


# శబ్ద రత్నాకరము

## తెలుగు-తెలుగు

## నిఘంటువు

నిఘంటువు : పదపదార్థములను తెలియజేసే గ్రంథము

ఉపనిషత్తు : వేదాంతము, ధర్మము, ఏకాంతము

భాష : సంస్కృతాది, మాట, ప్రతిజ్ఞ, ప్రమాణము

వేదము : తొలిచదువు, నాలుగు వేదాలు ఋక్కు, యజుస్సు, సామము, అధర్వము

బహుజనపల్లి
సీతారామాచార్యులు

# శబ్ద రత్నాకరము

*(నేటి విద్యార్థుల కోసం ప్రత్యేకంగా పరిష్కరించినది)*

చెన్నపట్టణపు బోధనాభ్యసన పాఠశాలయందు ఆంధ్ర పండితులుగ నుండిన

**బహుజనపల్లి సీతారామాచార్యులు**

సంపాదకుడు, అనుబంధకర్త

**డాక్టరు వెలగా వెంకటప్పయ్య** పి.హెచ్.డి,

---

**నవరత్న బుక్ హౌస్**

**28-22-20 రహిమాన్ స్ట్రీట్, అరండల్‌పేట**

**విజయవాడ - 520 002.**

# ముందుమాట

తెలుగు వాఙ్మయంలో కోశ సాహిత్యానికి సింహభాగం వాటా ఉంది. అది వంశపారంపర్యంగా వచ్చిందే. భాషాధ్యయనానికి కోశాధ్యయనం తప్పనిసరి. కోశం చదివినవాడే - అంటే కంఠస్థం చేసినవాడే పండితుడని ఒకనాటి భావన. అంతేగాదు జ్ఞానం సంపాదించేందుకు నిఘంటువునైనా, సంప్రదించు లేదా దేశాన్నయినా చూడు అనేది ఒక సదుక్తి. ఈ మంచిమాట ఈనాటికి శిరోధార్య మైనదే. పిన్నలకు, పెద్దలకు - ఎల్లరకు అన్వయించేదే.

మనకు తెలిసిందే. తొలుత మన నిఘంటువులు పద్యరూపంలో ప్రారంభమైనాయి. ఆంధ్రనామ కోశము, ఆంధ్రనామ సంగ్రహము, ఆంధ్రనామ శేషము ఈ కోవకు చెందినవే. తదుపరి ఇవి అకారాది రూపాన్ని సంతరించు కున్నాయి. ఇందుకు ఆంగ్ల నిఘంటువుల ప్రభావం కొంత లేకపోలేదు. ఆ విధంగా ఆంధ్ర దీపిక, శబ్దరత్నాకరము తదితర అకారాది నిఘంటువులు 19వ శతాబ్దంలో వెలుగులోకి వచ్చాయి. తుదకు అకారాది నిఘంటువులే స్థిరపడిపోయాయి. ఇవి ఎంతో విస్తృత సంఖ్యలో వెలువడ్డాయి. నేటికీ హెచ్చుగా వెలువడుతున్నాయి కూడా.

ముఖ్యంగా గత శతాబ్ది మధ్యకాలంలో దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించాక అన్ని స్థాయిల్లో విద్యారంగానికి ప్రాధాన్యం పెరిగింది. విజ్ఞాన శాస్త్రాలకు, వృత్తి విద్యలకు పెద్ద పీట వేయడం జరిగింది. ఇటీవల మైక్రోఫిల్మ్ రూపంలో, పి.సి.ఐ రూపంలో, సి.డి. రూపంలో, ఆన్‌లైన్‌లో ఉండడం ఆశ్చర్యకరమైన విషయం కాదు. కాలానికి తగినట్లు నిఘంటు నిర్మాణంలో పెరిగిన మార్పుకు నిదర్శనం.

ఈ తరుణంలో నేటి, రేపటి అవసరాలకు తగినట్లు మన పెద్దలు, మన మేధావుల జ్ఞానసంపదకు ప్రతిరూపాలైన నిఘంటువులను అనువైన రీతిలో మలచుకోవలసిన కాలం ఆసన్నమైంది. ఈ దిశలో తెలుగునాట విశేష ప్రసిద్ధి గాంచిన బహుజనపల్లి సీతారామా చార్యులు గారి శబ్ద రత్నాకరము (1885) నిఘంటువును తిరిగి ప్రచురించుకోవలసిన అవసరం ఉంది. ఈ బాటలో ఒక ప్రయత్నం ఈ గ్రంథం. ఈ గ్రంథ ప్రచురణలో ఈ దిగువ ఉదహరించిన పద్ధతులు పాటించటం జరిగింది.

1. శబ్ద రత్నాకరము - మూలంలోని పదాల సంఖ్యను ఏ మాత్రం తగ్గించ లేదు. పద్యపాదరూపంలో గల ప్రయోగాలను నేటి యువత సరిగా అర్థం చేసుకోలేరు కనుక ఆ ప్రయోగాలను మాత్రం తొలగించటమైనది.
2. పదాలకు సంబంధించిన విశేషాలు యథాతథంగా ఉంచడమైనది.
3. ఈనాటి పత్రికలలో ఎన్నో నూతన పదాలు ఏరోజుకారోజు సృష్టి అవుతు న్నాయి. ఇవి నిఘంటువులలో కనిపించే అవకాశమే లేదు. కొన్ని పదాలు ఆంగ్ల భాషా సంజనితాలు. వీటిలో కొన్ని అనుబంధంలో చేర్చాము.
4. వీటితోబాటు తెలుగు నిఘంటువులో సమ్మిళితాలైన నానార్థాలు, పర్యాయ పదాలు, ప్రకృతి, వికృతులు తదితరాలు అనుబంధాలతో చేర్చడం జరిగింది.
5. తెలుగు భాషకు నగలవంటి అందాన్ని సమకూర్చే జాతీయాలు, లోకోక్తులు కొన్నిటిని అనుబంధాలలో చేర్చాము. ఇందు తెలంగాణా, రాయలసీమ ప్రాంత జాతీయాలను చేర్చడం ఒక ప్రత్యేకత.
6. అయితే విద్యార్థి లోకానికి అవసరమైన ప్రకృతి, వికృతులు, పారిభాషిక పదాలు అంశాలను కూడ ఇందు చేర్చాము.
7. కొన్ని వ్యతిరేకార్థ పదాలు ఇందు చేరాయి.

ఇలా పలు నూతన ప్రయోగాలతో, విశేషాలతో, వైజ్ఞానిక సౌరభాలతో ఈ నిఘంటు నిర్మాణం జరిగింది. దీన్ని విద్యార్థి లోకం హర్షిస్తుందని ఆశిస్తాను.

నిఘంటు ప్రచురణ ఒక బృహత్ప్రయత్నం. సామాన్యులకు సాధ్యంకాని భాషా యజ్ఞం. ఈ నిఘంటువు పునర్నిర్మాణంలో అపూర్వమైన సాయం అందించిన మోదుగుల రవికృష్ణ గారికి, డాక్టరు చుక్కా నాగభూషణం గారికి కృతజ్ఞతలు తెలుపుతున్నాను. దీన్ని జయప్రదంగా నిర్వహించిన ఘనత, ప్రచురణ రంగంలో ఘనాపాఠి నవరత్న బుక్ హౌస్ అధినేత బి.కె.ఆర్. మూర్తిగారికి దక్కుతుంది. వారి కృషిని పాఠకలోకం ఆదరిస్తుందని నా ప్రగాఢ విశ్వాసం. సెలవు.

– *వెలగా వెంకటప్పయ్య*

సంపాదకుడు



# విషయ సూచిక

## ప్రాథమికాంశాలు


1 తెలుగు నిఘంటు వికాసం – సమీక్షా వ్యాసం 6
– వెలగా వెంకటప్పయ్య

2 శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులు – పరిచయం 19
– ఎం. రవికృష్ణ

3 శబ్దరత్నాకర పీఠిక–బహుజనపల్లి సీతారామాచార్యులు 25

4 భాషా ప్రశంస – బి. సీతారామాచార్యులు 28

5 నియమ విధాన క్రమము – బి. సీతారామాచార్యులు 47

6 సంజ్ఞా వివరణ పట్టిక – బి. సీతారామాచార్యులు 51

**శబ్ద రత్నాకరము** – తెలుగు– తెలుగు నిఘంటువు 52–960


## అనుబంధాలు


1. తెలుగులో చేరిన కొత్త పదాలు 962
2. తెలుగు పద సంపద – పర్యాయ పదాలు 972
3. తెలుగు పద సంపద – నానార్థాలు 974
4. కొన్ని తెలుగు పదాల వ్యుత్పత్తులు 976
5. ప్రకృతి–వికృతులు 980
6. తెలుగు తేనెసొనలు (పలుకుబడులు) 992
7. తెలుగు పంట : జంట పదాలు 1008
8. తెలుగు అంకెల పరిధి 1010
9. తెలుగు న్యాయాలు తెలుసుకుందాం 1011
10. తెలుగు, అరబిక్, రోమన్ అంకెలు : సంఖ్యలు 1022
11. సంఖ్యా వాచక విజ్ఞాన మహోదధి 1024
12. తెలుగు సామెతలు 1033




# తెలుగు నిఘంటు వికాసం : ఒక సమీక్ష

## వైదిక నిఘంటువుల ఆవిర్భావం

భాషకు కోశం, రాజ్యాధిపతికి ధనాగారం కావాలంటారు. కోశం భాషకు ప్రామాణికత్వాన్ని పెంపొదిస్తుంది. స్థిరత్వాన్ని చేకూర్చుతుంది. అవ్యవస్థను తగ్గిస్తుంది. భాషా జ్ఞానాన్ని వృద్ధి చేసుకోవడానికి తోడ్పడుతుంది. కోశం అంటే పదాలకు అర్థాలను చెప్పే పట్టికలని స్థూలంగా సరిపెట్టుకోరాదు. అది మన భాషా సంస్కృతీ సంపదను సమ్యగ్రుచిరంగా సందర్శించ డానికి వినియోగపడే అఖండ భాండాగారం. అందుచేతే "కోశవాన్ ఆచార్య:" కోశాన్ని చదివినవాడు పండితుడు అనే సంస్కృతసూక్తి, "కోశమైనా చూడు అథవా దేశమైనా చూడు" అన్న సూక్తులు వాడుకలోకి వచ్చాయి. ఈ రెండూ లేనిది వ్యక్తి ముందుకు పోలేదని భావన.

కోశానికి అనుశాసనం, అభిధానం, నిఘంటువు అనేవి పర్యాయ పదాలు. వీటిలోకి నిఘంటువు అనే పదం అత్యంత ప్రచారంలో ఉంది. తొలుత వైదికపరంగానే వాడడం జరిగింది. పాణిని అనంతరం లౌకికార్థంలో కూడ వాడుతూ వచ్చారు. వేదాలెప్పుడుద్భవించాయనేది ఇదమిత్థంగా నిర్ణయించడానికి వీలులేని అంశం. అయితే వీటి ప్రవచనా కాలం క్రీస్తుపూర్వం 1000 సం. ప్రాంతాలు అయి ఉండవచ్చునని సుప్రసిద్ధ చరిత్రకారుడు ఆర్.డి. మజుందార్ అభిప్రాయం. వైదిక హృదయం నిబిడీ కృతమైయున్న వేదాలు వందలు, వేల సంవత్సరాలు వాగ్రూపంలోనే మానవుని జ్ఞాపకశక్తికి, మేధాశక్తికి నికషోపలాలుగా నిలిచి ఉన్నాయి. అపౌరుషేయాలైన వేదాల లోని వాగర్థాలు, వ్యుత్పత్తులు కొందరకు తెలియడం లేదు. ఈ లోపాన్ని పూరిం చేందుకు యాస్కుడు వైదిక నిఘంటువును రాశారు. పాణిని యాస్క శబ్దనిరూపణ విషయంలో తన అష్టాధ్యాయిలో యస్కాది భ్యోగోత్రే (11-4-65) అని రాయడం చేత యాస్కుడు పాణిని కంటె అంటే క్రీ.పూ. నాలుగో శతాబ్దానికి పూర్వం వాడని వూహిస్తున్నారు. యాస్కుడు తన వైదిక నిఘంటువులో వేదాల్లోని అర్థాలను మాత్రమే తెలియజేయడమేగాక, శబ్దాల వ్యుత్పత్తులను గురించీ, దేవతలను గురించీ మెండుగా చర్చించారు. వైదిక నిఘంటువునే నిరుక్తం అంటారు. భావితరాలలోని నిఘంటు నిర్మాణానికి యిది మార్గదర్శకం అయింది. యాస్కుని నిఘంటువే ప్రపంచ భాషల్లోకెల్లా తొలి నిఘంటువని లాక్షణికుల అభిప్రాయం.

కాని మన సంస్కృత భాషకన్న ముందే చైనీయులు నిఘంటువు తయారు చేసినట్లు ఒక వాదం ఉంది. పురాతత్త్వశాఖ వారి త్రవ్వకాలలో బయల్పడిన సుమేరియన్ నాగరికతకు చెందిన మట్టి బిళ్ళలపై సుమేరియన్ పదాలకు సెమిటెక్, అస్సీరియన్ భాషలలో అర్థాలు గలవట. ఈ బిళ్ళలు ఆ ప్రాచీన నాగరికతకు,

భాషాయోషకు చెరగని గురుతులు. ఆ కాలంనాటి కొన్ని బిళ్ళలు నేటికి బ్రిటీష మ్యూజియం (లండన్)లో భద్రపరచి ఉన్నాయి. ఇవి క్రీస్తుపూర్వం ఐదువేల సంవత్సరాలనాటివని కొందరి తలంపు.

నిఘంటువు అనే పదం వైదికార్థంలో, లౌకికార్థంలో వేరు వేరు ఛాయలలో భావాలను కలిగి ఉంది. "సమామ్నాయ స్సమామ్నతః సవ్యాఖ్యాతవ్యః తమియం సమామ్నాయం నిఘంటవ ఇత్యాచక్షతే" అని నిరుక్తం చెబుతూ ఉంది. వేద మంత్రార్థా లను తెలియజేస్తున్నందున యవి నిగమ ములుగాను, నిశ్చయంగా అర్థ జ్ఞానాన్ని కలిగించేవి గాన నిఘంటువులు గానూ, మర్యాదతో పఠించబడేవి కావున సమా హంతువులనీ, వేద మంత్రాలనుంచి యేర్చి కూర్చబడినవి కావున సమాహర్తువు లనీ పిలుస్తున్నారు. ఈ సమాహంతువులు, సమాహర్తువులు, నిఘంటువులు వర్ణ విపర్యయ వర్ణవ్యాప్తాది నిరుక్త లక్షణాన్ని అనుసరించి అత్యంత పరోక్ష వృత్తితో నిఘంటువులుగా వ్యవహరిస్తున్నది. ఇది వైదికార్థం. ఇవన్నీ నైఘంటిక, నైగమ దైవత కాండలతో ఋషులలోని పర్యాయ పదార్థా లను, వ్యుత్పత్తులను వివరించడానికి బాగా తోడ్పడ్డాయి.

## లౌకిక నిఘంటువులు

వైదిక భాషకు భిన్నమైనది లౌకికభాష. ఇందు నిఘంటువు అనే పదానికి అర్థమిలా చెప్పారు. 'ని' అనే ఉపసర్గం మొదట 'త్యు' అనే ప్రత్యయం చివర చేరినట్టి 'ఘటి' ధాతువు నుండి నిఘంటు శబ్దోత్పత్తి జరిగిందని చెబుతారు. ని-నితరాం = లెస్సగా, ఘణ్ఘయతి- భాష్యతి = చెప్పునట్టిది అని భావం. అనగా నిఘంటువు స్పష్టంగా, సూటిగా అర్థం చెప్పేదని తాత్పర్యం. నిఘంటువులో అర్థబోధన ప్రధానం. తొలుత సంస్కృత భాషలో వ్యాడి, వరరుచి మొదలైనవారు శ్లోకరూపంలో లౌకికభాషలో నిఘంటువులను రాశారు. వీటివలన ప్రభావితుడై అమరుడు నామలింగాను శాసనం తయారుజేశారు. ఆ తర్వాత హేమచంద్రుని అభిధాన చింతామణి, పురుషోత్తమదేవుని త్రికాండ శేషము, కాత్యుని అంగ విశేషవిధి మొదలైన అనేక నిఘంటువులు అవతరించాయి. ముఖ్యంగా ధాతువు అర్థాన్ని శబ్దరూప నిష్పత్తిని తెలియజేసే వ్యాకరణాలు వెలువడిన తర్వాతే నిఘంటు నిర్మాణం హెచ్చుగా జరిగిందని భాషావేత్తల ఊహ.

## తెలుగు నిఘంటువులు

తెలుగు భాషలో నిఘంటువులు తొలుత పద్యరూపంలో, ఆ తర్వాత అకారాది క్రమంలో వెలువడ్డాయి. అకారాది నిఘంటువులనే గద్య నిఘంటువులు అని గూడ అంటారు. పద్య నిఘంటువులలో పదాలు, వాటి పర్యాయ పదాలు, నానార్థాలు అన్నీ ఛందోబద్ధమైన కవిత్వ రూపంలో ఉంటాయి. దీనికి తోడుగా అకారాది క్రమంలో పట్టిక ఉన్నప్పుడు దీనిని ఉపయోగించడానికి కొంతవరకు

వీలవుతుంది. తెలుగు భాషనభ్యసించే వారికి పదజాలమంతా కంఠతా రావాలనే ఒక ప్రబలమైన ఆకాంక్షతో యీ నిఘంటువులు బయలుదేరాయి. భాషలో వచ్చిన నవీన పరిణామాలదృష్ట్యా యిటీవలి కాలంలో పద్య నిఘంటువుల తయారీ బాగా తగ్గిపోయింది.

తెలుగు పద్యరచనపై సంస్కృత శ్లోక ప్రభావం ఉన్నట్లుగానే పద్య నిఘం టువులపై సంస్కృతంలో శ్లోకరూపంలో ఉన్న కోశాల ప్రభావం ఎంతో ఉంది. అభిదాన చింతామణికి హేమచంద్రుడు రాసిన వ్యాఖ్య ప్రకారం సంస్కృత భాషలో వాసుకి, వ్యాడీ, ధనపాలుడు, వాచస్పతి మొదలైనవారు తొలిశ్రేణి నిఘంటు కర్తలు. కాత్యుడు, అమరుడు, దుర్గదాసుడు, భాగురి, శాశ్వతుడు, యాదవుడు రెండవ శ్రేణికి చెందినవారు. వీరందరూ క్రీ.శ. 18వ శతాబ్దానికి పూర్వమే నిఘంటు రచన చేసిన ప్రజ్ఞానిధులు.

రాజరాజనరేంద్రుని ఆస్థానంలో వైయాకరణులు, పౌరాణికులు, మహా కవులు. తార్కికులు విద్యా విలసన గోష్ఠి సుఖోపవిష్టులయి ఉన్నారని నన్నయభట్టు చెప్పినప్పటికీ నాడుగానీ, ఆ తర్వాత అయిదారు వందల సంవత్సరాల పిదప గాని తెలుగులో నిఘంటువు వెలువడలేదు. ఆ కాలంలో మహా కవులందరూ సంస్కృత నిఘంటువులనే తమ 'రెఫరెన్స్' కోసం వినియోగించి ఉండవచ్చు. నిఘంటు రచన ప్రారంభమైన పిదప కూడ నిఘంటు కర్తలు సంస్కృత నిఘంటువుల ఛాయలలోనే తమ గ్రంథాలను రూపొందించారు. సంస్కృత సమ పదాలను సంస్కృత నిఘంటువుల నుండి గ్రహిస్తూ, ఆచ్ఛిక పదాలను మాత్రం తమకు తోచిన ఆంధ్ర గ్రంథాల నుండి గ్రహిస్తూ వచ్చారు. కాగా ఆంధ్ర ప్రబంధాలలో కాననగు తత్సమ పదాలు చాలవరకు ఆంధ్ర నిఘంటువులలో కాన రాకున్నవి. కొన్ని సందర్భాలలో తెలుగు నిఘంటు కర్తలు సంస్కృత నిఘంటు కర్తలు ఉపయోగించిన అర్థాలనే యథాతథంగా తీసుకోవటం జరిగింది. అందుచేత ఆ అర్థాలు తెలుగు భాషలో యిమడక, తెలుగు తనాన్ని సమకూర్చుకోక ప్రచారాన్ని పొందలేక పోయాయి. సుప్రసిద్ధ భాషావేత్త గిడుగు వెంకట సీతాపతి చెప్పినట్లు "మారుతున్న భాషకు తగినట్లు నిఘంటు వులు కనీసం ప్రతి యిరవై సంవత్సరాల కొకసారి సంస్కరణ జరగాలి". అలా జరిగినప్పుడే నిఘంటువులు సజీవ భాషకు యోగ్యమైన ప్రాతినిధ్యం వహిస్తాయి. కనుక నిఘంటు పరిష్కరణకు ముందు యింతకు ముందు వెలువడిన నిఘంటువుల సమగ్ర పరిశీలన, అర్థ వివరణ, ఛాయల సమీక్ష, నూతన పదాల సేకరణ మొదలైన పనులన్నీ శాస్త్రీయంగా జరిగినప్పుడే ఆ పని సాధ్యమౌతుంది. నిఘంటువుల ప్రయోజ నాన్ని తెలుసుకునేందుకు, వాటిని నిర్మించిన అవసరాన్ని గుర్తించేందుకు నేటివరకు తెలుగులో వెలువడిన భాషా నిఘంటువుల, విషయ నిఘంటువుల పరిచయం అవసరంగా కనిపిస్తూంది.

## తెలుగు పద్య నిఘంటువులు

సంస్కృత సాహిత్యంలోని సుమ సౌరభాలను స్వీకరించిన గణపవరపు వెంకటకవి 1684 ప్రాంతంలో వేంకటేశాంధ్రము అనే పద్య నిఘంటువును రాసి యీ నూతన ప్రక్రియకు శ్రీకారం చుట్టారు. అమరసింహుని నామలింగాను శాసనం యిందుకు ఊతాన్నిచ్చింది. ''పంకజాప్త నాకాశ వెంకటేశ'' అనే మకుటంతో అష్టోత్తర శత సంఖ్యలో యిందు సీసపద్యాలున్నాయి. దీన్ని శతక నిఘంటువు అంటారు. సర్వలక్షణ శిరోమణి అని కూడ పిలుస్తారు.

'అమరం నెమరుకు రావాలి' అనే ధోరణి ఆ రోజులలో హెచ్చుగా ఉండేది కనుక పద్యనిఘంటువులకు ప్రాపకం బాగా ఉన్నది. పైడిపాటి లక్ష్మణ కవి ఆంధ్ర నామ సంగ్రహము తయారుచేశారు. దేవ మానవ స్థావర తిర్యఙ్నానార్థ వర్గులు కలిగిన యీ పద్య నిఘంటువు విశేష ప్రచారాన్ని పొందింది. 1940లోనే బెందగిరి నాగయ్య గారి వ్యాఖ్యతో దీన్ని ప్రచురించారు. ఆ తర్వాత నేదునూరి గంగాధరం, తేవప్పెరు మాళ్లయ్య, చెన్నుబొట్ల వెంకటేశ్వర్లు మొదలైన పలువురు పండితులు టీకా తాత్పర్యాలను అనేకాది పట్టికలను సమకూర్చి పెట్టారు. లక్ష్మణ మంత్రి రాసిన నానార్థ నిఘంటుకర్త గూడ పైడిపాటి లక్ష్మణ కవి కావచ్చునీ, యీ నిఘంటువు వారి అముద్రిత ఆంధ్ర భాషా రత్నాకర ములో ఒక ఆశ్వాసం కావచ్చని టేకుమళ్ళ కామేశ్వరరావు ఊహ. ఆంధ్ర నామ సంగ్రహంలో కొన్ని పదాలు వదలి వేశాక 18వ శతాబ్దంలో మూడో పాదానికి చెందిన అడిదము సూరకవి ఆంధ్రనామ శేషాన్ని రాశారు. 1749-60 ప్రాంతానికి చెందిన కస్తూరి రంగకవి సాంబ నిఘంటువును రూపొందించారు. ఈ మూటిని లక్షణ కర్తలు నిఘంటుత్రయం అంటారు. ఈ మూడు నిఘంటువులు వెంకటేశాంధ్రము ఆదిగా గల నిఘంటువులలోని పదజాలాన్ని పఠించి సి.పి. బ్రౌన్ అకారాది క్రమంలో అమర్చి కర్కంబాడి నిఘంటువును తయారు చేయించారు. ఇది అముద్రితం.

హాస్య వ్యంగ్య రచనాధురీణుడు కవి చౌడప్ప ఒక పద్య నిఘంటువును సీస పద్యాలలో మూసపోశాడు. దీనిని తొలుత మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార బులెటెన్‌లో ప్రచురించారు. పుస్తక రూపంలోకి రాలేదు. ఇందు రాయలసీమ ప్రాంతాలలో వాడుకలో ఉన్న దేశీ శబ్దజాలం ఎక్కువగా ఉన్నట్లు తెలుస్తున్నది. 1769-79 ప్రాంతాలలో పుదుక్కోటను పాలించిన కోటి రఘునాథ నాయకుని ప్రేరణతో కోటి వెంకటార్యుడు ఆంధ్ర భాషార్ణవము రాశారు. దీనికి అమరం ఛాయలున్నందున, మూడు కాండలు కలిగి ఉన్నందున దీన్ని ఆంధ్ర అమరము అంటారు. పూర్తిగా కంద పద్యాలలో సుప్రసిద్ధ శతకకర్త అమలాపురపు సన్యాసినాయుడు సర్వాంధ్రసారసంగ్రహాన్ని రాశారు. ఇది అముద్రితం. విశాఖపట్నం

జిల్లా పాచిపెంట జమీందారు త్యాడ పూసపాటి వీరపరాజు ఆంధ్ర పదాకరాన్ని 1880 ప్రాంతంలో సిద్ధం చేశాడు. ఆ తర్వాత ప్రగడపువారి కందాలు ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో అచ్చయినాయి. ఈ శతాబ్దంలో వెలువడిన పద్య నిఘంటువు లలో భద్రాచల రామ భక్తులలో అగ్రగణ్యు డైన తూము రామదాసకవి ఆంధ్ర పద నిధానాన్ని సంకలనం చేశారు. ఇది అచ్చ తెలుగు పద్య నిఘంటువు. ఇందలి నానార్థ వర్గం విశిష్టమైనది. పద్య నిఘంటువులలో విస్తృతమైనది కలవటాల జయరామారావు జయరామ నానార్థ నిఘంటువు. దీన్ని నిడదవోలు వెంకటరావు పరిష్కరించారు. ఇది అముద్రితం. ఇవి గాక నానార్థాల విషయంలో సీతారామ సోమయాజులు నానార్థ నిఘంటువు, కోగంటి దుర్గా మల్లిఖార్జునరావు నానార్థశతకము, రొంపిచర్లవాసి నానార్థ శివశతకము, ములుగు చంద్రమౌళి శాస్త్రిగారి నానార్థ దీపిక యీ కోవలో ఉన్నాయి. పద్య నిఘంటువుల్లో ఒక ప్రత్యేకతతో రూపొం దించిన రామాయణం కృష్ణమామాత్యుని దేశ్య నామార్థకోశం ఎన్నదగినది. ఇందు తెలుగు పదాలకు ప్రాకృత, ద్రావిడ భాషలలోని పర్యాయ పదాలు కలవు.

మొత్తంమీద యీ పద్య నిఘంటువులు తెలుగు భాష సామాన్య ప్రజానీకానికి చేరువవుతున్న తొలిరోజుల్లో, పీఠాధిపతుల నుంచి విద్యాబోధన పాఠశాలల పరంగా ప్రారంభమైన తొలిరోజులలో యివి ఎంతగానో ఉపకరించాయి. ఆ నాటి అవసరాలను అవి తీర్చగలిగాయి.

## అకారాది నిఘంటువులు

గత శతాబ్ది తొలి పాదంలో దేశంలోని విద్యా వ్యవస్థలో అపూర్వమైన మార్పులకు అంకురార్పణ జరిగింది. ఆంగ్ల విద్యా విధానం స్థిరపడుతూ దేశ భాషలపై తన ప్రభావం ప్రచరిస్తూ వచ్చింది. "భారత దేశానికి సరస్వతి యిచ్చిన వరం ఆంగ్ల భాష" అని రాజాజీ అన్నట్లుగా యీ భాష మన దేశంలో సాంఘిక, రాజకీయ, ఆర్థిక అన్ని రంగాలను కొత్త మలుపుకు త్రిప్పింది. ఆంగ్లో శాగ్జన్ కాలం నుంచీ ప్రారంభమైన ఆంగ్ల నిఘంటు రచనా విభాగంలో 18వ శతాబ్ది అంతానికి రాబర్ట్ కాండ్రే (1604), నథానియెల్ (1721), డాక్టరు శామ్యూల్ జాన్సన్ (1755), జాన్ వెస్లి మొదలైన భాషావేత్తలు ఆంగ్ల నిఘంటువులను అత్యంత ప్రయోజనకరంగా తీర్చిదిద్దారు. జాన్ వెస్లీ తన నిఘంటు ముఖ పత్రాన్ని (టైటిల్ పేజ్) యీ విధంగా తీర్చిదిద్దాడు."

The complete English Dictionary, explaining most of those hard words which are found in the best English writers. By a lover of good English and common sense. N.B. : The author assures you that he thinks this is the best English Dictionary in the world.

ఈ ఆంగ్ల నిఘంటువులు, వాటి రచనా విభాగం, పదాల అమరిక భారతీయ భాషలపై ప్రభావాన్ని చూరగొన్నవి. 1786-1833 మధ్య కాలంలో ఎథీనియన్ డెమెట్రియన్ గలోనోన్ అను విదేశీ విద్వాంసుని ప్రోత్సాహంతో నొక కాశీ పండితుడు 25 వేలు సంస్కృత పదాల పట్టికను అకారాది క్రమంలో తయారు చేశారు. ఈ పట్టిక 1828-1857 మధ్య కాలంలో ప్రకటించిన తొలి అకారాది సంస్కృత నిఘంటువు, రాజా రాధాకాంత-దేవుని శబ్ద కల్పద్రుమ (1821-57) నిర్మాణానికి తోడ్పడింది. ఇంతకు పూర్వం శ్లోక నిఘంటువులలో చెప్పని ధాతువులు యిందు ఎన్నో ఉదహరించారు. ఇది కేవలం లౌకిక వాఙ్మయాన్ని దృష్టిలో ఉంచుకొని తయారు చేసింది. కనుక యిందు వైదిక పదాలను చొరనీయలేదు.

దాదాపు లోనో, మరి కాస్త ముందో మచిలీపట్నానికి చెందిన సంస్కృతాంధ్ర భాషల్లో ఉద్దండ పండితులు, ఉత్తమ సంస్కారి మామిడి వెంకయ్య (వెంకటార్యులు నామాంతరం), 1816 లోనే ఆంధ్రదీపిక అనే తొలి తెలుగు అకారాది నిఘంటువును తయారు చేశారు. భారతీయ భాషల్లో యిదే తొలి అకారాది నిఘంటువు అంటే ఆశ్చర్యం లేదేమో !

ప్రాచీన కావ్యాలలో గ్రంథస్థమైన పదాలకు మాత్రం పరిమితమైన యీ నిఘంటువు 1848 లో అచ్చు ముచ్చటను అలరించింది. దీన్ని గురించి బ్రౌన్ తన తెలుగు-ఇంగ్లీషు నిఘంటువులో యిలా రాశారు.

"The Dipica ఆంధ్ర దీపిక A Dictionary of Telugu explained in Telugu written by మామిడి వెంకయ్య at Masulipatam. It was completed in the year 1816. A deodecimo edition of this book was printed at Madras in 1848 : but is far from faithful. The Dipica gives a mere selection of the words used in Telugu poetry. The ordinary Telugu of common life is but slightly noticed. *(C.P. Brown's Telugu-English Dictionary: Page VIII: 1852 Edition.)*

దీని తొలిముద్రణ ప్రతి నేడు ఎక్కడా లభించడంలేదు. దీని రెండో ముద్రణను 1872 లో చుండూరు రంగనాయకులు శ్రేష్ఠి ప్రచురించి గ్రంథకర్తగా తన పేరు ఉంచుకున్నారు. ఇది 1895 లో నాలుగవ సారి ముద్రితమైంది. రెండు, నాలుగు ముద్రణల ప్రతులు యిప్పుడు తమిళనాడు ఆర్కైవ్స్‌లో భద్రంగా ఉన్నాయి. 1965 లో మచిలీపట్నం, వాసవీ గ్రంథ ప్రచురణ సమితి తరపున శుద్ధచైతన్యస్వామి ఆంధ్ర దీపికను పరిష్కరించి ప్రచురించారు. దీనిలో మొదటి నాలుగు ముద్రణల ప్రసక్తి ఎచ్చటలేదు. ఇది యింతకుముందు ప్రచురణకంటే రెండురెట్లు పెరిగింది. ఈ పెరుగుదల ఏ తీరుగా జరిగింది, ఎవరి పరంగా జరిగింది వివరణలేదు. దీనిపై

కొంత పరిశోధన జరగవలసి ఉంది. ఆంధ్ర దీపికకు అనుబంధంగా ఓరుగల్లు పదజాలం సిద్ధమైనది. దీని కర్త గూడ మామిడి వెంకయ్య కావచ్చని పండితుల ఊహ. దీని ప్రతి యిప్పుడు మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో లభ్య మౌతుంది.

ఈ నిఘంటువు యిచ్చిన స్ఫూర్తిని, తనకు గల అసాధారణమైన పాండితీ ప్రకర్షను మేళవించి, ఆంధ్ర ధాతుమాలను సిద్ధం చేసుకొని, తనపైన ఒక నూతన విధానంలో వచన రచనా ధురీణుడు చిన్నయసూరి అకారాది నిఘంటువు రచనను తలపెట్టారు. ఆంధ్రుల దురదృష్ట వశాత్తు అసంపూర్తిగానే నిలచిపోయింది.

తెలుగు భాషా విస్తృతికి ప్రయోగ ప్రాతిపదిక గల ఒక నిఘంటువు అవసర మని భావించి మద్రాసులో తెలుగు పండితులుగా ప్రసిద్ధి చెందిన బహుజనపల్లి సీతారామాచార్యులు అలఘు కౌముది, బాల చంద్రోదయము, వైకృత దీపిక, విభక్తి చంద్రిక మొదలైన 'మినీ' నిఘంటువులను ముందు సిద్ధంచేసి, ప్రయోగాలను తనకు తోచిన కావ్యాలనుంచి సేకరించి ఉదాత్త మైన రీతిలో శబ్ద రత్నాకరాన్ని సిద్ధంచేశారు. 1885 లో తొలిసారిగా దీన్ని దేశభాషా గ్రంథకరణ సమితివారు ప్రచురించారు. 1951 లో వెలువడిన ఏడో ముద్రణలో పరిశోధనా పరమేశ్వరులు నిడదవోలు వెంకటరావు 5000 కొత్త పదాలను చేర్చారు. తెలుగు సాహిత్యంలో విశేషాదరణ పొందిన, పొందుతున్న నిఘంటువు శబ్దరత్నాకరము. దీన్ని యథాతథంగా న్యూఢిల్లీ, ఏసియన్ ఎడ్యుకేషనల్ సర్వీసెస్ వారు 1988 నుంచి పలుసార్లు ముద్రించారు. ఆవంచ సత్యనారాయణ పలు అనుబంధాలను చేర్చి, తిరిగి అందంగా రీసెట్ చేయగా, విక్టరీ పబ్లిషర్స్, విజయవాడ వారు 2005లో తదుపరి పునర్ముద్రించారు.

ఇంతకుపూర్వం వెలుగులోకి వచ్చిన నిఘంటువులు అచ్చ తెలుగు పదాలకు తగిన న్యాయం చేయలేదని భావించి గురజాడ శ్రీరామమూర్తి, ఓగిరాల జగన్నాథ కవి గారు ఆంధ్రపద పారిజాతాన్ని వెలయించి భాషకు కొత్త సొంపును సమకూర్చారు. దాదాపు యిదే ఛాయలలో కొట్ర లక్ష్మీనారాయణశాస్త్రి లక్ష్మీనారాయణీ యాన్ని, ముసునూరి వెంకటశాస్త్రిగారు ఆంధ్రనామ సర్వస్వాన్ని ప్రచురించారు. అచ్చ తెలుగు భాషలో అనిర్వచనీయమైన కృషిచేసి, అచ్చ తెలుగులోనే ఉపన్యాసాలను సైతం చేసిన మారేపల్లి రామచంద్రశాస్త్రి తెలుగు నుడి కడలి అనే బృహన్నిఘంటువు అసంపూర్తిగానే నిలచిపోయింది.

నిఘంటు నిర్మాణంలో రెండవదశలో బృహన్నిఘంటువులపై దృష్టి కేంద్రీ కరించారు. పిఠాపురం జమీందారు రావు వెంకట కుమార మహీపతి సూర్యా రాయ బహద్దరు గారి ప్రోత్సాహంతో కాకినాడలో ఆంధ్రసాహిత్య పరిషత్ పరంగా 1930 లోనే సూర్యరాయాంధ్ర నిఘంటువు తయారు

చేయడానికి బీజావాపన జరిగింది. దీనికి జయంతి రామయ్యపంతులుగారు సారథ్యం వహించారు. తాము తయారుచేయ సంకల్పించిన నిఘంటువులో యీ క్రింది విషయాలుండాలని భావించారు.

1. ఆంధ్రభాషలో వ్యవహారంలో నున్న శబ్దాలు అన్నీ,
2. ఆయా శబ్దాల తత్సమ తద్భవ దేశ్యాన్య దేశ గ్రామ్యాలలో నేవియో వివరణ,
3. శబ్దార్థాలు,
4. శబ్దార్థాలకు పూర్వకవి ప్రయోగాలు
5. దేశ్య శబ్దాలను అన్య ద్రావిడ భాషలలో సజాతీయ పదాలు,
6. అవయవ వ్యుత్పత్తి ధాతునిరూపణం, మొదలైన యితర అంశాలు.

ఈ సంకల్పంలో సూర్యరాయాంధ్ర నిఘంటువులు సిద్ధం చేశాక 1936-1958 మధ్య కాలంలో ఎనిమిది సంపుటాలుగా ముచ్చటగా అచ్చయింది. దీనిలోని లోపాలు సరిదిద్దిన నాడు యిది ఆక్స్‌ఫర్డ్ ఇంగ్లీషు నిఘంటువుతో సరిసమానంగా సరితూగ కలదు.

దాదాపు యిదే సమయంలో ఒక్కచేతి మీదుగా కొట్ర శ్యామల కామశాస్త్రి విశాల ప్రాతిపదికపై, ముఖ్యంగా పర్యాయ పదాల సేకరణపై దృష్టి కేంద్రీకరించి 1934-40 మధ్య నాలుగు సంపుటాలలో ఆంధ్ర వాచస్పత్యాన్ని ప్రచురించారు. ప్రాచీన కావ్యాల ప్రచురణలో తమకు గల అనుభవాన్ని పురస్కరించుకొని ప్రసిద్ధ పండితులు శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి, బులుసు వెంకటేశ్వర్లు, వేదము లక్ష్మీనారాయణశాస్త్రి సహకారంతో 1949-69 మధ్యకాలంలో నాలుగు సంపుటాలలో వావిళ్ళ సంస్థ నిఘంటువును పూర్తి చేసింది. ఇందు పర్యాయ పదాలు, నానార్థాలు, ప్రయోగ వివరణ అన్నీ కలవు.

ఇంతకు పూర్వం వెలువడిన నిఘంటువులను భిన్నమైన రీతిలో ప్రసిద్ధ విద్వాంసులు చెలమచర్ల రంగాచార్యులు మూడు సంపుటాలలో 1967-70 మధ్య కాలంలో వెంకట్రామా అండ్ కో వారి పరంగా వెలుగులోకి తెచ్చారు. సాధారణంగా పెద్ద నిఘంటువులలో సహజంగా ఉండే పూర్వకవి ప్రయోగాలు యిందులేవు. ఐనప్పటికీ యీ నిఘంటువులో యీ దిగువ విశేషాంశాలున్నాయి.

1. పదాల వ్యుత్పత్తులకు, రూప ప్రక్రియలకు విపులీకరణలు,
2. శబ్దాల రూపభేదాలు, పర్యాయ పదాలు,
3. వివరణ సాపేక్షాలగు సమాసాల విపులీకరణ,
4. పురాణ గాథల సంగ్రహణ వివరణ,
5. న్యాయాలు, సామెతలు, పద బంధాలకు వివరణలు,
6. సంస్కృతాంధ్ర కృత్తద్ధిత ప్రత్యయాలిత్సంజ్ఞల పట్టికలు, మొదలైన వివరాలన్నీ ఆంధ్ర శబ్దరత్నాకరంలో రాసులుపోసి ఉన్నాయి.

ముఖ్యంగా పండితుల ఉపయోగార్థం మహాకాళి సుబ్బరాయుడు 1873 లోనే శబ్దార్థ చంద్రికను తొలిసారిగా ప్రచురించారు. దీనిని వేదము లక్ష్మీ నారాయణ పరిష్కరించి 1905 లో వావిళ్ళ పరంగా ప్రచురించారు. ఆ తర్వాత ఎన్నో ముద్రణలను పొందింది. ప్రచారంలోకి వచ్చింది. దాదాపు యిదే స్థాయిలో ముసునూరి వెంకటశాస్త్రి శబ్దార్థ దీపికను, వారణాసి వెంకటేశ్వర్లు, ఉత్పల వెంకటరంగాచార్యులు శబ్దార్థ రత్నాకరాన్ని ప్రచురించారు. శబ్దార్థ దీపికలో ఆయుర్వేద వైద్యానికి చెందిన పదాలుకూడ చేర్చారు. ఈ నిఘంటువులన్నీ భాషా సౌష్టవానికి ఎంతగానో ఉపకరించాయి. వీటికి తోడుగా భాషాభిరుచి గల విద్యార్థుల కోసం జి.యన్. రెడ్డి పరిష్కరించిన తెలుగు నిఘంటువు. పూతలపట్టు శ్రీరాములురెడ్డి, తాళ్ళూరు ఆర్ముగంపిళ్లె తయారుచేసిన రామచంద్ర విద్యార్థి కోశము, దుగ్గిరాల వెంకటపూర్ణ భుజంగశర్మ లఘుకోశము, ముసునూరి వెంకటశాస్త్రిగారి విద్యార్థి కల్పతరువు అనే ఆంధ్రభాషా విషయ సర్వస్వము మొదలైన అనేక నిఘంటువులు ప్రచారంలోకి వచ్చాయి. ఇటీవల తెలుగు అకాడమీ 2002లో ప్రచురించిన తెలుగు-తెలుగు నిఘంటువులో ఈ అంశంలో అగ్రస్థానంలో నిలుపగల వానిలో ఒకటి.

తెలుగులో నానార్థాలు తెలియజేసే నిఘంటువులు అనేకం ఉన్నప్పటికీ తాళ్ళపాక తిరు వెంగళనాథుడు ఆంధ్ర నానార్థ శబ్ద నిఘంటువును ప్రత్యేకంగా రూపొందించారు. హస్నాబాద నాగలింగ శివయోగి పరిష్కరణతో యిది ప్రచురిత మైనది. అంతేగాక కోట సుబ్రహ్మణ్యశాస్త్రి ఆంధ్ర సాహిత్య సర్వస్వములో వీటి వివరణ చక్కగా ఉంది. తెలుగు భాష తొలి దశలో ఏర్పడిన శాసన పదాలకు ప్రత్యేక అర్థాలు ఉంటాయి. అర్థవివరణ, ప్రయోగాలతో సహా కుందూరి ఈశ్వర దత్తుగారు శాసన శబ్దకోశంలోనూ, బూదరాజు రాధాకృష్ణ ప్రాచీనాంధ్ర శాసనాలలో వివరించారు. ఇంతవరకు వివరించిన నిఘంటువులలో అత్యధిక భాగం గ్రంథస్థమైన పదజాలానికి సంబంధించిన నిఘంటువులు. నాటినుంచీ నేటివరకు ప్రజాజీవనంలో కలిసిపోయిన జీవభాషా నిఘంటువుల విషయం గూడ మనం తెలుసుకోవాలి.

## మాండలిక పద కోశాలు

ప్రతి భాషలోను గ్రంథస్థమైన భాషకు, వాడుక భాషకు కొద్దో గొప్పో తేడా ఉండటం సహజం. అది భాషా లక్షణం. పదాలు వ్యవహారంలోకి చొచ్చుకుని వచ్చినంత వేగంగా గ్రంథాలలోకి చోటు సంపాదించ లేవు. తెలుగు భాషకు సంబంధించినంత వరకు యీ తేడా చాల ఎక్కువగా ఉంది. దీన్ని సన్నిహితం చేయడానికి ప్రయత్నాలు సరిగా జరగలేదు.

వాస్తవానికి వ్యవహారరీత్యా సంక్షిప్త మైన యీ మాండలిక పదజాలం భాషామ తల్లికి నిసర్గమైన ఆభరణాలు. దీనివల్ల భాషా

విస్తృతి తెలుస్తుంది. దేశీయ వృత్తుల చరిత్ర, సంస్కృతి నవీన దృక్పథంలో పునర్నిర్మించ డానికి, సంఘానికి సాహిత్యానికి ఉన్న సాపత్యం తెలుసుకోడానికి యీ పదజాలం ఉపకరిస్తుంది. కనుక యీ పదజాలాన్ని రక్షించుకోవల్సిన అవసరం ఎంతో కనిపిస్తుంది.

మన తెలుగు కావ్యాలు మాండలికా లకు దూరంగానె ఉన్నవని చెప్పాలి. అయ్యలరాజు రామభద్రుడు హంస వింశతిలో మాండలిక పదావళిని విశేషంగా సంతరించారు. ఈ కావ్యమొక పదకోశం వంటిదని భాషావేత్తలు చెబుతారు. ఆ తర్వాత 18,19 శతాబ్దాలలో వెలువడిన కావ్యాలలో యీ పదాలు కొద్దిగా తొంగి చూశాయి. 1818లో తొలిసారిగా విలియం బ్రౌన్ ప్రకటించిన తెలుగు, ఇంగ్లీషు నిఘంటువులో కొన్ని మాండలికాలకు తొలిసారిగా నిఘంటువులో ప్రవేశం లభించింది. పందొమ్మిదో శతాబ్దంనాటి మెకంజీ కైఫియతులలో, ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ లేఖా సంపుటాల్లో మాండలిక పదాలు వేల సంఖ్యలో ఉన్నాయి.

మాండలిక పదాల సేకరణ కార్య క్రమాన్ని జి.ఎ. గ్రియర్సన్ ప్రారంభంలో తన "బీహార్ పెజంట్ లైఫ్" (1885) అనే గ్రంథంలో బీహార్ రాష్ట్రంలోని గ్రామసీమలో పల్లీయులు వాడే పదాల పట్టికను సమ కూర్చారు. తెలుగు గ్రామీణ ప్రాంతాలలో వివిధ వృత్తులలో వాడే పదాలను సమగ్ర మైన మాండలిక పదకోశం తయారు చేయాల్సిన అవసరాన్ని గూర్చి తూమాటి దొణప్పగారు నొక్కి చెప్పారు. ఇప్పటికే దేశ పదాలపై చిన్న చూపు చూపబడినదనీ భాగవతుల రామారావు సోదాహరణ పూర్వకంగా వివరించారు. ఈ దేశ్యపదాలను ప్రాంతీయ దేశ్య నిఘంటువు ఆవశ్యకతను గురించి కొంత పరిశ్రమ చేశారు.

ఈ ప్రయత్నాలన్నిటికీ దీప్తినిచ్చే విధంగా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ డాక్టరు భద్రిరాజు కృష్ణమూర్తి గారి పర్యవేక్షణలో డాక్టరు జి.యన్. రెడ్డి, డాక్టరు తూమాటి దొణప్ప, డాక్టరు బూదరాజు రాధాకృష్ణ గార్ల ప్రభృతుల సంపాదకత్వంలో బృహత్తరమైన రీతిలో, శాస్త్రీయమైన పద్ధతిలో మాండలిక పదకోశాలు వృత్తుల వారీగా చేయడానికి నిర్ణయం జరిగింది. దీనికి అనుగుణంగా వ్యవసాయ పదాలు, చేనేత, వాస్తు, కుమ్మరం, కమ్మరం, కంసాలి, మత్స్య పరిశ్రమ మొదలైన పదాలకు కోశాలు ప్రచురితమయ్యాయి. వీటికి తోడుగా ఆంధ్ర ఆంధ్రేతర ప్రాంతాలలో వాడుకలో ఉన్న కొన్ని పదాలకు అర్థవివరణ, ప్రాంత వివరణతో సహా మాండలిక పదకోశంలో మరుపూరు కోదండ రామరెడ్డి సమ కూర్చారు. ఆంధ్రేతర రాష్ట్రాలలో వాడుకలో ఉన్న తెలుగు మాండలికాలపై జార్జి గ్రియర్సన్ విస్తృతమైన కృషి చేశారు. తెలుగు అకాడమీ అన్ని జిల్లాల మాండలికా లపై 26 గ్రంథాలు ప్రచురించింది. అంతకు ఇనుమిక్కిలి కృషి యిప్పటికీ తెలుగుదేశం లోని మాండలికాలపై జరగవలసి ఉంది.

## శాస్త్ర నిఘంటు నిర్మాణం

నిఘంటు నిర్మాణంలో తెలుగు అకాడమీ కృషి అపూర్వమైనది. గత పాతికేళ్ల కాలంలో తెలుగు అకాడమీ తెలుగులో లక్ష సాంకేతిక పదాలను రూపొందించినట్లు తెలుస్తుంది. వీరు డిగ్రీ స్థాయిలో సమాజ శాస్త్రం, రాజనీతి శాస్త్రం, మానవ శాస్త్రం, జంతు శాస్త్రం, వృక్ష శాస్త్రం, భౌతిక, రసాయన శాస్త్రాలపై నిఘంటువులు ప్రచురించారు. అంతేకాక ఓషధి నిఘంటువు, న్యాయశాస్త్ర పరిచయ నిఘంటువు ప్రచురించారు. పాఠశాల స్థాయిలో జీవశాస్త్రాలు, భౌతిక, రసాయన శాస్త్రాలు, గణిత శాస్త్రం, సాంఘిక శాస్త్రాల నిఘంటువు ప్రచురించారు. ఇవిగాక పురపాలక, న్యాయ, వాణిజ్యంపై పద కోశాలు ప్రచురించింది. శబ్ద సాగరం అనే ఒక బృహన్నిఘంటువును కూడ ప్రచురించే ఆలోచనలో ఉంది.

## పదప్రయోగ కోశాలు

ఒక గ్రంథంలో లేదా ఒక గ్రంథకర్త రచనలలోని ముఖ్యమైన పదాలను అకారాది క్రమంలో, ఆరోపాలతో సహా ఏర్పరచిన పట్టికను పదప్రయోగ కోశం (కంకార్డెన్స్) అంటారు. "Concordance - An alphabetical arrangement of principle words, contained in a book with citation of the passages in which they occur." ఈ ప్రయోగ కోశాలు ప్రాంతీయ భాషల్లో, తెలుగులో ప్రవేశిస్తున్న అధునాతనమైన, ప్రయోజనకరమైన ప్రక్రియ, శాస్త్రీయ విధానంలో ఉద్దిష్టమైన మహా నిఘంటువును రూపొందించ డానికి ఉపయోగించే పదప్రయోగ రాశి, దీనివల్ల భాషాస్వరూపాన్ని సుస్పష్టంగా నిర్ధారణ చేయవచ్చు. శబ్దాల మార్పు, అర్థాల పరిమితిని, ప్రయోగ వైచిత్రిని, ప్రయోగ సాంద్రత (వర్డ్ ఫ్రీక్వెన్సీ) ను గమనింప వచ్చు. కొన్ని పదాల అర్థ నిర్ణయానికైతేనేమి, అర్థ వివరణకైతే నేమి, సాధుపాఠ సాధనకైతేనేమి క్రమబద్ధంగా తయారుచేసిన పదప్రయోగ కోశాలే శరణ్యం.

చాలా కాలంగా ఇంగ్లీషు భాషలో పద ప్రయోగకోశాలు తయారుచేసే సంప్ర దాయం ఉంది. బైబుల్‌లోని పాత, క్రొత్త నిబంధనలకు క్రూడెన్ తయారు చేసిన పదప్రయోగకోశం, షేక్స్పియర్ రచనలను (పద్యాలతో సహా) బార్ట్‌లెట్ తయారు చేసినది, ఆ తర్వాత స్పెన్సర్, వర్డ్స్‌వర్త్ మొదలైన పలువురు ప్రసిద్ధుల రచనలకు తయారుచేసిన పదప్రయోగకోశాలు ఆంగ్ల నిఘంటు నిర్మాణంలో విప్లవాత్మకమైన మార్పులను తీసుకువచ్చాయి, దేశదేశాల్లో, పలు భాషల్లో నిఘంటు నిర్మాణానికి మార్గదర్శకం అయ్యాయి.

భారతదేశానికి సంబంధించినంత వరకు అమెరికా దేశానికి చెందిన మారిస్ బ్లూమ్ ఫీల్డ్ వేదాలలో మంత్రాలకు బృహత్తరమైన రీతిలో పదప్రయోగకోశాన్ని

తయారుచేయగా 1906 లో హార్వర్డ్ విశ్వవిద్యాలయ పరంగా ప్రచురించారు. అంతకు ముందే అంటే 1891 లో, 56 ఉపనిషత్తులకు, భగవద్గీతకు తయారు చేసిన పదప్రయోగకోశం ప్రత్యేకంగా పేర్కొనదగినది. దాదాపు యిదే ఛాయలలో శ్రుతులకు, ఐతరేయ బ్రాహ్మణానికి, శ్రుతి, మరికొన్ని కోశాలు సిద్ధమై భాషా శాస్త్రంలో భారతదేశ కీర్తి ప్రతిష్ఠలను యినుమడింప జేస్తున్నాయి.

తెలుగు భాషకు యీ కోశాల ప్రక్రియ పూర్తిగా క్రొత్తది కాదనే చెప్పాలి. సి.పి. బ్రౌన్‌ను యీ పదప్రయోగ కోశాలు తెలుగులో తయారు చేయించిన మూల పురుషునిగా గుర్తింపవచ్చు. తన నిఘంటు నిర్మాణానికి బ్రౌన్ వేల సంఖ్యలో వ్యవహారిక పదాలు సేకరించడమేగాక, పండితుల సహాయంతో మనుచరిత్ర, ఆముక్తమాల్యద, దశావతార చరిత్ర, తారాశశాంక విజయము మొదలైన కావ్యాలకు ప్రయోగ కోశాలు సిద్ధం చేయించారు. ఆ తర్వాత యీ ప్రక్రియను దాదాపు ఆరేడు దశాబ్దాల పాటు ఎవరూ స్వీకరింపలేదు.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఏర్పడ్డాక యీ కోశాల నిర్మాణంలో నవ శకం ఏర్పడింది. తెలుగు భాషకు చారిత్రక సూత్రాలపై ఒక ప్రమాణ నిఘంటువును నిర్మించడానికి ప్రాతిపదికగా తెలుగు ప్రాచీన కావ్యాలకు యీ కోశాలు సిద్ధం చేయించాలని అకాడమీ తలపెట్టి చాలవరకు కృతకృత్యురాలైనది. అకాడమీ పథకం ప్రకారం అబ్బూరి రామకృష్ణరావు గారు ఎంతో కాలం నుంచి కలలు కంటున్న నన్నయ పదప్రయోగ కోశము తయారు చేశారు. చాల కాలం క్రితం రూపొందించిన మారేపల్లి రామచంద్రశాస్త్రి గారు నన్నయనుడులు (చెయిది పొడలు) ఇటీవలే అచ్చు ముచ్చటను సంతరించు కున్నది. అకాడమీ పరంగా దివాకర్ల వేంకటావధాని, అబ్బూరి రామకృష్ణరావుగారలు నన్నెచోడ పదప్రయోగ సూచికను, అబ్బూరి రామకృష్ణ రావు, భద్రరాజు కృష్ణమూర్తి, దివాకర్ల వేంకటావధానిగారలు తిక్కన పదప్రయోగ కోశాన్ని, రామలక్ష్మి అరుద్ర గారు తాళ్లపాకవారి పలుకుబళ్ళను ఎంతో ప్రయాసతో, శ్రద్ధాసక్తులతో సమకూర్చారు. ఈ ప్రయత్నాలకు తోడుగా అన్నే కేశవార్య శాస్త్రి యజుర్వేదము లోని మంత్రాలను క్రమణిక, పదాను క్రమణిక, మంత్రార్థ విషయ నిర్దేశిక, దేవతాను క్రమణిక, ఋషుల అనుక్రమణికను సిద్ధం చేశారు. ఇంకా తెలుగులో అనేక ప్రధాన కావ్యాలకు యీ పదకోశాలు సిద్ధం కావలసి ఉంది. వీటిని ఎంతో వ్యయ ప్రయాసల కోర్చి ఈ రోజులలో ముద్రించడం అంతగా అభిలషించ దగిన విషయం గాదు. పరిశోధన ప్రధానంగా జరుగుతున్న ఒకటి రెండు ప్రాంతాలలో వీటి రాత ప్రతులు భద్రపరిస్తే చాలు. వీటిని సిద్ధం చేయించడం

మాత్రం అవసరం, అప్పుడే తెలుగుభాషకు బృహన్నిఘంటు నిర్మాణం సాధ్యమవుతుంది.

ఆధునిక భాషా శాస్త్రంలో అపారమైన పరిశ్రమ చేసిన భద్రిరాజు కృష్ణమూర్తి గారు చెప్పినట్లు "పదప్రయోగ కోశాలు మౌలిక గ్రంథాలు, వాటిని ఉపయోగించే వారు తక్కువైనా వాటి ప్రయోజనం ఎన్ని శతాబ్దాలకు గూడ తరగని నిధి". ఈ విషయం అందరూ గమనించాలి.

## నిఘంటు ప్రత్యేకతలు

తెలుగు భాషకు సంబంధించిన నిఘంటువుల రచనా విధానం తెలుగు దేశంలో ప్రారంభమై యిప్పటికి నూటపాతిక సంవత్సరాలు కావచ్చింది. ఈ కాలంలో నూరుకు పైగా తెలుగు నిఘంటువులు ఆవిర్భవించాయి. వీటిలో ఒకో నిఘంటువును ఒకో ప్రత్యేక దృష్టితో తయారు చేశారు. ఒక్కో ప్రత్యేక అవసరాన్ని ఆదుకోడానికి, అనగా అచ్చ తెలుగు, అన్య రూపాలు, అలఘు రేఫలు, క్రియా స్వరూపాలు (ధాతువులు), జాతీయాలు, తద్ధిత, కృదంతాల పట్టికలు, తత్సమాది భేదాలు, ద్రావిడ పదాలు, నానార్థాలు, న్యాయాలు, వ్యవహార పదాలు, వ్యాకరణ పదాలు, వ్యతిరేక పదాలు, రూపాంతరాలు, శాసన పదాలు, సమానార్థకాలను ఉద్దేశించారు.

ఈ ప్రత్యేకతలతో బాటు ప్రతి నిఘంటువులలో కొన్ని విశేషాలుంటాయి. అది కవి, పండితులకు అనుభవైక వేద్యం.

ఈ నిఘంటువులన్నీ ఏ ఒక్క గ్రంథాలయంలోనూ, ఏ వ్యక్తి వద్ద ప్రచురణ కర్త వద్ద పూర్తిగా లేవు. పలు ప్రాంతాలలో ఉన్నవి. కొన్ని అలభ్యం. ఇప్పటికి లభ్యంగా ఉన్న వాటిని ఫోటోస్టాట్ కాపీలు, లేదా మైక్రో ఫిల్మ్ తీసి భద్రపరిస్తే భాషకు మహోపకారం చేసినట్లవుతుంది. భాషా నిధిని పరిరక్షించినట్లవుతుంది. ఇది కనీస కర్తవ్యం.

**గమనిక :** ద్విభాషా నిఘంటువులు, పలుభాషల నిఘంటువులు, పద సూచికలు, విషయ నిఘంటువుల సమాచారం కోసం సి.పి. బ్రౌన్ తెలుగు-ఇంగ్లీషు నిఘంటువు చూడండి. ప్రచురణకర్త నవరత్న బుక్ హౌస్, విజయవాడ.

**ఆధారం :** *తొలి ప్రపంచ తెలుగు మహాసభల (1975) సందర్భంలో ప్రచురించిన తెలుగు నిఘంటు వికాసం-గ్రంథం.*

*- వెలగా వెంకటప్పయ్య.*

### అసాధారణ నిఘంటుకర్త

# బహుజనపల్లి సీతారామాచార్యులు

**(1827-1891)**

సంస్కృతభాషకు కాలం తెలియని కాలం నుండి నిఘంటువులు ఉన్నాయి. అర్థాన్ని గ్రహించటంలో, వర్ణక్రమం తెలుసుకోవటంలో నిఘంటువుల అవసరం ఎలాంటిదో వేరుగా వివరించనవసరం లేదు. సంస్కృతాన్ని అనేక రకాలుగా అనుకరించే తెలుగులో మాత్రం 17వ శతాబ్ది నుండే నిఘంటు రచన ప్రారంభం అయ్యింది. పైడిపాటి లక్ష్మణకవి కూర్చిన ఆంధ్రనామ సంగ్రహము, అడిదం సూరకవిగారి ఆంధ్రనామ శేషము, నుదురుపాటి వేంకటాచార్యుల ఆంధ్ర భాషార్ణవము, గణపవరపు వేంకటకవి విరచిత వేంకటేశాంధ్రము, కస్తూరి రంగకవి తయారించిన సాంబ నిఘంటువు తొలి తరపు నిఘంటువులలో కొన్ని. అయితే ఇవన్నీ పద్యాత్మకాలు. ఎక్కువ పదజాలాన్ని కలిగి ఉండవు. కొన్ని నిఘంటువులు ఒకే పదానికి ఉన్న పలు అర్థాలను చెప్పకుండా పర్యాయ పదాలు తెలిపేవిగానే ఉండేవి. మరికొన్ని నిఘంటువులు అమరకోశం నమూనాలో "వర్గ"లుగా విభక్తమై ఉంటాయి. వీటిని కూడా నాటి విద్యార్థులు భట్టీయం పద్ధతిలోనే చదివేవారు. కవి ప్రయోగాలు లేకపోవడం, అకారాది క్రమంలో ఉండక పోవడం ప్రధాన లోపాలు.

ఈ లోపాలను గుర్తించి అకారాది క్రమంలో నిఘంటువును సంతరించిన ప్రథములు సి.పి. బ్రౌన్. వారి పద్ధతిలోనే మరింత విస్తృతమైన, ప్రామాణికమైన నిఘంటువును వీరు నిర్మించారు. దాని పేరే శబ్ద రత్నాకరము. ఇప్పటికీ శబ్ద రత్నాకరము తన ఆధిక్యాన్ని కోల్పోలేదంటే దాని నిర్మాణంలో ఆచార్యులు ఎంత శ్రద్ధ తీసుకొన్నారో అవగతమవుతోంది. ఆంధ్రులకు నిఘంటు రంగంలో విశేష సేవ చేసిన ఆచార్యులుగారి వివరాలు ఏమంత తెలియరావడం లేదు.

తెలిసినంతమటుకు వీరు ద్రవిడ దేశ వైష్ణవులు. తల్లిదండ్రుల పేర్లు తెలియరాలేదు. వీరి పూర్వులు తెలుగువారా లేదా తెలుగు మూలాలు కలిగినవారా అన్న సంగతి కూడా నిర్ధారణగా తెలియదు. వారు పుట్టింది తమిళ దేశంలోని నాగపట్నంలో. వీరి రచనలన్నీ తెలుగు భాషలోనే ఉండటం, తమిళ భాషలో ఏవైనా రచించారో లేదో కూడా తెలిపే ఆధారాలు లేకపోవడం వలన వీరిని తెలుగువారిగానే భావించవచ్చు. తెలుగు భాషలో మరింత పాండిత్యం సంపాదించటానికి, ఆ నాళ్లలో చెన్నై తెలుగు సాంస్కృతిక రంగంగా వెలుగొందు

తున్నది కనుక ఆచార్యులుగారు 23 ఏండ్ల వయస్సులోనే చెన్నై వచ్చేసి, అక్కడే స్థిరపడి పోయారు. చెన్నైలో వారు చిన్నయసూరి వద్ద శిష్యరికం చేశారనే వాడుక ఉంది కాని దానిని స్పష్టపరిచే ఆధారాలు లేవు. తెలుగు భాషకు ఆధునిక వాగనుశాసనునిగా పరవస్తు చిన్నయసూరి పేరు ఆ రోజులలో విద్యా రంగంలో మారు మ్రోగుతున్నది. యూనివర్శిటీలో ఉన్నత పదవిలో ఉన్నారు. అన్నిటికీ మించి దొరల వద్ద విశేష మైన ప్రాపకం పొందారు. ఎన్నో కావ్యాలను అవలోడన చేసిన పండితుడు. అటువంటి చిన్నయసూరి శిష్యుడిగా ఉండి ఉంటే అది మరింత ఖ్యాతి కలిగించే విశేషమే. అయినా, ఆచార్యుల వారెక్కడా ఆ సంగతి తన రచనలలో ప్రస్తావించ లేదు. చిన్నయసూరి గురించి శబ్దరత్నాకరము పీఠికలో ఆచార్యుల వారు "సంస్కృతాంధ్రముల యందు విశేష పాండిత్యంబు గలిగి యాసేతు హిమా చలము చాల ప్రసిద్ధి వహించి యుండిన పరవస్తు చిన్నయసూరి" అని రాశారు. వారే మరొక సందర్భంలో "పరవస్తు చిన్నయ సూరికి ఆంధ్రము నందున దదుపయుక్త సంస్కృత ప్రాకృతముల యందును దలస్పర్శి యగు పరిజ్ఞానము కలదని వారు చేసిన లక్ష్య లక్షణ గ్రంథాలే నిరూపించు చున్నవి. మేము వారితో జిరకాలము సావాసము చేసి యుంట వారి పాండిత్యము మా కనుభవ సిద్ధము" అని కూడా అన్నారు. ఎక్కడా సూరి తమకు గురువులన్న ప్రస్తావన చేయలేదు. అందువలన నేరుగా తరగతి గదిలో ఆచార్యులుగారు సూరికి శిష్యులు కారు. నాగపట్నం నివాస కాలంలోనే ఆచార్యులు గారు తెలుగులో, సంస్కృతంలో ప్రావీణ్యత సంపాదించారు. వివిధ శాస్త్రాలను పరికించారు. నేర్చిన శాస్త్ర జ్ఞానానికి మరింత మెరుగు కోసం, అధ్యయనంలో తలెత్తే సందేహాల నివారణ కోసం ఆచార్యులు తరచూ సూరిని సందర్శిస్తూ వచ్చారు. వారితో శాస్త్ర చర్చ జరిపేవారు. వారితోనే కాక రాజధాని కళాశాలలో రెండవ పండితునిగా పని చేస్తున్న పురాణం హయగ్రీవశాస్త్రితో కూడా ఆచార్యులు గారికి సహచర్యం కుదిరింది.

ఆచార్యుల వారికి ప్రథమ గురువు వారి తండ్రిగారే. చిన్ననాటి నుండే మంచి కవితాధార అబ్బింది. వారు అనేక గ్రంథాలను రచించారు. అవి సౌందర్య రాజ శతకము (1849), వైకృత దీపిక, విభక్తి దీపిక, పదార్థ నామకోశము, బాల చంద్రోదయము (1871), అలఘు కౌముది (1872), ఆంధ్ర శబ్దమంజరి, ఉపాధ్యాయ బోధిని, వినాయక శతకము, త్రిలింగ లక్షణ శేషము, శబ్ద రత్నాకరము (1885).

పై రచనలలో ఆచార్యులగారికి విశేష ఖ్యాతి కలిగింది త్రిలింగ లక్షణ శేషము, శబ్దరత్నాకరములతోనే. అందులోనూ శబ్దరత్నాకర కారునిగానే ఇప్పటికి నిలిచి ఉన్నారు. పై రచనలలో ఎక్కువ భాగం

ప్రచారంలో లేవు. 22 ఏండ్ల ప్రాయంలో నాగపట్నంలో వేంచేసియున్న సౌందర్యరాజ స్వామిపై రాసిన శతకం, శబ్దరత్నాకరము రచనలో విఘ్నాలు లేకుండా నిరాటంకంగా కొనసాగుటకు వినాయకుని వేడుతూ రచించిన శతకం శతకకవుల చరిత్రకారు లచే ఉద్ధరించ బడ్డాయి. యౌవ్వన దశలోని ఆచార్యుల శైలి తెలుసుకొనుటకు సౌందర్య రాజ శతకంలోని ఒక పద్యం –

*మలయజ శిశిర తనురుచిర*
*జలరుహదళ సదృశనయన జలనిధి శయనా !*
*కలరవ కలిత కటకయుగ*
*సులలిత మృదుపద పయోజ ! సుందర రాజా !*

ఈ శతకం శబ్దాలంకార సంయుతం. కవిత ప్రాథమికంగా ఉన్నా మధుర భరితమైనదని విమర్శకుల అభిప్రాయం. ఆచార్యులవారు వైష్ణవు లైనప్పటికీ నిఘంటు నిర్విఘ్న సమాప్తికి వినాయక శతక రచన చేయటం వలన తీవ్ర వైష్ణవులు కాదనిపిస్తుంది. ఆ శతకం లోని ఒక పద్యాన్ని కూడా శతక కవుల చరిత్రకారులు ఉదహరించారు.

*వంకర తొండము చేటల*
*పొంకము గల చెవులు పెద్ద పొట్టయు దగ ని*
*చూము వందల వాగడగ*
*బింకముతో దాల్తువయ్యా పేర్వెనకయ్యా !*

విభక్తి దీపిక, వైకృత దీపిక, బాల చంద్రోదయము, అలఘు కౌముది, వైకృత దీపిక అనే చిన్న పుస్తకాలను పాఠశాల విద్యార్థులకు ఉపయోగపడే రీతిలో వీరు సంతరించారు. అందువలన పఠన పాఠనాదులలో వీటి ఉపయోగం తగ్గిన తరువాత ప్రచారం నుండి అదృశ్యమై ఉంటాయి. శబ్ద రత్నాకరము చివరి రచన అయినప్పటికీ దానిలో తన తొలి రచనల ప్రస్తావన ఏదీ చేయలేదు. అంటే ఈ రచనల విలువ గురించి వారికే అనుమానం కలిగి ఉండవచ్చు.

సాహిత్య చరిత్రలో వారి పేరు స్థిరపడటానికి శబ్ద రత్నాకరము చాల ఎక్కువగా, త్రిలింగ లక్షణ శేషము కొంత కారణమని ముందే చెప్పుకొన్నాం. బాల వ్యాకరణమునకు తదనంతర గ్రంథం కనుక ప్రౌఢ వ్యాకరణమని, త్రిలింగ లక్షణ శేషమని వ్యవహార నామం కలిగింది. ఇందులో చిన్నయసూరి బాల వ్యాకరణ ములో చెప్పని వ్యాకరణ విశేషాలను సూత్రీకరించారు. బాల వ్యాకరణంలో చెప్పిన వాటికి మరింత విస్తృతిని ఆచార్యుల వారు కల్పించారు. ఒక ఉదాహరణ పరిశీలిద్దాం. సూరి తన వ్యాకరణంలో సంధి పరిచ్ఛేదంలో "తెనుగుల మీది సాంస్కృతిక పరుషములకు గసడదవలు రావు" అని నిబద్ధించారు.

ఈ సూత్రానికి విరుద్ధమైన ప్రయో గాలు కావ్యాలలో కనబడుతున్నాయి. (అందులోనూ సవరించడానికి వీలులేని

ప్రాస స్థానంలో కనబడుతున్నాయి.) అందువలన బహుజనపల్లివారు ఆ సూత్రాన్ని సవరించి "కొన్ని యెడల దెనుగుల మీది సాంస్కృతిక కతపలకు గదవలు గానంబడియెడి" అని సూత్ర నిర్మాణం చేసి "కొన్ని యెడలననగా బ్రాసంబులందని యర్థము" అని వివరణ కూడా ఇచ్చారు. అయితే ఆచార్యులవారు ఇంత శ్రమపడినా "సూరివలె ఆచార్యుల గారికి సూత్రపరచుటలో బొందిక కుదర లేదన వలయును" అని పండితులు అభిప్రాయపడుతున్నారు. వారే "ఇందలి లక్షణములు అసాధారణములు. ఇయ్యది విద్యార్థుల కత్యంతోప కారక "మ"ని కూడా అంటున్నారు. ఏది ఏమైనా ఇప్పటికీ వ్యాకరణ వ్యాసంగంలో బాల వ్యాకరణానికి ఉన్న ప్రశస్తి ప్రౌఢ వ్యాకరణానికి రాలేదనే చెప్పాలి.

ఆచార్యుల కృషి, వారి భాషాధ్యయన శక్తి, శబ్దరత్నాకరము వలనే లోకానికి తేటతెల్లమయ్యింది. వారు రచించినవి ఎన్ని ఉన్నా వారికి నిఘంటుకర్తగానే సాహిత్య లోకంలో ప్రసిద్ధి. శబ్దరత్నాకరము వంటి నిఘంటువును కూర్చాలన్న కోరికకు ప్రేరేపకులు ఇద్దరు. ఒకరు తాను తరచూ శాస్త్ర చర్చలు సలుపుతూ చిరకాలం సావాసం చేస్తూ వచ్చిన చిన్నయసూరి, రెండవవారు సూరి తరువాత రెండవ పండిత స్థానంలో పనిచేస్తున్న పురాణం హయగ్రీవశాస్త్రి. వీరిరువురి సాహచర్యం వీరికి విద్యా సంగ్రహణంలో ఎంతో ఉపకరించింది.

బహుజనపల్లి వారి నిఘంటువు ప్రచారంలోకి రాక పూర్వం అమరం, విశ్వ, విశ్వప్రకాశిక, కొశవ, హలాయుధ, శబ్దార్ణవ వంటి దశవిధ నిఘంటువులు వాడుకలో ఉన్నా అవి పద్యాత్మకాలు. సంస్కృత భాష వరకు మాత్రమే ఉపయోగితములు కావటం వలన తెలుగు పదాలకు అర్థాలు తెలుసు కోవాలంటే ఏవైనా సంశయాలు ఏర్పడితే భారతాదులు తిరగేసి సంశయ నివారణ చేసుకోవలసి వచ్చేది. శబ్దరత్నాకరము బాగా వినియోగంలోకి వచ్చిన తరువాత ఆ శ్రమ తప్పిందని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి గారంతటి వారు సంతోషపడ్డారు. దీనికి ముందు ముద్రితమైన బ్రౌణ్యం ఉన్నా అది ఎందు వల్లనో శబ్దరత్నాకరము లాగా బహుళ ప్రచారం పొందలేదు. అప్పటి కోర్టులలో మాత్రం బ్రౌణ్యమ్ ప్రమాణం. విశేష మేమంటే శబ్దరత్నాకరం తయారీకి ముద్రిత బ్రౌణ్యము, అముద్రిత చిన్నయసూరి నిఘంటువు దారి చూపాయి. వైయాకరణ శ్రీనివాసాచార్యుల వారు సేకరించి పెట్టుకొన్న "అపూర్వ గ్రంథ ప్రయోగసార సంగ్రహములైన కొన్ని సంచికలు" కూడా ఎంతో తోడ్పడ్డాయి.

శబ్దరత్నాకరము కూర్పుకు ఆచార్యులు నాటికి లభ్యమవుతున్న 104 కావ్యాలను పరిశీలించారు. ఈ నిఘంటువు అచ్చుపడే

నాటికి వాటిలో కొన్ని గ్రంథాలు ఇంకా అచ్చు పడలేదు. పాతికేళ్ళ శ్రమ దమాదులకోర్చి 1885లో తొలిసారిగా అచ్చు వేశారు. మొదటి అచ్చులో 60,000 పదాలను నిఘంటువు కెక్కించారు. పుటల సంఖ్య 1131. ఈ గ్రంథానికి పీఠిక, భాషా ప్రశంస, నియమ విధాన క్రమం, సంజ్ఞా వివరణ పట్టిక, గ్రంథ సంకేతాది వివేచన పట్టిక పేర్లతో ఎంతో సమాచారాన్ని వీరు ఇచ్చారు. ఇందులో భాషా ప్రశంస భాగం వీరి సాహిత్యావలోడనానికి అద్దంలాగా ప్రతిఫలింప చేస్తుంది.

ఈ నిఘంటు రచనకు కావలసిన గ్రంథ సంపాదనకు నిఘంటుకర్త ఎంతో శ్రమించారు. వారికి తీరిక ఉన్న సమయా లలో వారే గ్రంథాలకు ప్రతులు రాసుకొనే వారు. ఇద్దరు ముగ్గురు రాయసకాండ్రతో రాజధాని కళాశాల గ్రంథగారానికి వెళ్ళి తాటాకుల పుస్తకాలకు, అచ్చు పుస్తకాలకు ప్రతులు తయారు చేయించుకొనేవారు. ''శరీర కష్టమును విత్త నష్టమును ఇంచుకేనియు బాటింప'' లేదు. కొన్ని దేశాంతరాల నుండి తెప్పించారు. కొన్ని పండితుల వద్ద నుండి సేకరించారు. కొన్ని ఆనరబుల్ లక్ష్మీనరసింహులు సెట్టి వద్ద రాయించారు. పచ్చయప్ప మొదలారిగారి పాఠశాలలో పండితులైన ఉ.వై. శ్రీనివాసా చార్యులు ప్రాణ ప్రదంగా దాచుకొన్న కొన్ని సంచికలను ఇచ్చి సహకరించారు. ఈ విధంగా గ్రంథ సంపాదనకే అయిదారు సంవత్సరాలు పట్టింది. ఈ ప్రకారం గ్రంథ సేకరణ చేసి వాటిలో వెదికి ఎత్తి రాసుకొన్న పదాలను, లోగడ సేకరించుకొన్న తెలుగు పదాలను కలిపి అమరము, అమరపద పారిజాతము, మేదిని, విశ్వప్రకాశిక వంటి సంస్కృత నిఘంటువులను పరిశీలించి వాటిలో నుండి అవసరమైన సంస్కృత పదాలను కూడా కలిపి నిఘంటు కూర్పు సాగించారు. పైన పేర్కొన్న నిఘంటువులలో బాగా ఉపకరించినది అమరపద పారిజాతము.

శబ్దరత్నాకర మందలి ఇంకొక విశిష్టత ఆరోపాలకు సాధ్యమైనన్ని కవి ప్రయోగాలను ప్రదర్శించడం. ఒక పదానికి వేరు వేరు అర్థాలు ఉన్న సందర్భాలలో ఆయా అర్థాలకు సరిపోయే కవి ప్రయోగా లను కూడా నిఘంటుకర్త ఇచ్చారు. సంస్కృత నిఘంటువులలో కూడా ప్రయో గాలు చూపకుండా ఆరోపమే ఇచ్చే పద్ధతి వాడుకలో ఉంది. వీరు ఆ పద్ధతిని సంస్కరించి నిఘంటువుకు ప్రామాణికతను పెంచారు.

నిఘంటువును రాయ ప్రారంభించిన కొత్తలో రామానుజులు నాయుడు ఉన్నారు. ఎక్కువ భాగం అనంతాచార్యులు అనే వారు అత్యంత శ్రద్ధతో పనిచేయబట్టి గ్రంథ గ్రథనం, ప్రచురణ ఒక కొలిక్కి వచ్చాయి. ఈ నిఘంటు ప్రయోజనాలను గుర్తించి

దేశభాషా గ్రంథకరణ సభ వారు (మద్రాసు స్కూల్ బుక్ వర్నాక్యులర్ సొసైటి) ఐదువేల రూపాయలు పారితోషిక మిచ్చి గ్రంథ ప్రచురణ హక్కులు పొంది 1885లో మొదటిసారిగా ప్రచురించారు. శబ్ద రత్నాకరము పీఠిక తరువాత భాగమైన భాషా ప్రశంస విలువైనది. ఇందులో ఆచార్యులు గారు కవులను వారి వారి రచనా సామర్థ్యాలను బట్టి ఆరు తరగతులుగా విభజించారు. వారి దృష్టిలో కవిత్రయం, నాచనసోముడు మాత్రమే ప్రథమశ్రేణి కవులు. ఈ భాగం రచన ఉద్దేశం ఏమైనా తదుపరి కాలంలో సాహిత్య చరిత్రలు రచనకు ప్రేరణ నిచ్చింది. ఈ నిఘంటువును మొదటిసారిగా పరివర్థితం చేసి పరిశోధన పరమేశ్వర నిడదవోలు వేంకటరావు 1958లో ప్రచురించారు. అయితే వేంకటరావు తాను చేర్చిన ఆరోపాలను మూలంలో కలిపి వేయకుండా అనుబంధంగానే అచ్చు వేయించారు.

ఆచార్యులుగారి మరొక చెప్పుకోదగిన సాహిత్య కృషి పత్రికా సంపాదకత్వం. తొలి తరం పత్రికలలో ఒకటైన సుజన రంజనిని వారి సహోద్యోగులైన వింజమూరి కృష్ణమాచార్యులు, కారుమంచి సుబ్బరాయ నాయుడులతో కలిసి 1865లో ప్రారంభించారు. ఈ పత్రికకు వారు ముగ్గురు 'ప్రవర్తకులు'. 'ఎడిటర్' పదానికి వారు పెట్టుకొన్న తెలుగు పేరు ప్రవర్తకుడని. తొలి తరం పత్రికలలో ఒకటవ్వడమే కాకుండా కేవలం విద్యార్థుల కోసమే నడిపిన తొలి పత్రిక సుజన రంజని.

ఆచార్యుల వారి స్వస్థలం నెల్లూరు జిల్లా గాని, చిత్తూరు జిల్లా గాని అయి ఉంటుందని చెళ్లపిళ్ల వారు అభిప్రాయ పడుతున్నారు. (కథలు–గాథలు తృతీయ భాగం). "ఊహాపోహలు కలిగి చూచుకొనే వారికి ఆచార్ల గారి నిఘంటువు తెలుగు మాత్రానికే కాదు, కొంతవరకు సంస్కృతాని క్కూడా ఉపకరిస్తుందని" శతావధాని గారి అభిప్రాయం. "శబ్దరత్నాకర కారుడు చేసిన పరిశ్రమ శ్లాఘనీయము. వారు చేసిన పరిశ్రమ తెలుగు యితిహాసము బంగారు రేఖల్లో ఒత్తబడగలదు" అనే ముమ్మనేని నాగేశ్వరరావు గారి నిశ్చయంలో ఏకీభవించని ఆంధ్రుడెవడు ?

**మోదుగుల రవికృష్ణ,**
తెలుగు లెక్చరర్
ఆర్.వి.ఆర్.ఆర్. విద్యా శిక్షణ కళాశాల,
గుంటూరు.

# పీఠిక

జనులు తమతమ భాషల యందు సంపూర్ణ జ్ఞానము సంపాదించుకొనుట అత్యావశ్యకము. ఆ జ్ఞానము ఆయా భాషా గ్రంథములను దలస్పర్శముగఁ జదువకకాని కలుగ నేరదు. అట్లు చదివి పదార్థ పరిజ్ఞానముఁ బడయుటకు ముఖ్య సాధనం బులు నిఘంటువులు. ఆ నిఘంటువులో యీ దేశభాషల యందింగ్లీషు నందువలె వచన రూపములు గాక సంస్కృతంబు నందుంబలెఁ బద్య రూపములుగా నున్నయవి. అట్లుండు టచే విద్యార్థుల కవి సుబోధంబులు కావు. ఆ హేతువుఁ బట్టి ముందు సంస్కృతము నందుఁ బద్య రూపములుగా నుండిన నిఘంటువు లన్నియు నిప్పుడు అకారాది క్రమమున వచన రూపములుగా నేర్పఱుపఁ బడి యున్నవి. ఇంకను గొన్ని యేర్పఱుపఁ బడుచున్నవి. అట్లే యాంధ్ర ద్రవిడాది భాషల యందును గొన్ని యేర్పఱుపఁబడి యున్నవి. అందు ద్రవిడాది భాషల కేర్పఱుపఁ బడినవేమో విద్యార్థుల యుపయోగమునకుఁ జాలునంతటివిగాను లక్ష్యా విరుద్ధములుగాను నున్నవి. ఈ యాంధ్రమున కేర్పఱుపఁబడి యుండు నొకటి రెండు నిఘంటువులన్ననో యట్లుకావు.

కావున నీలోపంబుంబాపఁ గొంత కాలంబునకు ముందు సంస్కృతాంధ్రముల యందు విశేష పాండిత్యంబు గలిగి యా సేతు హిమాచలము చాలఁ బ్రసిద్ధి వహించి యుండిన పరవస్తు చిన్నయసూరి గారు జీవితులై యుండిన కాలంబున దీర్ఘ సూత్రతతో ననేక గ్రంథ పరిశోధనంబు గావించి మిగులవిరివిగాఁ బ్రయోగ సహితం బుగ అకారాది తెనుంగు నిఘంటు వొకటి వ్రాయంబ్రారంభించి నడుపు చుండిరి. ఆ మహాప్రారంభముఁ జూచి యది పరిపూర్తి యగుటకు బహుకాలము చెల్లుననియుఁ బరిపూర్తి యయినను అందుఁ దెనుగు పదములు మాత్రమే చేర్చబడి యుండుటం జేసి యది విద్యార్థుల కంతగాఁ బ్రయోజన కారికాఁ జాలదనియు ఇదికాక బళ్లయందుఁ జదివెడు విద్యార్థులంత పెద్ద పుస్తకముఁ గొని యుంచు కొనుట కష్టముగానుండు ననియు నూహించి సంస్కృతాంధ్ర భాషల యందుఁ గొంత పరిశ్రమముగల నేనీయాంధ్ర భాషఁ జదువ దొరంకొను విద్యార్థుల సహాయార్థము వారి యుపయోగమునకుఁ జాలునంతటిది గాను లక్ష్యావిరుద్ధము గాను నుండునట్లు తెనుఁగు పదములతోఁ గూడఁ దదపేక్షితము లైన సంస్కృత పదములను జేర్చి చిన్నదిగ అకారాది నిఘంటువొకటి వ్రాసి శీఘ్ర కాలముననే పూర్తిచేసెదఁగాక యని మిక్కిలి పూనికతో దీని వ్రాయ నుద్యమించితిని.

అట్లుద్యమించి మునుమున్ను తెనుఁగు నిఘంటువుల యందుండి పదము లను మాత్రమెత్తి వ్రాసికొని యర్థము లందలివి తఱచుగ లక్ష్యవిరుద్ధములుగా నుండుటచే లక్ష్య శోధనంబు గావించియు తదను సారంబుగ నర్థములను వ్రాయ నిశ్చయించి వాస్తవార్థ పరిజ్ఞాన సిద్ధికిని విశేష పద ప్రాప్తికిని మూలకారణంబగు నాంధ్రభారతాది గ్రంథ పరిశోధనంబు నందత్యంత సముత్సు-కుండనై తదసాధారణ గ్రంథ సముపార్జ నంబునకుం గడంగి తదుపార్జన విషయమై

శరీర కష్టమును విత్త నష్టమును నించుకేనియుం బాటింపక నాకుఁ దీఱికయైన కాలములయందు వేతనము లేర్పరచి యుంచుకొని యుండిన యిద్దఱు ముగ్గరు వ్రాయసకాంధ్ర తోడఁ బదిగంటలకుఁ గాలేజికింజని సాయంకాల మయిదుగంటల పర్యంత మచ్చుటన యుండి యనేక గ్రంథములను వ్రాయించికొని వచ్చితిని. కొన్ని దేశాంతరంబుల నుండి తెప్పించితిని. కొన్ని పండితుల సన్నిధిం గడించితిని. కొన్ని హానరెబిల్ లక్ష్మీనరసింహులు సెట్టిగారి యొద్ద వ్రాయించితిని. ఆ గ్రంథ సంపాదన కాలమునందుఁ బచ్చయప్ప మొదలారిగారి పాఠశాలలోఁ బండితాగ్రగణ్యులై ప్రఖ్యాతికెక్కి యుండిన ఉ. వైయాకరణ శ్రీనివాసాచార్యుల వారు తాము ప్రాణ పదముగా సంగ్రహించి యుంచికొనియుండిన యపూర్వ గ్రంథ ప్రయోగ సార సంగ్రహములైన కొన్ని సంచికలను లోకోపకారార్థము నాచేతికొ సంగిరి. అవి నాగ్రంథకరణ కార్యమునకు మిక్కిలి సహకారులయ్యెను. ఈ తీరున గ్రంథములను సేకరించుటకే యయిదాఱు సంవత్సరంబులు కావచ్చెను. ఇన్ని పాట్లు పడియు నింత ద్రవ్య వ్యయము చేసియు సాధారణ గ్రంథములే విశేషము దొరకినవి గాని తదితరములు విశేషముగ దొరకినవి కావు. సాధారణ గ్రంథముల యందును బెక్కులు చిక్కవయ్యె. చిక్కిన గ్రంథములివి యని వెనుకఁజేర్పఁబడి యుండు గ్రంథ సంకేతాది వివేచన పట్టిక యందు విశద ములు కాఁగలవు. అక్కడనే గ్రంథ భార శోధనచే నాకుఁదోచి యేర్పఱిచిన తద్గ్రంథ కర్తలగు కవుల తారతమ్యమును నెఱుక పడగలదు. ఈ ప్రకారము గ్రంథములను సేకరముచేసి యందు వెదకి యెత్తిన పదము లను ముందటి తెనుఁగు పదములతోడఁ గూర్చి తెనుగు సంస్కృతాను సారి కనుక అమరము, అమరపద పారిజాతము, మేదిని, విశ్వప్రకాశిక లోనగు నంస్కృత నిఘంటువులను బరిశీలించి యందుండి వలయునన్ని సంస్కృత పదముల నెత్తి చేర్చితిని. నా గ్రంథకరణ కార్యములు రెంటి మూటికిఁజాల సహాయ భూతముగా నుండి నకతన అమర పద పారిజాతము నాపాలిటికిఁ బారిజాతము గానే యుండెను.

సంస్కృతాంధ్ర పదముల నకారాదిగా నిట్లేర్చి కూర్చి మిగుల మనఃక్లేశపడి దేశ్య వైకృత సంస్కృత గ్రామ్యాది సూచకంబులుగ నక్కడక్కడ నాయాయి సంకేతా క్షరంబులిడి యంతనెంతయు విచారణచేసి యా తెనుఁగుపదములకు లక్ష్యావ లోకనముచే లక్షింపఁబడిన యర్థములను వ్రాసి సంస్కృత పదంబులకు నాయా నిఘంటు వుల యందు వ్రాయఁబడియుండు నర్థము లను వ్రాసితిని. వాడుక పదములు నైఘంటిక పదములును దక్కఁదక్కిన తెనుగు పదముల కర్థములు వ్రాయబడి ప్రయోగములు చూపఁబడియున్నవి. కొన్ని చోట్లఁ గ్రొత్తగా నిర్ధారణ చేయఁబడిన యర్థము సరియని విశ్వాసము పుట్టుటకుఁ గాఁ దెనిగింపఁబడిన గ్రంథముల యందలి పదములకుఁ దత్తత్సం స్కృత మాతృ గ్రంథములనుండి యాయా ఘట్టముల ప్రయోగములును నెత్తి వ్రాయబడి యున్నవి. సంస్కృత నిఘంటువు లన్నియుఁ బ్రామాణికులగు పండితులచేతనే వ్రాయఁ బడినవి కాన వానికిఁ బ్రయోగములు

చూపబడవు. ఇందుఁ దెనుఁగు పదములు కొన్నిటికి యథాశక్తిని వ్యుత్పత్తియు వ్రాయఁబడి యున్నది. తెనుగు నందపూర్వ మయినయది యట్లు వ్రాయఁబడుట స్వపాండిత్య ప్రకటనమునకుఁ గాదు. తెనుగు పండితులును దాము నితఃపరము దానిని వాడుకలోనికిఁ దేవలయుననుటకు సూచకంబని గ్రహింప వలయును. సంకేతాక్షర క్రమ మును వాని యర్థములును దీని వెనుక నుండు సంజ్ఞావివరణపట్టిక యందుఁ బ్రకాశితములు కాఁగలవు. సంకేతము లేర్పఱుచుచోఁగొన్ని యెడలనిది సంస్కృత మిది తెనుఁగని కనిపెట్టుట దుష్కరముగా నుండెను. కొన్నికడల దేశ్యమిది వైకృత మిదియని తెలిసికొనుట దుస్సాధ్య ముగా నుండెను. కొన్నిచోట్ల దైశ్య వైకృత మిశ్రపద మిదియని గుర్తెఱుఁ గుట దుర్లభముగా నుండెను. కొన్నిపట్ల నిది సంస్కృతాంధ్ర మిశ్రపద మనియు గ్రామ్య పదమనియు గ్రహించుట దురూహముగా నుండెను. అది యట్టిదయని బుద్ధిమంతులు తలంతురు. "విద్వానేవవిజానాతి విద్వజ్జన పరిశ్రమమ్, నహివన్ధ్యా విజానాతి గుర్వీప్రప్ప నవ వేదనామ్." అని పెద్దలు వక్కాణింతురు కాదె.

ఈ నిఘంటువును వ్రాయఁ బ్రారంభించిన కొత్తలో, రా.రా.పో. రామానుజులు నాయుడు కొంతకాలము లేఖరిగా నుండి యీ గ్రంథమునకుఁ గావలసిన కుదురు పాటులన్నియుఁ గలుగఁజేసెను. ఆ పిమ్మట నౌకరిద్దఱు కొన్ని కొన్ని దినముల నుండి యీ వ్రాఁతపని చూచి పోయిరి. అటు తరువాత సంస్కృతాంధ్ర పండితులైన ఉ.కొ. అనంతాచార్యులు వ్రాయసమునకుఁ గుదిరి యత్యంత శ్రద్ధతో నిర్భర ప్రయాసము పుచ్చుకొని నిర్విఘ్నముగ నీ గ్రంథముఁ బరిసమాప్తిఁ బొందించిరి. శీఘ్రకాలముననే ఈ నిఘంటువు వ్రాసి సంపూర్తి గావించెదఁ గాకయని యుద్యమించియు నిది పరిసమాప్తిఁబొంద రమారమి యిరువది యైదు సంవత్సరములకు మీదనే కాలము పట్టెను.

ఎటువంటి బుద్ధిశాలురకును నిట్టి కార్యముల యందుఁ బొరపాట్లు కలుగు ననగా నావంటి స్వల్ప బుద్ధికా యిట్టి మహాకార్యమునందుఁ బొరపాట్లు కలుగక మానును ? కావున బుద్ధిమంతులట్టి పొరపాట్లు దెలిపి దిద్దించి నన్నుఁ గృతార్థుం జేయుదురని ప్రార్థించెద.

ఈ యకారాది నిఘంటువును నేను శ్రమపడి వ్రాసినను నాశ్రమము విఫలంబు గాక రెండు విధంబులను సఫలంబగునట్లు దానింగొని ముద్రితం బొనర్పించి ప్రసిద్ధికిని బ్రచారమునకును దెచ్చినట్టి ఘనులగు దేశభాషా గ్రంథ కరణ సభాధ్యక్షులను గృతజ్ఞతతోఁ దలంచుచు నిప్పుడీ వృత్తాంతంబుం బరిపూర్తి యొనరించెద.[1]

ఇట్లు

**బహుజనపల్లి సీతారామాచార్యులు**

1. ఆ నిఘంటువిట్లు వ్రాయఁబడి చెన్నపట్టణమునందలి దేశభాషా గ్రంథకరణ సభవారి ఆంధ్రభాషాధ్యక్షులచే పరిశోధింపబడి ముద్రింపబడియెను. ఈ గ్రంథ స్వాతంత్ర్యముగల పైసభవారు నా శ్రమమునకు ఐదువేల రూపాయలు సన్మానముగానిచ్చిరి.

# భాషా ప్రశంస

1. భాషయనఁగా శబ్దరూపమై భాషించుటకు సాధనమైనది. ఆ శబ్దము ధ్వని రూపముగాను వర్ణ రూపముగాను నుండును. అది యుచ్చరించునపుడు మొదట ధ్వనిరూపమై యాభ్యంతర ప్రయత్నములచే నుద్గమించి కంఠతాల్వాది స్థానముల యందుఁదగిలి కకారాది వర్ణరూపముగాఁ బరిణమించుచున్నది. ఆవర్ణములు కొన్ని స్వతంత్రించియుంగొన్ని యనేకములు చేరియు నా యాయి యర్థములను బోధించుచున్నవి. భాషణము పరస్పరాభి ప్రాయసూచకంబయి లోక ప్రవర్తనము నకు మూలకారణముగా నున్నయది.

2. ఆ భాష సంస్కృతాదిభేదంబులచే బహుభంగులం బ్రవర్తిల్లెడు.

   సంస్కృతము దేవతలు భాషించెడు భాష గావున దేవభాషనాఁబడు. అపభ్రంశాది దోషంబులు లేక సంస్కరింపబడిన దగుటంజేసి సంస్కృతంబని దానికభిధానంబుగలిగె. అది యనాదియగు వేదంబునకాధారమై భాషలన్నింటి కాది యగుటం బట్టి యాది భాషయనంబడు. “ఆద్యామహార్హాసామూలా సర్వేస్యేతి నిగద్యతే” అని వికృతివివేక కారుఁడు. సంస్కృతభాష యిప్పుడు కావ్య నాటకా దులయందు ఉపయోగపడుచున్నది.

3. ఇట్టి భాషయే వివేకవర్ధనములగు విద్యలుగాను కళలుగాను తంత్రములుగాను మఱియు ననేకములుగాను నేర్పడియున్నది.

   **విద్యలు :** ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వ వేదము, శిక్ష, వ్యాకరణము, ఛందము, నిరుక్తము, జ్యోతిషము, కల్పము, మీమాంసాశాస్త్రము, న్యాయ శాస్త్రము, పురాణము, ధర్మ శాస్త్రము అని ఇవి పదునాలుగు.

   **కళలు :** ఇతిహాసము, ఆగమము, కావ్యాలంకార నాటకములు, గాయకత్వము, కవిత్వము, కామశాస్త్రము, దురోదరము, దేశభాషా లిపిజ్ఞానము, లిపికర్మము, వాచనము, అవధానము, స్వరశాస్త్రము, శాకునము, సాముద్రికము, రత్న శాస్త్రము, రథాశ్వగజకౌశలము, మల్లశాస్త్రము, సూదకర్మము, దోహదము, గంధవాదము, ధాతువాదము, ఖనివాదము, రసవాదము, జలవాదము, అగ్ని స్తంభము, జల స్తంభము, ఖడ్గస్తంభము, వాచస్తంభము, వయస్తంభము, వశ్యము, ఆకర్షణము, మోహనము, విద్వేషణము, ఉచ్చాటనము, మారణము,

**అంతరించు** (సం.అ.క్రి.) : 1. చచ్చు 2. చెడు 3. స.క్రి. కడచు.

**అంతరిక్షము** (సం.వి.అ.న.) : ఆకాశము, మిన్ను. (రూ. అంతరీక్షము.)

**అంతరీపము** (సం.వి.అ.న.) : నీటి నడిమిదిబ్బ, ద్వీపము.

**అంతరీయము** (సం.వి.అ.న.) : పరిధానము, కట్టుఁగోక.

**అంతరువు** (వై.వి.) : 1. తారతమ్యము, 2.మఱుఁగు చోటు.

**అంతర్గతము** (సం.విణ.) (అ.ఆ.అ.) : 1. నడుము బొందఁబడినది, 2. మఱవఁ బడినది.

**అంతర్ధ** (సం.వి.ఆ.స్త్రీ.) : తిరోధానము, మఱుఁగు.

**అంతర్ధానము** (సం.వి.అ.న.) : మఱుఁగుపాటు.

**అంతర్ధి** (సం.వి.ఇ.పుం.) : పిధానము, మఱుఁగు.

**అంతర్భూతము** (సం.విణ.) (అ.ఆ.అ.) : లోపల నడఁగినది, అడకము.

**అంతర్మనుఁడు** (సం.విణ.స.) : దుఃఖము నొందిన మనస్సు గలవాఁడు, విమనుఁడు.

**అంతర్ముఖుఁడు** (సం.విణ.) (అ.ఈ. అ.) : బయటికి సంసారి వలెఁ గనఁబడుచుండియు లోపల బ్రహ్మ జ్ఞాన పరిపూర్ణుఁడైనవాఁడు. (ఈకారాంతమై నప్పుడు రూపము అంతర్ముఖీ. ఇట్లంతట తెలియునది.)

**అంతర్యామి** (సం.వి.న్.పుం.) : : 1. జీవాత్మ; 2. పరమాత్మ. (విణ.) : లోపల నుండువాఁడు.

**అంతర్లాపి** (సం.వి.న్.పుం.) : ఉత్తరము లోపల నణఁగి యుండునట్లు అడుగునట్టి విషమ సమస్య.

**అంతర్వత్ని** (సం.వి.ఈ.స్త్రీ.) : గర్భిణి, చూలాలు.

**అంతర్వాణి** (సం.విణ.ఇ.) : శాస్త్రము నెఱిఁగినవాఁడు.

**అంతర్హితము** (సం.విణ.) (అ.ఆ.అ.) : మఱుఁగు పడినది.

**అంతలపొంతలవాఁడు** (ద్వ.వి.) : దూరపు చుట్టము.

**అంతవట్టు** (ద్వ.) : 1. అంతయు; 2. అంతర మాలిక.

**అంతశయ్య** (సం. వి. ఆ. స్త్రీ.) : 1. చావు; 2. భూశయ్య; 3. శ్మశానము.

**అంతస్తు** (వై.వి.) : 1.మఱుఁగు చోటు; 2. తొట్టి కట్టు; 3. నిలువు; (రెండంతస్తుల యిల్లు.) 4. పరువు.

**అంతస్థ** (మి.వి.) : రహస్యముగా నిచ్చు లంచము.

**అంతావసాయి** (సం.వి.న్.పుం.) : 1. మంగలి వాఁడు; 2. మాలవాఁడు.

**అంతిక**(సం.వి.ఆ.స్త్రీ.): 1. నాట్య పరిభాషయందు అక్క; 2. శాతలమనెడి యోషధి; 3. ప్రొయ్యి.

**అంతికలు** (దే.వి.బ.) : చాఁపవలె నల్లిన కసవు తడికలు.

**అంతిపురము** (వై.వి.) : రాణివాసము, అంతఃపురము.

**అంతిపురి** (వై.వి.) : అంతిపురము, అంతఃపురి.

**అంతిమము** (సం.విణ.) (అ.ఆ.అ.) : 1. కడపటిది; 2. సమీపించినది.

**అంతియ** (వై.స.) : అంతమాత్రము.

**అంతు** (వై.వి.) : అంతకము, మొత్తము.

**అంతె** (వై.స.) : అంతియ, (రూ.) అంతే.

**అంతేవాసి** (సం.వి.న్.పుం.) : 1. శిష్యుఁడు; 2. మాలవాఁడు. (విణ.) : సమీపముననున్న వాఁడు.

**అంత్యజుఁడు** (సం.వి.అ.పుం.) : చండాలుఁడు, మాల.

**అంత్యము** (సం.వి.అ.పుం.) : తుంగ. (విణ.) : 1. అధమము; 2.కడపటిది.

**అంత్రము** (సం.వి.అ.న.) : ఆంత్రము, ప్రేగు.

**అందంద** (వై.అవ్య.) : మఱిమఱి.

**అందంబుగూడుకొను** (దే.అ.క్రి.) : (అందంబు + కూడుకొను.) కలసికొను.

**అందకత్తియ** (వై.విణ.) : (అందము + కత్తియ.) సౌందర్యవతి, (రూ.) అందకత్తె.

**అందగాఁడు** (ద్వ.విణ.) : (అందము + కాడు) సౌందర్యవంతుఁడు.

**అందగించు** (వై.అ.క్రి.) : అందపడు, రమ్యమగు.

**అందదుకు.** (దే.విణ.) : (అదుకు + అదుకు.) 1.మిక్కిలి యదుకు కలది; 2. సంపూర్ణము కానిది.

**అందనుక** (ద్వ.ద్ర.) : (అంత+దనుక.) అందాఁక.

**అందపడు.** (వై.అ.క్రి.) : (అందము+పడు.) రమ్యమగు. (ప్రే. అందపఱచు.)

**అందము.** (వై.వి.) : చక్కఁదనము, సౌందర్యము.

**అందఱు** (వై.స.) : (అంత + వారు) 1. అంత శబ్దమునకు మహన్మహత్యర్థక బహువచన రూపము, ఎల్లవారు. (సమస్త పురుషులు, సమస్త స్త్రీలు. సమస్త స్త్రీ పురుషులు) 2. అంత సంఖ్య గలవారు.

**అందలము** (వై.వి.): 1. పార్శ్వముల మఱుఁగు లేని పల్లకి, ఆందోళము, 2. (బ.) : బాలక్రీడా విశేషము.

**అందాఁక** (ద్వ.ద్ర.) : (అంత + దానిక) అంత పర్యంతము.

**అందిక** (దే.విణ.) : సమీపము.

**అందిపొందినవాఁడు** (దే.వి.) : దూరపు చుట్టము.

**అందియ** (వై.వి.) : స్త్రీలు కాళ్లను ధరించెడు భూషావిశేషము, అందుకము.

**అందు** (దే. స. క్రి) : 1. కైకొను, గ్రహించు; 2. పొందు.

**అందుకము** (సం. వి. అ. పుం.) : 1. అందె; 2. ఏనుఁగు సంకెల; 3. సంకెల.

**అందుకొను** (దే.స.క్రి.) : కైకొను, గ్రహించు.

**అందుకోలు** (దే.వి.) : అందుకొనుట, (విణ.) : అతి సమీపము.

**అందుగు** (దే.వి.) : అందువు, సల్లకి .

**అందుపాటు** (దే.విణ.) : సమీపము.

**అందుబడి** (దే.విణ.) : 1. ప్రాప్తము (ఆ సొమ్ము నీకు అందుబడియైనదా ?) 2. సమీపము.

**అందులకు** (దే.ద్ర.) : 1. అచ్చోటికి; 2. దానికి.

**అందువు** (ఉభ. దే.వి.) : అందుగు. (సం. ఊ. స్త్రీ.) : 1. అందియ; 2. ఏనుగుఁ కాలు కట్టెడు గొలుసు, బారీ.

**అందె** (వై.వి.) : అందియ

**అందొఱు** (వై.స.) : అందఱు యొక్క రూపాంతరము.

**అంధకరిపువు** (సం.వి.ఉ.పుం.) : శివుడుఁ, ముక్కంటి.

**అంధకారము** (సం.వి.అ.పుం.) : ధ్వాంతము, చీఁకటి.

**అంధకుడు** (సం.విణ.) (అ.ఈ.అ.) : గ్రుడ్డివాడు.

**అంధకూపము** (సం.వి.అ.పుం.) : పాడునుయ్యి.

**అంధతమసము** (సం.వి.అ.న.) : గాఢాంధకారము, చిమ్మ చీఁకటి, (రూ.) అంధాతమసము.

**అంధము** (సం.వి.అ.న.) : చీఁకటి. (విణ.) : గ్రుడ్డిది.

**అంధస్సు** (సం.వి.స్.న.) : అన్నము, వంటకము.

**అంధిక** (సం.వి,ఆ.స్త్రీ.) : 1. చీఁకటి 2. ఒక జూదము.

**అంధుఁడు** (సం.విణ.) (అ.ఆ.అ.) : అంధకుఁడు.

**అంధువు** (సం.వి.ఉ.పుం.) : కూపము, నుయ్యి.

**అంధ్రము** (సం.వి.అ.పుం.) : తెలుఁగు దేశము.

**అంపకము** (దే.వి.) : అంపుట, ప్రేషణము.

**అంపకాఁడు** (ద్వ. విణ.) (అమ్ము + కాఁడు) : 1. విల్లు చేతఁ బట్టినవాఁడు, ధానుష్కుఁడు; (అస్త్రి శబ్దము వంటిది.) 2. గుఱితప్పక అమ్ము వేయు వాఁడు, కృతహస్తుఁడు.

**అంపకోల** (ద్వ.వి.) : (అమ్ము+కోల) అమ్ము, బాణము.

**అంపఱ** (ద్వ.వి.) : (అమ్ము+పఱ) బాణ సమూహము.

**అంపాచారము** (వై.వి.) : జలప్రవాహము.

**అంపియ** (దే.వి.) : చింపిగుడ్డ. పటచ్చ రము. (చూ. అంపె.)

**అంపు** (దే.స.క్రి.) : 1. ఆజ్ఞాపించు; 2. పుచ్చు; (చూ. అంచు.) (వి.) : ఉత్సవ విశేషము.

**అంపుదోడు** (దే.విణ.) : (అంపు+తోడు) ప్రయాణమైపోవు వారికి తోడుగా అంపఁబడినవాఁడు.

**అంపె** (దే.వి.) : అంపియ.

**అంబ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. అమ్మ; 2. కాశిరాజు కూతురు; 3. చేఁతిసొర; 4. పులిచింత. (అంబాత్రయము = జ్ఞానాంబ, భ్రమరాంబ, మూకాంబ)

**అంబకము** (సం. వి. అ. స.) : 1.కన్ను; 2. బాణము.

**అంబకళము** (దే.వి.) : 1. ఒక దినుసు జావ; 2. అంబలి.

**అంబటిజోరిగాఁడు** (దే.వి.) : పక్షి విశేషము.

**అంబరము** (సం.వి.అ.న.) : 1. ఆకాశము; 2. వస్త్రము; 3. వ్యసనము; 4. సుగంధ ద్రవ్యము.

**అంబరీషము** (సం.వి.అ.న.) : 1. యుద్ధము; 2. వేఁపుడు చట్టి. (పుం.) : 1. అంబాళము; 2. గుఱ్ఱపు పిల్ల; 3. నరక విశేషము; 4. పశ్చాత్తాపము.

**అంబరీషుఁడు** (సం.వి.అ.పుం) : 1. ఒకానొక రాజు; 2. శివుఁడు; 3. సూర్యుఁడు.

**అంబరు** (వై.వి.) : సుగంధ ద్రవ్యము.

**అంబలి** (దే.వి.) : 1. పిండియు నూకలు చేర్చి అనుకుగా వండినది; 2. అంబకళము.

**అంబష్ఠ** (సం. వి. ఆ. స్త్రీ.) : 1.అడవి మొల్ల; 2. చిఱుబొద్ది; 3. పులిచింత; 4. (అ.పుం. ము.) : ఒకానొక దేశము; 4. బరుసడ్డసరము.

**అంబష్ఠుఁడు** (సం.వి.అ.పుం.) : మంగలివాఁడు.

**అంబారము** (దే.వి.) : ధాన్యరాశి, అంబారు.

**అంబారి** (దే.వి.) : ఏనుఁగుమీఁది పీఠము, చవుడోలు.

**అంబారు** (దే.వి.) : అంబారము.

**అంబారుపిడుజు** (దే.వి.) : పశువులమేన నంటికొని రక్తము పీల్చెడి జంతు విశేషము.

**అంబాళము** (వై.వి.) : ఆమ్రాతకము. (వా.వి.)

**అంబిక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. పార్వతి; 2. ధృతరాష్ట్రుని తల్లి; 3. తల్లి; 4. మేనత్త.

**అంబు** (వై.వి.) : 1. అమ్ము, బాణము. (చూ.బుజ్జ) 2. మేదరవాని అమ్మువంటి యొక యినుప కొంఅముట్టు.

**అంబుజము** (సం.వి.అ.న.) : తామర. (పుం.) : 1. ఎఱ్ఱగన్నేరు; 2. వానకోయిల.

**అంబుదము** (సం.వి.త్.పుం.) : మేఘము, మబ్బు.

**అంబుభృత్తు** (సం.వి.త్.పు.) : మేఘము, మబ్బు.

**అంబువాహిని** (సం.వి.ఈ.స్త్రీ.) : ఎత్తుడు నీరు పోయుటకై తొలిచి కాలువ మొదట నుంచెడు తాటిమ్రాను లోనగునది, దోనె.

**అంబువు** (సం.వి.ఉ.న.) : ఉదకము, నీరు.

**అంబువేతసము** (సం.వి.అ.పుం.) : నీరుప్రబ్బ.

**అంబూకృతము** (సం.విణ.) (అ.ఆ.అ.) : తుంపర కలది. (మాట).

**అంబే** (వై.వి.) : ఆవుల దూడల కూఁత.

**అంబేద** (దే.విణ.) : (అంబే +పేద) దిట్టతనము లేనివాఁడు, అధృష్టుఁడు.

**అంభ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఆవుకూఁత, అంబే.

**అంభస్సు** (సం.వి.స్.ఏన.) : జలము, నీరు.

**అంభోజము** (సం.వి.అ.న.) : కమలము, తామర.

**అంభోధి** (సం.వి.ఇ.పుం.) : సముద్రము, కడలి.

**అంభోరుహము** (సం.వి.అ.న.) : పద్మము, తామర.

**అంశకుఁడు** (సం.వి.అ.పుం.) : పాలికాఁపు, దాయ.

**అంశము** (సం.వి.అ.పుం.) : 1. పాలు; 2. వంతు.

**అంశుకము** (సం. వి. అ. న.) : 1. ఉత్తరీ యము; 2. సన్నవస్త్రము; 3. వస్త్రము.

**అంశుమంతుఁడు** (సం. వి. త్. పుం.) : 1. సూర్యుడు; 2. ఒకానొక రాజు. (విణ.) : ధనవంతుఁడు.

**అంశుమతి** (సం.వి.ఈ.స్త్రీ.) : ముయ్యాకుపొన్న.

**అంశుమత్ఫల** (సం.వి.ఆ.స్త్రీ.) : కదళి, అరఁటి.

**అంశుమాలి** (సం.వి.న్.పుం). : సూర్యుఁడు, వెలుఁగుఱేఁడు.

**అంశువు** (సం. వి. ఉ. పుం.) : 1.కాంతి; 2. కిరణము.

**అంసకూటము** (సం. వి. అ. పుం.) : ఎద్దు మూఁపురము, కకుదము.

**అంసము** (సం.వి.అ.పుం.న.) : 1. భుజ శిరస్సు, మూఁపు; 2. అంశము.

**అంసలుఁడు** (సం.విణ.) (అ.ఆ.అ.) : బలిసిన వాఁడు, మాంసలుఁడు.

**అంహతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. ఈవి; 2. తెవులు; 3. విడుపు.

**అంహస్సు** (సం.వి.స్.న.) : పాపము, దోషము.

**అఁట** (దే.అవ్య.) : 1. వృత్తాంతము చెప్పుటను తెలుపును; 2. మహత్వమును తెలుపును.

**అక** (వై.వి.): 1. అక్క; 2. పూజ్యస్త్రీ.

**అకట** (దే. అవ్య. అయ్యో.) (రూ.) : అకటా.

**అకటవికటము** (దే.విణ.) : తాఱుమాఱు.

**అకము** (సం.వి.అ.న.) :1.దుఃఖము; 2. పాపము.

**అకరణి** (సం.వి.ఇ.పుం.) : శాపము, తిట్టు.

**అకరు** (దే.వి.) : తామరదుద్దులోనగు వాని చుట్టునుండునది, కింజల్కము. (రూ. ఆకరువు.)

**అకర్మకము** (సం.విణ.) (అ.ఆ.అ.) : కర్మలేనిది. (క్రియ.)

**అకస్మాత్తుగా** (సం. క్రి. విణ. అవ్య.) : ఉన్నట్టుండి. (వాడుకలోనిది.)

**అకారణము** (సం.క్రి.విణ.అ.న.): కారణములేక. విణ. కారణములేనిది.

**అకారతుగా** (క్రి.విణ.) : కారణములేక.

**అకాలము** (సం.వి.అ.పుం.) : సరికాని కాలము.

**అకించనుఁడు** (సం. విణ.) (అ. ఆ. అ.) : దరిద్రుఁడు.

**అకుతోభయుఁడు** (సం.వి.అ.పుం.) : దేనివలనను వెఱపులేనివాఁడు.

**అకూపారము** (సం.వి.అ.పుం.) : 1. సముద్రము 2. ఆది కూర్మము.

**అకృష్ణకర్ముఁడు** (సం.విణ.న్.) : మంచి నడవడిక గలవాఁడు.

**అక్క** (ఉభ.వై.వి.) : 1. పెద్దదియగు తోడుబుట్టినది 2. పూజ్యస్త్రీ.

**అక్కజపడు** (వై.అ.క్రి.) : (అక్కజము+పడు) ఆశ్చర్యపడు.

**అక్కజము** (వై.విణ.) : 1.అధికము; 2. అశక్యము.

**అక్కజుఁడు** (వై.విణ.) : అధికుడు.

**అక్కజురాలు** (వై.విణ.): (అక్కజ+ఆలు.) అధికురాలు.

**అక్కట** (దే.అవ్య.) : అయ్యో, (రూ.) అక్కటా.

**అక్కటిక** (దే.వి.) : కనికరము. (రూ. అక్కటికము.)

**అక్కడ** (దే.వి.ఏ.) : (అ + కడ.) 1. ఆచోటు; 2. ఆవల. (అక్కడ, ఇక్కడ, ఎక్కడ శబ్దముల కడపట వృత్తి యందు ఇకారము వచ్చుట చేత అవి వేఱు వేఱు శబ్దములుగా వ్రాయఁబడి యెను. అక్కడి వార్త. మొ.)

**అక్కరము** (వై.వి.) : అకారాదివర్ణము.

**అక్కఱ** (దే.వి.) : 1.అపేక్ష; 2.ఆవశ్యక కార్యము; 3. శ్రద్ధ.

**అక్కఱకాఁడు** (దే.విణ.) : అక్కఱ గలవాఁడు.

**అక్కఱగండఁడు** (దే.విణ.) : శ్రద్ధ కలవాఁడు.

**అక్కఱపడు** (ద్వ.అ.క్రి.) : అక్కఱగొను.

**అక్కఱపాటు** (ద్వ.వి.) : అక్కఱపడుట.

**అక్కలకర** (దే.వి.) : జ్వర దోషాదులను పోఁగొట్టునట్టి మూలికా విశేషము.

**అక్కలి** (దే.వి.) : అల, తరంగము.

**అక్కళించు** (దే.స.క్రి.) : సగ్గించు.

**అక్కసము** (దే.వి.) : సంతాపము.

**అక్కసి** (దే. విణ.) : అక్కసు గలవాఁడు, ఆగ్రహవంతుఁడు.

**అక్కసు** (దే.వి.) : ఆగ్రహము, కోపము.

**అక్కసుకాఁడు** (దే.విన.): అక్కసి, ఆగ్రహవంతుఁడు.

**అక్కి** (దే.వి.) : రోగ విశేషము.

**అక్కిబిక్కిదండ** (దే.వి.) : బాలక్రీడా విశేషము.

**అక్కిలి** (దే.వి.) : అంకిలి, కలంత.

**అక్కిలిపడు** (ద్వ.అ.క్రి.) : కలంతపడు.

**అక్కు** (దే.వి.) : ఱొమ్ము, వక్షము.

**అక్కుళ్ళు** (దే.వి.బ.) : ధాన్యవిశేషము, ఆఁటగడలు.

**అక్తము** (సం.విణ.) (అ.ఆ.అ.) : 1. చేరినది; 2. పోయినది; 3. స్పష్ట మయినది.

**అక్రమము** (సం.వి.అ.పుం.) : క్రమము తప్పు.

**అక్షతము** (సం.వి.అ.న.) : పేడి. (విణ.) : నొప్పింపఁ బడనిది.

**అక్షతలు** (సం.వి.పుం.బ.) : సేసఁబ్రాలు, (దీనిని కొందఱు నపుంసకముగాను ఏక వచనాంతము గాను చెప్పుచున్నారు.)

**అక్షదర్శకుఁడు** (సం.వి.ఆ.పుం.) : దివాణము నందలి న్యాయ విచారణకర్త.

**అక్షదేవి** (సం.విన.న్.పుం.) : కితవుఁడు, జూదరి.

**అక్షద్యూతికము** (సం.వి.న.) : జూదము నందలి జగడము.

**అక్షధూర్తిలము** (సం.వి.అ.పుం.) : వృషభము, ఎద్దు.

**అక్షధూర్తుఁడు** (సం.వి.అ.పుం.) : కితవుఁడు, జూదరి.

**అక్షమాల** (సం. వి. ఆ. స్త్రీ.) : 1. అరుంధతి; 2. రుద్రాక్షమాల; 3. జపమాల.

**అక్షము** (సం. వి. ఆ. న.) : 1. ఇంద్రియము; 2. సౌవర్చల మనెడి యుప్పు; 3. తుత్తము. (పుం.) : 1. తాండ్ర; 2. పాచిక; 3. బండి; 4. బండి కన్ను; 5. రుద్రాక్షము; 6. ఇంద్రాక్షము; 7. పదునాఱు మాషముల యెత్తు; 8. వ్యవ హారము; 9. తెలియఁబడిన యర్థము. (డు.) : రావణుని కొడుకు.

**అక్షయ** (దే.వి.అ.పుం.) : ఒక సంవత్సరము (చూ.సంవత్సరము).

**అక్షయచణుఁడు** (సం.వి.అ.పుం.) : లిపికారుఁడు, వ్రాఁతకాఁడు.

**అక్షరచుంచువు** (సం.వి.ఉ.పుం.) : అక్షర చణుఁడు.

**అక్షరము** (సం.వి.ఆ.న.) : 1. అకారాద్యక్షరము, అక్కరము; 2. బ్రహ్మము; 3. ముక్తి.

**అక్షరుఁడు** (సం. వి. అ. పుం.) : 1. విష్ణువు; 2. శివుఁడు. (విణ.) : చెడనివాఁడు.

**అక్షవతి** (సం.వి.ఈ.స్త్రీ.) : కైతవము, జూదము.

**అక్షవాటము** (సం.వి.అ.పుం.) : జెట్లు సాధనచేయు చోటు.

**అక్షాంతి** (సం.వి.స్త్రీ.) : ఓర్వలేనితనము, ఈరసము.

**అక్షి** (సం.వి.ఇ.న.) : నేత్రము, కన్ను.

**అక్షింతలు** (వై.గ్రా.వి.బ.) : అక్షతలు, సేసఁబ్రాలు.

**అక్షిగతుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) పగగొనఁ దగినవాఁడు.

**అక్షిబము** (సం.వి.ఆ.పుం.) : మునగ .

**అక్షీబము** (సం.వి.అ.న.) : తనకుఁ దాన కలిగెడు సముద్రపు ఉప్పు. (పుం.) : మునగ. (విణ.) : క్రొవ్వనిది.

**అక్షోటము** (సం.వి.పుం.) : కొండగొనుగు.

**అక్షోభము** (సం.వి.అ.పుం.) : 1. ఏనుఁగునుకట్టు కంబము; 2. కలంతలేమి.

**అక్షౌహిణి** (సం.వి.ఈ.స్త్రీ.) : (ఇరువది యొక్క వేలు నెనమన్నూటడెబ్బది రథములు, అన్ని యేనుఁ గులు, అఱువదయిదు వేలు నార్నూట పది గుఱ్ఱములు, లక్షయుఁదొమ్మిదివేల మున్నూట యేబండ్రు కాల్వురును గల) సేనావిశేషము.

**అఖండము** (సం.విణ.) (అ.ఆ.అ.) : 1. సమ స్తము; 2. ఖండము కానిది.

**అఖండుకము** (సం.వి.అ.పుం.) : పొట్టి టెంకాయ చెట్టు, చెన్నంగి.

**అఖాతము** (సం.వి.అ.పుం.) : మనుష్యుల చేత త్రవ్వఁబడని కోనేఱు మొదలగు నీటిటెంకి.

**అఖిలము** (సం.విణ.) (అ.ఆ.అ.) : అశేషము, అంతయు.

**అగండ్రపాకు** (దే.వి.) : ఒకానొక చెట్టు.

**అగచరము** (సం.వి.అ.పుం.) : వానరము, కోఁతి.

**అగచాట్లపోతు** (దే.విణ.) : ఆపదలు పొందుటయే స్వభావముగా గలవాడు.

**అగచాట్లమారి** (దే.విశే.) : అగచాట్ల పోతు.

**అగచాట్లు** (దే.వి.బ.) : (అగ్గము + చాటులు.) ఇడుము, ఆపద.

**అగజాత** (సం.వి.ఆ.స్త్రీ.) : పార్వతి, గౌరీచూలి.

**అగడిత** (వై.వి.) : కోటచుట్టు త్రవ్వఁబడిన జలాధారము, పరిఖ.

**అగడు** (దే.వి.) : దూఱు, నింద, విశే. నింద్యము.

**అగడుపడు** (ద్వ. అ. క్రి.) : 1. దూఱు పడు; 2. తొట్రు పడు.

**అగడ్త** (వై.వి.) (చూ.) : అగడిత.

**అగత్యము** (వై.క్రి.విశే.) : అవశ్యము. (వాడుక లోనిది.)

**అగదంకారుఁడు** (సం.వి.అ.పుం.) : వైద్యుఁడు, వెజ్జు.

**అగదము** (సం.వి.అ.పుం.) : ఔషధము, మందు.

**అగప** (దే.వి.) : కొయ్యకు టెంకాయ చిప్పను గ్రుచ్చి గరిటెవలె చేసినది, అబక.

**అగపడు** (ద్వ. అ. క్రి.) : (అగ్గము + పడు) : 1. కనఁబడు, గోచరమగు; 2. అధీనమగు.

**అగపాటు** (ద్వ.వి.) : అగపడుట.

**అగమము** (సం.వి.పుం.) : 1. కొండ; 2. చెట్టు.

**అగము** (సం.వి.పుం.) : 1. కొండ; 2. చెట్టు; 3. పాము.

**అగరువు** (సం.వి.ఉ.న.) : చందన విశేషము, అగలు.

**అగలు** (యు.దే.అ.క్రి.) : 1. భేదిల్లు; 2. పెల్లగిల్లు. (చూ.అగలుచు.) (వై.వి.) : అగరువు.

**అగలుచే** (దే.ప్రే.) : 1. భేదించు; 2. పెల్లగించు. (రూ.అగల్చు.)

**అగలుసత్తు** (వై.వి.) : గంధద్రవ్య విశేషము.

**అగలుసొంటి** (వై.వి.) : పాఠ. (వా.వి.)

**అగవాళ్ళు** (దే.వి.బ.): (అగ్గము+వాఱులు) తేలిక యైన ఓరట్ట చెప్పులు.

**అగవు** (దే.వి.) : కార్యము, పని.

**అగసాలె** (ద్వ.వి.) : (అగ్గము+సాలె.) అగసాలె వాఁడు, స్వర్ణకారుఁడు. (వీఁడు గ్రామముల యందు కాఁపులకు స్వాధీనుఁడు.)

**అగస్తి** (సం.వి.ఇ.పుం.) : 1.అగిసె; 2. అగస్త్యుఁడు.

**అగస్త్యము** (సం.వి.అ.పుం.) : అగిసె.

**అగస్త్యుఁడు** (సం.వి.అ.పుం.) : ఒకానొక ముని.

**అగాడీ** (హిం.క్రి.విశే.) : ముందర, (వి.) : గుఱ్ఱము ముందు కాళ్ళకు కట్టు త్రాడు.

**అగాదు** (దే.వి.) : తుపాకి పిరంగి లోనగు వానియందు నిప్పుఁ దగిలించుట.

**అగాధము** (సం.వి.ఆ.పుం.) : బొక్క, (విశే.) : మిక్కిలి లోఁతుగలది.

**అగారము** (సం.వి.అ.న.) : గృహము, ఇల్లు.

**అగావు** (దే.వి.) : కుదవ, ఆధి.

**అగిని** (వై.వి.) : అగ్ని.

**అగిసియు** (వై.వి.) : అగిసె, అగస్తి.

**అగిసె** (వై.వి.) : అగిసియ.

**అగు** (దే.అ.క్రి.) : అవు. (స.క్రి.) : కలుగు. (ద్ర.) : అంగీకారమును తెలుపును, అవును.

**అగుఁగదే** (దే.) : అవ్య. (అగును+కదే) ఆశ్చర్యమును తెలుపును, (చూ.) ఔఁగదే.

**అగుగాక** (దే.అవ్య.) : (అగును+కాక) అంగీకారమును తెలుపును.

**అగుఁబొమ్ము** (దే.అవ్య.) : (అగును+పొమ్ము) సరే.

**అగుదెంచు** (దే.అ.క్రి.) : (అగు+తెంచు.) అగు.

**అగుర** దే.(అవ్య.) : (అగును+ర) అవుర. (ఆమ్రేడిత మందు అగురగుర.

**అగురు** (దే.వి.) : అవురుగడ్డి, వీరణము.

**అగురువు** (సం.వి.ఉ.న.) : ఇరుగుడు. (పుం. న.) : అగలు. (విశే.) : చిన్నది.

**అగులు** (దే.అ.క్రి.) : ఊడు.

**అగౌకసము** (సం. వి. స్. పుం.) : 1.పక్షి; 2. సింహము; 3. శరభము.

**అగ్గపడు** (ద్వ.అ.క్రి.) : (అగ్గము + పడు) అగపడు.

**అగ్గపాటు** (ద్వ.వి.) : అగ్గపడుట.

**అగ్గము** (దే.విణ.) : 1.అధీనము; 2. కనఁబడినది, దృష్టము.

**అగ్గలము** (దే.విణ.) : వెగ్గలము, అధికము.

**అగ్గలించు** (దే. అ. క్రి.) : 1. అతిశయించు; 2. పూను, ఉత్సహించు.

**అగ్గలిక** (దే.వి.) : 1. ఆధిక్యము; 2. పూనిక, ఉత్సాహము; 3. శౌర్యము.

**అగ్గి** (వై.వి.) : నిప్పు, అగ్ని.

**అగ్గించు** (వై.స.క్రి.) : పొగడు, స్తుతించు.

**అగ్గికంటి** (ద్వ.వి.) : ముక్కంటి, శివుఁడు.

**అగ్గిచూలి** (ద్వ.వి.) : కుమారస్వామి, కందుఁడు.

**అగ్గువ** (వై.వి.) : వెలతక్కువ, చవుక.

**అగ్ని** (సం.వి.ఇ.పుం.) : 1.నిప్పు; 2. చిత్ర మూలము.

**అగ్నికణము** (సం.వి.అ.పుం.) : విస్ఫులింగము, మిడుఁగుఱులు.

**అగ్నిచిత్తు** (సం.వి.త్.పుం.) : అగ్ని చయనము చేసినవాఁడు.

**అగ్నిజ్వాల** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. ఆరె; 2. నిప్పు మంట.

**అగ్నిభువు** (సం.వి.ఊ.పుం.) : కుమారస్వామి, అగ్గిచూలి.

**అగ్నిమంథము** (సం.వి.అ.పుం.) : శ్రీపర్ణము, నెల్లి.

**అగ్నిముఖము** (సం.వి.అ.పుం.న.) : జీడి.

**అగ్నిముఖుఁడు** (సం.వి.అ.పుం.) : 1. బ్రాహ్మ ణుఁడు; 2. వేలుపు.

**అగ్నిశిఖ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. తరిగొఱ్ఱ; 2. వెన్న వెదురు కూర 3. నిప్పుమంట. (అ.న.ము.) : 1. కుంకుమపువ్వు; 2. కుసుమపువ్వు.

**అగ్నిష్టోమము** (సం.వి.అ.పుం.) : వసంత కాలమందు ఐదు దినములలో చేసి ముగించెడి యాగ విశేషము.

**అగ్నిహోత్రము** (సం.వి.అ.పుం.) : 1.అగ్ని; 2.ఆహితాగ్నులు ప్రాత స్సాయంకాలముల యందుఁ జేసెడి హోమము; 3. హవిస్సు.

**అగ్రజన్ముఁడు** (సం.వి.న్.పుం.) : 1. బ్రాహ్మణుఁడు; 2. అన్న; 3. బ్రహ్మ.

**అగ్రజుఁడు** (సం.వి.అ.పుం.) : అగ్రజన్ముఁడు, అన్న.

**అగ్రణి** (సం.విణ.ఈ.) : ముఖ్యము, గామిడి.

**అగ్రతస్సరుఁడు** (సం. విణ.) (అ. ఆ. అ.) : 1. ముందు నడచువాఁడు; 2. మొదటి వాఁడు.

**అగ్రబీజము** (సం.వి.అ.పుం.) : ముంతమామిడి.

**అగ్రము** (సం.వి.అ.పుం.) : 1. చివర; 2. ఎదురు; 3. సమీపము; 4. సమూ హము; 5. నాలుగు కళ్ల కొలది గల భిక్ష. (విణ.) : 1. మొదటిది; 2. ముఖ్యము; 3. మిక్కుటము.

**అగ్రసరుఁడు** (సం.విణ.) (అ.ఆ.అ.) : 1. ముందు నడచువాఁడు; 2. మొదటివాఁడు.

**అగ్రహారము** (సం.వి.అ.పుం.) : బ్రాహ్మణుల యిండ్లవరుస, నల్లిండ్లు.

**అగ్రిముడు** (సం.విణ.) (అ.ఆ.అ.) : మొదటివాడు.

**అగ్రియము** (సం.విణ.) (అ.ఆ.అ.) : ముఖ్యము, గామిడి.

**అగ్రీయము** (సం.విణ.) (అ.ఆ.అ.) : అగ్రియము.

**అగ్రేదిధిషువు** (సం.వి.ఉ.పుం.) : మాఱు మనువు దాని మొదటి మగఁడు.

**అగ్రేసరుఁడు** (సం.విన.) (అ.ఆ.అ.) : 1. ముందు నడచువాఁడు; 2. మొదటి వాఁడు.

**అగ్ర్యము** (సం.విణ.) (అ.ఆ.అ.) : అగ్రీయము.

**అఘమర్షణము** (సం.వి.అ.న.) : సర్వ పాపము లను పోగొట్టెడు మంత్రము.

**అఘము** (సం. వి. అ. న.) : 1. పాపము; 2. వ్యసనము; 3. దుఃఖము.

**అఘోరము** (సం.విణ.) (అ.ఆ.అ.) : అంతకంటె ఘోరము లేనిది.

**అఘ్న** (సం.వి.ఆ.స్త్రీ.) : సౌరభేయి, ఆవు.

**అచల** (సం.వి.ఆ.స్త్రీ.) : నేల, (అ.పుం.ము.) : 1. కొండ; 2. మేకు. (విణ.) : కదలనిది.

**అచిరద్యుతి** (సం.వి.ఇ.స్త్రీ.) : విద్యుత్తు, మెఱపు.

**అచేతనము** (సం.వి.అ.పుం.) : అప్రాణి.

**అచ్చారము** (అర.వి.) : సంచకరువు.

**అచ్చి** (దే.వి.) : దేశవిశేషము. (అచ్చి మట్టము.)

**అచ్చిక** (దే.వి.) : కొఱంత.

**అచ్చికబుచ్చిక** (దే.వి.) : కలుపుకోలుతనము, అభేదము.

**అచ్చివచ్చు** (దే.అ.క్రి.) : అయివచ్చు, (నాకాయిల్లు అచ్చి వచ్చినది.)

**అచ్చు** (సం.వి.) : ప్రాణాక్షరములు. (అకారాదులు.)

**అచ్చెరుపడు** (వై.అ.క్రి.): (అచ్చెరువు+పడు) అశ్చర్యపడు.

**అచ్చెరుపాటు** (వై.వి.) : అచ్చెరుపడుట.

**అచ్చెరువు** (వై.వి.) : వెఱుఁగు, ఆశ్చర్యము.

**అచ్చెరువుపడు** (వై.అ.క్రి.) : ఆశ్చర్యపడు.

**అచ్చెరువుపాటు** (వై.వి.) : అచ్చెరువు పడుట.

**అచ్యుతుఁడు** (సం. వి. అ. పుం.) : విష్ణువు. (విణ.) : స్థిరుఁడు.

**అచేటు** (దే.వి.ఏ.) : అచ్చోటు యొుక్క రూపాంతరము.

**అచోటు** (దే.వి.ఏ.) : (ఆ + చోటు.) ఆ స్థానము.

**అచ్చే** (చూ.) : అచ్చము.

**అచ్చేగుండ్లపేరు** (దే.వి.) : 1.ముత్యాల హారము; 2. స్ఫటికమాల.

**అచ్చేటు** (దే.వి.ఏ.): అచ్చటు యొుక్క రూపాంతరము.

**అచ్చేనగండ్లు** (దే.వి.బ.) : 1. బాలికా క్రీడా విశేషము; 2.అచ్చన గండ్లాడెడు చిన్నచిన్న గండు ఱాళ్ళు, గిరీయకములు.

**అచ్చేనగాయలు** (దే.వి.బ.) : (అచ్చన + కాయలు.) బాలికా క్రీడావిశేషము, అచ్చనగండ్లు.

**అచ్చేనగుండ్లు** (దే.వి.బ.) : 1.అచ్చన లాడుగుండ్లు, గిరీయకములు; 2. అచ్చన గుండ్లాట.

**అచ్చేనలు** (దే.వి.బ.) : బాలికా క్రీడా విశేషము.

**అచ్చేము** (వై.విణ.) : 1. స్వచ్ఛము; 2. కేవలము; 3. తెల్లది; 4. దట్టము.

**అచ్చేర** (వై.వి.) : అప్సరస్త్రీ.

**అచ్చేలము** (దే.వి.) : 1. ఆగ్రహము; 2. పూనిక, ఉత్సాహము.

**అచ్చేలించు** (దే.అ.క్రి.) : ఆగ్రహించు.

**అచ్చాళు** (దే.విణ.) : (అచ్చము + ఆళు) జంజాటము లేని వాఁడు.

**అచ్చే** (యు.దే.అ.క్రి.) : అప్పుపడు. (స.క్రి.) : 1. ఇచ్చు; 2. దండుగిచ్చు.

**అచ్చేఁగూటము** (ద్వ.వి.) : (అచ్చు + కూటము.) ముద్రాక్షరశాల.

**అచ్చేకట్టు** (ద్వ. స. క్రి.) : 1. ఏర్పఱచు; 2. మడిమడిగా గనిమ తీయు.

**అచ్చేకుప్ప** (దే.విణ.) : ధనవంతుడు.

**అచ్చేకొను** (దే.స.క్రి.) : తానియ్య వలవని ధనాదికమును ఒప్పుకొని యిచ్చు.

**అచ్చేటెద్దు** (ద్వ.వి.) : (అచ్చు+ఎద్దు.) అచ్చు పోసి స్వేచ్ఛగాఁ దిరుగవిడిచిన వృషభము, ఆఁబోతు.

**అచ్చేదల** (దే.వి.) : 1. అప్పు; 2. అచ్చివచ్చుట.

**అచ్చేపడు** (వై.అ.క్రి.) : ఏర్పడు.

**అచ్చేపాటు** (వై.వి.) : అచ్చుపడుట, ఏర్పాటు.

**అచ్చోటు** (దే.వి.ఏ.) : (ఆ + చోటు) 1.ఆ స్థానము; 2. ఆఁడుగుఱి. (రూ.అచ్చోటు)

**అచ్చొత్తు** (ద్వ.స.క్రి. ) : (అచ్చు + ఒత్తు) అచ్చువేయు, ముద్రించు.

**అచ్ఛభల్లము** (సం.వి.అ.పుం.) : ఎలుఁగుగొడ్డు.

**అచ్ఛము** (సం.వి.అ.పుం.) : ఎలుఁగుగొడ్డు; 2. పటికపు ఱాయి. (విణ.) : స్వచ్ఛము.

**అజ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. ప్రకృతి; 2. ఆఁడు మేఁక. (అ.పుం.ము.) : మేఁకపోతు.

**అజగంధిక** (సం.వి.ఆ.స్త్రీ.) : వాయింట.

**అజగరము** (సం. వి. అ. పుం.) : పెనుఁబాము.

**అజగర్దము** (సం. వి. అ. పుం.) : నీరుపాము.

**అజగవము** (సం.వి.అ.న.) : శివుని విల్లు.

**అజన్యము** (సం.వి.అ.న.) : తోఁకచుక్క లోనగు ఉత్పాతము. (విణ.) : జన్యము కానిది.

**అజప** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. సగము మగ పోలిక సగము ఆఁడుఁపోలికయుఁ గల ఆకృతి; 2. మంత్ర విశేషము.

**అజపుఁడు** (సం.వి.అ.పుం.) : వైదికములు కాని గ్రంథములను చదువు వాఁడు.

**అజభక్షము** (సం.వి.అ.పుం.) : బొబ్బలి.

**అజమోద** (సం.వి.ఆ.స్త్రీ.) : ఒకదినుసు ఓమము.

**అజశృంగి** (సం.వి.ఆ.ఈ.స్త్రీ.) : జుట్టుపు.

**అజస్రము** (సం.క్రి.విణ.అ.న.) : అనవరతము, ఎల్లప్పుడు.

**అజహ** (సం.వి.ఆ.స్త్రీ.) : దూలగొండి.

**అజాగ్రత్త** (సం.వి.ఆ.స్త్రీ.) : జాగ్రత్తలేమి.

**అజాజి** (సం.వి.ఈ.స్త్రీ.) : జిలకఱ్ఱ.

**అజాజీవుఁడు** (సం.వి.అ.పుం.) : మేఁకల మేపు వాఁడు.

**అజాతశత్రువు** (సం.వి.అ.పుం.) : ధర్మరాజు. (విణ.) : శత్రువులు లేనివాఁడు.

**అజితుఁడు** (సం. వి. అ. పుం.) : 1. బ్రహ్మ; 2. విష్ణువు; 3. శివుఁడు. (విణ.) : గెలువఁ బడనివాఁడు.

**అజినపత్ర** (సం.వి.ఆ.స్త్రీ.) : జతుక, జివుకపిట్ట.

**అజినము** (సం.వి.అ.న.) : చర్మము, తోలు.

**అజిరము** (సం.వి.అ.న.) : 1.ముంగిలి; 2. కప్ప; 3. గాలి; 4. శరీరము; 5. శబ్దాదివిషయము.

**అజిహ్మగము** (సం.వి.అ.పుం.) : బాణము, అమ్ము.

**అజిహ్మము** (సం.వి.ఆ.పుం.) : కప్ప, (విణ.) : సరియైనది.

**అజిహ్వాము** (సం.వి.అ.పుం.) : కప్ప, విణ, నాలుకలేనిది.

**అజీగవము** (సం.వి.అ.న.) : అజగవము, (రూ.) అజీగావము.

**అజుఁడు** (సం.వి.అ.పుం.) : 1.బ్రహ్మ; 2.విష్ణువు; 3.శివుఁడు; 4.మన్మథుఁడు; 5. ఒకానొకరాజు.

**అజ్ఝట** (సం.వి.ఆ.స్త్రీ.) : నేలయుసిరిక.

**అజ్ఞత** (సం.వి.ఆ.స్త్రీ.) : అజ్ఞత్వము, తెలివిలేని తనము.

**అజ్ఞానము** (సం.వి.అ.న.) : తెలివిలేమి.

**అజ్ఞుఁడు** (సం.విణ.) (అ.ఆ.అ.) : 1.జడుఁడు; 2. మూర్ఖుఁడు.

**అజ్మాయిషీ** (హిం.వి.) : శోధన, పరీక్ష.

**అజారము** (దేవి.) : 1. మొగసాల; 2. ఆస్థాన పండపము.

**అజ్జే** (యు. దే. వి.) : 1. అడుగు, పాదము; 2. సమయము. (వై.అవ్య.) : (బళి.) : (రూ.అజ్జా.)

**అజ్జేము** (వై.వి.) : కొన్ని పనసలుగల వేదభాగము, అనువాకము.

**అజ్జేరె** (ద్వ.అవ్య.) : (అజ్జ + రె) బళిరె.

**అజ్జేవాలు** (ద్వ.వి.) : కోడి చరణాయుధము.

**అజ్జారె** (ద్వ.అవ్య.) : (అజ్జా + రె.) అజ్జరె. (రూ.అజ్జారే.)

**అట** (దే.వి.ఏ.) : అక్కడ. (అట, ఇట శబ్దములకు వృత్తియందు అంత ఇంత అను నర్థము కలుగుచున్నది. అట మున్ను అంతకుముందు, ఇటమున్ను ఇంతకుముందు.) ద్ర. ఆవుల.

**అటకలి** (దే.వి.) : నూనెజిడ్డును పోఁగొట్టెడి వస్తువు, ఉత్సాదనము.

**అటకాయించు** (హిం.క్రి.) : నిరోధించు, అడ్డగించు.

**అటకావు** (హిం.వి.) : ఆటంకము.

**అటతాళము** (సం.వి.అ.పుం.) : తాళభేదము. (౦౪ అక్షర కాలము)

**అటని** (సం.వి.ఇ.ఈ.స్త్రీ.) : వింటికొప్పు.

**అటమట** (దే.వి.) : 1. వంచన; (చూ. అటమటించు.); 2. దుఃఖము.

**అటమటకాఁడు** (దే.విణ.) : అటమటీఁడు, వంచకుఁడు.

**అటమటించు** (దే.అ.క్రి.) : చలించు.

**అటమటీఁడు** (దే.విణ.) : (అటమట + ఈఁడు.) మోసకాఁడు. (చూ. వాట్లీఁడు.)

**అటరూషము** (సం.వి.అ.పుం.) : అడ్డసరము.

**అటవి** (సం.వి.ఈ.స్త్రీ.) : అరణ్యము, అడవి.

**అటాట్య** (సం.వి.ఆ.స్త్రీ.) : భిక్షలోనగు వానికొఱకు తిరుగుట, పర్యటనము.

**అటి** (దే.విణ.) : అట్టి.

**అటిక** (దే.వి.) : ఒక దినుసు మంటి పాత్రము, అట్టిక.

**అటికమామిడి** (దే.వి.) : మండలచ్ఛదము.

**అటు** (దే.అవ్య.) : ఆప్రకారము. (చూ. అట్లు.)

**అటుక** (దే.వి.) : ఇంటిలోపల గోడల మీఁద నడ్డముగా పలకలు కొయ్యలు లోనగు వానిచే మంచెవలె నమర్చినది. (చూ. అట్టుక.)

**అటులు** (దే.అవ్య.) : అప్రకారము. (చూ.అట్లు.)

**అటువంటి** (దే.విణ.) : అట్టి.

**అటువలె** (దే.వి.) : అట్లు.

**అటె** (దే.అవ్య.) : 1. ఆశ్చర్యమును తెలిపెడి; 2. దుఃఖమును తెలిపెడి.

**అట్ట** (దే.వి.) : 1.తలతెగిన శరీరము, కబంధము; 2. చెప్పుల కొఱకుఁ జక్కఁ బఱపఁబడిన చర్మ ఖండము.

**అట్టచెమ్మ** (ద్వ.వి.) : నాలుగు గవ్వలతో నాడెడు దాయము వంటి యొకానొక ఆట.

**అట్టడి** (వై.వి.) : యుద్ధార్థము వాకిటి మండపము మీఁదఁ గాని కొత్తళము మీఁదఁ గాని యేర్పఱచిన గది, అట్టము.

**అట్టము** (సం.వి.అ.న.) : 1.వంటకము; 2. వంట చెఱకు. (పుం.) : 1. అట్టడి; మేడ వెనుకటి యిల్లు. (అని కొందఱు.) 2. అతిశయము.

**అట్టహాసము** (సం.వి.అ.పుం.) : పెద్దనవ్వు.

**అట్టాలకము** (సం.వి.అ.పుం.) : 1. కోట బురుజు; 2. నగరు.

**అట్టి** (దే.విణ.) : అటువంటి.

**అట్టిఁడు** (దే.విణ.) : (అట్టి+వాఁడు) అటువంటి వాఁడు.

**అట్టిక** (దే.వి.) :అటిక.

**అట్టియ** (దే.వి.) : గుంపు, సమూహము.

**అట్టు** (దే.వి.) : అపూప విశేషము. అవ్య. ఆప్రకారము. (చూ. అట్లు.)

**అట్టుక** (దే.వి.) : అటుక.

**అట్టుప్ప** (దే.వి.) : (అట్టు + ఉప్పు.) లవణ విశేషము, పాక్యము.

**అట్టులు** (దే.అవ్య.) : ఆప్రకారము. (చూ, అట్టు.)

**అట్టున** (దే.వి.) : అటుక.

**అట్టువోలె** (దే.ద్ర.) : (అట్టు + పోలె.) అట్లు.

**అట్టె** (దే.అవ్య.) : 1. ఆశ్చర్యమును తెలిపెడి; 2. దుఃఖమును తెలిపెడి. (చూ. అటె.)

**అట్టెడ** (దే.వి.) : 1. పూడికయెత్తుటకు ఈఁత బ్రద్దలు లోనగువానితో అల్లిన తట్ట; 2. నెరసులు పోఁగొట్టుటకై కూర్చిన జల్లెడ వంటి తడిక; 3. కాయ ధాన్యముల యందలి మట్టి గడ్డలు మొదలగువాని వెలువరించుటకుఁ గట్టిన గోఁగుకట్టెల లోనగువానిమోపు; 4. వంతెన.

**అట్టము** (వై.గ్రా.వి.) : వేదభాగము, అష్టకము.

**అట్లు** (దే.అవ్య.) : ఆప్రకారము.

**అడ** (దే.వి.) : 1. ముద్ద; 2. ఆకృతి.

**అడఁకువ** (దే.వి.) : అణఁకువ, నమ్రత.

**అడఁగారు** (దే.అ.క్రి.) : అడఁగు, ఉపశమిల్లు.

**అడఁగు** (దే.అ.క్రి.) : 1. తగ్గు; 2. ఉపశమిల్లు; 3. నమ్రమగు; 4. నశించు; 5. లోపడు.

**అడంగు** (హిం.వి.) : మొదటిచోటు. (విణ.) : తగులుబడియైన.

**అడఁచు** (దే.ప్రే.) : అడఁగఁజేయు. (అను ప్రయుక్తమైన అడఁగు ధాతువునకును రూప మిట్లెఱుంగునది.)

**అడకము** (దే.విణ.) : లోపల నణఁగినది, అంతర్భూతము.

**అడకించు** (దే.స.క్రి.) : 1. అపహసించు; 2. వంచించు.

**అడకొత్తు** (దే.వి.) : (అడకాయ + ఒత్తు.) పోఁకొత్తు, శంకుల.

**అడఁగుబొద్దు** (దే.వి.) : బేలుదారి లోపల నణఁగి యుండునట్లు గోడ యంచుల యందు గీఁటి యేర్పఱచెడు బొద్దు.

**అడగొను** (దే.అ.స.క్రి.) : (అడ + కొను.) అడకట్టు, ముద్దకట్టు.

**అడగోలుకొను** (దే.స.క్రి.) : (అడ + కోలుకొను.) అపహరించు.

**అడజేడి** (దే.వి.) : అలజడి, దుఃఖము. (చూ. అడజడిపెట్టు.)

**అడజేడి పెట్టు** (దే.స.క్రి.) : దుఃఖపఱచు.

**అడదడి** (దే.వి.) : ప్రభుత్వము. (అప్ర.)

**అడప** (దే.వి.) : అడపముంచుకొనియుండు ఆఁదుది.

**అడపకత్తె** (ద్వ.వి.) : (అడపము + కత్తె) అడపము నుంచుకొని యుండునది, (రూ.) అడప కత్తియ.

**అడపకాఁడు** (దే.వి.) : అడపము నుంచుకొని యుండువాఁడు.

**అడపట్టె** (ద్వ.వి.) : పొలములో విత్తనము విత్తి మిట్టపల్లము సమమగుటకై యెడ్లను కట్టి త్రోలెదు మ్రాను, దిండు.

**అడపము** (దే.వి.) : 1. వక్కలాకుల తిత్తి; 2. మంగల తిత్తి.

**అడపొడ** (దే.వి.) : జాడ.

**అడబాల** (వై.విణ.) : వంటవాడు, వంటలక్క.

**అడరు** (దే.అ.క్రి.) : 1. అతిశయించు; 2. పూను; 3. కలుగు; 4. త్వరపడు; 5. వర్ధిల్లు; 6. విజృంభించు; 7. వ్యాపించు.

**అడరించే** (దే.ప్రే.) : బాణమును ప్రయోగించు.

**అడరుచే** (దే.ప్రే.) : అడరించు. (రూ. అడర్చు.)

**అడరుదెంచే** (దే.అ.క్రి.) : (అడరు + తెంచు) అతిశయించు.

**అడలు** (దే.అ.క్రి.) : 1. ఏడ్చు; 2. విలపించు; 3. శోకించు; 4. భయపడు.

**అడలుకొను** (దే.అ.క్రి.) : అడలు, శోకించు.

**అడవి** (వై.వి.) : కాన, అరణ్యము, (అడవి శబ్దము ముందు గల సంజ్ఞా వాచక శబ్దములు – అడవికంద (సర్ప నాళము), అడవికాఁకర (వనకార వేల్లము), అడవికిక్కస (దేవనాళము), అడవికోడి (వనకుక్కుటము), అడవి గెనసు (పిండాంశుకము), అడవిచెఱకు (కాంతారము), అడవిచేమ(శకుటము), అడవితొగరి (తువరిక), అడవితొలసి (క్షవకము), అడవి దున్న (వన మహిషము), అడవిదోమ (దంశి), అడవి నువ్వులు (జర్తిలము), అడవి పంది (వన సూకరము), అడవిపెసలు (వనముద్గము), అడవి ప్రత్తి (భార ద్వాజి), అడవి బచ్చలి (వనోపోదక), అడవిబీఱ (కోశఫల), అడవిమల్లె (ఆస్ఫోట), అడవిమామిడి (ప్రియా లము), అడవిమామెన (శారిబా భేదము), అడవిమునగ (వనశిగ్రువు), అడవి మేఁక (ఇడిక్కము), అడవిమొల్ల (యూథిక), అడవియులవలు (వన కుళుత్థము), అడవిసదాప (శాలే యము), అడవీఁగ (దంశము). మొ॥)

**అడవికుక్క** (వై.వి.) : తోఁడేలు, అరణ్యశునకము.

**అడవితిరుగుడు** (ద్వ.వి.) : కోఁతి, వానరము.

**అడవినట్టు** (ద్వ.వి.) : అడవితిరుగుడు. (ఇట్లు అడవినెలవు అడవిమనికి, మొ॥)

**అడసాల** (వై.వి.) : వంటయిల్లు, మహానసము.

**అడావుడి** (హిం.వి.) : అల్లరి, దడబిడలు.

**అడి** (వై.ఉప.) : 1. అధికము; 2. వ్యర్థము.

**అడిగండ్లు** (దే.వి.బ.) : (అడుగు + కండ్లు.) మలువఁగా అడుగున నిలిచిన ఊళ్ళు.

**అడిగము** (దే.వి.) : భారవిశేషము.

**అడిగట్ట** (దే.వి.) : (అడుగు + కట్ట) పావ, పాదుక. (అడుగు, కట్ట ఈ రెండు పదములు చేరునపుడు గకారము మీఁది ఆకారమునకు ఇకారము వచ్చినది. ఇట్లు అడిగొట్టు, అడియా లము మొదలగు వానికి నెఱుఁగునది. పదములు ఒకటితో నొకటి చేరునపుడు వర్ణలోపవర్ణాగమ వర్ణాదేశములు పెక్కులు పెక్కువిధములుగా వచ్చుచు న్నవి. ఉదా : ఆకె,నూనె, తామరపాకు, ఇనుమడి, మొ॥)

**అడిగొట్టు** (దే.విణ.) : (అడుగు + కొట్టు.) కుత్సితుఁడు.

**అడిచిపడు** (ద్వ.అ.క్రి.) : 1. తమకించు, త్వరపడు; 2. మండిపడు.

**అడిచిపాటు** (ద్వ.వి.) : త్వర.

**అడితి** (దే.వి.) : ఒకవర్తకుఁడు మఱియొకఁ డంపెడు సరకులనమ్మి మరల వానికి సరకులు గొని పంపుటకై వానివద్ద నూటికింతయని పుచ్చుకొనెడు తఱుగు.

**అడిత్రాగుడు** (దే.వి.) : (అడిగి + త్రాగుడు) కఱవు. దుర్భిక్షము.

**అడిదపుమెకము** (ద్వ.వి.) : (అడిదము + మెకము) మీఁగండ్ల మెకము, ఖడ్గమృగము.

**అడిదము** (ద్వ.వి.) : కత్తి, కరవాలు. ఖడ్గము.

**అడియఁడు** (దే.వి.) : (అడుగు + ఉడు) పాదసేవకుఁడు.

**అడియరి** (దే.వి.) : (అడుగు + అరి.) కింకరుఁడు.

**అడియాలము** (దే.వి.) : (అడ + ఆలము) గుఱుతు, చిహ్నము. (ఆల శబ్దమున కిక్కడ స్థాన మర్థము.)

**అడియాస** (వై.వి.) : (అడి + ఆస) కలుగు ననెడి యాశ, ప్రత్యాశ.

**అడియొత్తు** (దే.వి.) : (అడుగు + ఒత్తు) అడిగట్టు.

**అడిసాటా** (దే.వి.) : (అడితి + సాటా) తఱుగు బేరము.

**అడుకు** (దే.స.క్రి.) : దొంతిగనిడు. (వి.) : 1.దొంతి; 2. బ.వడ్లు నానఁ బోసి వేఁచి కొట్టినవి, చిపిటము.

**అడుగంటు** (దే.అ.క్రి.) : (అడుగు + అంటు.) వట్టు. (విణ. బ.) : అడుగున నిలిచినవి.

**అడుగు** (దే. స. క్రి.) : 1. ప్రశ్నము చేయు; 2. యాచించు. (వి.): 1. క్రిందు; 2. పాదము; 3.పాద ప్రమాణము. (విణ.) : అధమము.

**అడుగుకొను** (దే.స.క్రి.) : 1. ప్రార్థించు; 2.యాచించు.

**అడుగుకోలు** (దే.వి.) : 1. ప్రార్థన; 2.యాచన.

**అడుగుపడు** (ద్వ.అ.క్రి.) : అధమమగు.

**అడుచే** (దే.స.క్రి.) : కొట్టు, తాడించు.

**అడుజో** (దే.వి.) : ఒకజాతి డేగ, అణుజు.

**అడుప** (దే.వి.) : (అడు + పట్టినది) పశువుల కాళ్ల యందుఁగలిగెడు వ్యాధివిశేషము.

**అడుపు** (దే.వి.) : ఆటు, కొట్టు, తాడనము.

**అడువ** (దే.విణ.) : (అడుగు + పట్టినది) ప్రాఁత, పురాతనము. (అడువసరకులు.)

**అడువు** (దే.స.క్రి.) : అడుగు.

**అడువుఁబుట్టువు** (దే.వి.) : (అడువు + పుట్టువు) కాఁపువాఁడు.

**అడుసు** (దే.వి.) : బురద, పంకము.

**అడ్గు** (దే. స. క్రి.) : 1. ప్రశ్నము చేయు; 2. యాచించు. (వి.): 1. క్రిందు; 2. పాదము; 3.పాద ప్రమాణము. (విణ.) : అధమము.

**అడ్డ** (యు.దే.వి.) : గుంటకలోనగువాని దిండు. (వై.) : కుంచములో సగము.

**అడ్డంకి** (దే.వి.) : అడ్డి, నిరోధము.

**అడ్డకట్ట** (దే.వి.) : (అడ్డము+కట్ట) ఏఱులోనగు వాని నీళ్ళు వెలికిఁబోక కట్టెడు కట్ట, ఆనకట్ట.

**అడ్డకట్టు** (దే.స.క్రి.) : (అడ్డము + కట్టు) అడ్డగించు, నిరోధించు.

**అడ్డకత్తి** (దే.వి.) : (అడ్డము+కత్తి) ఆయుధ విశేషము, పట్టిసము.

**అడ్డకమ్మి** (ద్వ.వి.) : (అడ్డము+కమ్మి) గడప యందు త్రొక్కుడు కమ్మికి సరిమీఁదుగా నడ్డముగ నేర్పఱపఁ బడిన దారు విశేషము, నాస.

**అడ్డకట్టు** (దే.వి.) : (అడ్డము + కట్టు) అడ్డి, విఘ్నము. (నీవు నామాటకు అడ్డకట్టు వేయకుము.)

**అడ్డకొడమ** (దే.వి.) : (అడ్డము+కొడమ.) మత్స్యములఁబట్టు నొకానొక సాధనము.

**అడ్డగాలు** (దే.వి.) : (అడ్డము + కాలు.) అడ్డకట్టు.

**అడ్డగించు** (దే.స.క్రి.) : అడ్డకట్టు. నిరోధించు.

**అడ్డచాఁపు** (దే.వి.) : (అడ్డము+చాఁపు.) అడ్డవాసపు దూలము.

**అడ్డసము** (వై.వి.) : 1. బెత్తము లోనగు వాని చేతఁ జేయఁబడిన కేడెము; (చూ. ఒడ్డనము.) 2. కేడెము.

**అడ్డపట్టు** (దే.స.క్రి.) : (అడ్డము+పట్టు) అడ్డముగా పట్టు.

**అడ్డపట్టె** (ద్వ.వి.) : (అడ్డము + పట్టె.) మడి చదును పఱచెడి పలుక. (రూ.అడ్డపట్టియ)

**అడ్డపడు** (ద్వ.అ.క్రి.) : (అడ్డము + పడు.) అడ్డము వచ్చు.

**అడ్డపాటు** (ద్వ.వి.) : అడ్డపడుట, నిరోధము.

**అడ్డపాప** (దే.వి.) : 1. (అడ్డము+పాప) అడ్డముగా పట్టఁదగిన శిశువు; 2. దూరదృష్టి లేనివాని కన్నులలోని పాప.

**అడ్డపెట్టు** (దే. స. క్రి.) : (అడ్డము + పెట్టు) 1. అడ్డకట్టు, నిరోధించు; 2.ఈడు పెట్టు. (వి.) : అడ్డగింత, నిరోధము.

**అడ్డబాస** (దే.వి.) : నాసాభూషణ విశేషము (దీనిని బులాకి అందురు.)

**అడ్డమాను** (దే.వి.) : (అడ్డము + మాను.) అడ్డపట్టె.

**అడ్డము** (దే.వి.) : 1. నిరోధము; 2. చాటు; 3. తాకట్టు; 4. పూఁట. (విశ.) : నిరోధకము. (వృత్తి యందు అంత్యవర్ణ లోపము. అడ్డకట్ట, అడ్డగాలు, అడ్డవేడెము. మొ.)

**అడ్డరిక** (సం.వి.ఆ.స్త్రీ.) : ఒక దినుసు పోలీ.

**అడ్డవాట్లు** (దే.వి.బ.) : (అడ్డము+వాట్లు) అడ్డకట్టు. (నీవేల దానికి అడ్డవాట్లు వేసెదవు ?)

**అడ్డవాతియమ్ము** (ద్వ.వి.) : (అడ్డము + వాయి + అమ్ము.) ఒకదినుసు బాణము.

**అడ్డవేడెము** (ద్వ.వి.) : (అడ్డము + వేడెము.) పామునడకవంటి గుఱ్ఱపునడ.

**అడ్డసరము** (వై.వి.) : అటరూషము.

**అడ్డసాకులు** (ద్వ.వి.బ.) : (అడ్డము + సారెలు.) పాచికలు. (రూ.అడ్డసాళ్ళు.)

**అడ్డాదిడ్డి** (దే.వి.ణ.) : (అడ్డము+దిడ్డి.) అక్రమము. (వాఁడు అడ్డాదిడ్డి మాట లాడుచున్నాఁడు.)

**అడ్డి** (దే.వి.) : అడ్డంకి, అభ్యంతరము, నిరోధము.

**అడ్డిగలు** (దే.వి.బ.) : ఆఁడవారు మెడ నుంచు కొనెడు ఒక దినుసు సొమ్ము, గ్రైవేయకము.

**అడ్డిపడు** (ద్వ.అ.క్రి.) : అభ్యంతరమగు.

**అడ్డీ** (దే.వి.) : అనుకైన వస్తువు యొక్క పూఁత. (అ.ప్ర.)

**అడ్డు** (దే.స.క్రి.) : అడ్డగించు. (వి.) : అడ్డగింత.

**అడ్డుగ** (వై.వి.) : రూకలో సగము, అర్ధపణము.

**అడ్డుగల్ల** (దే.వి.) : (అడ్డు + కల్ల.) 1. అడ్డ కల్ల; 2. గడియప్రమాను. (విణ. ) : విఘాతము.

**అడ్డుగొను** (దే.అ.క్రి.) : (అడ్డు + కొను) అడ్డపడు.

**అడ్వాన్సు** (ఆం.వి.) : ముందుగానిచ్చు రూకలు.

**అణఁకువ** (దే.వి.) : అడఁకువ, నమ్రత.

**అణఁగారు** (దే.అ.క్రి.) : అడఁగారు, ఉపశమిల్లు.

**అణఁగు** (దే.అ.క్రి.) : 1. తగ్గు; 2. ఉపశమిల్లు; 3. నమ్రమగు; 4. నశించు; 5. లోపడు.

**అణఁచు** (దే.ప్రే.) : అడఁచు, అణఁగించు.

**అణక** (దే.వి.) : మెడమీఁదనున్న కాఁడి మొదలగు వానిని మెడక్రిందికి తెచ్చుకొనుట.

**అణకించు** (దే.స.క్రి.) : అడకించు.

**అణకుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) అధముఁడు, కుత్సితుఁడు.

**అణవీనము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అణువులు పండునది. (పొలము.)

**అణవ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అణవీనము.

**అణా** (హిం.వి.) : రూపాయలో పది యారవ వంతు.

**అణియ** (సం.వి.ఇ.పుం.స్త్రీ.) : 1.ఇఱుసు తుదిచీల; 2.అంచు; 3.ఎల్ల.

**అణీయము** (సం.విణ.) (స్. ఈ. స్) : అల్పిష్ఠము, మిక్కిలి యణువు (ఈకారాంత మైనప్పుడు ణీయసీ అని రూపము. ఇట్లంతటనెఱుగునది)

**అణుజో** (దే.వి.) : అడుజు.

**అణువు** (సం.వి.ఉ.పుం.) : 1.చిఱువడ్లు; 2. లేశము. (విణ.) : అల్పము.

**అతఁడు** (దే.స.) : ఆ శబ్దమునకు మహదర్థక పూజ్యైక వచనము, అతగాఁడు.

**అతకరించు** (వై.స.క్రి.) : 1. క్రిందు పఱచు, అధఃకరించు; 2. అతిక్రమించు.

**అతగుఁడు** (దే.విణ.) : దుర్బలుఁడు.

**అతనుఁడు** (సం. వి. ఉ. పుం.) : మన్మథుఁడు. (విణ.) : గొప్పవాఁడు.

**అతర్కణము** (వై.వి.) : మట్టుమీఱిన కార్యము. (వాడుకలోనిది.)

**అతలషు** (హిం.వి.) : వస్త్రవిశేషము.

**అతసి** (సం.వి.ఈ.స్త్రీ.) : నూనెయగిసె.

**అతిక్రమించు** (సం.స.క్రి.) : మీఱు.

**అతిక్రాంతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అతీతము, మీఱినది.

**అతిక్రాంతి** (సం.వి.ఇ.స్త్రీ) : అతిక్రమము.

**అతిగండము** (సం.వి.అ.పుం.) : ఒక యోగము. (చూ.యోగము.) (విణ.) : దొడ్డచెంపగలది.

**అతిచర** (సం.వి.ఆ.స్త్రీ.) : మెట్టదామర.

**అతిచ్ఛత్ర** (సం.వి.ఆ.స్త్రీ.) : సదాప. (అ.పుం.ము.) : గుడ్డి కామంచి.

**అతిథి** (సం.వి.ఇ.పుం.స్త్రీ.) : విందు. (పుం.) : కుశుని కొడుకు.

**అతిదేశము** (సం.వి.అ.పుం.): 1. ఒకచోటఁ జెప్పఁబడిన దానిని సామ్యముఁ బట్టి మఱియొక చోట నుపయోగ పఱచుట; 2. బదులు.

**అతిధృతి** (సం.వి.ఇ.స్త్రీ.) : ఒక ఛందస్సు. (విణ.) : అత్యంతధృతి గలవాఁడు.

**అతినువు** (సం.విణ.ఉ.) : ఓడఁ గడచినది.

**అతిపథము** (సం.వి.న్.పుం.) : సత్పథము, మంచిత్రోవ.

**అతిపాతము** (సం.వి.అ.పుం.) : అతిక్రమము.

**అతిబల**(సం.వి.ఆ.స్రీ) : 1. ముత్తవపులగము దినుసు; 2. (విశ్వామిత్రుఁడు పదేశించిన) ఒక విద్య. (విణ.) : మిక్కిలి బలముగలది.

**అతిభూమి** (సం.వి.ఆ.స్త్రీ.) : అతిశయము.

**అతిమాత్రము** (సం.క్రి.విణ.అ.న.) : పెల్లు. (విణ.) : అధికము.

**అతిముక్తము** (సం.వి.అ.పుం.) : 1. తినాసము; 2.పువ్వుల గురివింద. (విణ.) : కూడికలేనిది.

**అతిరథుఁడ** (సం.వి.అ.పుం.) : పెక్కు విలుకాండ్రతో పోరెడి యోధుఁడు.

**అతిరసము** (సం.వి.అ.పుం.) : భక్ష్య విశేషము.

**అతిరిక్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) సమధికము. హెచ్చినది.

**అతిరేకము** (సం.వి.అ.పుం.) : ఆధిక్యము, హెచ్చు.

**అతివ** (దే.వి.) : ఆఁడుది, ఇంతి, వనిత.

**అతివస** (వై.వి.) : ఒక మందుదినుసు, అతివిష.

**అతివాదము** (సం.వి.అ.పుం.) : పరుషముగా మాటాడుట.

**అతివాసము** (వై.వి.) : శ్రాద్ధ దినమునకు ముందుదినము.

**అతివిష** (సం.వి.ఇ.స్త్రీ.) : అతివస.

**అతివృష్టి** (సం.వి.ఇ.స్త్రీ.) : దేశమునకు హానికరమైన మిక్కిలి వాన.

**అతివేలము** (సం.క్రి.విణ.అ.న.) : పెల్లు. (విణ.) : అధికము.

**అతిశయము** (సం.వి.అ.పుం.) : ఆధిక్యము, అగ్గలిక.

**అతిశయిల్లు** (సం.అ.క్రి.) : అగ్గలించు.

**అతిశాయి** (సం.విణ.న్.ఈ.న్) : అతిశయించినది.

**అతిసర్జనము** (సం.వి.అ.న.) : 1. ఈవి; 2. కొల.

**అతిసారకి** (సం.విణ.) : (న్.ఈ.న్.) అతిసార రోగము గలవాఁడు.

**అతిసారము** (సం.వి.అ.పుం.) : రోగవిశేషము.

**అతిహసితము** (సం. వి. అ. న.) : శరీర కంపముతోఁ గూడిన నవ్వు. (చూ. హాసము.) (ఇది అధమము.)

**అతీంద్రియము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ప్రత్యక్షము కానిది.

**అతీతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అతిక్రాంతము, కడచినది.

**అతుకు** (దే.అ.క్రి.) : అంటుకొను. (అం. ప్రే.) : అతికించు. (వి.) : 1. అతుకుట; 2. అతికిన తావు. (రూ.అదుకు.)

**అతులము** (సం.విణ.) : (అ.ఆ.అ.) సరిలేనిది.

**అత్త** (ఉభ.దే.వి.) : 1. మగని యొక్క తల్లి; 2. భార్య యొక్క తల్లి. (సం.ఆ.స్త్రీ.): 1. అక్క;

2. తల్లి. (సంస్కృతమున నీయర్థములు కొన్ని పుస్తకములయందు వ్రాయబడి యున్నవి.)

**అత్తడి** (దే.వి.) : గోడిగబుతువు. (గోడిగ = ఆఁడు గుఱ్ఱము.)

**అత్తపత్తి** (దే.వి.) : ఓషధి విశేషము, సోఁకుడు ముడుఁగు.

**అత్తమిల్లు** (వై.అ.క్రి.) : 1. అస్తమించు; 2. ఒఱగు; 3. వ్యాపించు; 4. శయనించు.

**అత్తము** (దే.వి.) : అరఁటిపండ్ల గెల.

**అత్తరము** (దే.వి.) : త్వర. (రూ.ఆత్రము.)

**అత్తరు** (దే.వి.) : సుగంధతైలము, ప్రబోధనము. (రూ. అత్తరువు.)

**అత్తలము** (దే.వి.) : 1. ఈఁటె, కుంతము. (రూ. అత్తళము) 2. బల్లెము.

**అత్తి** (దే.వి.) : మేడి, ఉదుంబరము.

**అత్తిక** (సం.వి.ఆ.స్త్రీ.) : (నాట్య పరిభాష యందు) అక్క, (తఱచుగా నిఘంటువుల యందు అంతిక యని యున్నది.)

**అత్తు** (దే.అ.క్రి.) : 1. కలుగు; 2. కూడు.

**అత్తెము** (వై.వి.) : హస్తకవచము.

**అత్తెసరు** (దే.వి.) : (అత్తు + ఎసరు) గంజి వారకుండ నన్నముతో నిమిడి పోవునట్లు పెట్టెడి యెసరు.

**అత్యంతము** (సం. క్రి. విణ. అ. న.) : పెల్లు. (విణ.) : అధికము.

**అత్యంతీనుఁడ** (సం.విణ) : (అ.ఆ.అ) విచ్చలవిడిఁ గడు నడచువాఁడు.

**అత్యయము** (సం.వి.అ.పుం.) : 1. అతిక్రమము; 2. చేటు; 3. దండము; 4. దుఃఖము; 5. దోషము.

**అత్యరాళము** (సం.వి.అ.పుం.) : అరాళ మనెడి యేనుఁగున కంటె మిక్కిలి ప్రమాణము గల యేనుఁగు. (ఇది నింద్యము) (విణ.) : మిక్కిలి వక్రము.

**అత్యర్థము** (సం.క్రి.విణ.అ.న.) : పెల్లు. (విణ.): అధికము.

**అత్యాకారము** (సం.వి.అ.పుం.) : తిరస్కారము, తెగడిక.

**అత్యాహితము**(సం.వి.అ.న.) : 1. మిక్కిలి వెఱపు; 2. బ్రదుకుఁ గోరని పని. (విణ.) : కూడఁ బడినది.

**అదంత్రము** ( వై.విణ.) : స్వాతంత్ర్యము తప్పినది. (దీనిని అతంత్రమని సంస్కృతముగానే చెప్ప వచ్చునని తోచుచున్నది. అయినను ప్రతుల యందట్లు లేదు.)

**అదక** (దే.వి.) : ప్రాఁతచెప్పు.

**అదటు** (దే.వి.) : 1.గర్వము; 2. మదము.

**అదనము** (వై.విణ.) : అగ్గలము, అధికము.

**అదను** (దే.వి.) : సమయము, (రూ.) హదను.

**అదపు** (హిం.వి.) : గద్దింపు, హెచ్చరిక, భయము.

**అదయుఁడు**(సం.విణ.) : (అ.ఆ.అ.) దయ లేనివాఁడు.

**అదరు** (దే.అ.క్రి.) : చలించు. (ని.) : 1.చలనము; 2.బ.మిడుఁగుఱులు.

**అదర్శనము** (సం.వి.అ.న.) : 1. కల 2.చూడమి.

**అదలు** (దే.అ.క్రి.) : బెదరు. (చూ. అదలుచు.)

**అదలుచే** (దే.ప్రే.) : అదలించు. (రూ. అదల్చు.) కోపమున గద్దించు, తర్జించు. (చూ. గద్దించు.)

**అదలుపు** (దే.వి.) : అదలించుట (రూ.) అదల్పు, తర్జనము.

**అదవద** (దే.వి.): కలఁత.

**అదవదపడు** (ద్వ.అ.క్రి.) : కలఁతపడు.

**అదాటు** (వై.అవ్య.) : ఉన్నట్టుండి. (ఇది వాడుక లోనిది.)

**అది** (దే.స.) : ఆ శబ్దమునకు అమహ దర్థక ప్రథమైక వచనము. (ఆయాఁడుది. ఆపశ్వాది. ఆజడవస్తువు.) (చూ.ఆ.)

**అదిగొ** (దే.ద్ర.) : చూపుటకు తెలుపునది. (రూ.అదిగో.)

**అదితినందనుఁడు** (సం.వి.అ.పుం.) : అమరుఁడు, వేలుపు.

**అదిర** (దే.అవ్య.) : (అది+ర) ఔరా. (రూ. అదిరా.)

**అదిరిపడు** (ద్వ.అ.క్రి.) : ఉలికిపడు.

**అదిరిపాటు** (ద్వ. అవ్య.) : ఉన్నట్టుండి, అకస్మాత్తుగా.

**అదుకు** (దే.అ.క్రి.) : అతుకు. (అం.ప్రే.) అతికించు. (వి.) : 1. అతుకుట; 2.అతికిన తావు.

**అదుము** (దే.స.క్రి.) : అణఁచు.

**అదుముడు** (దే.వి.) : అదుముట.

**అదురు** (దే.అ.క్రి.) : చలించు. (వి.) : చలనము. (చూ.అదరు.)

**అదురుఁగ్రోవి** (దే.వి.) : (అదురు + క్రోవి.) అదురువేటు.

**అదురుఁద్రిక్క** (దే.వి.) : (అదురు + త్రిక్క.) పశు రోగ విశేషము.

**అదురుగడ** (దే.వి.) : అదిరిపాటు.

**అదురుగుండియ** (దే.విణ.) : భయపడు స్వభావముగల వాఁడు, భీరువు.

**అదురుచు** (దే.అ.క్రీ) : అదురు యొక్క రూపాం తరము. (రూ. అదుర్చు.)

**అదురువేటు** (దే.వి.) : మ్రానియందు ఇనుప గొట్టములు నాటించి వాని యందు మందు గట్టించి అదురునట్లు వేసెడు వేటు.

**అదువ** (దే.విణ.) : అస్థిరము.

**అదృక్కు** (సం.విణ.శ్.) : గ్రుడ్డివాఁడు.

**అదృశ్యమ** (సం.విణ) : (అ. ఆ. అ.) దృశ్యము కానిది. (దృశ్యము = చూడఁదగినది)

**అదృష్టము** (సం.వి.అ.న.) : 1. అగ్ని జలాదుల వలనఁ బుట్టెడి కీడు; 2. భాగ్యము. (విణ.) : చూడఁబడనిది.

**అదృష్టి** (సం.వి.అ.న.) : రోషముచేఁ గ్రూరమైన చూపు.

**అద్ద** (వై.వి.) : 1.సగము; 2.అరసోల; 3.నూర్చక వేసిన కుప్ప యొక్క క్రింది సగము భాగము. (దీనికి సగమను అర్థమునందు వ్యస్తముగాఁ బ్రయోగము కనఁబడలేదు.)

**అద్దకము** (దే.వి.) : వస్త్రమునకు వేయు రంగు.

**అద్దగోడ** (వై.వి.) : మఱుఁగు గోడ.

**అద్దమరేయి** (వై.వి.) : (అద్ద + రేయి) అపరాతిరి, అర్ధరాత్రము.

**అద్దము** (వై.వి.) : ముఖము చూచుకొనెడు గాజుబిల్ల, దర్పణము.

**అద్ది** (దే.స.) : (చూ.) అది. (రూ. అయ్యది, ఆయది.)

**అద్దికము** (దే.వి.) : కావలి. రక్షణము.

**అద్దియ** (దే.వి.) : బాడుగ, భాటకము.

**అద్దిర** (దే.అవ్య.) : (అద్ది + ర) అదిర. (దీనికి అన్నయ్యలు అను ప్రయుక్తంబులగు. (రూ. అద్దిరా.)

**అద్దిరపాటు** (ద్వ.వి.) : అద్దిరపడుట.

**అద్దు** (దే.స.క్రి.) : 1. తోఁచు; 2. రంగువేయు.

**అద్దువ** (దే.విణ.): (రూ.) అదువ. (చూ.)

**అద్దె** (దే.వి.) : అద్దియ యొక్క రూపాంతరము.

**అద్భుతము** (సం.వి.అ.న.) : ఆశ్చర్యము. (విణ.): ఆశ్చర్యకరము.

**అద్మరుఁడు** (సం.విణ.) : (అ. ఆ. అ.) : భక్షకుడు, తిండిపోతు.

**అద్యత్వము** (సం.వి.అ.న.) : ఇప్పుడు.

**అద్రి** (సం.వి.ఇ.పుం.) : 1.కొండ; 2.చెట్టు; 3.సూర్యుఁడు.

**అద్రికాకము** (సం.వి.అ.పుం.) : కాకి దినుసు, కొండకాకి.

**అద్రుచే** (దే.అ.క్రి.) : అదురు, కంపించు. (అదురుచు యొక్క మాఱు రూపము.)

**అద్వయవాది** (సం.వి.న్.పుం.) : జైనుల దేవత.

**అద్వైతము** (సం.వి.అ.న.) : 1.అభేదము; 2.జీవేశ్వరుల కైక్యము చెప్పెడి మతము.

**అధఃకరణము** (సం.వి.అ.న.) : 1. క్రిందుపఱచుట 2. తక్కువ పఱచుట.

**అధఃకరించు** (సం.స.క్రి.) : 1. క్రిందుపఱచు, అతకరించు; 2.తక్కువపఱచు.

**అధఃకారము** (సం.వి.అ.పుం.) : 1. క్రిందు పఱచుట; 2. తక్కువపఱచుట.

**అధఃకృతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. క్రిందు పఱపఁబడినది; 2.తక్కువ పఱపఁబడినది.

**అధమము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అవద్యము, తక్కువైనది.

**అధమర్ణుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) అప్పులకాఁపు.

**అధరము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పెదవి. (విణ.) : 1. క్రిందిది; 2. తక్కువైనది.

**అధరితవస** (విణ) : (అ.ఆ.అ) : 1. క్రిందు పఱపఁబడినది 2. తక్కువ పఱపఁబడినది.

**అధర్మము** (సం.వి.అ.పుం.) : ధర్మము కానిది.

**అధర్వణుఁడు** (సం.వి.అ.పుం.) : 1. అధర్వ వేదముదెలిసిన బ్రాహ్మణుఁడు; 2. పురోహితుఁడు. (అధర్వణియని ఇకారాంతముగాఁ గొందఱు.)

**అధర్వము** (సం.వి.న్.న.) : ఒకవేదము.

**అధర్వుఁడు** (సం.వి.న్.పుం.) : బ్రాహ్మణుడు.

**అధికము**(సం.వి.అ.పుం.) : ఒక యర్థాలంకారము (చూ. అలంకారము.) (విణ.) : అదనము.

**అధికరణము** (సం.వి.అ.న.) : ఆధారము.

**అధికరించు** (సం.స.క్రి.) : చదువు.

**అధికాంగము** (సం.వి.అ.న.) : సారసనము, నడికట్టు.

**అధికారము** (సం.వి.అ.పుం.) : 1. ప్రక్రియ; 2. చెల్లుబడి.

**అధికారి** (సం.వి.న్.పుం.) : అధికారము కలవాఁడు, అధ్యక్షుఁడు.

**అధికృతుఁడు** (సం.వి.అ.పుం.) : అధికారి.

**అధిక్రియ** (సం.వి.ఆ.స్త్రీ.) : అధికారము.

**అధిక్షిప్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. ఉంచఁబడినది; 2. దూఱఁబడినది; 3. బెదరింపఁబడినది.

**అధిక్షేపము** (సం. వి. అ. పుం.) : 1.దూఱుట; 2.బెదరించుట.

**అధిక్షేపించు** (సం.స.క్రి.) : 1. దూఱు; 2.బెదరించు.

**అధిగతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1.చదువఁబడినది; 2.పొందఁబడినది.

**అధిగమము** (సం.వి.అ.పుం.) : 1. చదువుట; 2. పొందుట; 3. లాభము.

**అధిగమించు** (సం.స.క్రి.) : 1.చదువు; 2.తెలియు; 3.పొందు.

**అధిజ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఎక్కుపెట్టినది.

**అధిత్యక** (సం.వి.ఆ.స్త్రీ.) : కొండమీఁది నేల.

**అధిపతి** (సం.విణ.ఇ.) : ప్రభువు, ఏలిక.

**అధిపుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ప్రభువు, ఏలిక.

**అధిభువు** (సం.విణ.) : (ఊ.ఊ.ఉ.) ప్రభువు, ఏలిక.

**అధిరోహణము** (సం.వి.అ.న.) : ఆరోహణము, ఎక్కుట.

**అధిరోహించు** (సం.స.క్రి.) : ఆరో హించు, ఎక్కు.

**అధిరోహిణి** (సం.వి.ఈ.స్త్రీ.) : నిశ్రేణి, నిచ్చెన.

**అధివసించు** (సం.అ.క్రి.) : నివసించు, ఉండు.

**అధివాసము** (సం.వి.అ.పుం.) : 1. ఉనికి; 2.వాసెనకట్టుట.

**అధివాసరము** (సం.వి.అ.పుం.న.) : అతివాసము.

**అధివిన్న** (సం.వి.ఆ.స్త్రీ.) : మొదటి పెండ్లాము. సవతితనము చేత దుఃఖించునది. (అని కొందఱు.)

**అధివేదనము** (సం.వి.అ.న.) : భార్య యుండ మరలబెండ్లి యాడుట.

**అధిశ్రయణి** (సం.వి.ఈ.స్త్రీ.) : అంతిక, ప్రొయ్యి.

**అధిష్ఠాత** (సం.విణ.) : (ఋ.ఈ.ఋ.) అధిష్ఠించు వాఁడు. (ఈకారాంతమైనప్పుడు అధిష్ఠాత్రీ అని రూపము. ఇట్లంతట నెఱుంగునది.)

**అధిష్ఠానము** (సం.వి.అ.న.) : 1. ఆక్రమించుట; 2. బండికన్ను; 3. ప్రభావము; 4. ఒకానొక పట్టణము.

**అధిష్ఠించు** (సం.స.క్రి.) : ఆశ్రయించి యుండు.

**అధీతము** (సం.విణ.) : (అ.ఆ.అ) అధ్యయనింపఁబడినది.

**అధీతి** (సం.వి.ఇ.స్త్రీ.) : అధ్యయనము. (న్.పుం.): అధ్యయనము చేసినవాఁడు.

**అధీనము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఆయత్తము, అగ్గము.

**అధీశ్వరుఁడు** (సం.వి.అ.పుం.) : సమస్త సామంతులచేత సేవింపఁబడు రాజు.

**అధైర్యము** (సం.వి.అ.పుం.) : ధైర్యము లేమి.

**అధోక్షజుఁడు** (సం.వి.అ.ప.న.) : అచ్యుతుఁడు. విష్ణువు.

**అధోగతి** (సం.వి.ఇ.స్త్రీ.) : తక్కువ స్థితి.

**అధోగతుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) తక్కువ స్థితిని పొందినవాఁడు.

**అధోభువనము** (సం.వి.అ.న.) : క్రింది లోకము, పాతాళము.

**అధోముఖము** (సం.విణ.) : (అ.ఈ.అ.) దిగుముఖముగలది.

**అధ్యక్షించే** (సం.స.క్రి.) : పరిపాలించు, ఏలు.

**అధ్యక్షుఁడు** (సం.వి.అ.పుం.) : అధికారి. (విణ.): ప్రత్యక్షమైనవాఁడు.

**అధ్యగ్నికృతము** (సం.వి.అ.న.) : వివాహవేళ అగ్ని హోత్రుని సన్నిధి యందు చదివింపబడు స్త్రీధనము.

**అధ్యయనము** (సం.వి.అ.న.) : గురు ముఖమున ఆనుపూర్విగ వేదముఁ జదువుట.

**అధ్యయనించే** (సం.స.క్రి.) : అధ్యయనము చేయు.

**అధ్యవసానము** (సం.వి.అ.పుం.) : ఉత్సాహము, పూనిక.

**అధ్యాఖ్యానము** (సం.వి.అ.న.) : కల్ల జగడము, అభ్యాఖ్యానము.

**అధ్యాత్మము** (సం.అవ్య.) : జ్ఞానము.

**అధ్యాపకుఁడు** (సం.వి.అ.పుం.) : వేదముఁ జదివించువాఁడు.

**అధ్యాపనము** (సం. వి. అ. న.) : వేదముఁ జదివించుట.

**అధ్యాయము** (సం.వి.అ.పుం.) : గ్రంథభాగ విశేషము.

**అధ్యాసనము** (సం.వి.అ.న.) : ఆక్రమించుట, అధిష్ఠానము.

**అధ్యాహవనికము** (సం.వి.అ.న.) : పుట్టినింట నుండి చొచ్చినింటికి పోవునపు డియ్యఁబడునట్టి స్త్రీ ధనము.

**అధ్యాహారము** (సం.వి.అ.పుం.) : లేని పదములు కొన్నిటిని తెచ్చుకొనుట.

**అధ్యూఢ** (సం.వి.ఆ.స్త్రీ.) : మొదటి పెండ్లాము, సవతి తనము చేత దుఃఖించునది. (అని కొందఱు.)

**అధ్యూఢుఁడు** (సం.వి.అ.పుం.) : శివుఁడు.

**అధ్యేత** (సం.వి.ఋ.పుం.) : చదువువాఁడు.

**అధ్యేషణ** (సం.వి.ఆ.స్త్రీ.) : పూజ్యులను సత్కార పూర్వకముగ నొక కార్యమున నియోగించుట. అడిగికొనుట. (అని కొందఱు.)

**అధ్వగ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఆకాశగంగ, మిన్నేఱు.

**అధ్వగుఁడు** (సం.వి.అ.పుం.) : 1. దారి నడచువాఁడు, తెరువరి; 2.సూర్యుఁడు.

**అధ్వనీనుఁడు** (సం.వి.అ.పుం.) : అధ్వగుడు, తెరువరి.

**అధ్వన్యుఁడు** (సం.వి.అ.పుం.) : అధ్వగుడు, తెరువరి.

**అధ్వము** (సం.వి.న్.పుం.) : 1. త్రోవ; 2. చదుకము; 3.కాలము; 4.నిదురలో నగు సమయములందు శత్రువుల పైఁబడుట.

**అధ్వరము** (సం.వి.అ.పుం.) : యాగము, జన్నము.

**అధ్వరుఁడు** (సం.వి.అ.పుం.) : ఒక వసువు. (చూ.వసువు)

**అధ్వర్యుఁడు** (సం.వి.ఉ.పుం.) : యజ్ఞము నందు యజుర్వేద తంత్రము నడపు వాఁడు.

**అధ్వానము** (సం.వి.అ.పుం.) : అమార్గము.

**అన** (దే.వి.) : 1. ఆనకట్ట; 2. అన్న; 3.చాఁగు నట్టి మిక్కిలి లేఁతకొమ్మ.

**అనంగము** (సం.వి.అ.న.) : 1.ఆకాశము; 2. హృదయము.

**అనంగుఁడు** (సం. వి. అ. పుం.) : మన్మథుడు. (విణ.) : అంగము లేనివాఁడు.

**అనంత** (సం.వి.అ.స్త్రీ.) : 1. భూమి; 2. పార్వతి; 3. ఉసిరిక; 4. కరక; 5. గఱిక; 6.తరిగొఱ్ఱి 7. తిప్ప తీఁగ; 8. తీఁట కసింద; 9. నీరు పిప్పలి; 10. మావెన. (అ.న.ము.) : ఆకాశము. (విణ.) : మేరలేనిది.

**అనంతరము** (సం.క్రి.విణ.అ.న.) : పిమ్మట. (విణ.) : వెనుకటిది.

**అనంతవిజయము** (సం.వి.అ.పుం.) : ధర్మరాజు యొక్క శంఖము. (విణ.) : ఎన్నికకు మీఱిన జయములు గలది.

**అనంతుఁడు** (సం. వి. క్రి.) : 1.శేషుఁడు; 2. విష్ణువు.

**అనఁగు** (దే.అ.క్రి.) : కలయు.

**అనఁటి** (దే.వి.) : అరఁటి, కదళి.

**అనక్షరము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఉచ్చరింపఁ గూడనిది (తిట్టు) సైఁగగాఁ జెప్పునది (మాట) (అని కొందఱు.)

**అనఘము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. నిర్దోషము; 2. నిర్మలము; 3. మనోజ్ఞము.

**అనడ్వాహము** (సం.వి.అ.పుం.) : వృషభము, ఎద్దు.

**అనద** (వై.విణ.) : 1.అనాథ; 2. అల్పుఁడు.

**అనన్యజుఁడు** (సం.వి.అ.పుం.) : మన్మథుఁడు, మరుఁడు.

**అనన్యవృత్తి** (సం.విణ.ఇ.) : ఒకట మనసు చెల్లినవాఁడు, ఏకాగ్రుఁడు.

**అనన్యాదృశము** (సం.విణ.) : (అ.ఈ.అ.) మఱియొకటితో సమానము కానిది.

**అనన్వయము** (సం.వి.అ.పుం.) : ఒక యర్థా లంకారము (చూ. అలంకారము) (విణ.) : అన్వయము లేనిది.

**అనపత్యుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) బిడ్డలు లేనివాఁడు.

**అనపరాధి** (సం.విణ.) : (న.ఈ.న్.) అపరాధి కానివాఁడు.

**అనపాయము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అపాయములేనిది.

**అనపాయి** (సం.విణ.) : (న.ఈ.న్.) అపాయము లేనిది.

**అనయము** (ఉభ.దే.ద్ర) : 1. అత్యంతము; 2.అవశ్యము; 3.మఱిమఱి; 4.సతతము.

**అనరు** (దే.వి.) : 1.సంకటము; 2. (బ.) : జీవ స్థానము, మర్మము.

**అనర్గళము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అడ్డంకిలేనిది.

**అనర్ఘము** (సం.విణ.) : (అ.ఆ.అ.) వెలలేనిది.

**అనర్ఘ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) (అర్ఘ్యము కానిది) అర్ఘ్యము = వెల పెట్టఁదగినది, పూజ కొఱకైనది, అనర్ధకము.

**అనర్థకము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పరస్పరా న్వయము లేనిది. (దశ దాడిమములు షడపూపములు లోనగు పద సముదాయము.)

**అనర్థము** (సం.వి.అ.పుం.) : కీడు. (విణ.) అర్థము లేనిది.

**అనర్హము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అర్హముకానిది.

**అనలము** (సం.వి.అ.పుం.) : 1. అగ్ని; 2. జఠరాగ్ని.

**అనలుఁడు** (సం.వి.అ.పుం.) : 1.అగ్ని దేవుఁడు; 2.ఒక వసువు (చూ.వసువు)

**అనవటిల్లు** (దే.అ.క్రి.) : అన్నము పక్వమై చల్లారు.

**అనవరతము** (సం.క్రి.విణ.అ.న.) : ఎల్లప్పుడు (విణ.) : ఎడతెగనిది.

**అనవరార్ధ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ముఖ్యము, గామిడి.

**అనవస్కరము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కడుగుట లోనగు వానిచేత గర గరికైనది. శోధితము.

**అనస్సు** (సం.వి.స్.న.) : శకటము, బండి.

**అనాకారము** (సం.విణ.) : (అ.ఆ.అ.) రూపములేనిది.

**అనాచారము** (సం.వి.అ.పుం.) : ఆచారము లేమి. (విణ.) : ఆచారము లేనిది.

**అనాదరము** (సం.వి.అ.పుం.) : ఆదరములేమి.

**అనాది** (సం.విణ.) : ఆదిలేనిది (ఆది = మొదలు)

**అనాదీయము** (సం.విణ.) : మరి పురాతనపుది.

**అనాథ** (సం.విణ.) : (అ.ఆ.అ.) నాథుఁడులేనిది.

**అనామతు** (హిం.వి.) : 1. నమ్మకము మీద అల్పకాల మొక వస్తువు నిచ్చుట; 2.ఒక వస్తువును వాడుకొనక యూరక యుంచుట.

**అనామధేయము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పేరులేనిది.

**అనామిక** (సం.వి.అ.స్త్రీ.) : ఉంగరపు వ్రేలు.

**అనాయకము** (సం.విణ.) : అరాజకము.

**అనాయాసము** (సం. వి. అ. పుం.) : ఆయాసము లేమి. (విణ.) : ఆయాసములేనిది.

**అనారతము** (సం.క్రి.విణ.అ.న.) : (చూ.) అనవరతము.

**అనార్యతిక్తము** (సం.వి.అ.పుం.) : నేలవేము.

**అనావృష్టి** (సం.వి.ఇ.స్త్రీ.) : దేశమునకు హాని కలుగునట్లు బొత్తిగా వానలేక పోవుట, వఱపు.

**అనాస** (దే.వి.) : మొగలిపనస.

**అనాహతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చలువ చేయనిది, (క్రొత్త వస్త్రము) కారికము.

**అని** (దే.వి.) : 1. యుద్ధము; 2. అల్లిక మొదలు. (స.ఏ.) : అన్ని యొక్క రూపాంతరము. 1. ఈ ప్రకారము అను నర్థమును తెలుపును; 2. ప్రకారమును తెలుపును; 3. తలఁచుటను తెలుపును; 4. కారణమును తెలుపును; 5. ప్రసిద్ధిని తెలుపును.

**అనికి** (దే.వి.) : అల్లిక.

**అనిక్షువు** (సం.వి.అ.పుం.) : నల్లచెఱకు.

**అనిత్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నిత్యము కానిది. (నిత్యము = శాశ్వతము)

**అనిదంపూర్వము** (సం.విణ.) : (అ.ఆ. అ.) అపూర్వము, అబ్బురము.

**అనిమిషము** (సం.వి.అ.పుం.) : మత్స్యము, చేప.

**అనిమిషుఁడు** (సం.వి.అ.పుం.) : దేవత, వేలుపు.

**అనిరుద్ధుఁడు** (సం.వి.అ.పుం.) : మన్మథుని కొడుకు (విణ.) : అడ్డగింపబడనివాఁడు.

**అనిలుఁడు** (సం.వి.అ.పుం.) : 1. గాలి; 2. ఒక వసువు (చూ.వసువు)

**అనివార్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నివార్యము కానిది. (నివార్యము= నివారింపఁదగినది.)

**అనిశము** (సం.క్రి.విణ.అ.న.) : (చూ) అనవరతము.

**అనిష్టము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఇష్టముకానిది.

**అనీకము** (సం.వి.అ.పుం.న.) : 1. యుద్ధము; 2.సేన.

**అనీకస్థము** (సం.వి.అ.పుం.) : 1. గుఱుతు; 2.వీరమర్దళము.

**అనీకస్థుఁడు** (సం.వి.అ.పుం.) : 1. యుద్ధము నందు నిలిచినవాఁడు; 2. ఏనుఁగుల శిక్షించుట యందు నేర్పరియైనవాఁడు; 3.రాజ రక్షకుఁడు.

**అనీకిని** (సం.వి.ఈ.స్త్రీ.) : 1.సేన; 2. (రెండువేల నూటయెనుబదియేడు రథములు, అన్ని యేనుఁగులు, ఆఱువేలనేనూట యఱువది యొకటి గుఱ్ఱములు, పదివేలుందొమ్మనూట ముప్పది యేవురు కాల్బురును గల) సేనా విశేషము.

**అను** (దే.స.క్రి.) : 1.చెప్పు; "ఇట్టనియె" 2. అని చెప్పు; 3. అని యడుగు.

**అనుఁగు** (దే.విణ.) : 1.ముఖ్యుడు; 2.మొదటిది; 3.ఇంపు, మనోజ్ఞము.

**అనుఁగుఁగత్తియ** (ద్వ.విణ.) : (అనుఁగు + కత్తియ) చెలికత్తె. (ఈయర్థము కవిత్రయమువారి సమ్మతము కాదని తోఁచెడి.)

**అనుకంప** (సం.వి.) : కరుణ, కనికరము.

**అనుకరణము** (సం.వి.అ.న.) : అనుకృతి, అనుకరించుట.

**అనుకరించు** (సం.స.క్రి.) : అనుకరణము చేయు.

**అనుకర్షము** (సం.వి.అ.పుం.) : 1. నొగ చివర భూమిని ఆనక క్రిందనెత్తుగా సంతన పఱచి యుండు మ్రాని తుండు, కోడి పీఁట; 2. ఆకర్షణము.

**ఉన్నాహము** (సం.వి.అ.న.) : పుల్లనీళ్ళు.

**ఉన్ని** (దే.వి.) : గొజ్జెబొచ్చు.

**ఉన్నిద్రము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. మేలుకొన్నది; 2. వికసించినది.

**ఉన్నె** (దే.వి.) : ఉండునె (రూ.) ఉన్నే.

**ఉన్మంథనము** (సం.వి.అ.న.) : 1. కదలించుట; 2. చంపుట.

**ఉన్మంథము** (సం.వి.అ.పుం.) : 1. చంపుట; 2. చిలుకుట.

**ఉన్మంథితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కదలింపఁబడినది.

**ఉన్మత్తము** (సం.వి.అ.పుం.) : ఉమ్మెత్త. (విణ.): వెఱ్ఱెత్తినది.

**ఉన్మదితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఉమ్మాదము పట్టినవాఁడు.

**ఉన్మదిష్ణువు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఉమ్మాదము పట్టినవాఁడు.

**ఉన్మనుఁడు** (సం.విణ.స్.) : ఉత్కంఠ కలవాఁడు.

**ఉన్మాథము** (సం.వి.అ.పుం.) : 1. బోను; గాలము. (అని కొందఱు.) 2. వధము.

**ఉన్మాథుఁడు** (సం.వి.అ.పుం.) : వధించువాఁడు.

**ఉన్మాదకుఁడు** (సం.విణ.) : (అ.ఈ.అ.) ఉన్మదితుఁడు.

**ఉన్మాదనము** (సం.వి.అ.పుం.) : మన్మథుని యొక్క యొక బాణము (చూ. మన్మథుఁడు)

**ఉన్మాదము** (సం.వి.అ.పుం.) : ఉమ్మాదము. (ప్రియ వియోగ విభవ భ్రంశాదులచే చేతనా చేతనములయందు సమానముగాఁ బ్రవర్తించుట.)

**ఉన్మానము** (సం.వి.అ.న.) : తులామానము, తూనిక.

**ఉన్మార్గము** (సం.వి.అ.పుం.) : 1. చెడ్డ నడత; 2. తప్పుత్రోవ.

**ఉన్మితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కొలువఁబడినది.

**ఉన్మిషితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విరిసినది.

**ఉన్మీలనము** (సం.వి.అ.న.) : వికసించుట, విరియుట.

**ఉన్మీలితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విరిసినది.

**ఉన్ముఖము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మీఁదు చూచున్నది.

**ఉన్ముద్రము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విరిసినది.

**ఉన్మూలము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. వేరు తెగినది; 2. అడుగుతోఁజెడినది.

**ఉన్మూలించు** (సం.స.క్రి.) : పెల్లగించు.

**ఉన్మూలితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. వేరు త్రెంపఁబడినది. 2. అడుగుతోఁ జెఱుపఁ బడినది.

**ఉన్మేషము** (సం.వి.అ.పుం.) : వికాసము, గెలివి.

**ఉపకంఠము** (సం.వి.అ.న.) : దాపు. (విణ.) : దాపైనది.

**ఉపకరణము** (సం.వి.అ.న.) : సాధనము, కొఱముట్టు.

**ఉపకరించు** (సం.అ.క్రి.) : ఉపయుక్తమగు, ఒదవు.

**ఉపకర్త** (సం.విణ.) : (ఋ.ఈ.ఋ) ఉపకరించు వాఁడు, మేలుచేయువాఁడు.

**ఉపకారము** (సం.వి.అ.పుం.) : 1. మేలు; 2. చెదరినపువ్వులోనగునది.

**ఉపకారి** (సం.విణ.) : (న్.ఈ.న్) ఉపకర్త.

**ఉపకారిక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. ఉపకారము చేసెడు స్త్రీ; 2. ఉప్పరిగ; 3. ఉక్కెఱ.

**ఉపకార్య** (సం.వి.ఆ.స్త్రీ.) : ఉప్పరిగ (విణ.) ఉపకరింపఁదగినది.

**ఉపకుంచిక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. చిట్టేలకి; 2. నల్లజిలకఱ్ఱ.

**ఉపకుల్య** (సం.వి.ఆ.స్త్రీ.) : పిప్పలి.

**ఉపకృతము** (సం.వి.అ.న.) : ప్రయోజనము. (విణ.) : ఉపకరింపఁబడినది.

**ఉపకృతి** (సం.వి.ఇ.స్త్రీ.) : ఉపకారము, మేలు.

**ఉపక్రమము** (సం.వి.అ.పుం.) : 1. ఉపాయము నెఱింగి ప్రారంభించుట; 2. చికిత్స;

3. మంత్రులు లోనగు వారిఁ బరీక్షించుట; 4. విక్రమము.

**ఉపక్రమించే** (సం.అ.క్రి.స.క్రి.) : ప్రారంభించు. (పౌరాణికుఁడు కథ చెప్ప నుపక్రమించెను.)

**ఉపక్రోశము** (సం.వి.అ.పుం.) : నింద, దూఱు.

**ఉపగతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అంగీక రింపఁబడినది.

**ఉపగతి** (సం.వి.ఇ.స్త్రీ.) : ప్రాప్తి, పొందు.

**ఉపగమము** (సం.వి.అ.పుం.) : 1. అంగీకారము; 2. సమీపించుట.

**ఉపగూఢము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1.కౌఁగిలింపఁబడినది; 2.దాఁచ బడినది.

**ఉపగూహనము** (సం.వి.అ.న.) : 1. కౌఁగిలింత; 2. దాఁచుట.

**ఉపగ్రహము** (సం.వి.అ.పుం.) : 1.అనుకూ లించుట; 2. ఉపయోగము; 3. చెఱఁబడ్డది; 4.చెఱ; 5. సూర్యాది గ్రహణము.

**ఉపగ్రాహ్యము** (సం.వి.అ.న.) : ఉపహారము, కానుక.

**ఉపఘ్నము** (సం.వి.అ.పుం.) : సమీపాశ్రయము, ప్రాఁకు.

**ఉపచయము** (సం.వి.అ.పుం.) : 1. పొడవు; 2. వృద్ధి.

**ఉపచరము** (సం.వి.అ.పుం.) : గో మహిష్యాది గర్భగ్రహణము, వెద. గో మహిష్యాది ప్రథమ గర్భము. (అని కొందఱు.)

**ఉపచరించే** (సం.స.క్రి.) : 1. సన్మానించు; 2. సేవించు.

**ఉపచరితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) సేవింపఁ బడినవాఁడు, ఉపాసితుఁడు.

**ఉపచాయ్యము** (సం.వి.అ.పుం.) : యాగాగ్ని యందు ఉపయోగింపఁ దగిన పేరు.

**ఉపచారము** (సం.వి.అ.పుం.) : 1. సమ్మానము; 2. ఊడిగము; 3. లంచము; 4. వాడుక (పంచోప చారములు: స్నానము, పూజ, నైవే ద్యము, ప్రదక్షిణము, నమస్కారము, షోడశోప చారములు–ఆవాహనము, ఆసనము, పాద్యము, అర్ఘ్యము, ఆచమనీయము, అభిషేకము, వస్త్రము, యజ్ఞోపవీతము, గంధము, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము, ప్రదక్షిణము, నమస్కారము.)

**ఉపచితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. కాలినది; 2. కూడఁబెట్టినది; 3. వర్ధిల్లినది.

**ఉపచిత్ర** (సం.వి.ఆ.స్త్రీ.) : ఎలుకజీడి.

**ఉపజాపకుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) భేదము పుట్టించువాఁడు.

**ఉపజాపము** (సం.వి.అ.పుం.) : భేదోపాయము.

**ఉపజిహ్వక** (సం.వి.ఆ.స్త్రీ.) : కొండనాలుక.

**ఉపజీవి** (సం.విణ.) : (న్.ఈ.న్) ఒకరిననుసరించి జీవించువాఁడు.

**ఉపజీవించే** (సం.స.క్రి.) : ఒకరిననుసరించి జీవించు.

**ఉపజీవిక** (సం.వి.ఆ.స్త్రీ.) : జీవనోపాయము.

**ఉపజ్ఞ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఉపదేశములేక తనంతట మొట్టమొదట పుట్టెడు జ్ఞానము. (వాల్మీకి యొక్క శ్లోక నిర్మాణ జ్ఞానము వంటిది.)

**ఉపతప్త** (సం.వి.ఋ.పుం.) : రోగము, తెవులు.

**ఉపతాపము** (సం.వి.అ.పుం.) : 1. సంతాపము; 2. రోగము; 3. తొందర.

**ఉపతాయి** (దే.వి.) : మల్లవిజ్ఞానము. (ప్రయోగములు విశేషముగా దొరకమి చేతను దొరకిన రెండు ప్రయోగములను సందిగ్ధములుగా నుండుట చేతను ఈ యర్థ నిర్ణయము మనస్సున కంత ప్రశస్తముగాఁదోఁచలేదు.)

**ఉపత్యక** (సం.వి.ఆ.స్త్రీ.) : కొండచేరువ నేల.

**ఉపద** (సం.వి.ఆ.స్త్రీ.) : ఉపగ్రాహ్యము, కానుక.

**ఉపదంశము** (సం.వి.అ.పుం.) : 1. ఊరుఁగాయ; 2. కొఱుకురోగము.

**ఉపదర్శకుఁడు** (సం.వి.అ.పుం.) : తప్పు నడవక చూచుకొనువాఁడు.

**ఉపదానము** (సం.వి.అ.న.) : 1. అరణము; 2. కానుక.

**ఉపదిష్టము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఉపదేశింపఁబడినది.

**ఉపదేశము** (సం.వి.అ.పుం.) : హిత వచనము.

**ఉపదేశించే** (సం.స.క్రి.) : ఉపదేశము చేయు, పన్ను.

**ఉపదేష్ట** (సం.విణ.) : (ఋ.ఈ.ఋ.) ఉపదేశించువాఁడు, ఉపదేశకుఁడు.

**ఉపదేహిక** (సం.వి.ఆ.స్త్రీ.) : చెదపురుగు.

**ఉపద్రవము** (సం.వి.అ.పుం.) : విప్లవము, హోవడి.

**ఉపద్రష్ట** (సం.వి.ఋ.పుం.) : కార్యముల విచారించుకొనువాఁడు.

**ఉపధ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. ధర్మార్థ కామములచేత మంత్రిలోనగు వారి చిత్తమును పరీక్షించుట; 2. (వ్యాకరణమున) కడపటి యక్షరమునకు ముందటి యక్షరము.

**ఉపధర్మము** (సం.వి.అ.పుం.) : పాషండ ధర్మము.

**ఉపధానము** (సం.వి.అ.న.) : 1.తలగడ; 2. విషము; 3. స్నేహము.

**ఉపధావించే** (సం.అ.క్రి.) : ప్రధావించు, పాఱు.

**ఉపధి** (సం.వి.ఇ.పుం.) : 1. కపటము; 2. బండికల్లు.

**ఉపధూపితము** (సం.వి.అ.పుం.) : సమీపించిన యస్తమయము. (విణ.) : 1.చావు సమీపించినది; 2. పొగ వేయఁబడినది.

**ఉపనతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కదిసినది.

**ఉపనయనము** (సం.వి.అ.న.) : వడుగు, (రూ.) ఉపనయనము, ఉప నాయము.

**ఉపనాహము** (సం.వి.అ.పుం.) : 1. తంతిచుట్టెడు బిరడ; 2. పుంటిమీఁద పూసెడు మందు.

**ఉపనిధి** (సం.వి.ఇ.పుం.) : చెప్పక చూపక యుంచిన యిల్లడ, వాడిక.

**ఉపనిషత్తు** (సం.వి.ద్.స్త్రీ.) : 1. వేదాంతము; 2.ధర్మము; 3. ఏకాంతము.

**ఉపనిష్కరము** (సం.వి.అ.న.) : ఉక్కళము, (రూ.) ఉపనిష్కరము.

**ఉపనీతుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. వడుగైనవాఁడు; 2.సమీపమునకు తేఁబడినవాఁడు.

**ఉపన్యసించే** (సం.స.క్రి.) : 1. ఉనుచు; 2. ఉపన్యాసము చేయు.

**ఉపన్యాసము** (సం.వి.అ.పుం.) : ఏదేని యొకవిషయమునెత్తి విస్తరించి చెప్పుట.

**ఉపపతి** (సం.వి.ఇ.పుం.) : జారుఁడు, అంకుమగఁడు.

**ఉపపత్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. కలిమి; 2. అంతము; 3. అర్హత; 4. కారణము; 5. దృష్టాంతము; 6. పుట్టుక; 7. వృత్తాంతము.

**ఉపపన్నము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. ఉపపత్తికలది; 2. పుట్టినది.

**ఉపపాదకము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కలిగించునది.

**ఉపపాదనము** (సం.వి.అ.న.) : కలిగించుట.

**ఉపపాదితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కలిగింపఁబడినది.

**ఉపప్లవము** (సం.వి.అ.పుం.) : 1.ఉత్పాతము; 2. ఉపద్రవము; 3. రాహువు.

**ఉపబర్హము** (సం.వి.అ.పుం.) : ఉపధానము, తలగడ.

**ఉపబృంహణము** (సం.వి.అ.న.) : చక్కఁగా పెరుగుట, సంవృద్ధి.

**ఉపబృంహితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చక్కఁగా పెరిగినది, సంవర్ధితము.

**ఉపభుక్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అనుభవింపఁబడినది.

**ఉపభృత్తు** (సం.వి.త్.స్త్రీ.) : స్రుగ్భేదము.

**ఉపభోగము** (సం.వి.అ.పుం.) : అనుభవము.

**ఉపభోగ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అనుభవింపఁదగినది.

**ఉపమ** (ఉభ.వై.వి.) : ఉపాయము. 1. పోలిక; 2. పోల్పఁదగిన చంద్రాది. (విణ.) : ఉత్తర పదమైనచో సమానము.

**ఉపమరి** (వై.విణ.) : వెరవరి, ఉపాయశాలి.

**ఉపమాత** (సం.వి.ఋ.స్త్రీ.) : దాది. (విణ.) ఉపమానము చెప్పెడువాఁడు.

**ఉపమానము** (సం.వి.అ.న.) : 1. పోలిక; 2. పోల్పఁదగిన చంద్రాది.

**ఉపమించే** (సం.స.క్రి.) : పోల్చు.

**ఉపమితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఉపమింపఁబడినది, పోల్పఁబడినది.

**ఉపమితి** (సం.వి.ఇ.స్త్రీ.) :ఉపమానము, పోలిక.

**ఉపమేయము** (సం.వి.అ.న.) : పోలిక యందలి విషయము. (విణ.) : పోల్పఁ దగినది.

**ఉపయమము** (సం.వి.అ.పుం.) : ఉద్వాహము, పెండ్లి.

**ఉపయాచితకము** (సం.వి.అ.న.) : అభీష్టసిద్ధికై దేవతలకీఁబడు ద్రవ్యము, మ్రొక్కుబడి.

**ఉపయామము** (సం.వి.అ.పుం.) : ఉపయమము.

**ఉపయుక్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఒదవుబడియైనది.

**ఉపయోగము** (సం.వి.అ.పుం.) : ఒదవుబడి.

**ఉపయోగించు** (సం.అ.క్రి.) : ఒదవు.

**ఉపరంధ్రము** (సం.వి.అ.న.) : తొలకు.

**ఉపరక్తుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. రాహువుచే పట్టఁబడినవాఁడు; (చంద్రుఁడు లేక సూర్యుఁడు) 2. వ్యసనార్తుఁడు.

**ఉపరక్షణము** (సం.వి.అ.న.) : బెత్తముల వారు సందడి లేక తొలఁగించుట. శిబిరరక్షణము కొఱకు చుట్టుఁబెట్టిన వెలుగు లోనగునది. (అని కొందఱు.)

**ఉపరతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఉడిగినది.

**ఉపరతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. ఉడుకున; 2. పురుషాయితము.

**ఉపరథ్య** (సం.వి.ఆ.స్త్రీ.) : పసులు లోనగువాని రాకపోకలచేత నేర్పడిన ఊరి ముందటి దారి, పుంత.

**ఉపరాగము** (సం.వి.అ.పుం.) : 1. రాహువు సూర్యచంద్రులను బట్టుట; 2. అన్యాయము; 3. గ్రహకల్లోలము; 4. వ్యసనము.

**ఉపరామము** (సం.వి.అ.పుం.) : ఉడుకువ.

**ఉపరుద్ధము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అడ్డగింపఁబడినది.

**ఉపరోధము** (సం.వి.అ.పుం.) : అవరోధము, అడ్డగింత.

**ఉపరోధించు** (సం.స.క్రి.) : అవరోధించు, అడ్డగించు.

**ఉపల** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. కల్వాపు గుండు; 2. పొత్రము; 3. మొరపఱాయి (అ.పుం.ము.) : 1. ఱాయి; 2. రత్నము.

**ఉపలంభము** (సం.వి.అ.పుం.) : అనుభవము.

**ఉపలక్షణము** (సం.వి.అ.న.) : ఒకటి నుద్దేశించి చెప్పినది సామాన్య ధర్మముచే తదితర స్థలముల యందును ప్రవర్తించుట.

**ఉపలబ్ధము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1.పొందఁబడినది; 2. తెలియఁబడినది.

**ఉపలబ్ధి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. తెలివి; 2. పొందు.

**ఉపలాలనము** (సం.వి.అ.న.) : బుజ్జగము.

**ఉపలాలించే** (సం.స.క్రి.) : బుజ్జగించు.

**ఉపలాలితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) బుజ్జగింపఁబడినది.

**ఉపలింగము** (సం.వి.అ.న.) : ఉపద్రవము.

**ఉపలిప్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అలుకఁబడినది.

**ఉపలేపనము** (సం.వి.అ.న.) : గోముఖము, అలుకుట.

**ఉపవడము** (దే.వి.) : మేలుకొనుట, అవబోధము. (ఉప్పవడము యొక్క రూపాంతరము)

**ఉపవనము** (సం.వి.అ.న.) : ఆరామము, తోఁట.

**ఉపవర్తనము** (సం.వి.అ.న.) : దేశము, విలాతి.

**ఉపవసథము** (సం.వి.అ.పుం.) : గ్రామము, ఊరు.

**ఉపవసించు** (సం.అ.క్రి.) : భుజింపకుండు, పస్తుండు.

**ఉపవస్తము** (సం.వి.అ.పుం,న.) : ఉపవాసము.

**ఉపవాసము** (సం.వి.అ.పుం,న.) : పస్తు.

**ఉపవాహ్యము** (సం.వి.అ.పుం.) : రాజెక్కెడి యేనుఁగు, ఔపవాహ్యము.

**ఉపవిష** (సం.వి.ఆ.స్త్రీ.) : అతివస.

**ఉపనిష్టుఁడు** (సం. విణ.) : (అ. ఆ. అ.) కూర్చుండినవాఁడు.

**ఉపవీతము** (సం. వి. అ. న.) : ఎడమ భుజము మీఁదుగా కుడి పార్శ్వమున వ్రేలెడు జందెము.

**ఉపవేశము** (సం. వి. అ. పుం.) : ఆసన, కూర్చుండుట.

**ఉపశమము** (సం. వి. అ. పుం.) : 1. అడఁగుట; 2. ఓర్పు.

**ఉపశమించు** (సం. అ. క్రి.) : 1. అడఁగు; 2. ఓర్చు (రూ. ఉపశమిల్లు.)

**ఉపశయము** (సం. వి. అ. పుం.) : వల యొడ్డి యాచెంత తాను దాఁగి యుండుటకై త్రవ్విన పల్లము, మాటు.

**ఉపశల్యము** (సం. వి. అ. న.) : గ్రామము చేరువ నేల.

**ఉపశాంతి** (సం. వి. ఇ. స్త్రీ.) : 1. అడఁగుట; 2. ఓర్పు.

**ఉపశాయము** (సం. వి. అ. పుం.) : 1. కావలివారు వరుసక్రమమున పండుకొనుట; 2. వరుస.

**ఉపశోభితము** (సం. విణ.) : (అ. ఆ. అ.) ప్రకాశించినది.

**ఉపశ్రుతము** (సం. విణ.) : (అ. ఆ. అ.) సమ్మతింపఁబడినది, ఒడఁబడినది.

**ఉపశ్రుతి** (సం. వి. ఇ. స్త్రీ.) : 1. తమ భాషణ మప్పుడు డబ్బాటునఁ గలిగెడి శుభాశుభ సూచకమగు అన్య సంభాషణ శ్రవణము; 2. ఒడఁబాటు.

**ఉపసంపన్నము** (సం. విణ.) : (అ. ఆ. అ.) 1. యజ్ఞార్థము చంపఁబడినది; (పశ్వాది) 2. నీళ్ళు పోసి వండినది.

**ఉపసంవ్యానము** (సం. వి. అ. న.) : పరిధానము, దోవతి.

**ఉపసంహరించు** (సం. స. క్రి.) : 1. మరలించు; 2. సంహరించు.

**ఉపసంహారము** (సం. వి. అ. పుం.) : 1. మరలించుట; 2. సంహారము.

**ఉపసరము** (సం. వి. అ. పుం.) : (చూ.) ఉపచరము.

**ఉపసర్గము** (సం. వి. అ. పుం.) : 1. (క్రియా యోగమున) ప్రాది; 2. ఉత్పాతము; 3. ఒకానొక రోగము.

**ఉపసర్జనము** (సం. వి. అ. న.) : అప్రధానము.

**ఉపసర్పణము** (సం. వి. అ. న.) : ఆశ్రయము, ప్రాపు.

**ఉపస్పరించు** (సం. స. క్రి.) : ఆశ్రయించు, ప్రాపుగొను.

**ఉపసర్య** (సం. వి. ఆ. స్త్రీ.) : తొలిచూలావు.

**ఉపసూర్యకము** (సం. వి. అ. న.) : సూర్యపరివేషము.

**ఉపస్కరము** (సం. వి. అ. పుం.) : సంబారము.

**ఉపస్థానము** (సం. వి. అ. న.) : 1. చేరిక; 2. సేవ.

**ఉపస్థితము** (సం. విణ.) : (అ. ఆ. అ.) చేరినది.

**ఉపస్థితి** (సం. వి. ఇ. స్త్రీ.) : 1. చేరిక; 2. తోఁచుట.

**ఉపస్పర్శము** (సం. వి. అ. పుం.) : 1. ఆచమనము; 2. స్పర్శము; 3. స్నానము.

**ఉపహతము** (సం. విణ.) : (అ. ఆ. అ.) 1. ఉపద్రవము నొందినది; 2. నాశము నొందినది.

**ఉపహతి** (సం. వి. ఆ. స్త్రీ.) : 1. ఉపద్రవము; 2. నాశము.

**ఉపహారము** (సం. వి. అ. పుం.) : ఉపాయనము, కానుక.

**ఉపహితము** (సం. విణ.) : (అ. ఆ. అ.) ఉంచఁబడినది.

**ఉపహ్వరము** (సం. వి. అ. న.) : 1. ఏకాంతము; 2. సమీపము.

**ఉపాంగము** (సం. వి. అ. పుం.) : 1. సుతి పోసెడి తిత్తి; 2. మీమాంసాది (అవి ౪. మీమాంస, న్యాయశాస్త్రము, పురాణము, ధర్మశాస్త్రము)

**ఉపాంతము** (సం. వి. అ. పుం.) : 1. సమీపము; 2. మూల. (విణ.) : సమీపించినది.

**ఉపాంశు** (సం. అవ్య.) : ఏకాంతము. (వి. ఉ. పుం. వు.) జపభేదము.

**ఉపాకరణము** (సం. వి. ఆ. న.) : సంస్కారపూర్వకముగా వేదమును గ్రహించుట.

**ఉపాకర్మము** (సం.వి.న్.న.) : సంస్కార పూర్వకముగా వేదమును గ్రహించుట.

**ఉపాకృతము** (సం.వి.అ.పుం.) : యజ్ఞమునందు అభిమంత్రించి చంపఁబడిన పశువు. (విణ.) : కుదియింపఁ బడినది.

**ఉపాఖ్యానము** (సం.వి.అ.న.) : ఇతిహాసము.

**ఉపాగతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. పొందఁ బడినది; 2. వచ్చినది.

**ఉపాత్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. పొందఁ బడినది; 2. అపహరింప బడినది.

**ఉపాత్యయము** (సం.వి.అ.పుం.) : అతిక్రమణము, తుటారము.

**ఉపాదానము** (సం.వి.అ.న.) : 1. కారణము, 2. విషయముల వలన పాఱెడు ఇంద్రియము లను మరలించుట.

**ఉపాదేయము** (సం.విణ.) : (అ.ఆ.అ.) గ్రహింపఁదగినది.

**ఉపాధానము** (సం.వి.అ.న.) : 1. ఉంచుట; 2. ధరించుట; 3. కప్పుట.

**ఉపాధి** (సం.వి.ఇ.పుం.) : 1. ధర్మచింత; 2. కపటము; 3. కుటుంబమునందు మిక్కిలి యాస గలవాఁడు; 4. విశేషణము.

**ఉపాధ్యాయ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఉపాధ్యాయత్వము చేసెడు ఆఁడుది.

**ఉపాధ్యాయాని** (సం.వి.ఈ.స్త్రీ.) : ఉపాధ్యాయుని పెండ్లాము.

**ఉపాధ్యాయి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. ఉపాధ్యా యత్వము చేసెడి ఆఁడుది; 2. ఉపాధ్యాయుని పెండ్లాము.

**ఉపాధ్యాయుఁడు** (సం. వి. అ. పుం.) : 1. వేదమును చదివించువాఁడు; 2. చదువు చెప్పువాఁడు.

**ఉపానహము** (సం.వి.హ్, స్త్రీ.) : చెప్పులు.

**ఉపాయనము** (సం.వి.అ.న.) : ఉపహారము, కానుక.

**ఉపాయము** (సం.వి.అ.పుం.) : 1. వెరపు; 2. పొందు. (చతురుపాయములు : సామము, భేదము, దానము, దండము. మాయ, ఉపేక్ష, ఇంద్రజాలము. ఈ మూటిని గూడఁ జేర్చి సప్తోపాయము లని కొందఱు నీతికోవిదులు చెప్పుదురు. మరియు నాయకుఁడు నాయిక యొక్క కోపమును పోఁగొట్టునపుడు ఉపయో గించెడు ఉపాయములు ఆరు : సామము, భేదము, దానము, నతి, ఉపేక్ష, రసాంతరము)

**ఉపార్జనము** (సం.వి.అ.న.) : సంపాదనము, గడన.

**ఉపార్జించే** (సం.స.క్రి.) : సంపాదించు, గడించు.

**ఉపార్జితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) గడింపఁ బడినది.

**ఉపాలంభము** (సం.వి.అ.పుం.) : మర్మము దూఱి పాఱనాడుట.

**ఉపాలంభించు** (సం.స.క్రి.) : మర్మము దూఱి పాఱనాడు.

**ఉపాలబ్ధము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మర్మము దూఱి పాఱనాడఁబడినది.

**ఉపావృత్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పలు మాఱు నేలఁ బొర్లాడినది. (గుఱ్ఱము)

**ఉపాశ్రయము** (సం.వి.అ.పుం.) : 1. ప్రాపు; 2. ఆనిక.

**ఉపాశ్రితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఆశ్ర యింపఁబడినది.

**ఉపాసంగము** (సం.వి.అ.పుం.) : అమ్ములపొది.

**ఉపాసకుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) సేవకుఁడు.

**ఉపాసన** (సం.వి.ఆ.స్త్రీ.అ.న.) సేవ. (అ.న.ము.): 1. శరాభ్యాసము; 2. పీఁట.

**ఉపాసము** (వై.వి.) : ఉపవాసము.

**ఉపాసించు** (సం.స.క్రి.) : సేవించు, కొలుచు.

**ఉపాసిత** (సం.విణ.) : (ఋ.ఈ.ఋ.) ఉపాసించువాఁడు.

**ఉపాసితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఉపాసింపఁబడినవాఁడు, సేవితుఁడు.

**ఉపాసీనుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) సమీప మందుఁ గూర్చున్నవాఁడు.

**ఉపాస్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : ఉపాసనము, సేవ.

**ఉపాస్యుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఉపాసింపఁదగినవాఁడు, సేవ్యుఁడు.

**ఉపాహితము** (సం.వి.అ.పుం.) : తోఁకచిచ్చు. (విణ.) : ఆరోపితము.

**ఉపాహృతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. గ్రహింపఁబడినది; 2. పట్టుపడినది.

**ఉపేంద్రుఁడు** (సం.వి.అ.పుం.) : హరి, వెన్నుఁడు.

**ఉపేక్ష** (సం.వి.ఆ.స్త్రీ.) : అశ్రద్ధ, ఒప్పరికము.

**ఉపేక్షకుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఉపేక్షించువాఁడు, ఒప్పరికించువాఁడు.

**ఉపేక్షించు** (సం.స.క్రి.) : అశ్రద్ధ చేయు, ఒప్పరికించు.

**ఉపేక్షితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఉపేక్షింపఁబడినవాఁడు ఒప్పరికింపఁ బడినవాఁడు.

**ఉపేత** (సం.విణ.) : (ఋ.ఈ.ఋ.) 1. ఉపాయములు పన్నువాఁడు; 2. సమీపించువాఁడు.

**ఉపేతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కూడుకొన్నది.

**ఉపోదక** (సం.వి.ఆ.స్త్రీ.) : దుంప బచ్చలి. (రూ. ఉపోదకి. ఈ. స్త్రీ.)

**ఉపోద్ఘాతము** (సం.వి.అ.పుం.) : ఉదాహరణము.

**ఉపోషణము** (సం.వి.అ.న.) : ఉపవాసము, పస్తు.

**ఉపోషితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) పస్తున్నవాఁడు.

**ఉపోష్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పస్తుండఁదగినది.

**ఉప్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విత్తఁబడినది (నేల.)

**ఉప్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : విత్తుట, వెద.

**ఉప్పత** (దే.వి.) : ఓర్వలేనితనముచేత ఆడిపోసుకొనుట.

**ఉప్పతించే** (దే.స.క్రి.) : ఓర్వలేనితనముచేత ఆడిపోసికొను.

**ఉప్పతిల్లు** (వై.అ.క్రి.) : పుట్టు, ఉత్పత్తియగు.

**ఉప్పన** (దే.వి.) : ఒక రసము (చూ. రసము)

**ఉప్పనఁబట్టెలు** (దే.వి.బ.) : బాలక్రీడా విశేషము.

**ఉప్పర** (దే.వి.) : త్రవ్వియు గోడలు పెట్టియు బ్రదికెడు జాతి. (ఉప్పర వాఁడు, ఉప్పరది.)

**ఉప్పరము** (వై.వి.) : 1. ఆకాశము; 2. మీఁదు.

**ఉప్పరి** (దే.వి.) : ఉప్పరవాఁడు, ఖనకుఁడు.

**ఉప్పరించు** (దే.స.క్రి.) : మల్లయుద్ధ క్రియా విశేషము.

**ఉప్పరిగ** (వై.వి.) : మిద్దెమీఁది కట్టడము, మేడ.

**ఉప్పలవాయి** (దే.వి.) : బొట్టన జుట్టన వ్రేళ్లనడుము.

**ఉప్పలి** (దే.వి.) : కీడు, ఆపద.

**ఉప్పవడము** (దే.వి.) : (చూ.) ఉపవడము.

**ఉప్పళము** దే.వి. : (ఉప్పు + అళము) ఉప్పు పంట పెట్టెడు నేల. ఉప్పు రాసులుండెడు చోటు. (అని కొందఱు.)

**ఉప్పళించే** (దే.వి.) : ఉప్పరించు.

**ఉప్పి** (దే.వి.) : కుండలి. (ఇది ద్వివిధము : తెల్లయుప్పి, నల్లయుప్పి.)

**ఉప్పిడి** (దే.విణ.) : (ఉప్పు + ఇఁడి) ఉప్పు లేనిది, అలవణము.

**ఉప్పరింత** (దే.వి.) : జ్యోతిష్మతి.

**ఉప్ప** (దే.స.క్రి.) : ఆవిరిపోక యుడికించు. (చూ. ఆవించు) (వి.) : లవణము.

**ఉప్పుఁగండ** (ద్వ.వి.) : (ఉప్పు + కండ) ఉప్పు చమిరి యెండఁబెట్టిన మాంసఖండము.

**ఉప్పుఁగడలి** (దే.వి.) : (ఉప్పు + కడలి) లవణ సముద్రము.

**ఉప్పుఁగాయ** (దే.వి.) : (ఉప్పు + కాయ) ఊరుఁగాయ, ఉపదంశము.

**ఉప్పుఁగుందము** (దే.వి.) : (ఉప్పు + కుందము) బాలక్రీడా విశేషము.

**ఉప్పుఁజేప** (దే.వి.) : (ఉప్పు + చేఁప) ఉప్పుచమిరి యెండఁబెట్టిన మత్స్యము.

**ఉప్పుఁబట్టు** (దే.వి.) : (ఉప్పు + పట్టు) తనంతట ఉప్పు పండెడు నేల.

**ఉప్పుడు** (దే.వి.) : ఉప్పుట (ఉప్పుడు బియ్యము).

**ఉప్పవాము** (దే.వి.) : ఉప్పువంట పెట్టెడుచోటు.

**ఉప్పెన** (వై.వి.) : 1. సముద్రోల్బణము; 2. విజృంభణము.

**ఉప్పొంగు** (దే.అ.క్రి.) : (ఉబ్బి + పొంగు) 1. మిక్కిలి యుబుకు; 2. మిక్కిలి సంతోషించు; 3. విజృంభించు.

**ఉబలాటము**(దే.వి.) : జాలి. మిక్కిలి అభిలాషము. (అని కొందఱు.)

**ఉబుకు** (దే.అ.క్రి.) : పొంగు. (వి.) : పొంగుట.

**ఉబుసు** (దే.వి.) : 1. పనిలేని కాలము; 2. వృత్తాంతము.

**ఉబ్బ** (వై.వి.) : ఉక్క, ఊష్మము.

**ఉబ్బకము** (వై.వి.) : 1.ఆధిక్యము; 2. ఉత్సాహము.

**ఉబ్బతిల్లు** (వై.అ.క్రి.) : ఉబ్బు, పొంగు.

**ఉబ్బనీరు** (వై.వి.) : ఉమ్మనీరు.

**ఉబ్బరపోవు** (ద్వ.అ.క్రి.) : (ఉబ్బరము + పోవు) చేష్టలుడిగి యేమి తోఁచక అట్టె నిలుచు, నివ్వెఱపడు.

**ఉబ్బరము** (వై.వి.) : 1.కడుపుబ్బుట; 2. అతిశయము.

**ఉబ్బరించే** (వై.అ.క్రి.) : 1.కడుపుబ్బు; 2.అతిశయించు. (ఇక్కడ ఉబ్బరింపక అనఁగా మీఱక అని యర్థము.)

**ఉబ్బలి** (దే.వి.) : బురద. (చూ. ఉమ్మలి)

**ఉబ్బసము** (వై.వి.) : ఊర్ధ్వశ్వాసరోగము.

**ఉబ్బు** (వై.అ.క్రి.) : 1. ఉబ్బరించు; 2. పొంగు; 3. లేచు; 4. సంతోషించు; 5. స్థూలించు. (వి.) : సంతోషము.

**ఉభయము** (సం.స.ద్వి.) : 1. రెండవ యవములు గలది; 2. గుడి యుత్సవపుఁగట్టడ. (గుడి పారు పత్తెకాఁడును లోకులును జేరి చేయునుత్సవము గనుక దీనికి ఉభయమని పేరు కలిగెను.)

**ఉమ** (సం.వి.ఆ.స్త్రీ.) :1. పార్వతి; 2. నూనె యగిసె; 3. కాంతి; 4. పసుపు; 5. యశము.

**ఉమాదము** (వై.వి.) : ఉమ్మాదము యొక్క రూపాంతరము.

**ఉమాపతి** (సం.వి.ఇ.పుం.) : శివుఁడు, ముక్కంటి.

**ఉమి** (వై.వి.) : ఉమ్మియొక్క రూపాంతరము.

**ఉమియు** (వై.స.క్రి.) : (ఎంగిలి లోనగువాని) ఉమ్మివేయు, తూపొడుచు.

**ఉముక** (దే.వి.) : పొట్టు, తుషము.

**ఉమేజువారు** (హిం.వి.) : ఉద్యోగమునకై కనిపెట్టియుండు వాఁడు.

**ఉమ్మ** (వై.వి.) : ఉబ్బ, ఊష్మము.

**ఉమ్మగిల్లు** (వై.అ.క్రి.) : ఆవిరిచే నుడుకు.

**ఉమ్మడి** (దే.వి.) : పొత్తు. నిత్యపు గట్టడ.

**ఉమ్మదము** (వై.వి.) : ఉమ్మ, ఊష్మము.

**ఉమ్మనీరు** (వై.వి.) : ప్రసవజలము.

**ఉమ్మలము** (దేవ.ఇ. ) :1. దుఃఖము; 2. శోకము. (చూ. ఉమ్మలించు)

**ఉమ్మలి** (దే.వి.) : ఉబ్బలి.

**ఉమ్మలించు** (దే.అ.క్రి.) : 1. దుఃఖించు; 2. శోకించు.

**ఉమ్మలిక** (దే.వి.) : 1. దుఃఖము; 2. శోకము.

**ఉమ్మలికించే** (దే.అ.క్రి.) : 1.దుఃఖించు; 2. శోకించు.

**ఉమ్మాదము** (వై.వి.) : చిత్రవిభ్రమము (చూ.) ఉన్మాదము.

**ఉమ్మాయముత్తియము** (ద్వ.వి.) : క్షుద్రమౌక్తికము.

**ఉమ్మి** (వై.వి.) : ఉమిసెడు ఎంగిలి, ఊర్మి.

**ఉమ్మెత** (వై.వి.) : ఉమ్మెత్త యొక్క రూపాంతరము.

**ఉమ్మెత్త** (వై.వి.) : ఉన్మత్తము.

**ఉమ్మ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఉమలు పండునది (పొలము)

**ఉయాల** (ద్వ.వి.) : 1. ఉయాల (ద్వ. వి.) : ఉయ్యాల. 2. ఉయేల (ద్వ.వి.) : ఉయ్యాల. 3. ఉయ్యల (ద్వ.వి.) : ఉయ్యాల. బిడ్డలను పండఁబెట్టి ఊఁచెడు డోల.

**ఉయ్యాలతొట్టి** (ద్వ.వి.) : తొట్ల.

**ఉయ్యాలపులుఁగు** (ద్వ.వి.) : సారస పక్షి. (రూ.) ఉయ్యాలచేఱుఁ బులుఁగు.

**ఉయ్యాలమంచము** (ద్వ.వి.) : డోలా మంచము. (ఉయ్యేల మంచమని పాఠాంతరము.)

**ఉయ్యెల** (ద్వ.వి.) : ఉయ్యాల. (ఊయేల యొక్క రూపాంతరము.)

**ఉయ్యేల** (దే.వి.) : ఉయ్యాల. (ఊయేల యొక్క రూపాంతరము.)

**ఉరక** (దే.అవ్య.) : ఊరక.

**ఉరగము** (సం.వి.అ.పుం.) : సర్పము, పాము.

**ఉరడించే** (దే.అ.క్రి.) : ఉరవడించు యొక్క రూపాంతరము. (రూ. ఉరణించు.)

**ఉరణము** (సం.వి.అ.పుం.) : మేషము, పొట్టేలు.

**ఉరణాక్షము** (సం.వి.అ.పుం.) : తగిరిస.

**ఉరణాఖ్యము** (సం.వి.అ.పుం.) : తగిరిస.

**ఉరభ్రము** (సం.వి.అ.పుం.) : ఉరణము, పొట్టేలు.

**ఉరమరిక** (దే.వి.) : రమారమి.

**ఉరము** (సం.వి.స్.న.) : ఱొమ్ము. (విణ.) : శ్రేష్ఠము.

**ఉరరీకృతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అంగీకరింపఁబడినది, ఇయ్యకొనఁబడినది.

**ఉరరీకృతి** (సం.వి.ఇ.స్త్రీ.) : అంగీకారము, ఇయ్యకోలు.

**ఉరలఁబడు** (ద్వ.అ.క్రి.) : (ఉరలన్ + పడు) దొర్లు. (స్వార్థమున పడు) (చూ. ఉర్లఁబడు)

**ఉరలఁబాఱు** (దే.అ.క్రి.) : (ఉరలన్ + పాఱు.) చలించు. (చూ. పాఱు.)

**ఉరలు** (దే.అ.క్రి.) : 1. దొర్లు; 2. కాఱు; 3. రాలు; 4. వీడు.

**ఉరలుకొను** (దే.అ.క్రి.) : వీడు. (స్వార్థమునకొను)

**ఉరవడి** (ద్వ.వి.) : (ఉరవు + వడి) అతివేగము.

**ఉరవడించే** (ద్వ.అ.క్రి.) : 1. ఉరవడిగొను; 2. వేగిరపడు.

**ఉరవు** (వై.వి.) : ఔచిత్యము, ఉచితము.

**ఉరశ్ఛదము** (సం.వి.అ.పుం.) : కవచము, బొందలము.

**ఉరసిలుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) విశాలమైన ఱొమ్ముగలవాఁడు. శత్రువులకు ఱొమ్మిచ్చి తన బలమును రక్షించుకొనువాఁడు. (అని కొందఱు.)

**ఉరసుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) విశాలమైన ఱొమ్ముగల వాఁడు. శత్రువులకు ఱొమ్మిచ్చి తన బలమును రక్షించుకొనువాఁడు. (అని కొందఱు.)

**ఉరస్త్రాణము** (సం.వి.అ.న.) : ఉరశ్ఛదము, బొందలము.

**ఉరస్యుఁడు** (సం.వి.అ.పుం.) : ధర్మపత్నియందుఁ దనకుఁ బుట్టిన కొడుకు.

**ఉరస్వంతుఁడు** (సం.విణ.) : (త్.ఈ.త్) ఉరసిలుఁడు.

**ఉరసూత్రిక** (సం.వి.ఆ.స్త్రీ.) : ఱొమ్మున వ్రేలెడు ముత్యాల హారము.

**ఉరళించే** (దే.అ.క్రి.) : వెలుఁగు, ప్రకాశించు.

**ఉరి** (దే.వి.) : ఉచ్చు, వాగుర. (దీని భేదము కాలురి)

**ఉరిగోల** (దే.వి.) : (ఉరి+కోల) ఉడుము లోనగు వానిఁ బట్టుటకై చివరనురిఁ బెట్టి కట్టిన కోల.

**ఉరిడె** (దే.వి.) : కుమ్మరపురుగు.

**ఉరియాట** (దే.వి.) : 1.ఉరియాడుట, ఊఁగు లాట; 2. సందేహము.

**ఉరియాడు** (దే.అ.క్రి.) : (ఉరిసి + ఆడు) 1. ఊఁగు లాడు; 2. చలించు.

**ఉరియు** (దే.అ.క్రి.) : 1. చలించు; 2. నెరయు; 3. పక్వమగు; 4. పరితపించు.

**ఉరివోయు** (దే.స.క్రి.) : (ఉరి + పోయు) ఉరిదీయు.

**ఉరీకృతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఉరరీకృతము.

**ఉరు** (వై.అ.క్రి.) : 1. శ్రేష్ఠమగు; 2. తగు.

**ఉరుజే** (దే.వి.) : మత్స్యవిశేషము.

**ఉరుబూకము** (సం.వి.అ.పుం.) : ఆముదపుఁ జెట్టు.

**ఉరుము** (దే.వి.) : చర్మవాద్య విశేషము.

**ఉరుముంజి** (దే.వి.) : దేశవిశేషము.

**ఉరుముడు** (దే.వి.) : వృక్ష విశేషము.

**ఉరువడు** (ద్వ.అ.క్రి.) : (ఉరువు+పడు) నెఱవేరు.

**ఉరువిడి** (ద్వ.వి.) : (ఉరువు+విడి) వస్తు సమూహము.

**ఉరువు** (ఉభ.దే.స.క్రి.) : పరిహరించు. (విణ. ఉ.) : విరివియైనది.

**ఉరోజము** (సం.వి.అ.పుం.) : కుచము.

**ఉర్లఁబడు** (ద్వ.అ.క్రి.) : ఉరలఁబడు (స్వార్థమున పడు)

**ఉర్లు** (దే.అ.క్రి.) : ఉరలు యొక్క రూపాంతరము.

**ఉర్వర** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. ఎల్లపైరులచే నిండిన నేల; 2. నేల.

**ఉర్వారువు** (సం.వి.ఉ.స్త్రీ.) : దోస.

**ఉర్వి** (సం.వి.ఈ.స్త్రీ.) : భూమి, నేల.

**ఉఱవు** (వై.వి.) : ఔచిత్యము. (విణ.) : 1. అధికము; 2. ఉచితము.

**ఉఱిది** (దే.వి.) : దార్ఢ్యము. (విణ.) : 1. దృఢము; 2. స్థిరము.

**ఉఱియ** (దే.విణ.) : దిట్టతనము గలవాఁడు, ధృష్టుఁడు.

**ఉఱియు** (దే.అ.క్రి.) : ఇల్లులోనగువాని పైకప్పుచెడి యా ద్వారమున నీళ్లుపడు.

**ఉఱు** (యు.వై.అ.క్రి.) : 1. శ్రేష్ఠమగు; 2. తగు.

**ఉఱుద్రాళ్ళు** (దే.వి.బ.) : (ఉఱ్ఱు+త్రాళ్ళు) ఉఱ్ఱుఁ ద్రాళ్ళు, పాలు పిదుకునప్పుడు ఆవు కాళ్ళు గట్టు త్రాళ్లు. (ఉఱ్ఱుఁ ద్రాళ్లు యొక్క రూపాంతరము.)

**ఉఱుకు** (దే.అ.క్రి.) : 1. దాఁటు; 2. దుముకు.

**ఉఱుకుడుఁగప్ప** (దే.వి.) : (ఉఱుకుడు + కప్ప) ఒక దినుసుకప్ప.

**ఉఱుకుడుబొడ్డు** (దే.వి.) : రోగముచేఁ బెరిగిన బొడ్డు, తుండి.

**ఉఱుగొట్టు** (దే.అ.క్రి.) : (ఉఱ్ఱు + కొట్టు) కోఁతి ఉఱ్ఱుమను.

**ఉఱుత** (దే.వి.) : ఉడుత, చిక్రోడము.

**ఉఱుపు** (దే.వి.) : ఉఱియుట.

**ఉఱుము** (దే.అ.క్రి.) : గర్జించు. (వి.) : 1.గర్జనము; 2.వీరహుంకారము; 3.ఉడుము.

**ఉఱువు** (దే.వి.) : ఉఱుగొట్టుట.

**ఉఱ్ఱటలూఁగు** (దే.అ.క్రి.) : (ఊఁగు + ఊఁగు) 1. మిక్కిలి యూఁగు; (ప్రే. ఉఱ్ఱటలూఁచు.) 2. చలించు.

**ఉఱ్ఱట్లూఁగు** (దే.అ.క్రి.) : ఉఱ్ఱటలూఁగు యొక్క రూపాంతరము. (చలించుటకు.)

**ఉఱ్ఱు** (దే.వి.) : కోఁతియొక్క వికృత ధ్వని.

**ఉఱ్ఱుద్రాళ్లు** (దే.వి.బ.) : ఉఱుఁ ద్రాళ్లు.

**ఉఱ్ఱుకట్టు** (దే.స.క్రి.) : పాలుపిండునపుడు ఆవుకాళ్లను కట్టు.

**ఉఱ్ఱూతలూఁగు** (దే.అ.క్రి.) : (ఊఁగు + ఊఁగు) 1. మిక్కిలి యూఁగు; 2. చలించు.

**ఉలంగవము** (సం.వి.అ.పుం.) : పెద్ద నల్లచీమ, కంద్ర.

**ఉలక** (దే.విణ.) : చులుక, లఘువు.

**ఉలకన** (దే.వి.) : చులుకన, లాఘవము.

**ఉలగరము** (దే.వి.) : ఉలవరమునకు మొదటి రూపము.

**ఉలపము** (సం.వి.అ.పుం,న.) : ఒకటితో నొకటి పెనఁగొన్న ద్రాక్షలోనగునది. (పుం.) : దర్భ విశేషము.

**ఉలవ** (దే.వి.) : సస్యవిశేషము. (బ.) : ధాన్య విశేషము.

**ఉలవరము** (దే.వి.) : ఉలవరించుట.

**ఉలవరించు** (దే.అ.క్రి.) : తడిచేత నేలయుబుకు.

**ఉసల** (దే.వి.) : తృణవిశేషము.

**ఉలి**(దే.వి.) : వడ్లంగి సాధన విశేషము, వృక్షా దనము. (విణ.) : అల్పము. (ఇది నులి యొక్క రూపాంతరము.)

**ఉలింద** (దే.వి.) : వృక్షవిశేషము.

**ఉలికిపడు** (ద్వ.అ.క్రి.) : ఆకస్మికముగాఁ గలిగిన భయాదులచేఁ గంపించు.

**ఉలికిపాటు** (ద్వ.వి.) : ఉలికిపడుట.

**ఉలిపి** (దే.విణ.) : తులువ, దుర్మార్గుడు.

**ఉలిపిగొట్టు** (దే.విణ.) : తులువ, దుర్మార్గుడు.

**ఉలిమిడి** (దే.వి.) : వరుణము.

**ఉలిమిరి** (దే.వి.) : ఉలిమిడి యొుక్క రూపాంతరము.

**ఉలివ్రాను** (దే.వి.) : ఖదిరము.

**ఉలియు** (దే.అ.క్రి.) : 1. చలించు; 2. మ్రోయు.

**ఉలివాఁడు** (దే.అ.క్రి.) : (ఉలివు+ఆడు) చలించు.

**ఉలివు** (దే.వి.) : 1. మ్రోఁత; 2. చలనము. (చూ. ఉలివాడు)

**ఉలుకు** (దే.అ.క్రి.) : భయపడు. (వి.) : భయము.

**ఉలుక్కు** (దే.వి.) : అశ్వగతి విశేషము.

**ఉలుచ** (వై.వి.) : మిక్కిలి చాపల్యము గల మత్స్యము.

**ఉలుచు** (దే.స.క్రి.) : ఊడఁదీయు.

**ఉలుప** (వై.వి.) : 1.కానుక; (రూ. ఉలుపా. చూ.అచ్చికకడ.) 2. పలుచగా నూతిన పుల్ల ఊరుఁబిండి.

**ఉలుపఁడు** (దే.విణ.) : (ఉలుపు + అఁడు) శోఫరోగము గల వాఁడు.

**ఉలుపి** (దే.విణ.) : (ఉలుపు+ఇ) ఉలుపఁడు.

**ఉలుపు** (దే.స.క్రి.) : ఉలుచు. (వి.) : శోఫ రోగము.

**ఉలుము** (దే.వి.): కుష్ఠము. (పులుము యొక్క రూపాంతరము)

**ఉలూకము** (సం.వి.అ.పుం.) : గుడ్లగూబ.

**ఉలూకుఁడు** (సం.వి.అ.పుం.) : 1. ఇంద్రుఁడు; 2. భరతవంశమందలి యొకానొక యోధుడు.

**ఉలూఖలకము** (సం.వి.అ.న.) : గుగ్గి లపుఁ జెట్టు.

**ఉలూఖలము** (సం.వి.అ.న.) : ఉదూఖలము, ఱోలు.

**ఉలూపి** (సం.వి.న్.పుం.) : ఉలుచమీను. (ఈ.స్త్రీ.) ఒక నాగకన్యక.

**ఉల్క** (సం.వి.ఆ.స్త్రీ.) : మంటలేని కట్టె నిప్పు. భస్మము. (అని కొందఱు.)

**ఉల్టా** (హిం.వి.) : లోతట్టు, అడుగుతట్టు.

**ఉల్బణము** (సం. వి. అ. న.) : 1. పొంగు; 2. అతిశయము. (విణ.) : 1. అతిశయించినది; 2. స్పష్టమైనది.

**ఉల్బము** (సం.వి.అ.న.) : గర్భపిండము. మావి. (అని కొందఱు.)

**ఉల్ముకము** (సం.వి.అ.న.) : అలాతము, కొఱవి.

**ఉల్లంకి** (దే.వి.) : పక్షివిశేషము.

**ఉల్లంగి** (దే.వి.) : ఒకానొక చెట్టు.

**ఉల్లంఘనము** (సం.వి.అ.న.) : అతిక్రమణము.

**ఉల్లంఘించు** (సం.స.క్రి.) : అతిక్రమించు, తుటారించు.

**ఉల్లంఘితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అతిక్రమింపఁబడినది.

**ఉల్లంఘ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అతిక్రమింపఁదగినది.

**ఉల్లకుట్టు** (దే.వి.) : (ఉల్లము + కుట్టు) (చూ.) ఉత్ర్పాసము.

**ఉల్లడ** (వై.వి.) : పందిరిలోనగువాని లోపల మీఁదఁగట్టెడు మేలుకట్టు, ఉల్లాభము.

**ఉల్లము** (దే.వి.) : ఎద, హృదయము.

**ఉల్లఱము** (దే.విణ.) : (ఉల్లము + అఱు) మనస్సునకు సహింపఁ గూడనిది.

**ఉల్లల** (దే.వి.) : ఉడుకుట యందగు ధ్వన్య నుకరణము.

**ఉల్లలము** (సం.వి.అ.పుం.) : చలనము, కదలిక.

**ఉల్లలితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కదలినది.

**ఉల్లసమాడు** (దే.స.క్రి.) : (ఉల్లసము + ఆడు) : 1.మర్మము దూఱి పాఱఁబరిహసించు; 2.ఉపాలంభించు.

**ఉల్లసము** (ఉభ.దే.వి.) : 1. (చూ.) ఉత్ర్పాసము; 2. సంతోషము; 3. ప్రకాశము.

**ఉల్లసితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ప్రకాశితము.

**ఉల్లసిల్లు** (సం.అ.క్రి.) : 1. సంతోషించు; 2. ప్రకాశించు; 3. వికసించు.

**ఉల్లాకు** (దే.వి.) : (ఉలి+ఆకు) చీటి, ఖండపత్రిక.

**ఉల్లాకుఁజేప** (దే.వి.) : (ఉల్లాకు+చేప) మత్స్య విశేషము.

**ఉల్లాఘుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) రోగము దీఱిన వాఁడు, నిరామయుఁడు.

**ఉల్లాపము** (సం.వి.అ.పుం.) : శోక భీత్యాదుల చేతగలిగిన ధ్వని వికార ముతోఁ జెప్పఁబడిన మాట.

**ఉల్లాభము** (సం.వి.అ.పుం.) : వితానము, మేలుకట్టు.

**ఉల్లాము** (దే.వి.) : పక్షివిశేషము.

**ఉల్లారు** (దే.వి.) : గుఱ్ఱపు పల్లముమీఁది పఱపు.

**ఉల్లాసము** (సం.వి.అ.పుం.) : 1. సంతోషము; 2. ప్రకాశము.

**ఉల్లి** (దే.వి.) : 1. వెల్లుల్లి; 2. నీరుల్లి.

**ఉల్లికుచ్చేదము** (దే.వి.) : మత్స్యవిశేషము.

**ఉల్లిపాషాణము** (మి.వి.) : సౌవీరము.

**ఉల్లుంఠనము** (సం.వి.అ.న.) : ఉపాలంభము.

**ఉల్లూనము** (సం.వి.అ.పుం.) : ఒక దినుసు దర్భ, ఉలపము.

**ఉల్లేఖము** (సం.వి.అ.పుం.) : 1. ఒక యర్థాలంకారము; (చూ. అలంకారము) 2.ఉచ్చారణము.

**ఉల్లోచము** (సం.వి.అ.పుం.) : ఉల్లాభము, మేలుకట్టు.

**ఉల్లోలము** (సం.వి.అ.పుం.) : పెద్దయల, కడలు.

**ఉవిద** (వై.వి.) : ఆఁడుది, ఇంతి, మగువ.

**ఉవ్వ** (దే.వి.) : వృక్షవిశేషము.

**ఉవ్వపిట్ట** (ద్వ.వి.) : పక్షి విశేషము, గోలత్తిక.

**ఉవ్వలపోటి** (దే.వి.) : బాలక్రీడా విశేషము.

**ఉవ్వాయి** (దే.వి.) : వికాసము.

**ఉవ్విళులూరు** (దే.అ.క్రి.) : (ఉవ్విళులు + ఊరు) త్వరపడు.

**ఉవ్విళ్లుగొను** (దే.అ.క్రి.) : (ఉవ్విళ్లు+కొను) త్వరపడు.

**ఉవ్వు** (దే.వి.) : పూనిక. (ఇది యింకను విచార్యము.)

**ఉవ్వెత్తు** (వై.అవ్య.) : అడుగుతో, నిశ్శేషముగా.

**ఉశతి** (సం.విణ.) : (త్.ఈ.త్.) అశుభమైనది. (వాక్కు.) (రూ. ఉషతి)

**ఉశనుఁడు** (సం.వి.స్.పుం.) : భార్గవుఁడు, శుక్రుఁడు.

**ఉశీరము** (సం.వి.అ.పుం,న.) : నలదము, వట్టివేరు.

**ఉష** (సం.వి. ఆ.స్త్రీ.) : 1. బాణుని కూఁతురు; 2. చేఁదు గల సొర; 3. రేయి. (అ. పుం.) : గుగ్గిలపు చెట్టు.

**ఉషణ** (సం.వి.ఆ.స్త్రీ.) : పిప్పలి. (అ.న.ము.) 1. మిరియము; 2. సొంటి.

**ఉషర్బుధుఁడు** (సం.వి.అ.పుం.) : వైశ్వానరుఁడు, అగ్ని.

**ఉషస్సు** (సం.వి.స్.న.) : తెల్లవాఱుటకు ముందు నాలుగు గడియల కాలము. ఐదు గడియల కాలము. (అని కొందఱు.)

**ఉషాపతి** (సం.వి.ఇ.పుం.) : అనిరుద్ధుఁడు.

**ఉషితము** (సం.వి.అ.న.) : చలిది. (విణ.) : కాల్పఁబడినది.

**ఉష్ట్రము** (సం.వి.అ.పుం.) : క్రమేలకము, ఒంటె.

**ఉష్ట్రిక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. ఆఁడు ఒంటె; 2. ఒక దినుసుకుండ.

**ఉష్ణకము** (సం.వి.ఆ.స్త్రీ.) : వేసంగి కాలము.

**ఉష్ణకుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. చొరవ కలవాఁడు; 2. వ్యాధిగ్రస్తుఁడు.

**ఉష్ణము** (సం.వి.అ.పుం.) : 1.ఎండ; 2.వేసంగి కాలము. (విణ.) : 1.వేఁడియైనది; 2.నేర్పు గలది.

**ఉష్ణరశ్మి** (సం.వి.ఇ.పుం.) : సూర్యుఁడు, వేఁడి వెలుఁగు.

**ఉష్ణవారణము** (సం.వి.అ.న.) : ఆతపత్రము, గొడుఁగు.

**ఉష్ణిక** (సం.వి.ఆ.స్త్రీ.) : యవాగువు, కాఁపుడు గంజి.

**ఉష్ణీషము** (సం.వి.అ.న.) : 1.తలపాగ; 2. కిరీటము; 3. తల.

**ఉష్ణోపగమము** (సం.వి.అ.పుం.) : వేసంగి కాలము.

**ఉసి** (దే.వి.) : 1. (కుక్క) కవియుట; 2. పొడి. (ఈ యర్థముననిది నుసి యొక్క రూపాంతరము.)

**ఉసికొను** (దే.అ.క్రి.) : (కుక్క) కవియు. (ప్రే. ఉసికొలుపు.)

**ఉసిరిక** (దే.వి.) : ఆమలకి. (దీని భేదము నేలయుసిరిక)

**ఉసుక** (దే.వి.) : ఇసుక.

**ఉసుము** (దే.అ.క్రి.) : 1. ఉదుకు; 2. తుడుచు.

**ఉసురసురు** (దే.వి.) : ఉస్సురస్సు యొక్క రూపాంతరము.

**ఉసురు** (దే.వి.) : ఉస్సురు యొక్క రూపాంతరము.

**ఉసులు** (వై.వి.) : ప్రాణము.

**ఉసులు** (దే.వి.) : సౌఖ్యము. (విణ.) : సుఖము.

**ఉసుళ్లు** (దే.వి.బ.) : ఇసుళ్లు.

**ఉసూరు** (దే.వి.) : ఉస్సురు యొక్క రూపాంతరము.

**ఉస్ర** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. ఆవు; 2. ఎలుక జీడి. (అ.పుం.ము.) : 1. ఎద్దు; 2. కిరణము.

**ఉస్సు** (దే.వి.) : ఉస్సురు.

**ఉస్సురస్సురు** (దే.వి.) : (ఉస్సురు + అస్సురు) తాపమునందగు ధ్వన్య నుకరణము.

**ఉస్సురు** (దే.వి.) : తాపము నందగు ధ్వన్యనుకరణము.

**ఉహూహూ** (దే.వి.) : (ఉహూ + ఉహూ) శీతబాధ యందగు ధ్వన్యనుకరణము.

**ఉహ్హ్వా** (దే.వి.) : అగ్నినూందుట యందగు ధ్వన్యనుకరణము.

## ఊ

**ఊ** : ఒక యక్షరము.

**ఊ** (వై.అవ్య.) : ప్రశ్నమును తెలిపెడిని. (కథలు మొదలైనవి వినునప్పుడు ఊం ఊం అని విందురు.)

**ఊంక** (దే.వి.) : 1. ఊంగులాట; 2. ఉముక.

**ఊంకర** (వై.వి.) : ఊంకొట్టుట.

**ఊంకించే** (దే.అ.క్రి.) : పూను. (నిర్బంధపు చోట దీనికి ప్రయోగము చిక్క లేదు.) (ఉంకించు దీని రూపాంతరము.)

**ఊంకు** (దే.అ.క్రి.) : పూను.

**ఊంకువ** (దే.వి.) : పూనిక.

**ఊంకువగు** (దే.అ.క్రి.) : (ఊంకువ+అగు) పూను.

**ఊంకొట్టు** (ద్వ.న.క్రి.) : ఊం ఊం అని వృత్తాంతమువిను.

**ఊంకొను** (ద్వ.స.క్రి.) : ఊంకొట్టు.

**ఊంగాడు** (దే.అ.క్రి.) : (ఊంగి+ఆడు) ఊంగులాడు.

**ఊంగు** (దే.అ.క్రి.) : ఊంగాడు, ఆందోళించు.

**ఊంగులాట** (దే.వి.) : ఊంగులాడుట, ఆందోళనము.

**ఊంగులాడు** (దే.అ.క్రి.) : (ఊంగులు + ఆడు) ఊంగాడు.

**ఊంచే** (దే.వి.) : 1. జొన్నలోనగువాని కంకికాంద; 2. అరంటి బొందె; 3. ముండ్లదుబ్బు.

**ఊంచేపడు** (ద్వ.అ.క్రి.) : 1. ఊంచపట్టు; 2. కృశించు.

**ఊంచేపోవు** (దే.అ.క్రి.) : కృశించు.

**ఊంచేబియ్యము** (దే.వి.) : చక్కంగా ముదురని జొన్న లోనగువాని ధాన్యము.

**ఊంచేముట్టు** (దే.క్రి.విణ.) : నిశ్శేషము.

**ఊంచే** (దే.ప్రే.) : ఊంగంజేయు.

**ఊంటు** (దే.స.క్రి.) : దూంటు, పొడుచు.

**ఊంత** (దే.వి.) : 1. అవలంబము; 2. పైక్రిందులు బయలుగా విడిచి యడుగు నుండి మీందికి వాటముగా గంపవలె చువ్వలతో నల్లిన మత్స్య గ్రహణ సాధన విశేషము.

**ఊంతకొను** (దే.స.క్రి.) : ఊందు, అవలంబించు.

**ఊంతకోల** (ద్వ.వి.) : ఊనుకొనెడు కఱ్ఱ.

**ఊంతము** (దే.వి.) : పట్టు, అవలంబము.

**ఊంద** (దే.వి.) : 1. వాంపు; 2. ఈర్ష్య.

**ఊందబొడ్డు** (దే.వి.) : ఉఱుకుబొడ్డు (చూ. తెఱ్ఱ).

**ఊఁదర** (దే.వి.) : (కాయలు పండుటకును ఎలుకలులోనగునవి చచ్చుటకును వేసెదు) పొగ.

**ఊఁదరపెట్టు** (దే.స.క్రి.) : (పొగ వేసి జంతువులను) తపింపఁజేయు

**ఊఁదు** (దే.అ.క్రి.) : వాఁచు. (స.క్రి.) : 1. శంఖములోనగువాని నూఁదు; 2. నిప్పు మొదలగువాని నూఁదు; 3.పట్టు; 4.ఉంచు; 5. అదుము; 6. నొక్కు; 7. చేపలను ఊఁతతోఁ బట్టు; (వి.) 1. చేఁపలను పట్టెడియూఁత; 2. వాఁపు.

**ఊఁదుగ్రోవి** (దే.వి.) : (ఊఁదు + క్రోవి) అగసాలెవాఁడు కుంపటి యూఁదెడు గొట్టము.

**ఊఁదువత్తి** (ద్వ.వి.) : సాంబ్రాణి వత్తి, వర్తిధూపము.

**ఊఁదువెండి** (దే.వి.) : శుద్ధమైన వెండి.

**ఊఁపు** (దే.ప్రే.) : ఊఁగఁజేయు. (వి.) : ఊఁచుట.

**ఊఁపురము** (దే.వి.) : మూఁపురము. (ఇట్లు అజాదిగా కొన్ని పుస్తకములందు వ్రాయఁబడి యున్నది. దీనికిఁ బ్రయో గము చిక్కినదికాదు.)

**ఊకనబొడ్డు** (దే.వి.) : ఒకానొక మందాకుచెట్టు.

**ఊచు** (దే.అ.క్రి.) : (వ్యాధిచేత తల వెండ్రుకలు) రాలు.

**ఊట** (దే.వి.) : 1.ఊరెడునీరు; 2. ఊరగాయ రసము; 3.మూలగ; 4. చేవ.

**ఊటకల్లు** (దే.వి.) : ధాన్యవిశేషము. (అప్ర.)

**ఊటబుడ్డిచెక్క** (దే.వి.) : కట్టడమునకుఁ దగిన యొక దినుసు మ్రాను.

**ఊటాడు** (దే.అ.క్రి.) : (ఊట + ఆడు) 1. చలించు; 2. సంభ్రమించు.

**ఊటి** (దే.వి.) : అడవియందలి యొకానొక వృక్షము.

**ఊటించు** (దే.స.క్రి.) : వంచించు.

**ఊటు** (దే.వి.) : వానచినుకులచేత కలిగిన చెమ్మ.

**ఊడ** (దే.వి.) : మఱ్ఱిలోనగువాని కొమ్మ నుండి క్రిందికి దిగెడు వేరు, అవరోహము.

**ఊడనిఁబాడు** (దే.అ.క్రి.) : 1. తొలగు; 2. పాఱు.

**ఊడి** (దే.వి.) : ఒక దినుసుకూరాకు.

**ఊడిగము** (దే.వి.) : ఊడిగము, పరిచర్య, సేవ.

**ఊడిగీఁడు** (దే.వి.) : (ఊడిగము + ఈఁడు) పరిచారకుఁడు.

**ఊడిత** (దే.వి.) : (సాలెవాఁడు పడుగు చేయునపుడు అది వ్రాలకుండఁ గ్రింద నూఁతగా నిలువున నిలిపెడు) కొయ్య.

**ఊడియము** (దే.వి.) : ఊడిగము.

**ఊడు** (దే.అ.క్రి.) : 1. రాలు; 2. వదలు; 3. జాఱు; 4. కాఱు; 5. తెగు; 6. పాఱు.

**ఊడుకొను** (దే.అ.క్రి.) : గ్రుచ్చుకొను. (చూ. ఊడుకడపట.)

**ఊడుగు** (దే.వి.) : అంకోలము.

**ఊడుచు** (దే. స. క్రి.) : 1. చిమ్ము, సమ్మార్జించు; 2. నాఱునాటు. (ప్రే. ఊడఁ జేయు) (రూ. ఊడ్చు.)

**ఊడుపు** (దే.వి.) : 1.ఊడ్చుట; 2. నాఱునాటుట.

**ఊడెము** (దే.వి.) : ఊడియము యొక్క రూపాంతరము.

**ఊఢ** (సం.వి.ఆ.స్త్రీ.) : పెండ్లాము. (విణ.) : పెండ్లాడినది.

**ఊతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కుట్టఁబడినది. (వస్త్రాది)

**ఊతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. కుట్టు; 2. రక్షణము.

**ఊదర** (వై.వి.) : తృణ విశేషము (బ.) : ధాన్య విశేషము.

**ఊదా** (హిం.వి.) : వర్ణవిశేషము.

**ఊధము** (సం.వి.స్.న.) : (ఆవు మొదలగువాని) పాలపొదుఁగు.

**ఊధస్యము** (సం.వి.అ.న.) : క్షీరము, పాలు.

**ఊనము** (సం.విణ.) : (అ.ఆ.అ.) తక్కువైనది.

**ఊనిక** (దే.వి.) : 1. ఆనిక; 2. దిటవు.

**ఊను** (దే.స.క్రి.) : 1. అవలంబించు; 2. పొందు; 3. వహించు; 4. (తోలును) మెత్తపరచు.

**ఊప** (దే.వి.) : అడవిలోని చెట్లగుంపు (అప్ర.)

**ఊపిరి** (దే.వి.) : ఊర్పు, శ్వాసము.

**ఊపిరికుట్టు** (దే.వి.) : ఊపిరిపుచ్చనీక నొప్పించెడి వ్యాధి విశేషము, యౌకము.

**ఊబ** (దే.వి.) : పేడి, నపుంసకుఁడు.

**ఊబి** (దే.వి.) : బురద, పంకము.

**ఊయల** (ద్వ.వి.) : ఊయేల యొక్క రూపాంతరము.

**ఊయాల** (ద్వ.వి.) : ఊయేల యొక్క రూపాంతరము.

**ఊయెల** (ద్వ.వి.) : ఊయేల యొక్క రూపాంతరము.

**ఊయేల** (ద్వ.వి.) : (ఊఁచు+ఏల) ఉయ్యాల.

**ఊరఁగంద**(ద్వ.వి.) : (ఊరన్ + కంద) ఊరి యందు పైరు చేసెడు కంద.

**ఊరఁబంది** (దే.వి.) : (ఊరన్ + పంది) ఊరి యందు తిరుగు పంది, గ్రామ సూకరము.

**ఊరఁబిచ్చిక** (దే.వి.) : (ఊరన్ + పిచ్చిక) ఇండ్ల పట్టునఁదిరిగెడు ఒక దినుసుపిట్ట, చటకము.

**ఊరఁజోవు** (దే.అ.క్రి.) : (ఊరన్ + పోవు) తగ్గు.

**ఊరక** (దే.అవ్య.) : ఏదేని యొకటి లేక యను నర్థమును దెలిపెడి.

**ఊరగోఁగు** (దే.వి.) : (ఊరన్+గోఁగు) తీక్ష్ణ వృక్షము.

**ఊరజోగి** (ద్వ.వి.) : (ఊరన్ + జోగి) బిచ్చపు జోగి.

**ఊరబీఱ** (దే.వి.) : (ఊరన్ + బీఱ) ఆవడ, ఘోషకము.

**ఊరవ్యుడు** (సం.వి.అ.పుం.) : వైశ్యుఁడు, కోమటి.

**ఊరాఱుచే** (ద్వ.స.క్రి.): (ఊరుపు + ఆఱుచు) ఊఱడించు. (రూ. ఊరార్చు.)

**ఊరీకరించు** (సం.స.క్రి.) : అంగీకరించు.

**ఊరీకృతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అంగీకరింపఁబడినది, ఒప్పుకొనఁ బడినది.

**ఊరు** (దే. అ. క్రి.) : 1. లోపల నుండి జలాదికము వెలికిఁదోఁచు (నీళ్లూరును) 2. నాను; (నిమ్మకాయ ఊరెను.) 3. తడిగలది యగు; (నోరూరుచున్నది.) 4. పుట్టు. (ప్రే. ఊరించు) (వి.) : 1. ఏఁడికోల లేని నాఁగలి; 2. గ్రామము; 3. దేశము; 4. దేశాంతరము.

**ఊరుఁగాయ** (దే.వి.) : (ఊరు + కాయ) ఉపదంశము.

**ఊరుఁబిండి** (ద్వ.వి.) : (ఊరు + పిండి) వ్యంజన విశేషము.

**ఊరుకొను** (దే.స.క్రి.) : (మూరుకొను యొక్క రూపాంతరము) ఆఘ్రాణించు.

**ఊరుచే** (యు.దే.స.క్రి.) : ఊతనంటిన గందములోనగు దానిని చేత రాఁదీయు. (వై.) : ఊపిరి విడుచు. (రూ. ఊర్చు.)

**ఊరుజుఁడు** (సం.వి.అ.పుం.) : వైశ్యుఁడు, కోమటి.

**ఊరుపర్వము** (సం.వి.న్.న.) : జానువు, మోఁకాలు.

**ఊరుపు** (యు.దే.వి.) : వ్యంజన విశేషము. (వై.): శ్వాసము. (రూ. ఊర్పు)

**ఊరువు** (సం.వి.ఉ.పుం.) : సక్థి, తొడ.

**ఊరేగు** (దే.అ.క్రి.) : (ఊరు+ఏగు) మెరవడివోవు.

**ఊర్జము** (సం.వి.అ.పుం.) : 1.కార్తిక మాసము; 2.పూనిక; 3.బలము; 4.ఊపిరి వెలికిఁబుచ్చుట.

**ఊర్జస్వలుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. మిక్కిలి యుత్సాహము గలవాఁడు; 2. మిక్కిలి బలముగలవాఁడు.

**ఊర్జస్వి** (సం.విణ.) : (న్.ఈ.న్.) 1. మిక్కిలి యుత్సాహము గలవాఁడు; 2. మిక్కిలి బలము గలవాఁడు.

**ఊర్జితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) దృఢము, గట్టి.

**ఊర్ణ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. గొఱ్ఱె లోనగు వాని బొచ్చు, త్రుప్పుడు; 2. నూలు; 3. కనుబొమ్మల నడిమి సుడి. (ఇది మహాపురుష లక్షణము.)

**ఊర్ణనాభము** (సం.వి.అ.పుం.) : 1. సాలెపురుగు; 2. అభినయ హస్త విశేషము. (అయిదు వ్రేళ్లను గొంచెము వంచి కొనలు కూడక పట్టినది.)

**ఊర్ణనాభి** (సం.వి.ఇ.పుం.) : సాలెపురుగు.

**ఊర్ణాయువు** (సం.వి.ఉ.పుం.) : 1. పొట్టేలు; 2. గొఱ్ఱెబొచ్చుపుట్టి కంబళి; 3. సాలెపురుగు.

**ఊర్ధ్వకము** (సం.వి.అ.పుం.) : యవ మధ్యము వంటి మధ్యము గల మృదంగము.

**ఊర్ధ్వజ్ఞువు** (సం.విణ.ఉ.) : 1. కొంగకాళ్లవాఁడు; 2. లేచినవాఁడు.

**ఊర్ధ్వము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. పొడవైనది; 2. మీఁదికెత్తఁబడినది; 3. మీఁదిది.

**ఊర్ధ్వరేతసుఁడు** (సం.వి.స్.పుం.) : 1. ఋషి; 2. శివుఁడు.

**ఊర్ధ్వలోచనము** (సం.వి.అ.పుం.) : శరభము, మీఁగండ్ల మెకము.

**ఊర్పోక** (ద్వ.వి.) : (ఊర్పు + పోక) ఉబుసు పోక.

**ఊర్పోవు** (ద్వ.అ.క్రి.) : (ఊర్పు + పోక) ఊపిరి వెడలు.

**ఊర్మి** (సం.వి.ఇ.పుం.స్త్రీ.) : 1.అల; 2.పెద్ద అల; 3.ఉమ్మి; 4.తహతహ; 5.నొప్పి; 6.పరంపర; 7.వస్త్రపుముడుత; 8.ప్రకాశము; 9.ప్రవాహము; 10.వంకర. (షడూర్ములు : క్షుత్ తృష్ణా శోక మోహ జరా మరణములు)

**ఊర్మిక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. అల; 2. ఉంగరము; 3. వస్త్రపు ముడుత.

**ఊర్మిమాలి** (సం.వి.న్.) : సముద్రము, కడలి.

**ఊర్మిళ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. జనక మహారాజు కూఁతురు; 2. మగనినెడఁబాసిన స్త్రీ.

**ఊఱట** (దే.వి.) : 1. ఊఱడించుట, ఆశ్వాసము; 2. తెఱపి, విరామము. (విణ.) : సహాయము.

**ఊఱడిల్లు** (దే.అ.క్రి.) : ఉపశమిల్లు (ప్రే. ఊఱడించు.)

**ఊఱడు** (దే.అ.క్రి.) : ఉపశమిల్లు (ప్రే. ఊఱ డించు.)

**ఊఱు** (దే.స.క్రి.) : సరిపోలు.

**ఊలమాలగుడుచు** (దే.అ.క్రి.) : (ఊలమాల + కుడుచు) తహతహపడు.

**ఊవాడు** (దే.అ.క్రి.) : (ఊవి+ఆడు) ఊఁగాడు.

**ఊవు** (దే.అ.క్రి.) : ఊఁగు యొక్క రూపాంతరము.

**ఊషణ** (సం.వి.ఆ.స్త్రీ.) : పిప్పలి. (అ.న.ము.) : మిరియము.

**ఊషము** (సం.వి.అ.పుం.) : 1. చవుడు; 2. వేకువ.

**ఊషరము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చవుటిది (నేల)

**ఊష్మకము** (సం.వి.అ.పుం.) : నిదాఘము, వేసంగి.

**ఊష్మము** (సం.వి.న్.పుం.) : 1.ఉమ్మ; 2. వేసంగి; 3. (వ్యాకరణమున) శషసహలు.

**ఊష్మలము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఉమ్మగలది.

**ఊష్మాగమము** (సం.వి.అ.పుం.) : గ్రీష్మము, వేసంగి.

**ఊసరము** (యు.దే.విణ.) : కృశించినది. (వై.) : చవుటిది. (నేల)

**ఊసరవెల్లి** (దే.వి.) : మూడువన్నెలుగల తొండ, బింబకము.

**ఊసరిల్లు** (దే.అ.క్రి.) : చిక్కు, కృశించు.

**ఊసివాసము** (వై.వి.) : ఈర్ష్య.

**ఊసు** (దే.వి.) : ఉబుసు యొక్క రూపాంతరము.

**ఊహము** (సం.వి.అ.పుం.) : 1. అపూర్వార్థము నుత్ప్రేక్షించుట; 2. లేనిమాటలు కొన్నిటిని దెచ్చుకొనుట.

**ఊళ** (దే.వి.) : నక్కకూఁత.

# ఋ

**ఋ** : ఒక యక్షరము.

**ఋక్కు** (సం.వి.చ్.స్త్రీ.) : 1. ఒక వేదము; 2. వేదభాగ విశేషము.

**ఋక్థము** (సం.వి.అ.న.) : ధనము, విడిముడి.

**ఋక్షగంధ** (సం.వి.ఆ.స్త్రీ.) : బొద్దికూర.

**ఋక్షగంధిక** (సం.వి.ఆ.స్త్రీ.) : నల్లనేల గుమ్ముడు. పాలగుమ్ముడు. (అని కొందఱు.)

**ఋక్షము** (సం.వి.అ.న.) : నక్షత్రము. (పుం.) : 1.ఎలుఁగుగొడ్డు; 2.ఒకానొక కొండ; 3. దుండిగము. (విణ.) : గ్రువ్వఁబడినది.

**ఋజీషము** (సం.వి.అ.న.) : పిండివంట చేసెడు పాత్రము. బూరెలమూకుడు (అని కొందరు.)

**ఋజువు** (సం.విణ.ఉ.) : ప్రగుణము, చక్కనైనది.

**ఋణము** (సం.వి.అ.న.) : పర్యుదంచనము అప్పు. (ఋణత్రయము : దేవ ఋణము, ఋషి ఋణము, పితృ ఋణము)

**ఋణార్ణము** (సం.వి.అ.న.) : అప్పు తీర్చుటకై తీసిన అప్పు.

**ఋణి** (సం.విణ.) : (న్.ఈ.న్.) అధమర్ణుఁడు, అప్పులకాఁపు.

**ఋణికుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) అధమర్ణుఁడు, అప్పులకాఁపు.

**ఋతము** (సం.వి. అ.న.) : 1. శిలోంఛ వృత్తి; 2. నీళ్లు. (విణ.) : 1. సత్యమైనది; (మాట) 2. పూజింపఁబడినది; 3. ప్రకాశమొందినది.

**ఋతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. త్రోవ; 2. పోటి; 3. రోఁత; 4. శుభము.

**ఋతీయ** (సం.వి.ఆ.స్త్రీ.) : జుగుప్స, రోఁత.

**ఋతుమతి** (సం.వి.ఈ.స్త్రీ.) : పుష్పవతి, ముట్టుది.

**ఋతువు** (సం.వి.ఉ.పుం.) : 1. వసంతము లోనగునది; (అవి ఆఱు : వసంతము, గ్రీష్మము, వర్షము, శరత్తు, హేమంతము, శిశిరము) 2. ఆర్తవము; 3. వెలుఁగు.

**ఋత్విజుఁడు** (సం.వి.జ్.పుం.) : యజ్ఞకర్తచేత ధనముఁ బుచ్చుకొని యజ్ఞము చేయించువాఁడు. ఒజ్జ. (వీరు పదియాఱుగురు : బ్రహ్మ, ఉద్గాత, హోత, అధ్వర్యుఁడు, బ్రాహ్మణాచ్ఛంసి, ప్రస్తోత, మైత్రావరుణుఁడు, ప్రతిప్రస్థాత, పోత, ప్రతిహర్త, అచ్ఛావాకుఁడు, నేష్ట, అగ్నీధ్రుఁడు, సుబ్రహ్మ ణ్యుఁడు, గ్రావ స్తుతుఁడు, ఉన్నేత.)

**ఋద్ధము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. నుఱిచినది (ధాన్యము) 2. పెరిగినది.

**ఋద్ధి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. సమృద్ధి; 2. గంధద్రవ్య విశేషము.

**ఋభుక్షుఁడు** (సం.వి.న్.పుం.) : ఇంద్రుఁడు.

**ఋభుడు** (సం.వి.ఉ.పుం.) : నిర్జరుఁడు, వేల్పు.

**ఋశ్యకేతువు** (సం. వి. ఉ. పుం.) : మన్మథుఁడు, మరుఁడు.

**ఋశ్యప్రోక్త** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. దూలగొండి; 2. పిల్లపీఁచర.

**ఋశ్యము** (సం.వి.అ.పుం.) : మనుఁబోతు (రూ.) ఋష్యము.

**ఋషభము** (సం.వి.అ.పుం.) : 1. ఎద్దు; 2. ఓషధి విశేషము; 3. తిరుమల; 4. కర్ణ రంధ్రము; 5. ఒక స్వరము; 6. ఉత్తరపదమైనచో శ్రేష్ఠుఁడు.

**ఋషభి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. దూలగొండి; 2. మాచకమ్మ; 3. ముండ.

**ఋషి** (సం.వి.ఇ.పుం.) : 1. వసిష్ఠాది; 2. వేదము; 3. వెలుఁగు (సప్తర్షులు : మరీచి, అత్రి, అంగిరుఁడు, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు, వసిష్ఠుఁడు (మఱియొక క్రమము) కశ్య పుఁడు, అత్రి, భరద్వాజుఁడు, విశ్వామిత్రుఁడు, గౌతముఁడు, జమదగ్ని, వసిష్ఠుఁడు.)

**ఋష్యప్రోక్త** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.దూలగొండి; 2.పిల్లపీఁచర; 3. ఒక దినుసు చిట్టాముదపు చెట్టు.

## ఎ

**ఎ** : ఒక యక్షరము. (యు.దే.అన్య.) : 1. ప్రశ్నమును దెలిపెడి; 2. వ్యతిరేకమును దెలిపెడి; 3.మెచ్చుకొనుటను దెలిపెడి; 4.ఆఁదు దగుటను దెలిపెడి; 5. ఎక్కువతక్కువలను దెలిపెడు.

**ఎంగిలి** (దే.వి.) : ఉచ్ఛిష్టము.

**ఎంగెస** (దే.వి.) : ఒక దినుసు అడవిచెట్టు.

**ఎంచే** (దే.స.క్రి.) : 1. గణించు; 2. తలఁచు; 3. ఆక్షేపించుట.

**ఎండ** (దే.వి.) : సూర్యప్రకాశము, ఆతపము.

**ఎండఁగట్టు** (దే.స.క్రి.) : (ఎండన్+కట్టు) ఆఱఁగట్టు. (ముంగిట గుడ్డను ఎండఁగట్టుము.)

**ఎండఁగొట్టు** (దే.స.క్రి.) : (ఎండన్+కొట్టు) ఎండఁ జేయు. (నీళ్లు చల్లక ఆ పైరును ఎండఁ గొట్టినాఁడు.)

**ఎండఁబెట్టు** (దే.స.క్రి.) : (ఎండన్+పెట్టు.) ఎండ వేయు. (వరుగులెండఁ బెట్టుము.)

**ఎండదొర** (దే.వి.) : సూర్యుఁడు.

**ఎండమావులు** (దే.వి.బ.) : మిట్ట మధ్యాహ్నవేళ బయళ్ల యందు నీటి వలెఁ దోచెడి సూర్య కిరణములు, మృగతృష్ణ.

**ఎండు** (దే.అ.క్రి.) : 1. తడియాఱు; (గుడ్డ యెండెను, చెట్టు ఎండెను) 2. నీరింకు; (చెఱువు ఎండి పోయెను.) 3.తపించు; (వాఁడు ఎండలో ఎండుచున్నాడు.) 4.శుష్కించు. (అది అన్నము లేక ఎండుచున్నది.)

**ఎండుగులు** (దే.వి.బ.): ఎండఁబోసిన ధాన్యము.

**ఎండుతెవులు** (దే.వి.) : దేహము శుష్కించెడు వ్యాధి విశేషము.

**ఎండుపుఁదట్ట** (దే.వి.) : (ఎండు+తట్ట) ఏదేని యెండ పెట్టుటకు వెదురుబ్రద్దలు లోనగువాని చేత నల్లిన తట్ట, దాఁగర, ప్రసేవకము.

**ఎండువులు** (దే.వి.బ.) : ఎండుగులు యొక్క రూపాంతరము.

**ఎండ్రకాయ** (వై.వి.) : కర్కటకము. (చూ. ఎండ్రిక)

**ఎండ్రి** (వై.వి.) : కర్కటకము. (చూ. ఎండ్రిక)

**ఎండ్రిక** (వై.వి.) : కర్కటకము. (చూ. ఎండ్రిక)

**ఎంత** (ద్వ.స.) : (ఏ + అంత) 1. ఏకొలఁది; 2.ఏ యుద్దేశ్యపుకొలఁది.

**ఎంతనుక** (ద్వ.ద్ర.) : (ఎంత+దనుక) ఎందాఁక.

**ఎందఱు** (ద్వ.స.) : (ఎంత + వారు) (ఎంత శబ్దమునకు మహన్మహత్యర్థక బహువచన రూపము.) ఎంత సంఖ్య గలవారు. (దీనికి ఏనిశబ్దము వెనుకఁ జేరునపుడు అనేకులనెడి యర్థము కలుగుచున్నది.)

**ఎందాఁక** (ద్వ.ద్ర.) : (ఎంత + దాఁక) ఎంత పర్యంతము.

**ఎందు** (దే.ద్ర.) : ఎచ్చోట.

**ఎందులకు** (దే.ద్ర.) : 1. ఎచ్చోటికి. 2. దేనికి.

**ఎంబన్న**(దే.విణ.) : (ఎంబె+అన్న) చేతకానివాఁడు.

**ఎఁడు** (దే.అప.) : పరిమాణార్థకము.

**ఎకదొట్టు** (దే.అ.క్రి.) : అతిశయించు.

**ఎకరము** (అం.వి.) : 4840 గజముల నేల.

**ఎకరా** (దే.వి.) : ఏనుఁగునుగట్టు మొగసాల.

**ఎకరారు** (హిం.వి.) : ఒప్పుకొనుట.

**ఎకసకియము** (దే.వి.) : ఎక్కసెక్కియము యొక్క రూపాంతరము. (చూ. ఎకసక్కెము)

**ఎకసకెము** (దే.వి.) : ఎక్కసెక్కియము యొక్క రూపాంతరము. (చూ. ఎకసెక్కెము)

**ఎకసక్కియము** (దే.వి.) : ఎక్కసెక్కియము యొక్క రూపాంతరము. (చూ. ఎకసక్కెము)

**ఎకసక్కెము** (దే.వి.) : ఎక్కసెక్కియము యొక్క రూపాంతరము. 1. వికటపు మాట; 2. అవమానము; 3. వంచన.

**ఎకసెకియము** (దే.వి.) : ఎక్కసెక్కియము యొక్క రూపాంతరము. (చూ. ఎకసెక్కెము)

**ఎకసెకెము** (దే.వి.) : ఎక్కసెక్కియము యొక్క రూపాంతరము. (చూ. ఎకసెక్కెము)

**ఎకసెక్కియము** (దే.వి.) : ఎక్కసెక్కియము యొక్క రూపాంతరము. (చూ. ఎక సెక్కెము)

**ఎకసెక్కెము** (దే.వి.) : ఎక్కసెక్కియము యొక్క రూపాంతరము.

**ఎకాయకీ** (హిం.క్రి.విణ.) : అకస్మాత్తు, అతి వేగముగా.

**ఎకిమీఁడు** (దే.వి.) : అధిపతి, ఒడయఁడు, రాజు.

**ఎకిరింత** (దే.వి.) : ఎక్కిరింత యొక్క రూపాంతరము.

**ఎక్కటి** (వై.స.ఏ.) : ఒక్కటి. (విణ.) : అసహాయుఁడు; అసహాయము (ఎక్కటి కయ్యము మొ.)

**ఎక్కటీఁడు** (వై.వి.) : అసహాయుఁడైన బంటు. (స్వార్థమున ఈఁడు.)

**ఎక్కడ** (దే.వి.ఏ.) : (ఏ + కడ) ఏచోటు. (చూ. అక్కడ)

**ఎక్కము** (యు.దే.వి.) : గనిమ. (వై.స.ఏ.) : ఒకటి. (బ.) : గుణకహార పథకము, ఎక్కాలు.

**ఎక్కలి** (దే.వి.) : ప్రవాహము చేకొట్టుకొని వచ్చి కమ్ముకొనిన యిసుక.

**ఎక్కసకియము** (దే.వి.) : ఎక్కసెక్కియము యొక్క రూపాంతరము. (చూ. ఎకసెక్కెము)

**ఎక్కాడు** (దే.స.క్రి.) : (ఎక్కు + ఆడు) పురికొలుపు.

**ఎక్కిడు** (దే.స.క్రి.) : నారిగలదానిగాఁ జేయు, మోపెట్టు.

**ఎక్కిరింత** (దే.వి.) : వాహనము.

**ఎక్కిలి** (వై.వి.) : దప్పి మొదలగువానిచేఁ గలిగెడి వ్యాధి విశేషము, హిక్క

**ఎక్కు**(దే.అ.క్రి.) : 1. అతిశయించు; 2. ఇష్టమగు; 3. సిద్ధించు (చూ. ఉపాసము) వింటినారి, ప్రేరేపణ.

**ఎక్కుడించు** (దే.స.క్రి.) : హెచ్చించు.

**ఎక్కుడు** (దే.వి.) : 1.ఆరోహణము; 2. వాహనము; 3. వింటినారి (చూ. ఎక్కుడుపెట్టు.) (విణ.) : 1.అధికము; 2. ఉత్కృష్టము.

**ఎక్కుడుఁదీగ** (దే.వి.) : మానేరు, జ్యోతిష్మతి.

**ఎక్కుడుపెట్టు** (దే.స.క్రి.) : ఎక్కుపెట్టు, మోపెట్టు.

**ఎక్కుడుమెకము** (ద్వ.వి.) : ఏనుఁగు, మహా మృగము.

**ఎక్కుపెట్టు** (దే.స.క్రి.) : ఎక్కిడు, మోపెట్టు.

**ఎక్కులుపెట్టు** (దే.స.క్రి.) : పురికొలుపు, ప్రేరేపించు.

**ఎక్కువ** (దే.వి.) : ఆధిక్యము.

**ఎగ** (దే.అప.) : ఎగువ శబ్దమునకు వృత్తియందు ఆదేశముగా వచ్చిన రూపము. (చూ. దిగ)

**ఎగచు** (దే.ప్రే.) : 1.ఎగయఁజేయు; 2. తఱుము.

**ఎగతాళి** (దే.వి.) : గేలి, పరిహాసము.

**ఎగదిగ** (దే.ద్ర.) : ఎగువదిగువలుగా.

**ఎగపు** (దే.వి.) : 1.గర్వము; 2. మండిపడుట.

**ఎగయు** (దే.అ.క్రి.) : 1. ఎగురు; 2. పైకిలేచు.

**ఎగవు** (దే.వి.) : ఎగురుట, ఉడ్డీనము.

**ఎగసన** (దే.ద్ర.) : ఎగువగా.

**ఎగసిపడు** (ద్వ.అ.క్రి.) : 1 ఎగిరిపడు; 2. గర్వించు; 3. మండిపడు.

**ఎగసిపాటు** (ద్వ.వి.) : 1. ఎగసిపడుట; 2. గర్వించుట; (ఇది మీఁది రెండర్థములకు నుదాహరణము.) 3. మండిపడుట.

**ఎగసిల్లు** (దే.అ.క్రి.) : ఎగయు. (అప్ర.)

**ఎగాదిగ** (దే.ద్ర.) : ఎగదిగయొక్క రూపాంతరము.

**ఎగు** (దే.విణ.) : వృత్తియందు ఎగువ శబ్దమునకును ఎగురు శబ్దమునకును అంత్యవర్ణము లోపింపఁగా మిగిలిన రూపము (ఎగుబుజములు, ఎగుబోద. మొ.)

**ఎగుచే** (దే.స.క్రి.) : తఱుము.

**ఎగుడు** (దే.విణ.) : ఉన్నతము.

**ఎగుడుదిగుడు** (దే.విణ.) : 1. సమము కానిది, విషమము; (ఎగుడు దిగుడు నేల); 2. అసంగతము (ఎగుడు దిగుడు మాటలు)

**ఎగుదల** (ద్వ.వి.) : (ఎగువ + తల) 1. పై భాగము; 2. వృద్ధి.

**ఎగుబుజము** (ద్వ.వి.) : ఉన్నత భుజము.

**ఎగుబోద** (ద్వ.వి.) : ఱెక్కలు మొలచి యెగిరెడు వయసు వచ్చిన పక్షిపిల్ల.

**ఎగుమతి** (దే.వి.) : ఓడకు సరకు లెక్కించుట.

**ఎగుమతిచేయు** (దే.స.క్రి.) : ఓడకు సరకు లెక్కించు.

**ఎగురు** (దే.అ.క్రి.) : ఎగురుట.

**ఎగురులాడు** (దే.అ.క్రి.) : దుముకులాడు.

**ఎగువ** (దే.వి.) : 1.మీఁదు; 2. ఆధిక్యము. (విణ.) : ఉన్నతము. (వృత్తి యందు అంత్యవర్ణ లోపము)

**ఎగ్గతము** (వై.వి.) : ఏకాంతస్థలము.

**ఎగ్గాడు** (దే.స.క్రి.) : (ఎగ్గు + ఆడు) దూషించు.

**ఎగ్గించే** (దే.స.క్రి.) : అనాదరించు.

**ఎగ్గు** (దే.వి.) : 1.కీడు; 2.అపకారము; 3.కీడుమాట; 4. అపరాధము; 5.దోషము; 6. అనాదరము; 7. (బ.) : దూషణము.

**ఎగ్గులుతు** (దే.వి.) : (ఎగువ + గుఱుతు) విషయ సంగ్రహము. (ఎగ్గులుతు లెక్క) (రూ. ఎగ్గుర్తు.)

**ఎగ్గులాడు** (దే.స.క్రి.) : (ఎగ్గులు + ఆడు) నిందించు.

**ఎచ్చిరిలు** (దే.అ.క్రి.) : వర్ధిల్లు.

**ఎచ్చిఱు** (దే.అ.క్రి.) : 1. ఎచ్చిరిలు; 2. బాగుపడు.

**ఎచేటు** (దే.వి.ఏ.) : ఎచ్చొటు యొుక్క రూపాంతరము. (చూ.) ఎచ్చొటు.

**ఎచేరించు** (దే.స.క్రి.) : ఎచ్చరించు యొుక్క రూపాంతరము. (దీనికి ఈ ప్రయోగ మొుక్కటే కనంబడుటచేత ఇది యింకను విచారింపఁ దగినది.)

**ఎచోటు** (దే.వి.ఏ.) : ఎచ్చొటు యొుక్క రూపాంతరము. (చూ.) ఎచ్చొటు.

**ఎచ్చేటు** (దే.వి.ఏ.) : ఎచ్చొటు యొుక్క రూపాంతరము. (చూ.) ఎచ్చొటు.

**ఎచ్చేరము** (దే.వి.) : ఎచ్చరిక.

**ఎచ్చేరించు** (దే.స.క్రి.) : ఎచ్చరికచేయు.

**ఎచ్చేరింత** (దే.వి.) : ఎచ్చరిక.

**ఎచ్చేరిక** (దే.వి.) : 1. అవధానము; 2. సూచన.

**ఎచ్చేరికించు** (దే.స.క్రి.): ఎచ్చరించు యొుక్క రూపాంతరము.

**ఎచ్చే** (దే.అ.క్రి.) : అధికమగు. (వి.) : ఆధిక్యము. (విణ.) : అధికము.

**ఎచ్చొటు** (దే.వి.ఏ.) : (ఏ + చోటు) ఏ స్థానము. (రూ.) ఎచ్చోటు.

**ఎట** (దే.వి.ఏ.) : ఎక్కడ.

**ఎటవారె** (దే.వి.) : కుందురుకి.

**ఎటు** (దే.అవ్య.) : ఎట్లు.

**ఎటులు** (దే.అవ్య.) : ఎట్లు.

**ఎటువంటి** (దే.విణ.) : ఎట్టి.

**ఎటువలె** (దే.ద్ర.) : ఎట్లు.

**ఎట్టకునేని** (దే.అవ్య.) : ఎట్టకేని.

**ఎట్టకేని** (దే.అవ్య.) : అతిప్రయాసమున.

**ఎట్టకేలకు** (దే.ద్ర.) : అతిప్రయాసమున.

**ఎట్టట** (దే.అవ్య.) : (ఎట్టు + అటు + అ) ఎట్టయిన. (చూ. తాలిమి.)

**ఎట్టపోగు** (ద్వ.వి.) : దండు.

**ఎట్టయెదురు** (దే.వి.ఏ.) : (ఎదురు + ఎదురు) చక్కనియెదురు.

**ఎట్టి** (దే.విణ.) : ఎటువంటి.

**ఎట్టిఁడు** (దే.విణ.) : (ఎట్టి + వాఁడు) ఎటువంటివాఁడు.

**ఎట్టు** (దే.అవ్య.) : ఎట్లు.

**ఎట్టులు** (దే.అవ్య.) : ఎట్లు.

**ఎట్టువోలె** (దే.ద్ర.) : ఎట్లు.

**ఎట్టూ** (దే.అవ్య.) : ప్రశ్నమును దెలుపును. (ఆమ్రేడితమందు ఎట్టెటూ, ఎట్టెట్టూ.)

**ఎట్లు** (దే.అవ్య.) : ఏప్రకారము.

**ఎడ** (యు. దే.వి.): 1. స్థానము; 2. అవకాశము; 3. దూరము; 4. గడువు; 5. భేదము; 6.విఘ్నము; 7. వ్యవహారము; 8. సంధి; 9. దేవతా నైవేద్య వస్తువు (ఇది విచార్యము.) (విణ.) : ఎలప్రాయము గలది. (ఎల దూడ, ఎడపడ్డ.) ద్ర. నడుమ. (ఆమ్రేడితమందు ఎడనెడ.) (వై.వి. ) : హృదయము.

**ఎడఁద** (వై.వి.) : ఎద, హృదయము. (కొన్ని ప్రతుల యందు పాఠమిట్లున్నది. ఇదియ పొందికగాఁ దోచెడి.)

**ఎడఁబాటు** (దే.వి.) : ఎడఁబాయుట, వియోగము.

**ఎడఁబాపు** (దే.ప్రే.) : ఎడఁబాయఁ జేయు.

**ఎడఁబాయు** (దే.స.క్రి.) : (ఎడ + పాయు) వీడు, వదలు.

**ఎడకట్టు** (దే.అ.క్రి.) : ఆఱినపుండు మరల చీముపట్టు.

**ఎడకత్తియ** (ద్వ.వి.) : దూతిక. (రూ. ఎడకత్తె)

**ఎడకాఁడు** (దే.వి.) : తార్పువాఁడు, దూత.

**ఎడకారు** (ద్వ.వి.) : మాఘమాసము మొదలు జ్యేష్ఠమాసము లోపల పండించెడు పంట.

**ఎడగడ్డ** (ద్వ.వి.) : ఒడ్డు, గట్టు, దరి, తీరము.

**ఎడగిల్లు** (దే.అ.క్రి.) : తొలఁగు, అపసరిల్లు.

**ఎడతాఁకు** (దే.అ.క్రి.) : చేరు, సంధించు.

**ఎడతీయు** (దే.అ.క్రి.) : ఎడతెగు.

**ఎడతెగు** (దే.అ.క్రి.) : 1. ఎడపడు; 2. విడివడు.

**ఎడతెఅపి** (దే.వి.) : వ్యవధానము. (తిరునాళ్లకు జనులు ఎడతెఅపిలేక పోవుచున్నారు.) (చూ. ఎడతెర్పి.)

**ఎడతెర్పి** (దే.వి.) : ఎడతెఅపి యొుక్క రూపాంతరము.

**ఎడత్రెచ్చే** (దే.అ.క్రి.) : ఎడతెగు.

**ఎడదవ్వు** (దే.వి.) : అతిదూరము.

**ఎడనీరు** (ద్వ.వి.) : 1. లేఁతటెంకాయ లోని తియ్య నీరు; 2. ఎడనీటికాయ.

**ఎడపడు** (ద్వ.అ.క్రి.) : 1.ఎడతెగు; 2. పూఁట పడు.

**ఎడపదడప** (దే.అవ్య.) : అప్పుడప్పుడు.

**ఎడపు** (దే.ప్రే.) : ఎడయఁజేయు.

**ఎడపెట్టు** (దే.స.క్రి.) : 1. తొలఁగించు; 2. మాఱు వడ్డించుకొనుటకై యన్నమును దగ్గఱ యెత్తియుంచు.

**ఎడపోవు** (దే.అ.క్రి.) : దౌత్యముచేయు. (అప్ర.)

**ఎడమ** (దే.విణ.) : సవ్యము. (ఎడమ కాలు, ఎడమచేయి. మొ. వృత్తియందు అంత్య వర్ణ లోపము ఎడకన్ను, ఎడవంక. మొ.)

**ఎడమడుగు** (దే.వి.) : 1.వ్యత్యాసము; 2. వైషమ్యము.

**ఎడమడువు** (దే.వి.) : 1. వ్యత్యాసము; 2. వైషమ్యము.

**ఎడమడువుపరువడి** (దే.వి.) : మల్లబంధ విశేషము.

**ఎడము** (దే.వి.) : 1. చోటు; 2. అవకాశము

**ఎడయిక** (దే.వి.) : ఎడఁబాటు, వియోగము.

**ఎడయు** (దే.అ.క్రి.) : తొలఁగు.

**ఎడరు** (దే.అ.క్రి.) : భగ్నమగు. (వి.) : 1. ఆపద; 2. భంగము; 3. సందు; 4. ఎడారి.

**ఎడలు** (దే.అ.క్రి.) : 1. వికలమగు; 2. విచ్ఛిన్న మగు. స.క్రి. విసర్జించు.

**ఎడవాఁడు** (దే.స.) : కడవాఁడు, అన్యుఁడు.

**ఎడవు** (దే.విణ.) : దవ్వు, దూరము.

**ఎడసాల** (ద్వ.వి.) : ప్రత్యేకమయిన గది.

**ఎడాటము** (దే.వి.) : విషయము. (దీనికి ఆట అని కొందఱు అర్థము చెప్పుచున్నారు.)

**ఎడారి** (దే.వి.) : చెట్లు చేమలు లేని విశాలపు నిర్జలభూమి.

**ఎడారె** (ద్వ.వి.) : (ఎడ+ఆరె) చెప్పులుకుట్టెడు చిన్న సూది.

**ఎడ్డ** (వై.వి.) : డఁదయొక్క రూపాంతరము.

**ఎడ్డమి** (దే.వి.) : ఆపద.

**ఎడ్డము** (దే.వి.) : అడ్డంకి, నిరోధము.

**ఎడ్డియ** (వై.విణ.) : మూఢుఁడు.

**ఎడ్డె** (వై.విణ.) : ఎడ్డియ యొక్క రూపాంతరము.

**ఎడ్డెఁడు** (వై.విణ.) : ఎడ్డయొక్క రూపాంతరము.

**ఎడ్డెన** (దే.వి.) : భోజనపాత్రము నుంచుకొనెడి ఉన్నత పీఠము.

**ఎడ్లు** (దే.వి.బ.) : (ఎద్దు + లు) వృషభములు.

**ఎతఁడు** (దే.స.ఏ.) : ఏ పూజ్యుఁడు (ఏతఁడు యొక్క రూపాంతరము.)

**ఎతుబరికాఁడు** (దే.వి.) : ఎత్తుబరికాఁడు యొక్క రూపాంతరము.

**ఎత్తనగోల** (దే.వి.) : 1. గోనెలెత్తి యెద్ల మీఁద వేయుటకు సాధనమైన కఱ్ఱ. 2. ఊఁతగా నానించిన కోల.

**ఎత్తనగోలు**(దే.వి.) : 1.మొదలు; 2. ప్రారంభము.

**ఎత్తరము** (దే.విణ.) : ఉన్నతము.

**ఎత్తరవు** (దే.విణ.) : ఎత్తరము, ఉన్నతము.

**ఎత్తళి** (దే.వి.) : కొఱముట్టు, సాధనము.

**ఎత్తికొను** (దే.అ.క్రి.) : కడఁగు, యత్నించు. (స.క్రి.) : 1.అపహరించు; 2.వహించు; 3.ఉద్ధరించు. (ఇది రెండర్థములకును ఉదాహరణము.)

**ఎత్తికోలు** (దే.వి.) : 1. కడఁక, ప్రయత్నము; 2. సంకల్పము.

**ఎత్తిపొడుచు** (దే.స.క్రి.) : దోషములెత్తి చెప్పి మర్మము దూఱనాడు.

**ఎత్తిలి** (దే.అవ్య.) : గట్టిగా.

**ఎత్తివేయు** (దే.స.క్రి.) : 1. తీసివేయు; (వాని పేరెత్తి వేయుము.) 2.అలక్ష్యము చేయు. (నన్నెత్తి వేసి మాటాడెను.)

**ఎత్తు** (దే.అ.క్రి.) : 1.కలుగు, పుట్టు; 2. బయలు దేఱు. (స.క్రి.) : 1. అపహరించు; 2. దండెత్తు; 3. పైకెత్తు; 4. గ్రహించు (నీవా పుస్తకము నెత్తితివా.) 5. తీయు; (ఈ బండిని నేను ఏలములో నెత్తితిని.) 6. (చల్లుడునీరు) పాఱించు; 7. ప్రస్తావించు; (అక్కడయీ మాట యెత్తకుము.) 8.వహించు; (వాఁడు మంచి పేరెత్తెను.) 9. సంగ్రహించు. (ఇది మఱియొక గ్రంథము నుండి యెత్తి వ్రాసినది.) (నోరెత్తు, పరుగెత్తు, భిక్షమెత్తు, ఇత్యాదులను వేఱువేఱు క్రియలుగాఁ జెప్పుట యుక్తము.) (వి.) : 1చదరంగపు ఎత్తు; 2.ఉన్నతి; 3. ఉపాయము; 4. రెండు వీసెలకొలది; 5. తూనిక; 6. ప్రయత్నము; 7. పుష్ప సరము; 8. (బ.) : వలపుకత్తె వలచిన వానికిచ్చు ధనము. (ఇది పై యర్థమునకును ఉదాహరణము.)

**ఎత్తుగడ** (దే.వి.) : (ఎత్తు + కడ) 1. ఉపాయము; 2. యత్నము.

**ఎత్తుగడ్డలు** (దే.వి.బ.) : ఎత్తుడు ప్రొయ్యి గడ్డలు.

**ఎత్తుగున్న** (ద్వ.వి.) : లేఁతయేనుఁగుపిల్ల.

**ఎత్తుదెంచు** (దే.అ.క్రి.) : (ఎత్తు + తెంచు) దండెత్తివచ్చు.

**ఎత్తుపెట్టు** (దే.స.క్రి.) : పురికొలుపు.

**ఎత్తుబరికాఁడు** (దే.వి.) : దొంగ, చోరుఁడు.

**ఎత్తుభారము** (మి.విణ.) : పాడు.

**ఎత్తువచ్చు** (దే.అ.క్రి.) : సరిపోలు.

**ఎత్తువడు** (ద్వ.అ.క్రి.) : (ఎత్తు + పడు) 1.చెడు; (వానిపేరు ఎత్తువడిపోయినది) 2.లేవలేక పడు.

**ఎత్తువేయు** (దే.స.క్రి.) : తూఁచు.

**ఎత్తువోవు** (దే.అ.క్రి.) : (ఎత్తు+పోవు) 1. చెడు; 2. తగ్గు.

**ఎత్తెల** (దే.వి.) : చేఁపలఁబట్టెడి అడ్డువల.

**ఎద** (యు.దే.వి.) : పశుఋతువు. (వై.) : 1. హృదయము; 2. భయము.

**ఎదవడు** (వై.అ.క్రి.) : (ఎద + పడు) భయపడు.

**ఎదావు** (దే.వి.) : (ఎద + ఆవు) ఆఁబోతు చేర సమయమైన యావు.

**ఎది** (దే. స.) : ఏ శబ్దమునకు అమహద ర్థక ప్రథమైక వచనము. (ఏయాఁడుది, ఏపశ్వాది, ఏజడవస్తువు) (ఏది యొక్క రూపాంతరము.)

**ఎదిరి** (దే.వి.) : విరోధి.

**ఎదిరించు** (దే.స.క్రి.) : ఎదురు.

**ఎదుగు** (వై.అ.క్రి.) : పెరుగు, వర్ధిల్లు.

**ఎదురాడు** (దే.అ.క్రి.) : (ఎదురు + ఆడు) మాఱాడు.

**ఎదురు** (దే.స.క్రి.) : ఎదిరించు. (వి.ఏ.) : 1. పురో భాగము; 2. ఎదుటి వాఁడు; 3. వలపుకత్తె వలచిన వానికిచ్చు ధనము.

**ఎదురుకట్టుల** (దే.ద్ర.) : ఎదుట. (రూ. ఎదురుకట్ల.)

**ఎదురుకుత్తుక** (దే.వి.) : అంకిళ్ళు పట్టుకొనెడు వ్యాధి విశేషము.

**ఎదురుకొను** (దే.అ.క్రి.) : ఎదురగు, అభిముఖమగు. (స.క్రి.) : ఎదిరించు. (వాఁడు నన్నెదురుకొని నిలువనేరఁడు.) (రూ. ఎదుర్కొను.)

**ఎదురుకోలు** (దే.వి.) : 1. వివాహము నందుఁ బడుచింటివారు వరునికెదురు గాఁబోవుట; 2. పూజ్యులు వచ్చు నపుడు ఎదురుగాఁబోవుట. (రూ. ఎదుర్కోలు.)

**ఎదురుగడ** (దే.వి.) : (ఎదురు + కడ) మాఱు వ్రాసిన యొడంబడిక లోన గునది. (ఎదురుగడ యొడంబడిక, ఎదురుగడలెక్క. మొ.)

**ఎదురుచే** (దే.అ.క్రి.) : ప్రతికూలమగు. (చూ. ఎద్రుచు.) (స.క్రి.) : ఎదిరించు. (రూ. ఎదుర్చు.)

**ఎదురుచేక్క**(ద్వ.విశ.) : కానిది. (చుక్క అనఁగా శుక్రుఁడు. శుక్రుఁడెదురగుట యనిష్ట ప్రదము కనుక లక్షణచే నీయర్థము కలుగుచున్నది.)

**ఎదురుచోచే** (దే.స.క్రి.) : వేచు, ప్రతీక్షించు.

**ఎదురుపడు** (ద్వ.అ.క్రి.) : 1. ఎదురుగా వచ్చు; (దారిలో నాకు వాఁడెదురు పడెను) 2. ఎదురు తిరుగు (రూ. ఎదుర్పడు)

**ఎదురుపాటు** (ద్వ.వి.) : ఎదురుపడుట. (రూ. ఎదుర్పాటు)

**ఎదురుమ్రోయు** (ద్వ.అ.క్రి.) : మాఱుచెలఁగు.

**ఎదురుఱొమ్ము**(ద్వ.వి.) : ఱొమ్మునడిమి భాగము.

**ఎదురేగు** (దే.అ.క్రి.) : (ఎదురు + ఏగు) ఎదురుగాబోవు.

**ఎదురొత్తు** (దే.అ.క్రి.) : (ఎదురు + ఒత్తు) మాఱొత్తు. (వి.బ.) : మాఱొత్తులు.

**ఎద్దడి** (దే.వి.) : దారిద్ర్యము. (విశ.) : 1. దరిద్రము; 2. శూన్యము.

**ఎద్దడినేల** (దే.వి.) : నిర్జలభూమి, మరుభూమి.

**ఎద్దము** (దే.వి.) : పట్టెతీరిన యంచు (ఎద్దపుచీర)

**ఎద్ది** (దే.స.) : ఏది యొక్క రూపాంతరము (చూ.) ఎది.

**ఎద్దు** (దే.వి.) : వృషభము (బ. ఎడ్లు)

**ఎద్దునాలుక** (దే.వి.) : గోజిహ్వా.

**ఎద్దుపట్టు** (దే.స.క్రి.) : ఎద్దును ముష్క హీనముచేయు.

**ఎద్దుముట్టె** (దే.వి.) : ఒక దినుసుగడ్డ.

**ఎద్దురాసి** (ద్వ.వి.) : వృషభరాశి.

**ఎద్రుచు** (దే.అ.క్రి.) : (ఎదురుచు యొక్క రూపాంతరము) ప్రతికూలమగు.

**ఎన** (దే.విశ.ఏ.) : సమానము.

**ఎనమండ్రు** (దే.స.) : ఎనిమిదిమంది. (ఎనిమిదికి మహన్మహత్యర్థక రూపము.)

**ఎనమందుము** (ద్వ.వి.) : (ఎనిమిది + తూము) ఎనిమిది తూములు.

**ఎనమనూఱు** (దే.స.) : (ఎనిమిది + నూఱు) ఎనిమిది నూఱులు. (రూ.) ఎనమన్నూఱు.

**ఎనయిక** (దే.వి.) : 1. పొందిక; 2. సామ్యము.

**ఎనయు** (దే.అ.క్రి.) : సరిపోలు. (స.క్రి.) : 1. పొందు; 2. పోలు.

**ఎని** (ద్వ.స.ఏ.) : ఎన్ని యొక్క రూపాంత రము (చూ. ఎన్ని) (హల్లు పరమగుచో నిత్వలోపము వికల్పము గనగు.)

**ఎనిక** (దే.వి.) : 1. గణనము; 2. నాలుగు పోఁగుల నూలుదారము.

**ఎనిమిది** (దే.స.) : ఏడునొకటి, (రూ.) ఎన్మిది.

**ఎనిమిదికాళ్లచుక్క** (ద్వ.వి.) : పూర్వభద్ర పదానక్షత్రము.

**ఎనిమిదికాళ్లరిక్కనెల** (ద్వ.వి.) : భాద్రపద మాసము.

**ఎనియు** (దే.అ.క్రి.) : కలిసికొను.

**ఎనుచే** (దే.ప్రే.) : ఎనియఁజేయు, ఎనుపు.

**ఎనుపతేలు** (ద్వ.వి) : (ఎనుము + తేలు) నల్లతేలు.

**ఎనుపమోఁకాలు** (ద్వ.వి.) : ఒకానొక చెట్టు.

**ఎనుపసరము**(ద్వ.వి.) : (ఎనుము + పసరము) బఱ్ఱె.

**ఎనుపు** (దే.ప్రే.) : ఎనియఁజేయు, ఎనుచు.

**ఎనుపుడు** (దే.వి.) : ఎనుచుట.

**ఎనుపెంటి** (ద్వ.వి.) : (ఎనుము + పెంటి) బఱ్ఱె.

**ఎనుపోతు** (ద్వ.వి.) : (ఎనుము + పోతు) దున్న, మహిషము.

**ఎనుబండ్రు** (ద్వ.స.) : ఎనుబదిమంది. (ఎనుబదికి మహన్మత్యర్థక రూపము.)

**ఎనుబది** (ద్వ.స.) : (ఎనిమిది + పది)ఎనిమిది పదులు, అశీతి.

**ఎనుము** (వై.వి.) : బఱ్ఱె,మహిషి. (వృత్తి యందు అంత్యవర్ణ లోపము. ఎనుపెంటి, ఎనుపోతు. మొ.)

**ఎన్నఁడు** (దే.వి.ఏ.) : (ఏ+నాఁడు) 1. ఏకాలము; 2. ఎప్పుడు; 3. ఎల్లప్పుడు. (ఇది యీ యర్థమందు ద్రుతాంతమునగు.)

**ఎన్నాళ్లు** (దే.వి.బ.) : (ఎన్ని + నాళ్లు) ఎన్ని దినములు.

**ఎన్ని** (ద్వ.స.ఏ.) : (ఎంత శబ్దమునకు అమహదర్థక బహువచనా దేశము) 1. ఎంత సంఖ్య కలవి; 2. అన్ని. (చూ. ఎవ్వఁడు.) (దీనికి ఏని శబ్దము వెనుకఁ జేరునపుడు అనేకము అనెడి యర్థము కలుగుచున్నది.) (చూ. ఇన్ని.)

**ఎన్నిక** (దే.వి.) : ఎనిక, గణనము.

**ఎన్నికచేయు** (ద్వ.స.క్రి.) : ఎంచు, గణించు.

**ఎన్నికపెట్టు** (దే.స.క్రి.) : ఎంచు, గణించు.

**ఎన్ను** (దే.స.క్రి.) : 1. ఆక్షేపించు; 2. గణించు. (వి.) : సస్యాదిమంజరి. (వరియెన్ను. మొ.)

**ఎన్నువ** (దే.వి.) : ఆఁడువారేడ్చునప్పుడు అనుభవము నెంచి యెంచి పాటగాఁ బాడెడు చచ్చిన వారి చారిత్రము.

**ఎన్నెము** (దే.వి.) : పురిటి పురుగు. (అప్ర.)

**ఎన్బది** (ద్వ.స.) : ఎనుబదియొక్క రూపాంతరము.

**ఎపుడు** (ద్వ.వి.ఏ.) : ఎప్పుడు యొక్క రూపాంతరము.

**ఎప్పు** (ద్వ.వి.ఏ.) : ఎపుడు యొక్క రూపాంతరము.

**ఎప్పటి** (దే.అవ్య.) : అప్పటి, మరల.

**ఎప్పుడు** (ద్వ.వి.ఏ.) : (ఏ + ప్రొద్దు) 1. ఏకాలము; 2. ఎల్లప్పుడు. (ఇది యీ యర్థము నందు ఎన్నఁడు శబ్దము వలె ద్రుతాంతముగాను గానంబడి యెడి.)

**ఎబ్బె** (దే.వి.) : రోఁతపడుట యందుపయోగింపఁ బడుమాట.

**ఎబ్బెర** (దే.వి.) : పక్షివిశేషము. (అప్ర.)

**ఎబ్బెరాసి** (ద్వ.విశ.) : రోఁతకలవాఁడు (లేక) రోఁతకలది. (ఎబ్బెటికపు వస్తు రాశిలోఁ జేరినది అని వ్యుత్పత్త్యర్థము.)

**ఎబ్బెటికము** (దే.వి.) : రోఁత.

**ఎమిడిక** (దే.వి.) : కడుపులోఁగలుగు పాము వంటి తెల్లని పురుగు, ఎమిడికపాము.

**ఎముక** (దే.వి.) : ఎమ్ముక యొక్క రూపాంతరము.

**ఎముకలవట్టు** (దే.విశ.) : వ్యాధిచే బక్కటిల్లిన వాఁడు (లేక) బక్కటిల్లినది.

**ఎమ్ము** (దే.వి.) : ఎముక, అస్థి.

**ఎమ్ముక** (దే.వి.) : ఎముక, అస్థి.

**ఎమ్మూట** (దే.వి.) : (ఎమ్ము+ఊట) మూలగ.

**ఎమ్మె** (దే.వి.) : 1. మనోహరత్వము; 2. విలాసము.

**ఎమ్మెకాఁడు** (దే.విశ.) : విలాసవంతుడు.

**ఎమ్మెలాఁడి** (దే.వి.) : (ఎమ్మెలు + ఆఁడి) విలాసముగల ఆఁడుది, విలాసిని.

**ఎయిదు** (దే.స.) : 1. వెంబడించు, అనుగమించు; 2. పొందు.

**ఎయ్దు** (దే.స.క్రి.) : ఎయిదు యొక్క రూపాంతరము. (వెంబడించుటకు.)

**ఎయ్యది** (దే.స.) : (ఏ + అది) ఎది.

**ఎర** (దే.వి.) : 1.ఆహారము; 2. బలి; 3. వ్యసనము.

**ఎరఁగు** (దే.అ.క్రి.) : 1. దిగు; 2. నమస్కరించు.

**ఎరగుఁడు** (దే.వి.) : నమస్కారము.

**ఎరగలి** (దే.వి.) : ప్రమాను ఒకటితో నొకటి ఒరసి కొనఁగా పుట్టి అడవిని దహించెడి అగ్ని, కార్చిచ్చు, దావము.

**ఎరగొను** (దే.అ.క్రి.) : (ఎర+కొను) పరవశమగు. (స.క్రి.) : మ్రింగు.

**ఎరవలి** (దే.వి.) : ఎరగలి యొక్క రూపాంతరము.

**ఎరవు** (దే.వి.) : 1. ఒకటి రెండు దినములు వాడుకొనుటకై యడిగి తెచ్చు కొనెడి సొమ్ము, యాచితకము; 2. భేదము. (విశ.) : అన్యము.

**ఎరియు** (దే.అ.క్రి.) : 1. కాలు, మండు; 2. పరితపించు.

**ఎరువంటి** (దే.వి.) : పంజెచెట్టు.

**ఎరువాటు** (దే.వి.) : (ఎరువు + వాటు) ఎరువు వైచుట.

**ఎరవు** (దే.వి.) : పైరుకైపెక్కు నాళ్లు చేర్చి పెట్టిన పేఁడ, పాంశువు.(ఎండచే పరితపించునదియని వృత్పత్త్యర్థము.)

**ఎరుసు** (వై.వి.) : ఈర్ష్య.

**ఎర్కు**(దే.వి.) : ఎఱుకు యొక్క రూపాంతరము.

**ఎఱ** (వై.వి.) : వానపాము. (ఎఱ్ఱ యొక్క రూపాంతరము.)

**ఎఱఁగు** (దే.అ.క్రి.) : 1. దిగు; 2. నమస్కరించు.

**ఎఱక** (దే.వి.) : 1. ఱెక్క, పక్షము; 2. భుజము.

**ఎఱగందు** (ద్వ.వి.) : (ఎఱ + కందు) లేఁతబిడ్డ, శిశువు.

**ఎఱగన్ను**(ద్వ.వి.) : (ఎఱ+కన్ను) శివుని యొక్క అగ్ని నేత్రము.

**ఎఱగొను** (ద్వ.అ.క్రి.) : (ఎఱ+కొను) కోపగించు. (చూ. ఎఱ్ఱవాఱు.)

**ఎఱచి** (దే.వి.) : పొల, మాంసము.

**ఎఱచిదిండి** (దే.వి.) : (ఎఱచి + తిండి) అసురుఁడు.

**ఎఱచిపిడుక** (దే.వి.) : చోరపుష్పి.

**ఎఱబఱికము** (దే.వి.) : రోఁత.

**ఎఱసంజ** (వై.వి.) : 1. సాయంసంధ్య; 2. ప్రాత స్సంధ్య.

**ఎఱుఁగు** (దే.స.క్రి.) : తెలియు.

**ఎఱుక** (దే.వి.) : 1. తెలివి; 2. పరిచయము; 3. సోదె; 4. గుఱుతు; 5. జోస్యము.

**ఎఱుకత** (దే.వి.) : (ఎఱుక + త) సోదె చెప్పునది, దైవజ్ఞ.

**ఎఱుకజేయు** (ద్వ.స.క్రి.) : తెలియఁజేయు, తెలుపు.

**ఎఱుకపడు** (ద్వ.అ.క్రి.) : విదితమగు.

**ఎఱుకసాని** (ద్వ.వి.) : ఎఱుకత.

**ఎఱుకు** (దే.వి.) : 1. కిరాతుఁడు; 2. వ్యాధుఁడు.

**ఎఱుకువ** (దే.వి.) : ఎఱుక, తెలివి, జ్ఞానము.

**ఎఱుపు** (వై.వి.) : ఎఱ్ఱన, రక్తవర్ణము.

**ఎఱ్ఱ** (వై.వి.) : 1.వానపాము, గండూపదము. 2. ఎఱుపు. (ఎఱ్ఱ అను విశేషణము ముందు గల సంజ్ఞావాచక శబ్దములు. ఎఱ్ఱగందము (కుచందనము.) ఎఱ్ఱగడ్డ (నీరుల్లి.), ఎఱ్ఱ గన్నేరు (చండకము), ఎఱ్ఱగలిజేరు (వర్షకేతువు.), ఎఱ్ఱగిసె (లాలసి), ఎఱ్ఱగురిజ (కృష్ణల.), ఎఱ్ఱ గోరంట (కురవకము.), ఎఱ్ఱచీమ (తైల పిపీలిక.), ఎఱ్ఱచేమంతి (రక్త సేవంతిక.), ఎఱ్ఱ తుమ్మెద (గండోలి.), ఎఱ్ఱతెగడ (కాకనాసిక.), ఎఱ్ఱ పులుము (కుష్ఠ భేదము.), ఎఱ్ఱప్రత్తి (రక్త కార్పాసము.), ఎఱ్ఱమన్ను (శోణ మృత్తిక.), ఎఱ్ఱమల్లె (ముచుండ.), ఎఱ్ఱ మీను (రోహితము) ఎఱ్ఱమునుగ (మధుశిగ్రువు.), ఎఱ్ఱలొద్దుగు (పట్టిక.), ఎఱ్ఱాముదపుఁజెట్టు (హస్తిపర్ణి.) ఇత్యాదులు.)

**ఎఱ్ఱగొల్ల** (దే.వి.) : ఒకానొకజాతి. బ. ఆజాతి వారు.

**ఎఱ్ఱన** (వై.వి.) : ఎఱుపు, అరుణిమ. (విణ.) : ఎఱ్ఱనిది. (చూ. అలకన.)

**ఎఱ్ఱని వేలుపు** (ద్వ.వి.) : జ్వలనుఁడు, అగ్ని.

**ఎఱ్ఱపోతమ్మ** (ద్వ.వి.) : (ఎఱ్ఱపోతు + అమ్మ) ఒకానొక గ్రామదేవత.

**ఎఱ్ఱవాఱు** (ద్వ.అ.క్రి.) : (ఎఱ్ఱ + పాఱు) ఎఱ్ఱనగు.

**ఎల** (దే.విణ.) : 1. యౌవనము గలది; 2. స్వల్పము; 3. సాక్షి.

**ఎలగోలు** (దే.వి.) : 1. కలకలము; 2. ముందు నడచుట; 3. మొదటి ప్రసరణము; 4. మొదట పటపటమని వచ్చువాన.

**ఎలదోఁట** (దే.వి.) : ఆరామము.

**ఎలనాఁగ** (దే.వి.) : 1. యౌవనముగల ఆఁడుది; 2. ఆఁడుది.

**ఎలనీరు** (ద్వ.వి.) : లేఁత టెంకాయలోని తియ్యని నీరు.

**ఎలమి** (దే.వి.) : 1. వికాసము; 2. సంతోషము.

**ఎలమికాఁడు** (దే.విణ.) : వికాసవంతుఁడు.

**ఎలయు** (దే.అ.క్రి.) : 1. చేరు; 2. ప్రవేశించు; 3. కలుగు; 4. ఆసక్తిపడు.

**ఎలరారు** (దే.అ.క్రి.) : (ఎలరు + ఆరు) అతిశయించు.

**ఎలరు** (దే.వి.) : 1. అతిశయము; 2. వికసనము.

**ఎలరుచు** (దే.అ.క్రి.) : (రూ. ఎలర్చు) 1. అతిశయించు; 2. వికసించు; 3. సంతోషించు.

**ఎలరుపు** (దే.వి.) : సంతోషము. (రూ. ఎలర్పు.)

**ఎలుఁగించు** (దే.అ.క్రి.) : కూయు. (లక్షణ ప్రకారము ఎలిఁగించు అని యుండవలసి యున్నను ప్రతుల యందంతట పాఠమిట్లే యున్నది. కావున ఆలక్షణ మిక్కడ ప్రవర్తింపదని యెఱుఁగ వలెను.)

**ఎలుఁగు** (దే.వి.) : 1. కంఠస్వరము; 2. ఎలుఁగు గొడ్డు. (రూ. ఎల్గు)

**ఎలుఁగుగొడ్డు** (దే.వి.) : ఎలుఁగు, భల్లూకము.

**ఎలుఁగుబంటి** (దే.వి.) : ఎలుఁగు, భల్లూకము.

**ఎలుక** (దే.వి.) : మూషకము. (దీని భేదములు : కల్లెలుక, చిట్టెలుక, చుంచెలుక.)

**ఎలుకచెవి** (ద్వ.వి.) : మూషకపర్ణి.

**ఎలుకజీడి** (ద్వ.వి.) : మూషకపర్ణి.

**ఎలుకమొక్క** (దే.వి.) : ఒకానొక చెట్టు.

**ఎలవు** (దే.వి.) : ఎలుఁగుయొక్క రూపాంతరము.

**ఎల్ల** (దే.వి.) : పొలిమేర ద్ర. సమస్తము. (ఇదియీ యర్థము నందు ద్రుతాంతమైన అవ్యయముగా నుండియు ఎప్పుడును శబ్దము వలె ఎల్ల యందుఁ అని విభక్త్యంతముగాను, ఎల్లబోఁటి బాలుఁడు ఇత్యాది విధమున సమస్త పదముగాను బ్రయోగింపఁబడు చున్నది. మఱియు ఎల్ల వినఁగఁ, ఎల్లఁ శిష్యులను ఇత్యాది ప్రయోగంబులును గానంబడియెడి.)

**ఎల్లమ్మ** (ద్వ.వి.) : (ఎల్ల+అమ్మ) ఎల్లయందుండెడు నొక గ్రామదేవత.

**ఎల్లరు** (దే.స.బ.) : (ఎల్ల+వారు) అందఱు (దీనికేకవచనము ఎల్లవాఁడు.)

**ఎల్లవాఁడు** (దే.స.) : ఎవ్వఁడును.

**ఎల్లాఁపి** (దే.వి.) : (ఎల్ల + ఆఁపి) 1. అడవి యందు జోటు చేసికొని యెల్ల యందుండి కొట్టి దోఁచెడు దొంగ; 2. దొంగ.

**ఎల్లాఁపికత్తియ** (ద్వ.వి.) : దొంగతనము గల స్త్రీ. (రూ. ఎల్లాఁపికత్తె)

**ఎల్లి** (దే.వి.) : 1. గొడుగు; 2. ఏ. తేపు.

**ఎల్లిదము** (దే.వి.) : చులుకఁదనము (చూ. ఏలిదము) (విణ.) : చులుకనిది. (ఇది ఏలిదము యొక్క రూపాంతరము.)

**ఎల్లిదుఁడు** (దే.విణ.) : చులుకనివాఁడు.

**ఎల్లుండి** (దే.వి.) : రేపటికి ఆవలిదినము.

**ఎవఁడు** (దే.స.) : ఏవాఁడు యొక్క రూపాంతరము.

**ఎవత** (దే.స.ఏ.) : ఎవరిత యొక్క రూపాంతరము.

**ఎవతి** (దే.స.ఏ.): ఎవరితి యొక్క రూపాంతరము.

**ఎవతుక** (దే.స.ఏ.) : (ఎవత+క) ఏస్త్రీ. (ఇక్కడ స్వార్థమున ప్రత్యయము. క ప్రత్యయము పరమగునపుడు ఉకారము వచ్చును. ఇట్లు ఇతర స్థలములయందును తెలియునది.)

**ఎవతె** (దే.స.ఏ.) : ఎవరితెయొక్క రూపాంతరము.

**ఎవయు** (దే.అ.క్రి.) : ఎగయు యొక్క రూపాంతరము.

**ఎవరిత** (దే.స.ఏ.) : (ఎవరి+త) ఏస్త్రీ. (రూ. ఎవర్త.)

**ఎవరితి** (దే.స.ఏ.) : (ఎవరి+తి) ఏస్త్రీ. (రూ. ఎవర్తి.)

**ఎవరితె** (దే.స.ఏ.) : (ఎవరి+తె) ఏస్త్రీ. (రూ. ఎవర్తె.)

**ఎవర్తుక** (దే.స.ఏ.) : (ఎవర్త+క) ఏస్త్రీ. (చూ. ఎవతుక)

**ఎవుచు** (దే.స.క్రి.) : ఎగుచు యొక్క రూపాంతరము.

**ఎవ్వఁడు** (దే.స.) : ఏవాఁడు యొక్క రూపాంతరము. (ఎల్లవాఁడనుటకు.)

**ఎవ్వత** (దే.స.ఏ.) :ఎవ్వరిత యొక్క రూపాంతరము.

**ఎవ్వతి** (దే.స.ఏ.):ఎవ్వరితి యొక్క రూపాంతరము.

**ఎవ్వతుక** (దే.స.ఏ.) : (ఎవ్వత+క) ఏస్త్రీ. (చూ. ఎవతుక.)

**ఎవ్వతె** (దే.స.ఏ.) : ఎవ్వరితె యొక్క రూపాంతరము.

**ఎవ్వరిత** (దే.స.ఏ.) : (ఎవ్వరి+త) ఏస్త్రీ. (రూ. ఎవ్వర్త)

**ఎవ్వరితి** (దే.స.ఏ.) : (ఎవ్వరి + తి) ఏస్త్రీ. (రూ. ఎవ్వర్తి)

**ఎవ్వరితె** (దే.స.ఏ.) : (ఎవ్వరి+తె) ఏస్త్రీ. (రూ. ఎవ్వర్తె)

**ఎవ్వర్తుక** (దే.స.ఏ.) : (ఎవ్వర్త+క) ఏస్త్రీ. (చూ. ఎవతుక)

**ఎవ్వల** (దే.వి.) : ఏవల యొక్క రూపాంతరము.

**ఎవ్వాఁడు** (దే.స.) : (ఏ+వాఁడు) 1. ఏ పురుషుఁడు; 2. ఎల్లవాఁడు. (చూ. ఎవ్వఁడు)

**ఎస** (దే.వి.) : ఆధిక్యము.

**ఎసఁగు** (దే.అ.క్రి.) : 1. తనరు, అతిశయించు. 2. విజృంభించు.

**ఎసకము** (దే.వి.) : 1. అతిశయము; 2. విజృంభణము; 3. విధము.

**ఎసకొను** (దే.అ.క్రి.) : పురికొను. (ప్రే.ఎసకొలుపు.) దీనికి ప్రేరణమునందే ప్రయోగములు కనఁబడుచున్నవి.

**ఎసటిపోఁతలు** (దే.వి.బ.) : (ఎసరు + పోఁతలు) ఎసట వేయఁదగిన బియ్యము.

**ఎసరు** (దే.అ.క్రి.) : మీఱు. (చూ. రూ. ఏసరు) వి. వంటకై కాఁగఁబెట్టిన నీరు.

**ఎసరేఁగు** (దే.అ.క్రి.) : విజృంభించు.

**ఎసలారు** (దే.అ.క్రి.) : (ఎసలు + ఆరు) అతిశయించు.

**ఎసలిక** (దే.వి.) : తీటిక, అవకాశము.

**ఎసలు** (దే.వి.) : దొమ్మి యుద్ధము. (ఇట్లు ఒకఁడు వ్రాసియున్నాఁడు)

**ఎసవు** (దే.అ.క్రి.) : ఎసఁగు యొక్క రూపాంతరము. (కొన్ని యచ్చు పుస్తకముల యందును వ్రాఁత పుస్తకముల యందున ఈ పాఠమున్నది.)

**ఎసవెట్టు** (దే.స.క్రి.) : (ఎస + పెట్టు) పురికొలుపు, ప్రేరించు.

**ఎళనీరు** (ద్వ.వి.) : ఎడనీరు యొక్క రూపాంతరము.

**ఎళ్లము** (మి.గ్రా.వి.) : (ఏడు + పలము) ఏడు పలములు.

**ఎళ్లు** (దే.వి.బ.) : ఎడ్లయొక్క మాఱురూపము.

# ఏ

**ఏ** : ఒక యక్షరము. (యు.దే.స.) : 1.ప్రశ్నమును దెలిపెడి; 2.ఉద్దేశ్యమును దెలిపెడి; (చూ.ఆ.) అవ్య. 1.ప్రశ్నమును దెలిపెడి; 2. మెచ్చుకొనుటను దెలిపెడి; 3. వ్యతిరేకమును దెలిపెడి; 4. ఎక్కువను దెలుపుటకు (చూ. మదిమది.) 5. దుఃఖమును దెలిపెడి; 6. విచారమును దెలిపెడి; 7. ప్రార్థించుటను దెలిపెడి; 8.ఆఁడుదగుటను దెలిపెడి. (అవునే, ఏమే మొ.) (వై.): 1. మఱియొకదాని లేమిని దెలిపెడి; 2. చూపుటను దెలిపెడి; 3. తనంతట అను నర్థమును దెలిపెడి.

**ఏఁకట** (దే.వి.) : 1. మిక్కిలియపేక్ష; 2. అపేక్ష.

**ఏఁకరి** (దే.వి.) : కిరాతభేదము.

**ఏఁకరు** (దే.అ.క్రి.) : వాఁచిపోవు.

**ఏఁకారు** (దే.అ.క్రి.) : ఏఁకరు యొక్క రూపాంతరము.

**ఏఁచు** (దే.స.క్రి.) : కాఱించు, బాధించు.

**ఏఁజెల్ల** (దే.అవ్య.) : (ఏను + చెల్లె) సంతాపమును దెలిపెడిని.

**ఏఁడాది** (దే.వి.) : (ఏఁడు + ఆది) ఏఁడు, సంవత్సరము. (ఏఁడాది అనుచో అది శబ్దము నిరర్థకము. ఇట్టి శబ్దములు మహాకవి ప్రయోగముల యందు ఇంకను కొన్ని కలవు. పంచాది, పాఱాది. మొ.)

**ఏఁడి** (దే.వి.) : ఎక్కడనున్నాఁడు (వాఁడేఁడి) (రూ. ఏఁడీ.) ఏరి, ఏరీ. (వారేరి.)

**ఏఁడికోల** (దే.వి.) : నాఁగటికొయ్య, ఈష.

**ఏఁడు** (దే.వి.) : సంవత్సరము. స. 1. ఏ పురుషుఁడు; 2. ఎల్లవాఁడు.

**ఏఁడుడి** (దే.వి.) : (ఏఁడు + ఊడి) ఆబ్దికము.

**ఏఁదర** (దే.వి.) : కుటుంబములోఁ జేరని స్వతంత్రపు సొత్తు. (వాఁడు కొంత యేఁదర కట్టు కొన్నాఁడు.) (విణ. ) : కుటుంబముతోఁ జేరక స్వతంత్రమైనది. (నాకాయూరిలో ఏఁదర కమతము కలదు.)

**ఏఁదుము** (దే.వి.) : (ఏను+తూము) అయిదు తూములు.

**ఏఁపు** (దే.వి.) : కాఱియ, బాధ.

**ఏఁబండ్రు** (ద్వ.స.) : ఏఁబదిమంది. (ఏఁబదికి మహన్మహత్యర్థక రూపము.)

**ఏఁబది** (ద్వ.స.) : (ఏను + పది) అయిదుపదులు.

**ఏఁబలము** (మి.వి.) : (ఏను + పలము) అయిదు పలములు. (ఇప్పటి వాడుకలో పదిపలములు.)

**ఏకకుండలుఁడు** (సం.వి.అ.పుం.) : 1. బలరాముఁడు; 2. కుబేరుఁడు.

**ఏకకుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) అసహాయుఁడు, ఎక్కటి.

**ఏక గురువు** (సం.వి.ఉ.పుం.) : సహపాఠి, సతీర్థ్యుడు.

**ఏకచరము** (సం.వి.అ.పుం.) : అడవి పంది, ఒంటిగాఁడు. (విణ.) : ఏకాంతమైనది.

**ఏకతమాడు** (ద్వ.అ.క్రి.) : ఆలోచించు.

**ఏకతము** (వై.వి.) : 1. ఆలోచనకుఁదగిన చోటు; 2. ఆలోచన.

**ఏకతానుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఒకట మనసు చెల్లినవాఁడు, ఏకాగ్రుఁడు.

**ఏకతాళము** (సం. వి. అ. పుం.) : 1. లయతోడి కూడిక; 2. తాళభేదము. (నాలుగక్షరముల కాలము.)

**ఏకదంతుఁడు** (సం.వి.అ.పుం.) : వినాయకుఁడు, ఒంటికొమ్ము వేలుపు.

**ఏకదృష్టి** (సం.వి.ఇ.పుం.) : కాకి. (విణ.) : ఒక చూపుకలది.

**ఏకదేశము** (సం.వి.అ.పుం.) : అంశము, భాగము.

**ఏకధురము** (సం.వి.అ.పుం.) : నాఁగటి నైనను బండినైనను మఱిదేనినైనను ఒక్కటిని లాగెడి యెద్దు లోనగునది.

**ఏకధురావహము** (సం.వి.అ.పుం.): నాఁగటి నైనను బండినైనను మఱి దేనినైనను ఒక్కటిని లాగెడి యెద్దు లోనగునది.

**ఏకధురీణము** (సం.వి.అ.పుం.) : నాఁగటి నైనను బండినైనను మఱి దేనినైనను ఒక్కటిని లాగెడి యెద్దు లోనగునది.

**ఏకన** (దే.వి.) : అంచు. (బద్ధకంచము ఏకన నుంచుము.)

**ఏకపత్ని** (సం.వి.ఈ.స్త్రీ.) : పతివ్రత, క్రొత్తడి.

**ఏకపది** (సం.వి.ఈ.స్త్రీ.) : మార్గము, త్రోవ.

**ఏకపింగళుఁడు** (సం.వి.అ.పుం.) : కుబేరుఁడు.

**ఏకము** (సం.స.) : (అ.ఆ.అ.) 1. అన్యము; 2. అసహాయము; 3. ముఖ్యము; 4. ఏ. ఒక్కటి.

**ఏకలము** (సం.వి.అ.పుం.) : అడవిపంది. (ఇది దేశ్యపదముగా వాడఁబడుచున్నదిగాని పూర్వ కవి ప్రయోగము లందట్లు గానఁబడలేదు.)

**ఏకలీఁడు** (వై.వి.) : అడవిపంది, వరాహము. (నలకథయందు అనేక లీలఁ అని, హరిశ్చంద్ర కథ యందు ఏకలీలఁ అనియు ఛేదము.)

**ఏకసర్గుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఏకతానుఁడు.

**ఏకహాయని** (సం.వి.ఈ.స్త్రీ.) : ఒక యేఁడు ఈడుగల ఆవుపెయ్య. (ఏకాబ్ద అనియు.)

**ఏకాంగి** (సం.వి.న్.పుం.) : విరక్తుఁడైన విష్ణు భక్తుఁడు. (విణ.) : ఒంటివాఁడు.

**ఏకాండము** (వై.విణ.) : అఖండము.

**ఏకాంతము** (సం.క్రి.విణ.అ.న.) : అత్యంతము. (విణ.) : 1. మిక్కిలి; 2. ఇద్దఱ కంటె నెక్కువ జనములేనిది. (చోటు.)

**ఏకాకి** (సం.విణ.) : (న్.ఈ.న్.) ఏకకుఁడు.

**ఏకాక్షము** (సం.వి.అ.పుం.) : కాకి. (విణ.) : ఒక కన్నుగలది.

**ఏకాగ్రుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. ఒకట మనసు చెల్లినవాఁడు; 2. కలఁకబాఁఱనివాఁడు.

**ఏకాదశము** (సం.స.న్.) : పదునొకండు. విణ. (అ.ఈ.అ.) పదునొకండవది.

**ఏకాదశి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. పదునొకండవతిథి; 2. పదునొకండు తంత్రులుగల పరివాదిని యను వీణ.

**ఏకాయనగతుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఏకతానుఁడు.

**ఏకాయనుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఏకతానుఁడు.

**ఏకావళి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. ఒక యర్థా లంకారము; (చూ. అలంకారము.) 2. ఒంటి పేటహారము.

**ఏకాష్ఠీల** (సం.వి.ఆ.స్త్రీ.) : చిఱుబొద్ది. (అ. పుం.ము.) ఒక పుష్పము.

**ఏకాహము** (సం.వి.అ.పుం.) : 1. ఒక దినము; 2. మృతిఁబొందిన వారికి పదునొకండవనాడు చేయు శ్రాద్ధము.

**ఏకీభవించు**(సం.అ.క్రి.) : ఒక్కటియగు.

**ఏకీభావము** (సం.వి.అ.పుం.) : ఒక్కటి యగుట, ఐక్యము.

**ఏకు** (దే.స.క్రి.) : 1. దూదిని చక్కఁ జేయు; 2. దూఱు. (కానీ నిన్ను ఏకి కాకులకు వేసెద.) (వి.) : ఏకినదూదిచుట్ట.

**ఏకుడు** (దే.వి.) : దూదియేకుట.

**ఏకె** (ద్వ.స.ఏ.) : (ఏ+అక) ఏమె. (చూ. ఆకె.)

**ఏకోద్దిష్టము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఒకఁడు ఉద్దేశింపఁబడినవాఁడు గాఁగలది. (శ్రాద్ధము.)

**ఏకోను** (దే.వి.) : సమష్టి. (ఏకోనుకు మొత్త మెంత ? మొ.)

**ఏగాని** (దే.వి.) : దుగ్గాని.

**ఏగు** (దే.అ.క్రి.) : చను, పోవు, గమించు.

**ఏగుదెంచు** (దే.అ.క్రి.) : (ఏగు+తెంచు) 1. వచ్చు; 2. పోవు. (చూ. అరుగు దెంచు.)

**ఏగుపెండ్లి** (దే.వి.) : పెండ్లికడపట వధూవరులను ఊరేఁగించునట్టి వేడుక.

**ఏగురు** (దే.స.) : (ఏను + గురు) ఐదుగురు. (ఏనునకు మహన్మహత్యర్థక రూపము.)

**ఏగుస** (ద్వ.వి.) : (ఏను+కుంచము) అయిదు కుంచములు.

**ఏచే** (దే.విణ.) : 1. గ్రామ్యము; 2. వక్రము. (ఏచకంకటిచుక్క.)

**ఏచేకంకటిచుక్క**(ద్వ.వి.) : ఉత్తరాషాఢ నక్షత్రము.

**ఏచు** (దే.అ.క్రి.) : 1. అతిశయించు; 2. పెరుగు; 3. విజృంభించు.

**ఏట** (దే.వి.) : పక్షము. (రూ. ఏటము.)

**ఏటవాలు** (దే.వి.) : 1. వంపు; 2. పక్షపాతము.

**ఏటికపాము** (దే.వి.) : (చూ.) ఎమిడిక.

**ఏటికోళ్లు** (దే.వి.బ.) : 1. ప్రవర చెప్పి చేయు నమస్కారము; 2. నమస్కారము.

**ఏటిరింత** (దే.వి.) : ఏత్రింత.

**ఏటిఱేఁడు** (దే.వి.) : (ఏఱు+ఱేఁడు) సముద్రుఁడు, సరిత్పతి.

**ఏటు** (దే.వి.) : 1. బాణ ప్రయోగము; 2. బాణహతి.

**ఏటులాడు** (దే.అ.క్రి.) : (ఏటులు + ఆడు) ఆయుధపాణులై పోట్లాడు.

**ఏత్రింత** (దే.వి.) : భారద్వాజపక్షి. (ఏటిరింత యొక్క రూపాంతరము.)

**ఏడ** (దే.వి.ఏ.) : ఎక్కడ యొక్క రూపాంతరము.

**ఏడక** (సం.వి.ఆ.స్త్రీ.) : గొఱ్ఱె. (అ.పుం.ము.) : పొట్టేలు.

**ఏడగజము** (సం.వి.అ.పుం.) : తగిరిస.

**ఏడమూకుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. చెవిటిమూఁగ; 2. మోసకాఁడు.

**ఏడాకుపొన్న** (ద్వ.వి.) : (ఏడు + ఆకుపొన్న) ఒక దినుసు పొన్న, సప్తచ్ఛదము.

**ఏడాకులరఁటి** (దే.వి.) : (ఏడు + ఆకుల + అరఁటి.) ఒక దినుసు అరఁటి, సప్తవర్ణము.

**ఏడాగోడము** (దే.విణ.) : విరుద్ధము. (ఏడాగోడపు మాట. మొ.)

**ఏడాటలాడించు** (దే.స.క్రి.) : (ఏడు + ఆటలు + ఆడించు) మిక్కిలి శ్రమపఱచు. (వాఁడు నన్ను ఏడాట లాడించినాఁడు.) (ఏడాట లాడించుట = సప్త వ్యసనములను గలుగఁ

జేయుట. అనఁగా సప్త వ్యసనములు గలిగి నప్పుడు ఎంత శ్రమము కలుగునో అంత శ్రమమును గలిగించుట అని యర్థము ఉండ వచ్చును.)

**ఏడిక** (వై.వి.) : పొట్టేలు, ఏడకము.

**ఏడు** (దే.స.) : ఆఱునొకటి.

**ఏడుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) చెవిటివాఁడు.

**ఏడుగడ** (దే.విణ.) : (ఏడు + కడ) (గురువు, తల్లి, తండ్రి, పురుషుడు, విద్య, దైవము, దాత అని సప్త ప్రకారములు గల) రక్షకము.

**ఏడుగురు** (దే.స.) : ఏడుమంది. (ఏడునకు మహన్మహత్యర్థక రూపము.)

**ఏడుచు** (దే.అ.క్రి.) : రోదనము చేయు. (రూ. ఏడ్చు.)

**ఏడుపు** (దే.వి.) : రోదనము (రూ. ఏడ్పు.)

**ఏడూకము** (సం.వి.అ.న.) : (చూ.) మెత్తినగోడ. (రూ. ఏడుకము)

**ఏడ్గడ** (దే.విణ.) : ఏడుగడ యొక్క రూపాంతరము.

**ఏడ్తెఱ** (దే.వి.) : 1. అతిశయము; 2. పరా క్రమము; 3. విజృంభణము.

**ఏడ్దుము** (ద్వి.వి.) : (ఏడు+తూము) ఏడు తూములు.

**ఏణము** (సం.వి.అ.పుం.) : పెద్దకన్నులు గల నల్లయిఱ్ఱి.

**ఏణి** (సం.వి.ఈ.స్త్రీ.) : పెద్దకన్నులుగల నల్లలేడి.

**ఏతఁడు** (దే.స.ఏ.) : (ఏ + ఁడు) ఎతఁడు (చూ. అతఁడు)

**ఏతము** (ఉభ.వై.వి.) : నీళ్లెత్తెడు యంత్ర విశేషము. ఆరఘట్టము. (సం.వి.అ. పుం.) : చిత్ర వర్ణము. (విణ.) : 1. చిత్రవర్ణము గలది; 2. వచ్చినది.

**ఏతరి** (దే.విణ.) : దుర్నయపరుఁడు.

**ఏతాము** (వై.వి.) : ఏతము యొక్క రూపాంతరము.

**ఏతు** (దే.వి.) : ఉద్ధతి. (ఈ యర్థమింకను విచారణీయము.)

**ఏతుల** (దే.వి.) : చాఁపలల్లెడు మనుష్య జాతి విశేషము.

**ఏతెంచు** (దే.అ.క్రి.) : (ఏగుదెంచు యొక్క రూపాంతరము) 1. వచ్చు; 2. పోవు. (వెనుక మఱియొకచో.)

**ఏద** (దే.వి.) : ఒకానొక చెట్టు.

**ఏదడి** (దే.వి.) : ఒక దినుసు ఎలుఁగుగొడ్డు. (అప్ర.)

**ఏది** (దే.స.) : ఎది. (అవ్య.) : ఎట్లు.

**ఏదీ** (దే.ని.) : ఎక్కడనున్నది. (అవ్య.) : ఎట్లు. (చూ. ఏది.)

**ఏదు** (యు.దే.అ.క్రి.) : నశించు. (వి.) : ముండ్ల పంది, శల్యము. (వై.స.క్రి.) : పెంచు.

**ఏదుడు** (దే.వి.) : విడుపు. (ఇట్లు ఒకానొక నిఘంటు కారుఁడు వ్రాసియున్నాడు. అది విచారింపఁదగినది.)

**ఏదువేఁట** (దే.వి.) : వేఁటలో భేదము.

**ఏధ** (సం.వి.ఆ.స్త్రీ.) : ధనాది సమృద్ధి, నింపు. (అ.పుం.ము.) : 1. చిదుగు; 2. వంట చెఱకు. (ఇది వెనుకటి రెండర్థముల యందు సకారాంత క్లీబంబునగు.)

**ఏధితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) వృద్ధి పొందినది.

**ఏనస్సు** (సం.వి.స్.న.) : 1. అపరాధము; 2. పాపము.

**ఏనాదము** (దే.వి.) : సముద్రతీరము.

**ఏనాది** (దే.వి.) : అడవియందు వాసముచేసెడి యొక హీనజాతివాఁడు.

**ఏనాళ్లు** (దే.వి.బ.) : (ఏను + నాళ్లు) 1. అయిదు దినములు; 2. వివాహానంతరము వియ్యంకు లొకరి కొకరు పంపెడు సారె.

**ఏని** (దే.అవ్య.) 1. పక్షాంతరమును దెలిపెడిని; 2. వికల్పమును దెలిపెడిని; 3. బొత్తిగా అను నర్థమును దెలిపెడిని. (ఏనియునని ప్రయో గింపఁబడుటచే దీనిని ద్రుతప్రకృతికముగా గ్రహింపఁగూడదు. ఏనిఁ ఏఁ అను రూపములు యువర్ణమును నివర్ణమును లోపింపఁగా నైనవని యెఱుంగునది. ఎందేని, ఎన్నఁడేని ఇత్యాదుల యందలి యేనిశబ్దము వాక్యాలంకార నిబద్ధమని యెఱుంగునది.)

**ఏనిక** (వై.వి.) : ఏనుఁగు.

**ఏనికతిండి** (ద్వ.వి.) : సింహము.

**ఏనికదోమ** (ద్వ.వి.) : తొండపుదోమ, ఘోణిక.

**ఏను** (దే.స.) : 1. అయిదు; (ఇందలి ఉకారము వికల్పముగ లోపించును. ఉదా. ఏన్పర్వంబులు) 2. నేనుయొక్క రూపాంతరము.

**ఏనుఁగు** (వై.వి.) : ఏనిక విణ. పెద్దది. (ఏనుఁగు కలబంద, ఏనుఁగుకాలు, ఏనుఁగుతుమ్మి, ఏనుఁగు పల్లేరు, ఏనుఁగుజలగ, ఏనుఁగుబీఱ. మొ.)

**ఏనుఁగుకలబంద** (ద్వ.వి.) : నారకుపయోగించెడి పెద్ద కలబంద.

**ఏనుఁగు కొమ్ములు** (ద్వ.వి.బ.) : శాలిధాన్య విశేషము.

**ఏనుఁగడుగులు** (దే.వి.బ.) : (ఏనుఁగు + అడుగులు.) : చిత్రవర్ణ వస్త్ర విశేషము.

**ఏనుఁగుగొంగ** (ద్వ.వి.) : ఏనికతిండి, సింహము. (ఏనుఁగుఁబగఱ అనియు.)

**ఏనుఁగుబల్లేరు** (ద్వ.వి.) : పెద్దపల్లేరు.

**ఏనుఁగు మోముసామి** (వై.వి.) : విఘ్నేశ్వరుఁడు, గజాననుఁడు.

**ఏనుఁగురాకాసి** (గొంగ ద్వ.వి.) : శివుఁడు, గజాసురవైరి.

**ఏనుఁగుసొరము** (వై.వి.) : సప్త స్వరములలో నొకటి, నిషాదము.

**ఏనూఱు** (దే.స.) : (ఏను + నూఱు) అయిదు నూఱులు.

**ఏపరించు** (దే.స.క్రి.) : దుఃఖపఱచు.

**ఏపారు** (దే.అ.క్రి.) : (ఏపు + ఆరు) 1. అతిశయించు; 2. విజృంభించు.

**ఏపు** (దే.వి.) : 1. ఆధిక్యము; 2. విజృంభణము. (చూ. ఏపారు.) (ఈ పదమును ఆధునికులు కొందఱు ప్రకారార్థమందు ప్రయోగించి యున్నారు.)

**ఏపె** (దే.వి.) : సాలము. ద్వ.స.ఏ. (ఏ + అప) ఏమె. (చూ. ఆకె.)

**ఏబిడ** (దే.స.ఏ.) : (ఏ + బిడ్డ) ఏపె.

**ఏమఱిల్లు** (దే.అ.క్రి.) : ఏమఱు, ప్రమాదపడు.

**ఏమఱు** (దే.అ.క్రి.) : ఏమఱిల్లు.

**ఏమఱుచు** (దే.ప్రే.) : ఏమఱఁజేయు.

**ఏమఱుపాటు** (ద్వ.వి.) : 1. అకస్మాత్తుగా; 2. వంచనగా.

**ఏమి** (దే.స. ఏ.ఏది.) : అవ్య. ప్రశ్నమును దెలిపెడిని. (హల్లు పరమగునపుడును కడపటను మివర్ణకమును వికల్పముగా లోపము.) (రూ. ఏమీ.)

**ఏమె** (ద్వ.స.ఏ.) : (ఏ + అను) ఏ పూజ్యురాలు. (చూ. ఆకె.)

**ఏయది** (దే.స.) : (ఏ + అది) ఏది.

**ఏయు** (దే.స.క్రి.) : (బాణము) ప్రయోగించు.

**ఏరండము** (సం.వి.అ.పుం.) : ఆముదపుఁజెట్టు.

**ఏరవకడ** (దే.వి.) : డావరడంగి, దేవతాళము.

**ఏరాది** (దే.వి.) : (ఎరవు + అది) ఒక దాని సంతతియైన గుల్మము.

**ఏరాలు** (దే.వి.) : (ఎరవు + ఆలు) తోడికోడలు.

**ఏరాళము** (వై.వి.) : 1. అధికము; 2. అసంఖ్యము. (ఏరాళము = ఏరాళముగా ననియర్థము.) (చూ. హేరాళము.)

**ఏరు** (దే.వి.) : 1. ఎద్దులను గట్టి దున్నుటకు సిద్ధపఱచిన నాఁగలి; 2. తలనొప్పి.

**ఏరుగు** (దే.అ.క్రి.) : విష్ఠించు. వి. విష్ఠ.

**ఏరునేల** (దే.వి.) : భూపరిమాణ విశేషము.

**ఏరుపడు** (ద్వ.అ.క్రి.) : 1. తేటపడు; 2. నిర్ణయింపఁబడు; 3. బయలుపడు; 4. రూపువడు; 5. వేఱుపడు; 6. సిద్ధ పడు. (చూ. ఏర్పడు.)

**ఏరుపాటు** (ద్వ.వి.) : ఏర్పాటునకు మొదటి రూపము.

**ఏరువాక** (దే.వి.) : దుక్కి యొక్క ప్రారంభము.

**ఏర్చు** (దే.అ.క్రి.) : తలనొచ్చు. స.క్రి. 1. ఏర్పఱచు; 2. చక్కఁబఱచు; 3. దహించు.

**ఏర్పడు** (ద్వ.అ.క్రి.) : 1. తేటపడు; 2. బయలు పడు; 3. రూపగు; (దానికి అంగములేర్పడ్డవి)

4. నిర్ణయింపఁబడు; (క్షత్రియుఁడు రాజుగా నేర్పడును.) 5. వేఱుపడు.

**ఏర్పాటు** (ద్వ.వి.) : 1. నిర్ణయము; 2. నియమము; 3. వివరణము. (ఏరుపాటు యొక్క రూపాంతరము.)

**ఏర్పు** (దే.వి.) : మంట.

**ఏఱు** (దే.స.క్రి.) : క్రిందనుండు వస్తువుల నొకటొకటిగా ఎత్తు. (వి.) : నది.

**ఏఱుజాజి** (ద్వ.వి.) : ధాతకి.

**ఏఱుపిడక** (దే.వి.) : నేలఁబడి యెండి యేఱఁబడెడి పేఁడకడి, కరీషము. (దీనిని ఏఱునుగ్గులనియుఁ జెప్పుదురు.)

**ఏఱుపుచ్ఛ** (దే.వి.) : కలింగపత్రము.

**ఏఱుమద్ది** (దే.వి.) : నదీసర్జము.

**ఏఱుమల్లియ** (ద్వ.వి.) : వాసంతిక. (రూ. ఏఱు మల్లె)

**ఏఱువ** (దే.వి.) : విలాతి, దేశము.

**ఏఱువంగ** (ద్వ.వి.) : గండీరము.

**ఏఱువావిలి** (దే.వి.) : సప్తల.

**ఏల** (ఉభ.దే.అవ్య.) : ఎందుకు.(రూ.) ఏలా. (వై.వి.): 1.ఒక యేఱు; (దీనినే ఏలేఱందురు. ఇది పీఠాపురము సమీపమునఁ బాఱునట్టిది.) 2. (బ.) : శృంగారపుఁబాట. (సం.ఆ.స్త్రీ.) : పేరేలకి.

**ఏలకి** (వై.వి. ఏల.) : (దీని భేదము చిట్టేలకి.)

**ఏలకికాయ** (ద్వ.వి.) : 1. భక్ష్యవిశేషము; 2. ఏలాఫలము.

**ఏలపాటలు** (ద్వ.వి.బ.) : బాలక్రీడా విశేషము.

**ఏలము వెలము** (హిం.) : అమ్ముటలో నొకవిధము.

**ఏలము** (వై.వి.) : కల్లుగీచువాఁడు ఆతోఁపునందు వేసికొనెడు గుడిసె.

**ఏలముపట్టు** (ద్వ.వి.) : ఆలంబనము. (చూ. నాగగండ)

**ఏలాపర్ణి** (సం.వి.ఈ.స్త్రీ.) : కారేలకి.

**ఏలాము** (వై.వి.) : ఏలము యొక్క రూపాంతరము.

**ఏలావాలుకము** (సం.వి.అ.న.) : నూఁగు దోస. (రూ. ఏల వాలుకము)

**ఏలి** (దే.విణ.) : కృత్రిమము.

**ఏలిక** (దే.వి.) : 1. రాజు; 2. ఒడయఁడు.

**ఏలికసాని** (ద్వ.వి.) : దొరసాని, రాజ్ఞి.

**ఏలిదము** (దే.వి.) : చులుకఁదనము. (విణ.) : చులుకనిది. (చూ. ఎల్లిదము.)

**ఏలినవాఁడు** (దే.వి.) : ఏలిక, రాజు.

**ఏలు** (దే.స.క్రి.): 1. పరిగ్రహించు; 2. పాలించు.

**ఏలుకొను** (దే.స.క్రి.) : ఏలు, పరిగ్రహించు.

**ఏలుకోటి** (మి.వి.): ఏలుబడికి లోపడిన జనము, ప్రకృతి జనము.

**ఏలుబడి** (దే.వి.) : ఏలుట, పాలనము.

**ఏవ** (దే.వి.) : రోఁత. విణ. రోఁత యైనది. (రూ. ఏవము.)

**ఏవకాఁడు** (దే.విణ.) : 1. రోఁత గలవాఁడు; 2. ఓర్వలేని తనముకలవాఁడు.

**ఏవగించు** (దే.అ.క్రి.) : రోఁతపడు. 1. నిందించు; 2. విడుచు.

**ఏవపడు** (ద్వ.అ.క్రి.) : రోఁతపడు.

**ఏవల** (దే.వి.) : (ఏ + వలను) ఏప్రక్క. (చూ. ఎవ్వల.)

**ఏవాఁడు** (దే.స.) : 1. ఏపురుషుఁడు; 2. ఎల్ల వాఁడు (చూ. ఎవ్వఁడు.)

**ఏవురు** (దే.స.): ఏగురు యొక్క రూపాంతరము.

**ఏషణి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. నారాచాకృతియైన యగసాలె వాని త్రాసు; 2. పుంటి కంటఁ జొప్పించెడు శలాక.

**ఏష్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కాఁగలది.

**ఏస** (దే.వి.) : విజృంభణము. (చూ. ఏసరేఁగు) (విణ.) : 1. గ్రామ్యము; 2. వంకర.

**ఏసరు** (దే.అ.క్రి.) : మీఱు.

**ఏసరేఁగు** (దే.అ.క్రి.) : విజృంభించు.

**ఏసి** (దే.అవ్య.): 1. వంతున. (రెండేసి, మూడేసి. మొ.) 2. కొలఁదిని దెలుపును.

# ఐ

**ఐ** : ఒక యక్షరము

**ఐంగుదము** (సం.వి.అ.న.) : గారపండు.

**ఐందవము** (సం.విణ.) : (అ.ఈ.అ.) ఇందు సంబంధమైనది (ఇందుఁడు = చంద్రుఁడు)

**ఐంద్రజాలికుఁడు** (సం.వి.అ.పుం.) : ఇంద్రజాల విద్య నేర్చినవాఁడు.

**ఐంద్రము** (సం.వి.అ.పుం.) : 1. ఒక గ్రహ యోగము; 2. మాలకాకి.

**ఐంద్రియకము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చక్షురాదీంద్రియ గోచరమైనది, ప్రత్యక్షము.

**ఐకకంఠ్యము** (సం.వి.అ.న.) : ఏకకంఠత్వము, ఒద్దిక.

**ఐకమత్యము** (సం.వి.అ.న.) : ఏకమతిత్వము, ఒద్దిక.

**ఐకాగారికుఁడు** (సం.వి.అ.పుం.) : చోరుఁడు, దొంగ.

**ఐకాగ్ర్యుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఏకతానుఁడు.

**ఐక్యము** (సం.వి.అ.న.) : ఏకీభావము, ఒరిమ.

**ఐణము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఏణము యొక్క చర్మము మొదలైనది. (ఏణము = ఇఱ్ఱి.)

**ఐణేయము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఏణి యొక్క చర్మము మొదలైనది. (ఏణము = లేడి.)

**ఐతి** (దే.విణ.) : వల్ల, శక్యము. (అయితి యొక్క రూపాంతరము.)

**ఐతిహాసికుఁడు** (సం.వి.అ.పుం.) : ఇతిహాసము తెలిసిన వాఁడు. (విణ.) : ఇతిహాస సంబంధము గలవాఁడు.

**ఐతిహ్యము** (సం.అవ్య.) : పారం పర్యముచేనగు ఉపదేశము. (ఇది అకారాంత నపుంసకమని కొందఱు.)

**ఐదు** (దే.స.) : నాలుగునొకటి. (అయిదు యొక్క రూపాంతరము)

**ఐదుగురు** (దే.స.) : (ఐదునకు మహన్మత్యర్థక రూపము) ఐదుమంది. (అయిదుగురు యొక్క రూపాంతరము)

**ఐదుపదిచేయు** (దే.అ.క్రి.) : 1. నమస్కరించు; 2. ఓడిపోవు. (ఓడిపోవు వారును చేతులు కూర్చి మ్రొక్కెదురు కనుక దీనికి ఓడిపోవుట యను నర్థము కలిగెను.) (అయిదు పదిచేయు యొక్క రూపాంతరము.)

**ఐదుమోముల వేల్పు** (ద్వ.వి.) : శివుఁడు, పంచముఖుఁడు.

**ఐదువ** (ద్వ.వి.) : (ఐదు + వన్నెలు గలది) మాంగల్యముగల స్త్రీ. (వన్నె యనఁగా ఇక్కడ సుమంగలి యొక్క అలంకారము. ఐదేవనగా : మంగళ సూత్రము, పసుపు, కుంకుమము, గాజులు, చెవ్వాకు.) (అయిదువ యొక్క రూపాంతరము)

**ఐదువరాలు** (ద్వ.వి.) : (ఐదువ + ఆలు) ఐదువ. (ఇక్కడ ఐదువ శబ్దము విశేషణము. చూ. ఆలు) (అయిదు వరాలు యొక్క రూపాంతరము)

**ఐద్దాయులు** (దే.వి.బ.) : (ఐదు + దాయులు) వడ్లవాఁడు కమ్మరవాఁడు కంచరవాఁడు అగసాలె వాఁడు కాసెవాఁడు వీరిపనులు.

**ఐన** (దే.ద్ర.) : ముందు చెప్పఁబడిన దానికి విరుద్ధ మయిన యర్థమును దెలుపును.

**ఐనిల్లు** (దే.వి.) : నట్టిల్లు, అంతర్గృహము. (అయినిల్లు యొక్క రూపాంతరము)

**ఐపు** (దే.వి.) : తప్పు, దోషము. (అయిపు యొక్క రూపాంతరము)

**ఐపోవు** (దే.అ.క్రి.) : 1. వెచ్చమై తీఱు; (సంబారములన్ని అయిపోయినవి.) 2. ముగియు.(వాఁడు ఉద్యోగము చేసి అయి పోయనది.) (అయిపోవు యొక్క రూపాంతరము)

**ఐమూల** (దే.విణ.) : మూల వాటు. (అయిల్లు ఐమూలగా నున్నది) (అయిమూల యొక్క రూపాంతరము)

**ఐర** (దే.వి.) : నేత్రరోగవిశేషము. (అయిర యొక్క రూపాంతరము)

**ఐరకొను** (దే.అ.క్రి.) : చక్కఁబడు (అయిరకొను యొక్క రూపాంతరము)

**ఐరావణము** (సం.వి.అ.పుం.) : ఇంద్రుని యేనుఁగు, ఐరావతము.

**ఐరావతము** (సం.వి.అ.న.) : వంపు లేని నిడు పాటి యింద్రధనుస్సు (పుం.) 1. ఇంద్రుని యేనుఁగు; 2. ఒకానొక పాము; 3. మబ్బు మీఁద వచ్చెడి మబ్బు; (దీనిని రాజ మేఘ మందురు) 4. నారదబ్బ; 5. నిమ్మ.

**ఐరావతి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. మెఱపు; 2. కోల మెఱవు.

**ఐరేని** (దే.వి.ఏ.) : బచ్చెనపని చేసిన పెండ్లి కుండలు. (అయిరేని యొక్క రూపాంతరము)

**ఐలబిలుఁడు** (సం.వి.అ.పుం.) : కుబేరుఁడు, పైఁడిఱేఁడు.

**ఐలారము** (దే.వి.) : మూలికా విశేషము. (అయిలారము యొక్క రూపాంతరము)

**ఐలేయము** (సం.వి.అ.న.) : నూఁగుదోస.

**ఐవచ్చే** (దే.అ.క్రి.) : అచ్చివచ్చు (అయి వచ్చు యొక్క రూపాంతరము)

**ఐశ్వర్యము** (సం.వి.అ.న.) : 1. అణిమాది; (అవి. ౮, అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము) 2. సంపద.

**ఐహికము** (సం.విణ.) : (అ.ఈ.అ.) ఇహలోక సంబంధమయినది.

## ఒ

**ఒ** : ఒక యక్షరము. (దే.అవ్య.) : సందేహమును దెలుపును.

**ఒంకియ** (వై.వి.) : ఒంకె.

**ఒంకె** (వై.వి.) : పాగ మొదలైనవి తగిలించెడు చిలుకకొయ్య (ఒంకియ యొక్క రూపాంతరము)

**ఒంజిలి** (దే.వి.) : దుఃఖము. (విణ.) : దుఃఖము కలవాఁడు (లేక) దుఃఖము కలది. (చూ. ఒందిలి)

**ఒంటరము** (దే.వి.) : విరోధము.

**ఒంటరి** (ద్వ.వి.) : (ఒంటి + అరి) అసహాయుఁడైన బంటు. (విణ. ఏకాకి.

**ఒంటరికాఁడు** (ద్వ.వి.) : 1. పంది, ఏక చరము; 2. అసహాయుఁడయిన బంటు. (విణ.) : ఏకాకి. (స్వార్థమున కాఁడు)

**ఒంటరిపాటు** (ద్వ.వి.) : ఒంటి, ఏకాకిత్వము.

**ఒంటరీఁడు** (ద్వ.వి.) : (ఒంటరి + ఈఁడు) అసహాయుఁడైన బంటు. (స్వార్థమున ఈఁడు.)

**ఒంటి** (వై.వి.) : ఏకాకిత్వము.

**ఒంటింపు** (దే.వి.) : 1. ఆనుకూల్యము; 2. వీఁడు వీఁడీ యాపనిని జేయ వలయునని యేర్పఱుచు నేర్పాటు. (చూ. ఆరగింపు.)

**ఒంటికంటిగాము** (ద్వ.వి.) : చుక్క, శుక్రుఁడు.

**ఒంటికాఁడు** (ద్వ.వి.) : పంది, ఏకచరము. (విణ.) : 1. ప్రియురాలి నెడఁ బాసినవాఁడు, వియోగి; 2. ఏకాకి.

**ఒంటికొమ్మువేలుపు** (ద్వ.వి.) : వినాయకుఁడు, ఏకదంతుఁడు.

**ఒంటిపాటు** (వై.వి.) : ఏకాంతము.

**ఒంటిపోఁగు** (ద్వ.వి.) : బలరాముఁడు, ఏకకుండలుఁడు. (చూ. వితావిత)

**ఒంటియ** (వై.వి.) : ఒంటె, లొటిపిట.

**ఒంటియడుగుఁగత్తెర** (ద్వ.వి.) : మల్లబంధ విశేషము.

**ఒంటు** (దే.అ.క్రి.) : ఇముడు, అను కూలించు. (స.క్రి.) : చేరు. (వి.) : 1. గ్రామ సమూహము; 2. (బ.) : పురుషుల కర్ణభూషణము.

**ఒంటుకొను** (దే.స.క్రి.) : చేరు.

**ఒంటె** (వై.వి.) : ఉష్ట్రము. (ఒంటియ యొక్క రూపాంతరము.)

**ఒంటెపులి** (ద్వ.వి.) : మృగ విశేషము. (అప్ర.)

**ఒంట్రింపు** (ద్వ.వి.) : అసహాయుఁడైన బంటు (చూ. ఒంటరీఁడు)

**ఒంట్లు** (యు.దే.వి.బ.) : (ఒంటు+లు) పురుషుల కర్ణభూషణము. (వై. ) : అంకెలు.

**ఒండు** (వై.స.) : 1. అన్యము; 2. ఏ. ఏకము.

**ఒండె** (దే.ద్ర.) : 1. అటుకానిపక్షమున; 2. కాని.

**ఒండేని** (దే.అవ్య.) : (ఒండె౯ + ఏని) ఒండె.

**ఒండొండ** (దే.అవ్య.) : (ఒండు + ఒండు + అ) క్రమ క్రమముగా.

**ఒందిక** (దే.వి.) : ఒద్దిక. (ఒద్దిక యొక్క రూపాంతరము.)

**ఒందిలి** (దే.వి.) : దుఃఖము. (విణ.) : దుఃఖము కలవాఁడు (లేక) దుఃఖము కలది.

**ఒందు** (దే.అ.క్రి.) : కలుగు. (స.క్రి.) : పొందు.

**ఒక** (వై.స.) : (వృత్తి యందు ప్రత్యయము లోపించిన రూపము) 1. ఒక్క, 2. ఒకానొక. (ఒకించుక, ఒకింత ఇత్యాదులయందు ఇది యల్పార్థకమని యెఱుంగునది.)

**ఒకఁడు** (వై.స.) : 1. అన్యుఁడు; 2. ఏ. ఏకకుఁడు (లేక) అన్యము, ఏకము.

**ఒకట** (వై.ద్ర.) : 1. ఏక కాలమున; (చూ. ఒక్కొట) 2. కూడ (చూ. ఒక్కట)

**ఒకటి** (వై.స.ఏ.) : 1. ఏకము; 2. అన్యము.

**ఒకత** (వై.స.ఏ.) : ఒకరిత యొక్క రూపాంతరము.

**ఒకతి** (వై.స.ఏ.) : ఒకరితి యొక్క రూపాంతరము.

**ఒకతుక** (వై.స.ఏ.) : (ఒకత + క) (చూ.) ఒకరిత (చూ. ఎవతుక)

**ఒకతె** (వై.స.ఏ.) : ఒకరితె యొక్క రూపాంతరము.

**ఒకరిత** (వై.స.ఏ.) : (ఒకరి + త) 1. ఏకస్త్రీ; 2. అన్యస్త్రీ. (రూ.) ఒకర్త.

**ఒకరితి** (వై.స.ఏ.) : (ఒకరి + తి) 1. ఏకస్త్రీ; 2. అన్యస్త్రీ. (రూ.) ఒకర్తి.

**ఒకరితె** (వై.స.ఏ.) : (ఒకరి + తె) 1. ఏకస్త్రీ; 2. అన్యస్త్రీ. (రూ.) ఒకర్తె.

**ఒకరుఁడు** (వై.స.) : (చూ.) ఒకఁడు.

**ఒకరువుఁడు** (వై.స.) : (చూ.) ఒకఁడు.

**ఒకర్తు** (వై.స.ఏ.) : (ఒకర్త + ఉ) (చూ.) ఒకరిత.

**ఒకర్తుక** (వై.స.ఏ.) : (ఒకర్త + క) (చూ.) (చూ. ఎవతుక)

**ఒకానొక** (వై.విణ.) : (వృత్తి యందు ప్రత్యయము లోపించిన రూపము) ఉద్దేశింపఁబడని. (ఒకానొక పురుషుఁడు, ఒకానొక స్త్రీ, ఒకానొక మృగము. మొ.) (దీనిని ప్రత్యయముతో చేర్చి చెప్పునపుడు మహదర్థమున ఒకానొకఁ డనియు, మహత్యర్థమున ఒకనొకత యనియు, అమహదర్థ మున ఒకానొకటియనియు రూపములు.)

**ఒకొ** (దే.అవ్య.) : సందేహమును దెలుపును, (రూ.) ఒకో.

**ఒకొఁడు** (వై.స.) : (చూ.) ఒకఁడు (చూ. ఒక్కొఁడు)

**ఒకొట** (వై.ద్ర.) : (చూ.) ఒకట.

**ఒకొటి** (వై.స.ఏ.) : (చూ.) ఒకటి.

**ఒకొత** (వై.స.ఏ.) : ఒకొరిత యొక్క రూపాం తరము.

**ఒకొతి** (వై.స.ఏ.) : ఒకొరితి యొక్క రూపాం తరము.

**ఒకొతుక** (వై.స.ఏ.) : (ఒకొత + క) చూ. ఒకరిత. (చూ. ఎవతుక)

**ఒకొతె** (వై.స.ఏ.) : ఒకొరితె యొక్క రూపాం తరము.

**ఒకొరిత** (వై.స.ఏ.) : (ఒకొరి + త) (చూ.) ఒకరిత, (రూ.) ఒకొర్త.

**ఒకొరితి** (వై.స.ఏ.) : (ఒకొరి+తి) (చూ.) ఒకరిత, (రూ.) ఒకొర్తి.

**ఒకొరితె** (వై.స.ఏ.) : (ఒకొరి+తె) (చూ.) ఒకరిత, (రూ.) ఒకొర్తె.

**ఒకొరుఁడు** (వై.స.) : (చూ.) ఒకఁడు.

**ఒకొరువుఁడు** (వై.స.) : (చూ.) ఒకఁడు.

**ఒకొర్తు** (వై.స.ఏ.) : (ఒకొర్త + ఉ) (చూ. ఒకరిత)

**ఒకొర్తుక** (వై.స.ఏ.) : (ఒకొర్తు + క) (చూ. ఒకరిత) (చూ. ఎవతుక)

**ఒక్క** (వై.స.) : ఒక యొక్క రూపాంతరము. (చూ. ఒక)

**ఒక్కఁడు** (వై.స.) : ఒకఁడు యొక్క రూపాంతరము.

**ఒక్కట** (వై.ద్ర.) : ఒకట యొక్క రూపాంతరము.

**ఒక్కటి** (వై.స.ఏ.) : ఒకటి యొక్క రూపాంతరము.

**ఒక్కత** (వై.స.ఏ.) : ఒక్కరిత యొక్క రూపాంతరము.

**ఒక్కతి** (వై.స.ఏ.) : ఒక్కరితి యొక్క రూపాంతరము.

**ఒక్కతుక** (వై.స.ఏ.) : ఒకతుక యొక్క రూపాంతరము.

**ఒక్క** (తె.వై.స.ఏ.) : ఒక్కరితె యొక్క రూపాంతరము.

**ఒక్కప్రొద్దు** (వై.వి.) : వ్రతాదులచే నియమముతోఁ జేయునట్టియొక్క పూఁట భోజనము.

**ఒక్కరిత** (వై.స.ఏ.) : ఒకరిత యొక్క రూపాంతరము. (రూ. ఒక్కర్త.)

**ఒక్కరితి** (వై.స.ఏ.) : ఒకరితి యొక్క రూపాంతరము. (రూ. ఒక్కర్తె.)

**ఒక్కరితె** (వై.స.ఏ.) : ఒకరితె యొక్క రూపాంతరము. (రూ. ఒక్కర్తె.)

**ఒక్కరుఁడు** (వై.స.) : ఒకరుఁడు యొక్క రూపాంతరము.

**ఒక్కరువుఁడు** (వై.స.) : ఒకరువుఁడు యొక్క రూపాంతరము.

**ఒక్కర్తు** (వై.స.ఏ.) : ఒకర్తు యొక్క రూపాంతరము.

**ఒక్కర్తుక** (వై.స.ఏ.) : ఒకర్తుక యొక్క రూపాంతరము.

**ఒక్కెఱ** (వై.వి.) : ఉగ్రభావము.

**ఒక్కొ** (దే.అవ్య. ఒకా.) : (రూ. ఒక్కో.)

**ఒక్కొఁడు** (వై.స.) : ఒకొఁడు యొక్క రూపాంతరము.

**ఒక్కొట** (వై.ద్ర.) : ఒకొట యొక్క రూపాంతరము. (చూ.) ఒకట. (ఏక కాలముననుటకు.)

**ఒక్కొటి** (వై.స.ఏ.) : ఒకొటి యొక్క రూపాంతరము.

**ఒక్కొత** (వై.స.ఏ.) : ఒక్కొరిత యొక్క రూపాంతరము.

**ఒక్కొతి**(వై.స.ఏ.) : ఒక్కొరితి యొక్క రూపాంతరము.

**ఒక్కొతుక** (వై.స.ఏ.) : ఒకొతుక యొక్క రూపాంతరము.

**ఒక్కొతె** (వై.స.ఏ.) : ఒక్కొరితె యొక్క రూపాంతరము.

**ఒక్కొరిత** (వై.స.ఏ.) : ఒకొరిత యొక్క రూపాంతరము. (రూ. ఒక్కొర్త.)

**ఒక్కొరితి**(వై.స.ఏ.) : ఒకొరితియొక్క రూపాంతరము. (రూ. ఒక్కొర్తి.)

**ఒక్కొరితె** (వై.స.ఏ.) : ఒకొరితె యొక్క రూపాంతరము. (రూ. ఒక్కొర్తె.)

**ఒక్కొరుఁడు** (వై.స.) : ఒకొరుఁడు యొక్క రూపాంతరము.

**ఒక్కొరువుఁడు** (వై.స.) : ఒకొరువుఁడు యొక్క రూపాంతరము.

**ఒక్కొర్తు** (వై.స.ఏ.) : ఒకొర్తు యొక్క రూపాంతరము.

**ఒక్కొర్తుక** (వై.స.ఏ.) : ఒకొర్తుక యొక్క రూపాంతరము.

**ఒగరు** (వై.వి.) : చక్కఁగాఁబండని దానిమ్మ లోనగువాని రుచి, తువరము. (చూ. రసము.)

**ఒగరుచే** (వై.అ.క్రి.) : ఒగరగు.

**ఒగి** (దే.ద్ర.క్రి.) : విణ. క్రమముగా.

**ఒగిదిగ** (దే.వి.) : జడబిల్ల. (దీనికి ప్రయోగాంతరము మృగ్యము.)

**ఒగుడు** (దే.వి.) : జొన్నలోనగువాని యెండిన యాకు.

**ఒగుడుకఱచే** (దే.అ.క్రి.) : కృశించు.

**ఒగ్గము** (దే.వి.) : (చూ.) అవపాతము.

**ఒగ్గు** (దే.అ.క్రి.) : మొనయు. స.క్రి. 1. (వల) పఱచు, ఒడ్డు; (చూ. ఒగ్గము.) 2. చాఁచు.

**ఒగ్గుబల్ల**(దే.వి.) : తరిమెనపట్టెడు కొయ్యకాధారమైన బల్ల.

**ఒచ్చెము** (దే.వి.) : 1. కొఱఁత, న్యూనత; 2. అవమానము.

**ఒచ్చెల** (దే.అవ్య.) : ఓ చెల్ల యొక్క రూపాంతరము. (రూ. ఒచ్చెల.)

**ఒజ్జే** (వై.వి.) :1. ఉపాధ్యాయుడు; 2. పురోహితుడు; 3. యాజకుఁడు.

**ఒజ్జేనము** (వై.వి.) : ఒజ్జఁదనము, ఉపాధ్యాయత్వము.

**ఒజ్జెబంతి** (వై.వి.) : ఉపాధ్యాయుఁడు చూపిన పద్ధతి, మేలు బంతి.

**ఒజ్జెసాని** (వై.వి.) : ఉపాధ్యాయుని భార్య.

**ఒట్టు** (దే.అ.క్రి.) : కలుగు. 1. ఉంచు; 2. రగుల్చు.

**ఒడఁగూడు** (దే.అ.క్రి.) : 1. సిద్ధించు; 2. చేరు. (ప్రే. ఒడఁగూర్చు.)

**ఒడఁబడిక** (ద్వ.వి.) : 1. సమ్మతి; 2. సమ్మతించి వ్రాసియిచ్చిన వ్రాఁత.

**ఒడఁబడు** (ద్వ.అ.క్రి.) : 1. సమ్మతించు; 2.అనుకూలించు; 3. సంతోషించు. (ప్రే. ఒడఁబఱచు.)

**ఒడఁబాటు** (ద్వ.వి.) : సమ్మతి. (విణ.) : సమ్మతము.

**ఒడగోలుకొను** (దే.స.క్రి.) : అడగోలు కొనుయొక్క రూపాంతరము. (ఇక్కడ అడగోలుకొననియే యుండవచ్చును. అయినను ప్రతులయందిట్లు ఒకా రాదిగాఁగానఁబడుచున్నది.)

**ఒడపి** (దే.వి.) : గండి, రంధ్రము.

**ఒడమి** (దే.వి.) : ధనము.

**ఒడయఁడు** (దే.వి.) : మగఁడు. (విణ.) : స్వామి.

**ఒడయుఁడు** (దే.విణ.) : మగఁడు. (విణ.) : స్వామి.

**ఒడయురాలు** (దే.విణ.) : (ఒడయుఁడు + ఆలు) స్వామిని.

**ఒడలిచూపాడయఁడు** (దే.వి.) : ఇంద్రుఁడు.

**ఒడలు** (దే.వి.) : మే, మేను, దేహము.

**ఒడి** (దే.వి.) : 1. తొడపైభాగము, ఉత్సంగము; 2. ఒడుపు; 3. పశుయోని.

**ఒడిఁబ్రాలు** (దే.వి.బ.) : గర్భాధానాదికాలముల యందు స్త్రీలకు ఒడియందుఁ బోసెడు బియ్యము.

**ఒడికట్టు** (దే.అ.క్రి.) : కడఁగు, యత్నించు. (వి.) : ఒడ్డాణము.

**ఒడికము** (దే.వి.) : ఉపాయము. (విణ.) : 1. మనోజ్ఞము; 2. యుక్తము.

**ఒడికారము** (దే.వి.) : ఉద్రేకము. (ఇది యింకను విచార్యము.)

**ఒడిత్రాడు** (దే.వి.) : వేఁటాడుటకు తగిన సాధన విశేషము. (చూ. తీపుఁద్రాడు.)

**ఒడిదామర** (ద్వ.వి.) : (ఒడి+తామర) వృక్ష విశేషము.

**ఒడిదారము** (దే.వి.) : స్త్రీల మొలనూలు.

**ఒడిపిలి** (దే.వి.) : ఆహార విశేషము. (అప్ర.)

**ఒడియు** (దే.అ.క్రి.) : కొంచెము పైకెగురు.

**ఒడిసియ** (దే.వి.) : ఒడిసెగడ్డ.

**ఒడిసె** (దే.వి.) : ఒడిసియ యొక్క రూపాంతరము.

**ఒడిసెల** (ద్వ.వి.) : ఱాలు విసిరి వేయుటకై యేర్పఱపఁ బడిన యొక విధపు త్రాడు, క్షేపణి.

**ఒడిసెలకాఁడు** (ద్వ.వి.) : ఒడిసెల వేయువాఁడు.

**ఒడుచే** (దే.ప్రే.) : ఓడించు.

**ఒడుదొడుకు** (దే.వి.) : 1. సమముకామి, వైషమ్యము; 2. సంకటము.

**ఒడుపు** (దే.వి.) : 1. లక్ష్యముపెట్టి దాఁటిన దాఁటు; 2. పూనిక; 3. లాభము.

**ఒడ్డగ** (దే.వి.) : రెండిఱ్ఱికొమ్ములు జతచేసి యేర్పఱచిన ఆయుధ విశేషము.

**ఒడ్డగిల్లు** (దే.అ.క్రి.) : 1. ఒఱగు; 2. అతిశయించు; 3. చిప్పిల్లు.

**ఒడ్డగెడవు** (దే.వి.) : ఒక ప్రక్క క్రింది కొఱగి మఱియొక ప్రక్క పైకిలేచుట, వాటుపడుట.

**ఒడ్డనము** (యు.దే.వి.) : పందెము.

**ఒడ్డాణము** (వై.వి.) : 1. యోగ పట్టె; 2. స్త్రీలు నడుమున బిగికై ధరించుకొనెడు బంగారు లోనగువాని పట్టెడ.

**ఒడ్డాది** (వై.వి.) : ఓఢ్రదేశము.

**ఒడ్డారము** (దే.వి.) : 1. ద్వేషము; 2. మాఱొడ్డుట.

**ఒడ్డారించు** (దే.అ.క్రి.) : 1. ద్వేషించు; 2. మాఱొడ్డు.

**ఒడ్డిమి** (దే.వి.) : ఒడ్డు, పందెము.

**ఒడ్డయ** (వై.వి.) : ఒడ్డెవాఁడు.

**ఒడ్డీఁడు** (వై.వి.) : 1.ఓఢ్రదేశపురాజు; 2.ఉడ్డీన గతిగల పావురాయి.

**ఒడ్డు** (యు.దే.స.క్రి.) : 1.పందెమిడు; 2.(వల); 3.చాఁచు; 4. మొనయించు; 5. అడ్డగించు;

6. దాఁటు. (వి.) : 1.తీరము; 2.పందెము; 3. వ్యూహము; 4. పూనికి.

**ఒడ్డె** (వై.వి.) : ఒడ్డియ యొక్క రూపాంతరము.

**ఒడ్డొఱకము** (దే.విణ.) : (ఒడ్డు+ఒఱకము) ఎగుడు దిగుడైనది (భూమి)

**ఒత్తగిల్లు** (దే.అ.క్రి.) : 1. ప్రక్కకొఱగు; 2. ఒఱగు; 3. అంటుకొను.

**ఒత్తడము** (దే.వి.) : ఒత్తుట. (విణ.) : తఱుచు.

**ఒత్తడి** (దే.వి.) : 1.రాపు, సమ్మర్దము; 2.తఱుచుఁదనము; 3. బాధ (అని కొందఱు.)

**ఒత్తరము** (దే.వి.) : ముమ్మరము, ఉద్రేకము (చూ. అత్తరము)

**ఒత్తరించే** (వై.స.క్రి.) : 1.మించు; 2. ఆక్రమించు.

**ఒత్తియాడు** (దే.స.క్రి.) : (ఒత్తి + ఆడు) ఒత్తు (చూ. లంగగొను, ఊఁగాడు)

**ఒత్తిలి** (దే.అవ్య.) : 1. గట్టిగా; 2. పట్టుగా.

**ఒత్తిల్లు** (దే.అ.క్రి.) : ప్రక్కకొఱగు, ఒత్తగిల్లు. (రూ. ఒత్తిల్లు.)

**ఒత్తు** (దే.అ.క్రి.) : 1.పొడుచుకొను; 2.ఒఱగు; 3.ఘనమగు. (చిగురొత్తు ఇత్యాదుల యందలి ఒత్తు ఇంచుక్కు వంటిదని తెలియునది.) (స.క్రి.) : 1. అదుము; 1. (కాళ్లు) 2. పిసుకు; 3. (శంఖమును) ఊఁదు; 4. బలాత్కరించు; 5. (పంట) నొక్కు; 6. తుడుచు; 7.త్రోయు; 8.చేర్చు; 9. తీర్చు; 10. ఆక్రమించు; 11.(అంట్లు) త్రొక్కు. (వి.) 1.అదుముడు; 2. తఱుఁచుదనము; 3. మెత్త; 4. ఆక్రమణము; 5. (బ. ) : బిడ్డల చేతియొక దినుసు బంగారు సొమ్ము. (విణ.) : తఱుచు.

**ఒత్తుకమ్మి** (ద్వ.వి.) : బొద్దులకు ప్రక్కల కమ్మి వలె నేర్పఱచెడు తదవయ విశేషము.

**ఒత్తుకాఁడు** (దే.వి.) : సుతిపోయువాఁడు.

**ఒత్తుకొను** (దే.అ.క్రి.) : పొడుచుకొను. (స.క్రి.): ఆక్రమించుకొను.

**ఒత్తుడు** (దే.వి.) : 1.అదుముడు, పీడనము; 2. కాకితము లోనగునది వ్రాయునపుడు మెత్తనకై దాని క్రింద నుంచుకొనఁబడు కాకితము లోనగునది.

**ఒత్తువడు** (ద్వ.అ.క్రి.) : (ఒత్తు + పడు) అదుముడుపడు.

**ఒత్తొరవు** (దే.వి.) : (ఒత్తు + ఒరవు) మిక్కిలి యుదుముడు, సంపీడనము.

**ఒదరు** (దే.అ.క్రి.) : 1.విజృంభించు; 2. సంభ్రమించు.

**ఒదరుచు** (దే.స.క్రి.) : ఊదఁదీయు. (రూ. ఒదర్చు) (చూ. అంట)

**ఒదలు** (దే.అ.క్రి.) : వర్ధిల్లు.

**ఒదవు** (వై.అ.క్రి.) : 1.కలుగు; 2. ఉపయోగించు; 3. యుక్తమగు.

**ఒదవుబడి** (ద్వ.వి.) : ఉపయోగము. (విణ.) : ఉపయుక్తము.

**ఒదిఁగిలు** (దే.అ.క్రి.) : ప్రక్కకొఱగు, ఒత్తగిల్లు.

**ఒదిగిళ్లు** (దే.వి.బ.) : ఒదిగిలుటలు.

**ఒదివిరిప్రాలు** (దే.వి.బ.) : ధాన్యవిశేషము.

**ఒదుఁగఁబాఱు** (దే.అ.క్రి.) : (ఒదుఁగన్ + పాఱు) ఒదుఁగు.

**ఒదుఁగు** (దే.అ.క్రి.) : తొలఁగు.

**ఒదుఁగువడు** (ద్వ.అ.క్రి.) : (ఒదుఁగు + పడు) తొలఁగు.

**ఒదుఁగువాటు** (ద్వ.వి.) : ఒదుఁగు వడుట, తొలఁగుట.

**ఒదుగు** (దే.అ.క్రి.) : సమృద్ధమగు. (చూ. ఒదువు) (వి.) : సమృద్ధి. (విణ.) : సమృద్ధము.

**ఒదుగుబడి** (దే.వి.) : సమృద్ధి.

**ఒదువు** (దే.అ.క్రి.) : 1. క్రమ్ము; 2. సమృద్ధమగు. (ఒదుగు యొక్క రూపాంతరము.)

**ఒద్ద** (దే.వి.) : దాపు, సమీపము.

**ఒద్ది** (దే.వి.) : ఒకానొక చెట్టు.

**ఒద్దిక** (దే.వి.) : 1.ఆనుకూల్యము; 2.ఒక వస్తువునకు సరియెత్తుగా నుంచి తూఁచెడు ఱాయిలో నగునది, ప్రతిమానము.

**ఒద్దియ** (దే.వి.) : సమృద్ధి. (అప్ర.)

**ఒద్దె** (దే.వి.) : సమృద్ధి. (అప్ర.)

**ఒనగూడు** (దే.అ.క్రి.) : సిద్ధించు. (ఒడఁగూడు యొక్క రూపాంతరము) (ప్రే. ఒనగూర్చు.)

**ఒనరించు** (దే.ప్రే.) : ఒనర్చు, చేయు.

**ఒనరిక** (దే.వి.) : పొందిక, పొంకము.

**ఒనరు** (దే.అ.క్రి.) : 1. కలుగు; 2. పొసఁగు, సరిపడు. 3. ఒప్పు. (వి.) : 1. పొందిక; 2. ఇంపు.

**ఒనరుచే** (దే.ప్రే.) : ఒనరించు, చేయు.

**ఒనరుపడు** (ద్వ.అ.క్రి.) : పొందుపడు.

**ఒనవెట్టుకొను** (దే.అ.క్రి.) : (ఒనరు + పెట్టుకొను) పొంచువేయు.

**ఒప్పందము** (దే.వి.) : అమ్మెడువాఁడును కొనెడు వాఁడును ఈ వెలకు ఈ సరకు నింతమాత్రము ఇచ్చెదనని కాని తీసికొని యెదనని కాని చేసికొనెడు ఏర్పాటు.

**ఒప్పగించే** (వై.స.క్రి.) : అప్పగించు యొక్క రూపాంతరము.

**ఒప్పగింత** (వై.వి.) : అప్పగింత యొక్క రూపాంతరము.

**ఒప్పనము** (వై.వి.) : అర్పణము. (అప్పనము యొక్క రూపాంతరము.)

**ఒప్పనసేయు** (వై.స.క్రి.) : అప్పనసేయు యొక్క రూపాంతరము. (చూ. ఉప్పెన)

**ఒప్పమి** (దే.వి.) : 1. కీడు; 2. తప్పు.

**ఒప్పరము** (దే.వి.) : జలదారి.

**ఒప్పరికము** (వై.వి.) : ఉపేక్ష.

**ఒప్పరికించు** (వై.స.క్రి.) : ఉపేక్షించు.

**ఒప్పారు** (దే.అ.క్రి.) : (ఒప్పు + ఆరు) ఒప్పు.

**ఒప్పించు** (వై.స.క్రి.) : ఒప్పగించు.

**ఒప్పిదము** (దే.వి.) : (ఒప్పు + ఇదము) 1. అందము; 2. అలంకారము; 3. విధము. (విణ.) : మనోజ్ఞము.

**ఒప్పు** (దే.అ.క్రి.) : 1.ఒప్పిదమగు; 2.తగు; 3.సమ్మతించు. (వి.) : 1. అందము; 2. తప్పు కామి; 3. సమ్మతి.

**ఒప్పుకొను** (దే.స.క్రి.) : సమ్మతించు, అంగీకరించు.

**ఒప్పుకోలు** (దే.వి.) : ఒప్పుకొనుట.

**ఒప్పులాఁడి** (దే.వి.) : (ఒప్పులు+ఆఁడి) 1.చక్కఁదనముగల ఆఁడుది; 2. ఆఁడుది.

**ఒబ్బట్లు** (దే.వి.బ.) : (ఒమ్ము+అట్లు) భక్ష్య విశేషము, పోళీ.

**ఒబ్బిడి** (దే.వి.) : 1.పంటనుఱిపిడి; 2.నాశము. (ఇంటనున్న వడ్లగింజలన్నియు నొబ్బిడి యైనవి.)

**ఒమ్మచ్చు** (ద్వ.వి.) : (ఒమ్ము + అచ్చు) మణులను పొదుగుటకు బంగారుతో చేసెడి పీఠస్థానము.

**ఒమ్మిక** (దే.వి.) : ఇమిడిక, పొందిక.

**ఒమ్ము** (దే.అ.క్రి.) : ఒవ్వు, సరిపడు. (ఈ నీళ్లు నాకు ఒమ్మలేదు.) (వి.) : బలుపు, స్థౌల్యము. (విణ.) : పెద్ద, స్థూలము.

**ఒయారము** (దే.వి.) : 1. విలాసము; 2. సౌంద ర్యము. (ఒయ్యారము యొక్క రూపాంతరము)

**ఒయారి** (దే.వి.) : 1. విలాసము గల స్త్రీ; 2. సౌందర్యము గల స్త్రీ. (విణ.) : సౌందర్యము గలది. (ఒయ్యారి యొక్క రూపాంతరము)

**ఒయ్య** (దే.క్రి.విణ.) : 1. తిన్నఁగా; 2. మెల్లఁగా. (ఆమ్రేడితమందు ఒయ్యొయ్య.)

**ఒయ్యన** (దే.వి.) : 1. తిన్నన; 2. మెల్లన (చూ. ఒయ్య.)

**ఒయ్యారము** (దే.వి.) : 1. విలాసము; 2. అందము.

**ఒయ్యారి** (దే.వి.) : (చూ.) ఒయారి.

**ఒర** (దే.వి.) : 1. ఒరపెట్టుట; 2. సామ్యము.

**ఒరగట్టు** (దే.వి.) : (ఒర + కట్టు) చుట్టగాఁజుట్టి కట్టిన వస్త్రపుకట్టు.

**ఒరగడుగు** (దే.వి.) : (ఒర + కడుగు) రెండవసారి బియ్యము కడిగిన నీరు.

**ఒరగల్లు** (దే.వి.) : (ఒర + కల్లు) బంగారు లోనగువాని నొరపెట్టెటు ఱాయి, నికషము.

**ఒరగాలు** (దే.వి.) : (ఒరగు + కాలు) 1. ఒరగిన కాలు; 2. మఱియొక కాలి మీఁద నొరగఁ బెట్టిన కాలు.

**ఒరగు** (దే.అ.క్రి.) : 1. వంగు; 2. వ్రాలు. (వి.): 1. ఒరగుదిండు; (చూ. ఒఱగు) 2. వంపు. (విణ.) : వంపైనది.

**ఒరగొను** (దే.స.క్రి.) : (ఒర + కొను) ఒరపెట్టు.

**ఒరచాలుదుక్కి** (దే.వి.) : చాలు తేలికగాఁ బాఱిన దుక్కి.

**ఒరచుబద్ద** (ద్వ.వి.) : పలకలోనగునవి నునుపు పఱచెడు వడ్లవాని కొఱముట్టు. (అప్ర.)

**ఒరపదను** (దే.వి.) : కొంచెపుతడి.

**ఒరపిడి** (దే.వి.) : రాయిడి.

**ఒరపెట్టు** (దే.స.క్రి.) : బంగారులోనగువాని ఒరయు.

**ఒరయిక** (దే.వి.) : రాపిడి, ఘర్షణము.

**ఒరయు** (దే.స.క్రి.) : 1. ఒరపెట్టు, రాచు; 2. పరీక్షించు; 3. విచారించు; 4. వెదకు.

**ఒరవడి** (దే.వి.) : విద్యార్థులు అక్షరములు కుదురుటకై మేలుబంతిఁ జూచి వ్రాసెడు వ్రాఁత.

**ఒరసికొనుపోవు** (దే.అ.క్రి.) : దోఁగి పోవు. (క్రిందఁబడి మోఁకాలు ఒరసి కొనిపోయినది.)

**ఒరిగ** (దే.వి.) : మ్రొక్కు, నమస్కృతి.

**ఒరిజ** (దే.వి.) : ఏనుఁగుమెడ గొలుసు, కలాపము.

**ఒరిమ** (వై.వి.) : 1. ఒద్దిక. 2. ఐకమత్యము. (చూ. అంతరువు.)

**ఒరిమిక** (దే.వి.) : ఒరిమ.

**ఒరుఁడు** (వై.స.) : ఓకరుఁడు యొక్క రూపాంతరము.

**ఒరుదల** (దే.వి.) : (ఓరు + తల) కొండెకాని తనము, పైశున్యము.

**ఒరుదలకాఁడు** (దే.విణ.) : కొండెకాఁడు, పిశునుఁడు.

**ఒరుము** (దే.అ.క్రి.) : కలయు.

**ఒరువుఁడు** (వై.స.) : ఒకరువుఁడు యొక్క రూపాంతరము.

**ఒఱ** (దే.వి.) : 1. గవుసెన, నిచోళము; 2. ఖడ్గాది కోశము, 3. బావియొఱ.

**ఒఱకటము** (ద్వ.వి.) : (ఒఱగడ్డము యొక్క రూపాంతరము) సంకటము. (విణ.) : విషమము.

**ఒఱకము** (దే.వి.) : 1. పల్లము; 2. సంకటము.

**ఒఱకాటము** (ద్వ.విణ.) : ఒఱకటము యొక్క రూపాంతరము.

**ఒఱగఁబడు** (ద్వ.అ.క్రి.) : (ఒఱగన్ + పడు) (స్వార్థమునపడు) ఒఱగు (రూ. ఒరగఁబడు)

**ఒఱగడ్డము** (ద్వ.వి.) : (ఒఱవ + గడ్డ) సంకటము. (విణ.) : విషమము.

**ఒఱగు** (దే.అ.క్రి.) : 1. వంగు; 2. వ్రాలు. (వి.) : 1. ఒఱగుదిండు; 2. వంపు. (విణ.): వంపైనది.

**ఒఱగుబిల్ల** (దే.వి.) : ఒఱగుదిండు, ప్రగ్రీవము. (రూ. ఒరగుబిల్ల)

**ఒఱగువోవు** (దే.అ.క్రి.) : (ఒఱగు + పోవు) ఒఱగఁబడు. (రూ. ఒరగు వోవు.)

**ఒఱగొడ్డెము** (ద్వ.వి.) : (వఱగొడ్డయము యొక్క రూపాంతరము) మనసు నొప్పించెడు వంకర మాట.

**ఒఱటు** (దే.విణ.) : దుశ్శీలుఁడు.

**ఒఱపరి** (దే.విణ.) : (ఒఱపు + అరి) సౌందర్య వంతుఁడు.

**ఒఱపిఁడి** (దే.విణ.) : (ఒఱపు + ఇఁడి) అయోగ్యుడు.

**ఒఱపు** (దే.వి.) :1. సౌందర్యము; 2. ఉపాయము; 3. తాపము; 4. ప్రతా పము; 5. యోగ్యత; (చూ. ఇందు యోగ్యము నుదాహరణము) 6. స్థైర్యము. (విణ.): 1. దృఢము; యోగ్యము.

**ఒఱపులాఁడి** (దే.వి.) : (ఒఱపులు + ఆఁడి) సౌందర్యవతియైన స్త్రీ.

**ఒఱపెంకు** (దే.వి.) : బావియొఱ.

**ఒఱలు** (దే.అ.క్రి.) : 1. ఓలు, విలపించు; 2. మ్రోఁగు.

**ఒఱవ** (దే.విణ.) : 1. వక్రము; 2. వ్యత్యస్తము; 3. వికృతము.

**ఒఱవఁబడు** (ద్వ.అ.క్రి.) : ఒఱగఁబడు.

**ఒఱవు** (దే.అ.క్రి.) : ఒఱగు యొక్క రూపాంతరము. (చూ. ఒఱవఁబడు)

**ఒఱుబీజము** (మి.వి.) : (ఒఱ్ఱు + బీజము) ఒక ప్రక్క బీజము వాఁచిన వ్యాధి విశేషము.

**ఒఱ్ఱ** (దే.విణ.) : కారమైనది, కటువు.

**ఒఱ్ఱకసింద** (ద్వ.వి.) : కచ్చుర.

**ఒఱ్ఱన** (దే.వి.) : ఒఱ్ఱఁదనము, కారము.

**ఒఱ్ఱియ** (దే.వి.) : సాధువుకాని యావు, సుకత. (విణ.) : వక్రము.

**ఒఱ్ఱు** (దే.విణ.) : గొప్పది, పెద్దది.

**ఒఱ్ఱె** (దే.వి.) : ఒఱ్ఱియ యొక్క రూపాంతరము.

**ఒలయు** (దే.అ.క్రి.) : 1. వ్యాపించు; 2. ప్రవేశించు; 3. కలుగు; 4. కలయు, చేరు. (స.క్రి.): 1. చుట్టుకొను; 2. కదియు.

**ఒలి** (దే.వి.) : ఒలుపు, దోఁపుడు, అపహరణము.

**ఒలికి** (దే.వి.) : సొదపేర్చెడుచోటు.

**ఒలుకులమిట్ట** (దే.వి.) : (ఒలుకులు + మిట్ట) కాడు, శ్మశానము.

**ఒలిదామర** (ద్వ.వి.) : (ఒలి + తామర) ఒకానొక చెట్టు.

**ఒలియు** (దే.అ.క్రి.) : తోలుదోఁగు.

**ఒలివడు** (ద్వ.అ.క్రి.) : (ఒలి+పడు) దోఁపుడు పోవు.

**ఒలుకు** (దే.అ.క్రి.) : 1.చిందు; 2.కాఱు. (అం.ప్రే.) : కార్చు. (చూ. మొక్కలను మూడవ యర్థము నుదాహరణము) 2. పోయు.

**ఒలుచే** (దే.ప్రే.) : 1. ఒలియఁజేయు, తోలూడ్చు; 2. అపహరించు. (చూ. ఒలి)

**ఒలుపు** (దే.వి.) : ఒలుచుట (ఒలుపుఁబప్పు. మొ.)

**ఒలె** (దే.వి.) : (చూ.) ఒల్లియ. (ఒల్లె యొక్క రూపాంతరము.)

**ఒల్ల** (వై.క్రి.విణ.) : అల్ల యొక్క రూపాంతరము. (చూ. ఒల్లన)

**ఒల్లఁబాటు** (ద్వ.వి.) : (ఒల్లమి+పాటు) అపేక్ష లేమి, ఒల్లమి.

**ఒల్లఁబోక** (దే.వి.) : (ఒల్లమి+పోక) అనాదరము.

**ఒల్లఁబోవు** (దే.అ.క్రి.) : (ఒల్లమి + పోవు) 1.మూర్ఛిల్లు; 2.వాడు; 3.ఆదరింపఁబడనిదగు. (చూ.ఒల్లఁబోక)

**ఒల్లగిల్లు** (దే.అ.క్రి.) : ఆదరింపఁబడనిదగు.

**ఒల్లన** (వై.వి.) : తిన్నఁదనము, అల్లన.

**ఒల్లమి** (దే.వి.) : వలవమి. (వలచు ధాతువు యొక్క వ్యతిరేక భావార్థక రూపము.)

**ఒల్లియ** (దే.వి.) : 1. వస్త్రము; 2. ఉత్తరీయము.

**ఒల్లె** (దే.వి.) : ఒల్లియ యొక్క రూపాంతరము.

**ఒల్లెంక** (దే.వి.) : మత్స్యవిశేషము.

**ఒల్లెవాటు** (దే.వి.) : అంగవస్త్రము కుచ్చె పెట్టి మెడచుట్టిరా భుజములమీఁద వైచుకొనుట.

**ఒవ్వు** (దే.అ.క్రి.) : గిట్టు, సరిపడు.

**ఒసఁగు** (దే.స.క్రి.) : ఇచ్చు. (వి.) : 1. ఈవి, త్యాగము; 2. బహుమానము.

**ఒసపరి** (దే. విణ.) : 1. సుందరుఁడు; 2. ఉత్కృష్టము.

**ఒసవు** (దే.స.క్రి.) : ఒసంగు యొక్క రూపాంతరము.

**ఒహెూ** (దే.అవ్య.) : సంబోధమునందు వచ్చును.

**ఒళవరి** (దే.విణ.) : (ఒళవు + అరి) మర్మజ్ఞుఁడు. (చూ. ఒళవు)

**ఒళవు** (దే.వి.) : 1. మర్మము; 2. లోఁకువ; 3. వీణాదండము, ప్రవాళము.

**ఒళ్లు** (దే.వి.) : ఒడలు యొక్క రూపాంతరము. (ఇది వెళ్లు సళ్లుల వంటిది.)

**ఒళ్లుపెట్టు** (దే.అ.క్రి.) : బలియు.

## ఓ

**ఓ** : ఒక యక్షరము. (దే.అవ్య.) : 1.పిలిచినప్పుడు ఎచ్చరించుకొనుటను తెలుపును; 2. సందేహమును తెలుపును; 3. ఊహను తెలుపును; 4. ప్రార్థనాదులను దెలుపును; 5. ఆర్తిని తెలుపును; 6. అమ్ముటను తెలుపును; (చల్లో చల్ల.) 7. ప్రశ్నమును తెలుపును.

**ఓంకారము** (సం.వి.అ.పుం.) : ప్రణవము.

**ఓంద్ర** (దే.వి.) : గాడిద యొక్క కూఁత.

**ఓంద్రించు** (దే.అ.క్రి.) : ఓంద్రపెట్టు.

**ఓఁక** (దే.వి.) : పుల్లకలివె.

**ఓఁకలివె** (దే.వి.) : (ఓఁక + కలివె) పుల్లకలివె.

**ఓకర** (వై.వి.) : 1. పిత్తవ్యాధి మొదలగు వాని వలన ధ్వని పూర్వకముగా కడుపులోనిది నోటికి వచ్చుట; 2. రోఁత.

**ఓకరించు** (వై.అ.క్రి.) : 1. ఓకరవచ్చి ఉమియు; 2. రోఁతపడు.

**ఓకరింత** (వై.వి.) : 1. ఓకరించుట; 2. రోఁత.

**ఓకస్సు** (సం.విస్.న.) : 1. ఇల్లు; 2. స్థానము. (ఈ శబ్దము అకారాంత పుంలింగమునగును.)

**ఓకిలి** (వై.వి.) : (చూ.) ఓకర.

**ఓకిలించు** (వై.అ.క్రి.) : 1.ఓకరించు; 2. రోఁతపడు. (మీఁద మఱియొక చోట.)

**ఓకిలింత** (వై.వి.) : 1. ఓకరింత; 2. రోఁత.

**ఓకు** (గ్రా.) : దుర్భిణియుద్ధము.

**ఓగాత్యము** (వై.విణ.) : అమంగళము. (ఇది వాడుకలోనిది)

**ఓగితము** (వై.విణ.): యోగ్యము.

**ఓగిరము** (వై.వి.) : ఓరెము, అన్నము.

**ఓగు** (దే.వి.) : కీడు. (విణ.) : 1. కీడైనది; 2. మూర్ఖుఁడు.

**ఓగులొడుచు** (దే.అ.క్రి.) : దేవురించు.

**ఓఘము** (సం.వి.అ.పుం.) : 1. సమూహము; 2. ప్రవాహము; 3. పరంపర; 4. నృత్యాది ద్రుతమానము; 5. ఉపదేశము.

**ఓచెల** (దే.అవ్య.) : ఓచెల్ల యొక్క రూపాంతరము. (కొన్ని ప్రతుల యందిక్కడ ఒచ్చెలయనియు పాఠము కనఁబడుచున్నది.)

**ఓచెల్ల** (దే.అవ్య.) : (ఓ + చెల్లె) సంతాపమును తెలిపెడి.

**ఓజము** (సం.వి.అ.పుం.) : (జ్యోతిశ్శాస్త్రము నందు) బేసి.

**ఓజస్సు** (సం.వి.స్.న.) : 1. తేజము; 2. బలము; 3. ఉత్సాహము; 4. వెలుఁగు; 5. ఎండ.

**ఓజే** (యు.దే.వి.) : 1. క్రమము; 2. విధము; 3. స్వభావము; 4.ఆజ్ఞ. (వై.) : 1. ఉత్సాహము; 2.ఉపాధ్యాయుఁడు; (ఒజ్జ యొక్క రూపాంతరము.) 3. భయము.

**ఓజేపడు** (ద్వ.అ.క్రి.) : క్రమపడు.

**ఓజేబంతి** (వై.వి.) : ఒజ్జబంతి యొక్క రూపాంతరము.

**ఓట** (దే.వి.) : 1. భయము; 2. సంకోచము.

**ఓటమి** (దే.వి.) : 1. భయము; 2. భంగము.

**ఓటము** (దే.వి.) : అపజయము.

**ఓటఱు** (దే.అ.క్రి.) : నిస్సత్త్వమగు.

**ఓటాఱు** (దే.అ.క్రి.) : ఓటఱు యొక్క రూపాంతరము. (ప్రే. ఓటాఱుచు.)

**ఓటిల్లు** (దే.అ.క్రి.) : ఓడు, సంకోచించు.

**ఓటిల్లుచిందఱ** (దే.వి.) : బాలక్రీడా విశేషము.

**ఓటు** (దే.వి.) : 1. అపజయము; 2. భంగము.

**ఓటుపడు** (ద్వ.అ.క్రి.) : 1. అపజయపడు; 2. మోసపోవు.

**ఓటుపాటు** (ద్వ.వి.) : ఓటుపడుట.

**ఓటువోవు** (దే.స.క్రి.) : (ఓటు + పోవు) ఓటుపడు. (లేఖన గ్రంథముల యందోటు వోయెనని పాఠము.) (ప్రే. ఓటువుచ్చు.)

**ఓటుసేయు** (ద్వ.స.క్రి.) : (ఓటు + చేయు) భంగపఱచు.

**ఓడ** (వై.వి.) : కలము, నావ.

**ఓడంగి** (వై.వి.) : 1. ఓడవాఁడు; 2. పడవవాఁడు; 3. దోనెకు లోతట్టు వేసెడు దూలము.

**ఓడిక** (దే.వి.) : తన యిచ్చఁబాఱెడు నీరు, ప్రవాహము.

**ఓడిగిల్లు** (దే.అ.క్రి.) : 1. ప్రవహించు; 2. పరుగెత్తు; 3. కాఱు.

**ఓడినక్క** (ద్వ.వి.) : పొట్టినక్క (అప్ర.)

**ఓడు** (దే.అ.క్రి.) : 1.అపజయపడు; 2.పాఱు; 3.భయపడు; 4. సంకోచించు. (ఓటి కుండ. మొ.)

**ఓడుబిల్ల** (దే.వి.) : ఇంటిపైఁగప్పెడి పెంకు.

**ఓఢ్యాణము** (సం.వి.అ.న.) : 1. భూషావిశేషము; 2. ఆసన విశేషము.

**ఓఢ్ర పుష్పము** (సం.వి.అ.పుం.) : దాసనము.

**ఓఢ్రము** (సం.వి.అ.పుం.) : 1. దాసనము; 2. ఒకానొక దేశము.

**ఓఢ్రుఁడు** (సం.వి.అ.పుం.) : ఓఢ్ర దేశస్థుఁడు, ఒడ్డెవాఁడు.

**ఓతువు** (సం.వి.ఉ.పుం.) : మార్జాలము, పిల్లి.

**ఓదనము** (సం.వి.అ.పుం,న.) : అన్నము, వంటకము.

**ఓదము** (వై.వి.) : (చూ.) అవపాతము.

**ఓదారుచు** (దే.స.క్రి.) : ఊరార్చు, ఆశ్వాసించు.

**ఓదియ** (దే.వి.) : ఓదె.

**ఓదె** (దే.వి.) : కోఁతకోసి చేని యందక్క డక్కడ నుంచెడు వెన్నుపోఁచలప్రోగు. (ఓదియ యొక్క రూపాంతరము)

**ఓదెకొంగ** (ద్వ.వి.) : ఒకదినుసుకొంగ.

**ఓదెకొఱుకు** (దే.వి.) : ఓదెకొంగ. (అప్ర.)

**ఓనికట్టు** (దే.వి.) : కొండలనమిడి గొందిదారి.

**ఓపిక** (దే.వి.) : 1. శక్తి; 2. క్షమ.

**ఓపు** (దే.అ.క్రి.) : చాలు. (వాఁడీపని చేయ నోపును. మొ.) (వి.) : ఓపిక.

**ఓమటి** (దే.వి.): జజం అన్నము.

**ఓమనగాయలు** (దే.వి.బ.) : (ఓమన+ కాయలు) ఓమనగుంటలాడు గింజలు.

**ఓమనగుంటలు** (ద్వ.వి.బ.) : బాలికా క్రీడా విశేషము. (చూ. అచ్చనగండ్లు)

**ఓమనపీఁట** (ద్వ.వి.) : ఓమనగుంట లాడు పీఁట.

**ఓమము** (దే.వి.) : ఒకానొకయంగడి దినుసు, దీప్యము.

**ఓము** (దే.స.క్రి.) : కాచు, రక్షించు.

**ఓయన** (దే.వి.) : ఒయ్యన.

**ఓయారము** (దే.వి.) : ఒయ్యారము యొక్క రూపాంతరము.

**ఓయారి** (దే.వి.) : ఒయ్యారి యొక్క రూపాంతరము.

**ఓయి** (వై.అవ్య.) : పురుష సంబోధనము నందు వచ్చునది. (ఇందలి యివర్ణమునకు పురుష సంబోధనమునందు వికల్పముగాను ఇతర సంబోధనములందు నిత్యముగాను లోపంబగు. మఱియు నర్థవిశేషముల యందురిసి వర్ణంబులు దానికాదేశంబులగు.) (రూ. ఓయీ.)

**ఓయిరము** (వై.వి.) : ఓగిరము యొక్క రూపాంతరము.

**ఓర** (యు.దే.వి.) : 1.అంచు; 2.ప్రక్క. (విశ.) : 1.ఒరగినది; (ఓరచూపు, ఓర గచ్చ. మొ.) 2. వంగినది. (వై.) : అహోరాత్రము. (ఉదా. ఓరంత ప్రొద్దు.)

**ఓరంతప్రొద్దు** (వై.వి.) : (ఓర + అంత ప్రొద్దు) 1. దినమంతయు; 2. ఎల్లకాలము.

**ఓరగచ్చ** (దే.వి.) : (ఓర + కచ్చ) ప్రక్క కొదిఁగించిన కౌపీనము.

**ఓరగిల్లు** (దే.అ.క్రి.) : 1. ఒరగు; 2. ఒదుఁగు.

**ఓరచ్చులు** (ద్వ.వి.బ.) : (ఓర + అచ్చులు) గుదికాలుంచెడు చోట ఎత్తుగా అట్టలు వేసి కుట్టిన ఓరట్ట చెప్పులు.

**ఓరణము** (దే.వి.) : ఒక దినుసుదేగ.

**ఓరపాక** (దే.వి.) : పంచను దూలములు లేక వెలిప్రక్క వంచికట్టిన శాల.

**ఓరపాటు** (ద్వ.వి.) : ఒరగుడు.

**ఓరవలి** (దే.వి.) : వన్నెకోక. (అప్ర.)

**ఓరవోవు** (దే.అ.క్రి.) : (ఓర+పోవు) 1. ఒరగు; 2. వంగు.

**ఓరసింపు** (వై.వి.) : ఓరసిల్లుట. (చూ. ఆరగింపు.)

**ఓరసిల్లు** (వై.అ.క్రి.) : ఓసరిల్లు, తొలఁగు. (రూ. ఓరసిలు)

**ఓరిమి** (దే.వి.) : ఓర్పు, క్షమ.

**ఓరు** (యు.దే.వి.) : ఇంటితిన్నె గోడల యడుగున మూలలను తీర్చెడు ఎఱ్ఱమట్టి పట్టె. (వై. ఉప.) : పెద్ద. (ఓరు గాలి. మొ.)

**ఓరుగాలి** (ద్వ.వి.) : మిక్కిలి బలిమిగల వాయువు, ప్రకంపనము. (చూ. ఒఱలు.)

**ఓరుచు** (దే.అ.క్రి.) : 1.క్షమించు; 2.సహించు. ఓరుధాతు ప్రేరణము, ఓడించు. (రూ. ఓర్చు.)

**ఓరుతీయు** (దే.అ.క్రి.) : ఇంటితిన్నె గోడల యడుగునను మూలలను ఎఱ్ఱ మట్టితో పట్టెలు తీర్చు.

**ఓరుపరి** (దే.వి.) : (ఓరుపు+అరి) 1. క్షమించువాఁడు; 2. సహించువాఁడు (రూ. ఓర్పరి)

**ఓరుపు** (దే.వి.) : 1. క్షమ; 2. జయము; 3. సహనము. (రూ. ఓర్పు.)

**ఓరెము** (వై.వి.) : ఓయిరము యొక్క రూపాంతరము.

**ఓర్త** (వై.స.ఏ.) : ఒకర్త యొక్క రూపాంతరము.

**ఓర్తి** (వై.స.ఏ.) : ఒకరి యొక్క రూపాంతరము.

**ఓర్తు** (వై.స.ఏ.) : ఒకర్తు యొక్క రూపాంతరము.

**ఓర్తుక** (వై.స.ఏ.) : ఒకర్తుక యొక్క రూపాంతరము.

**ఓల** (దే.వి.) : జలక్రీడా సమయము నందు ప్రేరేఁపించుటకై యుపయోగించునట్టి శబ్దము.

**ఓలగందము** (ద్వ.వి.) : పూఁతపసుపు.

**ఓలగము** (దే.వి.) : 1. కొలువు; 2. కొలువు కూటము.

**ఓలగించు** (దే.స.క్రి.) : కొలుచు, సేవించు.

**ఓలచెంగనాలు** (దే.వి.బ.) : అపజయము.

**ఓలమాసగొను** (ద్వ.అ.క్రి.) : (ఓలము + అస + కొను) మఱుఁగుపడు.

**ఓలము** (దే.వి.) :1. వృక్షములులోనగువానిచే మఱుగగుచోటు; 2. దేహము.

**ఓలలాడు** (దే.అ.క్రి.) : (ఓలలు + ఆడు) 1. మునుఁగు; 2. తేలు. (ప్రే. ఓలలార్చు.)

**ఓలాకు** (దే.వి.) : అలయిక, శ్రమము.

**ఓలాకుపడు** (ద్వ.అ.క్రి.) : అలయు, శ్రమపడు.

**ఓలాడు** (దే.అ.క్రి.) : (ఓల+ఆడు) 1. మునుఁగు; 2. తేలు.

**ఓలి** (యు.దే.వి.) : ఉంకువ. వై. వరుస.

**ఓలిమి** (దే.వి.) : ఓలము, మఱుఁగుచోటు.

**ఓల్లము** (సం.వి.అ.పుం.) : 1. అల్లము; 2. కంద.

**ఓవరి** (వై.వి.) : 1. లోపలిగది, అపవరకము; 2. చంద్రశాల.

**ఓవు** (దే.అ.క్రి.) : ఒవ్వు, సరిపడు.

**ఓషధి** (సం.వి.ఇ.ఈ.స్త్రీ) :. 1.ఫలించిన తోడనే నశించెడి యరఁటిలోనగునది; 2.మందుచెట్టు.

**ఓషధీశుఁడు** (సం.వి.అ.పుం.) : చంద్రుఁడు.

**ఓషము** (సం.వి.అ.పుం.) : 1. కాలుట; 2. కాల్చుట.

**ఓష్ఠము** (సం.వి.అ.పుం.) : అధరము, పెదవి.

**ఓసరింత** (వై.వి.) : ఓసరిల్లుట.

**ఓసరిల్లు** (వై.అ.క్రి.) : తొలఁగు, అపసరిల్లు. (ప్రే. ఓసరించు.)

**ఓసరు** (వై.అ.క్రి.) : ఓసరిల్లు.

**ఓహటము** (దే.వి.) : వెనుదీయుట.

**ఓహటిల్లు** (దే.అ.క్రి.) : వెనుదీయు. (రూ. ఓహటించు.)

**ఓహరిసాహరి** (దే.క్రి.విశ.ద్ర.) : తండోపతండముగా.

**ఓహెూ** (యు.అవ్య.) : 1. సంబోధనము నందు వచ్చును. (ఓహెూ యొక్క రూపాంతరము) 2. ఏమీ. (ఆమ్రేడితము నందు ఓహెూహెూ.)

**ఓహెూరె** (వై.అవ్య.) : (ఓహెూ+రె) బళీ.

**ఓళిగ** : హెూళిగ. కపోళి.

## ఔ

**ఔ** : ఒక యక్షరము. (దే.) : 1. అగు. (ద్ర.) : అంగీకారమును దెలుపును. 2. ప్రశంసను దెలుపును. (ఆమ్రేడితము నందు ఔనా.)

**ఔఁగదే** (దే.అవ్య.) : (ఔను+కదే) ఔరా.

**ఔఁగాక** (దే.అవ్య.) : (ఔను + కాక) అట్లే కాని. (అవుఁగాక యొక్క రూపాంతరము)

**ఔకాఁపు** (దే.వి.) : అద్దెకాపురము. (అవుకాఁపు యొక్క రూపాంతరము.)

**ఔక్షకము** (సం.వి.అ.న.) : ఉక్షముల సమూహము. (ఉక్షము = ఎద్దు)

**ఔగాములు** (దే.వి.బ.) : (ఔట+కామి) 1. కలిమిలేములు; 2. యుక్తాయుక్తతలు; 3. మేలుగీళ్లు. (ఇది యొకానొకచో నేకవచనాంతము గాను గానఁబడి యెడి.) (అవుగాములు యొక్క రూపాంతరము)

**ఔచితి** (సం.వి.ఈ.స్త్రీ.) : ఉచితత్వము, యోగ్యత.

**ఔచిత్యము** (సం.వి.అ.న.) : 1. ఔచితి; 2. సత్యము.

**ఔజ్జ్వల్యము** (సం.వి.అ.న.) : ఉజ్జ్వలత్వము.

**ఔజు** (దే.వి.) : 1. కాలువ; 2. పని వాఁడు. (అవుజు యొక్క రూపాంతరము.)

**ఔటుగుండు** (ద్వ.వి.) : చట్టిపిరంగిగుండు.

**ఔడవము** (సం.వి.అ.పుం.) : ఐదు స్వరములతోఁ గూడిన రాగము.

**ఔడు** (వై.వి.) : పెదవిక్రిందిచోటు. (అవుడు యొక్క రూపాంతరము.)

**ఔత్కంఠ్యము** (సం.వి.అ.న.) : ఉత్కంఠ, తహతహ.

**ఔత్కృష్ట్యము** (సం.వి.అ.న.) : ఉత్కర్షము, మేలు.

**ఔత్తానపాది** (సం.వి.ఇ.పుం.) : ధ్రువుఁడు.

**ఔత్సుక్యము** (సం.వి.అ.న.) : ప్రియస్మరణాదులచేఁ గాలవిళంబము నోర్వలేమి, ఉత్సుకత్వము.

**ఔదనికుఁడు** (సం.విణ.) : (అ.ఈ.అ.) వంటవాఁడు.

**ఔదరికుఁడు** (సం.విణ.) : (అ.ఈ.అ.) పొట్ట పోసికొనువాఁడు.

**ఔదల** (దే.వి.) : (ఔ + తల) 1. నడితల; 2. తల. (అవుదల యొక్క రూపాంతరము.)

**ఔదార్యము** (సం.వి.అ.న.) : 1. ఉదారత్వము; 2. ఒక శబ్దగుణము. (చూ. గుణము.)

**ఔదు** (దే.వి.) : ఔజు యొక్క రూపాంతరము. (మొదటి రూపము అవుదు.)

**ఔదుంబరము** (సం.వి.అ.న.) : ఒక లోహము, రాగి.

**ఔద్దాలకము** (సం.వి.అ.న.) : పుట్టలో పెట్టిన తేనె.

**ఔద్ధత్యము** (సం.వి.అ.న.) : ఉద్ధతత్వము, ఏపు.

**ఔపగవకము** (సం.వి.అ.న) : ఔప గవముల సమూహము. (ఔపగవము = ఉపగువున పత్యములు.)

**ఔపచారము** (సం.విణ.) : (అ.ఈ.అ.) ఉపచారము వలనఁ గలిగినది. (ఇక్కడ ఉపచారమనుగా ఒక దాని యందుండు ధర్మమును మఱియొక దాని యందారోపించుట.)

**ఔపధర్మ్యము** (సం.వి.అ.పుం.) : పాషండధర్మము.

**ఔపనిషదుఁడు** (సం.విణ.) : (అ.ఈ.అ.) ఉపనిషత్తు తెలిసినవాఁడు.

**ఔపయికము** (సం.విణ.) : (అ.అ.అ.) న్యాయముతో గూడినది, యుక్తము.

**ఔపవస్తము** (సం.వి.అ.న.) : ఉపవాసము, పస్తు.

**ఔపవాహ్యము** (సం.వి.అ.పుం.) : రాజెక్కెడి యేనుఁగు.

**ఔపాసనము** (సం.వి.అ.న.) : గృహస్థుఁడగు బ్రాహ్మణుఁడు ప్రాతఃకాలమునందు చేయు అగ్ని యుపాసన. (విణ.) : ఉపాసనా విషయ మయినది.

**ఔమీనము** (సం.విణ.) : (అ.అ.అ.) ఉమలు పండెడునది. (పొలము.)

**ఔర** (దే.అవ్య.) : (ఔను + ర) ఆశ్చర్యమును దెలుపును. (ఆమ్రేడితమందు ఔరౌర) (రూ. ఔరా.) (అవుర యొక్క రూపాంతరము).

**ఔరభ్రకము** (సం.వి.అ.న.) : ఉభ్రములల సమూహము. (ఉరభ్రము = గొఱ్ఱె)

**ఔరసుఁడు** (సం.వి.అ.పుం.) : తనకు ధర్మపత్ని యందుఁ బుట్టిన కొడుకు.

**ఔరస్యుఁడు** (సం.వి.అ.పుం.) : తనకు ధర్మపత్ని యందుఁ బుట్టిన కొడుకు.

**ఔరు** (దే.వి.) : వీరణము (అవురు యొక్క రూపాంతరము.)

**ఔర్ధ్వదైహికము** (సం.విణ.) : (అ.అ.అ.) అహర్దానము.

**ఔర్వము** (పం.వి.అ.పుం.) : బడబాగ్ని, వార్వపుటగ్గి.

**ఔర్వవ్రతి** (సం.వి.న్.పుం.) : జలాహార నియమము గలవాఁడు.

**ఔర్వశేయుఁడు** (సం.వి.అ.పుం.) : అగస్త్యముని.

**ఔల** (దే.వి.) : అవల యొక్క రూపాంతరము. (మొదటి రూపము అవల.)

**ఔలు** (దే.అ.క్రి.) : అగులు యొక్క రూపాంతరము. (మొదటి రూపము అవులు.)

**ఔలెమ్ము** (దే.అవ్య.) : (ఔను + లెమ్ము) ఔనౌను. (అవులెమ్ము యొక్క రూపాంతరము.)

**ఔలే** (దే.అవ్య.) : ఔలెమ్ము యొక్క రూపాంతరము. (మొదటి రూపము అవులే.)

**ఔశీరము** (సం.వి.అ.న.) : 1. చామర దండము; 2. శయనము; 3. ఆసనము. (విణ.) : వట్టి వేరువలనఁ బుట్టినది.

**ఔషధము** (సం.వి.అ.న.) : అగదము, మందు.

**ఔష్ట్రకము** (సం.వి.అ.న.) : ఉష్ట్రముల సమూహము. (ఉష్ట్రము = ఒంటె)

**ఔసు** (దే.వి.) : హౌసు యొక్క రూపాంతము. (మొదటి రూపము అవుసు)

## క

**క** : ఒక యక్షరము.

**కంకటము** (సం.వి.అ.పుం.) : కవచము, బొందలము.

**కంకటి** (వై.వి.) : మంచము.

**కంకణము** (ఉభ.దే.వి.) : జలపక్షి విశేషము. 1. ముత్తెముల పగడములు లోనగువానిఁ జేర్చి గ్రువ్వఁబడిన చేసరము; 2. చేతఁగట్టుకొనెడు తోరము; 3. నీటిబొట్టు.

**కంకణాయి** (దే.వి.) : జలపక్షి విశేషము, కంకణము.

**కంకతము** (సం.వి.అ.పుం.న.) : దువ్వెన.

**కంకతిక** (సం.వి.అ.స్త్రీ.) : దువ్వెన.

**కంకపత్రము** (సం.వి.అ.పుం.) : బాణము, అమ్ము.

**కంకము** (సం.వి.అ.పుం.) : రాపులుఁగు.

**కంకముఖము** (సం.వి.అ.పుం.) : కాఁచినలోహము నెత్తెడు సాధనము, పటుకాఱు.

**కంకర** (వై.వి.) : శిలావిశేషము, (విణ.) : పరుషము. (కంకరగాడిద.)

**కంకరగాడిద** (వై.వి.) : కంచర గాడిద, అశ్వతరము.

**కంకాళము** (సం.వి.అ.పుం.) : చర్మ మాంస రహితమయిన యొడలి యెముకలు గూడు, డొక్క.

**కంకి** (దే.వి.) : (జొన్న లోనగువాని) వెన్ను.

**కంకు** (దే.స.క్రి.) : 1. గద్దించు; 2. తిట్టు.

**కంకుఁడు** (సం.వి.అ.పుం.) : 1. కపట బ్రాహ్మణుఁడు; 2. రాపులుఁగులను జంపితినెడు బోయ; 2. యముడు; 3. యుధిష్ఠి రుఁడు.

**కంగటి** (వై.వి.) : కంకటి యొక్క రూపాంతరము.

**కంగాణము** (దే.వి.) : కళ్లమునందలి కావలి.

**కంగారు** (దే.వి.) : యుద్ధము.

**కంగాళీ** (హిం. విణ.) : నీచమైన, అత్యల్పమైన.

**కంగిస** (దే.వి.) : యుద్ధము.

**కంగు** (దే.వి.) : నూలిపోఁగుతో వంగా ఏర్పఱచిన కన్ను.

**కంగునీపత్రము** (సం.వి.అ.పుం.) : తుత్తిరి.

**కంగువు** (సం.వి.ఉ.స్త్రీ.) : ప్రియంగువు, కొఱ్ఱలు.

**కంగేలి** (వై.వి.) : అశోకము.

**కంగోరు** (దే.వి.) : నిడుపుకాసె.

**కంచి** (వై.వి.) : కాంచీపురము. విణ. పెద్ద.

**కంచిమేఁక** (ద్వ.వి.) : పెద్దపొదుఁగు గల యొక దినుసు మేఁక.

**కంచియ** (దే.వి.) : 1. పసులు మేయుటకై దున్నక నిలిపిన పొలము, వివీతము, 2. జెముడు బలుసులోనగువానిచే నేర్పఱపఁబడిన వెలుగు, వృతి.

**కంచుకము** (సం.వి.అ.పుం.) : 1. అవిక; 2. కుబుసము; 3. పాము యొక్క కుబుసము 4. కవచము.

**కంచుకి** (సం.వి.ఇ.స్త్రీ.) : ఓషధి విశేషము. (న్.పుం.) : 1. అంతఃపుర కావలివాఁడు; 2. విటుఁడు 3. పాము; 4.అగరుఁద్రాను.

**కంచులిక** (సం.వి.ఆ.స్త్రీ.) : కంచుకము, అవిక.

**కంచె** (దే.వి.) : కంచియ యొక్క రూపాంతరము.

**కంచెకోట** (ద్వ.వి.) : వెదురు పేములో నగువానిచే గోటకుఁ జుట్టు నేర్పఱపఁ బడిన ఆవరణము, ప్రాచీనము.

**కంచెగోడ** (ద్వ.వి.) : కంపపాఁతినగోడ.

**కంచెల** (వై.వి.) : అవిక.

**కంచేము** (వై.వి.) : 1. బంగారు వెండిలోనగు వానిచేఁ జేయబడిన పాత్రము; 2. బంగారు వెండి లోనగువానిచేఁ జేయబడిన భోజన పాత్రము.

**కంచేర** (వై.వి.) : కంచుపనిచేసి బ్రతికెడు జాతి. (కంచరవాఁడు)

**కంచరగాడిద** (వై.వి.) : (కంచరము + గాడిద) కంచరమునకుఁ బూన్చెడు ఒక దినుసుగాడిద, అశ్వతరము.

**కంచేరము** (వై.వి.) : రథ విశేషము, గాడీ.

**కంచేరి** (వై.వి.) : కంచుపనిచేయువాఁడు, కాంస్యకారుఁడు.

**కంచే** (వై.వి.) : ఒక లోహము, కాంస్యము.

**కంచేకంటు** (దే.వి. దే.వి.) : బాణలి.

**కంచేమించు** (దే.విశ.) : అగోచరము.

**కంజజుఁడు** (సం.వి.అ.పుం.) : బ్రహ్మ, తమ్మిచూలి.

**కంజము** (సం.వి.అ.న.) : 1. తామర; 2. అమృతము. (పుం.) వెండ్రుక.

**కంజాతము** (సం.వి.అ.న.) : పద్మము, నీటి పుట్టుగు.

**కంజుఁడు** (సం.వి.అ.పుం.) : బ్రహ్మ, నలువ.

**కంజు** (వై.వి.) : పక్షివిశేషము. (కౌఁజు యొక్క రూపాంతరము.)

**కంట** (దే.వి.) : 1. కనుట; 2. నాట్యబంధము.

**కంటక** (సం.వి.అ.స్త్రీ.) : 1. ఎఱ్ఱతుమ్మెద; 2. కడుఁదురీఁగ.

**కంటకపుంఖి** (సం.వి.ఈ.స్త్రీ.) : ములు వెంపలి.

**కంటకఫలము** (సం.వి.అ.పుం.) : పనస.

**కంటకము** (ఉభ.దే.వి.) : విరోధోక్తి. (విశ.) : విరుద్ధము. 1.ముల్లు; 2. చేఁపలోనగువాని యెముక 3. కాకి; 4. రోమాంచము; 5. వెదురు; 6. సూదిమొన.

**కంటకారిక** (సం.వి.ఆ.స్త్రీ.) : వాఁకుడు.

**కంటకుఁడు** (సం.వి.అ.పుం.) : క్షుద్ర శత్రువు.

**కంటగించు** (దే.అ.క్రి.) : 1. విరోధించు; 2. నొచ్చు. (చూ. అలుగుల పడు.)

**కంటగిల్లు** (దే.అ.క్రి.) : నొచ్చు.

**కంటలము** (దే.వి.) : 1. చిల్లర సరుకులుంచి యెద్దు మొదలగు వానిమీద వేసెడు సంచుల జత; 2. దూదిమూట.

**కంటసము** (దే.వి.) : విరోధోక్తి, విప్రలాపము.

**కంటసరి** (వై.వి.) : మెడను ధరించెడి యొకానొక సొమ్ము.

**కంటియ** (వై.వి.) : కంటె.

**కంటివాలు** (ద్వ.వి.) : (కల్లు + వాలు) చక్రాయుధము

**కంటు** (దే.వి.) : పగ, విరోధము.

**కంటె** (యు.దే.అప.) : ఒకానొక విభక్తి. (వై.వి.): మెడను ధరించెడి చక్రాకారపు స్వర్ణాభరణ విశేషము. (కంటియ యొక్క రూపాంతరము.)

**కంట్లము** (దే.వి.) : కంటలము యొక్క రూపాంతరము.

**కంటగుణిక** (సం.వి.ఆ.స్త్రీ.) : పల్లకి, వీణె.

**కంఠము** (సం.వి.అ.పుం.) : 1. కుత్తుక; 2.కుత్తుక యొక్క ధ్వని; 3.సమీపము; 4. మంగచెట్టు.

**కంఠిక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. కంటె; 2. మెఱపు.

**కంఠీరథము** (సం.వి.అ.పుం.) : బాలకాదుల క్రీడాశకటము, డయనము.

**కంఠీరవము** (సం.వి.అ.పుం.) : సింహము, సింగము.

**కంఠేకాలుఁడు** (సం.వి.అ.పుం.) : శివుఁడు, కఱకంఠుఁడు.

**కంఠేరుఁడు** (సం.విశ.) : (అ.ఆ.ఆ.) దరిద్రుడు, బీద.

**కండ** (వై.వి.) : 1. పులకండము; 2. మాంస ఖండము; 3. మాంసము.

**కండచక్కెర** (వై.వి.) : పులకండము.

**కండచుక్క** (వై.వి.) : కడుపులో కుడిప్రక్క నల్లనై యుండెడు మాంస విశేషము, కాలఖండము.

**కండనము** (సం.వి.అ.న.) కంబూకము, తవుడు.

**కండని** (సం.వి.ఈ.స్త్రీ.) : ఉలూఖలము, ఱోలు.

**కండియ** (వై.వి.) : నూలికండె.

**కండువా** (దే.వి.) : 1. వెడల్పుగల యంగ వస్త్రము; 2. అడ్డ దూలము.

**కండువు** (సం.వి.ఊ.స్త్రీ.) : ఖర్జువు, తీఁట.

**కండూతి** (సం.వి.ఇ.స్త్రీ.) : ఖర్జువు, తీఁట.

**కండూయ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఖర్జువు, తీఁట.

**కండూర** (సం.వి.ఆ.స్త్రీ.) : దూలగొండి. (అ.పుం. ము.) : కంద.

**కండె** (వై.వి.) : 1. జొన్న కంకి; 2. పేనిన నూలి చుట్ట; 3. సాముచే మిక్కిలి గట్టి పడిన భుజముఖము.

**కండెము** (వై.వి.) : సాముచే మిక్కిలి గట్టిపడిన భుజముఖము.

**కండోలము** (సం.వి.అ.పుం.) : పిటము, గంప.

**కండోలవీణ** (సం.వి.ఆ.స్త్రీ.) : మాలవీణె, కిన్నెర.

**కంతి** (వై.వి.) 1. గడ్డవలెఁబుట్టెడు రోగ విశేషము; 2. దద్దు. (ఇక్కడ దద్దులనియే చెప్పవచ్చును. అయినను పాఠ మిట్లున్నది.)

**కంతు** (దే.వి.) : గడువు.

**కంతుఁడు** (సం.వి.ఉ.పుం.) : మన్మథుఁడు, మరుఁడు.

**కంతువు** (సం.వి.ఉ.పుం.) : గాదె.

**కంత్రాక్టు** (ఆం.వి.) : పనిచేయుటకు ఒడంబడిక.

**కంథ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. చింపిగుడ్డలను గూర్చి కుట్టిన బొంత; 2. చింపిగుడ్డ; 3. మట్టిగోడ.

**కంథటిక** (సం.వి.ఆ.స్త్రీ.) : కంథ, బొంత.

**కంథావాటము** (సం.వి.అ.పుం.) : ప్రాకారము.

**కంద** (సం.వి.అ.పుం.) : కందగడ్డ (దీనిని గొందఱు వైకృతముగా వాడియున్నారు)

**కందకము** (దే.వి.) : అగడిత, పరిఖ.

**కందణము** (దే.వి.) : మల్లబంధ విశేషము.

**కందనగాయ** (దే.వి.) : గుండియ.

**కందము** (ఉభ.వై.వి.) : పశుజాతి మూఁపు. 1. గడ్డ; 2. మబ్బు; 3. పద్య విశేషము; 4. కంద గడ్డ; 5. తామర లోనగువాని దుంప.

**కందరము** (సం.వి.అ.పుం.) : 1. గుహ; (ఇది యీ యర్థమునందు ఆకారాంత స్త్రీ లింగము నగును.) 2. అంకుశము.

**కందరాలము** (సం.వి.అ.పుం.) : 1. కొండ గొనుగు; 2. కలజువ్వి.

**కందర్పుఁడు** (సం.వి.అ.పుం.) : మన్మథుఁడు, మరుఁడు.

**కందళము** (ఉభ.దే.వి.) : ఎద్దువీఁపుపై వేసెడు గంత. సం.అ.త్రి. 1. క్రొత్త మొలక; 2. అవ్యక్త మధుర ధ్వని; 3. ఉప రాగము; 4. కపాలము.

**కందళి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. టెక్కెము; 2. ఒక విధమయిన పొద; 3. ఇరువది యంగుళముల నిడివిగలలేడి. (పుం.) : ఇరువదియంగుళముల నిడివిగల యిఱ్ఱి. (అని కొందఱు.)

**కందళించు** (సం.అ.క్రి.) : అంకురించు, మొలచు.

**కందళికము** (దే.వి.) : ఎద్దువీఁపుపైవేసెడు గంత.

**కందాయము** (సం.వి.అ.పుం.) : సంవత్సరము నందు మూడవ భాగము.

**కందారి** (దే.వి.) : ఒకనొక చెట్టు, తీక్ష్ణ కంటక.

**కంది** (దే.వి.) : సస్య విశేషము, తువరి. బ. ధాన్య విశేషము. (దీని భేదములు–కొండకందులు, పొట్టి కందులు.)

**కందు** (దే.అ.క్రి.) : 1.తపించు; 2. నలుపగు. 1. తాపము; 2 నలుపు; 3. బిడ్డ.

**కందుఁడు** (వై.వి.) కుమారస్వామి.

**కందుకము** (సం.వి.అ.పుం.) : ఆడెడు చెండు. (రూ. కండుకము.)

**కందురు** (వై.వి.) : కందురీఁగ.

**కందువ** (దే.వి.) : 1. జాడ; ఆ.2 సంకేత స్థలము; 3. ఋతువు; 4. ఏకాంతము; 5.చమత్కారము; 6. ప్రదేశము; 7. సామర్థ్యము; 8. తెగ.

**కందువాఱు** (దే.అ.క్రి.) : (కందు + పాఱు) మలినమగు.

**కందువు** (ఉభ. దే.వి.) : బిడ్డ (ఇది ప్రాచీన కవి ప్రయోగములందు వు వర్ణాంతముగాఁగను బడలేదు) (సం.ఉ.పుం.స్త్రీ.) : పెనము.

**కందెన** (దే.వి.) : బండి యిరుసునకుఁ బూసెడు మసి.

**కందెఱ** (ద్వ.వి.) : (కన్ను+తెఱ) ఱెప్ప.

**కంధర** (సం.వి.ఆ.స్త్రీ.) : మెడ (రూ. కంధరము) (అ.పుం.ము.) మబ్బు.

**కంధి** (సం.వి.ఇ.పుం.) : సముద్రము, కడలి.

**కంప** (దే.వి.) : ముండ్లమండ.

**కంపకోట** (ద్వ.వి.) : వెదురు పేములోనగు వానిచేఁ గోటకుఁజుట్టు నేర్పఱపఁబడిన యావరణము, ప్రాచీనము.

**కంపగోడ** (ద్వ.వి.) : కంపపాఁతినగోడ.

**కంపణము** (సం.వి.అ.పుం.) : ఆయుధ విశేషము.

**కంపనము** (సం.వి.అ.న) : 1.కదలుట; 2. వణఁకుట. (విణ.) 1. కదలునది 2. వణఁకునది.

**కంపము** (సం.వి.అ.పుం.) : వేపథువు, వణఁకు.

**కంపరము** (దే.వి.) : పాడె, ఖాటి.

**కంపించు** (సం.అ.క్రి.) : వణఁకు.

**కంపితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) వణఁకెత్తినది.

**కంపిల్లము** (వై.వి.) : కాంపిల్యము.

**కంపు** (దే.వి.) : గంధము. (వాడుక యందు దుర్గంధమని చెప్పుదురు.)

**కంపుదుమ్ము** (దే.వి.) : (కంపు + తుమ్మ) విట్ఖదిరము.

**కంపుటిరుగుడు** (దే.వి.) : (కంపు + ఇరుగుడు) భస్మగర్భ.

**కంపె** (దే.వి.) : తాంబూలపాత్రము.

**కంపెలుక** (దే.వి.) : (కంపు+ఎలుక) చుంచు, గంధమూషిక.

**కంప్రము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. కదలునది; 2. వణఁకునది.

**కంబడి** (వై.వి.) : కంబళి, కంబళము.

**కంబమయ్య** (వై.వి.) : (కంబము + అయ్య) స్తంభోద్భవ నృసింహస్వామి.

**కంబము** (వై.వి.) : 1. స్తంభము; 2. మల్ల పరికర విశేషము.

**కంబమురాయఁడు** (వై.వి.) : కంబమయ్య.

**కంబరత్రాడు** (గ్రా.వి.) : కొబ్బరిపీచుతో నల్లిన త్రాఁడు.

**కంబవల్లి** (వై.వి.) : ఉపనయమునందుఁ గడపటి దినము చేయు స్తంభపూజలో నగునది.

**కంబళము** (సం.వి.అ.న.) : నీరు. (పుం.) : 1.కంబళి; 2.ఉత్తరీయము; 3.కంబళిపురుగు; 4.గంగ డోలు; 5. ఏనుఁగు పక్కెర. (డు.) ఒక సర్పరాజు.

**కంబళి** (ఉభ.వై.వి.) : కంబళము (సం.న్.పుం.): ఎద్దు.

**కంబళిపండు** (ద్వ.వి.) : పట్టుపురుగు చెట్టు పండు.

**కంబళిపురుగు** (వై.వి.) : శూకకీటము.

**కంబాలాట** (ద్వ.వి.) : (కంబాలు+ఆట) బాలికా క్రీడావిశేషము. (చూ. అచ్చన గండ్లు.)

**కంబి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. వెదురుకమ్మి; 2. గరిటె.

**కంబు** (ఉభ.దే.వి.) : సజ్జపైరు. (బ.) : సజ్జలు. (సం.అ.న.) : 1. నీరు; 2. తల; 3. సుఖము. (పుం.) : 1. గాలి; 2. నెమలి. (ఇట్టి యేకాక్షర శబ్దములకు అమహదర్థమందు మాత్రము ఆధునిక ప్రయోగములయందు రూపమిట్లు కానఁబడుచున్నది.)

**కంబుగ్రీవ** (సం.వి.ఆ.స్త్రీ.) : మూడు ముడుతలు గల మెడ.

**కంబువు** (సం.వి.ఉ.పుం.న.) : శంఖము. (పుం.) : 1. ఏనుఁగు; 2. కడియము; 3. నత్తగుల్ల.

**కంబూకము** (సం.వి.అ.పుం.) : కండనము, తవుడు.

**కంసము** (సం.వి.అ.పుం.న.) : 1.కంచు; 2. కంచుగిన్నె; 3. మాన విశేషము (పుం. డు.) : ఒక రాక్షసుఁడు.

**కంసారాతి** (సం.వి.ఇ.పుం.) : కృష్ణుడు, వెన్నుఁడు.

**కకపాల** (వై.వి.) : సన్యాసులు తఱచుగాఁ జంకను బెట్టుకొనెడి యొక దినుసు సంచి. (కక్కపాల యొక్క రూపాంతరము)

**కకవికలు** (వై.వి.బ.) : యథాయథలు.

**కకావికలు** (వై.వి.బ.) : కకవికలు యొక్క రూపాంతరము.

**కకుత్తు** (సం.వి.ద్.సీ.) : 1. ఎద్దు మూఁపురము; 2. రాజ చిహ్నము విణ. శ్రేష్ఠము.

**కకుదము** (సం.వి.అ.పుం.న.) : 1. ఎద్దు మూఁపురము; 2. రాజ చిహ్నము (విణ.) : శ్రేష్ఠము.

**కకుద్మంతము** (సం.వి.త్.పుం.) : ఎద్దు. (విణ.): గొప్పమూఁపురము గలది.

**కకుద్మతి** (సం.వి.ఈ.స్త్రీ.) : శ్రోణి, పిఱుఁదు.

**కకుప్పు** (సం.వి.భ్.స్త్రీ.) : 1.దిక్కు; 2.శోభ; 3. సంపెఁగదండ; 4. అల్లికజడ.

**కకుభము** (సం.వి.అ.పుం.) : 1. ఏఱు మద్ది; 2. వీణెకరివె; 3. రాగభేదము.

**కక్కపాల** (వై.వి.) : కకపాల.

**కక్కరము** (వై.విణ.) : కఱకు.

**కక్కసపడు** (వై.అ.క్రి.) : (కక్కసము+పడు) 1. బాధపడు; 2. సంకటపడు. (చూ. కక్కసించు, కక్కసము.)

**కక్కసపెట్టు** (కక్కసము + పెట్టు) (ద్వ.స. క్రి.) : 1. బాధపఱచు; 2. సంకట పఱచు. (చూ. కక్కసము.)

**కక్కసము** (వై.వి.) : 1. కశ; 2. బాధ; (చూ. కక్కసించు) 3. సంకటము. 1. కఠినము; 2. కష్టము.

**కక్కసించు** (వై.స.క్రి.) : 1. బాధించు; 2. సంకట పరచు. (చూ. కక్కసము.)

**కక్కిరిబిక్కిరి** (దే.విణ.) : తాఱుమాఱు.

**కక్కు** (దే.స.క్రి.) : 1. కడుపులోనిది వెలిపుచ్చు; 2. వెడలించు. (ఈ యర్థ మందిది కఱకు యొక్క మాఱు రూపము.)

**కక్కుఁదెవులు** (దే.వి.) : (కక్కు + తెవులు) వ్యాధి విశేషము.

**కక్కుడు** (దే.వి.) : కక్కుట.

**కక్కుతితి** (దే.వి.) : 1. అశ్రద్ధ; 2. లోభము.

**కక్కుతితికాఁడు** (దే.విణ.) : 1. అశ్రద్ధ గలవాఁడు; 2. లోభి.

**కక్కువాయి** (ద్వ.వి.) : కాసరోగ విశేషము.

**కక్కెర** (వై.వి.) : పక్షి విశేషము. (క్రక్కెర యొక్క రూపాంతరము.)

**కక్ష** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. కచ్చ; 2.పోటి. (అ.పుం. ము.) : 1. చంక; 2.కసెము; 3.గడ్డి; 4.పొద; 5. ఎండినయడవి.

**కక్షపాల** (సం.వి.అ.స్త్రీ.) : కకపాల.

**కక్ష్య** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. తొట్టికట్టు; 2. మొల నూలు; 3. ఏనుఁగు నడుమునఁ గట్టెడు మోకు; 4. వాఁకుడు.

**కగ్గము** (వై.వి.) : కత్తి, ఖడ్గము.

**కచ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఆఁడేనుఁగు. (అ.పుం. ము.) : 1. వెంట్రుక; 2. కట్టు; 3. ఎండిన పుండు. (డు.) : బృహస్పతి కొడుకు.

**కచంకనము** (సం.వి.అ.న.) : నిర్ణయింఁపబడిన దినము నందుంచెడి యంగళ్ల వరుస, సంత.

**కచంగల** (సం.వి.అ.స్త్రీ.) : జంతువులు మిక్కిలి తఱచుగాఁగల నేల.

**కచిక్కు** (దే.వి.) : పొడుచుటయందగు ధ్వన్యను కరణము.

**కచేలము** (సం.వి.అ.పుం.) : జాబు మడుపు.

**కచేరి, కచ్చేరి** (హిం.వి.) : కొలువు కూటము, ఉద్యోగశాల.

**కచోలము** (సం.వి.అ.పుం.) : మానవిశేషము.

**కచ్చరము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మయిలది.

**కచ్చా** (హిం.విణ.) : పిచ్చ, తక్కువ, నీచమైన.

**కచ్చి** (దే.వి.) : (సాలెవాఁడు) లేక కొయ్యలను పడుగునందుఁ జొప్పించెడు సందు.

**కచ్చించు** (యు.దే.స.క్రి.) : సారెలులో నగు నడపు. (వై.అ.క్రి.) : కచ్చుఁగట్టు.

**కచ్చిక** (దే.వి.) : కాలిన పిడకతునుక.

**కచ్చితము** (వై.విణ.) : ఎచ్చుతక్కువలు లేక సరిగా నుండునది.

**కచ్చియ** (వై.వి.) : కలహము.

**కచ్చె** (వై.వి.) : కచ్చియ యొక్క రూపాంతరము.

**కచ్చెపోతు** (ద్వ.విణ.) : కలహశీలుఁడు.

**కచ్చేరి** (వై.వి.) : 1. న్యాయవిచారణ స్థలము; 2. వినోద గోష్ఠి.

**కచోరము** (వై.వి.) : కచ్చూరకము. (దీనినే గంధకచోర మందురు.)

**కచ్చే**(వై.వి.) : 1. వెనుకఁ జెక్కుకొనెడు దోవతి కొంగు; 2. కాసె; 3. గోఁచి.

**కచ్చేడము** (యు.దే.వి.) : దూది జీలకఱ్ఱలోనగు వానిఁ దెచ్చెడు బండి. (వై.) : కౌపీనము.

**కచ్చే** (యు.దే.స.క్రి.) : సారెలు లోనగువాని నడవు. (వి.) 1. గర్వము; 2. ఱేకు; 3. సిగబంతి; 4. పెద్ద వాసాము.

**కచ్చేకొను** (దే.స.క్రి.) : ఆశించు.

**కచ్ఛ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.చిమ్మట; 2ఒక మాతృక. (చూ. మాతృక) (అ.పుం.ము.) 1.వెనుక చెక్కు కొనుడు దోవతి కొంగు; 2.గోఁచి; 3.కసెము; 4.ఓడయంగము; 5.దరి; 6.పూఁదోట; 7.ప్రక్క; 8. నందివృక్షము.

**కచ్ఛటిక** (సం.వి.ఆ.స్త్రీ.) : కౌపీనము, గోఁచి.

**కచ్ఛపము** (సం.వి.అ.పుం.) : 1. తాఁబేలు; 2. ఒక నిధి; 3. మల్లబంధ విశేషము.

**కచ్ఛపి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. ఆఁడు తాఁబేలు; 2. సరస్వతి యొక్క వీణె; 3. మొటిమ.

**కచ్ఛుర** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. గంట్లకచోరము; 2. రేగడిదూల; 3. వాఁకుడు.

**కచ్ఛురుఁడు** (సం.వి.అ.పుం.) : జారుఁడు. (విణ.): గజ్జిగలవాఁడు.

**కచ్ఛువు** (సం.వి.ఊ.స్త్రీ.) : విచర్చిక, గజ్జి.

**కచ్చూరకము** (సం.వి.అ.పుం.) : గంధకచోరము.

**కచ్చూరము** (సం.వి.అ.పుం. ) : గంట్లక చోదము.

**కజ్జలము** (సం.వి.అ.న.) : 1. కాటుక; 2. చీఁకటి. (పుం.) : మబ్బు.

**కజ్యా, ఖజ్యా** (హిం.వి.) : పోరు, జగడము.

**కజ్జేము** (వై.వి.) : పోరు, జగడము.

**కజ్జోయము** (వై.వి.) : (కజ్జము యొక్క రూపాంతరము)

**కజ్జోరము** (వై.వి.) : ఖర్జూరము.

**కట** (దే.అవ్య.) : సంతాపమును దెలుపును. (రూ. కటా. ఆమ్రేడితమందు కటకట, కటకటా)

**కటంబకుఁడు** (సం.విణ.) : (అ.ఈ.అ.) కూరలు వండెడువాఁడు.

**కటంభర** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. ఆఁడేనుఁగు; 2. కటుక రోహిణి; 3. గొంతెమ గోరు.

**కటకట** (దే.వి.) : కొఱుకుటలోనగువాని యందగు ధ్వన్యనుకరణము (పండ్లు కటకట కొఱికెను. (చూ. గోంఁడ్రించు.)

**కటకటఁబడు** (ద్వ.అ.క్రి.) : (కటకట+ పడు) 1. కోపించు; 2. బాధపడు.

**కటకటాలు** (దే.వి.బ.) : ఇనుప కమ్ముల లోనగు వానిచే నేర్పఱచెడి యడ్డు, (రూ.) కటకటా కమ్ములు.

**కటకము** (సం.వి.అ.పుం,న.) : 1. కడి యము; 2. కొండనడుము; 3. ఏనుఁగు కొమ్మునకు వేసెడు పొన్ను; 4.రాజధాని; 5. సముద్రము నందుఁ గలిగెడి యుప్పు.

**కటకరము** (వై.వి.) : గంధర్వ మృగము.

**కటకాముఖము** (సం.వి.అ.పుం.) : అభినయహస్త విశేషము. (జుట్టన నడిమి వ్రేళ్ల నందును బొటనవ్రేలు చొప్పించి యఱచేతి చాయ వ్రాల్చి యుంగరపు వ్రేలిని జిటికెన వ్రేలిని నించుకంత వంచి పొడవుగాఁ బట్టినది.)

**కటకారుఁడు** (సం.వి.అ.పుం.) : 1. చాఁపలల్లు వాఁడు; 2. మేదరవాఁడు.

**కటపెట** (దే.వి.) : ఒరయుటయందగు ధ్వన్యను కరణము.

**కటభి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. మానేరుతీఁగ; 2. ఒకానొక మ్రాను.

**కటము** (సం.వి.అ.పుం.) : 1. ఏనుఁగు ఎక్కిలి; 2. చాఁప, 3. అతిశయము; 4. పీనుఁగు; 5. ప్రతిజ్ఞ; 6. మొల; 7. శ్మశానము.

**కటాక్షము** (సం.వి.అ.పుం.) : 1. కడకన్ను; 2. కడకంటి చూపు.

**కటాక్షించు** (సం.స.క్రి.) : కడకంటఁ జూచు.

**కటాదము** (సం.వి.అ.పుం.) : మహిషము, దున్నపోతు.

**కటారి** (వై.వి.) : 1. కత్తి; 2. బాఁకు.

**కటారికత్తియ** (వై.విశ.) : కటారి గలది. (ఆఁడుది.) (రూ. కటారికత్తె.)

**కటారికాఁడు** (వై.విశ.) : కటారి గలవాఁడు.

**కటారు** (వై.వి.) : 1. కత్తి; 2. బాఁకు.

**కటాహము** (సం.వి.అ.పుం.) : 1. నూనెలోనగు నవి కాఁచెడి కడవ; 2.కప్పెర; 3. తాఁబేటి వెన్ను చిప్ప; 4. ఒకానొక దీవి; 5. అప్పుడే కొమ్ములు తలచూపెడి యెనుపదూడ.

**కటి** (సం.వి.ఇ.స్త్రీ.) : మొల. (ఈ.స్త్రీ.) : పిప్పలి.

**కటిక** (వై.వి.) : మాంసమమ్మువాఁడు; 2. వెండి బెత్తమువాఁడు. (కట్టిక యొక్క రూపాంతరము.) (చూ. కట్టిక.)

**కటికమెకము** (వై.వి.) : ఖడ్గమృగము.

**కటికి** (దే.విశ.) : 1. అధికము; 2. కఠినము; 3. సాంద్రము.

**కటినము** (సం.వి.అ.న.) : పత్రఫలాదులుంచెడు బుట్ట.

**కటిల్లకము** (సం.వి.అ.పుం.) : 1.కప్పు; 2.కాఁకర; 3. నల్లగగ్గెర.

**కటీరము** (సం.వి.అ.పుం.) : మొల.

**కటుంభర** (సం.వి.ఆ.స్త్రీ.) : కటుక రోహిణి.

**కటుక** (సం.వి.ఆ.స్త్రీ.) : కటుకరోహిణి. (ఆ.న. ము.) : సొంటి పిప్పలి మిరియములు.

**కటుక్కు** (దే.వి.) : కొఱుకుట యందగు ధ్వన్యను కరణము.

**కటుతుంబి** (సం.వి.ఈ.స్త్రీ.) : చేఁదు గల సొర.

**కటుమరలు** (దే.వి.) : చెక్కిళ్ల మీఁది భాగములు, హనువు.

**కటురోహిణి** (సం.వి.ఈ.స్త్రీ.) : కటుక రోహిణి.

**కటువు** (ఉభ.వై.వి.) : పాడె. (సం.వి.ఉ.స్త్రీ.) : 1. కటుకరోహిణి; 2. నల్లావ; 3. ప్రేంకణము. (న.) : కానిపని (పుం.) : 1.కారము; 2.వాసన. (విశ.) : 1.ఇంపు కానిది; 2.కారము గలది; 3. మచ్చరము గలది; 4. వాఁడిమిగలది; 5. వాసన గలది.

**కటోలవీణ** (సం.వి.ఆ.స్త్రీ.) : మాలవీణె, కిన్నెర.

**కట్ట** (దే.వి.) : 1.మోపు; 2.చెఱువులోనగువాని కట్ట. (అవ్య.) సంతాపమును దెలుపునది (రూ.) కట్టా.

**కట్టకడ** (దే.వి.) : (కడ + కడ) అన్నిటికిఁ గడ.

**కట్టడ** (దే.వి.) : 1. నియమము; 2. తీరు.

**కట్టడచేయు** (దే.స.క్రి.) : ఆజ్ఞాపించు.

**కట్టనము** (దే.వి.) : 1. కానుక; 2. బంధనము.

**కట్టరము** (వై.వి.) : నాట్యబంధము. (చూ. కంట)

**కట్టిఁడి** దే.విశ. (కట్టు + ఇఁడి) క్రూరుఁడు.

**కట్టిక** వై.వి. వెండిబెత్తమువాఁడు.

**కట్టియ** (వై.వి.) : 1. కాష్ఠము; 2. దండము.

**కట్టు** (దే.అ.క్రి.) : 1. (ఆవులోనగునది) గర్భము ధరించు; 2. నిబద్ధమగు; (అంచెలుగట్టు, అంటలుగట్టు, అట్టుకట్టు, కరుదుకట్టు, కాలువలు గట్టు, గెలలు గట్టు, ఇత్యాదుల యందిది అగు ధాత్వర్థకమని యెఱుంగ వలయును.) (స.క్రి.): 1. బంధించు; 2. ఆరోపించు; 3. కూడఁ బెట్టు; 4. నిర్మించు; (ఇల్లుకట్టులోనగునది.) 5. (వస్త్రము) ధరించు. (వి.) : 1. బంధము 2. తొట్టి కట్టు; 3. వస్త్రధారణము; 4. నిబంధ నము; 5. నిర్బంధము; 6. ప్రదేశము; 7.మితి; 8. యూషము; 9. (పొల్ల యొక్క) సమూహము.

**కట్టుఁగంబము** (ద్వ.వి.) : (కట్టు + కంబము) ఏనుఁగు లోనగువానిఁ గట్టునట్టి స్తంభము.

**కట్టుఁగొంగు** (దే.వి.) : (కట్టు+కొంగు) కోక యొక్క కట్టుకొను చెఱఁగు.

**కట్టుఁగొమ్మ** (దే.వి.) : (కట్టు+కొమ్మ) అనకట్ట.

**కట్టుఁగొయ్య** (దే.వి.) : (కట్టు+కొయ్య) నాఁగటిమేఁడి.

**కట్టుఁగోక** (దే.వి.) : (కట్టు+కోక) మొలను ధరించెడు వస్త్రము, అంతరీయము (ఇట్లు కట్టు బట్ట లోనగునది.)

**కట్టుక** (దే.వి.) : గర్భస్రావము.

**కట్టుగడ** (దే.విణ.) : చేర్చిపెట్టినది. (ధాన్యము)

**కట్టుగొళ్లు** (దే.వి.) : (కట్టు + కొళ్లు) పసులను గట్టుటకు కళ్లమునఁబాఁతిన గుంజ, మేధి.

**కట్టుదొన** (ద్వ.వి.) : కోనేఱు.

**కట్టుపకాసి** (ద్వ.వి.) : రణోద్యుక్తుఁడైన శూరుఁడు.

**కట్టుపకాసు** (దే.విణ.) : అచలుఁడు.

**కట్టుపడు** (ద్వ.అ.క్రి.) : బద్ధమగు.

**కట్టుపాటు** (దే.వి.) : 1. కట్టు పడుట; 2. నిబంధనము.

**కట్టుబండి** (దే.వి.) : సకల పరికర సహితమైన శకటము.

**కట్టుబడి** (దే.వి.) : బంటునకిచ్చెడు మాన్యము.

**కట్టుమట్టు** (దే.వి.) : 1. పసులను గట్టు చోటు; (దీని నీయర్థమందు కట్టుముట్టని వాడుచు న్నారు.) 2. ఉనికితావు

**కట్టుమామిడి** (దే.వి.) : చిలుకలు లోనగునవి కొఱకకుండ పండ్లు మూసి కట్టఁబడిన మామిడి.

**కట్టుమ్రాను** (దే.వి.) : తెప్ప, ప్లవము.

**కట్టువ** (దే.వి.) : వెలుగు, వృతి.

**కట్టె** (వై.వి.) : కట్టియ యొక్క రూపాంతరము.

**కట్టెడ** (దే.వి.) : ఎడనెడ కట్లుగల సర్ప విశేషము.

**కట్టెపాఁపర** (ద్వ.వి.) : ఒకానొక చెట్టు.

**కట్టెవిఱుపుమాట** (ద్వ.వి.) : పరుష వచనము, కఠినోక్తి.

**కట్నము** (దే.వి.) : కానుక. (కట్టనము యొక్క రూపాంతరము.)

**కట్ఫలము** (సం.వి.అ.పుం.) : పినగుమ్మడు.

**కట్ల** (వై.వి.) : ఒకానొక తీఁగ, ఖట్వ.

**కట్లంక** (దే.వి.) : వరుసడ్డలపైనుంచెడి యొంటి గుడ్డ.

**కట్లగుదియ** (ద్వ.వి.) : ఆయుధ విశేషము, ముసుండి.

**కట్లజెట్టి** (దే.వి.) : కట్లుగల పెద్దజెట్టి.

**కట్లదండ** (దే.వి.) : ఎడనెడ బంగారు కట్లు గ్రుచ్చిన నల్లపూసల సరము.

**కట్లపురుగు** (ద్వ.వి.) : సర్పవిశేషము.

**కట్లబల్ల** (ద్వ.వి.) : (కట్ల + బల్ల) కత్తెరకాళ్ల మడుపు బల్ల.

**కట్లమారి** (దే.విణ.) : కట్లుగలది.

**కట్లసంచి** (దే.వి.) : (కట్లు + సంచి) చుట్లు అరలేర్పఱిచి కుట్టిన నిడుపాటి గుండు సంచి.

**కట్లి** (వై.వి.) : మంచపుడోలి.

**కట్లియ** (దే.వి.) : బంగారు తూనిక గుండు.

**కట్లె** (దే.వి.) : కట్లియ యొక్క రూపాంతరము.

**కట్వంగము** (సం.వి.అ.పుం.) : దుండిగము.

**కఠము** (సం.వి.అ.పుం.) : కంఠ స్వరము. (డు.): 1. ఒకానొక ఋషి; 2. ఆ ఋషి చెప్పిన ఋక్కులను జదువు వాఁడు, 3. ఆ ఋక్కులను దెలిసిన వాఁడు.

**కఠారము** (సం.వి.అ.పుం.) 1. కత్తి; 2. బాఁకు.

**కఠింజరము** (సం.వి.అ.పుం.) : నల్ల గగ్గెర.

**కఠిన** (సం.వి.ఆ.స్త్రీ.) : బెల్లపుచక్కెర (అ.న.ము.) : వంటకుండ. (విణ.) : గట్టి.

**కఠిని** (సం.వి.ఈ.స్త్రీ.) : ఖటిక, బలపము.

**కఠిల్లకము** (సం.వి.అ.పుం.) : 1.కప్పు; 2.కాఁకర; 3. నల్ల గగ్గెర.

**కఠిల్లు** (దే.వి.) : హతియందుగ ధ్వన్యనుకరణము.

**కఠోరము** (సం.విణ.) : (అ.ఆ.అ.) : కఠినము, గట్టి.

**కడ** (వై.వి.) : 1.దిక్కు; 2. అంతము; 3. దూరము; 4. పార్శ్వము; 5. సమీపము; 6. స్థానము.

**కడంగరము** (సం.వి.అ.పుం.) : 1.పొల్లు; 2.పొల్లు కసవు.

**కడంగరీయము** (సం.వి.అ.పుం.) : పొల్లు కసవు మేసెడి యెద్దు.

**కడంబము** (సం.వి.అ.పుం.) : కలంబము, కూరనార.

**కడఁక** (దే.వి.) : యత్నము.

**కడకొఱవి** (దే.వి.) : కాలిమిగిలి పొగసెడి కట్టె.

**కడఁగు** (దే.అ.క్రి.) : యత్నించు.

**కడంజు** (దే.వి.) : గోకర్ణమృగము.

**కడంత** (దే.వి.) : కంటికడప్రక్కచోటు, కణత.

**కడంతి** (దే.వి.) : గంధర్వ మృగము.

**కడంబడు** (ద్వ.అ.క్రి.) : (కడమ + పడు) తగ్గు.

**కడకుంబోవు** (ద్వ.అ.క్రి.) : (కడకున్ + పోవు) బహిష్ఠయగు.

**కడకొఱవి** (దే.వి.) : కాలంగా మిగిలిన కట్టె.

**కడగండ్లమారి** (దే.విణ.) : కష్టశీలుండు.

**కడగండ్లు** (దే.వి.బ.) : (కడ + కండ్లు) కష్టము.

**కడగట్టు** (ద్వ.స.క్రి.) : (కడ + కట్టు) నిర్ణయించు.

**కడగన్ను** (ద్వ.వి.) : (కడ+కన్ను) కటాక్షము.

**కడగొట్టు** (ద్వ.అ.క్రి.) : (కడ+కొట్టు) చచ్చు. (విణ.) : కడపటి. (కడగొట్టు కొడుకు. మొ.)

**కడచేను** (ద్వ.అ.క్రి.) : 1. చచ్చు; 2. నశించు; 3. ముగియు.

**కడచే**(దే.అ.క్రి.) : 1. గతించు; 2. చచ్చు; 3. నశించు; 4. మేరమీఱు; 5. హెచ్చు.

**కడచేక్క** (వై.వి.) : రేవతీ నక్షత్రము.

**కడతెగు** (ద్వ.అ.క్రి.) : సమాప్తమగు.

**కడతేఱు** (ద్వ.అ.క్రి.) : 1. చచ్చు; 2. తీఱు; 3. సమాప్తమగు.

**కడప** (యు.దే.వి.) : ఇంటి గడప, దేహళి. (కొన్ని దేశముల యందిట్లు పరుషాదిగా వాడుచున్నారు.) (వై.) : కదంబము.

**కడపల** (వై.వి.) : అంతము.

**కడపు** (దే.ప్రే.) : 1. ఇయ్యక పొమ్మను; 2. చంపు; 3. త్రోలు; 4. వదలు.

**కడపుంజేయి** (దే.వి.) : (కడపు+చేయి) చుక్కాను, అరిత్రము.

**కడమ** (దే.వి.) : 1. కొఱంత; 2. శేషము.

**కడమపడు** (ద్వ.అ.క్రి.) : కొఱంతపడు.

**కడముంత** (ద్వ.వి.) : కొయ్యముంతవంటి చిన్నమట్టి పాత్రము.

**కడముట్టు** (ద్వ.అ.క్రి.) : 1. సమాప్తమగు; 2. సిద్ధించు.

**కడయెత్తు** (ద్వ.వి.) : (కడ + ఒత్తు) గృహ విశేషము యొక్క చుట్టు గోడ యందలి కంబముల మీఁది దూలము.

**కడలి** (దే.వి.) : మున్నీరు, సముద్రము.

**కడలికూఁతురు** (దేవి.) : సిరి, లక్ష్మి.

**కడలిఱేఁడు** (దే.వి.) : నీటి రాయఁడు, వరుణుఁడు.

**కడలివెన్న** (దే.వి.) : చంద్రుఁడు.

**కడలు** (దే.వి.) అల.

**కడలుకొను** (దే.అ.క్రి.) : 1. అతిశయించు; 2. ఉప్పొంగు; 3. వ్యాపించు. (రూ. కడల్కొను.)

**కడలొత్తు** (ద్వ.అ.క్రి.) (కడలు+ఒత్తు) వ్యాపించు.

**కడవ** (వై.వి.) : పెద్దకుండ.

**కడవంబడు** (ద్వ.అ.క్రి.) : (కడవన్+పడు) గతించు. (స్వార్థమునపడు.)

**కడవతీటు** (ద్వ.వి.) : వాద్య విశేషము, తుడుము.

**కడవసము** (దే.వి.) : తోలు.

**కడవాఁడు** (ద్వ.విణ.) : 1. అన్యుఁడు; 2. కనిష్ఠుఁడు.

**కడవెళ్లు** (ద్వ.అ.క్రి.) : సమాప్తమగు. (స.క్రి.) : దాఁటు.

**కడపరము** (దే.వి.) : శ్యేనవిశేషము.

**కడాని** (దే.వి.) : అపరంజి, తప్త కాంచనము.

**కడారము** (సం.వి.అ.పుం.) : గోరోజనము వంటి వర్ణము. (విణ.) : గోరోజనము వంటి వర్ణముగలది.

**కడాసము** (దే.వి.) : కడవసము యొక్క రూపాంతరము.

**కడి** (దే.వి.) : 1. కబళము; 2. వాసన.

**కడిఁది** (దే.వి.) : ఆపద. (విణ.) : 1. అధికము; 2. అశక్యము; 3. కఠినము.

**కడికండలు** (ద్వ.వి.బ.) : ఖండ ఖండములు.

**కడిగొను** (దే.అ.క్రి.) : (కడి + కొను) కబళించు.

**కడితము** (వై.వి.) : ఘట్టించిన నీలపటపు లెక్క పుస్తకము.

**కడితి** (దే.వి.) : గోకర్ణ మృగము.

**కడిమి** (యు.దే.వి.) : 1.అతిశయము; 2. ఆధిక్యము; 3. పరాక్రమము.

**కడిమిడి** (దే.విణ.) : పచ్చికగలది (నేల).

**కడియపు టట్టు** (ద్వ.వి. ) : (కడియము + అట్టు) భక్ష్య విశేషము.

**కడియము** (వై.వి.) : హస్త భూషా విశేషము, కటకము.

**కడిలము** (వై.వి.) : ఒకానొక చెట్టు.

**కడివోవు** (దే.అ.క్రి.) : (కడి + పోవు) చెడు.

**కడు** (దే.ద్ర.) : అత్యంతము. (వృత్తి యందచ్చు పరమగుచో డకారమునకు టకారద్వయ మాదేశంబగు. ఉదా : కట్టనుఁగు, కట్టనువు, కట్టలుక, కట్టాణి, కట్టాయితము, కట్టావి, కట్టెండ, కట్టెదురు, కట్టెఱ్ఱ. మొ. (చూ.ముడియ.)

**కడుఁదురు** (వై.వి.) : కందురీఁగ, గండోలి.

**కడుకొను** (దే.అ.క్రి.) : 1. అతిశయించు, 2. ఉత్సహించు.

**కడుగు** (దే.అ.క్రి.) : ప్రక్షాళించు. (వి.) : బియ్యము లోనగునవి కడిగిన నీరు, తందురీణము.

**కడుజు** (దే.వి.) : శ్యేనవిశేషము. (చూ. అఱుజు)

**కడుపు** (వై.వి.) : 1. కుక్షి; 2. గర్భము.

**కడుపుమంట** (ద్వ.వి.) : ఓరువలేనితనము, ఈర్ష్య.

**కడుపూఁద** (ద్వ.వి.) : (కడుపు+ఊద) 1. జల మలములు కట్టి కడుపుబ్బరించెడి పశురోగము; 2. ఈర్ష్య.

**కడుపేడు** (దే.వి.) : (కడున్+పేడు) మేదరవాఁడు కట్టుకట్టెడు సన్నని వెదురుపేడు.

**కడువు** (దే.వి.క్రి.) : కడుగు యొక్క రూపాంతరము.

**కడెము** (వై.వి.) : కడియము యొక్క రూపాంతరము.

**కడ్గు** (దే.అ.వి.) : ప్రక్షాళించు. (వి.) : బియ్యము లోనగునవి కడిగిన నీరు, (కడుపు యొక్క రూపాంతరము).

**కడ్డాయము** (దే.వి.) : బోము, బలాత్కారము.

**కడ్డి** (వై.వి.) : 1. బలపపుఁగోపు; 2. పాళము; 3. పుడక (రూ. కడ్డీ).

**కడ్పు** (వై.వి.) : 1. కుక్షి; 2. గర్భము (కడుపు యొక్క రూపాంతరము).

**కడ్మి** (యు.దే.వి.) : 1.అతిశయము; 2.ఆధిక్యము; 3.పరాక్రమము. (కడిమి యొక్క రూపాంతరము.)

**కణ** (సం.వి.) : 1. ఒకానొక యీఁగ; 2. జీలకఱ్ఱ; 3. పిప్పలి. (అ.పుం.ము.) : 1. నీటిబొట్లు; 2. నూక; 3. లేశము.

**కణఁక** (దే.వి.) : కడఁక యొక్క రూపాంతరము.

**కణఁకు** (దే.వి.) : ఇంగలము.

**కణఁగు** (దే.అ.క్రి.) : కదుగు యొక్క రూపాంతరము.

**కణఁజము** (వై.వి.) : 1. ధాన్యముంచెడు పాఁతఱ; 2. ధాన్యముంచెడు గరిసె.

**కణఁజు** (దే.వి.) : కడఁజు యొక్క రూపాంతరము.

**కణఁత** (దే.వి.) : కడఁత యొక్క రూపాంతరము.

**కణఁతి** (దే.వి.) : కడఁతి యొక్క రూపాంతరము.

**కణయము** (సం.వి.అ.పుం.) : కుంత విశేషము.

**కణిక** (సం.వి.అ.స్త్రీ.) : 1. నీటిబొట్టు; 2. గోదుమ రవ; 3. అత్యంత సూక్ష్మ వస్తువులు; 4.నెల్లి.

**కణితి** (వై.వి.) : రోగవిశేషము కంతి. (కడితియొక్క రూపాంతరము)

**కడిశము** (సం.వి.అ.న.) : సస్యమంజరి, ఎన్ను.

**కణిష్ఠము** (సం.విణ.) : (అ.అ.అ.) కడుఁ గొంచెము.

**కణీయస్సు** (సం.విణ.) : (స్. ఈ.స్) కడుఁ గొంచెము.

**కణుఁదురు** (వై.వి.) : కడుఁదురీఁగ.

**కణుజు** (దే.వి.) : కడుజు యొక్క రూపాంతరము.

**కణ్వము** (సం.వి.అ.న.) : పాపము. (పుం.డు.): ఒకానొక ఋషి.

**కత** (వై.వి.) : 1. కథ; 2. వృత్తాంతము.

**కతకము** (సం.వి.అ.పు.) : చిల్ల.

**కతన** (వై.ద్ర.) : కారణముచేత.

**కతము** (వై.వి.) : 1. కారణము; 2. గుఱుతు.

**కతుక్కు** (దే.వి.) : కొఱుకుట యందగు ధ్వన్యనుకరణము.

**కత్తిరి** (దే.విశ.) : 1.నానావర్ణములు గలది, శబలము; (కత్తరియావు, కత్త యెద్దు. మొ.) 2. వర్ణ సాంకర్యము గలది.

**కత్తరిగలయు** (దే.అ.క్రి.) : (కత్తరి + కలయు) సంకరమగు.

**కత్తరిల్లు** (దే.అ.క్రి.) : చలించు.

**కత్తలాని** (వై.వి.) : తెల్లని గొరిజయుఁ దోఁకయు వెంట్రుకలును గల నల్ల గుఱ్ఱము. (చూ. కర్తలాణము.)

**కత్తళఁడు** (వై.వి.) : తెల్లని గొరిజయుఁ దోఁకయు వెంట్రుకలును గల నల్లగుఱ్ఱము. (చూ. కర్తలాణము.)

**కత్తళము** (దే.వి.) : బొందలము, కవచము.

**కత్తళీఁడు** (దే.విశ.) : (కత్తళము + ఈఁడు) కవచము దొడిగినవాఁడు, వర్మితుఁడు.

**కత్తి** (వై.వి.) : 1. ఖడ్గము; 2. మంగలి కత్తి, క్షురిక; 3. మల్లబంధ విశేషము.

**కత్తికాసు** (వై.వి.) : వడ్లవాని ఆయుధ విశేషము.

**కత్తిపిడిక** (వై.వి.) : ఈండ్రవాని కత్తుల బుట్ట.

**కత్తిపీఁట** (వై.వి.) : కూరలు తఱుగుటకుఁ బీఁటయందమర్చిన కత్తి, ఈళిక.

**కత్తిమందు** (ద్వ.వి.) : 1. కత్తియొఱకు పూయు వర్ణము; 2. గడ్డలకు పూయు మందు.

**కత్తియ** (వై.అప.) : ఒకానొక స్త్రీ ప్రత్యయము. (అంటుకత్తియ, చెలికత్తియ. మొ.)

**కత్తియము** (దే.వి.) : అంకెలయడ్డబంతి.

**కత్తిరించు** (వై.ప్రే.) : వస్త్రములోనగువాని ఛేదించు.

**కత్తిరిల్లు** (వై.అ.క్రి.) : భిన్నమగు.

**కత్తివాతియమ్ము** (వై.వి.) : (కత్తివాయి + అమ్ము) అర్ధచంద్రబాణము.

**కత్తువ** (దే.వి.) : 1. మన్నుకెల్లగించెడు గసిక; 2. గనిమ.

**కత్తృణము** (సం.వి.అ.న.) : 1. కామంచిగడ్డి; 2. నాఁచు.

**కత్తె** (దే.వి.) : కత్తయము యొక్క రూపాంతరము.

**కత్తెము** (దే.వి.) : కత్తియము యొక్క రూపాంతరము.

**కత్తెర** (వై.వి.) : 1. కత్తిరించెడి ఆయుధము; 2. భరణి మూడు నాలుగు పాదముల యందును, కృత్తికయందును రోహిణి మొదటి పాదమందును సూర్యుఁడుండు కాలము; 3. కృత్తికా నక్షత్రము.

**కత్తెరకాలు** (ద్వ.వి.) : అందలపుకాళ్లకు అడుగున పోటిగా నమర్చెడు మార్పు కాలు.

**కత్తెరగాయము** (ద్వ.వి.) : గవాక్ష విశేషము.

**కత్తెరచీల** (ద్వ.వి.) : మీటమునసల చీల వదలి రాకుండ దాని చివర రంధ్రమున నడ్డముగా వేసెడు చీల.

**కత్తెరబావిలీ** (ద్వ.వి.) : స్త్రీ కర్ణభూషా విశేషము.

**కత్తెరవంగ** (వై.వి.) : పెద్దవంగ.

**కత్తెరవాసము** (ద్వ.వి.) : ఎదురెదురుగాఁ గత్తెరవలె నుంచెడువాసము.

**కత్రి** (దే.వి.) : జిక్కిణీయను ఆట యొక్క ఒక యంగము.

**కత్రించే** (వై.స.క్రి.) : కత్తిరించు యొక్క రూపాంతరము.

**కథ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఇంచుక సత్యమైన కల్పిత ప్రబంధము. (కాదంబర్యాది.)

**కథకుఁడు** (సం.విశ.) : (అ.అ.అ.) 1. కథ చెప్పెడువాఁడు; 2. చెప్పెడు వాఁడు.

**కథనము** (సం.వి.అ.న.) : చెప్పుట.

**కథించు** (సం.స.క్రి.) : చెప్పు.

**కథితము** (సం.విశ.) : (అ.అ.అ.) చెప్పఁబడినది.

**కద** (యు.దే.అవ్య.) : ప్రసిద్ధిని దెలిపెడి.

**కదంబకము** (ఉభ.వై.విశ.) : మిశ్రము. (పుం.): తెల్లావలు.

**కదంబము** (ఉభ.వై.విశ.) : మిశ్రము. (వృత్తి యందంత్య వర్ణ లోపంబు వికల్పంబుగానగు. కదంబకావి.) (సం.వి.అ.న.) గుంపు (పుం.): 1. కడప; 2. తెల్లావలు.

**కదంబించే** (వై.అ.క్రి.) : మిళితమగు.

**కదధ్వము** (సం.వి.న్.పుం.) : కాపథము, చెడు త్రోవ.

**కదనము** (సం.వి.అ.న.) : 1. పాపము; 2. యుద్ధము; 3. హింస.

**కదను** (హిం.వి.) : అశ్వగతి విశేషము.

**కదన్నము** (సం.వి.అ.న.) : చెడ్డకూడు.

**కదము** (వై.వి.) : అశ్వగతివిశేషము, ఆస్కందితము.

**కదరము** (సం.వి.అ.పుం.) : 1.వెలిచంద్ర; 2. రోగ విశేషము; 3. అంపము.

**కదరె** (దే.అవ్య.) : (కద + రె) సంతాపమును దెలిపెడి.

**కదర్యుడు౦డు** (సం.విణ.) : (అ.అ.అ.) పిసినిగొట్టు.

**కదలాడు** (దే.అ.క్రి.) : (కదలి + ఆడు) చలించు. (చూ. ఊగాడు.)

**కదలిక** (దే.వి.) : చలనము.

**కదలు** (దే.అక్రి.) : 1. చలించు; 2. ప్రయాణమగు; 3.యత్నించు. (వి.) : 1. చలనము; 2. యత్నము.

**కదలుచే** (దే.ప్రే.) : కదలించు. (రూ. కదల్చు)

**కదలుడు** (దే.వి.) : ప్రయాణము.

**కదళ** (సం.వి.అ.స్త్రీ.) : 1. కోలపొన్న; 2. దొండ; 3. బూరుగు. (అ.పుం.ము.) : 1. అరఁటి; 2. కోలపొన్న.

**కదళి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. అరఁటి; (దీని పుష్పము శిలీంధ్రము.) 2. ఏనుఁగనంబారిమీఁది టెక్కెము; 3. ఇరువది యంగుళముల నిడివి గల లేడి. (పుం.) : ఇరువది యంగుళముల నిడివిగల యిఱ్ఱి. (అనికొందఱు.)

**కదించే** (దే.ప్రే.) : కదయించు యొక్క రూపాంతరము. (కదించియనఁగా నిక్కడ మూసి యని యర్థము.)

**కదియఁబడు** (ద్వ.అ.క్రి.) : (కదియన్ + పడు) కదియు. (స్వార్థమునపడు.)

**కదియించే** (దే.ప్రే.) : కదియఁజేయు.

**కదియు** (దే.అ.క్రి.) : 1. దగ్గఱవచ్చు; 2. సమానమగు.

**కదుకొను** (దే.అ.క్రి.) : (కదుము + కొను) అతిశయించు.

**కదుపు** (వై.వి.) : 1. సజాతీయ పశుపక్ష్యాది సమూహము, కులము; (ఎనుప కదుపు, జక్కి కదుపు, పందికదుపు, లేటికదుపు గూబకదుపు, చిల్కకదుపు, తేటికదుపు. మొ) 2. గోసమూహము.

**కదుము** (దే.స.క్రి.) : ఆక్రమించు. (వి.) : దెబ్బ తగిలినచోట నెత్తురు కట్టుకొని వాచు, వాపు.

**కదురు** (దే.అ.క్రి.) : 1. అతిశయించు; 2. కలుగు; 3. విజృంభించు. (వి.) : నూలు వడికెడు కదురు, తర్కువు.

**కదుష్ణము** (సం.వి.అ.న.) : ఇంచుక వేఁడి. (విణ.) : ఇంచుక వేఁడిగలది.

**కదె** (దే.అవ్య.) : ప్రసిద్ధిని దెలుపునది.

**కద్దుము** (దే.విణ.) : దట్టము.

**కద్రువ** (సం.వి.ఊ.స్త్రీ.) : పన్నగులతల్లి.

**కద్రువు** (సం.వి.) : గోరోజనమువంటి వర్ణము. (విణ.) : గోరోజనము వంటి వర్ణము గలది.

**కద్వదుఁడు** (సం.విణ.) : నిందింపఁదగు మాటలాడువాఁడు.

**కన** (దే.ద్ర.) : ఇది వాక్యాలంకారముగఁ బ్రయోగింపఁబడును.

**కనకచ్ఛద** (సం.వి.ఆ.స్త్రీ.) : గేదుగి.

**కనకతప్పెట** (ద్వ.వి.) : పటహము.

**కనకన** (దే.వి.) : నిప్పునందలి యధిక ప్రకాశము.

**కనకనమను** (దే.అ.క్రి.) : (కనకన + అను) (నిప్పు) మిక్కిలి ప్రకాశించు.

**కనకనలాడు** (దే.అ.క్రి.) : (కనకనలు + ఆడు) (నిప్పు) మిక్కిలి ప్రకాశించు.

**కనకము** (సం.వి.అ.న.) : బంగారు. (పుం.) : 1.ఉమ్మెత్త; 2. సంపెఁగ; (మఱియుఁ గనక పర్యాయములన్ని వీనికి నామములగును.) 3. కాంచనము; 4. నల్లఅగలు; 5. నాగకేసరము; 6.మోదుగ.

**కనకాక్షి** (సం.వి.ఈ.స్త్రీ.) : పయిఁడికంటి పక్షి.

**కనరు** (దే.వి.) : 1. కందగడ్డలోనగువానియందలి నస; 2. ఒగరు. (ఆ. విణ.) : అహితము.

**కనలు** (దే.అ.క్రి.) : 1. కోపగించు; 2. మండు. (ఆ. వి.) : 1. కోపము; 2. మంట.

**కనస్టేబిలు** (ఆం.వి.): పోలీసు బంట్రౌతు.

**కనారిలు** (దే.అ.క్రి.) : కోపగించు.

**కనికరము** (దే.వి.) : 1. కరుణ; 2. శోకము.

**కనికరించే** (దే.అ.క్రి.) : 1. కరుణించు; 2. శోకించు.

**కనిపట్టు** (దే.స.క్రి.) : వెదకిపట్టు.

**కనిపించే** (దే.ప్రే.) : కనఁజేయు. (అ.క్రి.) : (కను + ఇంచు) కనఁబడు, ప్రత్యక్ష మగు. (స్వార్థమున ఇంచు, సంధిని వర్ణాధిక్యము.)

**కనియు** (దే.అ.క్రి.) : మాఁగు.

**కనిష్ఠ** (సం.వి.అ.స్త్రీ.) : చిటికెనవ్రేలు (అ.పుం. ము.) : కొలఁదికి రెండరత్నులు కొఱవడిన యేనుఁగు. (విణ.) : 1. తమ్ముఁడు; 2. మిక్కిలి యల్పుఁడు; 3. మిక్కిలి కొంచెమైన వయస్సు గలవాఁడు.

**కనీనిక** (సం.వి.ఆ.స్త్రీ.) 1. కంటి నల్ల గ్రుడ్డు; 2. చిటికెనవ్రేలు.

**కనీయుఁడు** (సం.విణ.) : (స్.ఈ.స్.) 1. మిక్కిలి యల్పుఁడు; 2.తమ్ముఁడు; 3. మిక్కిలి కొంచె మైన వయస్సు గలవాఁడు.

**కనీసము** (వై.విణ.) : అధమము.

**కను** (దే.స.క్రి.) : 1.చూచు; 2.ప్రసవించు; 3.తెలియు; 4.పొందు; 5.భాగ్యము బొందు. (వి.) : 1. నేత్రము; 2. చెఱకులోనగువాని గనుపు క్రింద గుంట. (హల్లు పరమగుచో ఉకారమునకు వైకల్పికముగ లోపంబగు. ఉదా.: కన్గలిగి మొ.)

**కనుఁగొను** (దే.స.క్రి.) : (కను + కొను) 1. చూచు, వీక్షించు; 2. తెలిసికొను.

**కనుఁబాటు** (దే.వి.) : (కను + పాటు) 1. దృష్టి; 2. దృష్టి దోషము.

**కనుబ్రాము** (దే.స.క్రి.) : (కను+ప్రాము) వంచించు.

**కనుక** (దే.ద్ర.) : 1. హేతువును దెలుపును; 2. కావ్యాలంకారముగఁ బ్రయోగింపబడును.

**కనుకట్టు** (దే.వి.) : జాలవిద్యా విశేషము.

**కనుకని** (దే.వి.) : సంభ్రమము.

**కనుకలి** (దే.వి.) : చూపు.

**కనుకుట్టు** (దే.విణ.) : బాధకుఁడు.

**కనుకుట్టుఁదనము** (ద్వ.వి.) : (కనుకుట్టు + తనము) ఈర్ష్య.

**కనుకూలి** (దే.వి.) : ధాన్య రూపమయిన కూలి.

**కనుగుఁజేప** (దే.వి.) : మత్స్యవిశేషము.

**కనుచీఁకటి** (దే.వి.) : సంధ్యాకాలమందలి లేఁజీఁకటి.

**కనుపట్టు** (దే.అ.క్రి.) : చూపట్టు, గోచరమగు.

**కనుపాప** (దే.వి.) : కంటిలోని ప్రతిమ.

**కనుపాలవిత్తులు** (దే.వి.బ.) : కుళుత్థాంజనము.

**కనుపు** (దే.వి.) : వెదురుచెఱకులోనగువాని యందెడ నెడ నేర్పడియుండు ముడి, పర్వము. (ఇట్లు పరుషాదిగాఁ గొన్ని దేశములందు వ్యవహారము.)

**కనుపుగొట్టు** (దే.స.క్రి.) : (కనుపు + కొట్టు) ఖండించు, భంగపరచు.

**కనుపులగుండ్లు** (దే.వి.బ.) : (కనుపులు + గుండ్లు) మణిమయమైన హస్త భూషా విశేషము.

**కనుపెట్టు** (దే.అ.క్రి.) : ఎదురుచూచు, ప్రతీక్షించు.

**కనుపొట్టలు** (దే.వి.బ.) : కంటిపైక్రింది ఱెప్పలు.

**కనుబంటి** (దే.వి.) : జీలుగు పక్షి.

**కనుబడి** (దే.వి.) : ఉత్పత్తి.

**కనుమ** (దే.వి.) : 1. సందు; 2. కొండల సందు త్రోవ.

**కనుము** (దే.వి.) : 1. మకర సంక్రమణమునకు ఆవలిదినము; 2. తృణ విశేషము, శరము.

**కనుమూయు** (దే.స.క్రి.) : వంచించు. (దీనికి కర్మపదము క్రింది పాదమున నున్నది.)

**కనుమూసిగంతలు** (దే.వి.బ.) : కనులు గప్పి యాడెడి యాట.

**కనుమొఱఁగు** (దే.స.క్రి.) : వంచించు.

**కనువినికి** (దే.వి.) : పాము, చక్షు శ్ర్రవము.

**కనువెచ్చే** (దే.విణ.) : నులివెచ్చ, కదుష్ణము.

**కన్కని** (దే.వి.) : కనుకని యొక్క రూపాంతరము. (చూ. సగ్గిస మొగ్గిస)

**కన్గంట** (దే.ద్ర.) : (కంటఁ+కంటఁ) ప్రత్యక్షముగా.

**కన్గొను** (దే.స.క్రి.) : కనుఁగొను యొక్క రూపాంతరము.

**కన్న** (దే.అప.) : ఒకానొక ప్రత్యయము.

**కన్నగాఁడు** (వై.వి.) : (కన్నము + కాఁడు) కన్నము పెట్టి దొంగిలించెడు దొంగ, ఖనకుఁడు.

**కన్నడ** (దే.వి.) : ఆలము, ఉపేక్ష.

**కన్నడము** (వై.వి.) : భాషావిశేషము.

**కన్నడి** (వై.వి.) : ఒకానొక కర్ణాట దేశస్థుఁడు.

**కన్నడించు** (దే.స.క్రి.) : ఉపేక్షించు.

**కన్నడీఁడు** (దే.విణ.) : (కన్నడ + ఈఁడు) ఉపేక్ష చేయువాఁడు.

**కన్నపెట్టు** (ద్వ.స.క్రి.) : (కన్నము+పెట్టు) కన్నమువేయు.

**కన్నపోవు** (ద్వ.అ.క్రి.) : (కన్నము + పోవు) కన్నము వేయబఁడు.

**కన్నము** (వై.వి.) : దొంగ లోపలికిఁ బోవుటకై గోడయందుఁ జేసెడి సొరంగము.

**కన్నయ్య** (వై.వి.) : (కన్నఁడు + అయ్య) కృష్ణుఁడు. (ద్వ.) : (కన్న + అయ్య) కన్నతండ్రి.

**కన్నఱ** (దే.వి.) : దుఃఖము.

**కన్నఱి** (దే.విణ.) : (కన్నఱ + ఇ) దుఃఖితుఁడు.

**కన్నఱుపు** (దే.వి.) : కన్నడ, ఉపేక్ష.

**కన్నవిటి** (దే.విణ) : (కన్ను + అవిటి) చీకు, అంధుఁడు.

**కన్నాకు** (దే.వి.) : (కన్ను + ఆకు) తములపాకు కట్టయందు మొదట నుండెడి యాకు (విణ.) : 1. అగ్రేసరుఁడు; 2. ముఖ్యుఁడు.

**కన్నాత** (దే.వి.) : మల్లబంధ విశేషము. (బ.) : మల్లవిద్యా విశేషము.

**కన్నియ** (వై.వి.) : 1. పెండ్లికాని పడుచు; 2. కూఁతురు; (చూ.కన్నె.) : 3.ఒకానొక రాశి; 4. ఆఁడుది. (విణ.) : 1. క్రొత్త; (కన్నియ గేదఁగి పూతేకు, కన్నియ మెఱుంగు, మొ.) 2. చిన్న (చూ. కన్నె).

**కన్నియలేడి** (ద్వ.వి.) : కారండవము.

**కన్నీరు** (ద్వ.వి.) : (కన్ను + నీరు) హర్ష శోకముల వలన కన్నులగాఱెడు నీరు, అశ్రువు.

**కన్ను** (దే.వి.) : 1. నేత్రము; 2. చూపు; 3.జాడ; 4. వెదురు లోనగువాని గనుపు క్రిందిగుంట (కన్నుల విలుకాఁడు, మొ.) 5. బండి చక్రము; 6. వంతెన ద్వారము; 7. నెమలిపురి కన్ను; 8. మృదంగాది వాద్య భాండ ముఖము నందేర్పఱపఁబడిన వృత్తనీల మండలము 9. వల యందలి రంధ్రము; 10. వ్రణాది రంధ్రము.

**కన్నునీరు** (ద్వ.వి.) : కన్నీరు (దీనికి పెక్కులు మహాకవి ప్రయోగములు కనఁబడుచున్నవి.)

**కన్నుమొఱఁగు** (దే.స.క్రి.) : కనుమొఱఁగు, వంచించు.

**కన్నులఱ్రాను** (దే.స.క్రి.) : చెఱకు, ఇక్షువు.

**కన్నులువిలుకాఁడు** (దే.వి.) : మన్మథుఁడు.

**కన్నె** (వై.వి.) : కన్నియ యొక్క రూపాంతరము. (కూఁతునకు - క్రొత్తకు-కన్నె నెయ్యము, కన్నె కలుపు, కన్నె కూరిమి, కన్నె చెంగల్వ, కన్నె తమ్మి, కన్నెతావి, కన్నెయెండ. మొ. - చిన్నకు - కన్నెమావి, కన్నె సురపొన్న.)

**కన్నెగోరుకోఁత** (ద్వ.వి.) : కన్యకల గోళ్లు తీయు విధి.

**కన్నెబావి** (వై.వి.) : నీళ్లులేని బావి, కోనేటి వంటి పెద్దబావి. (అని కొందఱు.)

**కన్నెము** (దే.వి.) : కోడి గుండెకాయ.

**కన్నెఱికము** (ద్వ.వి.) : 1. కన్యాత్వము; 2. వారకన్యాప్రథమ సంగమము.

**కన్నెలేడి** (ద్వ.వి.) : కన్నియలేడి యొక్క రూపాంతరము.

**కన్నోటు** (దే.వి.) : (కన్ను+ఓటు) బెదరు, భయము.

**కన్పట్టు** (దే.అ.క్రి.) : కనుపట్టు యొక్క రూపాంతరము.

**కన్మొఱగు** (దే.స.క్రి.) : కనుమొఱఁగు యొక్క రూపాంతరము.

**కన్య** (ఉభ.వై.విణ.) : క్రొత్త (రామాయణార్థమందు నెయ్యపుఁ గన్యకలనన వాలుఁ దూపులననియు, భారతార్థ మందు నెయ్యపుఁగన్యకల ననవాలుఁ దూపుల ననియు ఛేదము.) (ఇక్కడ రామాయ ణార్థమునందు సహితము కన్యయను శబ్దమును తత్సమముగానే చెప్పి యర్థమును సరిపఱప వచ్చునని కొందఱు చెప్పుదురు. కన్యాశబ్దము వికృతిని జెందినప్పుడే క్రొత్తయను నర్థము కలిగి తెనుఁగు ప్రయోగము లందు సాధారణంగా వాడుబడుచున్నది. సంస్కృతము నందా యర్థము కలిగి వాడఁబడునట్లు కానము. సంస్కృతము నందు లేని యర్థములు వికృతి యందుఁ గలుగుట సహజము) (సం.వి.ఆ.స్త్రీ.) : 1. పెండ్లికానిపడుచు; 2. కూఁతురు; 3. ఒక రాశి; 4. ఆఁడుది; 5. కలబంద; 6. పొట్ల.

**కన్యక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. పెండ్లికాని పడుచు; 2. చెల్లెలు; 3. పెద్ద యేలకి.

**కన్యాకుబ్జము** (సం.వి.అ.న.) : పుర విశేషము, (పుం.) : కొమ్ముపొట్ల.

**కపటము** (సం.వి.అ.పు.స.) : కైతవము, కవుడు.

**కపటించు** (సం.అ.క్రి.) : కపటమెంచు.

**కపర్దము** (సం.వి.అ.పుం.) : 1. గవ్వ; 2. శివుని జడముడి.

**కపర్ది** (సం.వి.న్.పుం.) : శివుఁడు, ముక్కంటి.

**కపాటము** (సం.వి.) : కవాటము యొక్క రూపాంతరము.

**కపాలభృత్తు** (సం.వి.త్.పుం.) : శివుఁడు, ముక్కంటి.

**కపాలము** (సం.వి.అ.పుం.న.) : 1. తల పుఱ్ఱె; 2. కుండలోనిగువాని పెంచిక; 3. గుంపు.

**కపాలి** (సం.వి.న్.పుం.) : శివుఁడు, పునుక తాలుపు.

**కపి** (సం.వి.అ.పుం.) : 1. కోఁతి; 2. చిల్లమడ్డి; 3. విష్ణువు.

**కపింజలము** (సం.వి.అ.పుం.) : పక్షి విశేషము, కముఁజు.

**కపికచ్ఛువు** (సం.వి.ఊ.స్త్రీ.) : 1. ఎలుకజీడి; 2. దూలగొండి.

**కపిచూతము** (సం.వి.అ.పుం.) : అంబాళము.

**కపిత్థము** (సం.వి.అ.పుం.) : 1. వెలఁగ; 2. అభినయ హస్తవిశేషము. (నడిమి వ్రేలు మొదలగు మూటిని ముడిఁచి బొటన వ్రేలిని చూపుడు వ్రేలిని కొనలు కూర్చి పట్టినది.)

**కపిల** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. ఆగ్నేయ దిశ యందలి యాఁడేనుఁగు; 2. పుల్లావు; 3. ఇరుగుడు; 4. కంపుటిరుగుడు; 5. రేణుకయగు గంధ ద్రవ్యము. (అ.పుం.ము.) : గోరోజనము వంటి వర్ణము గలది.

**కపిలుఁడు** (సం.వి.) : 1.ఒకానొకముని; 2. విష్ణువు; 3. అగ్ని.

**కపిలె** (దే.వి.) : ఎడ్లను గట్టి తోలి నీరెత్తెడి యంత్ర విశేషము, మోట.

**కపిలోహము** (సం.వి.అ.న.) : ఆరకూటము, ఇత్తడి.

**కపివల్లి** (సం.వి.ఈ.స్త్రీ.) : గజపిప్పలి.

**కపిశ** (సం.వి.ఆ.స్త్రీ.) చిన్నయెఱ్ఱచీమ. (అ.పు. ము.) : 1. చిల్లమడ్డి; 2. పసుపు మీఱిన యెఱుపు. (విణ.) : పసుపు మీఱిన యెఱుపు గలది.

**కపిశీర్షము** (సం.వి.అ.న.) : 1. కోట కొమ్మ; 2. గోడపై చివర.

**కపీతనము** (సం.వి.అ.పుం.) : 1. అంబాళము; 2. కలుజువ్వి; 3. దిరిసెనము; 4 రావి.

**కపురము** (వై.వి.) : కర్పూము.

**కపోణి** (సం.వి.ఇ.పుం.) : స్త్రీ కూర్పరము, మోఁచేయి.

**కపోతపాలిక** (సం.వి.ఆ.స్త్రీ.) : కొఱిగ యందేర్పఱ చిన పావురపు గూఁడు.

**కపోతము** (సం.వి.అ.పుం.) : 1. గువ్వ; 2.పావురము; 3.అభినయహస్త విశేషము.

(వ్రేళ్లు చాఁపఁబడిన రెండు చేతులను ప్రక్కలు కూర్చి బోలుగాఁ బట్టినది.)

**కపోతాంఘ్రి** (సం.వి.ఇ.స్త్రీ.) : గువ్వగుత్తి.

**కపోలము** (సం.వి.అ.పుం.) : గండము, చెక్కిలి.

**కప్ప** (దే.వి.) : జలజంతు విశేషము, మండూకము.

**కప్పకుఱుపు** (దే.వి.) : కారకముచే అఱకాలి యందు లేచెడు గుల్ల.

**కప్పచిప్ప** (దే.వి.) : నీటియందలి గుల్ల, శంబూక.

**కప్పడము** (వై.వి.) : 1. చినిఁగిన వస్త్రము; 2. వస్త్రము.

**కప్పతాళము** (మి.వి.) : ముద్దబీగము.

**కప్పనావురు** (దే.వి.) : చిఱుకప్పకాటుచేత పసులకుఁ గలిగెడి పాసనపు రోగము.

**కప్పము** (దే.వి.) : ప్రజలు రాజునకిచ్చెడి ధనము, కరము.

**కప్పరపడు** (ద్వ.అ.క్రి.) : (కప్పరము + పడు.) సంభ్రమపడు.

**కప్పరపాటు** (ద్వ.వి.) : కప్పరపడుట.

**కప్పరము** (దే.వి.) : తొట్రుపాటు, సంభ్రమము.

**కప్పలి** (వై.వి.) : ఓడ, నావ.

**కప్పరి** (దే.వి.) : (కప్పు + ఇరులు) కొంచెపాటి చీఁకటి.

**కప్పు** (దే.అ.క్రి.) : క్రమ్ము. (స.క్రి.) : ఆచ్ఛాదించు. (వి.) : 1. ఆచ్ఛాదనము; 2. ఇంటిపైకప్పు; 3. నలుపు; 4. చీఁకటి; 5. దంతక్షతము.

**కప్పుఁగుత్తుకపుల్గు** (దే.వి.) : (కప్పు+కుత్తుక పుల్గు) నెమలి.

**కప్పుఁదెరువరి** (దే.వి.) : (కప్పు + తెరువు + అరి) అగ్ని, కృష్ణవర్మ.

**కప్పుడు** (దే.వి.) : ఆచ్ఛాదనము.

**కప్పుదెంచు** (దే.అ.క్రి.) : (కప్పు+తెంచు) క్రమ్ము.

**కప్పుబల్ల** (దే.వి.) : ద్వారము మీఁద గొడుగుబల్ల తన్ను బల్లలకు నడుమ నుండెడి పలక.

**కప్పుమల** (దే.వి.) : కాటుకకొండ, అంజన పర్వతము.

**కప్పుమేనిగాము** (ద్వ.వి.) : (కప్పుమేను + గాము) శనిగ్రహము.

**కప్పురగంధి** (వై.గ్రా.వి.) : కర్పూర గంధము వంటి గంధముగల స్త్రీ.

**కప్పురపుటనఁటి** (ద్వ.వి.) : (కప్పురము + అనఁటి) కర్పూరకదళి.

**కప్పురపు బెండ** (ద్వ.వి.) : (కప్పురము + బెండ) ఒకానొక బెండ, గంధ మూలము.

**కప్పురపు వంగ** (వై.వి.) : (కప్పురము + వంగ) ఒకానొకవంగ, కూటవార్తాకి.

**కప్పురబోగి** (వై.వి.) : సస్య విశేషము.

**కప్పురము** (వై.వి.) : కర్పూరము. (వృత్తి యందు హల్లు పరమగుచో అంత్యవర్ణమునకు వికల్పముగ లోపంబగు. కప్పురవీడెము. మొ.)

**కప్పుఱాయి** (దే.వి.) : నీలమణి.

**కప్పెర** (వై.వి.) : 1. కపాలము; 2. భిక్షాపాత్రము (దీనికి గొందఱు కటాహమనియునర్థము చెప్పుచున్నారు. ఆ యర్థమును కొప్పెర శబ్దమునకుఁ జెప్పుట సాధువని తోఁచుచున్నది.)

**కప్రము** (వై.వి.) : కప్పురము యొక్క రూపాంతరము. (వృత్తియందుఁగప్పుర శబ్దమువలె నెఱుంగునది.

**కప్రములక** (ద్వ.వి.) : (కప్రము + ములక) కప్పురపు వంగ.

**కఫము** (సం.వి.అ.పుం.) : శ్లేష్మము, తెమడ.

**కఫి** (సం.విణ.) : (న్.ఈ.న్.) కఫరోగము గల వాఁడు.

**కబంధము** (సం.వి.అ.న.) : నీరు. (పుం. న.) : తలతెగి త్రుళ్లెడుశరీరము. (పుం.) : సముద్రము.

**కబంధుఁడు** (సం.వి.అ.పుం.) : 1. ఒకానొక రాక్షసుఁడు; 2. కేతువు.

**కబరము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మిశ్రమము కలసినది.

**కబరి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. కొప్పు; 2. వాయింట; 3. ఇంగువ మ్రాను.

**కబళనము** (సం.వి.అ.న.) : మ్రింగుట.

**కబళము** (సం.వి.అ.పుం.) : గ్రాసము, కడి.

**కబళించు** (సం.స.క్రి.) : మ్రింగు.

**కబాడము** (దే.వి.) : ఎడ్లమీఁదవేసి తెచ్చెడు కసవులోనగువాని జంటమోపు.

**కబాయి** (దే.వి. అంగీ.) : (రూ. కబాయీ.)

**కబురు** (హిం.వి.) : సమాచారము.

**కబ్బపుఁగూరుపరి** (ద్వ.వి. ) : (కబ్బము + కూరుపరి) కావ్యము రచించు వాఁడు, కవి.

**కబ్బము** (వై.వి.) : 1. కావ్యము; 2. ప్రబంధము.

**కబ్బిలి** (దే.వి.) : కల్లమ్మువాఁడు, శౌండికుఁడు.

**కబేలా** (హిం.వి.) : ఇంటిపత్రము.

**కమండలువు** (సం.వి.ఉ.పుం.న.) : సన్యాసులుంచుకొనెడు గిండి వంటి మట్టి పాత్రము. (పుం.) : జువ్వి చెట్టు.

**కమటము** (దే.వి.) : అగసాలెవాని కుంపటి.

**కమఠము** (సం.వి.అ.న.) : భిక్షాపాత్రము. (పుం.) : తాఁబేలు.

**కమఠి** (సం.వి.ఈ.స్త్రీ.) : ఆఁడుతాఁబేలు, డులి.

**కమతకాఁడు** (దే.వి.) : (కమతము + కాఁడు) కమతము చేయువాఁడు.

**కమతము** (దే.వి.) : కమ్మతము యొుక్క రూపాంతరము.

**కమతీఁడు** (దే.వి.) : (కమతము + ఈఁడు) కమతకాఁడు.

**కమనీయము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మనోహరము, ఇంపైనది.

**కమనుఁడు** (దే.విణ.) : (అ.ఆ.అ.) ఇచ్చగలవాఁడు, కాముకుఁడు.

**కమరు** (దే.అ.క్రి.) : కాలు. (వి.) : 1. కాలిన కంపు; 2. కమ్మరు యొుక్క రూపాంతరము.

**కమరుచు** (దే.ప్రే.) : కమరఁజేయు, కాల్చు. (రూ. కమర్చు.)

**కమల** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. లక్ష్మి; 2. ఉత్తమురాలు. (అ.న.ము.) : 1. తామర; 2. ఎఱ్ఱ తామర; 3. నీరు; 4. మందు; 5. కడుపులో నొక ప్రక్కనుంచెడి యెఱ్ఱని మాంసము; 6. రాగి. (పుం.) : శివునిచేతి యిఱ్ఱి. (డు.) : బ్రహ్మ.

**కమలచ్ఛదనము** (సం.వి.అ.పుం.) : పక్షివిశేషము, రాపులుఁగు.

**కమలవల్లభ** (సం.వి.ఆ.స్త్రీ.) : పిన్నవరగోఁగు.

**కమలాప్తుఁడు** (సం.వి.అ.పుం.) : 1. సూర్యుఁడు; 2. విష్ణువు.

**కమలాఫలము** (సం.వి. ఫల) : విశేషము, కిచ్చలిపండు.

**కమలాసనుఁడు** (సం.వి.అ.పుం.) : బ్రహ్మ, నలువ.

**కమలిని** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. తామరకొలను; 2. తామరతీఁగ.

**కమలు** (దే.అ.క్రి.) : కందు.

**కమలోత్తరము** (సం.వి.అ.న.) : కుసుమ పువ్వు.

**కమసాలవాఁడు** (వై.వి.) : లోహకారుఁడు.

**కమాను** (అన్యదే.వి.) : ప్రయాణము, విల్లు.

**కమి** (దే.వి.) : కమికిలి. (ఇది పిడిశబ్దము వంటిదని తోఁచెడి. ప్రయోగాంతరము గనఁబడలేదు.)

**కమికిలి** (దే.వి.) : వంపఁబడిన వ్రేళ్లు గల పుడిసిలి.

**కమిచీ** (హిం.వి.) : చబుకు.

**కమిత** (సం.విణ.) : (ఋ.ఈ.ఋ.) కమనుఁడు.

**కమియు** (దే.అ.క్రి.) : 1. కవియు; 3. నలఁగు; 3. మాఁగు.

**కమీషన్** (ఆం.వి.) : బేరము చేసినందుకిచ్చు పెచ్చు ద్రవ్యము.

**కమీజో** (ఆం.) : లోన ధరించు చొక్కా.

**కముఁజో** (వై.వి.) : కపింజలపక్షి.

**కముచే** (దే.స.క్రి.) : 1. గ్రహించు; 2. మ్రింగు.

**కమ్మ** (దే.వి.) :1. స్త్రీ కర్ణభూషణము; 2. పత్రిక. (విణ.) 1. పులుసులేనిది; (కమ్మఁగూర. మొ.) 2. మధురము; (కమ్మ నీరు. మొ.) 3. వాసన గలది; (కమ్మ నూనియ. మొ.)

**కమ్మగాడ్పు** (దే.వి.) : మలయ మారుతము.

**కమ్మచ్చే** (వై.వి.) : (కమ్మి + అచ్చు) అగసాలెవాఁడు కమ్మి తీసెడి కొఱముట్టు.

**కమ్మటము** (దే.వి.) : అగసాలెవాని కుంపటి.

**కమ్మటీఁడు** (దే.వి.) : (కమ్మటము + ఈఁడు) అగసాలెవాఁడు, స్వర్ణకారుఁడు.

**కమ్మతము** (దే.వి.) : అనేకులుచేరి చేయు సేద్యము, కృషి.

**కమ్మతీఁడు** (దే.వి.) : (కమ్మతము + ఈఁడు) కమతకాఁడు, కృషీవలుఁడు.

**కమ్మన** (దే.వి.) : 1. కమ్మఁదనము; (చూ. కమ్మ) 2. మాధుర్యము; 3. సౌరభము. (ఇది విశేషణ మగుచో ఇకారాంత మగును.)

**కమ్మనిమ్మ** (దే.వి.) : నిమ్మపండువంటి వర్ణముగల కిత్తలి, తియ్యనిమ్మ, శర్కరాంకము.

**కమ్మనీరు** (ద్వ.వి.) : మకరందము.

**కమ్మనూనియ** (ద్వ.వి.) : సంపెఁగ మొదలగు వానిఁజేర్చి చేసిన తైలము.

**కమ్మపంజులు** (దే.వి.బ.) : పంజుల కమ్మలు.

**కమ్మపిల్లి** (ద్వ.వి.) : పునుఁగుపిల్లి, మార్జారిక.

**కమ్మర** (వై.వి.) : ఇనుము పనిచేసిన బ్రతికెడు జాతి (కమ్మరవాఁడు, కమ్మరది)

**కమ్మరి** (వై.రి.) : (కమ్మర + ఇ) 1. కమ్మరవాఁడు; 2. బాణకారుఁడు.

**కమ్మరీఁడు** (వై.వి.) : (కమ్మర + ఈఁడు) 1. కమ్మర వాఁడు; 2. బాణకారుఁడు.

**కమ్మరు** (దే.వి.) : కమరు, మొలనూలు.

**కమ్మరుబొందు** (దే.వి.) : రెండు గాడి కమ్ముల నడమి బిగిబద్ద.

**కమ్మరేను** (దే.వి.) : కశేరుకము.

**కమ్మవిలుకాఁడు** (దే.వి.) : మన్మథుఁడు, సురభిసాయకుఁడు.

**కమ్మి** (వై.వి.) : 1. వెదురులోనగువాని కమ్మి; 2. బంగారు లోనగువాని కమ్మి; 3.వస్త్రపుఁ గమ్మి; 4.బండికంటికడ కమ్మి; 5.పేము బొద్దు.

**కమ్మిబండి** (ద్వ.వి.) : కమ్మివేసిన మ్రాని చక్రపు బండి.

**కమ్మరించు** (దే.స.క్రి.) : మూయు.

**కమ్ము** (వై.స.క్రి.) : కమ్మిగాచాఁగఁగొట్టు.

**కమ్మెరాకు** (దే.వి.) : (కమ్మెర + ఆకు) కారపు నల్లతములపాకు.

**కమ్రము** (సం.విణ.) 2: 1. ఇంపైనది; 2. ఇచ్ఛ కలది.

**కయాహము** (సం.వి.అ.పుం.) :ఎనుప దూడ.

**కయిపు** (హిం.వి.) : మత్తు.

**కయివారము** (యు.దే.వి.) : గనిమ యంచు (వై.వి.) : స్తోత్రము.

**కయ్య** (దే.వి.) : మడి. (చూ. క్రయ్య)

**కయ్యపుఁదిండి** (దే.వి.) : (కయ్యము + తిండి) కలహాశనుఁడు, నారదుఁడు.

**కయ్యము** (దే.వి.) : జగడము, యుద్ధము.

**కయ్యర** (దే.వి.) : హీనజాతి మౌక్తికము.

**కయ్యాలక్రచ్చ** (దే.విణ.) : కలహశీలుఁడు.

**కర** (యు.దే.వి.) : తీరము.(వై.విణ.) : తీక్ష్ణము. (కరసాన.)

**కరంకము** (సం.వి.అ.పుం.) : 1. లోపల నేమియు లేని బొండ్లపుఁ జిప్ప; 2. డొక్క; 3. తల.

**కరంజము** (సం.వి.అ.న.) : పులిగోరు. (పుం.) : కానుగు.

**కరండము** (సం.వి.అ.పుం.) : 1.కత్తి; 2. తేనెపెర; 3. కరాటము (ఇది యీ యర్థమున మూడు లింగము లందు నగు.)

**కరంబము** (సం.వి.అ.పుం.) : 1. కంపిల్లము; 2. మేళనము.

**కరంభము** (సం.వి.అ.పుం.) : పెరుగుతోఁ గలిపిన పేలపిండి.

**కరఁగు** (దే.అ.క్రి.) : ద్రవించు.

**కరఁగువడు** (ద్వ.అ.క్రి.) : (కరుగు+పడు) కరఁగు.

**కరఁచే** (దే.ప్రే.) : కరఁగఁజేయు.

**కరక** (ఉభ.దే.వి.) : హరీతకి. (సం.వి.ఆ.స్త్రీ. అ.పుం.) : వడగల్లు (అ.న.ము.) : పుట్టగొడుగు (పుం.న.): 1. గిండివంటి పాత్రము; 2.లోపల నేమియులేని బొండ్లపుఁ జిప్ప. (పుం.): 1. దాళిమ్మ; 2. పక్షి శేషము.

**కరకంచే** (దే.వి.) : (కరక+అంచు) కరక్కాయ నీటితో వ్రాసిన యంచు.

**కరకణీ** (దే.వి.) : వేఁటాడుటకు ఉపయుక్తమగు సాధన విశేషము.

**కరకర** (దే.వి.) : వ్రాయుట యందగు ధ్వన్యను కరణము.

**కరకరి** (దే.వి.) : 1. క్రూరభావము; 2. ద్వేషము.

**కరకసా** (వై.విణ.) : కఱకు (కరకసా నేల)

**కరక్కాయ** (దే.వి.) : (కరక + కాయ) కరకచెట్టు కాయ.

**కరగసము** (వై.వి.) : అంపము, క్రకచము.

**కరగోడ** (ద్వ.వి.) : (వెలుగునాటుటకై) పొడిమట్టితో నేర్పఱచిన గోడ.

**కరజము** (సం.వి.అ.న.) : పులిగోరు. (పుం.) : 1. గోరు; 2. కానుగు.

**కరట** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. ప్రయాసము చేతఁ బిదుకఁదగిన యావు, అఱ్ఱు; 2. కాఁచి. (అ.పుం.ము.) : 1. కాకి; 2. కుసుమ పువ్వు; 3. గోఁదురుఁగప్ప; 4. ఏనుఁగు చెక్కిలి; 5.నింద్య జీవ నము; 6. వాద్య విశేషము; 7.ఏకా దశాహాది శ్రాద్ధము.

**కరటి** (సం.వి.న్.పుం.) : గజము, ఏనుఁగు.

**కరడము** (దే.వి.) : అల

**కరడు** (దే.వి.) : 1. అల; 2. పక్షి విశేషము.

**కరణకమ్మలు** (దే.వి.) : బ్రాహ్మణజాతి విశేషము.

**కరణము** (సం.వి.అ.న.) : 1. లెక్క వ్రాయువాఁడు; 2. బవాది; (ఇవి.11. బవ, బాలవ, కౌలవ, తైతిల, గరజి, వణిక్కు, భద్ర, శకుని, చతుష్పాత్తు, నాగవము, కింస్తుఘ్నము.) 3. కొఱ ముట్టు; 4.ఇంద్రియము; 5. కార ణము; 6. క్రియా భేదము; 7. పని; 8. క్షేత్రము; 9. గీతభేదము; 10. నృత్య భేదము; 11. పూఁత; 12. రతి బంధము; 13. శరీరము. (పుం.డు. ) : శూద్ర స్త్రీకిని వైశ్యునకును బుట్టిన వాఁడు (త్రికరణ ములు : మనస్సు, వాక్కు, కర్మము).

**కరణి** (దే.వి.) : విధము.

**కరణికము** (వై.వి.) : కరణము వానిపని.

**కరణీయము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చేయఁ దగినది.

**కరతిత్తి** (వై.వి.) : వస్త్రపు సంచి.

**కరతోయ** (సం.వి.ఆ.స్త్రీ.) : గౌరీ వివాహ కాల మందు ఈశ్వరుని హస్తము వలనఁ బుట్టిన యేఱు.

**కరదము** (సం.వి.అ.పుం.) : ఉపహారము, కానుక.

**కరదివియ** (వై.వి.) : దివ్వటీ.

**కరదివ్వియ** (వై.వి.) : దివ్వటీ.

**కరదివ్వె** (వై.వి.) : కరదివ్వియ యొక్క రూపాం తరము.

**కరదీపిక** (స.వి.ఆ.స్త్రీ.) : దివ్వటీ.

**కరపక్క** (దే.వి.) : వర్ణహీనమైన కెంపుఱాయి.

**కరపత్రము** (సం.వి.) : క్రకచము, అంపము.

**కరపుచ్ఛ** (దే.వి.) : సోమకర్కటి.

**కరఫలము** (సం.వి.అ.పుం.) : గుల్మమును దోమెడు గొఱపము.

**కరభుజము** (దే.వి.) : ఇత్రాలము.

**కరబూజా** (హిం.వి.) : ఒక పండు.

**కరభము** (సం.వి.అ.పుం.) : 1. మనికట్టు మొదలు చిటికెన వ్రేలి మొదలు దానిక గల చేతి వెలుపలి చోటు; 2. ఒంటె పిల్ల.

**కరమర్దము** (సం.వి.అ.పుం.) : కలివె.

**కరము** (ఉభ.దే.) : అవ్య, అత్యంతము. (వృత్తి యందు దీనికి వాఁడిశబ్దము పరమగుచో మువర్ణ లోపము మహాకవి ప్రయోగముల యందుఁ గానఁబడుచున్నది. "కరవాఁడి చూపులు." కరవాఁడి నఖములు) (సం.వి.అ. పుం.) : 1.చేయి; 2. కిరణము; 3. తొండము; 4. కప్పము; 5. వడగల్లు.

**కరరుహము** (సం.వి.అ.పుం.) : నఖము, గోరు.

**కరవటము** (వై.వి.) : బరణి.

**కరవాఁక** (దే.వి.) : సముద్రపుఁగట్టు నోరనుండెడి బురదనేల.

**కరవాయి** (దే.వి.) : లోహకారుఁడు సుత్తెతోఁ బాత్రములను చాఁగఁ గొట్టు నప్పుడు ఒత్తుడుగా వాని లోపలఁ జొప్పించెడి మొనవంపు దిమ్మె మొగపు యినుపకమ్మి.

**కరవాలము** (సం.వి.అ.పుం.) : ఖడ్గము, కత్తి.

**కరవాలు** (వై.వి.) : ఖడ్గము, కత్తి.

**కరవాళిక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.కత్తిపీఁట; 2. చుర కత్తి.

**కరవీరము** (సం.వి.అ.పుం.) : 1. కత్తి; 2. గన్నేరు; 3. డు. ఒకానొక రాక్షసుఁడు.

**కరశాఖ** (సం.వి.అ.) : అంగుళి, వ్రేలు.

**కరసాన** (వై.వి.) : రత్నములు మొదలగు వాని సానఁబట్టెడు చక్రాకారమైన సాన.

**కరహాటము** (సం.వి.అ.పుం.) : 1. తామరదుంప; 2. మంగ.

**కరా** (వై.విణ.) : తీక్ష్ణము. (కరాచురి. మొ) కరి యొక్క రూపాంతరము.

**కరాచేరకత్తి** (వై.వి.) : ఖడ్గము. (చుర కత్తి, చురి, చూరి ఈ శబ్దములు కరా శబ్ద పూర్వకమైనప్పుడు ఖడ్గ వాచకములుగాఁ బ్రయోగములంగానఁ బడుచున్నవి.)

**కరాచేరి** (వై.వి.) : (చూ.) (చురకత్తి, చురి, చూరి ఈ శబ్దములు కరాశబ్ద పూర్వకమైనప్పుడు ఖడ్గవాచకములుగాఁ బ్రయోగములంగానఁ బడుచున్నవి.)

**కరాచోరి** (వై.వి.) : (చూ.) (చురకత్తి, చురి, చూరి ఈ శబ్దములు కరాశబ్ద పూర్వకమైనప్పుడు ఖడ్గవాచకములుగాఁ బ్రయోగములంగానఁ బడుచున్నవి.)

**కరాటము** (వై.వి.) : బరణి. (కరవటము యొక్క రూపాంతరము.)

**కరాపువు** (వై.వి.) : లవంగము.

**కరారు** (హిం.వి.) : ఏర్పాటు, నిర్ణయము.

**కరారునామా** (హిం.వి.) : ఒడంబడిక పత్రము.

**కరాళము** (సం.వి.అ.న.) : 1. నల్లగగ్గెర; 2. వెన్నెముక. (పుం.) : సజ్జరసము నూనె. (విణ.) : 1.ఒడ్డు మిట్టయినది; 2. పొడవైనది; 3. వెఱపుఁ బుట్టించునది.

**కరాళించు** (దే.అ.క్రి.) : 1. బొబ్బరించు; 2. సకిలించు.

**కరి** (ఉభ.దే.వి.) : 1. నిదర్శనము; 2. మేర. (సం.వి.న్.పుం.) : 1. ఏనుఁగు; 2. కోఁతి.

**కరిఖలము** (సం.వి.అ.పుం.) : వేడుకగా నాడెడు జూదము.

**కరిణలు** (దే.వి.) : సాలెవారిలో నొక తెగవారు.

**కరిణి** (సం.వి.ఈ.స్త్రీ.) : ధేనుక, ఆఁడేనుఁగు.

**కరిది** (దే.వి.) : చర్మవాద్యవిశేషము.

**కరిపిప్పలి** (సం.వి.ఈ.స్త్రీ.) : గజపిప్పలి.

**కరిమాచలము** (సం.వి.అ.పుం.) : సింహము.

**కరివె** (దే.వి.) : ఇత్తడి లోనగువారితోఁ జేసి వీణాదండమును బొదివికాని యుండునట్లు సార కొయపయిన మర్చెడు తదంగము, కకుభము.

**కరివెద** (దే.వి.) : నేలదున్ని విత్తుటకు వాన నెదురు చూచుట.

**కరిసనము** (వై.వి.) : కృషి.

**కరిసించు** (వై.స.క్రి.) : ఘర్షించు.

**కరిసె** (వై.వి.) : కాలుపలము.

**కరీరము** (సం.వి.అ.పుం.న. ) : వెదురు మొలక. (పుం.) : 1. కుండ; 2. వెణుతురు.

**కరీరిక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. ఏనుఁగు కొమ్ము మొదలు; 2. చిమ్మట.

**కరీషము** (సం.వి.అ.పుం.న.) : 1. ఎరువు; 2. ఏఱుపిడక; 3. పిడక.

**కరుగు** (దే.వి.) : 1. గట్టిపడిన ముద్ద; 2. దినదినము వ్రాసెడు సంకీర్ణపు లెక్క.

**కరుడుగట్టు** (దే.అ.క్రి.) : (కరుడు+కట్టు) గట్టి, ముద్దయగు. (చూ. చలచలన.)

**కరుణ** (సం.వి.ఆ.స్త్రీ.) : కనికరము. (అ.పుం. ము.) : 1.ఒకానొక చెట్టు; 2. ఒక రసము. (చూ. రసము.)

**కరుణించు** (సం.అ.క్రి.) : కనికరించు.

**కరుమల** (వై.వి.) : (చూ.) కమ్మర. (కరుమల వాఁడు, కరుమలది.)

**కరువ** (వై.వి.) : కొండ.

**కరువలి** (దే.వి.) : గాలి, వాయువు.

**కరువలిపట్టి** (దే.వి.) : 1. భీముఁడు; 2. హనుమంతుఁడు. (ఇట్లు గాడుపుఁ బట్టి, గాలిచూలి.మొ.)

**కరువలిరిక్క** (ద్వ.వి.) : స్వాతీనక్షత్రము.

**కరువలివిందు** (దే.వి.) : అగ్ని.

**కరువు** (యు.దే.వి.) : కరుగు యొక్క రూపాంతరము.

**కరుసు** (వై.వి.) : పరుషోక్తి.

**కరూశము** (సం.వి.అ.పుం. ) : ఒకానొక దేశము.

**కరేకరము** (సం.వి.అ.న.) : పిడికిటిపోటు.

**కరేటువు** (సం.వి.ఉ.పుం.స్త్రీ.) : పెద్దకక్కెర.

**కరేణువు** (సం.వి.ఉ.స్త్రీ.) : ఆఁడేనుఁగు. (పుం.) : 1. ఏనుఁగు; 2. కొండగోఁగు.

**కరోటకము** (సం.వి.అ.న.) : వస్త్రములు పెట్టెడు పెట్టె, బొక్కిస.

**కరోటి** (సం.వి.ఇ.స్త్రీ.) : తలయెముక, పుఱ్ఱె.

**కర్కంధువు** (సం.వి.ఊ.పుం.స్త్రీ.) : 1. రేఁగు; 2. గంగరేఁగు.

**కర్కటకి** సం.వి.ఈ.స్త్రీ.) : గొడ్డుకాఁకర.

**కర్కటము** (సం.వి.అ.పుం.) : 1. ఎండ్రి; 2. కక్కెర; 3. చెఱకు; 4. నూఁగుదోస; 5. బూరుగు కాయ; 6. ఒక రాశి; (చూ. రాశి) 7. అభినయ హస్త విశేషము. (రెండు చేతుల వ్రేళ్లను నొకటొకటి సందున నదికినట్టుగాఁ గూర్చిపట్టినది.)

**కర్కటి** (సం.వి.ఈ.స్త్రీ.) : దోస.

**కర్కము** (సం.వి.అ.పుం.) : 1. అందము; 2. అద్దము; 3. ఎండ్రి; 4. కుండ; 5. తెల్ల గుఱ్ఱము; 6. నిప్పు. (విణ.) : 1. తెల్లనిది; 2. మంచిది.

**కర్కరము** (సం.వి.అ.న.) : కంకరఱాయి. (పుం.) : అద్దము. (విణ.) : కఱకైనది.

**కర్కరి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. దోస; 2. గిండివంటి మట్టిపాత్రము.

**కర్కరేటువు** (సం.వి.ఉ.పుం,స్త్రీ.) : పెద్దకక్కెర.

**కర్కశము** (సం.వి.అ.పుం.) : 1. కంపిల్లము; 2. కసింద; 3. చెఱకు. (విణ.): 1. కంపిల్లము; 2. కసింద; 3. చెఱకు. (విణ.) : 1. కనికరము లేనిది; 2. కఱకైనది; 3. గట్టిది; 4. తెగువ గలది; 5. నొప్పించునది.

**కర్మారువు** (సం.వి.ఉ.పుం.) : గుమ్మడి.

**కర్కోటకము** (సం.వి.అ.పుం.) : 1. ఒకానొక పాము; 2. మారేడు.

**కర్కోటము** (సం.వి.అ.పుం.) : మట్టు కాఁకర.

**కర్కోలకము** (సం.వి.అ.న.) : తక్కోలపు చెట్టు. (రూ. కర్కోలికము)

**కర్చూరము** (సం.వి.అ.న.) : బంగారు. (పుం.): గంట్లకచోరము.

**కర్జకాయ** (దే.వి.) : భక్ష్యవిశేషము.

**కర్జము** (వై.వి.) : పని, కార్యము.

**కర్ణజలూక** (సం.వి.) : చెవిఁజొరుపాము.

**కర్ణజలౌకము** (సం.వి.స్.పుం.) : చెవిఁ జొరు పాము.

**కర్ణధారుఁడు** (సం.వి.అ.పుం.) : ఓడ నడపు వాఁడు, ఆరకాటి.

**కర్ణపత్రము** (సం.వి.అ.న.) : కర్ణిక, చెవికమ్మ.

**కర్ణపూరము** (సం.వి.అ.పుం.) : 1. కంగేలి; 2. కడప; 3. పుష్పాదులచేఁ జేయబడిన చెవికమ్మ; 4. దిరిసెము; 5. నల్లగలువ.

**కర్ణము** (సం.వి.అ.పుం.) : 1. చెవి; 2. కన్నము; 3. చుక్కాను; 4. డు. కుంతి మొదటి కొడుకు.

**కర్ణలత** (సం.వి.ఆ.స్త్రీ.) : చెవితమ్మె.

**కర్ణవేష్టనము** (సం.వి.అ.న.) : కుండలము, పోఁగులు.

**కర్ణాకర్ణి** (సం.వి.ఈ.స్త్రీ.) : వినికివరుస.

**కర్ణాటము** (సం.వి.అ.పుం.) : ఒకానొక దేశము.

**కర్ణిక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. చెవికమ్మ; 2. తొండము చివర; 3. తామరదుద్దు; 4.చేతినడిమివ్రేలు; 5.బాణ విశేషము.

**కర్ణికారము** (సం.వి.అ.పుం.) : 1. కొండ గోఁగు. దీనికి దోహదక్రియ సల్లాపము. 2. ఱేల.

**కర్ణీరథము** (సం.వి.అ.పుం.) : బాలకాది క్రీడా శకటము.

**కర్ణేజపుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) సూచకుఁడు, కొండెకాఁడు.

**కర్త** (సం.వి.ఋ.పుం.) : బ్రహ్మ. (విణ.) చేయువాఁడు.

**కర్తనము** (సం.వి.అ.న.): 1.కత్తరించుట; 2. స్త్రీలు రాట్నము వడుకుట; 3. కయివడిముస్తె.

**కర్తరి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. కత్తెర; 2. భరణి మూడు నాలుగు పాదముల యందును కృత్తిక యందును రోహిణి మొదటి పాదము నందును సూర్యుఁ డుండు కాలము.

**కర్తరీముఖము** (సం.వి.అ.పుం.) : అభినయ హస్తవిశేషము. (బొటనవ్రేలిని వంచి చూపుడు వ్రేలి మొదటఁ గూర్చి యుంగరపువ్రేలిని వంచి చూపుడు నడిమి వ్రేళ్లను గత్తెరవలె బట్టినది.)

**కర్తలాణము** (సం.వి.అ.పుం.) : తెల్లని గొరిజతోఁక వెంద్రుకలు గల నల్ల గుఱ్ఱము, కత్తలాని. (ఉచ్చైవశ్రవముతో దీనిసరిఁబోల్చి తెల్లనియని విశేషణ మిచ్చి యుండుటచేత నిక్కడ నిది యశ్వ మాత్రపరమని యెఱుంగునది.)

**కర్తవ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చేయఁదగినది.

**కర్తారి** (సం.వి.ఈ.స్త్రీ.) : కత్తెరవంగ.

**కర్దమము** (సం.వి.అ.పుం.) : పంకము, అడుసు.

**కర్పటము** (సం.వి.అ.పుం.): 1.వస్త్రము; 2.చినిఁగిన వస్త్రము, మాసిన వస్త్రము. (అని కొందఱు.)

**కర్పరము** (సం.వి.అ.పుం.) : 1. తల పుఱ్ఱె; 2. కొప్పెర; 3. శస్త్రభేదము.

**కర్పరాలము** (సం.వి.అ.పుం. ) : కొండ గొనుగు.

**కర్పరి** (సం.వి.ఈ.స్త్రీ.) : మ్రానిపసుపున వండిన అంజన విశేషము.

**కర్పూరగంధి** (సం.వి.ఆ.స్త్రీ.) : కప్పుర గంది.

**కర్పూరభోగి** (సం.వి.న్.న.) : (చూ. కప్పుర బోగి.)

**కర్పూరము** (సం.వి.అ.పుం,న.) : ఘనసారము, కప్పురము.

**కర్బుర** (సం.వి.ఆ.స్త్రీ.) : కలిగొట్టు. (అ.న.ము.): 1. నీరు; 2. బంగారు; (పుం.) : 1. పాపము; 2. చిత్రవర్ణము. (విణ.) : చిత్రవర్ణముగలది.

**కర్బురుఁడు** (సం.వి.అ.పుం.) : రాక్షసుఁడు.

**కర్మంది** (సం.వి.న్.పుం.) : పారాశరి, సన్న్యాసి.

**కర్మకరుఁడు** (సం.విణ.) : (అ.ఈ.అ.) పనివాఁడు.

**కర్మకారుఁడు** (సం.వి.అ.పుం. ) : కమ్మరవాఁడు. (విణ.) : వెట్టికి పనిచేయువాఁడు.

**కర్మఠుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) నెఱవేరుదాఁక నొకపని చేయువాఁడు.

**కర్మణ్య** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. కూలి; 2. జీతము.

**కర్మము** (సం.వి.న్.న.) : 1. కారక విశేషము; 2. పని (రూ. కర్మువు.) (తర్క శాస్త్రము నందలి పంచవిధ కర్మములు : ఉత్క్షేపణము, అపక్షేపణము, ఆకుంచనము, ప్రసారణము, గమనము) (షట్కర్మములు: యజనము, యాజనము, అధ్యయనము, అధ్యాపనము, దానము, ప్రతిగ్రహము) (షోడశ కర్మములు : గర్భాధానము, పుంసవనము, సీమంతము, జాత కర్మము, నామకరణము, అన్న ప్రాశనము, చౌలము, ఉపనయనము, ప్రాజాపత్యము, సౌమ్యము, ఆగ్నేయము, వైశ్వదేవము, గోదానము, సమావర్తనము, వివాహము, అంత్య కర్మము.)

**కర్మయుగము** (సం.వి.అ.న.) : కలియుగము.

**కర్మసాక్షి** (సం.వి.న్.పుం.) : సూర్యుఁడు, చెయువుల సాకిరి.

**కర్మారము** (సం.వి.అ.న.) : వెదురు.

**కర్మారుఁడు** (సం.వి.అ.పుం.) : కమ్మరవాఁడు.

**కర్మేంద్రియము** (సం.వి.అ.న.) : పాయూపస్థపాణి పాదవాక్కులలో నేదే నొకటి.

**కర్వలి** (దే.వి.) : కరువలి యొక్క రూపాంతరము.

**కర్షకుఁడు** (సం.విణ.) : (అ.ఈ.అ.) 1. ఈడ్చువాఁడు; 2. దున్నుకొని బ్రదుకువాఁడు.

**కర్షణము** (సం.వి.అ.న.) : 1. ఈడ్చుట; 2. దున్నుట; 3. ఒరయుట.

**కర్షఫలము** (సం.వి.అ.పుం.) : తాండ్ర.

**కర్షము** (సం.వి.అ.పుం.న.) : పదునాఱు మాషముల యెత్తు. (పుం.) : ఒరయిక.

**కర్షితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1.ఈడువఁబడినది; 2. దున్నఁబడినది; 3. ఒరయఁబడినది.

**కర్షువు** (సం.వి.ఊ.స్త్రీ.) : 1. కాలువ; 2. యజ్ఞార్థకమైన దుక్కి. వంగ. (అని కొందఱు) (పుం.) : పిడకనిప్పు.

**కర్సనము** (వై.వి.) : కరిసనము యొక్క రూపాంతరము.

**కఱ** (వై.వి.) : 1. నలుపు; 2. మఱక.

**కఱకంఠుఁడు** (వై.గ్రా.వి.) : శివుఁడు, గరళకంఠుఁడు.

**కఱకరి** (వై.విణ.) : (కఱకు+అరి) కఠినుఁడు.

**కఱకఱ** (దే.వి.) : కందుట, ప్రొద్దు పొడుచుట, ఒరయుట, తఱుఁగుట లోనగువాని యందగు ధ్వన్యనుకరణము. (కఱకఱఁగందె, కఱకఱఁ బొడిచె, కఱకఱనొరయు, కఱకఱఁ దఱుఁగు.)

**కఱకటి** (దే.వి.) : బాధ.

**కఱకు** (వై.వి.) : 1. కర్కశత్వము, కాఠిన్యము; 2. బ. పరుషవచనము. (విణ.) 1. కఠినము; 2. పరుషము. (కఱకునేల, కఱకుమాట. మొ.)

**కఱకుగిలు** (వై.అ.క్రి.) : బిరుసగు.

**కఱకుట్లు** (దే.వి.బ.) : కఱ్ఱుకుట్లు యొక్క రూపాంతరము. (దీనిని కఱకుట్లు అనియు, కఱుకుట్లు అనియు ఉభయ విధముగా వాడుచున్నారు.)

**కఱకుదుమ్ము** (ద్వ.వి.) : ఇసుక.

**కఱచు** (దే.స.క్రి.) : 1. అభ్యసించు; 2. కాటు చేయు.

**కఱటి** (దే.విణ.) : వంచకుఁడు.

**కఱత** (వై.వి.) : 1. చేష్ట; 2. దుశ్చేష్ట.

**కఱతలాఁడు** (వై.విణ.) : (కఱతలు + ఆఁడు) దుశ్చేష్టుఁడు.

**కఱద** (వై.వి.) : బుద్ధి.

**కఱదూపము** (వై.వి.) : గృహ ధూమము, ధుంధుమారము.

**కఱనూనె** (ద్వ.వి.) : (కఱ్ఱ+నూనె) మ్రానితైలము.

**కఱపు** (దే.ప్రే.) : బోధించు. (వి.) : దుర్బోధన.

**కఱవ** (దే.వి.) : ఒకానొక మూలిక.

**కఱవాడు** (దే.వి.) : ఎండిన చేఁప.

**కఱవు** (దే.వి.) : 1. క్షామము; 2. పూరి యిండ్లు కప్పునప్పుడు ఏర్పఱచుకొను మితి.

**కఱి** (వై.వి.) : పశుయోని. (విణ.) నల్లనిది.

**కఱిపక్కము** (వై.వి.) : కృష్ణపక్షము.

**కఱియ** (వై.విణ.) : కృష్ణవర్ణము.

**కఱివేము** (ద్వ.వి.) : కఱివేఁపాకు చెట్టు, కాలశాకము.

**కఱివేలుపు** (ద్వ.వి.) : వెన్నుఁడు, కృష్ణుఁడు.

**కఱివేల్పురిక్క** (ద్వ.వి.) : శ్రవణ నక్షత్రము.

**కఱుకు** (దే.స.క్రి.) : రాచు. (వి.) : మందాకు మాడ్చి రాచిన పొడి.

**కఱుకుట్లు** (దే.వి.బ.) : కఱ్ఱు కుట్లు యొక్క రూపాంతరము.

**కఱుక్కు** (దే.వి.) : నఱకుట యందగు ధ్వన్యనుకరణము.

**కఱుగోల** (దే.వి.) : (కఱ్ఱు + కోల) వాఁత వేసెడు ఇనుపకమ్మి. చూఁడుఁ గొడుపు.

**కఱుదు** (వై.వి.) : నేర్పు.

**కఱుదులాఁడు** (వై.విణ.) : (కఱుదులు + ఆఁడు) నేర్పరి.

**కఱ్ఱ** (యు.దే.వి.) : కొయ్య. (వై.) : 1. నలుపు; 2. మఱక.

**కఱ్ఱకుట్లు** (దే.వి.బ.) : ఇనుప సలాక యందు గ్రుచ్చి కాల్చెడు మాంస ఖండము, శూల్యము.

**కఱ్ఱమడ** (దే.వి.) : సెల్లగింప నుపయుక్తమైన ఆయుధవిశేషము.

**కఱ్ఱి** (వై.వి.) : అర్జునుఁడు. (విణ.) : నల్లనివాఁడు.

**కఱ్ఱు** (దే.వి.) : నాఁగటిదుంప యందమర్చెడి యినుపపాళము, కృషకము.

**కఱ్ఱుకుట్లు** (దే.వి.బ.) : (చూ.) కఱ్ఱకుట్లు.

**కఱ్ఱుగుద్దలి** (ద్వ.వి.) : తొల్లిక.

**కల** (ఉభ.దే.వి.) : స్వప్నము. (సం.అ.స్త్రీ.) 1. ముప్పది కాష్ఠల కాలము; 2. చంద్రునిలోఁ

బదునాఱవ భాగము; 3. భాగము; 4. స్త్రీ రజస్సు; 5. మొదలి సొమ్ము వడ్డి; 6. శిల్పము. (అ.న.ము.) : రేతస్సు. (విణ.) : 1. అవ్యక్త మధురము; (ధ్వని) 2. అజీర్ణము; (కలలు అఱువది నాలుగు : 1. ఇతిహాసము; 2. ఆగమము; 3. కావ్యము; 4. అలంకారము; 5. నాటకము; 6. గాయకత్వము; 7. కవిత్వము; 8. కామ శాస్త్రము; 9. దురోదరము; 10. దేశ భాషాలిపి జ్ఞానము; 11. లిపి కర్మము; 12. వాచకము; 13. అవధానము; 14. స్వర శాస్త్రము; 15. శాకు నము; 16. సాముద్రి కము; 17. రత్న శాస్త్రము; 18. రథాశ్వగజ కౌశలము; 19. మల్లశాస్త్రము; 20. సూద కర్మము; 21.దోహదము; 22.గంధవాదము; 23.ధాతువాదము; 24. ఖనివాదము; 25.రస వాదము; 26. జలవాదము; 27. అగ్నిస్తంభము; 28.ఖడ్గస్తంభము; 29.జలస్తంభము; 30.వాక్స్తంభము; 31.వయస్స్తంభము; 32. వశ్యము; 33. ఆకర్షణము; 34. మోహ నము; 35. విద్వేషణము; 36. పరకాయ ప్రవేశము; 37. మారణము; 38.కాల వంచనము; 39. పరకాయ ప్రవేశము; 40.పాదుకా సిద్ధి; 41. వాక్సిద్ధి; 42. ఘటికా సిద్ధి; 43. ఐంద్రజాలికము; 44. అంజనము; 45. దృష్టి వంచనము; 46. స్వరవంచనము; 47. మణి మంత్రౌషధాదిసిద్ధి; 48. చోర కర్మము; 49. చిత్రక్రియ; 50. లోహ క్రియ; 51.అశ్మ క్రియ; 52. మృత్క్రియ; 53. దారుక్రియ; 54. వేణు క్రియ; 55. చర్మ క్రియ; 56.అంబర క్రియ; 57.అదృశ్యకరణము; 58.దూతీ కరణము; 59.మృగయ; 60.వాణిజ్యము; 61.పాశుపాల్యము; 62. కృషి; 63.ఆసవ కర్మము; 64. ప్రాణిద్యూత కౌశలము)

**కలంకము** (సం.వి.అ.పుం.) : 1. గుఱుతు; 2. ఇనుపచిట్టెము; 3. దూఱు.

**కలంకారి** (దే.వి.) : వ్రాఁతపని వస్త్రము.

**కలంజము** (సం.వి.) : గంజాయి.

**కలందాను** (హిం.వి.) : కలములుంచు పెట్టె.

**కలంబము** (సం.వి.) : 1.కూరనార; 2. బాణము.

**కలంబి** (సం.వి.ఈ.స్త్రీ.) : తీఁగ బచ్చలి.

**కలఁక** (దే.వి.) : 1. కలఁగుట; 2. కంటి తెవులు.

**కలఁకఁబాఱు** (దే.అ.క్రి.) : (కలకన్+పాఱు) కలఁతపడు.

**కలఁకపాటు** (ద్వ.వి.) : కలఁతపడుట.

**కలఁకు** (వై.వి.) :1. కళ్లము; 2. స్థానము; 3.యుద్ధము. (కలను యొక్క రూపాంతరము. చూ. కలను.)

**కలఁకువ** (దే.వి.) : కలఁత.

**కలెక్టరు** (ఆం.వి.) : జిల్లాకు అధికారి.

**కలఁగఁబడు** (ద్వ.అ.క్రి.) : (కలఁగన్ + పడు) కలఁగు, సంక్షోభించు.

**కలఁగఁబాఱు** (దే.అ.క్రి.) : (కలఁగన్ + పాఱు) కలఁగు, సంక్షోభించు.

**కలఁగు** (దే.అ.క్రి.) : కలఁకబాఱు, కలఁతపడు.

**కలఁచియాడు** (దే.స.క్రి. ) : (కలఁచి + ఆఁడు) కలఁచు.

**కలఁచు** (దే.ప్రే.) : కలఁగఁజేయు.

**కలఁత** (దే.వి.) : క్షోభము.

**కలఁతపడు** (ద్వ.అ.క్రి.) : కలఁగు, సంక్షోభించు.

**కలకంఠము** (సం.వి.అ.పుం.) : 1. అవ్యక్త మధుర ధ్వని; 2. కోకిలము; 3. పావురము; 4.హంస.

**కలకల** (దే.వి.) : నవ్వుటయందగు ధ్వన్యను కరణము.

**కలకలము** (సం.వి.అ.పుం.) : 1.గుంపునఁ బుట్టినపెద్దమ్రోఁత; అలబలము; 2. సజ్జరసము.

**కలకాలము** (మి.వి.) : ఎల్లప్పుడు.

**కలగలపు** (దే.వి.) : (కలపు+కలపు) 1. కలుపుఁ గోలుతనము; 2. కలుసుఁగూర. (రూ. కలగల్పు)

**కలగుండు** (దే.వి.) : కలఁత, క్షోభము.

**కలగుండుగొను** (దే.అ.క్రి.) : (కలగుండు + కొను) కలఁగు.

**కలగుండువడు** (ద్వ.అ.క్రి.) : (కలగుండు + పడు) కలఁగు.

**కలగుండుపెట్టు** (దే.స.క్రి.) : (కలగుండు + పెట్టు) కలఁచు.

**కలగూర** (దే.వి.) : (కలపు + కూర) పెక్కు దినుసులు కలసిన కూరాకు.

**కలగొను** (దే.అ.క్రి.) : (కలపు+కొను) 1. కలఁగు; 2. వ్యాపించు.

**కలజువ్వి** (దే.వి.) : కందరాలము.

**కలతెఱఁగు** (దే.వి.) : యాథార్థ్యము.

**కలధౌతము** (సం.వి.అ.న.) : 1. వెండి; 2. బంగారు; 3. అవ్యక్త మధుర ధ్వని.

**కలధ్వని** (సం.వి.ఇ.పుం.) : 1. అవ్యక్త మధుర ధ్వని; 2. కోకిలము; 3. నెమలి; 4. పావురము.

**కలన** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. ఎఱుఁగుట; 2. పొందుట.

**కలను** (వై.వి.) : 1. కళ్లము; 2. స్థానము; 3. యుద్ధము.

**కలప** (దే.వి.) : 1. నాఁగటిదుంప; 2. ఇల్లు కట్టుటకు ఉపయోగించెడు మ్రాను.

**కలపకట్టియ** (వై.వి.) : (కలము + కట్టియ) వ్రాసెడు కలము.

**కలపడము** (దే.వి.) : ఒకటితో నొకటి కలయుట.

**కలపతాల్పు** (దే.వి.) : 1. బలరాముడు; 2. శూద్రుఁడు.

**కలపనగంప** (దే.విణ.) : కలహశీలుఁడు.

**కలపనఁబిండి** (దే.వి.) : (కలపడము + పిండి) క్షోభము.

**కలపము** (దే.వి.) : 1. కలపుట; 2. పరిమళ ద్రవ్యములను చేర్చి కలపిన చందనము.

**కలపు** (దే.ప్రే.) : కలయఁజేయు.

**కలబంద** (దే.వి.) : ఒకానొక మందు చెట్టు, కన్య. (దీని భేదము ఏనుఁగుఁ గలబంద) (ఒక నిఘంటువు నందు ఇది కలుబంద అని వ్రాయఁబడి యున్నది.)

**కలభము** (సం.వి.అ.పుం.) : ఏనుఁగు గున్న. ముప్పది యేండ్ల యేనుఁగు. (అని కొందఱు.) (తద్విశేషములు. బాలము, పోతము, విక్కము.)

**కలమము** (సం.వి.అ.పుం.) : 1. వ్రాసెడు కలము; 2. వరిపైరు; 3. లత్తుక.

**కలమరి** (దే.విణ.) : (కలము + అరి) ఓడ యెక్కి పోవువాఁడు.

**కలము** (ఉభ.దే.వి.) : 1. ఓడ; 2. పండ్రెండు తూముల కొలఁది గల పరిమాణ విశేషము.

**కలముఁడు** (సం.వి.అ.పుం.) : చోరుఁడు, దొంగ.

**కలయ** (దే.ద్ర.) : అంతట. (రూ. కలయఁగ.)

**కలయంపి** (దే.వి.) : దుమ్మడఁగుటకై కస్తూరి చందనము లోనుగాఁగల సుగంధ వస్తువులఁ గలపి చల్లెడు నీరు. (కలాఁపి యొక్క రూపాంతరము)

**కలయఁబడు** (ద్వ.అ.క్రి.) : (కలయన్ + పడు) కలయు. (స్వార్థమునపడు.)

**కలయిక** (దే.వి.) : సంగమము.

**కలయు** (దే.స.క్రి.) : కూడు. (నలకథ యందు కంటిని కలయంగన్ అనియు హరిశ్చంద్ర కథ యందు కంటిని కల అంగనా అనియు భేదము.)

**కలరవము** (సం.వి.అ.పుం.) : పారావతము, పావురము.

**కలరూపు** (ద్వ.వి.) : యాథార్థ్యము.

**కలలము** (సం.వి.అ.పుం.న.) : 1. గర్భ పిండము; 2. మావి.

**కలవ** (దే.వి.) : 1. కలయుట; 2. కలసిన యిసుకయు సున్నమును. (విణ.) : కలసినది.

**కలవంటకము** (దే.వి.) : (కలపు + వంటకము) నూవు పొడి లోనగు వానితోఁ గలపిన వంటకము, చిత్రాన్నము.

**కలవడు** (ద్వ.అ.క్రి.) : (కలపు+పడు) కలయు.

**కలవరపడు** (ద్వ.అ.క్రి.) : (కలవరము + పడు) కలఁతపడు.

**కలవరపోవు** (దే.అ.క్రి.) : (కలవరము + పోవు) కలవరపడు.

**కలవరము** (దే.వి.) : 1. కలఁత; 2. చింత.

**కలవరించు** (దే.అ.క్రి.) : మైమఱచి మాటాడు.

**కలవరింత** (దే.వి.) : మైమఱచినమాట.

**కలవాఁడు** (దే.విణ.) : 1. ఆప్తుఁడు; 2. ధనవంతుఁడు; 3. శక్తుఁడు.

**కలవింకము** (సం.వి.అ.పుం.) : 1. ఊరఁ బిచ్చిక; 2. కూఁకటి మూఁగ అనుపక్షి.

**కలశము** (సం.వి.అ.పుం,న.ఈ.స్త్రీ.) : ఘటము, కుండ.

**కలశాబ్ధి** (సం.వి.ఇ.పుం.) : పాల సముద్రము.

**కలశి** (సం.వి.ఇ.ఈ.స్త్రీ.) : 1. కోల పొన్న; 2. పెరుగుఁజిలికెడు కుండ.

**కలహంస** (సం.వి.అ.పుం.) : 1. ధూమ్ర వర్ణములైన ముక్కు కాళ్లు ఱెక్కలు గల హంస; 2. రాజహంస; 3.రాజశ్రేష్ఠుఁ డు. (రూ. కలహంసము)

**కలహము** (సం.వి.అ.పుం,న.) : జగ డము. (పుం.) : 1. యుద్ధము; 2. కత్తి యొఱ.

**కలహాంతరిత** (సం.వి.ఆ.స్త్రీ.) : ముందు కోపముచేఁ బ్రియుని విడనాడి వెనుక పరితాపము నొందెడు నాయిక. (చూ. నాయిక.)

**కలహాశనుఁడు** (సం.వి.అ.పుం.) : నారదుఁడు, ఆరివేరపుఁదపసి.

**కలహించు** (సం.అ.క్రి.) : జగడమాడు.

**కలాచి** (సం.వి.) : తమ్మపడిగము.

**కలాదుఁడు** (సం.వి.అ.పుం.) : 1. అగ సాలెవాఁడు; 2. చంద్రుఁడు.

**కలాపకము** (సం.వి.అ.పుం.) : ఏనుఁగు మెడసంకెల.

**కలాపన** (దే.వి.) : కలఁత.

**కలాపము** (ఉభ.దే.వి.) : కలఁత. (సం.అ.పుం.): 1. ఇరువది యైదు పేటలు గల స్త్రీల యొడ్డాణము; 2. నెమలి పురి; 3. అమ్ములపొది; 4. భూషణము; 5. సమూహము.

**కలాపి** (దే.వి.) : (కలఁత + ఆఁపు) కలయంపి. (పుం.) : (సంధిని వర్ణ లోప వర్ణ వికారములు.) 1. నెమలి; 2. జువ్వి.

**కలాయము** (సం.వి.అ.పుం.) : గుండ్రని సెనగలు.

**కలాయి** (హిం.) : పాత్రలకు తగరము పూయుట.

**కలాలి** (హిం.వి.) : కల్లు సారాయలమ్మువాఁడు.

**కలాలుఖానా** (హిం.వి.) : కల్లుసారాయలమ్ము దుకాణము.

**కలావరు** (ఆం.వి.) : చీట్లాటలోనొక కాకితము పేరు.

**కలాసి** (హిం.వి.) : ఓడమీఁది పనివాఁడు.

**కలి** (ఉభ.దే.వి.) : పులియఁబెట్టిన కడుగు నీరు. (సం.ఇ.స్త్రీ.) : కల్లెము. (పుం.) : 1. జగడము; 2. ఒక యుగము; 3. యుద్ధము; 4. శూరుఁడు.

**కలింగలు** (అర.వి.) : అలుఁగు.

**కలిక** (సం.వి.) : 1. మొగ్గ; 2. కల్లెము.

**కలికము** (దే.వి.) : శైత్య నివారణార్థము కంటికి వేసెడు మందు.

**కలికారము** (సం.వి.) : 1. కూఁకటి మూఁగ యనుపక్షి; 2.పచ్చపిట్ట; 3.నెమలి యడుగుచెట్టు.

**కలికి** (దే.వి.) : 1. మనోజ్ఞురాలగు ఆఁడుది; 2. ఆఁడుది. (విణ.) : మనోజ్ఞము.

**కలిగొట్టు** (దే.వి.) : పాటల.

**కలితనము** (దే.వి.) : సామర్థ్యము.

**కలితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. ఎఱుఁగఁ బడినది; 2. పొందఁబడినది.

**కలితి, కల్తి** (హిం.వి.) : మిశ్రితము, స్వచ్ఛము కానిది.

**కలిద్రుమము** (సం.వి.అ.పుం.) : తాండ్ర.

**కలిమము** (దే.వి.) : మాంసము.

**కలిమారకము** (సం.వి.అ.పుం.) : నెమలియడుగు.

**కలిమి** (దే.వి.) : 1. కలుగుట; 2. సంపద.

**కలిమిచెలి** (దే.వి.) : లక్ష్మి.

**కలిమిదండుగ** (ద్వ.వి.) : నేరము లేకున్నను ధనవంతుని యొద్ద రాజు పుచ్చుకొనెడు ధనము.

**కలియు** (దే.స.క్రి.) : పొందు. (కలుపు, కలుపుఁ గోలు ఇత్యాది సాధారణ ప్రయోగంబులంబట్టి ఇట్లు ఇకార మధ్యముగాను వ్రాయఁబడియె.)

**కలిలము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. ఎఱుఁగ రానిది; 2. చొరరానిది.

**కలివె** (దే.వి. అ.పుం.) : కరమర్దము.

**కలీయము** (సం.వి.అ.పుం,న.) : కళ్లెము.

**కలు** (యు.దే.వి.) : 1.బండిచక్రము; 2. ఱాయి. (వై.) 1.మద్యము; 2.మద్యవిశేషము. (చూ.కల్లు)

**కలుఁగానుగు** (దే.వి.) : (కలు+కానుగు) త్రాయంతి.

**కలుఁగు** (దే.వి.) : 1. బొక్క; 2. గుహ.

**కలుఁజు** (దే.వి.) : చెఱువులోనగువాని నీళ్లు పోవుటకు ఱాతితోఁ గట్టిన మార్గము.

**కలుక్కు** (దే.వి.) : మనసు నొచ్చుట యందగు అనుకరణము.

**కలుక్రాంత** (దే.వి.) : కలుఁగానుగు.

**కలుగచ్చే** (దే.వి.) : ఒక దినుసుగచ్చ.

**కలుగానుగ** (దే.వి.) : ఱాతిగానుగ.

**కలుగు** (దే.అ.క్రి.) : 1.అగు; 2.ఉండు; 3.ఓపు; 4. పుట్టు; 5. కూడు.

**కలుచ** (వై.వి.) : 1. దోషము; 2. కలఁత; (చూ. కలుచపడు) 3. క్రోధము.

**కలుచపడు** (వై.అ.క్రి.) : కలఁతపడు.

**కలుపు** (దే.(ప్రే.) : కలియఁజేయు. (వి.) : 1. పైరులోని కసవులోనగునది; 2. పెరుగు.

**కలుపుఁగోలు** (దే.వి.) : (కలుపు + కోలు) అభేదము. (రూ. కల్పుఁగోలు)

**కలుపుఁగోలుతనము** (ద్వ.వి.) : అభిన్నత్వము.

**కలుము** (దే.వి.) : కలుషగంధము.

**కలువ** (వై.వి.) : ఒకానొక జలపుష్పము, ఉత్పలము.

**కలువకంటి** (ద్వ.వి.) : (కలువ + కన్ను) 1.కలువ ఱేకుల వంటి కన్నులు గల యాఁడుది; 2.ఆఁడుది.

**కలువడము** (వై.వి.) : (కలువ+వడము) ఉత్సవాది కాలములలో ధ్వజ స్తంభములోనగువాని యందు వ్రేలఁ గట్టెడు బంగారు కలువపూదండ.

**కలువము** (దే.వి.) : మందునూఱెడు ఱాయి.

**కలువరాయఁడు** (వై.వి.) : చంద్రుఁడు. (ఇట్లు కలువఱేఁడు లోనగునవి.)

**కలువఱేకు** (ద్వ.వి.) : 1. కలువపూఱేకు; 2. పిఱుఁదుల మీఁది నఖక్షతములు.

**కలువలదాయ** (వై.వి.) : సూర్యుఁడు.

**కలువవిందు** (ద్వ.వి.) : చంద్రుఁడు, కుముద బాంధవుఁడు. (ఇట్లు కలువ చెలి. మొ.)

**కలువు** (దే.అ.క్రి.) : కలుగు యొక్క రూపాంతరము. (పుట్టుటకు.)

**కలుషము** (సం.వి.అ.న.) : పాపము. (పుం.) : దున్నపోతు. (విణ.) : కలఁకఁ బాఱినది.

**కలుషించు** (సం.అ.క్రి.) : కలఁకఁబాఱు.

**కలుసుఁగూర** (ద్వ.గ్రా.వి.) : (కలుసు + కూర) అనుకుగా వండిన కూర. (వ్యవహారమునందు కనఁబడుటగాక గ్రంథములయందును నీ పదమిట్లు కనఁబడుచున్నది.)

**కల్కము** (సం.వి.అ.పుం,న.) : 1. కపటము; 2. పాపము; 3. నెయ్యి, నూనె లోనగు వాని యందు అడుగున నిలిచిన మడ్డి; 4.మలము; 5. మల సామాన్యము; 6. తాంద్ర. (విణ.) : డు. పాపాత్ముఁడు.

**కల్కి** (ఉభ.దే.వి.విణ.) : కలికి యొక్క రూపాంతరము. (చూ. కలికి) (సం.వి.ఇ.పుం.) : విష్ణ్వవతార విశేషము.

**కల్పన** (సం.వి.ఆ.స్త్రీ.) : ఆయిత్తము సేయుటకై యేనుఁగునకుఁ గట్టిన నిడు త్రాడు. (అ.న.ము.): 1. క్లప్తి; 2. రచన.

**కల్పము** (సం.వి.అ.పుం.) : 1. బ్రహ్మ దినము; 2. న్యాయము; 3. ప్రళయము; 4. వేదాంగమైన విధి; 5. శాస్త్రము.

**కల్పవృక్షము** (సం.వి.అ.పుం.) : 1. కోరిన వస్తువు లిచ్చెడు దేవవృక్ష సామాన్యము, వేల్పు మ్రాను; 2. తద్విశేషము (ఇవి 5 : 1. మందారము; 2. పారిజాతము; 3. సంతానము; 4. కల్ప వృక్షము; 5. హరి చందనము)

**కల్పాంతము** (సం.వి.అ.పుం.) : ప్రళయము; త్రుంగుడు.

**కల్పించు** (సం.స.క్రి.) : 1.కలిగించు; 2.రచించు.

**కల్మషము** (సం.వి.అ.న.) : పాపము. (పుం.) : 1. నరక విశేషము; 2. నలుపు. (విణ.) : నల్లనిది.

**కల్మాషము** (సం.వి.అ.పుం.) : 1. చిత్ర వర్ణము; 2. నలుపు. (డు.) : రాక్షసుఁడు. (విణ.) : 1. చిత్ర వర్ణము కలది; 2. నల్లనిది.

**కల్య** (సం.వి.ఆ.స్త్రీ.) : మద్యము. (అ. న.ము.) : వేకువ. (విణ.) : 1.చెవిటి మూఁగ; 2.నేర్పరి; 3. ఉపాయము కలది; (మాట) 4.శుభమైనది; (మాట) 5. రోగము లేనిది; 6. సంపాదింపఁ బడినది.

**కల్యవర్తము** (సం.వి.అ.పుం.) : ప్రాతర్భో జనము.

**కల్యాణము** (సం.వి.అ.న.) : 1.శుభము; 2. చొక్కపు బంగారు.

**కల్ల** (దే.వి.) : 1. అసత్యవచనము; 2. తప్పు; 3. మోసము; 4. పరుష వచనము; 5. తోఁట లోనగువాని వెలుగు. (విణ.) : 1. అసత్యము; 2. పరుషము.

**కల్లతనము** (దే.వి.) : 1.చెడ్డనడత; 2.వంచన.

**కల్లము** (దే.వి.) : మల్లబంధ విశేషము. (చూ. కత్తి)

**కల్లరి** (దే.విణ.) : (కల్ల + అరి) 1. అసత్యము పలుకు వాఁడు; 2. తప్పు చేసిన వాఁడు; 3.దుష్టుఁడు (లేక) దుష్టురాలు; 4. వంచకుఁడు.

**కల్లరీఁడు** (దే.విణ.) : (కల్లరి + ఈఁడు) కల్లరి. (స్వార్థమున ఈఁడు.)

**కల్లరుజు** (దే.వి.) : మత్స్యవిశేషము. (చూ. అరుజు.)

**కల్లు** (యు.దే.వి.) :1.కన్ను; 2. బండి కన్ను; 3. ఊయి. (వై.) : 1. మద్యము; 2. మద్య విశేషము.

**కల్లుపెంట** (ద్వ.వి.) : కల్లమ్మెడుచోటు, శుండ.

**కల్లువడు** (ద్వ.అ.క్రి.) : (కల్లు+పడు) స్తంభించు.

**కల్లెలుక** (దే.వి.) : (కల్ల + ఎలుక) పొలములలోఁ గలుఁగుల యందుండెడి యెలుక.

**కల్లేడు** (దే.వి.) : పక్షి విశేషము.

**కల్లేఱు** (దే.వి.) : (కల్లు + ఏఱు) వీర భద్ర పర్వత పాదమూలమునఁ బాఱెడి యొక నది.

**కల్లోలము** (సం.వి.అ.పుం.) : 1. పెద్ద యల; 2. సంతోషము. (డు.) శత్రువు.

**కల్లోలిని** (సం.వి.ఈ.స్త్రీ.) : నది, ఏఱు.

**కల్వ** (వై.వి.) : కలువ యొక్క రూపాంతరము.

**కల్వము** (దే.వి.) : కలువము యొక్క రూపాం తరము.

**కల్హారము** (సం.వి.) : ఇంచుక యెఱుపును దెలుపును గలిగి మిక్కిలి పరిమళముగల కలువ, సౌగంధికము.

**కవ** (దే.వి.) : 1. జత; (జక్కవకవ. మొ.) 2. యుగళము; (కన్నుఁగవ. మొ.) 3. కుశలవులు; 4. నకులసహదేవులు.

**కవకవ** (దే.వి.) : 1. నవ్వుటయందగు ధ్వన్యను కరణము; 2. పలుకుట యందగు ధ్వన్యను కరణము; 3.వ్రాలుట యందగు ధ్వన్యను కరణము.

**కవచము** (సం.వి.అ.పుం.) : 1. బొందలము; 2. తప్పెట; 3. కలజువ్వి.

**కవట** (దే.వి.) : పెద్దకొమ్మ, స్కంధశాఖ. (విణ.): లేఁత. (కవటాకు.)

**కవడె** (దే.వి.) : వాద్యవిశేషము.

**కవణకాఁడు** (దే.విణ.) : మల్ల గమనమును దెలిసినవాఁడు.

**కవణము** (వై.వి.) : గుగ్గిళ్ళము మొదలగు వాని యొక్క ఉలవలు లోనుగాఁగల భక్ష్యము.

**కవను** (దే.వి.) : కసవు.

**కవరు** (ఆం.వి.) : కాగితపు సంచి, పైకప్పు.

**కవఱలు** (దే.వి.బ.) : పాచికలు.

**కవలు** (దే.వి.) : వేదాది పఠనమునందుఁ గొంత సామ్యముచే నొకటి విడఁబడి మఱియొకటి వచ్చి కలయుట.

**కవలుకొను** (దే.అ.క్రి.) : వేదాది పఠనము నందుఁగొంత సామ్యముచే నొకటి విడఁబడి మఱియొకటి వచ్చి కలయు.

**కవలువోవు** (దే.అ.క్రి.) : (కవుల + పోవు) కవలుకొను.

**కవాటము** (సం.వి.అ.పుం,న.ఈ.స్త్రీ.) : తలుపు.

**కవాడము** (అర.వి.) : ఎద్దులుమోయు బరువు.

**కవాతు** (హిం.వి.) : దండువారు చేయు సాధకము.

**కవి** (సం. వి. ఇ. స్త్రీ.) : కళ్లెము. (పుం.) : 1. కవిత్వము చెప్పువాఁడు; 2. పండితుఁడు; 3. శుక్రుఁడు; 4. వాల్మీకి.

**కవించు** (దే.ప్రే.) : కవియించు యొుక్క రూపాంతరము.

**కవిక** (సం.వి.ఆ.స్త్రీ.) : ఖలీనము, కళ్లెము.

**కవిచేయు** (దే.అ.క్రి. కవియు. (ఇక్కడ కవి చేయుదురు అనఁగా సహగమనము చేయుదు రని యర్థము. రెండు మూడు ప్రతులయందును ఈ పాఠమే యున్నది. ఉండినను ప్రయోగాంత రము దొరకమిచే ఈ పదమిట్లే యుండవచ్చు నను నిశ్చయము పుట్టినదికాదు.)

**కవియు** (దే.అ.క్రి.) : పర్వు.

**కవియుదెంచు** (దే.అ.క్రి.) : (కవియు + తెంచు) కవియు. (స్వార్థమున తెంచు.)

**కవిరి** (వై.వి.) : తాంబూలముతోఁ గూడ నుపయోగించుకొనుటకుఁ గాఁచు లోనగు వస్తువులు చేర్చి చేసిన యుండ.

**కవిల** (వై.వి.) : కపిలవర్ణము. (ఇక్కడ వకార ప్రాసము గనుక కవిలగడ్డ మనియే చెప్ప వలయును. అప్పుడు కవిల అనునది వైకృత మగుచున్నది.)

**కవిలియ** (దే.వి.) : కవిలె.

**కవిలె** (దే.వి.) : ఘట్టించిన నీలపటపు వర్గు లెక్క పుస్తకము. (కవిలియ యొుక్క రూపాంతరము) (ఇప్పుడు దీనిని తాటాకుల లెక్క పుస్తకముగా వాడుచున్నారు.)

**కవోష్ణము** (సం.వి.అ.న.) : ఇంచుక వేఁడి. (విణ.) : ఇంచుక వేఁడిగలది.

**కవ్యము** (సం.వి.అ.న.) : పితృదేవతల కియ్యఁదగిన యన్నము.

**కవ్వడి** (దే.వి.) : (కవ+వడి) రెండు చేతుల వడి గలవాఁడు, అర్జునుఁడు.

**కవ్వపుఁగొండ** (ద్వ.వి.) : (కవ్వము + కొండ) మంథాద్రి. (ఇట్లు కవ్వపు మల లోనగునవి.)

**కవ్వము** (దే.వి.) : పెరుగుచిలికెడు సాధనము, మంథానము.

**కవ్వు** (దే.స.క్రి.) : 1. కబళించు; 2. అపహరించు.

**కశ** (సం.వి.ఆ.స్త్రీ.) : గుఱ్ఱములోనగువానిఁ గొట్టు నట్టి చబుకు.(అ.పుం.ము.) : పూతిమార్జాలము.

**కశిపువు** (సం.వి.ఉ.పుం.) : 1. అన్నము; 2. వస్త్రము; 3. అన్నవస్త్రములు; 4. పఱుపు.

**కశేరుక** (సం.వి.ఆ.స్త్రీ.) : వెన్నెముక. (అ.న. ము.) : 1. కమ్మరేఁగు; 2. కొట్టిగడ్డ.

**కశ్మలము** (సం.వి.అ.న.) : మూర్ఛ. (విణ.) : మలినము.

**కశ్యము** (సం.వి.అ.న.) : 1. గుఱ్ఱము నడుము; 2. మద్యము. (విణ.) : కశకుఁ దగినది.

**కష** (సం.వి.ఆ.స్త్రీ.) : దక్షుని కూఁతులలో నొకతె. (అ.పుం.ము.) : 1. ఒరగల్లు; 2. (సాన.డు.): సాన పెట్టుట మొదలగు పనులుచే జీవించెడు నొక నికృష్టపు జాతివాఁడు.

**కషణము** (సం.వి.అ.న.) : ఒరయిక.

**కషాయము** (సం.వి.అ.పుం,న.) : 1.ఒగరు; 2. ఔషధరసము; 3. పూసి కొనెడు చందనాది; 4. చందనాదుల పూఁత. (విణ.) : 1. ఎఱ్ఱనిది; 2. వాసన గలది.

**కషాయిక** (సం.వి.ఆ.స్త్రీ.) : నీరుదోమ.

**కష్టపడు** (మి.అ.క్రి.) : (కష్టము+పడు) దుఃఖపడు.

**కష్టపాటు** (మి.వి.) : కష్టపడుట.

**కష్టము** (సం.వి.అ.న.) : 1. దుఃఖము; 2. పాపము. (విణ.) : 1. దుఃఖము గలది; 2. పాపము గలది; 3. చొరరానిది. (అష్ట కష్టములు – 1. దేశాంతర గమనము; 2.భార్యా వియోగము; 3. ఆపత్కాలమందు బంధు దర్శనము; 4.ఉచ్ఛిష్ట భక్షణము; 5.శత్రు స్నేహము; 6.పరాన్న ప్రతీక్షణము; 7.భంగము; 8. దారిద్ర్యము.)

**కసటు** (వై.వి.) : 1. పాపము; 2. మాలిన్యము.

**కసమస** (దే.వి.) : తొట్రుపాటు.

**కసరతు** (హిం.వి.) : సాధకము.

**కసరు** (దే.అ.క్రి.) : చలించు. (వి.) : 1. కోపము; 2. వానగాలి, ఝంఝ; 3. పెచ్చు, లాభము.

**కసవు** (వై.వి.) : 1. గడ్డి; 2. ఇంటిపెంట.

**కసవుఁగుప్ప** (ద్వ.వి.) : (కసవు + కుప్ప) 1. పొరకతో నూడ్చి చేర్చిన పెంట, అవకరము; 2.గడ్డివామి.

**కసాయి** (దే.వి.) : కటికవాఁడు, సౌనికుఁడు.

**కసి** (దే.వి.) : 1. కోపము; (వానిని కసి తీఱఁ గొట్టితిని) 2. దురద; 3. కోరిక. (విణ.) : వృత్తి యందుఁ గసిడి శబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలినరూపము (కసికాటు.వె.)

**కసింద** (వై.వి.) : కాసమర్దము. (దీని భేదము తీఁటకసింద)

**కసిడి** (దే.విణ.) : అల్పము.

**కసిమసఁగు** (దే.అ.క్రి.) : విజృంభించు. (స.క్రి.): 1. ఖండించు; 2. చంపు.

**కసిమసి** (దే.వి.) : తొట్రుపాటు.

**కసిమిరి** (దే.వి.) : తీఁట.

**కసీదా, కసీదు** (హిం.వి.) : వస్త్రము మీఁద పూలుబుట్టాలు కుట్టుట.

**కసీసము** (వై.విణ.) : నల్లనిది.

**కసు** (దే.విణ.) : వృత్తియందుఁ గసురు శబ్దమునకు మీఁది వర్ణము లోపింపగా మిగిలిన రూపము. (కసుగాయ.మొ.)

**కసుఁగందు** (దే.వి.) : (కసురు+కందు) 1. లేఁత బిడ్డ; 2. నలుపు.

**కసుగందు** (దే.అ.క్రి.) : (కందు + కందు) మిక్కిలివాడు. (వి.బ.) : మిక్కిలి వాడుటలు.

**కసుగు** (దే.అ.క్రి.) : నలఁగు. 1. నలఁచు; 2. పులుము; 3. బాధించు.

**కసుబా** (హిం.విణ.) : అధికారులుండు గొప్ప గ్రామము.

**కసుమాలము** (వై.విణ.) : మలినము. (ఇక్కడ మలినమనఁగా పాపిష్ఠమని యర్థము.)

**కసురు** (దే.వి.) : లేఁతకాయ. (దీనికి వృత్తియం దంత్య వర్ణలోపమును లేఁతయను నర్థమును గలుగును. కసుఁగందు, కసుగాయ, కసు గాఁపు పూప వయసుమిటారి. మొ.)

**కసెము** (వై.వి.) : కస్సెము యొక్క రూపాంతరము.

**కస్తి** (దే.వి.) : దుఃఖము.

**కస్తురి** (వై.వి.) : కస్తూరి.

**కస్తురిపట్టియలు** (వై.వి.బ.) : 1. పుష్ప విశేషము; 2. ధాన్య విశేషము. (రూ. కస్తురిపట్టెలు.)

**కస్తురిపసుపు** (ద్వ.వి.) : గంధహరిద్ర.

**కస్తురిపిల్లి** (వై.వి.) : గంధమృగము.

**కస్తురివీణియ** (వై.వి.) : కస్తూరి యుండెడి జింక బొడ్డు, మృగనాభి.

**కస్తూరి** (ఉభ.దే.వి.) : కుక్కపేరు. (సం.ఈ. స్త్రీ.) : మృగమదము, కస్తురి.

**కస్సెము** (వై.వి.) : నీళ్లు చిదచిద యనెడు నేల.

**కహకహ** (సం.వి.) : రాక్షస హసనము నందగు ధ్వన్యనుకరణము.

**కహారము** (సం.వి.) : గృహ విశేషము యొక్క నడిమికంబము, నిట్రాడు.

**కహ్వాము** (సం.వి.అ.పుం.) : బకము, వక్కుకొంగ.

**కళ** (ఉభ.దే.వి.) : 1. మూర్ఛ; 2. రెమ్మ. (దీనికి యర్థ మీ గ్రంథమునందే కనఁబడుచున్నది.) (సం.ఆ.స్త్రీ.) : 1. ముప్పది కాష్ఠల కాలము; 2.చంద్రునిలో పదునాఱవ భాగము; 3.భాగము; 4. స్త్రీ రజస్సు; 5. మొదలి సొమ్ము వడ్డి; 6. శిల్పము.

**కళత్రము** (సం.వి.) : 1. పెండ్లాము; 2. పిఱుఁదు; 3. కోట.

**కళపెళ** (దే.వి.) : ఉడుకుట యందగు ధ్వన్యను కరణము.

**కళవరము** (దే.వి.) : మల్లబంధ విశేషము.

**కళవసము** (దే.వి.) : తోలు.

**కళవళపడు** (ద్వ.అ.క్రి.) : (కళవళము + పడు) 1. కలంతపడు; 2. తొట్రుపడు.

**కళవళపాటు** (ద్వ.వి.) : (కళవళపడుట) 1. కలంత పాటు; 2. తొట్రుపాటు.

**కళవళము** (దే.వి.): 1. కలంత; 2. తొట్రుపాటు.

**కళనళించు** (దే.అ.క్రి.) : 1. కలంతపడు; 2.తొట్రుపడు. (ఇక్కడ కళవళించుట అనఁగా చలించుట అని యర్థము.)

**కళానిధి** (సం.వి.ఇ.పుం.) : చంద్రుఁడు, చందమామ.

**కళాయి** (దే.వి.) : 1. నీలిమందు కాఁచెడు గంగాళము; 2. ఇత్తడి పాత్రలు లోనగువానికిఁ బూసెడు సీసపు పూఁత.

**కళావతి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. కళలను దెలిసిన యాఁడుది; 2. తుంబురుని వీణ.

**కళాసము** (దే.వి.) : కళవసము యొక్క రూపాం తరము.

**కళాసించు** (దే.అ.క్రి.) : అలయు.

**కళింగ** (సం.వి.) : ఆఁడుది. (అ.న.ము.) : కొడిసెకాయ. (పుం.) : 1. ఒకానొక దేశము; 2. కూఁకటి మూఁగయనెడు పక్షి; 3. నెమలి యడుగు.

**కళుకు** (దే.వి.) : 1. కాంతి; 2. పొడి; 3. పక్షి విశేషము.

**కళేబరము** (సం.వి.అ.న.) : శరీరము, మేను.

**కళ్యము** (వై.వి.) : కళ్లెము.

**కళ్ల** (దే.వి.) : శైత్యముచే గట్టిపడినయుప్పు. (ఇట్లు పరుషాదిగా కొన్ని దేశముల యందు వ్యవహారము.)

**కళ్లము** (వై.వి.) : ధాన్యము నుతిచెడు చోటు, ఖలము.

**కళ్లాము** (వై.వి.) : కళ్లము యొక్క రూపాంతరము.

**కళ్లియము** (వై.వి.) : కళ్లెము.

**కళ్లెము** (వై.వి.) : గుఱ్ఱమునోటఁ దగిలించునది, ఖలీనము. (కళ్లియము యొక్క రూపాంతరము.)

# కా

**కా** (ఉభ.దే.అన్య.కదా. దే.ద్ర.) : ఇది అవధార ణార్థకావ్యయము మీఁద వచ్చినపుడు ఇత్యర్థక మగును. (సం.వి.ఆ.స్త్రీ.) : కాకియఱచుట యందగు ధ్వన్యనుకరణము.

**కాంక్ష** (సం.వి. ఆ.స్త్రీ.) : ఇచ్ఛ, కోరిక.

**కాంక్షించు** (సం.స.క్రి.) : ఇచ్ఛించు, కోరు.

**కాంక్షితము** (సం.విశ.) : (అ.ఆ.అ.) కోరఁ బడినది.

**కాంచనము** (సం.వి.అ.న.) : 1. బంగారు; 2. అకరువు; (పుం.): 1.ఉమ్మెత్త; 2. సంపెఁగ; (చూ. కనకము) 3. కాంచనము; 4. నాగ కేసరము; 5.పొన్న; 6. మట్టి.

**కాంచనారము** (సం.వి. అ.పుం.) : కాంచనము.

**కాంచని** (సం.వి.ఈ.స్త్రీ.) : హరిద్ర, పసుపు.

**కాంచి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. ఒంటిపేట గల ఆఁడుదాని మొలనూలు; 2. ఒకానొక పట్టణము.

**కాంచనము** (వై.వి.) : కోవిదారము.

**కాంచే** (దే.స.క్రి.) : 1.చూచు; 2.పొందు; 3. బిడ్డనుకను; 4. భాగ్యముఁ బొందు.

**కాంజికము** (సం.వి.అ.న.) : అర నాళము, కలి. (రూ.కాంచికము)

**కాండపటము** (సం.వి.అ.పుం.) : తిరస్కరిణి, తెర.

**కాండపృష్ఠుఁడు** (సం.విశ.) : (అ.ఆ.అ.) ఆయుధములచేత బ్రదుకువాఁడు, శస్త్రాజీవుడు.

**కాండము** (సం.వి.అ.పుం,న.) : 1.కావ్య పరిచ్ఛేదము; సమూహము. (అని కొందఱు) 2. బాణము; 3. జలము; 4. ఆకులు లోనగు వాని యీనె; 5. తామర లోనగువానికాఁడ; 6.వరి లోనగువాని పోచ; 7. ముండ్లు లోనగు వాని దుబ్బు; 8.మోదుగు లోనగు వాని కట్టు; 9.చెట్టు బోదె; 10. గుఱ్ఱము, కుత్సితము; (అని కొందఱు) 11. ఏకాంతము; 12. సమయము.

**కాండీరుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) బాణమును ధరించినవాఁడు, దండమును ధరించినవాడు. (అని కొందఱు)

**కాండేక్షువు** (సం.వి.ఉ.పుం.) : ములు గొలిమిడి.

**కాండ్ర** (దే.వి.) : తృణ విశేషము.

**కాండ్రు** (దే.వి.) : పులి కూయుట యందగు ధ్వన్యనుకరణము.

**కాంత** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. కోరఁదగిన ఆఁడుది; 2. ఆఁడుది; 3. ప్రేంకణము. (అ.పుం. ము.) : 1. ఇనుము; 2. (చంద్ర సూర్యాయ శ్శబ్దములకును తత్పర్యాయ శబ్దములకును వెనుక వచ్చునపుడు) ఱాయి. (చంద్రకాంతము, సూర్యకాంతము, అయస్కాంతము. మొ. వీని యర్థములు ఆయాయి శబ్దము కడఁజూచునది.)

**కాంతలకము** (సం.వి. అ.పుం.) : నంది వృక్షము.

**కాంతారము** (సం.వి.అ.పుం,న.) : 1.పేరడవి; 2.పోరానిత్రోవ. (పుం.) : తెలుపు కలసిన పచ్చచెఱకు.

**కాంతాళపడు** (ద్వ.అ.క్రి.) : (కాంతాళము + పడు) ఈర్ష్యపడు.

**కాంతాళము** (దే.వి.) : 1. ఈర్ష్య

**కాంతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. జిగి; 2. కోరిక.

**కాంతుఁడు** (సం.వి.అ.పుం.) : మగఁడు. (విణ.): ఒప్పిదము గలవాఁడు.

**కాందవికుఁడు** (సం.విణ.) : (అ.ఈ.అ.) పిండివంటలు చేయువాడు.

**కాందిశీకుఁడు** (సం.విణ) : (అ.ఆ.అ) వెఱపుచేఁ బాఱెడు వాఁడు.

**కాంపిల్యము** (సం.వి.అ.పుం.) : కంపిల్లము.

**కాంబవికుఁడు** (సం.వి.అ.పుం. ) : సంకు పూసలు లోనగునవి చేసి యమ్మెడువాఁడు.

**కాంబళము** (సం.విణ.) : (అ.ఈ.అ) కంబళిచేతఁ గప్పబడినది (రథము)

**కాంబోది** (దే.వి.) : సస్య విశేషము.

**కాంభోజము** (సం.వి.అ.పుం.) : 1. ఒకానొక దేశము; 2. కాంభోజదేశపు గుఱ్ఱము; 3. వెలి చంద్ర; 4. పొన్న.

**కాంభోజి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. ఒకానొక రాగము; 2. వెలిచంద్ర; 3. కారు మినుము; 4. బండి గురివెంద.

**కాంస్యకారుఁడు** (సం.వి.అ.పుం.) : కంచర వాఁడు.

**కాంస్యము** (సం.వి.అ.న.) : 1. కంచు; 2. బంగారు వెండి లోనగువానిచేఁ జేయబడిన పాన పాత్రము.

**కాఁక** (దే.వి.) : 1. జ్వరము; 2. తాపము; 3. తపము; 4. కోపము; (అ.విణ.) : ఉష్ణము (కాఁక వెలుఁగు మొ.)

**కాఁకర** (వై.వి.) : కారవేల్లము. (దీని భేదములు : అడవి కాఁకర, కొమ్ము కాఁకర, గొడ్డుఁగాఁకర, పొట్టికాఁకర.)

**కాఁకరవత్తి** (వై.వి.) : బాణసంచు విశేషము.

**కాఁకవెలుఁగు** (దే.వి.) : సూర్యుఁడు, ఉష్ణరశ్మి.

**కాఁగు** (దే.అ.క్రి.) : 1. తపించు; 2. కోపపడు. (వి.) : పెద్దబాన.

**కాఁగుడు** (దే.వి.) : తపించుట, తపనము.

**కాఁచర** (వై.వి.) : కాసర.

**కాఁచి** (వై.వి.) : కాకమాచి.

**కాంచు** (దే.ప్రే.) : కాఁగఁజేయు. (వి.) : ఒకానొక యంగడి దినుసు.

**కాంచువడియము** (ద్వ.వి.) : కవిరి యుండ. (చూ. కైరవడి)

**కాఁడ** (వై.వి.) : 1. కూరాకులోనగువాని కామ; 2. తొడిమ.

**కాఁడి** (దే.వి.) : 1. పులియఁబెట్టిన కడుగు నీరు; 2. ఎద్దు మొదలగువాని మెడ మీఁద నుంచెడు బండి లోనగువాని యుగము.

**కాఁడిగట్టు** (ద్వ.వి.) : ఒక్కరొకరి నేలలకు హద్దుగా నేర్పఱచిన కట్ట.

**కాఁడు** (దే.అప.) : ఒకానొక పుంప్రత్యయము. (సొగసుకాఁడు.మొ.) అ.క్రి. నాటు.

**కాఁదారి** (దే.వి.) : అర్ధరాత్రము.

**కాఁదారిమాఁదారి** (దే.వి.) : అర్ధరాత్రము.

**కాఁపడము** (దే.వి.) : నొప్పిగలిగినచోట వేఁడి వస్తువుతో నొత్తుట.

**కాఁపు** (దే.వి.) : 1. కాఁపురము; 2. గృహస్థుఁడు; 3. పంటపెట్టువాఁడు; 4. శూద్రుఁడు

**కాఁపుడు** (దే.వి.) : కాఁచుట.

**కాఁపురము** (దే.వి.) : 1. నివానము; 2. సంసారము.

**కాఁపురించు** (దే.అ.క్రి.) : కాఁపురము చేయు, వసించు.

**కాఁబట్టి** (దే.అవ్య.) : (కాన్+పట్టి) హేతువును దెలుపును, కనుక.

**కాఁబట్టు** (దే.అ.క్రి.) : (కాన్+పట్టు) కావలసియుండు. (అది నాకు కాఁబట్టదు.)

**కాఁబడు** (ద్వ.అ.క్రి.) : (కాన్ + పడు) అగు.

**కాఁబోలు** (దే.ద్ర.) : (కాన్+పోలు) ఔనేమో.

**కాక** (ఉభ.దే.అవ్య.) : 1. ఆశీరాద్యర్థ మును దెలుపును (అట్టుల కాక, ఉండెడుఁ గాక. మొ.) 2. తక్కనను నర్థమును దెలుపును. (సం.వి.ఆ.స్త్రీ.) : 1. కాఁచి; 2. కాకి దొండ; 3.కారుకొల్లి; 4. కుక్కమేడి; 5. వెలమసంది; (అ.న.ము.) : కాకులసమూహము. (పుం.) : 1. కాకి; 2. ఒకానొక చెట్టు..

**కాకచించ** (సం.వి.ఆ.స్త్రీ.) : గురిజ.

**కాకచించి** (సం.వి.ఈ.స్త్రీ.) : గురిజ.

**కాకజంఘ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. కాకి దొండ; 2. వెలమ సంది.

**కాక జంబుక** (సం.వి.ఆ.స్త్రీ.) : కాకి నేరెడు.

**కాకతాళీయము** (సం.విశ.) : (ఆ.ఆ.అ) కాకి వ్రాలఁగా తాటిపండు పడిన విధము వంటిది.

**కాకతిందుకము** (సం.వి.అ.పుం.) : కాకి తుమ్మిక.

**కాకతుండఫల** (సం.వి.ఆ.స్త్రీ.) : కాకిదొండ.

**కాకతుండము** (సం.వి.అ.పుం.) : 1. అగరువు; 2. కాహళమను వాద్య విశేషము; 3.బాణ విశేషము.

**కాకనాసిక** (సం.వి.ఆ.స్త్రీ.) : కాకిదొండ.

**కాకపక్షము** (సం.వి.అ.పుం.) : పిల్ల జుట్టు, కూఁకటి.

**కాకపీలుకము** (సం.వి.అ.పుం.) : కాకి తుమ్మిక.

**కాకపుష్టము** (సం.వి.అ.పుం.) : కోయిల.

**కాకమల్లి** (సం.వి.ఈ.స్త్రీ.) : అడవిమల్లె.

**కాకమాచి** (సం.వి.ఈ.స్త్రీ.) : కాఁచి.

**కాకము** (సం.విశ.) : (అ) అల్పము.

**కాకముద్గ** (సం.వి.ఆ.స్త్రీ.) : కాకిపెసర.

**కాకరుహము** (సం.వి.అ.పుం.) : నువ్వులు.

**కాకలము** (సం.వి.అ.పుం.) : కాగితము.

**కాకలీ** (సం.వి.ఈ.స్త్రీ.) : సూక్ష్మమైన యవ్యక్త మధురధ్వని.

**కాకాంగి** (సం.వి.ఈ.స్త్రీ.) : కాకిదొండ.

**కాకాదని** (సం.వి.ఈ.స్త్రీ.) : పెద్దకాఁచి.

**కాకాక్షిన్యాయము** (సం.వి.అ.పు.) : కాకి చూపువలె నేదే నొక ప్రక్క కొఱగుట.

**కాకి** (ఉభ. వై.వి.) : కాకము. (విశ.) : అల్పము. (కాకి కలువ.మొ.) (సం.వి.ఈ.స్త్రీ.) : 1. ఆఁడుకాకి; 2. కాఁచి.

**కాకికలువ** (వై.వి.) : అల్లి పువ్వు, కాకోత్పలము.

**కాకిచిప్ప** (ద్వ.వి.) : నీటియందలి గుల్ల, శంబూక.

**కాకిచెఱకు** (ద్వ.వి.) : చెఱకు వంటి తృణ విశేషము, తేజనకము.

**కాకిచేవు** (ద్వ.వి.) : ఆకస్మికపు మృతి.

**కాకిణి** (సం.వి.ఈ. స్త్రీ.) : 1. కర్షము నందు నాల్గవ పాలు; 2. కొలిచెడు కోల; 3. ఒక గవ్వ; 4. తూనిక భాగము; 5. ఎఱ్ఱగురిజ.

**కాకితము, కాగితము** (హిం.వి.) : వ్రాయు పత్ర విశేషము.

**కాకితీపు** (ద్వ.వి.) : మూర్ఛావిశేషము.

**కాకితుమ్మికి** (ద్వ.వి.) : నల్లతుమికి, కాకతిందుకము.

**కాకిదొండ** (వై.వి.) : అడవిదొండ, కాకతుండఫల.

**కాకినేరెడు** (ద్వ.వి.) : నేలనేరెడు, కాకజంబువు.

**కాకిపెసర** (ద్వ.వి.) : పిల్లపెసర, కాకముద్గ.

**కాకిబంగారు** (ద్వ.వి.) : పీతాభ్రకము.

**కాకిబాతు** (ద్వ.వి.) : ఒక విధమైన అడవిబాతు.

**కునుకు** (దే.అ.క్రి.) : తూఁగు.

**కున్న** (వై.వి.) : కూనయొక్క రూపాంతరము.

**కున్నఁడు** (వై.వి.) : బాలుఁడు.

**కున్ననము** (సం.వి.అ.న.) : 1. గాజు చిప్ప; 2. పెద్దకుండ.

**కుపసము** (వై.వి.) : (కుప్పసము యొక్క రూపాంతరము) 1. అరచట్ట 2. నిడు చట్ట; 3. అవిక; 4. పాము యొక్క పైతోలు. (చూ. కుప్పసము.)

**కుపితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) కుత్సితము.

**కుప్ప** (దే.వి.) : ధాన్యములోనగువాని రాశి.

**కుప్పఁగూర** (దే.వి.) : కుప్పవడుట.

**కుప్పతిలు** (దే.అ.క్రి.) : కుప్పవడు.

**కుప్పనఁగూర** (దే.వి.) : కుప్పవడుట.

**కుప్పము** (దే.వి.) : 1. గ్రామము; 2. చెంబడి వారి పల్లె.

**కుప్పవడు** (ద్వ.అ.క్రి.) : (కుప్ప + పడు) కుప్పగాఁజేరు.

**కుప్పసము** (వై.వి.) : 1. అరచట్ట; 2. నిడుచట్ట; 3. అవిక; 4. పాము యొక్క పైతోలు.

**కుప్పి** (దే.వి.) : అవాకుప్పి.

**కుప్పించు** (వై.అ.క్రి.) : ఊపిరిపట్టు.

**కుప్పిగంతుకొను** (ద్వ.అ.క్రి.) : దుముకు.

**కుప్పిగంతులు** (ద్వ.వి.బ.) : బాలక్రీడా విశేషము.

**కుప్పీలు** (దేవి.బ.) : బాలికా క్రీడా విశేషము.

**కుప్పె** (వై.వి.) : 1. మెడ నిడుపుగాఁ గల కాచ పాత్ర విశేషము; 2. గొడుగు మీఁదిగుబ్బ; 3. ఇత్తడి లోనగు వానితోఁ జేసి యెద్దు కొమ్ము కొన దగిల్చెడు గుబ్బ; 4. స్త్రీ శిరోభూషా విశేషము; 5. గిండి లోనగువానిమీఁది మూఁత.

**కుప్పెంట** (దే.వి.) : హరితమంజరి.

**కుప్పెకోల** (ద్వ.వి.) : బాణవిశేషము, క్షుద్రకము.

**కుప్యము** (సం.వి.అ.న.) : వెండి బంగారుఁదక్క తక్కిన లోహము.

**కుబుసము** (దే.వి.) : తలుపునకుఁ గ్రిందుమీఁదుల నుంచెడు కూచము.

**కుబేరకము** (సం.వి.అ.పుం.) : నంది వృక్షము.

**కుబేరాక్షము** (సం.వి.అ.పుం.) : బాలక్రీడా విశేషము.

**కుబేరాక్షి** (సం.వి.ఈ.స్త్రీ.) : కలిగొట్టు.

**కుబేరుఁడు** (సం.వి.అ.పుం.) : ధనదుఁడు, పైఁడి ఱేఁడు.

**కుబ్జ** (సం.వి.ఆ.స్త్రీ.పొట్ల. అ.పుం.ము.) : 1.గజ విశేషము; 2.ఒకానొకచెట్టు. (విణ.) : మఱుగుజ్జు.

**కుబ్జిక** (సం.వి. ఆ.స్త్రీ.) : గొజ్జఁగ.

**కుమారము** (సం.వి.అ.న.) : చొక్కాపు బంగారు. (పుం.): 1.గుఱ్ఱపుపిల్ల; 2.చిలుక; 3.ఉలిమిరి.

**కుమారి** (సం.వి.ఈ.స్త్రీ.): 1.కూఁతురు; 2.పెండ్లి కాని పడుచు; 3. పార్వతి; 4.ఒకానొక యేఱు; 5.జంబూద్వీపము; 6.నల్లపిచ్చుక; 7. కలబంద; 8. చేమంతి; 9. పిన్న గోరంట (అని కొందఱు) 10. విరజాజి.

**కుమారిలు** (దే.అ.క్రి.) : కుములు.

**కుమారుఁడు** (సం.వి.అ.పుం.) : 1. కొడుకు; 2. బాలుఁడు; 3.స్కందుఁడు; 4. (నాట్యోక్తి యందు) యువరాజు.

**కుమి** (దే.వి.) : కుసూలవిశేషము.

**కుముఖము** (సం.వి.ఆ.పుం.) : పంది.

**కుముటు** (దే.అ.క్రి.) : ఓకరకై కంఠ బిలమున వికారమెత్తు. (వి.) : ఓకరకై కంఠ బిలమున నెత్తు వికారము.

**కుముద** (సం.వి.ఆ.స్త్రీ.): 1.గుమ్ముడు; 2. టేఁకు. (అ.న.ము.) : 1. ఎఱ్ఱ దామర; 2. తెల్లగలువ (పుం.) : 1. నిరృతి దిక్కునందలి యేనుఁగు; 2. ఒకా నొక పాము.

**కుముదబాంధవుఁడు** (సం.వి.అ.పుం.) : చంద్రుఁడు, కలువవిందు.

**కుముదిక** (సం.వి.ఆ.స్త్రీ.) : పిన గుమ్ముడు.

**కుముదిని** (సం.వి.ఈ.స్త్రీ.) : తెల్ల కలువతీఁగ.

**కుముదుఁడు** (సం.వి.అ.పుం.) : 1. ఒకానొక కోఁతి; 2. ఒకానొక రాక్షసుఁడు.

**కుముద్వంతము** (సం.విశే.) : (త్.ఈ. త్) తెల్లకలువలు తఱుచుగాఁ గలది. (దేశము)

**కుముద్వతి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. తెల్ల గలువతీఁగ; 2. కుశుని పెండ్లాము.

**కుములు** (దే.అ.క్రి.) : లోలోపలఁ దపించు.

**కుమ్మకు** (హిం.వి.) : సహాయము, తోఁడు.

**కుమ్మర** (వై.వి.) : కుండలుచేసి జీవించెడు జాతి. (కుమ్మరవాఁడు. కుమ్మరది.) (విశే.) : నలుపు. (కుమ్మర గువ్వ, కుమ్మరపొనిక. మొ.)

**కుమ్మరగువ్వ** (ద్వ.వి.) : పక్షి విశేషము, ఖంజరీటము.

**కుమ్మరచెట్టు** (ద్వ.వి.) : ఒకానొక చెట్టు.

**కుమ్మరత** (ద్వ.వి.) : కుమ్మరది.

**కుమ్మరపురుగు** (వై.వి.) : ఒకానొక పురుగు, యమకీటము.

**కుమ్మరపొనిక** (ద్వ.వి.) : కృష్ణ ముంజము.

**కుమ్మరపోలిక చెట్టు** (ద్వ.వి.) : ఒకానొకచెట్టు.

**కుమ్మరసారెచుక్క** (ద్వ.వి.) : విశాఖా నక్షత్రము.

**కుమ్మరి** (వై.వి.) : (కుమ్మర + ఇ) కుమ్మరవాఁడు.

**కుమ్మరించు** (దే.ప్రే.) : కుమ్మరిలఁ జేయు.

**కుమ్మరింపు** (దే.వి.) : మల్లబంధ విశేషము.

**కుమరిలు** (దే.అ.క్రి.) : 1. నీళ్లు లోనగునవి కుండలోనగు వాని యందుండిపడు; 2. రాలు.

**కుమ్మి** (దే.వి.) : కుమికి మొదటి రూపము.

**కుమ్ము** (దే.స.క్రి.) : 1.నలియఁగొట్టు; 2.పొడుచు. (వి.) : పొట్టు నిప్పు, కుకూలము.

**కుమ్ముసుద్ది** (ద్వ.వి.) : సంకేత వృత్తాంతము.

**కుమ్మె** (దే.వి.) : పోటు.

**కుమ్మెలువోవు** (దే.అ.క్రి.) : గాయమగు.

**కుయి** (దే.వి.) : 1. మొఱ; 2. రక్షణము. (కుయ్యి యొక్క రూపాంతరము)

**కుయ్యి** (దే.వి.) : 1. మొఱ; 2. రక్షణము.

**కురంగమము** (సం.వి.అ.పుం.) : హరిణము, జింక.

**కురంగము** (సం.వి.అ.పుం.) : 1.జింక; 2.కోఁతి.

**కురంటక** (సం.వి.ఆ.స్త్రీ.) : తుమ్మి. (అ.పుం. ము.) : 1.పచ్చ గోరంట. 2. పచ్చ చేమంతి. పచ్చ పువ్వులములు గోరంట, పచ్చపువ్వుల పెద్ద గోరంట. (అని కొందఱు)

**కురండము** (సం.వి.అ.పుం.) : అండ వృద్ధి, బుడ్డ.

**కురపము** (సం.వి.అ.పుం.) : గుల్భముఁ దోమెడు గొఱపము.

**కురము** (దే.వి.) : పశువులకుఁ గలిగెడు శీత రోగము.

**కురరము** (సం.వి.అ.పుం.) : ఉఁత్క్రోశము, లకుముకి పిట్ట, గోరువంక (అని కొందఱు), పెన్నడపులుఁగు (అని కొందఱు)

**కురరి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. గొఱ్ఱు; 2. ఆఁడు లకుముకి.

**కురవకము** (సం.వి.అ.పుం.) : 1. ఎఱ్ఱ గోరంట. (దీనికి దోహదక్రియ ఆలింగనము) 2. ఎఱ్ఱ చేమంతి. ఎఱ్ఱ పువ్వుల పెద్ద గోరంట, ఎఱ్ఱ పువ్వులముల గోరంట (అని కొందఱు).

**కురాళము** (దేవి.) : చప్పరము.

**కురాసాని** (దే.వి.) : ఒకానొక దేశము.

**కురిచీ** (దే.వి.) : కూర్చుండునట్టి యున్నత పీఠము.

**కురిడి** (దే.వి.) : లోపలి నీరింకిన కొబ్బెర.

**కురిమిడి** (దే.వి.) : మడిచుట్టువేసినకట్ట, గనిమ.

**కురియు** (దే.స.క్రి.) : వర్షించు. (అం. ప్రే.) : కురియించు.

**కురుంబము** (సం.వి.అ.పుం.) : సమూహము, గుంపు.

**కురుఁజు** (దే.వి.) : 1. దూలముమీఁది గుజ్జు; 2. మంచె.

**కురుజీ** (దే.వి.) : చిన్నకంట్లము.

**కురుజు** (దే.వి.) : 1.జున్ను; 2.శ్యేన విశేషము 3.బాణపుసంచువగ. 4.ఈఁకలు రాల్చిన పక్షి.

**కురుప** (దే.వి.) : గొఱ్ఱె త్రుప్పుట కంబళి నేయు గొల్ల.

**కురుపగొఱ్ఱె** (ద్వ.వి.) : దేహమునందు నిడుపు బొచ్చు గల గొఱ్ఱె.

**కురుమ** (దే.వి.) : గొఱ్ఱెబొచ్చుతో కంబళి నేయు గొల్లజాతి (కురుమవాఁడు)

**కురుబిస్తము** (సం.వి.అ.పుం.) : బంగారము యొక్క పలము. (రూ. కురువిస్తము)

**కురులు** (వై.వి.) : 1. ముంగురులు; 2. వెంట్రుక.

**కురువ** (దే.వి.) : కొండమీఁది కాలిత్రోవ.

**కురువిందము** (సం.వి.అ.పుం.) : 1. మాణిక్య విశేషము (ఇది కాలపురము నందు పుట్టినది, పసుపుదాళు కలది, మధ్యమ జాతిరత్నము) (చూ. మాణిక్యము) 2.అద్దము; 3. ఇంగిలికము; 4. నిడుముస్తె; 5. వ్రీహి విశేషము.

**కురువు** (సం.వి.ఉ.న.) : ఒక వర్షము (చూ. వర్షము.) (పుం.) : 1. ఒకానొక రాజు; 2. ఒకానొక దేశము; 3. అన్నము.

**కురువేరు** (ద్వ.వి.) : (కురులు + వేరు) ఒకానొక వేరు, హ్రీబేరము.

**కురుళము** (సం.వి.అ.పుం.) : ముంగురులు. వైజయంతీనిఘంటువు.

**కుర్కురము** (సం.వి.అ.న.) : గండివనము. (పుం.) కుక్క

**కుర్దనము** (సం.వి.అ.న.) : క్రీడ (రూ. కూర్దనము)

**కుర్పరము** (సం.వి.అ.పుం.) : కూర్పరము, మోఁచెయి.

**కుర్వాణుఁడు** (సం.వి.అ.పుం.) : పనివాఁడు. (విణ.) : చేయువాఁడు.

**కుఱంగలి** (దే.వి.) : సమీపము.

**కుఱకుఱ** (దే.విణ.) : అల్పము.

**కుఱునువ్వులు** (దే.వి.బ.) : తిలవిశేషము.

**కుఱు** (దే.విణ.) : వృత్తియందుఁ గుఱుచ శబ్దమునకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. (ఉదా. కుఱుగద్దియ, కుఱుగనుపు, కుఱుగతి, కుఱుగేలు, కుఱుమాపు, మొ. అచ్చు పరమగుచో అకారమునకు టకార ద్వయమాదేశంబగు. కుట్టారుగ, కుట్టుముక, కుట్టుసుఱు, కుట్టాపిరి, కుట్టూరుపు, మొ.)

**కుఱుకు** (దే.వి.) : ప్రోవు, రాశి.

**కుఱుగడ** (ద్వ.వి.) : (కుఱుచ+గడ) దండము.

**కుఱుచ** (దే.వి.) : 1.హ్రస్వస్వరము; 2.నాట్య విశేషము. (విణ.) : హ్రస్వము. (కొన్ని యెడల వృత్తి యందంత్యవర్ణ లోపము. చూ. కుఱు.)

**కుఱుచపడు** (ద్వ.అ.క్రి.) : తగ్గు.

**కుఱుపు** (దే.వి.) : వ్రణము.

**కుఱుమట్టము** (దే.విణ.) : వినతము, వినమ్రము.

**కుఱుమాడు** (దే.వి.) : ఇంటిమూలకప్పు.

**కుఱువు** (దే.వి.) : తొడ, ఉత్సంగము.

**కుఱ్ఱ** (దే.వి.) : 1. కోడెయెనుపోతు; 2. కొడుకు; 3 బాలుడు, 4. బిడ్డఁడు.

**కుఱ్ఱఁడు** (దే.వి.) : 1. కొడుకు; 2. బాలుఁడు; 3. బిడ్డడు.

**కుఱ్ఱి** (దే.వి.) : పాఁడియావు, ధేనువు.

**కుఱ్ఱు** (దే.అ.క్రి.) : కూయు.

**కులకము** (సం.వి.అ.న.) : 1. ఒక క్రియతో ముగిసెడు పద్యముల సమూహము; 2. చేఁదు పొట్ల (పుం.) : 1. కాకి తుమ్మిక; 2. పుట్ట.

**కులకుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) కుల శ్రేష్ఠుఁడు.

**కులట** (సం.వి.ఆ.స్త్రీ.) : అసతి, అంకుటాలు.

**కులపర్వతము** (సం.వి.అ.పుం.) : ప్రధాన పర్వతము.

**కులపాలిక** (సం.వి.ఆ.స్త్రీ.) : తల్లిదండ్రులచే నిచ్చి పెండ్లిచేయఁబడిన స్త్రీ.

**కులము** (సం.వి.అ.న.) : 1.వంశము; 2.తెగ; 3.ఇల్లు; 4.ఊరు; 5.శరీరము; 6.చేఁదుపొట్ల.

**కులసంభవుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) మంచివంశము నందుఁ బుట్టిన వాఁడు.

**కులస్త్రీ** (సం.వి.ఈ.స్త్రీ.) : కులపాలిక.

**కులాయము** (సం.వి.అ.పుం.) : 1. పక్షి గూఁడు; 2. చోటు.

**కులాలము** (సం.వి.అ.పుం.) : పక్షి విశేషము, గంపపులుఁగు.

**కుళాయి** (హిం.వి.) : తలమీఁదనుంచు టోపి.

**కులాలి** (సం.వి.ఈ.స్త్రీ.) : కనుపాల విత్తులు.

**కులాలుఁడు** (సం.వి.అ.పుం.) : కుమ్మరవాఁడు.

**కులి** (సం.వి.ఈ.స్త్రీ.) : వాఁకుడు. (ఇ.పుం.) : చేయి.

**కులికము** (సం.వి.అ.పుం.) : 1. ఒకానొక చెట్టు; 2. ఒకానొకపాము.

**కులికుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) కులశ్రేష్ఠుఁడు.

**కులిశము** (సం.వి.అ.పుం,న.) : వజ్రాయుధము. (పుం.) : మత్స్య విశేషము.

**కులీనుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) మంచి కులమునఁ బుట్టినవాఁడు.

**కులుకము** (సం.వి.అ.న.) : నాలుక ముఱికి.

**కులుకు** (దే.అ.క్రి.) : శృంగారముగ కుదులు. (స.క్రి.) : 1. పూయు; 2. పోయు; 3. వెదచల్లు; 4. వేయు. (వి.) : 1. శృంగారపు కుదిలిక; (కులుకు లాఁడి మొ.) 2. వణకుట.

**కులుకులాఁడి** (దే.వి.) : (కులుకులు + ఆఁడి) కులుకుగల స్త్రీ.

**కులుప** (దే.వి.) : శోఫ.

**కుల్మాషము** (సం.వి.అ.న.) : పులియఁబెట్టిన కడుగునీరు. (కుల్మాషాభిషుత మని యేక పదముగాఁ గొందఱు.) (పుం.) : 1.గుగ్గిళ్లు; 2. గోధుమ విశేషము, యవ విశేషము. (అని కొందఱు.)

**కుల్య** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. కాలువ; 2. నీళ్లు పోయెడు త్రోవి; 3.తిప్పతీఁగ. (అ.న.ము.) : 1. ఎముక; 2. తొలిచిన కొండదొన; 3. మాంసము; 4. మాన విశేషము. (విణ.) : 1. మంచి కులమునఁ బుట్టినది; 2. కులమునకు హితమైనది.

**కుల్యుఁడు** (సం.వి.అ.పుం.) : గౌరవింపఁదగిన మనుష్యుఁడు

**కువ** (దే.వి.) : కువ్వ యొక్క రూపాంతరము.

**కువలము** (సం.వి.అ.న.) : 1. కలువ; 2. ముత్యము; 3. రేఁగుబందు త్రి. రేఁగు.

**కువలయము** (సం.వి.అ.న.) : ఉత్పలము, కలువ.

**కువలాయికము** (సం.వి.అ.పుం.) : హంసజాతి విశేషము.

**కువాడము** (వై.వి.) : కువ్వాడము యొక్క రూపాంతరము.

**కువాదుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) పరుల దోషమును పలుకువాఁడు. నికృష్టపు మాటలాడు వాఁడు. (అని కొందఱు.)

**కువాళము** (యు.దే.వి.) : వాహనము లోనగువాని గవుసెన. (ఈ యర్థము నందిది కునాడము యొక్క రూపాంతరము.)

**కువిందుఁడు** (సం.వి.అ.పుం.) : తంతు వాయుఁడు, సాలెవాఁడు.

**కువేణి** (సం.వి.ఈ.స్త్రీ.) : చేఁపలఁబట్టి వేయు బుట్ట.

**కువేలము** (సం.వి.అ.న.) : కువలము, కలువ.

**కువ్వ** (దే.వి.) : కుప్ప, రాశి.

**కువ్వాడము** (వై.వి.) : కపటము.

**కుశ** (సం.వి.ఆ.స్త్రీ.) : త్రాడు. (అ.న. ము.) : నీళ్ళు (పుం,న.) : దర్భ (పుం.) : 1. ఒక ద్వీపము; 2. పలుపు.

**కుశలము** (సం.వి.అ.న.) : 1.క్షేమము; 2.తృప్తి; 3. పుణ్యము విణ. నేర్పరి.

**కుశాలు** (హిం.వి.) : సంతోషము.

**కుశి** (సం.వి.ఈ.స్త్రీ.) : కఱ్ఱు. ఇనుముతోఁ జేసిన వస్తువు. (అని కొందఱు.)

**కుశికము** (సం.వి.అ.పుం.) : అయోవికారము.

**కుశికుఁడు** (సం.వి.అ.పుం.) : విశ్వామిత్రుని తండ్రి.

**కుశీలవుఁడు** (సం.వి.అ.పుం.) : 1. నానా దేశ సంచారకుఁడైన నట్టువుఁడు; 2. నానాదేశ సంచారకుఁడైన బట్టువాఁడు; 3. వాల్మీకి.

**కుశుఁడు** (సం.వి.అ.పుం.) : రాముని పెద్ద కొడుకు. (విణ.) : 1. పాపము చేసినవాఁడు; 2. మదించినవాఁడు.

**కుశేశయము** (సం.వి.అ.న.) : పద్మము, తామర.

**కుషీ, ఖుషీ** (హిం.వి.) : సంతోషము.

**కుష్ఠము** (సం.వి.అ.న.) : 1. వ్యాధి విశేషము, పులుము; 2. చెంగల్వ కోష్టు. (పుం.) : విష భేదము.

**కుసి** (దే.వి.) : గండి యందుఁ జొప్పించు టకుఁ గాను సన్నఁగాఁజెక్కిన మంచపు పట్టె లోనగు వాని చివర.

**కుసిగుంపులు** (దే.వి.బ.) : శ్రమము, బాధ.

**కుసిలించు** (దే.అ.క్రి.) : అతృప్తిచే దుఃఖించు.

**కుసిలింత** (దే.వి.) : అతృప్తిచే దుఃఖించుట.

**కుసిని** (అన్య.దే.వి.) : వంటయిల్లు.

**కుసీదము** (సం.వి.అ.న.) : వడ్డికిచ్చి జీవనము చేయుట. (విణ.డు.) : వడ్డి కిచ్చి జీవనము చేయువాఁడు.

**కుసీదికుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) వడ్డికిచ్చి జీవనము చేయించువాఁడు.

**కుసుంభము** (సం.వి.అ.న.) : 1. కుసుమ పువ్వు; 2. బంగారు (పుం.) : కమండలువు.

**కుసుంభరాగము** (సం.వి.అ.పుం.) : బయటికి మాత్రము విశేషముగాఁ గనఁబడి లోపల బొత్తిగాలేని అనురాగము. (చూ. పూర్వరాగము)

**కుసుమ** (యు.దే.వి.) : 1. ఒకానొక చెట్టు; 2. సస్యవిశేషము. (బ.) : ధాన్య విశేషము. (వై.వి.) : 1. కుసుంభ పుష్పము 2. కుసుంభ వర్ణము.

**కుసుమము** (ఉభ.వై.వి.) : కుసుంభ వర్ణము. 1. పువ్వు; 2. కంటి తెవులు; 3. స్త్రీ రజస్సు; 4. పండు.

**కుసుమ** (దే.వి.) : పుండునందలి మొలక.

**కుసుమాంజనము** (సం.వి.అ.న.) : పుష్పాంజనము.

**కుసుమేషువు** (సం.వి.ఉ.పుం.) : మన్మథుఁడు, మరుఁడు.

**కుసులు** (దే.అ.క్రి.) : కుసిలించు.

**కుసూలము** (సం.వి.అ.పుం.) : ధాన్యముంచెడు గరిసె.

**కుసృతి** (సం.వి.ఈ.స్త్రీ.) : నికృతి, కుత్సితభావము.

**కుస్తరించు** (దే.స.క్రి.) : 1. ఊఱడించు; 2. సమాధానపఱచు; 3. సవరించు; 4. చఱచు.

**కుస్తుంబరి** (సం.వి.ఈ.స్త్రీ.) : ధాన్యాకము, కొత్తిమిరి.

**కుస్తుంబురువు** (సం.వి.ఉ.న.) : ధాన్యాకము, కొత్తిమిరి.

**కుస్తుభుఁడు** (సం.వి.అ.పుం.) : విష్ణువు, సముద్రుఁడు. (అని కొందఱు.)

**కుహకము** (సం.వి.అ.పుం.) : వంచన, మోసము.

**కుహణుఁడు** (సం.వి.అ.పుం.) : జారుఁడు, అంకుమగఁడు.

**కుహన** (సం.వి.ఆ.స్త్రీ.) : అర్థాపేక్ష చేతనగు కపట చర్య. (అ.పుం.ము.) : 1. ఎలుక; 2. పాము. (విణ.) : ఈర్ష్య గలది.

**కుహరము** (సం.వి.అ.న.) : 1. గుహ; 2. బెజ్జము (పుం.) ఒకానొక పాము.

**కుహళ** (సం.వి.ఆ.స్త్రీ.) : కాళె.

**కుహళి** (సం.వి.ఈ.స్త్రీ.) : పోఁకపొత్తి (చూ. పొత్తి మూడవ యర్థము)

**కుహాళ** (సం.వి.ఆ.స్త్రీ.) : కుహళ యొక్క రూపాంతరము.

**కుహువు** (సం.వి.ఊ.స్త్రీ.) : 1. చంద్రకళ కానరాని యమావాస్య; 2. కోకిల ధ్వని.

**కుహేళిక** (సం.వి.ఆ.స్త్రీ.) : ధూమిక, మూడమంచు.

**కుళాయ** (వై.వి.) : కుళ్లాయ యొక్క రూపాంతరము.

**కుళింగము** (సం.వి.అ.పుం.) : అడవి పిచ్చుక.

**కుళీరము** (సం.వి.అ.పుం.) : కర్కటకము, ఎండ్రకాయ.

**కుళుత్థము** (సం.వి.అ.పుం.) : ఉలవలు.

**కుళుత్థిక** (సం.వి.ఆ.స్త్రీ.) : కనుపాల విత్తులు.

**కుళుపు** (దే.వి.) : ఉంగరమునకుఁ బొదిగెడు విశాలమగుమణి విశేషము.

**కుళ్లా** (వై.వి.) : కుళ్లాయ యొక్క రూపాంతరము.

**కుళ్లాయ** (వై.వి.) : పటరచితమకుటము.

**కుళ్లు** (దే.అ.క్రి.) : క్రుళ్లు యొక్క రూపాంతరము.

**కుళ్లుపోతు** (దే.విణ.) : క్రుళ్లు పోతు యొక్క రూపాంతరము.

# కూ

**కూ** (దే.అవ్య.) : పిలువఁగా పామరజను లెచ్చరించుకొనుట యందు వచ్చును.

**కూఁక** (దే.వి.) : అఱపు.

**కూఁకటి** (వై.వి.) : 1. జుట్టు; 2. పిల్ల జుట్టు.

**కూఁకటి కువ్వే** (ద్వ.వి.) : పక్షివిశేషము.

**కూఁకటిమూఁగ** (ద్వ.వి.) : పక్షి విశేషము, కళింగము.

**కూఁకరించు** (దే.అ.క్రి.) : కూఁకలు వేయు.

**కూఁత** (దే.వి.) : కూయుట.

**కూఁతకైదువు** (దే.వి.) : శంఖము.

**కూఁతనేల** (దే.వి.) : కోసునేల, క్రోశము.

**కూఁతపట్టు** (దే.వి.) : కోసునేల, క్రోశము.

**కూఁతవేటు** (దే.వి.) : కోసునేల, క్రోశము.

**కూఁతురు** (దే.వి.) : కొమార్త, పుత్రిక.

**కూఁతురుబుడమ** (దే.వి.) : ఏలా వాలుకము.

**కూకీ** (దే.వి.) : పారావత విశేషము. (కొందఱు హ్రస్వాంతము గాను వ్రాసియున్నారు.)

**కూకు** (దే.వి.) : పాలవిఱుగుడు, ఆమిక్ష.

**కూకుదుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) వరుని సత్కరించి యలంకృతురాలగు కూఁతునిచ్చు వాఁడు.

**కూకురుగుండఁగి** (దే.వి.) : పక్షి విశేషము, దాత్యూహము.

**కూచి** (దే.విణ.) : 1. (యుద్ధయాత్రకు సైనికులు హెచ్చరిక పడుటకై) యుద్ధ వాద్యములను వాయించుట; 2. వాఁడి.

**కూచిమారుఁడు** (సం.వి.అ.పుం.) : పురుష జాతులు నాల్గింటిలో నొక జాతివాఁడు.

**కూచేము** (దే.వి.) : 1. గూటము; 2. స్తంభము.

**కూజా** (హిం.వి.) : పాత్ర విశేషము.

**కూటకము** (సం.వి.అ.న.) : ఏఁడికోల లేని నాఁగలి, గొడగ. (పుం.) : వెంద్రుకల కొప్పు.

**కూటమి** (దే.వి.) : 1. కూడిక; 2. సురతము.

**కూటము** (ఉభ. దే.వి.) : 1. కొలువు కూటము 2. చావడి. (సం.వి.అ. పుం.న.) : 1. అమ్ము; 2. ఆకాశము లోనగునది; 3. కపటము; 4. కఱ్ఱు; 5. కొండకొమ్ము; 6. గవను; 7. గారడము; 8.దుఃఖము; 9. ప్రోగు; 10. బొంకు; 11. బోను; 12. సంపెట. (పుం.): 1. ఇల్లు; 2.విఱిగిన కొమ్ముగల యెద్దు.

**కుటశాల్మలి** (సం.వి.ఇ.స్త్రీ.) : కొండబూరుగు.

**కూటస్థము** (సం.విణ.): (అ.ఆ.అ.) ఎల్లకాలము నొక్క రూపయి యుండె నది. (ఆకాశాదికము)

**కూటాగారము** (సం.వి.అ.న.) : మేడ మీఁది యిల్లు.

**కూటాము** (దే.వి.) : కూటము యొక్క రూపాం తరము.

**కూటినీళ్లు** (దే.వి.బ.) : పుల్లనీళ్లు, ఆరవాళము.

**కూటిముత్యము** (ద్వ.వి.) : మనుష్యులచేఁ జేయఁ బడునట్టి ఒక దినుసు ముత్యము.

**కూటు** (దే.వి.) : ధాన్యముంచుటకు వెంటితో నేర్పఱచెడు గరిసె.

**కూటుఁడు** (సం.వి.అ.పుం.) : ఱాయి తొలుచు వాఁడు, కాసీఁడు.

**కూటువ** (దే.వి.) : 1. గుంపు; 2. ప్రోగు.

**కూటువమూఁక** (దే.వి.) : ప్రోత్సాహపఱచి యక్క డక్కడ వెదకి తెచ్చిన పిఱికిబలము.

**కూటువు** (దే.వి.) : 1. గుంపు; 2. ప్రోగు (చూ. కూటువ)

**కూడ** (దే.ద్ర.) : సహితమనునర్థమును దెలుపునది.

**కూడఁబడు** (ద్వ.అ.క్రి.) : (కూడన్+పడు) చేరు. (స్వార్థమున పడు.)

**కూడఁబెట్టు** (దే.స.క్రి.) : (కూడన్ + పెట్టు) 1. చేర్చు; 2. తార్చు.

**కూడముట్టు** (దే.స.క్రి.) : తఱుము కొనిపోవు.

**కూడలి** (దే.వి.) : రెంటిమూటి కూడిక. (కూడలి త్రోవ)

**కూడలిఱాయి** (దే.వి.) : ఎల్లఱాయి.

**కూడలివాయి** (ద్వ.వి.) : రెండు పంచలు చేరెడు మూల నేర్పఱచిన నీటిదారి.

**కూడిక** (దే.వి.) : చేరిక, సంయోగము.

**కూడు** (దే.అ.క్రి.) : తగు. (స.క్రి.) : పొందు. (అం,ప్రే.) : కూర్చు. (లెక్కఁగూడు, సుతిఁ గూడు.) (వి.) : అన్నము.

**కూడుదల** (దే.వి.) : లాభము.

**కూణి** (సం.విణ.ఇ.) : కుణి యొక్క రూపాంతరము.

**కూన** (వై.వి.) : 1. పిల్ల; 2. బిడ్డ.

**కూనగుంత** (వై.వి.) : మీట మొదలు ఆనెడు పల్లము.

**కూని, ఖూని** (హిం.వి.) : నరహత్య.

**కూపకము** (సం.వి.అ.పుం.) : 1. ఓడకంబము; 2.పిఱిఁదిమీఁదిగుంత; 3.చెలమ; 4. చేతిసిద్దె.

**కూపము** (సం.వి.అ.పుం.) : 1.నుయ్యి; 2.చెలమ; 3.ఓడకంబము; 4. పిఱిఁది మీఁది గుంత.

**కూపారము** (సం.వి.అ.పుం.) : సముద్రము.

**కూపి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. కుప్పె; 2. గాజుకుప్పె.

**కూపెట్టు** (దే.అ.క్రి.) : (కూయి+పెట్టు) 1. అఱచు; 2. మొఱయిడు.

**కూబరము** (సం.వి.అ.పుం.) : బండినొగ. (విణ.) మనోజ్ఞము.

**కూయు** (దే.వి.) : 1.మొఱ; 2.రక్షణము.

**కూయు** (దే.అ.క్రి.) : 1. అఱచు; 2. మొఱపెట్టు.

**కూర** (వై.వి.) : 1. వ్యంజనము; 2. తోఁటకూర, వంకాయ లోనగునది.

**కూరట** (దే.వి.) : పొరలుట.

**కూరపసుపు** (దే.వి.) : కూరలలో చేర్చెడు పసుపు.

**కూరము** (సం.వి.అ.న.) : అన్నము, వంటకము.

**కూరాడు** (దే.వి.) : కాఁచిన కలి.

**కూరిచి** (దే.అవ్య.) : ఉద్దేశార్థమునందు ద్వితీయా విభక్తితో చేరి వచ్చునది. (రామునిఁ గూరిచి, సోమునిఁ గూరిచి) (రూ. కూర్చి)

**కూరిమి** (దే.వి.) : చెలిమి, స్నేహము (రూ.) కూర్మి.

**కూరు** (దే.అ.క్రి.) : 1. కలుగు; 2. దుస్సి పోవు; 3. (స.క్రి.) పొందు.

**కూరుకు** (దే.అ.క్రి.) : నిద్రించు. (వి.) : నిద్ర. (రూ. కూర్కు)

**కూరుకొను** (దే.అ.క్రి.) : చొచ్చు. (అం.ప్రే.) : చొప్పించు, క్రుక్కు. (రూ. కూర్కొను, చొచ్చుటకు.

**కూరుచే** (దే.అ.క్రి.) : ప్రియపడు. (ప్రే.) కూడఁ బెట్టు. (రూ. కూర్చు. ప్రియ పడుటకు.)

**కూరుచేండు** (దే.అ.క్రి.) : (కూరిచి + ఉండు) ఆసీనుఁడగు.

**కూరుపరి** (దే.విణ.) : (కూరుపు + అరి) కూర్చునట్టివాఁడు, ఘటకుఁడు, (రూ.) కూర్పరి.

**కూరుపు** (దే.వి.) : ఘటన, (రూ.) కూర్పు.

**కూర్చము** (సం.వి.అ,పుం,న) : 1. దర్భ పిడికిలి; 2. కనుబొమల నడుము; 3. పెరిగిన మీస గడ్డములు; 4. మెచ్చు; 5. మోసము.

**కూర్చశీర్షము** (సం.వి. అ.పుం.) : జీవకమనెడి గంధ ద్రవ్యము.

**కూర్చిక** (సం.వి.అ.స్త్రీ.) : 1.కుంచెకోల; 2.జున్ను (ఇది ద్వివిధము : దధికూర్చిక, తక్రకూర్చిక) 3.చిత్రమువ్రాసెడు తూలిక; 4.మొగ్గ; 5. సూది.

**కూర్చేండఁబడు** (ద్వ.అ.క్రి.) : (కూర్చుండన్ + పడు) కూర్చుండు.

**కూర్పరము** (సం.వి.అ.పుం.) : 1. మోఁచెయి; 2. మోఁకాలు.

**కూర్పాసకము** (సం.వి.అ.పుం.న.) : 1. అరచట్ట; 2. అవిక.

**కూర్మము** (సం.వి.అ.పుం.) : 1.తాఁబేలు; 2.ఒక యుప వాయువు. (చూ. వాయువు)

**కూలంకష** (సం.వి.ఆ.స్త్రీ.) : ఏఱు. (అ.పుం.ము.) సముద్రము.

**కూలఁబడు** (ద్వ.అ.క్రి.) : (కూలన్+పడు) కూలు, పడు. (స్వార్థమున పడు.)

**కూలము** (సం.వి.అ.న.) : 1. దరి; 2. గుంట; 3. మట్టిలోనగువాని దిబ్బ; 4. మూఁకవెనుక.

**కూలి** (దే.వి.) : 1.పనిచేసినదానికిఁగా నిచ్చెడు ధనము; 2. పన్ను

**కూలు** (దే.అ.క్రి.) : 1. పడు; (చూ. కూలుచు) 2. చచ్చు.

**కూలుచు** (దే.ప్రే.) : 1. పడఁజేయు; 2. చంపు (రూ. కూల్చు) పడఁ జేయుటకు.

**కూష్మాండము** (సం.వి.అ.పుం.) : 1. గుమ్మడి; 2. పిశాచభేదము; 3. భ్రూణ విశేషము. (రూ. కూశ్మాండము)

**కూసము** (వై.వి.) : కుప్పసము యొక్క రూపాంతరము.

**కూళ** (వై.విణ.) : 1. క్రూరుఁడు; 2. కుత్సితుఁడు. (చూ. కూళుఁడు)

**కూళుఁడు** (వై.విణ.) : 1. కుత్సితుఁడు; 2. మూఢుఁడు.



**కృకణము** (సం.వి.అ.పుం.) : పక్షివిశేషము, కక్కెర.

**కృకము** (సం.వి.అ.పుం.) : కంఠనాళము, బొండుగు.

**కృకరము** (సం.వి.అ.పుం.) : 1. ఒక యుపవాయువు; (చూ. వాయువు) 2. కక్కెర.

**కృకలాసము** (సం.వి.అ.పుం.) : 1. ఊసరవెల్లి; 2. తొండ.

**కృకవాకువు** (సం.వి.ఉ.పుం.) : 1. కోడి; 2. మయిలచాయ తొండ; 3. నెమలి.

**కృకాటిక** (సం.వి.ఆ.స్త్రీ.) : పెడతల, పెడతల యందలి ముల్చిలిగుంట. (అని కొందఱు.)

**కృచ్ఛ్రము** (సం.వి.అ.న.) : 1. పాపము; 2. బాధ; 3. సాంతపనాది వ్రతము.

**కృతకము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మనుష్యులచే జేయఁబడినది, కృత్రిమము.

**కృతకర్ముఁడు** (సం.విణ.) : (న్.ఈ.న్) నేర్పరి.

**కృతకాద్రి** (సం.వి.ఇ.పుం.) : క్రీడించుట కొఱకు నేర్పఱుపఁబడిన పర్వతము, చేంత గట్టు.

**కృతకృత్యుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) కృతార్థుఁడు.

**కృతఘ్నుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) చేసిన మేలు మఱచినవాఁడు.

**కృతజ్ఞము** (సం.వి.అ.పుం.) : శ్వానము, కుక్క.

**కృతజ్ఞుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) చేసిన మేలు తలచువాఁడు.

**కృతపడు** (మి.అ.క్రి.) : (కృతము + పడు) కడచు.

**కృతపుంఖుఁడు** (సం.విణ.) : (అ.ఆ. అ.) గుఱి తప్పక యేయువాఁడు, కృతహస్తుఁడు.

**కృతమాలకము** (సం.వి.అ.పుం.) : నల్లగూబ.

**కృతమాలము** (సం.వి.అ.పుం.) : ఱేల.

**కృతము** (సం.వి.అ.న.) : 1. ఒక యుగము. (క్రి.విణ.) : పెల్లు. (విణ.) : చేయఁబడినది. 2. నొప్పింపఁ బడినది.

**కృతముఖుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) నేర్పరి.

**కృతలక్షణుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) గుణములచేతఁ బ్రసిద్ధిఁ జెందిన వాఁడు.

**కృతసాపత్నిక** (సం.వి.ఆ.స్త్రీ.) : అధ్యూఢ, మొదటి పెండ్లాము.

**కృతహస్తుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. గుఱి తప్పక యేయువాఁడు; 2. నేర్పరి.

**కృతాంతము** (సం.వి.అ.పుం.) : 1. అశుభ కర్మము; 2. భాగ్యము; 3. సిద్ధాంతము.

**కృతాంతుఁడు** (సం. వి. అ. పుం.) : యముఁడు, జముఁడు.

**కృతార్థుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) నెఱవేఱిన పని గలవాఁడు, ధన్యుఁడు.

**కృతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1.చేయుట; 2. ప్రబంధము; 3.ఒక ఛందస్సు; (చూ. ఛందస్సు) 4. నొప్పించుట. (న్.పుం.) : చదువరి. (విణ.) : 1.నెఱవేఱిన పని గలవాఁడు; 2. నేర్పరి.

**కృతుఁడు** (సం.వి.అ.పుం.) : కడుపు కూటివాఁడు.

**కృత్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఛేదింపఁబడినది.

**కృత్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. తోలు; 2. ఒకానొక దేవత; 3. చెట్టు పై పట్ట. 4. బుజపత్తి.

**కృత్తిక** (సం.వి.ఆ.స్త్రీ.) : ఒక నక్షత్రము. (చూ. నక్షత్రము)

**కృత్తివాసుఁడు** (సం.వి.న్.పుం.) : శివుఁడు, ముక్కంటి.

**కృత్య** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. చేయుట; 2. ఒకానొక దేవత. (అ.న.ము.) : పని. (విణ.) : ధనాదులచే ఛేదింపఁదగినది. (శత్రుగృహాది)

**కృత్రిమధూపకము** (సం.వి.అ.పుం.) : అనేక పరిమళ వస్తువులు కూర్చి చేసిన ధూపము.

**కృత్రిమము** (సం.వి.అ.న.) : ఉప్పు దినుసు. (పుం.) : చిల్ల. మడ్డి. (విణ.) : మనుష్యులచేఁ జేయఁబడినది.

**కృత్స్నము** (సం.వి.అ.న.) : 1.కడుపు; 2.నీళ్లు (విణ.) : అంతయు.

**కృప** (సం.వి.ఆ.స్త్రీ.) : దయ, కనికరము.

**కృపణము** (సం.వి.అ.పుం.) : పురుగు.

**కృపణుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. లోభి; 2. కుత్సితుఁడు.

**కృపాణము** (సం.వి.అ.పుం.) : కరవాలము, కత్తి.

**కృపాణి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. కత్తి; 2. కత్తెర.

**కృపాళువు** (సం.విణ.ఉ.) : కనికరము గలవాఁడు.

**కృపీటము** (సం.వి.అ.న.) : 1.కడుపు; 2.నీళ్లు

**కృపీటయోని** (సం.వి.ఇ.పుం.) : అగ్ని, నిప్పు.

**కృపుఁడు** (సం.వి.అ.పుం.) : ద్రోణుని మఱఁది.

**కృమి** (సం.వి.ఇ.పుం.) : 1. పురుగు; 2. చెట్టు మీఁది నల్లపురుగు; 3. లక్క.

**కృశము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1.బక్క; 2. సన్నము.

**కృశానువు** (సం.వి.ఉ.పుం.) : అగ్ని, నిప్పు.

**కృశానురేతసుఁడు** (సం.వి.స్.పుం.) : శివుఁడు.

**కృశాశ్వి** (సం.వి.న్.పుం.) : నటుఁడు, నట్టువుఁడు.

**కృశించు** (సం.అ.క్రి.) : 1. బక్కటిల్లు; 2. సన్నగిల్లు.

**కృషకము** (సం.వి.అ.పుం.) : కఱ్ఱు, (రూ.) కృషికము.

**కృషాణుఁడు** (సం.వి.అ.పుం.) : సేద్యకాఁడు.

**కృషి** (సం.వి.ఇ.స్త్రీ.) : సేద్యము, కరిసనము.

**కృషికుఁడు** (సం.వి.అ.పుం.) : సేద్యకాఁడు, (రూ.) కృషకుఁడు.

**కృషీవలుఁడు** (సం.వి.అ.పుం.) : సేద్యకాఁడు, (రూ.) కృషకుఁడు.

**కృష్టము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. ఒకసారి దున్నఁబడినది; (నేల) 2. ఈడువఁ బడినది.

**కృష్టి** (సం.వి.ఇ.స్త్రీ.) : దుక్కి (పుం.) : చదువరి.

**కృష్ణ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.ఒకానొక యేఱు; 2. ద్రౌపది; 3. ద్రాక్ష; 4. నీలి; 5. పిప్పలి. (అ.న.ము.) : 1. ఇనుము; 2. మిరియము. (పుం.) : 1. నలుపు; 2. కాకి; 3. కోకిలము; 4. దున్న; 5. కృష్ణ పక్షము; 6. నల్లని కడుపుగల మంద పిచ్చుక. విణ. నల్లనిది.

**కృష్ణకర్ముఁడు** (సం.విణ.) : (న్.ఈ.న్) దురాచారుఁడు.

**కృష్ణపాకఫలము** (సం.వి. అ.పుం.) : కలివె.

**కృష్ణపాకి** (సం.వి.ఈ.స్త్రీ.) : నల్ల గురిగింజ.

**కృష్ణఫల** (సం.వి.ఆ.స్త్రీ.) : కారుగచ్చ.

**కృష్ణభేది** (సం.వి.ఈ.స్త్రీ.) : కటుకరోహిణి.

**కృష్ణల** (సం.వి.ఆ.స్త్రీ.) : గురిజ.

**కృష్ణలోహితము** (సం.వి.అ.పుం.) : నలుపు మించఁ గలసిన యెఱుపు. (విణ.) : నలుపు మించఁ గలసిన యెఱుపు గలది.

**కృష్ణవర్త** (సం. వి. న్. పుం.) : 1. అగ్ని; 2. దురాచారుఁడు; 3. రాహువు.

**కృష్ణవల్లి** (సం.వి.ఈ.స్త్రీ.) : కమ్మెరాకు తీఁగ, నల్లతీఁగ.

**కృష్ణవృంత** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. కలి గొట్టు ; 2. కారు మినుము.

**కృష్ణసారకము** (సం.వి.అ.పుం.) : నల్లవెదురు.

**కృష్ణసారము** (సం.వి.అ.పుం.) : 1. నల్ల యిట్టి; 2. ఇరుగుడు ; 3. జెముడు. (రూ. కృష్ణశారము)

**కృష్ణిక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. తవిఁదలు; 2. నల్లావలు; 3. నల్లపిచ్చుక.

**కృష్ణుడు** (సం. వి. అ. పుం.) : 1. విష్ణువు; 2. అర్జునుఁడు; 3. వ్యాసుఁడు.

**కృసరము** (సం.వి.అ.న.) : 1. పులగము; 2. శ్రాద్ధమున నిమంత్రితులకు అభ్యంజన కాలమందు కలిపి యిచ్చెడు నువ్వులు, బెల్లము.

**క్లుప్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఏర్పాటు చేయఁబడినది.

**క్లుప్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : ఏర్పాటు.

## కె

**కె** (దే.విణ.) : వృత్తియందు కెంపు శబ్దము నకు మీఁది వర్ణములు లోపింపఁగా మిగిలిన రూపము. (దీనికి పరుష సరళములు పరుమగు నపుడు నుమాగమమును తదితరములు పరమగు నపుడు మీఁదిదానికి ద్విత్వమును వచ్చును. కెంగేలు, కెంజడ, కెంజాయ, కెంజిగి, కెంజిగురు, కెందలిరు, కెంద ళుకు, కెందామర, కెందొవ, కెంబట్టు, కెంబువ్వు, కెంబెదవి, కెన్నురువు, కెమ్మొక్క, కెమ్మోవి.మొ.)

**కెందమ్మి** (ద్వ.వి.) : (కెంపు+తమ్మి) ఎఱ్ఱదామర.

**కెంపు** (దే.వి.) : 1. పద్మరాగమణి; 2. ఎఱుపు. (విణ.) : ఎఱ్ఱనిది.

**కెంపుకంటి** (దే.వి.) : (కెంపు+కన్ను) కోయిల.

**కెంపుగాము** (ద్వ.వి.) : గ్రహ విశేషము, అంగారకుఁడు.

**కెంపుసవతు** (ద్వ.వి.) : నక్షత్ర విశేషము, స్వాతి.

**కెడ** (దే.వి.) : పార్శ్వము.

**కెడపు** (దే.ప్రే.) : 1. పడఁజేయు; 2. త్రోయు; 3. చంపు.

**కెడయిక** (దే.వి.) : 1. పడుట; 2. చావు.

**కెడయు** (దే.అ.క్రి.) : 1. పడు; 2. చచ్చు.

**కెడవు** (దే.వి.) : పాటు, పతనము.

**కెరకొట్టు** (దే.అ.క్రి.) : (కెరలు+కొట్టు) కలకలకూయు.

**కెరలియాడు** (దే.అ.క్రి.) : (కెరలి + ఆడు) చెలరేఁగు.

**కెరలు** (దే.అ.క్రి.) : 1.అతిశయించు; 2. ఆగ్ర హించు; 3. కూయు; 4. విజృంభించు; 5. సంభ్రమించు

**కెరలుచే** (దే.ప్రే.) : కెరలఁజేయు.

**కెరలువొడుచే** (దే.అ.క్రి. ): (కెరలు + పొడుచు) 1. వర్ధిల్లు; 2. విజృంభించు.

**కెలఁకు** (దే.స.క్రి.) : 1. కలపెట్టు; 2. పెల్లగించు. (వి.) : 1. దిక్కు; 2. పార్శ్వము.

**కెలను** (దే.వి.) : 1. దిక్కు 2. పార్శ్వము (రూ.) కెలఁకు.

**కెలయు** (దే.అ.క్రి.) : విజృంభించు.

**కెలవు** (దే.వి.) : అనురాగము.

**కెలసము** (దే.వి.) : అక్కఱ, పని.

**కెల్లగించే** (దే.స.క్రి.) : 1. పెల్లగించు; 2. రేఁచు.

**కెళకుళి** (వై.వి.) : కేళాకూళి యొక్క రూపాం తరము.

**కెళవు** (దే.వి.) : దూరము.

**కెళాకుళి** (వై.వి.) : కేళాకుళి యొక్క రూపాం తరము.

**కెళాకూళి** (వై.వి.) : కేళాకుళి యొక్క రూపాం తరము.

## కే

**కే** (దే.వి.) : ధ్వన్యనుకరణము.

**కేక** (ఉభ.దే.వి.) : పెద్దకూఁత. (సం.ఆ.స్త్రీ.) : నెమలికూఁత.

**కేకయము** (సం.వి.అ.పుం.) : ఒకానొకదేశము.

**కేకరము** (సం.వి.అ.పుం.) : 1. కడుకన్ను; 2. మెల్లకన్ను.

**కేకరించు** (ఉభ.దే.అ.క్రి.) : 1. కేకలు వేయు; 2. సకిలించునట్లు శబ్దించు. (సం. స.క్రి.) : కటాక్షించు.

**కేకరింత** (దే.వి.) : 1. కేకలు వేయుట; 2. గొంతదుపు తీఱుటకు సకిలించునట్లు శబ్దించుట.

**కేకరుఁడు** (సం.విణ.) : (అ.ఈ.అ.) మెల్లకంటి వాఁడు.

**కేకి** (సం.వి.న్.పుం.) : మయూరము, నెమలి.

**కేకిసలు** (దే.వి.బ.) : 1. చప్పట్లు; 2. అంజలులు.

**కేటత్రాడు** (దే.వి.) : యమపాశము.

**కేటియించు, ఖేటాయించు** (గ్రా.క్రి.) : వేఱు పఱచు.

**కేడ** (దే.విణ.) : ధూర్తుఁడు.

**కేడించు** (దే.అ.క్రి.స.క్రి.) : క్రేడించు యొక్క రూపాంతరము.

**కేడెము** (వై.వి.) : డాలువాలు, ఖేటకము.

**కేతకి** (సం.వి.ఈ.స్త్రీ.) : పూమొగలి, గేదఁగి.

**కేతనము** (సం.వి.అ.న.) : 1. టెక్కెము; 2. గుఱుతు; 3. ఇల్లు; 4. నియంత్రణము.

**కేతుమాలము** (సం.వి.అ.న.) : ఒక వర్షము. (చూ.వర్షము)

**కేతువు** (సం.వి.ఉ.పుం.) : 1. ఒక గ్రహము (చూ. గ్రహము) 2. టెక్కెము; 3. గుఱుతు; 4. అగ్ని; 5. కాంతి; 6. ధూమకేతువు.

**కేదరము** (సం.వి.అ.పుం.) : కేదారము యొక్క రూపాంతరము.

**కేదారము** (సం.వి.అ.పుం.న.) : వరిమిడి. (పుం.) : 1. కొండ; 2. పాదు; 3. ఒకానొక పుణ్యక్షేత్రము.

**కేదారుఁడు** (సం.వి.అ.పుం.) : శివుఁడు, ముక్కంటి.

**కేనిపాతకము** (సం.వి.అ.పుం.) : (చూ.) అరిత్రము.

**కేమము** (సం.వి.అ.న.) : పులిపిరికాయ.

**కేయూరము** (సం.వి.అ.న.) : అంగదము, బాహుపురి.

**కేరజము** (వై.వి.) : ఒకానొకపక్షి. (దీని నొకానొక యాధునిక కవి కేర్జమని ప్రయోగించినాఁడు.)

**కేరడము** (దే.వి.) : 1.ఉపేక్ష; 2. తిరస్కారము; 3. తిరస్కారపు మాట; 4. వంకర మాట.

**కేరడించే** (దే.స.క్రి.) : వక్రముచేయు.

**కేరళము** (సం.వి.అ.పుం.) : ఒకానొక దేశము.

**కేరించు** (దే.అ.క్రి.) : విజృంభించు.

**కేరు** (దే.అ.క్రి.) : 1. ఉత్సహించు; 2. విజృంభించు. (స.క్రి.) : 1.తిరస్కరించు; 2. పరిహసించు.

**కేరుపు** (దే.వి.) : విజృంభణము.

**కేలు** (వై.వి.ఏ.) : 1. చేయి; 2. తొండము.

**కేలుమొగ్గ** (వై.వి.) : చేమోడ్పు, అంజలి బంధము.

**కేవడము** (వై.వి.) : కేడెము యొక్క రూపాంతరము.

**కేవరి** (దే.వి.) :(కేవు+అరి) కేవు పుచ్చుకొనువాఁడు.

**కేవలము** (సం.వి.అ.న. ) : నిర్ణయింపఁబడినది. (విణ.) : 1. అంత; 2. ఒకటి.

**కేవలుఁడు** (సం.వి.అ.పుం.) : పరమాత్మ.

**కేవు** (దే.వి.) : ఓడకిచ్చెడు కూలి.

**కేశకారము** (సం.వి. అ.పుం.) : కరఫలము, గొఱపము.

**కేశఘ్నము** (సం.వి.అ.న.) : బట్టతల.

**కేశపాశి** (సం.వి.ఈ.స్త్రీ.) : చూడ, సిగ.

**కేశము** (సం.వి.అ.పుం.) : 1. వెండ్రుక; 2. కురువేరు.

**కేశముష్టి** (సం.వి.ఇ.పుం.) : తేనెమ్రాను.

**కేశవము** (సం.వి.అ.పుం.) : పొన్న.

**కేశవుఁడు** (సం.వి.అ.పుం.) : విష్ణువు. (విణ.): మంచి వెండ్రుకలు కలవాఁడు.

**కేశవేశము** (సం.వి.అ.పుం.) : కబరి, కొప్పు.

**కేశాంబునామము** (సం.వి.అ.న.) : కురువేరు.

**కేశి** (సం.వి.న్.పుం.) : ఒకానొక రాక్ష సుఁడు. (విణ.) : మంచి వెండ్రుకలు కలవాఁడు.

**కేశిని** (సం.వి.ఈ.స్త్రీ.) : 1.కట్లతీఁగ; 2.పద్మపు తీఁగ. (విణ.) : మంచి వెండ్రుకలు గలది. (ఆఁడుది)

**కేశుఁడు** (సం.వి.) : వరుణుఁడు.

**కేసరము** (సం.వి.అ.న.) : ఇంగువ. (పుం,న.) : అకరువు. (పుం.) : 1. సింహము లోనగువాని మెడ మీఁది వెండ్రుక, జూలు; 2. నాగకేసరము; 3. పొగడ; 4. పొన్న.

**కేసరి** (ఉభ.వై.వి.) : 1. ఒకానొక మృగము; 2. ఒక దినుసువరిపైరు. (బ.ఆ.) : ధాన్యము. (సం.విన్.) : (పుం.) : 1. సింహము; 2. గుఱ్ఱము; 3. నాగకేసరము; 4. పొన్న.

**కేళకుళి** (వై.వి.) : కేళాకుళి యొక్క రూపాంతరము.

**కేళకూళి** (వై.వి.) : కేళాకుళి యొక్క రూపాం తరము.

**కేళాకూళి** (వై.వి.) : క్రీడాసరస్సు.

**కేళి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1.పురుషులు స్నేహమున స్త్రీలులోనగు వారిని గద్దించుట కొట్టుట పరిహసించుట మొదలుగాఁ గలది; 2.ఆట; 3. ప్రియుని తోడి విహారము నందలి నాయిక యొక్క క్రీడ.

**కేళిక** (వై.వి.) : నృత్యము.

**కేళికీలుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) నవ్వించు వాడు.



**కై** (దే.అప.) : చతుర్థీ విభక్తి యందు వచ్చెడు ఒక ప్రత్యయము. (వి.) : 1. చేయి. 2. తొండము. (కయి యొక్క రూపాంతరము.)

**కైంకర్యము** (సం.వి.అ.న.) : 1. ఊడిగము; 2. భగవంతునికిని భగవద్భక్తులకును జేసెడి యూడిగము.

**కైక** (వై.వి.) : కైకేయి. (కయిక యొక్క రూపాం తరము.)

**కైకట్టు** (ద్వ.వి.) : సందర్భము. (కయికట్టు యొక్క రూపాంతరము)

**కైకానుక** (దే.వి.) : రాజులు లోనగువారిని జూడఁ బోవునపుడు కొనిపోయెడి యుపహారము. (కయి కానుక యొక్క రూపాంతరము.)

**కైకేయి** (సం.వి.ఈ.స్త్రీ.) : కేకయరాజు కూఁతురు.

**కైకొను** (దే.అ.క్రి.పూను.స.క్రి.) : 1. గ్రహించు; 2.లక్ష్యపెట్టు.(కయికొను యొక్క రూపాంతరము)

**కైకొలుపు** (దే.ప్రే.) : కైకొనఁజేయు. (కయి కొలుపు యొక్క రూపాంతరము.)

**కైకోల** (దే.వి.) : గుడ్డలు నేసి బ్రదికెడు ఒకానొక జాతి. (కైకోలవాఁడు, కోలది). (కయికోల యొక్క రూపాంతరము)

**కైకోలు** (దే.వి.) : 1.అంగీకారము; 2.గ్రహణము. (కయికోలు యొక్క రూపాంతరము)

**కైచేఁపులు** (ద్వ.వి.బ.) : నమస్కృతి. (కయి చాఁపులు యొక్క రూపాంతరము)

**కైజా** (దే.వి.) : వాగెను వెనుకకీడ్చి కట్టుట. (కయిజా యొక్క రూపాంతరము)

**కైజీతము** (ద్వ.వి.) : బత్తెము. (కయిజీతము యొక్క రూపాంతరము)

**కైజాఱు** (దే.అ.క్రి.) : ఒఱగు. (కయి జాఱు యొక్క రూపాంతరము.

**కైజు** (దే.వి.) : పక్షి విశేషము. (కయిజు యొక్క రూపాంతరము)

**కైటభారి** (సం.వి.ఇ.పుం.) : హరి, వెన్నుఁడు.

**కైడర్యము** (సం.వి.అ.పుం.) : 1. కటివేము; 2. పిన గుమ్ముడు.

**కైత** (వై.వి.) : కవిత్వము. (కయిత యొక్క రూపాంతరము)

**కైతవము** (సం.వి.) : 1. కపటము; 2. జూదము.

**కైదండ** (దే.వి.) : హస్తావలంబము. (కయిదండ యొక్క రూపాంతరము)

**కైదారకము** (సం.వి.అ.న.) : కేదారముల సమూహము. (కేదారము = వరిమడి)

**కైదారికము** (సం.వి.అ.న.) : కేదారముల సమూహము. (కేదారము = వరిమడి)

**కైదార్యము** (సం.వి.అ.న.) : కేదారముల సమూహము. (కేదారము = వరిమడి)

**కైదు** (దే.వి.) : కైజు యొక్క రూపాంతరము. (మొదటి రూపము కయిదు.)

**కైదువు** (దే.వి.) : ఆయుధము. (ఆధునిక కవులు దీనిని అకారాంతముగాఁ బ్రయోగించెదరు.) (కయిదువు యొక్క రూపాంతరము)

**కైపదము** (వై.వి.) : కవి పరిజ్ఞాన పరీక్షార్థము పూరింపనిచ్చెడి పద్యాంశము, సమస్య. (కయి పదము యొక్క రూపాంతరము.)

**కైపు** (దే.వి.) : 1. లాహిరి; (ఈ రూపము వాడుకయందుఁ గనఁబడు చున్నది. చూ. కైపు.) 2. అందము; 3. విజృంభణము; 4. విధము. (కయిపు యొక్క రూపాంతరము)

**కైఫీయతు** (హిం.వి.) : ఒక సంగతి వివరము.

**కైముడి** (ద్వ.వి.) : వాద్యవిశేషము. (కయిముడి యొక్క రూపాంతరము)

**కైమోడుపు** (ద్వ.వి.) : నమస్కృతి. (కయి మోడుపు యొక్క రూపాంతరము)

**కైరఁడు** (దే.వి.) : ఈ పేరుగల గుల్మము. (కయిరఁడు యొక్క రూపాంతరము.)

**కైరవడి** (వై.వి.) : తాంబూలముతోఁగూడ నుపయోగించు కొనుటకుఁగాఁచు లోనగు వస్తువులు చేర్చి చేసిన యుండ, ఖాదిరము. (కయిరపడి యొక్క రూపాంతరము.)

**కైరవము** (సం.వి.అ.న.) : తెల్లగలువ.

**కైరవిణి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. తెల్ల గలువల సమూహము; 2. తెల్లగలువలుండు కొలను.

**కైరవుఁడు** (సం.వి.అ.పుం.) : 1. జూదరి; 2. పగవాఁడు.

**కైలాగు** (దే.వి.) : కైదండ. (కయిలాగు యొక్క రూపాంతరము)

**కైలాటకాఁడు** (దే.విణ.) : (కైలాటము + కాఁడు) మాయోపాయము గలవాడు. (కయి లాటకాఁడు యొక్క రూపాంతరము)

**కైలాటము** (దే.వి.) : మాయోపాయము. (కయిలాటము యొక్క రూపాంతరము)

**కైలాసము** (సం.వి.అ.పుం.) : కుబేరుని యునికి పట్టు, వెండి కొండ.

**కైలు** (హిం.వి.) : పండిన ధాన్యపు కొలఁత.

**కైవడి** (దే.వి.) : 1. ప్రకారము 2. పోలిక. (కయివడి యొక్క రూపాంతరము)

**కైవడిముస్తె** (వై.వి.) : తుంగముస్తె. (కయివడి ముస్తె యొక్క రూపాంతరము)

**కైవర్తము** (సం.వి.అ.న.) : కైవడిముస్తె.

**కైవర్తి** (సం.వి.ఈ.స్త్రీ.) : కైవడిముస్తె.

**కైవర్తుఁడు** (సం.వి.అ.పుం.) : చేఁపలఁబట్టు వాఁడు, జాలరి.

**కైవల్యము** (సం.వి.అ.న.) : అపవర్గము, మోక్షము.

**కైవారము** (ఉభ. దే.వి.) : గనిమ యంచు. (వై.) స్తోత్రము. (చూ. కయివారము) (సం.అ.న.) : వంది స్తోత్రము.

**కైవారి** (సం.వి.న్.పుం.) : వంది.

**కైవు** (దే.వి.) : (క్రైపు యొక్క రూపాంతరము) ఉన్మాదము. (మొదటి రూపము కయివు.)

**కైవ్రాలు** (దే.అ.క్రి.) : 1.ఒఅగు; 2. పక్షులు లోనగునవి క్రిందికి దిగు; 3. పడు. (కయివాలు యొక్క రూపాంతరము)

**కైవ్రాలుచే** (దే.ప్రే.) : కైవ్రాలఁజేయు. (కయి వ్రాలుచు యొక్క రూపాంతరము)

**కైశికము** (సం.వి.అ.న.) : వెంట్రుకల సమూహము.

**కైశికి** (సం.వి.ఈ.స్త్రీ.) : ఒక కావ్యవృత్తి. (చూ. వృత్తి)

**కైశోరము** (సం.వి.అ.న.) : వయో విశేషము.

**కైశ్యము** (సం.వి.అ.న.) : కైశికము.

**కైసాటిచేుక్క** (ద్వ.వి.) : హస్తనక్షత్రము. (కయిసాటి చుక్క యొక్క రూపాంతరము)

**కైసేఁత** (ద్వ.వి.) : అలంకారము. (కయిసేఁత యొక్క రూపాంతరము)

**కైసేయు** (ద్వ.స.క్రి.) : 1. అలంకరించు; 2. పూజించు. (కయిసేయు యొక్క రూపాంతరము)

## కొ

**కొంగనక్క** (ద్వ.వి.) : చిన్నజాతి నక్క, కిఖి.

**కొంకర** (దే.వి.) : వంపు. (అక్షరములు వంకర కొంకరగా ఉన్నవి.)

**కొంకరలువోవు** (దే.అ.క్రి.) : (కొంకరలు + పోవు) శైత్యాదులచేతఁ గాళ్లుఁ చేతులు లోనగునవి నిగిడికొను.

**కొంకి** (దే.వి.) : 1. వంపుచీల; 2. దోఁటి; 3. బ.ముచ్చిలి గుంతకుఁ బార్శ్వముల నుండెడి యెముకలు; 4. మోఁకాలి చిప్పకు లోతట్టు

రెండు ప్రక్కల నుండెడి యెముకలు. (కొంకి వ్రేళ్లనుచోఁ గొంకివలె నుండు వ్రేళ్లని తెలియ వలెను.)

**కొంకు** (దే.అ.క్రి.) : 1. భయపడు; 2. వెను దీయు 3.సంకోచించు. (వి.) : 1. భయము; 2. వెనుదీయుట; 3. సంకోచము.

**కొంకుపాటు** (ద్వ.వి.) : 1. భయుపడుట; 2. సంకోచపడుట.

**కొంకువోవు** (దే.అ.క్రి.) : (కొంకు + పోవు) కొంకరలువోవు.

**కొంగ** (వై.వి.) : బకము.

**కొంగకాళ్లవాఁడు** (ద్వ.విశే.) : నిడుపు మోఁకాళ్ల వాఁడు, ఊర్ధ్వజ్ఞువు.

**కొంగవాలు** (వై.వి.) : మాదిగకత్తి.

**కొంగు** (దే.వి.) : వస్త్రపు చెఱఁగు.

**కొంగుమాయు** (దే.అ.క్రి.) : బహిష్ఠయగు.

**కొంగోడువడు** (ద్వ.అ.క్రి.) : (కొంగోడు + పడు) ఒడ్డిగిల్లు. ఒఱగు.

**కొంగోడువోవు** (దే.అ.క్రి.) : (కొంగోడు + పోవు) ఒడ్డిగిల్లు, ఒఱగు. (చూ. కుక్కివడు)

**కొంచించే** (దే.అ.క్రి.) : సంకోచించు.

**కొంచియము** (వై.వి.) : న్యూనత (చూ. కొంచెము) (విశే.) : అల్పము.

**కొంచెకత్తె** (వై.విశే.) : (కొంచెము + కత్తె) 1. అల్పురాలు; 2. సామాన్యురాలు.

**కొంచెకాడు** (ద్వ.విశే.) : (కొంచెము + కాఁడు) 1. అల్పుఁడు; 2. సామాన్యుఁడు.

**కొంచెతనము** (వై.వి.) : (కొంచెము + తనము) సన్నఁదనము, అల్పభావము.

**కొంచెపడు** (వై.అ.క్రి.) : (కొంచెము + పడు) 1. తక్కువపడు; 2. సన్నగిల్లు.

**కొంచెము** (వై.వి.) : న్యూనత. (కొంచి యము యొక్క రూపాంతరము)

**కొంచ** (వై.వి.) : 1. ఒకానొక కొండ; 2. ఒకానొక పక్షి.

**కొంచదీవి** (వై.వి.) : క్రౌంచ ద్వీపము.

**కొంచమల** (వై.వి.) : క్రౌంచపర్వతము.

**కొంచమొగ్గరము** (ద్వ.వి.) : క్రౌంచ వ్యూహము.

**కొంచసారము** (వై.వి.) : మధ్యమ స్వరము.

**కొంచు** (యు.దే.వి.) : ముతికి చెమట.

**కొంజే** (వై.అ.క్రి.) : సంకోచించు. (కొంచు యొక్క రూపాంతరము)

**కొంట** (దే.వి.) : కొనుట. (అను ప్రయుక్త మైన కొను ధాతువునకును రూపమిట్లెఅంగునది. కనుఁగొంట, కయికొంట, పయికొంట, మొ.)

**కొంటె** (దే.విశే.) : అకార్యశీలుఁడు.

**కొండ** (వై.వి.) : మల, పర్వతము.

**కొండకంది** (ద్వ.వి.) : సస్య విశేషము. (బ.) : ఆఢాన్యము.

**కొండకాకి** (వై.వి.) : ఒక దినుసు కాకి, అద్రికాకము.

**కొండకాలువ** (వై.వి.) : సెలయేఱు, ఝరము.

**కొండగుఱుతు** (ద్వ.వి.) : సామాన్య లక్షణము.

**కొండగొనుగు** (ద్వ.వి.) : అక్షోటము.

**కొండగొఱ్ఱె** (వై.వి.) : గాడిదెవంటి మృగ విశేషము, రౌహిషము.

**కొండగోఁగు** (ద్వ.వి.) : కర్ణికారము.

**కొండచిలువ** (ద్వ.వి.) : కొండ పాము, అజగరము.

**కొండచీమ** (ద్వ.వి.) : ఒక దినుసు చీమ, ఉద్దీపకము.

**కొండచూలి** (ద్వ.వి.) : పార్వతి. (ఇట్లు కొండరాచూలి.)

**కొండజొన్న** (వై.వి.) : సస్య విశేషము. (బ.) : ఆఢాన్యము.

**కొండతంగేడు** (ద్వ.వి.) : ఒక దినుసు తంగేడు.

**కొండత్రిమ్మరి** (ద్వ.వి.) : కోఁతి. (ఇట్లు తిప్ప త్రిమ్మరి, మలత్రిమ్మరి, మొ.)

**కొండనాలుక** (ద్వ.వి.) : చిఱునాలుక, గళ శుండిక.

**కొండపగతుఁడు** (ద్వ.వి.) : ఇంద్రుఁడు, గోత్రారి.

**కొండపలుకు** (ద్వ.వి.) : పర్వతబిలము నందలి ప్రతిధ్వని.

**కొండపిండి** (వై.వి.) : వృక్ష విశేషము.

**కొండప్రత్తి** (వై.వి.) : ఒక దినుసు ప్రత్తి.

**కొండబూరుగు** (ద్వ.వి.) : కూటశాల్మలి.

**కొండబెండ** (ద్వ.వి.) : కచ్చూరకము.

**కొండమల్లె** (వై.వి.) : గిరిమల్లిక.

**కొండమామిడి** (ద్వ.వి.) : కోశామ్రము.

**కొండమారేడు** (ద్వ.వి.) : గంధగర్భము.

**కొండము** (వై.వి.) : గుండము.

**కొండముచ్చు** (ద్వ.వి.) : నల్లనిమూతి గల కోఁతి.

**కొండముసువ** (ద్వ.వి. ) : నల్లనిమూతిగల కోఁతి.

**కొండయల్లుఁడు** (ద్వ.వి.) : (కొండ + అల్లుఁడు) ముక్కంటి శివుడు.

**కొండఱేఁడు** (ద్వ.వి.) : హిమవంతుడు.

**కొండల్లము** (వై.వి.) : (కొండ+అల్లము) ఒక దినుసు అల్లము, తృణపుష్పిక.

**కొండవారు** (ద్వ.వి.బ.) : కొండ యందుండు బోయలు.

**కొండాటము** (దే.వి.) : సంతోషము.

**కొండారు** (దే.స.క్రి.) : పొగడు, స్తుతించు.

**కొండి** (దే.వి.) : 1. తేలు తోఁక; 2. ఔక్క తలుపు నంచుల యందుఁ గొట్టెడు తేలు తోఁక వంటి యినుప గొళ్లెము.

**కొండిక** (వై.విశ.) : 1. చిన్న; 2. బాలుఁడు.

**కొండియ** (దే.వి.) : కొండె.

**కొండియము** (దే.వి.) : కొండెము.

**కొండియుఁడు** (దే.విశ.) : కొండెము చెప్పు వాఁడు, పిశునుఁడు.

**కొండీఁడు** (దే.విశ.) : (కొండియము + ఈఁడు) కొండెము చెప్పువాఁడు, పిశునుఁడు.

**కొండె** (దే.వి.) : రాజులలోనగువారు మొగము తట్టువేసికొనెడు వెంద్రుకల ముడి. (కొండియ యొక్క రూపాంతరము.)

**కొండెంగ** (వై.వి.) : కొండయందుండెడు నల్లకోఁతి.

**కొండెకత్తె** (ద్వ.విశ.) : (కొండెము + కత్తె) కొండెము చెప్పునది. (ఆఁడుది.)

**కొండకాఁడు** (దే.విశ.) : (కొండెము + కాఁడు) కొండెము చెప్పెడువాఁడు.

**కొండెము** (దే.వి.) : చాడి. (కొండియము యొక్క రూపాంతరము)

**కొండెవల** (దే.వి.) : చేఁపలఁబట్టుటకు ఒకఁడు వేసెడు వల.

**కొండొక** (వై.విశ.) : 1. కొంచెము; (కొండొక సేపు.) 2. చిన్న.

**కొండ్ర** (దే.వి.) : మళ్లించిదున్నినచాలు.

**కొండ్రకైదువు** (దే.వి.) : నాఁగలి.

**కొంత** (వై.స.) : (కొంచెము + అంత) ఇంచుక కొలఁది. (చూ. ఇంత)

**కొంతము** (వై.వి.) : ఆయుధ విశేషము, కుంతము.

**కొందఱు** (వై.స.) : (కొంత + వారు) కొంద శబ్దమునకు మహన్మహత్యర్థక బహువచన రూపము.

**కొందలపడు** (ద్వ.అ.క్రి.) : (కొందలము + పడు) కలఁతపడు, సంక్షోభించు.

**కొందలపాటు** (ద్వ.వి.) : కొందల పడుట.

**కొందలము** (దే.వి.) : కలఁత, క్షోభము.

**కొందలించు** (దే.అ.క్రి.) : కలఁతపడు.

**కొందు** (దే.స.క్రి.) : నజ్జుగనఱకు.

**కొంప** (దే.వి.) : ఇల్లు. (నింద మొదలగు సమయముల యందే యిది ప్రయోగింపఁ బడును.)

**కొంపోవు** (దే.స.క్రి.) : (కొని + పోవు) తీసికొని పోవు.

**కొక్కరాయి** (వై.వి.) : బకము.

**కొక్కరించే** (దే.అ.క్రి.) : (కోఁతి) వెక్కిరించు.

**కొక్కరింత** (దే.వి.) : కొక్కరించుట.

**కొక్కిస** (దే.వి.) : మల్లబంధ విశేషము.

**కొక్కు** (దే.వి.) : పందికొక్కు.

**కొక్కురవుతు** (ద్వ.వి.) : వినాయకుఁడు.

**కొక్కెర** (వై.వి.) : బకము.

**కొక్కెస** (దే.వి.) : ఒకానొక చెట్టు.

**కొక్కొరొకో** (దే.వి.) : కొక్కొరోకో యొక్క రూపాంతరము.

**కొక్కొరోకో** (దే.వి.) : కొక్కొరోకో యొక్క రూపాంతరము.

**కొజ్జా** (దే.వి.) : రాణివాసపు కావలివాఁడు.

**కొటారము** (దే.వి.) : ధాన్యాది రాసులుండెడు చోటు.

**కొటారి** (దే.వి.) : ఉగ్రాణపువాఁడు.

**కొటారు** (దే.వి.) : 1. ధాన్యాదిరాసులుండెడి చోటు; 2. ఉప్పుకొఠారు.

**కొటిక** (వై.వి.) : కొట్టిక, గ్రామము.

**కొటికాఁడు** (దే.వి.) : కొట్టికాఁడు యొక్క రూపాంతరము.

**కొట్టకొన** (దే.వి.) : (కొన+కొన) అన్నిటికిఁగొన.

**కొట్టడి** (వై.వి.) : సామాగ్రులుంచెడు గది, కోష్ఠము.

**కొట్టము** (యు.దే.వి.) : నృత్య విశేషము. పసులు లోనగువానిఁ గట్టెడు చోటు.

**కొట్టరువు** (దే.వి.) : కొటారు యొక్క రూపాంతరము.

**కొట్లాడు** (దే.అ.క్రి.) : (కొట్టు + ఆడు) 1. జగడమాడు; 2. బాధపడు.

**కొట్టాము** (యు.దే.వి.) : ఒకానొక దేశము. (వై.) : పసులు లోనగు వానిఁ గట్టెడు చోటు. (ఈ యర్థమునందిది కొట్టము యొక్క రూపాంతరము)

**కొట్టి** (దే.వి.) : వేగు, (కోటి యొక్క రూపాంతరము. చూ. కొట్టికాఁడు)

**కొట్టిక** (వై.వి.) : కొటిక యొక్క రూపాంతరము.

**కొట్టికాఁడు** (దే.వి.) : వేగరి. (పాఠాంతరము కోటికాఁడు.)

**కొట్టు** (యు.దే.స.క్రి.) : ప్రహరించు. (వి.) : ప్రహరము. (వై.) : సామగ్రులుంచెడు గది.

**కొట్టుపడు** (ద్వ.అ.క్రి.) : వ్యయమగు.

**కొట్టులాడు** (దే.అ.క్రి.) : (కొట్టులు + ఆడు) పోట్లాడు.

**కొట్టులాట** (దే.వి.) : కొట్టులాడుట.

**కొట్టె** (దే.వి.) : మట్టి మొఱల యంతటి దళము గల కాఁగు.

**కొట్నము** (దే.వి.) : 1. వడ్ల దంపకము; 2. వివాహతంత్ర విశేషము; 3. ఊడిగము.

**కొట్ర** (దే.వి.) : 1. పిండిలోనగువాని నుదుకఁ బెట్టుటకుఁ బెట్టెడి యెసరు.

**కొట్లమారి** (దే.విణ.) : (కొట్లు+మారి) కొట్లుపడు స్వభావము గలవాఁడు.

**కొట్లాట** (దే.వి.) : కొట్టులాట యొక్క రూపాంతరము.

**కొడమ** (దే.వి.) : ముఖభాగమునఁ గట్టులేక నడుమ వలవలె నల్లిక గల యూఁతవంటి యొక మత్స్య గ్రహణ సాధన విశేషము. (చూ. అడ్డకొడమ)

**కొడవలి** (దే.వి.) : కోసెడు సాధనము, లవిత్రము.

**కొడి** (వై.వి.) : దీపశిఖ.

**కొడిది** (దే.వి.) : ఒకానొక చెట్టు.

**కొడిదిలి** (దే.వి.) : 1. వంచిన చేర; 2. పుడిసిలి.

**కొడిమె** (దే.వి.) : 1. అపదూఱు; 2. పాపము; 3. చేఁపలబుట్ట.

**కొడిమెలాఁడు** (దే.విణ.) : (కొడిమెలు + ఆఁడు) పాపాత్ముఁడు.

**కొడిసె** (వై.వి.) : కొండమల్లె. కుటజము. (దీనికాయ ఇంద్రయవము)

**కొడిసెపాల** (దే.వి.) : కొడిసెవిత్తు.

**కొడుఁగురు** (దే.వి.) : దీపముయొక్క చిట్టెము.

**కొడుకఁడు** (వై.వి.) : పుత్రుఁడు.

**కొడుకు** (వై.వి.) : కొడుకు, పుత్రుఁడు.

**కొడుపు** (దే.వి.) : 1. గంటలోనగు వాని వాయించెడు సన్నకొయ్య. కోణము; 2. బలపము లోనగు వానికోపు; 3. తంతి మీటుటకు బంగారు లోనగువానితోఁ జేసి వ్రేలికి వేసికొనెడు గోరు; 4. వెదురు కనుపుల నడిమి భాగము.

**కొడుము** (దే.వి.) : బిందెవంటి కుండ.

**కొడ్కు** (వై.వి.) : కొడుకు యొక్క రూపాంతరము.

**కొఁడి** (దే.వి.) : కొడిదిి యొక్క రూపాంతరము.

**కొఁణజ** (దే.వి.) : వాకిటి కావలియిల్లు.

**కొఁణత** (దే.వి.) : 1. కుక్కను గట్టెడు కొయ్య; 2. మల్లపరికర విశేషము.

**కొఁణిఁగె** (ఏ.వి.) : కుప్ప. దిబ్బ.

**కొఁణిగ** (దే.వి.) : మంజూరు.

**కొఁణిద** (దే.వి.) : జాతిభేదము.

**కొఁణిదిలి** (దే.వి.) : కొడిదిలి యొక్క రూపాంతరము.

**కొఁణుఁగురు** (దే.వి.) : కొడుఁగురు యొక్క రూపాంతరము.

**కొఁణుజు** (దే.వి.) : పిడుఁజు.

**కొతిమిరి** (వై.వి.) : కొత్తిమిరి యొక్క రూపాంతరము.

**కొతుకు** (దే.అ.క్రి.) : 1. వర్ణలోపముగా మాటాడు; 2. సంకోచించు. (వి.) : 1. వర్ణ లోపము గల మాట; 2. సంకోచము.

**కొతుకుపడు** (ద్వ.అ.క్రి.) : 1. (మాట) లుప్త వర్ణమగు; 2. సంకుచితమగు.

**కొత్తిమిరి** (వై.వి.) : దనియాలపైరు. (బ.) : దనియాలు.

**కొత్తెము** (దే.వి.) : తాటిపండ్ల యందు విత్తులేని కండ.

**కొత్వాలు** (హిం.వి.) : పోలీసు అధికారి.

**కొద** (దే.వి.) : కొదవ యొక్క రూపాంతరము.

**కొదమ** (దే.వి.) : 1. పశుపక్ష్యాదుల పిల్ల, (సింగపుఁ గొదమ, అంచకొదమ, తేఁటి కొదమ. మొ.) 2. ఆఁడుమేఁక పిల్ల. (విణ.) : 1.యౌవనము తల చూపినది; (పశుపక్ష్యాదికము) (కొదమ పెంటి, కొదమ తుమ్మెద.మొ.) 2. ధృడము. (కొదమ పిడుగు. మొ.)

**కొదరు** (దే.అ.క్రి.) : 1. అతిశయించు; 2. చెదరు; 3. రేఁగు.

**కొదవ** (దే.వి.) : కొఱఁత.

**కొదుక** (దే.విణ.) : తక్కువ.

**కొదుకు** (దే.అ.క్రి.) : కొతుకు యొక్క రూపాంతరము.

**కొదుపు** (దే.స.క్రి.) : ఏదేని నోటవేసికొని మ్రింగక ఊరక నమలు.

**కొద్ది** (దే.వి.) : కొలఁది యొక్క మాఱు రూపము.

**కొన** (వై.వి.) : 1. చివర; 2. చెట్టుకొమ్మ చివర.

**కొనకొను** (ద్వ.అ.క్రి.) : యత్నించు.

**కొనటి** (వై.విణ.) : అంగహీనుఁడు.

**కొనరిక్క** (వై.వి.) : రేవతీ నక్షత్రము.

**కొనలిడు** (ద్వ.అ.క్రి.) : (కొనలు + ఇడు) వర్ధిల్లు.

**కొనలొత్తు** (ద్వ.అ.క్రి.) : (కొనలు + ఒత్తు) వర్ధిల్లు.

**కొనసాగు** (ద్వ.అ.క్రి.) : 1. వర్ధిల్లు; 2. సిద్ధించు.

**కొని** (ద్వ.స.ఏ.) : కొన్ని యొక్క రూపాంతరము.

**కొనిపోవు** (దే.స.క్రి.) : తీసికొనిపోవు.

**కొనియాట** (దే.వి.) : (కొనియాడుట) 1. నుతించుట; 2. ఆదరించుట; 3. కాపాడుట; 4. కొలుచుట.

**కొనియాడు** (దే.స.క్రి.) : (కొని + ఆడు) 1. నుతించు; 2. ఆదరించు; 3. కాపాడు.

**కొనివచ్చు** (దే.స.క్రి.) : తెచ్చు.

**కొను** (దే.అ.క్రి.) : 1. నాటు; 2. సరిపడు (స.క్రి.) : 1. అపహరించు; 2. వెలకుఁ దీయు; 3. గ్రహించు; 4. తీసికొను 5. పట్టుకొను; 6. పరిగ్రహించు; 7. లక్ష్య పెట్టు; 8. వ్రేయు.

**కొనుగోలు** (దే.వి.) : 1. క్రయము; 2. నట్టువుఁడు కొలిపించుట.

**కొనుజు** (దే.వి.) : పిడుఁజు.

**కొనుబడి** (దే.వి.) : కొనుగోలు, క్రయము.

**కొనుమొదలు** (దే.వి.) : కొనుటకిచ్చిన ధనము.

**కొన్నాళ్లు** (ద్వ.వి.బ.) : (కొన్ని+నాళ్లు) కొన్ని దినములు.

**కొన్ని** (ద్వ.స.ఏ.) : (కొంత శబ్దమునకు అమహదర్థక బహువచనాదేశము.) కొంత సంఖ్యగలవి. (చూ. ఇన్ని.)

**కొపురు** (వై.వి.) : 1.శిఖరము; 2.ఉన్నతి. (కొప్పరము యొక్క రూపాంతరము)

**కొప్పరము** (వై.వి.) : 1. శిఖరము; 2. మూఁపు; 3. విజృంభణము.

**కొప్పరించే** (వై.అ.క్రి.) : 1. అతిశయించు; 2. విజృంభించు.

**కొప్పరింత** (వై.వి.) : 1. అతిశయించుట; 2. విజృంభణము.

**కొప్పు** (దే.వి.) : 1. తలయందు దోఁపిన వెంట్రుకల ముడి; 2. ఇంటికొన; 3. ఇంటి నడికొప్పు, మొగుడు.

**కొప్పెర** (వై.వి.) : వెడల్పు ముఖముగల పెద్ద పాత్రము, కటాహము.

**కొప్రము** (వై.వి.) : శిఖరము.

**కొబ్బెర** (దే.వి.) : చిప్పతీసిన టెంకాయ.

**కొబ్బెరకాయ** (దే.వి.) : టెంకాయ.

**కొబ్బెరపండు** (దే.వి.) : కొబ్బెరకాయ.

**కొబ్బెరయుండ** (దే.వి.) : (కొబ్బెర+ఉండ) భక్ష్య విశేషము, మౌండము.

**కొమ** (దే.వి.) : 1. శాఖ; 2. ఆఁడుది. (కొమ్మ యొక్క రూపాంతరము)

**కొమరసామి** (వై.వి.) : కుమారస్వామి.

**కొమరాలు** (ద్వ.వి.) : (కొమరు + ఆలు) 1.యౌవనవతి; 2. సౌందర్యవతి. (చూ. కొమరు)

**కొమరిత** (వై.వి.) : కూఁతురు.

**కొమరు** (వై.వి.) : 1.వృత్తియందు కొమిరె శబ్దమునకు ఆదేశము (కొమరాలు. మొ.) 2. మనోజ్ఞత. (విణ.) : మనోజ్ఞము.

**కొమరుఁడు** (వై.వి.) : కొడుకు, పుత్రుఁడు.

**కొమరుఁదనము** (వై.వి.) : (కొమరు + తనము) యౌవనము. (చూ. కొమరు)

**కొమరుఁబాయము** (వై.వి.) : (కొమరు + పాయము) యౌవనము. (చూ. కొమరు.)

**కొమరులు** (దే.వి.బ.) : మేలుదూలము మీఁది గుజ్జులు.

**కొమరేఁటు** (ద్వ.వి.) : (కొమర + ఏఱు) స్వామి పుష్కరిణి.

**కొమారి** (వై.వి.) : కూఁతురు.

**కొమారిత** (వై.వి.) : కూఁతురు.

**కొమారుఁడు** (వై.వి.) : కొడుకు, పుత్రుఁడు. (బ. కొమారులు, కొమాళ్లు)

**కొమార్త** (వై.వి.) : కొమారిత యొక్క రూపాంతరము.

**కొమిరె** (వై.వి.) : యౌవనముగల స్త్రీ.

**కొమ్మ** (దే.వి.) : 1.శాఖ; 2.ఆఁడుది; 3.కోట కొమ్మ. కపిశీర్షము.

**కొమ్మత్రిమ్మరి** (దే.వి.) : కోఁతి.

**కొమ్మనఁటి** (దే.వి.) : (కొమ్ము + అనఁటి) కదళీ విశేషము.

**కొమ్మనగొట్టెపిండి చెట్టు** (ద్వ.వి.) : పూతిక.

**కొమ్మనగొలిమిడి** (దే.వి.) : మూలఫల.

**కొమ్మనగోర** (దే.వి.) : వృక్ష విశేషము.

**కొమ్మమెకము** (ద్వ.వి.) : కోఁతి, శాఖా మృగము.

**కొమ్మి** (దే.వి.) : ఒకానొక చెట్టు.

**కొమ్ము** (దే.వి.): 1. ఉకారము యొక్క రూపాంతర నామము; 2.ఎద్దు లోనగు వాని కొమ్ము; 3.మాదిగవాఁడు క్రొవ్వు నుంచుకొనెడు పాత్రము; 4.పసుపు లోనగువాని యెండిన నిడుపాటి గడ్డ; 5. చిమ్మనఁగ్రోవి; 6. పల్లకి బొంగు; 7. ఏనుఁగుయొక్క దంతము; 8. పంది కోఱ; 9. ఊఁదెడి యొకానొక వాద్యము; 10. శాఖ; 11. శిఖరము; 12. కొన; 13. ఉత్సాహము; 14. బలము; 15. గవుండ్లవాఁడు బందము తగిలించెడు కత్తిపిడికలోని వంకర కొయ్య.

**కొమ్ముకాఁకర** (ద్వ.వి.) : కారవేల్ల విశేషము.

**కొమ్ముకాఁడు** (దే.వి.) : 1.వరాహము; 2.అగసాలెవాఁడు; 3. కొమ్మూఁదెడు మాదిగవాఁడు.

**కొమ్ముచేప** (దే.వి.) : ఒకానొక ఆఁడు మత్స్యము, శృంగి.

**కొమ్ముటేనుఁగు** (దే.వి.) : (కొమ్ము+ఏనుఁగు) మగయేనుఁగు.

**కొమ్ముపెసర** (దే.వి.) : సస్య విశేషము. (బ.ఆ.): ధాన్యము.

**కొమ్ముమాచకమ్మ** (దే.వి.) : ఊొమ్ములు గల మాచకమ్మ.

**కొమ్మువాఁడు** (దే.వి.) : కొమ్మూఁదెడు మాదిగ వాఁడు.

**కొయుగూర** (ద్వ.వి.) : (కోయు + కూర) కోయఁ దగిన నల్ల తోఁటకూర.

**కొయ్య** (దే.వి.) : 1. కఱ్ఱ; 2. మ్రాను.

**కొయ్యగాలు** (దే.వి.) : (కోయు + కాలు) కోఁత కోసిన మోడు.

**కొయ్యుగూర** (ద్వ.వి.) : కొయుగూర యొక్క రూపాంతరము.

**కొరడా** (హిం.వి.) : చబుకు, జాటి.

**కొరడు** (యు.దే.వి.) : వంకరగాక సరిగా నుండెడి యింద్రధనుస్సు. వై. గుడ్లగూబ.

**కొరద** (దే.వి.) : మత్స్యవిశేషము.

**కొరవంజి** (దే.వి.) : 1. ఎఱుకువాఁడు; 2. ఎఱుకుది.

**కొరవి** (వై.వి.) : ఎఱ్ఱగోరంట.

**కొరనాసిగండు** (ద్వ.వి.) : క్రూర మృగ విశేషము.

**కొరి** (దే.వి.) : ఱెప్పనడిమి వెండ్రుక, అర్మము.

**కొర్నవగండు** (ద్వ.వి.) : కొరసానిగండు (చూ. కణఁతి)

**కొఱ** (దే.వి.) : 1. కొఱఁత; 2. ప్రయోజనము; 3. మత్స్యవిశేషము (కొఱ్ఱయొక్క రూపాంతరము) 4. శిల్పము

**కొఱఁకు** (దే.వి.) : 1. పసులు మేయు కంచె, వివీతము; 2. పక్షులెర యేఱి తినుచోటు; (కొఱను యొక్క రూపాంతరము)

**కొఱఁత** (దే.వి.) : తక్కువ.

**కొఱఁతనుఱుకు** (దే.స.క్రి. ) : (కొఱఁతన్ + ఉఱుకు) అకార్యము చేయు.

**కొఱకచ్చు** (దే.వి.) : కొఱవి, అలాతము.

**కొఱకు** (దే.అప.) : చతుర్థీ విభక్తియందు వచ్చెడు ఒక ప్రత్యయము.

**కొఱకొఱ** (దే.వి.) : కోపవికారము.

**కొఱకొఱలాడు** (దే.అ.క్రి.) : (కొఱకొఱలు + ఆడు) కోపగించు.

**కొఱగామి** (దే.వి.) : (కొఱ+కామి) 1. అకార్యము; 2. దుర్లక్షణము; 3. దోషము.

**కొఱడు** (దే.వి.) : ఆయుధవిశేషము

**కొఱడుకోల** (దే.వి.) : ఆయుధ విశేషము

**కొఱడుపాఱు** (దే.అ.క్రి.) : తిమురుపట్టు.

**కొఱను** (దే.వి.) : 1. పసులు మేయు కంచె; 2. పక్షులెర యేఱి తినుచోటు. (చూ. కొఱఁకు.)

**కొఱపము** (వై.వి.) : గుఱ్ఱమును దోమెడు గొఱపము. (ఇట్లు పరుషాదిగాఁ గొన్ని దేశముల యందు వ్యవహారము.)

**కొఱప్రాణము** (మి.వి.) : కుట్టుసుఱు.

**కొఱముట్టు** (దే.వి.) : పనిముట్టు, ఉపకరణము.

**కొఱలు** (దే.అ.క్రి.) : 1. ఉండు; 2. ప్రకాశించు.

**కొఱవ** (దే.వి.) : ఒకానొక తక్కువ జాతి. (కొఱవ వాఁడు, కొఱవది.)

**కొఱవత** (దే.వి.) : కొఱవది.

**కొఱవి** (దే.వి.) : కొఱకచ్చు.

**కొఱవిచీమ** (దే.వి.) : పెద్ద యెఱ్ఱచీమ.

**కొఱవిదయ్యము** (ద్వ.వి.) : పిశాచ భేదము.

**కొఱవోవు** (దే.అ.క్రి.) : (కొఱ+పోవు) మూర్ఛిల్లు.

**కొఱసంది** (ద్వ.వి.) : ఆయము, జీవస్థానము.

**కొఱు** (దే.వి.) : కొఱుయొక్క రూపాంతరము.

**కొఱకు** (దే.స.క్రి.) : కఱచు. (వి.) : మేహరోగ విశేషము.

**కొఱ్ఱ** (దే.వి.) : 1.మత్స్యవిశేషము, పాఠీనము; 2. సస్య విశేషము. (బ.) : ఆధాన్యము, ప్రియంగువు.

**కొఱ్ఱు** (దే.వి.) : మేకు, శూలము.

**కొల** (దే.వి.) : 1. పాపము 2. హింస.

**కొలఁకు** (వై.వి.) : కొలను యొక్క రూపాంతరము.

**కొలఁకువు** (వై.వి.) : కొలను యొక్క రూపాంతరము.

**కొలఁది** (దే.వి.) : పరిమితి. (విణ.) : శక్యము.

**కొలకొల** (వై.వి.) : కలకలము.

**కొలగాఁడు** (దే.వి.) : (కొలత+కాఁడు) ధాన్యము కొలుచువాఁడు.

**కొలగారము** (దే.వి.) : ధాన్యము కొలతకిచ్చెడు కూలి.

**కొలత** (దే.వి.) : 1. పరిమాణము 2. ధాన్యము లోనగు వానిని కొలుచుట.

**కొలను** (వై.వి.) : గుంట, సరస్సు (రూ. కొలcకు)

**కొలము** (వై.వి.) : 1. వంశము 2. సజాతీయ ప్రాణి సమూహము.

**కొలారకము** (దే.వి.) : ధాన్యమును కొలుచుట.

**కొలారము** (దే.వి.) : కొలారము యొక్క రూపాంతరము.

**కొలారు** (దే.వి.) : కొలారము యొక్క రూపాంతరము.

**కొలారుబండి** (దే.వి.) : కొల్లారుబండి యొక్క రూపాంతరము.

**కొలి** (దే.వి.) : బిల్లగోడాడునపుడు బిల్లcబెట్టి కొట్టుటకుc ద్రవ్విన చిన్న పల్లము.

**కొలికి** (దే.వి.) : 1. ముక్కునంటిన కంటి మూల; 2. హారము లోనగువాని తగిల్చెడు వంకర కమ్మి; 3. పరిపాకము.

**కొలికిపూస** (దే.వి.) : కొలికికిc దగిలించెడు పూస.

**కొలికిముడి** (దే.వి.) : వదలుముడి.

**కొలిపించు** (దే.అ.క్రి.) : నట్టువుcడు కొనుగోలు చేయు. (ప్రే.) : ధాన్యాదికము కొలువcజేయు.

**కొలిమి** (దే.వి.) : కమ్మరినిప్పుంచెడు పల్లము.

**కొలిమితిత్తి** (ద్వ.వి.) : కొలిమియూcదెడు తిత్తి, భస్త్ర.

**కొలుచు** (దే.స.క్రి.) : 1.ఉపాసించు; 2.సేవించు; 3. ధాన్యాదికము కొలత చేయు. (వి.) : 1. ధాన్యము; 2. వరి ధాన్యము.

**కొలుపు** (దే.అ.క్రి.) : 1. నట్టువుcడు కొలిపించు; 2. సమ్మతించు; 3. సరిపడు; 4. చెల్లు. (అం. ప్రే.) : 1.పురికొలుపు; 2.పుట్టించు; 3.(కను) గీటు, సైcగ చేయు; 4. అనుప్రయుక్తమైన కొను ధాతువునకు ప్రేరణమునుందు వచ్చెడి రూపము. (అడలు కొలుపు, పురి కొలుపు. మొ.) (వి.) : గ్రామశక్తికి చేసెడి యుత్సవము.

**కొలువడి** (దే.వి.) : (కొలుచు + వడి) కొలత. (చూ. కొలారకము)

**కొలునాసములు** (దే.వి.) : మత్స్య విశేషము, రాజీవము.

**కొలువు** (దే.వి.) : 1. ఆస్థానము; 2. సేవ; 3. ఉత్సవ విశేషము.

**కొలువుకాcడు** (దే.వి.) : సేవకుcడు.

**కొలువుకూటము** (దే.వి.) : ఆస్థాన మండపము.

**కొలువుగొను** (దే.స.క్రి.) : (కొలువు + కొను) సేవకునిగా పరిగ్రహించు.

**కొలువుడుకాcడు** (దే.వి.) : కొలువుకాcడు, సేవకుcడు.

**కొలె** (దే.ద్ర.) : మొదలుకొని యను నర్థమును దెలుపునది. (కోలె యొక్క రూపాంతరము)

**కొల్ది** (దే.వి.విశ.) : కొలcది యొక్క రూపాంతరము.

**కొల్ను** (దే.వి.) : కొలను యొక్క రూపాంతరము.

**కొల్ల** (దే.వి.) : దోcపుడు, అభ్యవ స్కందనము.

**కొల్లకత్తె** (ద్వ.విశ.) : కొల్లపెట్టునది. (ఆcడుది)

**కొల్లకాcడు** (దే.వి.విశ.) : కొల్లపెట్టు వాcడు.

**కొల్లకొట్టు** (దే.స.క్రి.) : 1. కొల్లపెట్టు; 2. (అధిక లాభముగ) సంపాదించు.

**కొల్లగొను** (దే.స.క్రి.) : (కొల్ల+కొను) కొల్లపెట్టు.

**కొల్లపెట్టు** (దే.స.క్రి.) : అపహరించు.

**కొల్లలాడు** (దే.స.క్రి.) : (కొల్లలు+ఆడు) దోcచుకొను, అపహరించు.

**కొల్లవోవు** (దే.అ.క్రి.) : (కొల్ల+పోవు) చూఱపోవు.

**కొల్లాడు** (దే.స.క్రి.) : (కొల్ల + ఆడు) కొల్లపెట్టు.

**కొల్లాబండి** (దే.వి.) : గాడీ.

**కొల్లాయపంచె** (దే.వి.) : చిన్న అంగవస్త్రము.

**కొల్లారము** (దే.వి.) : నడుమ బయలును నాలు ప్రక్కలcc గట్టడమును గల యిల్లు.

**కొల్లారు** (దే.వి.) : నడుమ బయలును నాలుగు ప్రక్కలcc గట్టడమును గల యిల్లు.

**కొల్లారుబండి** (దే.వి.) : కొల్లాబండి. (చూ. కొలారుబండి)

**కొల్లి** (దే.వి.) : ఒకానొక చెట్టు.

**కొస** (దే.వి.) : 1. కొన; 2. ఉపయుక్తము కాని తృణాదుల యగ్రాంశము.

**కొసరు** (దే.అ.క్రి.) : 1. విజృంభించు; 2. సంకోచించు. వి. 1. కోరిక; 2. ఏదేనొక వస్తువును దీసికొన్న దానికిచ్చెడు పెచ్చు; 3.ప్రార్థనము; 4. సంకోచము.

# కో

**కో** (దే.వి.) : అఱపునందగు ధ్వన్యనుకరణము.

**కోంకణము** (సం.వి.అ.న.) : ఆయుధ విశేషము. (పుం.) : ఒకానొక దేశము. (చూ. దేశము.)

**కోగిరి, ఖోగిరి** (హిం.వి.) : గుఱ్ఱపుజీను.

**కోఁగు** (దే.స.క్రి.) : గొఱుగు.

**కోఁచ** (దే.వి.) : పిఱికి, భీరువు.

**కోఁచవాఱు** (దే.అ.క్రి.) : (కోఁచ + పాఱు) భయపడు.

**కోఁడు** (దే.స.క్రి.) : బియ్యములోనగువానిని చేటలోఁ బోసికొని వాటుగా నిటునటు త్రిప్పు.

**కోఁత** (దే.వి.) : కోయుట, లవనము.

**కోఁతపట్టు** (దే.అ.క్రి.) : కోఁతకోయ నారంభించు.

**కోఁతపడు** (ద్వ.అ.క్రి.) : ఖండితమగు.

**కోఁతి** (దే.వి.) : మల్లు, వానరము.

**కోఁతిపుల్లలు** (దే.వి.బ.) : మగ్గపు పలక దారములను మీఁదికిఁ దగిల్చెడు పుల్లలు.

**కోఁతిమామిడి** (దే.వి.) : అంబాళము.

**కోఁదాడు** (వై.వి.) : తాళవృక్ష విశేషము.

**కోక** (దే.వి.) : వలువ, వస్త్రము.

**కోకనదము** (సం.వి.అ.న.) : 1. చెంగలువ; 2. చెందమ్మి.

**కోకము** (సం.వి.అ.పుం.) : 1. జక్కన; 2. తోఁడేలు; 3. బల్లి; 4. కప్ప; 5. ఈఁదు.

**కోకిలము** (సం.వి.అ.పుం.) : పికము, కోయిల.

**కోకిలాక్షము** (సం.వి.అ.పుం.) : ములుగొలిమిడి.

**కోగెల** (వై.వి.) : కోవెల, కోకిలము.

**కోట** (వై.వి.) : 1. దుర్గపురము. 2. పట్టణము చుట్టుగల ప్రహరి.

**కోటఁడు** (వై.వి.) : గుడ్లగూబ.

**కోటము** (సం.వి.అ.పుం.) : కోటఁడు, గుడ్లగూబ.

**కోటరము** (ఉభ.దే.వి.) : కోడంత్రమ,. చెట్టుతొఱ్ఱ.

**కోటతికము** (దే.వి.) : కోడతికము యొక్క రూపాంతరము.

**కోటవి** (సం.వి. ఈ.స్త్రీ.) : దిసమొలది, ఉచ్చమల్లి.

**కోటానఁగోటులు** (మి.వి.బ.) : (కోటులు + కోటులు) అసంఖ్యములు.

**కోటి** (ఉభ.దే.వి.) : వేగు. 1.అంచు; 2. అతిశయము; 3. వింటికొప్పు; 4. చివర; 5. సంఖ్యా విశేషము.

**కోటికాఁడు** (దే.వి.) : వేగువాఁడు. (పాఠాంతరము కొట్టికాఁడు.)

**కోటివర్ష** (సం.వి.ఆ.స్త్రీ.) : పిక్క.

**కోటిశము** (సం.వి.అ.పుం.) : మట్టి గడ్డలు కొట్టెడు కొయ్య. (రూ. కోటీశము)

**కోటీరము** (సం.వి.అ.పుం.) : కిరీటము, బొమిడికము.

**కోటు** (ఆం.వి.) : చొక్కాయి.

**కోటేరు** (దే.వి.) : దుక్కికిఁ బోవునపుడు గాని దుక్కియై మరలి వచ్చునపుడు గాని దుంప మీఁదుగా కాఁడికి తగిలించిన నాఁగలి.

**కోట్టము** (సం.వి.అ.పుం.) : దుర్గపురము.

**కోట్టారము** (సం.వి. అ.పుం.) : నీటి పల్లము.

**కోట్రము** (దే.వి.) : కోటరము యొక్క రూపాంతరము.

**కోఠము** (సం.వి. అ.పుం.) : మండలాకారమైన కుష్ఠము.

**కోర్టు** (ఆం.వి.) : న్యాయసభ.

**కోడంత్రము** (దే.వి.) : కోటతికము.

**కోడంత్రికము** (దే.వి.) : కోటతికము.

**కోడతికము** (దే.వి.) : (కోడలు + తికము) కోడంత్రము.

**కోడలు** (దే.వి.) : (కొడుకు + ఆలు) కొడుకు యొక్క పెండ్లాము, స్నుష. (హల్లు పరమగుచో వికల్పముగా నుత్వలోపంబగు.)

**కోడాడు** (దే.అ.క్రి.) : బాధపడు.

**కోడి** (వై.వి.) : అజ్జవాలు, కుక్కుటము.

**కోడిగ** (దే.వి.) : రత్నముల యిరువదింటి సంజ్ఞ.

**కోడిగము** (దే.వి.) : విలాసచేష్ట.

**కోడిగీఁడు** (దే.విణ.) : (కోడిగము + ఈఁడు) కోడిగము చేయువాఁడు.

**కోడిపీఁట** (వై.వి.) : నొగచివర క్రింద నెత్తుగా నుంచెడు మోపుడు కొయ్య, అనుకర్షము.

**కోడిబడి** (దే.వి.) : పసిబాలురకుఁజేసి యిచ్చెడు భక్ష్య విశేషము.

**కోడియ** (దే.వి.) : కోడెదూడ, వత్సతరము.

**కోడీ** (దే.వి.) : కోడిగ.

**కోడు** (దే.వి.) : 1. మంచములోనగు వాని కంబము; 2. ఊరిదరి నీటిపల్లము.

**కోడుతాఱు** (దే.అ.క్రి.) : పండినపైరు మిక్కిలి యెండు.

**కోడె** (దే.వి.) : 1. కాఁడిమరపఁ దగిన దూడ; 2. విటుఁడు. (కోడియ యొక్క రూపాంతరము)

**కోడెకాఁడు** (దే.వి.) : విటుఁడు.

**కోడెరవుతు** (ద్వ.వి.) : శివుఁడు, వృషభ వాహనుఁడు.

**కోణంగి** (వై.వి.) : అంగములను వికారముగాఁ జూపి బిచ్చమెత్తెడు దాసరి.

**కోణపుఁడు** (సం.వి.అ.పుం.) : నైరృతుడు, మూలఱేఁడు.

**కోణము** (సం.వి.అ.పుం.) : 1. ఇల్లు లోనగు వాని మూల; 2. అంచు; 3. గంటలోనగు వాని వాయించెడు కొడుపు; 4. దుడ్డుఁగోల 5. వాద్య విశేషము.

**కోణుఁడు** (సం.వి.అ.పుం.) : శనైశ్చరుఁడు.

**కోదండము** (ఉభ.దే.వి.) : బాలురను దండించు టకై పట్టుకొని వ్రేలాడునట్లు మీఁదఁ గ్రట్టెడు త్రాడు. (సం.అ.న.) : 1.విల్లు; 2.నాలుగు మూరల విల్లు; 3.వెదురువిల్లు; (పుం.) 1. కనుబొమ; 2. ఒకానొక దేశము.

**కోద్రంగము** (సం.వి.అ.పుం.) : మంచె.

**కోద్రవము** (దే.వి.అ.పుం.) : కోర దూషము, ఆళ్లు.

**కోన** (యు.దేవి.) : గోసమూహము. 1. అడవి; 2. కొన; 3. మూల; 4. కొండల యందలి మఱుఁగు చోటు.

**కోనత్రిమ్మరి** (ద్వ.వి.) : కోఁతి, వనచరము.

**కోనమునికి** (ద్వ.వి.) : కోఁతి, వనౌకము. (ఇట్లు కోనటెంకి. మొ.)

**కోనఱేఁడు** (ద్వ.వి.) : నైరృతుఁడు, కోణపుఁడు.

**కోనెఱు** (ద్వ.వి.) : కోనేఱు యొక్క రూపాంతరము.

**కోనేఱు** (ద్వ.వి.) : (కోన + ఏఱు) చుట్టు మెట్లు గల నలుచదరపు గుంట, పుష్కరిణి.

**కోపకత్తె** (మి.గ్రా.విణ.) : (కోపము + కత్తె) కోపముగలది. (ఆఁడుది.)

**కోపకాఁడు** (మి.గ్రా.విణ.) : (కోపము + కాఁడు) కోపము గలవాఁడు.

**కోపగించు** (వై.స.క్రి.) : కోపించు.

**కోపగిల్లు** (వై.అ.క్రి.) : కోపపడు.

**కోపన** (సం.వి.ఆ.స్త్రీ.) : కోపముగల ఆఁడుది. (విణ.) : కోపము గలది.

**కోపము** (సం.వి.అ.పుం.) : క్రోధము, కినుక.

**కోపి** (సం.విణ.) : (న్.ఈ.న్) కోపము గలవాఁడు.

**కోపించు** (సం.స.క్రి.) : కోపగించు.

**కోపు** (దే.వి.) : 1. బలపము లోనగువాని కడ్డి; 2. కడ్డి; 3. అందము; 4. వింటి కొప్పు; 5. (బ.) : నమస్కారము; 6. నాట్యము తీర్పు; 7. నిమిత్తము; 8. పార్శ్వము; 9. విధము; 10. సమయము; 11. చేఁపల గుది గ్రుచ్చు నట్టి సూది; 12. మద్యము.

**కోపుదారుఁడు** (దే.వి.) : సరుకులను బైటనుండి తెచ్చియమ్మెడువాఁడు.

**కోపువాఱు** (దే.అ.క్రి.) : (కోపు + పాఱు) అందగించు.

**కోము** (దే.వి.) : 1. గోపురము వలె పెరిఁగిన పుట్ట చివర; 2. ఆఁడుది.

**కోమటి** (వై.వి.) : వైశ్యుఁడు.

**కోమలము** (సం.వి.) : నీళ్లు. (విణ.) : మృదువు.

**కోమలి** (వై.వి.) : 1. చక్కఁదనము గల ఆఁడుది; 2. ఆఁడుది.

**కోమలికము** (వై.వి.) : చక్కఁదనము.

**కోయ** (దే.వి.) : ఒక జాతిబోయ.

**కోయష్టికము** (సం.వి. అ.పుం.) : చీకుఁగొక్కెర.

**కోయిల** (యు.దే.వి.) : 1. గుడి; 2. ఒకానొక దివ్య స్థలము.

**కోయు** (దే.స.క్రి.) : 1. తీఁగలు లోనగు వాని ఛేదించు, లవించు; 2. పువ్వులు లోనగు వాని గిల్లు.

**కోర** (దే.వి.) : 1. గిన్నె; 2. కల్లుత్రాగెడు గిన్నె, చషకము; 3. తట్ట. (కోరమీసము, ముచ్చుగోర.)

**కోరంగి** (సం.వి.ఈ.స్త్రీ.) : చిట్టేలకి.

**కోరకము** (సం.వి.అ.పుం.న.) : 1. మొగ్గ; 2.అర విరి మొగ్గ; 3.తామర తూఁడు; 4. తక్కోలము.

**కోరకొండె** (దే.వి.) : బిడ్డలులోనగు వారికి ముఖ పార్శ్వమున వేసెడు కొండె.

**కోరగించు** (వై.అ.క్రి.) : 1. ముకుళించు; 2. మొలకెత్తు.

**కోరటు, కోర్టు** (ఆం.వి.) : న్యాయసభ.

**కోరడి** (దే.వి.) : ఆవరణముగా వేసిన పొడి మట్టి గోడ, కరగోడ.

**కోరదూషము** (సం.వి.) : కోద్రవము, ఆళ్లు.

**కోరవాయి** (ద్వ.వి.) : కోష్ఠశీర్షమగు వాయువు.

**కోరవోవు** (దే.అ.క్రి.) : (కోర + పోవు) కొంకరులు వోవు.

**కోరసిగ** (ద్వ.వి.) : కోరకొండె.

**కోరా** (దే.విణ.) : కారికము, అనాహతము. (వస్త్రము)

**కోరాడు** (దే.స.క్రి.) : (కోరి + ఆడు) 1. ఏనుఁగు లోనగునవి కొమ్ములతో నేలఁ బొడిచి దుమ్మెత్తి పైకిఁజల్లు; 2. పంది ముట్టెతో నేలకెల్లగించు (చూ. క్రోడాడు.) 3. దుమ్ము లోనగువాని నెత్తి పైకిఁ జల్లు. (ఇది క్రోడాడు అను క్రియకు మాఱు రూపముగాఁ దోఁచు చున్నది.)

**కోరాబంగారు** (దే.వి.) : మట్టపుబంగారు.

**కోరింద** (దే.వి.) : లక్కగలిగెడి యొకా నొక తీఁగ, జతూక.

**కోరిక** (దే.వి.) : 1.ఇచ్ఛ; 2.కోరుట; 3.వరము.

**కోరికి** (దే.వి.) : ఇచ్ఛ. (రూ. కోర్కి)

**కోరు** (యు.దే.స.క్రి.) : 1.ఇచ్ఛించు; 2. కోరాడు. (దీనికి గ్రంథములయందు కోరాడు అనియే ప్రయోగము.)

**కోర్టు** (ఆం.వి.) : న్యాయసభ.

**కోఱ** (వై.వి.) : దంష్ట్ర.

**కోఱడము** (దే.వి.) : 1. అపహాస్యము; 2. (బ.) అపహాస్య వచనము.

**కోల** (ఉభ.దే.వి.) : 1. దండము; 2. బాణము; 3. వంటకట్టె; 4. మగగుఱి. (విణ.) : దీర్ఘము. (కోలనిమ్మ.మొ.) (సం.వి.) : 1. చవ్యమను గంధ ద్రవ్యము; 2. పిప్పలి.

**కోలంబకము** (సం.వి.అ.పుం.) : వీణె యొక్క సర్వాంగము.

**కోలకము** (సం.వి.అ.న.) : 1. తక్కోలపు; 2. మిరియము.

**కోలక్రోఁతులు** (దే.వి.బ.) : కోఁతి కొమ్మంచియను బాల క్రీడావిశేషము. (చూ. అందలము)

**కోలగగ్గెర** (దే.వి.) : కాళ్లకు దారమును పెనఁచి యెద్దులను మూటకట్టుగా కట్టెడు కట్టు.

**కోలజున్ను** (దే.వి.) : ఒక దినుసు జున్ను, ఔద్దాలకము.

**కోలదబ్బ** (దే.వి.) : ఒక దినుసు దబ్బ.

**కోలదళము** (సం.వి.) : నలియనెడు గంధ ద్రవ్యము.

**కోలదివియ** (ద్వ.వి.) : వెలుతురు కట్టెల దివటీ. (రూ. కోలదివ్వె)

**కోలనిమ్మ** (దే.వి.) : నిడుపుదినుసునిమ్మ.

**కోలపాల** (దే.వి.) : అర్కపుష్పిక.

**కోలపొన్న** (ద్వ.వి.) : అంఘ్రిపర్ణిక.

**కోలము** (ఉభ.దే.వి.) : వేషము. (పుం.) : 1. పంది; 2. తెప్ప; 3. ఒడి; 4. కౌఁగిలి.

**కోలమెఱుఁగు** (దే.వి.) : నిలువు మెఱుఁగు, ఐరావతి.

**కోలలవారు** (దే.వి.బ.) : వేత్రధరులు.

**కోలవల్లి** (సం.వి.ఈ.స్త్రీ.) : గజపిప్పలి.

**కోలవస** (ద్వ.వి.) : జటిల.

**కోలాటకమ్మ** (దే.వి.) : ఒక దినుసు కమ్మ.

**కోలాటము** (దే.వి.) : (కోల + ఆట) చేతులఁ గోలలుంచుకొని యాడెడి యాట. (చూ.అఱకడ)

**కోలాహలము** (సం.వి.అ.పుం.) : కలకలము, అలబలము.

**కోలి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. రేఁగు; 2. గంగరేఁగు.

**కోలు** (దే.వి.) : 1. అనుప్రయుక్తమైన కొను ధాతువునకు భావార్థక రూపము (ఇచ్చుకోలు, పుచ్చుకోలు. మొ.) 2. కొల్ల. (విణ.) : పెద్ద. (కోలు పులి, కోలు మొసలి, కోలు మూఁపులు, మొ.) (క్రి.విణ.) : మిక్కిలి (కోలుమసఁగు)

**కోలుకాఁడు** (దే.వి.) : 1. నియమించెడి యధికారి; 2. కావలివాఁడు; 3. సుంకరి క్రిందిబంటు.

**కోలుకొను** (దే.అ.క్రి.) : 1.ఉత్సహించు; 2.తేఱు కొను; 3. వర్ధిల్లు. (రూ. కోల్కొను. ఉత్సహించుటకు.)

**కోలుతల** (దే.వి.) : 1. ఎదుట నిలిచి యుద్ధము చేయుట; 2. (యుద్ధ) సన్నాహము. (రూ. కోల్తల. ఎదుట నిలిచి యుద్ధము చేయుటకు.)

**కోలుపడు** (ద్వ.అ.క్రి.) :1. చెడు, నశించు; 2. అగపడు. (స.క్రి.) : పోఁగొట్టుకొను. (రూ. కోల్పడు. చెడుటకు.)

**కోలుపాటు** (ద్వ.వి.) : 1. చేటు; 2. పోఁగొట్టుకొనుట.

**కోలుపోక** (దే.వి.) : పోఁగొట్టుకొనుట. (చూ. కోలుపోవు.)

**కోలుపోవు** (దే.అ.క్రి.) : చెడు. (ఇక్కడ చెడుట యనఁగా బయలుపడుట.)

**కోలె** (దే.వి.) : వెన్నుకోసిన కాఁడ. ద్ర.కొలె.

**కోలెమ్ము** (దే.వి.) : (కోల + ఎమ్ము) వీఁపు నడుమఁ బూసపూసగా గొలుసు వలెఁ బెనఁచుకొని యుండెడి యెముక, కశేరుక. (ఇట్లు కోలెముక, కోలెమ్ముక.)

**కోవ** (దే.వి.) : 1. బిడ్డలకు గొంతు నందుఁ గలిగెడు వ్యాధి విశేషము. (చూ.అరిమి) 2. పుట్టకోమ.

**కోవిదారము** (సం.వి.అ.పుం.) : కాంచనము.

**కోవిదుఁడు** (సం.వి.అ.పుం.) : విద్వాంసుఁడు, చదువరి.

**కోవు** (దే.వి.) : ఆర్పునందగు ధ్వన్యనుకరణము.

**కోవురము** (దే.వి.) : శత్రువును బట్టుటకై పొంచెడు పొంచు.

**కోవెల** (యు.దే.వి.) : గుడి.

**కోశకారము** (సం.వి.అ.పుం.) : ఒక దినుసు చెఱకు.

**కోశఫలము** (సం.వి.అ.న.) : తక్కోలపు చెట్టు.

**కోశము** (సం.వి.అ.పుం,న.) : 1. కత్తి యొఱ; 2. గ్రుడ్డు; 3. జాజికాయ బెరడు; 4. ఒక దివ్యము; (చూ. దివ్యము) 5.పుస్తకము; 6.బొక్కసము; 7. కరఁగి పోసిన వెండి బంగారముల ముద్ద; 8. ముష్కము; 9. మొగ్గ (తత్త్వ విషయమున పంచకోశములు : అన్నమయము, ప్రాణమయము, మనోమయము, విజ్ఞానమయము, ఆనందమయము) (రూ. కోషము)

**కోశాతకి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1.ఆనద; 2.ఉత్తరేను; 3. పొట్ల.

**కోశామ్రము** (సం.వి.అ.పుం.) : కొండమామిడి.

**కోష్టు** (వై.గ్రా.వి.) : మందుదినుసు, చెంగల్వకోష్టు.

**కోష్ఠము** (సం.వి.అ.పుం.) : 1.లోకడుపు; 2. సామగ్రులుంచెడు కొట్టు; 3. గాదె.

**కోష్ణము** (సం.వి.అ.న.) : ఇంచుకవేఁడి. (విణ.): ఇంచుకవేఁడిగలది.

**కోసము** (దే.అవ్య.) : నిమిత్తమును దెలుపునది.

**కోసలము** (సం.వి.అ.పుం.) : ఒకానొక దేశము.

**కోసు** (వై.వి.) : రెండువేల విండ్ల పట్టు కొలఁది, క్రోశము.

**కోస్తా** (ఆం.వి.) : సముద్రతీరము.

**కోహకము** (సం.వి.అ.పుం.) : దేహమణంచు కొన్న పిల్లి.

**కోహళము** (సం.వి.అ.పుం.) : 1. కాహళమను వాద్యము; 2. బజాఱు మాట.

**కోహళుఁడు** (సం.వి.అ.పుం.) : నాట్య శాస్త్ర ప్రవర్తకుఁడైన యొక ముని.

**కోహో** (దే.వి.) : పరిహాసమునందగు ధ్వన్యను కరణము.

**కోళె** (దే.విణ.) : ఆశ్చర్యమునొందినవాఁడు. విలక్షుఁడు.



**కౌ** (దే.వి.) : వృత్తియందు కౌను శబ్దమునకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. (కౌఁదీఁగ.మొ.) (కవు యొక్క రూపాంతరము)

**కౌంతి** (సం.వి. ఈ.స్త్రీ.) : రేణుకయను గంధ ద్రవ్యము.

**కౌంతికుఁడు** (సం.విణ.) : (అ.ఈ.అ) ఈఁటెకాఁడు.

**కౌఁగిలి** (వై.వి.) : భుజాంతరము, క్రోడము. (కవుఁగిలి యొక్క రూపాంతరము)

**కౌగిలించు** (వై.స.క్రి.) : ఆలింగనము చేయు. (కవుఁగిలించు యొక్క రూపాంతరము)

**కౌఁగిలింత** (వై.వి.) : ఆలింగనము (కవుఁగిలింత యొక్క రూపాంతరము)

**కౌఁగిలింపు** (వై.వి.) : కౌఁగిలింత. (కవుఁగిలింపు యొక్క రూపాంతరము). (చూ. ఆరగింపు)

**కౌఁజు** (వై.వి.) : కపింజలము. (కవుఁజు యొక్క రూపాంతరము)

**కౌకృత్యము** (సం.వి.అ.న.) : 1.అకార్యము చేయుట; 2. పశ్చాత్తాప పడుట.

**కౌక్కుటికుఁడు** (సం.వి.అ.పుం.) : 1. కపటము కలవాఁడు; 2. చేరువ చూచుచుఁ బోయెడి వాఁడు.

**కౌక్షింభర్యము** (సం.వి.అ.న.) : పొట్టపోసికొను వానితనము.

**కౌక్షేయకము** (సం.వి.అ.పుం.) : ఖడ్గము, కత్తి.

**కౌచు** (దే.వి.) : చేఁపమీఁది పొలుసు. (కవుచు యొక్క రూపాంతరము)

**కౌటతక్షుఁడు** (సం.వి.అ.పుం.) : స్వతంత్రముగా పనిచేయు వడ్లంగి.

**కౌటికుఁడు** (సం.వి.అ.పుం.) : మృగ పక్ష్యాదులను జంపి విక్రయించి జీవించువాఁడు.

**కౌటిల్యము** (సం.వి.అ.న.) : వంకరతనము.

**కౌడు** (వై.వి.) : కపటము. (కవుడు యొక్క రూపాంతరము)

**కౌణపుఁడు** (సం.వి.అ.పుం.) : నైరృతుఁడు, మూలతేఁడు.

**కౌతుకము** (సం.వి.అ.న.) : 1. అనుభవింపని కోరిక యందలి యాశ; 2. కోరిక; 3. పెండ్లి యందు చేతఁగట్టు కొనెడు తోరము; 4. పండుగ; 5. స్త్రీ పురుష పరిహాసము; 6. పైపై వచ్చిన మేలు; 7.సంతోషము; 8.పాటలోనగు సుఖము.

**కౌతూహలము** (సం.వి.అ.న.) : అనుభవింపని కోరిక యందలి యాశ, తమి.

**కౌద్రవీణము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఆళ్లు పండునది. (పొలము)

**కౌను** (దే.వి.) : 1. నడుము; 2. వింటి నడుము. (కవును యొక్క రూపాంతరము)

**కౌపము** (సం.వి.అ.న.) : నూతిజలము.

**కౌపీనము** (సం.వి.అ.న.) : 1. గోఁచి; 2. అకార్యము; 3. గుహ్య ప్రదేశము.

**కౌబేరము** (సం.వి.అ.న.) : 1. చెంగల్వకోష్టు; 2. ఒక దినుసు పిండివంట.

**కౌమారము** (సం.వి.అ.న.) : బాల్యమునకు ఆవలి వయోవస్థ.

**కౌమారి** (సం.వి.ఈ.స్త్రీ.) : ఒక మాతృక.

**కౌముదము** (సం.వి.అ.పుం.) : కార్తికమాసము.

**కౌముది** (సం.వి.ఈ.స్త్రీ.) : చంద్రిక, వెన్నెల.

**కౌమోదకి** (సం.వి.ఈ.స్త్రీ.) : విష్ణువు యొక్క గద.

**కౌరు** (దే.వి.) : వర్ణాధిక్యము. (కవురు యొక్క రూపాంతరము.)

**కౌలటినేయుఁడు** (సం.వి.అ.పుం.) : భిక్షుకి యైన పతివ్రత కొడుకు.

**కౌలటేయుఁడు** (సం.వి.అ.పుం.) : 1. భిక్షుకి యైన పతివ్రత కొడుకు; 2. అంకుటాలి కొడుకు.

**కౌలటేరుఁడు** (సం.వి.అ.పుం.) : అంకుటాలి కొడుకు.

**కౌలవ** (సం.వి.అ.పుం.) : ఒక కరణము. (చూ. కరణము)

**కౌలీనము** (సం.వి.అ.న.) : 1. గొప్ప వంశము నందలి పుట్టుక; 2. గుహ్యము; 3.పశుపక్ష్యాదుల జగడము; 4. జగడము; 5. నిందింపఁ దగిన పని.

**కౌలు** (దే.వి.) : రాజులోనగు వారు ప్రజలు లోనగు వారికిచ్చునట్టి యొడంబడిక. (కవులు యొక్క రూపాంతరము) కౌలుఖత్తులు.

**కౌలేయకము** (సం.వి.అ.పుం.) : కుక్క. (విణ.): మంచికులమునఁ బుట్టినది.

**కౌశలము** (సం.వి. అ.న.) : నేర్పరితనము.

**కౌశలి** (సం.వి.ఈ.స్త్రీ.) : కుశలప్రశ్నము.

**కౌశల్యము** (సం.వి. అ.న.) : కౌశలము.

**కౌశికము** (సం.వి. అ.పుం.) : 1. గుగ్గిలపు చెట్టు; 2. గుడ్లగూబ; 3. ముంగిస.

**కౌశికి** (సం.వి. ఈ.స్త్రీ.) : 1. ఒకానొక యేఱు; 2. పార్వతి.

**కౌశికుఁడు** (సం.వి.అ.పుం.) : 1.విశ్వామిత్రుఁడు; 2. ఇంద్రుఁడు; 3. నిఘంటువు తెలిసినవాఁడు; 4. పాములవాఁడు.

**కౌశేయము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పట్టుది. (చీర)

**కౌసీద్యము** (సం.వి. అ.న.) : 1. కుసీదభావము; 2. ఆలస్యము; 3. కునికిపాటు.

**కౌస్తుభము** (సం.వి.అ.పుం.) : విష్ణు వక్షస్థ్సలము నందలి మణి.

**కౌక్షుత్థీయము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఉలవలు పండునది. (పొలము)



**క్రంగు** (దే.వి.) : మ్రోఁగుటయందగు ధ్వన్యను కరణము. (చూ.కొడుపు)

**క్రంత** (యు.దే.వి.) : 1. పెండ్లికొడుకు వారు పెండ్లికూఁతునకుఁ తీసికొని పోయెడి ప్రధాన ద్రవ్యము. 1. సందు త్రోవ; 2. రంధ్రము.

**క్రందనము** (సం.వి.అ.న.) : 1. ఆర్పు; 2. ఏడ్పు; 3. పిలుపు.

**క్రందితము** (సం.వి.అ.న.) : 1.ఏడ్పు; 2.పిలుపు.

**క్రందిల్లు** (వై.అ.క్రి.) : మ్రోఁగు.

**క్రందు** (వై.అ.క్రి.) : 1. మ్రోఁగు; 2. విలపించు. 1. మ్రోఁత; 2. సందడి; 3. ఉపద్రవము; 4. తఱచు.

**క్రందుకయ్యము** (ద్వ.వి.) : దొమ్మి యుద్ధము.

**క్రందుకొను** (ద్వ.అ.క్రి.) : అతిశయించు.

**క్రంప** (దే.వి.) : కంపకు మొదటి రూపము.

**క్రకచపత్రము** (సం.వి.అ.పుం.) : తేఁకు.

**క్రకచము** (సం.వి.అ.పుం.) : 1. అంపము; 2. వెఱుతురు.

**క్రకరము** (సం.వి.అ.పుం.) : 1. కక్కెర; 2. అంపము; 3. వెఱుతురు. (విణ.) : బీదవాఁడు.

**క్రక్కస** (వై.విణ.) : కఠినము.

**క్రక్కు** (దే.స.క్రి.) : కడుపున వికారమెత్తి తిన్నది వెడల నుమియు. (వి.) : 1. కడుపున వికార మెత్తి తిన్నది వెడల నుమియుట; 2. వ్యాధి విశేషము.

**క్రక్కెర** (వై.వి.) : క్రక్కెరకు మొదటి రూపము, క్రకరము.

**క్రచ్చఱ** (దే.ద్ర.విణ.) : (క్రచ్చు + అఱన్) 1. నిష్కల్మషముగా; 2. శీఘ్రముగా

**క్రచ్చే** (దే.స.క్రి.) : చుట్టుకొను. (వి.) : పేనిన త్రాడులోనగు వాని యందు ఉపయుక్తము కాని తృణాదుల యంశము.

**క్రచ్చేకొను** (దే.స.క్రి.) : చుట్టుకొను.

**క్రతుధ్వంసి** (సం.వి.న్.) : శివుఁడు, జన్నపుగొంగ.

**క్రతుభుజుఁడు** (సం.వి.జ్.పుం.) : దేవత, జన్నపుఁ దిండి.

**క్రతువు** (సం.వి.ఉ.పుం.) : 1. యజ్ఞము; 2. ఒకానొక ఋషి.

**క్రధనము** (సం.వి.అ.న.) : వధ, కొల.

**క్రన్న** (దే.ద్ర.క్రి.విణ.) : 1. శీఘ్రముగా; 2. పిమ్మట; 3. మరల.

**క్రమణము** (సం.వి.అ.న.) : అడుగిడుట.

**క్రమము** (సం.వి.అ.పుం.) : 1. సొరిది; 2. అడుగిడుట; 3. అఱుముట; 4. బలిమి; 5. వడఁకు.

**క్రమించు** (సం.స.క్రి.) : 1. అతిక్రమించు; 2. ఆక్రమించు.

**క్రముకము** (సం.వి.అ.న.) : 1. పోఁక; 2. తమ్ములము. (పుం.) : 1. పోఁక; 2. ఎఱ్ఱలొద్దుగు; 3. గంగరావి; 4. నాగముస్తె; 5. ప్రత్తి.

**క్రమేలకము** (సం.వి. అ.పుం.) : ఉష్ట్రము, ఒంటె.

**క్రమ్మఱఁబడు** (ద్వ.అ.క్రి.) : (క్రమ్మఱ్ + పడు) క్రమ్మఱు. (స్వార్థమునపడు)

**క్రమ్మఱిల్లు** దే.అ.క్రి.) : (క్రమ్మఱ్+పడు) క్రమ్మఱు. (రూ. క్రమ్మఱిలు.)

**క్రమ్మఱు** (దే.అ.క్రి.) : మరలు.

**క్రమ్మఱుచే** (దే.ప్రే.) : క్రమ్మఱఁజేయు.

**క్రమ్ము** (దే.అ.క్రి.) : 1. కవియు; 2. పైకుబుకు; 3. వ్యాపించు.

**క్రమ్ముదల** (దే.వి.) : క్రమ్ముట.

**క్రమ్ముదెంచే** (దే.అ.క్రి.) : (క్రమ్ము + తెంచు) పైకుబుకు. (స్వార్థమున తెంచు.)

**క్రయము** (సం.వి.అ.పుం.) : 1. వెల; 2. (వెలయిచ్చి) కొనుట.

**క్రయవిక్రయికుఁడు** (సం.వి.అ.పుం.) : (సరకును) కొని యమ్మెడు వాఁడు, బేహారి.

**క్రయించు** (సం.స.క్రి.) : (సరకును వెలయిచ్చి) కొను, విలుచు.

**క్రయికుఁడు** (సం.వి.అ.పుం.) : (సరకును వెలయిచ్చి) కొనువాఁడు, విలువకాఁడు.

**క్రయ్య** (దే.వి.) : కాలువ.

**క్రయ్యఁబడు** (ద్వ.అ.క్రి.) : (క్రయ్య్ + పడు) కలయు. (స్వార్థమున పడు.)

**క్రయ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కొనుటకు అంగడియందు పఱపఁ బడినది. (సరుకు)

**క్రయ్యు** (దే.అ.క్రి.) : కలయు. (చూ. క్రయ్యఁబడు)

**క్లల్లవడు** (ద్వ.అ.క్రి.) : ఎండు.

**క్రవ్యము** (సం.వి.అ.న.) : మాంసము, పొల.

**క్రవ్యాత్తు** (సం.వి.ద్.పుం.) : రాక్షసుఁడు. (విణ.): మాంసము తినుఁవాడు.

**క్రవ్యాదుఁడు** (సం.వి.అ.పుం.) : రాక్షసుఁడు. (విణ.) : మాంసము తినుఁవాడు.

**క్రవ్యాశి** (సం.వి.న్.పుం.) : రాక్షసుఁడు. (విణ.): మాంసము తినుఁవాడు.



**క్రాంతి** (సం.వి.ఇ.స్త్రీ.) : (చూ.) క్రమణము.

**క్రాఁక** (దే.వి.) : కాఁక యొక్క రూపాంతరము. (చూ. క్రాఁగు)

**క్రాఁగు** (దే.అ.క్రి.) : కాఁగు యొక్క రూపాంతరము.

**క్రాఁగుడు** (దే.వి.) : కాఁగుడు యొక్క రూపాంతరము.

**క్రాఁచే** (దే.ప్రే.) : కాఁచు యొక్క రూపాంతరము.

**క్రాయకుఁడు** (దే.వి.అ.పుం.) : (చూ.) క్రయికుఁడు.

**క్రాయు** (దే.స.క్రి.) : 1. ధ్వని పూర్వకముగా కళ్లలోనగు వానిని కంఠము నుండి నోటికిఁ దెచ్చికొను; 2. క్రక్కు; 3. ఉమియు.

**క్రార** (దే.వి.) : (క్రయ్యు+ర) (జడ్డయై యొక యక్షరముతో) కలయు రేఫము.

**క్రారవడి** (దే.వి.) : (క్రయ్యు+ర) (స్వార్థమున వడి.)

**క్రాలు** (దే.అ.క్రి.) : 1. (టెక్కెము) అల్లలాడు; 2. గిరగిరఁదిరుగు; 3. చెదరు; 4. సంచరించు; 5. సంచలించు; 6. సంభ్రమించు; 7. వర్తిల్లు; 8. ప్రవర్తిల్లు.

**క్రాలుగంటి** (దే.వి.) : (క్రాలు + కన్ను) 1. చలించునట్టి కన్నులు గల ఆఁడుది; 2. ఆఁడుది. (తరళేక్షణ)

## క్రి

**క్రి** (దే.విణ.) : వృత్తియందుఁ గ్రింద శబ్దమునకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. (దీనికి పరుష సరళములు పరములగునపుడు సుమాగమమును తదితరములు పరములగు నపుడు పరవర్ణమునకు ద్విత్వమును వచ్చును. ఉదా : క్రిందల, క్రియ్యాట. మొ.) (ఇది దీర్ఘాంతమునగు. చూ.క్రీ.)

**క్రించే** (వై.విణ.) : అల్పుఁడు. (కించు యొక్క రూపాంతరము.)

**క్రించేఁడు** (వై.విణ.) : అల్పుఁడు. (కించు యొక్క రూపాంతరము.)

**క్రిందల** (దే.వి.) : (క్రింది + తల) క్రిందగుతల.

**క్రిందు** (దే.వి.) : 1. అధో భాగము; 2. గత కాలము. (క్రింద జరిగినవన్ని పోనీ ఇఁక జరగ వలసినది యోచింపుము.) (వృత్తి యందు అంత్యవర్ణ లోపము. చూ.క్రి.క్రీ.)

**క్రిందుపడు** (ద్వ.అ.క్రి.) : అడుగుపడు. (ప్రే.క్రిందు పఱచు.)

**క్రిక్క** (దే.వి.) : బట్టువాఁడు, వంది.

**క్రిక్కిఱించు** (దే.అ.క్రి.) : క్రిక్కిఱియు.

**క్రిక్కిఱియు** (దే.అ.క్రి.) : (క్రిక్కు + ఇఱియు) ఎడము లేక వ్యాపించు. (కొన్ని చోట్ల వృత్తి యందంత్య వర్ణలోపము. క్రిక్కిఱి చన్నుదోయి. మొ.)

**క్రిక్కు** (దే.వి.) : కిఱుకు యొక్క రూపాంతరము.

**క్రిమి** (సం.వి.ఇ.పుం.) : 1. పురుగు; 2. చెట్టు మీఁది నల్లపురుగు; 3. లక్క.

**క్రిమిఘ్నము** (సం.వి.అ.పుం.) : వాయు విళంగము.

**క్రిమిజము** (సం.వి.అ.న.) : అగురువు, అగలు.

**క్రిమినల్** (ఆం.విణ.) : నేరముల సంబంధమైన.

**క్రియ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.ధాత్వర్థము; 2.చేయుట; 3.చేష్ట; 4.పని; 5.ఆరంభము; 6. పూజ; 7. ఉపాయము; 8. చికిత్స; 9. ప్రాయశ్చిత్తము; 10. వ్యవహారమునందు నిశ్చయమును బుట్టించు నట్టి లిఖితము సాక్ష్యము లోనగునది; 11. శిక్ష; 12. విధము. (కడపటి యర్థమునకు తెనుఁగున మాత్రము ప్రయోగము.)

**క్రియాకారము** (సం.వి.అ.పుం.) : ప్రతిజ్ఞ.

**క్రియాకారుఁడు** (సం.వి.అ.పుం.) : క్రొత్త శిష్యుఁడు.

**క్రియావంతుఁడు** (సం.విణ.) : (త్.ఈ.త్) పని యందు పూన్కి గలవాఁడు.

**క్రియ్యు** (వై.అ.క్రి.) : కృశించు.

## క్రీ

**క్రీ** (దే.విణ.) : వృత్తియందుఁ గ్రింద శబ్దమునకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలిన రూపము.

**క్రీఁగడుపు** (ద్వ.వి.) : (క్రిందు + కడుపు) పొత్తికడుపు.

**క్రీఁదొడ** (దే.వి.) : (క్రిందు+తొడ) తొడకు లోపలి భాగము.

**క్రీవాడ** (ద్వ.వి.) : (క్రిందు+వాడ) పాటి పొలము.

**క్రీడ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. ఆట్లాట; 2. పరిహాసము; 3. దూఱు.

**క్రీడి** (వై.వి.) : కవ్వడి, అర్జునుఁడు.

**క్రీడించు** (సం.అ.క్రి.) : ఆట్లాడు.

## క్రు

**క్రుంకు** (దే.అ.క్రి.) : 1. మునుఁగు; 2. అస్తమించు; 3. చచ్చు.

**క్రుంకుడు** (దే.వి.) : అస్తమయము. (చూ. క్రుంకుడు గట్టు)

**క్రుంకుడుగట్టు** (ద్వ.వి.) : అస్తపర్వతము.

**క్రుంకుమల** (ద్వ.వి.) : అస్తపర్వతము. (ఇట్లు క్రుంకుమెట్టు మొ.)

**క్రుంగబడు** (ద్వ.అ.క్రి.) : (క్రుంగన్ + పడు) క్రుంగు. (స్వార్థమున పడు.)

**క్రుంగిలు** (దే.అ.క్రి.) : (క్రుంగన్ + పడు) క్రుంగు. (స్వార్థమున పడు.)

**క్రుంగు** (దే.అ.క్రి.) : 1. క్రిందికి అడఁగు; 2. దిగఁబడు.

**క్రుంచము** (సం.వి.చ.పుం.) : క్రౌంచ పక్షి, కొంచ.

**క్రుక్కు** (దే.స.క్రి.) : 1. పేలులోనగు వానిఁజేతి బొటనవ్రేలిగోటితో చదుపు; 2. అడఁచు; 3. తుఱుగు.

**క్రుక్కుడు** (దే.వి.) : క్రుక్కుట.

**క్రుధ** (సం.వి.ఆ.స్త్రీ.) : కోపము, కినుక. (ఇది ధకారాంతమునగు.)

**క్రుద్ధుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) కోపము నొందినవాఁడు.

**క్రుమ్మరిల్లు** (దే.అ.క్రి.) : క్రుమ్మరు. (రూ. క్రుమ్మరిలు)

**క్రుమ్మరు** (దే.అ.క్రి.) : సంచరించు, తిరుగు.

**క్రుమ్ము** (దే.స.క్రి.) : పొడుచు. (వి.) : (కొమ్ముల) పొడుపు.

**క్రుమ్ముడు** (దే.వి.) : (కొమ్ముల) పొడుపు.

**క్రుమ్ముడువడు** (ద్వ.అ.క్రి.) : (క్రుమ్ముడు + పడు) పోటుపడు.

**క్రుమ్ములాడు** (దే.అ.క్రి.) : (క్రుమ్ములు + ఆడు) క్రుమ్ముకొని పోట్లాడు.

**క్రుయ్యఁబాఱు** (ద్వ.అ.క్రి.) : (క్రుయ్యన్ + పాఱు) క్రుయ్యు. (స్వార్థమున పాఱు.)

**క్రుయ్యు** (వై.అ.క్రి.) : 1. కృశించు; 2. వెనుదీయు.

**క్రుష్టము** (సం.వి.అ.న.) : 1. ఏడుపు; 2. సద్దు.

**క్రుళ్లగించు** (దే.అ.క్రి.) : (మనసులో) దుఃఖించు.

**క్రుళ్లగింత** (దే.వి.) : (మనసులో) దుఃఖించుట.

**క్రుళ్లు** (దే.అ.క్రి.) : 1. క్రుళ్లగించు; 2. అవియు; 3. (కాల మతిక్రమించుటచే ఫలాదులు) నలుపుపాఱి చెడు.

**క్రుళ్లుపోతు** (దే.విణ.) : క్రుళ్లగించు స్వభావము గలవాఁడు.

## క్రూ

**క్రూరము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. నొప్పించునది; 2. భయంకరమైనది; 3. గట్టిది.

**క్రూరు** (దే.విణ.) : వాఁడి.

## క్రే

**క్రే** (దే.విణ.) : వృత్తియందు క్రేవశబ్దము నకు మీఁది వర్ణములోపింపఁగా మిగిలిన రూపము. (ఉదా. క్రేగన్ను, క్రేగయి. మొ.)

**క్రేఁటు** (దే.అ.క్రి.) : 1. గొంతడుపు తీఱుటకు సకిలించునట్లు శబ్దించు; 2. తొట్రు పడు.

**క్రేఁటుకొను** (దే.అ.క్రి.) : గొంతడుపు తీఱుటకు సకిలించునట్లు శబ్దించు. (స్వార్థమున కొను.)

**క్రేగన్ను** (దే.వి.) : (క్రేవ+కన్ను) కడకన్ను, కటాక్షము.

**క్రేగయి** (ద్వ.వి.) : (క్రేవ + కయి) హస్తాగ్రము.

**క్రేడి** (దే.వి.) : సంబావుతోఁ గలసిన కారులోనగు ఎత్తువడ్లు.

**క్రేడించు** (దే.అ.క్రి.) : తొలఁగు. (దీనికి గ్రామ్య రూపము కేడించు.)

**క్రేడిసేయు** (దే.స.క్రి.) : (క్రేడి + చేయు) పరిహాసము చేయు.

**క్రేణి** (దే.వి.) : 1. ఉన్నతపదము; 2. పరిహాసము.

**క్రేణించే** (దే.స.క్రి.) : అలక్ష్యము చేయు. (క్రేడించు యొక్క రూపాంతరము)

**క్రేణిసేయు** (దే.స.క్రి.) : (క్రేణి + చేయు) పరిహాసము చేయు. (క్రేడిసేయు యొక్క రూపాంతరము.)

**క్రేతొట్టు** (దే.అ.క్రి.) : (క్రేవ+తొట్టు) గట్టొరయు.

**క్రేపు** (దే.వి.) : 1. దూడ; 2. (పర్వత) శిఖరము.

**క్రేయము** (సం.విణ.) : (అ.ఆ.అ.) (వెల యిచ్చి) కొనఁదగినది. (సరకు)

**క్రేయో** (దే.వి.) : వెడలఁగొట్టుటయందగు ధ్వన్యనుకరణము.

**క్రేవ** (దే.వి.) : పార్శ్వము. (వృత్తి యందంత్య వర్ణ లోపము. చూ. క్రే.)

**క్రేవు** (దే.వి.) : సింహనాదము నందగు ధ్వన్యనుకరణము.

**క్రేళ్లు** (దే.వి.బ.) : ఉన్నతి.

**క్రేళ్లుదాఁటు** (దే.అ.క్రి.) : 1. ఎగిరిపడు; 2. గంతులిడు.

**క్రేళ్లుబ్బు** (దే.అ.క్రి.) : (క్రేళ్లు + ఉబ్బు) అతిశయించు.

**క్రేళ్లువాఱు** (దే.అ.క్రి.) : (క్రేళ్లు + పాఱు) గంతులిడు.

**క్రేళ్లుఱుకు** (దే.అ.క్రి.) : (క్రేళ్లు+ఉఱుకు) 1. ఎగిరి పడు; 2. గంతులిడు; 3. దూఁకు.



**క్రైలు** (దే.వి.) : ధాన్యము నుతిచి కొలుచుట, ఒబ్బిడి.

**క్రైలుదారి** (దే.వి.) : క్రైలు చేయించెడి అధికారి.



**క్రొ** (దే.విశ.) : వృత్తియందుఁ గ్రొత్త శబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. (దీని కంటెఁ బరములైన పరుష, సరళ, స్థిర వర్ణములకు ద్విత్వము కలుగును. క్రొక్కన్ను, క్రొక్కారు, క్రొగ్గండి, క్రొచ్చెలిక, క్రొత్తరఁగ, క్రొత్తలిరు, క్రొత్తావి, క్రొన్నన, క్రొన్నలుపు, క్రొన్ను రువు, క్రొన్నెత్తురు, క్రొన్నెల, క్రొన్నేయి, క్రొమ్మంచు, క్రొమ్మదుఁగు, క్రొమ్మావి, క్రొమ్మించు, క్రొమ్మిడుఁ గుఱు, క్రొమ్ముడి, క్రొమ్మెదడు, క్రొమ్మెఱుఁగు, క్రొమ్మొగడ, క్రొమ్మొన, క్రొమ్మొలక, క్రొవ్వాఁడి, క్రొవ్విరి, క్రొవ్వెద, క్రొవ్వేఁడి. మొ. కొన్ని చోట్లఁ దత్సమ పదము పరమగునపుడును ద్విత్వము కానఁబడుచున్నది. కొన్ని యెడల పరుషములు పరములగు నపుడు దీనికి నుమాగ మము వచ్చును. క్రొంజాయ, క్రొంజెమట, క్రొందమ్మి, క్రొందలిరు, క్రొంబంట, క్రొంబదను, క్రొంబసిఁడి, క్రొంబసిమి, క్రొంబుట్టము, క్రొంబువ్వు, క్రొంబొగ, క్రొంబొగడ. మో.) (కొన్ని చోట్లఁ దత్సమ పదములు పరమగునపుడును నుమాగమము కానంబడియెడి. ఉదా. క్రొంబులకలు. మొ.)

**క్రొంకి** (దే.వి.) : కొంకియొక్క రూపాంతరము.

**క్రొంచె** (వై.వి.) : కొంచయొక్క రూపాంతరము.

**క్రొక్కారము** (దే.వి.) : కోడికూఁత.

**క్రొత్త** (దే.విశ.) : 1.నూతనము; 2.అపూర్వము. (వృత్తియందు అంత్య వర్ణలోపము. చూ. క్రొ.)

**క్రొత్తడము** (దే.వి.) : కోటబురుజు.

**క్రొత్తడి** (దే.వి.) : మగనాలు. (అని కొందఱు.)

**క్రొత్తముట్టు** (దే.వి.) : వడుక నారంభించి నప్పుడు ఏకున నుండి పురిలేక చాఁగఁ దీసి కదురున కంటించెడునూలు.

**క్రొత్తళము** (దే.వి.) : క్రొత్తడము యొక్క రూపాంతరము.

**క్రొన్నెలలు** (దే.వి.బ.) : కపోలోరుకటోపరి ప్రదేశముల యందలి నఖక్షతములు.

**క్రొమ్మి** (వై.వి.) : ఎఱ్ఱగోరంట.

**క్రొవ్విదము** (దే.వి.) : (క్రొవ్వు + ఇదము) 1. దుష్కార్యము; 2. పరువము.

**క్రొవ్వు** (దే.అ.క్రి.) : మదించు. వి. 1. మదము; 2. మెదడు.

**క్రొవ్వుఁగొను** (దే.అ.క్రి.) : (క్రొవ్వు + కొను) మదించు.



**క్రోఁతి** (దే.వి.) : కోఁతి యొక్క రూపాంతరము.

**క్రోడము** (సం.వి.అ.న.ఆ.స్త్రీ.) : 1.ఒడి; 2. ఱొమ్ము. అ.పుం. పంది.

**క్రోడాడు** (దే.స.క్రి.) : 1. (ఏనుఁగు లోనగునవి) కొమ్ములతోఁ బొడుచు; 2. (పంది) ముట్టెతో నేల కెల్లగించు; 3. (ఏనుఁగు లోనగునవి) కొమ్ము

లతోఁ బొడిచి దుమ్మెత్తి పైకిఁజల్లు; 4.(దుమ్ము లోనగువాని) ఎత్తిపైకిఁజల్లు (చూ. కోరాడు.)

**క్రోడీకరణము** (సం.వి.అ.న.) : 1. ఆలింగనము; 2. క్రోడీకరించుట.

**క్రోడీకరించు** (సం.స.క్రి.) : ఒకటిగా చేర్చు.

**క్రోడుఁడు** (సం.వి.అ.పుం.) : శనిగ్రహము.

**క్రోధన** (సం.వి.ఆ.స్త్రీ.) : బెండ. (అ.పుం.) : ఒక సంవత్సరము. (చూ.సంవత్సరము) (విణ.) కోపము గలది.

**క్రోధము** (సం.వి.అ.పుం.) : కోపము, కినుక.

**క్రోధి** (సం.వి.న్.పుం.) : ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము) (విణ.) : కోపము గలవాఁడు.

**క్రోధించే** (సం.అ.క్రి.) : కోపగిల్లు.

**క్రోయు** (దే.స.క్రి.) : విషమముగా చాఁచు.

**క్రోలు** (దే.స.క్రి.) : 1. అనుభవించు; 2. తిను; 3. త్రాగు; 4. గ్రహించు.

**క్రోలుకసవు** (ద్వ.వి.) : తృణశేషము, నడము.

**క్రోలుచే** (దే.అ.క్రి.) : కూయు, శబ్దించు. ప్రే.క్రోలఁజేయు. (రూ. క్రోల్చు శబ్దించుటకు)

**క్రోవ** (దే.వి.) : సరము.

**క్రోవి** (యు.దే.వి.): 1. గొట్టము; 2. ఆసుపోసెడు గొట్టము; 3.తుపాకి మూఁక; 4. బుడ్డి; 5. భూమి లోపల నీళ్లువచ్చుట కేర్పఱచిన మార్గము

**క్రోశము** (సం.వి.అ.పుం.) : రెండువేల విండ్లపట్టు కొలఁది, కోసు.

**క్రోష్టము** (సం.వి.అ.పుం,న.) : గెనుసు.

**క్రోష్టుపుచ్ఛిక** (సం.వి.ఆ.స్త్రీ.) : కోలపొన్న, పొర్లుగాడి.

**క్రోష్టువిన్న** (సం.వి.ఆ.స్త్రీ.) : నక్కతోఁక పొన్న.

**క్రోష్టువు** (సం.వి.ఉ.పుం.) : జంబుకము, నక్క.

**క్రోష్టి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. ఆఁడునక్క; 2. తెల్లనేల గుమ్మడి; 3. లాంగలి. (లాంగలి శబ్దమునకు తరిగొఱ్ఱయు నీరు పిప్పలియు నర్థములు.)

## క్రౌ

**క్రౌంచదారణుఁడు** (సం.వి.అ.పుం.) : గుహుఁడు, కుమారస్వామి.

**క్రౌంచము** (సం.వి.అ.పుం.) : 1. ఒకానొక కొండ; 2. ఒకానొక ద్వీపము (చూ. ద్వీపము); 3. ఒకానొక పక్షి.

**క్రౌర్యము** (సం.వి.అ.న.) : క్రూరభావము.

## క్ల

**క్లమథము** (సం.వి.అ.పుం.) : శ్రమము, బడలిక.

**క్లమము** (సం.వి.అ.పుం.) : శ్రమము, బడలిక.

## క్లా

**క్లాంతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) బడలినది.

**క్లాంతి** (సం.వి.ఇ.స్త్రీ.) : క్లమము, బడలిక.

## క్లి

**క్లిన్నము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఆర్ద్రము, తడిసినది.

**క్లిశితము** సం.విణ. (అ.ఆ.అ.) దారిద్ర్యాదులచేత క్లేశమునొందినది.

**క్లిష్టము** (సం.వి.అ.న.) : ఒకానొక శబ్ద దోషము. (విణ.) : 1. దారిద్ర్యాదుల చేత క్లేశము నొందినది; 2. పూర్వోత్తర విరుద్ధమయినది. (వాక్కు.)

## క్లీ

**క్లీతకము** (సం.వి.అ.న.) : అతిమధురము.

**క్లీతకిక** (సం.వి.ఆ.స్త్రీ.) : నీలిచెట్టు.

**క్లీబము** (సం.వి.అ.న.) : నపుంసకము. (విణ.): విక్రమములేనిది.

## క్లే

**క్లేదము** (సం.వి.అ.న.) : ఆర్ద్రత, తడి.

**క్లేశము** (సం.వి.అ.పుం.) : 1. దుఃఖము; 2. కోపము; 3. వ్యవసాయము.

## క్లో

**క్లోమము** (సం.వి.న్.న.) : కడుపులో నొక ప్రక్కనుండెడి యెఱ్ఱనిమాంసము, నీరు తిత్తి (అని కొందఱు.)

## క్వ

**క్వణనము** (సం.వి.అ.పుం.) : వీటిలో నగువాని మ్రోఁత.

**క్వణము** (సం.వి.అ.పుం.) : వీటిలో నగువాని మ్రోఁత.

**క్వథితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చక్కఁగా కాఁగినది.

**క్వయినా** (ఆం.వి.) : శీతజ్వరముల కౌషధము.

## క్వా

**క్వాణము** (సం.వి.అ.పుం.) : క్వణము యొక్క రూపాంతరము.

**క్వాథము** (సం.వి.అ.పుం.) : బాధ.

**క్వాథోద్భవము** (సం.వి.అ.న.) : మ్రాని పసుపున వండిన అంజన విశేషము.

## క్వి

**క్విట్రెంటు** ఆం.వి. మాన్యములమీఁద నీయఁబడు అల్పమైన పన్ను.

## క్ష

**క్షంత** (సం.విణ.) : (ఋ.ఈ.ఋ) క్షమిత, ఓర్పరి.

**క్షణద** (సం.వి.ఆ.స్త్రీ.) : రాత్రి. (అ.న.ము.) : నీళ్లు.

**క్షణదుఁడు** (సం.వి.అ.పుం.) : జోస్యుఁడు.

**క్షణనము** (సం.వి.అ.న.) : వధము, కొల.

**క్షణప్రభ** (సం.వి.ఆ.స్త్రీ.) : తటిత్తు, మెఱపు.

**క్షణము** (సం.వి.అ.పుం.) : 1. ఘటిక యందాఱవ పాలు; 2. తిరునాళ్ల; 3. పండుగ; 4. వ్యాపారము లేమి; 5. సమయము.

**క్షణియించే** (సం.స.క్రి.) : భోజనార్థము వరించు. (రూ. క్షణించు.)

**క్షతజము** (సం.వి.అ.న.) : రక్తము, నెత్తురు.

**క్షతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. గాయము నొందినది. 2. నాశము నొందినది.

**క్షతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. గాయము; 2. నాశము.

**క్షత్త** (సం.వి.ఋ.పుం.) : 1. శూద్ర స్త్రీ యందు క్షత్రియునికిఁ బుట్టినవాఁడు; (క్షత్రియ స్త్రీయందు శూద్రునికిఁ బుట్టిన వాఁడని పాఠాంతరము.) 2. దాసీ పుత్రుఁడు; 3. ద్వారపాలకుఁడు; 4. బ్రహ్మ; 5. సారథి.

**క్షత్ర బంధువు** (సం.విణ.ఉ.) : స్వధర్మము లేక క్షత్రియునకు బంధుమాత్రుఁడైన వాఁడు. (ఇది నింద యందు వచ్చును.)

**క్షత్రము** (సం.వి.అ.న.) : శరీరము, మేను.

**క్షత్రియ** (సం.వి.ఆ.స్త్రీ.) : రాచది.

**క్షత్రియాణి** (సం.వి.ఈ.స్త్రీ.) : రాచది.

**క్షత్రియి** (సం.వి.ఆ.స్త్రీ.) : రాచవాని పెండ్లాము.

**క్షత్రియుఁడు** (సం.వి.అ.పుం.) : రాచవాఁడు.

**క్షత్రుఁడు** (సం.వి.అ.పుం.) : రాచవాఁడు.

**క్షప** (సం.వి.ఆ.స్త్రీ.) : రాత్రి, రేయి.

**క్షపణకుఁడు** (సం.వి. అ.పుం.) : బౌద్ధ మతస్థుడు.

**క్షపణము** (సం.వి.అ.న.) : అశుచిభావము. (విణ.) : సిగ్గులేనిది.

**క్షపాకరుఁడు** (సం.వి.అ.పుం.) : చంద్రుఁడు.

**క్షమ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. ఓర్పు; 2. నేల. (అ.న.ము.) : యుక్తము. (విణ.) : చాలునది.

**క్షమి** (సం.విణ.) : (న్.ఈ.న్.) సహిష్ణువు, ఓర్పరి.

**క్షమించు** (సం.స.క్రి.) : ఓర్చు. (క్షమియించు అనియు)

**క్షమిత** (సం.విణ.) : (ఋ.ఈ.ఋ) సహిష్ణువు, ఓర్పరి.

**క్షముఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. శక్తుఁడు; 2. హితుఁడు.

**క్షయము** (సం.వి.అ.పుం.) : 1. అఱుఁదెవులు; 2. తగ్గుదల; (ఇది త్రి వర్గమునం దొక్కటి. చూ. వర్గము.) 3. ప్రళయము; 4. ఇల్లు.

**క్షయించు** (సం.అ.క్రి.) : క్షీణించు, తగ్గు.

**క్షయ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) క్షయింపఁ దగినది.

**క్షరము** (సం.వి.అ.న.) : నీళ్లు. (పుం.) : మబ్బు.

**క్షవధువు** (సం.వి.ఉ.పుం.) : 1.తుమ్ము; 2.దగ్గు.

**క్షవము** (సం.వి.అ.పుం.) : 1. తుమ్ము; 2. నల్లావలు.

## క్షా

**క్షాంతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఓర్వఁబడినది.

**క్షాంతి** (సం.వి.ఇ.స్త్రీ.) : క్షమ, ఓర్పు.

**క్షాత్రము** (సం.వి.అ.న.) : క్షత్రధర్మము.

**క్షామము** (సం.వి.అ.పుం.) : కఱవు. (విణ.) : కృశము.

**క్షారకము** (సం.వి.అ.పుం.) : 1. కసు గాయ; 2. (పక్షులు మత్స్యములు లోనగువానిఁ బట్టి వేసెడు) బుట్ట; 3. పసరు మొగ్గ. మొగ్గలగుమి. (అని కొందఱు)

**క్షారము** (సం.వి.అ.పుం.) : 1.ఉప్పు; 2.కారము; 3. గాజు; 4. బూడిద; 5. ఉమ్మెత్త.

**క్షారాబ్ధి** (సం.వి.ఇ.పుం.) : ఉప్పు సముద్రము.

**క్షారితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కాఁచినది.

**క్షారితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) పరస్త్రీ గమనాది దోషములచే దూఱఁబడినవాఁడు.

**క్షాళనము** (సం.వి.అ.న.) : కడుగుట.

**క్షాళితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కడుగఁ బడినది.

## క్షి

**క్షితి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1.నేల; 2.ఉనికి; 3.చిటిక వేయునంత కాలము; 4. నాశము.

**క్షితిధరము** (సం.వి.అ.పుం.) : పర్వతము, నేల తాలుపు.

**క్షితిపతి** (సం.వి.ఇ.పుం.) : రాజు, నేలఱేఁడు.

**క్షిప** (సం.వి.ఆ.స్త్రీ.) : క్షేపణము, ప్రేరేఁపించుట.

**క్షిప్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. త్రోయఁ బడినది 2. వైవఁబడినది.

**క్షిప్నువు** (సం.విణ.ఉ.) : తిరస్కరించువాడు.

**క్షిప్రము** (సం.క్రి.విణ.అ.న.) : శీఘ్రము. (విణ.): వడి గలది.

**క్షిప్రశ్యేనము** (సం.వి.అ.పుం.) : పక్షి విశేషము, ఏట్రింత.

**క్షియ** (సం.వి.ఆ.స్త్రీ.) : క్షయము, తగ్గుదల.

## క్షీ

**క్షీణము** (సం.విణ.) : (అ.ఆ.అ.) క్షయించినది.

**క్షీణించే** (సం.అ.క్రి.) : క్షీణమగు.

**క్షీబుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) క్రొవ్వినవాఁడు.

**క్షీరకాకోలి** (సం.వి.ఈ.స్త్రీ.) : పిన్నపాల చెట్టు.

**క్షీరము** (సం.వి.అ.న.) : 1. పాలు; 2. నీళ్లు. (శునక క్షీరము శూనారము.)

**క్షీరమోరట** (సం.వి.ఆ.స్త్రీ.) : చేకొణద.

**క్షీరవిదారి** (సం.వి.ఈ.స్త్రీ.) : నల్ల నేల గుమ్ముడు.

**క్షీరశుక్ల** (సం.వి.ఆ.స్త్రీ.) : తెల్ల నేల గుమ్ముడు.

**క్షీరాబ్ధి** (సం.వి.ఇ.పుం.) : పాలసముద్రము.

**క్షీరావి** (సం.వి.ఈ.స్త్రీ.) : చిఱుపాల.

**క్షీరాశము** (సం.వి.అ.పుం.) : హంస.

**క్షీరిక** (సం.వి.ఆ.స్త్రీ.) : పాలచెట్టు.

**క్షీరోదకన్యాయము** (సం.వి.అ.పుం.) : నీళ్లును పాలును గలసినట్లొక్కటిగాఁ గలసి యుండు ధర్మము.

**క్షీరోదము** (సం.వి.అ.పుం.) : పాల సముద్రము.

## క్షు

**క్షుణ్ణము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పొడి చేయcబడినది.

**క్షుణ్ణుcడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) వ్యుత్పన్నుcడు.

**క్షుతము** (సం.వి.అ.న.త్.స్త్రీ.) : తుమ్ము.

**క్షుతాభిజననము** (సం.వి.అ.పుం.) : నల్లావలు (క్షుధాభిజననమని కొందఱు)

**క్షుత్తు** (సం.వి.ధ్.స్త్రీ.) : ఆcకలి, బుభుక్ష.

**క్షుద్ర** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. ఈcగ, 2. తేనెటీcగ; 3.వేశ్య; 4.అంగహీనయగు ఆcడుది; 5.నాట్య మాడెడు ఆcడుది; 6. హింసించెడు ఆcడుది; 7. పులి చింత; 8. వాcకుడు.

**క్షుద్రకము** (సం.వి.అ.పుం.) : బాణ విశేషము, కుప్పెకోల.

**క్షుద్రము** (సం.విణ.) : (అ.ఆ.అ.) (చూ. క్షుద్రుcడు)

**క్షుద్రమూలకము** (సం.వి.అ.న.) : పిన్నముల్లంగి.

**క్షుద్రశంఖము** (సం.వి.అ.పుం.) : నత్తగుల్ల.

**క్షుద్రుcడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. అధముcడు 2. అల్పుcడు 3. లోభి. 4.హింసకుcడు.

**క్షుధ** (సం.వి.ఆ.స్త్రీ.) : క్షుత్తు, ఆcకలి.

**క్షుధితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఆcకలి గొన్నది.

**క్షుపము** (సం.వి.అ.పుం.) : కుఱుచ కొమ్మలును ఊడలును గలచెట్టు.

**క్షుబ్ధము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కలcత పెట్టcబడినది.

**క్షుభితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కలcత పెట్టcబడినది.

**క్షుమ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. నీలిచెట్టు; 2. నూనె యగిసె.

**క్షురకము** (సం.వి.అ.పుం.) : 1. గొలిమిడి; 2. పల్లేరు; 3. బొట్టుగు.

**క్షురప్రము** (సం.వి.అ.పుం.) : అర్ధ చంద్రబాణము.

**క్షురము** (సం.వి.అ.పుం.) : 1. మంగలికత్తి; 2. గొలిమిడి; 3. పల్లేరు.

**క్షురి** (సం.వి.న్.పుం.) : మంగలి.

**క్షురిక** (సం.వి.ఆ.స్త్రీ.) : మంగలికత్తి.

**క్షుల్లకము** (సం.వి.అ.పుం.) : నత్తగుల్ల. (విణ.): 1. అల్పము 2. నీచము 3. పేద.

## క్షే

**క్షేత్రజ్ఞుcడు** (సం.వి.అ.పుం.) : జీవుcడు. (విణ.): నేర్పరి.

**క్షేత్రము** (సం.వి.అ.న.) : 1. వరిమడి; 2. గణిత శాస్త్ర విశేషము; 3. పెండ్లాము; 4.శరీరము; 5. సిద్ధ స్థానము. (ఏనుగు యొక్క హస్త, వదన, దంత, శిరో, నయన, కర్ణ, గ్రీవా, గాత్రో, రః, కాయ, మేఢ్ర, పదములు పండ్రెండు క్షేత్రము లనcబడును)

**క్షేత్రాజీవుcడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) దున్నుకొని బ్రదుకువాcడు.

**క్షేత్రియము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మడియందుc బుట్టినది (తృణము)

**క్షేత్రియుcడు** (సం.విణ.అ.) : పరదారరతుcడు.

**క్షేపణము** (సం.వి.అ.న.) : ప్రేరేcపించుట.

**క్షేపణి** (సం.వి. ఈ.స్త్రీ.) : 1. ఓడనడపు గడ; 2. ఒకానొక వల.

**క్షేపము** (సం.వి.అ.పుం.) : 1.చిమ్ముట; 2.త్రుళ్లు; 3.దూఱు; 4.పూcత; 5. ప్రేరణము.

**క్షేపిష్ఠము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మిక్కిలి క్షిప్రము. (క్షిప్రము = శీఘ్రము)

**క్షేపీయము** (సం.విణ.) : (స్.ఈ.స్.) మిక్కిలి క్షిప్రము. (క్షిప్రము = శీఘ్రము)

**క్షేమ** (సం.వి.ఆ.స్త్రీ.) : పార్వతి.

**క్షేమంకరుcడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) మేలు చేయువాcడు.

**క్షేమతండులము** (సం.వి.అ.పుం.) : ప్రయాణ కాలమందు వట్టిచేతc బోక యింట నుండి కొలcదిcగాc గట్టికొని పోయెడు బియ్యము.

**క్షేమము** (సం.వి.అ.పుం,న.) : 1. కలిగినది చెడకుండుట; 2. శుభము. (పుం.) : బలు రక్కెస.

**క్షైత్రము** (సం.వి.అ.న.) : క్షేత్రముల సమూహము. (క్షేత్రము = వరిమడి)

## క్షో

**క్షోణి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. నేల; 2. ముంజ తృణముచే నల్లిన బ్రహ్మచారి మొలత్రాడు.

**క్షోదము** (సం.వి.అ.పుం.) : 1.నూఱుట; 2.పొడి.

**క్షోదిష్ఠము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మిక్కిలి క్షుద్రము. (క్షుద్రము = అల్పము)

**క్షోదీయము** (సం.విణ.) : (స్.ఈ.స్.) మిక్కిలి క్షుద్రము. (క్షుద్రము = అల్పము)

**క్షోభము** (సం.వి.అ.పుం.) : 1. కలఁత; 2. దోఁపుడు.

**క్షోభించు** (సం.అ.క్రి.) : కలఁతపడు.

**క్షోభితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కలఁత పెట్టఁబడినది.

## క్షౌ

**క్షౌద్రము** (సం.వి.అ.న.) : 1. తేనె; 2. నీళ్లు.

**క్షౌమము** (సం.వి.అ.న.) : 1. నారచీర; 2. నూనె యగిసె నార చీర; 3. కుందేటి త్రుప్పటి చీర (పుం,న.) : 1. తెల్లచీర; 2. యుద్ధార్థము వాకిటి మండపము మీఁదఁ గాని కొత్తళము మీఁదఁగాని యేర్పఱచిన గది.

**క్షౌరము** (సం.వి.అ.న.) : మంగలిపని.

**క్షౌరికుఁడు** (సం.వి.అ.పుం.) : మంగలి.

## క్ష్ణః

**క్ష్ణుతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) వాఁడి చేయఁబడినది.

## క్ష్మా

**క్ష్మా** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. నేల; 2. నిద్ర. (అ.న.ము.) : 1. స్థానము; 2. రాక్షసుఁడు.

**క్ష్మాజము** (సం.వి.అ.పుం.) : చెట్టు.

**క్ష్మాభృత్తు** (సం.వి.త్.పుం.) : 1. కొండ; 2. రాజు.

## క్ష్వి

**క్ష్వింక** (సం.వి.ఆ.స్త్రీ.) : ఎఱ్ఱని మొగము గల ఆఁడుకోఁతి. (అ.పుం.ము.) : ఎఱ్ఱని మొగముగల మగకోఁతి.

## క్ష్వే

**క్ష్వేడ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.సింహనాదము; 2.వెదురుసలాక. (అ.న.ము.) : 1.ఆవడ పువ్వు; 2.ఎఱ్ఱ జిల్లెడుకాయ. (పుం.) : 1. చెవుడు; 2. మ్రోఁత; 3.విషము. (విణ.) : 1.పొందరానిది; 2. వంకరైనది.

**క్ష్వేడితము** (సం.వి.అ.న.) : సింహనాదము.

**క్ష్వేళ** (సం.వి.ఆ.స్త్రీ.) : సింహనాదము. అ.పుం.ము. విషము.

**క్ష్వేళితము** (సం.వి.అ.న.) : సింహనాదము.

## ఖ

**ఖ** : ఒక యక్షరము.

**ఖంగుఖింగు** (దే.వి.) : ఆయుధము లొకటితో నొకటి తాఁకునప్పుడు కలిగెడు ధ్వన్యనుకరణము.

**ఖంజ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఛందోవిశేషము. (విణ.): కుంటిది.

**ఖంజనము** (సం.వి.అ.పుం.) : మంద పిచ్చుక, కాటుక పిట్ట (అని కొందఱు)

**ఖంజపాదము** (సం.వి.అ.పుం.) : బాల క్రీడావిశేషము, గంజనగాలు.

**ఖంజరి** (సం.వి.ఈ.స్త్రీ.) : వాద్య విశేషము.

**ఖంజరీటము** (సం.వి.అ.పుం.) : మంద పిచ్చుక, కాటుకపిట్ట. (అని కొందఱు)

**ఖండ** (సం.వి.ఆ.స్త్రీ.) : గర్భాధానాది విధి ప్రతిపాదక గ్రంథము.

**ఖండకము** (సం.వి.అ.పుం,న.) : గోఁచి.

**ఖండనము** (సం.వి.అ.న.) : నఱకుడు.

**ఖండపరశువు** (సం.వి.ఉ.పుం.) : 1. శివుఁడు; 2. పరశురాముడు; 3. రాహువు; 4. సున్నము పూయువాఁడు; 5. ఖండామలక మనెడు మందు.

**ఖండము** (సం.వి.అ.పుం,న.) : తునుక (పుం.): 1. పులకండము; 2. రత్నదోషము.

**ఖండశర్కర** (సం.వి.ఆ.స్త్రీ.) : పులకండము.

**ఖండా** (వై.గ్రా.వి.) : పెద్దకత్తి.

**ఖండించే** (సం.స.క్రి.) : ఖండము చేయు, నఱకు.

**ఖండిక, ఖండ్రిక** (గ్రా.) : చిన్నపల్లె.

**ఖండికము** (సం.వి.అ.పుం.) : ధాన్య విశేషము.

**ఖండిత** (సం.వి.ఆ.స్త్రీ.) : నాయకుఁడు రాత్రి మఱియొక దాని యింటికిపోయి యా చిహ్నాము లతో రాఁగా చూచి కోపము నొందిన నాయిక. (చూ. నాయిక)

**ఖండితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నఱకఁ బడినది.

**ఖండీ** (హిం.వి.) : పుట్టి.

**ఖండీరము** (సం.వి.అ.పుం.) : పచ్చపెసలు.

**ఖండువా** (గ్రా.వి.) : పైవస్త్రము.

**ఖంబు** (సం.వి.అ.న.): 1. ఆకాశము; 2.స్వర్గము; 3.అభావము; 4.ఇంద్రి యము; 5. తెలివి; 6. పట్టణము; 7. వరి మడి; 8. సుఖము; 9. సున్న. (చూ.కంబు)

**ఖగము** (సం.వి.అ.పుం.): 1. పక్షి; 2. బాణము; 3. గ్రహము.

**ఖగుఁడు** (సం.వి.అ.పుం.) : 1. సూర్యుఁడు; 2. వేలుపు.

**ఖగేశ్వరుఁడు** (సం.వి.అ.పుం.) : గరుత్మంతుడు.

**ఖచరము** (సం.వి.అ.పుం.): 1.పక్షి; 2. మేఘము; 3. గాలి.

**ఖచరుఁడు** (సం.వి.అ.పుం.) : 1. దేవుఁడు; 2. సూర్యుఁడు.

**ఖచించే** (సం.స.క్రి.) : చెక్కు, పొదుఁగు. (ఖచియించు అనియు.)

**ఖచితము** (సం.విణ.): (అ.ఆ.అ.) చెక్కఁబడినది.

**ఖజపము** (సం.వి.అ.పుం.) : మిళ్లి.

**ఖజాక** (సం.వి.ఆ.స్త్రీ.) : గరిఁటె.

**ఖజానా** (హిం.వి.) : ధనాగారము.

**ఖటిక** (సం.వి.ఆ.స్త్రీ.) : బలపము.

**ఖటిని** (సం.వి.ఈ.స్త్రీ.) : బలపము.

**ఖట్టి** (సం.వి.ఇ.స్త్రీ.) : పాడె.

**ఖట్టిక** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. గద్దియ; 2. పాడె.

**ఖట్టికుఁడు** (సం.వి.అ.పుం.) : వేఁటకాఁడు.

**ఖట్వ** (సం.వి.ఆ.స్త్రీ.) : పర్యంకము, మంచము.

**ఖడ్గము** (సం.వి.అ.పుం.) : 1. కత్తి; 2. ఖడ్గ మనెడు మృగము; 3. ఖడ్గ మృగము కొమ్ము.

**ఖడ్గి** (సం.వి.న్.పుం.) : ఖడ్గ మృగము. (విణ.): కత్తిగలవాఁడు.

**ఖతమాలము** (సం.వి.అ.పుం.) : 1. పొగ; 2. మబ్బు.

**ఖతిలకము** (సం.వి.అ.పుం.) : సూర్యుఁడు.

**ఖత్తు** (హిం.వి.) : రీతి, ఉత్తరము.

**ఖదిర** (సం.వి.ఆ.స్త్రీ.) : ముదుఁగుఁ దామర. (అ.పుం.ము.) : చంద్ర.

**ఖదిరుఁడు** (సం.వి.అ.పుం.) : ఇంద్రుఁడు.

**ఖద్ది** (దే.వి.) : బలము.

**ఖద్యోతము** (సం.వి.అ.పుం.) : మిడుఁగుఱుఁ బురువు.

**ఖద్యోతుఁడు** (సం.వి.అ.పుం.) : సూర్యుఁడు.

**ఖననము** (సం.వి.అ.పుం.) : 1. ఎలుక; 2. పందికొక్కు (రూ. ఖానకము)

**ఖనకుఁడు** (సం.వి.అ.పుం.) : 1. ఉప్పర వాఁడు; 2. కన్నపు దొంగ. (విణ.) : త్రవ్వెడుఁ వాడు.

**ఖని** (సం.వి.ఇ.స్త్రీ.) : రత్నములు పుట్టెడుచోటు, గని. (రూ. ఖాని)

**ఖనిత్రము** (సం.వి.అ.న.) : 1. గడ్డ పాఱ; 2. గుద్దలి.

**ఖనిత్రి** (సం.వి.ఈ.స్త్రీ.) : పాఱ.

**ఖపుటుఁడు** (సం.వి.అ.పుం.) : అన్న మాకులోఁ బెట్టుకొనక చేతఁ బెట్టుకొని భుజించు వ్రతము గలవాఁడు.

**ఖపురము** (సం.వి.అ.పుం.) : 1. పోఁక జబర; 2.పోఁకమ్రాను; 3.మ్రానిబంక; 4.నాగముస్తె.

**ఖర** (సం.వి.ఆ.స్త్రీ.) : డావరడంగి చెట్టు. అ.పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము) (న.ము.) : 1.ఎండు పోఁక; 2.వాఁడిమి; 3.వేఁడిమి. (విణ.) : 1. వాఁడిమిగలది 2. వేఁడిమి గలది.

**ఖరకరుఁడు** (సం.వి.అ.పుం.) : సూర్యుఁడు.

**ఖరకుటి** (సం.వి.ఈ.స్త్రీ.) : మంగలియిల్లు.

**ఖరణసుఁడు** (సం.విణ.) : (స్.అ.ఆ.అ.) వాఁడియైన ముక్కుగలవాఁడు, గద్ద ముక్కువాఁడు.

**ఖరపుష్ప** (సం.వి.ఆ.స్త్రీ.) : వాయింట.

**ఖరమంజరి** (సం.వి.ఈ.స్త్రీ.) : ఉత్తరేను.

**ఖరము** (సం.వి.అ.పుం.) : గాడిద.

**ఖరాగా** (హిం.క్రి.విణ.) : సరిగా, స్థిరముగా.

**ఖరాశ్వ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఓమము.

**ఖరీదు** (హిం.వి.) : వెల.

**ఖరుఁడు** (సం.వి.అ.పుం.) : ఒక రాక్షసుఁడు. (విణ.) : 1. వాఁడి మిగల వాఁడు; 2. వేఁడిమి గలవాఁడు.

**ఖరువు** (సం.వి.ఉ.పుం.) : 1.గర్వము; 2. గుఱ్ఱము; 3. పల్లు; 4. శివుడు. (విణ.) : తెల్లనిది.

**ఖర్చే** (హిం.వి.) : వ్రయము.

**ఖర్జువు** (సం.వి.ఊ.స్త్రీ.) : 1. తీఁట; 2. ఒకానొక పురుగు; 3. చిట్టీఁదు.

**ఖర్జూరము** (సం.వి.అ.న.) : వెండి. (పుం.) : 1.తేలు; 2.పేరీఁదు; 3.(బ.) : ధాన్య విశేషము.

**ఖర్జూరి** (సం.వి.ఈ.స్త్రీ.) : చిట్టీఁదు.

**ఖర్పరము** (సం.వి.అ.పుం.) : 1. బిచ్చ మెత్తెడు కప్పెర; 2. తలపుఱ్ఱె.

**ఖర్పరి** (సం.వి.ఈ.స్త్రీ.) : పాలతుత్తము.

**ఖర్పరుఁడు** (సం.వి.అ.పుం.) : దొంగ.

**ఖర్వటము** (సం.వి.అ.పుం.) : కొండ దొన నాశ్రయించి యుండెడుపల్లె. కమ్మరి వడ్లంగి లోనగు వారుండెడు పల్లె. (అనికొందఱు) నన్నూఱు గ్రామములు గల పరగణాకు ముఖ్య గ్రామము. (అని కొందఱు) (ఖర్పటమని కొన్ని పుస్తకముల యందుఁ గానఁ బడుచున్నది.)

**ఖర్వము** (సం.వి.అ.న.) : సంఖ్యా విశేషము. (విణ.) : 1. అధమము; 2. పొట్టి.

**ఖలతి** (సం.విణ.ఇ.) : బట్టతలవాఁడు.

**ఖలపవు** (సం.విణ.) : (ఊ.ఈ.ఉ.) కళ్లము నూడ్చువాఁడు.

**ఖలము** (సం.వి.అ.న.) : 1. చోటు; 2. నేల; 3. పాపము (పుం.) : కళ్లము. (విణ.) : 1. అధమము; 2. క్రూరము; 3. నీచము.

**ఖలిని** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. కళ్లముల సమూహము; 2. ఖలుల సమూహము; 3. ముర యనెడు గంధ ద్రవ్యము.

**ఖలీనము** (సం.వి.అ.పుం.న. ) : గుఱ్ఱపు కళ్లెము (రూ. ఖలినము)

**ఖల్య** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. కళ్లముల సమూహము; 2. ఖలుల సమూహము.

**ఖల్లము** (సం.వి.అ.పుం.) : 1. తోలు; 2. పల్లము; 3. వస్త్ర విశేషము; 4. వాన కోయిల.

**ఖల్వాటుఁడు** (సం.విణ.) : (అ.ఈ.అ.) బట్టతల వాఁడు.

**ఖసూచి** (సం.విణ.ఇ.) : ప్రతిభ లేనివాఁడు.

**ఖస్థసము** (సం.వి.అ.పుం.) : గసగసా.

**ఖఘూరిక** (సం.వి.ఆ.స్త్రీ.) : సాముకూటము, గరిడీ.

## ఖా

**ఖాండవము** (సం.వి.అ.న.) : ఇంద్రుని యొక్క ఒకానొక వనము.

**ఖాటి** (సం.వి.ఇ.స్త్రీ.) : పాడె. (రూ. ఖాటిక)

**ఖాణము** (వై.గ్రా.వి.) : గుఱ్ఱము మొదలగు వానియొక్క యులవలు లోనుగాఁగల భక్ష్యము.

**ఖాతకము** (సం.వి.అ.న.) : అగడ్త. (రూపఖాతిక)

**ఖాతము** (సం.వి.అ.న.) : పుష్కరిణి, కోనేఱు.

**ఖాతకుఁడు** (సం.విణ.) : (అ.ఈ.అ.) 1. త్రవ్వెడు వాఁడు; 2. అప్పు తీసెడు వాఁడు.

**ఖాదకుఁడు** (సం.విణ.) : (అ.ఈ.అ.) 1. తిను వాఁడు; 2. అప్పుతీసెడువాఁడు.

**ఖాదనము** (సం.వి.అ.న.) : 1.తినుట; 2.తిండి; 3. పల్లు.

**ఖాదితము** (సం.విణ.) :(అ.ఆ.అ.) తినఁబడినది.

**ఖాదిరము** (సం.వి.అ.పుం.) : కవిరియుండ.

**ఖాద్యము** (సం.వి.అ.న.) : తినఁదగిన బండము. (విణ.) : తినఁదగినది.

**ఖామందు** (హిం.వి.) : యజమాని, స్వంతగాఁడు.

**ఖాముఖా** (హిం.క్రి.విణ.) : అగత్యముగా, గట్టిగా.

**ఖాయము** (హిం.విణ.) : స్థిరము, శాశ్వతము, రూఢి.

**ఖారి** (సం.వి.ఈ.స్త్రీ.) : పుట్టి, ఇద్దుము. (అని కొందఱు.)

**ఖారీకము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పుట్టెఁడు విత్తులు విత్తఁదగినది. (పొలము)

**ఖాలీ, ఖాళీ** (హిం.విణ.) : ఆక్రమింపఁబడని, ఉత్త.

**ఖాసా** (హిం.విణ.) : స్వంత.

**ఖి**

**ఖిన్నము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఖేదము నొందినది.

**ఖిలము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1.దున్న నిది (నేల); 2. చెడినది (దున్నని నేల యను నర్థము నందు నపుంసకమని కొందఱు)

**ఖిలీభవించే** (సం.అ.క్రి.) : చెడు.

**ఖు**

**ఖుద్దున** (హిం.క్రి.విణ.) : స్వంతముగా.

**ఖురణసుఁడు** (సం.విణ.) : (స్.అ.ఆ. అ.) బుఱ్ఱ ముక్కువాఁడు.

**ఖురము** (సం.వి.అ.పుం.) : 1. గొరిజ. 2. నఖ మనెడు గంధ ద్రవ్యము.

**ఖురముఖము** (సం.వి.అ.న.) : బూరగొమ్ము.

**ఖురళి** (సం.వి.ఈ.స్త్రీ.) : సాము. (రూ. ఖురళిక)

**ఖురాకము** (సం.వి.అ.పుం.) : మృగ విశేషము.

**ఖురాలకము** (సం.వి.అ.పుం.) : ఇనుప బాణము.

**ఖుర్దనము** (సం.వి.అ.న.) : క్రీడ, ఆట.

**ఖులాసా** (హిం.వి.) : సౌఖ్యము, నెమ్మది.

**ఖుల్లకము** (సం.విణ.) : (అ.ఆ.అ.) క్షుల్లకము, అల్పము.

**ఖుల్లసు** (హిం.వి.) : వివరము.

**ఖే**

**ఖేంఖాణము** (సం.వి.అ.పుం.) : గుఱ్ఱము.

**ఖేచరము** (సం.వి.అ.పుం.) : మృగ విశేషము.

**ఖేచరుఁడు** (సం.వి.అ. పుం.) : వేలుపు. (విణ.): ఆకాశమున సంచరించు వాఁడు.

**ఖేటకము** (సం.వి.అ.న.) : 1. డాలువాఱు 2. గ్రామ విశేషము.

**ఖేటము** (సం.వి.అ.పుం,న.) : 1. పంట కాఁపు లుండెడు పల్లె, వర్తకులుండెడు పేట (అని కొందఱు) 2. డాలువాఱు 3. కఫము. (విణ.): అధమము.

**ఖేదము** (సం.వి. అ.పుం.) : శోకము.

**ఖేయము** (సం.వి.అ.న.) : అగడ్త. నీళ్లు పాఱుటకుఁ గట్టిన ఆనకట్ట.

**ఖేల** (సం.వి.ఆ.స్త్రీ.) : క్రీడ, ఆట.

**ఖై**

**ఖైదీ, కైది** (హిం.వి.) : చెఱలో నుంచఁబడిన వాఁడు.

**ఖైదు, కైదు** (హిం.వి.) : చెఱ, కారాగృహము.

**ఖో**

**ఖోడుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) కుంటివాఁడు.

**ఖోలకము** (సం.వి.అ.పుం.) : 1. కుల్లాయ; 2. పోఁకచిప్ప; 3. పుట్ట.

## ఖ్యా

**ఖ్యాతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) వాసికెక్కినది.

**ఖ్యాతి** (సం.వి.ఇ.స్త్రీ.) : ప్రసిద్ధి, వాసి.

## గ

**గ** : ఒక యక్షరము.

**గంగ** (ఉభ.దే.విణ.) : 1. పూజ్యము; (గంగగోవు. మొ.) 2. పెద్ద. (గంగ రావి. మొ.) (సం.వి. ఆ.స్త్రీ.) : ఒకానొక యేఱు. (పంచ గంగలు : కావేరి, తుంగభద్ర, కృష్ణవేణి, గౌతమి, భాగీ రథి, ఆకాశ గంగమందాకిని, పాతాళగంగ భోగవతి)

**గంగడోలు** (దే.వి.) : ఆవులకును ఎడ్లకును మెడ క్రింద వ్రేలాడెడు తోలు, సాస్న.

**గంగమయిలావు** (ద్వ.వి.) : (గంగ మయిల + ఆవు) నలుపును పసుపును గలసిన వర్ణముగల ఆవు.

**గంగమ్మ** (ద్వ.వి.) : (గంగ + అమ్మ) ఒకానొక గ్రామదేవత. (రూ. గంగనమ్మ)

**గంగరావి** (దే.వి.) : బ్రాహ్మదారువు.

**గంగరేను** (దే.వి.) : పెద్దరేఁగు, లికుచము.

**గంగాజలములు** (సం.వి.అ.న.బ.) : ధాన్య విశేషము.

**గంగాధరుఁడు** (సం.వి.అ.పుం.) : శివుఁడు, మిన్నువాఁక తాలుపు.

**గంగాళము** (దే.వి.) : ఇత్తడి రాగి లోనగువానితోఁ జేసిన నీళ్లకొప్పెర.

**గంగి** (దే.విణ.) : 1. పూజ్యము; (గంగెద్దు) 2. యజ్ఞియము.

**గంగెద్దు** (దే.వి.) : (గంగి + ఎద్దు) బిచ్చపు దాసరులు శృంగారించి తీసుకొని వచ్చెడి యెద్దు. (రూ. గంగిరెద్దు)

**గంజ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. కల్లమ్మెడి యిల్లు; 2. గని. (ఒకానొక కవి గంజాహాలలు పాంశు నభుజించి యని ప్రయోగించి యున్నాఁడు. అక్కడ గంజా శబ్దమునకు గంజాయి యర్థమగు చున్నది. అది విచారణీయము.) (అ.పుం, న.ము.) : బండారము. (పుం.) : తిరస్కారము.

**గంజి** (వై.వి.) : అన్నరసము.

**గంజిగుల్ల** (వై.వి.) : నీటిబుగ్గవలె లేచెడి బొబ్బ.

**గంజితొరక** (ద్వ.వి.) : గంజిమీఁది మీఁగడ.

**గంజ** (దే.వి.) : కృషికి యోగ్యమైన భూమి.

**గంజనగాలు** (ద్వ.వి.) : బాలక్రీడా విశేషము.

**గంజాయి** (వై.వి.) : కైపు పుట్టించునట్టి యొక్క వస్తువు, కళంజము.

**గంజో** (దే.వి.) : బజాఱు. (అప్ర.)

**గంట** (యు.దే.వి.) : గడ్డిదుబ్బు, తృణ స్తంబము. (వై.) : 1. వాద్య విశేషము; 2. కాల విశేషము.

**గంటకట్టు** (దే.అ.క్రి.) : గంట యేర్పడి నదియగు.

**గంటము** (దే.వి.) : తాటాకు వ్రాయుటకు నుపయుక్తమైన యుక్కు సాధనము.

**గంటలమ్మ** (వై.వి.) : (గంటల + అమ్మ) ఒకానొక గ్రామదేవత.

**గంటవేఁట** (ద్వ.వి.) : వేఁటలో భేదము. (చూ. ఏదువేఁట)

**గంటి** (దే.వి.) : 1. గాయము, క్షతి; 2. దుఃఖము.

**గంటు** (దే.స.క్రి.) : గాయము చేయు. (వి.) 1. గనుపు; 2. ముడి; 3. రూకలముడి; 4. వెంద్రుకలముడి.

**గంటుబారంగి** (ద్వ.వి.) : ఒకానొక మందుచెట్టు.

**గంటువెట్టు** (దే.స.క్రి.) : (గంటు + పెట్టు) (కోపముచే మొగము) ముడుఁచు.

**గంటె** (దే.వి.) : 1. గరిటె; 2. సజ్జపైరు. (బ.) సజ్జలు.

**గంటెకామ** (దే.వి.) : ఒకానొక చెట్టు.

**గంట్లకచోరము** (ద్వ.వి.) : షడ్గ్రంథిక.

**గంట్లకానుగు** (దే.వి.) : షడ్గ్రంథము.

**గంట్లము** (దే.వి.) : గర్భిణులకోరిక, దోహదము.

**గండ** (దే.వి.) : మ్రొక్కుబడి. (గండదల, గండ దీపము. మొ.)

**గండఁడు** (వై.వి.) : శూరుఁడు.

**గండకత్తెర** (వై.వి.) : మెడకత్తిరించుకొనెడి యొక దినుసు కత్తెర.

**గండకము** (సం.వి.అ.పుం.) : 1. ఖడ్గ మృగము; 2. జోస్యము; 3. భేదము; 4. విఘ్నము; 5. సంఖ్యా విశేషము.

**గండగొడ్డలి** (వై.వి.) : పరశువు.

**గండగొడ్డలితాలుపు** (ద్వ.వి.) : పరశురాముఁడు.

**గండడఁగు** (ద్వ.అ.క్రి.) : (గండు + అడఁగు) 1. పరాక్రమహీనుఁడగు; 2. చచ్చు.

**గండదల** (దే.వి.) : (చూ. గండ.)

**గండపెండరము** (ద్వ.వి.) : గండ పెండారము యొక్క రూపాంతరము.

**గండపెండారము** (ద్వ.వి.) : (గండఁడు + పెండారము) శూరులు బిరుదుగా కాలను ధరించెడి యందియ.

**గండభేరుండము** (సం.వి.అ.పుం.) : పక్షి విశేషము. (పక్షి విశేషమని చెప్పుచున్నారు గాని ప్రయోగముల యందు మృగపర్యాయముల తోడఁజేర్చి చెప్పఁబడి యున్నది.)

**గండమాల** (సం.వి.ఆ.స్త్రీ.) : మెడచుట్టు గడ్డలు లేచెడు వ్యాధి విశేషము.

**గండము** (సం.వి.అ.పుం.) : 1. ఏనుఁగు చెక్కిలి; 2. చెక్కిలి; 3. ఒక గ్రహ యోగము; (చూ. యోగము) 4. ఖడ్గ మృగము; 5. గుండ్రాయి; 6. గుఱుతు; 7. గుఱ్ఱపు సొమ్ము; 8. పుండు; 9. పొక్కు; 10. నీటిమీఁది బుగ్గ.

**గండరగండఁడు** (వై.వి.) : శూరులకెల్ల శూరుఁడు.

**గండరించు** (దే.అ.క్రి.) : పుట్టు.

**గండరులు** (వై.వి. బ.) : తునుకలు.

**గండరువు** (దే.వి.) : పడియచ్చు.

**గండవడము** (వై.వి.) : తెర.

**గండశైలము** (సం.వి.అ.పుం.) : 1. కొండ నుండి జాఱిపడిన పెద్దఱాయి; 2. కోయిల; 3. నొసలు.

**గండాడు** (ద్వ.అ.క్రి.) : (గండు+ఆడు) రమించు.

**గండారు** (దే.వి.) : చెఱసాల.

**గండాలి** (సం.వి.ఈ.స్త్రీ.) : తీఁగగఱిక.

**గండి** (వై.వి.) : 1. బిలము; 2. రంధ్రము; 3. సందు; 4. నీళ్లధికముగా వచ్చుట చేత దెగిన చెఱువుకట్ట సందు.

**గండిక** (వై.వి.) : గండి యొక్క రూపాంతరము.

**గండిదొంగ** (ద్వ.వి.) : కన్నపుదొంగ, ఖనకుఁడు.

**గండివనము** (వై.వి.) : గ్రంథిపర్ణము.

**గండీరము** (సం.వి.అ.న.) : చిట్టికూర. (పుం.) : 1. ఏఱువంగ; 2. తురుజకూర.

**గండీరి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. చిట్టికూర; 2. ములుజెముడు.

**గండు** (వై.వి.) : 1. పౌరుషము; 2. బలము; 3. పశుజాతియందు మగది.

**గండుఁడు** (సం.వి.అ.పుం.) : శూరుఁడు.

**గండూపదము** (సం.వి.అ.పుం.) : కించులికము, ఎఱ్ఱ.

**గండూపది** (సం.వి.ఈ.స్త్రీ.) : శిలి, ఆఁడుఎఱ్ఱ.

**గండూషము** (సం.వి.అ.పుం.) : 1. పుక్కిలింత; 2. పుడిసిలి; 3. తొండము చివర.

**గండూషించు** (సం.స.క్రి.) : పుక్కిలించు.

**గండె** (వై.వి.) : చేఁప.

**గండోలము** (సం.వి.అ.పుం.) : కుచ్చులమీను.

**గండోలి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. ఎఱ్ఱ తుమ్మెద; 2. కఱుఁదురీఁగ. (రూ. గంధోలి)

**గండ్ర** (యు.దే.విఱ.) : 1. ధృష్టుఁడు; 2. పెద్దది. (గండ్రచీమ.మొ.) బ. పరుషము. (వై.వి.) : ఖండములు.

**గండ్రచీమ** (దే.వి.) : పెద్దనీల్లచీమ, ఉలంగవము.

**గండ్రించు** (వై.స.క్రి.) : ఖండించు.

**గండ్రికలు** (వై.వి.బ.) : ఖండములు.

**గంత** (ఉభ.వై.వి.) : 1. మెత్తగాఁ బఱచు కొనుటకై ప్రాఁత గుడ్డలను జేర్చి దట్టముగాఁ గుట్టిన బొంత; 2. ఎద్దు లోనగువాని మీఁద వేసెడు గంత. (సం.విఱ.): (ఋ.ఈ.ఋ) పోవువాఁడు.

**గంతవ్యుడు** (సం.విఱ.) : (అ.ఆ.అ.) పోఁదగిన వాఁడు.

**గంతు** (దే.వి.) : దుముకు.

**గంతుకొను** (దే.అ.క్రి.) : 1. దుముకు; 2. చచ్చు.

**గంత్రి** (సం.వి.ఈ.స్త్రీ.) : గాడీబండి.

**గందపట్టె** (వై.వి.) : తలుపుమీఁద నమర్చెడి యడ్డుకొయ్య.

**గందపుఁగొండ** (వై.వి.) : (గందము + కొండ) మలయపర్వతము. (ఇట్లు గందపు మల. మొ.)

**గందపుమ్రాను** (ద్వ.వి.) : (గందము + మ్రాను) చందన వృక్షము.

**గందపొడి** (ద్వ.వి.) : (గందము+పొడి) కొన్ని గంధ ద్రవ్యములఁజేర్చి చేసిన పొడి, చూర్ణము.

**గందము** (వై.వి.) : చందనము.

**గంధకము** (సం.వి.అ.పుం.) : అంగడి మందు దినుసు.

**గంధకారి** (సం.వి.ఈ.స్త్రీ.) : ముడుఁగు దామర.

**గంధకుటి** (సం.వి.ఈ.స్త్రీ.) : ముర యనెడు గంధద్రవ్యము.

**గంధగజము** (సం.వి.అ.పుం.) : మదపుటేనుఁగు.

**గంధగర్భము** (సం.వి.అపుం.) : కొండమారెడు.

**గంధనము** (సం.వి.అ.న.) : 1.ఎతిఁగించుట; 2. నలుగిడుట; 3.నొప్పించుట; 4. వెలిఁగించుట.

**గంధనాకులి** (సం.వి.ఈ.స్త్రీ.) : సర్పాక్షి.

**గంధపిండీతకము** (సం.వి.అ.పుం.) : వెలికి.

**గంధఫలి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. ప్రేంక ణము; 2. సంపెఁగమొగ్గ. (రూ. గండఫలి)

**గంధమాదనము** (సం.వి.అ.పుం.) : 1. ఒకానొక కొండ; 2. ఒకానొక కోఁతి; 3. మగ తుమ్మెద; 4. మదపుటేనుఁగు.

**గంధము** (సం.వి.అ.పుం.) : 1.వాసన; 2.గంధకము; 3. గర్వము; 4. లేశము; 5. సంబంధము.

**గంధమూలము** (సం.వి.అ.పుం.) : 1. అడవి చోరము; 2. కొండబెండ.

**గంధమూలి** (సం.వి.ఈ.స్త్రీ.) : గండ్లకచోరము.

**గంధమూషి** (సం.వి.ఈ.స్త్రీ.) : చుంచు, ఛుచుందరి.

**గంధమృగము** (సం.వి.అ.పుం.) : పునుఁగుపిల్లి.

**గంధరసము** (సం.వి.అ.పుం.) : బోళము, గోపము.

**గంధరాజము** (సం.వి.అ.పుం.) : ఒకానొక గంధద్రవ్యము.

**గంధర్వము** (సం.వి.అ.పుం.) : 1. మృగ విశేషము; 2. గుఱ్ఱము; 3. అంతర పిశాచము; 4. మగకోయిల.

**గంధర్వహస్తకము** (సం.వి.అ.పుం.) : ఆముదపుచెట్టు.

**గంధర్వుఁడు** (సం.వి.అ.పుం.) : 1. దేవయోని విశేషము; 2. పాట పాడువాఁడు.

**గంధవతి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. కల్లు; 2. వ్యాసుని తల్లి; 3. నేల; 4. ఒకానొక పట్టణము.

**గంధవహ** (సం.వి.ఆ.స్త్రీ.) : నాసిక, ముక్కు.

**గంధవహుఁడు** (సం.వి.అ.పుం.) : వాయువు, గాలి. (రూ. గంధవాహుఁడు)

**గంధసారము** (సం.వి.అ.పుం.) : చందనము, గందము.

**గంధాఖువు** (సం.వి.ఉ.పుం.) : గంధ మూషి, చుంచు.

**గంధాశ్మము** (సం.వి.న్.పుం.) : గంధకము.

**గంధిక** (సం.వి.ఆ.స్త్రీ.) : గంధకము.

**గంధిని** (సం.వి.ఈ.స్త్రీ.) : మురయనెడి గంధ ద్రవ్యము.

**గంధిలము** (సం.వి.అ.పుం.) : పెద్దజాతి నక్క, వఱడు. (విణ.) : వాసన గలది.

**గంధోత్తమ** (సం.వి.ఆ.స్త్రీ.) : మద్యము, కల్లు.

**గంప** (దే.వి.) : వెదురుబద్దలు లోనగు వానితో నల్లినది, కండోలము.

**గంపపులుఁగు** (దే.వి.) : కుక్కుభము.

**గంబుర** (వై.వి.) : కర్పూరము.

**గంబురా** (వై.వి.) : కర్పూరము.

**గంభారి** (సం.వి.ఈ.స్త్రీ.) : గుమ్ముడు.

**గంభీరము** (సం.విణ.) : (అ.ఆ.అ.) లోఁతుగలది.

**గంభీరవేది** (సం.వి.న్.పుం.) : తోలు దోఁగు నట్లును నెత్తురు కాఱునట్లును కండ యూడు నట్లును బరిగోలల తోడను అంకుశముల తోడను పొడిచి యెంత బాధ పెట్టినను ఒళ్లెఱుఁగ కుండునట్టి మదపు టేనుఁగు.

**గంభీరిమ** (సం.వి.న్.పుం.) : గంభీర భావము.

**గగనము** (ఉభ. వై.విణ.) : దుర్లభము. (సం.వి. అ.న.) : ఆకాశము.

**గగురు** (దే.వి.) : భయహర్షాదులచేత మేని వెంద్రుకలు నిక్కపొడుచుట, రోమాంచము.

**గగురుపాటు** (ద్వ.వి.) : రోమాంచము కలుగుట.

**గగురుపు** (దే.అ.క్రి.) : రోమాంచము. (రూ. గగుర్పు. "గగుర్పు కూర్పు." చంద్ర.)

**గగురుపొడుచు** (దే.అ.క్రి.) : రోమాంచితమగు.

**గగురుపొడుపు** (దే.వి.) : గగురుపాటు. (రూ. గగుర్పొడుపు.)

**గగ్గు** (యు.దే.అ.క్రి.) : సంకోచించు (వై.వి. ) : సంతోషాదులచేతఁ గలిగెడు గొంతడుపు, గద్గదిక.

**గగ్గురు** (దే.వి.) : గగురు యొక్క రూపాంతరము.

**గగ్గులకాడు** (దే.వి.) : ధాన్యమురాల్చిన కంకుల సమూహము. (ఇత్యాది ప్రయోగముల యందు గగ్గులకాడై అనఁగా గగ్గులకాటి వంటిదై యనుట. నిస్సారమై అని అర్థము.)

**గగ్గులు** (దే.వి.బ.) : గింజలు రాల్చిన కంకులు. (గగ్గులు జల్లలోపోసి తీసికొనిరా.)

**గగ్గెర** (దే.వి.) : ఒకానొక చెట్టు. (ఇది తెల్లగగ్గెర, నల్ల గగ్గెర అని ద్వివిధము.)

**గగ్గోలు** (దే.వి.) : కలఁత, క్షోభము.

**గగ్గోలువడు** (ద్వ.అ.క్రి.) : (గగ్గోలు + పడు) కలఁగు, క్షోభించు.

**గచ్చ** (దే.వి.) : గ్రచ్చకు మొదటి రూపము.

**గచ్చే** (యు.దే.వి.) : 1. కాంతి; 2. పూఁత; 3. గారపూఁత.

**గచ్చేకొను** (దే.స.క్రి.) : పట్టుకొను.

**గచ్చులాడి** (దే.వి.) : (గచ్చులు + ఆఁడి) బయటికి యోగ్యురాలి వలె నటించునట్టి ఆఁడుది.

**గచ్చేవిచ్చగు** (దే.అ.క్రి.) : (గచ్చువిచ్చు + అగు) (కార్య) వైకల్యమగు.

**గజకర్ణము** (సం.వి.అ.పుం.) : ఏనుఁగు చెవివంటి యొక దినుసు విసనకఱ్ఱ.

**గజత** (సం.వి.ఆ.స్త్రీ.) : గజ సమూహము.

**గజదంతము** (సం.వి.అ.పుం.) : అభినయ హస్త విశేషము.

**గజనిమీలనము** (సం.వి.అ.న.) : కపటము.

**గజభక్ష్య** (సం.వి.ఆ.స్త్రీ.) : అందుగు.

**గజము** (సం.వి.అ.పుం.) : 1. ఏనుఁగు (గజ జాతులు మూడు : భద్రము, మందము, మృగము అని. త్రివిధ గజములకును మానభేదముచే అరాళము,అత్యరాళము, మధ్యము, కనిష్ఠము, వామనము అని నామములు గలవు. మఱియు పిష్టకము, వ్యాళము, పూతనము, మాతృకము, మాయుకము, పంచ మంగళము అని గజ భేదము లనేకములు కలవు. గజము యొక్క శిరః పిండములు కుంభములు. కుంభముల క్రింది చోటు ఆరక్షము. వాని నడిమి చోటు విదువు. చెక్కిలికటము. నొసలు అవగ్రహము. కనుగ్రుడ్డు ఈషిక. కడగంటి చోటు నిర్యాణము. కర్ణ మూలము చూళిక. దంతమూలము కరీరిక, దంతమధ్యము శంఖము. అడ్డముగా విసరఁ బడిన కొమ్ముదెబ్బ పరిణామము. నొసటిబుడిపి వాత కుంభము. వాతకుంభము క్రింది చోటు వాహిత్థము. వాహిత్థము క్రింది కొమ్ముల లోపలి చోటు ప్రతిమానము. తొండము శుండ. తొండము చివర కర్ణిక. తొండమున వచ్చు తుంపురులు వమథువు. ముఖము నందలి బొట్ల గుంపు పద్మకము. మూఁపు ఆసనము. మోఁకాలు ప్రోహము. మోఁకాటి క్రింది చోటు సందానము. పిక్కకు ముందటి చోటు అయ స్కారము. ప్రక్క చోటు పక్షభాగము. ముందటి చోటు దంత భాగము. ముందటి కాళ్ల పిక్కలు మొదలుగాఁగల చోటు గాత్రము. వెనుకటి కాళ్లపిక్కలు మొదలుగాఁ గల చోటు అవరము. మెడను గట్టెడు గొలుసు కలాపకము. కాళ్లఁ గట్టెడు గొలుసు త్రిపది. నడుమునఁ గట్టెడు

మోకు వరత్ర. దీనిని ఆయితము సేయు నపుడు మెడను గట్టెడు త్రాడు సజ్జన. వీఁపు మీఁదఁ బఱచు కంబళము విధానము. గంతశారి. ఇది నీళ్లమునుఁ గుట నిర్వాణము. దీని అలంకారము శృంగారము. దీనిఁ బట్టుటకు త్రవ్వెడు పల్లము అవపాతము. దీనికిఁ గలిగెడు పిత్త జ్వరము పాకలము. మదము దానాది. దానాదులు ౮. చూ. మదము) 2. మూడడుగుల కొలఁది; 3. వాస్తు స్థాన విశేషము.

**గజయాన** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. ఏనుఁగు నడకవంటి నడకగల ఆఁడుది; 2. ఆఁడుది. (ఇట్లు ఇభయాన. మొ.)

**గజరిపువు** (సం.వి.ఉ.పుం.) : సింహము, ఏనుఁగుగొంగ.

**గజాననుఁడు** (సం.వి.అ.పుం.) : వినాయకుఁడు, ఏనుఁగు మోము సామి.

**గజిబిజి** (దే.వి.) : 1. కలఁత; 2. నలఁగుడు; 3. సందడి. (విణ.) : 1. కలఁగినది; 2. నలఁగినది.

**గజిబిజించే** (దే.అ.క్రి.) : కలఁగు.

**గజ్జి** (వై.వి.) : తీఁటకుఱుపు, కచ్చువు.

**గజ్జియ** (దే.వి.) : గజ్జె

**గజ్జె** (దే.వి.) : కింకిణి (గజ్జియ యొక్క రూపాంతరము)

**గజ్జెగొలుసు** (ద్వ.వి.స్త్రీ.) : పాదాభరణ విశేషము, పాఁజేబులు.

**గజే** (వై.విణ.) : పెద్ద. (ఉదా. గజనిమ్మ.)

**గజేగజ** (దే.వి.) : వడఁకుట యందగు ననుకరణము.

**గజేనిమ్మ** (ద్వ.వి.) : లకుచము చెట్టు.

**గజేము** (దే.వి.) : తుపాకికి మందు గట్టించెడి యినుప సలాక.

**గజ్జే** (దే.వి.) : తొడసందు, వంక్షణము.

**గజ్జే** (వై.వి.) : మదము.

**గజ్జేరము** (వై.వి.) : ఖర్జూరము.

**గటక** (దే.వి.) : పిండితోఁజేసిన జావ.

**గట్ట** (వై.వి.) : సిద్దెనోటికి వేసి గట్టించెడు బిరడ.

**గట్టన** (వై.వి.) : గట్టించుట. (గులకపోసి గట్టనచేసినాఁడు.)

**గట్టి** (దే.విణ.) : 1. కఠినము; 2. దృఢము; 3. ఉచ్చైర్నాదముకలది. (వాఁడు గట్టి మాటాడఁడు)

**గట్టించు** (వై.స.క్రి.) : గట్టునచేయు.

**గట్టినబోది** (దే.వి.) : బాలక్రీడా విశేషము.

**గట్టివ** (ద్వ.విణ.) : (గట్టి+వా) ధూర్తుఁడు.

**గట్టివా** (ద్వ.విణ.) : 1. గట్టిగ మాటలాఁడు వాఁడు, గట్టిగ మాటలాఁడునది; 2. ధూర్తుడు, ధూర్తురాలు. (గట్టివకు మొదటి రూపము.)

**గట్టివాఁడు** (దే.విణ.) : సమర్థుఁడు. (మహాత్త్య మహదర్థక రూపము గట్టిది.)

**గట్టివాయి** (ద్వ.విణ.) : గయ్యాళి, ధూర్తురాలు.

**గట్టు** (వై.వి.) : 1. తీరము; 2. కొండ.

**గట్టుద్రిమ్మరి** (ద్వ.వి.) : (గట్టు + త్రిమ్మరి) కోఁతి, అగచరము. (ఇట్లు తిప్ప త్రిమ్మరి, మల త్రిమ్మరి. మొ.)

**గట్టుతాలుపు** (ద్వ.వి.) : విష్ణువు, నగధరుఁడు.

**గట్టుదాయ** (వై.వి.) : ఇంద్రుఁడు, నగవైరి.

**గట్టువాలు** (ద్వ.వి.) : సైరంధ్రి. (పర్వతము వలెఁ బ్రవర్తించునది–అనఁగా పురుష సాంగత్యముఁ గోరక ధైర్యముతో నుండునదియని వ్యుత్పత్త్యర్థము)

**గట్టురాచూలి** (ద్వ.వి.) : పార్వతి, గిరిజ.

**గట్టులతేఁడు** (ద్వ.వి.) : హిమవంతుఁడు, నగాధిపుఁడు. (ఇట్లు గట్టులరాయఁడు, గట్ల రాయఁడు. మొ.)

**గట్టువాలు** (దే.వి.) : విచ్చలవిడియై యొకరి యిండ్ల నుండి శృంగారించుట లోనగు పనులు చేయు నట్టి ఆఁడుది.

**గట్టువిలుకాఁడు** (ద్వ.వి.) : శివుఁడు, శైలధన్వుఁడు. (ఇట్లు గుబ్బవిలు కాఁడు. మొ.)

**గట్టువిలుతుఁడు** (ద్వ.వి.) : శివుఁడు, శైల ధన్వుఁడు. (ఇట్లు మల విలుతుఁడు. మొ.)

**గట్రాచూలి** (ద్వ.వి.) : గట్టురాచూలి యొక్క రూపాంతరము.

**గడ** (వై.వి.) : 1. నిడుపాటికోల; (ఏతపు గడ, చెఱకుగడ, వెదురుగడ, దొమ్మరి గడ మొ.) 2. సమూహము; 3. ఓడ కంబము; 4. కంబము.

**గడగడ** (దే.వి.) : వడఁకుట యందగు ననుకరణము.

**గడగడలాడు** (దే.అ.క్రి.) : (గడగడలు + ఆడు) వడఁకు. (వాఁడు నన్ను చూచిన గడగడ లాడును.)

**గడచీల** (ద్వ.వి.) : ఏతపుబానయం దమర్చి యుండెడు దండెపుఁ బీఁటలు తగుల్చుటకు గడతల నుండెడు చీల.

**గడన** (వై.వి.) : 1. ఎన్నిక; 2. స్తోత్రము; 3. సంపాదనము.

**గడనకత్తె** (వై.వి.) : బోగముది, వేశ్య.

**గడనపడఁతి** (ద్వ.వి.) : బోగముది, వేశ్య.

**గడప** (దే.వి.) : వాకిటి క్రింది భాగము, దేహళి (చూ. కడప)

**గడబడ, గడిబిడి** (గ్రా.వి.) : అల్లరి, అతి తొందర.

**గడము** (ఉభ.దే.వి.) : కుండలోనగువాని మూఁత. 1. గండెచేఁప; 2. విఘ్నము.

**గడవంచె, గడమంచె** (హిం.వి.) : మూటల క్రింద నుంచునది.

**గడసాదన** (వై.వి.) : సాము, వ్యాయామము.

**గడసె** (దే.వి.) : అటుక. (అప్ర.)

**గడి** (దే.వి.) : ఎల్ల. సీమము.

**గడించు** (వై.స.క్రి.) : 1. సంపాదించు; (గడి యించు అనియు.) 2. కల్పించు.

**గడికాళ్లువేయు** (దే.స.క్రి.) : (రెండు రెండు పశు వులను ఒక్కొక్కకాలు చేర్చి లంకె వేయు. (ఆవులను పొలములో గడికాళ్లు వేసిరా.)

**గడితపడు** (వై.అ.క్రి.) : (గడితము+పడు) గట్టిపడు.

**గడితము** (వై.వి.) : 1. తఱచు; 2. ముదుగు. (విణ.) : 1. తఱచైనది; 2. ముదుగైనది.

**గడిత్రాడు** (దే.వి.) : (రెండు రెండు పశువులను) ఒక్కొక్కకాలు చేర్చి లంకెవేసెడు పలుపు.

**గడిదేఱు** (దే.అ.క్రి.) : (గడి + తేఱు) సమర్థుఁడగు. (వాఁడు అన్నిట గడి దేఱినాఁడు.)

**గడిదొంగ** (దే.వి.) : ఒళవెఱిఁగిన దొంగ.

**గడిపోతు** (దే.విణ.) : ఆఁబోతు.

**గడియ** (వై.వి.) : 1. ఇరువది నాలుగు నిమిషముల కాలము; 2. గడెమ్రాను.

**గడియారము** (వై.వి.) : కాలపరిమాణమును దెలుపునట్టి యొక యంత్రము.

**గడు** (దే.వి.) : దారు విశేషము.

**గడులుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) కుబ్జుఁడు, మఱుగుజ్జు.

**గడువు** (ఉభ. దే.వి.) : నిర్ణయకాలము. (సం. ఉ.పుం.) : కణితి.

**గడుసరి** (దే.విణ.) : (గడుసు + అరి) 1.అసాధ్యుఁడు; 2.కఠినుఁడు; (స్వార్థమున అరి.) 3. ధైర్యము గలవాఁడు.

**గడుసు** (దే.వి.) : 1. కాఠిన్యము; 2. ధైర్యము. (చూ. గడుసువడు.) (విణ.) : 1.అసాధ్యము; 2.కఠినము.

**గడుసువడు** (ద్వ.అ.క్రి.) : (గడుసు + పడు) ధీరుఁడగు.

**గడె** (వై.వి.) : గడియ యొక్క రూపాంతరము.

**గడెకారి** (అర. వి.) : బల్లెముగలవాఁడు, పోకిరి.

**గడ్డ** (వై.వి.) : 1. దుంప; 2. వ్రణము; 3.మంటి పెల్ల; 4. ద్వీపము.

**గడ్డపలుగు** (ద్వ.వి.) : గుంటకపలుగు. (చూ. గంటక, పలుగు.)

**గడ్డపాఱ** (ద్వ.వి.) : నేలపెల్లగించెడు సాధన విశేషము, ఖనిత్రము.

**గడ్డప్రొయ్యి** (ద్వ.వి.) : గడ్డలుగా ఏర్పఱచిన పొయ్యి. (చూ. ప్రొయ్యి.)

**గడ్డము** (వై.వి.) : 1. చిబుకము; 2. శ్మశ్రువు.

**గడ్డి** (దే.వి.) : కసవు, తృణము.

**గడ్డిపాము** (దే.వి.) : ఒక విధమైన పాము.

**గడ్డిపిట్ట** (ద్వ.వి.) : పక్షివిశేషము.

**గడ్డిబొద్దు** (దే.వి.) : చుట్టుకుదురు.

**గడ్డు** (దే.విణ.) : 1. అసాధ్యము; 2. మిక్కిలి. (గడ్డుపనులే, గడ్డుఱుకు. మొ.)

**గడ్డుకొను** (దే.అ.క్రి.) : అతిశయించు.

**గణకుఁడు** (సం.వి.అ.పుం.) : 1.జోస్యుఁడు; 2. కరణమువాఁడు. (మేదిన్యాది నిఘంటువుల యందిది ఇకార మధ్యమ ముగా నున్నది.)

**గణగణ** (దే.వి.) : ఘంటా ధ్వని యందుగు ననుకరణము. (గంటగణగణ మ్రోఁగు చున్నది.)

**గణన** (సం.వి.ఆ.స్త్రీ.) : ఎన్నిక.

**గణనీయము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఎంచఁ బడినది.

**గణపతి** (సం.వి.అ.పుం.) : వినాయకుఁడు.

**గణము** (సం.వి.అ.పుం.) : 1. సమూహము; 2. ప్రమథుల సమూహము; 3. సేనావిశేషము. (ఇరువది యేడు రథములు అన్ని యేనుఁగులు ఎనుబది యొక్క గుఱ్ఱములు నూట ముప్పది యేవురు కాల్బురును గలది)

**గణరాత్రము** (సం.వి.అ.న.) : పెక్కు రాత్రుల సమూహము.

**గణరూపము** (సం.వి.అ.పుం.) : జిల్లేడు.

**గణహాసకము** (సం.వి.అ.పుం.) : 1. నల్ల కచోరము; 2. బలురక్కెస.

**గణాధిపుఁడు** (సం.వి.అ.పుం.) : 1. వినాయకుఁడు; 2. శివుఁడు.

**గణి** (సం.వి.ఇ.పుం.) : సాంగముగా వేదాధ్య యనము చేసినవాఁడు.

**గణించు** (సం.స.క్రి.) : 1. ఎంచు; 2. లక్ష్య పెట్టు.

**గణిక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. వేశ్య; 2. ఆడేనుఁగు; 3. అడవిమొల్ల; 4. నెల్లి.

**గణికారిక** (సం.వి.ఆ.స్త్రీ.) : నెల్లి.

**గణితము** (సం.వి.అ.న.) : గణిత శాస్త్రము, అంకవిద్య. (విణ.) : ఎంచఁ బడినది.

**గణితవ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఎంచఁదగినది.

**గణిల్లు** (దే.వి.) : ఎద్దు అంకె వేయుట లోనగువాని యందగు ధ్వన్యనుకరణము. (గంటలు గణిల్లని మ్రోఁగుచున్నవి. వాఁడు గణిల్లని మాటలాడు చున్నాఁడు.)

**గణుతి** (వై.వి.) : 1. ఎన్నిక; 2. స్తోత్రము; 3. లక్ష్యము. (చూ. గణుతించు)

**గణుతించు** (వై.స.క్రి.) : 1. ఎంచు; 2. స్తోత్రము చేయు; 3. లక్ష్యముచేయు.

**గణెము** (దే.వి.) : వేషధారులు ధరించెడి లక్క సొమ్ము.

**గణేయము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఎంచఁ దగినది.

**గణ్యుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఎంచఁ దగినవాడు.

**గతపడు** (మి.అ.క్రి.) : (గతము+పడు) 1. కడచు; 2. చచ్చు.

**గతము** (సం.వి.అ.న.) : పోక. (విణ.) : 1. పోయినది; 2. తెలియఁబడినది.

**గతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. పోక; (ధన గతులు మూడు : దానము, భోగము, నాశము) 2. త్రోవ; 3. నారిపుంటి కంటిత్రోవ; 4. తెలివి; 5. ఉపాయము; 6. బాల్యములోనగు దశ; 7. విధము. (ఈ యర్థమునకు తెనుఁగున వాడుక.)

**గతించు** (సం.అ.క్రి.) : 1. కడచు; 2. చచ్చు.

**గతుకు** (దే.స.క్రి.) : ఎంగిలితిను. (వి.) : ఎంగిలి తినుట.

**గత్త** (దే.వి.) : ఎరువు. (రూ. గత్తము)

**గత్తర** (దే.వి.) : ఉపద్రవము. (వాఁడు చాల గత్తర పడ్డాఁడు)

**గత్తు** (దే.వి.) : మూత్రగంధము.

**గద** (సం.వి.ఆ.స్త్రీ.) : గుదియ. (అ.పుం.ము.) : తెవులు. (డు.) : కృష్ణుని తమ్ముఁడు.

**గదమాయించు** (గ్రా.క్రి.) : గద్దించు.

**గదాగ్రజుఁడు** (సం.వి.అ.పుం.) : గదునియన్న, విష్ణువు.

**గదాధరుఁడు** (సం.వి.అ.పుం.) : గదునియన్న, విష్ణువు.

**గది** (ఉభ.దే.వి.) : ఇంటిలోపలి యఱ. (సం.వి. న్.పుం.) : గదను ధరించినవాఁడు. విష్ణువు. (విణ.) : తెవులు గలవాఁడు.

**గదుకు** (దే.స.క్రి.) : ఎంగిలితిను. (వి.) : ఎంగిలి తినుట. (గతుకు యొక్క రూపాంతరము)

**గదుము** (దే.స.క్రి.) : గద్దించు.

**గదుముకొను** (దే.స.క్రి.) : గద్దించు.

**గదురు** (దే.వి.) : చెడుకంపు, దుర్గంధము.

**గద్గదము** (సం.విశే.) : (అ.ఆ.అ.) డగ్గుత్తిక పడినది. (మాట)

**గద్గదస్వరము** (సం.వి.అ.పుం.) : 1. ఎనుబోతు; 2. డగ్గుత్తిక పడిన యెలుఁగు.

**గద్గదిక** (సం.వి.ఆ.స్త్రీ.) : డగ్గుత్తిక.

**గద్ద** (వై.వి.) : పక్షి విశేషము, గృధ్రము.

**గద్దగోరు** (వై.వి.) : చోరసాధన విశేషము.

**గద్దముక్కువాఁడు** (ద్వ.విశే.) : (చూ.) ఖరణసుఁడు.

**గద్దరి** (దే.విశే.) : దిట్టతనము కలది.

**గద్దరికాఁడు** (దే.విశే.) : దిట్టతనము కలవాఁడు. (స్వార్థమున కాఁడు.)

**గద్దించు** (దే.అ.క్రి.) : కోపమున అదలించు.

**గద్దియ** (వై.వి.) : 1. ఉన్నత పీఠము; 2. సింహాసనము. (చూ. గద్దె)

**గద్దువ** (దే.వి.) : గడ్డము.

**గద్దె** (వై.వి.) : 1. ఉన్నతపీఠము; 2. సింహాసనము; 3. వరహా; 4. సోదె.

**గద్దెపొంకము** (ద్వ.వి. ) : పరువునకుఁ దగిన గౌరవంపు మాట.

**గద్యాణము** (సం.వి.అ.న.) : ఒక బంగారు నాణెము, వరహా.

**గనగన** (దే.వి.) : 1. తపించుటయందగు ధ్వన్యను కరణము; 2. మండుట యందగు ధ్వన్యను కరణము.

**గనప** (దే.విశే.) : పెద్ద.

**గనయము** (దే.వి.) : 1.పోఁకముడి; 2. వింటి కొప్పు.

**గని** (వై.వి.) : 1. బంగారులోనగునవి పుట్టుచోటు; 2. బిలము.

**గనిమ** (దే.వి.) : మడికిఁజుట్టు నేర్పఱచిన చిన్నకట్ట.

**గనియ** (వై.వి.) : ఖండము.

**గనీబు** (దే.వి.) : ఒఱ.

**గనుపు** (దే.వి.) : వెదురుచెఱకులోనగువాని యందెడనెడ నేర్పడియుండు ముడి, పర్వము. (చూ. కనుపు)

**గనె** (వై.వి.) : గనియ యొక్క రూపాంతరము.

**గన్నెరాకమ్ము** (ద్వ.వి.) : (గన్నెరు+ఆకు+అమ్ము) గన్నెరాకు వంటి యలుఁగు గల బాణ విశేషము.

**గన్నెరు** (దే.వి.) : గన్నేరు యొక్క రూపాంతరము.

**గన్నేరు** (దే.వి.) : కరవీరము. (ఎఱ్ఱ గన్నేరు, తెల్లగన్నేరు, పచ్చగన్నేరు అని ఇది త్రివిధము)

**గపటిక** (సం.వి.ఆ.స్త్రీ.) : పరిగపైరు.

**గప్పాలు** (హిం.వి.) : జంభాలు, అతిశయపు మాటలు.

**గబీలు** (దే.వి.) : మండుటయందగు ధ్వన్యను కరణము. (ఆ యడవి గబీలున మండుకున్నది. కడుపులో గబీలు మనుచున్నది.

**గబ్బా** (దే.వి.) : కలఁత. (విశే.) : వెల తక్కువైనది. (పసుపు, కంద, చేమ, గెనసు, పెండలము మొదలగు వస్తువు)

**గబ్బి** (వై.వి.) : గాంభీర్యమునుబట్టి కుక్క కియ్యఁ బడిన పేరు. (విశే.) : గర్వము గలవాఁడు.

**గబ్బిడాయి** (దే.వి.) : గబ్బిలము, తైలపాయిక.

**గబ్బిలము** (దే.వి.) : గబ్బిలము, తైలపాయిక.

**గబ్బిలాయి** (దే.వి.) : గబ్బిడాయి యొక్క రూపాంతరము.

**గబ్బిలి** (దే.వి.) : పిడికిలి. (గబ్బెఁడు కూరతే.)

**గబ్బిస** (దే.వి.) : ఒకానొక మూలిక.

**గబ్బు** (యు.దే.వి.) : దుర్గంధము. (వై.) : 1. గర్వము; 2. మదము.

**గబ్బుచీఁకటి** (దే.వి.) : గాఢాంధకారము.

**గబ్బుచెంకమెకము** (ద్వ.వి.) : ఏనుఁగు.

**గబ్బులుఁగు** (దే.వి.) : ఒకానొక శకునపు పక్షి, భాసంతము.

**గభస్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : అగ్ని పెండ్లాము. (పుం.): 1. సూర్య కిరణము; 2. సూర్యుడు.

**గభీరము** (సం.విణ.) : (అ.ఆ.అ.) గంభీరము యొక్క రూపాంతరము.

**గభీరిమ** (సం.వి.న్.పుం.) : గంభీరిమ యొక్క రూపాంతరము.

**గభోళి** (సం.వి.ఇ.స్త్రీ.) : ఒఱగుదిండు, ప్రగ్రీవము.

**గమకము** (ఉభ.దే.వి.) : యత్నము. (విణ.) : 1.అధికము; 2.మనోజ్ఞము. (సం.వి.అ.పుం.) : సంగీత శాస్త్రము నందు స్వరవిన్యాస భేదము. (విణ.) : తోఁపఁజేయునది.

**గమకించు** (దే.అ.క్రి.) : యత్నించు.

**గమగమ** (దే.వి.) : వాసనకొట్టుట యందగు ననుకరణము.

**గమగమించు** (దే.అ.క్రి.) : గమగమ యని వాసనకొట్టు.

**గమనము** (సం.వి.అ.న.) : 1. పోక; 2. ప్రయాణము; 3. తలఁపు.

**గమనించే** (సం.అ.క్రి.) : 1. పోవు; 2. తలఁచు.

**గమనిక** (ఉభ.దే.వి.) : విధము.

**గమము** (సం.వి.అ.పుం.) : 1. పోక; 2. ప్రయాణము; 3. త్రోవ.

**గమాయించే** (దే.అ.క్రి.) : గమగమించు.

**గమి** (దే.వి.) : సమూహము. (విణ.) : తఱచు.

**గమించు** (సం.అ.క్రి.) : పోవు. (గమి యించు అనియు.)

**గమికత్తె** (ద్వ.వి.) : అంతఃపురము నందు కావలి యుండెడు ఆఁడుది.

**గమికాఁడు** (దే.వి.) : 1. అధిపతి; 2. సేనాధిపతి; 3. ముఖ్యజనుఁడు.

**గమికొను** (దే.అ.క్రి.) : ప్రోగువడు.

**గమ్మతు** (హిం.వి.) : వేడుక.

**గమ్ము** (దే.వి.) : వాసనకొట్టుట యందగు ననుకరణము.

**గమ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పొందఁ దగినది.

**గయ** (సం.వి.ఆ.స్త్రీ.) : తీర్థ విశేషము. (అ.పుం.ము.) : పశువు. గయుడు. ఒక చక్రవర్తి.

**గయాళము** (దే.వి.) : గయ్యాళము యొక్క రూపాంతరము.

**గయాళి** (దే.విణ.) : గయ్యాళి యొక్క రూపాంతరము.

**గయాళించే** (దే.అ.క్రి.) : గయ్యాళించు యొక్క రూపాంతరము.

**గయాళు** (దే.వి.) : సేద్యము చేయుటకుఁ దగని పొలము.

**గయ్యాళము** (దే.వి.) : ధిక్కారపు మాట.

**గయ్యాళి** (దే.విణ.) : (గయ్యాళము+ఇ) ధిక్కరించి మాటాడునది.

**గయ్యాళించు** (దే.అ.క్రి.) : ధిక్కరించి మాటాడు.

**గర** (దే.వి.) : గడ్డ, ముద్ద.

**గరకట్టు** (దే.అ.క్రి.) : గడ్డకట్టు.

**గరకొను** (దే.అ.క్రి.) : గరకట్టు, గడ్డకట్టు.

**గరగ** (వై.వి.) : 1. చిన్నకుండ; 2. నీళ్లు త్రాగుట లోనగువాని కుపయోగించెడు చిన్న పాత్రము.

**గరగడ** (దే.వి.) : (గరగ + గడ) నూనె మొదలయినవి చిన్న నోరుగల పాత్రము లలోఁ బోయుటకు అడుగున ఆఁదోఁక వలె క్రోవి యమర్చి చేసిన విశాల ముఖపాత్ర విశేషము.

**గరగర** (దే.విణ.) : నిర్దోషము; నిర్మలము. (కర్మధారయ సమాసము నందు దీనికి నిగాగ మంబు వచ్చును. గరగరని నెఱికురులు. మొ.)

**గరగలిక** (దే.వి.) : 1. నైర్మల్యము; 2. అందము.

**గరజి** (సం.వి.ఇ.పుం.) : ఒక కరణము. (చూ. కరణము)

**గరదుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) విషము పెట్టువాఁడు.

**గరము** (సం.వి.అ.పుం.) : 1. ఒక కరణము, (చూ. కరణము) 2. కృత్రిమ విషము.

**గరవడు** (ద్వ.అ.క్రి.) : (గర+పడు) గడ్డకట్టు.

**గరళము** (సం.వి.అ.న.) : 1. విషము; 2. కసవు ప్రోగు; 3. కొలఁది.

**గరాగరి** (సం.వి.ఈ.స్త్రీ.) : డావరగండి. (రూ. ఖరాగరి)

**గరాసు** (వై.విణ.) : దుష్టుఁడు.

**గరిఁటె** (దే.వి.) : ఇనుముతోఁగాని యిత్తడితోఁ గాని చేసిన తెడ్డు (రూ. గంటె)

**గరిడి** (వై.వి.) : 1. సాము; 2. సాము కూటము; 3. చోటు; 4. సమీపము.

**గరిడిముచ్చే** (ద్వ.వి.) : మంచివానివలె దగ్గఱఁ జేరియుండి సమయముచూచి దొంగిలించెడు దొంగ.

**గరిడియ** (వై.వి.) : బుట్ట.

**గరిత** (వై.వి.) : 1. ఇల్లాలు; 2. పతివ్రత.

**గరిమ** (సం.వి.న్. పుం.) : గొప్పతనము. (రూ. గరిమము)

**గరిమిడికొక్కు** (దే.వి.) : పందికొక్కు, మూషిక.

**గరివడియము** (వై.వి.) : వంటక విశేషము.

**గరివించు** (వై.అ.క్రి.) : గర్వపడు.

**గరిష్ఠము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మిక్కిలి గురువు.

**గరిసె** (వై.వి.) : 1. ధాన్యముంచెడు కొట్టు; 2. మానవిశేషము.

**గరిసెబావి** (వై.వి.) : మెల్లెలతో గరిసె వలెనల్లి భూమిలోపలికి కుంచియెత్తెడు నూయి.

**గరీబు** (హిం.వి.) : బీదవాఁడు.

**గరు** (దే.వి.) : రోమాంచము.

**గరుజు** (హిం.వి.) : అక్కర, అగత్యము.

**గరుటామంతుఁడు** (వై.వి.) : గరుత్మంతుఁడు.

**గరుటాలమంతుఁడు** (వై.వి.) : గరుటామంతుఁడు యొక్క రూపాంతరము.

**గరుడకంబము** (వై.వి.) : (గుడి యందలి) గరుడస్తంభము.

**గరుడధ్వజుఁడు** (సం.వి.అ.పుం.) : విష్ణువు, వెన్నుఁడు.

**గరుడపచ్చ** (వై.వి.) : మరకతము.

**గరుడసరులు** (వై.వి.బ.) : మేలయిన శాలిధాన్య విశేషము.

**గరుడాగ్రజుఁడు** (సం.వి.అ.పుం.) : గరుత్మంతుని యన్న అనూరుఁడు.

**గరుడి** (వై.వి.) : గరుత్మంతుఁడు.

**గరుడిరవుతు** (వై.వి.) : విష్ణువు, గరుడ వాహనుఁడు.

**గరుడుఁడు** (సం.వి.అ.పుం.) : గరుత్మంతుఁడు, గరుడి.

**గరుత్తు** (సం.వి.త్.పుం.) : పక్షము, ఱెక్క.

**గరుత్మంతము** (సం.వి.త్.పుం.) : పక్షి.

**గరుత్మంతుఁడు** (సం.వి.త్.పుం.) : గరుడుఁడు, గరుడి.

**గరుపాటు** (ద్వ.వి.) : గగురపాడుపు.

**గరుపాటుమొన** (ద్వ.వి.) : పందిమూతి ముట్టె.

**గరుపాఱు** (దే.అ.క్రి.) : రోమాంచితమగు.

**గరుము** (వై.విణ.) : గులకఱాలచేత గట్టియైనది. (గరుపనేల.)

**గరువము** (వై.వి.) : 1. గర్వము; 2. గౌరవము; 3. విరివి.

**గరువు** (యు.దే.వి.) : చెంప. (వై.విణ.) : గులకఱాలచే గట్టియైనది. (నేల.)

**గరుసు** (యు.దే.వి.) : 1.మర్యాద, మేర; 2.తోలు.

**గర్గరి** (సం.వి.ఈ.స్త్రీ.) : పెరుగుచిలికెడు కుండ, తరిగడవ.

**గర్జ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. (మేఘము లోనగువాని) ధ్వని; 2. సింహనాదము.

**గర్జనము** (సం.వి.అ.న.) : 1. (మేఘము లోనగువాని) ధ్వని; 2. కోపము.

**గర్జించు** (సం.వి.అ.క్రి.) : 1. (మేఘము లోనగువాని) ధ్వనించు; 2. కోపించు.

**గర్జితము** (సం.వి.అ.న.) : (మేఘము లోనగు వాని) ధ్వని. (పుం.) : మదపు టేనుఁగు.

**గర్తము** (సం. వి. అ. పుం.) :1. పల్లము; 2. పిఱుఁదుల మీఁది గుంతలు; 3. త్రిగర్త దేశ విశేషము.

**గర్తాటము** (సం.వి.అ.పుం.) : 1. ఎలుక; 2. పందికొక్కు.

**గర్దభము** (సం.వి.అ.న.) : తెల్లగలువ. (పుం.) : 1. గాడిద; 2. గంధ విశేషము.

**గర్ధభాండము** (సం.వి.అ.పుం.) : కలజువ్వి.

**గర్ధనము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఇచ్ఛగలది, గృధ్నువు.

**గర్భకము** (సం.వి.అ.న.) : వెండ్రుకల లోపల ముడుచుకొన్న పూదండ.

**గర్భము** (సం.వి.అ.పుం.) : 1. కడుపు; 2. కడుపు లోని పిండము; (గర్భ సంస్కారములు మూడు ఆధానికము, పుంసవనము, సీమంతోన్నయనము) 3. బిడ్డ; 4. ఒక నాటకసంధి. (చూ.సంధి.)

**గర్భాగారము** (సం.వి.అ.న.) : లోపలి గది, ఓవరి.

**గర్భాశయము** (సం.వి.అ.పుం.) : గర్భమును జుట్టుకొని యుండెడు సంచి, మావి.

**గర్భిణి** (సం.వి.ఈ.స్త్రీ.) : చూలాలు, అంతర్వత్ని.

**గర్ముత్తు** (సం.వి.త్.న.) : తృణసస్య విశేషము, గంటె.

**గర్వము** (సం.వి.అ.పుం.) : 1. అహంకారము; 2. మదము.

**గర్వి** (సం.విణ.) : (న్.ఈ.న్.) గర్వము గలవాఁడు.

**గర్వించు** (సం.అ.క్రి.) : గర్వపడు.

**గర్వితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) గర్వించిన వాఁడు.

**గర్హణము** (సం.వి.అ.న.) : నింద, దూఱు.

**గర్హించు** (సం.స.క్రి.) : నిందించు, దూఱు.

**గర్హితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నిందింపఁ బడినది.

**గర్హ్యవాది** (సం.విణ.) : (న్.ఈ.న్) (చూ.) కద్వదుఁడు.

**గర్హ్యుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. అధముఁడు; 2. నిందింపఁ దగినవాఁడు.

**గఱగఱ** (దే.వి.) : భక్ష్యములు నమలుట యందగు ధ్వన్యనుకరణము. (వరుగులు గఱగఱ నములు చున్నాడు.)

**గఱగఱలాడు** (దే.అ.క్రి.) : (గఱగఱలు + ఆడు) గఱగఱయని మ్రోఁగు.

**గఱగొఱ** (దే.వి.) : తక్కువ.

**గఱి** (వై.వి.) : 1. ఱెక్క; 2. బాణము ఱెక్క.

**గఱిక** (దే.వి.) : ఒక దినుసు కసవు, దూర్వ.

**గఱికచెక్క** (ద్వ.వి.) : పచ్చికతోడిమట్టి పెల్ల, పచ్చికపెల్ల. (గఱిక మోడిచెక్క అనియు.)

**గఱికమ్మి** (ద్వ.వి.) : (గఱుకు + కమ్మి) గఱిబద్ద. (సంధిని వర్ణలోప వర్ణ వికారములు)

**గఱికసూదులు** (ద్వ.వి.బ.) : శాలిధాన్య విశేషము.

**గఱిచిప్ప** (ద్వ.వి.) : ముత్యపుఁజిప్ప.

**గఱిబద్ద** (ద్వ.వి.) : (గఱుకు + బద్ద) గఱుకుతోడి తాటాకుబద్ద. (సంధిని వర్ణ లోప వర్ణ వికారములు.)

**గఱుకు** (దే.వి.) : కొడవలిలోనగువాని కక్కు.

**గఱుగు** (దే.వి.) : ఒకానొకచెట్టు.

**గఱువ** (వై.విణ.) : 1. పెద్ద; 2. గొప్పవాఁడు.

**గఱ్ఱు** (దే.వి.) : త్రేఁచుటయందగు ధ్వన్యను కరణము.

**గఱ్ఱె** (దే.వి.) : మత్స్యములఁబట్టెడు సాధన విశేషము. (దీని ఆకారము తిఱ్ఱివంటిది గాని యిది మిక్కిలి పెద్దది.)

**గలఁతియ** (వై.వి.) : గిండిచెంబు.

**గలగల** (దే.వి.) : 1. కదలుట యందగు ధ్వన్యను కరణము; 2. భూషణములు మ్రోయుట యందగు ధ్వన్యనుకరణము.

**గలతరించు** (దే.అ.క్రి.) : (మేను) జల్లు మను. (నాకు ఒళ్లంతయు గలతరించు చున్నది.)

**గలబ** (దే.వి.) : కలఁత.

**గలబరించు** (దే.అ.క్రి.) : కలఁగు. (నాకు బుద్ధి గలబరించి పోయెను.)

**గలబా, గల్బా** (హిం.వి.) : కలఁత, తాఱుమాఱు.

**గలిజెరు** (దే.వి.) : గలిజేరు యొక్క రూపాంతరము.

**గలిజేరు** (దే.వి.) : పునర్నవ.

**గలిబిలి** (దే.వి.) : సందడి. (అక్కడ మిక్కిలి గలిబిలిగానున్నది.)

**గలీబు** (హిం.వి.) : తలఁగడ యొఱ.

**గల్ల** (దే.వి.) : 1. పొల్ల, 2. మాదిగవాఁడు తోలు నానవేసెడు చట్టి.

**గల్లము** (సం.వి.అ.పుం.) : చెక్కిలి.

**గల్లు** (దే.వి.) : భూషణములు మ్రోయుట యందగు ధ్వన్యనుకరణము.

**గవఁకు** (దే.వి.) : గవను యొక్క రూపాంతరము.

**గవతము** (దే.వి.) : కసవు (చూ. కవను)

**గవను** (దే.వి.) : దుర్గపురద్వారము, గోపురము.

**గవయము** (సం.వి.అ.పుం.) : గురుపోతు.

**గవరన** (వై.వి.) : ఎఱుపు.

**గవరన్మెంటు** (ఆం.విణ.) : ప్రభుత్వ సంబంధమైన.

**గవర్నరు** (ఆం.వి.) : దేశప్రభువు.

**గవలము** (సం.వి.అ.న.) : ఎనుప కొమ్ము. (పుం.) : నల్లయెనుఁబోతు.

**గవాక్షము** (సం.వి.అ.పుం.న.) : కిటికీ. పుం.డు. ఒకానొక కోఁతి.

**గవాక్షి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. పిన్న పాపర; 2. బుడమ.

**గవాదని** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. పసులు మేయు కంచె, కొఱను; 2. పెద్దపాపర.

**గవి** (ఉభ. దే.వి.) : 1. గుహ; 2. పల్లము.

**గవిలెము** (దే.వి.) : గందములో ఊచి కలిపెడు విత్తు.

**గవీనము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అంతకు ముందు ఆవులు మేసినది, ఉండినది. (చోటు)

**గవుండ్లవాఁడు** (వై.వి. సారాయమ్ము వాఁడు. కల్లు గీచువాఁడు. (అని కొందఱు.)

**గవేధుక** (సం.వి.ఆ.స్త్రీ.అ.పుం.) : అడవి గోధుమలు, వట్టివడ్లు.

**గవేధువు** (సం.వి.ఉ.పుం.స్త్రీ.) : అడవి గోధుమలు, వట్టివడ్లు.

**గవేషణ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. ఆమంత్రణార్థము వెదకుట; 2. వెదకుట.

**గవేషించు** (సం.స.క్రి.) : వెదకు, ఆరయు.

**గవేషితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అన్వేషితము, వెదకఁబడినది.

**గవ్య** (సం.వి.ఆ.స్త్రీ.) : ఆవులమంద (అ.న.ము.): 1.అల్లెత్రాడు; 2.రాగ ద్రవ్యము. (విణ.) : 1. ఆవుపాలు లోనగునది; 2. ఆవునకు హితమైనది. (పంచగవ్యములు: పాలు, పెరుగు, నెయ్యి, పంచితము, పేఁడ)

**గవ్యూతి** (సం.వి.ఇ.స్త్రీ.) : రెండు కోసుల కొలఁది.

**గవ్వ** (దే.వి.) : శంఖముదినుసు, కపర్దకము.

**గవ్వచౌకము** (ద్వ.వి.) : వెలిగారము.

**గశికము** (సం.వి.అ.పుం.) : గసి.

**గస** (దే.వి.) : ఉబ్బసము.

**గసగసలు** (వై.వి.బ.) : ఒక దినుసు విత్తులు.

**గసి** (యు.దే.వి.) : మేకు.

**గసిక** (దే.వి.) : 1. త్రవ్వుటకనువుగా కొన చెక్కిన కొయ్య; 2. శలాక; 3. బాణము.

**గసిబిసి** (దే.వి.విణ.) : గజిబిజి యొక్క రూపాంతరము. (కలఁగినది యనుటకు)

**గస్తీలు** (దే.వి.బ.) : (గస్తు+ఈలు) కావలివారు. (పై గస్తీలు వచ్చినారు.)

**గస్తు** (దే.వి.) : (రాత్రివేళ దొంగతనము లోనగునవి జరగకుండుటకై కావలి వారు) ఊరుతిరిగి కాచు కావలి.

**గహనము** (సం.వి.అ.న.) : 1. అడవి; 2. గుహ; 3. దుఃఖము. (విణ.) : 1. ఎఱుఁగ రానిది; 2. చొరరానిది.

**గహరము** (సం.వి.అ.న.) : పొయికిఁబెట్టెడు కట్టె.

**గహ్వరము** (సం.వి.అ.న.) : 1. అడవి 2. గుహ 3. నెపము. (పుం.) : పొదరిల్లు.

**గహ్వరి** (సం.వి.ఈ.స్త్రీ.) : భూమి, నేల.

**గళంతిక** (సం.వి.ఆ.స్త్రీ.) : గిండిచెంబు.

**గళకంబళము** (సం.వి.అ.పుం.) : (చూ.) గంగడోలు.

**గళకత్తెర** (వై.వి.) : మల్లబంధవిశేషము. (చూ. కాసెనిల్కడ.)

**గళగండము** (సం.వి.అ.పుం.) : (చూ.) గండమాల.

**గళగళ** (దే.వి.) : చెప్పుట యందగు ధ్వన్యనుకరణము.

**గళనము** (సం.వి.అ.న.) : జాఱుట.

**గళము** (సం.వి.అ.పుం.) : 1.కుత్తుక 2. సజ్జ రసము.

**గళశుండిక** (సం.వి.ఆ.స్త్రీ.) : కొండనాలుక.

**గళాంకురము** (సం.వి.అ.పుం.) : అంగిటి ముల్లు, కొండనాలుక (అని కొంద అందురు.)

**గళితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. జాఱినది; 2. తినcబడినది.

**గళ్య** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. కంఠముల సమూహము; 2. పోట గళముల సమూహము.

**గళ్ల** (దే.వి.) : (చూ.) కళ్ల.

**గల్లెము** (దే.వి.) : పాలమీcగడవంటి లేఁత కొబ్బెర.

## గా

**గాంగము** (సం.విణ.) : (అ.ఈ.అ.) గంగది.

**గాంగుఁడు** (సం.వి.అ.పుం.) : 1. భీష్ముఁడు; 2. కుమారస్వామి.

**గాంగేయము** (సం.వి.అ.న.) : బంగారు (పుం.): ఒకానొక చేఁప.

**గాంగేయుఁడు** (సం.వి.అ.పుం.) : 1. భీష్ముఁడు; 2. కుమారస్వామి.

**గాంగేరుకము** (సం.వి.అ.పుం.) : బలుసు.

**గాంగేరుకి** (సం.వి.ఈ.స్త్రీ.) : బీఱ.

**గాండివము** (సం.వి.అ.పుం,న.) : 1. అర్జునుని విల్లు; 2. విల్లు (రూ. గాండీవము)

**గాండ్రించే** (దే.అ.క్రి.) : (ముఖము) ఉబ్బు.

**గాండ్ల** (దే.వి.) : నూనె అమ్మి జీవించెడు జాతి. (గాండ్లవాఁడు, గాండ్లది.)

**గాంధర్వము** (సం.వి.అ.న.) : పాట. (పుం.) : 1. కన్యావరులు పరస్పరేచ్ఛ చేతఁ జేసికొను వివాహము (చూ. వివాహము); 2. దినము యొక్క ఏడవభాగము. (చూ. దినము)

**గాంధర్వుఁడు** (సం.వి.అ.పుం.) : గంధర్వుఁడు.

**గాంధారము** (సం.వి.అ.పుం.) : 1. ఒక స్వరము; (చూ.స్వరము) 2. సిందూ రము; 3. ఒకానొక దేశము.

**గాంధారి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. గంజాయి; 2. ధృతరాష్ట్రుని భార్య.

**గాంభీర్యము** (సం.వి.అ.న.) : గంభీరభావము.

**గాcజర** (దే.వి.) : ఒకానొక దుంప.

**గాcడి** (దే.వి.) : 1. తొలిచికాని త్రవ్వికాని నిడుపుగా నేర్పఱచిన పల్లము; (గాcడి పలక. మొ.) 2. పసులు నీరుత్రాగుటకు గాcడి యేర్పడ ఱాతితోcగట్టిన తొట్టి, నిపానము; 2. పసులc గట్టు చోcట గసువు వేయుటకుc బలకలులోనగు వానితో గాcడిగా నేర్పఱచిన స్థానము.

**గాcడిప్రొయ్యి** (దే.వి.) : గాcడిత్రవ్వి యేర్పఱచిన పొయ్యి. (చూ. ప్రొయ్యి)

**గాడీ** (హిం.వి.) : బండి.

**గాcడు** (దే.వి.) : కామమదము.

**గాగర** (దే.వి.) : (స్త్రీలు కట్టుకొను) పావడ.

**గాజె** (వై.వి.) : ధాన్యము పోయుటకు మట్టి యొఱలచేనేర్పఱచిన బొట్ట, కుసూలము.

**గాజొపరుcజు** (ద్వ.వి.) : పరుcజు యొక్క రూపాంతరము.

**గాజే** (వై.వి.) : 1. ఒక దినుసు మన్ను; 2. (బ.) : గాజు మట్టితోc జేసిన వలయములు.

**గాజేప్ప** (ద్వ.వి.) : (గాజు + ఉప్పు) ఒకానొక ఉప్పు, కాచము.

**గాజేలవాండ్రు** (ద్వ.వి.బ.) : గాజులవ్మెడు బలిజెలు.

**గాజువాఱు** (ద్వ.అ.క్రి.) : (గాజు + పాఱు) కాంతిహీనమగు.

**గాటము** (వై.విణ.) : అధికము.

**గాటు** (వై.వి.) : కారము. (పొగాకు పొడి మిక్కిలి గాటుగానున్నది.)

**గాcడిగడుగు** (దే.స.క్రి.) : (గాcడి + కడుగు) సంచయనము చేయు.

**గాడి** (దే.వి.) : రథ విశేషము. (రూ. గాడీ.)

**గాడిద** (వై.వి.) : గార్ధభము, గాలిగాcడు. (రూ. గాడ్ద.)

**గాడిదకాళ్లవాఁడు** (ద్వ.విణ.) : ముట్టు మోcకాళ్ల వాఁడు, సంజ్ఞువు.

**గాడిదగడపర** (ద్వ.వి.) : వృషగంధిక.

**గాడిదపులి** (ద్వ.వి.) : దుమ్ములగొండి, కొర్నవగండు.

**గాడుపు** (దే.వి.) : గాలి, వాయువు. (రూ. గాడ్పు)

**గాడుపుచూలి** (దే.వి.) : 1. భీముఁడు; 2. హనుమంతుఁడు.

**గాడుపుపట్టి** (దే.వి.) : 1. భీముఁడు; 2. హనుమంతుఁడు.

**గాడుపుమేపరి** (దే.వి.) : సర్పము, పవనాశనము.

**గాడుపుసంగడీఁడు** (దే.వి.) : అగ్ని, వాయుసఖుఁడు.

**గాఢము** (సం.క్రి.విణ.అ.న.) : పెల్లు. (విణ.) : అధికము.

**గాణ** (వై.వి.) : 1. పాటకాఁడు; 2. పాటకత్తె.

**గాణాపత్యము** (సం.వి.అ.న.) : ఒక మతము. (చూ. మతము)

**గాణిక్యము** (సం.వి.అ.న.) : గణికల సమూహము.

**గాణీ** (వై.వి.) : పాటకత్తె.

**గాణుఁడు** (వై.వి.) : పాటకాఁడు.

**గాణేయము** (సం.విణ.) : (అ.ఆ.అ.) గణనీయము.

**గాత** (ఉభ.వై.వి.) : దెబ్బ. (చూ. ఖద్ది) (సం. బు.పుం.) : పాట పాడువాఁడు.

**గాతము** (వై.వి.) : పల్లము.

**గాతి** (వై.వి.) : తిండి, గ్రాసము.

**గాతుకలఁగు** (దే.అ.క్రి.) : భేదిల్లు.

**గాత్రము** (ఉభ.దే.విణ.) : స్థూలము. (సం.వి. అ.న.) : 1. శరీరము 2. అవయవము 3. ఏనుఁగు యొక్క ముందటి పిక్కలులోనగు చోటు. (ఈ యర్థము నందిది ఆకారాంత స్త్రీలింగమునగును.)

**గాథ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. చరిత్రము; 2. పద్యము; 3. పాట; 4. చక్కఁబఱుపఁ బడని భాష.

**గాథకుఁడు** (సం.వి.అ.పుం.) : పాటకాఁడు.

**గాద** (దే.వి.) : చెమటకాయలతఱుచు.

**గాదము** (దే.వి.) : 1.పైరులోని కసవు; 2.ఆకు.

**గాదిలి** (దే.వి.) : ప్రేమము.

**గాదె** (వై.వి.) : గాజె యొక్క రూపాంతరము.

**గాధము** (సం.వి.అ.పుం.) : 1. మిట్ట; 2. కోరిక.

**గాధేయుఁడు** (సం.వి.అ.పుం.) : గాధికొడుకు, విశ్వామిత్రుఁడు.

**గానము** (సం.వి.అ.న.) : గీతము, పాట.

**గానుఁగ** (దే.వి.) : నూనెఁదీసెడి యంత్రము, పరంజము.

**గానుఁగపిండి** (ద్వ.వి.) : తెలికపిండి.

**గాబ** (దే.వి.) : తృణవిశేషము. (ఇక్కడ గాబ నిండపెరిగి ఉన్నది.)

**గాబము** (గాబ యొక్క రూపాంతరము)

**గాబరా** (హిం.వి.) : భయము, తొందర, కలవరము.

**గాబు** (దే.వి.) : కొప్పెర.

**గామ** (దే.వి.) : పిపీలికా విశేషము.

**గామిడి** (వై.విణ.) : శ్రేష్ఠుడు.

**గాము** (వై.వి.) : 1. సూర్యాది గ్రహము; 2. పిశాచము.

**గాములతేఁడు** (ద్వ.వి.) : సూర్యుఁడు, గ్రహపతి.

**గాయకము** (దే.వి.) : మర్మము. (విణ.) : గూఢము.

**గాయకుఁడు** (ఉభ.వై.విణ.) : గ్రహణశక్తి గలవాఁడు. (సం.వి.అ.పుం.) : పాట పాడువాఁడు.

**గాయత్రి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. మంత్ర విశేషము; 2. ఒక ఛందస్సు. (చూ. ఛందస్సు) (ఈ.స్త్రీ. న్.పుం.) : చంద్ర.

**గాయని** (సం.వి.ఈ.స్త్రీ.) : పాటపాడునది.

**గాయనుఁడు** (సం.వి.అ.పుం.) : పాట పాడు వాఁడు.

**గాయమానము** (దే.వి.) : శస్త్రవిద్యా విశేషము.

**గాయము** (దే.వి.) : కత్తిలోనగువాని తాఁకుడు, క్షతి.

**గార** (దే.వి.) : 1. గోడలోనగువాని పూఁతకై యిసుకఁజేర్చి దంచిన సున్నము; 2. మణిదోష విశేషము; 3. ఇంగుది.

**గారడము** (వై.వి.) : 1. విషమంత్రము; 2. వాయ.

**గారడి** (వై.వి.) : (గారడము + ఇ) పాముల వాఁడు, అహితుండికుఁడు.

**గారడీఁడు** (వై.వి.) : (గారడము + ఈఁడు) పాముల వాఁడు, అహితుండికుఁడు.

**గారము** (వై.వి.) : గారవము యొక్క రూపాంతరము. (గొప్పతనమునకు.)

**గారవము** (వై.వి.) : 1. గొప్పతనము; 2. ప్రేమము.

**గారవించే** (వై.స.క్రి.) : 1. గౌరవపఱచు; 2. ఆదరించు.

**గారవిల్లు** (వై.అ.క్రి.) : గౌరవపడు. (రూ. గారవిలు.)

**గారాబము** (వై.వి.) : 1. గొప్పతనము; 2. ప్రేమము.

**గారాబు** (వై.వి.) : గారాబము యొక్క రూపాంతరము. (ఈ పదము కలదని నిర్ణయించుటకుఁ దగిన గ్రాంథిక ప్రయోగము దొరికినది కాదు.)

**గారాము** (వై.వి.) : గారవము యొక్క రూపాంతరము. (గొప్పతనమునకు. ప్రేమమునకు.)

**గారు** (దే.అప.) : పూజ్యత్వమును దెలుపు నది. (అయ్యగారు, అమ్మగారు.)

**గారుడము** (సం.వి.అ.పుం.) : 1. గరుడ పచ్చ; 2. విష మంత్రము. (విణ.) : గరుడునిది.

**గారుడికుఁడు** (సం.వి.అ.పుం.) : పాములవాఁడు.

**గారుత్మతము** (సం.వి.అ.న.) : పచ్చ, మరకతము.

**గారె** (వై.వి.) : అచ్చుము మినుపపప్పువడ. (చూ. ఔఁగు)

**గార్దభము** (సం.వి.అ.పుం.) : గాడిద, రాసభము.

**గార్భిణము** (సం.వి.అ.న.) : గర్భిణుల సమూహము. (గర్భిణి = చూలాలు)

**గార్హపత్యము** (సం.వి.అ.పుం.) : ఒక శ్రౌతాగ్ని.

**గార్హస్థ్యము** (సం.వి.అ.న.) : ఒక గృహస్థ ధర్మము.

**గాలకాఁడు** (దే.వి.) : (గాలము + కాఁడు) చేఁపలను పట్టువాఁడు, కైవర్తుఁడు.

**గాలము** (దే.వి.) : చేఁపలను బట్టుటకు ఉక్కు కమ్మితో వంకరగాఁ జేసిన సాధనము, బడిశము. (దీని భేదములు ఉంటగాలము, గోరుగాలము అని. ఇదియె గోరుగాలము.)

**గాలనము** (సం.వి.అ.పుం.) : లొద్దుగు. (డు.) : ఒకానొక ముని.

**గాలాము** (దే.వి.) : గాలము యొక్క రూపాంతరము.

**గాలి** (దే.వి.) : 1. వాయువు; 2. మృగముల దేహవాసన; 3. పిశాచము. (దీనికి గాలిసోఁకి నట్లున్నది.)

**గాలించే** (దే.స.క్రి.) : 1. బియ్యము లోనగువానిని నీళ్లలో పోసి ఱాళ్లులేక శోధించు; 2. వెదకు.

**గాలికుంటు** (దే.వి.) : పశువులకు గొరిజలయందు పుండుపడెడు వ్యాధి.

**గాలిగాఁడు** (దే.వి.) : గాడిద.

**గాలిగుడి** (ద్వ.వి.) : సూర్యచంద్రులకు జుట్టు నేర్పడెడు మండలము, పరివేషము.

**గాలిగొను** (దే.అ.క్రి.) : (గాలి+కొను) గాలిపాఱు. (చూ. కలిమము)

**గాలిగ్రుడ్డు** (దే.విణ.) : పేద. (అప్ర.)

**గాలిచూలి** (దే.వి.) : 1. అగ్ని; 2. భీముఁడు; 3. హనుమంతుఁడు. (ఇట్లు గాలిపట్టి, గాలి బిడ్డఁడు. మొ.)

**గాలిదిండి** (దే.వి.) : (గాలి + తిండి) సర్పము, పవనాశనము.

**గాలినెచ్చెలి** (దే.వి.) : అగ్ని, వాయుసఖుఁడు.

**గాలిపంట** (దే.వి.) : నిర్ణయములేని పంట.

**గాలిపటము** (ద్వ.వి.) : బాలక్రీడా సాధన విశేషము.

**గాలిపడగ** (ద్వ.వి.) : గాలిపటము.

**గాలిమాట** (దే.వి.) : లోకప్రవాదము, జనశ్రుతి.

**గాలిమేపరి** (దే.వి.) : సర్పము. (ఇట్లు గాలిమేఁతరి మొ. చూ. గాలిదిండి.)

**గాలివాన** (దే.వి.) : గాలితోడివాన, ఝంఝ.

**గాలివేత** (దే.వి.) : 1. గాలికొట్టుట; 2. జ్వర భేదము.

**గావు** (దే.వి.) : బలి.

**గావుకోడి** (ద.వి.) : మూలికావిశేషము.

**గావుపట్టు** (దే.స.క్రి.) : 1. చంపు; 2. నాశము చేయు. (వి.) గట్టిపట్టు.

**గాసటబీసట** (దే.వి.) : సలక్షణముగాని చదువు.

**గాసము** (వై.వి.) : ఆహారము.

**గాసి** (దే.వి.) : శ్రమము. (నాకిప్పుడు మిగుల గాసిగా నున్నది.)

**గాసిఁబడు** (ద్వ.అ.క్రి.) : (గాసి౯ + పడు) బాధపడు.

**గాసిఁబెట్టు** (దే.స.క్రి.) : (గాసిన్ + పెట్టు) బాధించు.

**గాసిచేయు** (ద్వ.స.క్రి.) : నాశముచేయు.

**గాసియగు** (దే.అ.క్రి.) : (గాసి+అగు) నాశమగు.

**గాసిల్లు** (దే.అ.క్రి.) : 1. బాధపడు; 2. శ్రమ పడు; 3. కోపపడు. (రూ. గాసిలు. బాధ పడుటకు.) (మొదటి రెండర్థము లకును ప్రేరణమందు రూపము గాసించు.)

**గాహనము** (సం.వి.) : స్నానము, మునుక.

**గాహితము** (సం.విశే.) : (అ.ఆ.అ.) మునిఁగినది.

**గాళకుఁడు** (దే.విశే.) : 1.ధీరుఁడు; 2.ప్రౌఢుఁడు.



**గి** (దే.అప.) : నింద యందు హ్రస్వాదియైన ఆమ్రేడిత శబ్దము యొక్క యాద్యక్షరమునకు వచ్చెడి యాదేశము. (చంద్రుఁడు గింద్రుఁడు, చిలుక గిలుక, వరములు గిరములు. మొ.)

**గింగురు** (దే.వి.) : వింటినారి నుండి బాణము వెడలుట యందగు ధ్వన్యనుకరణము.

**గింజ** (దే.వి.) : 1. విత్తు; 2. బ. ధాన్యము.

**గింజుకొను** (దే.వి.) : బిడ్డలు వెలికిలఁ బందుకొని యేడ్చునప్పుడు కాళ్లు విదిలించు.

**గింటెన** (దే.వి.) : దింటెన.

**గింటెము** (దే.వి.) : జంట నేఁతవస్త్రము.

**గిండి** (దే.వి.) : సన్నపు మెడగల చెంబు, భృంగారము.

**గిచ్చే** (దే.స.క్రి.) : గీచు యొక్క రూపాంతరము.

**గిజిగాఁడు** (దే.వి.) : పచ్చపిట్ట.

**గిజ్జిగాఁడు** (దే.వి.) : గిజిగాఁడు యొక్క రూపాంతరము.

**గిజేగిజే** (దే.వి.) : తన్నుకొనుటయందగు ధ్వన్యనుకరణము.

**గిజేగిజేగొను** (దే.అ.క్రి.) : (గిజగిజ + కొను) తత్తఅపడు.

**గిజగిజలాడు** (దే.అ.క్రి.) : (గిజగిజలు + ఆడు) తత్తఅపడు.

**గిజేరు** (దే.వి.) : మామిడిపండులోనగు వాని యందుండు బేసము.

**గిటక** (దే.విశే.) : పొట్టి, వామనుఁడు.

**గిటగిట** (దే.వి.) : పండ్లు కొఱుకుట యందగు ధ్వన్యనుకరణము.

**గిటగిటన** (దే.విశే.) : 1.అల్పము; 2. కృశము; 3.సూక్ష్మము.

**గిటగిటమను** (దే.అ.క్రి.) : (గిటగిట + అను) వడఁకు.

**గిట్ట** (దే.వి.) : 1. పశువుల కాలిగోరు, ఖురము 2. బాణము.

**గిట్టించు** (దే.అ.క్రి.) : గిట్టుబడియగు. (ప్రే.) : చావఁజేయు.

**గిట్టింపు** (దే.వి.) : 1. గిట్టుబడి; 2. చావు (చూ. ఆరగింపు)

**గిట్టు** (దే.అ.క్రి.) : 1. అనుకూలించు; 2. చచ్చు; 3. నశించు.

**గిట్టుబడి** (దే.వి.) : అమ్మకమునందలి లాభము.

**గిడస** (దే.విశే.) : పొట్టి, గిటక, వామనము.

**గిడిగిళ్లు** (దే.వి.బ.) : నమస్కారము.

**గిడియ** (దే.వి.) : పటహ విశేషము.

**గిడుగు** (దే.వి.) : కామలేని గొడుగు.

**గిడ్డ** (దే.విశే.) : పొట్టి, వామనుఁడు.

**గిడ్డంగి** (అన్య.దే.వి.) : 1. సరకులుంచి యమ్మెడి యిల్లు; 2. చెఱసాల.

**గిడ్డి** (వై.వి.) : ఆవు, ధేనువు.

**గిడ్డు** (దే.వి.) : శ్యేనవిశేషము.

**గిత్త** (దే.వి.) : 1. ఎద్దుపట్టనికోడె; 2. వృషభము.

**గిద్ద** (దే.వి.) : సోలయందు నాల్గవ భాగము.

**గిద్దు** (దే.వి.) : గిడ్డు యొక్క రూపాంతరము.

**గినియ** (వై.వి.) : కటభి చెట్టు.

**గినుమాడు** (దే.స.క్రి.) : (గినుము+ఆడు) వంచించు.

**గినుము** (దే.వి.) : వంచన.

**గిన్నియ** (దే.వి.) : గిన్నె.

**గిన్నె**(దే.వి.) : త్రాగెడు గిన్నె, చషకము. (గిన్నియ యొక్క రూపాంతరము.)

**గిబ్బ** (దే.వి.) : 1. అచ్చుటెద్దు; 2. వృషభము.

**గిబ్బరౌతు** (ద్వ.వి.) : శివుఁడు, వృషభ వాహనుఁడు.

**గిర** (సం.వి.ఆ.స్త్రీ.) : వాక్కు.

**గిరక** (దే.వి.) : నూతిరాట్నము, ఘటయంత్రము.

**గిరగిర** (దే.వి.) : తిరుగుట యందు ధ్వన్యను కరణము.

**గిరణము** (సం.వి.అ.న.) : మ్రింగుట.

**గిరదా** (హిం.విణ.) : గుండ్రని, జుట్టును చుట్టి యుండు వెండ్రుకలు.

**గిరవు** (దే.వి.) : కుదువ.

**గిరస** (దే.విణ.) : పంద, పాఱుఁబోతు, పిఱికి, సమర భీరువు.

**గిరాకి** (హిం.విణ.) : వెల యధికమైన, ప్రియమైన.

**గిరాటువేయు** (దే.స.క్రి.) : (ఱాయి) ఱువ్వు.

**గిరి** (సం.వి.ఇ.స్త్రీ.) : మ్రింగుట. (పుం.) : 1. కొండ; 2. అచ్చన గాయలు; 3. నేత్రరోగ విశేషము. (విణ.) : పూజ్యము.

**గిరిక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. చిట్టెలుక; 2. జలగ; 3. వసురాజు భార్య; 4. పార్వతి; 5. విధవ; 6. అడవి మల్లె. (పుం.ము.) : బొంగరము.

**గిరికర్ణి** (సం.వి.ఈ.స్త్రీ.) : దింటెన.

**గిరిగిటలు** (దే.వి.) : ఆడునప్పుడు వాయించెడు కంచు తాళము.

**గిర్గిటలు** (దే.వి.బ.) : గిరిగిటలు యొక్క రూపాంతరము.

**గిరిజ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.పార్వతి; 2. మాదిఫలము. (అ.న.ము.) : 1. అభ్రకము; 2. లోహము; 3. శిలాజిత్తు. (విణ.) : కొండ యందుఁ బుట్టినది.

**గిరిధరుఁడు** (సం.వి.అ.పుం.) : విష్ణువు, గట్టు తాలుపు.

**గిరిమల్లిక** (సం.వి.ఆ.స్త్రీ.) : కొండమల్లె.

**గిరియకము** (సం.వి.అ.పుం.) : అచ్చన గాయలు.

**గిరిశుఁడు** (సం.వి.అ.పుం.) : శివుఁడు, కొండ యల్లుఁడు.

**గిరిసెము** (వై.వి.) : శిరీషము.

**గిరిస్తని** (సం.వి.ఈ.స్త్రీ.) : భూమి, నేల.

**గిరీశుఁడు** (సం.వి.అ.పుం.) : 1. శివుడు; 2. హిమవంతుఁడు; 3. బృహస్పతి.

**గిఱక** (దే.విణ.) : గిటక, పొట్టి.

**గిఱకతాడు** (ద్వ.వి.) : హింతాలము.

**గిఱి** (దే.వి.) : వలయాకారపు రేఖ. (వాఁడు గీచిన గిఱిదాటఁడు.)

**గిఱికొను** (దే.స.క్రి.) : చుట్టుకొను.

**గిఱిపిల్లాఁడి** (దే.వి.) : స్త్రీలు కాలధరించెడి మూడవ వ్రేలి పిల్లాణి.

**గిఱుకు** (దే.స.క్రి. ) :1. అక్షరములు బటువుగా నేర్పడ వ్రాయక వంకర కొంకరగా గీచు; 2.తప్పు వ్రాఁతను తుడుచు. (వి.) : తుడుపు.

**గిఱుక్కు** (దే.వి.) : మరలుట యందగు ననుకరణము.

**గిఱుపు** (దే.స.క్రి.) : 1. (కన్ను) త్రిప్పు; 2. కదలించు.

**గిల్లు** (దే.వి.) : తిరుగటయందగు ననుకరణము. (గిల్లునఁదరిగె.) (ఇది మఱికొన్ని యర్థము లందును వచ్చును. ఆమ్రేడితమునందు గిల్లు గిల్లు.)

**గిల్లుపురుగు** (ద్వ.వి.) : చెట్లయందుండి యెల్ల ప్పుడు గిల్లుమని కూయునట్టి యొక పురుగు.

**గిలక** (దే.వి.) : 1. గిలగిల మ్రోఁగు బాలక్రీడా సాధనము; 2. గిలగిలమని మ్రోఁగెడి యినుప తగటిబిల్ల.

**గిలకచెట్టు** (దే.వి.) : ఘంటారవ.

**గిలకబండి** (దే.వి.) : చిన్న చక్రముల బండి.

**గిలకరించేు** (దే.న.క్రి.) : 1.గిలకొట్టు; 2. చిలుకు; 3. మ్రోఁగు.

**గిలకొట్టు** (దే.స.క్రి.) : 1. వ్రేళ్లతో కలఁచు; 2. కుదిలించు; 3. వ్రేళ్లతో పుణుకు. (చూ. కిలకొట్టు)

**గిలగిలచెట్టు** (దే.వి.) : గిలకచెట్టు.

**గిలాబ** (హిం.వి.) : గచ్చుచేయుట.

**గిలి** (దే.వి.) : భయము. (పులిపోయినను గిలిపోలేదు.)

**గిలిగించేు** (దే.స.క్రి.) : గిలిగింతపెట్టు.

**గిలిగింత** (దే.వి.) : చక్కలిగింత.

**గిలిగింత చెట్టు** (దే.వి.) : గిలక చెట్టు, గిలగిల చెట్టు.

**గిలిగిచ్చ** (దే.వి.) : గిలక చెట్టు, గిలగిల చెట్టు.

**గిలిగిలి** (దే.వి.) : గిలిగింత.

**గిలిగించు** (దే.స.క్రి.) : (చూ.) గిలిగించు.

**గిలిగిలింత** (దే.వి.) : గిలిగింత.

**గిలుకు** (దే.వి.) : మెట్టెలులోనగువాని యందగు ధ్వన్యనుకరణము.

**గిలుపు** (దే.స.క్రి.) : (కన్ను) గిఱుపు. (గిఱుపు యొక్క రూపాంతరము.)

**గిలుబాడు** (దే.స.క్రి.) : (గిలుబు + ఆడు) అపహరించు.

**గిలుబు** (దే.వి.) : అపహరణము.

**గిలుబుకొను** (దే.స.క్రి.) : గిలుబాడు.

**గిలుబుసేయు** (ద్వ.స.క్రి.) : (గిలుబు + చేయు) గిలుబాడు.

**గిల్లకన్ను** (దే.వి.) : మెల్లకన్ను.

**గిల్లచూపు** (దే.వి.) : మెల్లచూపు.

**గిల్లు** (దే.స.క్రి.) : 1.నఖక్షతము చేయు; 2.ఆకులు లోనగువానిఁగోయు. (వి.) : నఖక్షతము.

**గిల్లుడు** (దే.వి.) : నఖక్షతము.

**గివుఱు** (దే.స.క్రి.) : గీఱుయొక్క రూపాంతరము.

**గిళనము** (సం.వి.అ.న.) : తినుట.

**గిళితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) తినఁబడినది.

## గీ

**గీ** (దే.అప.) : నిందయందు దీర్ఘాదియైన ఆమ్రేడిత శబ్దము యొక్క ఆద్యక్షరమునకు వచ్చెడి యాదేశము. (దేవుఁడు గీవుఁడు, వాలిగీలి, సాత్యకిగీత్యకి. మొ.)

**గీఁక** (వై.వి.) : ఏనుఁగు కూత, బృంహితము.

**గీఁకు** (దే.స.క్రి.) : కత్తిలోనగువానితో గీచు.

**గీఁటు** (దే.స.క్రి.) : 1. (పండ్లు) కొఱుకు; 2. (కన్ను) గిఱుపు; 3. చిమ్ము.

**గీఁత** (దే.వి.) : గీటు, రేఖ.

**గీఁతకట్టియ** (ద్వ.వి.) : వడ్లవాఁడు గీఁతలు గీయుటకుపయోగించెడు పలక. (రూ. గీఁతకట్టె)

**గీచు** (దే.స.క్రి.) : గీటుగీచు.

**గీటడఁగు** (దే.అ.క్రి.) : చచ్చు.

**గీటు** (దే.వి.) : గీఁత, రేఖ.

**గీటునఁబుచ్చు** (దే.స.క్రి.) : అనాదరించు.

**గీట్లబద్ద** (ద్వ.వి.) : కాకితములు లోనగువాని యందు గీట్లు వేయుట కుపయోగించెడు కోల.

**గీతము** (సం.వి.అ.న.) : పాట. (విణ.) పలుకఁ బడినది.

**గీతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. పద్యభేదము; 2. పాట.

**గీపెట్టు** (ద్వ.అ.క్రి.) : (గీఁక+పెట్టు) 1. ఏనుఁగు కూయు; 2. మొఱపెట్టు; 3. శబ్దించు. (గీఁపెట్టు ఇది యిట్లుం డుట యుక్తము.)

**గీము** (వై.వి.) : ఇల్లు.

**గీయు** (దే.స.క్రి.) : గీఁతగీయు.

**గీరనంగింజలు** (దే.వి.బ.) : బాలికా క్రీడా విశేషము. (చూ. అచ్చనగండ్లు) (రూ. గీరన గింజలు.)

**గీర్ణి** (సం.వి.ఇ.స్త్రీ.) : మ్రింగుట.

**గీర్వాణము** (సం.వి.అ.పుం.) : దేవభాష.

**గీర్వాణుఁడు** (సం.వి.అ.పుం.) : దేవుఁడు; వేల్పు, బాసవాలు.

**గీఱ** (దే.వి.) : గీఁత, రేఖ.

**గీఱు** (దే.స.క్రి.) : 1. గోఁకు; 2. భేదించు.

**గీఱుగాజులు** (ద్వ.వి.బ.) : ఒక విధమైన గాజులు.

**గీఱుడు** (దే.వి.) : 1.గోఁకుడు; 2. భేదనము.

**గీఱునామము** (దే.వి.) : గీఱగలిగిన నాము.

**గీలు** (దే.అ.క్రి.) : స్రవించు.

**గీవు** (దే.వి.) : గిరవు యొక్క రూపాంతరము. (అ.ప్ర.)

**గీష్పతి** (సం.వి.ఇ.పుం.) : బృహస్పతి. (రూ. గీర్పతి.)

# గు

**గుంజ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. గురిజ; 2. అవ్యక్త మధుర ధ్వని; 3. ఉప్పళము; 4. తప్పెట.

**గుంజాటన** (గ్రా.వి.) : వ్యసనము.

**గుంజిలిపెట్టు** (దే.స.క్రి.) : గోపనము చేయు.

**గుంజిళ్లు** (దే.వి.బ.) : చేతులు కట్టుకొని రెండుకాళ్లు చేర్చిపెట్టి కూర్చుండి లేచుట.

**గుంజే** (వై.వి.) : స్తంభము.

**గుంజేనుసుఁగు** (దే.స.క్రి.) : పరిహాసము చేయు. (వి.) : ఎలుఁగు గొడ్డాట.

**గుంజో** (దే.స.క్రి.) : 1. ఈడ్చు; 2. ఉదుకు. 1. తాడు ఈఁదులోనగువాని మోవు మొదలు; 2. తాటితేగ మొనయందు బుట్టలో నుండెడు గిజురు. (కొన్ని చోట్ల పుట్టెలోని మెదటికిని అర్థమగుచున్నది.)

**గుంజోలాడు** (దే.స.క్రి.) : (గుంజులు + ఆడు) లాగులాడు.

**గుంట** (వై.వి.) : 1. కొలను; 2. పల్లము; 3. భూ పరిమాణ విశేషము; 4. చెఱువు.

**గుంటక** (దే.వి.) : దున్ని విత్తులు చల్లిన వెనుక నేల సవరచేయు సాధనము.

**గుంటక్రోవ** (ద్వ.వి.) : ఒక దినుసు పిరంగి.

**గుంటగలగర** (ద్వ.వి.) : భృంగరాజము.

**గుంటగలిజేరు** (ద్వ.వి.) : భృంగరాజము.

**గుంటచాళ్లు** (ద్వ.వి.బ.) : బాలక్రీడా విశేషము. (చూ. ఆలంకులు)

**గుంటదూలము** (వై.వి.) : గృహ విశేషముల యందు కడ యొత్తుల మీఁద నుండి గుజ్జుల నడిమికిఁ జొప్పించెడి చిన్న దూలము.

**గుంటనక్క** (వై.వి.) : చిన్నజాతి నక్క, కిఖి.

**గుంటప్రొయ్యి** (ద్వ.వి.) : గుంటత్రవ్వి యేర్పఱచిన పొయ్యి. (చూ. ప్రొయ్యి)

**గుంటి** (దే.వి.) : 1. చేని భాగము; 2. దున్నుట మొదలగువాని కేర్పఱచుకొన్న భాగము.

**గుంఠితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) (ధూళి మొదలగువానిచే కప్పఁబడినది.)

**గుండ** (యు.దే.వి.) : గుద్ద యొక్క రూపాంతరము. (వై.) : పొడి.

**గుండఁగి** (దే.వి.) : నీరుకోడి.

**గుండఁడు** (దే.వి.) : దాసుఁడు.

**గుండకము** (సం.వి.అ.పుం.) : 1. దుమ్ము; 2. నూనె పాత్రము; 3. అవ్యక్తమధుర ధ్వని.

**గుండగొయ్య** (ద్వ.విణ.) : (గుండ + కొయ్య) దుష్టుఁడు.

**గుండము** (వై.వి.) : నిప్పులగుంట.

**గుండా** (దే.విణ.) : ధీరుఁడు.

**గుండిగ** (వై.వి.) : వెడల్పు నోరు గల లోహ పాత్రము.

**గుండియ** (దే.వి.) : హృదయము.

**గుండీలము** (సం.వి.అ.పుం.) : మద్దెల మ్రోఁత.

**గుండీ** (వై.వి.) : బరణి, బొత్తాను.

**గుండు** (వై.వి.) : 1.గుండ్రపుఱాయి, 2. తూనిక గుండు; 3. పిరంగి గుండు, 4. కపిలె గుండు, 5. పెద్ద ఱాయి, 6. కొండ.

**గుండుకొను** (ద్వ.స.క్రి.) : చుట్టుకొను.

**గుండుగీలు** (వై.అ.క్రి.) : చుట్టువడు.

**గుండుగుత్త** (వై.వి.) : సమస్త స్వాతంత్ర్యము తోడ నిచ్చెడు గుత్త.

**గుండుజల్ల** (ద్వ.వి.) : పెద్దగంప.

**గండుపులుఁగు** (ద్వ.వి.) : చక్రవాకము.

**గుండుములుపుగాఁడు** (దే.వి.) : పక్షి విశేషము.

**గుండె** (దే.వి.) : 1. హృదయము; 2. మనసు. (గుండియ యొక్క రూపాంతరము.)

**గుండెకాయ** (దే.వి.) : హృదయము.

**గుండ్ర** (వై.విణ.) : వృత్తియందు గుండ్రము నకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. (ఉదా. గుండ్ర కంబము, గుండ్రకడుపు. మొ.)

**గుండ్రతుంగ** (ద్వ.వి.) : (గుండ్రము + తుంగ) ఒక దినుసు ముస్తె.

**గుండ్రన** (వై.వి.) : వర్తులత.

**గుండ్రము** (వై.విణ.) : వర్తులము. (కొన్ని యెడల వృత్తి యందు అంత్యవర్ణ లోపము. చూ. గుండ్ర.)

**గుండ్రలు** (దే.వి.) : 1. పిండికొట్టి చెరుగఁగా వెనుక నిలిచిన ఉండలు; 2. చెఱకు రాట్నపు కంబములు.

**గుండ్రలుకొలుపు** (దే.అ.క్రి.) : గుడ్లగూబకూయు.

**గుండ్రాయి** (ద్వ.వి.) : (గుండు + ఱాయి) పొత్తరము.

**గుండ్రించు** (దే.అ.క్రి.) : కడుపుత్రిప్పు.

**గుండ్రింపు** (దే.వి.) : గుండ్రించుట. (చూ. ఆరగింపు)

**గుంత** (వై.వి.) : 1.పల్లము; (చూ. కొలి.) 2.పిఱఁది మీఁది గుంట. (గుంట యొక్క రూపాంతరము.)

**గుంద్ర** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. నాగముస్తె; 2. ప్రేం కణము; పుం.ము. కాకి చెఱకు.

**గుంధము** (సం.వి.) : గుంజ.

**గుంపించే** (దే.స.క్రి.) : 1. కుప్పవేయు.

**గుంపు** (దే.వి.) : ప్రాణి సమూహము.

**గుంపెన** (దే.వి.) : 1. ఒకానొకచెట్టు; 2. విజృం భణము.

**గుంఫనము** (సం.వి.అ.న.) : మాటలు లోనగు వాని కూర్చుట.

**గుంఫము** (సం.వి.అ.పుం.) : 1. మాటలు లోనగువాని కూర్పు; 2. బాహు భూషణము.

**గుంఫించే** (సం.అ.క్రి.) : గుంఫితమగు.

**గుంఫితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కూర్ప బడినది.

**గుంబము** (దే.వి.) : గుమ్మము యొక్క రూపాంతరము.

**గుగ్గిలపుఁజెట్టు** (ద్వ.వి.) : గుగ్గుల వృక్షము.

**గుగ్గిలము** (వై.వి.) : గుగ్గులు వృక్షపు బంక.

**గుగ్గిళ్లు** (దే.వి.బ.) : ఉడుక వేసిన సెనగలు లోనగునవి, అభ్యూషము.

**గుగ్గులువు** (సం.వి.ఉ.పుం.) : గుగ్గిలపుఁ జెట్టు.

**గుచ్ఛకము** (సం.వి.అ.పుం.) : 1. పూ గుత్తి; 2. నెమలిపురి; 3. పొద; 4. ముప్పది రెండు మణులు గ్రుచ్చిన హారము.

**గుచ్ఛము** (సం.వి.అ.పుం.) : 1. పూగుత్తి; 2. నెమలి పురి; 3.పొద; 4. ముప్పది రెండు మణులు గ్రుచ్చిన హారము.

**గుజరీ, గుజిరీ** (గ్రా.వి.) : సంతచోటు.

**గుజస్తా** (హిం.విణ.) : గడచిపోయిన.

**గుజారతు** (హిం.వి.) : వశము.

**గుజేగుజే** (దే.విణ.) : పీడితము.

**గుజేగుజేతేకులు** (దే.వి.బ.) : బాలికా క్రీడా విశేషము.

**గుజేగుజేలాడు** (దే.అ.క్రి.) : (గుజ గుజలు + ఆడు) త్రొక్కటపడు.

**గుజేగుజేవోవు** (దే.అ.క్రి.) : (గుజగుజ + పోవు) త్రొక్కటపడు. (రూ. గుజ గుజలు వోవు.)

**గుజేరాతి** (వై.వి.) : 1. ఘూర్జర దేశము; 2. ఘూర్జర భాష; 3. నాట్య విశేషము.

**గుజేరీ** (వై.వి.) : ఘూర్జరదేశము.

**గుజాటి** (దే.విణ.) : ధనవంతుడు.

**గుజారు** (దే.వి.) : గిజురు యొక్క రూపాంతరము.

**గుజ్జేరాతి** (వై.వి.) : 1. ఘూర్జర దేశము; 2. ఘూర్జర భాష. (గుజరాతి యొక్క రూపాం తరము.)

**గుజ్జెరి** (వై.వి.) : ఘూర్జరదేశము. (రూ.) గుజ్జరీ. (గుజరీ యొక్క రూపాంతరము)

**గుజ్జె** (యు.దే.వి.) : అనుకగురస ద్రవ్యము. 1. కుబ్జత్వము; 2. పొట్టియెద్దు; 3. గుంటక గుజ్జు; 4. దూలపుగుజ్జు; 5. బండిపఱపుగుజ్జు; (విణ.) : పొట్టి వాఁడు; 6. పాపటపుగుజ్జు.

**గుజ్జెపొట్ల** (వై.వి.) : పొట్టికాయలుగల పొట్ల.

**గుజ్జెమామిడి** (ద్వ.వి.) : పొట్టిదినుసు మామిడి, రాజామ్రము.

**గుజ్జు వేలుపు** (ద్వ.వి.) : వినాయకుఁడు.

**గుజ్జెనగూళ్లు** (దే.వి.బ.) : 1. (గుజ్జు + ఎన + కూళ్లు) బాలక్రీడా విశేషము; (చూ. అచ్చన గండ్లు) 2. బాలికలాడు కొనునప్పుడు గురుగులతో వండిన వంటకము.

**గుటక** (దే.వి.) : ఒక తూరి నోటఁబోసి కొని మ్రింగెడు నీళ్లు లోనగువాని కొలఁది.

**గుటగుట** (దే.వి.) : 1. అన్నముడుకుట నీళ్లు త్రాగుట లోనగువాని యందగు ధ్వన్యను కరణము; 2. పందికూఁత. (ఒకానొకచోఁ బులికూఁతగాను బ్రయోగింపఁబడియున్నది) 3. (బ.) : పెద్దఱికపు మాటలు.

**గుటుకు** (దే.వి.) : గుటుక్కు యొక్క రూపాం తరము. (ఆమ్రేడితము నందు గుటు గుటుకు.

**గుటుక్కను** (దే.అ.క్రి.) : (గుటుక్కు+అను) చచ్చు.

**గుటుక్కు** (దే.వి.) : మ్రింగుట యందగు ధ్వన్యను కరణము.

**గుట్ట** (వై.వి.) : 1.చిన్నకొండ; 2.రాశి; 3.కొండ.

**గుట్టు** (వై.వి.) : మర్మము.

**గుట్టుఁబేడు** (ద్వ.వి.) : (గుట్టు + పేడు) రాజమంత్రము బయలుపడుట.

**గుట్టుసాకిరి** (వై.విణ.) : వాది తన వ్యవహారము గెలుచుట కొఱకు రప్పింపఁగా వచ్చి డాఁగి యుండి ప్రతివాది యొక్క మాటలన్నియుఁ జక్కఁగావిన్న సాక్షి.

**గుడ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. గుళిగ; 2. జెముడు; 3. ద్రాక్ష. (అ.పుం.ము.) 1. బెల్లము; 2. గోలి; 3. ఏనుఁగు కవచము.

**గుడక** (వై.వి.) : 1. టెంకాయబుఱ్ఱలో నగునది; 2. పాలడ.

**గుడత్వక్కు** (సం.వి.చ్.న.) : లవంగపుఁబట్ట.

**గుడత్వచము** (సం.వి.) : లవంగపుఁబట్ట.

**గుడపుష్పము** (సం.వి.అ.పుం.) : ఇప్ప.

**గుడఫలము** (సం.వి.అ.పుం.) : గొనుగు.

**గుడాక** (సం.వి.ఆ.స్త్రీ.) : నిద్ర.

**గుడాకు** (మి.వి.గ్రా.) : (గుడము + ఆకు) బెల్లముతోఁ జేర్చి మర్దించిన పొగాకు.

**గుడాకేశుఁడు** (సం.వి.అ.పుం.): 1. అర్జునుఁడు; 2. శివుఁడు.

**గుడారము** (వై.వి.) : వస్త్రముచేత నేర్పఱచిన యిల్లు, దూష్యము.

**గుడారు** (వై.వి.) : గుడారము.

**గుడి** (యు.దే.వి.) :1. ఇకార రూపాంతర నామము; 2. పరివేషము; 3. వలయాకారపు రేఖ.

**గుడిక** (సం.వి.ఆ.స్త్రీ.) : గుళిగ.

**గుడికట్టు** (దే.వి.) : గ్రామము నాలుగు దిక్కుల యెల్లల యేర్పాటు.

**గుడికొను** (దే.అ.క్రి.) : క్రమ్ము.

**గుడిగి** (దే.వి.) : మోఁకాలివఱకుఁ దొడిగికొను వస్త్రకవచము.

**గుడిగుడి** (దే.విణ.) : అల్పము.

**గుడిచుట్టు** (దే.వి.) : చంద్రసూర్యులకుఁ జుట్టు నేర్పడు మండలాకారము, పరివేషము.

**గుడిజెల్ల** (ద్వ.వి.) : మత్స్యవిశేషము.

**గుడిదిరుగు** (దే.అ.క్రి.) : (గుడి + తిరుగు) గుండ్రముగా తిరుగు.

**గుడిసె** (యు.దే.వి.) : ఒక విత్తు చింతపండు. (వై.) స్తంభములు గోడలు నుంచక మెల్లెలు నాటి తృణాదులతో నేర్పఱచిన చిన్న యిల్లు.

**గుడుక్కు** (దే.వి.) : గుటుకు యొక్క రూపాంతరము. (ఆమ్రేడితమునందు గుడు గుడుక్కు.)

**గుడుగుడు** (గ్రా.వి.) : 1. చిన్నహుక్కా; (దే.వి.) 2. పరిగెత్తుట యందగు ధ్వన్యనుకరణము. (గుడుగుడుమని పరుగెత్తి వచ్చెను.)

**గుడుగుడుగుంచములు** (దే.వి.) : బాలక్రీడా విశేషము. (చూ. కుందెనగుడి)

**గుడుగురావిలము** (దే.వి.) : పక్షివిశేషము.

**గుడుసరి** (దే.విణ.) : (గుడుసు + అరి) కపటము గలవాఁడు.

**గుడుసు** (దే.వి.) : పరివేషము. (చూ. గుడి) (విణ.) : గుంద్రము.

**గుడుసుకయిదువు** (దే.వి.) : విష్ణు చక్రము. (ఇట్ల గుడుసువాలు. మొ.)

**గుడుసువడు** (ద్వ.అ.క్రి.) : (గుడుసు + పడు) గుంద్రమగు.

**గుడూచి** (సం.వి.ఈ.స్త్రీ.) : తిప్పతీఁగ.

**గుడ్డ** (దే.వి.) : వస్త్రము.

**గుడ్డము** (దే.వి.) : చేను.

**గుడ్డాము** (దే.వి.) : గుడ్డము యొక్క రూపాంతరము.

**గుడ్డి** (దే.వి.) : అట్టచెమ్మ ఆటలో వెలకిలఁబడ్డ ఒంటికాయ.

**గుణకము** (సం.వి.అ.పుం.) : పెంచెడు లెక్క.

**గుణపడు** (మి.అ.క్రి.) : (గుణము + పడు) చక్కఁబడు.

**గుణము** (సం.వి.అ.పుం.) : 1. ఐశ్వ ర్యాది (ఐశ్వర్యము, వీర్యము, యశము, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము. ఇవి భగవంతుని షడ్గుణములు) 2. త్యాగ శౌర్యాది 3. త్రాడు 4. వడము 5. అల్లె త్రాడు 6. మడుఁగు (ఇను మడుగు ముమ్మడుఁగు మొ.) 7. శబ్దాది (శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము ఇవి యైదు భూత గుణములు) 8. శుక్లాది 9. సంధ్యాది (ఇవి యాఱు : సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధము, ఆశ్రయము) 10. సత్త్వాది (ఇవి మూడు : సత్త్వము, రజస్సు, తమస్సు వీనికి శక్తులనియు నామాంతరము కలదు.) 11. ఇంద్రి యము 12. అప్రధానము 13. అలవాటు (కావ్య గుణములు : శ్లేషము, ప్రసాదము, మాధుర్యము, సౌకుమార్యము, సమత, అర్థదీపనము, ఔదార్యము, కాంతి, ఓజస్సు, సమాధి అని పది)

**గుణవృక్షకము** (సం.వి.అ.పుం.) : ఓడకంబము.

**గుణాలయము** (సం.వి.అ.పుం.) : గుడారము.

**గుణి** (సం.వి.న్.పుం.) : విల్లు. (విణ.) : గుణము గలవాఁడు.

**గుణించు** (సం.స.క్రి.) : గుణకము చేయు.

**గుణితము** (సం.వి.) : హల్లులతో అచ్చులను హల్లులను చేర్చి చెప్పుట. (విణ.) : గుణింపఁ బడినది.

**గుణుఁడు** (సం.వి.అ.పుం.) : భీముఁడు. (విణ.) : వంటవాఁడు.

**గుణ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) గుణింప దగినది.

**గుత్త** (వై.వి.) : ఫలప్రదమైన యొక సొత్తును ఆ సొత్తుగలవానికి తత్ఫలార్థము తగిన ధనమిచ్చి తన యనుభవ మున నుంచుకొనుట.

**గుత్తకాఁడు** (ద్వ.విణ.) : గుత్త యెత్తినవాఁడు.

**గుత్తగొను** (ద్వ.స.క్రి.) : (గుత్త + కొను) గుత్తయెత్తు.

**గుత్తి** (వై.వి.) : 1. పూవులోనగువాని గుచ్ఛము; 2. చీలమండ.

**గుత్తికగువ్వ** (ద్వ.వి.) : గువ్వగుత్తిక.

**గుత్తికవ్వము** (ద్వ.వి.) : వెదురుకొయ్య చివరను చీల్చి దారము తోఁగట్టి యేర్పఱచిన కవ్వము.

**గుత్తిపండ్లు** (ద్వ.వి.బ.) : గుత్తులు గుత్తులుగా పండెడు ఒక విధమైన పండ్లు.

**గుత్తిమల్లెలు** (వై.వి.) : ధాన్యవిశేషము.

**గుత్తివడు** (వై.అ.క్రి.) : (గుత్తి + పడు) ముడుఁగు.

**గుత్సకము** (సం.వి.అ.పుం.) : పూగుత్తి, గుచ్ఛకము.

**గుత్సము** (సం.వి.అ.పుం.) : 1. వరి లోనగువాని గంట; 2. పూగుత్తి; 3. ముప్పది రెండు మణులు గ్రుచ్చిన హారము; 4. గండి వనము.

**గుదగుదలాడు** దే.అ.క్రి. (గుదగుదలు + ఆడు) డగ్గుత్తికతో నేడ్చు.

**గుదము** (సం.వి.) : పాయువు, మూడి.

**గుది** (దే.వి.) : 1. ఆకులులోనగువాని గ్రుచ్చిన సరము; 2. గుత్తి.

**గుదికాలు** (దే.వి.) : చీలమండకు దిగువ నుండు పాదము వెనుకటి భాగము, పార్ష్ణి.

**గుదికూర్పు** (దే.వి.) : (చూ.) గుంఫనము.

**గుదిగఱ్ఱ** (దే.వి.) : (గుది+కఱ్ఱ) దుష్టమగు గోవు మొదలుగాఁగలవానికి మెడను గట్టెడు కొయ్య.

**గుదిగుంజలు** (ద్వ.వి.బ.) : పసుల దొడ్డి లోనగు వాని ద్వార మందు నిలువుగాఁ బాఁతిన కంబములు.

**గుదిగొను** (దే.అ.క్రి.) : (గుది + కొను) 1.అతిశ యించు; 2. దట్టమగు; 3. మూటకట్టుగాఁ గూలఁబడు.

**గుదిత్రాడు** (దే.వి.) : దూడకాలికిఁగట్టు త్రాడు.

**గుదిత్రోయు** (దే.స.క్రి.) : కాళ్లుకట్టి త్రోయు.

**గుదియ** (వై.వి.) : 1. నాలుగు మూరల నిడివిగల దండము; 2. గుదిగఱ్ఱ.

**గుదియకఱ్ఱలు** (ద్వ.వి.బ.) : గుది గుంజల కడ్డముగాఁ జొప్పించెడు కఱ్ఱలు.

**గుదియతాలుపు** (ద్వ.వి.) : యముఁడు, దండధరుఁడు.

**గుదివడు** (ద్వ.అ.క్రి.) : (గుడి + పడు) కట్టువడు.

**గుదె** (వై.వి.) : గుదియ యొక్క రూపాంతరము.

**గుద్దలి** (వై.వి.) : వేళ్లు మొదలగునవి పెల్లగించెడు సాధనము, కుద్దాలము.

**గుద్దలించు** (వై.స.క్రి.) : 1. గుద్దలితోఁ బెల్లగించు; 2. వెదకు.

**గునగున** (దే.వి.) : వేగముగా నడుచుట యందగు ననుకరణము.

**గునపనకోడి** (ద్వ.వి.) : వనకుక్కుటము.

**గునపము** (దే.వి.) : గడ్డపాఱ. ఖనిత్రము.

**గునామొలనూలు** (దే.వి.) : బిడ్డలు కట్టుకొనెడు కటి సూత్ర విశేషము.

**గునియు** (దే.అ.క్రి.) : 1. నర్తించు; (ఇక్కడ గునిసి యనఁగా ఇటునటు ప్రక్కకు మేను వాల్చి యనుట.) 2. కులుకు.

**గునిసాడు** (దే.అ.క్రి.) : (గునిసి+ఆడు) 1.నర్తించు; 2.కులుకు. (చూ. గునియు.) (దీని మొదటి రూపము గునిసియాడు. (చూ. ఊఁగాడు)

**గునుకు** (దే.అ.క్రి.) : కొద్ది పరువుగా పరువెత్తు. (వి.) : తృణ విశేషము. (బ.) : తృణ ధాన్య విశేషము.

**గునుపు** (దే.వి.) : విలాస విశేషము.

**గున్న** (వై.వి.) : పిల్ల (ఏనుఁగుగున్న, పందిగున్న, మామిడిగున్న. మొ.)

**గున్నంగి** (దే.వి.) : పక్షి విశేషము.

**గుప్తకేళి** (సం.వి.ఈ.స్త్రీ.) : బాలక్రీడా విశేషము, దాఁగిలి మూఁతలు.

**గుప్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. కావఁ బడినది; 2. దాఁచఁబడినది.

**గుప్తరాగము** (సం.వి.అ.పుం.) : కేతకి, మొగలి.

**గుప్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. కాపాడుట; 2. దాఁచుట; 3. చెఱసాల; 4. పాఁతఱ.

**గుప్పళించు** (దే.స.క్రి.) : 1. వస్త్రము మొదలగు వాని ఉసుము; 2. పుక్కిలించు;

**గుప్పించు** (దే.స.క్రి.) : 1. (బాణాదులను) ప్రయోగించు; 2. కురియు.

**గుప్పిలి** (దే.వి.) : పిడికిలి.

**గుప్పు** (దే.స.క్రి.) : 1.ఉంచు; 2.చల్లు; 3. (దూడ పాలు త్రాగునప్పుడు తలతో) పొఁదుగును పొడుచు; (చూ. అంబే) 4. (బాణాదులను) ప్రయోగించు; 5. విసరి వైచు.

**గుప్పున** (దే.ద్ర.క్రి.విణ.) : శీఘ్రముగా.

**గుబక** (వై.వి.) : తలుపుగందపట్టె మీఁది గుబ్బ.

**గుబగుబ** (దే.వి.) : కోకిల ధ్వనియందగు ధ్వన్యను కరణము.

**గుబాలు** (దే.వి.) : 1.గుబేలు యొక్క రూపాం తరము; 2.పగులుటయందగు ధ్వన్యనుకరణము. (ఇది యాకారమధ్య మనుటకుఁ దగిన ప్రయోగము దొరికనదికాదు.) (చూ. గుబేలు.)

**గుబాళించు** (దే.అ.క్రి.) : వాసనకొట్టు.

**గుబిలి** (దే.వి.) : 1. ఒకానొక శకునపు పక్షి, కనకాక్షి; 2. గులిమి.

**గుబుకు** (దే.స.క్రి.) : గుముకు యొక్క రూపాంతరము.

**గుబురు** (దే.వి.) : 1. దట్టము; 2. సమూహము.

**గుబులు** (దే.వి.) : 1. గుప్పనికొట్టు వాసన. 2. భయము, గుండెకొనుట.

**గుబులుకొను** (దే.అ.క్రి.) : గుప్పని వాసనకొట్టు.

**గుబుసు** (దే.వి.) : కిటుకు, కపటము.

**గుబేలు** (దే.వి.) : పడుట యందగు ధ్వన్యను కరణము.

**గుబ్బ** (వై.వి.) :1. కుచము; 2. గొడుగు మీఁది గుబ్బ; 3. తలుపుగందపట్టె మీఁది గుబ్బ; 4. బాణము నలుఁగు క్రింది గుబ్బ. (విణ.) గుండ్రమైనది.

**గుబ్బటిల్లు** (వై.అ.క్రి.) : తిరుగుడువడు. (రూ. గుబ్బటిలు.)

**గుబ్బతిల్లు** (వై.అ.క్రి.) : 1. అతిశయించు; 2. ఉప్పొంగు. (రూ. గుబ్బతిలు. ఉప్పొంగుటకు.)

**గుబ్బన** (దే.ద్ర.క్రి.విణ.) : శీఘ్రముగా.

**గుబ్బలాఁడి** (ద్వ.వి.) : (గుబ్బలు + ఆఁడి) యౌవనముగల ఆఁడుది, యువతి.

**గుబ్బలి** (దే.వి.) : కొండ, పర్వతము.

**గుబ్బలివిలుకాఁడు** (దే.వి.) : శివుఁడు, శైలధన్వుఁడు.

**గుబ్బసరము** (వై.వి.) : పెక్కుదినుసు మణులు గ్రుచ్చిన సరము.

**గుబ్బిక** (దే.వి.) : ఒకానొక చెట్టు.

**గుబ్బిక** (దే.వి.) : పక్షులులోనగు వానికిఁ బెట్టెడి యురి.

**గుబ్బిరి** (దే.వి.) : ఒకానొక చెట్టు.

**గుబ్బిలికాఁడు** (దే.వి.) : పక్షి విశేషము. (చూ.) గుబిలి.

**గుబ్బు** (దే.వి.) : గుండెయదురుట యందగు ననుకరణము. (చూ. గుబ్బుమను.)

**గుబ్బుమను** (దే.అ.క్రి.) : (గుబ్బు + అను) గుండె గుబ్బనియదరు.

**గుబ్బురను** (దే.అ.క్రి.) : (గుబ్బు + అను) గుండె గుబ్బనియదరు.

**గుబ్బెత** (వై.వి.) : (గుబ్బ + ఎత) గుబ్బ లాఁడి, యువతి.

**గమగుమ** (దే.వి.) : 1. గుమగుమ యను వాసన; (చూ. గుబులు) 2. వాసన కొట్టుట యందగు ననుకరణము.

**గుమాను** (హిం.వి.) : అనుమానము.

**గుమాస్తా** (హిం.వి.) : క్రింది యుద్యోగస్థుడు.

**గుమి** (దే.వి.) : గుంపు, సమూహము.

**గుమికాఁడు** (దే.వి.) : కాకి, వాయసము.

**గుమితి** (దే.వి.) : గుమ్మితి యొక్క రూపాంతరము.

**గుమిలి** (దే.వి.) : పక్షివిశేషము. (గుబిలి యొక్క రూపాంతరము)

**గుముకు** (దే.స.క్రి.) : పిడికిటితో పొడుచు.

**గుముడు** (వై.వి.) : గుమ్ముడు యొక్క రూపాంతరము.

**గుమురు** (దే.వి.) : గుబురు యొక్క రూపాం తరము. (సమూహమునకు)

**గుమ్మ** (దే.వి.) : పాలుపిండునప్పుడు వచ్చెడు ధార.

**గుమ్మఁడు** (దే.విణ.) : అలంకరించుకొనువాఁడు.

**గుమ్మటము** (దే.వి.) : దీపముంచెడు కాకితపు గూఁడు.

**గుమ్మడి** (వై.వి.) : కూశ్మాండము.

**గుమ్మతీలు** (దే.వి.) : చెవి తమ్మెల నుంచెడు సొమ్ము.

**గుమ్మము** (దే.వి.) : వాకిలి, ద్వారము.

**గుమ్మితి** (దే.వి.) : ఆయుధ విశేషము.

**గుమ్ము** (దే.స.క్రి.) : పిడికిటితో పొడుచు. (వి.): 1. పిడికిటిపోటు; 2. వాసన కొట్టుట యందగు ధ్వన్యనుకరణము.

**గుమ్ముడు** (వై.వి.) : శ్రీపర్ణి. (ఇది ద్వివిధము: పెదగుమ్ముడు, పినగుమ్ముడు అని. ఇదే పెద గుమ్ముడు)

**గుమ్మెట** (దే.వి.) : వాద్య విశేషము; తుడుము.

**గుమ్మెత** (దే.వి.) : వాద్య విశేషము; తుడుము.

**గుమ్మెతకాఁడు** (దే.వి.) : గుమ్మెత వాయించువాఁడు.

**గురగుర** (వై.వి.) : పందికూఁత.

**గురణము** (సం.వి.అ.న.) : యత్నము. (రూ. గూరణము)

**గురిగి** (దే.వి.) : ఆఁడుపడుచులు ఆడుకొను చిన్న పిడత.

**గురిగింజే** (ద్వ.వి.) : (గురిజ + గింజ) గురిజపూస, శిలాపాకి.

**గురిజే** (వై.వి.) : గుంజ. (ఇది త్రివిధము: ఎఱ్ఱగురిజ, తెల్లగురిజ, నల్లగురిజ అని. ఇదే యెఱ్ఱ గురిజ)

**గురివెంద** (ద్వ.వి.) : (గురిజ + వెంద) గుంజ.

**గురు** (దే.వి.) : మృగవిశేషము, గవయము.

**గురుగు** (దే.వి.) : ఒక దినుసు కూరాకు చెట్టు, భూరుండి.

**గురుజ** (దే.వి.) : ఒక దినుసు కూరాకు చెట్టు, ఉత్తుండి.

**గురువు** (ఉభ.) : దే.వి. వేగపుపరుగు. (సం.ఉ. పుం.) : 1. ఉపాధ్యాయుఁడు; 2. బృహస్పతి; 3. కులముపెద్ద; 4.తండ్రి; 5.తండ్రి తోడఁ బుట్టినవాఁడు; 6. తాత; 7. అన్న; 8. మామ; 9. మేనమామ; 10. రాజు; 11. కాపాడు వాఁడు. (విణ.) : 1. అలఘువు; 2. గొప్పది; 3. భరింపఁగూడనిది.

**గురువుదేఱు** (దే.అ.క్రి.) : (గురువు + తేఱు) జిఱ్ఱున చిప్పిలు.

**గురువులువాఱు** (దే.అ.క్రి.) : (గురువులు + పాఱు) 1. వేగపు పరువుగా పాఱు; 2. అతి శయించు.

**గురుసు** (దే.వి.) : 1. జీవస్థానము; 2. మేర.

**గుర్తించు** (దే.స.క్రి.) : గుఱుతుపట్టు.

**గుర్విణి** (సం.వి.ఈ.స్త్రీ.) : గర్భిణి, చూలాలు.

**గుర్వు** (వై.విణ.) : అధికము.

**గుర్వెట్టు** (దే.అ.క్రి.) : గుఱువెట్టు యొక్క రూపాంతరము.

**గుఱక** (దే.వి.) : నిద్రయందలి ధ్వని.

**గుఱగుఱ** (దే.వి.) : ఒక విధమైన దురద.

**గుఱి** (దే.వి.) : 1. లక్ష్యము; 2. గుఱుతు; 3. దృష్టాంతము; 4. నిర్ణయము; 5. మితి.

**గుఱించే** (దే. స. క్రి.) : 1.ఉద్దేశించు; 2. నిర్ణయించు.

**గుఱికట్టు** (దే.వి.) : 1. అంచు; 2. మితి.

**గుఱికాఁడు** (దే.విణ.) : లక్ష్యము తప్పక యేయు వాడు, కృతహస్తుఁడు.

**గుఱికొండి** (దే.వి.) : ఆయము, జీవస్థానము.

**గుఱికొను** (దే.స.క్రి.) : లక్షించు.

**గుఱిచి** (దే.అప.) : కూర్చి ప్రత్యయమునకు పర్యాయము.

**గుఱుకొను** (ద్వ.అ.క్రి.) : యత్నించు.

**గుఱుగుఱ్ఱు** (దే.వి.) : ఒఱలుట యందగు ధ్వన్యనుకరణము.

**గుఱుతు** (దే.వి.) : 1. చిహ్నము; 2. మేర.

**గుఱుపొడుచు** (దే.అ.క్రి.) : గుఱకపెట్టు.

**గుఱుములు** (దే.వి.బ.) : గింజలు.

**గుఱువెట్టు** (దే.అ.క్రి.) : (గుఱ్ఱు + పెట్టు) గుఱకయిడు.

**గుఱ్ఱపుఁజుక్క** (వై.వి.) : (గుఱ్ఱము + చుక్క) అశ్వినీ నక్షత్రము.

**గుఱ్ఱపుఁబీఁట** (వై.వి.) : (గుఱ్ఱము+పీఁట) ద్వార బంధము మీఁదనుంచెడు గుఱ్ఱపు మూతికొయ్య.

**గుఱ్ఱపుమోమువేల్పు** (ద్వ.వి.) : (గుఱ్ఱము + మోము వేల్పు) కింపురుషుఁడు.

**గుఱ్ఱపుసొరము** (వై.వి.) : (గుఱ్ఱము + సొరము) సప్తస్వరములలో నొకటి, దైవతము.

**గుఱ్ఱము** (వై.వి.) : అశ్వము. (దీనికి బహు వచనము నదు గుఱ్ఱాలనియు రూపము గలదు.)

**గుఱ్ఱు** (దే.వి.) : 1. కోపము నందగుననుకరణము; 2. నిద్ర యందగు ధ్వన్యనుకరణము. (గుఱ్ఱెత్తెను.) (ఆమ్రేడితము నందు గుఱ్ఱుగుఱ్ఱు.)

**గులక** (వై.వి.) : ఒక దినుసు ఱాయి.

**గులకరించు** (దే.అ.క్రి.) : రమ్యమగు.

**గులగుల** (దే.వి.) : 1. పుట్టలను కోరాడుట యందగు ననుకరణము; 2. (బ.) : చూర్ణము;

3.నలఁగుడు; 4. దురద (గుఱగుఱ యొక్క రూపాంతరము.)

**గులప** (దే.వి.) : గుజ్జుపువాఁడు.

**గులాము** (వై.వి.) : దాసుఁడు; దాసురాలు.

**గులాబి** (హిం.వి.) : పుష్పవిశేషము.

**గులి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. గోలీ; 2. తీఁటగుల.

**గులిబి** (దే.వి.) : గులిమియొక్క రూపాం తరము. (ఇట్లు బకారోపధముగాఁ గొన్ని దేశముల యందు వ్యవహారము.)

**గులిమి** (దే.వి.) : కర్ణమలము, పింజూషము.

**గులిమికదురు** (దే.వి.) : గులిమి తీసికొనెడి వెండిలోనగు వానిపుల్ల.

**గుల్ఫము** (సం.వి.అ.పుం.) : చీలమండ.

**గుల్మము** (సం.వి.అ.పుం.) : 1.బోదెలేని చెట్టు; 2.వ్యాధివిశేషము; 3.సేనా విశేషము; (తొమ్మిది రథములు అన్నియ నేనుఁగులు ఇరువదేడు గుఱ్ఱములు నలువదేవురు కాల్వురును గలది) 4. సైన్యరక్షణము; 5. పురాభిముఖమైన రాజమార్గము.

**గుల్మిని** (సం.వి.ఈ.స్త్రీ.) : ఉలపము, పొదరు.

**గుల్ల** (వై.వి.) : 1. కప్పచిప్ప; 2. బొబ్బ. (విణ.): 1. అల్పము; (గుల్లకావి, గుల్ల పుటిక. మొ.) 2. బోలు. (గుల్లకఱ్ఱ. మొ.)

**గుల్లకాఁడు** (ద్వ.విణ.) : ఏమిలేనివాఁడు, అకించనుఁడు.

**గుల్లపడు** (వై.అ.క్రి.) : అవమానపడు. (దీనికిఁ బ్రయోగము ప్రేరణ మందే కానఁ బడుచున్నది.

**గుల్లాము** (వై.వి.) : గులాము యొక్క రూపాం తరము.

**గువాకము** (సం.వి.అ.పుం.) : పోఁక చెట్టు. (రూ. గూవాకము)

**గువ్వ** (దే.వి.) : అడవి పావురము, కపోతము.

**గువ్వకరిగొను** (దే.స.క్రి.) : చుట్టుకొను.

**గువ్వకుత్తుక** (దే.వి.) : (ఆఁకటిచేతఁ గలుగు) హీనస్వరము. (చూ. కుతిలపడు.)

**గువ్వకుత్తుకపడు** (ద్వ.అ.క్రి. ) : (ఆఁకటి చేత) హీనస్వరమగు.

**గువ్వకోలుకొను** (దే.స.క్రి.) : గువ్వ కరిగొను. (రూ. గువ్వకోల్కొను.)

**గువ్వగుత్తి** (ద్వ.వి.) : కపోతాంఘ్రి.

**గువ్వగుత్తుక** (దే.వి.) : కపోతాంఘ్రి.

**గుసగుస** (దే.వి.) : రహస్యపు మాటల చప్పుడు.

**గుసగుసలువోవు** (దే.అ.క్రి.) : గుసగుస యని మాటలాడు.

**గుహ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. కొండయందు తొలువఁ బడిన గొప్ప బిలము; 2. పల్లము; 3. నక్క తోఁక పొన్న.

**గుహాశయము** (సం.వి.అ.పుం.) : వ్యాఘ్రము, పులి.

**గుహుఁడు** (సం.వి.అ.పుం.) : కుమారస్వామి, కందుఁడు.

**గుహ్యకుఁడు** (సం.వి.అ.పుం.) : దేవయోని విశేషము.

**గుహ్యకేశ్వరుఁడు** (సం.వి.అ.పుం.) : కుబేరుఁడు.

**గుహ్యము** (సం.వి.అ.న.) : 1. ఏకాంతము; 2. స్త్రీ పురుషుల గుఱి; 3. తాఁబేలు; 4. నెపము. (విణ.) : దాఁచదగినది.

**గుళిక** (సం.వి.ఆ.స్త్రీ.) : రసమణి లోనగునది.

**గుళిగ** (వై.వి.) : రసమణిలోనగునది.

**గుళుచ్ఛము** (సం.వి.అ.పుం.) : పువ్వులోనగువాని గుత్తి, గుచ్ఛము.

**గుళ్ళు** (దే.వి.బ.) : కుందెన గుడి యను బాల క్రీడా విశేషము.

## గూ

**గూండ్ర** (దే.వి.) : గుడ్లగూబకూఁత.

**గూండ్రించు** (దే.అ.క్రి.) : (గుడ్లగూబ) కూయు.

**గూఁటి** (వై.వి.) : పంది, సూకరము.

**గూటిఁగువ్వ** (దే.వి.) : (గూఁడు + గువ్వ) ఈఁకలు రాల్చిన పక్షి.

**గూఁడు** (దే.వి.) : 1.పక్షిగృహము; 2. గోడ యందు దీపముంచుటకేర్పఱచిన చోటు; 3. (పెంపుడు చిలుకలు లోనగునవి యుండు) పంజరము; 4. ఆకుగుడిసె.

**గూఁడుకానుపు** (దే.వి.) : పక్షి, నీడోద్భవము.

**గూఁడుబండి** (దే.వి.) : చాఁపకట్టిన బండి.

**గూటము** (వై.వి.) : 1. వడ్లవాని యొకానొక కొఱముట్టు; 2.గుంజ; 3.మేకు; 4. మాదిగవాని ఒక కొఱముట్టు.

**గూటాము** (వై.వి.) : గూటము యొక్క రూపాంతరము.

**గూడ** (దే.వి.): 1. వానకు తలమీద వేసుకొనుటకై యల్లిన జమ్ముగూడ; 2.తిరుపగూడ; 3.నీళ్లు చల్లెడు వెదురు బుట్ట; 4. పూవులులోనగునవి యుంచెడు బుట్ట; 5.మత్స్యములను బట్టెడి సాధన విశేషము; 6.దొప్ప.

**గూడకట్టు** (దే.వి.) : కచ్ఛములేక కట్టిన దోవతి యద్దకట్టు.

**గూడపాల** (దే.వి.) : మామెన, శారిబ.

**గూడబాతు** (దే.వి.) : బక విశేషము.

**గూడారము** (వై.వి.) : గుడారము యొక్క రూపాంతరము.

**గూడారు** (వై.వి.) : గూడారము యొక్క రూపాంతరము.

**గూడెము** (దే.వి.) : కొండదొన నాశ్రయించి యుండెడు బోయపల్లె.

**గూఢపాత్తు** (సం.వి.త్.పుం.) : కానరాని కాళ్లది, పాము.

**గూఢపురుషుఁడు** (పం.వి.అ.పుం.) : చారుఁడు, వేగువాడు.

**గూఢమణి** (సం.వి.ఇ.స్త్రీ.) : బాలికా క్రీడా విశేషము.

**గూఢము** (సం.వి.అ.న.) : 1.రహస్యము; 2. స్త్రీ పురుషుల గుటి. (విణ.) : దాచ బడినది.

**గూఢసాక్షి** (సం.విణ.) : (న్.ఈ.న్) (చూ.) గుట్టుసాకిరి. (వీఁడు కృతసాక్షు లేవురిలో నొకఁడు. చూ. సాక్షి.)

**గూథము** (సం.వి.) : పురీషము, విష్ఠ.

**గూన** (దే.వి.) : పెద్దకుండ.

**గూనివాఁడు** (దే.విణ.) : (గూను + వాఁడు) కుబ్జుఁడు.

**గూను** (దే.వి.) : నడుముమీఁది వంపు.

**గూనుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) విష్ఠించిన వాఁడు.

**గూనుగిల్లు** (దే.అ.క్రి.) : గూనుకలుగు.

**గూబ** (యు.దే.వి.) : కర్ణమూలము. (వై.) : గుడ్లగూబ.

**గూబతడ** (దే.వి.) : మహాబల.

**గూబరి** (దే.వి.) : మాదిగవాఁడు.

**గూవనాలు** (దే.వి.బ.) : బాలక్రీడా విశేషము. (చూ. కుప్పిగంతులు)

**గూహనము** (సం.వి.అ.న.) : గోపనము, దాఁచుట.



**గృంజనము** (సం.వి.అ.న.): విషము తిన్న పశువు యొక్క మాంసము. (పుం.) : వెల్లుల్లి.

**గృధ్నువు** (సం.విణ.ఉ.) : ఇచ్ఛగలవాడు, గర్ధనుఁడు.

**గృధ్రము** (సం.వి.అ.పుం.) : గద్ద. (విణ.) : పిసినివాఁడు.

**గృధ్రసి** (సం.వి.ఈ.స్త్రీ.) : (చూ.) కిరుదెస.

**గృష్టి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. ఒకతూరి యీనిన యావు; 2. పాఁచితీఁగ.

**గృహకచ్ఛపము** (సం.వి.అ.పుం.) : (నూఱెడు) సన్నెకల్లు.

**గృహగోధిక** (సం.వి.ఆ.స్త్రీ.) : ముసలి, బల్లి.

**గృహద్రుమము** (సం.వి.అ.పుం.) : పాలతేఁకు.

**గృహపతి** (సం.వి.ఇ.పుం.) : 1. గృహస్థుఁడు 2. మంత్రి 3. విడువక యిచ్చువాడు.

**గృహమణి** (సం.వి.ఇ.స్త్రీ.) : దీపము, దివ్వె.

**గృహము** (సం.వి.అ.న.): 1.ఇల్లు; 2.పెండ్లాము.

**గృహమృగము** (సం.వి.అ.పుం.) : శ్వానము, కుక్క.

**గృహమేధి** (సం.వి.న్.పుం.) : (చూ.) గృహస్థుఁడు.

**గృహస్థుఁడు** (సం.వి.అ.పుం.) : భార్యను పరిగ్రహించిన ధర్మార్థ కామముల నడపుచు వేద పాఠము వైశ్వదేవాది హోమము అతిథి పూజ పితృ తర్పణము భూతబలియుననెడు పంచ యజ్ఞములను జేయుచు ప్రవర్తించు వాఁడు, ఇలుఱేఁడు. (రూ. గృహస్థు)

**గృహస్థూణము** (సం.వి.అ.న.) : ఇంటి నడిమి కంబము, నిట్రాడు.

**గృహావగ్రహణి** (సం.వి.ఈ.స్త్రీ.) : దేహళి, గడప.

**గృహి** (సం.వి.న్.పుం.) : (చూ.) గృహస్థుఁడు.

**గృహిణి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. ఇల్లాలు; 2. ఎఱ్ఱ తుమ్మెద; 3. కణుఁదురీఁగ.

**గృహీతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) గ్రహింపఁ బడినది.

**గృహీతి** (సం.వి.ఇ.స్త్రీ.) : గ్రహింపఁ జాలిన బుద్ధి.

**గృహ్యకము** (సం.వి.అ.పుం.) : పెంపుడు మృగము లోనగునది, దీమము. (విణ.) : పరాధీనము.

**గృహ్య** (సం.వి.ఆ.స్త్రీ.) : శాఖానగరము. (అ.న.ము.) : కర్మబోధిక గ్రంథము. (పుం.) : పెంపుడు మృగము లోనగునది. (విణ.) : 1. స్వాధీనము; 2. పరాధీనము.

## గె

**గెంటసము** (దే.వి.) : పరుష వచనము.

**గెంటించు** (దే.అ.క్రి.) : చలించు.

**గెంటు** (దే.అ.క్రి.) :1.చలించు; 2.తొలఁగు. 1. త్రోయు; (వీఁడు వానిని మెడపట్టి గెంటి నాఁడు.) 2. ప్రయోగించు. (వి.) : చలనము.

**గెంటువడు** (ద్వ.అ.క్రి.) : (గెంటు + పడు) తప్పు.

**గెంటెము** (దే.వి.) : జంట నేఁత వస్త్రము. (విణ.): దట్టము.

**గెగ్గలు** (దే.వి.) : గేలి, పరిహాసము. (అప్ర.)

**గెడ** (దే.వి.) : 1. జత; 2. సమీపము; (చూ. గొంటు.) 3.వేఁటకుఁ దగిన యొకానొక సాధనము.

**గెనయు** (దే.అ.క్రి.) : పుష్టియగు.

**గెనసు** (దే.వి.) : ఒకానొకగడ్డ, ఆలువు.

**గెబ్బు** (దే.స.క్రి.) : 1. అపహరించు; 2. గ్రహించు.

**గెఱ** (దే.వి.) : రేఖ.

**గెల** (దే.వి.) : పండ్ల యొక్కయు కాయల యొక్కయు గొల.

**గెలివి** (దే.వి.) : సంతోషము. (వాఁడు మిక్కిలి గెలివితో నున్నాఁడు.)

**గెలివిడి** (దే.వి.) : గెలివియొక్క రూపాంతరము.

**గెలుచు** (దే.అ.క్రి.) : పోవు. (ఆం.ప్రే.) : పుచ్చు. (స.క్రి.) : జయించు.

**గెలుపు** (దే.వి.) : 1. జయించుట; 2. జయము.

**గెలుపుకాఁడు** (దే.విణ.) : జయశీలుఁడు.

**గెలుపుకొను** (దే.స.క్రి.) : జయించు. (రూ. గెల్పుకొను.)

**గెలువము** (దే.వి.) : గెలుపు, జయము.

**గెల్లి** (దే.వి.) : ఉప్పుకుప్ప.

**గెల్లు** (వై.వి.) : కలకల ధ్వని.

## గే

**గేందుకము** (సం.వి.) : బాలురు ఆడుకొనెడు చెండు, కందుకము.

**గేడెకాళ్లవాఁడు** (దే.విణ.) : కొంగ కాళ్లవాఁడు.

**గేదఁగి** (వై.వి.) : పుచ్చపూ మొగలి. (ఇది శివపూజ కనర్హము.)

**గేదె** (దే.వి.) : 1. పొట్టిబఱ్ఱె; 2. బఱ్ఱె.

**గేదెచెలప** (దే.వి.) : మూడేండ్ల యెనుప దూడ.

**గేయము** (సం.వి.అ.న.) : పాట. (విణ.) : 1. పాడఁదగినది; 2. పాడునది.

**గేరంజము** (సం.వి.అ.పుం.) : (చూ.) కేరజము.

**గేలి** (వై.వి.) : పరిహాసము.

**గేలికొట్టు** (ద్వ.స.క్రి.) : పరిహసించు.

**గేలికొను** (ద్వ.స.క్రి.) : పరిహసించు.

**గేస్తు** (వై.వి.) : (చూ.) గృహస్థుఁడు.

**గేస్తుఁడు** (వై.వి.) : గృహస్థుఁడు.

**గేస్తురాలు** (ద్వ.వి.) : (గేస్తు + ఆలు) ఇల్లాలు.

**గేహము** (సం.వి.అ.పుం.న.) : గృహము, ఇల్లు.

**గేహాళి** (సం.వి.ఈ.స్త్రీ.) : (దీనిని దేహళీ పర్యాయ ముగా వాడుచున్నారు.)

**గేహి** (సం.వి.న్.పుం.) : గృహస్థుఁడు.

**గేహిని** (సం.వి.ఈ.స్త్రీ.) : ఇల్లాలు.



**గైరికము** (సం.వి.అ.న.) : 1. పర్వత ధాతు విశేషము; 2. బంగారు.

**గైరేయకము** (సం.వి.అ.పుం.) : కారుపోఁక.

**గైరేయము** (సం.వి.అ.న.) : సిలాజిత్తు.



**గొ** (దే.అవ్య.) : చూపుటయందు వచ్చును. (అదిగొ, ఇదిగొ. మొ.)

**గొంగ** (దే.వి.) : పగతుఁడు, శత్రువు.

**గొంగడి** (దే.వి.) : కంబళి.

**గొంగడికాఁడు** (దే.వి.) : పక్షి విశేషము.

**గొంగళి** (దే.వి.) : గొంగడి యొక్క రూపాంతరము.

**గొంగళిపురుగు** (ద్వ.వి.) : (చూ.) కంబళి పురుగు.

**గొంజ** (దే.వి.) : గొఱ్ఱాలు.

**గొంటరి** (దే.విణ.) : (గొంటు + అరి) 1. కుత్సి తుఁడు; 2. కఠినుఁడు.

**గొంటి** (దే.విణ.) : దుష్టురాలు. (ఇక్కడ ఇకారము స్త్రీ విషయకమైన ప్రత్యయ మని యెఱుంగునది.)

**గొంటు** (యు.దే.విణ.) : దుష్టుఁడు. (వై.వి.) : బందనలేని వక్క.

**గొంటుకాఁడు** (ద్వ.విణ.) : కఠినుడు. (స్వార్థమున కాఁడు.)

**గొండిలి** (వై.వి.) : 1. కుండలాకార నృత్యము; 2. నృత్యము; 3. నర్తకి.

**గొండ్లి** : 1. కుండలాకార నృత్యము; 2. నృత్యము; 3. నర్తకి. (గొండిలి యొక్క రూపాంతరము)

**గొండెము** (దే.వి.) : గొండ్లెము (చూ. కొండెము)

**గొండ్లెము** (దే.వి.) : తలుపుచిలుకు.

**గొంతి** (వై.వి.) : పాండురాజు భార్య.

**గొంతు** (దే.వి.) : 1. కంఠము; 2. కంఠ ధ్వని; (నీ గొంతువిని నేనిక్కడికి వచ్చితిని.) 3. కుక్కు టాసనము. (వాఁడు గొంతుగూర్చున్నాఁడు.)

**గొంతుక** (దే.వి.) : కంఠము.

**గొంతుకపోఁక** (ద్వ.వి.) : గొంతు ముందఱి ప్రక్క పోఁక వలె నుండెడి యెముక, గొంతుముడి.

**గొంతమాలు** (దే.వి.) : మల్లబంధ విశేషము.

**గొంతుముడి** (దే.వి.) : గొంతుకపోఁక.

**గొంతెమకోరిక** (దే.వి.) : కోరదగని కోరికలను గోరుట.

**గొంతెమగోరు** (దే.వి.) : (గొంతెమ + కోరు) ప్రసారిణి.

**గొంది** (దే.వి.) : మూల.

**గొగ్గి** (దే.విణ.) : ఎచ్చుతక్కువైనది.

**గొజ్జఁగ** (వై.వి.) : గొజ్జెఁగ యొక్క రూపాంతరము.

**గొజ్జెఁగ** (వై.వి.) : ఒకానొకపూఁజెట్టు.

**గొటగొట** (దే.వి.) : గోండ్రించుట లోనగువాని యందగు ధ్వన్యనుకరణము.

**గొట్టము** (దే.వి.) : క్రోవి.

**గొట్టి** (దే.వి.) : ఒకదినుసుగడ్డ, కశేరుకము.

**గొట్టు** (దే.వి.) : 1. దౌష్ట్యము; 2. విరోధి. (విణ.): 1. కఠినము; 2. దుర్లభము; 3. దుష్టము.

**గొట్టె** (వై.వి.) : ఘోటజటి.

**గొట్లె** (వై.వి.) : రేఁగుచెట్టు.

**గొడఁగు** (దే.స.క్రి.) : గొణఁగు.

**గొడగ** (వై.వి.) : ఏఁడికోలలేని నాఁగలి.

**గొడగర** (దే.వి.) : చెప్పులు కుట్టి జీవించెడు జాతి. (గొడగరవాఁడు, గొడగరది.)

**గొడగరి** (దే.వి.) : (గొడగర+ఇ) మాదిగ వాఁడు.

**గొడవ** (దే.వి.) : 1.ఆపద; 2.తప్పు; 3.దుఃఖము; 4.అడ్డి; 5.కలఁత.

**గొడారి** (దే.వి.) : గొడగరి యొక్క రూపాంతరము.

**గొడిగ** (వై.వి.) : గులకఱాయి.

**గొడియ** (దే.వి.) : అందలము యొక్క ఒకానొక అవయవము.

**గొడుగు** (దే.వి.) : ఆతపత్రము, ఛత్రము.

**గొడుగుగడ్డి** (దే.వి.) : గుడ్డికామంచి, అతిచ్ఛత్రము.

**గొడుగుబల్ల** (దే.వి.) : తలుపుమీఁది కుబుసము తిరిగెడు పట్టె.

**గొడుగుమెట్టెలు** (దే.వి.బ.) : వాటము పెట్టి ఓరలు సన్నగాఁ దీర్చిన వెడలుపు మెట్టెలు.

**గొడె** (దే.వి.) : గొడియ యొక్క రూపాంతరము.

**గొడ్డ** (దే.వి.) : 1. బిఱుసు; 2. (బ.) : బిఱుసుమాట.

**గొడ్డగము** (వై.విణ.) : బాధకము.

**గొడ్డలి** (వై.వి.) : చెట్లు నఱకెడు సాధనము, కుఠారము.

**గొడ్డు** (దే.వి.) : 1.గొడ్రాలితనము; 2. ఈనని పశువు; 3. గొడ్రాలు; 4. పశువు. (విణ.) : శూన్యము. (గొడ్డంబలి = నూఁకలులేని యంబలి అని యర్థము.) (ఇట్లు గొడ్డుజావ, గొడ్డు సంకటి.) గొడ్డేఱు = నీళ్లులేని యేఱు అని యర్థము. గొడ్డుచెట్టు = ఫలములేని చెట్టు అని యర్థము.

**గొడ్డుఁగాఁకర** (ద్వ.వి.) : (గొడ్డు + కాఁకర) కర్కటకి.

**గొడ్డుఁబోతు** (దే.విణ.) : (గొడ్డు + పోతు) నిష్ప్రయోజకుఁడు.

**గొడ్డురాలు** (దే.వి.) : (గొడ్డు + ఆలు) బిడ్డలుకనని ఆడుది, వంధ్య.

**గొడ్డువోవు** (దే.అ.క్రి.) : (గొడ్డు + పోవు) వ్యర్థమగు. ఇత్యాది స్థలముల యందు గొడ్డు వోవుటయనఁగా పౌరుష హీనమగుట అర్థము.)

**గొడ్డేఱు** (దే.స.క్రి.) : (గొడ్డు + ఏఱు) గుత్తయెత్తు.

**గొడ్రాలు** (దే.వి.) : గొడ్డురాలు యొక్క రూపాంతరము.

**గొణఁగు** (దే.అ.క్రి.) : మాటవెడలనీక నోటనె గొణ గొణయను. (గొడఁగు యొక్క రూపాంతరము)

**గొణగ** (వై.వి.) : గొడగ యొక్క రూపాంతరము.

**గొణగొణ** (దే.వి.) : గొణఁగుట యందగు ధ్వన్యను కరణము.

**గొణగొణలాడు** (దే.అ.క్రి.) : (గొణ గొణలు + ఆడు) గొణగొణయను.

**గొణిజ** (దే.వి.) : గొణిద యొక్క రూపాంతరము.

**గొణిద** (దే.వి.) : తలుపు గ్రంది తగిలించెడి యినుప చీల.

**గొతుపు** (దే.వి.) : నీలమణి విశేషము.

**గొత్తు** (దే.వి.) : వెన్న మొదలగునవి పాసిపోయిన కంపు.

**గొద** (దే.వి.) : ఆఁకలి, క్షుత్తు.

**గొదకొను** (దే.అ.క్రి.) : 1. అతిశయించు; 2. త్వరపడు; 3. విజృంభించు.

**గొదగొద** (దే.వి.) : పగ, విరోధము.

**గొనకొను** (దే.అ.క్రి.) : యత్నించు.

**గొనప** (దే.వి.) : అఱిగిన నాఁగేలు. (విణ.) : పొట్టి. (గొనపకోడి. మొ.)

**గొనబు** (దే.వి.) : మనోజ్ఞత. (విణ.) : మనోజ్ఞము.

**గొనబుకాఁడు** (దే.విణ.) : అందగాఁడు, సుందరుఁడు.

**గొనమ** (దే.వి.) : గొనప యొక్క రూపాంతరము. (ఇది యిట్లు మకారో పథముగాఁ గొన్ని గ్రంథముల యందు వ్రాయఁబడి యున్నది.)

**గొనము** (వై.వి.) : శౌర్యాదిగుణము.

**గొనయము** (వై.వి.) : వింటినారి, మౌర్వి.

**గొనుగు** (దే.వి.) : గుడఫలము.

**గొప్ప** (దే.విణ.) : పెద్ద, అధికము.

**గొప్పలు** (యు.దే.విణ.బ.) : వరిమడి లోనగువాని యందు కొంచెము పొడవుగా నుండెడు చోట్లు. (గొప్పులు త్రవ్వుచున్నారు.) (వై.) : చూరు పట్టె, గోపానసి.

**గొబ** (వై.వి.) : 1. గుహ; 2. గొంది.

**గొబడి** (దే.వి.) : పక్షి విశేషము.

**గొబ్బండు** (దే.వి.) : (గొప్ప + పండు) పెద్దపండు.

**గొబ్బరము** (దే.వి.) : ఎరువు.

**గొబ్బి** (దే.వి.) : 1. ధనుర్మాస దినముల సాయంకాలములయందు గడపలకు ముందు బాలికలు పాటలుపాడి చేతులు తట్టుచుఁ జుట్టి వచ్చి జరపించెడునొక వేడుక; 2. సమర్తాడి నప్పుడు బాలికలు పాటలు పాడి చేతులు తట్టుచు జుట్టి వచ్చి జరపించెడి యొక వేడుక; 3. ఇక్షు రకము.

**గొబ్బిళ్లు** (దే.వి.బ.) : 1. బాలక్రీడా విశేషము (చూ. కుప్పిగంతులు) 2. బాలికా క్రీడా విశేషము. 3. నమస్కారము.

**గొబ్బున** (దే.ద్ర.క్రి.విశ.) : శీఘ్రముగా.

**గొయ్యి** (దే.వి.) : పల్లము, గర్తము.

**గొరక** (వై.వి.) : 1. ఇనుప బాణము; 2. మృగ విశేషము.

**గొరకకట్టె** (వై.వి.) : అలుఁగుగల చేతికఱ్ఱ.

**గొరగ** (దే.వి.) : మైలారును గొలిచెడి యొకానొక మతస్థుఁడు.

**గొరగొర** (దే.వి.) : వేగము.

**గొరిజ** (వై.వి.) : గొరిసె యొక్క రూపాంతరము.

**గొరిసె** (వై.వి.) : పశువులకాలిగిట్ట, ఖురము.

**గొరిసెగాలి** (ద్వ.వి.) : పశువుల గొరిసెల నడుమ పుండై పురుగులు పడెడి వ్యాధి.

**గొరువంక** (వై.వి.) : గోరువంక యొక్క రూపాంతరము.

**గొఱుకు** (వై.విశ.) : నీచుఁడు.

**గొఱపము** (వై.వి.) : గుఱ్ఱమును దోమెడు సాధనము, కేశకారము. (ఇట్లు సరళాదిగాఁ గొన్ని దేశముల యందు వ్యవహారము.)

**గొఱియ** (వై.వి.) : గొఱ్ఱియ యొక్క రూపాంతరము.

**గొఱుగు** (దే.స.క్రి.) : క్షౌరముచేయు.

**గొఱె** (వై.వి.) : గొఱ్ఱె యొక్క రూపాంతరము.

**గొఱ్ఱియ** (వై.వి.) : గొఱ్ఱె

**గొఱ్ఱు** (దే.వి.) : 1. ముప్పది రెండు కుంటల కొలఁది; 2. దున్నిన పొలము మీఁద దున్నెడు యంత్రము.

**గొఱ్ఱె** (వై.వి.) : మేషి. (గొఱ్ఱియ యొక్క రూపాంతరము.)

**గొల** (వై.వి.) : పండ్లులోనగు వానియొక్క గెల.

**గొలక** (యు.వై.వి.) : కలకలధ్వని. (దే.బ.) : తాటిచన్నులు.

**గొలగొల** (వై.వి.) : 1. కలకల ధ్వని; 2. ధ్వన్యను కరణము.

**గొలిమిడి** (దే.వి.) : ఇక్షురకము.

**గొలివె** (దే.వి.) : తృణ విశేషము. (బ.) : తృణ ధాన్య విశేషము.

**గొలుగు** (దే.వి.) : గొనుగు యొక్క రూపాంతరము.

**గొలుసు** (దే.వి.) : 1. చేత ధరించెడి యొక సొమ్ము; 2. ఏనుఁగుకాలు గట్టెడు నిగళము; 3.సంకెల.

**గొలుసుమోడి** (దే.వి.) : విడివిడిగా లేక గొలుసు వలె నొకటితో నొకటి పెనఁ గొన్న వ్రాలు.

**గొల్ల** (యు.దే.వి.) : 1. ద్వారపాలకుఁడు; 2. ధనపాలుఁడు. పశువులను మేపియు పాలు పెరుగు అమ్మియు జీవించెడు జాతి. (గొల్లవాఁడు, గొల్లది.)

**గొల్లఁడు** (వై.వి.) : గోపాలకుడు.

**గొల్లజిడ్డు** (ద్వ.వి.) : శూలిని.

**గొల్లత** (వై.వి.) : గోపిక.

**గొల్లదొందు** (దే.వి.) : మత్స్య విశేషము.

**గొల్లము** (వై.వి.) : లోతుగల పల్లము. (చూ. కొలి)

**గొల్లియన** (దే.వి.) : గొల్లెన.

**గొల్లు** (వై.వి.) : కలకల ధ్వని.

**గొల్లెన** (దే.వి.) : గుడారము. (గొల్లియన యొక్క రూపాంతరము)

**గొల్లెనబండి** (దే.వి.) : గాడీ.

**గొవరు** (దే.వి.) : తాపము. (చూ. గొవరువోవు.)

**గొవరువోవు** (దే.అ.క్రి.) : తపించు.

**గొహోరు** (దే.వి.) : ఉపద్రవము.

## గో

**గో** (దే.అవ్య.) : చూపుటయందు వచ్చును. (అదిగో, ఇదిగో. మొ.)

**గోండుఁడు** (సం.వి.అ.పుం.) : పామర జాతి వాడు. (విణ.) : ఉఱుకు బొద్దువాఁడు.

**గోండ్రించు** (దే.అ.క్రి.) : 1. (పులి) కూయు; (చూ.గోండ్రిల్లు) 2. (ఎలుఁగు) కూయు.

**గోండ్రిల్లు** (దే.అ.క్రి.) : (పులి) కూయు. (రూ. గోండ్రిలు.)

**గోండ్రు** (దే.వి.) : అంగలార్చుట యందగు ధ్వన్యనుకరణము.

**గోఁకు** (దే.స.క్రి.) : 1. గీఁకు; 2. గీఱు.

**గోఁకుడుపాఱ** (దే.వి.) : దోఁకుడుపాఱ.

**గోఁగు** (దే.వి.) : గోను యొక్క రూపాంతరము. (ఇది ద్వివిధము. ఊరగోఁగు, కొండగోఁగు అని. ఇదియె ఊరగోఁగు.)

**గోఁచి** (దే.వి.) : కచ్చడము, కౌపీనము.

**గోఁచికట్టు** (దే.వి.) : బ్రహ్మచారి.

**గోఁచికాఁడు** (దే.వి.) : బ్రహ్మచారి. (విణ.) : నిర్ధనుఁడు.

**గోఁచిబాఁపఁడు** (ద్వ.వి.) : బ్రహ్మచారి.

**గోఁజాట** (దే.వి.) : గోఁజాడుట. (ఇదేమి యెప్పుడు చూచినను ఈ గోఁజాట.)

**గోఁజాడు** (దే.స.క్రి.) : (గోఁజు + ఆడు) పీడించి యడుగు. (స్వార్థమున ఆడు.) (ఏల ఊరక గోజాడుచున్నావు.)

**గోఁజే** (దే.స.క్రి.) : గోఁజాడు. (వీడు ఊరక నన్ను గోఁజుచున్నాడు.) (వి.) : గోఁజాట. (ఇదేమి పెద్ద గోఁజుగా ఉన్నది.)

**గోఁటు** (దే.వి.) : 1. కోకయంచున చేర్చి కుట్టెడు సన్నని సరిగపట్టె; 2. ఒయ్యారము; 3. రేఖ; 4. (బ.) : చేతనుంచుకొనెడు స్వర్ణ కటక విశేషము.

**గోఁటుకత్తె** (ద్వ.విణ.) : ఒయ్యారము గలది.

**గోఁటుకాఁడు** (దే.విణ.) : ఒయ్యారము గలవాఁడు.

**గోఁదు** (దే.వి.) : బందన.

**గోఁదురు** (దే.వి.) : పెద్దకప్ప.

**గోకంటకము** (సం.వి.అ.పుం.) : 1. పల్లేరు; 2. గోవుల గొరిసె.

**గోకర్ణము** (సం.వి.అ.పుం.) : 1. కడితి మృగము; 2. జుత్త; 3. కంచరగాడిద; 4.పాము; 5. ప్రమథ గణ విశేషము.

**గోకర్ణి** (సం.వి.ఈ.స్త్రీ.) : చాఁగ.

**గోకిలము** (సం.వి.అ.పుం.) : 1. రోఁకలి; 2. నాఁగలి.

**గోకులము** (సం.వి.అ.న.) : ఆవులమంద.

**గోకులికము** (సం.వి.అ.పుం.) : అడుసునఁ బడిన యెద్దు. (కొన్ని పుస్తకముల యందు గోగుణిక మని పాఠము కానఁ బడుచున్నది.)

**గోక్షురకము** (సం.వి.అ.పుం.) : పల్లేరు.

**గోగంధనము** (సం.వి.అ.పుం.) : ఎదురుగాలి.

**గోగ్రంథి** (సం.వి.ఇ.పుం.) : 1. పసుల కొట్టము; 2. ఏఱుపిడక; 3. బెండ.

**గోచరము** (సం.వి.అ.పుం.) : 1. ఇంద్రియార్థము (చూ. విషయము) 2. విషయము.

**గోచరించు** (సం.అ.క్రి.) : అగపడు. (ఆం. ప్రే.): అగపఱచు.

**గోచారము** (సం. వి. అ. పుం.) : సూర్యాది గ్రహముల యొక్క మేషాదిరాసుల సంచారము.

**గోజిహ్వ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఎద్దునాలుక చెట్టు, బెండ.

**గోటాపన** (వై.వి.) : పక్షియీఁక.

**గోడ** (వై.వి.) : కుడ్యము.

**గోడకాలు** (ద్వ.వి.) : కరగోడ.

**గోడగించు** (దే.అ.క్రి.) : 1.మాటాడు; 2.శబ్దించు.

**గోడచేర్పు** (ద్వ.విణ.) : జడుఁడు.

**గోడా** (వై.వి.) : గుఱ్ఱము.

**గోడాడు** (దే.అ.క్రి.) : (గోడు + ఆడు) దుఃఖించు.

**గోడి** (దే.విణ.) : 1. అణఁగుడు; 2. వంపు.

**గోడిగ** (వై.వి.) : ఆఁడు గుఱ్ఱము.

**గోడిపట్టెలు** (దే.వి.) : బాలక్రీడా విశేషము.

**గోడిపడు** (ద్వ.అ.క్రి.) : (గోడి+పడు) 1. అణఁగు; 2. వంపగు.

**గోడివెట్టు** (దే.స.క్రి.) : (గోడి + పెట్టు) వంచు.

**గోడు** (దే.వి.) : దుఃఖము.

**గోడెము** (దే.వి.) : కొండ దొన నాశ్రయించి యుండెడు బోయపల్లె.

**గోణము** (వై.వి.) : గోవణము యొక్క రూపాంతరము.

**గోణాము** (వై.వి.) : గోణము యొక్క రూపాంతరము.

**గోణి** (ఉభ. దే.వి.) : ఎద్దు. (సం.ఈ.స్త్రీ.) : గోనె.

**గోతము** (దే.వి.) : 1. జనుపనార సంచి; 2. మల్లులు సాధన కొఱకు ఱాళ్లు నించి యుంచు కొనెడు గోనె.

**గోతాము** (దే.వి.) : గోతము యొక్క రూపాంతరము.

**గోతి** (దే.వి.) : ఆఁడుది.

**గోతుంబ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. పిన్న పాపర; 2. పుచ్చ; 3. బుడమ.

**గోత్ర** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.నేల; 2. గోవులగుంపు.

**గోత్రభిదుఁడు** (సం.వి.ద్.పుం.) : ఇంద్రుఁడు.

**గోత్రము** (సం.వి.అ.న.) : 1. వంశము; 2. పేరు; 3. గొడుగు; 4. అడవి; 5. బలిమి; 6. వరిమడి. (పుం.) : కొండ.

**గోత్రుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) గోవులఁ గాచువాడు.

**గోద** (దే.వి.) : ఎద్దు.

**గోదరి** (దే.వి.) : ముచ్చివాఁడు.

**గోదారణము** (సం.వి.అ.న.) : హలము, నాఁగలి.

**గోదారి** (దే.వి.) : వెన్నకాఁచిన మడ్డి.

**గోదావరి** (సం.వి.ఈ.స్త్రీ.) : నదీ విశేషము.

**గోదు, గోందు** (హిం.వి.) : తుమ్మ జిగురు.

**గోదుమ** (వై.వి.) : సస్య విశేషము. (బ.) : ధాన్య విశేషము.

**గోదుమపూసలు** (ద్వ.వి.బ.) : స్త్రీ కంఠ భూషా విశేషము.

**గోధ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఉడుము. (ఆ.స్త్రీ.అ.న.): అల్లె త్రాటి దెబ్బ తాఁకకుండు టకై యుడుము తోలుతోఁ గుట్టి చేతికిఁ దొడిగికొన్న కవచము.

**గోధనము** (సం.వి.అ.న.) : గోకులము.

**గోధాపది** (సం.వి.ఈ.స్త్రీ.) : చెప్పుతట్ట.

**గోధి** (సం.వి.ఇ.పుం.) : నొసలు, అలికము.

**గోధిక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.ఉడుము, 2. నీరుడుము.

**గోధుహుఁడు** (సం.వి.హ్.పుం.) : గొల్లవాఁడు.

**గోధూమము** (సం.వి.అ.పుం.) : 1. గోధుమలు 2. నారదము.

**గోనర్దము** (సం.వి.అ.న.) : కయివడి ముస్తె. (పుం.) : బెగ్గురుపక్షి.

**గోనసము** (సం.వి.అ.పుం.) : కొండ చిలువ. (రూ. గోనాసము)

**గోనియ** (వై.వి.) : గోనె.

**గోను** (దే.వి.) : గోఁగు, తీక్ష్ణవృక్షము.

**గోనె** (వై.వి.) : అడ్డముగా నడుమఁ గుట్టు పోసి ధాన్యమునించి యెద్దుమీఁద వేసెడు జనుపనార పట్టల సంచి. (గోనియ యొక్క రూపాంతరము)

**గోనెసంచి** (ద్వ.వి.) : గోతము.

**గోపతి** (సం.వి.ఇ.పుం.) : 1.ఆఁబోతు; 2. ఇంద్రుఁడు; 3. రాజు; 4. శివుఁడు; 5. సూర్యుఁడు.

**గోపనము** (సం.వి.అ.న.) : 1. దాఁచుట; 2. కాపాడుట.

**గోపము** (సం.వి.అ.పుం.) : బోళము.

**గోపానసి** (సం.వి.ఈ.స్త్రీ.) : చూరుపట్టె, గొప్పులు.

**గోపాయితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కావఁబడినది.

**గోపాలుఁడు** (సం.వి.అ.పుం.) : 1. గొల్లవాఁడు; 2. రాజు.

**గోపి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. గొల్లది; 2. మామెన.

**గోపిక** (సం.వి.ఆ.స్త్రీ.) : గొల్లది, వ్రేత.

**గోపిచందనము** (సం.వి.అ.న.) : ఒక దినుసు సుద్దమన్ను. (రూ. గోపీ చందనము)

**గోపీతము** (సం.వి.అ.పుం.) : ప్రభాతము, వేకువ.

**గోపీథము** (సం.వి.అ.పుం.) : నీటిదొన.

**గోపుఁడు** (సం.వి.అ.పుం.) : 1.గొల్లవాఁడు; 2. రాజు; 3. గోవుల కధిపతి; 4. అనేక గ్రామముల కధిపతి.

**గోపుచ్ఛము** (సం.వి.అ.పుం.) : కోఁతి.

**గోపురము** (సం.వి.అ.న.) : 1. గవను; 2. వాకిలి; 3. కైవడిముస్తె.

**గోప్యుఁడు** (సం.వి.అ.పుం.) : ఊడిగపువాఁడు. (విణ.) : కావఁదగినవాఁడు.

**గోమంతుఁడు** (సం.వి.త్.పు.) : గోవుల కొడయఁడు.

**గోమయచ్ఛత్రము** (సం.వి.అ.న.) : కుక్కగొడుగు.

**గోమయము** (సం.వి.అ.పుం.న.) : పేఁడ.

**గోమాయువు** (సం. వి. ఉ. పుం.) : నక్క జంబుకము.

**గోమారి** (మి.వి.) : (గోవు + మారి) పసులకుఁ బట్టెడి చెక్క పిడుఁజు.

**గోమి** (సం.వి.న్.పు.) : 1. గోవులకొడయఁడు; 2. నక్క. (విణ.) : గోవులు గలవాఁడు.

**గోమించు** (దే.స.క్రి.) : గోముచేయు.

**గోము** (దే.వి.) : శ్రమ మెఱుఁగనితనము, సౌకుమార్యము.

**గోముఖము** (సం.వి.అ.న.) : 1. అలుకుట; 2. కొంకర వంకరగాఁ గట్టిన యిల్లు; 3. వాద్య విశేషము, (పుం.) : 1. మొసలి; 2. సురంగ విశేషము.

**గోమేధికము** (సం.వి.అ.న.) : పసుపు వన్నెగల రత్న విశేషము. (అచ్చు పుస్తకముల యందు గోమేదకమను పాఠము కానఁబడుచున్నది.)

**గోర** (వై.వి.) : గోరువంక పక్షి.

**గోరంక** (వై.వి.) : గోరువంక పక్షి. (ఇది ప్రయోగమునందు మృగ్యమైనను వ్యవహారము నందు రూఢము.)

**గోరంకువు** (సం.వి.ఉ.పుం.) : 1. గోరువంక పక్షి; 2. దిసమొలవాఁడు; 3. బట్టువాడు.

**గోరఁట** (వై.వి.) : కురంటకము.

**గోరగింత** (వై.వి.) : భయంకరత్వము.

**గోరతనము** (దే.వి.) : దౌష్ట్యము.

**గోరప** (దే.వి.) : గట్టిమ్రోఁత.

**గోరపడు** (ద్వ.అ.క్రి.) : (గోరము + పడు) రోఁతపడు.

**గోరము** (దే.వి.): 1. దేహము యొక్క అస్వాస్థ్యము; 2. ఆపద; 3. రోఁత. (విణ.) : రోఁతగలది.

**గోరసము** (సం.వి.అ.పుం.) : కాలశేయము, మజ్జిగ.

**గోరి** (హిం.వి.) : కట్టిన సమాధి.

**గోరించు** (దే.అ.క్రి.) : ఎగయు.

**గోరింపు** (దే.వి.) : ఎగపు.

**గోరు** (వై.వి.) :1.నఖము; 2. తంతి మీటుటకు బంగారు లోనగువానితోఁ జేసి వ్రేలికి వేసికొనెడు ప్రతినఖము; 3. అరఁటి పువ్వులోపలనుండెడి వస్తు విశేషము.(గోరువెచ్చ. మొ.)

**గోరుగల్లు** (ద్వ.వి.) : (మంగలిగోళ్లు తీసెడి) ఇనుపసలాక, నఖోత్పాటని.

**గోరుగాలము** (ద్వ.వి.) : చేఁపలను బట్టుటకు ఉక్కుకమ్మితో వంకరగాచేసిన గాలము, బడిశము.

**గోరుగొండి** (ద్వ.వి.) : గోరుగల్లు. (రూ.గోర్గొండి.)

**గోరుచిక్కుడు** (ద్వ.వి.) : చిన్న దినుసు చిక్కుడు.

**గోరుచీరణము** (ద్వ.వి.) : గోటివలె కొనయందు వంపు గల యులి.

**గోరుచుట్టు** (ద్వ.వి.) : 1. గోటిచుట్టు లేచెడు పుండు; 2. ఒక దినుసు గడ్డ.

**గోరుపడము** (వై.వి.) : కంబళి.

**గోరుపులాడు** (దే.స.క్రి.) : (గోరుపులు + ఆడు) 1. పుట్ట చెండ్లాడు; 2. ఎగుర వేయు. (ఈచోట

ఒక పాఠమిట్లున్నది. మఱియొక చోట గోర్పిళు లాడును అని యున్నది. విచార్యము.) (చూ. లంగగొను, గోర్పిళ్లాడు.)

**గోరువంక** (వై.వి.) : శారిక పక్షి.

**గోరొత్తు** (ద్వ.వి.) : (గోరు + ఒత్తు) నఖక్షతము.

**గోరోచన** (సం.వి.ఆ.స్త్రీ.) : గోరోజనము.

**గోరోజనము** (వై.వి.) : ఆవుల కడుపులో నుండి యెత్తెడి యొక వస్తువు.

**గోర్ధము** (సం.వి.అ.న.) : తలమెదడు, మస్తిష్కము.

**గోర్పడము** (వై.వి.) : గోరుపడము యొక్క రూపాంతరము.

**గోర్పిళ్లాడు** (దే.స.క్రి.) : (గోరు+పిళ్ళు + ఆడు) 1. పుట్టచెండ్లాడు; 2. ఎగరవేయు. (రూ. గోర్పిళులాడు.)

**గోర్వంక** (వై.వి.) : గోరువంక యొక్క రూపాంతరము.

**గోఅజము** (వై.వి.) : గోరోజనము.

**గోల** (ఉభ. దే.విణ.) : ముగ్ధుడు, ముగ్ధ. (సం.వి. ఆ.స్త్రీ.) : 1. కాఁగు; 2. గోదా వరి; 3. మణి సిల. నేపాళ దేశమునఁ బుట్టిన మణి సిల. (అని కొందఱు.)

**గోలకము** (సం.వి.అ.పుం.) : 1.కాఁగు; 2.గోలీ.

**గోలత్తిక** (సం.వి.ఆ.స్త్రీ.) : ఆఁడు మందపిచ్చుక.

**గోలాంగూలము** (సం.వి.అ.పుం.) : 1. కొండ ముచ్చు; 2. కోఁతి.

**గోలించు** (దే.స.క్రి.) : చమురు పోసి వేఁచు.

**గోలిహము** (సం.వి.హ.పుం.) : మొక్కపుఁజెట్టు.

**గోలీ** (వై.వి.) : బాలురాడుకొను చిన్నఱాతియుండ.

**గోలీఢము** (సం.వి.అ.పుం.) : మొక్కపుఁజెట్టు.

**గోలు** (దే.వి.) : పేముబొద్దునకు ప్రక్క నేర్పఱచెడు సన్నని పేము బొద్దు.

**గోలుగోలు** (దే.వి.) : ఏడ్చుట యందగు ధ్వన్యనుకరణము.

**గోలురించు** (దే.అ.క్రి.) : (పులి) కూయు.

**గోలెము** (వై.వి.) : కాఁగు.

**గోలోమి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. తెల్ల గఱిక; 2. మరులుజడ; 3. వస; 4.నేల గొలిమిడి.

**గోల్గోలు** (దే.వి.) : గోలుగోలు యొక్క రూపాంతరము.

**గోవ** (దే.వి.) : యౌవనము. (చూ. గోవాళ్లు) (విణ.) : మనోజ్ఞము (గోవపని. మొ.)

**గోవందిని** (సం.వి.ఈ.స్త్రీ.) : ప్రేంకణము.

**గోవణము** (వై.వి.) : కౌపీనము.

**గోవమొలత్రాడు** (దే.వి.) : మగవాని మొలనూలు, శృంఖలము.

**గోవావు** (దే.వి.) : (గోవ + ఆవు) సాధువుకాని యావు, కరట.

**గోవాళ్లు** (దే.వి.బ.) : (గోవ + వారలు) యౌవనము గలవాఁడు.

**గోవిందుడు** (సం.వి.అ.పుం.) : 1. కృష్ణుఁడు; 2. గోవుల కొడయఁడు; 3. బృహస్పతి.

**గోవిట్టు** (సం.వి.ష్. స్త్రీ.) : గోమయము, పేఁడ.

**గోవు** (సం.వి.ఓ.స్త్రీ.) : 1. ఆవు; (దీని ధ్వని హంభ. శిరోదేశము నైచికము) 2. కన్ను; 3. దిక్కు; 4.బాణము; 5. భూమి; 6. వాక్కు; 7. (బ.) : నీళ్లు(పుం.) : 1. ఎద్దు; 2.కిరణము; 3. స్వర్గము; 4. చంద్రుడు; 5. వజ్రాయుధము.

**గోవృషము** (సం.వి.అ.పుం.) : ఆఁబోతు.

**గోశీర్షము** (సం.వి.అ.న.) : పసుపు వన్నె గల చందనము, హరి చందనము.

**గోశ్రేణి** (సం.వి.ఈ.స్త్రీ.) : తంగేడు.

**గోషా, ఘోషా** (హిం.వి.) : అంతఃపురము, రాణివాసము.

**గోష్ఠము** (సం.వి.అ.న.) : గోవులమంద యుండు చోటు.

**గోష్ఠశ్వుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) తానుండెడు చోటనుండుకొని పరులను ద్వేషించువాడు.

**గోష్ఠి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. సభ; 2. సల్లాపము.

**గోష్పదము** (సం.వి.అ.న.) : 1. గోవు యొక్క అడుగు కొలఁది; 2. గోవు గొరిసె యిడిన గుంట; 3. గోవులు తిరిగెడి చోటు.

**గోసంఖ్యుఁడు** (సం.వి.అ.పుం.) : గొల్లవాఁడు.

**గోసఁగి** (వై.వి.) : మాలవాఁడు.

**గోసడుచే** (దే.స.క్రి.): (గోసు+అడుచు) నిందించు.

**గోసన** (వై.వి.) : చాటించుట.

**గోసము** (సం.వి.అ.పుం.) : 1. బోళము; 2. వేకువ.

**గోసర్గము** (సం.వి.) : ప్రభాతము, వేకువ.

**గోసు** (వై.వి.) : 1. అపదూఱు; 2. దూఱు; 3. దోషము.

**గోస్తనము** (సం.వి.అ.పుం.) : నలువది పూసల సరము.

**గోస్తని** (సం.వి.ఈ.స్త్రీ.) : ద్రాక్ష.

**గోస్వామి** (సం.వి.న్.పుం.) : 1. గోవుల కొడయఁడు; 2. (నాట్య పరిభాష యందు) ఇతర రాజు యొక్క కొడుకు.

**గోహరి** (దే.వి.) : పరాక్రమము.

**గోళకుఁడు** (సం.వి.అ.పుం.) : విధవకు ఱంకు మగనియందు పుట్టిన కొడుకు.

**గోళము** (సం.వి.అ.న.) : మండలము.

**గోళి** (వై.వి.) : కురాకుదినుసు.

**గోళ్లకుతికంటు** (ద్వ.వి.) : స్త్రీ కంఠ భూషా విశేషము.

**గోళ్లగొండి** (ద్వ.వి.) : తృణ విశేషము. (బ.) : తృణ ధాన్య విశేషము.

## గౌ

**గౌండ్లవాఁడు** (వై.వి.) : గవుండ్లవాడు యొక్క రూపాంతరము.

**గౌఁడు** (వై.వి.) : 1. సారాయమ్మువాఁడు; 2. కాఁపువారి పట్టపుపేరు. (గవుఁడు యొక్క రూపాంతరము)

**గౌడము** (సం.వి.అ.పుం.) : ఒకానొక దేశము.

**గౌడసరము** (ద్వ.వి.) : భూషావిశేషము, చెంప సరము. (గవుడసరము యొక్క రూపాంతరము.)

**గౌడి** (సం.వి.ఈ.స్త్రీ.) : పద్యముల యొక్క యొక రీతి. (చూ. రీతి)

**గౌణము** (సం.విణ.) : (అ.ఈ.అ.) అముఖ్యము.

**గౌతమి** (సం.వి.ఈ.స్త్రీ.) : నదీ విశేషము.

**గౌతముఁడు** (సం.వి.అ.పుం.) : 1.ఒకానొక ముని; 2. జినుఁడు.

**గౌద** (దే.వి.) : చెంప. (గవుద యొక్క రూపాంతరము)

**గౌధారము** (సం.వి.అ.పుం.) : ఉడుము యొక్క పిల్ల.

**గౌధేయము** (సం.వి.అ.పుం.) : ఉడుము యొక్క పిల్ల.

**గౌధేరము** (సం.వి.అ.పుం.) : ఉడుము యొక్క పిల్ల.

**గౌర** (దే.వి.) : బేహారి, వర్తకుఁడు. (గవుర యొక్క రూపాంతరము.)

**గౌరము** (సం.వి.అ.న.) : అకరువు. (పుం.) : తెల్లావలు. (విణ.) : 1.ఎఱ్ఱ నిది; 2. తెల్లనిది; 3. పసుపు పచ్చనిది; 4. స్వచ్ఛమయినది.

**గౌరవము** (సం.వి.అ.న.) : గొప్పతనము.

**గౌరవించు** (సం.స.క్రి.) : గొప్ప పఱచు.

**గౌరి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. పార్వతి; 2.సమర్తాడని కన్యక.

**గౌరు** (దే.వి.) : 1. ఏనుఁగు; 2. పెద్దకాళె. (గవురు యొక్క రూపాంతరము.)

**గౌరుఁడు** (సం.వి.అ.పుం.) : చంద్రుఁడు, చందమామ.

**గౌలు** (దే.వి.) : 1. దుర్గంధము; 2. గంధము. (గవులు యొక్క రూపాంతరము.)

**గౌలేయకము** (సం.వి.అ.పుం.) : కారుపోఁక.

**గౌష్ఠీనము** (సం.వి.అ.న.) : అంతకు ముందు గోవులమందయున్న చోటు.

**గౌసెన** (వై.వి.) : వీణె మొదలగువాని మీఁది యొఱ. (గవుసెన యొక్క రూపాంతరము.)

**గౌళి** (దే.వి.) : శకునములు చెప్పెడు బల్లి. (గవుళి యొక్క రూపాంతరము.)



**గ్రంథకుటి** (సం.వి.ఈ.స్త్రీ.) : వ్రాసెడి గది.

**గ్రంథనము** (సం.వి.అ.న.) : రచన, కూర్పు.

**గ్రంథము** (సం.వి.అ.పుం.) : 1. కావ్యము; 2. ముప్పదిరెండక్షరముల శ్లోకము; 3. ధనము.

**గ్రంథి** (సం.వి.ఇ.పుం.) : 1. కంతి; 2. గనుపు; 3. ముడి; 4. గండివనము.

**గ్రంథిక** (సం.వి.ఆ.స్త్రీ.) : కట్ల తీఁగ. (అ.న.ము.) : 1. పిప్పలి వేరు; 2. గండి వనము. (పుం.) : 1. గుగ్గిలపుఁ జెట్టు 2. వెఱుతురు.

**గ్రంథికుఁడు** (సం.వి.అ.పుం.) : 1. జోస్యుఁడు 2. యుధిష్ఠిరుని కడగొట్టు తమ్ముఁడు.

**గ్రంథితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కూర్పఁబడినది, గ్రథితము.

**గ్రంథిపర్ణము** (సం.వి.అ.న.) : 1. గండివనము; 2. పచ్చాకు; 3. మాచిపత్రి.

**గ్రంథిలము** (సం.వి.అ.పుం.) : 1. ములు వెలఁగ; 2. వెఱుతురు; (విణ.) : గనుపులు గలది.

**గ్రందె** (వై.వి.) : ద్వారబంధము లోనగు వాని నిలువులయందు బిగఁగొట్టిన చీలలకు తగిలించెడు తలుపుల యందలి యినుపపట్టె.

**గ్రక్కతిల్లు** (దే.అ.క్రి.) : బెదరు.

**గ్రక్కదలు** (దే.అ.క్రి.) : (కదలు + కదలు) మిక్కిలి కదలు.

**గ్రక్కన** (దే.ద్ర.క్రి. విణ.) : శీఘ్రముగ.

**గ్రక్కున** (దే.ద్ర.క్రి.విణ.) : శీఘ్రముగ.

**గ్రచ్చే** (దే.వి.) : కాలపత్రి. (వాడుకయందు గచ్చ)

**గ్రచ్చేకాయలు** (దే.వి.బ.) : బాలక్రీడా విశేషము.

**గ్రచ్చే** (వై.విణ.) : వర్ణలోపము గాని పద లోపము గాని కలిగినది. (మాట)

**గ్రథనము** (సం.వి.అ.న.) : 1.కూర్పు; 2.గ్రుచ్చుట.

**గ్రథితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. కూర్పఁబడినది; 2. గ్రువ్వఁబడినది.

**గ్రద్ద** (వై.వి.) : గద్ద, గృధ్రము.

**గ్రద్దగోరు** (వై.వి.) : చోరసాధన విశేషము. (చూ. గద్దగోరు)

**గ్రద్దన** (దే.ద్ర.క్రి.విణ.) : శీఘ్రముగ.

**గ్రమ్మన** (దే.ద్ర.క్రి.విణ.) : శీఘ్రముగ.

**గ్రసించు** (సం.స.క్రి.) : 1. కవ్వు; 2. తిను; 3. మ్రింగు.

**గ్రసిష్ణువు** (సం.విణ.ఉ.) : 1. తినువాఁడు; 2. మ్రింగువాఁడు.

**గ్రస్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. తినఁబడినది; 2. మ్రింగఁబడినది; 3. వర్ణలోపము గాని పదలోపముగాని కలిగినది (మాట)

**గ్రహణము** (సం.వి.అ.న.) : 1. రాహువు సూర్య చంద్రులను బట్టుట; 2. గ్రహించుట; 3. ఆదరించుట; 4. చెఱనిడిన ప్రాణి; 5. చేయి; 6. బుద్ధి.

**గ్రహణి** (సం.వి.ఈ.స్త్రీ.) : అతిసార రోగము; ప్రవాహిక.

**గ్రహపతి** (సం.వి.ఇ.పుం.) : సూర్యుడు.

**గ్రహము** (సం.వి.ఈ.స్త్రీ.) : 1.సూర్యాది; 2.గ్రహించుట; 3.అనుగ్రహము; 4. చెఱ; 5. రాహువు సూర్య చంద్రులను బట్టుట; 6. పూతనాది; 7. ఊర్ధ్వాకారమైన యజ్ఞ పాత్ర విశేషము; 8. యుద్ధ ప్రయత్నము; 9. రాహువు.

**గ్రహయాళువు** (సం.విణ.ఉ.) : గ్రహించువాఁడు.

**గ్రహరాజో** (సం.వి.అ.పుం.) : 1. సూర్యుఁడు; 2. చంద్రుఁడు.

**గ్రహించే** (సం.స.క్రి.) : 1. కైకొను; 2. తీసికొను; 3. తెలిసికొను. (గ్రహి యించు అనియు.)

**గ్రహీకుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) గ్రహించువాఁడు.

**గ్రహీత** (సం.విణ.) : (ఋ.ఈ.ఋ) గ్రహించువాఁడు.

**గ్రహీనుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) గాలి సోఁకినవాడు.



**గ్రాంథికము** (సం.విణ.) :(అ.ఈ.అ.) గ్రంథముది.

**గ్రాఁజ** (దే.వి.) : ఒకానొకచెట్టు.

**గ్రాద** (దే.వి.) : కదుము.

**గ్రామటిక** (సం.వి.ఆ.స్త్రీ.) : పల్లె.

**గ్రామణి** (సం.వి.ఈ.పుం.) : మంగలి. (త.విణ.) : 1. గ్రామాధిపతి; 2. ముఖ్యుఁడు.

**గ్రామత** (సం.వి.ఆ.స్త్రీ.) : గ్రామముల సమూహము.

**గ్రామతక్షుఁడు** (సం.వి.అ.పుం.) : గ్రామమున కధీనుఁడైన వడ్లంగి.

**గ్రామము** (సం.వి.అ.పుం.) : 1.ఊరు; 2. షడ్జాది స్వరము; 3. (శబ్దాది పూర్వకమైనపుడు) సమూహము. (ఉదా. శబ్ద గ్రామము, గుణ గ్రామము.)

**గ్రామసింహము** (సం.వి.అ.పుం.) : శునకము, కుక్క.

**గ్రామీణ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. నీలిచెట్టు; 2. వేశ్య. (విణ.) : ఊరిది.

**గ్రామ్యధర్మము** (సం.వి.అ.పుం.) : సురతము.

**గ్రామ్యము** (సం.వి.అ.న.) : 1.అర్థ దోషములలో నొకటి; 2. శబ్ద దోషములలో నొకటి; 3. రత బంధ విశేషము. (విణ.) : 1. అసభ్యమైనది; (మాట) 2. పామరము.

**గ్రావము** (సం.వి.న్.పుం.) : 1.కొండ; 2.ఱాయి.

**గ్రాసము** (సం.వి.అ.పుం.) : కబళము.

**గ్రాహకము** (సం.వి.అ.పుం.) : డేగ. (విణ.) : గ్రహించునది.

**గ్రాహము** (సం.వి.అ.పుం.) : 1. గ్రహించుట; 2. చెఱ; 3. ఒకానొక నీరుపాము, మొసలి (అని కొందఱు.)

**గ్రాహి** (సం.వి.న్.పుం.) : వెలఁగ.

**గ్రాహ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) గ్రహింపఁ దగినది.



**గ్రీవ** (సం.వి.అ.స్త్రీ.) : 1. మెడ; 2. మెడ నరము.

**గ్రీష్మము** (సం.వి.అ.పుం.) : 1. వేఁడిమి; 2. వేసంగి.



**గ్రుక్క** (దే.వి.) : 1. మ్రింగుట, గ్రసనము; 2. ఊపిరి. (వాఁడు గ్రుక్కపట్టలేఁడు.)

**గ్రుక్కగొను** (దే.స.క్రి.) : మ్రింగు.

**గ్రుక్కలుమ్రింగు** (దే.అ.క్రి.) :1.అపేక్ష పడు; 2. సంకోచించు. (ఏల గ్రుక్కలు మ్రింగెదవు చెప్పుము.)

**గ్రుక్కిలి** (దే.వి.) : గ్రుక్క.

**గ్రుక్కిళ్లుమ్రింగు** (దే.అ.క్రి.) : 1. అపేక్షపడు; 2. సంకోచించు. (చూ. గ్రుక్కలు మ్రింగు)

**గ్రుక్కుమిక్కను** (దే.అ.క్రి.) : (గ్రుక్కుమిక్కు + అను) మాటాడనోరెత్తు.

**గ్రక్కుమిక్కుమను** (దే.అ.క్రి.) : (గ్రుక్కు మిక్కు + అను) మాటాడనోరెత్తు.

**గ్రుచ్చు** (దే.అ.కి.) : నాటు. 1. నాటించు; 2. తూర్చు. (సూదిని దారము గ్రువ్వుము.)

**గ్రుడ్డి** (దే.విణ.) : అంధకుఁడు.

**గ్రుడ్డింగిలాయి** (దే.వి.) : (గ్రుడ్డి + ఇంగిలాయి) ఇంగిలాయి భేదము.

**గ్రుడ్డికామంచి** (దే.వి.) : గొడుగు గడ్డి, అతిచ్ఛత్రము.

**గ్రుడ్డికొక్కరాయి** (ద్వ.వి.) : కోయష్టికము.

**గ్రుడ్డివాటు** (దే.విణ.) : (గ్రుడ్డి + పాటు) దైవికము. (వానికీపని గ్రుడ్డివాటుగా కలిగినది.)

**గ్రుడ్డు** (దే.వి.) : 1. గ్రుడ్డితనము; 2. కనుగ్రుడ్డు; 3. పక్షిలోనగువాని అండము.

**గ్రుడ్డుకానుపు** (దే.వి.) : 1.పక్షి; 2. సర్పము. (దీనికి సరియైన సంస్కృత శబ్దము అండజము.)

**గ్రుడ్లగూబ** (ద్వ.వి.) : ఘూకము.

**గ్రుద్దు** (స.క్రి.) : పిడికిటితో పొడుచు. (వి.) : పిడికిటి పోటు.

**గ్రుద్దులాట** (దే.వి.) : గ్రుద్దులాడుట.

**గ్రుద్దులాడు** (దే.అ.క్రి.) : (గ్రుద్దులు + ఆడు) ఒకరినొకరు గ్రుద్దుచు పోట్లాడు.



**గ్రైవము** (సం.వి.అ.న.) : మెడనుగట్టెడు త్రాడు.

**గ్రైవేయకము** (సం.వి.అ.న.) : మెడను బెట్టెడు సొమ్ము.

**గ్రైవేయము** (సం.వి.అ.న.) : మెడనుగట్టెడు త్రాడు.



**గ్రొచ్చే** (దే.ప్రే.) : గుద్దలి లోనగువానితో పల్లము చేయు. (వాఁత యందిది పరుషాది గాను గానఁబడుచున్నది.)

**గ్రొయ్యు** (దే.అ.క్రి.) : పల్లముపడు.



**గ్లహము** (సం.వి.అ.పుం.) : జూదము నందలి పందెము.



**గ్లాని** (సం.వి.ఇ.స్త్రీ.) : శ్రమముచేతఁ గలిగిన దౌర్బల్యము.

**గ్లాసుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) తెవులుగొంటు.

**గ్లాసు** (ఆం.వి.) : అద్దము, అద్దపుపాత్ర.

**గ్లాస్నువు** (సం.విణ.ఉ.) : తెవులుగొంటు.



**గ్లౌ** (సం.వి.ఔ.పుం.) : చంద్రుఁడు, చందమామ.



**ఘ** : ఒక యక్షరము.

**ఘంట** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. కాల పరిమాణ విశేషము; 2. రాగ విశేషము; 3. వాద్య విశేషము; 4. మొక్కపుఁజెట్టు.

**ఘంటాపథము** (సం.వి.అ.పుం.) : పది బారలు వెడల్పు గల రాజమార్గము, బాట.

**ఘంటారవ** (సం.వి.ఆ.స్త్రీ.) : గిలగిచ్చ.

**ఘట** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. సమూహము; 2. ఏనుఁగుల సమూహము; 3. ఘటనము. (అ.న.ము.) : ఎళనీరు కాయ. (పుం.) : 1. కుండ; 2. ఏనుఁగు కుంభస్థలము; 3. శిఖరము; 4. పాదు నుయ్యి; 5. ఊపిరి లోనికిఁ దీసి నిలుపుట.

**ఘటకుఁడు** (సం.విణ.) : (అ.ఈ.అ.) ఘటిల్లఁ జేయువాఁడు.

**ఘటదాసి** (సం.వి.ఈ.స్త్రీ.) : విటీవిటులను తార్చెడి యింతి.

**ఘటన** (సం.వి.ఆ.స్త్రీ.) : కూర్పు.

**ఘటయంత్రము** (సం.వి.అ.న.) : నూతి గిరక.

**ఘటశాసి** (సం.వి.న్.పుం.) : తార్కికుఁడు.

**ఘటిక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.ఇరువది నాలుగు నిమిషముల కాలము; 2. గడె మ్రాను; 3. బలపము.

**ఘటిల్లు** (సం.అ.క్రి.) : కలుగు.

**ఘటీకారము** (సం.వి.అ.పుం.) : గడియారము.

**ఘటీకారుఁడు** (సం.వి.అ.పుం.) : కుమ్మరవాఁడు.

**ఘటీయంత్రము** (సం.వి.అ.న.) : 1. ఏతము; 2. నీళ్లుచేఁదెడు రాట్నము.

**ఘట్టన** (సం.వి.ఆ.స్త్రీ.) : గట్టించుట.

**ఘట్టము** (సం.వి.అ.పుం.) : 1. తీరము; 2. సుంకము మొదలయినవి తీయు చోటు; 3. వన గిరి ప్రాయదేశము.

**ఘట్టితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) గట్టింపఁ బడినది.

**ఘనము** (సం.వి.అ.న.) : 1. నృత్యాది మధ్య మానము; 2. కంచు తాళము లోనగు వాద్యము; 3. నడిమిపెరుగు (ఈ యర్థము నామ లింగాను శాసన వ్యాఖ్యానము నందు మాత్రము కనఁబడు చున్నది గాని యితర నిఘంటువుల యందుఁ గనఁ బడదు.) (పుం.) 1. తుంగముస్తె; 2.దిటవు; 3.మబ్బు; 4. విరివి; 5. సమ్మెట. (విణ.) : 1. దట్టమైనది; 2. దిటవు గలది.

**ఘనరసము** (సం.వి.అ.పుం.) : 1. నీళ్లు; 2. కర్పూరము; 3.గులిగ; 4. చెట్టు బంక; 5. మజ్జిగ; 6. చాఁగ. (విణ.) : దట్టమయినది.

**ఘనశ్రోణి** (సం.వి.ఈ.స్త్రీ.) : భూమి, నేల.

**ఘనసారతరువు** (సం.వి.ఉ.పుం.) : కర్పూరపరఁటి.

**ఘనసారము** (సం.వి.అ.పుం.) : కర్పూరము.

**ఘనాఘనము** (సం.వి.అ.పుం.) : 1. కురియునట్టి మేఘము; తొలుమొగులు; 2. హింసించునట్టి మదపుటేనుఁగు.

**ఘనాఘనుఁడు** (సం.వి.అ.పుం.) : ఇంద్రుఁడు.

**ఘనీభవించు** (సం.అ.క్రి.) : ముద్దకట్టు.

**ఘనుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) గొప్పవాఁడు.

**ఘనోపలము** (సం.వి.అ.పుం.) : వడగల్లు.

**ఘరట్టము** (సం.వి.అ.పుం.) : తిరుగలి.

**ఘర్ఘరము** (సం.వి.అ.పుం.) : 1. గుడ్లగూబ; 2. కొండదారి; 3. గర్భము మ్రోఁత; 4. వాకిలి. ఒక విధమైన తలుపు (అని కొందఱు)

**ఘర్ఘరి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1.చిఱుగంట; 2.వీణా విశేషము; 3. స్వరభేదము.

**ఘర్మము** (సం.వి.అ.పుం.) : 1.ఎండ; 2.చెమట; 3.ఏనుఁగు హృదయము నందలి మదము; 4. వేఁడిమి; 5. వేసంగికాలము.

**ఘర్షణము** (సం.వి.అ.న.) : ఒరయిక, రాయిడి.

**ఘర్షణాలము** (సం.వి.అ.పుం.) : నూఱెడుగుండు, పాత్రము.

**ఘర్షించు** (సం.స.క్రి.) : రాయిడి చేయు.

**ఘస్మరుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) తిండిపోతు.

**ఘస్రము** (సం.వి.అ.పుం.) : దినము. (విణ.) : నొప్పించునది.

## ఘా

**ఘాంటికుఁడు** (సం.వి.అ.పుం.) : వేకువను రాజుల నిద్రమేల్కొలిపెడువాఁడు, బోధకరుఁడు.

**ఘాట** (సం.వి.ఆ.స్త్రీ.) : పెడతల, పెడతల యందలి ముచ్చిలిగుంట. (అని కొందఱు)

**ఘాటు** (ఆం.వి.) : సంరక్షకభటుల సముదాయము.

**ఘాతము** (సం.వి.అ.పుం.) : 1. దెబ్బ; 2. బాణము.

**ఘాతించు** (సం.స.క్రి.) : చంపు.

**ఘాతిని** సం.విణ.) : (ఈ) చంపునట్టిది.

**ఘాతుకుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. చంపు వాఁడు; 2. నొప్పించువాఁడు.

**ఘారిక** (సం.వి.ఆ.స్త్రీ.) : భక్ష్యవిశేషము, గారె.

**ఘాసము** (సం.వి.అ.పుం.) : లేఁతపచ్చిక.

## ఘీ

**ఘీంకారము** (సం.వి.అ.పుం.) : ఏనుఁగు గీఁక.

**ఘీంకృతి** (సం.వి.ఇ.స్త్రీ.) : ఏనుఁగుగీఁక.

## ఘు

**ఘుటము** (సం.వి.అ.పుం.) : ఘుటిక, చీలమండ.

**ఘుటిక** (సం.వి.ఆ.స్త్రీ.) : కాలిగుత్తి, చీలమండ.

**ఘుణము** (సం.వి.అ.పుం.) : మ్రాను తొలుచు పురుగు.

**ఘుణాక్షర న్యాయము** (సం.వి.అ.పుం.) : మ్రాని యందు నుసిపురుగు తొలుపఁగా నేర్పడిన యక్షరము యొక్క న్యాయము.

**ఘుర్ఘరము** (సం.వి.అ.పుం.) : పంది కూఁత.

**ఘుర్ఘరించు** (సం.అ.క్రి.) : (పంది) కూయు.

**ఘుర్మురము** (సం.వి.అ.పుం.) : కుమ్మర పురుగు.

**ఘుష్టము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చాటింపఁ బడ్డది.

**ఘుసృణము** (సం.వి.అ.న.) : కుంకుమ పువ్వు.

## ఘూ

**ఘూకము** (సం.వి.అ.పుం.) : గ్రుడ్లగూబ.

**ఘూర్జరము** (సం.వి.అ.పుం.) : ఒకానొక దేశము.

**ఘూర్ణనము** (సం.వి.అ.న.) : తిరుగుడు.

**ఘూర్ణితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. తిరుగుడు పడినది; 2. కూరుకు పాటు పడినది.

**ఘూర్ణిల్లు** (సం.అ.క్రి.) : తిరుగుడుపడు. (ఆధునిక కవులు కొందఱు దీని మ్రోఁగుట యను నర్థము నందు బ్రయోగించి యున్నారు.)

## ఘృ

**ఘృణ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. కనికరము; 2. రోఁత.

**ఘృణి** (సం.వి.ఇ.పుం.) : కిరణము, వెలుఁగు.

**ఘృతకోశాతకి** (సం.వి.ఈ.స్త్రీ.) : నేతిబీఱ.

**ఘృతము** (సం.వి.అ.న.) : 1. నెయ్యి; 2. నీరు. (విణ.) : వెలిఁగినది.

**ఘృతేలిక** (సం.వి.ఆ.స్త్రీ.) : ఎఱ్ఱచీమ.

**ఘృతోదము** (సం.వి.అ.పుం.) : నేతి సముద్రము.

**ఘృష్టి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1.పాఁచి తీఁగ; 2. పోటి; 3. రాయిడి. (పుం.) : 1. కిరణము; 2. పంది.

## ఘో

**ఘోంట** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. పోఁకచెట్టు; 2. రేఁగుచెట్టు.

**ఘోటకము** (సం.వి.అ.పుం.) : తురగము, గుఱ్ఱము.

**ఘోటజటి** (సం.వి.న్.పుం.) : గొట్టెచెట్టు.

**ఘోటిక** (సం.వి.ఆ.స్త్రీ.) : ఆఁడుగుఱ్ఱము, గోడిగ.

**ఘోట్టాణము** (సం.వి.అ.పుం.) : 1. గుఱ్ఱము; 2. ఒకానొక దేశము.

**ఘోణ** (సం.వి.ఆ.స్త్రీ.) : నాసిక, ముక్కు.

**ఘోణి** (సం.వి.ఈ.స్త్రీ.) : ఏనికదోమ. (న్.పుం.) : పంది.

**ఘోరదర్శనము** (సం.వి.అ.పుం.) : వ్యాఘ్రము, పులి.

**ఘోరము** (సం.వి.అ.పుం.) : నక్క. (విణ.) : భయంకరము.

**ఘోరుఁడు** (సం.వి.అ.పుం.) : శివుఁడు. (విణ.): భయంకరుఁడు.

**ఘోలి** (సం.వి.ఈ.స్త్రీ.) : ఒక దినుసు కూరాకు, గోళి.

**ఘోష** (సం.వి.ఆ.స్త్రీ.) : సదాప. (అ.పుం.ము.): 1. గొల్లపల్లె; 2. ఆవులమంద; 3. ఉఱుము; 4. కంచు; 5. చేఁతిబీఱ.

**ఘోషకము** (సం.వి.అ.పుం.) : చేఁతిబీఱ.

**ఘోషణ** (సం.వి.ఆ.స్త్రీ.) : చాటించుట.

**ఘోషవతి** (సం.వి.ఈ.స్త్రీ.) : వీణె.

**ఘోషించు** (సం.అ.క్రి.) : మ్రోయు.

**ఘోషుఁడు** (సం.వి.అ.పుం.) : గొల్లవాఁడు.

## ఘ్రా

**ఘ్రాణతర్పణము** (సం.విణ.) : (అ.ఆ. అ.) మంచివాసన గలది.

**ఘ్రాణము** (సం.వి.అ.న.) : ముక్కు. (విణ.) : మూర్కొనఁబడినది.

**ఘ్రాణించు** (సం.స.క్రి.) : ఆఘ్రాణించు, మూర్కొను.

**ఘ్రాతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మూర్కొనఁబడినది.

## చ

**చ** : ఒక యక్షరము.

**చంకరము** (సం.వి.అ.పుం.) : 1.తేరు; 2.చెట్టు.

**చంక్రమణము** (సం.వి.అ.న.) : దాఁటుట.

**చంగము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. నేర్పరి; 2. చక్కనిది.

**చంచ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. చాఁప; 2. కసవుతోఁ జేసిన బొమ్మ.

**చంచరీకము** (సం.వి.అ.పుం.) : భృంగము, తుమ్మెద.

**చంచల** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. మెఱపు; 2.లక్ష్మి (అ.పుం. ము.) : 1.గాలి; 2.మంద పిచ్చుక. (విణ.) : చలించునది.

**చంచలించే** (సం.అ.క్రి.) : చలించు.

**చంచలుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) కాముకుఁడు.

**చంచుఁడు** (సం.వి.అ.పుం.) : చెంచువాడు.

**చంచువు** (సం.వి.ఉ.స్త్రీ.) : పక్షిముక్కు. (పుం.): ఆముదపు చెట్టు.

**చండ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. నల్ల కచోరము; 2. బలురక్కెస. (అ.పుం. ము.) : చింతచెట్టు.)

**చండకము** (సం.వి.అ.పుం.) : వ్యాఘ్రము, పులి.

**చండాంశువు** (సం.వి.ఉ.పుం.) : సూర్యుఁడు, వేఁడి వెలుఁగు.

**చండాతకము** (సం.వి.అ.పుం) : వేశ్యల చల్లడము.

**చండాతము** (సం.వి.అ.పుం.) : గన్నేరు.

**చండాలుఁడు** (సం.వి.అ.పుం.) : మాలవాఁడు (రూ. చాండాలుఁడు)

**చండి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. పార్వతి; 2. కోపము గల ఆఁడుది; 3. మిక్కిలి ప్రేమ గల ఆఁడుది; 4. చంపునట్టి ఆఁడుది.

**చండించే** (సం.అ.క్రి.) : మిక్కిలి కోపించు.

**చండిక** (సం.వి.ఆ.స్త్రీ.) : పార్వతి, గట్రాచూలి.

**చండిమ** (సం.వి.న్.పుం.) : వాఁడిమి.

**చండిలము** (సం.వి.అ.పుం.) : చక్రవర్తమను కూరాకు.

**చండిలుఁడు** (సం.వి.అ.పుం.) : 1. మంగలి; 2. శివుఁడు.

**చండుఁడు** (సం.వి.అ.పుం.) : 1. ఒకానొక రాక్షసుఁడు; 2. యమ కింకరుఁడు. (విణ.) : 1.మిక్కిలి కోపము గలవాఁడు; 2. వాఁడిమి గలవాఁడు.

**చందన** (సం.వి.ఆ.స్త్రీ.) : మామెన. (అ.న.ము.): కుంకుమ పువ్వు. (పుం,న.) : గందము.

**చందిరుఁడు** (సం.వి.అ.పుం.) : చంద్రుఁడు.

**చంద్రకము** (సం.వి.అ.పుం.) : నెమలిపురికన్ను.

**చంద్రకాంతము** (సం.వి.అ.న.) : కపటము. (పుం.) : చలువఱాయి.

**చంద్రకి** (సం.వి.న్.పుం.) : 1.నెమలి; 2.కవుఁజు.

**చంద్రచ్ఛందము** (సం.వి.అ.పుం.) : వేయి పేటలు గల హారము.

**చంద్రజ్యోతి** (సం.వి.స్.పుం.) : బాణపు సంచువగ, పగలువత్తి.

**చంద్రబాల** (సం.వి.ఆ.స్త్రీ.) : పెద్దయేలకి.

**చంద్రబీజము** (సం.వి.అ.న.) : రజతము, వెండి.

**చంద్రభాగ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఒకానొక యేఱు.

**చంద్రము** (సం.వి.అ.పుం.) : 1. కర్పూ రము; 2. నీళ్లు; 3. బంగారు; 4. కం పిల్లము.

**చంద్రముఁడు** (సం.వి.స్.పుం.) : చంద్రుఁడు.

**చంద్రశాల** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.పైమేడ; 2.వెన్నెల.

**చంద్రశేఖరుఁడు** (సం.వి.అ.పుం. ) : శివుఁడు, నెలతాల్పు.

**చంద్రసంజ్ఞము** (సం.వి.అ.పుం.) : కర్పూరము.

**చంద్రహాసము** (సం.వి.అ.పుం.) : 1. కత్తి; 2. రావణుని కత్తి.

**చంద్రాతపము** (సం.వి.అ.పుం.) : చంద్రిక, వెన్నెల.

**చంద్రాపీడుఁడు** (సం.వి.అ.పుం.) : చంద్రశేఖరుఁడు.

**చంద్రిక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. వెన్నెల; 2. కుసుమ పువ్వు.

**చంద్రుఁడు** (సం.వి.అ.పుం.) : చందమామ, నెల.

**చంద్రోదయము** (సం.వి.అ.పుం.) : 1.ఉల్లెడ; 2. ఔషధ విశేషము.

**చంపకము** (సం.వి.అ.పుం.) : సంపెఁగ. (దీనికి దోహదక్రియ ముఖరాగము. కర్ణికారమునకు సల్లాపమును, కురవక మునకు ఆలింగనమును దోహద క్రియలని యెఱుంగునది. తక్కినవి ఆయాయి శబ్దముకడ వ్రాయఁబడి యున్నవి.)

**చకితము** (సం.వి.అ.న.) : 1. భయము; 2. నాయికకు దేనిచేతనైనను ప్రియుని యెదుట కలిగెడు భయసంభ్రమము.

**చకితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) భయపడిన వాఁడు.

**చకోరకము** (సం.వి.అ.పుం.) : వెన్నెల పులుఁగు. (రూ. చకోరము)

**చక్రకారకము** (సం.వి.అ.పుం.) : పులిగోరు.

**చక్రదోల** (సం.వి.ఆ.స్త్రీ.) : అంకుల రాట్నము.

**చక్రధరము** (సం.వి.అ.పుం.) : సర్పము, పాము.

**చక్రధరుఁడు** (సం.వి.అ.పుం.) : విష్ణువు. (విణ.): గ్రామపు వళుకుకాఁడు.

**చక్రపక్షము** (సం.వి.అ.పుం.) : హంస.

**చక్రపాణి** (సం.వి.ఇ.పుం.) : విష్ణువు, చుట్టుకైదువు తాల్పు.

**చక్రమర్దనము** (సం.వి.అ.పుం.) : తగిరిస.

**చక్రము** (సం.వి.అ.న.) : 1. ఆయుధ విశేషము 2.బండికల్లు 3. గుంపు 4. దండు 5. రాష్ట్రము 6. గ్రామపు వళుకు 7. కుమ్మరిసారె 8. నీటి సుడి 9. చిన్న నాణెము. (పుం.) : జక్కవ. (దీని పర్యాయములన్నియు జక్కవకగు)

**చక్రల** (సం.వి.ఆ.స్త్రీ.) : వట్రువముస్తె.

**చక్రవర్తి** (సం.వి.న్.పుం.) : సార్వభౌముఁడు, రారాజు.

**చక్రవర్తిని** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. సార్వభౌమురాలు; 2. కోరింద.

**చక్రవాకము** (సం.వి.అ.పుం.) : జక్కవ పక్షి.

**చక్రవాళము** (సం.వి.అ.న.) : 1. గుంపు; 2. మండలము. (పుం.) : చుట్టుఁగొండ.

**చక్రవృద్ధి** (సం.వి.ఇ.స్త్రీ.) : వడ్డికివడ్డి.

**చక్రాంగము** (సం.వి.అ.పుం.) : 1. జక్కవ; 2. హంస.

**చక్రాంగి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. ఆఁడుహంస; 2. కటుకరోహిణి.

**చక్రి** (సం.వి.న్.పుం.) : 1. విష్ణువు; 2. జక్కవ; 3. పాము; 4. రారాజు; 5. కుమ్మరి.

**చక్రీవంతము** (సం.వి.త్.పుం.) : గార్దభము, గాడిద.

**చక్షుశ్శ్రవము** (సం.వి.స్.పుం.):పాము, కనువినికి.

**చక్షుష్య** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. కనుపాల; 2. అందకత్తెయగు ఆఁడుది. (అ.పుం.ము.) : 1. మొగలి; 2. పుండరీక మను చెట్టు. (విణ.): కంటికి హితమైనది.

**చక్షువు** (సం.వి.స్.న.) : నేత్రము, కన్ను.

**చటక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.ఆఁడుపిచ్చుక; 2.ఆఁడు పిచ్చుక పిల్ల; 3.పిప్పలివేరు. (అ.పుం.ము.) : పిచ్చుక.

**చటకారి** (అర.వి.) : ఈ దేశమునఁ బుట్టిన ఆంగ్లేయ సంతతివాఁడు.

**చటకాశిరము** (సం.వి.స్.న.) : పిప్పలివేరు.

**చటాకు** (హిం.వి.) : సేరులో పదు నాఅవ వంతు.

**చటులము** (సం.విణ.) :(అ.ఆ.అ.) చలించునది.

**చణకము** (సం.వి.అ.త్రి.) : సెనగలు.

**చతురంగము** (సం.వి.అ.న.) : చదరంగము.

**చతురంగుళము** (సం.వి.అ.పుం.) : తేల.

**చతురంతయానము** (సం.వి.అ.న.) : పల్లకి.

**చతురము** (సం.వి.అ.న.) : గజశాల. (పుం.) : అభినయ హస్తవిశేషము. (విణ.) : నేర్పరి.

**చతురస్త్రము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చదరము.

**చతురశ్రికము** (సం.వి.అ.పుం.) : ములువెలఁగ.

**చతురాననుఁడు** (సం.వి.అ.పుం.) : బ్రహ్మ, నలువ.

**చతురిమ** (సం.వి.న్.పుం.) : నేర్పరి తనము.

**చతురుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) నేర్పరి.

**చతుర్గతి** (సం.వి.ఇ.పుం.) : తాఁబేలు.

**చతుర్థి** (సం.వి.ఈ.స్త్రీ.) : చవుతి. (విణ.) : నాలుగవది.

**చతుర్దంతము** (సం.వి.అ.పుం.) : ఇంద్రుని యేనుఁగు, చవుదంతి.

**చతుర్దశి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. పక్షము నందు పదునాలవతిథి; 2. పదునాలుగు తంతులుగల పరివాదినియనువీణ.(విణ.) : పదునాలుగవది.

**చతుర్భద్రము** (సం.వి.అ.న.) : బలయుక్తములైన ధర్మార్థ కామ మోక్షములు.

**చతుర్భుజుఁడు** (సం.వి.అ.పుం.) : విష్ణువు, ఉడ్డకేలు వేలుపు.

**చతుర్వర్గము** (సం.వి.అ.పుం.) : ధర్మార్థ కామ మోక్షములు.

**చతుర్హాయని** (సం.వి.ఈ.స్త్రీ.) : నాలుగేండ్ల ఆవు.

**చతుశ్శాలము** (సం.వి.అ.న.) : నాలుగిండ్ల బవంతి.

**చతుష్కము** (సం.వి.అ.న.) : 1. చదుకము 2. చవిక; 3. నాలుగు.

**చతుష్కి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. పెద్ద కోనేఱు; 2. దోమతెర; 3. నాలుగుపేటలు గల హారము.

**చతుష్టయము** (సం.వి.అ.న.) : నాలుగు.

**చతుష్పథము** (సం.వి.అ.న.) : చదుకము. (పుం.) : మంచ విశేషము.

**చతుష్పథుఁడు** (సం.వి.అ.న.) : బ్రాహ్మణుఁడు.

**చతుష్పదము** (సం.వి.అ.పుం.) : 1. ఒక కరణము; (చూ. కరణము) (రూ. చతుష్పాత్తు) 2. నాలుగుకాళ్ల జంతువు. (రూ. చతుష్పాదము)

**చతుష్షష్టి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. అఱువది నాలుగు; 2. అఱువది నాలుగు కలలు; (చూ. కల) 3. ఋగ్వేదము.

**చత్వరము** (సం.వి.అ.న.) : 1. ముంగిలి; 2. వ్రతము పూనిన వానికి పండుకొనుటకు చక్కఁ బఱచిన భూమి. అగ్నిహోత్రము నుంచుటకై సంస్కరించిన స్థానము. (అని కొందఱు.)

**చత్వరి** (సం.వి.ఈ.స్త్రీ.) : శ్రవణ క్షమమైన బుద్ధి.

**చత్వరిక** (సం.వి.ఆ.స్త్రీ.) : బాలవిధవ.

**చపల** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.మెఱపు; 2. లక్ష్మి; 3. ఱంకుటాలు; 4. పిప్పలి. (పుం.ము.) : 1. కోఁతి; 2.చేఁప; 3.చలువఱాయి; 4.పాదరసము. (క్రి.విణ.అ.న.) : త్వరితము. (విణ.) : 1. కదులునది; 2. నిలుకడలేనిది; 3. వడిగలది.

**చపలత** (సం.వి.ఆ.స్త్రీ.) : రాగద్వేషాదులచే పనులయందుఁ గలుగు తబ్బిబ్బు.

**చపేటము** (సం.వి.అ.పుం.) : చాఁచిన వ్రేళ్లు గల అఱచేయి (రూ. చపటము.)

**చమత్కారము** (సం.వి.అ.పుం.) : నేర్పు, హరువు.

**చమత్కృతి** (సం.వి.ఇ.స్త్రీ.) : నేర్పు, హరువు.

**చమరము** (సం.వి.అ.న.) : 1. వింజామరము 2. సవరము. (పుం.) : సవరపు మెకము.

**చమరి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. ఆఁడు సవరపు మెకము 2. చిగురుకొమ్మ.

**చమరికము** (సం.వి.అ.పుం.) : కాంచనము.

**చమసము** (సం.వి.అ.పుం.) : చతురస్రమైన యజ్ఞపాత్రము. (పుం.) పక్షిపిల్ల.

**చమసి** (సం.వి.ఈ.స్త్రీ.) : సోఁపుపిండి.

**చమువు** (సం.వి.ఊ.స్త్రీ.) : 1.ఏడ్నూట యిరువది తొమ్మిది రథములు అన్ని యేనుఁగులు రెండు వేల నూట యెనుబది యేడు గుఱ్ఱములు మూడు వేలున్నార్నూట నలువది యేవురు కాల్వురును గలసేన; 2. సేన.

**చమూరువు** (సం.వి.ఉ.పుం.) : కలదు లేదను తోఁక కలిగి తెల్లఁగానైనను నల్లఁగా నైనను నానా వర్ణములు కలదిగా నైనను నుండెడు మృగ విశేషము. (దీనితోలు జనులు ఉపయోగపఱచు కొందురు)

**చయము** (సం.వి.అ.పుం.) : 1. సమూహము; 2. కోటకొఱడు; 3. సంగ్రహము.

**చరకము** (సం.వి.అ.పుం,న.) : వైద్య శాస్త్రము, కూర్చిన రెండు వస్త్రములు. (అని కొందఱు)

**చరణము** (సం.వి.అ.న.) : 1. తినుట; 2. తిరుగుట; 3. నడవడిక. (పుం.న.) : 1.పాదము; 2.వేరు; 3.ఋగ్వేదాది; 4.కులము.

**చరణాయుధము** (సం.వి.అ.పుం.) : కోడి, అజ్జవాలు.

**చరమక్రియ** (సం.వి.ఆ.స్త్రీ.) : అంత్యకర్మము.

**చరమము** (సం.విణ.) : 1. కడపటిది; 2. పడమటిది.

**చరమాద్రి** (సం.వి.ఇ.పుం.) : అస్త పర్వతము.

**చరము** (సం.వి.అ.పుం.) : ఒకానొక జూదము. (విణ.) : 1. కదలునది; 2. తిరుగునది.

**చరాచరము** (సం.వి.అ.న.) : జగత్తు. (విణ.) : 1.తిరుగునది; 2.తిరుగునదియుఁ దిరుగనిది యునైనది.

**చరించు** (సం.అ.క్రి.) : తిరుగు. (స.క్రి.) : చేయు.

**చరితము** (సం.వి.అ.న.) : నడవడి. (రూ.చరిత)

**చరిత్రము** (సం.వి.అ.న.) : నడవడి.(రూ.చరిత్ర)

**చరిష్ణువు** (సం.విణ.ఉ.) : తిరుగునది, జంగమము.

**చరుఁడు** (సం.వి.అ.పుం.) : 1. వేగువాఁడు; 2. అంగారకుఁడు.

**చరువు** (సం.వి.ఉ.పుం.) : 1. హవ్యము; 2. హవ్యము వండెడుకుండ.

**చర్చ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. విచారము; 2. చింత; 3.చేతనిడిన కుంకుమము లోనగునది. కుంకుమములోనగువానిపూఁత (అని కొందఱు.)

**చర్చరి** (సం.వి.ఈ.స్త్రీ.) : చప్పట.

**చర్చించు** (సం.స.క్రి.) : విచారించు.

**చర్చిక్యము** (సం.వి.అ.న.) : చేత నిడిన కుంకుమము లోనగునది. కుంకుమము లోనగువాని పూఁత (అని కొందఱు)

**చర్పటము** (సం.వి.అ.పుం.) : 1.చాఁచినవ్రేళ్లు గల అఱచేయి; 2. ఒకానొక మందు చెట్టు.

**చర్పటి** (సం.వి.ఈ.స్త్రీ.) : ఒబ్బట్లు.

**చర్మకష** (సం.వి.ఆ.స్త్రీ.) : సంబరేను.

**చర్మకారము** (సం.వి.అ.పుం.) : సంబరేను.

**చర్మకారుఁడు** (సం.వి.అ.పుం.) : మాదిగవాఁడు.

**చర్మచటక** (సం.వి.ఆ.స్త్రీ.) : చీకురువాయి.

**చర్మణ్వతి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. ఒకానొక యేఱు; 2. అరఁటి.

**చర్మప్రసేవిక** (సం.వి.ఆ.స్త్రీ.) : కొలిమితిత్తి, భస్త్ర.

**చర్మభేదిక** (సం.వి.ఆ.స్త్రీ.) : ఆరెసూది.

**చర్మము** (సం.వి.న్.పుం.) : 1. తోలు; 2. కేడెము.

**చర్మి** (సం.వి.న్.పుం.) : 1. కేడెము ధరించిన వాఁడు; 2. భుజ పత్రము.

**చర్య** (సం.వి.ఆ.స్త్రీ.) : నడచుట నిలుచుట కూర్చుండుట పండుకొనుటల యందు సమాహితుఁడగుట, ఈర్య.

**చర్వణ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఈఁగ. (అ.న.ము.) : నమలుట.

**చర్వితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నమలఁబడినది.

**చర్షణి** (సం.వి.ఈ.స్త్రీ.) : ఱంకుటాలు.

**చల** (సం.వి.ఆ.స్త్రీ.) : లక్ష్మి. (అ.పుం.ము.) : వణఁకు. (విణ.) : వణఁకు గలది.

**చలదళము** (సం.వి.అ.పుం.) : రావి.

**చలనము** (సం.వి.అ.న.) : 1.కదలుట; 2. తిరుగుట; 3. చల్లడము. (విణ.) : కదలునది.

**చలమంచము** (సం.వి.అ.పుం.) : తూఁగు మంచము.

**చలాకీ, చాలాకీ** (హిం.విణ.) : చుఱుకైన.

**చలానా** (హిం.వి.) : ఆయా వస్తువుల పట్టి, జాపితా.

**చలాచలము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కదలునది.

**చలామణీ, చలావణీ** (హిం.విణ.) : వాడుకలో నుండు, చెల్లుబడియైన.

**చలాయించు** (హిం.క్రి.) : జఱిగించు,పాఱిపోవు.

**చలించు** (సం.అ.క్రి.) : కదలు.

**చలితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కదలింపఁబడినది.

**చవిక** (సం.వి.ఆ.స్త్రీ. అ.న.) : చవ్యము.

**చవ్య** (సం.వి.ఆ.స్త్రీ.) : వస. (అ.న.ము.) : మందు దినుసు.

**చషకము** (సం.వి.అ.పుం,న.) : 1. కల్లు త్రాగెడు గిన్నె; 2. గిన్నె; 3.గిండి; 4.ఒక దినుసు కల్లు.

**చషాలము** (సం.వి.అ.పుం.) : యూప స్తంభ శిరోభాగము నందలి దారు మయమైన కడియము. రాజసూయము నందు యూప స్తంభము నడుగునఁదగిల్చెడి యినుప కడియము. (అని కొందఱు.)

# చా

**చాంగేరి** (సం.వి.ఈ.స్త్రీ.) : పులిచింత.

**చాంచల్యము** (సం.వి.అ.న.) : చపలత్వము.

**చాండాలిక** (సం.వి.ఆ.స్త్రీ.) : మాలవీణ, కిన్నెర.

**చాంద్రమానము** (సం.వి.అ.న.) : చంద్రుని గతిఁబట్టి యేర్పఱచెడు కాల పరిమాణము.

**చాంద్రాయణము** (సం.వి.అ.పుం.) : భుజింపఁదగిన ముప్పదిరెండు కబళములలో చంద్రుని యొక్క క్షయ వృద్ధులననుసరించి క్రమమున కృష్ణ పక్షమునందు ఒక్కొక్క కడిగా తగ్గించుచు, శుక్లపక్షమునందు ఒక్కొక్కడిగా హెచ్చించుచు భుజించి యాచరించెడి యొకానొకవ్రతము.

**చాందిని** (హిం.వి.) : మేలుకట్టు.

**చాందీ** (హిం.విణ.) : మెఱుఁగులేని.

**చాంద్రి** (సం.వి.ఈ.స్త్రీ.) : వెన్నెల, జ్యోత్స్న.

**చాంపేయము** (సం.వి.అ.న.) : బంగారు. (పుం.) : 1. అకరువు; 2. నాగకేసరము; 3. సంపెఁగ.

**చాకచక్యము** (సం.వి.అ.న.) : చకచక భావము.

**చాకిరి** (హిం.వి.) : నీచమైన కొలువు.

**చాకు** (హిం.వి.) : కత్తి.

**చాకోరము** (సం.వి.అ.న.) : చకోర పక్షుల గుంపు.

**చాక్రికుఁడు** (సం.వి.అ.పుం.) : 1. వేకువను రాజుల నిద్ర మేల్కొలిపెడు వాఁడు; 2. గాండ్లవాడు.

**చాటకైరము** (సం.వి.అ.పుం.) : 1. ఏట్రింత; 2. పిచ్చుక మగపిల్ల.

**చాటుకారము** (సం.వి.అ.పుం.) : బంగారు పూసలు గ్రుచ్చిన యొంటిపేట హారము.

**చాటువు** (సం.వి.ఉ.పుం,న.) : ప్రియమైన మాట.

**చాతకము** (సం.వి.అ.పుం.) : వానకోయిల.

**చాతురి** (సం.వి.ఈ.స్త్రీ.) : చతురత్వము, నేర్పు.

**చాతుర్మాస్యము** (సం.వి.అ.న.) : ప్రతి సంవత్సరము ఆషాఢశుద్ధము మొదలు కార్తిక శుద్ధము వఱకు నాలుగు నెలలు చేసెడి యొకానొక యజ్ఞము.

**చాతుర్యము** (సం.వి.అ.న.) : చాతురి, నేర్పు.

**చాతుర్వర్ణ్యము** (సం.వి.అ.న.) : బ్రాహ్మణాది చతుర్వర్ణములు.

**చాదస్తము** (గ్రా.వి.) : వెఱ్ఱితనము.

**చాదస్తుఁడు** (గ్రా.వి.) : వెఱ్ఱివాఁడు.

**చాపము** (సం.వి.అ.పుం.) : ధనుస్సు, విల్లు.

**చాపలము** (సం.వి.అ.న.) : చాంచల్యము.

**చాపల్యము** (సం.వి.అ.న.) : చాంచల్యము.

**చామరపుష్పము** (సం.వి.అ.పుం.) : 1. పోఁక చెట్టు; 2. మామిడి చెట్టు; 3. మొగలిచెట్టు; 4. ఱెల్లు.

**చామరము** (సం.వి.అ.న.) : వింజా మరము. (దీనికి మువర్ణలోపమును కానంబడియెడి.)

**చామీకరము** (సం.వి.అ.న.) : బంగారు, కనకము.

**చాముండ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఒక మాతృక. (చూ. మాతృక)

**చారటి** (సం.వి.ఈ.స్త్రీ.) : మెట్టదామర.

**చారణుఁడు** (సం.వి.అ.పుం.) : 1. నానా దేశ సంచారకుఁడైన నట్టువుఁడు; 2. నానా దేశ సంచారకుఁడైన బట్టువాఁడు; 3. ఒక జాతి ఖేచరుఁడు.

**చారము** (సం.వి.అ.పుం.) : 1. చెఱ, 2. నడ; 3. చాఱ.

**చారవాయువు** (సం.వి.ఉ.పుం.) : పడమటి గాలి.

**చారిత్రము** (సం.వి.అ.న.) : చరిత్రము.

**చారిమము** (సం.వి.న్.పుం.) : ఒప్పిదము.

**చారుఁడు** (సం.వి.అ.పుం.) : వేగు వాఁడు.

**చారువు** (సం.వి.ఉ.పుం.) : బృహస్పతి. (విణ.) : ఒప్పిదమైనది.

**చార్చిక్యము** (సం.వి.అ.న.) : చేతనిడిన కుంకుమము లోనగునది. కుంకుమము లోనగువాని పూఁత (అని కొందఱు)

**చార్మణము** (సం.వి.అ.న.) : చర్మముల సమూహము.

**చార్వాకుఁడు** (సం.వి.అ.పుం.) : 1. ఒకానొక మతమువాఁడు; 2. ఒకానొక రాక్షసుఁడు.

**చార్జి** (ఆం.వి.) : నేరస్థాపన, ఒప్పగింత, అధీనము.

**చార్వి** (సం.వి.ఈ.స్త్రీ.) : ఊహాపోహ క్షమమైన బుద్ధి.

**చాలనము** (సం.వి.అ.న.) : 1. చలింపఁ జేయుట 2. జల్లెడ.

**చాలని** (సం.వి.ఈ.స్త్రీ.) : జల్లించెడు జల్లెడ.

**చాషము** (సం.వి.అ.పుం.) : పాలపిట్ట, కికీదివి.

## చి

**చింక** (దే.వి.) : 1. చిన్నకాలువ; 2. (బ.) : రెల్లలలోనుండు జొన్నలు.

**చింకలిక్క** (వై.వి.) : ఎఱ్ఱని మొగముగల కోఁతి.

**చింగోటి** (దే.వి.) : ఆయుధ విశేషము.

**చించ** (సం.వి.ఆ.స్త్రీ.) : చింత.

**చించు** (దే.ప్రే.) : చినుఁగజేయు.

**చింత** (ఉభ. వై.వి.) : చింతచెట్టు. (సం. వి.ఆ. స్త్రీ.) : 1. తలఁపు; 2. వగపు.

**చింతకుఁడు** (సం.విశ.) : (అ.ఈ.అ.) చింతించువాఁడు.

**చింతగుల్ల** (వై.వి.) : బరుడుతో నుండు చింతపండు.

**చింతన** (సం.వి.ఆ.స్త్రీ.) : పలుమాఱు తలఁచుట.

**చింతనీయము** (సం.విశ.) : (అ.ఆ.అ.) చింతింపదగినది.

**చింతపండు** (ద్వ.వి.ఏ.) : బరడూడ్చిన తంత్రిణీ ఫలముల ముద్ద.

**చింతామణి** (సం.వ.ఇ.పుం.) : కోరిన కోరికల నిచ్చెడు దేవమణి.

**చింతించు** (సం.అ.క్రి.) : వగచు. (రూ. చింతిల్లు)

**చింతితము** (సం.విశ.) : (అ.ఆ.అ.) చింతింపఁ దగినది.

**చింద** (వై.వి.) : చీపరపిట్ట.

**చిందము** (దే.వి.) : శంఖము.

**చిందఱ** (యు.దే.వి.) : విజృంభణము. 1. తూఁటు; 2. ఖండము.

**చిందఱగొను** (దే.అ.క్రి.) : (చిందఱ + కొను) విజృంభించు.

**చిందఱరేఁగు** (దే.అ.క్రి.) : ఆవేశమెత్తు.

**చిందఱవందఱ** (దే.వి.) : 1.తునక; 2.కలగుండు (చూ. చిట్టాడు) (విశ.) : కలగుండువడినది.

**చిందఱవందఱచేయు** (దే.స.క్రి.) : ఖండించు.

**చిందఱవోవు** (ద్వ.అ.క్రి.) : (చిందఱ + పోవు) తూఁటువోవు.

**చిందఱసేయు** (ద్వ.స.క్రి.) : (చిందఱ + చేయు) భేదించు. (రూ. చిందఱలు సేయు.)

**చిందాడు** (దే.అ.క్రి.) : (చిందు+ఆడు) చిందులు ద్రొక్కు.

**చిందియ** (దే.వి.) : (చూ.) చిందె.

**చిందిలి** (దే.విశ.) : చలించినది.

**చిందిలిపడు** (ద్వ.అ.క్రి.) : సంభ్రమించు.

**చిందిలిపాటు** (ద్వ.వి.) : చిందిలిపడుట, వేగిరపాటు.

**చిందిలు** (దే.అ.క్రి.) : చలించు.

**చిందు** (దే.అ.క్రి.) : 1. నీళ్లు పాత్రము నందుండి తొనఁకిపడు; 2. రాలు; 3. వ్యాపించు. (స.క్రి.) : వెచ్చెము సేయు. (వి.) : 1. గీత ప్రబంధ విశేషము. (విశ.) : చెదిరినది

**చిందుగ** (దే.వి.) : వృక్షవిశేషము.

**చిందుద్రొక్కు** (దే.అ.క్రి.) : (చిందు + త్రొక్కు) నర్తనముచేయు.

**చిందుపరుపు** (దే.వి.) : బాలక్రీడా విశేషము.

**చిందువ** (దే.వి.) : 1.చిన్నపెట్టె; 2.వృక్ష విశేషము. (చూ. చిందుగ)

**చిందువందు** (దే.విశ.) : చెదరినది.

**చిందువందుచేయు** (దే.స.క్రి.) : చెదరఁగొట్టు.

**చిందె** (దే.వి.) : జెట్లకుల్లాయ (చిందియ యొక్క రూపాంతరము)

**చింపి** (దే.విశ.) : చినిఁగినది.

**చింపిటి** (దే.వి.) : నిప్పుసోఁకినట్లుండు కొనలు గలిగి బిరుసెక్కిన చిన్న వంకర వెంట్రుకలు.

**చింపు** (దే.ప్రే.) : చించు యొక్క రూపాంతరము.

**చింబు** (దే.వి.) : మేఁక, అజ.

**చింబోతు** (దే.వి.) : (చింబు+పోతు) మేఁకపోతు.

**చికటారి** (దే.వి.) : చిక్కటారి యొక్క రూపాంతరము.

**చికమక** (దే.వి.) : చిక్కు.

**చికిచికి** (దే.విణ.) : చిన్న.

**చికిత్స** (సం.వి.ఆ.స్త్రీ.) : (రోగమునకు జేయు) ప్రతి క్రియ.

**చికిత్సకుఁడు** (సం.వి.అ.పుం.) : వైద్యుఁడు, వెజ్జు.

**చికిత్సించు** (సం.అ.క్రి.) : చికిత్సచేయు.

**చికినము** (వై.వి.) : చికినివక్క.

**చికిని** (వై.వి.) : చాయవక్క.

**చికిలి** (దే.వి.) : తుడిచి చక్కచేయుట.

**చికిలికాఁడు** (దే.వి.) : (కత్తులు మొదలైన వానిని) చికిలి చేయువాఁడు.

**చికిలిచేయు** (దే.స.క్రి.) : తుడిచి చక్క చేయు.

**చికిలు** (దే.అ.క్రి.) : చనవుచేనేడ్చు.

**చికీర్ష** (సం.వి.ఆ.స్త్రీ.) : చేయనిచ్ఛ.

**చికీర్షితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చేయ నిచ్ఛింప బడినది.

**చికీర్షువు** (సం.విణ.) : (ఉ.) చేయ నిచ్ఛ గలవాఁడు.

**చికురము** (సం.వి.అ.పుం.) : 1. వెంట్రుక; 2. కొండ; 3. పక్షి విశేషము; 4. పాము; 5. ముంగిస; 6. వృక్ష విశేషము. (విణ.) : కదలునది.

**చిక్క** (సం.వి.ఆ.స్త్రీ.) : పోఁక. (అ.న.ము.) : చికినపు వక్క. (పుం.) : చుంచెలుక.

**చిక్కంటె** (దే.వి.) : తల చిక్కు దీసికొనెడు నిడుపు దువ్వెన

**చిక్కటారి** (ద్వ.వి.) : (చికి+కటారి) చిన్న కటారి.

**చిక్కణము** (సం.వి.అ.న.) : 1. చికిని వక్క; 2. ఏనుఁగు హృదయమదము. (పుం,న.) : పోఁక. (విణ.) : 1. తఱచైనది; 2. నునుపైనది.

**చిక్కన** (వై.వి.) : 1. తఱచు; (చిక్కని పాలు) 2. బలము; 3. దార్ఢ్యము.

**చిక్కనాబిల్లలు** (దే.వి.బ.) : బాలక్రీడా విశేషము. (చూ. ఓటిల్లుచిందఱ.)

**చిక్కపట్టు** (దే.వి.) : (చిక్కని + పట్టు) నిర్ణయము.

**చిక్కము** (వై.వి.) : 1. ఉట్టి; 2. తీఁగలు లోనగు వానితో నల్లి పసుల మూతికిఁ దగిలించెడు బుట్ట; 3. దారముతో నల్లిన సంచి.

**చిక్కసము** (సం.వి.అ.న.) : యవల పిండి.

**చిక్కు** (దే.అ.క్రి.) : 1. కృశించు; 2. తక్కు; 3. తగులు; 4. దొరకు; 5. మిగులు. (వి.) : 1. మెలి; 2. సంకటము.

**చిక్కుడు** (దే.వి.) : ఒకానొక తీఁగ.

**చిక్కుతాళము** (మి.వి.) : ఒక దినుసు బీగము.

**చిక్కుపడు** (ద్వ.అ.క్రి.) : 1.చిక్కగు; 2. సంకట పడు.

**చిక్కుపాటు** (ద్వ.వి.) : చిక్కు పడుట; సంకట పాటు.

**చిక్కువడు** (ద్వ.అ.క్రి.) : (చిక్కు+పడు) 1.చిక్కగు; 2. సంకటపడు.

**చిక్కొట్టు** (దే.స.క్రి.) : (ఛీ + కొట్టు) ఛీఛీయను.

**చిక్కోల** (దే.వి.) : (చిక్కు + కోల) చిక్కంటె.

**చిక్రోడము** (సం.వి.అ.పుం.) : ఉడుత.

**చిగిరించే** (దే.అ.క్రి.) : చిగురుచు, పల్లవించు.

**చిగిరింత** (దే.వి.) : తృణ విశేషము.

**చిగురాకుదిండి** (దే.వి.) : (చిగురు + ఆకు + తిండి) పికము.

**చిగురాకువిలుకాఁడు** (దే.వి.) : (చిగురు + ఆకువిలుకాఁడు) మన్మథుఁడు.

**చిగురు** (దే.వి.) : పల్లవము. (విణ.) : లేఁత (చిగురుఁ గొమ్మ). (హల్లు పర మగుచో దీని కడపటి యుకారము వికల్పముగ లోపించెడి.)

**చిగురుఁగొమ్మ** (దే.వి.) : (చిగురు + కొమ్మ) చిగిరించిన లేత కొమ్మ, పూచిన లేఁత కొమ్మ. (అని కొందఱు.)

**చిగురుఁబోఁడి** (దే.వి.) : (చిగురు + పోఁడి) 1. చిగురువలె మనోజ్ఞురాలగు ఆఁడుది; 2. ఆఁడుది (చూ. అలరుఁ బోడి)

**చిగురుకొను** (దే.అ.క్రి.) : చిగిరించు.

**చిగురుచు** (దే.అ.క్రి.) : 1. చిగిరించు; 2. ఎఱ్ఱ నగు. (రూ. చిగుర్చు.)

**చిగురువిలుకాఁడు** (దే.వి.) : మన్మథుఁడు. (ఇట్లు చిగురు విలుతుఁడు. మొ.)

**చిగురొత్తు** (దే.అ.క్రి.) : (చిగురు+ఒత్తు) 1. చిగు రుచు; 2. అనురక్తమగు. "చిత్తము చిగురొత్త." (చూ. ఒత్తు.)

**చిచ్చేఱ** (వై.విణ.) : (చిచ్చు+అఱ) అగ్నిమయము.

**చిచ్చేఱకంటి** (ద్వ.వి.) : (చిచ్చుఱ+కన్ను) శివుఁడు.

**చిచ్చి** (దే.అవ్య.) : బిడ్డలకు జోలలు పాడునపుడు పీడా పరిహారార్థము చెప్పఁబడు మాట. (రూ. చిచ్చీ)

**చిచ్చే** (వై.వి.) : 1. అగ్ని; 2. తాపము.

**చిచ్చేబుడ్లు** (ద్వ.వి.) : బాణము సంచువగ.

**చిచ్చేఱ** (వై.విణ.) : (చిచ్చు+ఉఱ) అగ్నిమయము.

**చిటచిట** (దే.వి.) : 1. కాఁగిన నూనె యందు నీటిబొట్లు పడఁగాఁ గలుగునట్టి ధ్వన్యను కరణము; 2. మిడుఁగుఱులు చెదరుట లోనగువాని యందగు ధ్వన్యనుకరణము; 3. మంట యందగు ధ్వన్యనుకరణము.

**చిటచిటమను** (దే.అ.క్రి.) : (చిటచిట + అను) మండిపడు.

**చిటచిటలాడు** (దే.అ.క్రి.) : (చిట చిటలు + ఆడు) మండిపడు.

**చిటపొట** (దే.వి.) : 1. ఈర్ష్యచేఁ గలిగెడు స్త్రీయొక్క కోపము; 2. ఆకులు తినుట యందగు ధ్వన్యనుకరణము; 3. చినుకులు పడుట యందగు ధ్వన్యనుకరణము; 4. కాయలు రాలుట యందగు ధ్వన్యనుకరణము.

**చిటాలు** (దే.వి.) : ధ్వన్యనుకరణము.

**చిటి** (దే.విణ.) : 1. చిన్న; 2. సన్నము. (చిట్టి యొక్క రూపాంతరము)

**చిటిక** (వై.వి.) : 1.నడిమి వ్రేలిని పెద్ద వ్రేలితోఁ గూర్చి ధ్వనింపఁజేయునంత కాలము; 2. నడిమి వ్రేలిని పెద్ద వ్రేలితోఁ గూర్చి ధ్వనింపఁ జేయుట.

**చిటికరించు** (వై.అ.క్రి.) : చిటికవేయు.

**చిటికరింత** (వై.వి.) : చిటిక.

**చిటికాఁడు** (దే.వి.) : పొట్టిగానుండుట చేత కుక్క కియ్యఁబడిన పేరు. (ఇది చిటిలింగఁడు అనుదానికి పర్యాయము.) (విణ.) : చిన్నవాఁడు.

**చిటికెన** (దే.వి.) : చిన్నవ్రేలు, కనిష్ఠిక.

**చిటికెనబొద్దులు** (దే.వి.బ.) : కాలి చిటికెన వ్రేళ్ల యందుంచుకొనెడు భూషా విశేషము.

**చిటిగొట్టె** (ద్వ.వి.) : చిన్నజాతి గొట్టెచెట్టు.

**చిటితాళము** (మి.వి.) : మ్రానితోఁజేసిన తాళ విశేషము.

**చిటిపొటి** (దే.విణ.) : అల్పము. (పొట్టి శబ్దము యొక్క రూపాంతరము పొటి. చిటిపొటి శబ్దములు రెండు చేరి యుండుట వలన అత్యల్పమనియు నర్థము చెప్పవచ్చును.)

**చిటిబొద్దులు** (దే.వి.బ.) : చిటికెన బొద్దులు.

**చిటిముత్తెములు** (ద్వ.వి.బ.) : ధాన్య విశేషము.

**చిటిలింగఁడు** (ద్వ.వి.) : చిన్న లింగము వలె నుండుటచే కుక్క కియ్యబడిన పేరు. (చూ. గబ్బి)

**చిటివ్రేలు** (దే.వి.) : చిటికెనవ్రేలు.

**చిటుకను** (దే.అ.క్రి.) : చిటుక్కను యొక్క రూపాంతరము.

**చిటుకుపొటుకు** (దే.వి.) : వాన వెలిసిన పిమ్మట చెట్టుమీఁద నుండి బొట్లు పడునపుడు కలుగు ధ్వన్యను కరణము.

**చిటుకుపొటుకుమను** (దే.అ.క్రి.) : (చిటుకు పొటుకు + అను) పలుకు. (వాఁడు చిటుకు పొటుకు మనక ఉన్నాఁడు.)

**చిటుకురను** (ద్వ.అ.క్రి.) : (చిటుకు+అను) చిటుక్కని మ్రోఁగు.

**చిటుక్కను** (దే.అ.క్రి.) : (చిటుక్కు+అను) చిటుక్కని మ్రోఁగు.

**చిటులు** (దే.అ.క్రి.) : చిట్లు.

**చిట్ట** (దే.వి.) : 1. ఆశ్చర్యము; 2. చిన్న పొద. కల్పితము. (ఇది చిట్టగానున్నది.)

**చిట్టంటుచేఁతలు** (దే.వి.బ.) : (చిట్టి + అంటు చేఁతలు) విలాసము.

**చిట్టంటులు** (దే.వి.బ.) : (చిట్టి + అంటులు) నఖదంతక్షతాది. (ఇక్కడ అంటియనఁగా చేసియని యర్థము.)

**చిట్టకము** (వై.వి.) : 1. శృంగారచేష్ట; 2. లీల; 3. కపటము.

**చిట్టచివర** (దే.విణ.) : (చివర+చివర) అన్నిటికి చివర.

**చిట్టతుమికి** (దే.వి.) : రావణ వృక్షము.

**చిట్టమిడుచు** (దే.అ.క్రి.) : చిటికవేయు.

**చిట్టా** (హిం.వి.) : దినపులెక్క.

**చిట్టాడు** (దే.అ.క్రి.) : (చిట్టి + ఆడు) 1. సంచరించు; 2. ప్రసరించు; 3. చలించు.

**చిట్టాముదపుఁజెట్టు** (ద్వ.వి. ) : (చిట్టాముదము + చెట్టు) బల.

**చిట్టాముదము** (ద్వ.వి.) : (చిట్టి + ఆముదము) 1. చిట్టాముదాల నూనె; 2. చిట్టాముదపు విత్తులు.

**చిట్టి** (దే.వి.) : సోలయందు నాలుగవ భాగమయిన మాన విశేషము. (విణ.) : చిన్న. (ఇత్యాది ప్రయోగములంబట్టి చిట్టడవి, చిట్టాస, చిట్టీఁదు, చిట్టుడుకు, చిట్టెండ, చిట్టేలకి ఇత్యాదుల యందుఁ బూర్వమునందుండునది చిట్టి శబ్దము గాని చిఱుత శబ్దము కాదని తోఁచుచున్నది.)

**చిట్టియ** (దే.వి.) : (చూ.) చిట్టె.

**చిట్టియము** (దే.వి.) : (చూ.) చిట్టెము.

**చిట్టీఁదు** (దే.వి.) : (చిట్టి + ఈఁదు) ఖర్జూరి.

**చిట్టీడ** (దే.వి.) : (చిట్టి+ఈడ) క్షుద్రరక్త నారంగము.

**చిట్టు** (దే.వి.) : తవుడుకలిసిన సన్ననూక.

**చిట్టుడుకునీళ్లు** (ద్వ.వి.బ.) : (చిట్టి + ఉడుకు నీళ్ళు) పొంగునీళ్లు.

**చిట్టుములు** (దే.వి.బ.) : (చిట్టి + ఉములు) గర్భిణికిఁ గలిగెడి యొకానొక లక్షణము.

**చిట్టె** (దే.వి.) : 1. వస్త్రముల యంచుల యందు నేసెడు చిన్నకమ్మి; 2. వెదురు గనుపు. (చిట్టి యొక్క రూపాంతరము.)

**చిట్టెము** (దే.వి.) : ఇనుముకాఁచు నప్పుడు వచ్చెడు ముఱికి, శింఘాణము. (చిట్టియము యొక్క రూపాంతరము)

**చిట్టెలుక** (దే.వి.) : (చిట్టి + ఎలుక) చిన్నజాతి యెలుక, గిరిక.

**చిట్టేలకి** (ద్వ.వి.) : (చిట్టి + ఏలకి) ఉప కుంచిక.

**చిట్లపొట్లకాయ** (దే.వి.) : బాలక్రీడా విశేషము. (చూ. కుందెనగుడి)

**చిట్లు** (దే.అ.క్రి.) : 1. పగుళ్లువాఱు; 2. మిక్కిలి కోపించు. వి. వృత్తాంతము. (చిటులు యొక్క రూపాంతరము.)

**చిట్లుకట్టియ** (ద్వ.విణ.) : మిక్కిలి కోపము గలవాఁడు.

**చిట్లుకట్టె** (ద్వ.విణ.) : చిట్లు కట్టియ యొక్క రూపాంతరము.

**చిడిపి** (దే.విణ.) : 1. అల్పము; 2. పరుషము.

**చిడిముడి** (దే.వి.) : తొట్రు.

**చిడిముడిపడు** (ద్వ.అ.క్రి.) : తొట్రుపడు.

**చిడిముడిపాటు** (ద్వ.వి.) : చిడిముడి పడుట, తొట్రుపాటు.

**చిడుగు** (దే.విణ.) : అల్పము.

**చిడుగుడు** (దే.వి.) : బాలక్రీడా విశేషము. (చూ. ఉవ్వలపోటి.)

**చిడుము** (దే.వి.) : తీఁటకుఱుపు.

**చిత** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. సొద; 2. ప్రోగు. (విణ.) : 1. కప్పఁబడినది; 2. చేర్పఁ బడినది.

**చితి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. సొద; 2. ప్రోగు.

**చితుకు** (దే.అ.క్రి.) : కుఱుపులోనగునవి నలఁగు.

**చిత్త** (వై.వి.) : చిత్రానక్షత్రము; ఒక కార్తె పేరు.

**చిత్తగించు** (వై.అ.క్రి.) : మనస్కరించు. 1. తలఁచు; 2. యోచించు.

**చిత్తడి** (ద్వ.వి.) : (చిత్త + తడి) మిక్కిలితడి.

**చిత్తము** (సం.వి.అ.న.) : మనసు, మానసము, మది.

**చిత్తర** (దే.వి.) : మత్స్యవిశేషము.

**చిత్తరువు** (వై.వి.) : 1. ఆశ్చర్యము; 2. పటము నందు రూపము వ్రాయుట; 3. పటము నందు వ్రాసిన రూపము. (వృత్తి యందుఁ గడపటి వర్ణము వికల్పముగా లోపించును. చిత్తరు బొమ్మ. మొ.)

**చిత్తటి** (ద్వ.వి.) : (చిత్త + తటి) వర్షఋతువు.

**చిత్తిని** (వై.వి.) : స్త్రీజాతి విశేషము.

**చిత్తు** (ఉభ. దే.వి.) : 1. దిద్దిచక్క పఱపని మొదట వ్రాసిన వ్రాఁత; 2. మొదట గుణించుకొను లెక్క (సం.త్.స్త్రీ.) : జ్ఞానము.

**చిత్య** (సం.వి.ఆ.స్త్రీ.) : సొద.(అ.న.ము.) : గోరీ.

**చిత్ర** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. ఒక నక్షత్రము; (చూ. నక్షత్రము) 2. మాయ; 3. ఎలుకజీడి; 4. గుమ్మడి; 5. పిన్న పాపర; 6. బుడమ. (అ.న.ము.) : 1. ఆశ్చర్యము; 2. చిత్తరువు; 3. నానావర్ణము; 4.బొట్టు. (విణ.1. ఆశ్చర్యకర మైనది; 2. నానావర్ణములు గలది.

**చిత్రకంఠము** (సం.వి.అ.పుం.) : కపోతము, గువ్వ.

**చిత్రకము** (సం.వి.అ.న.) : బొట్టు (పుం.) : 1. చిఱుతపులి; 2. ఆముదపు చెట్టు; 3. గుమ్మడి; 4. చిత్రమూలము.

**చిత్రకాయము** (సం.వి.అ.పుం.) : చిఱుతపులి.

**చిత్రకారుఁడు** (సం.వి.అ.పుం.) : చిత్తరువు వ్రాయు వాఁడు, ముచ్చి.

**చిత్రకుఁడు** (సం.వి.అ.పుం.) : చిత్తరువు వ్రాయు వాఁడు, ముచ్చి.

**చిత్రకృత్తు** (సం.వి.త్.పుం.) : తినాసము.

**చిత్రగుప్తుఁడు** (సం.వి.అ.పుం.) : 1. యముని వద్ద లెక్క వ్రాయు వాఁడు; 2. యముడు.

**చిత్రతండుల** (సం.వి.ఆ.స్త్రీ.) : వాయు విడంగము.

**చిత్రదండము** (సం.వి.అ.పుం.) : కంద.

**చిత్రపక్షము** (సం.వి.అ.పుం.) : 1. కవుఁజు; 2. నెమలి.

**చిత్రపర్ణి** (సం.వి.ఈ.స్త్రీ.) : కోలపొన్న.

**చిత్రబింబము** (సం.వి.) : (అ.పుం.) కామరూపము గల తొండ. ఊసరవెల్లి.

**చిత్రభాను** (సం.వి.ఉ.పుం.) : ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము)

**చిత్రభానువు** (సం.వి.ఉ.పుం.) : 1. అగ్ని; 2. సూర్యుఁడు.

**చిత్రరథుఁడు** (సం.వి.) : (అ.పుం.) 1. ఒకానొక గంధర్వుఁడు; 2. ఒకానొక విద్యాధరుఁడు; 3. సూర్యుఁడు.

**చిత్రవాలము** (సం.వి.) : (అ.పుం.) పాలపిట్ట.

**చిత్రశిఖండిజుఁడు** (సం.వి.) : (అ.పుం.) బృహస్పతి.

**చిత్రశిఖండులు** (సం.వి.న్.పుం.) : మరీచ్యాది సప్త మహర్షులు.

**చిత్రించు** (సం.స.క్రి.) : చిత్రము వ్రాయు.

**చిత్రిక** (దే.వి.) : మ్రాను నునుపు పఱచెడు వడ్లవాని కొఱమట్టు, త్రోపుడు.

**చిత్రిణి** (సం.వి.ఈ.స్త్రీ.) : (చూ.) చిత్తిని.

**చిత్రితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చిత్రింపఁ బడినది.

**చిదక** (దే.విణ.) : చప్పట. (చిదక ముక్కువాఁడు. మొ.)

**చిదగొద** (దే.వి.) : భేదము, వ్యత్యాసము.

**చిదియు** (దే.అ.క్రి.) : నలఁగు.

**చిదుకు** (దే.అ.క్రి.) : చిప్పిలు.

**చిదుగు** (దే.వి.) : ఎండిన చిన్నపుల్ల, సమిధ.

**చిదుపు** (దే.ప్రే.) : చిదియఁజేయు.

**చిదుము** (దే.స.క్రి.) : 1.గిల్లు; 2.పువ్వులు లోనగు వానిఁ గోయు; 3. త్రుంచు; 4. వైచు. (వి.) : చిగురు. చంద్ర.

**చిదురలు** (దే.వి.బ.) : 1. సూక్ష్మ ఖండములు; 2. సూక్ష్మభాగములు.

**చిదురుపలు** (దే.వి.బ.) : 1. సూక్ష్మ ఖండములు; 2. సూక్ష్మ భాగములు.

**చిద్రుపలు** (దే.వి.బ.) : చిదురుపలు యొక్క రూపాంతరము. (చూ. చిదురుపలు.)

**చిన** (దే.విశ.) : చిన్న యొక్క రూపాంతరము.

**చిని** (దే.విశ.) : 1. చిన్న; 2. మనోజ్ఞము. (చిన్ని యొక్క రూపాంతరము.)

**చినుఁగు** (దే.అ.క్రి.) : వస్త్రాదికము ఛిన్నమగు.

**చినుకు** (దే.అ.క్రి.) : కాఱు. (అం, ప్రే.) : కార్చు, కురియు.

**చినుకుఁబూస** (దే.వి.) : (చినుకు + పూస) ముత్యము.

**చిన్న** (దే.విశ.) : 1. అల్పము; 2. కనిష్ఠము.

**చిన్నటనాడు** (దే.వి.) : (చిన్న + నాడు) బాల్య సమయము.

**చిన్నది** (దే.వి.) : (చిన్న + అది) బాలిక. (విశ.): చిన్నయైనది.

**చిన్ననాడు** (దే.వి.) : బాల్య సమయము.

**చిన్నము** (దే.వి.) : 1. నాలుగు గురిగింజల యెత్తు; 2. నాలుగు గురిగింజల యెత్తు గల బంగారు నాణెము.

**చిన్నరిపొన్నరి** (దే.విశ.) : చిన్నారి పొన్నారి యొక్క రూపాంతరము.

**చిన్నఱికము** (దే.వి.) : చిన్నతనము.

**చిన్నవాఁడు** (దే.వి.) : బాలుఁడు. (విశ.) : చిన్న యైన వాఁడు.

**చిన్నవోవు** (దే.అ.క్రి.) : (చిన్న+పోవు) ఖిన్నుఁడగు. (ప్రే. చిన్నపుచ్చు)

**చిన్నారి** (దే.విశ.) : మనోజ్ఞము. (చిన్నారి చిగురు, చిన్నారి జాబిల్లి, చిన్నారి నూఁగారు, చిన్నారి మొగము. మొ.)

**చిన్నారిపొన్నారి** (దే.విశ.) : మనోజ్ఞము.

**చిన్నిదము** (దే.వి.) : 1. చిన్నపువ్వు; 2. బంగారు.

**చిన్నిపువు** (ద్వ.వి.) : 1. భూషావిశేషము; 2. నమస్కృతి. (రూ. చిన్నిపువ్వు.)

**చిన్నిపూఱేకు** (ద్వ.వి.) : 1. భూషావిశేషము; 2. నమస్కృతి. (రూ. చిన్ని పువ్వు.)

**చిన్నియ** (వై.వి.) : 1. గుఱుతు; (చూ. చిన్నె) 2. విలాసము.

**చిన్నె** (వై.వి.) : చిన్నియ యొక్క రూపాంతరము. (గుఱుతునకు, విలాసమునకు.)

**చిన్నెలాఁడి** (ద్వ.విశ.) : (చిన్నెలు + ఆఁడి) విలాసవతి.

**చిన్నెలాఁడు** (ద్వ.విశ.) : (చిన్నెలు + ఆఁడు) విలాసవంతుఁడు.

**చిపిటము** (సం.వి.) : (అ.పుం.) అడుకులు. (విశ.) : చప్పట ముక్కువాఁడు.

**చిప్ప** (దే.వి.) : 1. కప్పుచిప్ప; 2. కల్లు త్రాగెడు గిన్నె; 3. టెంకాయచిప్ప; 4. తామేటి వీఁపు చిప్ప; 5. భూగోళము నందర్ధ భాగము; 6. ముత్తెపుఁ జిప్ప; 7. మోఁకాటి చిప్ప; 8. తునుక; 9. తల పుఱ్ఱె; 10. చేఁప మీఁది పొలుసు. (విశ.) అల్పము.

**చిప్పకత్తి** (దే.వి.) : చెట్లు మొదలైనవి నఱకెడు మోటకత్తి.

**చిప్పకసవు** (ద్వ.వి.) : భూస్తృణము. (ఇట్లు చిప్పగడ్డి.)

**చిప్పకూఁకటి** (ద్వ.వి.) : పిల్లజుట్టు.

**చిప్పగొడ్డలి** (ద్వ.వి.) : చెట్లు నఱకెడు గొడ్డలి.

**చిప్పపెడక** (దే.వి.) : ఇంటిపార్శ్వముల కప్పు.

**చిప్పము** (దే.వి.) : పెద్దమూట.

**చిప్పముత్తెము** (ద్వ.వి.) : కృత్రిమ మౌక్తికము.

**చిప్పమూతి** (దే.వి.) : కళాహీనమగు ముఖము.

**చిప్పిల్లు** (దే.అ.క్రి.) : నీటిబొట్టులోనగువాని లోపల నుండి పైకుబుకు. (రూ. చిప్పిలు.)

**చిప్పెవాఁడు** (దే.వి.) : కుత్రపువాఁడు.

**చిబుకము** (సం.వి.అ.న.) : గడ్డము. (రూ. చీబుకము)

**చిబుకు** (దే.స.క్రి.) : చప్పరించు.

**చిమచిమ** (దే.వి.) : గాయపు మంట యందగు ననుకరణము.

**చిమట** (దే.వి.) : చిమ్మట యొక్క రూపాంతరము.

**చిమిడిక** (దే.వి.) : చిమిడిన యన్నము.

**చిముటాలు** (దే.వి.బ.) : క్షౌరమప్పుడు తండస ముతో వెండ్రుకలూడఁ దీయుట.

**చిముటు** (దే.స.క్రి.) : సైఁగకు కన్ను మూసి తెఱచు.

**చిముడు** (దే.అ.క్రి.) : 1. అన్నము పాకము మీఱునుడికి ముద్దయగు; 2. పాకము చెడు.

**చిముడుచు** (దే.ప్రే.) : చిముడఁజేయు.

**చిమ్మ** (దే.వి.) : జలకణ సమూహము.

**చిమ్మచీఁకటి** (దే.వి.) : గాఢాంధకారము, అంధ తమసము.

**చిమ్మట** (దే.వి.) : ఈలపురుగు, ఝిల్లిక.

**చిమ్మదిరుగు** (దే.అ.క్రి.) : గిరగిరఁ దిరుగు.

**చిమ్మనగ్రోవి** (దే.వి.) : (చిమ్మనము + క్రోవి) జలక్రీడయందు నీళ్లు చిమ్మెడు గొట్టము, శృంగము.

**చిమ్మనము** (దే.వి.) : చిమ్ముట.

**చిమ్ని** (ఆం.వి.) : పొగగూడు, పొగగొట్టము.

**చిమ్మిరేఁగు** (దే.అ.క్రి.) : మిక్కిలి విజృంభించు.

**చిమ్మిలి** (దే.వి.) : నువ్వులును బెల్లమును కొట్టి చేసెడి యుండ.

**చిమ్ము** (దే.స.క్రి.) : 1. మీటు; 2. వైచు. (వి.) : 1. పొడుచుట; 2. వైచుట.

**చిమ్ముడు** (దే.వి.) : చిమ్ముట, విక్షేపము.

**చిమ్ముబిల్లలు** (దే.వి.బ.) : బాలక్రీడా విశేషము.

**చిమ్ములాట** (దే.వి.) : చిమ్ములాడుట, ఒకరిమీఁద నొకరు చిమ్ముకొనుట.

**చిమ్ములాడు** (దే.స.క్రి.) : (చిమ్ములు + ఆడు) ఒకరిమీఁద నొకరు చిమ్ముకొను.

**చియ్య** (దే.వి.) : కండ.

**చిరంటి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. ఐదువరాలు; 2. జవరాలు.

**చిరంతనము** (సం.విణ.) : (అ.ఆ.అ.) బహుదినములది, ప్రాంతది.

**చిరక్రియుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) తామసించి కార్యము చేయువాఁడు.

**చిరజీవి** (సం.వి.న్.పుం.) : 1. కాకి; 2. విష్ణువు. (విణ.) : చిరకాలము జీవించువాఁడు.

**చిరత్నము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చిరంతనము.

**చిరమర** (దే.వి.) : భేదము.

**చిరరాత్రము** (సం.వి.అ.న.) : 1. రాత్రుల సమూహము; 2. పెక్కు రాత్రులు.

**చిరాకు** (దే.వి.) : కోపము.

**చిరాయువు** (సం.వి.న్.న.) : బూరుగు. (పుం.) : వేలుపు.

**చిరి** (సం.వి.ఇ.పుం.) : చిలుక.

**చిరిక** (సం.వి.ఆ.స్త్రీ.) : పురాతనమలము.

**చిరిపి** (దే.వి.) : తైలమార్జకము.

**చిరిబిల్వము** (సం.వి.అ.పుం.) : కానుగు.

**చిరిమిడి** (దే.వి.) : భక్ష్యవిశేషము.

**చిరుఁగు** (దే.అ.క్రి.) : చినుఁగు.

**చిరుక** (సం.వి.) : ఈలపురుగు, చిమ్మట.

**చిరుగడము** (దే.వి.) : తియ్యకంద. (చూ. చిరువడము)

**చిరుగుడు** (దే.వి.) : వ్యాధి విశేషము, ఎఱ్ఱ పులుము.

**చిరుతలుకవియు** (దే.అ.క్రి.) : మిఱు మిట్లుగొను. (ఇట్లు చిరుతలుక్రమ్ము, చిరుతులు వాఱు)

**చిరునామ** (వై.వి.) : జాబులమీఁదను లెక్కల మీఁదను వ్రాయు వ్రాఁత.

**చిరువడము** (దే.వి.) : చిరుగడము యొక్క రూపాం తరము.

**చిర్నవ్వు** (ద్వ.వి.) : చిఱునవ్వు యొక్క రూపాం తరము.

**చిర్భటము** (సం.వి.అ.పుం.) : నక్కదోస.

**చిఱచిఱ** (దే.వి.) : కోప వికారము.

**చిఱచిఱలాడు** (దే.అ.క్రి.) : (చిఱ చిఱలు + ఆడు) మండిపడు.

**చిఱి** (వై.వి.) : చిట్టి యొక్క రూపాంతరము.

**చిఱు** (వై.విణ.) : వృత్తియందు చిఱుత శబ్దమునకు మీఁది వర్ణము లోపింపగా మిగిలిన రూపము.

(ఉదా : చిఱుగజ్జె, చిఱుగెంపు, చిఱుచెమట, చిఱుచెయ్వు, చిఱుచేఁప, చిఱుదోఁక, చిఱుపొక్కు. మొ.)

**చిఱుగాలి** (ద్వ.వి.) : (చిఱుత + గాలి) మందమారుతము.

**చిఱుగూబ** (వై.వి.) : (చిఱుత + గూబ) పైఁడికంటి.

**చిఱుత** (వై.వి.) : 1. చిన్నపులి; 2. సాము చేసెడు వారు త్రిప్పెడు చిన్న కోల. (విణ.) : చిన్న. (తఱుచుగా వృత్తి యందు అంత్యవర్ణమునకు లోపము. చూ. చిఱు.)

**చిఱుతనగోడు** (ద్వ.వి.) : (చిఱుత + కోడు) బాలక్రీడా విశేషము.

**చిఱుతనబిల్లలు** (ద్వ.వి.బ.) : (చిఱుత + బిల్లలు) బాలికా క్రీడావిశేషము.

**చిఱుతుక** (వై.విణ.) : (చిఱుత + ఉక) చిన్నవయసుగలది. (ఆఁడుది)

**చిఱుతేఁకు** (ద్వ.వి.) : (చిఱుత+తేఁకు) భార్జి.

**చిఱుదిండి** (ద్వ.వి.) : (చిఱుత+తిండి) భక్ష్యము.

**చిఱుదొడ** (ద్వ.వి.) : (చిఱుత + తొడ) పిక్క జంఘ. (చూ. ఒక్కెఱ)

**చిఱునవ్వు** (ద్వ.వి.) : (చిఱుత + నవ్వు) స్మితము.

**చిఱునాలుక** (ద్వ.వి.) : (చిఱుత + నాలుక) వ్యాధి విశేషము, గళశుండిక.

**చిఱుపాల** (ద్వ.వి.) : (చిఱుత + పాల) క్షీరావి.

**చిఱుపులి** (ద్వ.వి.) : (చిఱుత + పులి) చిత్రకము.

**చిఱుబంతిపసుపు** (వై.వి.) : (చిఱుత + బంతి పసుపు) పూసికొను పసుపు. (ఇది బంతి పసుపని యుండవచ్చునని తోఁచుచున్నదిగాని దొరకిన యీ రెండు ప్రయోగముల యందును చిఱు శబ్ద పూర్వకముగానే కానఁబడుచున్నది.)

**చిఱుబొద్ది** (ద్వ.వి.) : (చిఱుత + బొద్ది) పాఠ.

**చిఱుము** (దే.అ.క్రి.) : విజృంభించు.

**చిఱువడ్లు** (ద్వ.వి.బ.) : (చిఱుత + వడ్లు) ధాన్య విశేషము, అణువు.

**చిఱువాలు** (వై.వి.) : (చిఱుత + పాలు) ఇవురఁ గాఁచిన పాలు, ఆనవాలు.

**చిఱువేరు** (ద్వ.వి.) : (చిఱుత + వేరు) ఎఱ్ఱచాయ వేయుటకు ఉపయుక్త మయిన యొకానొక వేరు.

**చిఱుసెనగలు** (ద్వ.వి.బ.) : (చిఱుత + సెనగలు) చిన్నజాతి సెనగలు, మసూరము.

**చిల్టి** (దే.వి.) : 1. కోపము; 2. చింపిటి. (చిల్టితల.)

**చిల్టిచిల్టి** (దే.వి.) : సంభ్రమము.

**చిల్టిలువొడుచు** (దే.అ.క్రి.) : (చిల్టిలు + పొడుచు) సంభ్రమించు.

**చిల్టీ** (వై.వి.) : ఒక దినుసు కూరాకు, తండులీయము.

**చిల్టీపట్టె** (ద్వ.వి.) : బాలక్రీడా విశేషము.

**చిల్టు** (దే.వి.) : కోపము.

**చిల్టుద్ది** (ద్వ.వి.) : (చిఱుత + ఉద్ది) చిన్నయుద్ధి.

**చిల్టుమను** (దే.అ.క్రి.) : (చిల్టు + అను) 1. కోపించు; 2. బుసకొట్టు.

**చిల్టుముల్టాడు** (దే.అ.క్రి.) : (చిల్టుముల్టు + ఆడు) పెనఁగులాడు. –స.క్రి. భేదించు.

**చిలచిల** (దే.వి.) : వట్టుటయందగుననుకరణము.

**చిలవ** (దే.వి.) : నీరుకోడి.

**చిలికించు** (దే.స.క్రి.) : చల్లు.

**చిలిచిమము** (సం.వి.అ.పుం.) : కిక్కస కసవు నందుండెడి తేలువంటి చేఁప, తేలు మీను.

**చిలిపి** (దే.విణ.) : 1. అల్పము; 2. నికృష్టము. (చిడిపి యొక్క రూపాంతరము.)

**చిలిమిడి** (దే.వి.) : అక్షోళము.

**చిలివిలిపోవు** (దే.అ.క్రి.) : (చిలివిలి + పోవు) సందడించు.

**చిలుక** (వై.వి.) : శుకము. (చూ. తేఁటి)

**చిలుకకూర** (వై.వి.) : హిలమోచిక.

**చిలుకకొయ్య** (ద్వ.వి.) : వస్త్రములు మొదలైనవి యుంచుటకుఁగాను గోడ యందు కొట్టిన చిలుక వంటి యాకారము గల కొయ్య, నాగదంతకము.

**చిలుకడ** (ద్వ.వి.) : (చిలుకు+కడ) పగ్గము లోనగువాని కొనను వేసెడి కొలికిముడి.

**చిలుకతాళి** (ద్వ.వి.) : మీఁద నిరు ప్రక్కల చిలుక రూపేర్పఱచిన పతకము.

**చిలుకత్తు** (ద్వ.వి.) : (చిలుకు+అత్తు) కవచ విశేషము.

**చిలుకముక్కు** (ద్వ.వి.) : శుకనాస.

**చిలుకయారె** (వై.వి.) : (చిలుక + ఆరె) ఒక దినుసు మాదిగసూది.

**చిలుకరవుతు** (వై.వి.) : మన్మథుడు.

**చిలుకరించు** (దే.స.క్రి.) : చిలికించు. (ఒకానొకఁడు చిలుకరింపు అని కృదంతముగా ప్రయోగించియున్నాఁడు.)

**చిలుకలకొలికి** (ద్వ.వి.) : 1. చిలుక కొలికి వంటి కొలుకులుగల ఆఁడుది; 2. ఆఁడుది.

**చిలుకు** (దే.అ.క్రి.) : 1. చిందు; 2. ప్రసరించు; 3. మీఱు. 1. చల్లు; 2. త్రచ్చు (వి.) : 1. కొలికి; 2. గొండ్లెము; 3. బాణము; 4. బాణము యొక్క యలుఁగు.

**చిలుకుడు** (దే.వి.) : చిలుకుట.

**చిలుగు** (దే.వి.) : దీర్ఘయష్టిక.

**చిలుప** (దే.వి.) : కొంచెముగఁజేరి నిలిచిన నీళ్లు. (ఇది ద్రవవస్తువునకే విశేషణముగాఁ గానఁబడుచున్నది. అప్పుడు చిలుపని అని రూపము.)

**చిలుము** (దే.వి.) : 1. రాగిలోనగు లోహముల యందు గల ముఱికి; 2. విషము.

**చిలుమువాలు** (ద్వ.విణ.) : తులువ, కుత్సితుఁడు.

**చిలువ** (దే.వి.) : (చిలుము + వా) పాము, విషధరము.

**చిలువతాలుపు** (దే.వి.) : శివుఁడు.

**చిలువతిండి** (దే.వి.) : 1. గరుత్మంతుఁడు; 2. నెమలి.

**చిలువతేఁడు** (దే.వి.) : సర్పరాజు, శేషుఁడు.

**చిలువాయనము** (దే.విణ.) : చిల్లర, క్షుద్రము.

**చిలువాలు** (దే.వి.) : (చిఱువాలు యొక్క రూపాంతరము) ఇవురఁ గాఁచిన పాలు, ఆనవాలు.

**చిల్ల** (యు.దే.వి.) : కతకము. (వై.) : శల్యము.

**చిల్లకోల** (ద్వ.వి.) : తోమరము.

**చిల్లగొండి** (దే.విణ.) : కలహకారి.

**చిల్లపెంకు** (దే.వి.) : (చిల్లర + పెంకు) పగిలిన కుండ యొక్క చిన్న పెంకు.

**చిల్లపెంచు** (దే.వి.) : (చిల్లర + పెంచు) పగిలిన కుండయొక్క చిన్న పెంకు.

**చిల్లమడ్డి** (ద్వ.వి.) : అందుగు బంకతోఁ జేసిన ధూపద్రవ్యము.

**చిల్లము** (ఉభ.దే.వి.) : హుక్కాకు నిప్పు పెట్టుకొనెడు పాత్రము. (సం.అ.పుం.) : 1. చీపరపిట్ట; 2. తడికన్ను. (విణ.) : తడికంటిది (రూ. చుల్లము)

**చిల్లర** (దే.వి.) : 1. చింతపండు మిరపకాయలు లోనగు సరుకు; 2. కొంచెపాటి నాణెము. (విణ.) : సామాన్యము. (చిల్లరవేల్పులు)

**చిల్లరకాఁడు** (దే.విణ.) : సామాన్యుఁడు.

**చిల్లాడము** (దే.వి.) : ఆయుధ విశేషము. (రూ. చిల్లాణము)

**చిల్లాభుఁడు** (సం.వి.) : బందిపోటు దొంగ.

**చిల్లి** (ఉభ. దే.వి.) : తూఁటు. (సం.ఈ.స్త్రీ.) : చిట్టికూర.

**చిల్లింగి** (దే.వి.) : మూలిక చేతఁ జేసెడి యుచ్చాటనాది క్రియ, కార్మణము.

**చిల్లు** (దే.వి.) : చిమ్ముటలోనగువాని యందగు ధ్వన్యనుకరణము.

**చిల్లుపొల్లు** (దే.వి.) : సంక్షోభము. (చూ. చిరాకు)

**చిల్లులువోవు** (దే.అ.క్రి.) : (చిల్లులు + పోవు) తూంట్లుపడు.

**చిల్లోటి** (దే.వి.) : ఒక దినుసు డాలువాఱు.

**చివఁగి** (దే.వి.) : చివ్వఁగి యొక్క రూపాంతరము. (చూ. చివ్వఁగి)

**చివక** (దే.వి.) : సన్నని చిన్న నిడుపాటి కొమ్మ.

**చివచివ** (దే.వి.) : గమనాదుల యందగు ననుకరణము.

**చివర** (దే.వి.) : కొన, అగ్రము.

**చివికివెలమ** (దే.వి.) : కాకజంఘ చెట్టు.

**చివుక** (దే.వి.) : కాలురూపాయ.

**చివుకపిట్ట** (వై.వి.) : ఒక దినుసు గబ్బిలము, జతుక.

**చివుకపిల్లి** (వై.వి.) : ఒక దినుసు మార్జాలము.

**చివుకు** (దే.అ.క్రి.) : 1. తడియుటచే సార హీనమగు చుక్కానుబిగువు; 2. సారహీనమగు. (వి.) : ఎగయుట లోనగువాని యందగు ననుకరణము. (చివుక్కు యొక్క రూపాంతరము.) (విణ.) : సారములేనిది.

**చివుక్కు**(దే.వి.) : దాఁటుటలోనగువాని యందగు ననుకరణము.

**చివుక్కురుమను** (దే.అ.క్రి.) : (చివుక్కురు + అను) (తన్నెవరేని యొక మాట చెప్పినను మర్మము బయలు పడినను) మనసు కలఁగు. (మర్మము బయలు పడెనని మనసు కలఁగుటకు. చూ. చెయువు.)

**చివురు** (దే.వి.) : చిగురు యొక్క రూపాంతరము.

**చివ్వ** (దే.వి.) : 1. కలహము; 2. సన్నని చిన్న నిడుపాటి కొమ్మ.

**చివ్వఁగి** (దే.వి.) : సివంగి. (తఱచుగా వ్రాఁత ప్రతుల యందు ఇట్లు పరుషాదిగానే కానఁ బడుచున్నది.)

**చివ్వలాఁడి** (దే.విణ.) : (చివ్వలు + ఆఁడి) కలహశీలురాలు.

**చివ్వు** (దే.స.క్రి.) : చెక్కు.

**చివ్వున** (దే.ద్ర.క్రి.విణ.) : శీఘ్రముగ.

**చిహ్నము** (సం.వి.అ.న.) : 1. గుఱుతు; 2. టెక్కెము.

## చీ

**చీ** (దే.అవ్య.) : ధిగర్థకము.

**చీఁకటి** (దే.వి.) : (చీఁకు + కట్టు) అంధకారము. (నీవు చీఁకటితో లేచి రమ్ము – ఇక్కడ చీఁకటి తోననఁగా తెల్లగా తెల్లవాఱకముందని యర్థము.)

**చీఁకటిగాము** (ద్వ.వి.) : రాహువు.

**చీఁకటిగొంగ** (దే.వి.) : సూర్యుఁడు.

**చీఁకటిచెట్టు** (దే.వి.) : తమాలము.

**చీఁకటితప్పు** (దే.వి.) : జారత్వము.

**చీఁకటి మొటికిళ్ళు** (దే.వి.బ.) : బాల క్రీడా విశేషము.

**చీఁకటియీఁగ** (దే.వి.) : (చీఁకటి+ఈఁగ) చిన్నదోమ.

**చీఁకిలి** (దే.వి.) : చీఁపురుఁగట్ట, సమ్మార్జని.

**చీఁకు** (దే.స.క్రి.) : 1. చప్పరించు; 2. చుంబించు.

**చీఁకు** (దే.వి.) : గ్రుడ్డితనము, అంధత్వము. (ఈ యర్థమునందిట్లు దీనిని సబిందుకముగాఁ జెప్పుట చీఁకటి శబ్దమునకు వ్యుత్పత్తిని కల్పించుటకు అనుకూలముగా నున్నది. ఇట్లు చెప్పుటచే ప్రయోగములకు విరోధము కనఁ బడదు.) (విణ.) : అంధుఁడు. (ఇట్లు చీఁకు కొక్కెర, చీఁకురించు, చీఁకువాలు అను నీ పదములను సబిందువులుగా గ్రహించవలెను.)

**చీఁద** (వై.వి.) : చిందపక్షి.

**చీఁదఱ** (యు.దే.వి.) : ఉపద్రవము.

**చీఁదఱగొను** (యు.దే.అ.క్రి.) : (చీఁదఱ + కొను) 1. ఉపద్రవపడు; 2. ఆవేశమెత్తు;

**చీఁదఱరేఁగు** (దే.అ.క్రి.) : ఆవేశమెత్తు.

**చీఁదఱలువోవు** (ద్వ.అ.క్రి.) : (చీఁదఱలు + పోవు) తూఁటువోవు.

**చీఁదు** (దే.స.క్రి.) : (చీమిడి బయలు పుచ్చుచు బుఱ్ఱని ఊపిరివెలికిరా) మొదటి రెండు వ్రేళ్ళతో ముక్కునదుము.

**చీఁపురు** (దే.వి.) : చీఁపురుగట్ట, సమ్మార్జని.

**చీకాకు** (దే.వి.) : (చీకు + ఆకు) 1. చివికిన ఆకు; 2. శ్రమము, నఁలకువ.

**చీకాకుపడు** (ద్వ.అ.క్రి.) : 1. బలహీనమగు; 2. శ్రమపడు.

**చీకిరేను** (దే.వి.) : ఒకానొక చెట్టు.

**చీకిలించు** (దే.అ.క్రి.) : మిఱుమిట్లు గొను.

**చీకిలిమాకిలి** (దే.విణ.) : కొక్కిరిబిక్కిరి.

**చీకు** (దే.విశే.) : 1. అంధము, అంధుఁడు; 2. నిస్సారము. (ఈ యర్థమునందిది చివుకు యొక్క రూపాంతరము.)

**చీకుకొక్కెర** (ద్వ.వి.) : కోయష్టికము.

**చీకురించు** (దే.అ.క్రి.) : అందమగు.

**చీకురువాయి** (దే.వి.) : ఒక దినుసు గబ్బిలము, జతుక.

**చీకువాలు** (దే.వి.) : చీఁకటి.

**చీకొట్టు** (దే.స.క్రి.) : చీచీయను, ధిక్కరించు.

**చీటకము** (వై.వి.) : చిట్టకము యొక్క రూపాంతరము.

**చీటి** (దే.వి.) : ఖండపత్రిక.

**చీటికిమాటికి** (దే.ద్ర.) : మాటిమాటికి.

**చీడ** (దే.వి.) : సస్యాదులను చెఱిచెడి యొకానొక పురుగు.

**చీడు** (దే.వి.) : పుంజము తక్కువయగు వార. (వార = ఎనిమిది పుంజముల నూలు)

**చీడుదబ్బ** (దే.వి.) : నూలిచీడు తగిలించుటకు వెదురు బ్రద్దలతో గుమ్మటము వలెఁ గట్టఁబడిన సాలెవాని సాధనము. (చూ. ఊడిత)

**చీనము** (సం.వి.అ.న.) : బంగారు (పుం.) : 1. ముప్పది యంగుళముల పొడవు గలిగి గువ్వవన్నె గలిగిన జింక; 2. ధాన్య విశేషము; 3. నూలు; 4. వస్త్ర విశేషము; 5. గుఱ్ఱపు పల్లమునకు క్రింద వేసెడు మెత్త. (అని యొకఁడు.) 6. ఒకానొక దేశము.

**చీపర** (దే.వి.) : పక్షివిశేషము, ఆతాయి.

**చీపు** (దే.వి.) : అరఁటిగెలయందలి యొక భాగము.

**చీమ** (దే.వి.) : పిపీలిక.

**చీమిడి** (దే.వి.) : నాసామలము, శింఘాణము.

**చీము** (దే.వి.) : చెడితెల్లనైన నెత్తురు, పూయము.

**చీముంత** (దే.వి.) : చెంబు.

**చీర** (వై.వి. ) : వస్త్రము. (ఇది వాడుక యందే స్త్రీ వస్త్రమాత్ర పర్యాయముగా కానఁ బడుచున్నది.)

**చీరచింపు** (ద్వ.వి.) : మత్స్యవిశేషము.

**చీరణము** (దే.వి.) : చిన్న యులి.

**చీరపిట్ట** (వై.వి.) : చీరపేను.

**చీరపేను** (ద్వ.వి.) : గుడ్డనంటుకొని యుండు తెల్లని పేను, ధేనుకము.

**చీరపోతు** (ద్వ.వి.) : గుడ్డనంటుకొని యుండు తెల్లని పేను, ధేనుకము.

**చీరము** (సం.వి.అ.న.) : 1. కౌపీనము; నారచీర. (అనికొందరు) వస్త్రవిశేషము (అని కొందఱు) 2. రేఖ; 3. జిలుగు వ్రాఁత; 4. నలువదిపూసల గ్రుచ్చిన సరము.

**చీరి** (ఉభ. దే.వి.) : లక్ష్యము. (షష్ఠ్యంత ముగా నేయిది ప్రయోగములందుఁ గానఁబడుచున్నది.) (సం.ఈ. స్త్రీ.) : ఈలపురుగు.

**చీరిక** (దే.వి.) : చీలిక.

**చీరు** (దే.స.క్రి.) : 1. చీలుచు; 2. పిలుచు.

**చీరుక** (సం.వి.) : ఈలపురుగు, ఝిల్లి.

**చీరుడు** (దే.వి.) : 1. చీల్చుట; 2. పిలుపు.

**చీర్ణము** (దే.వి.) : చీరణము యొక్క రూపాంతరము.

**చీఱు** (దే.స.క్రి.) : 1. గీఱు 2. చీల్చు. (ఇట్లు అలఘురేఫముగా ఒకానొకఁడు వ్రాసి యున్నాఁడు గాని దానికి ప్రయోగము దొరకినది కాదు.)

**చీఱుడు** (దే.వి.) : పీల్చుట, విదారణము.

**చీల** (దే.వి.) : మేకు, కీలము.

**చీలమండ** (దే.వి.) : కాలిమడమల కిరుప్రక్కల నుండు కీలు, గుల్ఫము.

**చీలి** (దే.వి.) : పిల్లి, మార్జాలము.

**చీలిక** (దే.వి.) : పాయ, బ్రద్ద.

**చీలు** (దే.అ.క్రి.) : విదారితమగు.

**చీలుచు** (దే.ప్రే.) : చీలఁజేయు, విదారించు (రూ. చీల్చు)

**చీవరము** (సం.వి.అ.న.) : భిక్షుకుని వస్త్రము.

**చీవాట్లు** (దే.వి.బ.) : గద్దింపుమాటలు.

## చు

**చుంబకము** (సం.వి.అ.పుం.): 1. త్రాసు ముల్లు; 2. సూదంటుఱాయి.

**చుంబకుఁడు** (సం.వి.అ.పుం.) : 1. పెక్కు గ్రంథముల యందు ఇంచుకించుక చదివిన వాఁడు; 2. ముద్దు పెట్టుకొను వాఁడు; 3. మోసకాఁడు.

**చుంబనము** (సం.వి.అ.న.) : ముద్దు.

**చుంబించే** (సం.స.క్రి.) : ముద్దుపెట్టుకొను.

**చుక్రము** (సం.వి.అ.న.) : చింతపండు (పుం.): 1. పులుసు; 2. పుల్లప్రబ్బ.

**చుక్రిక** (సం.వి.ఆ.స్త్రీ.) : పులిచింత.

**చుచుందరి** (సం.వి.ఈ.స్త్రీ.) : చుంచెలుక. (రూ. చుందరి)

**చుబుకము** (సం.వి.అ.న.): చిబుకము, గడ్డము.

**చులుకము** (సం.వి.అ.పుం.) : 1. చేర; 2. పుడిసిలి; 3. ముంత; 4. చిఱుతపులి.

**చుల్లి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. ప్రొయ్యి; 2. సొద.

## చూ

**చూచుకము** (సం.వి.అ.పుం, న.) : స్తనాగ్రము, అంచు.

**చూడ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. నెమలిజుట్టు; 2. జుట్టు; 3. చూరు; 4. బాహుపురి.

**చూడామణి** (సం.వి. ఇ.పుం.): 1. అలంకారార్థము తల యందుంచు కొనెడు రత్నము; 2. గురిగింజ.

**చూడాల** (సం.వి.ఆ.స్త్రీ.) : వట్రువముస్తె.

**చూడాలుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) జుట్టు గలవాఁడు.

**చూతము** (సం.వి.అ.పుం.): ఆమ్రము, మామిడి.

**చూర్ణకము** (సం.వి.అ.పుం.) : పేలపిండి.

**చూర్ణకుంతలము** (సం.వి.అ.పుం.) : అలకము, నెఱికురులు.

**చూర్ణము** (సం.వి.అ.న.) : గందవొడి. (పుం,న.) : సున్నము. (పుం.) : 1. దుమ్ము; 2. పొడి.

**చూర్ణిక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. గద్య భేదము; 2. గ్రంథ భేదము.

**చూలిక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.పిల్లజుట్టు; 2. ఏనుఁగు చెవి మొదలు; 3. నాటకాంగము.

**చూష** (సం.వి.ఆ.స్త్రీ.) : ఏనుఁగు నడు మునఁ గట్టెడు తోలుమోకు, దూష్య.

**చూషకము** (సం.వి.అ.పుం.) : సరిగాలి.

**చూషణము** (సం.వి.అ.న.) : పీల్చుట.

## చె

**చె** (దే.విణ.) : వృత్తియందు చెన్ను శబ్దమునకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. (దీనికి పరుషము పరమగునపుడు సుమాగమము. ఉదా: చెంగావి. మొ.)

**చెంక** (దే.వి.) : చెంప, కపోలము.

**చెంగఁగొట్టు** (దే.స.క్రి.) : (చెంగట+కొట్టు) ఓడించు.

**చెంగనాలు** (దే.వి.బ.) : 1. గంతులు; 2. నమస్కృతి.

**చెంగలి** (దే.వి. విణ.) : సమీపము, కుఱంగలి.

**చెంగలించే** (దె.అ.క్రి.) : 1. అతిశయించు; 2. ప్రకాశించు; 3. విజృంభించు; 4. హసించు.

**చెంగలింపు** (దే.వి.) : చెంగలించుట. (ఇట్లు కృదంతముగా నొకానొకఁడు ప్రయోగించినాఁడు. (చూ. ఆరగింపు.)

**చెంగలువ** (ద్వ.వి.) : (చెన్ను + కలువ) 1. ఎఱ్ఱ కలువ, హల్లకము; 2. ప్రియముచే కుక్కకు ఇయ్యఁబడిన పేరు. (చూ. గబ్బి)

**చెంగల్వకోష్టు** (వై.గ్రా.వి.) : పారిభావ్యము.

**చెలగావి** (దే.వి.) : (చెన్ను + కావి) మనోజ్ఞమైన యెఱుపు (అనఁగా) ఎఱ్ఱ దాళువర్ణము (చెంగావి చీర. మొ.)

**చెంగు** (దే.అ.క్రి.) : 1. తొలఁగు; 2. వెనుదీయు. 1. చెఱఁగు; 2. వాద్య విశేషము.

**చెంచెత** (వై.వి.) : శబరకాంత. (చూ. చెంచు)

**చెంచేడము** (దే.వి.) : శ్యేనవిశేషము.

**చెంచేలి** (దే.వి.) : ఒక దినుసు కూరాకు, కుణుంజము.

**చెంచు** (వై.వి.) : శబరుఁడు.

**చెండాడు** (దే.స.క్రి.) : (చెండి+ఆడు) ఖండించు.

**చెండు** (దే.స.క్రి.) : ఖండించు. (వి.) : 1.కందుకము; 2. పూబంతి; 3. బాల క్రీడా విశేషము. (చూ. ఉవ్వలపోటీ)

**చెండుదానిమ్మ** (ద్వ.వి.) : కాయలు లేక పూవులు మాత్రము చెండువలెఁ బూచెడి యొక దినుసు దానిమ్మ.

**చెండుబెండాడు** (దే.స.క్రి.) : (చెండు బెండు + ఆడు) ఖండించు. (ఒకానొక కవి చెండు బెండొనరించియని ప్రయోగించి యున్నాఁడు.)

**చెంత** (దే.వి.) : చేరువ, సమీపము.

**చెందమ్మి** (దే.వి.) : (చెన్ను + తమ్మి) ఎఱ్ఱ తామర, కోకనదము.

**చెందిరము** (వై.వి.) : కుంకుమము, సిందూరము.

**చెందిరిక** (యు.దే.వి.) : కమ్మపై దుద్దు. 1.కుసుంభ పుష్పము; 2. కుసుంభ వర్ణము.

**చెందు** (దే.అ.క్రి.) : కలుగు.

**చెందుప్ప** (ద్వ.వి.) : (చెందు+ఉప్పు) ఇందుప్పు, సైంధవము.

**చెందొవ** (దే.వి.) : (చెన్ను + తొవ) ఎఱ్ఱగలువ, హల్లకము.

**చెంద్రము** (వై.వి.) : సిందూరము.

**చెంద్రవంకలు** (వై.వి.బ.) : ధాన్య విశేషము.

**చెంద్రిక** (యు.) : చెందిరిక యొక్క రూపాంతరము.

**చెంప**(దే.వి.) : 1.కపోలము; 2. పార్శ్వము.

**చెంపకల్లీ** (దే.వి.) : స్త్రీ భూషావిశేషము.

**చెంపకాయ** (దే.వి.) : చెంపదెబ్బ.

**చెంపకొప్పు** (దే.వి.) : ప్రక్కకొఱగించి వేసిన కొప్పు.

**చెంపసరులు** (ద్వ.వి.బ.) : స్త్రీ భూషా విశేషము.

**చెంబు** (వై.వి.) : రాగి మొదలయిన వానితోఁ జేసిన చిన్న నోరుగల స్వల్ప పాత్రము.

**చెంబుతల** (ద్వ.వి.) : బట్టిగట్టినతల.

**చెకడా** (వై.వి.) : సరకులుతెచ్చెడు రెండెద్దుల బండి.

**చెకపికలాడు** (దే.స.క్రి.) : తొందరపెట్టు.

**చెకము** (దే.వి.) : వస్త్రము మొదటిబద్దె.

**చెకుముకి** (దే.వి.) : నిప్పు కలుగుటకై యొక దినుసు ఱాతితో దాకించెడి యుక్కు తునక.

**చెక్క** (వై.వి.) : మ్రానిలోనగువాని పలుచని ఖండము.

**చెక్కకొఱుజే** (ద్వ.వి.) : చెక్రపిడుఁజు.

**చెక్కచెట్టు** (ద్వ.వి.) : ఎఱ్ఱచాయ వేయుట కుపయోగించెడు చెక్కగల యొక దినుసు చెట్టు.

**చెక్కడము** (దే.వి.) : (రత్నములను) పొదుఁగుట.

**చెక్కతాపి** (వై.వి.) : బేలుదారిగోడ మొదలగు వానిమీఁద పూసిన గారను జూచి మట్ట పఱచెడు వీఁపున పిడి యమర్చిన గుండ్రనిడుపు జేనెఁడు చిన్నపలక.

**చెక్కపిడుఁజే** (ద్వ.వి.) : పశువుల మేనిరక్తముఁ బీల్చెడి యొక దినుసు పిడుఁజు.

**చెక్కియము** (దే.వి.) : చెక్కెము.

**చెక్కిలి** (దే.వి.) : చెక్కు, కపోలము.

**చెక్కు**(యు.దే.స.క్రి.) : (రత్నములను) పొదుఁగు. (వి.) : 1. చెక్కడము; 2. చెక్కిలి; (వై.స.క్రి.) : చెక్కలు చేయు.

**చెక్కు** (అం.వి.) : హుండీ.

**చెక్కుడుపాఱ** (ద్వ.వి.) : గడ్డి చెక్కెడుపాఱ.

**చెక్కెము** (దే.వి.) : ఎముకలయందుండు నెయ్యి. (చెక్కియము యొక్క రూపాంతరము)

**చెచ్చెర** (దే.(ద్ర.క్రి.విణ.) : శీఘ్రముగ.

**చెట్ట** (వై.వి.) : 1. కీడు; 2. చేయి.

**చెట్టవట్టు** (ద్వ.స.క్రి.) : (చెట్ట+పట్టు) పెండ్లి యాడు. (వి.) : పెండ్లి.

**చెట్టు** (దే.వి.) : 1. గుల్మము; 2. వృక్షము.

**చెట్టుద్రిమ్మరి** (దే.వి.) : (చెట్టు + త్రిమ్మరి) వానరము, వృక్షచరము.

**చెట్టుగట్టు** (దే.అ.క్రి.) : (చెట్టు + కట్టు) చెట్టుగా నేర్పడు.

**చెట్టునట్టు** (దే.వి.) : వానరము.

**చెట్టుప** (దే.వి.) : ఱెక్క.

**చెట్టుపడు** (ద్వ.అ.క్రి.) : స్తంభించు.

**చెడగరము** (దే.విణ.) : క్రూరము, క్రూరుడు.

**చెడనాడు** (దే.స.క్రి.) : (చెడన్+ఆడు) నిందించు.

**చెడిప** (దే.వి.) : (చెడిన + అప) ఱంకుటాలు. అసతి.

**చెడు** (దే.అ.క్రి.) : 1. కనఁబడకపోవు; 2. కొల్ల పోవు; 3. నశించు.

**చెడుగఁడు** (దే.వి.) : (చెడుగు+అఁడు) క్రూరుఁడు.

**చెడుగు** (దే.వి.) : అశుభకార్యము. (వీఁడు మంచి చెడుగులకు ఒదవు వాఁడు.) (విణ.) : 1. క్రూరము; 2. దుష్టురాలు.

**చెడ్డ** (వై.వి.) : కీడు. (మంచిచెడ్డలు) (విణ.) : దుష్టము. (చెడ్డపని)

**చెడ్డి** (దే.వి.) : మోఁకాలి వఱకు దొడిగికొను గుడిగి.

**చెడ్డు** (దే.స.క్రి.) : తొడచఱచు.

**చెత్త** (దే.వి.) : తృణము.

**చెదరఁబడు** (ద్వ.అ.క్రి.) : (చెదరన్ + పడు) చెదరు.

**చెదరు** (దే.అ.క్రి.) : నీళ్లబొట్టు లోనగునవి యెగిరి పడు. (వి.) : 1. చెదరుట; 2. కలఁత. (ఇది యొకా నొకచో నుకార మధ్యమముగాఁ గానఁ బడుచున్నది. చూ. అదురు.)

**చెదలు** (వై.వి.) : పుట్టపెట్టు చీమ.

**చెదవట్టు** (ద్వ.అ.క్రి.) : (చెదలు + పట్టు) చెదలుపట్టు.

**చెదారము** (దే.వి.) : తృణలేశము.

**చెనఁగి** (దే.వి.) : చెన్నఁగి యొక్క రూపాంతరము. (ధాన్య విశేషమునకు.)

**చెనఁటి** (దే.విణ.) : 1. కుత్సితము; 2. వ్యర్థము; 3. శూన్యము.

**చెనకు** (దే.స.క్రి.) : 1. ఎదిరించు; (వి.) : 1. ఎదిరించుట; (చెనకుఁ జేకొని మాయ ఘటింపఁగ నిదియను రూపం బైన వేళయని యన్వయము. చెనకుఁ జేకొని = ఎదిరించియని యర్థము.) 3. (గోటి) నొక్కు.

**చెనయు** (దే.స.క్రి.) : 1. ఎదిరించు; 2. తాఁకు; 3. సోలు.

**చెనుపరి** (దే.విణ.) : గ్రామ్యము (మాట).

**చెన్నఁగి** (దే.వి.) : 1. పొట్టి టెంకాయ చెట్టు, అఖండుకము; 2. (బ.) : ధాన్య విశేషము.

**చెన్నఁటి** (దే.విణ.) : చెనఁటి యొక్క రూపాం తరము.

**చెన్నఁటివోవు** (దే.అ.క్రి.) : (చెన్నఁటి + పోవు) వ్యర్థమగు.

**చెన్నచెర్ల** (దే.వి.) : లాంగరి.

**చెన్నచెఱకు** (దే.వి.) : అగ్నిశిఖ.

**చెన్ను** (దే.వి.) : 1. అందము; 2. విధము. (వృత్తియందు దీనికి ఎఱుపు అర్థము. చూ.చె.)

**చెన్నుఁడు** (దే.విణ.) : అందకాఁడు.

**చెప్పు** (దే.స.క్రి.) : వచించు. (దీనికిఁ బ్రార్థ నాద్యర్థమునందు ద్విత్వము వికల్పముగ లోపించును. చెపుము, చెపుఁడు లోనగునవి.) (వి.) : పాదరక్ష.

**చెప్పుడుమాట** (దే.వి.) : ఒకరు చెప్పునట్టి మాట.

**చెప్పుతట్ట** (దే.వి.) : గోధాపది.

**చెమట** (దే.వి.) : స్వేదము.

**చెమటకాయ** (దే.వి.) : ఎండవేఁడిమి చేత దేహమునందుఁగలిగెడు చిన్న గుల్ల.

**చెమటగొట్టు** (దే.విణ.) : చెమట పట్టిన వాఁడు.

**చెమటపట్టు** (దే.అ.క్రి.) : చెమట పోయు.

**చెమటపోయు** (దే.అ.క్రి.) : చెమట గలదియగు.

**చెమరించు** (దే.అ.క్రి.) : చెమటపోయు.

**చెమరు** (దే.వి.) : 1. చెమట; 2. చెమరుఁగాకి.

**చెమరుఁబోతు** (దే.విణ.) : మిక్కిలి చెమట గలవాఁడు.

**జాల** (వై.వి.) : 1. చేఁపలనుబట్టువల; 2. కిటికి (చూ. జాలకట్టు)

**జాలకడ్డి** (ద్వ.వి.) : నల్లఱాతి యందు బెజ్జము లేర్పరిచి యుంచిన కిటికి.

**జాలకాఁడు** (యు.దే.విణ. ) : (జాలము + కాఁడు) ఆలస్యము చేయువాఁడు. (వై.వి.) : చేఁపలఁ బట్టువాఁడు.

**జాలము** (దే.వి.) : జాగు, ఆలస్యము.

**జాలరి** (దే.వి.) : (జాల + అరి) చేఁపల బట్టువాఁడు, ధీవరుఁడు. (దీనికి జలగడుగు వాఁడును అర్థమని కొందఱు చెప్పెదరు.)

**జాలరు** (వై.వి.) : గొడుగులోనగువాని కొసనుచుట్టు వ్రేలెడు జల్లిలోనగునది.

**జాలవల్లిక** (ద్వ.) : (జాల + పల్లిక) చిత్రపుపని చేసిన తములపాకుల తట్ట.

**జాలారి** (దే.వి.) : హింస్ర.

**జాలి** (దే.వి.) : 1. మనఃఖేదము; 2. ఖేదము; 3. విచారము.

**జాలిఁబడు** (ద్వ.అ.క్రి.) : (జాలి+పడు) 1. దుఃఖ పడు; 2. విచారపడు. (చూ. జాలిఁబెట్టు.)

**జాలిఁబెట్టు** (దే.స.క్రి.) : (జాలి+పెట్టు) దుఃఖపెట్టు.

**జాలిగొను** (దే.అ.క్రి.) : (జాలి+కొను) (చూ. జాలిఁబడు.)

**జాలియ** (దే.వి.) : 1.జాలెదేగ; (చూ. అఱుజు. 2. జాలెసంచి; 3.బొంగరపు త్రాడు. (చూ. జాలె.)

**జాలియము** (దే.వి.) : జాలెసంచి. (చూ. జాలెము.)

**జాలీ** (దే.వి.) : గొడుగులోనగువాని కొనను వ్రేలెడు జాలరు.

**జాలు** (వై.వి.) : 1. ఏఱు; 2. అల్ప ప్రవాహము. (చూ. చిమ్మ.)

**జాలుకొను** (ద్వ.అ.క్రి.) : ప్రవహించు.

**జాలువా** (దే.వి.) : జాళువా యొక్క రూపాంతరము.

**జాలువాఱు** (ద్వ.అ.క్రి.) : (జాలు+పాఱు) ప్రవహించు.

**జాలువు** (వై.వి.) : జాలు యొక్క రూపాంతరము.

**జాలె** (దే.వి.) : 1. ఒక జాతి దేగ; 2. వరాలు పోసెడి యొక దినుసు సంచి; 3. బొమ్మరపు త్రాడు. (జాలియ యొక్క రూపాంతరము.)

**జాలెత్రాడు** (దే.వి.) : జెట్టి యొక్క యుపకరణ విశేషము.

**జాలెము** (దే.వి.) : జాలియము యొక్క రూపాంతరము.

**జావ** (వై.వి.) : నూకలు లోనగువానిఁ జేర్చి పలుచగాఁగాఁచిన గంజి.

**జావడము** (దే.వి.) : 1. అపౌరుషము; 2. పిఱికి తనము; 3. గుఱ్ఱపుతట్టు; 4. ఒకజాతిదేగ.

**జావడి** (దే.వి.) : (జావడము + ఇ) చాకలవాఁడు.

**జావళము** (దే.వి.) : గుఱ్ఱపుతట్టు. (జావడము యొక్క రూపాంతరము.)

**జావళి** (దే.వి.) : గీత విశేషము.

**జావాహిరి** (దే.వి.) : రత్నపుసొమ్ము. (రూ. జావాహిరి.)

**జాళించు** (దే.స.క్రి.) : జాడించు యొక్క రూపాంతరము.

**జాళియ** దే.వి. (చూ.) జాళెము. (చూ. జాళె)

**జాళియము** (దే.వి.) : (చూ.) జాళెము.

**జాళువా** (దే.వి.) : అపరంజి.

**జాళె** (దే.వి.) : జాళియ యొక్క రూపాంతరము. (చూ. జాళెము.)

**జాళెము** (దే.వి.) : అశ్వగతి విశేషము (చూ.) రేచితము.

**జాళ్వా** (దే.వి.) : జాళువా యొక్క రూపాంతరము.

## జు

**జుం** (దే.వి.) : 1. తావి వీచుట మొదలగు వాని యందగు ధ్వన్యనుకరణము; 2. తుమ్మెదలు లోనగునవి మ్రోయుట యందగు ధ్వన్యను కరణము. (ఈ యర్థము నందు ఆమ్రేడితమున జుం జుం. (అను శబ్దము పరమైనప్పుడు

జుం శబ్దము యొక్క అనుస్వారమునకు మకారా దేశము వచ్చెడి.)

**జోంజము** (దే.వి.) : దీపావళి పండుగ నాటి రాత్రి బాలురు కాల్చి త్రిప్పెడు తెల్లువిడవలి లోనగువాని నిడుపాటి సన్నకట్ట, పంజు, దివ్వటీ. (అని కొందఱు.)

**జోంజాము** (దే.వి.) : జుంజము యొక్క రూపాంతరము.

**జోంజోఱు** (దే.వి.) : 1.చింపిఱి; 2.జుంజుఱుకట్ట.

**జోంజోఱుకట్ట** (దే.వి.) : వెలుతురు పుల్లలులోనగు వానితో నేర్పఱచిన దివటీ.

**జోంటితేనె** (దే.వి.) : (జున్ను + తేనె) జుంటీఁగలు కూర్చిన తేనె, క్షౌద్రము.

**జోంటీఁగ** (దే.వి.) : (జున్ను + ఈఁగ) తేనెటీఁగ, సరఘ.

**జోజుఱు** (దే.వి.) : గుబురు. (చూ. జుజుఱుకొను.)

**జోజోఱుకొను** (దే.అ.క్రి.) : గుబురుకొను.

**జోట్టనవ్రేలు** (దే.వి.) : తర్జని.

**జోట్టవ్రేలు** (దే.వి.) : (జుట్టన + వ్రేలు) తర్జని.

**జోట్టిలి** (దే.వి.) : చాఁపఁబడిన బొట్టన వ్రేలి చూపుడు వ్రేలి నడిమి కొలఁత, ప్రాదేశము.

**జోట్టు** (వై.వి.) : సిగ, శిఖ.

**జోట్టుఁబులుఁగు** (ద్వ.వి.) : (జుట్టు + పులుఁగు) నెమలి, శిఖావళము. (జుట్టుపిట్ట అనియు.)

**జోట్టుపిట్టతాలుపు** (ద్వ.వి.) : కుమార స్వామి.

**జోట్టుపు** (దే.వి.) : అజశృంగి.

**జోడుఁగు** (దే.అ.క్రి.) : 1. భయాదులచే ఒదుఁగు; 2. డాఁగు; (చూ. జుణుఁగు.) 3. వెనుదీయు.

**జోణుఁగు** (దే.అ.క్రి.) : జుదుఁగుయొక్క రూపాంతరము.

**జోత్త** (దే.వి.) : చాఁపఁబడిన బొటనవ్రేలి ఉంగరపు వ్రేలి నడిమి కొలఁత, గోకర్ణము.

**జోత్తనవ్రేలు** (దే.వి.) : జుట్టనవ్రేలు యొక్క రూపాంతరము.

**జోత్తిలి** (దే.వి.) : జుట్టిలి యొక్క రూపాంతరము.

**జోన్ను** (దే.వి.) : 1. జున్నుఁబాలు; 2. జున్నుగడ్డ; 3. తేనెతెట్టె.

**జోన్నుఁబాలు** (ద్వ.వి.) : (జున్ను + పాలు) ఈనిన అయిుదాఱు దినములలోని పాలు, పియ్యూషము.

**జోన్నుగడ్డ** (ద్వ.వి.) : కాఁగి గడ్డకట్టిన యీనిన అయిదాఱు దినములలోని పాలు.

**జోబ్బ** (వై.వి.) : బాహుపురి. (అప్ర.)

**జోమాయించు** (దే.స.క్రి.) : (వాగెను) ఈడ్చిపట్టు.

**జోమికీలు** (దే.వి.బ.) : 1. స్త్రీ కర్ణభూషా విశేషము; (చూ. గునామొలనూలు.) 2. పుష్ప విశేషము.

**జోమ్మ** (దే.వి.) : పక్షి విశేషము.

**జోమ్మఁడు** (దే.వి.) : విటుఁడు. (చూ. జుమ్మ కాఁడు.)

**జోమ్మకాఁడు** (దే.వి.) : (జుమ్మఁడు + కాఁడు) విటుఁడు.

**జోఱుకు** (దే.వి.) : నెత్తురులోనగునవి లోపలనుండి పైకి వేగమున వచ్చుట యందగు ధ్వన్యను కరణము. (ఆమ్రేడితమునందు జుఱు జుఱుకు.)

**జోఱ్ఱు** (దే.స.క్రి.) : పీల్చు. (వి.) : 1. పీల్చుట; 2. పీల్చుట యందగు ధ్వన్యనుకరణము.

**జోలుము** (దే.వి.) : దుండగము.

**జోల్మాన** (హిం.వి.) : అపరాధము.

**జోవ్వ** (దే.వి.) : ఉచ్చు. (అప్ర.)

**జోవ్వరించు** (దే.అ.క్రి.) : విజృంభించు.

**జోవ్వి** (దే.వి.) : ప్లక్షము.

**జోవ్విదీవి** (ద్వ.వి.) : ప్లక్షద్వీపము.

**జోవ్వు** (దే.వి.) : 1. వైచుటయందగు ధ్వన్యనుకరణము. 2. ఇంకుటయందగు ధ్వన్యనుకరణము.

## జూో

**జూోఁక** (దే.వి.) : తత్తఱపాటు.

**జూోఁకించు** (దే.అ.క్రి.) : తత్తఱపడు.

**జూోజము** (వై.వి.) : 1. జూదము; 2.మోసము. (చూ. జూదకత్తియ, జూదకాఁడు, జూదరి.) (జూదము యొక్క రూపాంతరము.)

**జూజి** (వై.వి.) : దూతిక.

**జూటాడు** (ద్వ.స.క్రి.) : (జూటు + ఆడు) మోసము చేయు.

**జూటు** (వై.వి.) : మోసము.

**జూటుఁదనము** (వై.వి.) : మోసము. (స్వార్థమున తనము.)

**జూదకత్తియ** (వై.విణ.) : (జూదము + కత్తియ) జూదమాడెడి యాఁడుది. (రూ.) జూదకత్తె, జూజకత్తియ.

**జూదకాఁడు** (వై.విణ.) : (జూదము + కాఁడు) జూదమాడెడు వాఁడు. (రూ. జూజకాఁడు.)

**జూదము** (వై.ఎ.) : ద్యూతము.

**జూదరి** (వై.విణ.) : (జూదము + అరి) జూదకాఁడు. (రూ. జూజరి.)

**జూలు** (దే.వి.) : 1. సింహము లోనగు వాని మెడమీఁది వెంట్రుకలు; 2. ఏనుఁగుమీద బఱచెడి యెఱ్ఱ కంబళి.

**జూవరము** (వై.వి.) : సంతాపము.



**జొంపము** (దే.వి.) : 1. ఆకులు కొమ్మలు లోనగువాని గుంపు, గుబురు. 2. రెమ్మ; 3. నిరంతర ధార.

**జొంపు** (దే.వి.) : కొండయందలి యూటనీరు.

**జొగ్గు** (దే.వి.) : భిక్షము. (జోగు యొక్క రూపాంతరము.)

**జొటజొట** (దే.వి.) : వడియుట కురియుట లోనగు వాని యందగు ధ్వన్యనుకరణము. (గ్రంథముల యందు కొన్నియెడల చొటచొట అనియు కానఁబడుచున్నది. ఇట్టిదియని నిర్ధారణ చేయుటకు అనువు పడలేదు.)

**జొత్తిల్లు** (దే.అ.క్రి.) : 1. ఎఱ్ఱపాఱు; 2. రంజిల్లు. (రూ. జొత్తిలు. ఎఱ్ఱ పాఱుటకు.)

**జొత్తు** (దే.వి.) : ఎఱుపు. కృత్రిమ రక్తము. (అని యొకఁడు.)

**జొత్తుపాప** (దే.వి.) : మేననెత్తురు దేఱుచున్న లేఁతబిడ్డ.

**జొన్న** (యు.దే.వి.) : వృక్ష విశేషము. (వై.) 1. సస్య విశేషము; 2. బ. ధాన్య విశేషము.

**జొబ్బిల్లు** (దే.అ.క్రి.) : 1. స్రవించు; 2. నిండారు; 3. ఉప్పతిల్లు. (రూ. జొబ్బిలు స్రవించుటకు.)

**జొట్టీగ** (దే.వి.) : జోటీఁగ యొక్క రూపాంతరము.

**జొల్ల** (దే.వి.) : చిన్నయేఱు.

**జొల్లు** (దే.వి.) : చొంగ, లాల.

**జొహారు** (దే.వి.) : నమస్కారము.

**జొహారువు** (దే.వి.) : నమస్కారము.



**జోక** (దే.వి.) : 1. సామ్యము; 2. బాగు; 3. జత; 4. విధము; 5. ఉత్సాహము; 6. మొత్తము; 7. స్వరూపము; (విణ.) : 1. సమానము; 2. అధీనము; 3. యుక్తము.

**జోకచేయు** (ద్వ.స.క్రి.) : 1. సంపాదించు; 2. సిద్ధపఱచు. (ఇట్లు జోకకావించు.)

**జోకపడు** (ద్వ.అ.క్రి.) : జతపడు. (ప్రే. జోకపఱచు.)

**జోకు** (దే.స.క్రి.) : తిట్టు. (వి.) : తిట్టుట.

**జోకొట్టు** (దే.స.క్రి.) : 1. బిడ్డలు నిద్ర పోవుటకుఁగాను జోజోయని చేత వీఁపున మెల్లగా తట్టు; 2. చఱచు.

**జోగపట్టియ** (వై.వి.) : యోగపట్టము (రూ.) జోగపట్టె.

**జోగము** (వై.వి.) : యోగము.

**జోగి** (యు.దే.వి.) : (జోగు + ఇ) భిక్షుకుఁడు. వై. యోగి.

**జోగిణి** (వై.వి.) : 1. ఒకానొక స్త్రీ దేవత; 2. సోదెకత్తె.

**జోగు** (దే.వి.) : 1. భిక్షము; 2. జనులెక్కి పోయెడియోడ.

**జోగురాలు** (దే.వి.) : (జోగు+ఆలు) భిక్షుకురాలు.

**జోజో** (దే.అవ్య.) : సుఖముగానుండు మనెడు దీవన.

**జోటి** (వై.వి.) : ఆడుది, ఇంతి.

**జోటిక** (వై.వి.) : ఆడుది, ఇంతి. (స్వార్థమున కప్రత్యయము.)

**జోటికత్తియ** (వై.వి.) : చెలికత్తియ. (రూ. జోటికత్తె.)

**జోటిపని** (ద్వ.వి.) : (జోడు + పని) మిథున కృత్యము.

**జోడఁగి** (దే.వి.) : మిక్కిలి వేగముగా పరుగెత్తెడు వేఁటకుక్క.

**జోడగించు** (దే.స.క్రి.) : జోడననడతో నడపించు.

**జోడన** (దే.వి.) : అశ్వగతివిశేషము, (చూ.) ధౌరితకము.

**జోడమ్ము** (వై.వి.) : (జోడు + అమ్ము) చేయమ్ము.

**జోడాలు** (వై.వి.బ.) : నతివిశేషము.

**జోడించు** (వై.స.క్రి.) : జతచేయు, చేర్చు.

**జోడింపు** (వై.వి.) : మల్లబంధ విశేషము. (చూ. ఆరగింపు.)

**జోడు** (యు.దే.వి.) : కవచము. చెప్పులాజిత. (విణ.) : సమానము.

**జోడుకోడియ** (ద్వ.విణ.) : 1. సమానుఁడు, సమానము. 2. జత (రూ. జోడుకోడె.)

**జోడువేల్పులరిక్క** (ద్వ.వి.) : విశాఖ నక్షత్రము.

**జోణఁగి** (దే.వి.) : జోడఁగి యొక్క రూపాంతరము.

**జోత** (దే.వి.) : నమస్కారము. (రూ. జోతము.)

**జోతాము** (దే.వి.) : నమస్కారము. (జోతము యొక్క రూపాంతరము.)

**జోతి** (వై.వి.) : 1. కాంతి; 2. దీపము.

**జోదు** (వై.వి.) : యుద్ధముచేయు బంటు, యోధుఁడు.

**జోనంగి, జోణంగి** (దే.వి.) : ఒక జాతికుక్క.

**జోనడ** (దే.వి.) : జోడన యొక్క రూపాంతరము. (ఇందు వర్ణ వ్యత్యయము.)

**జోబిళ్లు** (దే.వి.) : నమస్కారము. (ఇక్కడ నతి శబ్దమునకు నమ్రత యర్థము.)

**జోరావరి** (దే.వి.) : బలాత్కారము. (ఇది తెనుఁగు దేశముల యందును వాడఁబడుచున్నది.)

**జోరు** (దే.వి.) : 1. కురియుటయందగు ధ్వన్యను కరణము; 2. బలము, బలాత్కారము.

**జోఱీఁగ** (దే.వి.) : (జోఱు + ఈఁగ) ఒక దినుసు ఈఁగ, పశుమక్షిక.

**జోఱు** (దే.వి.) : ధ్వన్యనుకరణము. (చూ. జోఱీఁగ.)

**జోల** (దే.వి.) : బిడ్డల నిద్దురపుచ్చునప్పుడు పాడెడు పాట.

**జోలి** (దే.వి.) : 1.సంగతి, సంబంధము; (నాజోలికి రాకుము. జోలిమాలినపని.) 2. వృత్తాంతము.

**జోలియ** (దే.వి.) : జోలె.

**జోలె** (దే.వి.) : చౌకపుగుడ్డ నాలుగంచులును జత జతగాఁ జేర్చి ముడివేసి కుట్టి చంకను వ్రేలవేసి కొనెడుసంచి. (జోలియ యొక్క రూపాంతరము.)

**జోవ** (దే.వి.) : జోల యొక్క రూపాంతరము.

**జోసి** (వై.వి.) : జోస్యుఁడు.

**జోస్యము** (వై.వి.) : జ్యోతిశ్శాస్త్రము.

**జోస్యుఁడు** (వై.వి.) : జోస్యము నెఱిఁగిన వాడు, జ్యౌతిషికుఁడు.

**జోహారు** (దే.వి.) : జొహారుయొక్క రూపాంతరము.

**జోహారువు** (దే.వి.) : జొహారువు యొక్క రూపాం తరము.

## జౌ

**జౌకు** (దే.అ.క్రి.) : మిక్కిలి మెత్తగిల్లు. (కట్టుకట్టి గడ్డజౌకినది.) (వి.) : బురద. (జవుకు యొక్క రూపాంతరము.)

**జౌజవ్వు** (దే.వి.) : 1. పాఱుట యందగు ధ్వన్యను కరణము. 2. క్రుంగుట యందగు ననుకరణము. (జవ్వుజవ్వు యొక్క రూపాంతరము.)

**జౌరు** (దే.స.క్రి.) : 1. కొట్టు; 2. చేతులతో కుప్ప చేసి యెత్తు. (జవురు యొక్క రూపాం తరము.)

## ఝ

**ఝ** : ఒక యక్షరము.

**ఝుంకరించు** (సం.అ.క్రి.) : ఝుంకారము చేయు.

**ఝుంకారము** (సం.వి.అ.పుం.) : తుమ్మెదరొద.

**ఝుంకృతి** (సం.వి.ఇ.స్త్రీ.) : ఝుంకారము.

**ఝుంఝు** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.వానగాలి; 2.ధ్వని విశేషము.

**ఝుంప** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. జంపె తాళము; 2. దూఁకుడు.

**ఝుకటము** (సం.వి.అ.పుం.) : జగడము.

**ఝుట** (సం.వి.ఆ.స్త్రీ.) : నేలయుసిరిక.

**ఝురము** (సం.వి.అ.పుం.) : సెలయేఱు, నిర్ఝరము. (ఇది ఆకారాంత స్త్రీ లింగమునగును.)

**ఝురసి** సం.వి.ఈ.స్త్రీ.) : చేఁతరాసి.

**ఝురి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. సెలయేఱు, (రూ.) ఝూరి; 2. తేళ్ళపుట్ట.

**ఝుర్ఝరము** (సం.వి.అ.పుం.) : 1. కయిముడియను వాద్య విశేషము; 2. మణిదోష విశేషము; 3. నదవిశేషము; 4. కలియుగము.

**ఝుర్ఝరి** (సం.వి.ఈ.స్త్రీ.) : ఝుర్ఝరము, కయిముడి.

**ఝుల్లరి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1.ఉడుక; పెద్దడోలు వంటి వాద్య విశేషము (అని కొందఱు) 2. జాలరు 3. నీటిసుడి (రూ. ఝూల్లరి)

**ఝుష** (సం.వి.ఆ.స్త్రీ.) : బీఱ. (అ.పుం.ము.) : 1. చేఁప; 2. మొసలి 3. అడవి.

**ఝుషకేతుఁడు** (సం.వి.ఉ.పుం.) : మన్మథుఁడు, మీనుసిడము మేటి.

## ఝూ

**ఝూటము** (సం.వి.అ.పుం.) : 1. సమూహము; 2. కాఱడవి; 3. పొదరిల్లు; 4. చీఁపురుకట్ట.

**ఝూటలము** (సం.వి.అ.పుం.) : మొక్కపు చెట్టు.

**ఝూటలి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. మొక్కపు చెట్టు; 2. పొదరిల్లు.

**ఝూబుకము** (సం.వి.అ.పుం.) : సన్నపు ఆకుల పక్కె.

## ఝి

**ఝింటి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1.నల్లగోరంట; 2.తెల్లగోరంట; 3. ములుగోరంట. (అని కొందఱు.)

**ఝిల్లి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1.ఈలపురుగు; 2.ఈల పురుగుకూఁత; 3.ఎండజిగి; 4.తుడిచెదుగుడ్డ.

**ఝిల్లిక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.ఈలపురుగు; 2.ఈల పురుగుకూఁత; 3.ఎండజిగి; 4.తుడిచెదుగుడ్డ.

## ఝీ

**ఝీరుక** (సం.వి.ఆ.స్త్రీ.) : ఈలపురుగు, ఝిల్లి.

## ట

**ట** : ఒక యక్షరము.

**టంకకము** (సం.వి.అ.పుం.) : వెండినాణెము.

**టంకణము** (సం.వి.అ.న.) : వెలిగారము.

**టంకము** (ఉభ.వై.వి.) : పదియాఱు డబ్బుల బంగారు నాణెము, దీనారము. 1. వెలిగారము; 2.గడ్డపాఱ; 3. నల్లవెలఁగ. (పుం.) 1.కాసె యులి; 2. కత్తి; 3. కత్తియొఱ; 4. కోపము. (ఇది ఆకారాంత స్త్రీ లింగమైనప్పుడు పిక్క అర్థము.)

**టంకరించు** (సం.స.క్రి.టం) : అని నారిని మ్రోయించు.

**టంకవాటు** (ద్వ.వి.) : (టంకము + వాటు) ఒకానొక బంగారు నాణెము.

**టంకసాల** (వై.వి.) : (టంకము + సాల) నాణెములు ముద్రించెడు చోటు.

**టంకసాలవాటు** (ద్వ.వి.) : టంకవాటు.

**టంకారము** (సం.వి.అ.పుం.) : 1. వింటినారి యొక్క ధ్వని; 2. ఆశ్చర్యము; 3. ప్రసిద్ధి.

**టంకు** (దే.విణ.) : 1. నాగరికత కలవాఁడు; 2. డాంబికుఁడు (చూ. సిరంగఁడు.)

**టంకృతి** (సం.వి.ఇ.స్త్రీ.) : వింటినారి యొక్క ధ్వని, టంకారము.

**టంగు** (దే.వి.) : టంగువాఱు.

**టంగువాఱు** (దే.వి.) : గుఱ్ఱముల మీఁది గంత జాఱక బిగఁగట్టెడు వాఱు.

**టకటొంకు** (దే.విణ.) : కుత్సితము. (చూ. సిరంగఁడు.)

**టక్కరి** (వై.విణ.) : (టక్కు + అరి) మోసకాఁడు, మోసకత్తె.

**టక్కరికాఁడు** (వై.విణ.) : మోసకాఁడు.

**టక్కియము** (దే.వి.) : ధ్వజము, టక్కెము. (ఇట్లు కొందఱు వ్రాసియున్నారు. దీనికి తగిన ప్రయోగము కనఁబడలేదు.)

**టక్కు** (వై.వి.) : మోసము.

**టక్కుబాజీతనము** (వై.వి.) : టక్కరితనము.

**టక్కులాఁడి** (ద్వ.విణ.) : (టక్కులు + ఆఁడి) టక్కులు చేయునది. (ఆఁడుది.)

**టక్కులాఁడు** (ద్వ.విణ.) : (టక్కులు + ఆఁడు) టక్కులు చేయువాఁడు.

**టక్కెము** (దే.వి.) : టక్కియము యొక్క రూపాంతరము.

**టపా, టపాలు** (హిం.వి.) : అంచె.

**టపాకాయ** (దే.వి.) : బాణసంచా విశేషము.

**టలాయించు** (దే.క్రి.) : అటునిటు తిరుఁగు. (రూ. తస్సా)

**టస్సా** (హిం.వి.) : రీతి, అచ్చు.

## టా

**టాకనా, టంగనా** (హిం.వి.) : మట్టసపు గుఱ్ఱము.

**టాకు** (దే.వి.) : 1. ఉంగరము మొదలగునది జాతి రాకుండ బంగారు లోనగువానితో చేసి వేసికొనెడు సన్నని సాదా ఉంగరము; 2. ఓర.

**టాటోటు** (దే.వి.) : మోసము, కపటము.

**టాటోటుకాఁడు** (దే.విణ.) : మోసకాఁడు.

**టాపు** (ఆం.వి.) : పైభాగము.

**టాలాటోలితనము** (గ్రా.వి.) : టక్కరితనము.

## టి

**టికము** (వై.వి.) : వెన్నెముక క్రిందిచోటు, ముడ్డిపూస.

**టికెట్టు** (ఆం.వి.) : రైలు అధికారులు ప్రయాణస్థుల కిచ్చు కేవు చీటి.

**టిట్టిభకము** (సం.వి.అ.పుం.) : లకుముకిపిట్ట.

**టిప్పణము** (సం.వి.అ.పుం.) : టీకకు టీక.

**టిట్టి** (దే.వి.) : మోసెడు జంతువు.

## టీ

**టీక** (సం.వి.ఆ.స్త్రీ.) : అర్థవివరణము.

**టీకము** (దే.వి.) : ఒరగల్లు (చూ. ఊఁదుఁగ్రోవి)

**టీకా** (దే.వి.) : 1. ఒక దినుసు పతకము; 2. స్ఫోటకము పొడిపించుట.

**టీకు** (దే.వి.) : నడచుటయందలి నిక్కు.

**టీచరు** (ఆం.వి.) : ఉపాధ్యాయుఁడు.

**టీపు** (దే.వి.) : మంచినడవడికకు పూటగాఁగట్టిన ధనము.

## టూ

**టూకి** (దే.వి.) : సంగ్రహము.

**టూకించు** (దే.స.క్రి.) : సంగ్రహించు.

## టె

**టెంక** (దే.వి.) : 1. ఎండిన మామిడి యూరుగాయలోని విత్తు; 2. మామిడి కాయలోని విత్తు.

**టెంకణము** (దే.వి.) : నమస్కృతి.

**టెంకాయ** (దే.వి.) : (టెంక + కాయ) నారికేళ ఫలము.

**టెంకాయ చెట్టు** (దే.వి.) : నారికేళము.

**టెంకి** (దే.వి.) : 1. స్థానము; 2. తాటాకులకు బెజ్జము వేసెడి సాధనము.

**టెంకియ** (దే.వి.) : టెంకె.

**టెంకె** (దే.వి.) : మాదిగవాఁడు బెజ్జము వేసెడు సూది. (టెంకెయ యొక్క రూపాంతరము.)

**టెక్కి** (దే.వి.) : దాసరికుల్లాయ.

**టెక్కియము** (దే.వి.) : టెక్కెము.

**టెక్కు** (దే.వి.) : యౌవనాదుల వలనఁ గలుగు గర్వచేష్ట.

**టెక్కులాఁడి** (దే.విశే.) : (టెక్కులు + ఆఁడి) టెక్కులు గలది (ఆఁడుది)

**టెక్కులాఁడు** (దే.విశే.) : (టెక్కులు + ఆఁడు) టెక్కులు గలవాఁడు.

**టెక్కువ** (దే.వి.) : టెక్కు.

**టెక్కెపుగాము** (ద్వ.వి.) : (టెక్కెము + గాము) కేతుగ్రహము.

**టెక్కెము** (దే.వి.) : ధ్వజము. (టెక్కియము యొక్క రూపాంతరము.)

**టే**

**టేంకణము** (సం.వి.అ.పుం.) : ఒకానొక దేశము.

**టేఁకి** (దే.వి.) : మత్స్యవిశేషము.

**టేఁకు** (దే.వి.) : తేఁకు, క్రకచపత్రము.

**టేఁకుదీవి** (ద్వ.వి.) : శాకద్వీపము.

**టేపు** (ఆం.వి.) : నాడా.

**టేవు** (దే.వి.) : మండుటయందగు ధ్వన్యను కరణము.

**టై**

**టైము** (ఆం.వి.) : కాలము.

**టైలరు** (ఆం.వి.) : కుట్టుపనివాఁడు, దర్జీ.

**టో**

**టోకు** (దే.వి.): 1. మొత్తము; 2. జెట్టుభుజముతో భుజము తాఁకించుట.

**టోపి** (దే.వి.) : పట్టులోనగవానితో నేర్పఱచిన కిరీటము.

**టోలా** (హిం.వి.) : గుంపు.

**టోలి** (హిం.వి.) : పైసలో ఎనిమిదవ భాగము.

**ఠ**

**ఠ** : ఒక యక్షరము.

**ఠంగుఠింగు** (దే.వి.) : ఆయుధము లొకటితోనొకటి తాఁకునప్పుడు కలిగెడు ధ్వన్యనుకరణము. (చూ. ఖంగుఖింగు.)

**ఠక్కుఁడు** (సం.విశే.) : (అ.ఆ.అ.) మోసకాఁడు.

**ఠక్కురుఁడు** (సం.వి.అ.పుం.) : దేవత, వేలుపు.

**ఠలాయించే** (హిం.క్రి.) : అటునిటు తిఱుఁగు.

**ఠవఠవ** (దే.వి.) : శ్రమము. అడ్డంకి. (అని కొందఱు.)

**ఠవణించు** (దే.ప్రే.) : ఠవణిల్లఁజేయు, కావించు.

**ఠవణిల్లు** (దే.అ.క్రి.) : 1. ప్రవర్తిల్లు; 2. ఒప్పు.

**ఠవర** (దే.విశే.) : నేర్పరి.

**ఠవళి** (దే.వి.) : మోసము, కపటము.

**ఠవళికాఁడు** (దే.విశే.) : మోసకాఁడు.

**ఠవిణ** (దే.వి.) : దవిణ యొక్క రూపాంతరము.

**ఠా**

**ఠాకురు** (వై.వి.గ్రా.) : 1. దేవత; 2. అధిపతి; 3. తండ్రి; 4. గురువు; (ఇది వాడుక లోనిది.)

**ఠాణా** (హిం.వి.) : కావలిదండు, కావలి స్థలము.

**ఠాయము** (వై.వి.గ్రా.) : ఠాయి యొక్క రూపాం తరము.

**ఠాయి** (వై.వి. గ్రా.) : స్వరస్థాయి.

**ఠావు** (వై.వి.గ్రా.) : స్థానము.

**ఠి**

**ఠింగణా** (దే.విశే.) : బాలుఁడు.

**ఠికానా** (హిం.వి.) : ఆశ్రయము, గతి.

**ఠీ**

**ఠీవి** (దే.వి.) : వైభవము.

**ఠే**

**ఠేవ** (దే.వి.) : 1. ఒప్పిదము; 2. విధము.

**ఠో**

**ఠోలా** (దే.వి.) : తెగ, సమూహము.

# డ

**డ** : ఒక యక్షరము.

**డంక** (దే.విణ.) : దిట్ట.

**డంకా** (వై.వి.) : డక్క యొక్క రూపాంతరము.

**డంగు** (దే.అ.క్రి.) : దంగు యొక్క రూపాంతరము. (చూ. డంచు.)

**డంగురము** (దే.వి.) : చర్మ వాద్య విశేషము.

**డంచే** (దే.ప్రే.) : దంచు యొక్క రూపాంతరము.

**డంబము** (వై.వి.) : 1. స్థితికి మించిన వేషము; 2. ప్రతిష్ఠ. (చూ. డంబు.)

**డంబరము** (సం.వి.అ.పుం.) : విజృంభణము.

**డంబు** (వై.వి.) : 1. కపటము; 2. స్థితికి మించిన వేషము; 3. కాంతి; (చూ. క్రొత్తడము.) 4.గర్వము; 5.ప్రతిష్ఠ; 6.విధము. (విణ.) : అధికము.

**డక్క** (వై.వి.) : వాద్య విశేషము, ఢక్క

**డక్కి** (వై.వి.) : డక్క, డమరువు. (అని కొందఱు.)

**డక్కు** (దే.అ.క్రి.) : దక్కు యొక్క రూపాంతరము.

**డక్కొను** (దే.అ.క్రి.) : దక్కొను యొుక్క రూపాంతరము.

**డగర** (దే.వి.) : పిశాచము. (విణ.) : గండు.

**డగరము** (దే.వి.) : కీడు. (రూ. దగరము.)

**డగ్గర** (దే.వి.) : డగర యొక్క రూపాంతరము.

**డగ్గఱ** (దే.వి.విణ.) : దగ్గఱ యొక్క రూపాంతరము.

**డగ్గఱించు** (దే.అ.క్రి.) : దగ్గఱించు యొక్క రూపాంతరము.

**డగ్గఱు** (దే.అ.క్రి.) : దగ్గఱు యొక్క రూపాంతరము.

**డగ్గు** (దే.అ.క్రి.వి.) : దగ్గు యొక్క రూపాంతరము.

**డగ్గుత్తిక** (దే.వి.) : (డక్కు + కుత్తిక) గద్గద స్వరము, గాద్గద్యము.

**డజన్** (ఆం.వి.) : పండ్రెండు, డజన్ బాజీ, చాలా దెబ్బలు.

**డప్పి** (దే.వి.) : దప్పి యొక్క రూపాంతరము. (శ్రమమునకు.)

**డప్పు** (దే.వి.) : తప్పెట, తమ్మటము.

**డబడబ** (దే.వి.) : ఉద్ధతి.

**డబ్బఱ** (దే.వి.) : దబ్బఱ యొక్క రూపాంతరము.

**డబ్బా** (దే.వి.) : తుపాకిమందు లోనగునవి యుంచుకొనెడు తోలుపెట్టె.

**డబ్బాటు** (దే.క్రి.విణ.అవ్య.) : అకస్మాత్తుగా. (ఒకానొకఁడు డబ్బాటుమైనని ప్రయోగించి యున్నాఁడు. అది విచార్యము.)

**డబ్బాటుసాకిరి** (ద్వ.విణ.) : ప్రసంగ వశమున వచ్చి యెల్ల కార్యములు తెలిసికొనిన సాక్షి, యదృచ్ఛాభిజ్ఞుఁడు.

**డబ్బి** (దే.వి.) : బరణి.

**డబ్బు** (యు.దే.స.క్రి.) : బొంకాడు. (వాఁడొక డబ్బు డబ్బెను.) (వి.) : 1. బొంకు; 2. రెండు దుగ్గానుల రాగి నాణెము; 3.ధనము; 4. ఒకానొక శకునపు బక్షి (చూ. గబ్బులుగు) (విణ.) : బొంకైనది.

**డబ్బుడుబ్బు** (దే.వి.) : ఆయుధము లొకటితో నొకటి తాఁకునప్పుడు కలిగెడు ధ్వన్యనుకరణము. (చూ. ఖంగుఖింగు)

**డబ్బుర** (దే.వి.) : 1. వెడలుపాటి నోరు గల లోహపాత్ర విశేషము; 2. గిన్నె (చూ. దబ్బుర)

**డమరము** (సం.వి.అ.పుం.) : కొల్ల మొదలగు దేశోపద్రవము, హోవడి.

**డమరుకము** (సం.వి.అ.పుం.) : డమరువు యొక్క రూపాంతరము.

**డమరుగము** (వై.వి.) : చర్మవాద్య విశేషము.

**డమరువు** (సం.వి.ఉ.పుం.) : 1. డమరుగము; 2. చమత్కారము.

**డమాయి** (వై.వి.) : చర్మవాద్య విశేషము.

**డమారము** (వై.వి.) : డమాయి.

**డమాను** (హిం.వి.) : తెఱచాప.

**డమ్మను** (దే.అ.క్రి.) : (డం + అను) చచ్చు.

**డమ్మారము** (వై.వి.) : డమారము యొక్క రూపాంతరము.

**డయనము** (సం.వి.అ.న.) : 1.బాలకాదుల క్రీడా శకటము; 2. పక్షిగతి.

**డయ్యు** (దే.అ.క్రి.) : 1. బలహీనమగు, బడలు; 2. కృశించు.

**డలాయతు** (హిం.వి.) : బిళ్లబంట్రౌతు.

**డల్లి** (హిం.వి.) : ముద్ద.

**డవాలీ** (హిం.వి.) : బంట్రౌతు బిళ్ల తగిలించు పట్ట.

**డవిణ** (దే.వి.) : డంకా.

**డహువు** (సం.వి.ఉ.పుం.) : గజనిమ్మ.



**డా** (దే.విణ.) : ఎడమ, సవ్యము (డాకడ, డాకన్ను, డామూఁపు. మొ.)

**డాంబికుఁడు** (సం.వి.అ.పుం. ) : ఇంద్రజాలాది మాయలు చేయువాఁడు.

**డాఁకొను** (దే.అ.క్రి.) : దాఁకొను యొక్క రూపాంతరము. (ప్రే. డాఁకొలుపు)

**డాఁగనమ్రుచ్చేలు** (దే.వి.బ.) : డాఁగురు మూఁతలు. (రూ. డాఁగన మ్రుచ్చిళ్లు.) (దాఁగన మ్రుచ్చులు యొక్క రూపాంతరము.)

**డాఁగిలిమూఁతలు** (దే.వి.బ.) : డాఁగురు మూఁతలు. (దాఁగిలి మూఁతలు యొక్క రూపాంతరము.)

**డాఁగిలిమ్రుచ్చేలు** (దే.వి.బ.) : డాఁగురు మూఁతలు. (దాఁగిలి మ్రుచ్చులు యొక్క రూపాంతరము.)

**డాఁగు** (దే.అ.క్రి.) : దాఁగు యొక్క రూపాంతరము. (చూ. డాఁచు)

**డాఁగుడుమూఁతలు** (దే.వి.బ.) : (చూ. డాఁగురు మూఁతలు.)

**డాఁగురించే** (దే.ప్రే.) :1.దాఁచు; 2.వంచించు. (దాఁగురించు యొక్క రూపాంతరము.)

**డాఁగురింత** (దే.వి.) : 1. డాఁగురించుట; 2. బ. డాఁగురు మూఁతలు. (దాఁగురింత యొక్క రూపాంతరము.)

**డాఁగురుమూఁతలు** (దే.వి.బ.) : బాలక్రీడా విశేషము. (దాఁగురు మూఁతలు యొక్క రూపాంతరము.)

**డాఁచే** (దే.ప్రే.) : దాఁచు యొక్క రూపాంతరము.

**డాఁపు** (దే.ప్రే.) : దాఁపు యొక్క రూపాంతరము.

**డాక** (దే.వి.) : 1. విజృంభణము; 2. శౌర్యము.

**డాకడ** (ద్వ.వి.) : 1. ఎడమ పార్శ్వము; 2. ఉత్తరపు దిక్కు.

**డాకలి** (దే.వి.) : దాకలి యొక్క రూపాంతరము.

**డాకల్లు** (దే.వి.) : దాకల్లు యొక్క రూపాంతరము.

**డాకిని** (సం.వి.ఈ.స్త్రీ.) : పిశాచస్త్రీ.

**డాకురు** (దే.స.క్రి.) : (కాళ్లు) తేలగిల వేయు.

**డాకొను** (దే.అ.క్రి.) : దాకొను యొక్క రూపాంతరము.

**డాక్టరు** (ఆం.వి.) : పెద్ద వైద్యుఁడు, పండితుఁడు.

**డాగు** (దే.వి.) : 1.గుఱుతు; 2.వాఁత; 3. మఱక.

**డాత్యూటము** (సం.వి.అ.పుం.) : చేదుగల చేఁప.

**డాపల** (దే.వి.) : ఎడమభాగము.

**డాపలించు** (దే.అ.క్రి.) : ప్రదక్షిణమగు.

**డాపు** (దే.వి.విణ.) : దాపు యొక్క రూపాంతరము.

**డాపురము** (దే.వి.విణ.) : దాపురము యొక్క రూపాంతరము.

**డాబ** (దే.వి.) : 1. పక్షి విశేషము; 2. జందెము వలె వేసుకొనెడి తోలుపట్టె.

**డాబా** (దే.వి.) : బోడిమిద్దె.

**డాబు** (యు.దే.వి.) : దినుసుల పట్టిక. (వై.) డంబము, అతిశయపు మాటలు.

**డామరము** (సం.వి.అ.పుం.) : 1. డమరము యొక్క రూపాంతరము; (గ్రంథముల యందు డాంబరమని కనఁబడుచున్నదిగాని దానికి ఆకర మేమియుఁ గానఁబడలేదు.) 2. శివోక్త తంత్ర విశేషము.

**డాయి** (దే.వి.) : దాయి యొక్క రూపాంతరము.

**డాయు** (దే.అ.క్రి.) : దాయు యొక్క రూపాంతరము.

**డాలించే** (వై.స.క్రి.) : డాలువాఱు పూను.

**డాలు** (యు.దే.వి.) : 1.కాంతి; 2.టెక్కెము (వై.) : డాలువాఱు.

**డాలుకాఁడు** (ద్వ.విణ.) : డాలువాఱు చేతఁబట్టిన వాఁడు.

**డాలువాఱు** (దే.వి.) : డాలు, కేడెము.

**డావరడంగి** (దే.వి.) : దేవతాళము.

## డి

**డింకవేయు** (దే.అ.క్రి.) చచ్చు. డింకా కొట్టు రూపాంతరము.

**డింకీలు** (దే.వి.బ.) : మల్లవిద్యా విశేషము.

**డింకు** (దే.అ.క్రి.) : చచ్చు.

**డింగరీఁడు** (వై.వి.) : 1. సేవకుఁడు; 2. భక్తుఁడు.

**డింగరుఁడు** (సం.వి.అ.పుం.) : సేవకుఁడు.

**డింగిల్లు** (దే.వి.బ.) : నమస్కార విశేషము.

**డించు** (దే.ప్రే.) : దించు యొక్క రూపాంతరము. (చూ. డిగు)

**డిండిమము** (సం.వి.అ.పుం.) : రాయడి గిడిగిడి యను వాద్య విశేషము.

**డిండీరము** (సం.వి.అ.పుం.) : ఫేనము, నురుఁగు.

**డిందు** (దే.అ.క్రి.) : 1. అడఁగు; 2. ఇంకు; 3. క్రుంగు; 4. మ్రొగ్గు.

**డిందుపడు** (ద్వ.అ.క్రి.) : 1. అడఁగు, శమించు; 2. సమాధానపడు. (ప్రే. డిందుపఱచు.)

**డిందుపాటు** (ద్వ.వి.) : ఉపశాంతి.

**డింపు** (దే.వి.) : దింపు యొక్క రూపాంతరము. (ఇక్కడ డింపునన్ అనఁగా దీనత్వముతోనని యర్థము)

**డింబము** (సం.వి.అ.పుం.) : 1. కొల్ల మొదలగు దేశోపద్రవము; 2. భయము; 3. పక్షిగ్రుడ్డు; 4. ఱొమ్ము నందెడమ ప్రక్క నుండెడు మాంస గోళము; 5. కడుపు నెడమప్రక్క నుండెడు మలాశయము.

**డింభము** (సం.వి.అ.పుం.) : 1. పిల్ల; 2. గ్రుడ్డు.

**డింభుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. వెలికిలఁ దిరిగి పరుండినవాఁడు; (బిడ్డ) 3. మూర్ఖుఁడు.

**డిగద్రావు** (దే.అ.క్రి.) : దిగు. (చూ. దిగఁద్రావు) (స.క్రి.) : విడుచు. (చూ. డిగ్గఁద్రావు.) (దిగఁ ద్రావు యొక్క రూపాంతరము.)

**డిగఁబడు** (ద్వ.అ.క్రి.) : దిగఁబడు యొక్క రూపాంతరము.

**డిగనాడు** (దే.స.క్రి.) : దిగనాడు యొక్క రూపాంతరము.

**డిగనుఱుకు** (దే.అ.క్రి.) : (డిగన్ + ఉఱుకు) దిగువకు దుముకు.

**డిగియ** (వై.వి.) : డిగ్గి యొక్క రూపాంతరము.

**డిగు** (దే.అ.క్రి.) : 1. డిగ్గు; 2. తగ్గు. (దిగు యొక్క రూపాంతరము.)

**డిగుడు** (దే.వి.) : దిగుడు యొక్క రూపాంతరము.

**డిగువ** (దే.వి.విణ.) : దిగువ యొక్క రూపాంతరము. (క్రిందునకు.)

**డిగ్గఁద్రావు** (దే.అ.క్రి.దిగు.) : (చూ. దిగఁ ద్రావు) (స.క్రి.) : విడుచు. (డిగఁద్రావు యొక్క రూపాంతరము.)

**డిగ్గదాఁటు** (దే.అ.క్రి.) : డిగనుఱుకు. (అది–దాని నుండి యని యర్థము.)

**డిగ్గన** (దే.ద్ర.క్రి.విణ.) : దిగ్గన యొక్క రూపాంతరము.

**డిగ్గనాడు** (దే.స.క్రి.) : డిగనాడు యొక్క రూపాంతరము.

**డిగ్గనుఱుకు** (దే.అ.క్రి.) : డిగనుఱుకు యొక్క రూపాంతరము.

**డిగ్గి** (దే.వి.) : అగ్ని. (అప్ర.)

**డిగ్గియ** (వై.వి.) : నడబావి.

**డిగ్గు** (దే.అ.క్రి.) : దిగు. (వి.) : తక్కువ. (డిగు యొక్క రూపాంతరము.)

**డిగ్గుడు** (దే.వి.) : డిగుడు యొక్క రూపాంతరము.

**డిగ్గువడు** (ద్వ.అ.క్రి.) : (డిగ్గు+పడు) తక్కువపడు.

**డిమము** (సం.వి.) : నాటక భేదము. (చూ. నాటకము.)

**డిమ్మరి** (దే.వి.) : దిమ్మరి యొక్క రూపాంతరము.

**డిమ్మి** (ఆం.వి.) : ఒక విధమైన దట్టపు కాగితము.

**డిల్లపడు** (ద్వ.అ.క్రి.) : (డిల్లము+పడు) (భయాదులచే) సత్వహీనమగు.

**డిల్లపాటు** (ద్వ.వి.) : డిల్లపడుట.

**డిల్లపోవు** (ద్వ.అ.క్రి.) : (డిల్లము + పోవు) డిల్లపడు.

**డిల్లము** (దే.విణ.) : (భయాదులచె) సత్వ హీన మైనది. (వృత్తియందు అంత్యవర్ణ లోపము. ఉదా. డిల్లపడు. మొ.)

**డిస్ట్రిక్టు** (ఆం.వి.) : జిల్లా; కలెక్టరు క్రిందనుండు దేశము.

## డీ

**డీ** (దే.అవ్య.) : తలతో పొడుచుట.

**డీకు** (దే.విణ.) : ప్రేరేఁపణ (చూ. దీకు)

**డీకొను** (దే.అ.క్రి.) : 1. పురికొను; 2. కవియు. (స.క్రి.) : ఎదిరించు.

**డీకోలు** (దే.వి.) : డీకొనుట.

**డీనము** (సం.వి.అ.న.) : మీఁదికెగురుట.

**డీలించు** (దే.ప్రే.) : డీలఁజేయు, సడలించు.

**డీలు** (దే.అ.క్రి.) : డిల్లపడు. (చూ. దీలు.) (విణ.) : డిల్లము. (వాని పని డీలైపోయినది.)

**డీలుపడు** (ద్వ.అ.క్రి.) : డిల్లపడు.

**డీలుపాటు** (ద్వ.వి.) : డీలుపడుట.

## డు

**డు** (దే.అప.) : బిందు పూర్వకమై ప్రథమైక వచ నమునందు వచ్చు ఒకానొక ప్రత్యయము. (ఉదా. మ్రొక్కుచున్నాఁడు, మ్రొక్కఁడు, మ్రొక్కఁడు. మొ.) (ద్ర.) : ఇది అనంతర్యార్థము నందు వచ్చును. (ఉదా. కొట్టుదును, తిట్టుదును. మొ.)

**డుంకు** (దే.అ.క్రి.) : తగ్గు.

**డుండుకము** (సం.వి.అ.పుం.) : దుండిగము. (విణ.డు.) : 1. అల్పుఁడు; 2. క్రూరుఁడు.

**డుండుభము** (సం.వి.అ.పుం.) : ఇరుదలపాము.

**డుక్కు** (దే.అ.క్రి.) : మఱుఁగుపడు.

**డుబుడక్క** (ద్వ.వి.) : డుబుడక్కవాని వాద్యము.

**డుబుడక్కవాఁడు** (ద్వ.వి.): వేషము వేసికొని దుబుడక్కను వాయించుచు మేలుకీళ్లను దెలిపెడి యొక జాతిబిచ్చపు జోగి.

**డుయ్యు** (దే.అ.క్రి.స.క్రి.) : 1. దుయ్యు యొక్క రూపాంతరము. (బాణాదికము నాటి వెడలుటకు.)

**డుఱ్ఱుచ్చి** (దే.అవ్య.) : యుద్ధమునకు పిలుచుట యందు ఉపయోగింపఁ బడునది.

**డులడుల** (దే.వి.) : దుల్లుటయందగు ధ్వన్యను కరణము. (రా.యు, కాం.) :

**డులుచే** (దే.ప్రే.) : డుల్లఁజేయు (రూ. డుల్చు)

**డుల్లు** (దే.అ.క్రి.) : 1. పడు; 2. ఊడు.

## డూ

**డూయు** (దే.అ.క్రి.స.క్రి.) : దూయు యొక్క రూపాంతరము.

## డె

**డెందము** (దే.వి.) : ఉల్లము, హృదయము.

**డెక్క** (దే.వి.) : పశువుల కాలిగిట్ట, ఖురము.

**డెక్కు** (దే.స.క్రి.) : అడ్డగించు, నివారించు.

**డెక్కొను** (దే.అ.క్రి.) : (డెక్క + కొను) నెలకొను.

**డెప్ప** (దే.వి.) : కొండమీఁది సమమైన చోటు, నెత్తము.

**డెప్పరము** (దే.వి.) : ఆపద.(విణ.) : 1.అశక్యము; 2.దుస్సహము. (దీనికి సందర్భానుసారముగా అసాధ్యము, దుర్లభము మొదలగు అర్థములును గలుగును.) (దెప్పరము యొక్క రూపాంతరము.)

**డెప్పరించు** (దే.అ.క్రి.) : అశక్యమగు.

**డెప్పు** దే.స.క్రి.) : దెప్పు యొక్క రూపాంతరము.

**డెబ్బండ్రు** (ద్వ.స.) : డెబ్బదిమంది. (డెబ్బదికి మహన్మహత్యర్థక రూపము.)

**డెబ్బది** (ద్వ.స.) : (ఏడు + పది) ఏడు పదులు, సప్తతి.

## డే

**డేఁగుర** (సం.వి.ఆ.స్త్రీ.) : జయఘంటిక, జేగంట.

**డేక్సా** (హిం.వి.) : పెద్ద వంటపాత్ర.

**డేగ** (దే.వి.) : సాధారణపు పక్షులను కుందేలు లోనగు స్వల్ప మృగములను వేఁటాడెడు ఒక దినుసు పక్షి, శ్యేనము. (దీని భేదములు అనేకములు. చూ. అఋజు.)

**డేగాట** (దే.వి.) : (డేగ + ఆట) పెండ్లి అయిదవ నాడు సమీప బంధువులు పెండ్లి కొడుకును పెండ్లి కూఁతును మూఁపుల మీఁద నెత్తుకొని వారిచే మాలలు మార్పింప దేగలవలె ఎగిరి యాడెడు ఆట.

**డేరా** (దే.వి.) : గుడారము.

## డై

**డైరీ, డైలి** (ఆం.వి.) : దినచర్య.

## డొ

**డొంక** (దే.వి.) : 1. నడిచి పల్లముగా నేర్పడిన కాలిదారి; 2. పొద; 3. కోన.

**డొంకు** (దే.అ.క్రి.) : 1. ఇంకు; 2. ఎండు; 3. అడఁగు. (వి.) వంకర.

**డొంకెన** (దే.వి.) : వంకర అలుఁగుల యీఁటె.

**డొంగ** (దే.వి.) : దొంగ యొక్క రూపాంతరము.

**డొంగు** (దే.అ.క్రి.) : డాఁగు. (దొంగు యొక్క రూపాంతరము.) (వి.) : చెట్టులోని తొఱ్ఱ.

**డొకారము** (దే.వి.) : లోను, అంతరాళము. (చూ. డొకారము సొచ్చు.)

**డొకారముసొచ్చు** (దే.అ.క్రి.) : (డొకారము + చొచ్చు) లోనగు, లోపడు.

**డొక్క** (దే.వి.) : 1. ఒడలి యెముకల గూఁడు, కంకాళము, కడుపు (అని కొందఱు) 2. టెంకాయ బొండ్లపు చెక్క.

**డొక్కబుఱ్ఱ** (దే.వి.) : తేగపాఱవీడిన తాటివిత్తు.

**డొక్కరము** (వై.వి.) : మల్లబంధ విశేషము.

**డొక్కు** (దే.అ.క్రి.) : ముదియు. (విణ.) : ముదిసినది.

**డొగరు** (దే.వి.) : 1. అపరాధము; 2. నింద.

**డొప్ప** (దే.వి.) : దొప్ప యొక్క రూపాంతరము.

**డొలుచే** (దే.ప్రే.) : డొల్లఁజేయు, (రూ. డొల్చు.)

**డొల్ల** (దే.వి.) : చేటవలె మూఁడు ప్రక్కల యందు అడ్డుపలకగల బల్లలోనగునది. బుఱ్ఱ. (అని కొందఱు.)

**డొల్లు** (దే.అ.క్రి.) : 1. పొర్లు; (దొర్లు యొక్క రూపాంతరము.) (చూ. డొలుచు.) 2. పడు.

## డో

**డోఁకు** (దే.అ.క్రి.) : ఓకిలించు. (స.క్రి.) : గడ్డి లోనగు దాని నెదురుగాఁ జెక్కు. (ఈ యర్థ మందు ఇది దోఁకు యొక్క రూపాంతరము.) (వి.) : ఓకిలింత.

**డోఁగియాడు** (దే.అ.క్రి.) : (డోఁగి+ఆడు) దోఁగాడు.

**డోఁగు** (దే.అ.క్రి.) : దోఁగు యొక్క రూపాంతరము.

**డోకడా** (దే.వి.) : నూఱవపాలు.

**డోరము** (సం.వి.అ.న.) : చేతఁగట్టు కొనెడు వ్రత సూత్రము, తోరము.

**డోరములు** (దే.వి.బ.) : కత్తిమీఁది చాఱలు.

**డోరియా** (హిం.వి.) : చార.

**డోల** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. డోలి; 2. తొట్ల; 3. నీలిచెట్టు. (అ.పుం.ము.) అభినయహస్త విశేషము.

**డోలనము** (సం.వి.అ.న.) : ఊఁచుట, ఊఁపు.

**డోలాబ్జము** (సం.వి.అ.న.) : కలువపువ్వు.

**డోలి** (వై.వి.) : ఉయ్యాల వంటి అందలము, డోల.

**డోలిక** (సం.వి.ఆ.స్త్రీ.) : ఉయ్యాల వంటి అందలము, డోల.

**డోలు** (వై.వి.) : చర్మవాద్య విశేషము.

**డోసు** (ఆం.వి.) : ఔషధము పరిమాణము, మద్యపానము.

**డోసుగాఁడు** (ఆం.వి.) : త్రాఁగుబోతు.



## డౌ

**డౌలు, డవులు** (దే.వి.) : మదింపు, రీతి.

## డ్రె

**డ్రెస్సరు** (ఆం.వి.) : సహాయవైద్యుడు.

## ఢ

**ఢ** : ఒక యక్షరము.

**ఢక్క** (సం.వి.ఆ.స్త్రీ.) : యశఃపటహము, ఢంకా.

**ఢక్కాముక్కీ** (హిం.వి.) : సంకటము, ఇబ్బంది.

**ఢమామిక** (సం.వి.ఆ.స్త్రీ.) : ఢమాయి.

## ఢా

**ఢాలము** (సం.వి.అ.న.) : డాలువాఱు, ఫలకము.

## ఢు

**ఢుండి** (సం.వి.ఇ.పుం.) : గణేశుఁడు.

**ఢులి** (సం.వి.ఇ.ఈ.స్త్రీ.) : ఆఁడుతాఁబేలు, కమఠి. (రూ. డులి.)

## ఢో

**ఢోలము** (సం.వి.అ.పుం.) : డోలు.

## ణ

**ణ** : ఒక యక్షరము.

## త

**త** : ఒక యక్షరము. (దే.అప.) : కులవాచకమగు స్త్రీ ప్రత్యయము. (చాకిత, వ్రేత. మొ.)

**తంకర** (దే.వి.) : తుచ్ఛధాన్యము.

**తంగు** (దే.వి.) : టంగు యొక్క రూపాంతరము.

**తంగువాఱు** (దే.వి.) : టంగువాఱు యొక్క రూపాంతరము.

**తంగెడు** (దే.వి.) : తంగేడు యొక్క రూపాంతరము.

**తంగేడు** (దే.వి.) : గోశ్రేణి.

**తంట** (దే.వి.) : 1. కలహము; 2. చాడీ; 3. శ్రమము; 4. అప్పు; 5. మోసము.

**తంటా** (దే.వి.) : తంట యొక్క రూపాంతరము.

**తంటియము** (దే.వి.) : తంటెము.

**తంటెము** (దే.వి.) : ప్రపున్నాటము. (తంటియము యొక్క రూపాంతరము.)

**తండకము** (సం.వి.అ.పుం.) : 1. మిద్దెటింటికి అడ్డముగా వేసెడు దంతె; 2. వృత్త విశేషము.

**తండసము** (ఉభ.దే.వి.) : మంగలవాఁడు వెండ్రుక ఊడఁబెరికెడు సాధనము, కుటిలిక. (ఒకానొక నిఘంటువు నందు తంటసమని వ్రాయఁబడి యున్నది.) (సం.వి.అ.పుం.) : కమ్మరకొలిమి.

**తండా** (వై.వి.) : 1. లంబాడీల సమూహము; 2. సరకు నింపిన గోనెల సమూహము.

**తండిరి** (దే.వి.) : తండ్రికి మొదటి రూపము.

**తండు** (దే.స.క్రి.) : (ఇయ్యవలసిన ధనమును) పోయి అడుగు.

**తండుగోల** (దే.వి.) : (తండు + కోల) చేఁపల బొడిచెడు చిల్లకోల, మండము.

**తండురీణము** (సం.వి.అ.పుం.) : 1. కడుగునీరు; 2. పురుగు; 3. బొబ్బరలు.

**తండులము** (సం.వి.అ.పుం.) : 1. బియ్యము; 2. వాయు విడంగము.

**తండులీయము** (సం.వి.అ.పుం.) : 1. ధాన్యము; 2. చిఱ్ఱికూర.

**తండువు** (సం.వి.ఉ.పుం.ఊ.స్త్రీ.) : త్రెడ్డుకొయ్య. (ఉ.పుం.) : నందికేశ్వరుఁడు.

**తండెలు** (దే.వి.) : ఓడపెత్తనగాఁడు.

**తండేలు** (దే.వి.): తండెలు యొక్క రూపాంతరము.

**తండ్రి** (దే.వి.) : అబ్బ, జనకుఁడు. (చూ. తలిరుచుకడ.)

**తండ్రితండ్రి** (దే.వి.) : తాత, పితామహుఁడు.

**తంతి** (వై.వి.) : వీణెలోనగువానికి వేసెడు ఉక్కుకమ్మి.

**తంతియలు** (దే.వి.బ.) : మెట్లు.

**తంతు** (యు.దే.వి.) : ఉత్సవ విశేషము. (వై.) : ఉభయార్థ సాధకమైన ఉపాయము.

**తంతుకాష్ఠము** (సం.వి.అ.న.) : 1. సాలెవాని నాడె; 2. నూలు వడికెడు కదురు.

**తంతుకీటము** (సం.వి.అ.పుం.) : పట్టుపురుగు.

**తంతునాగము** (సం.వి.అ.పుం.) : సర్పాకారమైన జల జంతు విశేషము, నెగడు.

**తంతునాభము** (సం.వి.అ.పుం.) : సాలెపురుగు.

**తంతుభము** (సం.వి.అ.పుం.) : సర్షపము, ఆవాలు.

**తంతువాయము** (సం.వి.అ.పుం.) : తంతు నాభము.

**తంతువాయుఁడు** (సం.వి.అ.పుం.) : సాలెవాఁడు.

**తంతువు** (సం.వి.ఉ.పుం.) : 1. నూలిపోఁగు; 2. తంతునాగము.

**తంతెలు** (దే.వి.బ.) : తంతియలు యొక్క రూపాంతరము.

**తంత్రకము** (సం.విణ.) : (అ.ఈ.అ.) క్రొత్తది. (వస్త్రము.)

**తంత్రము** (సం.వి.అ.న.) : 1. ఉభయార్థ సాధకమైన ఉపాయము; 2. స్వరాష్ట్ర చింత; 3.వ్యాకరణ శాస్త్రము; 4.కుటుంబ వ్యాపారము; 5.ఉత్తమమైన ఔషధము; 6.సిద్ధాంతము; 7. ప్రధానము; 8. మగ్గము, నూలిపడుగు; (అని కొందఱు.) 9. పరివారము; 10. ఒకానొక వేదశాఖ; 11. హేతువు; 12. ఇట్లు చేయఁ దగినదనుట.

**తంత్రి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. తంతి; 2. తిప్పఁతీగ; 3. నరము.

**తందనము** (వై.వి.) : మాటిమాటికి తానశబ్ద పూర్వకముగా చేసెడు రాగాలాపము.

**తందర** (వై.వి.) : తూఁగు, కునికిపాటు, తంద్ర.

**తంద్ర** (సం.వి.ఆ.స్త్రీ.) : తూఁగు, కునికిపాటు, తంద్ర.

**తంద్రి** (సం.వి.ఈ.స్త్రీ.) : తూఁగు, కునికిపాటు, తంద్ర.

**తంపర** (దే.వి.) : తామరగుంపు, షండము. "తామర తంపర."

**తంపి** (దే.వి.) : 1. దాలిగుంట; 2. కలహము.

**తంబ** (దే.వి.) : ఒకానొకతీఁగ, శింబి.

**తంబళ** (దే.వి.) : శివార్చనచేసి బ్రతికెడు జాతి. (తంబళవాఁడు, తంబళది.)

**తంబళి** (దే.వి.) : (తంబళ + ఇ) తంబళవాఁడు.

**తంబు** (దే.వి.) : తమ్ముఁడు. (ఇది వాత్సల్య సంబోధనమునందు వాడఁబడును.)

**తంబుగ** (దే.వి.) : మెడ నిడుపుగా నుండెడు చెంబు.

**తంబుఱ** (ద్వ.వి.) : (తంతి + బుఱ్ఱ) పాట పాడువారు శ్రుతికై యుంచు కొనెడు తంత్రీ వాద్య విశేషము. (రూ. తంబుఱా.)

**తకరారు** (హిం.వి.) : వివాదము.

**తకతక** (దే.వి.) : తాళమునందగు ధ్వన్యను కరణము.

**తకపికలాడు** (దే.అ.క్రి.) : (తకపికలు + ఆడు) ఇట్టట్టుచలించు.

**తకావి** (హిం.వి.) : సేద్యము చేయుటకై సహాయముగా నియ్యఁబడు సొమ్ము.

**తక్కటి** (దే.వి.) : మూడు ముఖములు గల దీపారాత్రికపుతట్ట.

**తక్కరి** (వై.విణ.) : (తక్కు + అరి) టక్కరి.

**తక్కడి** (వై.వి.) : మోసము. (చూ. తక్కిడికాఁడు)

**తక్కిడికాఁడు** (వై.విణ.) : మోసకాఁడు.

**తక్కిలి** (వై.వి.) : ఒకానొక చెట్టు.

**తక్కు**(యు.దే.అ.క్రి.) : తప్పు. (స.క్రి.) : విడుచు. (వి.) : మిగులు. (విణ.) : ఇతరము. (వై.అ. క్రి.) : టక్కు చేయు. (చూ. టక్కు అనునర్థము నుదాహర ణము.) ఇక్కడ ఇది సకర్మకము. (వి.) : టక్కు. (ఈ యర్థమందు ఇది టక్కు యొక్క రూపాంతరము.)

**తక్కువిడు** (దే.వి.) : తక్కుట. (ఇక్కడ తక్కుట అనియే యుండవచ్చును. అయినను ప్రతుల యందిట్లు కానఁబడుచున్నది.)

**తక్కులాఁడి** (ద్వ.విణ.) : (తక్కులు + ఆఁడి) టక్కులాఁడి.

**తక్కులాడు** (ద్వ.విణ.) : (తక్కులు + ఆఁడు) టక్కులాఁడు.

**తక్కువపడు** (ద్వ.అ.క్రి.) : కొఱంతపడు.

**తక్కువపాటు** (ద్వ.వి.) : కొఱంతపాటు.

**తక్కె** (యు.దే.వి.) : రెండువీసెలయెత్తు. (వై.) : తక్కిలి.

**తక్కెడ** (వై.వి.) : 1. పేములతట్టలుగ్రుచ్చి వ్రేల వేసిన త్రాసు; (చూ. కుడక) 2. తక్కిలి.

**తక్కెఱ** (దే.విణ.) : అల్పము.

**తక్కెల** (వై.వి.) : తక్కిలి.

**తక్కేడ** (వై.వి.) : తక్కిలి. (తక్కెడము యొక్క రూపాంతరము)

**తక్కేల** (వై.వి.) : తక్కిలి. (తక్కెల యొక్క రూపాంతరము)

**తక్కొను** (దే.అ.క్రి.) : (తల + కొను) పూనుకొను. (చూ. ఉంకు.)

**తక్కోలకము** (సం.వి.అ.న.) : తక్కోలపు చెట్టు, తక్కోలఫలము. (అని కొందఱు.)

**తక్తు** (హిం.వి.) : సింహాసనము.

**తక్రము** (సం.వి.అ.న.) : పాతిక పాలునీళ్లు చేర్చిన మజ్జిగ.

**తక్రాటము** (సం.వి.అ.పుం.) : పెరుగు చిలికెడు కవ్వము.

**తక్షకుఁడు** (సం.వి.అ.పుం.) : 1. ఒక సర్పరాజు; 2. వడ్లవాఁడు.

**తక్షణము** (సం.వి.అ.న.) : (మాను) చెక్కుట.

**తక్షణి** (సం.వి.ఈ.స్త్రీ.) : మాను చెక్కెడు సాధనము, బాడిస.

**తక్షుఁడు** (సం.వి.న్.పుం.) : తక్షకుఁడు, వడ్లవాఁడు.

**తగటి** (దే.విణ.) : (తగటు + ఇ) సరిగది. (రూ. తగటీ.) చంద్ర. (చూ. కురాళము.)

**తగటు** (దే.వి.) : సరిగ.

**తగడు** (దే.వి.) : బంగారులోనగువాని ఱేకు.

**తగరము** (ఉభ. వై.వి.) : లోహ విశేషము. (సం.అ.పుం.) : 1. పొట్టేలు; 2. నందివర్ధనము.

**తగరు** (వై.వి.) : పొట్టేలు.

**తగరురవుతు** (వై.వి.) : అగ్ని.

**తగవరి** (దే.వి.) : (తగవు + అరి) న్యాయాధిపతి.

**తగవు** (దే.వి.) : 1. తగుట; 2. న్యాయము; 3. ధనాది నిమిత్తమైన జగడము; 4. పెండ్లప్పుడు పెండ్లి కూఁతునకు తల్లిదండ్రు లిచ్చెడు బహుమానము. (విణ.) : తగినది. యుక్తము. (చూ. ఇహిహీ.)

**తగవుగోరి** (దే.విణ.) : (తగవు + కోరి) సంధి చేయువాఁడు.

**తగాదా** (హిం.వి.) : వ్యాజ్యెము, తగవు.

**తగిరిస** (దే.వి.) : తంటెము, ప్రపున్నాటము.

**తగు** (దే.అ.క్రి.) : యుక్తమగు.

**తగుకత్తి** (ద్వ.వి.) : సాధనకు ఉప యుక్తమైన ఆయుధవిశేషము.

**తగులఁగట్టు** (దే.స.క్రి.) : (తగులన్ + కట్టు) తగిలించు.

**తగులఁబడు** (ద్వ.అ.క్రి.) : (తగులన్ + పడు) తగులు, చిక్కు. (స్వార్థమునపడు)

**తగులఁబెట్టు** (దే.స.క్రి.) : (తగులన్ + పెట్టు.) 1. తగిలించు; 2. కాల్చు.

**తగులము** (దే.వి.) : 1. ఆసక్తి; 2. అడ్డపాటు.

**తగులాటకత్తె** (ద్వ.వి.) : (తగులాటము + కత్తె) తగులాటముగల ఆడుది.

**తగులాటము** (దే.వి.) : (తగులు + ఆట) తగులు, బంధము. (ఇది పోరాటము మాఱాటము వంటిది.)

**తగులు** (దే.అ.క్రి.) : 1. చిక్కు; (పుస్తక మంతయు వెదకితిని ఆ పదమెక్కడ నాకు తగులలేదు.) 2. పట్టు; (ఆ యిల్లు కట్టుటకు కర్చు ఏమి తగిలెను ?) 3. తాఁకు; (గడపతగిలి తలబొప్పి కట్టినది.) 4. సక్తమగు; (అందునాబుద్ధి తగులదు.) 5. అంటు; (నా కాలమన్ను తగిలినది.) 6. పొసఁగు. (ఒక పని తగిలి

ఊరికి వెళ్లితిని.) (అం,ప్రే.) : తగుల్చు. (చూ. తందనము.) (స.క్రి.) : వెంబడించు. (వాఁడు నన్ను తగిలినాఁడు విడువలేదు.) (వి.): 1. ఆసక్తి; 2. అభిలాష; 3. తగులాటము.

**తగులుకొను** (దే.అ.క్రి.) : రగులుకొను. (ఆ గుడిసె తగులుకొన్నది.) (స.క్రి.) : వలచు.

**తగులుకోలు** (దే.వి.) : తగులుకొనుట.

**తగులుగొండి** (దే.విణ.) : (విటుని) తగులుకొను నట్టిది.

**తగులుచు** (దే.ప్రే.) : తగులఁజేయు (రూ. తగుల్చు.)

**తగులుడు** (దే.వి.) : తగులుట. (తగులము అని అచ్చు పుస్తకముల యందున్నది.)

**తగులుదల** (దే.వి.) : తగులుడు.

**తగులుబడి** (దే.వి.) : పట్టుబడి.

**తగులువడు** (ద్వ.అ.క్రి.) : (తగులు+పడు) పట్టు వడు, చిక్కు.

**తగులువాటు** (ద్వ.వి.) : తగులువడుట.

**తగ్గు** (దే.అ.క్రి.) : 1.తక్కువగు; 2. వెనుకకుఁ దీయు; 3. తెగిపడు. (వి.) 1. తక్కువ; 2. త్రి వర్గము నందొకటి యగు క్షయము. (చూ. త్రివర్గము)

**తగ్గుదల** (దే.వి.) : తక్కువ.

**తచ్చన** (దే.వి.) : 1. కపటము; 2. పరిహాసము. (చూ. ఉబ్బరపోవు)

**తచ్చనలాడు** (దే.అ.క్రి.) : (తచ్చనలు + ఆడు) పరిహాసముచేయు.

**తచ్చనసేయు** (ద్వ.అ.క్రి.) : (తచ్చన + చేయు) పరిహసించు.

**తటకా** (దే.వి.) : నిశ్చేష్టత.

**తటకాపడు** (ద్వ.అ.క్రి.) : చేష్టలుతక్కు.

**తటకాపాటు** (ద్వ.వి.) : తటకాపడుట.

**తటతట** (దే.వి.) : గుండెలదరులట లోనగువాని యందగు ననుకరణము.

**తటమట** (దే.వి.) : మోసము. (విణ.) : 1.మోసము గలది; (చూ. తటవట) 2. కలఁత నొందినది.

**తటమటించు** (దే.స.క్రి.) : 1. మోసపుచ్చు; 2. కలఁచు.

**తటము** (సం.వి.అ.న.) : వరిమడి. (పుం,న.) : 1. ఏటి ఒడ్డు; 2. ప్రదేశము. (పుం.) : కొండ చఱియ.

**తటవట** (దే.వి.) : మోసము. (చూ. తటమట) (విణ.) : 1. మోసము గలది; 2. కలఁత నొందినది (చూ. తటమట) (తటమట యొక్క రూపాంతరము.)

**తటవటచేయు** (ద్వ.స.క్రి.) : మోసపుచ్చు.

**తటస్థము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. సమీపము నందున్నది; 2. ఒనఁగూడినది.

**తటస్థించు** (సం.అ.క్రి.) : 1. సమీపించు; 2. ఒనఁగూడు.

**తటస్థుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) న్యాయస్థుఁడు.

**తటాకము** (సం.వి.అ.పుం, న.) : చెఱువు. (రూ. తటాగము)

**తటాన** (దే.ద్ర.క్రి.విణ.) : తటాలున యొక్క రూపాంతరము.

**తటాయించు** (దే.స.క్రి.) : అడ్డగించు, నివారించు.

**తటాలు** (దే.వి.) : గుండె యదురుట యందగు ననుకరణము.

**తటాలున** (దే.ద్ర.క్రి.విణ.) : అతి శీఘ్రముగ.

**తటి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. ఏటిఒడ్డు; 2. ప్రదేశము.

**తటిత్తు** (సం.వి.త్.స్త్రీ.) : మెఱపు, విద్యుత్తు.

**తటిత్వంతము** (సం.వి.త్.పుం.) : మేఘము, మబ్బు.

**తటిని** (సం.వి.ఈ.స్త్రీ.) : నది, ఏఱు.

**తటుకున** (దే.ద్ర.క్రి.విణ.) : తటుక్కున యొక్క రూపాంతరము.

**తటుక్కున** (దే.ద్ర.క్రి.విణ.) : తటాలున.

**తట్ట** (దే.వి.) : 1. వెదురు బద్దలు లోనగు వానితో నల్లిన పల్లిక; (ఎండుపుతట్ట, తక్కెడతట్ట) 2. ఇత్తడిలోనగు లోహముతో చేసిన తబుకు; (సిబ్బితట్ట వక్కాకుతట్ట. మొ.) 3. చిన్నగంప.

**తట్టగిల్లు** (దే.అ.క్రి.) : తట్టయగు.

**తట్టము** (దే.వి.) : టంగువాఱు.

**తట్టస** (వై.వి.) : ధైర్యము.

**తట్టాడు** (దే.స.క్రి.) : (తట్టు + ఆడు) (అడుగులు) ఇట్టట్టు ఇడు.

**తట్టి** (దే.వి.) : 1. కంచము; 2. వేఁటతెర.

**తట్టు** (హిం.వి.) : పొట్టిగుఱ్ఱము.

**తట్టు** (యు.దే.అ.క్రి.) : 1. కలుగు; 2. తోఁచు. (స.క్రి.) : 1. చఱచు. 1. దరి; 2. పార్శ్వము.

**తట్టుచేయి** (ద్వ.వి.) : కోటకొమ్మమీఁది అవయవ విశేషము. (చూ. ద్వి. రా. యు, కాం.)

**తట్టుపునుఁగు** (ద్వ.వి.) : తట్టి యెత్తిన మేలైన పునుఁగు.

**తట్టుముట్టాడు** (ద్వ.స.క్రి.) : (తట్టుముట్టి + ఆడు) (దారిద్ర్యము) చుట్టుకొను.

**తట్టువ** (వై.వి.) : 1. అశ్వము; 2. కుత్సితాశ్వము. (రూ. తట్టువము. కుత్సితాశ్వమునకు.)

**తట్టువడు** (ద్వ.అ.క్రి.) : (తట్టు+పడు) బాధపడు.

**తట్ర** (వై.వి.) : బంగారు పనిచేసి బ్రతికెడు జాతి. (తట్రవాఁడు, తట్రది.)

**తడ** (దే.వి.) : 1. అడ్డి; 2. కడ; 3. ధన్వము. (దీని భేదము గూబతడ.)

**తడఁబడు** (ద్వ.అ.క్రి.) : (తడ+పడు) 1. తొట్రుపడు; 2. వ్యత్యాసపడు; 3. చలించు. (కనసూజ ప్రే. తడఁబఱచు.)

**తడఁబాటు** (ద్వ.వి.) : (తడఁబడుట.) 1. వ్యత్యాసము; 2.చలనము. (చూ. తడఁబడు.)

**తడక** (దే.వి.) : 1. ఈఁతబ్రద్దలు లోనగు వానితో నల్లిగుడిసెలకు నమర్చెడు తలుపు; 2. పక్షుల వేఁటాడువాఁడు మఱుఁగుగా నుంచుకొను సాధనము. (ప్రయోగముల యందు తడక యనియు వ్యవహారమునందు తడిక యనియు కానంబడు చున్నది. తడకయని యుండుటయే సాధువని తోఁచెడి.)

**తడకట్టు** (దే.స.క్రి.) : అడ్డగించు. (వి.) : అడ్డగింత.

**తడకాలు** (దే.వి.) : మల్లబంధవిశేషము.

**తడగము** (దే.వి.) : తణగము యొక్క మొదటి రూపము.

**తడప** (దే.వి.) : పట్టగానుండు నార.

**తడపెట్టు** (దే.వి.క్రి.) : తడఁబఱచు.

**తడయు** (దే.అ.క్రి.) : ఆలస్యముచేయు.

**తడవ** (దే.వి.) : తేప, మాఱు, ఆవృత్తి.

**తడవాడు** (దే.అ.క్రి.) : (తడవి + ఆడు) 1. దోఁగాడు; 2. తడఁబడు. (మొదటి రూపము. తడవియాడు. దోఁగాడుటకు.)

**తడవిల్లు** (దే.వి.) : తడబ్రద్దలతోఁజేసిన విల్లు. (చూ. విల్లు.)

**తడవు** (దే.అ.క్రి.) : 1. చేతులతో అట్టిట్టుప్రాఁకు; 2. దోఁగాడు. (స.క్రి.) : 1.నిమురు; 2. వెదకు; 3. ప్రస్తావించు 4. విచారించు; 5. రక్షించు. (వి.) : 1. ఆలస్యము; 2. చిరకాలము. (అంత మొదలగు శబ్దములు ముందు వచ్చునపుడు ఇది కేవలము కాలవాచక మగును. ఉదా : అంత తడవు, ఇంత తడవు, ఎంతతడవు, కొంత తడవు. మొ.)

**తడవుడు** (దే.వి.) : వెదకుట, అన్వేషణము.

**తడవులనిడుపఁడు** (దే.వి.) : శేషుఁడు, అనంతుఁడు.

**తడి** (దే.వి.) : 1. తేమ; 2. నీరు. (విణ.) తేమగలది, ఆర్ద్రము.

**తడిక** (దే.వి.) : తడక యొక్క రూపాంతరము.

**తడికద్రోపరి** (దే.వి.) : (తడిక + త్రోపరి) తడిక త్రోసివేసి లోపలఁ దూఱెడు దొంగ.

**తడిపొడి** (దే.విణ.) : కొంచెము తడి గలిగి పొడిగానుండునది.

**తడియు** (దే.అ.క్రి.) : ఆర్ద్రమగు.

**తడియొత్తు** (దే.వి.) : (తడి + ఒత్తు) తడి తుడుచుకొనుగుడ్డ.

**తడుకు** (దే.వి.) : తోఁటలోనగువాని చుట్టు నేర్పఱచెడు వెలుగు.

**తడుకున** (దే.ద్ర.క్రి.విణ.) : తటుకున యొక్క రూపాంతరము.

**తడుపు** (దే.ప్రే.) : తడియఁ జేయు. (వి.) : 1. గోఁచి; 2. చిన్న వస్త్రము.

**తడుపుదాలుపు** (దే.వి.) : (తడుపు + తాలుపు) బ్రహ్మచారి.

**తడుము** (దే.అ.క్రి.) : ఆలోచించు.

**తణగము** (దే.వి.) : ఎద్దుమీఁద నీళ్లు తెచ్చెడు తోలుసంచి.

**తణగాము** (దే.వి.) : తణగము యొక్క రూపాంతరము.

**తతము** (సం.వి.అ.న.) : వీణలోనగు వాద్యము. (పుం.) : గాలి. (విణ.) : 1.విరివియైనది; 2.వ్యాపించినది.

**తతి** (ఉభ. దే.వి.) : సమయము. (చూ. కుతిల పడు.) (సం.ఇ.స్త్రీ.) : సమూహము.

**తతిమ్మా** (హిం.విణ.) : మిగిలిన.

**తత్తడి** (దే.వి.) : గుఱ్ఱము, అశ్వము, వాహనము.

**తత్తబడ** (దే.వి.) : పరివారము.

**తత్తఱ** (దే.వి.) : (తఱ + తఱ) సంభ్రమము. (రూ. తత్తఱము.)

**తత్తఱపడు** (ద్వ.అ.క్రి.) : సంభ్రమించు.

**తత్తఱపాటు** (ద్వ.వి.) : తత్తఱపడుట.

**తత్తఱపెట్టు** (దే.స.క్రి.) : తత్తఱపఱచు.

**తత్తఱించు** (దే.అ.క్రి.) : 1. సంభ్రమించు; 2. చలించు. (చూ. తత్తఱిల్లు.)

**తత్తఱిల్లు** (దే.అ.క్రి.) : 1. సంభ్రమించు; 2. చలించు. (రూ. తత్తఱిలు. చలించుటకు.)

**తత్తెర** (దే.వి.) : సారాయిపోసెడు తిత్తి.

**తత్పరుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) (ఒకట) ఆసగలవాఁడు.

**తత్రత్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అక్కడ కలిగినది.

**తత్వజ్ఞుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) తత్వము తెలిసినవాఁడు.

**తత్వము** (సం.వి.అ.న.) : 1. పరమాత్మ; 2. స్వభావము; 3. నృత్యాది విలంబితమానము. (పంచ వింశతి తత్వములు. – అష్టప్రకృతులు షోడశ వికారములు పురుషుఁడు)

**తథాగతుఁడు** (సం.వి.అ.పుం.) : బుద్ధదేవుఁడు.

**తథ్యము** (సం.వి.అ.న.) : సత్యము. (విణ.) : సత్యమైనది.

**తదాత్వము** (సం.వి.అ.న.) : అకాలము.

**తదియ** (వై.వి.) : పక్షమునందు మూడవతిథి.

**తదీయము** (సం.వి.) : (అ.ఆ.అ.) తత్సంబంధ మైనది.

**తద్గుణము** (సం.వి.అ.పుం.) : 1. ఒక యర్థాలం కారము (చూ.) అలంకారము. 2. ఆగుణము.

**తద్ద** (దే.అవ్య.) : అత్యంతము. (ఇదియును వర్ణాంతమునగును.

**తద్దినము** (సం.వి.అ.న.) : ఆదినము. (వాడుక యందు మృతి పొందిన దినము.)

**తద్దె** (దే.వి.) : పండుగ. (అట్లతద్దె,ఉట్లతద్దె. మొ.)

**తనకలి** (దే.వి.) : చిక్కు (చూ.గొల్ల.దే. కడపటి ఉదా.) (విణ.) : 1. చిక్కు గలది; 2.చిక్కులఁ బెట్టువాఁడు.

**తనఖా** (హిం.వి.) : తాకట్టు, దత్త పత్రము.

**తనఖీ తనిఖీ** (హిం.వి.) : విమర్శ.

**తనము** (ఉభ.వై.అప.) : భావార్థమునందు వచ్చెడు నొక ప్రత్యయము. (గొప్పతనము, చిన్నతనము. మొ.) (సం.వి.అ.పుం.) : 1. చందనము; 2. చిత్తము.

**తనయ** (సం.వి.ఆ.స్త్రీ.) : పుత్రిక, కూఁతురు.

**తనయుఁడు** (సం.వి.అ.పుం.) : పుత్రుఁడు, కొడుకు.

**తనరారు** (ద్వ.అ.క్రి.) : (తనరి+ఆరు) 1.ఉన్నత మగు; 2. అతిశయించు.

**తనరు** (వై.అ.క్రి.) : 1. అతిశయించు 2. విజృం భించు; 3. ఒప్పు.

**తనరుచు** (వై.అ.క్రి.) : తనరు యొక్క రూపాం తరము. (రూ. తనర్చు. అతిశయించుటకు.)

**తనరుపు** (వై.వి.) : 1. పొడవు; 2. అతిశయము. (రూ. తనర్పు. పొడవునకు.

**తనాబి** (దే.వి.) : స్తంభముల మీఁది గోడకు క్రింద వేసెడు పెద్ద పలక.

**తని** (వై.విణ.) : 1. అల్పము; 2. సూక్ష్మము.

**తనిమము** (సం.వి.న్.పుం.) : 1. కార్శ్యము; 2. విస్తారము; 3. శరీరత.

**తనియు** (దే.అ.క్రి.) : ఆపోవు, తృప్తిపడు.

**తనివి** (దే.వి.) : ఆపోక, తృప్తి.

**తనివు** (దే.వి.) : తనివి. (కొన్ని వ్రాఁత పుస్తకముల యందును అచ్చు పుస్తకముల యందును ఈ పాఠము కనఁబడుచున్నది. దీనిని సాధువు గానే గ్రహింపవచ్చును. అప్పుడు ఇది ఉలివు లోనగు వానివంటిదని తెలియవలెను.)

**తనివోవు** (దే.అ.క్రి.) : (తనివి + పోవు) తనియు.

**తనిసను** (దే.అ.క్రి.) : (తనివి + చను) తనియు.

**తను** (దే.విణ.) : వృత్తియందు తనుపు శబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము.

**తనుకు** (దే.అ.క్రి.) : 1. కలుగు; 2. జ్వలించు. 3. ప్రకాశించు. 4. తపించు.

**తనుత్రము** (సం.వి.అ.న.) : కవచము, బొందలము.

**తనుత్రాణము** (సం.వి.అ.న.) : కవచము, బొందలము. (శిరస్త్రాణము శిరస్కము, ముఖ త్రాణము దలపము, ఉదరత్రాణము నాగోదము, జంఘాత్రాణము మంఖుణము, బాహు త్రాణము బాహులము, అంగులీత్రాణము గోధ.)

**తనుపారు** (దే.అ.క్రి.) : (తనువు + ఆరు) 1. తనియు; 2. చల్లనయగు.

**తనుపు** (దే.ప్రే.) : తనియఁజేయు. 1.తనివి; 2.శైత్యము; 3.శైత్యోపచారము; 4.పితృయజ్ఞము; 5. తడి. (రూ. తన్పు.)

**తనుమధ్య** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. సన్నని నడుముగల ఆఁడుది; 2. ఆఁడుది.

**తనువడు** (ద్వ.అ.క్రి.) : (తనుపు + పడు) చల్లఁబడు.

**తనువు** (సం.వి.ఉ.స్త్రీ.) : 1. దేహము; 2. తోలు. (విణ.) : 1. చిన్న; 2. బక్క; 3. సన్నము.

**తనూజుఁడు** (సం.వి.అ.పుం.) : తనయుఁడు, కొడుకు.

**తనూనపాత్తు** (సం.వి.త్.పుం.) : అగ్ని.

**తనూభవుఁడు** (సం.వి.అ.పుం.) : తనూజుఁడు, కొడుకు.

**తనూరుహము** (సం.వి.అ.న.) : 1. వెండ్రుక; 2. ఱెక్క (రూ. తనురుహము.)

**తన్ను** (దే.స.క్రి.) : 1. పాదముతో తాడనము చేయు; 2. ఒరయు. (వి.) : పాదతాడనము.

**తన్నుఁగోల** (దే.వి.) : (తన్ను + కోల) ఏటవాలుగా పోటిపెట్టిన కోల.

**తన్నుబల్ల** (దే.వి.) : ద్వారము యొక్క అరిగాళ్ళ మీఁద వేసెడు పలక.

**తన్నుబిల్ల** (దే.వి.) : బాలక్రీడావిశేషము. (చూ. డాగిలి ముచ్చులు)

**తన్నులాడు** (దే.అ.క్రి.) : (తన్నులు + ఆడు) ఒకరికొకరు తన్నుకొను.

**తన్మయము** (సం.వి.) : (అ.ఈ.అ.) తత్స్వరూపమైనది.

**తన్మాత్రము** (సం.వి.అ.న.) : శబ్దాది. (పంచన్మా త్రములు: శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము.)

**తన్వి** (ఉభ.దే.వి.) : తనివి యొక్క రూపాంతరము. (సం.ఈ.స్త్రీ.) : 1. కృశించిన దేహము గల ఆఁడుది; 2. ఆఁడుది.

**తపతప** (దే.వి.) : ఱెక్కలుకొట్టుకొనుట యందగు ధ్వన్యనుకరణము.

**తపనము** (సం.వి.అ.న.) : 1. తాపము. (ఈ యర్థమున నిది తెనుఁగు ప్రయోగముల యందు స్త్రీ సమముగాఁ గానఁబడియెడి.) 2. నాయికకు ప్రియ వియోగ కాలమందు మన్మథావేశముచే గలిగెడు చేష్ట. (పుం.) : 1. వేసంగి కాలము; 2. నరక విశేషము; 3. జీడి.

**తపనీయము** (సం.వి.అ.న.) : స్వర్ణము, బంగారు.

**తపనుఁడు** (సం.వి.అ.పుం.) : సూర్యుఁడు.

**తపము** (సం.వి.అ.పుం.) : వేసంగి కాలము. (స్.న.) : 1.తపస్సు; 2. ఒక లోకము; (చూ.లోకము) 3. చాంద్రాయణాది పుణ్య కర్మము. (పుం.) : 1. శిశిరఋతువు; 2. మాఘ మాసము.

**తపసి** (వై.వి.) : 1. తపస్వి; 2. గార చెట్టు.

**తపస్య** (సం.వి.ఆ.స్త్రీ.) : వ్రతచర్య. (అ.పుం.ము.): ఫాల్గున మాసము.

**తపస్వి** (సం.వి.న్.పుం.) : తపము చేయువాఁడు. (విణ.) : కనికరింపఁ దగినవాఁడు.

**తపస్విని** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. తాపసురాలు; 2. కటుక రోహిణి; 3. జటామాంసి.

**తపారము** (దే.వి.) : ఒకదినుసు కుల్లాయ.

**తపారు** (దే.వి.) : తపారము యొక్క రూపాంతరము.

**తపించు** (సం.అ.క్రి.) : 1. తాపము నొందు; 2. తపస్సుచేయు.

**తపోధనుఁడు** (సం.వి.అ.పుం.) : తపస్సే ధనముగాఁ గలవాఁడు, తపస్వి.

**తప్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) తపింపఁజేయఁ బడినది, కాఁచఁ బడినది.

**తప్పకాయ** (దే.వి.) : విత్తుపట్టనికాయ.

**తప్ప** (దే.వి.) : గింజపట్టని ధాన్యము.

**తప్పిదము** (ద్వ.వి.) : (తప్పు + ఇదము) దోషము. (తప్పు యొక్క రూపాంతరము.)

**తప్పు** (యు.దే.అ.క్రి.) : తక్కు. (స.క్రి.) : అతిక్ర మించు. (వి.) : తప్పిదము.

**తప్పుడు** (వై.వి.) : తప్పుట.

**తప్పుడువడు** (వై.అ.క్రి.) : (తప్పుడు + పడు) 1. తప్పు పడు; 2. సరితప్పు.

**తప్పుదల** (ద్వ.వి.) : తప్పుట.

**తప్పుదారి** (వై.వి.) : తప్పుత్రోవ, అపథము.

**తప్పుదెబ్బలు** (ద్వ.వి.) : బళ్లయందు ప్రొద్దుపోయి వచ్చినందులకై వచ్చిన క్రమముఁ బట్టి బాలురను ఉపాధ్యాయులు కొట్టెడు ఒకటి రెండు మొదలగు దెబ్బలు.

**తప్పెట** (వై.వి.) : 1. చర్మవాద్యవిశేషము; (చూ. భేరి) 2. వనకుళుత్థము.

**తఫావతు** (హిం.వి.) : భేదము, లోపము, తక్కువ.

**తఫిసీలు** (హిం.వి.) : వివర్ణము.

**తబము** (వై.వి.) : తపస్సు.

**తబుకు** (దే.వి.) : తములపాకుతట్ట.

**తబేలా** (హిం.వి.) : గుఱ్ఱపులాయము.

**తబ్బిబ్బు** (దే.వి.) : తడఁబాటు, విపర్యయము.

**తబ్దీలు** (హిం.వి.) : మార్పు.

**తమంగము** (సం.వి.అ.పుం.) : మంచె, తమగము.

**తమకపడు** (ద్వ.అ.క్రి.) : (తమకము + పడు) 1. త్వరపడు; 2. మోహపడు (చూ. తమకము)

**తమకము** (దే.వి.) : 1. త్వర 2. మోహము.

**తమకి** (దే.విణ.) : (తమకము + ఇ) 1.త్వర గలవాఁడు; 2. మోహము గలవాఁడు (చూ.తమకము)

**తమకించు** (దే.అ.క్రి.) : 1.త్వరపడు; 2.చలించు.

**తమకు** (దే.అ.క్రి.) : చలించు. (వి.) : విధము.

**తమగము** (వై.వి.) : మంచె.

**తమటము** (సం.వి.అ.పుం.) : తప్పెట. (చూ. తమ్మటము.)

**తమము** (సం.వి.స్.న.) :1.చీఁకటి; 2.ఒక గుణము; (చూ.గుణము) 3. శోకము. (పుం, న.) : రాహుగ్రహము.

**తమరము** (సం.వి.అ.న.) : లోహ విశేషము, తగరము.

**తమస్విని** (సం.వి.ఈ.స్త్రీ.) : త్రియామ, రాతిరి.

**తమాము** (హిం.విణ.) : అంత.

**తమాయించు** (దే.అ.క్రి.) : స్తిమితమగు, శమించు.

**తమాలపత్రము** (సం.వి.అ.న.) : 1. బొట్టు; 2. మకరికా పత్రము; 3. చీఁకటిమ్రాను.

**తమాలము** (సం.వి.అ.న.) : బొట్టు. (పుం.) : 1. కత్తి; 2. ఉలిమిరి; 3. చీఁకటిమ్రాను.

**తమాషా** (హిం.వి.) : వేడుక.

**తమి** (ఉభ.దే.వి.) : 1. త్వర; 2. కుతూహలము; 3. అపేక్ష; 4. వలపు. (చూ. తమికొను.) (సం.ఇ.ఈ.స్త్రీ.) : 1. రాతిరి; 2. చీఁకటి.

**తమిఁద** (దే.వి.) : రాగిపైరు. (బ.) : రాగులు (చూ. తవ్విఁద)

**తమికొను** (దే.అ.క్రి.) : 1. త్వరపడు; 2. కుతూహలపడు; 3. అపేక్షపడు; 4. మోహపడు. (ప్రే. తమికొల్పు. మోహపఱచుటకు.)

**తమిరె** (దే.వి.) : కాఁడినడిమి చీల, శమ్య.

**తమిస్ర** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.చీకఁటిరేయి; 2.చిమ్మచీకఁటి. (అ.స్త్రీ.అ.న.ము.) : చీఁకటి. (న.) : కోపము.

**తముకు** (దే.వి.) : చర్మవాద్య విశేషము, తుడుము.

**తములపాకు** (ద్వ.వి.) : (తములము + ఆకు) నాగవల్లీదళము (రూ. తములపుటాకు.)

**తములము** (వై.వి.) : తమ్ములము యొక్క రూపాంతరము.

**తమ్మ** (దే.వి.) : 1.చర్వితతాంబూలము; 2.తంబ.

**తమ్మంటు** (దే.వి.) : (తమ్మె+అంటు) కుండలము.

**తమ్మటము** (సం.వి.అ.పుం.) : తమటము, తప్పెట. (ప్రయోగము లిట్లున్నవి. కొందఱు తమట **తమ్మట** శబ్దముల నుద్దేశ్యములుగా వ్రాసియున్నారు.)

**తమ్మితసుకు** (దే.వి.) : తమ్మపడిగము.

**తమ్మళ** (దే.వి.) : తంబళ యొక్క రూపాంతరము.

**తమ్మళి** (దే.వి.) : తంబళి యొక్క రూపాంతరము.

**తమ్మి** (యు.దే.వి.) : వృక్షవిశేషము. (వై.) : 1. పద్మము; 2. పద్మవ్యూహము.

**తమ్మికంటి** (ద్వ.వి.) : (తమ్మి + కన్ను) 1. కమలముల వంటి కన్నులుగల ఆఁడుది, కమలాక్షి; 2. ఆఁడుది; 3. విష్ణువు. కమలాక్షుఁడు. (ఇట్లు తామరకంటి. మొ.)

**తమ్మికెంపు** (ద్వ.వి.) : పద్మరాగమణి. (ఇట్లు తామరకెంపు. మొ.)

**తమ్మిచూలి** (ద్వ.వి.) : బ్రహ్మ, పద్మయోని. (ఇట్లు తామర చూలి. మొ.)

**తమ్మిదీవి** (వై.వి.) : పుష్కరద్వీపము.

**తమ్మిదొర** (ద్వ.వి.) : సూర్యుఁడు, పద్మినీ వల్లభుఁడు.

**తమ్మిపగతుఁడు** (ద్వ.వి.) : చంద్రుఁడు, అబ్జారి.

**తమ్మిపుట్టు** (ద్వ.వి.) : బ్రహ్మ, అజ్జయోని.

**తమ్మియ** (దే.వి.) : 1.చెవితమ్మె; 2.పలుపుతమ్మె.

**తమ్మియింటిగరిత** (ద్వ.వి.) : లక్ష్మి, పద్మాలయ.

**తమ్ముఁడు** (దే.వి.) : వెనుకఁబుట్టినవాడు, అనుజుఁడు. (వృత్తియందు తమ్మి గమి, తమ్మి గుబ్బ, తమ్మిదోయి, తమ్మి ప్రోవు. మొ.)

**తమ్ములము** (వై.వి.) : తాంబూలము. (ఈ యుదాహరణమునందలి తక్కిన ముందటి భాగమును అడపకడఁ జూచినది.)

**తమ్ములవిందు** (ద్వ.వి.) : సూర్యుఁడు, పద్మ బాంధవుఁడు. (చూ. చుట్టలుఁగు.)

**తమ్మువాఁడు** (దే.వి.) : తమ్ముఁడు (చూ. తమ్ముఁడు)

**తమ్మె** (దే.వి.) : 1.చెవియొక్క అడుగు భాగము; 2. పసుల మెడను దగిలించెడు పలుపు యొక్క ముందు భాగము. (తమ్మియ యొక్క రూపాంతరము.)

**తయారు** (హిం.విశే.) : సిద్ధమైన.

**తయినాతి** (హిం.వి.) : కాచికొనియుండుట.

**తరంగము** (సం.వి.అ.పుం.) : ఊర్మి, అల.

**తరంగిణి** (సం.వి.ఈ.స్త్రీ.) : తటిని, నది, ఏఱు.

**తరండము** (సం.వి.అ.పుం.న.) : 1.ఓడ; 2.గాలపుదారము కట్టిన కొయ్య లోనగునది; 3.పుట్టి.

**తరఁగ** (వై.వి.) : అల.

**తరకటించే** (వై.అ.క్రి.) : తర్కించు.

**తరకటింపు** (వై.వి.) : తర్కము. (చూ. ఆరగింపు)

**తరకసము** (దే.వి.) : అమ్ములపొది, తూణీరము.

**తరకసా** (దే.వి.) : తరకసము యొక్క రూపాంతరము.

**తరక్షువు** (సం.వి.ఉ.పుం.) : సివంగి, మృగాదనము.

**తరగంపియ** (దే.వి.) : తరగంపె.

**తరగంపె** (దే.వి.) : ఒక దినుసు అంపము. (తరగంపియ యొక్క రూపాంతరము.)

**తరగతి** (మి.గ్రా.వి.) : (తరము + గతి) తరమును దెలిపెడు భాగము.

**తరగతిగుండ్లు** (వి.గ్రా.వి.బ.) : స్త్రీల కంఠభూషావిశేషము.

**తరణము** (సం.వి.అ.న.) : దాఁటుట. (పుం.) : ఓడ.

**తరణి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. ఓడ; 2. దాఁటుట; 3. పిన్నగోరంట; 4. చేమంతి. (అని కొందఱు) (పుం.) : 1. సూర్యుఁడు; 2. సముద్రము.

**తరతరము** (దే.అవ్య.క్రి.విణ.) : (తరము + తరము) 1. క్రమముగా; 2. పరంపరగా.

**తరపణ్యము** (సం.వి.అ.న.) : ఓడనడపు వాని కిచ్చెడు కూలి, కేవు.

**తరపు** (దే.స.క్రి.) : పోఁగొట్టు, హరించు.

**తరపు** (హిం.వి.) : పక్షము, దేశము.

**తరబడి** (దే.వి.) : (తరము + బడి) తరము.

**తరబియ్యతు** (హిం.వి.) : నేర్పు.

**తరము** (ఉభ.దే.వి.) : 1.పురుషాంతరము; 2.మానము; 3.సామ్యము; 4. వరుస; 5. దినుసు. (విణ.) : 1. శక్యము; 2. శక్తము; 3. సమానము. (సం.వి.అ. పుం.) : దాఁటుట.

**తరలు** (దే.అ.క్రి.) : ప్రయాణమగు. (చూ. తముకు)

**తరవరి** (వై.వి.) : పట్టాకత్తి. (రూ. తరవలి.)

**తరవాణి** (దే.వి.) : పుల్లనీళ్లు.

**తరవాయి** (దే.వి.) : 1.సమయము; 2.ఉపక్రమము; 3. అనుక్రమము; 4. తడవ; 5. మిగిలినది.

**తరవారి** (సం.వి.ఇ.పుం.) : కత్తి, పట్టాకత్తి. (అని కొందఱు.)

**తరసము** (సం.వి.అ.న.) : మాంసము, పొల.

**తరస్వి** (సం.వి.న్.పుం.) : పులి. (విణ.) : 1. బలిమి గలవాఁడు; 2. వడి గలవాఁడు.

**తరస్సు** (సం.వి.స్.న.) : 1. బలిమి; 2. వడి.

**తరహా** (హిం.వి.) : విధము, రీతి.

**తరళము** (సం.వి.అ.పుం.) : హార మధ్య రత్నము. (విణ.) : 1.చలించునది; 2.అనురాగము గలది; 3. ప్రకాశించునది.

**తరళితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చలించినది.

**తరళేక్షణ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. చలించు కన్నులు గల ఆఁడుది; 2. ఆఁడుది. (దీనికి తెనుఁగున సరియైన పదము క్రాలుగంటి.)

**తరాజు** (దే.వి.) : త్రాసు. (రాజులుతరాజులు.)

**తరాసు** (దే.వి.) : తరాజు యొక్క రూపాంతరము.

**తరి** (ఉభ. వై.వి.) : త్రచ్చుట, మథనము. 1. ఓడ; 2. పొగ; 3. మబ్బు; 4. మాగాని.

**తరించు** (సం.స.క్రి.) : (సముద్రము లోనగు వానిని ఓడలోనగు సాధనములచే) దాఁటు.

**తరికాఁడు** (వై.విణ.) : త్రచ్చువాఁడు.

**తరిగంబము** (వై.వి.) : (తరి + కంబము) పెరుగు త్రచ్చెడు స్తంభము, కుటరము.

**తరిగడప** (వై.వి.) : (తరి + కడవ) పెరుగు త్రచ్చెడు కుండ, మంథని.

**తరిగొండ** (వై.వి.) : (తరి + కొండ) మంథాద్రి.

**తరిగొట్టి** (ద్వ.వి.) : ఒక దినుసు కూరాకు, లాంగలి.

**తరిగోల** (ద్వ.వి.) : (తరి + కోల) కవ్వము, మంథానము.

**తరిచుట్టు** (ద్వ.స.క్రి.) : (పెరుగు దేవతాదులకు) నివేదనము చేయు.

**తరిటి** (దే.వి.) : రెండు పెండెలు బిగించెడు గోనెపట్ట. (రూ. తరిటీ.)

**తరితీపు** (ద్వ.వి.) : 1.ఉపేక్ష; 2.ఉద్ధృతి. (ఇక్కడ మథన మాధుర్య మర్థాం తరము.) 3.అపేక్ష.

**తరితీపుసేయు** (ద్వ.అ.క్రి.) : (తరితీపు + చేయు) గర్వించు. స.క్రి. ఉపేక్షించు.

**తరిత్రాడు** (ద్వ.వి.) : పెరుగుత్రచ్చెడు త్రాడు, మంథరజ్జువు.

**తరిదాలుపు** (ద్వ.వి.) : (తరి + తాలుపు) మంథ పర్వతమును ధరియించినవాడు, విష్ణువు. (రూ. తరిదాల్పు.)

**తరివట్టు** (దే.స.క్రి.) : (తరి + పట్టు) (దేవతలను ఉద్దేశించి పెరుగును) త్రచ్చక నిలుపు.

**తరుచు** (వై.స.క్రి.) : చిలుకు, మథించు.

**తరుణము** (ఉభ.దే.వి.) : సమయము. (సం. అ.న.) : కుబ్జ పుష్పము. (పుం.) : ఆముదపుఁ జెట్టు. (విణ.) : 1. యౌవనము గలది; 2. క్రొత్తది. (రూ. తలునము)

**తరుణి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. యౌవనము గల ఆఁడుది; 2. ఆఁడుది. (రూ. తలుని)

**తరుణిమ** (సం.వి.న్.పుం.) : యౌవనము, జవ్వనము.

**తరుణుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) యౌవనము గలవాఁడు.

**తరువడి** (దే.వి.) : తఱిమెన.

**తరువాయి** (దే.వి.) : అనంతరము.

**తరువు** (ఉభ.దే.వి.) : ఇయ్యవలసిన ధనాదికము నిమ్మని చేయు నిర్బంధము. (సం.ఉ.పుం.) : చెట్టు.

**తరువుకత్తె** (ద్వ.విణ.) : తరువు వచ్చినది.

**తరవుకాఁడు** (దే.విణ.) : తరువు వచ్చినవాఁడు.

**తర్కము** (సం.వి.అ.పుం.) : 1. ఊహ; 2. అధ్యాహారము; 3. కారణము; 4. కోరిక; 5. ఒక శాస్త్రము. (చూ. శాస్త్రము)

**తర్కారి** (సం.వి.ఈ.స్త్రీ.) : తక్కిలి.

**తర్కించు** (సం.అ.క్రి.) : తర్కముచేయు.

**తర్కుటము** (సం.వి.అ.న.) : (నూలు) వడుకుట.

**తర్కులాసకము** (సం.వి.అ.పుం.) : నూలు వడుకునపుడు కదురు క్రింద నుంచుకొనెడు చిప్ప.

**తర్కువు** (సం.వి.ఉ.పుం.) : (నూలు వడికెడు) కదురు.

**తర్చే** (వై.స.క్రి.) : తరుచు యొక్క రూపాంతరము. (అనేక గ్రంథముల యందు పాఠమిట్లు కనఁబడుచున్నది.)

**తర్జనము** (సం.వి.అ.న.) అదలుపు.

**తర్జని** (సం.వి.ఈ.స్త్రీ.) : ప్రదేశిని, జుట్టనవ్రేలు.

**తర్జించు** (సం.స.క్రి.) : అదలించు.

**తర్జుమా** (హిం.వి.) : భాషాంతరము.

**తర్దువు** (సం.వి.ఊ.స్త్రీ.) : మ్రానిగరిఁటె; త్రెడ్డు.

**తర్ణకము** (సం.వి.అ.పుం.) : అప్పుడు పుట్టిన దూడ.

**తర్తనికము** (సం.వి.అ.పుం.) : కాకిగూఁడు.

**తర్పణము** (సం.వి.అ.న.) : తృప్తి, తనివి.

**తర్మము** (సం.వి.న్.న.) : యూపస్తంభపు కొన.

**తర్లు** (దే.అ.క్రి.) : ప్రయాణమగు. (తరలు యొక్క రూపాంతరము.)

**తర్షణము** (సం.వి.అ.న.) : దప్పిగొనుట.

**తర్షము** (సం.వి.అ.పుం.) : 1. దప్పి; 2. ఇచ్ఛ.

**తర్షితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) దప్పికొన్న వాఁడు.

**తఱక** (దే.వి.) : గింజపట్టని ధాన్యము.

**తఱచే** (దే.వి.) : బాహుళ్యము. (విణ.) : 1. బహుళము; 2. అధికము.

**తఱటు** (దే.స.క్రి.) : కశతోకొట్టు (వి.) : 1. కశ; 2. మౌర్ఖ్యము. (విణ.) : మూర్ఖము. (తఱటు వెట్టి.)

**తఱటుగొను** (దే.స.క్రి.) : (తఱటు + కొను) కశతో కొట్టు.

**తఱటుసేయు** (ద్వ.స.క్రి.) : (తఱటు + చేయు) కశతో కొట్టు.

**తఱతఱ** (దే.వి.) : తత్తఱ. (వానికి తఱ తఱ యెత్తినది.)

**తఱతఱలాడు** (దే.అ.క్రి.) : (తఱతఱలు + ఆడు) తత్తఱపడు. (వాఁడు ఆ మాటవిని తఱతఱ లాడుచున్నాఁడు.)

**తఱపి** (దే.వి.) : 1. ఆఱునెలలదూడ, బష్కయము; 2. తారుణ్యము. (విణ.) : తరుణము.

**తఱపియావు** (దే.వి.) : (తఱపి + ఆవు) బహు కాలమునకు ముందీనిన యావు, బష్కయణి.

**తఱలు** (దే.అ.క్రి.) : 1. చలించు; 2. సంభ్రమించు. (స.క్రి.) : విడుచు.

**తఱలుచు** (దే.ప్రే.) : తఱలఁజేయు. (రూ.) తఱల్చు. విడిపించుటకు.

**తఱి** (దే.వి.) :1. సమయము; 2. సమీపము; 3. త్రాడు లోనగువాని యొత్తుడు రేఖ; 4. వృత్తి యందు తఱిమెన శబ్దమునకు మీఁది వర్ణములు లోపింపఁగా మిగిలిన రూపము (తఱిగోడు)

**తఱిగొను** (దే.అ.క్రి.) : (తఱి + కొను) యత్నించు.

**తఱిమెన** (దే.వి.) : ప్రాను చిలుకుట. (దీనికి వృత్తి యందంత్య వర్ణములు లోపించును. చూ. తఱి.)

**తఱిమెనఁబెట్టు** (దే.స.క్రి.) : (తఱిమెనన్ + పెట్టు) ప్రానుచిలుకు.

**తఱియఁబడు** (వై.అ.క్రి.) : (తఱియన్ + పడు) తఱియు. (స్వార్థమున పడు.)

**తఱియు** (యు.దే.అ.క్రి.) : సమీపించు. 1. అతి క్రమించు; 2. దాఁటు.

**తఱివడు** (ద్వ.అ.క్రి.) : (తఱి + పడు) ఒత్తుడు పడు. (చూ. గోడి)

**తఱుఁగు** (దే.అ.క్రి.) : తగ్గు, క్షయించు.

**తఱుగరి** (దే.వి.) : (తఱుగు + అరి) తఱుగు బేరకాఁడు.

**తఱుగాకు** (దే.వి.) : (తఱుగు + ఆకు) కొయుగూర.

**తఱుగు** (దే.స.క్రి.) : 1. ఖండించు; 2. చించు.

**తఱుచు** (దే.వి.) : (చూ.) తఱచు.

**తఱుపు** (దే.వి.) : 1. ఏఁడాది వయసు చెల్లిన ఆఁడుదూడ; 2. మణి విశేషము.

**తఱుము** (దే.అ.క్రి.) : 1.కవియు; 2.త్వరితపడు. (స.క్రి.) : 1. వెంబడించి పరుగెత్తించు; 2.బలాత్కరించు; 3. తఱిమెనఁబెట్టు.

**తఱులమెకము** (ద్వ.వి.) : తఱులమోర మెకము యొక్క రూపాంతరము.

**తఱులమోరమెకము** (ద్వ.వి.) : కోఁతి; వలీముఖము.

**తఱువు** (దే.అ.క్రి.) : తగ్గు. (స.క్రి.) : ఖండించు.

**తఱుసలి** (దే.విణ.) : ఉద్ధతుఁడు.

**తఱ్ఱి** (దే.విణ.) : నీచుఁడు.

**తఱ్ఱు** (దే.విణ.) : నీచుఁడు.

**తల** (యు.దే.వి.) : 1.శిరసు; 2.శిరసు వెండ్రుకలు; 3. కొన; 4. పూనిక; 5. ఎత్తు; 6. ముందుభాగము; 7.మొత్తము; 8.ఎడ; 9.సమయము. (వై.వి.) 1. చోటు; 2.రంగము; 3. పక్షము.

**తలంటు** (దే.అ.క్రి.) : తలయంటు యొక్క రూపాంతరము.

**తలఁకించే** (దే.అ.క్రి.) : చలించు. (ప్రే.) : తలకజేయు.

**తలఁకు** (దే.అ.క్రి.) : 1.చలించు; 2. భయపడు. (వి.) : 1. చలనము; 2. భయము.

**తలఁగు** (దే.అ.క్రి.) : తొలఁగు. (అం,ప్రే.) : తొలఁగించు.

**తలఁగుడు** (దే.వి.) : తొలఁగుట.

**తలఁచే** (దే.స.క్రి.) : 1. ఎంచు; 2. ధ్యానించు; 3. స్మరించు.

**తలఁపు** (దే.వి.) : 1.తలఁచుట; 2.అభి ప్రాయము; 3.కోరిక; 4.చింత; 5. జ్ఞప్తి; 6. హృదయము.

**తలఁపుచేయు** (దే.అ.క్రి.) : ఎంచు, భావించు.

**తలఁపుచూలి** (దే.వి.) : మన్మథుఁడు, భావజుఁడు.

**తలఁపుమిన్న** (ద్వ.వి.) : చింతామణి. (ఇట్లు తలఁపురతనము, తలఁపుఱాయి.)

**తలఁపుఱాయి** (దే.వి.) : చింతామణి. (ఇట్లు తలఁపురతనము. మొ.)

**తలఁపుసాకిరి** (ద్వ.విణ.) : ఈ కార్యము నీవెఱిఁగి యుండమని పలుమాఱు వాదిచే తెలిపింపఁ బడిన సాక్షి, స్మారితుఁడు.

**తలఁబ్రాలు** (దే.వి.) : (తలన్ + ప్రాలు) వివాహ కాలమందు దోసిళ్లతో తల మీఁదఁ బోయు నక్షతలు.

**తలకట్టు** (దే.వి.) : 1. అకారము యొక్క రూపాంతర నామము; 2.పాగకట్టుట 3.పాగ. (విణ.) : కన్నాకు, ముఖ్యము.

**తలకడచే** (దే.స.క్రి.) : తలమీఱు, అతిక్రమించు.

**తలకాఁడి** (దే.వి.) : బరువు అధికమై రెండెద్దుల కంటె హెచ్చుగా కట్టవలసి నప్పుడు సంతన చేసి మొదటికాఁడికి ముందు కట్టెడు మఱియొక కాఁడి, ప్రాసంగము.

**తలకాయ** (దే.వి.) : తల, శిరము.

**తలకూడు** (దే.అ.క్రి.) : సిద్ధించు.

**తలకెడవు** (దే.విణ.) : తలక్రిందు.

**తలకొట్లమారి** (దే.విణ.) : (తలకొట్లు+మారి) 1.శిరశ్ఛేదనము పొందిన వాఁడు; 2. అవినీతుఁడు.

**తలకొను** (దే.అ.క్రి.) : 1. కలుగు; 2. యత్నించు. (ప్రే. తలకొల్పు.)

**తలకొనుదెంచే** (దే.అ.క్రి.) : (తలకొను + తెంచు) తలకొను, కలుగు. (స్వార్థమున తెంచు.)

**తలకొఱివి** (దే.వి.) : అపరకర్మము చేయువాఁడు శవము ఱొమ్మున నుంచెడు నిప్పు.

**తలకోల** (దే.వి.) : సాధువు కాని యావును పిదుకు నపుడు కొనను త్రాడుకట్టి దాని కొమ్ములకు తగిలించి పట్టుకొనెడు కోల.

**తలకోలు** (దే.వి.) : తలకొనుట.

**తలక్రిందు** (దే.విణ.) : 1. అధోముఖము; 2. విలోమము.

**తలగడ** (ద్వ.వి.) : (తల + కడ) 1. (పండుకొను నపుడు) తలయుంచు కొనెడు దిక్కు; 2. తలక్రింద ఎత్తుగా నుంచుకొనెడు నిడుపాటి దిండు, ఉపధానము.

**తలగడుగు** (దే.వి.) : (తల + కడుగు) తలంటు, అభ్యంగము.

**తలగాము** (ద్వ.వి.) : రాహువు.

**తలగుంజ** (ద్వ.వి.) : నిట్రాడు.

**తలచీల** (దే.వి.) : మీటనుమునసను జేర్చి బిగించెడు చీల.

**తలచేమురు** (దే.వి.) : నూనె.

**తలచావిడి** (దే.వి.) : ఇంటిముందఱి చావడి.

**తలచేట్టు** (దే.వి.) : 1. పొగకట్టుట; 2. పాగ, ఉష్ణీషము.

**తలచూపు** (దే.అ.క్రి.) : పొడచూపు, తోఁచు.

**తలడిల్లు** (దే.అ.క్రి.) : తల్లడిల్లు యొక్క రూపాంతరము. (రూ. తలడించు.)

**తలతల** (దే.అవ్య.) : మనుష్యునికి మనుష్యునికి.

**తలత్రాడు** (దే.వి.) : ఎద్దుకొమ్ములకుఁ గట్టెడు కుచ్చుల తోలుత్రాడు.

**తలదువారము** (ద్వ.వి.) : తలవాకిలి.

**తలనట్టు** (దే.వి.) : వేరుపురుగు కొఱికి మోవులెండుట.

**తలపడు** (ద్వ.అ.క్రి.) : 1. ప్రారంభించు; 2. ఏర్పడు. (స.క్రి.) : 1.ఎదిరించు; 2.తాఁకు.

**తలపాటు** (ద్వ.వి.) : (తలపడుట) 1. ప్రారంభము; 2. ఎదిరించుట.

**తలపెట్టు** (దే.అ.క్రి.) : ప్రారంభించు.

**తలపొలము** (దే.వి.) : పొలిమేర వెంబడినున్న పొలము. (చూ. తఱక.)

**తలపోఁత** (దే.వి.) : 1. చింత; 2. ఆలోచన, విచారము.

**తలపోయు** (దే.అ.క్రి.) : (తలఁపు + పోయు) 1. చింతించు; 2. ఆలోచించు, విచారించు.

**తలబీకనకాయ** (దే.విణ.) : కలత నొందినది. (దీనిని తలబీకరకాయ అని వాడుచున్నారు.)

**తలమాటు** (దే.వి.) : చేటు, నాశము.

**తలమానికము** (ద్వ.వి.) : అలంకారార్థము శిరమునందుంచు కొనెడు రత్నము. (విణ.) : శ్రేష్ఠము.

**తలమించు** (దే.అ.క్రి.) : ముందుమించు.

**తలమిగులు** (దే.అ.క్రి.) : ముందుమిగులు.

**తలమీఱు** (దే.అ.క్రి.) : ముందుమీఱు.

**తలము** (ఉభ. దే.వి.) : ఏతము, (విణ.) : శక్యము. (తరము యొక్క రూపాంతరము.) (సం.వి. అ.న.) : 1.వింటి దెబ్బ తగులకుండ చేతికి తొడుగుకొనెడి అత్రైము; 2. అడవి; 3. కారణము; 4.పాతాళలోకము. (పుం,న.) : 1. స్వరూపము; 2. క్రిందిభాగము; 3. కాళ్లు చేతుల క్రింది భాగము. (పుం.) : 1. తాటి చెట్టు; 2. చాఁచిన వ్రేళ్లు గల అఱచేయి; 3. కత్తి యొక్క పిడి; 4. ఎడమచేతి తంతిమీటు.

**తలముదప్పు** (దే.అ.క్రి.) : (తలము + తప్పు) అశక్యమగు.

**తలమునుక** (దే.వి.) : 1. శిరస్స్నానము; 2.శిరః ప్రయాణము, తలబంటి. (రూ. తలమున్క.)

**తలముళ్లు** (దే.వి.బ.) : 1. వేఁటకాని సాధనము; (చూ. జీగురు.) 2. దొంగ యొక్క సాధనము. (చూ. గద్దగోరు.)

**తలయంటు** (దే.అ.క్రి.) : (తల + అంటు) తలమీఁద (నూనెపెట్టి) రాచు. (వి.) : తలమీఁద (నూనె పెట్టి) రాచుట, అభ్యంగము.

**తలయంపి** (దే.వి.) : 1. (పండుకొనునపుడు) తలయుంచుకొనెడు దిక్కు, తలగడ. 2. తల క్రింద నుంచుకొనెడు నిడుపాటి దిండు. (తలాఁపి యొక్క రూపాంతరము.)

**తలయెత్తు** (దే.అ.క్రి.) : 1. వర్ధిల్లు; 2. మొలచు.

**తలరు** (దే.అ.క్రి.) : 1. చలించు; 2. చింతించు; 3. కలఁగు; 4. సంభ్ర మించు; 5. ఒప్పు.

**తలవంపు** (దే.వి.) : 1. తలవంచుట, 2. మానభంగము.

**తలవరి** (వై.వి.) : తలారివాఁడు.

**తలవాకిలి** (దే.వి.) : ఇల్లులోనగువాని మొదటి ద్వారము.

**తలవిడి** (దే.వి.) : తలనఱకిన తాటిచెట్టు లోనగు తృణద్రుమము యొక్క తలతుండు. (తలవిడి తుండు, తలవిడి బ్రద్దలు.)

**తలవీడు** (దే.వి.) : పురఃప్రదేశము; సమీప ప్రదేశము.

**తలవు** (దే.అ.క్రి.) : తొలఁగు. (అం.ప్రే.) : తొలగించు. (తలఁగు యొక్క రూపాంతరము.)

**తలసాల** (ద్వ.వి.) : ఇంటితలవాకిలి.

**తలా** (దే.అవ్య.క్రి.విశ.) : చెఱి.

**తలాఁపి** (దే.వి.) : (తల + ఆఁపి) (చూ.) తలయంపి.

**తలాటము** (దే.వి.) : (తల + ఆట) పికిలి పిట్ట ఱెక్కలులోనగు వానిచే నేర్పఱచి గుఱ్ఱము నెత్తిని నిలువుగా నమర్చెడు తురాయి. (చూ. పోరాటము.)

**తలాడ** (ద్వ.వి.) : తలగడ యొక్క రూపాంతరము.

**తలారి** (వై.వి.) : రాత్రుల యందు దొంగతనము పోక కావలికాచు దొరతనపు బంటు. (తలవరి యొక్క రూపాంతరము.)

**తలారించే** (దే.అ.క్రి.) : మరలు.

**తలి** (దే.వి.) : తల్లి యొక్క రూపాంతరము.

**తలికె** (దే.అవ్య.) : ముందు (ప్రొద్దు పొడువక తలికెవచ్చినాఁడు. మొ.)

**తలిమము** (సం.వి.అ.న.) : 1. దూది పఱపు; 2. మేలుకట్టు; 3. ఱాతికట్టనపు నేల; 4. కత్తి.

**తలియ** (వై.వి.) : భోజనపాత్రము.

**తలిరు** (దే.వి.) : చిగురు, పల్లవము.

**తలిరుఁబోఁడి** (దే.వి.) : (తలిరు + పోఁడి) 1. చిగురువలె మనోజ్ఞురాలైన ఆఁడుది. 2. ఆఁడుది. (చూ. అలరుఁ బోఁడి.)

**తలిరుచే** (దే.అ.క్రి.) : 1. చిగిరించు; 2. సంతోషించు; 3. అతిశయించు. (రూ. తలిర్చు. సంతోషించుటకు, అతిశయించుటకు.

**తలిరుదిండి** (దే.వి.) : (తలిరు+తిండి) కోయిల, పికము.

**తలిరుపు** (దే.వి.) : తలిరుచుట. (రూ. తలిర్పు.)

**తలిరువిలుతుఁడు** (దే.వి.) : మన్మథుఁడు. (రూ.) తలిరువిల్తుఁడు. (ఇట్లు తలిరువిలుకాఁడు.)

**తలివము** (వై.వి.) : శయ్య.

**తలుకు** (దే.వి.) : తళుకు యొక్క రూపాంతరము.

**తలుగు** (దే.వి.) : పసుల గట్టెడు పలుపు, సందానము.

**తలుపు** (దే.వి.) : పనిచేసిన వాకిట మూఁతపలక, కవాటము.

**తలోదరి** (సం.వి.ఈ.స్త్రీ.) : ఆడుది.

**తల్లడ** (ద్వ.వి.) : తలగడ యొక్క రూపాంతరము.

**తల్గు** (దే.అ.క్రి.) : తలఁగు యొక్క రూపాంతరము. (తొలఁగించుటకు.) (వి.) : తలుగు యొక్క రూపాంతరము.

**తల్చు** (దే.స.క్రి.) : తలఁచు యొక్క రూపాంతరము.

**తల్పము** (సం.వి.అ.న.) : 1. దూది పఱపు; 2. అట్టడి; 3. భార్య.

**తల్లఁపి** (దే.వి.) : తలాఁపి యొక్క రూపాంతరము.

**తల్లకెడవు** (దే.విశ.) : తలకెడవు యొక్క రూపాంతరము.

**తల్లక్రిందు** (దే.విణ.) : తల్లక్రిందు యొక్క రూపాంతరము.

**తల్లజము** (సం.వి.అ.పుం.) : వృత్తియందు ఉత్తర పదమై శ్రేష్ఠతను దెలుపును. (ఉదా. కుమారీ తల్లజము. మొ.)

**తల్లడకుడుచే** (ద్వ.అ.క్రి. ) : (తల్లడము + కుడుచు) తల్లడించు.

**తల్లడపడు** (వై.అ.క్రి.) : (తల్లడము + పడు) చలించు.

**తల్లడపాటు** (వై.అ.క్రి.) : తల్లడపడుట, చలనము.

**తల్లడపెట్టు** (ద్వ.స.క్రి.) : (తల్లడము + పెట్టు) 1.చలింపఁ జేయు; 2. బాధపెట్టు.

**తల్లడము** (వై.వి.) : చలనము.

**తల్లడిల్లు** (వై.అ.క్రి.) : చలించు. (తల్లడించు అనియు.)

**తల్లి** (ఉభ. దే.వి.) : జనని. (విణ.) : 1. మొదటిది; 2. ముఖ్యము. (ఉదా. తల్లి కొంద్ర, తల్లిగోడ. మొ.) (సం.ఈ.స్త్రీ.) : జవరాలు.

**తల్లికొంద్ర** (దే.వి.) : మొదటికొంద్ర.

**తల్లిగోడ** (ద్వ.వి.) : ఇంటికి ముఖ్యమైన ప్రక్కగోడ.

**తల్లితల్లి** (దే.వి.) : 1. తల్లినిగన్న తల్లి; 2. లక్ష్మి.

**తల్లియొఱ** (దే.వి.) : నూతిపైయొఱ.

**తల్లివేరు** (దే.వి.) : ముఖ్యమైన వేరు.

**తవన** (దే.వి.) : క్లుప్తకాలము.

**తవరము** (వై.వి.) : ఒక లోహము, తగరము.

**తవళి** (దే.వి.) : రవళి, అసత్యము.

**తవాయి** (దే.వి.) : (చూ.) తళ్లు, ఉపద్రవము, తప్పు గాలి.

**తవిఁద** (దే.వి.) : రాగిపైరు. (చూ. అఱవడు.) (బ.) : ఆధాన్యము. (చూ. తవ్విఁద.)

**తవు** (దే.అ.క్రి.) : తగు యొక్క రూపాంతరము. (చూ. కవిల.)

**తవుటిపాము** (దే.వి.) : (తవుడు + పాము) మలుఁగుచేఁప.

**తవుడు** (దే.వి.) : బియ్యముమీఁది పొట్టు, కంబూకము.

**తవులఁబడు** (ద్వ.అ.క్రి.) : తగులఁబడు యొక్క రూపాంతరము.

**తవులు** (దే.అ.క్రి.స.క్రి.) : తగులు యొక్క రూపాంతరము.

**తవులుకొను** (దే.అ.క్రి.) : తగులుకొను యొక్క రూపాంతరము.

**తవులుచు** (దే.ప్రే.) : తగులుచు యొక్క రూపాంతరము. (రూ. తవుల్చు.)

**తవులుపడు** (ద్వ.అ.క్రి.) : తగులువడు యొక్క రూపాంతరము.

**తవెల** (దే.వి.) : నోరు వెడల్పుగా నుండు కుండ వంటి లోహపాత్రము.

**తవులుపడు** (ద్వ.అ.క్రి.) : తగులువడు యొక్క రూపాంతరము.

**తవెల** (దే.వి.) : నోరు వెడల్పుగా నుండు కుండవంటి లోహపాత్రము.

**తవ్వ** (దే.వి.) : రెండు సోలలకొలఁదిగల మాన విశేషము.

**తవ్విఁద** (దే.వి.) : తవిఁద యొక్క రూపాంతరము.

**తష్టము** (సం.విణ.) : (అ.ఆ.అ.) బాడిస లోనగు వానిచే చెక్కఁబడినది.

**తసి** (దే.వి.) : దట్టమగు నాఱువరుస, సడ.

**తసిలీబు** (హిం.వి.) : బహుమానము.

**తసుకు** (దే.అ.క్రి.) : ప్రేమకలిగినట్టు చేష్టించు (వి.) : 1. ప్రేమ గలిగినట్టు చేయు చేష్ట; 2. టక్కు

**తసుకులాఁడి** (దే.విణ.) : (తసుకులు + ఆఁడి) తసుకులు గలది.

**తస్కరించు** (సం.వి.క్రి.) : దొంగిలించు.

**తస్కరుఁడు** (సం.వి.అ.పుం.) : దొంగ, చోరుఁడు.

**తస్స** (దే.వి.) : దుర్మాంసము.

**తహతహ** (దే.వి.) : తమకము, వ్యసనము. (చూ.) కుతుకము.

**తహతహపడు** (ద్వ.అ.క్రి.) : తమకపడు, వ్యసనపడు, కుతూహలపడు.

**తహతహపెట్టు** (దే.స.క్రి.) : తమకపఱచు కుతూహలపఱచు.

**తహాశ్శీలు** (హిం.వి.) : పన్ను, సిస్తు.

**తహాశ్శీలుదారు** (హిం.వి.) : సిస్తు వ్యవహారము చూచు ఉద్యోగస్థుఁడు.

**తళతళ** (దే.వి.) : 1. మిఱుమిట్లుకొలుపు కాంతి, 2. మెఱయుటయందగు అనుకరణము.

**తళిగ** (వై.వి.) : 1. భోజనపాత్రము; 2. భగవన్ని వేదనార్హమైన యన్నము.

**తళియ** (వై.వి.) : తళిగ యొక్క రూపాంతరము. (భోజన పాత్రమునకు.)

**తళుకు** (దే.వి.) : మిక్కిలి ప్రకాశము.

**తళుకొత్తు** (దే.అ.క్రి.) : (తళుకు + ఒత్తు) మిక్కిలి ప్రకాశించు. (చూ. ఒత్తు.)

**తళుక్కు** (దే.వి.) : మెఱయుట యందగు అనుకరణము. (ఆమ్రేడితమునందు తళుకు తళుక్కు.) (చూ. గల్లు.)

**తళ్లు** (దే.వి.బ.) : చెఱవులోనగు వానియందు గాలిచేత ఉబికి దరిని మోఁదెడు చిన్న చిన్న అలలు.



**తా** (దే.స.) : తాను అనుదానికి ప్రాతిపదికము.

**తాండవము** (సం.వి.అ.పుం, న.) : 1. ఉద్ధత మైన నృత్యము; 2. తృణ విశేషము.

**తాండవించు** (సం.అ.క్రి.) : ఉద్ధతముగా నృత్యము చేయు.

**తాండ్ర** (దే.వి.) : విభీతకము.

**తాంతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) బడలినది.

**తాంతి** (సం.వి.ఇ.స్త్రీ.) : బడలిక.

**తాంత్రికుఁడు** (సం.వి.అ.పుం.) : 1. సిద్ధాంతము నెఱిఁగినవాఁడు; 2. విషవైద్యుఁడు.

**తాంబాళము** (దే.వి.) : తాంబూలము మొదలగు నవి యుంచుకొనుటకు ఉప యోగమగు ఇత్తడి లోనగువానితోఁ జేసిన పెద్దతట్ట.

**తాంబూలము** (సం.వి.అ.న.) : 1. వక్కాకు; 2. పోఁక.

**తాంబూలవల్లి** (సం.వి.ఈ.స్త్రీ.) : తములపాకు తీఁగ.

**తాంబూలి** (సం.వి.ఈ.స్త్రీ.) : తములపాకుతీఁగ.

**తాకత్తు** (హిం.వి.) : శక్తి, బలము.

**తాఁకించు** (దే.స.క్రి.) : శ్రమపఱచు. (ప్రే.) తాఁకఁ జేయు.

**తాకీదు** (హిం.వి.) : ఆజ్ఞాపత్రిక.

**తాఁకు** (దే.అ.క్రి.) : మార్మోను. (స.క్రి.) : 1. అంటు; 2. (యుద్ధము) ముట్టు.

**తాఁకుడు** (దే.వి.) : తాఁకుట, స్పర్శము.

**తాఁకుడువేఁకి** (దే.వి.) : వరుస మేరకు వచ్చెడు జ్వరము.

**తాఁకుదల** (దే.వి.) : (తాఁకు + తల) యుద్ధ ప్రారంభము.

**తాఁగలి** (దే.వి.) : పల్లపుమడి.

**తాఁచు** (దే.స.క్రి.) : తన్ను.

**తాజా** (హిం.వి.) : క్రొత్త, చేర్చిన.

**తాఁట** (దే.వి.) : 1. చెట్టుపైపట్ట; 2. మోసము.

**తాఁటకత్తె** (ద్వ.వి.) : మోసకత్తె (చూ. లొట)

**తాఁటదమ్మఁడు** (ద్వ.వి.) : జీవనార్థము సన్యాసి వేషము ధరించినవాఁడు, లింగి.

**తాఁడి** (దే.వి.) : తాండ్ర, విభీతకము.

**తాఁపు** (దే.వి.) : తన్ను, పాదతాడనము.

**తాఁబేలు** (దే.వి.) : తామేలు, కూర్మము.

**తాకట్టు** (దే.వి.) : (తాకు + కట్టు) అప్పు తీసికొన్న వాని యొద్దనుంచెడి యీడు.

**తాకు** (దే.వి.) : కాలిటాకు.

**తాగడించు** (దే.స.క్రి.) : (తాకు + గడించు) నిర్బంధించు.

**తాగాఁడి** (దే.వి.) : (తాకు + కాఁడి) జాతితోఁగాని మ్రానితోఁగాని హంస పాదాకారముగా నూతి ముఖమున నేర్పఱచెడు బంధనము, పీనాహము.

**తాగాణి** (దే.వి.) : తాగాఁడి యొక్క రూపాం తరము.

**తాగు** (దే.స.క్రి.) : (నీళ్లులోనగునవి) త్రాగు.

**తాగుఁబోతు** (దే.విణ.) : నియతిలేక మద్యపానము చేయు స్వభావము గలవాఁడు.

**తాచే** (వై.స.క్రి.): 1.చెక్కు, ఖచించు; 2.తొలుచు. 3.అవలంబించు. (చూ. అవలంబము.)

**తాజో** (దే.వి.) : కుళ్లాయ.

**తాటంకము** (సం.వి.అ.పుం.) : దంతములో నగువాని చేఁత జేయఁ బడిన చెవికమ్మ.

**తాటాడూటము** (దే.విణ.) : చక్కన తప్పినది.

**తాటించు** (వై.స.క్రి.) : కొట్టు (చూ. ఆస్ఫోటించు)

**తాటికట్టెడ** (ద్వ.వి.బ.) : తాటిగిటి పాము.

**తాటిగిటిపాము** (ద్వ.వి.) : తాటిచెట్టు మీఁద నుండెడి పాము.

**తాటిపడగవాఁడు** (ద్వ.వి.) : 1. బలరాముఁడు; 2. భీష్ముఁడు.

**తాటిరిక్క** (వై.వి.) : జ్యేష్ఠా నక్షత్రము.

**తాటిరిక్క నెల** (ద్వ.వి.) : జ్యేష్ఠ మాసము.

**తాటోటు** (దే.వి.) : టక్కు, మోసము.

**తాడఘ** (సం.వి.ఆ.స్త్రీ.) : సుత్తె.

**తాడనము** (సం.వి.అ.న.) : కొట్టుట.

**తాడించే** (సం.స.క్రి.) : తాటించు, కొట్టు.

**తాడితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కొట్టఁ బడినది.

**తాడు** (యు.దే.వి.) : త్రాడు. (వై.) : తాటి.

**తాత** (ఉభ. దే.వి.) : తండ్రికి తండ్రి. (వై.) : బ్రహ్మ.తండ్రి. (విణ.) : కనికరింపఁదగినవాడు.

**తాత్పర్యము** (సం.వి.అ.న.) : అభిప్రాయము.

**తాదృశము** (సం.విణ.) : (అ.ఈ.అ.)అటువంటిది.

**తానకము** (వై.వి.) : 1. జెట్లు నిలుచుండుట యందలి భేదము; 2. స్థానము.

**తానము** (ఉభ.వై.వి.) : 1.స్నానము; 2.స్థానము. (సం.అ.పుం.) : తన్నకారముతో పాడెడు పాట.

**తానవము** (సం.వి.అ.న.) : తనుత్వము.

**తాను** (దే.స.) : తాశబ్దమునకు ప్రథమైక వచనము.

**తాప** (దే.వి.) : 1. నిచ్చెన; 2. మెట్టు.

**తాపము** (సం.వి.అ.పుం.) : 1. సంతాపము; 2. బాధ. (తాపత్రయము : ఆధ్యాత్మికము, ఆధి భౌతికము, ఆధిదైవికము)

**తాపసతరువు** (సం.వి.ఉ.పుం.) : గార.

**తాపసుఁడు** (సం.వి.అ.పుం.) : తపస్సు చేయు వాఁడు, తాపసి.

**తాపి** (యు.దే.వి.) : 1.మర్మము; 2.జాడ. (వై.) 1.బేలు దారి; 2. బేలుదారి గోడ పెట్టునపుడు గారను అడుసును ఎత్తివేసి ఆాళ్లను పెట్టి సరిపటిచెడు కొయ్యపిడి వేసిన మట్టాకు వంటి యినుప సాధన విశేషము; 3. చెక్కతాపి.

**తాపించే** (వై.స.క్రి.) : 1. నెలకొలుపు, నిలుపు; 2. చెక్కు; 3. మోఁదు.

**తాపింఛము** (సం.వి.అ.పుం.) : చీఁకటిమ్రాను.

**తాపికత్తియ** (ద్వ.వి.) : సంధానము చేయునది. (రూ. తాపికత్తె.)

**తాపికాఁడు** (దే.వి.) : సంధానము చేయువాఁడు.

**తాపిత** (దే.వి.) : మేలైన పట్టువస్త్రము. (రూ. తాపితా.)

**తాపితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) తపింపఁ జేయఁబడినది.

**తాపీ** (యు.వి.) : తాపి యొక్క రూపాంతరము.

**తాపు** (వై.స.క్రి.) : చెక్కు. (వి.) : అవలంబము.

**తాబందు** (దే.వి.) : పావడ, గాగర.

**తాబేదారు** (హిం.వి.) : తక్కువ పనివాఁడు.

**తామర** (వై.వి.) : తామరపువ్వు, కమలము. (చూ. తమ్మికంటి, తమ్మి కెంపు, తమ్మిచూలి.)

**తామరచెలి** (ద్వ.వి.) : సూర్యుఁడు; పద్మమిత్రుఁడు.

**తామరతంపము** (ద్వ.వి. ) : తామర తంపర యొక్క రూపాంతరము.

**తామరతంపర** (ద్వ.వి.) : 1. తామరల సమూహము, కమలషండము; 2. అభివృద్ధి.

**తామరతూపరి** (ద్వ.వి. ) : (తామర తూపు + అరి) మన్మథుఁడు.

**తామరపాకు** (ద్వ.వి.) : (తామర + ఆకు) పద్మపత్రము. (చూ. తల్లడము)

**తామరసము** (సం.వి.అ.న.) : 1. తామర; 2. బంగారు; 3. రాగి.

**తామలకి** (సం.వి.ఈ.స్త్రీ.) : నేలయుసిరిక.

**తామసము** (ఉభ.దే.వి.) : ఆలస్యము. (సం.అ.పుం.) : పాము. (విణ.) : తమోగుణము గలది.

**తామసి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1.చీఁకటి; 2.పార్వతి.

**తామసించే** (దే.అ.క్రి.) : ఆలస్యముచేయు.

**తామసుఁడు** (సం.విణ.) : (అ.ఈ.అ.) 1. తమో గుణము గలవాఁడు; 2. దుష్టుఁడు.

**తామిస్రము** (సం.వి.అ.న.) : 1. చీఁకటి; 2. చీఁకటి మయమైన నరకము.

**తామేలు** (దే.వి.) : తాఁబేలు యొక్క రూపాం తరము. (చూ. ఇంచు)

**తామ్రకుట్టకుఁడు** (సం.వి.అ.పుం.) : రాగి పని వాఁడు, శౌల్బికుఁడు.

**తామ్రచూడము** (సం.వి.అ.పుం.) : 1. కోడి; 2. అభినయహస్త విశేషము.

**తామ్రపర్ణి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. ఒకానొక యేఱు; 2. పడమటి దిక్కునందుండెడు ఆఁడేనుఁగు.

**తామ్రము** (సం.వి.అ.న.) : రాగి, (పుం.) : ఎఱుపు. (విణ.) : ఎఱ్ఱనిది.

**తామ్రాక్షము** (సం.వి.అ.పుం.) : కోయిల. (విణ.) ఎఱ్ఱని కన్నులు గలది.

**తాయము** (దే.వి.) : అరుదగువస్తువు.

**తాయి** (వై.వి.) : తల్లి.

**తాయెతు** (ద్వ.వి.) : తాయెత్తు యొక్క రూపాం తరము.

**తాయెత్తు** (ద్వ.వి.) : (తాయి+ఎత్తు) తల్లిబిడ్డలకుఁ గట్టెడు రక్షా బంధము.

**తార** (ఉభ. దే.వి.) : సుషిర వాద్య విశేషము. (సం.ఆ.స్త్రీ.) : 1. బృహస్పతి భార్య; 2. వాలి భార్య. (అ.స్త్రీ.అ.న. ము.) : 1. కనుగ్రుడ్డు; 2. నక్షత్రము.

**తారక** (సం.వి.ఆ.స్త్రీ.) : (అ.న.ము.) : 1. కంటి నల్లగ్రుడ్డు; 2. నక్షత్రము. (అ.న.ము.) : కన్ను.

**తారకజిత్తు** (సం.వి.త్.పుం.) : తారకాసురుని జయించినవాఁడు, కుమారస్వామి.

**తారకాణ** (దే.వి.) : దృష్టాంతము. (రూ. తారకాణము)

**తారకాణించు** (దే.స.క్రి.) : 1. దృష్టాంత పఱచు; 2. మూదలించు.

**తారకుఁడు** (సం.వి.అ.పుం.) : 1.మాలిమి కాఁడు; 2.ఒకానొక రాక్షసుఁడు. (విణ.) : దాఁటించు వాడు.

**తారణ** (సం.వి.అ.పుం.) : ఒక సంవత్స రము. (చూ. సంవత్సరము.) (విణ.) : తరింపఁ జేయునది.

**తారతమ్యము** (సం.వి.అ.న.) : తరతమ భావము, న్యూనాధిక్యము.

**తారము** (ఉభ. దే.వి.) : నాలుగు కాసుల నాణెము. (సం.అ.న.) : వెండి. (పుం.) : 1. పులుగడిగిన ముత్తెము; 2. ముత్తెము పులుగడుగుట. (విణ.): గట్టి. (ప్రోఁత.)

**తారసము** (దే.వి.) : 1. సమీపము; 2. తల పాటు. (విణ.) : సమీపించినది.

**తారసించే** (దే.అ.క్రి.) : తారసిల్లు.

**తారసిల్లు** (దే.అ.క్రి.) : 1. సమీపించు; 2. వ్యాపించు. (రూ. తారసిలు. సమీపించు టకు. వ్యాపించుటకు.)

**తారాడు** (దే.అ.క్రి.) : (తారి + ఆడు) 1. తిరుగు లాడు; 2. జీరాడు. (చూ. ఊఁగాడు.)

**తారాపథము** (సం.వి.అ.పుం.) : ఆకాశము, మిన్ను.

**తారాపీఁట** (ద్వ.వి.) : ఎద్దువెన్ను మీఁద వేసెడుపీఁట.

**తారి** (వై.వి.) : ఆటాడించెడు సూత్రధారి.

**తారీఖు** (హిం.వి.) : ఆంగ్లేయ మాసములో దినము.

**తారు** (దే.అ.క్రి.) : 1. సంచరించు; 2. పోవు; 3. కదియు.

**తారుకొను** (దే.స.క్రి.) : కదియు. (ప్రే. తారు కొలుపు. చూ. తార్కొను.)

**తారుచు** (దే.ప్రే.) : తారఁజేయు, కదియించు. (రూ. తార్చు.)

**తారుపు** (దే.వి.) : 1. తార్చుట; 2. బరణి (చూ. తార్పు)

**తారుణ్యము** (సం.వి.అ.న.) : యౌవనము, జవ్వనము.

**తారేయుఁడు** (సం.వి.అ.పు.) : 1. అంగదుఁడు; 2. బుధుఁడు.

**తార్కాణ** (దే.వి.) : తారకాణ యొక్క రూపాంతరము. (రూ. తార్కాణము.)

**తార్కాణించు** (దే.స.క్రి.) : తారకాణించు యొక్క రూపాంతరము. (దృష్టాంత పఱచుటకు.)

**తార్కికుఁడు** (సం.వి.అ.పుం.) : తర్క శాస్త్రము తెలిసినవాఁడు.

**తార్కొను** (దే.స.క్రి.) : తారుకొను యొక్క రూపాంతరము.

**తార్క్ష్యుఁడు** (సం.వి.అ.పుం.) : 1. గరుత్మంతుడు; 2. అనూరుఁడు.

**తార్పు** (దే.వి.) : తారుపు యొక్క రూపాంతరము.

**తార్పులాడు** (దే.అ.క్రి.) : (తార్పులు + ఆడు) (పెంపుడు పొట్టేలు కోడి మొదలగునవి) జగడమాడు.

**తార్యము** (సం.విశ.) : (అ.ఆ.అ.) తరింపఁ దగినది.

**తాఱు** (దే.అ.క్రి.) : 1. అడఁగు; 2. మఱుఁగుపడు.

**తాఱుమాఱు** (దే.వి.) : క్రమము తప్పుట, వ్యత్యాసము. (విశ.) : క్రమము తప్పినది, వ్యత్యస్తము.

**తాఱుమాఱుపడు** (ద్వ.అ.క్రి.) : (తాఱుమాఱు + పడు) వ్యత్యస్తమగు.

**తాలకి** (సం.వి.ఈ.స్త్రీ.) : తాటికల్లు.

**తాలధ్వజుఁడు** (సం.వి.అ.పుం.) : 1. బలరాముడు; 2. భీష్ముఁడు.

**తాలపర్ణి** (సం.వి.ఈ.స్త్రీ.) : మురయనెడు గంధ ద్రవ్యము.

**తాలము** (సం.వి.అ.న.) : హరిదళము. (పుం.): చాఁపఁబడిన బొటనవ్రేలి నడిమి వ్రేలి నడిమికొలఁత.

**తాలాంకుఁడు** (సం.వి.అ.పుం.) : బలరాముఁడు.

**తాలి** (ఉభ. దే.వి.) : మంగళసూత్రము.

**తాలించే** (దే.స.క్రి.) : (కూర మొదలగు వాని) తిరుగఁబోయు.

**తాలింపు** (దే.వి.) : 1.తిరుగఁబోఁత; 2. తాలించినకూర. (చూ. ఆరగింపు.)

**తాలిక** (దే.వి.) : మెలిక.

**తాలిబొట్టు** (ద్వ.వి.) : మంగళసూత్రపు బొట్టు.

**తాలిమి** (దే.వి.) : 1. క్షమ; 2. ధైర్యము.

**తాలిమికత్తె** (ద్వ.విశ.) : క్షమావంతురాలు.

**తాలిమికాఁడు** (దే.విశ.) : క్షమావంతుడు.

**తాలీశివ** (సం.వి.ఆ.స్త్రీ.) : నేల యుసిరిక.

**తాలీసపత్రము** (సం.వి.అ.న.) : 1. తాళిసపత్రి; 2. నేల యుసిరిక.

**తాలు** (దే.వి.) : ఎన్నుతీసి యెండి పోయిన పైరు.

**తాలుచే** (దే.స.క్రి.) : 1. ధరించు, 2. (నూలు) సిరిపెట్టు; 3. తిరికలుచేయు; 4. దారములో నగువానిపేను; 5. పిండి లోనగువానియందు మెటికలు లోనగువానిని చేటతో తట్టియెత్తు. (రూ. తాల్చు. తిరికలు చేయుటకు.)

**తాలువు** (సం.వి.ఉ.న.) : దవుడ, కాకుదము.

**తాలూకా** (హిం.వి.) : జిల్లాలో నొకభాగము.

**తాల్మి** (దే.వి.) : తాలిమి యొక్క రూపాంతరము.

**తావకాళ్ళు** (దే.వి.బ.) : (తావలము + కాళ్లు) తలమెత్తువాడు కాళ్లుంచు కొనుటకు నమర్చిన పట్టెలు. (తావ కోళ్లు అని కొందఱందురు.)

**తావకీనము** (సం.విశ.) : (అ.ఆ.అ.) నీది, త్వదీయము.

**తావడము** (దే.వి.) : రుద్రాక్షలు లోనగునవి గ్రుచ్చిన హారము.

**తావరము** (వై.విశ.) : స్థిరమైనది.

**తావలము** (దే.వి.) : 1. స్థానము; 2. ఆధారము.

**తావళము** (దే.వి.) : తావడము యొక్క రూపాంతరము.

**తావి** (దే.వి.) : పరిమళము.

**తావిగట్టు** (దే.వి.) : మలయపర్వతము.

**తావినూనె** (దే.వి.) : తావిగలనూనె, అత్తరు.

**తావిమోపరి** (దే.వి.) : గాలి, గంధవహుఁడు.

**తావివిలుకాఁడు** (దే.వి.) : మన్మథుఁడు.

**తావు** (దే.వి.) : తావలము, స్థానము, కాకిదము.

**తావుకొను** (దే.అ.క్రి.) : నెలకొను, నిలుచు.

**తావేలువేయుట** (హిం.క్రి.) : పోల్చి చూచుట, సంప్రతించుట.

**తాహతు** (హిం.వి.) : శక్తి, బలము.

**తాళకము** (సం.వి.అ.న.) : 1. పర్వత ధాతు విశేషము; 2. హరిదళము; 3. తొగరిమన్ను; 4. చిన్న బీగము.

**తాళగించే** (వై.అ.క్రి.) : తాళమువేయు.

**తాళగిరి** (వై.వి.) : తాళము వేయువాఁడు.

**తాళపత్రము** (సం.వి.అ.న.) : 1. తాటాకు; 2. చెవ్వాకు.

**తాళము** (ఉభ.దే.వి.) : మల్లబంధ విశేషము. (సం.అ.న.) : బీగము. (పుం.) : 1.పాడునపుడు చేతులతో చఱచెడి చఱపు; 2.తాటి. 3. పరుఁజు; 4. పాడునపుడు జరగెడు కాల పరిమాణము; 5. తాళము వేసెడు కంచువాద్యము.

**తాళమూలిక** (సం.వి.ఆ.స్త్రీ.) : నేలతాడు.

**తాళవృంతము** (సం.వి.అ.న.) : విసనకఱ్ఱ, వ్యజనము.

**తాళి** (ఉభ.దే.వి.) : 1. పతకము; 2. హార విశేషము. (సం.ఈ.స్త్రీ.) : శ్రీతాళము.

**తాళించే** (దే.స.క్రి.) : జూదమాడునపుడు క్రింద వేయుటకై పాచికలను చేత నుంచుకొని యిటు నటు త్రిప్పు.

**తాళిక** (దే.వి.) : ఓర్పు, క్షమ. (విణ.) : చాలినది, క్షమము.

**తాళిసపత్తిరి** (వై.వి.) : ఒకానొక మందు దినుసు. (రూ. తాళిసపత్రి).

**తాళీ** (దే.వి.) : తాళి యొక్క రూపాంతరము. (హారవిశేషమునకు)

**తాళీకుఁడు** (దే.విణ.) : కార్యమును ముగించు వాఁడు.

**తాళు** (దే.అ.క్రి.) : 1. తాళికయగు; (అది నా కంటికి తాళియుండలేదు. ఆ సొమ్ము నూఱు రూపాయలు తాళును.) 2. సహించు; 3. నిదానించు. (నీవు రెండు దినములు తాళిరా.)

**తాళుకొను** (దే.అ.క్రి.) : తాళు (స్వార్థమునకొను)



**తింట** (దే.వి.) : తినుట, భుజించుట.

**తిండి** (దే.వి.) : 1. భోజనము; 2. ఆహారము.

**తిండికత్తియ** (ద్వ.విణ.) : మిక్కిలి తిను నట్టి స్వభావము గలది. భక్షకురాలు. (రూ. తిండికత్తె.)

**తిండికాఁడు** (దే.విణ.) : మిక్కిలి తినునట్టి స్వభావము గలవాడు; భక్షకుఁడు.

**తిండిపోతు** (దే.విణ.) : తిండికాఁడు, తిండికత్తె.

**తిండీఁడు** (దే.విణ.) : (తిండి+ఈఁడు) తిండికాఁడు.

**తింత్రిణి** (సం.వి.ఈ.స్త్రీ.) : చింత. (రూ. తింతిడి)

**తింత్రిణీకము** (సం.వి.అ.న.) : చింతపండు. (రూ. తింతిడీకము.)

**తిందుకము** (సం.వి.అ.పుం.) : తుమ్మికి.

**తికమక** (దే.వి.) : 1. కలఁత; 2. తొట్రుపాటు; (చూ. తికమకగొను.) 3. అంగముల యొక్క అస్వాధీనత.

**తికమకగొను** (దే.అ.క్రి.) : (తికమక+కొను) తొట్రుపడు; 2. (అంగముల యొక్క) అస్వాధీనతను పొందు. (చూ. తికమక.)

**తికమకలాడు** (దే.అ.క్రి.) : (తికమకలు + ఆడు) 1. తొట్రుపడు; (చూ. తికమకగొను) 2. (అంగముల యొక్క) అస్వాధీనతను పొందు. (చూ. తికమక.)

**తిక్క** (దే.వి.) : పిచ్చి, ఉన్మాదము. (త్రిక్క యొక్క రూపాంతరము.)

**తిక్కగొను** (దే.అ.క్రి.) : (తిక్క + కొను) వెఱ్ఱెత్తు.

**తిక్కటమక్కట** (దే.వి.) : కలఁత, క్షోభము.

**తిక్కడి** (దే.వి.) : నూలువడికెడు చిప్పకదురు.

**తిక్కణిక** (సం.వి.ఆ.స్త్రీ.) : ఇటికపగడము.

**తిక్త** (సం.వి.ఆ.స్త్రీ.) : కటుకరోహిణి. (అ.న.ము.): చేఁతిపొట్ల. (పుం.) : చేదు. (విణ.) : చేఁదైనది.

**తిక్తశాకము** (సం.వి.అ.పుం.) : 1. ఉలిమిరి. 2. చంద్ర.

**తిగ** (వై.స.) : మూడు, త్రికము.

**తిగకంటి** (ద్వ.వి.) : (తిగ + కన్ను) శివుఁడు, త్ర్యంబకుఁడు.

**తిగవంచ** (ద్వ.స.) : నాలుగు, చతుష్కము.

**తిగియు** (దే.స.క్రి.) : తివియు, ఆకర్షించు.

**తిగుచు** (దే.స.క్రి.) : తివియు, ఆకర్షించు.

**తిగ్మము** (సం.వి.అ.న.) : వేఁడిమి. (విశ.) : వేఁడిమి కలది.

**తిట్ట** (దే.వి.) : రాశి.

**తిట్టాట** (దేవ. ఇ.) : తిట్టాడుట.

**తిట్టాడు** (దే.స.క్రి.) : (తిట్టు + ఆడు) తిట్టు (స్వార్థమున ఆడు.) (చూ. తిట్టాట)

**తిట్టు** (దే.స.క్రి.) : 1. శపించు; 2. నిందించు; (వి.) : 1. శాపము; 2. నింద.

**తిట్టువడు** (ద్వ.అ.క్రి.) : (తిట్టు+పడు) నిందింపఁబడు.

**తిట్టువాటు** (ద్వ.వి.) : (తిట్టువడుట) నింద.

**తిమ్మిడి** (దే.వి.) : రథము పాఱునప్పటి మ్రోంత యందగు ధ్వన్యనుకరణము. (రూ. తిడిమి.)

**తితువు** (సం.వి.ఉ.పుం, న.) : జల్లెడ.

**తితిక్ష** (సం.వి.ఆ.స్త్రీ.) : క్షాంతి, ఓర్పు.

**తితిక్షువు** (సం.విశ.ఉ.) : క్షమించునట్టి స్వభావము గలవాడు, ఓర్పరి.

**తిత్తి** (వై.వి.) : 1. ఒలిచి కొలిమి యూఁదుటకు అనువుగా నేర్పఱచిన మేఁక తోలు; (కొలిమితిత్తి) 2. మృగముల తోలు; 3. ఒలిచి సుతి పోయుట కేర్పఱచిన తోలు; (తిత్తి పోయుము) 4. ఒలిచి సారాయి కొని పోవుటకు అనువుగా నేర్పఱచిన మేఁక తోలు; (సారాయి తిత్తి.) 5. తోలుసంచి; (కత్తులతిత్తి.) 6. సంచి. (వక్కాకు తిత్తి.)

**తిత్తికాఁడు** (వై.విశ.) : తిత్తిపోయువాఁడు.

**తిత్తిరి** (సం.వి.ఇ.పుం.) : తీతువుపిట్ట.

**తిథి** (సం.వి.ఇ.పుం,స్త్రీ.) : 1.పాడ్యమి లోనగునది; (శుక్లపక్షము మొదటనుండి క్రమముగా ఐదేసి తిథులు నంద, భద్ర, జయ, రిక్త, పూర్ణయను నామములు కలవియగును.) 2.శ్రాద్ధదినము.

**తినాసము** (వై.వి.) : నెమ్మి, తినిశము.

**తినిశము** (సం.వి.అ.పుం.) : తినాసము.

**తిను** (దే.స.క్రి.) : భుజించు.

**తినుకు** (దే.అ.క్రి.) : ముక్కిముక్కి విష్ఠించు. (వి.) : ముక్కి ముక్కి విష్ఠించుట.

**తిన్న** (దే.విశ.) : 1. మనోజ్ఞము; 2. యుక్తము; 3. స్వస్థము; 4. ఋజువు; (నీవు ఈ దారిని తిన్నగాపొమ్ము ఊరు అగపడును) 5.సౌమ్యము.

**తిన్నన** (దే.వి.) : 1.మనోజ్ఞత; 2. యుక్తత; 3. స్వస్థత; 4. సౌమ్యత; 5. ఋజుభావము.

**తిన్నియ** (దే.వి.) : తిన్నె.

**తిన్నె** (దే.వి.) : అరఁగు, వేదిక. మ. (తిన్నియ యొక్క రూపాంతరము)

**తిపురుకట్టు** (దే.అ.క్రి.) : వ్యాపించు.

**తిప్ప** (వై.వి.) : 1. చిన్నకొండ; 2. కొండ; 3. దిబ్బ.

**తిప్పకాయ** (దే.విశ.) : ఆకతాయ.

**తిప్పతీఁగ** (దే.వి.) : గుడూచి.

**తిప్పతిమ్మరి** (ద్వ.వి.) : కోఁతి, అగచరము.

**తిప్పటెల్లు** (ద్వ.వి.) : ఇక్షుకము.

**తిబిరి** (దే.వి.) : మాఱుపాటు. (వాఁడు ఈపనిలో కొంచెము తిబిరిచేసినాఁడు.) (విశ.) : అల్పము.

**తిబ్బి** (దే.వి.) : ముందఱికి కుట్టు పోనిచ్చుచు వెనుకకు మరలించి కుట్టెడు గట్టికుట్టు. (దీనికి డిబ్బియని కూడ వాడుక కలదు.)

**తిమి** (సం.వి.ఇ.పుం.) : నూఱు యోజనముల పొదుపుగల చేప.

**తిమింగిలము** (సం.వి.అ.పుం.) : తిమిని మ్రింగెడు చేప.

**తిమితము** (సం.విశ.) : (అ.ఆ.అ.) ఆర్ద్రము, తడిసినది.

**తిమిరము** (సం.వి.అ.న.) : 1. చీఁకటి; 2. నేత్ర రోగ విశేషము.

**తిమిరి** (దే.వి.) : తిమ్మిరి యొక్క రూపాంతరము.

**తిమిరిమీను** (ద్వ.వి.) : ఒక దినుసు చేప.

**తిమురు** (దే.అ.క్రి.) : 1.త్వరపడు; 2. ఉద్రేకించు; 3. గర్వించు. (వి.) : 1. తిమ్మిరి; 2. గర్వము.

**తిమురుకొను** (దే.అ.క్రి.) : ఆగ్రహముతో పెనఁగులాడి వదలించుకొను. (నేను పట్టితిని వాఁడు తిమురుకొని పోయినాఁడు.)

**తిమ్మ** (దే.విణ.) : స్వస్థము. (చూ. తిమ్మపడు)

**తిమ్మఁడు** (దే.వి.) : (తిరుమల+ఁడు) కోఁతి, వానరము.

**తిమ్మదయ్యము** (దే.వి.) : (తిమ్మ + తియ్యము) రత్యతృప్తి.

**తిమ్మన** (దే.వి.) : స్వస్థత. (చూ. తిమ్మవడు, అలకన)

**తిమ్మనము** (వై.వి.) : మజ్జిగపులుసు.

**తిమ్మప్పఁడు** (దే.వి.) : (తిరుమల + అప్పఁడు) వేంకటేశ్వరస్వామి. (రూ. తిమ్మప్ప)

**తిమ్మవడు** (ద్వ.అ.క్రి.) : (తిమ్మ + పడు) స్వస్థ పడు, సేదదేఱు.

**తిమ్మిరి** (దే.వి.) : స్పర్శము తెలియని వ్యాధి విశేషము.

**తిమ్ము** (దే.స.క్రి.) : దీవించు.(నేను వానిని తిట్టను లేదు, తిమ్మను లేదు.) (దీనికి ప్రత్యేక ప్రయోగము లేదు.)

**తియ్య** (దే.విణ.) : మధురము.

**తియ్యఁబోఁడి** (దే.వి.) : (తియ్య + పోఁడి) 1. చెఱుకు వలె మనోజ్ఞురాలగు ఆడుది; 2. ఆఁడుది. (చూ. అలరుఁబోడి)

**తియ్యకంద** (మి.వి.) : కనరులేని కంద.

**తియ్యగూర** (ద్వ.వి.) : (తియ్య + కూర) పులుసు చేరని కమ్మగూర.

**తియ్యదానిమ్మ** (ద్వ.వి.) : తియ్యని విత్తులు గల దానిమ్మ.

**తియ్యన** (దే.వి.) : తియ్యఁదనము, మాధుర్యము. (విశేషణమగుచో తియ్యనిపలుకులు. మొ. చూ. అలకన.)

**తియ్యనిమ్మ** (దే.వి.) : కమ్మనిమ్మ, శర్కరాంకము.

**తియ్యమామిడి** (దే.వి.) : సహకారము.

**తియ్యము** (దే.వి.) : 1. ప్రియవచనము, సాంత్వనము; 2. ప్రియము.

**తియ్యమునగ** (ద్వ.వి.) : ఎఱ్ఱమునగ, మధుశిగ్రువు.

**తియ్యవ్రాను** (దే.వి.) : చెఱకు, ఇక్షువు.

**తియ్యవిలుకాఁడు** (దే.వి.) : మన్మథుఁడు, స్వాదుధన్వుఁడు. (రూ. తియ్య విల్కాఁడు. ఇట్లు తియ్య విలతుఁడు.)

**తిరపడు** (వై.అ.క్రి.) : (తిరము + పడు) స్థిరపడు, కుదురుకొను.

**తిరము** (వై.విణ.) : స్థిరము.

**తిరశ్చీనము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అడ్డముగాఁ బోవునది.

**తిరస్కరించు** (సం.అ.క్రి.) : అనాదరము చేయు, తెగడు.

**తిరస్కరణి** (సం.వి.ఈ.స్త్రీ.) : తెరచీర, ప్రతిసీర.

**తిరస్కారము** (సం.వి.అ.పుం.) : అనాదరము, తెగడిక.

**తిరస్కృతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) తిరస్కరింపబడినది, తెగడఁబడినది.

**తిరస్క్రియ** (సం.వి.ఆ.స్త్రీ.) : తిరస్కారము.

**తిరస్తు** (దే.వి.) : సప్తాంగములలో నొకటి, రాష్ట్రము.

**తిరి** (దే.వి.) : 1. జట; 2. సుడి.

**తిరిక** (దే.వి.) : మెలిక.

**తిరిగివచ్చే** (దే.అ.క్రి.) : ప్రదక్షిణ మగు. (స.క్రి.) : పరివేష్టించు.

**తిరితీపులాడు** (దే.అ.క్రి.) : (తిరితీపులు + ఆడు) పెనఁగులాడు.

**తిరిపగాఁడు** (దే.వి.) : (తిరపము + కాఁడు) భిక్షుకుఁడు.

**తిరిపగొట్టు** (దే.విణ.) : (తిరిపము + గొట్టు) విరక్తుఁడు కాక భిక్షమెత్తువాఁడు.

**తిరిపము** (దే.వి.) : భిక్షము. (విణ.) : భిక్షకుఁడు.

**తిరిపరి** (దే.విణ.) : (తిరిపము + అరి) తిరిపగాఁడు.

**తిరియు** (దే.స.క్రి.) : భిక్షమెత్తు, భిక్షించు.

**తిరివడు** (ద్వ.అ.క్రి.) : (తిరి + పడు) కలఁతపడు.

**తిరివెట్టు** (దే.స.క్రి.) : (తిరి + పెట్టు) కలఁత పఱచు.

**తిరు** (దే.విణ.) : శ్రీప్రదము. (తిరునామము, తిరుమేను. మొ.)

**తిరుఁడు** (వై.విణ.) : స్థిరుఁడు.

**తిరుకాపు** (దే.వి.) : భగవంతుని యొక్క అలంకారము.

**తిరుకొలను** (దే.వి.) : పుష్కరిణి.

**తిరుగఁబడు** (ద్వ.అ.క్రి.) : (తిరుగన్ + పడు) 1. ఎదిరించు; (నాతో వాఁడు తిరుగఁ బడ్డాఁడు.) 2. తిరుగు; 3. మరలు; 4. విపరీతమగు.

**తిరుగఁబోఁత** (దే.వి.) : తిరుగఁ బోయుట, తాలింపు.

**తిరుగఁబోయు** (దే.అ.క్రి.) : (తిరుగన్ + పోయు.) తాలించు.

**తిరుగడ** (ద్వ.వి.) : (తిరుగన్ + కలు) 1. పిండి మొదలైనవి విసరెడు శిలాయంత్రము, ఘరట్టము; 2.(తిరుగు + కలి) భ్రమము. (ఈయర్థమునందు 'కలి' భావార్థమునందు వచ్చిన ప్రత్యయము.)

**తిరుగాడు** (దే.అ.క్రి.) : (తిరుగు + ఆడు) తిరుగు, సంచరించు. (రూ. తిరుగులాడు.)

**తిరుగు** (దే.అ.క్రి.) : 1. సంచరించు; 2. పరిభ్ర మించు; 3. వెనుకకు మరలు; 4. మరలవచ్చు. (స.క్రి.) : పరివేష్టించు. (వి.) : తిరుగుట.

**తిరుగుఁబోఁతు** (దే.విణ.) : (తిరుగు + పోతు) తిరుగునట్టి స్వభావము గలవాఁడు, తిరుగునట్టి స్వభావముగలది.

**తిరుగుడు** (దే.వి.) : 1. తిరుగుట, భ్రమ ణము; 2. మాఱుపాటు; (అందులో ఒక తిరుగుడు ఉన్నది చూచినారా) 3. మఱ; 4. చక్రము.

**తిరుగుడుచీల** (దే.వి.) : తిరుగుడు నొక్కులు గల చీల, మఱ.

**తిరుగుత్రాడు** (దే.వి.) : పక్షులను బట్టెడు సాధన విశేషము.

**తిరుగుడునొక్కు** (దే.వి.) : తిరుగుడు, మఱ.

**తిరుగుడుపడు** (ద్వ.అ.క్రి.) : పరిభ్రమించు.

**తిరుగుడుపాటు** (ద్వ.వి.) : తిరుగుడు పడుట.

**తిరుగుడుబిల్ల** (దే.వి.) : స్త్రీల శిరో భూషణ విశేషము.

**తిరుగుదల** (దే.వి.) : మరలుట, నివర్తనము.

**తిరుగుమొగము** (ద్వ.విణ.) : 1.అభి ముఖము; (వ్యాధి కొంచెము తిరుగు మొగముగా నున్నది.) 2. విముఖము.

**తిరుగువాఱు** (దే.స.క్రి.) : (తిరుగు + పాఱు) పరివేష్టించు.

**తిరుచిన్నము** (ద్వ.వి.) : సన్నగాళె.

**తిరుచూర్ణము** (మి.వి.) : పసుపు బియ్యము చేర్చి చేసి వైష్ణవులు నొసట నుంచుకొనెడు పొడి.

**తిరుచు** (దే.స.క్రి.) : తిరియు యొక్క రూపాం తరము.

**తిరునాళ్ల** (దే.వి.) : దేవోత్సవము.

**తిరునీఱు** (దే.వి.) : శైవులు నొసట నుంచుకొనెడు గోమయపిండ భస్మము.

**తిరుపగూడ** దే.వి.) : (తిరు + గూడ) వైష్ణవులు తిరుమణిపెట్టె మొదలైనవి యుంచి చంకను దగిలించుకొనెడు తాటాకుల బుట్ట.

**తిరుపతి** (దే.వి.) : విష్ణుక్షేత్రము.

**తిరుపు** (దే.వి.) : తిరుగుట. (చూ. తిరుపులుగట్టు. ఇది విఱుపు వంటిది.)

**తిరుపులుగట్టు** (దే.అ.క్రి.) : (తిరుపులు + కట్టు) వ్యాపించు.

**తిరుమజ్జనము** (మి.వి.) : భగవంతుని యభిషేకము.

**తిరుమణి** (ద్వ.వి.) : (తిరు + మన్ను) వైష్ణవులు నొసటనుంచుకొనెడు ధవళ మృత్తిక.

**తిరుమణివడము** (మి.వి.) : తామర పూసల దండ. (చూ. తిరుమణి.)

**తిరుమన్ను** (ద్వ.వి.) : తిరుమణి.

**తిరుమల** (ద్వ.వి.) : వేంకటాచలము.

**తిరుమాళిగ** (ద్వ.వి.) : (వైష్ణవ పరిభాష యందు) గృహము.

**తిరుముడి** (దే.వి.) : వైష్ణవుఁడు.

**తిరువడికోల** (దే.వి.) : దాసరివాని దీపస్తంభము.

**తిరువరంగములు** (దే.వి.బ.) : శాలి ధాన్య విశేషము.

**తిరువారాధనము** (మి.వి.) : (తిరు + ఆరాధనము) (వైష్ణవ పరిభాష యందు) దేవతార్చన (చూ. తాలింపు)

**తిరువు** (దే.అ.క్రి.స.క్రి.వి.) : తిరుగు యొక్క రూపాంతరము.

**తిరోధానము** (సం.వి.అ.న.) : మఱుఁగు పాటు.

**తిరోభావము** (సం.వి.అ.పుం.) : మఱుఁగుపడుట.

**తిరోహితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) మఱుఁగు పడినవాఁడు.

**తిర్గు** (దే.అ.క్రి.స.క్రి.వి.) : తిరుగు యొక్క రూపాంతరము. (చూ. దిరదిర)

**తిర్యక్కు** (సం.విణ.) : (చ్.ఈ.చ్.) అడ్డముగాఁ బోవునది.

**తిటికి** (దే.వి.) : మత్స్యవిశేషము.

**తిట్టి** (దే.వి.) : బుట్టవలె తాటియీనలతో నల్లిన మత్స్యగ్రహణ సాధనవిశేషము. (చూ.అడ్డ కొడమ)

**తిట్టిగొట్టు** (దే.విణ.) : (చూ.) తిరిపగొట్టు.

**తిలకము** (సం.వి.అ.న.) : 1.సౌవర్చల మనెడి యుప్పు; 2.కడుపులో కుడిప్రక్క నుండెడు ఎఱ్ఱని మాంసము, నీరుతిత్తి. (అని కొందఱు.) (పుం.న.) : బొట్టు. (పుం.) : 1.నల్లగుఱ్ఱము; 2. పుట్టుమచ్చ; 3. బొట్టుగు; (దీనికి దోహద క్రియ వీక్షణము.) 4. పొట్ట. (విణ.) : శ్రేష్ఠము.

**తిలకాలకము** (సం.వి.అ.పుం.) : పుట్టుమచ్చ.

**తిలకించే** (దే.అ.క్రి.) : 1. ప్రకాశించు; 2. ప్రసన్నతనొందు. (స.క్రి.) : చూచు. (ఈ యర్థము ఆదికవుల ప్రయోగము లందు కానఁబడదు.)

**తిలఘాతుకుఁడు** (సం.వి.అ.పుం.) : గాండ్లవాఁడు.

**తిలతండులన్యాయము** (సం.వి.అ. పుం.) : నువ్వులును బియ్యమును గలసిన విధము.

**తిలతండులము** (సం.వి.అ.న.) : ఆలింగన విశేషము.

**తిలపర్ణి** (సం.వి.ఈ.స్త్రీ.న్.పుం.) : రక్తచందనము.

**తిలపేజము** (సం.వి.అ.పుం.) : పొల్ల నువ్వులు. (రూ. తిలపింజము)

**తిలయంత్రము** (సం.వి.అ.న.) : గానుఁగ.

**తిలలు** (సం.వి.అ.పుం.బ.) : నువ్వులు. (ఇది సంస్కృతమున నిత్యబహు వచనాంతము కాదు.)

**తిలిప్సము** (సం.వి.) : కొండచిలువ, (రూ. తిలిత్సము)

**తిల్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) తిలలు పండునది. (పొలము)

**తిల్వము** (సం.వి.అ.పుం.) : లొద్దుగు, లోధ్రము.

**తివ** (వై.స.) : తిగ యొక్క రూపాంతరము.

**తివాసి** (వై.వి.) : మేలైన చిత్రాసనము. (రూ. తివాసీ.)

**తివియు** (దే.స.క్రి.) : తిగియు యొక్క రూపాం తరము. (చూ. అలవి)

**తివుచు** (దే.స.క్రి.) : తిగుచు యొక్క రూపాం తరము.

**తివుట** (దే.వి.) : కోరిక.

**తివురు** (యు.దే.స.క్రి.) : కోరు. 1. త్వరపడు; 2. కుతూహలపడు; 3. యత్నించు; 4. మ్రోఁగు; 5. కోపపడు.

**తిష్యఫల** (సం.వి.ఆ.స్త్రీ.) : ఉసిరిక.

**తిష్యము** (సం.వి.అ.పుం.) : 1. పుష్య నక్షత్రము; 2. పుష్యమాసము; 3. కలియుగము.



**తీ** (వై.స.) : వృత్తియందు శబ్దమునకగు ఆదేశము (తీవంచ)

**తీంట్రము** (దే.వి.) : తీఁట, దురద, కండూయ.

**తీండ్ర** (దే.వి.) : 1. ప్రకాశము; (చూ. తీండ్రించు) 2. వేఁడిమి; 3. తేజము; 4. చుఱుకు.

**తీంఁడ్రము** (దే.విణ.) : తీక్ష్ణము, ప్రచండము.

**తీంఁడ్రించే** (దే.అ.క్రి.) : 1. ప్రకాశించు; 2. జ్వలించు. (తీఁడిరించు యొక్క రూపాంతరము.)

**తీఁగ** (వై.వి.) : 1. లత; 2. స్త్రీలు మెడను ధరించెడు బంగారుపట్టెడ; 3. మొల నూలు; 4.వీణ మొదలగు వాని తంతి.

**తీఁగబోఁడి** (ద్వ.వి.) : (తీఁగ+పోఁడి) 1. తీఁగ వలె మనోజ్ఞరాలగు ఆఁడుది; 2. ఆఁడుది. (రూ. తీవఁబోఁడి.) (చూ. అలరుఁబోఁడి)

**తీఁగకానుగు** (ద్వ.వి.) : మర్కిటి.

**తీఁగగఱిక** (ద్వ.వి.) : నిడుపుగఱిక, గండాలి.

**తీఁగజాజి** (వై.వి.) : ఒక దినుసుజాజి.

**తీఁగతుమడి** (ద్వ.వి.) : దీర్ఘమూల.

**తీఁగపాల** (ద్వ.వి.) : క్షీరావి.

**తీఁగబచ్చలి** (ద్వ.వి.) : కలంబి.

**తీఁగమల్లియ** (వై.వి.) : 1. మల్లికా విశేషము; 2. బ. ధాన్య విశేషము. (చూ. కుసుమ)

**తీఁగమల్లె** (వై.వి.) : తీఁగమల్లియయొక్క రూపాంతరము. (ధాన్యవిశేషమునకు.)

**తీఁగమెఱుఁగు** (ద్వ.వి.) : 1. ఉఱుము లేని మెఱపు; 2. ప్రొద్దు తిరుగుడు.

**తీఁగమోడి** (ద్వ.వి.) : వ్రాంతపని.

**తీఁగయిల్లు** (ద్వ.వి.) : (తీఁగ + ఇల్లు) పొదరిల్లు, నికుంజము.

**తీఁగయెలుఁగు** ద్వ.వి. (తీఁగ + ఎలుఁగు) హీనస్వరము.

**తీఁగలువాఱు** (ద్వ.అ.క్రి.) : (తీఁగలు + పాఱు) వ్యాపించు.

**తీఁగవిలుకాఁడు** (ద్వ.వి.) : మన్మథుఁడు. (ఇట్లు తీఁగ విలుతుఁడు.)

**తీఁగసరులు** (వై.వి.బ.) : ధాన్య విశేషము. (రూ. తీవసరులు.)

**తీఁగసాఁగు** (ద్వ.వి.) : (తీఁగ + చాఁగు) వర్ధిల్లు.

**తీఁగియ** (వై.వి.) : 1. తీఁగ యొక్క రూపాంతరము. (చూ.తీఁగ.)

**తీఁగె** (వై.వి.) : తీఁగియ యొక్క రూపాంతరము.

**తీఁట** (దే.వి.) : 1. ఒక విధమైన గజ్జి; 2. దురద.

**తీఁటకసింద** (దే.వి.) : తీఁటకసివెంద యొక్క రూపాంతరము.

**తీఁటకసివెంద** (దే.వి.) : రేగడిదూల, కచ్ఛుర.

**తీఁటకోవెల** (దే.వి.) : రేగడిదూల, కచ్ఛుర.

**తీఁడిరించే** (దే.అ.క్రి.) : ప్రకాశించు. (చూ. తీంఁడ్రించు.)

**తీఁపురము** (దే.వి.) : ఆగడము.

**తీక్ష్ణకంటక** (సం.వి.ఆ.స్త్రీ.) : కందారి.

**తీక్ష్ణ గంధ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. ఓమము; 2. నల్లావలు. (అ.పుం.ము.) : 1. మునగ; 2. పెద్ద తుమ్మి; 3. నెరవెంద.

**తీక్ష్ణ తుండము** (సం.వి.అ.పుం.) : మశకము, దోమ.

**తీక్ష్ణము** (సం.వి.అ.న.) : 1. వేఁడిమి; 2. విషము; 3. పోరు; 4. ఇందుప్పు; 5. ఇనుము. (పుం.): గాజుప్పు. (విణ.) : 1. చుఱుకైనది; 2. వాఁడి యైనది.

**తీడు** (దే.స.క్రి.) : వాఁడిచేయు.

**తీతువు** (వై.వి.) : తిత్తిరిపక్షి.

**తీఽ తేరగా** (హిం.క్రి.విణ.) : తారుమారుగా, ఆరుమూడు.

**తీనియ** (దే.వి.) : తినియ యొక్క మొదటి రూపము.

**తీనె** (దే.వి.) : తీనియ యొక్క రూపాంతరము.

**తీపారు** (దే.అ.క్రి.) : (తీపు + ఆరు) మనోజ్ఞమగు.

**తీపి** (దే.వి.) : 1. ఒక రసము, మాధుర్యము. (చూ. రసము.) 2. ఇచ్ఛ. మధురము.

**తీపు** (దే.వి.) : 1. మాధుర్యము; 2. యాతన. (చూ. తీపి)

**తీపుఁద్రాడు** (దే.వి.) : (తీపు + త్రాడు) వేఁటాడుటకు దగిన సాధన విశేషము.

**తీయ** (దే.విణ.) : తియ్య యొక్క మొదటి రూపము.

**తీయన** (దే.వి.) : తియ్యన యొక్క మొదటి రూపము. (చూ. తియ్యన.)

**తీయము** (దే.వి.) : తియ్యము యొక్క మొదటి రూపము. (ప్రియమునకు.)

**తీయు** (దే.అ.క్రి.) : 1. తొలఁగు; (చూ. తీయము) 2. కృశించు; (నొప్పిచేత వాని దేహము మిక్కిలి తీసినది.) 3.తగ్గు. (చెఱువులో నీళ్లు తీసినవి.) (స.క్రి.) : 1.ఈడ్చు; 2.కొను; (వాని వద్ద వీఁడు లంచము తీసినాఁడు) 3. వెల యిచ్చి కొను; (ఈగుఱ్ఱమును వీఁడు ఇన్నూఱు రూపాయలకు తీసినాఁడు) (ఇది తెనుఁగు దేశమునందీ యర్థమున వాడఁబడదు.) 4.వేయు.

**తీరము** (సం.వి.అ.న.) : 1. దరి; 2. తగరము.

**తీరు** (దే.అ.క్రి.) : 1.చక్కఁబడు; (ఇందు నశించు అనునర్థమున లఘురేఫము కానఁబడుచున్నది) 2.శక్యమగు. (వి.) : 1.చక్కన; 2.విధము.

**తీరుకు** (దే.వి.) : నాట్యగతి విశేషము.

**తీరుచు** (దే.ప్రే.) : 1. తీర్పుచేయు; 2. చక్కఁ బఱచు, దిద్దు; నృత్తగీత వాద్యములు సమము కావించు. (చూ. తీర్చు.)

**తీరుపరి** (దే.వి.) : (తీరుపు+అరి) 1.న్యాయాధి పతి; 2. చారుఁడు. (విణ.) : 1.అధికారి; 2. కార్య నిర్వాహకుఁడు (రూ. తీర్పరి. చారునకు) అధికారికి. కార్య నిర్వాహకునకు.

**తీరుపు** (దే.వి.) : 1. న్యాయము; 2. చక్కఁ బాటు; 3. నృత్త గీత వాద్యములు సమమగుట. తీరువ (దే.వి.) : కాఁపులు ధాన్యములోనగునవి పంటపెట్టి తీసికొనిపోవునపుడు నేల యొక్క స్వాతంత్ర్యమును బట్టి రాజునకు చేరవలసిన భాగమున కిచ్చెడు ధనము.

**తీర్చే** (దే.ప్రే.) : (తీరుచు యొక్క రూపాంతరము) 1. తీర్పు చేయు; 2. చక్కఁబఱచు, దిద్దు. 3. నృత్తగీత వాద్యములు సమముకావించు; (తీఱుచు యొక్క రూపాంతరము.) 1. నాశము చేయు; 2. పాపు.

**తీర్ణము** (సం.వి.) : (అ.ఆ.అ.) దాఁటఁ బడినది.

**తీర్థమాట** (మి.వి.) : తీర్థమాడుట, స్నానము.

**తీర్థమాడు** (మి.అ.క్రి.) : (తీర్థము + ఆడు) స్నానము చేయు. (తీర్థములాడు అనియు.)

**తీర్థము** (సం.వి.) : 1. మహర్షులు స్నానము చేసిన పుణ్యోదకము; 2. పుణ్య నది; 3. రేవు; 4. నూతియొద్ది తొట్టి; 5. పుణ్యక్షేత్రము; 6. యజ్ఞము; 7. శాస్త్రము; 8. ఉపాయము; 9. పాత్రము; 10. స్త్రీ రజస్సు; 11. ఉపాధ్యా యుఁడు; 12. మంత్రి.

**తీర్థవాసి** (సం.విణ.) : (న్.ఈ.న్) తీర్థ సేవ చేయువాఁడు.

**తీఱమి** (దే.వి.) : అక్కఱ, పోరామి.

**తీఱిక** (దే.వి.) : తీఱుబడి, అవకాశము.

**తీఱు** (దే.అ.క్రి.) : 1.నశించు; 2. పాయు; 3.అవకాశపడు. (నాకు ఱేపు తీరును గాని నేఁడుతీఱదు.)

**తీఱుగడ** (దే.వి.) : 1. ముగియిక; 2. తీఱిక.

**తీఱుచే** (దే.ప్రే.) : 1. నశింపజేయు; 2. పాపు. (చూ. తీర్చు)

**తీఱుదల** (దే.వి.) : ముగియిక.

**తీఱుపడు** (ద్వ.అ.క్రి.) : నశించు.

**తీఱుపాటు** (ద్వ.వి.) : తీఱిక, అవకాశము.

**తీఱుపు** (దే.ప్రే.) : తీఱుచు. (రూ. తీర్పు.) (ఈ పద ప్రయోగము విచారణీయము.)

**తీఱుబడి** (దే.వి.) : తీఱుపాటు, అవకాశము.

**తీలగు** (దే.అ.క్రి.) : (తీలు + అగు) అడఁగు. (చూ. తీలుపడు.)

**తీలు** (దే.వి.) : అడకము (చూ. తీలగు)

**తీలుపడు** (ద్వ.అ.క్రి.) : తీలగు.

**తీవ** (వై.వి.) : తీఁగ యొక్క రూపాంతరము.

**తీవంచ** (ద్వ.స.) : (తిగ + వంచ) నాలుగు.

**తీవరపడు** (వై.అ.క్రి.) : (తీవరము + పడు) త్వరితపడు.

**తీవరపాటు** (వై.వి.) : తీవరపడుట.

**తీవరము** (వై.వి.) : త్వరితము.

**తీవరించే** (వై.స.క్రి.) : త్వరిత పఱుచు.

**తీవరుఁడు** (సం.వి.అ.పుం.) : 1. చేఁపలు పట్టువాఁడు, కైవర్తుఁడు, 2. సముద్రుఁడు.

**తీవియ** (వై.వి.) : తీఁగియ యొక్క రూపాంతరము.

**తీవిరము** (దే.వి.) : తీఁట, కండూయ.

**తీవె** (వై.వి.) : తీవియ యొక్క రూపాంతరము.

**తీవ్ర** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. నల్లావలు; 2. కటుక రోహిణి; 3. తీఁగగఠిక.

**తీవ్రగంధ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఓమము, (అ.పుం.ము.) : కారుబుడమ.

**తీవ్రము** (సం.క్రి.విణ.అ.న.) : పెల్లు. (విణ.) : 1.అధికము; 2.మిక్కిలి వేఁడిమి గలది; 3.కారము గలది.

**తీసివేయు** (దే.స.క్రి.) : 1. ఖండించు; (నీవు నాతలతీసి వేయుదువా) 2. ఎత్తివేయు. (వానిని ఉద్యోగము నుండి తీసివేసిరి.)

## తు

**తుంగ** (ఉభ.) : తృణ విశేషము. ముస్త. (సం. ఆ.స్త్రీ.) : జమ్మి.

**తుంగభద్ర** (సం.వి.ఆ.స్త్రీ.) : ఒకానొక యేఱు. (అ.పుం.ము.) : మదపుటేనుఁగు.

**తుంగము** (సం.వి.అ.పుం.) : 1.కొండ; 2.పొన్న. (విణ.) : పొడవైనది.

**తుంగి** (సం.వి.ఈ.స్త్రీ.) : వాయింట.

**తుంట** (యు.దే.వి.) : 1. తునక; 2. చెఱకు. (వై.విణ.) : దుష్టుఁడు.

**తుంటరి** (ద్వ.విణ.) : (తుంట + అరి) దుష్టుఁడు. (స్వార్థమున అరి.)

**తుంటవిలుతుఁడు** (దే.వి.) : మన్మథుఁడు, ఇక్షుధన్వుఁడు. (రూ. తుంట విల్తుఁడు.) (ఇట్లు తుంట విలుకాఁడు.)

**తుంటి** (దే.వి.) : కటిపార్శ్వ భాగము, రొండి.

**తుంటికూర** (ద్వ.వి.) : తూఁటికూర యొక్క రూపాంతరము.

**తుండము** (ఉభ. వై.వి.) : ఖండము. 1. పక్షి ముక్కు; 2. నోరు; 3. మొగము.

**తుండి** (సం.వి.ఇ.స్త్రీ.) : ఉఱుకుబొడ్డు. (పుం.) : 1. పక్షిముక్కు; 2. మొగము. (న్.) : పక్షి

**తుండించు** (వై.స.క్రి.) : ఖండించు, ఛేదించు.

**తుండికేరి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1.దొండ; 2.ప్రత్తి;

**తుండిభుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఉఱుకు బొడ్డు వాఁడు.

**తుండిలుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఉఱుకు బొడ్డు వాఁడు.

**తుండు** (వై.వి.) : తుండెము, ఖండము.

**తుండెము** (వై.వి.) : తుండెము, ఖండము. (రూ.) తుండె.

**తుంతుర్వము** (సం.వి.అ.పుం.) : తుంపురు.

**తుందపరిమృజుఁడు** (సం.వి.అ.పుం.) : సోమరి.

**తుందము** (సం.వి.అ.న.) : కడుపు, ఉదరము, కుక్షి.

**తుంది** (సం.వి.ఇ.న.) : కడుపు. (పం.) : ఉఱుకు బొడ్డు. (విణ.) : (న్.ఈ.న్) బొజ్జ కడుపువాఁడు.

**తుందిభుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ) 1. బొజ్జ కడుపువాఁడు 2. ఉఱుకు బొడ్డువాఁడు.

**తుందిలుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. బొజ్జ కడుపువాఁడు 2. ఉఱుకు బొడ్డువాఁడు.

**తుందుడుకు** (దే.వి.) : (తుడుకు + తుడుకు) 1.సంతాపము; 2. విచారము; 3.కలఁత, క్షోభము. (విణ.) : యోచింపక త్వరపడి చేయు వాఁడు. (ఇది ద్విరుక్తముగానే ప్రయోగములం జూపట్టెడు.)

**తుండునుకలు** (దే.వి.బ.) : (తునుకలు + తునుకలు) చిన్న చిన్న ఖండములు.

**తుందుభము** (సం.వి.అ.పుం.) : సర్షపము, ఆవలు.

**తుంపర** (వై.వి.) : గాలిచేత చెదరిపడు నీరు లోనగువాని బొట్టు, శీకరము.

**తుంపిళ్లు** (దే.వి.బ.) : తూరవాన.

**తుంపురు** (వై.వి.) : తుంపర.

**తుంపెసలాడు** (దే.అ.క్రి.) : (తుంపెసలు + ఆడు) 1. చలించు; 2. ఊఁగాడు.

**తుంపెసలు** (దే.వి.) : చలనము. (చూ. తుంపెస లాడు)

**తుంపెసలుగునియు** (దే.అ.క్రి.) : తుంపెసలాడు, చలించు.

**తుంబకము** (సం.విణ.) : (అ.ఆ.అ.)(చూ.) నంగి.

**తుంబి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. తుమ్మి; 2. సొర.

**తుంబిక** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. బండి చక్రము నడిమి రంధ్రము, తూము, 2. సొర.

**తుకతుక** (దే.వి.) : 1. సంతాపము; 2. కోపము; 3. ఉడుకుటయందగు ధ్వన్యనుకరణము; 4. కాఁగుట యందగు ధ్వన్యనుకరణము.

**తుకము** (దే.వి.) : విత్తనాల చల్లకపు అంచన.

**తుకాటము** (దే.వి.) : మిక్కిలి ప్రాఁతది.

**తుక్కు** (దే.విణ.) : అల్పము. (అది చెడెఁబో తుక్కు.)

**తుక్కుడు** (దే.విణ.) : పనికిమాలినది.

**తుక్ఖారము** సం.వి.అ.పుం. గుఱ్ఱము, ఘోటకము.

**తుచ్ఛ** (సం.వి.ఆ.స్త్రీ.) : చిట్టేలకి.

**తుచ్ఛము** (సం.వి.అ.న.) : దుఃఖము. (విణ.) : శూన్యము.

**తుజాలకము** (సం.వి.అ.పుం.) : ఆరుదొండ.

**తుజుగు** (దే.విణ.) : త్వరపడువాఁడు.

**తుటాయించు** (దే.స.క్రి.) : అలక్ష్యపఱచు.

**తుటారము** (దే.వి.) : 1.దిట్టతనము; అచ్చ. (అ,కాం.) : 2. పురుష వచనము. (చూ. గొడఁగు)

**తుటారి** (దే.విణ.) : (తుటారము + ఇ) 1. దిట్టతనము గలది; (చూ. తుటారి కత్తియ) 2. పారుష్యము గలది.

**తుటారించు** (దే.స.క్రి.) : తిరస్కరించు.

**తుటారికత్తియ** (ద్వ.విణ.) : 1. దిట్టతనము గలది; 2. పారుష్యము కలది. (రూ. తుటారి కత్తె. పారుష్యము కలదానికి.) (స్వార్థమున కత్తియ)

**తుటారికాఁడు** (దే.విణ.) : 1.దిట్టతనము గల వాఁడు; 2.పారుష్యము గలవాఁడు. (స్వార్థమున కాఁడు.)

**తుటుక్కు** (దే.వి.) : గుండెలు అదురుట యందగు ధ్వన్యనుకరణము. (ఆమ్రేడితమునందు తుటుక్కు తుటుక్కు) (చూ. గల్లు.)

**తుటుము** (దే.వి.) : సమూహము

**తుట్టతుద** (దే.వి.) : (తుద + తుద) కేవలము తుద.

**తుట్టమర** (దే.అవ్య.క్రి.విణ.) : బొత్తిగా (పిల్లవాఁడు తుట్టమర చదువఁడు.)

**తుట్టియ** (దే.వి.) : తుట్టె. (తుట్టియ యొక్క రూపాంతరము)

**తుట్టు** (దే.వి.) : నష్టి. (ఈ వ్యాపారములో నాచేతి సొమ్ము తుట్టు పెట్టుకొన్నాను.)

**తుట్టె** (దే.వి.) : సమూహము. (తుట్టియ యొక్క రూపాంతరము)

**తుట్టెగట్టు** (దే.అ.క్రి.) : (తుట్టె + కట్టు) (పురుగులు పట్టి) ఉండగట్టు.

**తుట్టెపురుగు** (ద్వ.వి.) : సామాన్య సర్పము.

**తుట్ర** (దే.వి.) : మంచువంటి తూరవాన, ఊడ్చిన కుప్ప. (అని కొందఱు)

**తుడుచు** (దే.స.క్రి.) : 1. తడిపోవనొత్తు; 2. ఊడ్చు.

**తుడుపు** (దే.వి.) : 1. తుడుచుట, మార్జనము; 2. తప్పు వ్రాలను గటికిన గిఱుకు.

**తుడుము** (దే.వి.) : 1. వాద్య విశేషము; మద్దువు; 2. తుటుము యొక్క రూపాంతరము.

**తుడ్చే** (దే.స.క్రి.) : తుడుచు యొక్క రూపాంతరము.

**తుతినాగము** (దే.వి.) : లోహవిశేషము.

**తుత్తి** (దే.వి.) : తుత్తిరి యొక్క రూపాంతరము.

**తుత్తిరి** (దే.వి.) : కంగునీపత్రము.

**తుత్తుంభిక** (సం.వి.ఆ.స్త్రీ.) : వాద్య విశేషము. (చూ. తమ్మటము)

**తుత్తునియలు** (దే.వి.బ.) : (తునియలు + తునియలు) చిన్న చిన్న తునుకలు.

**తుత్తుమురు** (దే.వి.) : (తుమురు + తుమురు) మిక్కిలి తుమురు (తుమురు = పొడి)

**తుత్థ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. చిట్టేలకి; 2. నీలి. (అ.న.ము.) మ్రాని పసుపున వండిన అంజన విశేషము. (పుం.) : అగ్ని.

**తుత్థాంజనము** (సం.వి.అ.న.) : మయిలుతుత్తము.

**తుద** (దే.వి.) : 1. చివర, అగ్రము; 2. కడ, అంతము.

**తుది** (దే.వి.) : కడ, అంతము.

**తుదిముట్టు** (దే.అ.క్రి.) : చచ్చు.

**తుదిరేయి** : కల్పాంతము.

**తుదివాఁడు** (దే.విణ.) : కడపటి వాఁడు, కనిష్ఠుఁడు.

**తునికోల** (దే.వి.) : (తూనిక + కోల) తూఁచునట్టి కోల.

**తునికోలదుడ్డు** (దే.వి.) : గవుండ్లవాడు కల్లు బుడ్డి తగిలించుకొని పోయెడు తునికోల వంటి దుడ్డుకోల.

**తునియ** (దే.వి.) : తునుక, ఖండము.

**తునియు** (దే.అ.క్రి.) : తునుఁగు, ఖండితమగు.

**తునుఁగు** (దే.అ.క్రి.) : తునుఁగు, ఖండితమగు.

**తునుక** (దే.వి.) : తునియ, ఖండము.

**తునుమాడు** (దే.స.క్రి.) : (తునుము + ఆడు) 1. ఖండించు 2. చంపు. (చూ. తునుము.)

**తునుము** (దే.స.క్రి.) : 1. ఖండించు; 2. చంపు. (రూ. తున్ము. చంపుటకు.)

**తున్నకము** (సం.వి.అ.పుం.) : నందివృక్షము.

**తున్నవాయుఁడు** (సం.వి.అ.పుం.) : కుట్రపు వాఁడు, సౌచికుఁడు.

**తున్మాడు** (దే.స.క్రి.) : తునుమాడు యొక్క రూపాంతరము.

**తుపాకి** (దే.వి.) : (సిపాయులు మందు గుండువేసి గట్టించికాల్చెడు) ఇనుప క్రోవి.(చూ. జబరజంగి)

**తుపాను** (దే.వి.) : గాలివాన.

**తుపాసి** (వై.వి.) : ఒక భాషను మరియొక భాషలో చెప్పెడువాఁడు.

**తుపుక్కు** (దే.వి.) : ఉమియుటయందగు ధ్వన్యను కరణము. (తమ్మ తుపుక్కని యుమిసినాఁడు.)

**తుప్ప** (దే.వి.) : చిన్నపొద.

**తుప్పటిల్లు** (వై.అ.క్రి.) : తనియు. (వ్రాఁత ప్రతుల యందు జిహ్వ త్రుప్పుడుల్ల అని యున్నది.)

**తుప్పర** (వై.వి.) : తుంపర, శీకరము.

**తుప్పలుదూలు** (దే.అ.క్రి.) : (తూలు + తూలు) మిక్కిలి చలించు.

**తుప్పు** (దే.వి.) : ఉమియుటయందగు ధ్వన్యను కరణము. (ఆమ్రేడితమునందు తుప్పుతుప్పు.)

**తుభము** (సం.వి.అ.పుం.) : మేఁకపోతు, ఛాగము.

**తుమికి** (దే.వి.) : తుమ్మికి, తిందుకము.

**తుమురు** (దే.వి.) : సూక్ష్మ ఖండము.

**తుములము** (సం.వి.అ.న.) : దొమ్మియుద్ధము. (పుం.) : తాండ్ర.

**తుమ్మ** (దే.వి.) : అరిమేదము.

**తుమ్మి** (వై.వి.) : ఒక దినుసు కూరాకు.

**తుమ్మికి** (దే.వి.) : తుమికి యొక్క రూపాంతరము.

**తుమ్ము** (దే.అ.క్రి.) : క్షుతము చేయు.(వి.) : క్షుతము.

**తుమ్మెద** (దే.వి.) : పూఁదేనెఁద్రావెడి యొక దినుసు నల్ల ఱెక్కల పురుగు, భ్రమరము.

**తుమ్మెదకంటు** (ద్వ.వి.) : సంపెఁగ. (చూ. మొగడ)

**తుమ్మెదమామిడి** (దే.వి.) : కోశామ్రము.

**తురంగమము** (సం.వి.అ.పుం.) : గుఱ్ఱము, అశ్వము.

**తురంగము** (సం.వి.అ.పుం.) : గుఱ్ఱము, అశ్వము.

**తురక** (వై.వి.) : తురకవాఁడు, మ్లేచ్ఛుఁడు.

**తురకదొగ్గలి** (ద్వ.వి.) : ఒక దినుసు దొగ్గలి.

**తురకపికిలి** (ద్వ.వి.) : ఒక దినుసు పిలికిపిట్ట.

**తురకఱాయి** (ద్వ.వి.) : బొంతఱాయి.

**తురకవేము** (ద్వ.వి.) : తృణనింబము.

**తురకాణ్యము** (గ్రా.వి.) : తురకజనము, తురక ప్రభుత్వము.

**తురగము** (సం.వి.అ.పుం.) : 1. గుఱ్ఱము; 2. హృదయము.

**తురా** (దే.వి.) : తురాయి యొక్క రూపాంతరము.

**తురాయి** (దే.వి.) : 1. నిడుపుకాఁడపెట్టి కట్టిన పూబంతి; 2. తలనుంచెడు భూషా విశేషము.

**తురాషాహుఁడు** (పం.వి.హ్.పుం.) : ఇంద్రుఁడు.

**తురి** (సం.వి.ఈ.స్త్రీ.) : కండెలుంచి నేసెడు యంత్రము, నాడె.

**తురికి** (వై.వి.) : గుజ్జము (చూ. తఱటు సేయు)

**తురితము** (వై.అవ్య.క్రి.విణ.) : శీఘ్రము.

**తురీన** (వై.ద్ర.క్రి.విణ.) : తటాలున.

**తురీయము** (సం.వి.అ.న.) : బ్రహ్మము, (విణ.): నాలుగవది.

**తురుంభము** (సం.వి.అ.పుం.) : పూల దండలు మొదలగునవి తుఱిమిన కొప్పు.

**తురుజే** (దే.వి.) : ఒక దినుసు కూరాకు, గండీరము.

**తురుపు** (ఆం.వి.) : గుజ్జపుదండు.

**తురుష్కము** (సం.వి.అ.పుం.) : 1. చిల్ల మడ్డి; 2. ఒకానొక దేశము.

**తురుష్కుఁడు** (సం.వి.అ.పుం.) : తురకవాఁడు.

**తుర్యతుండి** (సం.వి.ఈ.స్త్రీ.) : పిండిదొండ.

**తుర్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) తురీయము.

**తుఱఁగలి** (దే.వి.) : ప్రకాశము.

**తుఱఁగలించే** (దే.అ.క్రి.) : 1. ప్రకాశించు; 2. అతిశయించు.

**తుఱఁగలిగొను** (దే.అ.క్రి.) : (తుఱఁగలి + కొను) 1. ప్రకాశించు; 2. అతిశయించు. (ప్రకాశించుటకు.) అతిశయించుటకు.

**తుఱుగు** (దే.స.క్రి.) : (బలవంతమున లోపలవేసి) క్రుక్కు.

**తుఱుతు** (వై.వి.) : వేగిరపాటు. (క్రి. విణ.) : శీఘ్రము. (నీవక్కడికి పోయి తుఱుతుగరమ్ము.)

**తుఱుము** (యు.దే.స.క్రి.) : తుఱుము పీఁటతో పొడిపొడిచేయు. (వి.) పొడి. (వై.స.క్రి.) : 1.(కొప్పుగా) ముడుచు; 2. (కొప్పున) చెరువు.

**తుఱుముపీఁట** (ద్వ.వి.) : తుఱుముట కనువుగా చివరను పండ్లేర్పఱచిన వంకర యినుప కమ్మి చెక్కిన పీఁట.

**తుఱ్ఱు** (వై.వి.) : వేగిరపాటు. (క్రి .విణ.) : శీఘ్రము. (తుఱుతు యొక్క రూపాంతరము)

**తుల** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. త్రాసు; 2. దూలము; 3. నూఱు పలముల కొలఁది; 4. పోలిక; 5. ఒక రాశి (చూ. రాశి) (తులా సూత్రము ప్రగ్రాహము.)

**తులకించే** (దే.అ.క్రి.) : 1. ప్రకాశించు; 2. కుతూహలపడు.

**తులకింపు** (దే.వి.) : ప్రకాశము. (చూ. ఆరగింపు)

**తులము** (దే.వి.) : పలమునందు మూడవ భాగము (లేక) రూపాయ యెత్తు.

**తులసి** (సం.వి.ఈ.స్త్రీ.) : తొళసి.

**తులాకోటి** (సం.వి.ఇ.పుం.) : అందె, నూపురము.

**తులామానము** (సం.వి.అ.న.) : త్రాసున తూఁచెడు తూనిక.

**తులితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. సరి పోల్పఁబడినది; 2. తూఁచఁ బడినది.

**తులుచే** (దే.విణ.) : వేగముగలది. (చూ. తులుచన)

**తులుచన** (దే.వి.) : వేగము. (విశేషణమైనచో.) (చూ. అలకన.)

**తులువ** (దే.విణ.) : కుత్సితుఁడు.

**తులువకత్తి** (ద్వ.వి.) : వంపు చురకత్తి.

**తుల్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) సమము, సరి.

**తువర** (దే.వి.) : తువ్వర యొక్క రూపాంతరము.

**తువరము** (సం.వి.అ.పుం.) : ఒక రసము, ఒగరు. (చూ. రసము) (విణ.) : ఒగరైనది (రూ. తూవరము)

**తువరి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. తొగరి; 2. అడవి తొగరితీఁగ 3. తొగరిమన్ను.

**తువాల** (ఆం.వి.) : చేతిగుడ్డ.

**తువ్వర** (దే.వి.) : తూర.

**తుషము** (సం.వి.అ.పుం.) : 1. ఉముక; 2. తాండ్ర;

**తుషారము** (సం.వి.అ.పుం.) : 1. మంచు; 2. తుంపర. (విణ.) చల్లనిది.

**తుషితుఁడు** (సం.వి.అ.పుం.) : గణదేవతా విశేషము. (వీరు ముప్పది యాఱుమంది)

**తుష్టి** (సం.వి.ఇ.స్త్రీ.) : సంతోషము.

**తుష్టుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) సంతోషము పొందినవాఁడు.

**తుస్సి** (దే.విణ.) : ఒగరైనది (నేల)

**తుస్సు** (వై.విణ.) : నీచము. (తుస్సు పెంజెర)

**తుస్సుపెంజెర** (ద్వ.వి.) : పెంజెర భేదము.

**తుహినకరుఁడు** (సం.వి.అ.పుం.) : చంద్రుఁడు, చలివెలుఁగు.

**తుహినము** (సం.వి.అ.న.) : హిమము, మంచు.

## తూ

**తూ** (దే.వి.) : తూపొడుచుటయందగు ధ్వన్యను కరణము. (రూ. తూపొడుచు)

**తూఁగాడు** (దే.అ.క్రి.) : (తూఁగి + ఆడు) 1. ఊఁగు; 2. చలించు. (మొదటి రూపము తూఁగి యాడు.) (చూ. ఊఁగాడు.)

**తూఁగు** (దే.అ.క్రి.) : 1. ఊఁగు; (తూఁగు మంచము.) 2. కూరుకు; (వాఁడు తూఁగి పడుచున్నాఁడు) 3. చలించు; 4. తూనికపడు; 5. నడచు. (వి.) : 1.ఊఁగుట; (తూఁగు టుయ్యేల.) 2. కూరుకుపాటు. (నాకు తూఁగు వచ్చుచున్నది.)

**తూఁగుటుయ్యల** (ద్వ.వి.) : ఉయ్యాల మంచము.

**తూఁగుపలక** (ద్వ.వి.) : తాపివాఁడు గోడల మట్టము చూచుటకై ఊయి వ్రేలఁగట్టిన నిడుపాటి పలక.

**తూఁగుమంచము** (ద్వ.వి.) : ఉయ్యాలమంచము.

**తూఁచు** (దే.ప్రే.) : తూఁగఁజేయు, తూనికవేయు.

**తూఁట** (యు.దే.వి.) : తుంట, ఖండము. (వై.విణ.) : దుష్టుఁడు. (చూ. తూఁటరి)

**తూఁటకట్టు** (ద.అ.క్రి.) : ఖండితమగు.

**తూఁటరి** (వై.విణ.) : (తూఁట + అరి) దుష్టుఁడు. (స్వార్థమున అరి.)

**తూఁటాడు** (దే.స.క్రి.) : (తూఁటు + ఆడు) వేధించు, జర్జరితము చేయు.

**తూఁటికూర** (దే.వి.) : ఒక దినుసు కూరాకు, నళి. (చూ. తుంటికూర.)

**తూఁటు** (దే.వి.) : చిల్లి, రంధ్రము.

**తూఁటుకట్టు** (దే.అ.క్రి.) : తూఁటుపడు, తూఁటుపోవు.

**తూఁడరి** (వై.విణ.) : తూఁటరి యొక్క రూపాంతరము.

**తూఁడు** (దే.వి.) : తామరపువ్వు లోనగువాని వేరు, బిసము.

**తూఁడుదిండి** (దే.వి.) : (తూఁడు+తిండి) హంస.

**తూఁతకొమ్ము** (దే.వి.) : పిల్లంగ్రోవి, మురళి.

**తూకము** (దే.వి.) : పూనిక.

**తూకు** (దే.వి.) : తూకము యొక్క రూపాంతరము.

**తూకొను** (దే.అ.క్రి.) : (తూకు + కొను) పూను. (తూఱు + కొను)

**తూణము** (సం.వి.అ.పుం.) : అమ్ముల పొది. (ఇది ఆకారాంత స్త్రీ లింగముగాను ఈకారాంత స్త్రీలింగముగాను గలదు.)

**తూణీరము** (సం.వి.అ.పుం.) : తూణము, అమ్ములపొది.

**తూదము** (సం.వి.అ.పుం.) : గంగరావి.

**తూదరతుక్కము** (దే.వి.) : బాలక్రీడా విశేషము.

**తూనిక** (దే.వి.) : (త్రాసుతో) తూఁచుట, ఉన్మానము.

**తూనికకోల** (దే.వి.) : త్రాసుదండె.

**తూనికవేయు** (దే.స.క్రి.) : తూఁచు.

**తూనిఁగ** (దే.వి.) : తూనీఁగ యొక్క రూపాంతరము.

**తూనీఁగ** (దే.వి.) : ఒక దినుసు ఈఁగ, పతంగిక.

**తూపరము** (దే.వి.) : చిల్లి, రంధ్రము.

**తూపరాణ** (దే.వి.) : నీళ్లు బయటికి వచ్చు తూము. (చూ. ఒప్పరము) (రూ. తూపరాణము)

**తూపరాణి** (దే.వి.) : నీళ్లు బయటికివచ్చు తూము. (చూ. ఒప్పరము) (రూ. తూపరాణము)

**తూపి** (వై.వి.) : గుడిలో మూల విగ్రహము ఉండెడు చోటికి మీఁద విమానమువలె ఎత్తుగా కట్టిన కట్టడము.

**తూపు** (దే.వి.) : బాణము.

**తూపురిక్క** (ద్వ.వి.) : శ్రవణ నక్షత్రము.

**తూపురిక్క నెల** (ద్వ.వి.) : శ్రావణ మాసము.

**తూపొడుచు** (దే.స.క్రి.) : ఉమియు. (చూ. తూ.)

**తూబరము** (సం.వి.అ.పుం.) : కాలమున కొమ్ములు మొలవని యెద్దు.

**తూబరుఁడు** (సం.వి.అ.పుం.) : 1. ప్రాయమున గడ్డము మీసము రాని మగవాఁడు; 2. అంతః పురపు కావలివాఁడు.

**తూము** (వై.వి.) : 1. బండి చక్రము నడిమి రంధ్రము; 2. నీళ్లు బయటికి వచ్చునట్లు ద్వార మేర్పరచి కట్టిన కట్టడము; 3. నాలుగు కుంచముల కొలఁది; 4. సూది చెవి. 5. నగల మోపునందలి రంధ్రము.

**తూర** (దే.వి.) : 1. వానబొట్టు; (తువర యొక్క రూపాంతరము) 2. మత్స్య విశేషము. (చూ. తూల)

**తూరనగోలలు** (దే.వి.బ.) : బాలక్రీడా విశేషము. (చూ. అందలము)

**తూరనతుంకములు** (దే.వి.బ.) : బాలక్రీడా విశేషము. (చూ. అందలము)

**తూరి** (దే.వి.) : తడవ, ఆవృత్తి. (ఇది ఏకాద్యర్థక శబ్ద పూర్వకముగానే ప్రయోగింపఁబడును. ఉదా. ఒకతూరి, ఈతూరి. మొ.)

**తూరు** (దే.అ.క్రి.) : (సన్నగా) తూరపడు. (దీనిని చొచ్చు అను అర్థమందును కొందఱు లఘు రేఫముగా ప్రయోగించి యున్నారు. ప్రామాణిక ప్రయోగముల యందట్లు కనఁబడలేదు.) (వి.): ధాన్యముతో కలసియున్న గల్లపొట్టు మొదలైనది.

**తూరుపాఱఁబట్టు** (దే.స.క్రి.) : (తూరు + పాఱన్ + పట్టు) గల్లపొట్టు లోనగునవి యెగిరిపోవు నట్లుగా చేట లోనగువానితో ధాన్యము లోనగు వానిని పైకెత్తి క్రిందుగాఁ బోయు.
(రూ. తూర్పాఱఁ బట్టు)

**తూరుపు** (దే.వి.) : సూర్యుఁడుదయించెడు దిక్కు, ప్రాగ్దిశ (రూ. తూర్పు)

**తూరుపుఁగొండ** (ద్వ.వి.) : ఉదయాద్రి, పూర్వ పర్వతము.

**తూరుపుఱేఁడు** (దే.వి.) : ఇంద్రుఁడు, పూర్వదిక్పతి.

**తూరుపెత్తు** (దే.స.క్రి.) : (తూరుపు + ఎత్తు) 1. ధాన్యాదికమును ఎత్తి తూరుపు గాలికి విడుచు; 2. ఏదేని గాలి వాటముగా ఎత్తి విడుచు; 3. వెండ్రుకలు పాయఁదీసి అడ్డముగా మీఁది కెత్తి పట్టు.

**తూర్చే** (దే.ప్రే.) : తూఱుచు యొక్క రూపాం తరము.

**తూర్ణము** (సం.క్రి.విణ.అ.న.) : త్వరితము. (విణ.) : వడిగలది.

**తూర్పిడి** (దే.వి.) : తూరుపాఱఁబట్టుట.

**తూర్పెత్తు** (దే.స.క్రి.) : తూరుపెత్తు యొక్క రూపాం తరము.

**తూర్యము** (సం.వి.అ.న.) : వాద్యము. (పుం.న.) వాద్యపు మ్రోఁత.

**తూఱఁబడు** (ద్వ.అ.క్రి.) : (తూఱన్ + పడు) తూఱు. (స్వార్థమునపడు.)

**తూఱు** (దే.అ.క్రి.) : చొచ్చు.

**తూఱుచు** (దే.ప్రే.) : తూఱఁజేయు.

**తూల** (దే.వి.) : పందుచేఁప, ఝుషము.

**తూలఁబాఱు** (దే.అ.క్రి.) : (తూలన్ + పాఱు) 1. తూలు, చలించు; 2. తొలఁగు.

**తూలనాళిక** (సం.వి.ఆ.స్త్రీ.) : దూది చుట్ట, ఏకు.

**తూలపోవు** (మి.అ.క్రి.) : (తూలము + పోవు) చిన్నపోవు. (ప్రే. తూల పుచ్చు.)

**తూలము** (సం.వి.అ.న.) : 1. గంగరావి. 2. ఆకాశము. (పుం.న.) : దూది.

**తూలాడు** (దే.అ.క్రి.) : (తూలి + ఆడు) తూలు, చలించు. (దీని మొదటి రూపము తూలియాడు) (చూ. ఊఁగాడు.)

**తూలి** (ఉభ.దే.వి.) : (తూల + ఇ) చేఁపలను బట్టి జీవించెడి యొకానొకజాతివాఁడు. (సం.ఈ.స్త్రీ.) : తూలిక.

**తూలిక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. చిన్న యాఁక; 2. వ్రాసెడు కలము; 3. చిత్రము వ్రాసెడు వాగర.

**తూలికాఁడు** (దే.వి.) : తూలి (స్వార్థమున కాఁడు)

**తూలు** (దే.అ.క్రి.) : 1. చలించు; 2. తొలఁగు.

**తూలు** (హిం.విణ.) : అనగత్యముగా పెంచి చెప్పిన తూలుమాటలు, తిట్లు.

**తూలుచు** (దే.ప్రే.) : (తూలఁజేయు) 1. చలింపఁ జేయు; 2. తొలఁగించు. (రూ. తూల్చు)

**తూష్ణీకుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) మాట లాడక ఊరకుండువాఁడు, తూష్ణీంశీలుఁడు.

## తృ

**తృట్టు** (సం.వి.ష్.స్త్రీ.) : 1. దప్పి; 2. ఇచ్ఛ.

**తృణగ్రాహి** (సం.వి.న్.పుం.) : పచ్చ, మరకతము.

**తృణజలూక** (సం.వి.ఆ.స్త్రీ.) : తృణముల యందు సంచరించెడు జలగవంటి యొకదినుసు పురుగు.

**తృణత** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. తృణ భావము; 2. విల్లు.

**తృణద్రుమము** (సం.వి.అ.పుం.) : తాటి. లోనగునది.

**తృణధాన్యము** (సం.వి.అ.న.) : విత్తక పండెడు గునుకు నివ్వని దూసరి లోనగునది.

**తృణధ్వజము** (సం.వి.అ.పుం.) : వెదురు, వేణువు.

**తృణపుష్పిక** (సం.వి.ఆ.స్త్రీ. ) : కొండ యల్లము.

**తృణము** (సం.వి.అ.న.) : 1. కిక్కస లోనగుగడ్డి; 2. గంటె చామలోనగు పైరు.

**తృణరాజము** (సం.వి.అ.పుం.) : 1. తాటి; 2. గిఱకతాటి; 3. టెంకాయ.

**తృణశూన్యము** (సం.వి.అ.న.) : మల్లె (రూ. తృణ శూల్యము). (ఇది ఆకారాంత స్త్రీ లింగము నగును.) (అ.పు,న.ఆ.) : స్త్రీ. మొగలిపండు. (విణ.) : తృణములేనిది.

**తృణీకరించు** (సం.స.క్రి.) : తృణముగాఁ జేయు, అలక్ష్యముచేయు.

**తృణ్య** (సం.వి.ఆ.స్త్రీ.) : గడ్డిమోపు.

**తృతీయము** (సం.స.) : (అ.ఆ.అ.) మూడవది.

**తృతీయాకృతము** (సం.విణ.) : (అ.ఆ. అ.) మూడు చాళ్లు దున్నినది. (నేల)

**తృతీయాప్రకృతి** (సం.వి.ఇ.స్త్రీ.) : నపుంసకుఁడు, పేడి. (రూ. తృతీయ ప్రకృతి)

**తృప్తము** (సం.వి.అ.పుం.) : పురోడాశము. (విణ.) : తృప్తి పొందినది.

**తృప్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : తనివి, తర్పణము.

**తృప్తుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) తనివి నొందిన వాఁడు.

**తృష** (సం.వి.ఆ.ష్.స్త్రీ.) : 1. దప్పి; 2. ఇచ్ఛ.

**తృషితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. దప్పి గొన్నవాఁడు; 2. ఇచ్ఛగొన్న వాఁడు.

**తృష్ణ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. ఇచ్ఛ; 2. దప్పి.

**తృష్ణక్కు** (సం.విణ.జ్.) : 1. ఇచ్ఛగొన్న వాఁడు; 2. దప్పిగొన్నవాఁడు.

## తె

**తెంకాయ** (దే.వి.) : టెంకాయ యొక్క రూపాం తరము.

**తెంకి** (దే.వి.) : స్థానము (టెంకి యొక్క రూపాం తరము)

**తెంచు** (దే.ప్రే.) : తెగఁజేయు. (త్రెంచు యొక్క రూపాంతరము)

**తెండు** (దే.అ.క్రి.) : పరుండు, శయనించు. (చూ. తేఁడు)

**తెందెప్పలు** (దే.విణ.బ.) : (తెప్పలు + తెప్పలు) అపారము. (రూ. తెందేపలు.)

**తెంపరి** (దే.విణ.) : (తెంపు+అరి) సాహసికుఁడు.

**తెంపి** (దే.వి.) : 1. విధవ; 2. తెంపు యొక్క రూపాంతరము.

**తెంపు** (దే.ప్రే.) : తెంచు. (వి.) 1. తెగువ; 2. తెగుట.

**తెకతెక** (దే.వి.) : ఉడుకుట క్రాఁగుట యొగ యుటల యందగు ధ్వన్యనుకరణము.

**తెకతేర** (దే.విణ.) : (తేర + తేర) బొత్తిగా సంబంధములేనిది. (క్రి.విణ.) : మిక్కిలి వ్యర్థము.

**తెక్కరము** (దే.వి.) : విలాసము.

**తెక్కలి** (వై.వి.) : 1. దొంగతనము; 2. వంచన; 3. ప్రమాదము. (విణ.) : పంచకము.

**తెక్కలికాఁడు** (ద్వ.వి.) : దొంగ. (చూ. చొచ్చిల్లు) (విణ.) : వంచకుఁడు.

**తెక్కలిపాటు** (వై.వి.) : విపత్తు.

**తెక్కు** (దే.వి.) : టెక్కు యొక్క రూపాంతరము.

**తెగ** (దే.వి.) : 1. సజాతీయ సమూహము; 2. సమూహము; 3. విధము; 4. పక్షము; 5.(ఎక్కు పెట్టిన) అల్లె త్రాడు; 6. (అల్లె త్రాటిని) ఎక్కు పెట్టుట; 7. నిడుపు. (క్రి.) : 1. నిశ్శేష ముగా; 2. ఖండితముగా.

**తెగఁగొట్టు** (దే.స.క్రి.) : (తెగన్ + కొట్టు) నఱకు. (వాని తల తెగఁగొట్టెను)

**తెగఁజూచు** (దే.స.క్రి.) : (తెగన్ + చూచు) చంపు. (ఇందు పూర్వావ యవమైన తెగ అనునది అంత్యావయ వమైన చూచు క్రియకు వెనుకను ప్రయోగముల యందు కానం బడియెడి.)

**తెగఁబడు** (ద్వ.అ.క్రి.) : (తెగన్ + పడు) తెగించు. (స్వార్థమునపడు.)

**తెగఁబాటు** (ద్వ.వి.) : (తెగ న్ + పాటు) తెగఁబడుట.

**తెగఁబాఱు** (దే.అ.క్రి.) : (తెగన్ + పాఱు) తెగించు. (స్వార్థమున పాఱు.)

**తెగచే** (దే.అ.క్రి.) : కలఁగు.

**తెగటాఱు** (దే.అ.క్రి.) : (తెగటు+అఱు) చచ్చు, నశించు.

**తెగటాఱుచు** (దే.ప్రే.) : తెగటాఱఁ జేయు. (రూ. తెగటార్చు.)

**తెగటు** (దే.అ.క్రి.) : త్రుళ్లు. (వి.) : త్రుళ్ళు.

**తెగడ** (వై.వి.) : త్రివృత. (దీని భేదములు తెల్లతెగడ, నల్లతెగడ. ఇదే తెల్లతెగడ.)

**తెగడు** (దే.అ.క్రి.) : ఉపేక్షింపఁబడు. –(స.క్రి.): 1. తిరస్కరించు; 2. ఉపేక్షించు; 3. నిందించు.

**తెగవేయు** (దే.స.క్రి.) : నఱకు. (దానితల తెగవేసెను.)

**తెగించు** (దే.అ.క్రి.) : సాహసించు.

**తెగు** (దే.అ.క్రి.) : 1. ఖండితమగు; 2. ఛిన్నమగు; 3. చచ్చు; 4. తీర్పగు; 5. సాహసించు.

**తెగుడు** (దే.వి.) : తెగుట, విచ్ఛేదము.

**తెగుదల** (దే.వి.) : 1. అంతము; 2. క్షయము.

**తెగుదారి** (దే.విణ.) : (తెగువ + దారి) 1. సాహసికుఁడు, సాహసికురాలు; 2. దాత.

**తెగుదెంపు** (దే.వి.) : (తెగు+తెంపు) తీర్పు.

**తెగుబడి** (దే.వి.) : 1. తెగుట; 2. దుక్కి; 3. అమ్మకము.

**తెగులు** (దే.వి.) : 1. వ్యాధి; 2. చీడ.

**తెగులుగొంటు** (దే.విణ.) : వ్యాధిగ్రస్తుఁడు, వ్యాధిగ్రస్తురాలు, వ్యాధిగ్రస్తము.

**తెగులుగొను** (దే.అ.క్రి.) : (తెగులు + కొను) వ్యాధిగ్రస్తమగు.

**తెగువ** (దే.వి.) : 1. సాహసము; 2. దాతృత్వము.

**తెగువడు** (ద్వ.అ.క్రి.) : (తెగుడు + పడు) వేఱుపడు.

**తెచ్చు** (దే.స.క్రి.) : తీసికొనివచ్చు, ఆనయించు.

**తెట్టగిలఁబడు** (ద్వ.అ.క్రి.) : (తెట్టగిలన్ + పడు) తెట్టగిల్లు. (స్వార్థమునపడు)

**తెట్టగిల్లు** (దే.అ.క్రి.) : నిస్సారమగు.

**తెట్టతెరువు** (దే.వి.) : (తెరవు + తెరవు) నడివీధి. (ఇట్లు తెట్టతెన్ను.)

**తెట్టియ** (వై.వి.) : 1. తెట్టువ; 2. తేనెపెర; 3. తృణకాష్ఠాది భారము.

**తెట్టు** (దే.వి.) : పట్టణమునకైనను కోటకైనను బయట చుట్టు నేర్పఱచిన కంపకోట.

**తెట్టువ** (వై.వి.) : 1. సమూహము; 2. నీటియందు గాలికొక్క

**తెట్టువగట్టు** (ద్వ.అ.క్రి.) : (తెట్టువ + కట్టు) నీటియందు తృణాదికము గాలి కొక్క ప్రక్కచేరు. (రూ. తెట్టువలుగట్టు.)

**తెట్టువలుగొను** (ద్వ.అ.క్రి.) : (తెట్టువలు + కొను) తెట్టువలుగట్టు. (చూ. తెట్టెలుగట్టు)

**తెట్టువు** (దే.వి.) : తెట్టు యొక్క రూపాంతరము.

**తెట్టె** (వై.వి.) : తెట్టియ యొక్క రూపాంతరము.

**తెట్టెము** (వై.వి.) : మొత్తము.

**తెట్టెలుగట్టు** (ద్వ.అ.క్రి.) : (తెట్టెలు + కట్టు) రాశిపడు.

**తెట్టెలుగొను** (ద్వ.అ.క్రి.) : (తెట్టెలు + కొను) తెట్టెలుగట్టు.

**తెడ్డు** (వై.వి.) : 1. కొయ్యగరిఁటె; 2. పడవ త్రోసెడు పలక. (త్రెడ్డు యొక్క రూపాంతరము.)

**తెడ్డుమూతికొంగ** (ద్వ.వి.) : జలపక్షి విశేషము.

**తెనమణు** (దే.అ.క్రి.) : శయనించు.

**తెనుఁగు** (వై.వి.) : తెలుగు యొక్క రూపాంతరము.

**తెన్ను** (దే.వి.) : దారి, మార్గము.

**తెన్నుండు** (దే.అ.క్రి.) : పరుండు, శయనించు.

**తెప్ప** (దే.వి.) : 1. తెప్పకొయ్య, కట్టు మ్రాను; 2. ప్రోవు. (తేప యొక్క రూపాంతరము)

**తెప్పదెరలఁగ** (దే.ద్ర.క్రి.విణ.) : అతివేగముగా.

**తెప్పలఁదేలు** (దే.అ.క్రి.) : (తెప్పలుఁ + తేలు) ఓలలాడు. (ప్రే. తెప్పలఁ దేల్చు.)

**తెప్పిర్లు** (దే.అ.క్రి.) : తెప్పిఱిల్లు యొక్క రూపాంతరము.

**తెప్పిఱిల్లు** (దే.అ.క్రి.) : అపాయము నుండి తేఱు. (రూ. తెప్పిఱిలు.)

**తెప్పిఱు** (దే.అ.క్రి.) : తెప్పిఱిలు.

**తెప్పున** (దే.ద్ర.క్రి.విణ.) : శీఘ్రముగా.

**తెబక** (దే.వి.) : మొత్తము, సమూహము.

**తెమడ** (దే.వి.) : శైత్యముచేఁగలిగెడు శ్లేష్మము.

**తెమలు** (దే.అ.క్రి.) : చలించు.

**తెమలుచే** (దే.ప్రే.) : (తెమలఁజేయు) ఉసుము. (రూ. తెమల్చు.) తెమ్మ (వై.వి.) : తేమ యొక్క రూపాంతరము.)

**తెమ్మెర** (దే.వి.) : (తెమ్మ + ఎర) 1. చల్లగాలి, మలయమారుతము; (ఎర శబ్దమునకు వృత్తియందు గాలి యర్థమని తెలియవలయును.) 2. గాలి (చూ. తెమ్మ)

**తెర** (వై.వి.) : 1. మఱుఁగుచీర; 2. అడ్డువల; 3. అల. 4. బ. పరంపర.

**తెరతెర** (వై.వి.) : పరంపర. (వానికి దగ్గు తెరతెరగా వచ్చుచున్నది.)

**తెరల** (దే.వి.) : కవణము, కబళము.

**తెరలఁబాఱు** (దే.అ.క్రి.) : (తెరలన్ + పాఱు) తొలఁగు. (స్వార్థమున పాఱు.)

**తెరలిక** (దే.వి.) : గుంపు, సమూహము.

**తెరలు** (దే.అ.క్రి.) : 1. తెర్లు; 2. బయలు దేఱు; 3. కలఁగు; 4. తొలఁగు.

**తెరలుచే** (దే.ప్రే.) : తెరలఁజేయు. (తొలఁగించుటకు)

**తెరలుడు** (దే.వి.) : బయలుదేరుట, ప్రయాణము.

**తెరవాఱు** (ద్వ.అ.క్రి.) : (తెర + పాఱు) జిడ్డుదేఱి తెరగట్టు. (తెర = అల)

**తెరవేఁట** (ద్వ.వి.) : తెరయెత్తి ఆడెడు వేఁట. (చూ. ఏదువేఁట)

**తెరవేఁటకాఁడు** (ద్వ.వి.) : తెర యెత్తి వేఁటాడెడు వేఁటకాఁడు. (ఇక్కడ వేఁటకాండ్రు అనఁగా విలువేఁట కాండ్రు అని యర్థము.)

**తెరువరి** (దే.విణ.) : (తెరవు + అరి) దారి నడుచువాఁడు, పథికుఁడు.

**తెరువాటీఁడు** (దే.విణ.) : (తెరువాటు + ఈఁడు) తెరువాటు కాఁడు.

**తెరువాటు** (దే.వి.) : (తెరువు + ఆటు) (దొంగలు) దారి గట్టి కొట్టుట, అభిగ్రహము. ("తెరువాటు కొట్టి, తెరువాటు కొట్టె" ఇత్యాది స్థలముల యందు తెరువాటుగా కొట్టుట యని తెలియవలెను. అప్పుడు తెరువాటునకు దారి కట్టుట మాత్ర మర్థము.)

**తెరువటుకాఁడు** (దే.వి.) : దారికట్టి కొట్టి దోఁచుకొను దొంగ, పరిపంథి.

**తెరువు** (దే.వి.) : దారి, మార్గము.

**తెర్లు** (దే.వి.) : నీళ్లు లోనగునవి కాఁగి సలసల పొంగు. (వి.) : నీళ్లు లోనగు నవి కాగి సలసల పొంగుట. (తెరలు యొక్క రూపాంతరము.)

**తెర్వు** (దే.వి.) : తెరువు యొక్క రూపాంతరము. (చూ. కట్టిఁడి)

**తెఱ** (దే.విణ.) : తెఱపయయినది. (ఉదా. తెఱగంటి, తెఱవ.మొ.) (దీనికి వ్యస్తముగా ప్రయోగము కనఁబడదు.)

**తెఱఁగు** (దే.వి.) : 1. విధము; 2. క్రమము; 3. చక్కన; 4. సంధి.

**తెఱఁగువడు** (ద్వ.అ.క్రి.) : (తెఱఁగు + పడు) సంధియగు. (ప్రే. తెఱఁగు వఱచు.)

**తెఱకువ** (దే.వి.) : 1. వివేకము; 2. ఉపాయము.

**తెఱకొను** (దే.అ.క్రి.) : (తెఱలు + కొను) (చూ.) తెఱలు. (స్వార్థమున కొను. ప్రే. తెఱకొలుపు.)

**తెఱగంటి** (దే.వి.) : (తెఱ+కన్ను) 1. అనిమిషుఁడు; 2. అనిమిష స్త్రీ; 3. చేప, అనిమిషము.

**తెఱగంటిఱేఁడు** (దే.వి.) : ఇంద్రుడు, లేఖర్షభుఁడు.

**తెఱచు** (దే.స.క్రి.) : తెఱపచేయు.

**తెఱనోటిమెకము** (ద్వ.వి.) : (తెఱనోరు + మెకము) సింహము, పంచాస్యము. (ఇట్లు తెఱవామెకము)

**తెఱప** (దే.వి.) : 1. తెఱచుట; 2. ఉపశమనము. (విణ.) : మఱుఁగు లేనిది. (తెఱపనేల.)

**తెఱపి** (దే.వి.) : సందు, అవకాశము.

**తెఱపుమఱపు** (ద్వ.వి.) : (చిత్తస్వాస్థ్యము తప్పినప్పుడు కలుగు.) తబ్బిబ్బు. (వాఁడు జన్నిపుట్టి తెఱపుమఱపు మాటలాడుచున్నాఁడు.)

**తెఱలు** (దే.అ.క్రి.) : (వాసన) బయలువెడలు.

**తెఱవ** (దే.వి.) : (తెఱ+వా) ఆఁడుది, ఇంతి.

**తెఱవు** (దే.అ.క్రి.) : తెఱఁగు యొక్క రూపాంతరము.

**తెఱ్ఱ** (దే.విణ.) : తెఱయొక్క రూపాంతరము.

**తెల** (వై.విణ.) : తెల్లయొక్క రూపాంతరము. (ఆమ్రేడితము నందు తెలతెల.

**తెలగా** (వై.వి.) : 1. త్రిలింగ దేశమందలి యొక శూద్ర జాతి; 2. బ. ఆజాతి వారు. (వృత్తి యందు దీర్ఘమునకు హ్రస్వము. ఉదా. తెలగ బలిజెలు.)

**తెలచే** (దే.స.క్రి.) : తెలుచు యొక్క రూపాంతరము. (ఇట్లు అకార మధ్యముగా గ్రంథముల యందు కానఁబడుచున్నది. ఆ పక్షమున ఇది వెలచు క్రియ వంటిదిగా నుండవచ్చును.)

**తెలతెలఁబోవు** (ద్వ.అ.క్రి.) : (తెలతెల + పోవు) వెలవెలఁబోవు.

**తెలతెలవాఱు** (ద్వ.అ.క్రి.) : (తెలతెల + పాఱు) తెలతెలఁబోవు; 2. తెల్లగా తెల్లవాఱు.

**తెలనాకు** (ద్వ.వి.) : తెల్లనాకు యొక్క రూపాంతరము.

**తెలవాఱు** (ద్వ.అ.క్రి.) : తెల్లవాఱు యొక్క రూపాంతరము.

**తెలి** (వై.విణ.) : 1. తెల్లనిది. "తెలినవ్వు." 2. నిర్మలము.

**తెలికపిండి** (వై.వి.) : గానుఁగపిండి, పిణ్యాకము.

**తెలికలు** (వై.వి.బ.) : నువ్వులు. (వృత్తి యందు ఏకవచనాంతము. తెలికపిండి. మొ.)

**తెలికవాఁడు** (వై.వి.) : గాండ్లవాఁడు.

**తెలిగంటి** (ద్వ.వి.) : (తెలి + కన్ను) ఆఁడుది, ధవళాక్షి.

**తెలిగాము** (వై.వి.) : గ్రహ విశేషము, శుక్రుఁడు.

**తెలిగొను** (ద్వ.అ.క్రి.) : (తెలి + కొను) ప్రయాణము చేయించు.

**తెలిదమ్మి** (వై.వి.) : (తెలి + తమ్మి) తెల్లదామర, పుండరీకము.

**తెలిదమ్మికంటి** (ద్వ.వి.) : (తెలిదమ్మి + కన్ను) విష్ణువు, పుండరీకాక్షుఁడు.

**తెలిపక్కము** (వై.వి.) : శుక్లపక్షము.

**తెలిపిట్ట** (వై.వి.) : హంస, శ్వేతగరుత్తు. (ఇట్లు తెలుపులుఁగు. మొ.)

**తెలిమెకము** (వై.వి.) : సింహము.

**తెలిమొదవు** (ద్వ.వి.) : కామధేనువు.

**తెలియ** (వై.వి.) : తెలె.

**తెలియు** (దే.అ.క్రి.) : 1. విదితమగు; 2. విశదమగు; 3. మేలుకొను; 4. ప్రసన్నతనొందు. (స.క్రి.) : ఎఱుఁగు.

**తెలియేఱు** (ద్వ.వి.) : ఆకాశగంగ.

**తెలివి** (దే.వి.) : 1. దేహాత్మాది భేద జ్ఞానము; 2. వివేకము; 3. ప్రకాశము; 4. కాంతి; 5. వికాసము; 6. ప్రసన్నత; 7. (నీళ్లు) తేఱుట; 8. తెలుపు.

**తెలివికత్తె** (ద్వ.విశే.) : వివేకముగలది, ప్రాజ్ఞ.

**తెలివికాఁడు** (దే.విశే.) : వివేకము గలవాఁడు, ప్రాజ్ఞుఁడు.

**తెలివిడి** (దే.వి.) : 1. దృష్టాంతము; 2. తెలియఁ జేయుట.

**తెలుఁగు** (వై.వి.) : తెనుఁగు, ఆంధ్రము.

**తెలుచే** (దే.స.క్రి.) : 1. మ్రొక్కు; (కుకవులఁ – కుకవులను గూర్చి యనుట. కుకవులకు ననియు ప్రయోగము.) 2. తేర్చు; 3.ప్రార్థించు. (రూ. తెల్చు. తేర్చుటకు.) (చూ. తెలియు, తెలుపు.)

**తెలుపారు** (ద్వ.అ.క్రి.) : (తెలుపు + ఆరు) తెల్లనగు. (రూ. తెల్పారు.)

**తెలుపు** (యు.దే.ప్రే.) : (తెలియఁ జేయు.) 1.ఎఱిఁగించు; 2.మేలు కొలుపు; 3. తేర్చు. (చూ. తియ్యము) (వి.) : ఊఱట. (వై.) : 1.ధావళ్యము; 2.పరిశుద్ధి; (చూ. తెలుపు వాఱు) 3. మేహ రోగము. (విశే.) : ధవళము (రూ. తెల్పు.) ఊఱటకు.

**తెలుపుడు** (దే.వి.) : ఎఱుక. (రూ. తెల్పుడు.)

**తెలుపుడుసేయు** (ద్వ.స.క్రి.) : (తెలుపుడు + చేయు) ఎఱిఁగించు. (రూ. తెల్పుడు సేయు.)

**తెలుపువాఱు** (ద్వ.అ.క్రి.) : (తెలుపు + పాఱు) తెలుపారు.

**తెలె** (వై.వి.) : భోజనపాత్రము. (విజ్ఞా. ఆచా, కాం.) : (తెలియ యొక్క రూపాంతరము.)

**తెల్ల** (వై.విశే.) : 1.ధవళము; 2.స్పష్టము (చూ. గాసటబీసట.) తెల్ల అను విశేషణము ముందు గల సంజ్ఞావాచక శబ్దములు. తెల్లకలిగొట్టు. (కాష్ఠపాటలి.) తెల్లకాకి (ధూంక్ష్మము.), తెల్ల కొక్కెర (బలాక.), తెల్ల గగ్గెర (ఆర్జకము.), తెల్ల గడ్డ (లశునము), తెల్లగన్నేరు (శ్వేత కర వీరము.), తెల్లగటిక (శతవీర్య.) తెల్ల గలిజేరు (దీర్ఘపత్రము.), తెల్లగినియ (సునాభము), తెల్లగిసె (ముతంగి.) తెల్లగురిజ (మధుశ్రవ.), తెల్లగురిగింజ (శ్వేతపాకి.) తెల్ల గోరింట (సైరే యకము.) తెల్లచెఱకు (తేజెనకము.) తెల్లజనము (వృత్తపర్ణి.), తెల్ల దామర (పుండరీకము.), తెల్లదింటెన (అశ్వఖుర.) తెల్లదీవి (శ్వేత ద్వీపము.), తెల్ల నేలగుమ్ముడు (విదారి.), తెల్ల పులుగుడు (శ్వేతవాతంగిని.), తెల్లములక (శ్వేత బృహతి.), తెల్లయిరుగుడు (శ్వేత పత్రము.), తెల్ల యుప్పి (మౌక్తికఫల.), తెల్ల లొద్దుగు (జీర్ణ వృంతము.), తెల్ల వట్టి వేరు (లామజ్జకము.), తెల్లజిలకఱ్ఱ (అజాజి.), తెల్లజిల్లెడు (అలర్కము.), తెల్లతెగడ (త్రివృత.), తెల్లవస (హైమవతి.), తెల్లవావిలి (శ్వేతసురని.), తెల్లావలు (సిద్ధార్థము.) ఇత్యాదులు.

**తెల్లడాలుమెకము** (ద్వ.వి.) : సింహము.

**తెల్లన** (వై.వి.) : తెలుపు. (విశే.) : తెల్లనిది. (ముందు విశేషణమగుచో (చూ. అలకన.)

**తెల్లనాకు** (ద్వ.వి.) : (తెల్లన + ఆకు) తెల్లని సన్నపు తములపాకు. (ఇక్కడ తెల్లన అనఁగా తెల్లదాళు అని యర్థము.)

**తెల్లనార** (ద్వ.వి.) : మత్స్యవిశేషము.

**తెల్లనిదొర** (ద్వ.వి.) : 1.శివుఁడు; 2.బల రాముఁడు.

**తెల్లమి** (వై.విశే.) : తెల్లము యొక్క రూపాంతరము.

**తెల్లము** (వై.విశే.) : స్పష్టము.

**తెల్లయేనుఁగు** (ద్వ.వి.) : (తెల్ల + ఏనుఁగు) ఇంద్రుని వెల్లయేనుఁగు, ఐరావతము.

**తెల్లవాఱు** (ద్వ.అ.క్రి.) : (తెల్ల + పాఱు) ఉదయ మగు. (వాని పని తెల్లవాఱెను.)

**తెవ** (దే.వి.) : సమూహము. (తెగ యొక్క రూపాంతరము.)

**తెవడు** (దే.స.క్రి.) : తిరస్కరించు. (తెగడు యొక్క రూపాంతరము)

**తెవులు** (దే.వి.) : తెగులు యొక్క రూపాంతరము.

**తెవులుగొంటు** (దే.విశే.) : తెగులు గొంటు యొక్క రూపాంతరము.

**తెవులుగొను** (ద్వ.అ.క్రి.) : తెగులుగొను యొక్క రూపాంతరము.

**తెవులువడు** (ద్వ.అ.క్రి.) : (తెవులు + పడు) వ్యాధిగ్రస్తమగు.

**తెవ్వుగొంటు** (దే.వి.) : తెవులుగొంటు యొక్క రూపాంతరము.



**తేఁకు** (దే.వి.) : టేఁకు యొక్క రూపాంతరము.

**తేఁకువ** (దే.వి.) : 1. ధైర్యము; 2. భయము.

**తేఁజెట్టు** (దే.వి.):తెంకాయ చెట్టు, నారికేళ వృక్షము.

**తేఁటి** (దే.వి.) : తుమ్మెద, భ్రమరము.

**తేఁడు** (దే.అ.క్రి.) : తెండు, శయనించు.

**తేగ** (దే.వి.) : తాటిమొలక.

**తేగడ** (దే.విశే.) : తేసినది. (నాణెము.)

**తేగము** (వై.వి.) : ఈవి, త్యాగము.

**తేగాకత్తి** (ద్వ.వి.) : చురకత్తి.

**తేజనకము** (సం.వి.) : కాకి వెదురు.

**తేజనము** (సం.వి.అ.పుం.) : వెదురు, వేణువు.

**తేజని** (సం.వి.ఈ.స్త్రీ.) : చాఁగ.

**తేజస్సు** (సం.వి.స్.న.) : 1.ప్రకాశము; 2.ప్రభావము; 3.పరాక్రమము; 4.రేతస్సు. (రూ.తేజము)

**తేజస్వి** (సం.విశే.) : (న్.ఈ.న్) తేజస్సు గలవాఁడు.

**తేజి** (దే.వి.) : 1.మేలుజాతి గుఱ్ఱము; 2.గుఱ్ఱము.

**తేజితము** (సం.విశే.) : (అ.ఆ.అ.) వాఁడి చేయఁబడినది, శాతము.

**తేజీ** (దే.వి.) : తేజి యొక్క రూపాంతరము. (మేలు జాతి గుఱ్ఱమునకు.)

**తేజేరిల్లు** (వై.అ.క్రి.) : ప్రకాశించు(రూ.) తేజరిలు.

**తేజో** (వై.వి.) : 1. ప్రకాశము; 2. కాంతి; 3. ప్రతాపము.

**తేట** (దే.వి.) : 1.నైర్మల్యము; 2. ప్రసన్నత; 3. తేటిన మజ్జిగ లోనగునది. (విశే.) : 1. నిర్మలము; (నీళ్లు మిక్కిలి తేటగా ఉన్నవి.) 2. ప్రసన్నము; (ఇప్పుడు వీని ముఖము తేటగా ఉన్నది.) 3.విశదము. (తేటగా మాటాడుము.)

**తేటతెల్ల** (ద్వ.విశే.) : 1. మిక్కిలి స్పష్టము; 2. స్పష్టము.

**తేటపడు** (ద్వ.అ.క్రి.) : విశదమగు.

**తేటి** (దే.వి.) : తెప్ప.

**తేడా** (వై.వి.) : పెచ్చు.

**తేది** (వై.వి.) : (సౌరమానమునందు) దినము.

**తేనియ** (దే.వి.) : తేనె.

**తేనియతిండి** (దే.వి.) : తుమ్మెద, మధుపము.

**తేనె** (దే.వి.) : మధువు. (పుట్టతేనె, పెర తేనె అని దీని భేదములు అనేకములు కలవు.) (తేనియ యొక్క రూపాంతరము.)

**తేనెగద్ద** (ద్వ.వి.) : పక్షివిశేషము.

**తేనెగాజు** (దే.వి.) : కాచవలయ విశేషము.

**తేనెటీఁగ** (దే.వి.) : (తేనె + ఈఁగ) తేనెకూర్చెడి యీఁగ, సరఘ.

**తేనెతిండి** (దే.వి.) : తేనియతిండి యొక్క రూపాంతరము.

**తేనెతొల** (దే.వి.) : భక్ష్య విశేషము.

**తేనెదానిమ్మ** (ద్వ.వి.) : తియ్యదానిమ్మ.

**తేనెమామిడి** (దే.వి.) : తియ్యమామిడి.

**తేనెవ్రాను** (దే.వి.) : కేశముష్టి.

**తేనెయరఁటి** (దే.వి.) : (తేనె + అరఁటి) బూడిద వర్ణపు పండ్లుగల నల్ల అరఁటి.

**తేప** (దే.వి.) : 1. తడవ; 2. తెప్ప.

**తేమ** (వై.వి.) : తడి. (విశే.) : తడిగలది. (నేల మిక్కిలి తేమ.) (సంస్కృతము నందు వలెఁగాక కొంచెము అర్థభేదము కలిగియుండుటవల్లను కుండమొదలగు దీనివంటి శబ్దములు కొన్ని వైకృతముగా వాడఁబడియుండుటవల్లను ఇదియు వైకృతముగా వ్రాయఁబడియెను.)

**తేమగిల్లు** (వై.అ.క్రి.) : చెమ్మగిల్లు, ఆర్ద్రమగు.

**తేమనము** (సం.వి.అ.న.) : 1. తడియుట; 2. మజ్జిగ పులుసు.

**తేమము** (సం.వి.అ.పుం.) : స్తేమము, తడియుట.

**తేమానము** (దే.వి.) : వడ్డి. (కొందఱు తేర అనియొక యర్థము వ్రాసి యున్నారు. దానికి తెనుఁగు నందు ప్రయోగము కనఁబడలేదు.)

**తేమ్రాను** (దే.వి.) : తెంకాయమ్రాను.

**తేయాకు** (దే.వి.) : (తే + ఆకు) తే అను ఒక దినుసు ఆకు. (తే అనునది అన్యదేశ్యము.)

**తేయు** (దే.అ.క్రి.) : అఱుగు.

**తేర** (దే.వి.) : 1. తేట; (చూ. తేరకొను.) 2. సంబంధములేమి (చూ. తేరకాఁడు, తేరకత్తె) (విణ.) : సంబంధము లేనిది. (తేర మాట, తేర సొమ్ము. మొ.) (చూ. తెక తేర.) (క్రి. విణ.) : 1.వ్యర్థముగా; 2. అనాయాసముగా.

**తేరకత్తియ** (ద్వ.విణ.) : సంబంధము లేనిది, అన్యురాలు.

**తేరకాఁడు** (దే.విణ.) : సంబంధము లేనివాఁడు, అన్యుఁడు.

**తేరకు** (దే.ద్ర.క్రి.విణ.) : 1. వ్యర్థముగా; 2. అనాయాసముగా. (వానికీ సొత్తు తేరకు వచ్చెను.)

**తేరకుఁదేర** (దే.అవ్య.క్రి.విణ.) : (తేరకుఁ + తేర) మిక్కిలి అనాయాసముగా.

**తేరకొను** (దే.అ.క్రి.) : తేటపడు. (తేరకొనఁ = తేటపడ. ఇట్లంతటఁ గ్రహించునది.) (దీనికి క్రియా విశేషణము నందే ప్రయోగము కానఁ బడియెడి.)

**తేరు** (దే.అ.క్రి.) : కలుగు. (వి.) : 1. రథము; 2. బండి.

**తేరుకాఁడు** (దే.వి.) : (చూ.) రథికుఁడు.

**తేరుపూన్పరి** (దే.వి.) : (తేరుపూన్పు + అరి) సారథి.

**తేటి** (దే.వి.) : కాఁచి తేటిన నెయ్యి.

**తేటిచూచు** (దే.వి.) : తేరకొనఁజూచుట.

**తేఱు** (దే.అ.క్రి.) : 1. తేటపడు; 2. ప్రసన్నత నొందు; 3. ఊఱడిల్లు; 4. తేఱుకొను; (వాఁడు ఇంకను తేఱలేదు.) 5.తెప్పిఱు; 6.కలుగు; 7. ముగియు; (చూ. తేఱుచు.) 8. తేరకొను. (ఇట్లు తేటిచూచు.మొ.) (దీనికి ఈ యర్థమున క్త్వార్థమునందే ప్రయోగము కానఁబడు చున్నది.)

**తేఱుకొను** (దే.అ.క్రి.) : స్వస్థత నొందు.

**తేఱుగడ** (దే.వి.) : 1. ముగియిక; 2. తెలివిడి.

**తేఱుచు** (దే.ప్రే.) : (తేఱఁజేయు) 1. ప్రసన్నత నొందించు. 2. చంపు. (ఈ యర్థమునందు తీఱుచు అనియే ఉండవచ్చును. అయినను వ్రాఁత ప్రతుల యందు పెక్కుచోట్ల తేఱుచు అని కానఁ బడుచున్నది.) (రూ.తేర్చు. ప్రసన్నత నొందించుటకు,చంపుటకు.) (చూ. గరువము.)

**తేలగిలఁబడు** (ద్వ.అ.క్రి.) : (తేలగిలఁ + పడు) తేలగిల్లు. (స్వార్థమున పడు.)

**తేలగిల్లు** (దే.అ.క్రి.) : 1.పైకితేలు; (చూ. తీపు) 2.పరవశమగు. (రూ. తేలగిలు పరవశ మగుటకు.)

**తేలవేయు** (దే.స.క్రి.) : తేలగిలఁజేయు. (వాఁడు కన్నులు తేలవేసినాఁడు.)

**తేలాడు** (దే.అ.క్రి.) : (తేలి+ఆడు) తేలు.

**తేలిక** (దే.వి.) : లఘుత్వము. (విణ.) : లఘువు.

**తేలిపోవు** (దే.అ.క్రి.) : 1. హానిచేయక తొలఁగి పోవు; (వానికి వచ్చిన ఆపద తేలిపోయెను.) 2. తొలఁగిపోవు.

**తేలు** (దే.అ.క్రి.) : 1. నీళ్లలో మునుగక మీద సంచరించు. 2. నీళ్లలో క్రీడించు. 3. తేలగిల్లు; 4. పొడచూపు. (వి. ) : వృశ్చికము.

**తేలుకొండి** (దే.వి.) : వృశ్చికాలి.

**తేలుచే** (దే.ప్రే.) : తేలఁజేయు. (రూ. తేల్చు)

**తేలుమణి** (మి.వి.) : తేలుకొండి.

**తేలుమీను** (ద్వ.వి.) : (చూ.) చిలిచిమము.

**తేలుమొన** (దే.వి.) : తేలుకొండి.

**తేలురాసి** (ద్వ.వి.) : వృశ్చికరాశి.

**తేలువాఱు** (దే.అ.క్రి.) : (తేలు + పాఱు) పుట్టు.

**తేవ** (దే.వి.) : ఉత్సవవిశేషము.

**తేవనము** (సం.వి.అ.న.) : 1.ఆటతోఁట; 2. ఆట.



**తైజసము** (సం.వి.అ.న.) : బంగారు వెండిలోనగు ధాతు ద్రవ్యము. (పుం.) : రాజసగుణము.

**తైజసావర్తని** (సం.వి.ఈ.(స్త్రీ.) : బంగారు లోనగునవి కరఁగుమూస.

**తైతిలము** (సం.వి.అ.న.) : ఒక కరణము. (చూ. కరణము) (పుం.) : మండెఁగ.

**తైత్తిరము** (సం.వి.అ.న.) : తిత్తిరిపక్షుల సమూహము.

**తైరు** (దే.వి.) : పెరుగు, దధి. (మొదటి రూపము తయిరు.)

**తైర్థికుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) తీర్థసేవ చేయువాఁడు.

**తైలపర్ణి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. చిల్లమడ్డి; (ఇది దేవదారు బంకచే చేయఁబడి సరళ ద్రవమను పేరు గలది.) 2. పీత చందనము.

**తైలపాయిక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. గబ్బిలము; 2. ఎఱ్ఱతోఁటకూర.

**తైలము** (సం.వి.అ.న.) : నూనె. (ఇది ఏరండాది శబ్దపూర్వకమైనప్పుడు తత్తద్ద్రవ ద్రవ్యమును తెలియఁజేయును. ఏరండ తైలము. మొ.)

**తైలికుఁడు** (సం.వి.అ.పుం.) : గాండ్లవాఁడు.

**తైలీనము** (సం.విణ.) : (అ.ఆ.అ.) తిలలు పండునది. (పొలము)

**తైషము** (సం.వి.అ.పుం.) : పుష్యమాసము, పౌషము.



**తొంక** (దే.వి.) : తోఁక యొక్క రూపాంతరము.

**తొంగలి** (దే.విణ.) : 1.వాలునది; 2.స్రవించునది.

**తొంగలించు** (దే.అ.క్రి.) : 1. అతిశయించు; 2. ప్రకాశించు; 3. వికసించు; 4. వర్ధిల్లు; 5. స్రవించు; 6. నిక్కు.

**తొంగలిగొను** (దే.అ.క్రి.) : (తొంగలి + కొను) తొంగలించు.

**తొంగలిపాట్లు** (ద్వ.వి.బ.) : నమస్కృతి.

**తొంగిళ్లు** (దే.వి.బ.) : నీళ్లు లోనగువాని బొట్లు. (తొంగిళ్లు = తొంగిళ్లుగా = బొట్టుబొట్టుగా.) (తొంగిళ్లు పైనిడి ఇక్కడ తొంగిళ్లు అనఁగా నూనెబొట్టు.)

**తొంగు** (దే.అ.క్రి.) : 1. వాలు; 2. శయనించు.

**తొంట** (దే.వి.) : 1.చెట్టుపట్ట, త్వక్కు; 2. కసవువెంటి.

**తొంటచేతివాఁడు** (ద్వ.వి.) : (తొంట చేయి + వాఁడు) ఈచఁబోయిన చేయి కలవాఁడు, కుకరుఁడు.

**తొంటచేయి** (దే.వి.) : ఈచఁబోయిన చేయి.

**తొంటి** (దే.విణ.) : తొల్లిటి. (తొంటి పుట్టువు)

**తొండ** (దే.వి.) : సరటము.

**తొండపుద్రాడు** (ద్వ.వి. ) : (తొండము + త్రాడు) కపిలెబొక్కన తోఁకకు కట్టెడు త్రాడు. (దీనిని తొండాపుఁద్రాడందురు.)

**తొండపుదోమ** (ద్వ.వి. ) : (తొండము + దోమ) నిడుపుముక్కు గల యొక దినుసు పెద్దదోమ, ఘోణి. (ఇదే యేనికదోమ.)

**తొండము** (వై.వి.) : 1. గజహస్తము; 2. కపిలె బొక్కెనతోఁక.

**తొండరూపు** రిక్క (ద్వ.వి.) : పుష్యమీ నక్షత్రము.

**తొండాడు** (దే.స.క్రి.) : త్వరపఱచు.

**తొండి** (దే.వి.) : దొండి యొక్క రూపాంతరము.

**తొండు** (దే.విణ.) : ప్రాలుమాలినవాఁడు, సోమరి.

**తొండొరు** (దే.విణ.) : ప్రాలుమాలినవాఁడు, సోమరి.

**తొండ్లి** (దే.వి.) : ఒకానొక చెట్టు.

**తొండ** (వై.వి.) : బొజ్జపెట్టినవాఁడు, తుండిలుఁడు.

**తొందర** (వై.వి.) : (తొర + తొర) 1. మిక్కిలి సంభ్రమము; 2. సంభ్రమము; 3. బాధ. (చూ. తొందరచేయు.)

**తొందరచేయు** (వై.స.క్రి.) : బాధించు.

**తొందరపడు** (వై.అ.క్రి.) : సంభ్రమించు.

**తొందరపాటు** (వై.వి.) : తొందరపడుట.

**తొందళము** (దే.వి.) : రెండు మూడు దినుసుల కూరలు చేరిన దప్పళము.

**తొందు** (వై.విశే.) : (చూ.) తొంద.

**తొంబ** (గ్రా.వి.) : గుంపు, మూఁక.

**తొంబండ్రు** (ద్వ.స.బ.) : తొంబది మంది. (తొంబదికి మహన్మహత్యర్థక రూపము.)

**తొంబది** (ద్వ.స.) : (తొంబది + పది) తొమ్మిది పదులు.

**తొంబనూఱు** (ద్వ.స.) : (తొమ్మిది + నూఱు) తొంబది నూఱులు.

**తొకతొక** (దే.విశే.) : (చూ.) తొక్కు. (మాట) (చూ. తుంపెసలాడు)

**తొక్క** (వై.వి.) : చెట్టులోనగువాని తోలు, పట్ట.

**తొక్కట** (దే.వి.) : సంకటము. (రూ. తొక్కటము.) (త్రొక్కట యొక్క రూపాంతరము.)

**తొక్కటపడు** (ద్వ.అ.క్రి.) : సంకట పడు. (త్రొక్కట పడు యొక్క రూపాంతరము.)

**తొక్కటపాటు** (ద్వ.వి.) : సంకటపాటు. (త్రొక్కట పాటు యొక్క రూపాంతరము.)

**తొక్కిస** (దే.వి.) : మల్లబంధ విశేషము.

**తొక్కు** (దే.స.క్రి.) : ఉప్పును కారమును చేర్చి మామిడికాయలు లోనగు వానిని ఱోటిలో వేసి చిదియఁగొట్టు. (వి.) : ఉప్పును కారమునుచేర్చి ఱోటిలోవేసి చిదియఁగొట్టిన మామిడికాయ లోనగు వాని ముద్ద. (విశే.) : అవ్యక్తము.

**తొక్కుడు** (దే.విశే.) : ఉప్పును కారమును చేర్చి ఱోటిలో వేసిన తొక్కినది. (మామిడి కాయ లోనగునది.)

**తొగ** (యు.దే.వి.) : 1. కలువ; 2. సమూహము; 3. విధము; (వై.వి.) : కష్టము. (విశే.) : కష్టుఁడు. (చూ. సమూహమను అర్థము నుదాహరణము.)

**తొగకంటి** (దే.వి.) : (తొగ + కన్ను) 1. తొగల వంటి కన్నులుగల ఆఁడుది; 2. ఆఁడుది.

**తొగచెలికాఁడు** (దే.వి.) : చంద్రుఁడు, కుముద బాంధవుఁడు.

**తొగట** (దే.వి.) : గుడ్డలునేసి బ్రదికెడు ఒకానొక జాతి (తొగటవాడు, తొగటది) (తొగటరేకు. మొ)

**తొగడు** (దే.వి.) : లోపలికణఁగుట.

**తొగర** (వై.వి.) : ఒగరు, తువరము.

**తొగరి** (వై.వి.) : 1. కందిచెట్టు; 2. అడవికంది తీఁగ; 3. సురాష్ట్ర దేశపు మన్ను.

**తొగరు** (దే.వి.) : 1. ఎఱ్ఱనూలు; 2. ఎఱుపు. (చూ. కసిసము.)

**తొగరుకొను** (దే.అ.క్రి.) : ఎఱ్ఱనగు. (ప్రే. తొగరు కొలుపు.)

**తొగఱేఁడు** (దే.వి.) : చంద్రుఁడు, (రూ.) తొగల ఱేఁడు. (ఇట్లు తొగదొర.)

**తొగవిందు** (దే.వి.) : చంద్రుఁడు, కుముద బాంధవుఁడు. (ఇట్లు తొగచుట్టము.)

**తొగసూడు** (దే.వి.) : సూర్యుఁడు.

**తొచ్చియము** (వై.వి.) : (చూ.) తొచ్చెము.

**తొచ్చెము** (వై.వి.) : తుచ్ఛవచనము. (తొచ్చియము యొక్క రూపాంతరము)

**తొటతొట** (దే.వి.) : 1. తొరఁగుట యందగు ధ్వన్యనుకరణము. 2. పడుట యందగు ధ్వన్యను కరణము. (వాడుకయందు తుటతుట అని కనఁబడు చున్నది.)

**తొట్ట** (దే.విశే.) : స్థూలము. (పెదవి.)

**తొట్టగిలఁబడు** (ద్వ.అ.క్రి. ) : (తొట్టగిలఁ + పడు) తొట్రుపడు.

**తొట్టగిల్లు** (దే.అ.క్రి.) : 1. అతి శయించు; (చూ. తీపు.) 2. కలుగు. (రూ. తొట్టగిలు.)

**తొట్టి** (దే.వి.) : 1. నోరు వెడల్పును, అడుగు సన్నము నైన గంప వంటి మట్టి పాత్రము; 2. పసులు నీళ్లుత్రాగుట లోనగువాని కుప యుక్తముగ ఱాతితో కట్టిన కట్టడము. 3.కొప్పెర.

**తొట్టికట్టు** (దే.వి.) : లోఁగిలి.

**తొట్టియ** (దే.వి.) : నేయువాడు నూలు కండె నుంచుకొనెడు నాడె.

**తొట్టిల** (దే.వి.) : తొట్ల. (పాఠాంతరము తొట్టెల.)

**తొట్టు** (దే.అ.క్రి.) : 1. వ్యాపించే; 2. ప్రవహించు; 3. స్రవించు; 4. ఎగదట్టు; 5. జరగు. (స. క్రి.) : 1. స్పృశించే; 2.అవ లంబించు; (చూ.తిన్న శబ్దముకడ సౌమ్యము అనునర్థము నుదాహరణము) 3. మొదలుకొను. (వి.) : 1. చెఱువు లోపలి పొలము; 2.స్పృక్కు; 3. పడుట యందగు ధ్వన్యనుకరణము. 4. తెట్టువ. (అని కొందఱు.)

**తొట్టుకొను** (దే.అ.క్రి.) : తొట్టు. (వ్యాపించుటకు) (స్వార్థమున కొను.)

**తొట్టువ** (దే.వి.) : తెట్టువ. (దీని కీయర్థము ఒకానొకచో వ్రాయcబడి యున్నది.)

**తొట్టె** (దే.వి.) : తొట్టియ యొక్క రూపాంతరము.

**తొట్టెల** (దే.వి.) : తొట్ల (చూ. తొట్టిల)

**తొట్ర** (దే.వి.) : తొఱ్ఱ.

**తొట్రిలఁబడు** (ద్వ.అ.క్రి.) : (తొట్రిలఁ + పడు) తొట్రుపడు, సంభ్రమించు.

**తొట్రిల్లు** (దే.అ.క్రి.) : 1. తడcబడు; 2. భేదిల్లు.

**తొట్రు** (దే.వి.) : సంభ్రమము.

**తొట్రుకొను** (దే.అ.క్రి.) : తొట్రుపడు.

**తొట్రుపడు** (ద్వ.అ.క్రి.) : 1. సంభ్రమించు; 2. తడcబడు.

**తొట్రుపాటు** (ద్వ.వి.) : తొట్రువడుట, తడcబాటు.

**తొట్ల** (దే.వి.) : బిడ్డలు పండుకొను ఉయ్యాల తొట్టి. (తొట్లి యొక్క రూపాంతరము.)

**తొట్లియ** (దే.వి.) : తొట్ల.

**తొట్లె** (దే.వి.) : తొట్లియ యొక్క రూపాంతరము.

**తొడ** (దే.వి.) : గజ్జకు మోcకాలికి నడిమి భాగము, ఊరువు.

**తొడcకు** (దే.అ.క్రి.) : తొనcకు.

**తొడcగు** (దే.అ.క్రి.) : 1.ప్రారంభించు; 2.మొదలు కొను. (ఈ యర్థమునకు ప్రయోగ ముక్త్యార్థము నందేయని యెఱుంగునది.)

**తొడపుట్టువు** (దే.వి.) : వైశ్యుcడు, ఊరుజుcడు.

**తొడబెల్లము** (దే.వి.) : తొడగిల్లుట.

**తొడయు** (దే.స.క్రి.) : 1. తుడుచు; 2. కడుగు.

**తొడరిక** (దే.వి.) : అనుసరణము.

**తొడరు** (దే.అ.క్రి.) : 1.కలుగు; 2. యత్నించు; 3. సక్తమగు; 4. తొట్రుపడు. (స.క్రి.) : 1.అనుసరించు; 2. ఎదిరించు; 3. ప్రాపించు; 4. అనుకరించు; 5. ఎదిరించు.

**తొడరువు** (దే.వి.) : యత్నము.

**తొడవు** (దే.వి.) : భూషణము. (ఇది తొడు ధాతు కృదంతము. నగవు లోనగు వాని వంటిది.)

**తొడి** (దే.వి.) : త్వర, సంభ్రమము.

**తొడిఁబడు** (దే.అ.క్రి.) : (తొడిఁ + పడు) 1. చలించు; 2. చెదరు.

**తొడికిలు** (దే.స.క్రి.) : ఒడియు. (చూ. తొట్టికడ కొప్పెర యను నర్థము నుదాహరణము.) తొడితెచ్చు (దే.స.క్రి.) : తోడితెచ్చు యొక్క రూపాంతరము.

**తొడిమ** (దే.వి.) : ఆకుపూవు మొదలగు వాని తలనుండెడు కాcడ, వృంతము.

**తొడు** (దే.స.క్రి.) : 1. సొమ్ములులోనగు వాని తొడుగు; 2. బాణము తొడుగు.

**తొడుకు** (దే.స.క్రి.) :1.పట్టు; 2.ఒడిసి పట్టు; 3.ఒడియు; 4.గ్రహించు. (వి.) : 1.ఆవు; 2.దొంగమేcత.

**తొడుకొను** (దే.స.క్రి.) : 1.తోడుకొను యొక్క రూపాంతరము. 2. తొడుగు కొను. (చూ.పాగ.) (రూ. తొడికొను.)

**తొడుంగఱ** (దే.వి.) : తొడుంగఱ్ఱ యొక్క రూపాంతరము.

**తొడుగఱ్ఱ** (దే.వి.) : (తొడుగు + కఱ్ఱ) ముండ్లకంప మోపు.

**తొడుగు** (దే.స.క్రి.) : 1. (భూషణాదులను) ధరించు; 2. (వింటబాణము) సంధించు. 1. ఆభరణము; 2. కవచము; 3. బాణము; 4. గవుసెన; 5. ముండ్ల కంపమోపు.

**తొడుపు** (దే.వి.) : (చూ.) 1. అనుసు; 2. కవచము; 3. చెప్పినది మరల చెప్పుట.

**తొడుపు** (దే.స.క్రి.వి.) : తొడుగు యొక్క రూపాంతరము.

**తొడుసు** (దే.వి.) : సంబంధము.

**తొడ్గు** (దే.స.క్రి.) : తొడుగు యొక్క రూపాంతరము. (భూషణము ధరించుటకు.)

**తొత్తఱికము** (దే.వి.) : (తొత్తు + అఱికము) తొత్తుఁదనము.

**తొత్తు** (దే.వి.) : 1. బానిస, దాసి; 2. లంజియ.

**తొత్తులమారి** (దే.విణ.) : తొత్తుల యిండ్లకుఁబోవు స్వభావము కలవాఁడు.

**తొన** (దే.వి.) : తొల. విణ. రక్షకము.

**తొనఁకు** (దే.అ.క్రి.) : తొలఁకు.

**తొన్నుండు** (దే.అ.క్రి.) : తెన్నుండు, శయనించు.

**తొపారము** (దే.వి.) : తోపారము యొక్క రూపాంతరము.

**తొప్పదోఁగు** (దే.అ.క్రి.) : (తోఁగు + తోఁగు) మిక్కిలితోఁగు.

**తొప్పఱిల్లు** (దే.అ.క్రి.) : ఒఱగు. (రూ. తొప్పఱిలు)

**తొప్పఱు** (దే.అ.క్రి.) : ఒఱగు. (రూ. తొప్పఱిలు)

**తొప్పలుదొరలు** (దే.విణ.బ.) : కోటానఁగోటులు.

**తొప్పి** (దే.వి.) : తోపి యొక్క మొదటి రూపము.

**తొబక** (దే.విణ.) : విత్తులు రాలినది. (మిరప కాయ లోనగునది.)

**తొమ్మండ్రు** (దే.స.బ.) : తొమ్మిదిమంది. (తొమ్మిదికి మహన్మహత్యర్థక రూపము.)

**తొమ్మందుము** (ద్వ.వి.) : (తొమ్మిది + తూము) తొమ్మిది తూములు.

**తొమ్మనూఱు** (దే.స.) : (తొమ్మిది + నూఱు) తొమ్మిది నూఱులు. (రూ. తొమ్మన్నూఱు.)

**తొమ్మాడు** (దే.వి.) : నాశము. (దానిని తొక్కి తొమ్మాడు చేసినారు.)

**తొమ్మిది** (దే.స.) : ఎనిమిదియు నొకటి.

**తొయ్యలి** (దే.వి.) : ఆఁడుది, ఇంతి.

**తొర** (వై.వి.) : 1.వేగిరపాటు; 2.ఆపద. (ఈ యర్థము విచారింపఁదగినది.) (క్రి. విణ.) : త్వరితము.

**తొరఁగు** (దే.అ.క్రి.) : 1.స్రవించు; 2.ప్రవహించు; 3.పడు; 4.వ్రాలు. (గ్రంథముల యందు అంతట ఇది యిట్లు అకార మధ్యముగానే కనఁబడుచున్నది. అయినను ఒక మహాకవి మాత్రము ఉకార మధ్యముగా ప్రయోగించి యున్నాఁడు.)

**తొరపడు** (వై.అ.క్రి.) : వేగిరపడు.

**తొరలు** (దే.అ.క్రి.) : 1. కలుగు; 2. మాఱు. (చూ. తొరలుచు, తొర్లించు.)

**తొరలుచు** (దే.ప్రే.) : మార్చు, బదిలించు. (రూ. తొరల్చు.)

**తొరితొరి** (దే.అవ్య.క్రి.విణ.) : లెస్సగా.

**తొరుఁగు** (దే.అ.క్రి.) : తొరఁగు యొక్క రూపాంతరము.

**తొరుపు** (దే.స.క్రి.) : తొర్లించు.

**తొర్లించు** (దే.ప్రే.) : వేనీళ్లు చల్లార్చు. (తొరలించు యొక్క రూపాంతరము.)

**తొఱ** (దే.వి.) : తొఱ్ఱ యొక్క రూపాంతరము.

**తొఱఁగు** (దే.స.క్రి.) : విడుచు.

**తొఱఁగుచొచ్చు** (దే.అ.క్రి.) : (పసులు) తప్పించు కొనుపోవు.

**తొఱఁగువోవు** (దే.అ.క్రి.) : (తొఱఁగు + పోవు) (పసులు) తప్పించుకొనుపోవు.

**తొఱట** (దే.వి.) : తొఱ్ఱ, కోటరము.

**తొఱటలువాఱు** (దే.అ.క్రి.) : (తొఱటలు + పాఱు)

**తొఱతేనె** (దే.వి.) : పుట్టతేనె.

**తొఱవు** (దే.స.క్రి.) : తొఱఁగు యొక్క రూపాంతరము.

**తొఱద్రొక్కు** (దే.వి.) : (త్రొక్కు + త్రొక్కు) గట్టి త్రొక్కుడు. (చూ. చొటిగాఁడు.)

**తొఱ్ఱ** (దే.వి.) : చెట్లయందేర్పడెడు పెద్ద రంధ్రము, కోటరము.

**తొఱ్ఱి** (దే.వి.) : ముందటి పండ్లులేనినోరు.

**తొఱ్ఱివాఁడు** (దే.విణ.) : తొఱ్ఱినోటివాఁడు.

**తొల్లు** (దే.వి.) : ఆవు, మొదవు.

**తొల్లుపట్టు** (దే.వి.) : ఆవులమంద, ఘోషము.

**తొల** (దే.వి.) : పనసపండులోనగువాని తొల, తొన.

**తొలఁకాడు** (దే.అ.క్రి.) : (తొలఁకి + ఆడు) 1.తొనఁకు; 2. చలించు; (చూ. తొలఁకు) 3. అతిశయించు; 4. ప్రకాశించు. (చూ. ఊఁగాడు)

**తొలఁకు** (దే.అ.క్రి.) : 1. తొనఁకు; 2. చలించు; 3. అతిశయించు; 4. ప్రకాశించు. (వి.) : 1. చలనము; 2. అల.

**తొలఁగఁబాఱు** (దే.అ.క్రి.) : (తొలఁగన్ + పాఱు) తొలఁగు. (స్వార్థమున పాఱు.)

**తొలఁగు** (దే.అ.క్రి.) : ఒదుఁగు, అపసరిల్లు.

**తొలఁగుడు** (దే.వి.) : తొలఁగుట, అపసరణము.

**తొలఁగుబావ** (ద్వ.వి.) : దాయ, శత్రువు. (చూ. చుక్కవాలు.)

**తొలఁచు** (దే.ప్రే.) : తొలఁగఁజేయు. (స.క్రి.) : 1. కడుగు; 2. తొడయు.

**తొలకరి** (ద్వ.వి.) : 1. (చైత్ర వైశాఖ మాసముల యందు కురియు) వాన; 2. వర్షర్తువు. (తొలకు + కారు) (సంధిని వర్ణలోప వర్ణవికారములు.)

**తొలకరించే** (దే.అ.క్రి.) : 1. (చైత్ర వైశాఖ మాసముల యందు) వాన కురియు; 2. వాన కురియు; (చూ. గిలకరించు) 3. పుట్టు.

**తొలకరిసూడు** (దే.వి.) : హంస.

**తొలకు** (దే.వి.) : మృగములవెనుక కాలిమూలము నకును ప్రక్కకును నడిమిచోటు, ఉపరంధ్రము.

**తొలి** (దే.వి.) : 1. ముందు; (తొల్లియొక్క రూపాం తరము) 2. మొదలు; (ఆమ్రేడితము నందు తొలితొలి.) 3.రంధ్రము; 4. చక్ర మధ్య రంధ్రము, పిండిక. (చూ.అంచు) (విణ.) : 1. ముందటిది; (తొలిబాము.) 2. మొదటిది. (తొలిముద్ద. మొ.)

**తొలిక** (దే.వి.) : తొలి, రంధ్రము.

**తొలు** (దే.విణ.) : వృత్తి యందు తొలుత శబ్దమునకు తొలుకు శబ్దమునకు మీఁది వర్ణము లోపింపగా మిగిలిన రూపము. (ఉదా. తొలుచూలు; తొలుమబ్బు. మొ.)

**తొలుకారు** (ద్వ.వి.) : (తొలుకు + కారు) 1. వర్షర్తువు; 2. (తొలుత + కారు) ముక్కారు పంటలలో మొదటి కారుపంట.

**తొలుకు** (దే.స.క్రి.) : కురియు, వర్షించు. (వృత్తి యందు అంత్య వర్ణ లోపము. తొలుకారు, తొలుమొగులు. మొ.)

**తొలుకుడుపు** (దే.వి.) : (తొలుత + కుడుపు) అన్నప్రాశనము.

**తొలుగట్టు** (ద్వ.వి.) : (తొలుత + గట్టు) ఉద యాద్రి, పూర్వ పర్వతము. (తొలి తొలు శబ్దములు సమానార్థకములు గాన తొలు పూర్వక ములైన యిట్టి శబ్దములను తొలి పూర్వకములు గాను వాడుకొనవచ్చును. అయినను తొలి కారు, మలుకారు; తొలుచూలు, మలు చూలు; తొలుసంజ, మలుసంజ అని ఇత్యాదులు వ్యవహారము నందును ప్రయోగములందును గానఁబడుట చేతను, తొల్చదువులు, తొల్బాము, తొల్వేలుపు అను ఇత్యాది శబ్దముల యందు ఇకార లోప సంపాదనము కంటె ఉకార లోప సంపాదనము సులభ సాధ్యముగా నుండుట చేతను ఇట్లు తొలు శబ్దపూర్వకముగా నుండు టయే యుక్తమని తోఁచెడి.)

**తొలుచదువులు** (దే.వి.బ.) : (తొలుత + చదువులు) వేదము. (రూ. తొల్చదువులు.) (ఇట్లు తొలుపలుకులు, తొలుమినుకులు.)

**తొలుచు** (దే.స.క్రి.) : 1. రంధ్రము చేయు; 2. తోఁడు. (రూ. తొల్చు, తోడుటకు.)

**తొలుత** (దే.వి.) : 1. ముందు; (చూ ఏనిక తిండి) 2. మొదలు (విణ.) : మొదటిది. (1."తొలుతటి వారు" 2."తొలుతపట్టి.") ద్ర. మొదట (ఆమ్రేడితమునందు తొలుదొలుత.)

**తొలుదీవి** (ద్వ.వి.) : (తొలుత + దీవి) జంబూ ద్వీపము.

**తొలునీటిరిక్క** (దే.వి.) : (తొలుత + నీటి రిక్క) పూర్వాషాఢా నక్షత్రము.

**తొలుపంది** (దే.వి.) : (తొలుత + పంది) ఆదివరాహము. (రూ. తొల్పంది)

**తొలుపక్కము** (ద్వ.వి.) : (తొలుత + పక్కము) శుక్లపక్షము, పూర్వపక్షము.

**తొలుఁబలుకులు** (దే.వి.బ.) : (తొలుత + పలుకులు) వేదము.

**తొలుమినుకులు** (దే.వి.బ.) : (తొలుత + మినుకులు) వేదము.

**తొలుమొగులు** (దే.వి.) : (తొలకు + మొగలు) వర్షించుచున్న మేఘము, ఘనాఘనము.

**తొలురిక్క** (ద్వ.వి.) : (తొలుత + రిక్క) అశ్వినీ నక్షత్రము.

**తొలురిక్కనెల** (ద్వ.వి.) : ఆశ్వయుజ మాసము.

**తొలువేలుపు** (దే.వి.) : (తొలుత + వేలుపు) 1.బ్రహ్మాసుర జ్యేష్ఠుఁడు; 2.అసురుఁడు; పూర్వదేవుఁడు.

**తొలుసంజ** (ద్వ.వి.) : (తొలుత + సంజ) ప్రాతస్సంధ్య.

**తొల్కరి** (దే.వి.) : తొలకరి యొక్క రూపాంతరము.

**తొల్కరించు** (దే.అ.క్రి.) : తొలకరించు యొక్క రూపాంతరము. (చైత్రవైశాఖ మాసముల యందు వాన కురియుటకు.)

**తొల్లి** (దే.వి.) : 1. ముందు; 2. బిలము. (చూ. వఱపు.) (విణ.) : ముందటిది. ("తొల్లిఁటివారు." "తొల్లింటివారు.")

**తొల్లించు** (దే.(ప్రే.) : తొర్లించు యొక్క రూపాంతరము.

**తొల్లిక** (దే.వి.) : త్రవ్వుటకుపయుక్తమైన పాఱ వంటి చిన్న సాధనము.

**తొవ** (దే.వి.) : కలువ. (తొగ యొక్క రూపాంతరము)

**తొవర** (వై.వి.విణ.) : తొగర యొక్క రూపాంతరము.

**తొవరి** (వై.వి.) : తొగరి యొక్క రూపాంతరము.

**తొవరు** (దే.వి.విణ.) : తొగరు యొక్క రూపాంతరము.

**తొస్స** (దే.వి.) : ఉచ్చారణలోపము.

**తొస్సె** (దే.విణ.) : బోసి, బొక్కి.

**తొళక** (దే.విణ.) : పలుచనిది.

**తొళసి** (వై.వి.) : తులసి.

## తో

**తో** (దే.అప.) : తృతీయా విభక్తి యందు వచ్చు ఒకానొక్క ప్రత్యయము. (ద్ర.) : 1. కూడ; 2. వెంబడి.

**తోఁక** (దే.వి.) : పశ్వాదుల పుచ్ఛము.

**తోఁకగుంజ** (ద్వ.వి.) : ఆఁదోఁకగా నేర్పఱచిన స్తంభము.

**తోఁకచిచ్చు** (ద్వ.వి.) : నిప్పు రగిలించిన పిడకల వరుస.

**తోఁకచుక్క** (ద్వ.వి.) : ధూమకేతువు.

**తోఁకపరువు** (ద్వ.వి.) : పుచ్ఛము గల క్రిమి విశేషము, (రూ. తోఁకపుర్వు.)

**తోఁకమిరియము** (ద్వ.వి.) : చలువ మిరియము.

**తోఁగు** (దే.అ.క్రి.) : 1. మునుఁగు; 2. తడియు.

**తోఁచిగాఁడు** (దే.వి.) : శ్యేనవిశేషము.

**తోఁచే** (దే.వి.) : మాదిగవాఁడు, మాతంగుఁడు.

**తోఁచు** (దే.అ.క్రి.) : 1. ఉదయించు; 2. భావ ముదయించు; (అది నాకు సరియని తోఁచెను.) 3. ప్రత్యక్షమగు.

**తోఁట** (దే.వి.) : 1. ఉపవనము; 2. గృహోపవనము. 3. ఆశ్రమము.

**తోఁటకాఁపు** (దే.వి.) : తోఁటవాఁడు.

**తోఁటకూర** (ద్వ.వి.) : ఒక దినుసు కూరాకు, మారిషము. (దీని భేదము నల్లతోఁటకూర.)

**తోఁటపోఁక** (ద్వ.వి.) : ఒక దినుసు పోఁక, భూపూగము.

**తోఁటమాలియ** (ద్వ.వి.) : తోటమాలియ యొక్క మొదటి రూపము.

**తోఁటమాలె** (ద్వ.వి.) : తోఁటమాలి యొక్క రూపాంతరము.

**తోఁటమొల్ల** (ద్వ.వి.) : కుందము.

**తోఁటవాఁడు** (దే.వి.) : వనపాలకుఁడు.

**తోటా** (హిం.వి.) : ఒక విధమైన మందుసామాను.

**తోఁటీఁడు** (దే.వి.) : (తోఁట+ఈఁడు) తోఁటవాఁడు.

**తోఁడు** (దే.స.క్రి.) : 1. కెల్లగించు; (చూ. గోరుగొండి); 2. నూలిపోఁగు తీసిచుట్టు.

**తోఁడుఁబోతు** (దే.వి.) : పంపు చేయుట, కార్మ ణము. (విణ.) : పంపు చేయువాఁడు, కార్మణ శీలుఁడు.

**తోఁడెలు** (దే.వి.) : తోఁడేలు యొక్క రూపాంతరము.

**తోఁడేటికడుపుమేటి** (ద్వ.వి.) : (తోఁడేలు + కడుపుమేటి) భీముఁడు, వృకోదరుఁడు.

**తోఁడేలు** (దే.వి.) : అడవికుక్క, వృకము. (రూ. తోఁడేలువు. ఇట్లు వువర్ణాంతముగా కొందఱు చెప్పుచున్నారు.)

**తోఁతెంచు** (దే.అ.క్రి.) : (తోఁచు + తెంచు) 1. ఉదయించు; 2. కనఁబడు; 3. ప్రత్యక్షమగు; (స్వార్థమున తెంచు.)

**తోఁప** (దే.వి.) : సంకటి.

**తోఁపిక** (దే.వి.) : తలఁపు.

**తోఁపు** (దే.వి.) : 1. పెంపుడువనము; 2. ఎఱుపు; 3. తోఁపిక; 4. సుకియలు లోనగువాని మూఁతపిండి.

**తోఁబుట్టు** (దే.వి.) : (తోఁ౽ + పుట్టుగు) తోడఁబుట్టువు.

**తోఁబుట్టుగు** (దే.వి.) : (తోఁ౽ + పుట్టువు) తోడఁబుట్టువు.

**తోకము** (సం.వి.అ.న.) : అపత్యము, బిడ్డ.

**తోకొను** (దే.స.క్రి.) : తోడుకొను యొక్క రూపాంతరము.

**తోక్మము** (సం.వి.అ.న.) : గులిమి. (పుం.) : 1. పచ్చన; 2. పచ్చయవలు. (విణ.) : పచ్చనిది.

**తోటి** (దే.వి.) : మాల, చండాలుఁడు.

**తోడ** (దే.అప.) : తృతీయావిభక్తి యందు వచ్చు నొకప్రత్యయము. (ద్ర.) : 1. కూడ; 2. వెంబడి.

**తోడంటు** (దే.వి.) : (తోడు + అంటు) చేమిరి.

**తోడఁబుట్టు** (దే.వి.) : (తోడ౽ + పుట్టు) తోడఁబుట్టువు.

**తోడఁబుట్టుగు** (దే.వి.) : (తోడ౽ + పుట్టుగు) తోడఁబుట్టువు. (చూ. తోఁబుట్టుగు.)

**తోడఁబుట్టువు** (దే.వి.) : (తోడ౽ + పుట్టువు) సహోదరుఁడు, సహోదరి.

**తోడనము** (సం.వి.అ.న.) : ఖండనము.

**తోడా** (దే.వి.) : హస్తభూషావిశేషము.

**తోడికోడలు** (దే.వి.) : (తోడ౽ + కోడలు) మగని తోడఁబుట్టిన వాని భార్య, యాత.

**తోడిచూలు** (దే.వి.) : (తోడ౽ + చూలు) తోడఁబుట్టువు.

**తోడితెచ్చు** (దే.స.క్రి.) : పిలుచుకొని వచ్చు.

**తోడియల్లుఁడు** (దే.వి.) : (తోడ౽ + అల్లుడు) షడ్డకుఁడు.

**తోడివాఁడు** (దే.వి.) : (తోడ౽ + వాఁడు) తోడనున్నవాఁడు.

**తోడు** (దే.వి.) : 1. ఆన; 2. తోడు బుట్టువు. 3. చేమిరి. (విణ.) : సహాయము.

**తోడుఁబాలు** (ద్వ.వి.) : (తోడు + పాలు) పాలుపిండఁబోవునపుడు పాలదుత్తలో నుంచుకొనెడు నీళ్లు.

**తోడుకొను** (దే.అ.క్రి.) : (పాలు) పేరు. (స.క్రి.) పిలుచుకొను. (రూ. తోడికొను.) (ఈ యర్థము నందు దీనికి భూతార్థక అసమాపక క్రియగానే ప్రయోగము.)

**తోడుచల్ల** (దే.వి.) : చేమిరిపెట్టు మజ్జిగ.

**తోడుత** (దే.ద్ర.) : తోడ.

**తోడుతో** (దే.ద్ర.) : వెంబడిని.

**తోడుతోడ** (దే.ద్ర.) : వెంబడిని.

**తోడునీడ** (దే.విణ.) : సహాయుఁడు.

**తోడుపడు** (ద్వ.అ.క్రి.) : సహాయపడు.

**తోడుపాటు** (ద్వ.వి.) : తోడుపడుట, సాహాయ్యము.

**తోడుపెట్టు** (దే.స.క్రి.) : చేమిరిపెట్టు.

**తోడువోవు** (దే.అ.క్రి.) : (తోడు+పోవు) సరియగు.

**తోడెము** (దే.వి.) : కొంచెము, లేశము.

**తోడ్కొను** (దే.స.క్రి.) : తోడుకొను యొక్క రూపాంతరము. (చూ. తోడితెచ్చు.)

**తోడ్తెచ్చే** (దే.స.క్రి.) : తోడితెచ్చు యొక్క రూపాంతరము. (చూ. తోడితెచ్చు.)

**తోడ్తో** (దే.ద్ర.) : తోడుతో యొక్క రూపాంతరము. (తూ. త్రెక్కొను.)

**తోడ్తోడ** (దే.ద్ర.) : తోడుతోడ యొక్క రూపాంతరము.

**తోడ్పడు** (దే.అ.క్రి.) : తోడుపడు యొక్క రూపాంతరము.

**తోడ్పాటు** (ద్వ.వి.) : తోడుపాటు యొక్క రూపాంతరము.

**తోతెచ్చు** (దే.స.క్రి.) : తోడితెచ్చు యొక్క రూపాంతరము.

**తోత్రము** (సం.వి.అ.న.) : 1. (ఏనుఁగును పొడిచెడు) బరిగోల, 2. (పసులను దోలెడు) మునికోల.

**తోదనము** (సం.వి.అ.న.) : 1. నొప్పించుట; 2. (పసులను దోలెడు) మునికోల.

**తోదు** (దే.వి.) : వరుసకట్టు.

**తోనిగాఁడు** (దే.వి.) : శ్యేన విశేషము.

**తోపరా** (హిం.వి.) : ఉలవలసంచి.

**తోపాటు** (దే.అవ్య.) : వలె.

**తోపారము** (దే.వి.) : దేగల ముఖమునకుఁ గట్టెడు తోలుగంత.

**తోపి** (దే.వి.) : టోపి యొక్క రూపాంతరము. (చూ. టోపి.)

**తోపు** (హిం.విణ.) : ఒక విధమైన ఎఱుపు.

**తోమకము** (దే.వి.) : తోముట.

**తోమరము** (సం.వి.అ.పుం, న.) : చిల్లకోల, సర్వల.

**తోమాలియ** (ద్వ.వి.) : (తోఁట + మాలియ) తోమాలె.

**తోమాలె** (ద్వ.వి.) : ఆకులు పువ్వులు కూర్చి కట్టిన దండ, వనమాల. (తోమాలియ యొక్క రూపాంతరము)

**తోము** (దే.స.క్రి.) : (ముఱికిపోవ) రుద్దు.

**తోముడు** (దే.వి.) : (ముఱికిపోవ) రుద్దుట.

**తోయగాఁడు** (దే.విణ. ) : (తోయము + కాఁడు) విధము గలవాఁడు.

**తోయజము** (సం.వి.అ.న.) : తామర, నీటిపుట్టుగు.

**తోయజాక్షి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. తామరవంటి కన్నులుగల ఆఁడుది; 2. ఆఁడుది. (దీనికి సరియైన పదము తెనుఁగున తమ్మికంటి.)

**తోయదము** (సం.వి.అ.న.) : నెయ్యి. (పుం.) : 1. మబ్బు; 2. తుంగ.

**తోయధి** (సం.వి.ఇ.పుం.) : సముద్రము, మున్నీరు.

**తోయపిప్పలి** (సం.వి.ఈ.స్త్రీ.) : నీరు పిప్పలి.

**తోయము** (ఉభ. దే.వి.) : 1. విధము; 2. తెగ; 3. తడవ; 4. పరివారము; 5. సమయము.

**తోయరుహము** (సం.వి.అ.న.) : తామర, నీటిపుట్టుగు.

**తోయలి** (దే.వి.) : తొయ్యలి యొక్క మొదటి రూపము.

**తోరణము** (సం.అ.పుం.న.) : 1. పుష్పమాలికాదులు గట్టుటకై గృహమునకు వెలుపల స్తంభ ద్వయముచేత నేర్పఱపఁబడిన ద్వారము. 2. మంగళార్థముగా ఆ తోరణమునకు గట్టెడు మావిడాకు లోనగువాని సరము. (రూ. తోరణ.)

**తోరమల్లి** (దే.వి.) : వజ్రమువలె తెల్లగా నుండు అల్పమణి విశేషము.

**తోరము** (వై.వి.) : వ్రతసూత్రము. (విణ.) : 1. స్థూలము; 2. అధికము; 3. బలిష్ఠము.

**తోరహత్తము** (వై.వి.) : మల్లబంధ విశేషము.

**తోరహత్తు** (వై.విణ.) : సమృద్ధము.

**తోలు** (దే.స.క్రి.) : (పసులు లోనగువాని) నడపించు. (వి.) : చర్మము.

**తోలుక** (దే.వి.) : తోలు, చర్మము. (స్వార్థమున కప్రత్యయము.)

**తోలుచు** (దే.ప్రే.) : తోలఁజేయు, తోలించు.

**తోలుదాలుపు** (దే.వి.) : (తోలు + తాలుపు) శివుఁడు; కృత్తివాసుఁడు; (రూ. తోలుదాల్పు.)

**తోవ** (దే.వి.) : కొణిగ, వలభి.

**తోలువాయిదము** (ద్వ.వి.) : తోలు కప్పిన వాద్యము, ఆనద్ధము.

**తోసిరాజు** (మి.వి.) : తొలఁగఁదగిన రాజు. (ఇది చదరంగము నందలి పరిభాష. దీనిని భాషాంతరమందు షహ్ అందురు.)

## తౌ

**తౌ** (దే.అ.క్రి.) : తగు యొక్క రూపాంతరము. (చూ. కవిల) (మొదటి రూపము తవు.)

**తౌటిపాము** (దే.వి.) : (తౌడు + పాము) మలుఁగు చేఁప. (మొదటి రూపము తవుటిపాము.)

**తౌడు** (దే.వి.) : బియ్యము మీది ముఱికి, కంబూకము. (మొదటి రూపము తవుడు.)

**తౌర్యత్రికము** (సం.వి.) : నృత్తగీత వాద్యములు.

**తౌలఁబడు** (ద్వ.అ.క్రి.) : తగులబడు యొక్క రూపాంతరము. (మొదటి రూపము తవులఁబడు.)

**తౌలు** (దే.అ.క్రి.) : తగులు యొక్క రూపాంతరము. (వెంబడించుటకు.) (మొదటి రూపము తవులు. చిక్కుటకు. సక్తమగుటకు. తగులమునకు.)

**తౌలుకొను** (దే.అ.క్రి.) : తగులుకొను యొక్క రూపాంతరము. (మొదటి రూపము తవులు కొను. ప్రే. తౌలు కొలుపు, రగులు కొలుపుటకు.)

**తౌలుచే** (దే.ప్రే.) : తగులుచు యొక్క రూపాంతరము. (మొదటి రూపము తవులుచు.) (రూ. తవుల్చు.)

**తౌలువడు** (ద్వ.అ.క్రి.) : తగులువడు యొక్క రూపాంతరము. (మొదటి రూపము తవులు వడు.)

**తౌల్యము** (సం.వి.అ.న.) : సామ్యము.

## త్య

**త్యక్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విడువఁ బడినది.

**త్యజనము** (సం.వి.అ.న.) : వర్జనము, విడుపు.

**త్యజించు** (సం.స.క్రి.) : వర్జించు, విడుచు.

**త్యాగము** (సం.వి.అ.పుం.) : 1.ఈవి; 2.విడుపు.

**త్యాగి** (సం.విణ.) : (న్.ఈ.న్) 1. ఈవికాఁడు; 2. శూరుఁడు.

**త్యాజ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విడువఁ దగినది. (జ్యోతిశ్శాస్త్రము నందు దోషయుక్తమైన కొంతకాలము త్యాజ్యమని చెప్పఁబడును.)

## త్ర

**త్రంపి** (దే.వి.) : దాలి.

**త్రచ్చన** (వై.వి.) : 1. చిలుకుట; 2. చెక్కుట.

**త్రచ్చే** (వై.స.క్రి.) : తరచు యొక్క రూపాంతరము.

**త్రప** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. సిగ్గు; 2. అంకుటాలు.

**త్రపిష్ఠుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) మిక్కిలి సిగ్గు గలవాఁడు.

**త్రపువు** (సం.వి.ఉ.న.) : 1. తగరము; 2. ఉ.స్.న. సీసము.

**త్రపులము** (సం.వి.అ.న.) : సీసము.

**త్రపుస** (సం.వి.ఆ.స్త్రీ.) : చేఁదుగలదోస.

**త్రమ్ము** (దే.స.క్రి.) : దుమ్ముచేయు. (వి.) : దుమ్ము.

**త్రయము** (సం.స.అ.) : మూఁటి సమూహము.

**త్రయి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1.మూడు వేదములు; 2. మూఁటి సమూహము; 3. ఏనుఁగు కాలి సంకెల; 4. కుటుంబముగల ఆఁడుది; 5. మంచి మనస్సుగల ఆఁడుది; 6. ఒకవిద్య. (చూ. విద్య)

**త్రయీతనువు** (సం.వి.ఉ.పుం.) : సూర్యుఁడు.

**త్రయీధర్మము** (సం.వి.అ.పుం.) : వేద విహిత ధర్మము.

**త్రయోదశము** (సం. స.) : (అ. ఈ. అ.) పదుమూడవది.

**త్రయోదశి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. పక్షమునందు పదుమూడవ తిథి; 2. పదుమూడు తంతులు గల పరివాదిని యను వీణ. (విణ.) : పదుమూడవది.

**త్రవు** (దే.స.క్రి.) : త్రవ్వు యొక్క రూపాంతరము.

**త్రవుకోల** (దే.వి.) : త్రవ్వుకోల యొక్క రూపాంతరము.

**త్రవ్వటము** (దే.వి.) : త్రవ్వుట.

**త్రవ్వటించు** (దే.స.క్రి.) : త్రవ్వు.

**త్రవ్వితండము** (దే.విణ.) : అసంఖ్యము.

**త్రవ్వు** (దే.స.క్రి.) : 1.ఖననము చేయు; 2.ఖండించు; 3.పుట్టు పూర్వోత్తర ములనెత్తు, 4.ప్రస్తావమునకుఁ దెచ్చు.

**త్రప్పుకోలు** (దే.వి.) : గుద్దలి, కుద్దాలము.

**త్రసకము** (సం.వి.అ.న.) : గడ్డిపరక.

**త్రసము** (సం.విణ.) : (అ.ఆ.అ.) తిరుగునది, జంగమము.

**త్రసరము** (సం.వి.) : పంటెకట్ట. నూలు చుట్టుట. (అని కొందఱు.)

**త్రసరేణువు** (సం.వి.ఉ.స్త్రీ.) : సంజ్ఞాదేవి. (పుం.) : ముప్పది పరమాణువుల కొలఁది.

**త్రస్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) భయపడినది.

**త్రస్తరి** (దే.వి.) : పరిహాసము.

**త్రస్తరించు** (దే.అ.క్రి.) : పరిహాసమాడు.

**త్రస్నువు** (సం.విణ.ఉ.) : భయపడువాఁడు.

**త్రస్స** (దే.వి.) : వేదాధ్యయనము చేయునపుడు నోట నుండి రాలెడు తుంపర, బ్రహ్మబిందువు.



**త్రాఁచు** (దే.వి.) : సర్పము.

**త్రాగు** (దే.స.క్రి.) : పానము చేయు. (చూ. త్రావు)

**త్రాగుడు** (దే.వి.) : పానము.

**త్రాడు** (దే.వి.) : 1. పేనినదారము, పాశము; 2. కిరణము (చూ. కాచు)

**త్రాడుదాలుపు** (దే.వి.) : (త్రాడు + తాలుపు) వరుణుఁడు; పాశి.

**త్రాడువడు** (ద్వ.అ.క్రి.) : (త్రాడు + పడు) 1. కృశించు; 2. దారమగు.

**త్రాణ** (వై.వి.) : బలము, శక్తి.

**త్రాణము** (సం.వి.అ.న.) : 1. కలుకానుగు, 2. కాపు. (విణ.) : కావఁబడినది.

**త్రాత** (సం.వి.ఋ.పుం.) : కాచువాఁడు.

**త్రాతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కావఁబడినది.

**త్రాపుషము** (సం.విణ.) : (అ.ఈ.అ.) త్రపువుచేత చేయఁబడినది.

**త్రాయంతి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. కలుకానుగు; 2. కలుక్రాంత చెట్టు.

**త్రాయమాణ** (సం.వి.ఆ.స్త్రీ.) : కలుకానుగు. (విణ.) : కావఁబడుచుండునది.

**త్రావు** (దే.స.క్రి.) : త్రాగు యొక్క రూపాంతరము.

**త్రావుడు** (దే.వి.) : త్రాగుడు యొక్క రూపాంతరము.

**త్రాసము** (సం.వి.అ.పుం.) : 1. భయము; 2. మణిదోష విశేషము.

**త్రాసు** (దే.వి.) : తూఁచెడుతుల. (తరాసు యొక్క రూపాంతరము)



**త్రింశత్తు** (సం.స.త్.స్త్రీ.) : ముప్పది.

**త్రింశము** (సం.స.) : (అ.ఆ.అ.) ముప్పదవది.

**త్రిక** (సం.వి.ఆ.స్త్రీ.) : నూతిగిరక. (అ.న.ము.) : 1. మూటి సమూహము; 2. ముడ్డిపూస; 3. సొంటి పిప్పిలి మిరియాలు; 4. కరకతాడి యుసిరికలు; 5. మూడుదారులు కలయుచోటు.

**త్రికంటకము** (సం.వి.అ.పుం.) : 1. ములు జెముడు; 2. పెద్ద పల్లేరు; 3. మత్స్యవిశేషము.

**త్రికకుత్తు** (సం.వి.ద్.పుం.) : 1. త్రికూట పర్వతము; 2. విష్ణువు; 3. అభినయ హస్త విశేషము.

**త్రికటుకము** (సం.వి.అ.న.) : సొంటి పిప్పలి మిరియాలు. (రూ. ఉ.న. త్రికటువు.)

**త్రికాష్ఠి** (సం.వి. ఇ.న.) : (చూ.) త్రిక్కటి.

**త్రికూటము** (సం.వి.అ.న.) : ఇదుప్పు. (పుం.): ఒకానొక పర్వతము.

**త్రికోణము** (సం.వి.అ.న.) : మూడు మొనలు కలసిన రూపము.

**త్రిక్క** (దే.వి.) : తిక్క యొక్క రూపాంతరము.

**త్రిక్కటి** (వై.వి.) : ఆయుధ విశేషము.

**త్రిక్కు** (దే.అ.క్రి) : తక్కు. (వి.) : చిక్కుబాధ.

**త్రిగర్త** (సం.వి.ఆ.స్త్రీ.) : అంకుటాలు. (అ.పుం.ము.) : ఒక దేశము.

**త్రిగుణాకృతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మూడుచాళ్లు దున్నినది (పొలము)

**త్రితయము** (సం.స.అ.న.) : మూడు.

**త్రిదండము** (సం.వి.అ.న.) : మనో దండము, వాగ్దండము, కర్మ దండము అను మూడు

దండములు. (పుం.) : మనోదండము, వాగ్దండము, కర్మ దండము అను మూడు దండములు గల సన్యాసా(శమము.

**త్రిదండి** (సం.వి.న్.పుం.) : మనోదండ వాగ్దండ కర్మదండములను మూడు దండములు గల సన్యాసి.

**త్రిదశాలయము** (సం.వి.అ.పుం.) : స్వర్గము, వేల్పుఁబ్రోలు.

**త్రిదశుఁడు** (సం.వి.అ.పుం.) : దేవత, వేల్పు.

**త్రిదవ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఒకానొక యేఱు. (అ.పుం.ము.) : స్వర్గము.

**త్రిదివేశుఁడు** (సం.వి.అ.పుం.) : త్రిదశుఁడు, వేల్పు.

**త్రిదోషము** (సం.వి.అ.న.) : వాతపిత్తశ్లేష్మములు.

**త్రిద్యుస్పృక్కు** (సం.వి.శ్.పుం.స్త్రీ.) : మూడు వారములు కూడిన తిథి. (చూ. అవమము)

**త్రిధాముఁడు** (సం.వి.న్.పుం.) : 1. అగ్ని; 2. విష్ణువు; 3. శివుఁడు; 4. యముఁడు.

**త్రిపతాకము** (సం.వి.అ.న.) : మూడు రేఖలుగల నొసలు. (పుం.) : అభినయ హస్త విశేషము. (బొటన వ్రేలిని వంచి చూపుడు వ్రేలి మొదటఁ గూర్చి యుంగరపు వ్రేలిని వంచి కడమ వ్రేళ్లను జూఁచిపట్టినది.)

**త్రిపథగ** (సం.వి.ఆ.స్త్రీ.) : గంగానది, ముత్రోవద్రిమ్మరి.

**త్రిపది** (సం.వి.ఈ.స్త్రీ.) : ఏనుఁగుకాలి సంకెల.

**త్రిపుండ్రము** (సం.వి.అ.న.) : నొసట నుంచిన విబూదిలోనగువాని మూడు రేఖలు.

**త్రిపుట** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.చిట్టేలకి; 2.తెల్లతెగడ; 3.మల్లె. (అ.పుం.) : 1.ఒక తాళము; (ఏడక్షరముల కాలము.) ము. 2. దరి; 3. నరము.

**త్రిపురము** (సం.వి.అ.న.) : మయునిచే నిర్మింపఁబడిన మూడు పురములు. (పుం.) : బంగిచెట్టు.

**త్రిపురాంతకుఁడు** (సం.వి.అ.పుం.) : శివుడు. (ఇతనికి త్రిపుర సంహార మప్పుడు తేరు భూమి, చక్రములు సూర్య చంద్రులు, గుఱ్ఱములు వేదములు, చాపము మేరువు, నారి శేషుడు, బాణము విష్ణువు)

**త్రిప్పట** (దే.వి.) : తిరుగుట, పర్యటనము.

**త్రిప్పిరి** (దే.విణ.) : (త్రిప్పు + అరి) త్రిమ్మరి.

**త్రిప్పికొను** (దే.అ.క్రి.) : తిరిగికొను. (ప్రే. త్రిప్పి కొలుపు.)

**త్రిప్పియాడు** (దే.ప్రే.) : (త్రిప్పి + ఆడు) త్రిప్పు.

**త్రిప్పు** (దే.ప్రే.) : తిరుగఁజేయు.

**త్రిప్పడుత్రాడు** (దే.వి.) : (చూ.) తిరుగుడు త్రాడు.

**త్రిప్పుత్రాడు** (దే.వి.) : (చూ.) తరిత్రాడు.

**త్రిఫల** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. కరక తాడి యుసిరికలు; 2. ద్రాక్షాకాశ్మర్య ఖర్జూర ఫలములు; 3. జాజీ లవంగ పూగ ఫలములు.

**త్రిభండి** (సం.వి.ఈ.స్త్రీ.) : తెల్లతెగడ.

**త్రిమూర్తి** (సం.వి.ఇ.పుం.) : బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుఁడు అను పేళ్లుగల మూడు శరీరములు గలవాఁడు.

**త్రిమ్మట** (దే.వి.) : 1. త్రిప్పుట; 2. ఆపద. (చూ. ఇఱుకు)

**త్రిమ్మటకాఁడు** (దే.విణ.) : త్రిమ్మరి.

**త్రిమ్మరి** (దే.విణ.) : ఇచ్చవచ్చినట్టు తిరుగువాఁడు.

**త్రిమ్మరీఁడు** (దే.విణ.) : (త్రిమ్మరి + ఈఁడు) త్రిమ్మరి. (స్వార్థమున ఈఁడు)

**త్రిమ్మరు** (దే.అ.క్రి.) : సంచరించు. (స.క్రి.) : చుట్టివచ్చు.

**త్రియామ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. రాతిరి; 2. పసుపు; 3. యమునానది.

**త్రిరాత్ర** (సం.వి.ఆ.స్త్రీ.) : ముట్టుది. (అ.న.ము.): మూడు రాత్రులు. (పుం.) : 1. యాగవిశేషము; 2. పట్టణము నందలి వెదురు పొద.

**త్రిలింగము** (సం.వి.అ.పుం.) : శ్రీశైల, దక్షారామ, కాళేశ్వరములనెడు మూడు లింగములకు నడుమనుండు దేశ విశేషము. (విణ.) : మూడు లింగములు గలది.

**త్రిలోచనుఁడు** (సం.వి.అ.పుం.) : శివుడు, ముక్కంటి. (ఇట్లు త్రినేత్రుఁడు. మొ.)

**త్రివత్సము** (సం.వి.అ.పుం.) : మూడేండ్ల కోడెదూడ.

**త్రివర్గము** (సం.వి.అ.పుం.) : 1. ధర్మార్థ కామములు; 2. సత్వర జస్తమములు; 3. క్షయస్థాన వృద్ధులు; 4. త్రికటుకము; 5. త్రిఫల.

**త్రివిక్రముఁడు** (సం.వి.అ.పుం.) : మూడు లోకము లను మూడడుగులుగా కొలచిన విష్ణువు.

**త్రివిష్టపము** (సం.వి.అ.న.) : స్వర్గము, వేల్పుఁబోలు.

**త్రివృత** (సం.వి.ఆ.స్త్రీ.) : తెల్లతెగడ.

**త్రివృత్తు** (సం.వి.త్.స్త్రీ.) : తెల్లతెగడ.

**త్రివేణి** (సం.వి.ఈ.స్త్రీ.) : గంగానది.

**త్రిశంకువు** (సం.వి.ఉ.పుం.) : 1. ఒకానొక రాజు; 2. పిల్లి; 3. మిడుత.

**త్రిశఖము** (సం.వి.అ.న.) : 1. త్రిశూలము; 2. సిగదండ. (పుం. డు.) ఒకానొక రాక్షసుడు.

**త్రిశూలము** (సం.వి.అ.న.) : ఆయుధ విశేషము, ముమ్మొనవాలు.

**త్రిశృంగము** (సం.వి.అ.పుం.) : పరికెగడ్డ.

**త్రిషవణము** (సం.వి.అ.న.) : 1.మూడు సవనములు; (ప్రాతస్సవనము, మధ్యందిన సవనము, సాయం సవనము. చూ. సవనము.) 2. మూడు కాలములు.

**త్రిష్టుప్పు** (సం.వి.భ్.స్త్రీ.) : ఒక ఛందస్సు. (చూ. ఛందస్సు)

**త్రిసంధ్యము** (సం.వి.అ.న.) : పూర్వాహ్ణ మధ్యాహ్నా పరాహ్ణా సంధ్యలు.

**త్రిసీత్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మూడు చాళ్లు దున్నినది. (పొలము)

**త్రిసూత్రము** (సం.వి.అ.న.) : బ్రహ్మ సూత్రము. (పుం.) : వైదూర్య విశేషము.

**త్రిస్రోత** (స.వి.స్.స్త్రీ.) : 1. గంగానది; 2. నదీ విశేషము.

**త్రిహల్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) (చూ.) త్రిసీత్యము.

**త్రిహాయణి** (సం.వి.ఈ.స్త్రీ.) : మూడేండ్ల పెయ్య.



**త్రుంగు** (దే.అ.క్రి.) : 1. తునుకలగు; 2. నశించు.

**త్రుంగుడు** (దే.వి.) : 1. నాశము; 2. ప్రళయము.

**త్రుంగుడువడు** (ద్వ.అ.క్రి.) : (త్రుంగుడు + పడు) నశించు.

**త్రుంచే** (దే.ప్రే.) : (త్రుంగఁ జేయు) 1. తునుకలు చేయు; 2. చంపు; 3. ఉత్తరించు.

**త్రుంపు** (దే.వి.) : ఖండము.

**త్రుంపుడు** (దే.వి.) : ఖండము.

**త్రుక్కు** (దే.వి.) : త్రుళ్లు, గర్వము.

**త్రుటణము** (సం.వి.అ.న.) : తెగుట.

**త్రుటి** (సం.వి.ఇ.స్త్రీ.) :1. లఘ్వక్షరము యొక్క చతుర్థ భాగోచ్చారణము చేయునంతటి కాలము; 2. ఇంచుక; 3. సంశయము; 4. చిట్టేలకి.

**త్రుటితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) తెగినది.

**త్రుట్టియ** (దే.వి.) : త్రుట్టె.

**త్రుట్టె** (దే.వి.) : సమూహము. (త్రుట్టియ యొక్క రూపాంతరము)

**త్రుప్పు** (దే.వి.) : 1. ఇనుము మీఁది ముఱికి; 2. అరుచి.

**త్రుప్పుడు** (దే.వి.) : పశుపక్ష్యాదుల మేని రోమము.

**త్రుస్సు** (దే.వి.) : నీళ్లు చిమ్ముట యందగు ధ్వన్యనుకరణము.

**త్రుళ్లగించే** (దే.అ.క్రి.) : ఎగురు.

**త్రుళ్లగింత** (దే.వి.) : ఎగురుట. (త్రుళ్ల గింతలు పెట్టు = ఎగురు.)

**త్రుళ్లింత** (దే.వి.) : 1. ఎగిరిపడు; 2. గర్వించు. (వి.) : 1. ఎగిరిపాటు; 2. గర్వము.

**త్రుళ్లుఁబోతు** (దే.విణ.) : (త్రుళ్లు+పోతు) త్రుళ్లునట్టి స్వభావము గలవాడు.

**త్రుళ్లుపిండి** (ద్వ.వి.) : స్ఫోటకము కనిపించి నప్పుడు పోలేరమ్మకు కొట్టిపెట్టెడు పిండి.

**త్రుళ్లుమింత** (దే.వి.) : త్రుళ్లగింత. (గ్రంథముల యందు రూపమిట్లు కానఁబడుచున్నది.)

## త్రె

**త్రెంచు** (దే.ప్రే.) : త్రెగc జేయు.

**త్రెంపు** (దే.ప్రే.) : త్రెంచుయొక్క రూపాంతరము.

**త్రెక్కొట్టు** (దే.అ.క్రి.) : ఎగcదట్టు.

**త్రెక్కొను** (దే.స.క్రి.) : 1. చెఱచు; 2. చంపు; 3. కలcచు; 4. మ్రింగు; 5. త్రాగు.

**త్రెక్కోలు** (దే.వి.) : త్రెక్కొనుట.

**త్రెక్కోలుకొను** (దే.స.క్రి.) : చంపు.

**త్రెగు** (దే.అ.క్రి.) : (చూ.) తెగు.

**త్రెడ్డు** (వై.వి.) : (చూ.) తెడ్డు.

**త్రెయ్యు** (దే.అ.క్రి.) : తెగు.

**త్రెవ్వన** (దే.వి.) : చక్కన, సౌందర్యము.

**త్రెవ్వు** (దే.అ.క్రి.) : తెగు, ఖండితమగు.

**త్రెళ్లు** (దే.అ.క్రి.) : పడు. (చూ. పొంపు రెండవ యర్థము.)

## త్రే

**త్రేcచు** (దే.అ.క్రి.) : త్రేcపు విడుచు, ఉద్గారించు. (త్రేనుచు యొక్క రూపాంతరము.)

**త్రేcపు** (దే.వి.) : త్రేcచుట, ఉద్గారము. (త్రునుపు యొక్క రూపాంతరము.)

**త్రేగుడు** (దే.వి.) : జిగట పాటిన యెంగిలి లోనగునది. (చూ. క్రుయ్యు. త్రేవడు)

**త్రేజరి** (ఆం.వి.) : ధనాగారము, ద్రవ్య సంబంధమైన.

**త్రేత** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. ఒక యుగము; (చూ. యుగము) 2. మూడగ్నులు (గార్హపత్యము, దక్షిణాగ్ని, ఆహవనీయము)

**త్రేనుచు** (దే.అ.క్రి.) : త్రేcచు.

**త్రేనుపు** (దే.వి.) : త్రేcపు.

**త్రేన్చు** (దే.అ.క్రి.) : త్రేనుచు యొక్క రూపాంతరము.

**త్రేన్పు** (దే.వి.) : త్రేనుపు యొక్క రూపాంతరము.

**త్రేవుడు** (దే.వి.) : త్రేగుడు యొక్క రూపాంతరము.

## త్రై

**త్రైగుణ్యము** (సం.వి.అ.న.) : 1. సత్త్వరజస్తమో గుణములు; 2. శైత్యసౌగంధ్య మాంద్యములు.

**త్రైలోక్యము** (సం.వి.అ.న.) : త్రిలోకముల సమాహారము.

**త్రైవర్గికుcడు** (సం.విణ.) : (అ.ఈ.అ.) ధర్మార్థ కామమోక్షముల యందిచ్ఛ గలవాcడు.

**త్రైవిద్యుcడు** (సం.వి.అ.పుం.) : వేదము తెలిసిన వాcడు.

## త్రొ

**త్రొక్కట** (దే.వి.) : (చూ.) తొక్కట; (రూ.) త్రొక్కటము.

**త్రొక్కటపడు** (ద్వ.అ.క్రి.) : (చూ.) తొక్కటపడు.

**త్రొక్కటపాటు** (ద్వ.వి.) : (చూ.) తొక్కటపాటు.

**త్రొక్కు** (దే.స.క్రి.) : పాదముతో నదుము. (వి.) : త్రొక్కుడు.

**త్రొక్కుడు** (దే.వి.) : 1. త్రొక్కుట; 2. ఆపద. 3. పక్షిరతము.

**త్రొక్కుడుcగమ్మి** (ద్వ.వి.) : (త్రొక్కుడు + కమ్మి) కడప క్రింది పలక, శిల.

**త్రొక్కుడుపట్టె** (ద్వ.వి.) : 1.త్రొక్కుడుc గమ్మి; 2. బ. సాలెవాcడు నేయునప్పుడు త్రొక్కెడు చెక్కెలు.

**త్రొక్కుడుపలక** (ద్వ.అ.క్రి.) : ఊళ్లపని వాని కాళ్ల క్రింద పలక.

**త్రొక్కుడుబిల్ల** (దే.వి.) : బాలక్రీడా విశేషము.

**త్రొక్కుడువడు** (ద్వ.అ.క్రి.) : (త్రొక్కుడు + పడు) త్రొక్కువడు.

**త్రొక్కువడు** (ద్వ.అ.క్రి.) : (త్రొక్కు + పడు) త్రొక్కుడువడు.

## త్రో

**త్రోచు** (దే.అ.క్రి.) : 1.వడిగొను; 2.పూను; 3.నడచు; 4.కవియు; 5.మీఱు. (స.క్రి.) : 1. త్రోయు; 2. ఉపేక్షించు; 3. చంపు.

**త్రోటి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. పక్షిముక్కు; 2. చేప ముక్కు; 3. టేఁకు.

**త్రోద్రోపు** (దే.వి.) : (త్రోపు+త్రోపు) మిక్కిలి త్రోపు.

**త్రోద్రోపులాడు** (దే.స.క్రి.) : (త్రోద్రోపులు + ఆడు) మిక్కిలిత్రోయు. (బలాత్కారము చేసి త్రోయు అని యర్థము.)

**త్రోపడు** (ద్వ.అ.క్రి.) : (త్రోపు+పడు) త్రోయఁబడు.

**త్రోపనంగొఱవి** (దే.విణ.) : (త్రోపు + కొఱవి) ఉభయభ్రష్టుఁడు, ఉభయ భ్రష్టురాలు.

**త్రోపరి** (దే.విణ.) : (త్రోపు+అరి) త్రోయువాఁడు.

**త్రోపాటు** (ద్వ.వి.) : త్రోపడుట.

**త్రోపాడు** (దే.స.క్రి.) : (త్రోపు + ఆడు) త్రోయు.

**త్రోపు** (దే.వి.) : 1. త్రోయుట; 2. నిరాకరణము; 3. నిషేధము.

**త్రోపుడు** (దే.వి.) : 1. త్రోపు; 2. (చూ.) చిత్రిక.

**త్రోపుడుపెట్టు** (దే.స.క్రి.) : త్రోపుడుతో మ్రాను నునుపు పఱచు.

**త్రోపువడు** (ద్వ.అ.క్రి.) : (త్రోపు + పడు) త్రోపడు.

**త్రోపుసేయు** (ద్వ.స.క్రి.) : (త్రోపు + చేయు) నిరాకరించు.

**త్రోయు** (దే.స.క్రి.) : తొలఁగనూకు.

**త్రోలు** (దే.స.క్రి.) : (చూ.) తోలు.

**త్రోవ** (దే.వి.) : దారి, మార్గము.

**త్రోవరి** (దే.విణ.) : (త్రోవ + అరి) మార్గము నెఱిఁగినవాఁడు.



**త్ర్యంగటము** (సం.వి.అ.న.) : ఒక దినుసు చిక్కము. (పుం.డు.) శివుఁడు.

**త్ర్యంబకసఖుఁడు** (సం.వి.అ.పుం.) : కుబేరుఁడు, ముక్కంటిచెలి.

**త్ర్యంబకుఁడు** (సం.వి.అ.పుం.) : శివుడు, ముక్కంటి.

**త్ర్యబ్ద** (సం.వి.ఆ.స్త్రీ.) : మూడేండ్ల పెయ్య.



**త్ర్యూషణము** (సం.వి.అ.న.) : సొంటి పిప్పలి మిరియాలు. (రూ. త్ర్యుషణము)



**త్వక్కు** (సం.వి.చ్.స్త్రీ.) : 1. తోలు; 2. చెట్టుపట్ట; 3. లవంగపు పట్ట; 4. నార.

**త్వక్పత్రము** (సం.వి.అ.న.) : 1. లవంగపుపట్ట; 2. ఇంగువాకు.

**త్వక్షీరము** (సం.వి.అ.న.) : తవక్షీరి. (ఇది ఆకారాంత స్త్రీలింగమును ఈకారాంత స్త్రీ లింగమునగును.)

**త్వక్సారము** (సం.వి.అ.పుం.) : వెదురు.

**త్వచము** (సం.వి.అ.న.) : లవంగపు పట్ట (పుం.) : 1. తోలు; 2. చెట్టుపట్ట.

**త్వచిసారము** (సం.వి.అ.పుం.) : త్వక్సారము, వెదురు.

**త్వర** (సం.వి.ఆ.స్త్రీ.) : సంభ్రమము, వేగిరపాటు.

**త్వరితము** (సం.క్రి.విణ.అ.న.) : శీఘ్రము. (విణ.) : వడిగలది.

**త్వష్ట** (సం.వి.ఋ.పుం.) : 1. విశ్వకర్మ; 2. ద్వాదశాదిత్యులలో నొకడు; (చూ. ఆదిత్యుఁడు) 3. వడ్లవాఁడు. (విణ.అ.ఆ.అ.) చెక్కఁబడినది.



**త్వాదృశము** (సం.విణ.) : (అ.ఈ.అ.) నీవంటిది.



**త్విట్టు** (సం.వి.ష్.స్త్రీ.) : 1. జిగి; 2. మంట; 3. వెలుఁగు. (ఇది త్విష అని ఆకారాంత స్త్రీ లింగమునగును.)

**త్విషాంపతి** (సం.వి.ఇ.పుం.) : సూర్యుఁడు; వెలుఁగుఱేఁడు.

# ద

**ద** : ఒక యక్షరము.

**దంగు** (దే.అ.క్రి.) : బియ్యములోనగునది పైతవుడు పోవునట్లు మెదుగు.

**దంగుడు** (దే.విణ.) : దంచినది. (దంగుడు బియ్యము)

**దంచేన** (దే.వి.) : పెద్దపిరంగి. (రూ.దంచనము.) (దెంచనమని వక్రాదిగాను కానఁబడుచున్నది.)

**దంచే** (దే.ప్రే.) : దంగఁజేయు, దంపు.

**దంట** (యు.దే.వి.) : జంట. (చూ. దంట మోముల దేవర) (వై.విణ.) : 1. దిట్టతనము గలవాఁడు; 2. నేర్పరి.

**దంటమోముల దేవర** (ద్వ.వి.) : అగ్ని.

**దంటు** (వై.వి.) : జొన్నలోనగువాని కాఁడ.

**దండ** (యు.దే.వి.) : 1. సమీపము; 2. ప్రాపు. (చూ. దండ గోల.) 3. ఎద్దు ముడ్డి మీఁద ముల్లుకోలతో పొడువఁగా నేర్పడిన బొరుసు. వై.హారము. (ఇది కుండ శబ్దము వంటిది.)

**దండకడియము** (సం.వి.) : సందిదండ, కేయూరము.

**దండకము** (సం.వి.అ.పుం.) : 1. వృత్త విశేషము; 2. అరణ్యవిశేషము; (ఈ యర్థము నందిది ఆకారాంత స్త్రీ లింగమునగును.) 3. దేశ విశేషము; చెట్టు బోదె. (విణ.) : వంచకము.

**దండకవిలియ** (ద్వ.వి.) : ప్రాంతలెక్క పుస్తకపు కట్ట.

**దండగోల** (దే.వి.) : (దండ + కోల) ఊత, అవలంబము.

**దండచేయి** (వై.వి.) : సందిలి, ప్రగండము. (రూ. దండచే.)

**దండచేరు** (ద్వ.వి.) : సందిటఁ గట్టుకొనుదు తోరము.

**దండధరుడు** (సం.వి.అ.పుం.) : 1. యముఁడు; 2. రాజు.

**దండనము** (సం.వి.అ.న.) : దండించుట.

**దండనాయకుఁడు** (సం.వి.అ.పుం.) : సేనాధిపతి.

**దండనీతి** (సం.వి.ఇ.స్త్రీ.) : కామందకా ద్యర్థశాస్త్రము.

**దండపడు** (ద్వ.అ.క్రి.) : 1.సమీపించు; (చూ. దండపాటు) 2.ఎద్దుముడ్డిమీఁద ముల్లు కోలతో పొడువఁగా బొరుసుగా నేర్పడు.

**దండపాటు** (ద్వ.వి.) : దండ పడుట, సమీపించుట.

**దండపాశికుఁడు** (సం.వి.అ.పుం.) : చోరోప ద్రవము లేక పట్టణమును కాపాడెడి యధికారి.

**దండము** (ఉభ.దే.వి.) : నమస్కారము. (సం.అ.పుం,న.) : దుడ్డుకఱ్ఱ. (పుం.) : 1. చతురుపాయములలో నొకటి; (ఇది వధించుట, ధనము హరించుట, పీడించుట అని మూడు విధములు గలది. చూ. ఉపాయము) 2.రాజశిక్ష; 3.చెట్టుబోదె; 4.కాఁడ; 5. కవ్వము; 6. వాద్యము వాయించెడు కొడుపు; 7. దండు; 8.అడ్డముగా తీర్చి దిద్దిన వ్యూహము; 9. గర్వము; 10. పీడనము; 11. వధము; 12.బార; 13. గుఱ్ఱము; 14. తోఁకతెగిన యెద్దు; 15. హారము నందలి పేట; 16. కప్పము; 17. జత; 18. సమూహము. (వేదండంబులు. మొ.) వేదండ తండంబులు అనితకారాదిగా గ్రంథముల యందు కనఁబడుచున్నది. దాని కాకర మేమియుఁ గానరాదు.)

**దండయాత్ర** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. దిగ్విజయము; 2.యుద్ధయాత్ర; 3. అధ్వరయాత్ర.

**దండలాసకము** (సం.వి.అ.పుం.) : నృత్య విశేషము, కోలాటము.

**దండవిష్కంభము** (సం. వి. అ. పుం.) : తరిగంబము.

**దండసిల్లు** (దే.అ.క్రి.) : 1. ఇఱుకుకొను; 2. అదుముదువడు, అణఁగు. (రూ. దండసిలు. అదుముదు వడుటకు.)

**దండాట** (ద్వ.వి.) : (దండ + ఆట) (చూ.) దేగాట.

**దుండాహతము** (సం.వి.అ.న.) : మజ్జిగ, కాలశేయము.

**దండి** (ఉభ.దే.వి.) : 1.ప్రతాపము; 2.శౌర్యము. (విణ.) : 1.ప్రతాప వంతుఁడు; 2. శౌర్య వంతుఁడు; 3.సమృద్ధము; 4.గొప్ప. (సం.వి.న్. పుం.) : 1. ఒకానొక కవి; 2. యముఁడు; 3. ద్వారపాలకుఁడు. (విణ.) : దండము గలవాఁడు.

**దండించే** (సం.స.క్రి.) : దండనము చేయు.

**దండిక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. కిన్నెర; 2. హారము నందలి పేట.

**దండితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) దండింపఁబడినవాఁడు.

**దండియ** (వై.వి.) : 1.కిన్నెర; 2.వీణె; 3.తంబుఱ; 4. పల్లకి బొంగు; 5. త్రాసు కోల; 6. పగుడు నేల రాచు కొనకుండ మగ్గపు గుంత కెదుట అడ్డముగా పాతిన కొయ్య; (చూ. క్రోవి) 7. ఏతపు కడవకు మీఁద నడ్డముగా నుంచి కట్టెడు కొయ్య.

**దండియము** (వై.వి.) : 1. వస్త్రములు ఎండ వేయుట లోనగువానికిఁ గాను అడ్డముగా కట్టెడు దారము (లేక) కొయ్య; 2. గరిడిసాధనలలో నొక విధము.

**దండు** (వై.వి.) : 1. సేన; 2. సమూహము.

**దండుఁడు** (సం.వి.అ.పుం.) : 1.సూర్యుని ప్రక్కనుండు వారలలో నొకఁడు, (దండుఁడు, పింగళఁడు, మాఠరుఁడు అనివీరు ముగ్గురు. సూర్యుడు దైత్యులకు వరమియ్యక విఘ్నము చేయుటకు రుద్రాగ్నియములు క్రమంబుగ పై మూడు నామములో వర్తింతురు) 2.యముఁడు.

**దండుగ** (వై.వి.) : 1. రాజు ధనవంతుని బలాత్కారముచేసి పుచ్చుకొనెడుధనము; 2. అధికారి యపరాధి వలన నపరాధమునకుఁ గాను పుచ్చుకొనెడి ధనము. (చూ.దండుగు) 3. నష్టము.

**దండుగు** (వై.వి.) : దండుగ యొక్క రూపాం తరము. (అధికారి యపరాధి వలన నపరాధము నకుఁ గాను పుచ్చుకొను ధనమునకు.)

**దండుదివియ** (వై.వి.) : దీపపు సెమ్మె.

**దండుబాట** (ద్వ.వి.) : (చూ.) ఘంటా పథము. (ఇట్లు దండుదారి.)

**దండులంజె** (వై.వి.) : బజారి.

**దండువ** (వై.వి.) : దండుగ యొక్క రూపాం తరము.

**దండువు** (వై.వి.) : దండుగు యొక్క రూపాం తరము.

**దండూరావేయు** (హిం.క్రి.) : తప్పెట కొట్టి చాటించు.

**దండె** (వై.వి.) : దండియ యొక్క రూపాంతరము. (కిన్నెరకు.) పడగు నేల రాచుకొనకుండ మగ్గపుగంత కెదుట అడ్డముగాఁ బాఁతిన కొయ్యకు.

**దండెత్తు** (ద్వ.అ.క్రి.) : (దండు + ఎత్తు) యుద్ధ ప్రయత్నము చేయు.

**దండెపుఁబీఁటలు** (వై.వి.బ.) : (దండెము + పీఁటలు) గడచీల తగుల్చుటకు దండెకు నడుమ గ్రుచ్చిన రంధ్రములుగల రెండు పీఁటలు.

**దండెము** (వై.వి.) : దండియము యొక్క రూపాం తరము. (గరిడీ సాధనలలో నొక విధమునకు.)

**దండ్యుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) దండింపఁ దగినవాఁడు.

**దంతధావనము** (సం.వి.అ.న.) : పలుదోముట. (పుం.) : చంద్ర.

**దంతభాగము** (సం.వి.అ.పుం.) : ఏనుఁగు ముందటి భాగము.

**దంతము** (సం.వి.అ.పుం.) : 1. పల్లు; (దంత ములు పాఁచి = పిప్పిక.) 2.కొండనడుము; 3. పొదరిల్లు; 4. పొడవుఱాయి.

**దంతశఠ** (సం.వి.ఆ.స్త్రీ.) : పులిచింత. (అ.పుం. ము.) : 1.నిమ్మ; 2.వెలఁగ; 3.చింత; 4. నారదము.

**దంతావళము** (సం.వి.అ.పుం.) : ఏనుఁగు, సామజము.

**దంతి** (సం.వి.ఈ.స్త్రీ.) : ఒక చెట్టు. (న్.పుం.) : 1. ఏనుఁగు; 2. కొండ. (విణ.) : కోఱపంటివాఁడు.

**దంతియ** (వై.వి.) : 1. మిద్దెటింటికి అడ్డముగా వేసెడు పట్టె; 2. అచ్చుకట్టు దంతె.

**దంతురము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ప్రక్కలణఁగి నడుము పొడవైనది.

**దంతురుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) మిట్టపండ్లవాఁడు.

**దంతె** (వై.వి.) : దంతియ యొక్క రూపాంతరము. (మిద్దెటింటికి అడ్డముగా వేసెడు పట్టెకు.)

**దంత్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) దంతము నందు పుట్టినది.

**దందడి** (దే.వి.) : తఱచు. (విణ.) : తఱచైనది.

**దందడించు** (దే.అ.క్రి.) : తఱచగు.

**దందడివెట్టు** (దే.స.క్రి.) : (దందడి + పెట్టు) రాయిడి చేయు.

**దందన** (వై.వి.) : మాయ, జాలము.

**దందనకత్తియ** (వై.విణ.) : జాలము చేయునది. (రూ.) దందనకత్తె.

**దందనకాఁడు** (ద్వ.విణ.) : జాలము చేయువాఁడు.

**దందశూకము** (సం.వి.అ.పుం.) : సర్పము. (డు.) రాక్షసుఁడు.

**దంధనము** (సం.విణ.) : (అ.ఆ.అ.) శాశ్వతము కానిది.

**దంపకట్టు** (ద్వ.వి.) : (దమ్ము + కట్టు) (చూ.) దంపనాఁగలి.

**దంపతులు** (సం.వి.ఇ.పుం.ద్వి.) : ఆలుమగలు.

**దంపనాఁగలి** (వై.వి.) : (దమ్ము + నాఁగలి) అడుసున దున్నెడు నాఁగలి.

**దంపు** (దే.ప్రే.) : దంచు యొక్క రూపాంతరము. (వి.) : దంపుడు.

**దంపుటిల్లు** (దే.వి.) : (దంపు + ఇల్లు) దంచునట్టి యిల్లు.

**దంపుడు** (దే.వి.) : దంచుట, దంపు.

**దంభము** (సం.వి.అ.పుం.) : 1. కపటము; 2. తప్పు.

**దంభోళి** (సం.వి.ఇ.పుం.) : వజ్రాయుధము, ఱాతివాలు.

**దంశనము** (సం.వి.అ.న.) : 1. కాటు; 2. కవచము. (పుం.) : పల్లు. (రూ. దంసనము)

**దంశము** (సం.వి.అ.పుం.) : 1. అడవియీఁగ; 2. కాటు; 3. కవచము.

**దంశి** (సం.వి.ఈ.స్త్రీ.) : అడవిదోమ.

**దంశిక** (సం.వి.ఆ.స్త్రీ.) : పటుకాఱు.

**దంశితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. కాటు పడ్డవాఁడు; 2. కవచము తొడిగినవాఁడు.

**దంష్ట్ర** (సం.వి.ఆ.స్త్రీ.) : కోఱపల్లు.

**దంష్ట్రాయుధము** (సం.వి.అ.పుం.) : వరాహము, పంది.

**దంష్ట్రి** (సం.వి.న్.పుం.) : వరాహము, పంది.

**దక్కినంపురాయఁడు** (వై.వి.) : (దక్కినము + రాయఁడు) దక్షిణ దిక్కున కధిపతి, యముఁడు. (ఇట్లు దక్కినపు తేఁడు. ము.)

**దక్కినము** (వై.వి.) : దక్షిణపుదిక్కు.

**దక్కు** (దే.అ.క్రి.) : అనుభవ యోగ్యమగు. (విణ.) అనుభవ యోగ్యము.

**దక్కొను** (దే.అ.క్రి.) : (దక్కు + కొను) స్వతంత్రుఁ డగు. (ఇక్కడ దక్కొను అనఁగా కలుగునట్టి అని యర్థము)

**దక్కోలు** (దే.వి.) : దక్కొనుట. (విణ.) : స్వాధీనము.

**దక్కోలుపడు** (ద్వ.అ.క్రి.) : (చూ.) దక్కొను.

**దక్షాయ్యము** (సం.వి.అ.పుం.) : గృధ్రము, గద్ద.

**దక్షిణ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. యజ్ఞము లోనగు వాని యందు ఋత్విజులు లోనగువారికి ఇచ్చెడు ధనము; 2. కుడిదిక్కు.

**దక్షిణము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. కుడి; 2. కుడి దిక్కుది.

**దక్షిణస్థుఁడు** (సం.వి.అ.పుం.) : తేరు నడపువాఁడు.

**దక్షిణాగ్ని** (సం.వి.ఇ.పుం.) : ఒక శ్రౌతాగ్ని (చూ. అగ్ని)

**దక్షిణాపథము** (సం.వి.అ.పుం.) : వింధ్య పర్వతము మొదలుకొని సేతువు వఱకుఁ గల దేశము.

**దక్షిణీయుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) దక్షిణ యియ్యఁదగినవాఁడు.

**దక్షిణుఁడు** (సం.వి.అ.పుం.) : అనేక నాయికల యందు సమముగా ప్రవర్తించు నాయకుడు. (చూ. నాయకుఁడు.) (విణ.) : 1. కుటిలము గాక చక్కనైన మనస్సుగలవాఁడు; 2. దాక్షిణ్యము కలవాఁడు; 3. నేర్పు గలవాఁడు.

**దక్షిణ్యుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) దక్షిణకుఁదగిన వాఁడు.

**దక్షిణేర్మము** (సం.వి.న్.పుం.) : బోయ వానిచేత కుడిప్రక్క గాయము చేయబడిన మృగము.

**దక్షుఁడు** (సం.వి.అ.పుం.) : 1. ఒక బ్రహ్మ; (చూ. బ్రహ్మ) 2. ఒకానొక ముని. (విణ.) : నేర్పరి.

**దఖలు** (హిం.వి.) : ప్రవేశము.

**దగ** (వై.వి.) : 1. తాపము; 2. దప్పి.

**దగదగ** (దే.వి.) : మెఱయుటలోనగు వాని యందగుననుకరణము. (కెంపు దగదగ మెఱయుచున్నది. ప్రొయ్యి దగదగ మండు చున్నది. మొ.)

**దగదగమను** (దే.అ.క్రి.) : దగదగ యని ప్రకాశించు.

**దగర** (దే.వి.విణ.) : డగర యొక్క రూపాంతరము.

**దగరము** (దే.వి.) : డగరము యొక్క రూపాంతరము.

**దగరు** (దే.వి.) : యుద్ధసాధన విశేషము.

**దగల్బాజీ** (హిం.వి.) : దొంగ, మోసకాఁడు.

**దగా** (హిం.వి.) : మోసము.

**దగ్గఱ** (దే.వి.) : సమీపముజ (రూ. దగ్గఱ)

**దగ్గఱించు** (దే.అ.క్రి.) : సమీపించు. (రూ. దగ్గ ఱించు)

**దగ్గఱు** (దే.అ.క్రి.) : సమీపించు. (చూ. రూ. దగ్గఱు.)

**దగ్గు** (దే.అ.క్రి.) : కాసముచేయు. (వి.) : కాసము.

**దగ్ధ** (సం.వి.ఆ.స్త్రీ.) : సూర్యుఁడున్న దిక్కు. (విణ.) కాల్పఁబడినది.

**దగ్ధిక** (సం.వి.ఆ.స్త్రీ.) : మాఁడిన వంటకము, మాఁడు.

**దచ్చవుక** (వై.స.) : (దంట + చవుకము) ఇరునాలుగు, దల్చి.

**దచ్చి** (దే.స.) : దచ్చొక, అష్టకము.

**దచ్చికాళ్లమెకము** (ద్వ.వి.) : శరభము, అష్టా పదము.

**దటాయించు** (హిం.క్రి.) : కోపగించు, అదమాయించు.

**దట్టన** (దే.వి.) : అదలుపు, తర్జనము.

**దట్టము** (దే.వి.) : పావడ. (విణ.) : 1. తఱచు; (వృత్తి యందు హల్లు పరమగుచో అంత్యవర్ణము వికల్పముగా లోపించును.) 2. విరళము.

**దట్టా** (దే.వి.) : సిద్దెమూతికి వేసెడు మంటిమూఁత.

**దట్టి** (వై.వి.) : దిండు, కాసె.

**దట్టించు** (యు.దే.స.క్రి.) : అదలుచు. (వై.) : దట్టికట్టు.

**దట్టీ** (వై.వి.) : దట్టి యొక్క రూపాంతరము.

**దట్టుఁడు** (వై.విణ.) : దిట్టతనము గలవాఁడు.

**దడ** (యు.దే.వి.) : వణుకు. 1. కొయ్య త్రాసు; 2. (చూ.) దాళా.

**దడకట్టు** (ద్వ.స.క్రి.) : (నెయ్యి నూనె మొదలగునవి తీయు పాత్రములనుగాని అవియుంచి యున్న పాత్రములను గాని) సరియొత్తుఱాలను దడతట్టనుంచి తూఁచు.

**దడదడ** (దే.క్రి.విణ.) : వడిగా. (వాఁడు దడదడ చదువుచున్నాఁడు. వీఁడు దడదడ వచ్చెను.మొ.)

**దడదడమను** (దే.అ.క్రి.) : దడదడ కొట్టుకొను.

**దడబడ** (దే.వి.) : ఆటోపము, ఆవేగము.

**దడము** (యు.దే.విణ.) : దట్టము. (దళము యొక్క మొదటి రూపము) (వై.వి.) : 1.సేన; 2. సమూహము.

**దడి** (దే.వి.) : వెదురుచాఁప లోనగు వానితో నేర్పఱచిన మఱుఁగు.

**దడిగ** (దే.వి.) : (చూ.) అరిగ.

**దడిబము** (వై.వి.) : పఱపు, మెత్త, తల్పము, శయ్య.

**దడిమము** (యు.దే.విణ.) : సన్నము. (వై.వి.) : పఱపు.

**దడియ** (దే.వి.) : కొండచేరువ నేల, ఉపత్యక.

**దడియఁబడు** (ద్వ.అ.క్రి.) : (దడియ౯ + పడు) దడియు. (రూ. దడియఁ గఁబడు.) (స్వార్థమున పడు, మహాకవి ప్రయోగములయందు పద్యను బంధము పరమగుచుండఁగా అగు ధాతువు యొక్క తుమ్మున్నర్థక రూపము పూర్వాగమముగా కానఁబడుచున్నది.)

**దడియము** (దే.వి.) : పదిసేరుల యెత్తు. అయిదు సేరుల యెత్తు. (అని కొందఱు.)

**దడియు** (దే.అ.క్రి.) : వణఁకు.

**దడెము** (దే.వి.) : దడియము యొక్క రూపాంతరము.

**దడ్డియము** (దే.వి.) : దడియము యొక్క రూపాంతరము.

**దణా** (వై.వి.) : సేన.

**దణాయఁడు** (వై.వి.) : సేనానాయకుఁడు.

**దణి** (వై.వి.) : ప్రభువు, ఱేఁడు.

**దత్తకుఁడు** (సం.వి.అ.పుం.) : దత్తపుత్రుఁడు.

**దత్తము** (సం.వి.అ.న.) : ఈవి. (విణ.) : ఇయ్యఁబడినది.

**దత్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : ఈవి, దానము.

**దత్తు** (వై.వి.) : స్వీకారము.

**దత్తుఁడు** (సం.వి.అ.పుం.) : 1. ఒకానొక రాజు; 2. దత్తాత్రేయుఁడు; 3. ఒక జాతి పురుషుఁడు. (చూ. పురుషుఁడు) (విణ.) : కుదువయుంచబడినవాఁడు.

**దద్దడము** (దే.వి.) : చిన్నగుడి, బోడిమిద్దె.

**దద్దటిల్లు** (దే.అ.క్రి.) : తబ్బిబ్బుపడు.

**దద్దఱు** (దే.అ.క్రి.) : తబ్బిబ్బుపడు.

**దద్దళము** (దే.వి.) : దద్దడము యొక్క రూపాంతరము.

**దద్దిర్లు** (దే.అ.క్రి.) : దద్దటిల్లు యొక్క రూపాంతరము.

**దద్దు** (వై.వి.) : 1.రోగవిశేషము; 2. చీమ కుట్టుట లోనగువానిచే గలిగెడు బుడిపి.

**దద్దురు** (వై.వి.) : రోగవిశేషము, దద్దు.

**దద్రుఘ్నము** (సం.వి.అ.పుం.) : తగిరస.

**దద్రుణుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) దద్దురోగము గలవాఁడు.

**దద్రువు** (సం.వి.ఉ.పుం.) : రోగ విశేషము, దద్దు.

**దధి** (సం.వి.ఇ.న.) : 1. పెరుగు; (దీని భేదములు ఆర్యోఘ్నము, ప్రాగ్రాటము, అఘనము) 2. సరళమను ధూప ద్రవ్యము; 3. మద్ది.

**దధిత్థము** (సం.వి.అ.పుం.) : వెలఁగ.

**దధిఫలము** (సం.వి.అ.పుం.) : వెలఁగ.

**దధిబుసము** (సం.వి.అ.న.) : మీఁగడ తీసిన పెరుగు. (మీఁగడ పెరుగు అర్యోఘ్నము)

**దధ్యుదము** (సం.వి.అ.పుం.) : పెరుగు సముద్రము.

**దనియాలు** (వై.వి.బ.) : కొత్తిమిరి విత్తులు, ధాన్యాకము.

**దనియు** (దే.స.క్రి.) : కూడు, సంగమించు.

**దనివు** (దే.వి.) : కూడిక, సంగమము.

**దనుక** (దే.ద్ర.) : వఱకు, పర్యంతము.

**దనుకు** (దే.స.క్రి.) : 1. తాఁకు; 2. పొందు. (రూ. దన్కు.)

**దనుజుఁడు** (సం. వి. అ. పుం.) : అసురుఁడు, తొలివేల్పు.

**దఫా** (హిం.వి.) : తడవ.

**దప్పము** (దే.విణ.) : దట్టము.

**దప్పళము** (దే.వి.) : పలుచగాఁ జేసిన వ్యంజన విశేషము, పులుసు.

**దప్పి** (దే.వి.) : 1. నీరుపట్టు; 2. శ్రమము. (చూ. డప్పి.)

**దప్పిక** (దే.వి.) : దప్పి యొక్క రూపాంతరము. (స్వార్థమున కప్రత్యయము.)

**దబకాయించు** (హిం.క్రి.) : అదుము, గదమాయించు.

**దబదబ** (దే.వి.) : తలుపులోనగునవి తట్టుట పరుగెత్తుట మొదలగువాని యందగు ధ్వన్యను–

కరణము. (దబదబ తలుపు తట్టుచున్నాఁడు. దబదబ పరుగెత్తుచున్నాఁడు. మొ.)

**దబరా** (హిం.వి.) : వెడల్పయిన గిన్నె, బొగిణి.

**దబాయించు** (హిం.క్రి.) : అదుము, నెట్టు.

**దబ్బ** (యు.దే.వి.) : నాగరంగ విశేషము. (దీని భేదములు కోలదబ్బ, నారదబ్బ.) (వై.) : 1. దర్భ; 2. బద్ద; 3. వెదురుబద్ద.

**దబ్బడము** (దే.వి.) : మూకుడు.

**దబ్బడించు** (దే.స.క్రి.) : 1. మూకుటితో మూయు; 2. చేతులతో చఱచు.

**దబ్బనము** (దే.వి.) : గోనె కుట్టెడు సూది.

**దబ్బయుంగరము** (ద్వ.వి.) : పవిత్రపు ముడివలె బంగారుతో చేసిన యుంగరము.

**దబ్బఱ** (దే.వి.) : 1.బొంకు; 2.మోసము; 3.విపత్తు; 4.తప్పు (చూ. బుజ.) విణ. 1. బొంకుకాఁడు; 2. మోసకాఁడు.

**దబ్బఱకత్తియ** (ద్వ.విణ.) : దబ్బఱ లాడునది. (స్వార్థమున కత్తియ)

**దబ్బఱకాఁడు** (దే.విణ.) : దబ్బఱలాడువాఁడు (స్వార్థమున కాఁడు.)

**దబ్బఱి** (దే.విణ.) : (దబ్బఱ + ఇ) దబ్బఱ కాఁడు, దబ్బఱకత్తియ. (స్వార్థమున ఇ ప్రత్యయము.)

**దబ్బవాఁడు** (ద్వ.వి.) : మేదరవాఁడు.

**దబ్బవ్రేలు** (ద్వ.వి.) : పవిత్రపు వ్రేలు, అనామిక.

**దబ్బాటు** (దే.క్రి.విణ.) : డబ్బాటు యొక్క రూపాంతరము.

**దబ్బిచిప్ప** (దే.వి.) : తాటిచెట్టు బద్దలు చేసెడు సాధనము.

**దబ్బు** (దే.స.క్రి.) : చెప్పు. (వి.) : 1. మాట. 2. దబ్బడము. 3. చఱచుట లోనగువాని యందగు ధ్వన్యనుకరణము.

**దబ్బుడు** (దే.వి.) : మూఁత, దబ్బడము.

**దబ్బున** (దే.ద్ర.క్రి.విణ.) : శీఘ్రముగా. (నీవు పోయి దబ్బునరా.)

**దబ్బుర** (దే.వి.) : డబ్బుర యొక్క రూపాంతరము. (గిన్నెకు)

**దబ్బువెట్టు** (దే.స.క్రి.) : (డబ్బు + పెట్టు) మూయు. (చూ. గోలెము.)

**దభ్రము** (సం.విణ.) : (అ.ఆ.అ.) సూక్ష్మము, సన్నము.

**దమథము** (సం.వి.అ.పుం.) : 1. క్లేశము నోర్చుతనము; 2. దండనము.

**దమనము** (సం.వి.అ.న.) : అణఁచుట. (పుం.) : దవనము.

**దమనుఁడు** (సం.వి.అ.పుం.) : 1. ఒకానొకముని; 2. శూరుఁడు. (విణ.) : అణఁచువాఁడు.

**దమము** (సం.వి.అ.పుం.) : 1. దండోపాయము; 2. క్లేశము నోర్చుతనము; 3. ఇంద్రియ నిగ్రహము; 4. అణఁచుట; 5. అడుసు.

**దమి** (సం.విణ.) : (న్.ఈ.న్) అణఁచువాఁడు.

**దమించు** (సం.స.క్రి.) : అణఁగఁద్రొక్కు, అణచు. (దమియించు. అనియు.)

**దమితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. అణఁపఁబడిన వాఁడు; 2. తపః క్లేశ సహనము గలవాఁడు.

**దమునసుఁడు** (సం.వి.స్.పుం.) : అగ్నిహోత్రుఁడు.

**దమ్మఁడు** (వై.విణ.) : కపటము లేనివాఁడు.

**దమ్మము** (యు.దే.వి.) : నాలుగు కాసుల నాణెము. (వై.) : ధర్మము.

**దమ్మిడి** (దే.వి.) : అయిదుకాసుల నాణెము. రెండు కాసుల నాణెము. (అని కొందఱు)

**దమ్ము** (వై.వి.) : అడుసు, పంకము.

**దమ్ముకొను** (ద్వ.అ.క్రి.) : అడుసగు, పంకిలమగు.

**దమ్యము** (సం.వి.అ.పుం.) : మోయుటకును, దున్నుటకును బనుపఱుపఁదగిన వయసు గల కోడె.

**దయ** (సం.వి.ఆ.స్త్రీ.) : కృప, కనికరము.

**దయచేయు** (మి.అ.క్రి.) : కరుణించు. (మఱియు నిది గొప్పవారిని రండు పొండు అనుట యందును ఉపయోగింపఁబడును.) (రూ. దయ సేయు.)

**దయాళువు** (సం.విణ.ఉ.) : కనికరముగలవాఁడు.

**దయిత** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. ప్రియురాలు; 2. ఆఁడుది.

**దయితుఁడు** (సం.వి.అ.పుం.) : ప్రియుఁడు. (విణ.) : ఇష్టుఁడు.

**దయ్యము** (వై.వి.) : 1. దేవుఁడు; 2. వేలుపు; 3. విధి. 1. పిశాచము.

**దయ్యు** (దే.అ.క్రి.) : డయ్యు యొక్క రూపాంతరము.

**దర** (వై.వి.) : వెల, క్రయము.

**దరణము** (దే.వి.) : ఎనిమిది డబ్బుల నాణెము.

**దరము** (సం.వి.అ.పుం.న.) : 1. భయము; 2.శంఖము; 3.గొయ్యి. (అవ్య.) : ఇంచుక. (దరహాసము.మొ.)

**దరహాసము** (సం.వి.అ.పుం.) : చిఱునవ్వు.

**దరాం** (ఆం.వి.) : ఒక కొలంత, మద్యపానము.

**దర్ఖాస్తు** (హిం.వి.) : విన్నపము.

**దర్జా** (హిం.వి.) : మెట్టు, స్థితి.

**దరి** (ఉభ.వై.వి.) : 1. గట్టు; 2. మేర; 3. సమీపము. (సం.ఈ.స్త్రీ.) : గుహ.

**దరికొను** (దే.అ.క్రి.) : 1. మండు; 2. కాలు. (ప్రే. దరికొలుపు.)

**దరితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) భయపడిన వాఁడు.

**దరిద్రుఁడు** (సం.విణ.) : బీదవాఁడు.

**దరిబేసి** (దే.వి.) : దైన్యము గలవాఁడు, దీనుఁడు.

**దరిమిల** (హిం.క్రి.విణ.) : తఱువాత.

**దరిసించు** (వై.స.క్రి.) : 1. చూచు; 2. కానుకగా నిచ్చు.

**దరిసెనము** (వై.వి.) : రాజులు లోనగువారిని చూడఁబోవునపుడు తీసికొని పోయి యిచ్చెడు కానుక.

**దర్జీ** (హిం.వి.) : కుట్టుపనిచేయువాఁడు.

**దరుజు** (దే.వి.) : గచ్చుపూతతో రాళ్లను కలుపుట.

**దరువు** (వై.వి.) : 1. గీతి విశేషము; 2. తాళము.

**దరువుచేయు** (వై.అ.క్రి.) : తాళమువేయు.

**దర్దుర** (సం.వి.ఆ.స్త్రీ.) : దుర్గ. (అ.పుం.ము.) : 1. కప్ప; 2. మబ్బు.

**దరోబస్తు** (హిం.విణ.) : అంత.

**దర్పకుఁడు** (సం.వి.అ.పుం.) : మన్మథుఁడు, మరుఁడు.

**దర్పణము** (సం.వి.అ.పుం.) : అద్దము, ముకురము.

**దర్పము** (సం.వి.అ.పుం.) : 1.గర్వము; 2.కస్తూరి.

**దర్పించు** (సం.అ.క్రి.) : గర్వించు, త్రుళ్లు.

**దర్బారు** (హిం.వి.) : కచ్చేరీ, కొలువు కూటము, ఒక రాగము.

**దర్భ** (సం.వి.అ.పుం.) : తృణవిశేషము, కుశము.

**దర్భముద్రిక** (సం.వి.ఆ.స్త్రీ.) : దబ్బ యుంగరము.

**దర్యాప్తు** (హిం.వి.) : విచారణ.

**దర్వి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1.మిల్లి; 2.గరిఁటె; 3. పాముయొక్క పడగ.

**దర్వీకరము** (సం.వి.అ.పుం.) : సర్పము, పాము.

**దర్శకుఁడు** (సం.వి.) : ద్వారపాలకుఁడు. (విణ.): 1.చూపెడువాఁడు; 2. నేర్పరి.

**దర్శనము** (సం.వి.అ.న.) : 1. చూపు; 2. కన్ను; 3. అద్దము; 4. బుద్ధి; 5. తెలివి; 6. కల; 7.శాస్త్రము; 8. ధర్మము.

**దర్శని** (సం.వి.ఈ.స్త్రీ.) : (చూ.) ఉపరథ్య.

**దర్శనీయము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చూడఁదగినది.

**దర్శము** (సం.వి.అ.పుం.) : 1. అమావాస్య; 2.అమావాస్య నాఁడు చేయఁదగిన యిష్టి; 3. చూపు.

**దర్శయిత** (సం.విణ.) : (ఋ.ఈ.ఋ) చూపువాఁడు.

**దర్శించు** (సం.స.క్రి.) : చూచు, వీక్షించు.

**దర్శితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చూపఁ బడినది.

**దర్సెనము** (వై.వి.) : దరిసెనము యొక్క రూపాంతరము. (చూ. చేదర్సెనము.)

**దలపము** (సం.వి.) : ముఖత్రాణము. (చూ. తను త్రాణము)

**దలారి, దలాలి** (హిం.వి.) : తరగరి.

**దలిమము** (దే.విణ.) : సన్నము. (దడిమము యొక్క రూపాంతరము)

**దల్లు** (వై.వి.) : జల్లు యొక్క రూపాంతరము. (వానకు.)

**దవ** (దే.వి.) : దుమ్ము, చెఱకుకొన. (అని కొందఱు.)

**దవంత్రి** (దే.వి.) : అగడ్త, కందకము.

**దవనము** (వై.వి.) : వాసన గల మూలికా విశేషము.

**దవము** (సం.వి.అ.పుం.) : 1.కార్చిచ్చు; 2.అడవి.

**దవసము** (దే.వి.) : కొలుచు, ధాన్యము.

**దవిష్ఠము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మిక్కిలి దవ్వైనది.

**దవీయము** (సం.విణ.) : (స్.ఈ.స్) మిక్కిలి దవ్వైనది.

**దవ్వ** (దే.వి.) : మ్రానినడిమి మెత్తని భాగము.

**దవ్వు** (వై.విణ.) : దూరము. (ఇది ద్వితీయా బహువచనాంతమైనచో దూరదేశ మర్థమగు చున్నది)

**దశ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.అవస్థ; 2.వత్తి; 3.బద్దె.

**దశకము** (సం.స.అ.న.) : పది.

**దశనము** (సం.వి.అ.న.) : కవచము (పుం.) : 1. పల్లు; 2. శిఖరము.

**దశనవాససు్స** (సం.వి.న్.న.) : పెదవి, పలువలువ.

**దశబలుఁడు** (సం.వి.అ.పుం.) : బుద్ధదేవుఁడు.

**దశమి** (సం.వి.ఈ.స్త్రీ.) : పక్షమునందు పదియవ తిథి. (విణ.) : పదియవది. (న్.) : మిక్కిలి వృద్ధుఁడు.

**దశమీస్థుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. నష్ట వీర్యుఁడు; 2. వృద్ధుఁడు.

**దశాహము** (సం.వి.అ.పుం.) : మృతి పొందిన వానికి పదియవనాఁడు చేయు శ్రాద్ధము.

**దష్టము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కఱవఁబడినది.

**దసరా** (వై.వి.) : దశరాత్రి పండుగ.

**దసిలీ** (దే.వి.) : 1. ఒక దినుసుపట్టు, మొగ్గపట్టు; 2. వదలు.

**దసువంది** (దే.వి.) : గ్రుద్దులాటకు జెట్టీలను గూర్చువాఁడు.

**దసెన** (దే.వి.) : ఆయుధ విశేషము. (అప్ర.)

**దస్థతు** (హిం.వి.) : చేవ్రాలు.

**దస్తరము దసము** : కాకిదముల మూట.

**దస్తావేజో** (హిం.వి.) : వ్రాత పూర్వకమైన సాధనము.

**దస్తు** (హిం.వి.) : పోగుచేసిన సొమ్ము.

**దస్తూరి** (హిం.వి.) : వ్రాఁత. (అన్యదేశ్యము)

**దస్యుఁడు** (సం.వి.ఉ.పుం.) : 1.శత్రువు; 2.దొంగ.

**దస్రులు** (సం.వి.అ.పుం.ద్వి.) : అశ్వినీదేవతలు.

**దహనము** (సం.వి.అ.న.) : కాల్చుట. (పుం.) : 1. చిత్రమూలము; 2. జీడి.

**దహనుఁడు** (సం.వి.అ.పుం.) : అగ్ని. (విణ.) : దుష్టుఁడు.

**దహించు** (సం.స.క్రి.) : కాల్చు.

**దళకొను** (దే.అ.క్రి.) : దళముకొను యొక్క రూపాంతరము.

**దళగించే** (దే.అ.క్రి.) : దళముకొను, దట్టమగు.

**దళనము** (సం.వి.అ.న.) : 1. ఖండించుట; 2. భేదించుట.

**దళము** (ఉభ.దే.వి.) : ఆధిక్యము. (విణ.) : 1.అధికము; 2.తఱచు; 3.దట్టము. (సం.వి. అ.న.) : 1. ఆకు; 2. దండు; 3. హరిదళము; 4. భాగము.

**దళముకొను** (దే.అ.క్రి.) : అధికమగు. (ప్రే. దళము కొలుపు.)

**దళవరి** (యు.దే.వి.) : (దళము + వరి) ధాన్య విశేషము. (వై.) : సేనాధిపతి.

**దళవాయి** (వై.వి.) : 1. సేనాధిపతి; (చూ. తల బీకనకాయ.) 2. సుంకరికి సహాయుఁడైన యుద్యోగస్థుఁడు.

**దళసంచే** (దే.వి.) : (దళము + సంచు) దళము జాతి.

**దళసరి** (ద్వ.వి.) : (దళము + సరి) ఘనత. (విణ.): 1.తఱచు; (నేఁత దళసరిగా నున్నది.) 2.మందము. (ఈ రాగి తగడు మిక్కిలి దళసరి.)

**దళించు** (సం.స.క్రి.) : 1. ఖండించు; 2. భేదించు.

**దళితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. ఖండింపఁబడినది; 2. భేదింపఁబడినది; 3. వికసించినది.



**దా** (దే.విణ.) దా యొక్క రూపాంతరము. (చూ. దాపల.)

**దాంతి** (సం.వి.ఇ.స్త్రీ.) : బ్రహ్మచర్యాది తపఃక్లేశము నోర్చుతనము.

**దాంతుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. అడపఁబడినవాఁడు; 2. తపః క్లేశము నోర్చువాఁడు.

**దాంపత్యము** (సం.వి.అ.న. ) : దంపతి భావము.

**దాంభికుఁడు** (సం.విణ.) : (అ.ఈ.అ.) దంభము గలవాఁడు.

**దాఁక** (దే.ద్ర.) : దనుక యొక్క రూపాంతరము.

**దాఁకొను** (దే.అ.క్రి.) : (దాఁగు + కొను) మఱుఁగుపడు. (స్వార్థమునకొను.)

**దాఖలా** (హిం.వి.) : ఋజువు, సాక్ష్యము.

**దాఁగనమ్రుచ్చులు** (దే.వి.బ.) : దాఁగిలి మూఁతలు.

**దాఁగర** (దే.వి.) : ఎండుపుఁదట్ట, ప్రసేవకము.

**దాఁగిలిమూఁతలు** (దే.వి.) : బాలక్రీడా విశేషము, గుప్తక్రీడ.

**దాఁగిలిమ్రుచ్చులు** (దే.వి.) : బాలక్రీడా విశేషము, గుప్తక్రీడ.

**దాఁగు** (దే.అ.క్రి.) : మఱుఁగు పడు, తిరోహితమగు.

**దాఁగురించే** (దే.స.క్రి.) : 1. దాఁచు; 2. వంచించు (చూ. డాఁగురించు)

**దాఁగురింత** (దే.వి.) : 1. దాఁగురించుట; 2. బ. దాఁగురుమూతలు. (చూ. డాఁగురింత)

**దాఁగురుమూఁతలు** (దే.వి.బ. ) : దాఁగిలి మూఁతలు.

**దాఁచు** (దే.ప్రే.) : దాఁగజేయు.

**దాఁటడుగుపరువడి** (దే.వి.) : మల్లబంధ విశేషము.

**దాఁటడుగుమొన** (దే.వి.) : మల్లబంధ విశేషము.

**దాఁటు** (యు.దే.అ.క్రి.) : లంఘించు. (చూ. ఉంకు) (స.క్రి.) : 1. తరించు; (వాఁడేయేఱు దాఁటి వచ్చెను.) 2. ఉల్లంఘించు. (వీఁడు నామాట దాఁటఁడు.) (వి.) : లంఘనము. (వై.) : సమూహము.

**దాఁటుకట్టు** (ద్వ.అ.క్రి.) : గుంపుగూడు.

**దాఁటుకొను** (దే.అ.క్రి.) : లంఘించు. (స్వార్థమున కొను)

**దాఁపన** (దే.వి.) : డాఁచుట.

**దాఁపరము** (దే.వి.) : దొంగిలించుట. (చూ. దాఁపరీఁడు)

**దాఁపరించే** (దే.స.క్రి.) : దొంగిలించు.

**దాఁపరీఁడు** (దే.వి.) : (దాపరము + ఈఁడు) దొంగ.

**దాఁపటికము** (దే.వి.) : (దాఁపన + ఇకము) దాఁపురము, గోపనము.

**దాఁపు** (దే.ప్ర.) : దాఁచు.

**దాఁపుడు** (దే.వి.) : దాఁచుట, గోపనము.

**దాఁపురము** (దే.వి.) : 1. మఱుఁగు పుచ్చుట, గోపనము; 2. దాఁచిన సొమ్ము.

**దాక** (యు.దే.వి.) : 1. వెడలుపు నోరుగల యటిక 2. బోగిణి. వై. ద్రాక్ష.

**దాకలి** (దే.వి.) : (దాయి + కలు) కాఁచి సాగఁగొట్టెడు ఇనుము బంగారు లోనగువానికి ఊతగా క్రిందనుంచెడు ఇనుపముద్ద లోనగునది, నిఘాతిక.

**దాకల్లు** (దే.వి.) : (దాపు + కల్లు) బండికంటి కడకమ్మినేమి.

**దాకొను** (దే.అ.క్రి.) : (దాపు+కొను) సమీపించు.

**దాక్షాయణి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. పార్వతి; 2. రోహిణీ నక్షత్రము; 3. అశ్విన్యాది నక్షత్రము; 4. భూమి.

**దాక్షిణ్యము** (సం.వి.అ.న.) : మొగమోటము.

**దాక్షిణ్యుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) దక్షిణకు తగినవాఁడు. (రూ. దక్షిణ్యుఁడు)

**దాగలి** (దే.వి.) : దాకలి యొక్క రూపాంతరము.

**దాడి** (వై.వి.) : 1. శత్రుజయార్థము దండెత్తి పోవుట; (చూ. జోడఁగి) 2. గడ్డము.

**దాడికాఁడు** (వై.వి.) : వేగులవాఁడు.

**దాడిచేయు** (వై.అ.క్రి.) : దండెత్తు.

**దాడినిమ్మ** (వై.వి.) : దానిమ్మ.

**దాడిమపుష్పకము** (సం.వి.అ.పుం.) : ములుమోదుగు.

**దాడిమము** (సం.వి.అ.పుం,న.) : దానిమ్మ. (రూ.) దాడింబము. (ఇది ఈకారాంత స్త్రీ లింగమునగును.) (పుం.) : ఏలకి.)

**దాడిమ్మ** (వై.వి.) : దానిమ్మ.

**దాడియాడు** (ద్వ.స.క్రి.) : (దాడి + ఆడు) మార్కొను.

**దాఢ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. కోఱపల్లు; 2. సమూహము.

**దాణ** (వై.వి.) : ఉలవలు లోనగు గుఱ్ఱము నాహారము.

**దాణము** (దే.వి.) : సుంకము, శుల్కము.

**దాత** (సం.విణ.) : (ఋ.ఈ.ఋ) ఇచ్చువాఁడు.

**దాతికట్ట** (దే.వి.) : (దాయి + కట్టు) (చూ.) ఉద్ఘనము.

**దాత్యూహము** (సం.వి.అ.పుం.) : 1. కూకురు గుండఁగి; 2. వాన కోయిల.

**దాత్రము** (సం.వి.అ.న.) : కొడవలి, లవిత్రము.

**దాదాపు** (దే.వి.) : (దాపు + దాపు) మిక్కిలి సమీపము.

**దాది** (వై.వి.) : పాలిచ్చి పెంచుతల్లి.

**దాదిలి** (వై.వి.) : పాలిచ్చి పెంచుతల్లి.

**దాదుంగ** (దే.వి.) : (దాయి + దుంగ) (చూ.) ఉద్ఘనము.

**దానము** (సం.వి.అ.న.) : 1. ఈవి; (దశ దానములు : 1. గోదానము, భూదానము, తిలా దానము, హిరణ్య దానము, ఆజ్య దానము, వస్త్ర దానము, ధాన్యదానము, గుడదానము, రౌప్య దానము, లవణదానము. షోడశమహా దానములు:- గోదానము, భూదానము, తిలదానము, హిరణ్యదానము, రత్న దానము, విద్యా దానము, కన్యా దానము, దాసీదానము, శయ్యా దానము, గృహ దానము, అగ్రహార దానము,రథదానము, గజదానము, అశ్వ దానము, ఛాగదానము, మహిషీ దానము) 2. ఏనుఁగు కపోల మదము; 3.పాలనము; 4. ఛేదనము; 5.శుద్ధి; 6. చతురుపాయములలో నొకటి. (ఇది పంచవిధము. తనకుఁగల ధన మంతయు నిచ్చుట, ఎక్కడనేని ధనము తీసికొన్నచో దానికిఁ దానను కూలుఁడై యుండుట, అపూర్వ వస్తువుల నిచ్చుట, ఒకని ధనముఁ బుచ్చుకొనఁ బ్రవర్తింపఁ జేయుట, అప్పు తీర్చుట అని. చూ. ఉపాయము.)

**దానవారి** (సం.వి.ఇ.పుం.) : దేవత, వేల్పు.

**దానవుఁడు** (సం.వి.అ.పుం.) : దనుజుఁడు, తొలువేల్పు.

**దానశౌండుఁడు** (సం.విణ.) : (అ.ఆ. అ.) మిక్కిలి యీవికాఁడు, వదాన్యుఁడు.

**దానిమ్మ** (వై.వి.) : దాడిమము.

**దాపనము** (సం.వి.అ.న.) : దండుగ గొనుట.

**దాపరము** (దే.వి.) : ప్రాప్తి.

**దాపరించే** (దే.అ.క్రి.) : ప్రాప్తించు.

**దాపల** (దే.వి.) : డాపల, ఎడమ భాగము. (డాపల యొక్క రూపాంతరము)

**దాపలించు** (దే.అ.క్రి.) : డాపలించు యొక్క రూపాంతరము.

**దాపించు** (దే.అ.క్రి.) : సమీపించు.

**దాపితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) దండుగ గొనఁబడిన వాఁడు, సాధితుఁడు.

**దాపు** (దే.వి.) : 1. సమీపము; 2. భయము.

**దాపురమగు** (దే.అ.క్రి.) : (దాపురము + అగు) ప్రాప్తించు.

**దాపురము** (దే.వి.) : ప్రాప్తి.

**దాప్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) దండుగ గొనఁదగినది.

**దామని** (సం.వి.ఈ.స్త్రీ.) : దామెనత్రాడు.

**దామము** (సం.వి.న్.పుం,న.) : (పసులఁ గట్టెడు) 1. తలుగు; 2. హారము.

**దామర** (దే.వి.) : 1. ఉరిత్రాడు; 2. మండలాకార కుష్ఠము.

**దామెన** (వై.వి.) : పెక్కు తలుగులు గల నిడివి త్రాడు.

**దామోదరుఁడు** (సం.వి.అ.పుం.) : విష్ణువు, వెన్నుఁడు.

**దాయ** (దే.వి.) : 1. జ్ఞాతి; 2. శత్రువు.

**దాయఁగట్టు** (దే.స.క్రి.) : (దాయ౯ + కట్టు) (చూ.) ఉఱ్ఱుకట్టు.

**దాయకుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఇచ్చువాఁడు.

**దాయము** (ఉభ.దే.వి.) : 1. పాచికలు గవ్వలు మొదలైన వానియందలి పందెము. 2. గవ్వ లాట; 3. విపత్తు. 1. పంచుకొనఁదగిన తండ్రి సొత్తు; 2.ఈవి; 3.అరణము; 4. కట్నము; 5. ఉల్లకుట్టుమాట.

**దాయాదుఁడు** (సం.వి.అ.పుం.) : 1. జ్ఞాతి; 2. పుత్రుడు.

**దాయి** (ఉభ.దే.వి.) : (చూ.) దాకలి.ఇచ్చువాఁడు.

**దాయు** (దే.అ.క్రి.) : డాయు, సమీపించు.

**దార** (ఉభ.వై.వి.) : 1.నీటిచాలు; 2. దానము. 3.క్రమము. అగ్నిసాక్షిగా పెండ్లాడిన పెండ్లాము.

**దారకుఁడు** (సం.వి.అ.పుం.) : 1. బాలకుఁడు; 2. కృష్ణుని సారథి. (విణ.) : చీల్చువాఁడు.

**దారణ** (వై.వి.) : వెల, క్రయము.

**దారణము** (సం.వి.అ.న.) : చీల్చుట.

**దారదము** (సం.వి.అ.పుం.) : 1. విషభేదము; 2. పాదరసము; 3. ఇంగువ.

**దారబందము** (వై.వి.) : ద్వారబంధము.

**దారము** (దే.వి.) : నూలిత్రాడు.

**దారి** (వై.వి.) : మార్గము. (విణ.) : ధరించు వాఁడు. (జడదారి. మొ.)

**దారించే** (సం.స.క్రి.) : చీల్చు.

**దారితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చీల్పఁ బడినది.

**దారిద్ర్యము** (సం.విణ.అ.న.) : బీదతనము.

**దారుకీటము** (సం.వి.అ.పుం.) : (చూ.) ఘుణము.

**దారుణము** (సం.వి.అ.పుం.) : భయానకరము. (విణ.) : భయంకరము.

**దారున** (దే.ద్ర.క్రి.) : తటాలున.

**దారువు** (సం.వి.ఉ.న.) : 1. కొయ్య; 2. దేవదారువు; 3. ఇత్తడి.

**దారుహరిద్ర** (సం.వి.ఆ.స్త్రీ.) : మ్రానిపసుపు.

**దారుహస్తకము** (సం.వి.అ.పుం.) : కొయ్యతెడ్డు.

**దారోగా** (హిం.వి.) : పైయధికారి.

**దార్ఢ్యము** (సం.వి.అ.న.) : దిటవు.

**దార్వాఘాటము** (సం.వి.అ.పుం.) : వడ్రంగిపిట్ట.

**దార్వి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. మ్రాని పసుపు; 2. బెండ.

**దార్వీక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. బెండ; 2. మ్రాని పసుపున వండిన అంజన విశేషము.

**దాలి** (దే.వి.) : పాలు కాఁచుట లోనగు వానికిఁ బేర్చిన పిడకల ప్రోగు.

**దాల్చిని** (హిం.వి.) : సుగంధద్రవ్య విశేషము.

**దావ** (దే.వి.) : తగవు. (ఇది విచార్యము.)

**దావంతము** (దే.వి.) : దుఃఖము.

**దావము** (సం.వి.అ.పుం.) : 1. అడవి; 2. కారుచిచ్చు.

**దావరడంగి** (దే.వి.) : డావరడంగి యొక్క రూపాంతరము.

**దావరి** (దే.విణ.) : వీరుఁడు.

**దావరీఁడు** (దే.విణ.) : (దావరి + ఈఁడు) దావరి (స్వార్థమున ఈఁడు)

**దావా** (హిం.వి.) : వ్యాజ్యము.

**దావికము** (సం.విణ.) : (అ.ఆ.అ.) దేవికా నది యందుఁ బుట్టినది.

**దాశపురము** (సం.వి.అ.న. ) : కయివడి ముస్తె.

**దాశార్హుఁడు** (సం.వి.అ.పుం.) : హరి, వెన్నుఁడు.

**దాసనము** (దే.వి.) : జప.

**దాసరయ్య** (వై.వి.) : (దాసరి+అయ్య) తాఁబేలు.

**దాసరి** (వై.వి.) : విష్ణుసేవకుఁడైన శూద్రుఁడు.

**దాసరికొయ్య** (ద్వ.వి.) : మత్స్య విశేషము. (చూ. కొరద.)

**దాసరిగాఁడు** (ద్వ.వి.) : (దాసరి + కాఁడు) తాఁబేలు.

**దాసరిపాము** (ద్వ.వి.) : సర్పవిశేషము.

**దాసి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. వెలకుఁగొన్న పనికత్తె; 2. కాకి దొండ; 3. నల్లగోరంట.

**దాసుఁడు** (సం.వి.అ.పుం.) : 1.వెలకుఁగొన్న పనివాఁడు; 2.శూద్రుఁడు; 3.జ్ఞాని; 4.చేఁపలఁ బట్టువాడు.(ఈ యర్థముననిది శకారోపథము నగు.)

**దాసేయుఁడు** (సం.వి.అ.పుం.) : పనివాఁడు. (విణ.) : దాసికిఁ బుట్టినవాఁడు.

**దాసేరుఁడు** (సం.వి.అ.పుం.) : పనివాఁడు. (విణ.) : దాసికిఁ బుట్టినవాఁడు.

**దాస్యము** (సం.వి.అ.న.) : సేవ, పని.

**దాహకుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) కాల్చువాఁడు.

**దాహము** (సం.వి.అ.పుం.) : 1. కాలుట; 2. దప్పి.

**దాహరి** (వై.వి.) : దాసరి యొక్క రూపాంతరము.

**దాళా** (యు.దే.వి.) : పడియొక్క హెచ్చు తక్కువ. (వై.) : (నెయ్యినూనె మొదలగునవి తీయు పాత్రములను గాని అవి యుంచియున్న పాత్రములను గాని) సరియెత్తు ఊలను దడతట్ట నుంచి తూచుట.

**దాళి** (సం.వి.ఈ.స్త్రీ.) : సెనగలు లోనగువాని పప్పు.

**దాళిమ్మ** (వై.వి.) : దాడిమ్మ యొక్క రూపాంతరము.

**దాళీకుఁడు** (దే.విణ.) : కార్యకర్త.

**దాళు** (దే.వి.) : వర్ణలేశము.

**దాళువ** (వై.వి.) : దౌడ.

**దాళువా** (దే.వి.) : శరదృతువు మొదలు కొని నీరాసరాను పండెడు పల్లపుపంట.



**ది** (దే.అప.) : సంబంధమును దెలుపునది. (నాది, నీది, వానిది, వీనిది. మొ.)

**దించు** (దే.ప్రే.) : దిగఁజేయు.

**దింటెన** (దే.వి.) : గిరికర్ణి.

**దిండీఁడు** (దే.వి.) : (దిండు + ఈఁడు) కాసెకట్టినవాఁడు.

**దిండు** (దే.వి.) : 1. నిడుపాటి గుండ్రపు తలగడ; 2. నిడుపాటి గుండ్రపు తలగడ వలె చెక్కఁబడిన మ్రాను; (గుంటక దిండు, గొర్తిదిండు, పాపనపు దిండు. మొ.) 3. మెఱుఁగు బిళ్ల లోనగునవి యంటించెడు ఊళ్లపనివాని సాన తిరుగుడు కొయ్య; 4. దట్టి.

**దిందిం** (దే.వి.) : దిమిదిమి యొక్క రూపాంతరము.

**దింపు** (దే.వి.) : వ్రేలుట, లంబనము.

**దింపులువోవు** (దే.అ.క్రి.) : (దింపులు + పోవు) వ్రేలాడు.

**దిక్కమొగములు** (వై.విణ.) : భయము చేత దిక్కున కొకరుగా పాఱినవారు.

**దిక్కామొగములు** (వై.విణ.బ.) : దిక్క మొగములు యొక్క రూపాంతరము.

**దిక్కు** (సం.వి.శ్.స్త్రీ.) : 1. దిశ; 2. శరణము.

**దిగ** (దే.అప.) : దిగువశబ్దమునకు వృత్తియందు ఆదేశముగా వచ్చిన రూపము. (వృత్తియందు ఇది అర్థ విశేషముల నిచ్చుచున్నది. దిగఁబోఁత. (వి.) : దిగువకు వ్యాపించుట. (వానికి చెమట ఎగఁబోఁతలు దిగఁబోతలుగా నున్నది.) దిగరోఁజు. (వి.) : కుట్టూపిరి. (వాఁడు ఎగరోఁజు దిగరోఁజులుగా పరుగెత్తుచున్నాఁడు) ఇత్యాదులు.

**దిగంబరుఁడు** (సం.వి.అ.పుం.) : 1. శివుఁడు; 2. భైరవుఁడు. (విణ.) : దిసమొలవాఁడు.

**దిగఁదీయు** (దే.స.క్రి.) : దిగఁదుడుచు.

**దిగఁదుడుచే** (దే.స.క్రి.) : (దిగన్ + తుడుచు) (దృష్టిదోషము మొదలైనవానికి ఉప్పు మిరపకాయ లోనగువాని) చుట్టివేయు.

**దిగఁదుడుపు** (దే.వి.) : దిగఁదుడుచుట. (చూ. దిగఁదుడుచు.)

**దిగఁద్రావు** (దే.అ.క్రి.) : (దిగఁ + త్రావు) దిగు. (స.క్రి.) : విడుచు.

**దిగఁబడు** (ద్వ.అ.క్రి.) : (దిగఁ+పడు) 1. దిగు; 2. అడఁగు; 3. జాఱు.

**దిగదిగ** (దే.వి.) : వచ్చుట పోవుట విసరుట మెఱయుట లోనగువాని యందగుననుకరణము.

**దిగనాడు** (దే.స.క్రి.) : (దిగఁ + ఆడు) విడుచు.

**దిగవిడుచు** (దే.స.క్రి.) : (దిగఁ + విడుచు) విడుచు.

**దిగసన** (దే.ద్ర.క్రి.విణ.) : దిగువగా.

**దిగు** (దే.అ.క్రి.) : 1.మీదనుండి క్రిందికి వచ్చు; 2. దిగుమతియగు; 3. ప్రయాణమై పోవునపుడు దారిలో విడియు; 4. దిగఁబడు.

**దిగుచే** (దే.ప్రే.) : దించు.

**దిగుడు** (దే.విణ.) : 1.ఆనతము; (నేల ఎగుడు దిగుడుగా నున్నది.) 2.తక్కువ. (చూ. దిగ్గుడు.)

**దిగుదల** (ద్వ.వి) : (దిగుడు+తల) క్రిందిభాగము.

**దిగుమతి** (దే.వి.) : (ఓడలోనున్న సరకును రేపు నందు) దించుట.

**దిగులు** (దే.వి.) : గుండెయదరు.

**దిగులుపడు** (ద్వ.అ.క్రి.) : దిగులొందు.

**దిగులుపాటు** (ద్వ.వి.) : దిగులుపడుట.

**దిగువ** (దే.వి.) : క్రిందు.

**దిగువాటు** (ద్వ.వి.) : (దిడుగు + పాటు) దిగువ.

**దిగువాయి** (దే.విణ.) : తక్కువ.

**దిగువాఱు** (దే.అ.క్రి.) : (దిగుడు + పాఱు) 1. మీఁద నుండి క్రిందికి పడు; 2. ఆకఱు.

**దిగ్గన** (దే.ద్ర.క్రి.విణ.) : తటాలున.

**దగ్గనాడు** (దే.స.క్రి.) : దిగనాడు యొక్క రూపాంతరము.

**దిగ్గియ** (వై.వి.) : డిగ్గియ యొక్క రూపాంతరము. (చూ. గెడ రెండవ యర్థము నుదాహరణము)

**దిగ్గు** (దే.స.క్రి.) : దిగు యొక్క రూపాంతరము. (వి.) : భయము నందగు ననుకరణము.

**దిగ్గుడు** (దే.విణ.) : దిగుడు యొక్క రూపాంతరము. (తక్కువకు.)

**దిగ్గున** (దే.ద్ర.క్రి.విణ.) : దిగ్గన యొక్క రూపాంతరము.

**దిగ్గురను** (దే.అ.క్రి.) : (దిగ్గు + అను) భయముచే హృదయము దిగ్గుమను. (సంధి యందు వర్ణాధిక్యము)

**దిగ్గోలు** (దే.వి.) : కోయు పయిరునకు ముందు పయిరు.

**దిగ్ధము** (సం.వి.అ.పుం.) : విషము పూసిన బాణము. (విణ.) : పూయఁబడినది.

**దిగ్బంధము** (సం.వి.అ.పుం.) : 1. మంత్రముచే కట్టెడు దిక్కులకట్టు; 2. సాలెపురుగు.

**దిగ్భ్రమము** (సం.వి.అ.పుం.) : దిక్కుల తబ్బిబ్బు. (వాస్తవార్థము ఇదిగా నుండినను వాడుక యందు భ్రమ పర్యాయముగానే కానఁబడుచున్నది.)

**దిచ్చేరి** (వై.వి.) : వ్యభిచారిణి.

**దిచ్చుమొగము** (ద్వ.విణ.) : అదృశ్యము.

**దిట** (వై.వి.) : దార్ఢ్యము, శక్తి.

**దిటము** (వై.వి.) : ధైర్యము. (విణ.) : దృఢము.

**దిటవు** (వై.వి.) : దార్ఢ్యము. (విణ.) : దృఢము.

**దిట్ట** (వై.వి.) : దార్ఢ్యము, శక్తి. (చూ. తెవులుపడు.) 1.దార్ఢ్యము గలవాఁడు; 2.ధైర్యము గలవాఁడు; 3. సామర్థ్యము గలవాఁడు.

**దిట్టఁడు** (వై.విణ.) : ధైర్యముగల వాఁడు.

**దిట్టము** (వై.వి.) : నిర్ణయము, చిక్కఁబట్టు.

**దిడ్డి** (దే.వి.) : 1.గవనిలోనగువాని ప్రక్క నుండు చిన్నవాకిలి; 2. చిన్న వాకిలి.

**దితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నఱుకఁబడినది.

**దితి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. అసురులతల్లి; 2. నఱుకుడు.

**దితిసుతుఁడు** (సం.వి.అ.పుం.) : దితికొడుకు, దైత్యుఁడు.

**దిద్దు** (దే.స.క్రి.) : 1. శిక్షించు; 2. సవరించు. (ఇక్కడ సవరించుట అనఁగా అలుకుట. ఇట్లు సందర్భానుసారముగా అక్కడక్కడ నర్థము నూహించునది.)

**దిద్దుగడ** (దే.వి.) : దిద్దుపాటు.

**దిద్దుడు** (దే.వి.) : దిద్దుపాటు.

**దిద్దుపాటు** (ద్వ.వి.) : 1. సవరించుట; 2. శిక్షించుట.

**దిద్దుబడి** (దే.వి.) : దిద్దుపాటు.

**దిదృక్ష** (సం.వి.ఆ.స్త్రీ.) : చూడనిచ్ఛ.

**దిదృక్షువు** (సం.విణ.ఉ.) : చూడనిచ్ఛ గలవాఁడు.

**దిధిక్ష** (వి.ఆ.స్త్రీ.) : కాలువనిచ్ఛ.

**దిధిషువు** (సం.వి.ఊ.స్త్రీ.) : మాఱు మనువుది. (ఉ.పుం.) : మాఱు మనువు దానిమగఁడు.

**దినకరుఁడు** (సం.వి.అ.పుం.) : సూర్యుఁడు.

**దినబత్తెము** (మి.గ్రా.వి.) : (దినము + బత్తెము) దినదినము నిచ్చెడు బత్తెము.

**దినము** (సం.వి.అ.న.) : దివసము, పగలు. (దిన భాగములు పదునేను : రౌద్రము, శ్వేతము, మైత్రము, శారభటము, సావిత్రము, విజయము, గాంధర్వము, కుతపము, రౌహిణే యము, విరంచము, సోమము, నిర్మృతి, మహేంద్రము, వరుణము, భటము)

**దినవెచ్చెము** (మి.గ్రా.వి.) : (దినము + వెచ్చము) దినదినము జరగెడు వెచ్చము.

**దినసరి** (దే.వి.) : 1. సస్య విశేషము; 2. (బ.): ధాన్య విశేషము.

**దినాంతము** (సం.వి.అ.పుం.) : సాయంకాలము, మాపు.

**దినారి** (వై.వి.) : (చూ.) దీనారము. (ఇక్కడ దినారిశబ్దమునకు పైఁడి మాత్రమర్థము)

**దినుసు** (దే.వి.) : 1. ప్రకారము; 2. వస్తువు. (చూ. దినుస్సు)

**దినుస్సు** (దే.వి.) : దినుసు యొక్క రూపాంతరము. (వస్తువునకు.)

**దిన్న** (దే.వి.) : వృక్షవిశేషము. (జిన్న యొక్క రూపాంతరము)

**దిబ్బ** (వై.వి.) : 1. ఉన్నత భూమి; 2. కుప్ప.

**దిబ్బడము** (దే.వి.) : దబ్బడము యొక్క రూపాంతరము.

**దిబ్బెము** (వై.వి.) : దీపము.

**దిమాకు** (హిం.వి.) : గర్వము, అధికారము.

**దిమిదిమి** (దే.వి.) : మద్దెల మ్రోత యందగు ధ్వన్యనుకరణము.

**దిమ్మ** (వై.వి.) : 1. దిబ్బ, కుప్ప; 2. భ్రమము.

**దిమ్మరి** (వై.విణ.) : (దిమ్ము + అరి) 1.భ్రమ కలవాఁడు, భ్రమ కలది; 2.మత్తు కలవాఁడు, మత్తుకలది.

**దిమ్మరీఁడు** (వై.విణ.) : (దిమ్మరి+ఈఁడు) మత్తు కలవాఁడు. (స్వార్థమున ఈఁడు.)

**దిమ్మిస** (దే.వి.) : నేలచదును.

**దిమ్ము** (యు.దే.వి.) : సమూహము. (వై.) : 1. భ్రమము; 2. మత్తు. (చూ. దిమ్మరి.)

**దిమ్మువట్టు** (ద్వ.అ.క్రి.) : (దిమ్ము + పట్టు) 1.భ్రమ గొను; 2.మత్తు గొను. (వీనికి తలదిమ్ము పట్టినది.)

**దిమ్మె** (దే.వి.) :1.తామరపువ్వులోని దుద్దు; 2.కొయ్యబిరడ; 3.రాళ్లు లోనగు వానితో నేర్పఱచిన చిన్న మిట్ట.

**దిమ్మెస** (దే.వి.) : కాసెవాని ఒక కొఱముట్టు.

**దిరదిర** (దే.వి.) : తిరుగుట యందగు ననుకరణము.

**దిరిసెనము** (వై.వి.) : (చూ.) గిరిసెనము.

**దిరిసెము** (వై.వి.) : దిరిసెనము యొక్క రూపాంతరము.

**దిర్దిర** (దే.వి.) : దిరదిర యొక్క రూపాంతరము.

**దిలాసా** (హిం.వి.) : హెచ్చరిక, ధైర్యము.

**దివటీ** (వై.వి.) : ఇనుపసలాకకు గుడ్డలు చుట్టి ముట్టించెడు దీపము. (చూ.) దివ్వటీ.

**దివము** (సం.వి.అ.న.) : 1. ఆకాశము; 2. స్వర్గము; 3. పగలు.

**దివస్పతి** (సం.వి.ఇ.పుం.) : ఇంద్రుఁడు, వేల్పుతేఁడు.

**దివాంధము** (సం.వి.అ.పుం.) : గుడ్లగూబ, ఘూకము.

**దివాకరుఁడు** (సం.వి.అ.పుం.) : సూర్యుఁడు, పగటివేల్పు.

**నింగివడు** (ద్వ.అ.క్రి.) : (నింగి + పడు) అస్తమించు.

**నింగిసిగ** (ద్వ.వి.) : శివుఁడు, వ్యోమకేశుఁడు.

**నించే** (దే.ప్రే.) : నినుచు యొక్క రూపాంతరము, నిండఁజేయు, నిండించు.

**నింట** (దే.వి.) : జలపూరము.

**నిండఁబడు** (ద్వ.అ.క్రి.) : (నిండ౯+పడు) నిండు. (స్వార్థమునపడు.)

**నిండారు** (దే.అ.క్రి.) : (నిండు+ఆరు) నిండు.

**నిండు** (దే.అ.క్రి.) : పూర్ణమగు. (వి.) పూర్ణత. (విణ.) పూర్ణము.

**నిండుకొను** (దే.అ.క్రి.) : నిండు. (ప్రే. నిండు కొలుపు, స్వార్థమునకొను.) (బియ్యము నిండుకొన్నవి, పసుపు నిండుకొన్నది; ఇట్టిచోట్ల నిండుకొనుట యనఁగా అయిపోయినవని యర్థము.)

**నింద** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. దూఱు; 2. అపదూఱు.

**నిందించు** (సం.స.క్రి.) : దూఱు.

**నిందితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) దూఱఁ బడినవాఁడు.

**నింద్యుఁడు** (సం.విణ.) : దూఱఁదగినవాఁడు.

**నింపాది** (దే.విణ.) : (నింపు + ఆది) సమృద్ధము. (కొలనిలో నీళ్లు నింపాదిగానున్నవి.)

**నింపారు** (దే.అ.క్రి.) : నినుపారు యొక్క రూపాంతరము.

**నింపిరి** (దే.వి. మ) : ముఱికి, మలము.

**నింపు** (దే.ప్రే.) : నించు యొక్క రూపాంతరము. (వి.): సమృద్ధి. (నినుపు యొక్క రూపాంతరము.)

**నింబతరువు** (సం.వి.ఉ.పుం.) : వారిజము.

**నింబము** (సం.వి.అ.పుం.) : వేము.

**నికటము** (ఉభ. దే.వి.) : నిర్బంధము. (సం. అ.న.) : సమీపము. (విణ.) : సమీపమైనది.

**నికము** (దే.వి.) : నిక్కము యొక్క రూపాంతరము.

**నికరము** (ఉభ.దే.విణ.) : త్రోపుడు పోఁగా మిగిలినది. (సం.అ.పుం.) : 1. సమూహము; 2.నిధి; (విణ.) : శ్రేష్ఠము.

**నికర్షణము** (సం.వి.అ.న.) : ఇల్లు లోనగువాని వెనుకటి భాగము. పట్టణము చుట్టు వాతిన బయలు. (అని కొందఱు.)

**నికష** (సం.వి.ఆ.స్త్రీ.) : రాక్షసుల తల్లి. (అ.పుం.ము.) : 1. ఒరగల్లు; 2. సాన.

**నికషాత్మజుఁడు** (సం.వి.అ.పుం.) : నిరృతి.

**నికామము** (సం.క్రి.విణ.అ.న.) : యథేచ్ఛము.

**నికాయము** (సం.వి.అ.పుం.) : 1. ఇల్లు; 2. తెగ; 3. లక్ష్యము; 4. ప్రోగు; 5. పరమాత్మ.

**నికాయ్యము** (సం.వి.అ.పుం.) : గృహము. ఇల్లు. (రూ. నీకాయ్యము)

**నికారణము** (సం.వి.అ.న.) : వధము, కొల.

**నికారము** (సం.వి.అ.పుం.) : 1. వంచన; 2. ధాన్యము ప్రోగుచేయుట; 3. దంత నిష్పీడనము వలనఁ గలిగిన ముఖ వికారము లోనగునది.

**నికాశము** (సం.వి.అ.పుం.) : నిశ్చయము. (విణ.) : తుల్యము.

**నికుంచకము** (సం.వి.అ.పుం.) : సోల.

**నికుంజము** (సం.వి.అ.పుం,న.) : పొదరిల్లు.

**నికుంభము** (సం.వి.అ.పుం.) : దంతి. (దు.) : కుంభకర్ణుని కొడుకు.

**నికురుంబము** (సం.వి.అ.న.) : సమూహము, గుమి.

**నికృంతనము** (సం.వి.అ.న.) : ఖండనము, నఱకుడు.

**నికృతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. దూఱఁ బడినది; 2. వంచింపఁబడినది; 3. త్రోపుడు చేయఁబడినది.

**నికృతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. బెదరుమాట; 2. వంచన; 3. త్రోపుడు.

**నికృత్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నఱకఁ బడినది.

**నికృష్టము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అధమము.

**నికేతనము** (సం.వి.అ.న.) : గృహము, ఇల్లు. (రూ. నీకేతనము.)

**నికోచకము** (సం.వి.అ.పుం.) : ఊడుగ.

**నిక్కచ్చి** )దే.వి.) : నిర్బంధము, నికటము. (వాఁడా యప్పునకై నన్ను చాలనిక్కచ్చి చేయుచున్నాఁడు.)

**నిక్కము** (దే.వి.) : 1.నిశ్చయము; 2.యథార్థము; 3. సత్యము; (విణ.) : 1.సత్యమైనది; 2.అన్వర్థము.

**నిక్కల** (దే.వి.) : (నిక్కము + కల) కన్నది యనుభవమునకు తెచ్చెడుకల.

**నిక్కవుడు** (వై.వి.) : నిష్కపటము.

**నిక్కవొడుచు** (దే.అ.క్రి.) : (నిక్కు + అ+ పొడుచు) నిక్కునిలుచు. (మేన వెంద్రుకలు నిక్కవొడిచె.)

**నిక్కాఁక** (దే.వి.) : (నిండు + కాఁక) మిక్కిలి కాఁక.(దేహము నిక్కాఁకగా నున్నది.)

**నిక్కు** (దే.అ.క్రి.) : 1. ఉన్నతమగు; 2. గర్వించు; 3. అతిశయించు; 4. వర్ధిల్లు. (వి.) : 1.ఉన్నతి; 2. గర్వము.

**నిక్కుఁబోతు** (దే.విణ.) : (నిక్కు + పోతు) గర్వ స్వభావము గలవాఁడు.

**నిక్కుడు** (దే.వి.) : ఉన్నతి.

**నిక్కువము** (దే.వి.) : నిక్కము యొక్క రూపాం తరము. (యథార్థమునకు.)

**నిక్కువీనులజక్కి** (దే.వి.) : (చూ. ఉచ్చై శ్రవము) (చూ. తలఁపుమిన్న.)

**నిక్వణము** (సం.వి.అ.పుం.) : వీణ లోనగువాని మ్రోఁత.

**నిక్వాణము** (సం.వి.అ.పుం.) : వీణ లోనగువాని మ్రోఁత.

**నిక్షేపము** (సం.వి.అ.పుం.) : 1. చెప్పి చూపి యుంచిన యిల్లడ; 2. నిధి.

**నిక్షేపించు** (సం.స.క్రి.) : పాఁతు, పూడ్చు.

**నిఖాతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) త్రవ్వ బడినది.

**నిఖిలము** (సం.విణ.) : (అ.ఆ.అ.) సర్వము, ఎల్ల.

**నిగణము** (సం.వి.అ.పుం.) : హోమ ధూమము.

**నిగదము** (సం.వి.అ.పుం.) : స్పష్టముగా చెప్పుట.

**నిగదించు** (సం.స.క్రి.) : స్పష్టముగా చెప్పు.

**నిగనిగ** (దే.వి. మెఱయుట యందగు నను కరణము. (విశేషణమగుచో నిగనిగని = నిగనిగ యను కాంతి గలది.)

**నిగమము** (సం.వి.అ.పుం.) : 1. వేదము; 2. అంగడివాడ; 3. మార్గము; 4. పట్టణము.

**నిగముఁడు** (సం.వి.అ.పుం.) : బేహారి, వణిజుఁడు.

**నిగరణము** (సం.వి.అ.న.) : మ్రింగుట. (పుం.) : కంఠము.

**నిగరము** (ఉభ.వై.విణ.) : శ్రేష్ఠము.

**నిగళము** (సం.వి.అ.పుం,న.) : 1. ఏనుఁగు కాలి సంకెల; 2. సంకెల. (రూ. నిగడము.)

**నిగా** (హిం.వి.) : దృష్టి, విచారణ. (రూ. నిఘా.)

**నిగాదము** (సం.వి.అ.పుం.) : నిగదము యొక్క రూపాంతరము.

**నిగారము** (ఉభ.వై.విణ.) : శ్రేష్ఠము. (నిగరము యొక్క రూపాంతరము.) (సం.వి.అ.పుం.) : మ్రింగుట.

**నిగాళము** (సం.వి.అ.పుం,న.) : గుఱ్ఱపు మెడ సమీపపు చోటు.

**నిగిడారు** (దే.అ.క్రి.) : (నిగిడి+ఆరు) వ్యాపించు. (చూ. ఊఁగాడు.)

**నిగుడు** (దే.అ.క్రి.) : 1. వ్యాపించు; 2. నిక్కు; 3. చాఁగు; 4. పఱఁగు; 5. విజృంభించు; 6. వేగిరపడు; 7. కవియు; 8. చక్కఁబడు; 9. చిప్పిల్లు. (చూ. నివుడు.)

**నిగుడుచే** (దే.ప్రే.) : నిగుడఁజేయు, (రూ. నిగుడ్చు.)

**నిగుడుదెంచే** (దే.అ.క్రి.) : (నిగుడు + తెంచు) నిక్కు. (స్వార్థమున తెంచు.)

**నిగులు** (దే.వి.) : కట్టె నిప్పు మీఁది భస్మము.

**నిగూఢము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మఱుఁగు పుచ్చినది.

**నిగూహనము** (సం.వి.అ.న.) : మఱుఁగు పుచ్చుట.

**నిగ్గడి** (దే.విణ.) : కఠినము.

**నిగ్గు** (దే.అ.క్రి.) : నిర్వహిల్లు. (నాతోసరిగా వాఁడు నిగ్గలేఁడు.) (వి.) : 1.ఉత్కృష్టకాంతి; 2. వర్ణ లేశము. (చూ. ఇంటిపట్టు.) (విణ.) : త్రోపుడు పోఁగా మిగిలినది.

**నిగ్రహము** (సం.వి.అ.పుం.) : 1. త్రోపాట; 2. బెదరు మాట; 3. చెఱ; 4. మేర.

**నిగ్రహించు** (సం.స.క్రి.) : త్రోపాడు.

**నిఘంటువు** (సం.వి.ఉ.పుం.) : పదపదార్థములను తెలియఁజేసెడు గ్రంథము.

**నిఘము** (సం.వి.అ.పుం.) : చదరపు వస్తువు.

**నిఘసము** (సం.వి.అ.పుం.) : భోజనము, కుడుపు.

**నిఘాతిక** (సం.వి.ఆ.స్త్రీ.) : ఇనుమును పెట్టి కొట్టెడి యినుప ముద్ద, దాఁగలి.

**నిఘ్నుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) లోఁకువైన వాఁడు, అధీనుఁడు.

**నిచయము** (సం.వి.అ.పుం.) : సమూహము, గుమి.

**నిచితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పఱపఁబడినది.

**నిచులము** (సం.వి.అ.పుం.) : 1. ఎఱ్ఱ గన్నేరు; 2. కప్పుడు దుప్పటి.

**నిచోళము** (సం.వి.అ.పుం.) : 1. గవుసెన; 2. కప్పుడు దుప్పటి.

**నిచ్చెన** (వై.వి.) : పైకెక్కఁదగిన సాధనము, నిశ్రేణి.

**నిచ్చెనపంజో** (ద్వ.వి.) : దివటీల కమ్ముల మర్చిన నిచ్చెనవంటి సాధనము.

**నిచ్చే** (వై.అవ్య.) : 1. సదా; 2. ప్రత్యహము.

**నిచ్చేయము** (వై.వి.) : నిశ్చయము.

**నిచ్చేలము** (వై.వి.) : నిశ్చయము. (చూ.నిచ్చలు.) (విణ.) : 1. నిశ్చలము; 2. నిర్దోషము; 3. నిరంతరము.

**నిచ్చేలు** (వై.వి.) : నిశ్చయము. అవ్య. సదా.

**నిజము** (సం.వి.అ.న.) : స్వభావము. (విణ.) : 1. తనది; 2. శాశ్వతమైనది.

**నిజాయతీ** (గ్రా.విణ.) : న్యాయమైన, సత్యమైన.

**నిజేమరి** (ద్వ.విణ.) : (నిజము + అరి) సత్యశీలుఁడు.

**నిజేము** (వై.వి.) :1. సత్యవచనము; (నిజము చెప్పుము) 2.నిశ్చయము. (విణ.) : సత్యము; (నిజంబు నిజముగా ననుట.)

**నిటలము** (సం.వి.అ.పుం,న.) : నుదురు, ఫాలము.

**నిటలాక్షుఁడు** (సం.వి.అ.పుం.) : శివుఁడు, ముక్కంటి.

**నిటాలము** (సం.వి.అ.పుం.న.) : నిటలము యొక్క రూపాంతరము.

**నిట్ట** (దే.వి.) : 1.ప్రవాహము; 2.స్తంభము; 3.స్థానము; 4.నిక్కు. (విణ.) : 1.నిక్కినది; 2. సరియైనది. (చూ. నిట్టనిలుచు. మొ.)

**నిట్టకనిలుచు** (దే.అ.క్రి.) : నిట్టనిలుచు. (ఇక్కడ స్వార్థమున కకారాగమమని యెఱుంగునది.)

**నిట్టకనిలువు** (దే.వి.) : సరినిలువు. (రూ. నిట్టక నిల్వు.) (చూ. నిట్టక నిలుచు.)

**నిట్టగ్రమ్ము** (దే.అ.క్రి.) : (నిట్ట + క్రమ్ము) నిట్టవొడుచు.

**నిట్టనిలుచే** (దే.అ.క్రి.) : సరిగా నిలుచు.

**నిట్టనిలుచుండు** (దే.అ.క్రి.) : సరిగా నిలుచుండు.

**నిట్టరాడు** (దే.వి.) : దూలములేని యింటినడిమి పొడువు కంబము, కహోరము.

**నిట్టలము** (దే.విణ.) : ఇట్టలమునకు మొదటి రూపము.

**నిట్టవొడుచు** (దే.అ.క్రి.) : (నిట్ట+పొడుచు) 1. ఉప్పొంగు; 2. రోమాంచితమగు; 3.విజృంభించు.

**నిట్టు** (దే.వి.) : 1. ఉపవాసము; 2. క్షామము. (చూ. నిట్టుపాసము)

**నిట్టుపాసము** (ద్వ.వి.) : (నిట్టు + ఉపాసము) శుష్కోపవాసము.

**నిట్టూరుచు** (ద్వ.అ.క్రి.) : (నిడుద + ఊరుచు) నిట్టూర్పు విడుచు. (రూ. నిట్టూర్చు.)

**నిట్టూరుపు** (ద్వ.వి.) : (నిడుద + ఊరుపు) దీర్ఘనిశ్వాసము, (రూ. నిట్టూర్పు.)

**నిట్ర** (దే.వి.) : నిలువు. (రూ. నిట్రము. కలము అంత నిట్రముగా పట్టుకొనకుము.)

**నిట్రాడు** (దే.వి.) : నిట్టరాడు యొుక్క రూపాంతరము. (చూ. నిట్టకనిలుచు.)

**నిట్రాయి** (దే.వి.) : (నిట్ట+ఱాయి) పొడువుఱాయి.

**నిట్రించు** (దే.స.క్రి.) : నిలువుగానుంచు.

**నిట్రిల్లు** (దే.అ.క్రి.) : ఉపవాసముండు.

**నిట్రు** (దే.వి.) : ఉపవాసము. (విణ.) : శుష్కము. (చూ. నిట్రుపాసము.) (నిట్టుయొుక్క రూపాంతరము.)

**నిట్రుపాసము** (ద్వ.వి.) : (నిట్రు + ఉపాసము) శుష్కోపవాసము.

**నిడివి** (దే.వి.) : ధైర్యము. (విణ.) : దీర్ఘము.

**నిడు** (దే.విణ.) : వృత్తి యందు నిడుద శబ్దమునకు మీఁది వర్ణము లోపిం పఁగా మిగిలిన రూపము. (ఉదా. నిడుమోము, నిడువాలు. మొ.)

**నిడుచేను** (దే.స.క్రి.) : (నిడుద + చను) చాఁగు.

**నిడుద** (దే.విణ.) : నిడుపు, దీర్ఘము.

**నిడుదవెన్ను** (దే.వి.) : సర్పము, దీర్ఘవృష్ఠము.

**నిడుపఁడు** (దే.వి.) : (నిడుపు + అఁడు) సర్పము.

**నిడుపకమ్ములు** (ద్వ.వి.) : (నిడుపు + కమ్ములు) కడపకు నిరుప్రక్కలనుండు నిలువులు.

**నిడుపు** (దే.వి.) : నిడివి. (విణ.) : నిడివియైనది.

**నిడుముస్తె** (ద్వ.వి.) : (నిడుద + ముస్తె) తుంగ.

**నిడువెండ్రుక** (దే.వి.) : (నిడుద + వెండ్రుక) రోమాంచము.

**నిడువెండ్రుకవెట్టు** (దే.అ.క్రి.) : (నిడు వెండ్రుక + పెట్టు) (చూ. నిట్టవొడుచు)

**నితంబము** (సం.వి.అ.పుం.) : 1.పిఱుఁదు; 2.మొల; 3.కొండనడుము; 4.మూఁపు; 5.దరి.

**నితంబిని** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. గొప్ప పిఱుఁదులు గల ఆఁడుది; 2. ఆఁడుది.

**నితాంతము** (సం.క్రి.విణ.అ.న.) : పెల్లు. (విణ.) : అధికము.

**నిత్తెమల్లె** (వై.వి.) : మల్లికావిశేషము.

**నిత్యము** (సం.క్రి.విణ.అ.న.) : ఎల్లప్పుడు. (విణ.) : ఎడతెగనిది.

**నిదర్శనము** సం.వి.అ.న. దృష్టాంతము. (పుం.) ఒక యర్థాలంకారము (చూ. అలంకారము.)

**నిదాఘము** (సం.వి.అ.పుం.) : 1. వేసఁగి; 2. వేఁడిమి; 3. చెమట.

**నిదానము** (ఉభ.వై.వి.) : ఆత్రపడక విచారించుట. (వాని యోగ్యత నిదానముమీఁద తెలియును.) (సం.అ. న.) : 1. ఆది కారణము; 2. పెయ్య పలుపు; 3. రోగనిర్ణయము (చూ. స్కంధము.)

**నిదానించు** (వై.అ.క్రి.) : ఆత్రపడక విచారించు. (నిదానించకకాని గుణాగుణములు తెలియవు.)

**నిదిగ్ధము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పెంపఁబడినది.

**నిదిగ్ధిక** (సం.వి.ఆ.స్త్రీ.) : వాఁకుడు.

**నిదిధ్యాసనము** (సం.వి.అ.న.) : మఱిమఱి తలఁచుట.

**నిదుర** (వై.వి.) : నిద్ర.

**నిదురపోతు** (ద్వ.విణ.) : నిదురపోవు స్వభావము కలవాఁడు నిద్రాళువు.

**నిదురవోవు** (ద్వ.అ.క్రి.) : (నిదుర + పోవు) నిదురించు.

**నిదురించు** (వై.అ.క్రి.) : నిద్రించు.

**నిదేశము** (సం.వి.అ.పుం.) : 1. పనుపు; 2. చెప్పుట; 3. దాపు.

**నిదిష్ట** (సం.విణ.) : (ఋ.ఈ.ఋ.) ఆజ్ఞాపించువాఁడు.

**నిద్ధము** (వై.విణ.) : 1. నునుపు గలది; 2. స్నేహము గలది.

**నిద్దా** (వై.విణ.) : నునుపుగలది. (నిద్దము యొుక్క రూపాంతరము.)

**నిద్దుర** (వై.వి.) : నిదుర యొుక్క రూపాంతరము.

**నిద్దురపోతు** (ద్వ.విణ.) : నిదురపోతు యొుక్క రూపాంతరము.

**నిద్దురపోవు** (ద్వ.అ.క్రి.) : నిదురవోవు యొుక్క రూపాంతరము.

**నిద్ర** (సం.వి.ఆ.స్త్రీ.) : నిదుర.

**నిద్రపోవు** (మి.అ.క్రి.) : నిద్రచేయు.

**నిద్రాణుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) నిదురపోతు.

**నిద్రాళువు** (సం.విణ.ఉ.) : (అ.ఆ.అ.) నిదురపోతు.

**నిద్రించు** (సం.అ.క్రి.) : నిద్రపోవు.

**నిద్రిల్లు** (సం.అ.క్రి.) : నిద్రించు. (రూ. నిద్రిలు. చూ. త్రుట్టై.)

**నిధనము** (సం.వి.అ.న.) : కులము. (పుం,న.): 1. చావు; 2. చేటు.

**నిధానము** (సం.వి.అ.న.) : 1. ఉంచుట; 2. పాఁతఱ.

**నిధి** (సం.వి.ఇ.పుం.) : పాఁతఱ. (నవనిధులు. పద్మము, మహాపద్మము, శంఖము, మకరము, కచ్ఛపము, ముకుందము, కుందము, నీలము, వరము.)

**నిధువనము** (సం.వి.అ.న.) : 1. కలయిక; 2. వడఁకు.

**నిధ్యానము** (సం.వి.అ.న.) : దర్శనము, చూపు.

**నినదము** (సం.వి.అ.పుం.) : ధ్వని, మ్రోఁత.

**నినాదము** (సం.వి.అ.పుం.) : నినదము యొక్క రూపాంతరము.

**నినుచే** (దే.ప్రే.) : నించు యొక్క రూపాంతరము.

**నినుపారు** (దే.అ.క్రి.) : (నినుపు + ఆరు) పూర్ణమగు.

**నినుపు** (దే.వి.) : నింపు యొక్క రూపాంతరము. (వృత్తియందు అంత్యవర్ణమునకు లోపము.)

**నిన్న** (దే.వి.) : (నిరు + నాడు) కడచిన దినము.

**నిపఠము** (సం.వి.అ.పుం.) : పాఠము, చదువు.

**నిపతించే** (సం.స.క్రి.) : నిపాతముచేయు.

**నిపము** (సం.వి.అ.పుం.) : కుండ, కలశము.

**నిపాఠము** (సం.వి.అ.పుం.) : నిపఠము యొక్క రూపాంతరము.

**నిపాతనము** (సం.వి.అ.న.) : దిగద్రొబ్బుట.

**నిపాతము** (సం.వి.అ.పుం.) : 1. పడుట; 2. (వ్యాకరణము నందు) సాధారణ విధికి సంబంధింపక విధింపఁబడిన శబ్దము; 3. అవ్యయము.

**నిపాతించు** (సం.స.క్రి.) : పడఁద్రోయు.

**నిపానము** (సం.వి.అ.న.) : పసులు లోనగునవి నీళ్లు త్రాగుటకై నూతివద్ద ఱాయిలోనగువానితో నేర్పఱచిన తొట్టి.

**నిపుణుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) నేర్పరి, కుశలుఁడు.

**నిప్పచ్చ** (ద్వ.వి.) : (నిఱు + పచ్చు) నాశము.

**నిప్పచ్చరము** (వై.వి.) : దారిద్ర్యము. (విణ.) : శూన్యము.

**నిప్పటి** (దే.వి.) : నిప్పట్టు యొక్క రూపాంతరము.

**నిప్పట్టు** (దే.వి.) : (నిప్పు + అట్టు) ఆకులు మీఁద కప్పి నిప్పులో వేసి కాల్చెడి భక్ష్య విశేషము.

**నిప్పస్తు** (దే.వి.) : (నిఱు+పస్తు) శుష్కోపవాసము.

**నిప్పు** (దే.వి.) : 1. అగ్ని; 2. బ. అగ్నికణము.

**నిప్పుఁదిండి** (దే.వి.) : (నిప్పు+తిండి) పక్షివిశేషము.

**నిప్పుక** (దే.వి.) : 1. అగ్ని; 2. బ. అగ్నికణము.

**నిప్పువన్నెగుత్తులకానుగు** (ద్వ.వి.) : అంగారవల్లరి.

**నిబంధనము** (సం.వి.అ.న.) : 1.ఏర్పాటు; 2.బంధము; 3. (చూ.) ఉపనాహము; 4. హేతువు. (విణ.) : కూర్పఁబడ్డది.

**నిబంధము** (సం.వి.అ.పుం.) : 1.మల మూత్రబంధము; 2.బంధము; 3.వర్షాశనము మొదలైనది.

**నిబంధించు** (సం.స.క్రి.) : 1.బంధించు; 2. అడ్డగించు.

**నిబద్ది** (వై.విణ.) : నిజము, సత్యము. (వానిమాట నిబద్దిగా ఎంచఁగూడదు.)

**నిబద్దించు** (వై.స.క్రి.) : నిజపఱచు.

**నిబద్దిలించే** (వై.స.క్రి.) : నిబద్దించు యొక్క రూపాంతరము.

**నిబద్ధము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. బంధింపఁ బడినది; 2. అడ్డగింపఁబడినది.

**నిబర్హణము** (సం.వి.అ.న.) : వధము, చంపుట.

**నిబర్హితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చంపఁ బడినది.

**నిబిడము** (సం.విణ.) : (అ.ఆ.అ.) సాంద్రము, దట్టము.

**నిబిడీకరించే** (సం.అ.క్రి.) : దట్టముచేయు.

**నిబిడీకృతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నిబిడ ముగాఁ జేయఁబడినది.

**నిబిరీసము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నిబిడము.

**నిబోధనము** (సం.వి.అ.న.) : చూపు, ఆలోకనము.

**నిబ్బద్ది** (వై.విణ.) : నిబద్ధి యొక్క రూపాంతరము.

**నిబ్బరము** (వై.వి.) : అశ్వగతి విశేషము (చూ.) ప్లుతము. (క్రి.విణ.) : పెల్లు. (విణ.) : అధికము. (చూ.గొబ.)

**నిబ్బరించు** (వై.అ.క్రి.) : 1. అతిశయించు; 2. నిదానించు.

**నిబ్బరికము** (దే.వి.) : కరుణ.

**నిబ్బరికించే** (యు.దే.అ.క్రి.) : కరుణించు. (వై.) : ఉప్పొంగు.

**నిభము** (సం.వి.అ.పుం.) : నెపము. (విణ.) : సమానము.

**నిభాయించు** (హిం.క్రి.) : సహించు, తాళు.

**నిభృతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) తీర్పఁ బడినది.

**నిమంత్రణము** (సం.వి.అ.న.) : శ్రాద్ధ భోజనాదుల యందు తగినవారిని నియమించుట.

**నిమంత్రించు** (సం.స.క్రి.) : శ్రాద్ధ భోజనాదుల యందు తగిన వారిని నియమించు.

**నిమంత్రితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) నిమంత్రింపఁబడిన వాఁడు.

**నిమజ్జనము** (సం.వి.అ.న.) : మజ్జనము, స్నానము.

**నిమటాయి** (దే.వి.) : ఒక దినుసుతీఁగ.

**నిమాజు** (హిం.వి.) : ప్రార్థన, పూజ. (రూ. నమాజు.)

**నిమయము** (సం. వి. అ. పుం.) : (వస్తువుల) మాఱుపు.

**నిమితకాఁడు** (ద్వ.వి.) : (నిమితము + కాఁడు) బరువుమోసెడు పనివాఁడు. (చూ. కామాటము.)

**నిమితము** (వై.వి.) : నియమనము. (చూ. నిమితకాఁడు.)

**నిమిత్తము** (సం. వి. అ. న.) : 1. కారణము; 2. శకునము; 3. గుఱి; 4. గుఱుతు.

**నిమిషము** (సం.వి.అ.పుం.) : 1. ఱెప్ప వేయుట; 2. ఱెప్పవేయునంతకాలము.

**నిమీలనము** (సం.వి.అ.న.) : 1. కనుమూయుట; 2. చావు.

**నిముకళా** (దే.వి.) : (నిమురు + కళ్లము) 1.కైలు చేసిన కళ్లము నందలి యడుగు ధాన్యము; 2.కొఱఁత.

**నిముకు** (దే.స.క్రి.) : స్తన్యపానము చేయు, కుడుచు.

**నిమురు** (దే.స.క్రి.) : (ప్రేమమున శరీరమును) అల్లన తడవు.

**నిముసము** (వై.వి.) : (చూ.) నిమిషము.

**నిమేషము** (సం.వి.అ.పుం.) : నిమిషము యొక్క రూపాంతరము.

**నిమ్నగ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఏఱు, నది.

**నిమ్నము** (సం.విణ.) : (అ.ఆ.అ.) లోఁతు, గభీరము.

**నిమ్మ** (దే.వి.) : జంబీరము.

**నిమ్మళము** (వై.విణ.) : 1.నిశ్చింతము; 2.స్వస్థము.

**నిమ్మళించు** (వై.అ.క్రి.) : 1. నిశ్చింతమగు; 2. స్వస్థ మగు.

**నియంత** (సం.వి.ఋ.పుం.) : తేరు నడపువాఁడు. (విణ.) : నడపువాఁడు.

**నియంతవ్యుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1.అడ్డగింపఁ దగినవాఁడు; 2.ఆజ్ఞాపింపఁ దగినవాఁడు.

**నియంత్రణ** (సం.వి.ఆ.స్త్రీ.) : అడ్డగింత.

**నియంత్రితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అడ్డగింపఁబడినది.

**నియతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. నియ మము గలది; 2. నిత్య మయినది.

**నియతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. నియమము; 2. భాగ్యము.

**నియమనము** (సం.వి.అ.న.) : నియమించుట, ఏర్పాటు.

**నియమము** (సం.వి.అ.పుం.) : 1. ఏర్పాటు; 2. కట్టు; 3. పసుపు; 4. ప్రతిజ్ఞ; 5. శరీరము కంటె భిన్నములైన మృజ్జలాదులు సాధనముగాఁ గలిగి నిత్యముగా నాచరింపఁదగిన యొక యోగాంగము. (ఇది దశవిధము. తపము, సంతోషము, ఆస్తికత్వము, దానము, భగవ దర్చన, వేదాంత శ్రవణము, లజ్జ, మతి, జపము, వ్రతము. చూ. అంగము.)

**నియమించు** (సం.స.క్రి.) : ఆజ్ఞాపించు, పనుచు.

**నియమితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. నియ మింపఁబడినది; 2. కట్టఁ బడినది.

**నియమ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నియమింపఁదగినది.

**నియాతనము** (సం.వి.అ.న.) : దిగద్రొబ్బుట.

**నియామకుఁడు** (సం.వి.అ.పుం.) : 1. (చూ.) ఆరకాటి; 2. (చూ.) తండేలు. (విణ.) : నియమించువాఁడు.

**నియామము** (సం.వి.అ.పుం.) : నియమము యొక్క రూపాంతరము.

**నియుక్తుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) నియోగిం పఁబడినవాఁడు.

**నియుతము** (సం.వి.అ.న.) : సంఖ్యా విశేషము, లక్ష.

**నియుద్ధము** (సం.వి.అ.న.) : బాహు యుద్ధము.

**నియోక్తవ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నియోగింపఁదగినది.

**నియోగము** (సం.వి.అ.పుం.) : ఆజ్ఞ, పనుపు.

**నియోగి** (సం.విణ.) : (న్.ఈ.న్) నియోగము కలవాఁడు.

**నియోగించే** (సం.స.క్రి.) : ఆజ్ఞాపించు, పనుచు.

**నియోగ్యుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) నియోగింపఁదగినవాఁడు.

**నియోజనము** (సం.వి.అ.న.) : అజ్ఞాపనము, పనుపు.

**నియోజ్యుఁడు** (సం.వి.అ.పుం.) : పనివాఁడు, భృత్యుఁడు.

**నియోద్ధ** (సం.వి.ఋ.పుం.) : బాహు యుద్ధము చేయువాఁడు.

**నియ్యోగి** (వై.వి.) : 1. మంత్రి; 2. ఒక తెగ బ్రాహ్మణుఁడు.

**నిరంకుశ** (సం.వి.ఆ.స్త్రీ.) : జిబిలిక. (విణ.) : అడ్డములేనిది.

**నిరంజన** (సం.వి.ఆ.స్త్రీ.) : పున్నమ. (అ.పుం. ము.) : యజ్ఞమునకుఁ దగిన చిత్రవర్ణ హరిణము. (విణ.) : 1. కాటుక లేనిది; 2. దోషము లేనిది.

**నిరంతరము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. దట్టము; 2. ఎడతెగనిది.

**నిరకు** (హిం.వి.) : అంగడివెల.

**నిరతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మిక్కిలి ఆసక్తికొన్నది.

**నిరతి** (సం.వి.ఇ.స్త్రీ.) : మిక్కిలి ఆసక్తి.

**నిరత్యయము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నాశము లేనిది.

**నిరపరాధుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) అపరాధములేనివాఁడు.

**నిరపాయము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అపాయము లేనిది.

**నిరపేక్షము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అపేక్షలేనిది.

**నిరయము** (సం.వి.అ.పుం.) : దుర్గతి, నరకము.

**నిరర్గళము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అడ్డము లేనిది.

**నిరర్థకము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ప్రయోజనము లేనిది.

**నిరవగ్రహుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) అడ్డ పాటు లేనివాఁడు, స్వతంత్రుఁడు.

**నిరవధికము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మేరలేనిది.

**నిరసనము** (సం.వి.అ.న.) : 1. తిరస్కారము; 2. ఆక్షేపము; 3. వధము; 4. ఉమియుట.

**నిరసించే** (సం.స.క్రి.) : 1. తిరస్కరించు; 2. విడుచు.

**నిరస్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. త్వరితముగాఁ జెప్పఁబడినది; (మాట) 2. తిరస్కరింపఁబడినది; 3. వెడలఁ గ్రక్కఁ బడినది; 4. న్యాయముచే త్రోయఁబడినది; 5. ప్రయోగింపఁబడినది. (బాణము.)

**నిరాకరణము** (సం.వి.అ.న.) : తిరస్కారము.

**నిరాకరిష్ణువు** (సం.విణ.ఉ.) : తిరస్కరించువాఁడు.

**నిరాకారము** (సం.వి.అ.పుం.) : 1. తిరస్కారము; 2. ఆకాశము.

**నిరాకారుఁడు** (సం.వి.అ.పుం.) : 1. విష్ణువు; 2. శివుఁడు; 3. పరమాత్ముఁడు. (విణ.) : ఆకారము లేనివాఁడు.

**నిరాకృతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) న్యాయముచే త్రోయఁబడినది, నిరస్తము.

**నిరాకృతి** (సం.వి.ఇ.స్త్రీ.) : తిరస్కారము. (విణ.): 1. రూపము లేనివాఁడు; 2. వేదము చదువని వాఁడు.

**నిరాఘాటము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. కొలఁదిలేనిది; 2. మేరలేనిది.

**నిరాతంకము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. భయము లేనిది; 2. వ్యాధిలేనిది.

**నిరాపనింద** (మి.గ్రా.వి.) : అపదూఱు.

**నిరాబారి** (వై.వి.) : ముని. (చూ. తబము.)

**నిరామయము** (సం.వి.అ.పుం.) : రోగములేమి. (విణ.) రోగము లేనిది.

**నిరాయాసము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఆయాసములేనిది.

**నిరాయుధము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఆయుధము లేనిది.

**నిరాలంబము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అవలంబము లేనిది.

**నిరాశము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఆశలేనిది.

**నిరాసకము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నిరసించునది.

**నిరాసనము** (సం.వి.అ.న.) : నిరసనము యొక్క రూపాంతరము.

**నిరాహారము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఆహారము లేనిది.

**నిరీక్షణము** (సం.వి.అ.న.) : దర్శనము, చూపు.

**నిరీక్షించే** (సం.స.క్రి.) : దర్శించు, చూపు.

**నిరీక్షితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చూడఁబడినది.

**నిరీషము** (సం.వి.అ.న.) : (చూ.) గొడగ.

**నిరు** (వై.అవ్య.) : గతార్థకము. (నిరుడు, నిన్న, నిప్పచ్చు. మొ.)

**నిరుకడము** (దే.వి.) : ఒకానొక చెట్టు.

**నిరుకళము** (వై.విణ.) : నిరర్గళము.

**నిరుకు** (దే.వి.) : 1. నిర్ణయము; 2. నిర్ణయము చేసిన వెల.

**నిరుక్తము** (సం.వి.అ.న.) : ఒక వేదాంగము. (చూ. అంగము.) (విణ.) : చెప్పఁబడినది.

**నిరుక్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. అర్థ నిర్వచనము; 2. అలంకార విశేషము.

**నిరుడిమావియావు** (దే.వి.) : (నిరుడిమావి + ఆవు) ఒక తూరి యీనిన ఆవు, గృష్టి.

**నిరుడు** (దే.వి.) : (నిరు + ఏఁడు) కడచిన సంవత్సరము.

**నిరుద్ధము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నిరోధింపఁబడినది.

**నిరుపద్రవము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఉపద్రవము లేనిది.

**నిరుపమము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఉపమలేనిది.

**నిరూఢము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ప్రసిద్ధి కెక్కినది.

**నిరూఢి** (సం.వి.ఇ.స్త్రీ.) : ప్రసిద్ధి.

**నిరూపణము** (సం.వి.అ.న.) : 1. అరయిక; 2. చూపు; 3. తార్కాణ.

**నిరూపించే** (సం.స.క్రి.) : నిరూపణము చేయు.

**నిరూపితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నిరూపింపఁబడినది.

**నిరూప్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నిరూపింపఁదగినది.

**నిరూహము** (సం.వి.అ.పుం.) : ముగిసిన వాక్యము. (విణ.) : 1.ఊహ లేనిది; 2. నిశ్చయింపఁబడినది.

**నిరృతి** (సం.వి.ఇ.స్త్రీ.) : పెద్దమ్మ. (పుం.) : 1. దిక్పాల విశేషము; 2. దినము యొక్క పంద్రెండవ భాగము. (చూ. దినము.) (విణ.): ఉపద్రవములేనిది.

**నిరోధము** (సం.వి.అ.పుం.) : 1.అడ్డు; 2.చేటు.

**నిరోధించే** (సం.స.క్రి.) : అడ్డగించు.

**నిర్గంధము** (సం.విణ.) : (అ.ఆ.అ.) గంధము లేనిది.

**నిర్గతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) వెడలఁబడినది.

**నిర్గతి** (సం.వి.ఇ.స్త్రీ.) : వెడలఁబాటు, నిర్గమనము.

**నిర్గమనము** (సం.వి.అ.న.) : వెడలఁబాటు, నిర్గమనము.

**నిర్గమము** (సం.వి.అ.పుం.) : వెడలఁబాటు, నిర్గమనము.

**నిర్గమించే** (సం.అ.క్రి.) : వెడలఁబడు.

**నిర్గళనము** (సం.వి.అ.న.) : వెలికిజాఱుట.

**నిర్గళితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) వెలికి జాఱినది.

**నిర్గుండి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. వావిలి; 2. నల్లవావిలి.

**నిర్గుణుఁడు** (సం.వి.అ.పుం.) : భగవంతుఁడు. (విణ.) : గుణరహితుఁడు.

**నిర్గ్రంథనము** (సం.వి.అ.న.) : వధము, చంపుట.

**నిర్గ్రంథుఁడు** (సం.వి.అ.పుం.) : 1. దిసమొల వాఁడు; 2. బీదవాఁడు; 3. మూర్ఖుఁడు.

**నిర్ఘటము** (సం.వి.అ.న.) : బహుజన సమ్మర్దముగల అంగడి. (విణ.) : ఘటములేనిది.

**నిర్ఘాతము** (సం.వి.అ.పుం.) : 1. పిడుగు; 2. వజ్రము.

**నిర్ఘృణుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) కనికరము లేనివాఁడు.

**నిర్ఘోషము** (సం.వి.అ.పుం.) : ధ్వని, మ్రోఁత.

**నిర్జనము** (సం.విణ.) : (అ.ఆ.అ.) జనములేనిది.

**నిర్జర** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. తిప్పతీఁగ; 2. ముర.

**నిర్జరుఁడు** (సం.వి.అ.పుం.) : దేవత, వేలుపు. (విణ.) : ముదిమి లేనివాఁడు.

**నిర్జలము** (సం.విణ.) : (అ.ఆ.అ.) జలము లేనిది.

**నిర్జించే** (సం.స.క్రి.) : జయించు, గెలుచు.

**నిర్జితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) గెలువఁబడినవాఁడు.

**నిర్జీవుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) జీవము లేనివాఁడు.

**నిర్ఝరము** (సం.వి.అ.పుం.) : సెలయేఱు, ఝరము.

**నిర్ఝరిణి** (సం.వి.ఈ.స్త్రీ.) : ఏఱు, నది, సరిత్తు.

**నిర్ణయము** (సం.వి.అ.పుం.) : ఏర్పాటు.

**నిర్ణయించే** (సం.స.క్రి.) : ఏర్పాటు చేయు.

**నిర్ణాయకుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) నిర్ణయముచేయువాఁడు.

**నిర్ణిక్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కడుగుట లోనగు వానిచేత గరగరికైనది. మృష్టము.

**నిర్ణీతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నిర్ణయింపఁబడినది.

**నిర్ణేజకుడు** (సం.వి.అ.పుం.) : చాకలవాఁడు, రజకుఁడు.

**నిర్ణేత** (సం.విణ.) : (ఋ.ఈ.ఋ.) నిర్ణయము చేయువాఁడు.

**నిర్ణేయము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నిర్ణయముచేయఁదగినది.

**నిర్దగ్ధము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చక్కఁగా కాలినది.

**నిర్దయుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) దయ లేనివాఁడు.

**నిర్దళనము** (సం.వి.అ.న.) : చక్కఁగా భేదించుట.

**నిర్దళితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చక్కఁగా భేదింపఁబడినది.

**నిర్దహనము** (సం.వి.అ.న.) : చక్కఁగా కాలుట.

**నిర్దహించు** (సం.స.క్రి.) : చక్కఁగా కాలుచు.

**నిర్దారణము** (సం.వి.అ.న.) : చక్కఁగా చీల్చుట.

**నిర్దారితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చక్కఁగా చీల్పఁబడినది.

**నిర్దిష్టము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నిర్దేశింపఁ బడినది.

**నిర్దేశము** (సం.వి.అ.పుం.) : 1.ఆజ్ఞ; 2. చెప్పుట; 3. సమీపము.

**నిర్దేశించు** (సం.అ.క్రి.) : ఆజ్ఞాపించు, పనుచు.

**నిర్దేశ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నిర్దేశింపఁ దగినది.

**నిర్దేష్ట** (సం.విణ.) : (ఋ.ఈ.ఋ.) నిర్దేశించు వాఁడు.

**నిర్దోషము** (సం.విణ.) : (అ.ఆ.అ.) దోషము లేనిది.

**నిర్ధనుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ధనము లేనివాఁడు.

**నిర్ధరించే** (సం.స.క్రి.) : నిర్ధారణచేయు.

**నిర్ధారణ** (సం.వి.ఆ.స్త్రీ.) : అ.న.ము. నిశ్చయము.

**నిర్ధారణీయము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నిర్ధరింపఁదగినది.

**నిర్ధారితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నిర్ధరింపఁ బడినది.

**నిర్ధార్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నిర్ధారణీయము.

**నిర్ధార్యుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) దుఃఖాదులు కలిగినను మనోవికార మును చెందక పూనిన పని విడువక చేయువాఁడు.

**నిర్ధూతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విడువఁ బడినది.

**నిర్నిద్రము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1.నిద్ర లేనిది; 2. జాగరూకత కలది.

**నిర్బంధము** (సం.వి.అ.పుం.) : 1. బలాత్కారము; 2. కదలమెదలఁగూడని కట్టు.

**నిర్బంధించే** (సం.స.క్రి.) : నిర్బంధము చేయు.

**నిర్భయము** (సం.విణ.) : (అ.ఆ.అ.) భయము లేనిది.

**నిర్భరము** (సం.క్రి.విణ.అ.న.) : పెల్లు. (విణ.) : అధికము.

**నిర్భర్త్సనము** (సం.వి.అ.న.) 1. అదలుపు; 2. లత్తుక.

**నిర్భర్త్సించే** (సం.స.క్రి.) : అదలించు.

**నిర్భర్త్సితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నిర్భర్త్సింపఁబడినది.

**నిర్భాగ్యుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) భాగ్యము లేనివాఁడు.

**నిర్భిన్నము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చక్కఁగా భేదింపఁ బడినది.

**నిర్మదము** (సం.వి.అ.పుం.) : మదము ఉడిగిన యేనుఁగు. (విణ.) : మదము లేనిది.

**నిర్మలము** (సం.వి.అ.న.) : 1. నిర్మాల్యము; 2. అభ్రకము. (విణ.) : మయిలకానిది.

**నిర్మాణము** (సం.వి.అ.న.) : 1.నిర్మితి; 2. యోగ్యత; 3. సారము.

**నిర్మాత** (సం.విణ.) : (ఋ.ఈ.ఋ.) నిర్మించువాఁడు.

**నిర్మాయి** (సం.విణ.) : (న్.ఈ.న్.) నిర్మించువాఁడు.

**నిర్మాల్యము** (సం.వి.అ.న.) : ధరించి తీసివేసినది.

**నిర్మించే** (సం.స.క్రి.) : నిర్మాణము చేయు, కలుగఁజేయు.

**నిర్మితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నిర్మింపఁ బడినది.

**నిర్మితి** (సం.వి.ఇ.స్త్రీ.) : నిర్మించుట, నిర్మాణము.

**నిర్మిమీష** (సం.వి.ఆ.స్త్రీ.) : నిర్మింపనిచ్ఛ.

**నిర్ముక్తము** (సం.వి.అ.పుం.) : కుబుసము విడిచిన పాము.

**నిర్ముక్తుఁడు** (సం.వి.అ.పుం.) : సంగము విడిచిన సన్యాసి. (విణ.) : సంగము విడిచినవాఁడు.

**నిర్మూలము** (సం.విణ.) : (అ.ఆ.అ.) వేరులేనిది.

**నిర్మూలించు** (సం.స.క్రి.) : 1. వేరు లేనిదిగాఁ జేయు; 2. నాశముచేయు.

**నిర్మృష్టము** (సం.విణ.) : (అ.ఆ.అ.) తుడువఁ బడినది.

**నిర్మోకము** (సం.వి.అ.పుం.) : 1. పాఁప కుబుసము; 2. కుబుసము; 3. విడుపు; 4. ఆకాశము.

**నిర్యంత్రణము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అడ్డము లేనిది.

**నిర్యంత్రితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అడ్డము లేనిదిగా చేయఁబడినది.

**నిర్యాణము** (సం.వి.అ.న.) : 1. ఏనుఁగు కడకన్ను; 2. చావు; 3. ముక్తి; 4. వెడలఁబాటు.

**నిర్యాతనము** (సం.వి.అ.న.) : 1. పగ తీర్చుట; 2. చంపుట; 3. అప్పు లోనగు వానిఁదీర్చుట; 4. దాఁచఁ బెట్టిన సొమ్ము మరల నప్పగించుట; 5. ఈవి.

**నిర్యాతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) వెడలఁ బడినది.

**నిర్యాసము** (సం.వి.అ.పుం.) : మ్రానిబంక.

**నిర్యూహము** (సం.వి.అ.పుం.) : 1. సిగ బంతి; 2. నాగవాసము, గృహదారు విశేషము; (అని కొందఱు.) 3. మ్రాని బంక; 4. వాకిలి.

**నిర్లజ్జము** (సం.విణ.) : (అ.ఆ.అ.) లజ్జలేనిది.

**నిర్వచనము** (సం.వి.అ.న.) : అర్థ వివరణము చేసి చెప్పుట. (విణ.) : మాటలేనిది.

**నిర్వచనీయము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నిర్వచింపఁదగినది.

**నిర్వచించు** (సం.స.క్రి.) : నిర్వచనము చేసి చెప్పు.

**నిర్వపణము** (సం.వి.అ.న.) : దానము, ఈవి.

**నిర్వర్ణనము** (సం.వి.అ.న.) : చూపు, ఆలోకనము.

**నిర్వర్తించు** (సం.ప్రే.) : నిర్వర్తిల్లఁజేయు.

**నిర్వర్తిల్లు** (సం.అ.క్రి.) : నెఱవేఱు.

**నిర్వహణము** (సం.వి.అ.న.) : 1. ప్రస్తుత కథా సంహార రూపమైన యొక నాటక సంధి; (చూ. సంధి.) 2. నిష్ఠ.

**నిర్వహించు** (సం.ప్రే.) : నిర్వహిల్లఁ జేయు.

**నిర్వహిల్లు** (సం.స.క్రి.) : 1. జరుగు; 2. నెఱవేఱు.

**నిర్వాణము** (సం.వి.అ.న.) : 1.ముక్తి; 2.నాశము; 3.సుఖము; 4. ఏనుఁగు నీళ్లలో మునుఁగుట. (విణ.) : 1. చల్లాఱినది; (దీపము నిప్పులోనగు నది.) 2. నీళ్లమునిఁగినది. (ఏనుఁగు.)

**నిర్వాణుఁడు** (సం.వి.అ.పుం.) : 1. పని వాఁడు; 2. బరువుమోసెడి వాఁడు. (విణ.) : 1. ముక్తి నొందినవాఁడు; (ముని.మొ.) 2. శాంతిఁ బొందినది. (వహ్ని. మొ.)

**నిర్వాతము** (సం.వి.అ.పుం.) : చలింపని గాలి. (విణ.) : గాలిలేనిది. (చోటు. మొ.)

**నిర్వాదము** (సం.వి.అ.పుం.) : 1. అపవాదము; 2. వాదములేమి; 3. నిశ్చితవాదము.

**నిర్వాపణము** (సం.వి.అ.న.) : 1.కొల; 2.ఈవి.

**నిర్వాసనము** (సం.వి.అ.న.) : 1. చంపుట; 2. వెళ్లఁగొట్టుట.

**నిర్వాసితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) వెళ్లఁ గొట్టఁబడినది.

**నిర్వాస్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) వెళ్ల గొట్టఁదగినది.

**నిర్వాహకుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) నిర్వహించువాఁడు.

**నిర్వాహము** (సం.వి.అ.పుం.) : 1.శక్తి; 2. జరుగుఁబాటు.

**నిర్వికారుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) వికారము లేనివాఁడు.

**నిర్విఘ్నము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విఘ్నములేనిది.

**నిర్విణ్ణుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) నిర్వేదము నొందినవాఁడు.

**నిర్విశేషము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విశేషములేనిది.

**నిర్విష** (సం.వి.ఆ.స్త్రీ.) : అతివస. (విణ.) : విషములేనిది.

**నిర్విష్టము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. చొరఁ బడినది; 2. పొందఁబడినది; 3. నిలిచినది.

**నిర్వీర్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) వీర్యము లేనిది.

**నిర్వృతము** (సం.వి.అ.న.) : ఇల్లు. (విణ.) : 1. సుఖించినది; 2. నశించినది.

**నిర్వృతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. సుఖము; 2. ఊఱట; 3. నాశము.

**నిర్వృత్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నెఱవేఱినది.

**నిర్వృత్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1.సంతోషము; 2. మోక్షము; 3. నెఱవేఱుట. (విణ.) : వృత్తి లేనిది.

**నిర్వేదము** (సం.వి.అ.పుం.) : తత్త్వ జ్ఞాన దుఃఖే ర్ష్యాదుల చేతc గలుగు హేయత్వబుద్ధి.

**నిర్వేదించు** (సం.అ.క్రి.) : నిర్వేదపడు.

**నిర్వేశము** (సం.వి.అ.పుం.) : 1.కూలి; 2.జీతము; 3. బోగము; 4. మూర్ఛపోవుట.

**నిర్వైరము** (సం.విణ.) : (అ.ఆ.అ.) వైరములేనిది.

**నిర్వ్యధనము** (సం.వి.అ.న.) : రంధ్రము, బెజ్జము.

**నిర్వ్యాజము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నెపము లేనిది.

**నిర్హరణము** (సం.వి.అ.న.) : 1. నిశ్శేషముగా హరించుట; 2. పీనుఁగును కాల్చుట.

**నిర్హ్రాదము** (సం.వి.అ.పుం.) : ధ్వని, మ్రోఁత.

**నిర్హ్రారము** (సం.వి.అ.పుం.) : నాటిన ములికి లోనగువాని నూడcబెఱుకుట, పైరునకు విఘాత మైన గాదము మొదలైన వానిc బెఱుకుట. (అని కొందఱు.)

**నిర్హ్రారి** (సం.విణ.) : (న్.ఈ.న్.) దూరము వ్యాపించు నట్టిది. (పరిమళము.)

**నిర్హృతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఊడc బెఱికినది. (నాటిన ముల్లు లోనగునది.)

**నిర్హృతి** (సం.వి.ఇ.స్త్రీ.) : (చూ.) నిర్హ్రారము.

**నిఱు** (వై.ఉప.) : మిక్కిలి. (నిఱుపేద, నిఱు పేదరాలు. మొ.)

**నిట్టనీలుగు** (దే.అ.క్రి.) : (నీలుగు+నీలుగు) 1. మిక్కిలి నీలుగు; 2. గర్వించు.

**నిలఁబడు** (ద్వ.అ.క్రి.) : నిలువcబడు యొక్క రూపాంతరము. (చూ. నిట్టకనిలుచు.)

**నిలక** (దే.వి.) : నిలుపు. (ఇది నాకు నిలక యియ్యలేదు.)

**నిలయనము** (సం.వి.అ.న.) : (చూ.) కనుమూసి గంతలు.

**నిలింపుడు** (సం.వి.అ.పుం.) : 1. వేలుపు; 2. బోయ.

**నిలయము** (సం.వి.అ.పుం.) : గృహము, ఇల్లు.

**నిలీనము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మిక్కిలి అడఁగినది.

**నిలుకడ** (దే.వి.) : 1.ఉనికి; 2.స్థైర్యము; 3. విరామము. (రూ. నిల్కడ.)

**నిలుగు** (దే.అ.క్రి.) : ఒళ్లువిఱుచుకొను. (వి.) : నిలుగుట. (నీలుగు యొక్క రూపాంతరము.)

**నిలుచే** (దే.అ.క్రి.) : 1. నిలcబడు; 2. ప్రతిష్ఠిత మగు; 3. ఉండు; 4. శేషించు; 5. అడ్డిపడు. (వచ్చునది రాక నిలువదు.) (రూ. నిల్చు. చూ. నిలుపు.)

**నిలుచేండు** (దే.అ.క్రి.) : (నిలిచి + ఉండు) నిలcబడియుండు, (రూ. నిల్చుండు.)

**నిలుచేకొను** (దే.అ.క్రి.) : (నిలిచి + ఉండు) నిలcబడియుండు, (రూ. నిల్చుండు.) (స్వార్థమునకొను.)

**నిలుపు** (దే.ప్రే.) : (నిలువcజేయు.) 1. నిలువc బెట్టు; (వానిని పదిమందిలో నిలిపి విచారణ చేసిరి.) 2. ప్రతిష్ఠించు; 3. అడ్డగించు; (నన్ను పోవలదని నిలిపినాఁడు) 4. స్థిరపఱచు. (వి.) : 1.నిలుచుట, ఉండుట; 2.నిష్ఠ; 3.నిలుపుట, ప్రతిష్ఠ; 4.స్థైర్యము. (విణ.) : 1. నిలుపునది; 2. స్థిరమైనది; (రూ. నిల్పు. ప్రతిష్ఠించుటకు, స్థిరమునకు.)

**నిలుపోపు** (దే.అ.క్రి.) : (నిలుపు + ఓపు) ఓర్చు, సహించు.

**నిలువ** (దే.వి.) : నిలిచిన వస్తువు, శేషము. (రూ. నిల్వ.)

**నిలువఁబడు** (ద్వ.అ.క్రి.) : (నిలువన్ + పడు) 1. నిలుచు; 2. అడ్డిపడు; 3. ప్రతిష్ఠితమగు. నిలుచుటకు. (స్వార్థమున పడు.)

**నిలువరము** (దే.విణ.) : స్థిరమైనది. (రూ. నిల్వరము.)

**నిలువరించు** (దే.అ.క్రి.) : చలింపక నిలుచు. (ఆం.ప్రే.) : 1.చలింపక నిలుపు; 2.నిలుపు. (చూ. నిల్వరించు.)

**నిలువు** (దే.వి.) : 1. నిలుచుట, నిలుపు; 2. చేయీ మీఁది కెత్తుకొని నిలుచున్న పురుషుని చేయి పొడవు కొలఁది; (ఈ నూతిలో రెండునిలువుల నీళ్లున్నవి.) 3. మీఁదియంతస్తు; 4. ఆకృతి; 5. చేనిలో కొంత కోసిన తరువాత కోయఁ గల భాగము; 6. బ. అరిగాళ్లు.

**నిలువుఁగొలువు** (దే.వి.) : (నిలువు + కొలువు) నిలుచుండి చేయుసేవ.

**నిలువుగాళ్లు** (దే.వి.బ.) : (నిలువు + కాళ్లు) తావకాళ్లకు వెనుక మాను మొదలైనవాని కాధారముగా నాటిన స్తంభములు.

**నిలువుజీతము** (ద్వ.వి.) : నిలుచుండి సేవ చేయునట్లు ఏర్పాటు చేసికొని యిచ్చెడు జీతము.

**నిలువోపు** (దే.అ.క్రి.) : (నిలువు + ఓపు.) నిలుపోపు యొక్క రూపాంతరము.

**నిల్కడ** (దే.వి.) : నిలుకడ యొక్క రూపాంతరము.

**నిల్వ** (దే.వి.) : నిలువ యొక్క రూపాంతరము.

**నిల్వరము** (దే.విణ.) : నిలువరము యొక్క రూపాంతరము.

**నిల్వరించు** (దే.అ.క్రి.అం,ప్రే.) : నిలువరించు యొక్క రూపాంతరము. (చలింపక నిలుచుటకు. నిలుపుటకు.)

**నివరి** (వై.వి.) : నివ్వరి యొక్క రూపాంతరము.

**నివర్తనము** (సం.వి.అ.న.) : మరలఁబాటు.

**నివర్తించే** (సం.ప్రే.) : నివర్తిల్లఁజేయు.

**నివర్తిల్లు** (సం.అ.క్రి.) : మరలఁబడు, (రూ. నివర్తిలు.)

**నివసతి** (సం.వి.ఇ.స్త్రీ.) : గృహము, ఇల్లు.

**నివసథము** (సం.వి.అ.పుం.) : గ్రామము, ఊరు.

**నివసనము** (సం.వి.అ.న.) : నిలయము, ఇల్లు.

**నివసించే** (సం.అ.క్రి.) : వాసము చేయు, ఉండు.

**నివహము** (సం.వి.అ.పుం.) : సమూహము, గుమి.

**నివాకము** (సం.వి.అ.పుం.) : జయ ఘంట మొదలగువాని గుండ ధాన్యాదుల వెల ప్రసిద్ధ పఱచుట, వ్యవహారాదుల యందు న్యూనాధిక్యములు లేక కలిగినది పలుకుట. (అని కొందఱు.) మహార్ఘములైన ధాన్యాదుల యందలి జనుల యాదరాతిశయము. (అని కొందఱు.)

**నివాతము** (సం.వి.అ.పుం.) : ప్రాపు. (విణ.): 1. బాణములచే భేదింప రానిది; (కవచము) 2. గాలి లేనిది. (చోటు.)

**నివాపము** (సం.వి.అ.పుం.) : పితాళ్ల నుద్దేశించి నువ్వులు నీళ్లు విడుచుట లోనుగాఁగల కర్మము.

**నివారణము** (సం.వి.అ.న.) : అడ్డగింత, నిరోధము.

**నివారణీయము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అడ్డగింపఁదగినది.

**నివారించు** (సం.స.క్రి.) : నివారణ చేయు, అడ్డగించు.

**నివారితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అడ్డగింపఁబడినది.

**నివాసము** (సం.వి.అ.పుం.) : ఇల్లు, నివసనము.

**నివాసి** (సం.విణ.) : (న్.ఈ.న్.) వాసము చేయువాఁడు.

**నివాళి** (వై.వి.) : నివ్వాళి యొక్క రూపాంతరము.

**నివాళించు** (వై.అ.క్రి.) : ఆరతెత్తు.

**నివాళిక** (వై.వి.) : నివాళి యొక్క రూపాంతరము. (స్వార్థమున కప్రత్యయము.)

**నివాళితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చుట్టఁబడినది.

**నివిష్టుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. కూర్చున్నవాఁడు; 2. ప్రవేశించినవాఁడు.

**నివీతము** (సం.వి.అ.న.) : మెడను దండవలె వ్రేలెడు జన్నిదము. (విణ.) : కప్పుకొనఁబడినది. (వస్త్రము.)

**నివీతి** (సం.వి.న్.పుం.) : నివీతము గలవాఁడు.

**నివుడు** (దే.అ.క్రి.) : నిగుడు యొక్క రూపాంతరము. (చిప్పిలుటకు.)

**నివుడుచే** (దే.ప్రే.) : నిగుడుచు యొక్క రూపాంతరము. (రూ. నివుడ్చు.)

**నివురు** (దే.స.క్రి.) : నిమురు.

**నివుఱు** (దే.వి.) : నిగుఱు యొక్క రూపాంతరము.

**నివృతము** (సం.విశే.) : (అ.ఆ.అ.) నలుప్రక్కల చుట్టఁబడినది, పరిక్షిప్తము.

**నివృతి** (సం.వి.ఇ.స్త్రీ.) : నలుప్రక్కల చుట్టుట.

**నివృత్తము** (సం.విశే.) : (అ.ఆ.అ.) మరలఁ బడినది.

**నివృత్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : మరలఁబాటు, అప్రవృత్తి.

**నివేదనము** (సం.వి.అ.న.) : 1.ఎఱుక; 2. సమర్పణము.

**నివేదించే** (సం.స.క్రి.) : 1. ఎఱిఁగించు; 2. సమర్పించు.

**నివేదితము** (సం.విశే.) : (అ.ఆ.అ.) 1.ఎఱిఁ గింపఁబడినది; 2. సమర్పింపఁబడినది.

**నివేద్యము** (సం.విశే.) : (అ.ఆ.అ.) 1. ఎఱిఁ గింపఁదగినది; 2. సమర్పింపఁ దగినది.

**నివేశము** (సం.వి.అ.పుం.) : 1.ఇల్లు; 2.చౌరవ; 3.ఎత్తినదండు విడిసిన పాళెము; 4.పెండ్లి; 5. ఇల్లడ.

**నివ్వటించు** (వై.ప్రే.) : నివ్వటిల్లఁజేయు.

**నివ్వటిల్లు** (వై.అ.క్రి.) : 1. నెఱవేఱు; 2. అతిశ యించు; 3. కలుగు; 4. వ్యాపించు. (రూ. నివ్వటిలు. అతిశయిం చుటకు. కలుగుటకు.)

**నివ్వరి** (వై.వి.) : తృణధాన్యవిశేషము. (నీవరి యొక్క రూపాంతరము.)

**నివ్వాళి** (వై.వి.) : ఆరతి.

**నివ్వాళిక** (వై.వి.) : నివ్వాళి యొక్క రూపాం తరము. (స్వార్థమున కప్రత్యయము.)

**నివ్వెర** (దే.వి.) : నివ్వెఱ యొక్క రూపాంతరము. (దీనికి మిక్కిలి భయమను అర్థములేదు.)

**నివ్వెఱ** (దే.వి.) : 1.పారవశ్యము; 2. నిశ్చేష్టత; (చూ. నివ్వెఱపడు.) (నివ్వెఱఁగు యొక్క రూపాంతరము) 3.భ్రాంతి; (చూ. నివ్వెఱఁగు) 4.(నిండు + వెఱ.) మిక్కిలి భయము. (చూ. నివ్వెఱపడు.)

**నివ్వెఱఁగు** (దే.వి.) : (నిండు + వెఱఁగు) 1. పారవశ్యము; 2. నిశ్చేష్టత; (చూ. నివ్వెఱపడు.) 3. భ్రాంతి; (చూ. మీఁది పజ్కులు.)

**నివ్వెఱపడు** (దే.అ.క్రి.) : 1. పరవశమగు; (చూ. నివ్వెఱ.) 2. చేష్టలు దక్కు; (చూ. వెఱఁగు పాటు.) 3. భ్రాంతిపడు; (చూ. నివ్వెఱఁగు.) 4. మిక్కిలి భయపడు.

**నివ్వెఱపాటు** (ద్వ.వి.) : 1. పారవశ్యము; 2.నిశ్చేష్టత; 3.భ్రాంతి; (చూ. నివ్వెఱఁగు.) 4. మిక్కిలి భయము.

**నిశ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. రేయి; 2. పసుపు; 3. మ్రానిపసుపు.

**నిరాంకుశ** (సం.వి.ఆ.స్త్రీ.) : జిబిలిక.

**నిశాంతము** (సం.వి.అ.న.) : 1. ఇల్లు; 2. వేకువ. విశే. మిక్కిలి అడఁగినది.

**నిశాకరుఁడు** (సం.వి.అ.పుం.) : చంద్రుఁడు, రేతేఁడు.

**నిశాఖ్య** (సం.వి.ఆ.స్త్రీ.) : పసుపు, హరిద్ర.

**నిశాచరి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. రాక్షసి; 2. అంకుటాలు; 3. పయిఁడికంటి అను పక్షి.

**నిశాచరుఁడు** (సం.వి.అ.పుం.) : రాక్షసుఁడు, రేద్రిమ్మరి.

**నిశాటుఁడు** (సం.వి.అ.పుం.) : రాక్షసుఁడు, రేద్రిమ్మరి.

**నిశాతము** (సం.విశే.) : (అ.ఆ.అ.) మిక్కిలి వాఁడిచేయఁబడినది.

**నిశాన్** (హిం.వి.) : జెండా, గుఱుతు, చేవ్రాలు.

**నిశానుదారు** (హిం.వి.) : గుఱుతు మాత్రము పెట్టఁగలవాఁడు.

**నిశాపతి** (సం.వి.ఇ.పుం.) : 1. చంద్రుఁడు, రేతేఁడు; 2. కర్పూరము.

**నిశారణము** (సం.వి.అ.న.) : మారణము, చంపుట.

**నిశారము** (సం.వి.అ.పుం.) : చలి కప్పుడు దుప్పటి, (రూ. నీశారము.)

**నిశితము** (సం.విశే.) : (అ.ఆ.అ.) 1. మిక్కిలి వాఁడిచేయఁబడినది; 2. సానఁబెట్టఁబడినది.

**నిశీథము** (సం.వి.అ.పుం.) : 1. నడురేయి; 2. రేయి.

**నిశీథిని** (సం.వి.ఈ.స్త్రీ.) : రేయి, రాత్రి, నిశ.

**నిశ్చయము** (సం.వి.అ.పుం.) : నిర్ణయము.

**నిశ్చయించు** (సం.స.క్రి.) : నిర్ణయించు.

**నిశ్చల** (సం.వి.ఆ.స్త్రీ.) : నేల. (విణ.) : కదలనిది.

**నిశ్చాయకుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) నిశ్చయించువాఁడు.

**నిశ్చింతుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) చింత లేనివాఁడు.

**నిశ్చితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నిశ్చయింపఁబడినది.

**నిశ్చేష్టాకరణము** (సం.వి.అ.న.) : మన్మథ బాణములలో నొకటి (చూ. బాణము.)

**నిశ్చేష్టితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) చేష్టలు తక్కినవాఁడు.

**నిశ్రేణి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. నిచ్చెన; 2. ఈఁతచెట్టు.

**నిశ్రేయసము** (సం.వి.అ.న.) : 1. ముక్తి; 2. మేలు. (పుం.డు.) : శివుఁడు.

**నిశ్వసనము** (సం.వి.అ.న.) : నిట్టూర్చుట.

**నిశ్వసించే** (సం.అ.క్రి.) : నిట్టూర్పు విడుచు, నిట్టూర్చు.

**నిశ్వాసము** (సం.వి.అ.పుం.) : నిట్టూర్పు.

**నిశ్వాసించు** (సం.అ.క్రి.) : నిశ్వసించు (చూ. నన.)

**నిశ్శబ్దము** (సం.వి.అ.పుం.) : తాలమాన లఘు చతుష్టయ కాలము. (విణ.) : శబ్దము లేనిది. (ఆకారాంత స్త్రీ లింగమైనప్పుడు రాత్రి అర్థము.)

**నిశ్శలాకము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఏకాంతము. (చోటు.)

**నిశ్శేషము** (సం.విణ.) : (అ.ఆ.అ.) సర్వము, అంతయు.

**నిశ్శోధ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కడుగుట లోనగువానిచేత గరగరికైనది, శోధితము.

**నిషంగము** (సం.వి.అ.పుం.) : 1. అమ్ములపొది; 2. మిక్కిలి సంగము.

**నిషంగి** (సం.విణ.) : (న్.ఈ.న్.) విలుకాఁడు.

**నిషణ్ణము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. ఉండినది; 2. కూర్చుండినది.

**నిషద్య** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. అంగడి; 2. కూర్చుండుట.

**నిషద్వర** (సం.వి.ఆ.స్త్రీ.) : రేయి. (అ.పుం.ము.) అదును.

**నిషధము** (సం.వి.అ.పుం.) : 1. ఒకానొక కొండ; 2. ఒకానొక దేశము. (విణ.) : కఠినము.

**నిషా** (హిం.వి.) : మత్తు.

**నిషాదము** (సం.వి.అ.పుం.) : ఒక స్వరము. (రూ.) నిషదము. (చూ. స్వరము.)

**నిషాది** (సం.వి.న్.పుం.) : మావటివాఁడు.

**నిషాదుఁడు** (సం.వి.అ.పుం.) : 1. ఒక తెగ బోయవాఁడు; 2. మాలవాఁడు.

**నిషిద్ధము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నిషేధింపఁబడినది.

**నిషూదనము** (సం.వి.అ.న.) : వధము, చంపుట.

**నిషేకము** (సం.వి.అ.పుం.) : గర్భాధానము.

**నిషేధము** (సం.వి.అ.పుం.) : త్రోపుడు.

**నిషేధించు** (సం.స.క్రి.) : త్రోపుడుచేయు.

**నిషేవణము** (సం.వి.అ.న.) : 1. చక్కఁగా సేవించుట; 2. సోమపానము.

**నిషేవితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చక్కఁగా సేవింపఁబడినది.

**నిషేవ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చక్కఁగా సేవింపఁదగినది.

**నిష్కము** (సం.వి.అ.పుం,న.) : 1.మాడ; 2.టంకము; 3.నూటయెనిమిది మాడలు; 4.పతకము; 5. పలము; 6. బంగారు; 7. వెండి.

**నిష్కర్ష** (సం.వి.అ.పుం.) : నిశ్చయము.

**నిష్కర్షించే** (సం.స.క్రి.) : నిశ్చయించు.

**నిష్కళ** (సం.వి.ఆ.స్త్రీ.) : ముట్లుడిగిన ఆఁడుది. (విణ.) : 1. కళలేనిది; 2. వీర్యము లేనిది.

**నిష్కాసితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1.ఉనుపఁబడినది; 2. వెడలింపఁబడినది.

**నిష్కుటము** (సం.వి.అ.పుం.) : 1. తొట్టి; (రూ. నిష్కూటము.) 2. అంతిపురము; 3. ఇంటి తోఁట; 4. తలుపు; 5. మడి.

**నిష్కుటి** (సం.వి.ఈ.స్త్రీ.) : పెద్ద యేలకులు.

**నిష్కుహము** (సం.వి.అ.పుం.) : తొట్టి (రూ. నిష్కూహము.)

**నిష్కృతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. ప్రాయశ్చిత్తము చేయఁబడినది; 2. చేయఁబడినది.

**నిష్కృతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. ప్రాయశ్చిత్తము; 2. చేయమి.

**నిష్క్రమము** (సం.వి.అ.పుం.) : 1. చెడు కులము; 2. బుద్ధి సంపత్తి; (శుశ్రూష, శ్రవణము, గ్రహణము, ధారణము, ఊహ, ఆపోహము, అర్థవిజ్ఞానము, తత్త్వవిజ్ఞానము అను నెనిమిది.) 3. వెడలఁబాటు.

**నిష్క్రాంతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) బయలువెడలినది.

**నిష్క్రాంతి** (సం.వి.ఇ.స్త్రీ.) : బయలు వెడలుట.

**నిష్ఠ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.ఉనికి; 2. చేటు; 3.తుది; 4. ముగియిక; 5. వేఁడి కోలు; 6. ప్రస్తుత కథాసంహార రూపమయిన యొక నాటక సంధి (చూ. సంధి.)

**నిష్ఠానము** (సం.వి.అ.న.) : మజ్జిగ పులుసు, తేమనము.

**నిష్ఠించు** (సం.అ.క్రి.) : స్థిరమగు.

**నిష్ఠితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చక్కఁగా నుంచఁబడినది.

**నిష్ఠీవనము** (సం.వి.అ.న.) : ఉమియుట.

**నిష్ఠురము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. కఠినము; 2. పరుషమైనది. (మాట.)

**నిష్ఠూతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) త్రోయఁబడినది.

**నిష్ఠేవము** (సం.వి.ఆ.స్త్రీ.అ.పుం.) : ఉమియుట.

**నిష్ఠ్యూతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1.ఉమియఁబడినది; 2. త్రోయఁ బడినది.

**నిష్ఠ్యూతి** (సం.వి.ఇ.స్త్రీ.) : నిష్ఠీవనము, ఉమియుట.

**నిష్ణాతుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) నేర్పరి.

**నిష్పక్వము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చక్కఁగా కాఁగినది, క్వథితము.

**నిష్పత్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. సిద్ధి; 2. పరిసమాప్తి.

**నిష్పన్నము** (సం.విణ.) : (అ.ఆ.అ.) సిద్ధించినది.

**నిష్పాదనము** (సం.వి.అ.న.) : నిష్పత్తి, సిద్ధి.

**నిష్పాదించే** (సం.స.క్రి.) : సిద్ధింపఁ జేయు.

**నిష్పాదితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) సిద్ధించినది.

**నిష్పాద్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) సిద్ధింపఁదగినది.

**నిష్పావము** (సం.వి.అ.పుం.) : 1. అనుములు; 2. చేట గాలి; 3. తూర్పెత్తుట; 4. పెసలు లోనగువాని పొట్టు; 5. పొల్లు. (విణ.) : నిలుకడైనది.

**నిష్పిష్టము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చక్కఁగా నూఱఁబడినది.

**నిష్పేషణము** (సం.వి.అ.న.) : చక్కఁగా నూఱుట.

**నిష్ప్రయోజనము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ప్రయోజనములేనిది.

**నిష్ప్రవాణి** (సం.విణ.ఇ.) : క్రొత్తది, (వస్త్రము.)

**నిష్ఫలము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఫలములేనిది.

**నిసర్గము** (సం.వి.అ.పుం.) : 1. స్వభావము; 2. కలిగించుట; 3. ఈవి.

**నిసి** (వై.వి.) : 1. రాత్రి; 2. అర్ధరాత్రము.

**నిసిందా** (హిం.వి.) : వ్రాయువాఁడు. (నిసిందా వ్రాఁత)

**నిసివెలుఁగు** (ద్వ.వి.) : చంద్రుఁడు.

**నిసుఁగు** (వై.వి.) : శిశువు.

**నిసువు** (వై.వి.) : నిసుఁగు యొక్క రూపాంతరము.

**నిసృష్టము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. దాఁచఁ బెట్టినది; 2. మధ్యస్థము.

**నిస్తంద్రము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చొరవ గలది.

**నిస్తరణము** (సం.వి.అ.న.) : 1. దాఁటుట; 2. వెడలఁబాటు; 3. వెరవు.

**నిస్తరించే** (సం.స.క్రి.) : చక్కఁగా దాఁటు.

**నిస్తర్హణము** (సం.వి.అ.న.) : వధము, చంపుట.

**నిస్తలము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. కదలునది; 2. వట్రువైనది.

**నిస్తారకము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నిస్తరింపఁ జేయునది.

**నిస్తారము** (సం.వి.అ.పుం.) : నిస్తరణము, దాఁటుట.

**నిస్తుషితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. చులుకనగా చేయఁబడినది; 2. పొట్టు పోఁగొట్టినది; 3. విడువఁ బడినది.

**నిస్త్రింశము** (సం.వి.అ.పుం.) : కత్తి. (విణ.) కనికరములేనిది.

**నిస్పందము** (సం.వి.అ.పుం.) : మిక్కిలి చలనము.

**నిస్పృహము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఆశలేనిది.

**నిస్రావము** (సం.వి.అ.పుం.) : గంజి, ఆచామము.

**నిస్వనము** (సం.వి.అ.పుం.) : ధ్వని, మ్రోఁత.

**నిస్వానము** (సం.వి.అ.పుం.) : ధ్వని, మ్రోఁత.

**నిస్సంతు** (వై.విణ.) : సంతానములేనిది. (అతని సంతు నిస్సంతయి పోయినది.)

**నిస్సత్తువ** (వై.వి.) : శక్తిలేమి, అశక్తి.

**నిస్సరణము** (సం.వి.అ.న.) : 1. ఇల్లులోనగువాని ముందటి భాగము; 2. చావు; 3. ముక్తి; 4. వెడలఁబాటు; 5. వెరవు.

**నిస్సహణము** (వై.వి.) : చర్మవాద్య విశేషము.

**నిస్సాణము** (సం.వి.అ.పుం.) : చర్మ వాద్య విశేషము.

**నిస్సానము** (వై.వి.) : చర్మవాద్య విశేషము.

**నిస్సారము** (సం.విణ.) : (అ.ఆ.అ.) సారము లేనిది.

**నిస్స్యందము** (సం.వి.అ.పుం.) : కాఱుట.

**నిస్స్వుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) బీదవాఁడు.

**నిహంత** (సం.విణ.) : (ఋ.ఈ.ఋ.) చంపువాఁడు.

**నిహతము** (సం.వి.అ.న.) : గుణకారము. (పుం.) : అనుదాత్త స్వరము (విణ.) : 1. చంపఁబడినది; 2. గుణింపఁబడినది.

**నిహతి** (సం.వి.ఇ.స్త్రీ.) : చావు, మరణము.

**నిహననము** (సం.వి.అ.న.) : వధము, చంపుట.

**నిహాక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. ఉడుము; 2. నీటి యుడుము.

**నిహింసనము** (సం.వి.అ.న.) : వధము, చంపుట.

**నిహితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఉంచఁ బడినది.

**నిహీనుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) నీచుఁడు.

**నిహ్నవము** (సం.వి.అ.పుం.) : 1. అపనమ్మిక; 2. కపటము; 3. తిరస్కారము; 4.దాఁపటికము; 5.నమ్మిక; 6. మఱుఁగుమాట.

**నిహ్నవించే** (సం.స.క్రి.) : మఱుఁగు పుచ్చు.

**నిహ్నుతి** (సం.వి.ఇ.స్త్రీ.) : మఱుఁగు పుచ్చుట.



**నీ** (దే.స.) : నీవు అనుదానికి ప్రాతిపదికము.

**నీఁగు** (దే.స.క్రి.) : నివర్తించు.

**నీఁడు** (వై.వి.) : కమ్మవారి బిరుదు పేరు. (అబ్బి నీఁడు, సామినీఁడు.మొ.) (నాయఁడు యొక్క మాఱు రూపము.)

**నీకాశము** (సం.వి.అ.పుం.) : 1. ప్రకాశము; 2. నిశ్చయము. (విణ.) : తుల్యము.

**నీచుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1.అధ ముఁడు; (రూ. నీచు.) 2. వామనుఁడు.

**నీటికానుపు** (ద్వ.వి.) : (నీరు + కానుపు) అగ్ని, కృపీటయోని.

**నీటికుప్ప** (ద్వ.వి.) : (నీరు + కుప్ప) సముద్రము, జలరాశి. (మొదటి రూపము నీరు కుప్ప.)

**నీటిచూలి** (ద్వ.వి.) : (నీరు + చూలి) అగ్ని, కృపీటయోని.

**నీటితాత** (ద్వ.వి.) : (నీరు + తాత) వాయువు.

**నీటిదయ్యము** (వై.వి.) : (నీరు + దయ్యము) జలగ్రహము, నెగడు.

**నీటిపుట్టుగు** (ద్వ.వి.) : (నీరు+పుట్టుగు) తామర, అజ్జము. (మొదటి రూపము నీరుపుట్టుగు.)

**నీటియిక్క** (ద్వ.వి.) : (నీరు+ఇక్క) విష్ణు వక్ష స్థలము నందలి మణి, కౌస్తుభము.

**నీటిరిక్క** (వై.వి.) : (నీరు + రిక్క) పూర్వాషాఢా నక్షత్రము.

**నీటితేఁడు** (ద్వ.వి.) : (నీరు + తేఁడు) 1. వరుణుఁడు, అప్పతి; 2. సముద్రుఁడు, అపాంపతి (ఇట్లు నీటిరాయఁడు.)

**నీటితేనిరిక్క** (ద్వ.వి.) : శతభిషఙ్నక్షత్రము.

**నీటు** (దే.వి.) : శృంగారగర్వము, మురిపము.

**నీటుకత్తియ** (ద్వ.విఀ.) : నీటు గలది. (రూ. నీటుకత్తె.)

**నీటుకాఁడు** (దే.విఀ.) : నీటు గలవాఁడు.

**నీడ** (దే.వి.) : 1. ఛాయ; 2. ఎండలేమి.

**నీడము** (సం.వి.అ.న.) : చోటు. (పుం,న.) పక్షిఁగూఁడు.

**నీడోద్భవము** (సం.వి.అ.పుం.) : పక్షి, గూఁడు కానుపు.

**నీతకము** (వై.వి.) : నీతము యొక్క రూపాం తరము.

**నీతము** (ఉభ.వై.వి.) : నియమము. (సం.వి. అ.న.) : 1.ధనము; 2.ధాన్యము. (విఀ.) : 1.పొందింపఁబడినది; 2. శిక్షింపఁబడినది; 3. తేఁబడినది.

**నీతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. న్యాయము; 2. పొందించుట.

**నీపము** (సం.వి.అ.పుం.) : 1. కడిమి; 2. మంకెన; 3. నల్ల యిరుగుడు.

**నీయంచ** (దే.వి.) : కంకికాఁడ.

**నీరంధ్రము** (సం.వి.అ.న.) : ఆకాశము. (విఀ.) : సందులేనిది.

**నీరజము** (సం.వి.అ.న.) : 1. తామర; 2. ముత్యము; 3. చెంగల్వకోష్టు. (విఀ.) నీటఁబుట్టినది.

**నీరదము** (సం.వి.అ.పుం.) : 1.మబ్బు; 2.తుంగ.

**నీరధి** (సం.వి.ఇ.పుం.) : సముద్రము, కడలి.

**నీరము** సం.వి.అ.న.) : జలము, నీరు.

**నీరసము** (సం.వి.అ.పుం.) : దానిమ్మ. (విఀ.): రసములేనిది.

**నీరాకు** (ద్వ.వి.) : (నీరు+ఆకు) పాఁచి, వారిపర్ణి.

**నీరాజనము** (సం.వి.అ.న.) : ఆరతి.

**నీరాట** (ద్వ.వి.) : (నీరు + ఆట) 1. స్నానము; 2. జలక్రీడ. (రూ. నీరాటము. స్నానమునకు.)

**నీరాటము** (సం.వి.అ.పుం.) : నీళ్లయందు చరించు జంతువు.

**నీరాడు** (ద్వ.అ.క్రి.) : (నీరు+ఆడు) స్నానముచేయు, క్రుంకు. (వి.) కూరాటిలో పోసెడు వేన్నీళ్లు.

**నీరామని** (ద్వ.వి.) : (నీరు+ఆమని) వర్షఋతువు.

**నీరారుచు** (దే.ప్రే.) : నీరాడఁజేయు, (రూ. నీరార్చు.)

**నీరిజే** (దే.వి.) : ఒకానొక అడవిచెట్టు.

**నీరిప్ప** (ద్వ.వి.) : (నీరు + ఇప్ప) మధూలకము.

**నీరు** (యు.దే.విఀ.) అల్పము. (నీరుకావి. మొ.) (హల్లు పరమగుచో దీని ఉత్వము వికల్పముగా లోపించును. నీర్కావి. మొ.) (వై.వి.) : 1. ఉదకము; 2. కన్నీరు; 3. మూత్రము.

**నీరుకట్టియ** (వై.వి.) : నీరుకట్టె.

**నీరుకట్టు** (ద్వ.వి.) : మూత్రబంధ రోగము అశ్మరి.

**నీరుకట్టె** (వై.వి.) : నీరుపాము, అలగర్దము. (నీరు కట్టియ యొక్క రూపాంతరము.) (చూ.వరుజు.)

**నీరుకడిమి** (ద్వ.వి.) : ధారాకదంబము.

**నీరుకాకి** (ద్వ.వి.) : జలకాకము, మద్గువు.

**నీరుకాయ** (ద్వ.వి.) : నీటిబుగ్గ, బుద్బుదము.

**నీరుకాయవాఁడు** (ద్వ.వి.) : నీటి మనుష్యుఁడు.

**నీరుకాఱు** (ద్వ.వి.) : కమసాలెవాని యొకదినుసు కొఱముట్టు.

**నీరుకావి** (దే.వి.) : కొంచెమెఱుపు. (రూ.నీర్కావి.)

**నీరుకాళ్లు** (ద్వ.వి.బ.) : శోణ హరితవర్ణములై యుభయ సంధ్యల యందుఁ దోఁచెడు సూర్య కిరణములు. (ఇది వర్షసూచకము.)

**నీరుకుక్క** (వై.వి.) : జలశునకము.

**నీరుకుప్ప** (ద్వ.వి.) : సముద్రము, జలరాశి.

**నీరుకోఁతి** (ద్వ.వి.) : జలమర్కటము, శింశుమారము.

**నీరుకోడి** (ద్వ.వి.) : జలకుక్కుటము, పరిప్లవము.

**నీరుగండి** (ద్వ.వి.) : తూముకాలువ, వాహసము.

**నీరుగన్నేరు** (ద్వ.వి.) : హింజలము.

**నీరుగొబ్బి** (ద్వ.వి.) : ఒకానొకచెట్టు, ఇక్షురము.

**నీరుచిచ్చు** (వై.వి.) : బడబాగ్ని, బాడబము.

**నీరుచెంచేలి** (ద్వ.వి.) : ఒక దినుసు చెంచలి, వితున్నము.

**నీరుచేఁబుకు** (ద్వ.వి.) : నీరుదిగునపుడు మంటయెత్తెడు రోగ విశేషము.

**నీరుటెంకి** (ద్వ.వి.) : జలాశయము.

**నీరుడి** (ద్వ.వి.) : (నీరు + ఊడు) నీరు అధికముగా దిగు రోగవిశేషము.

**నీరుడుము** (ద్వ.వి.) : (నీరు + ఉడుము) నీటి యుడుము, గోధిక.

**నీరుతాలుపు** (ద్వ.వి.) : మబ్బు, జలధరము. (రూ. నీటితాల్పు.)

**నీరుతిట్ట** (ద్వ.వి.) : సముద్రము జలరాశి.

**నీరుతిత్తి** (వై.వి.) : మూత్రకోశము, క్లోమము.

**నీరుతుట్ర** (ద్వ.వి.) : నీరుకట్టె, అలగర్దము.

**నీరుదొత్త** (ద్వ.వి.) : నీరుకట్టె, అలగర్దము.

**నీరుదోమ** (ద్వ.వి.) : జలమశకము, కషాయిక.

**నీరుద్రిమ్మరి** (ద్వ.వి.) : (నీరు + త్రిమ్మరి) జలజంతువు.

**నీరుపంది** (ద్వ.వి.) : జలసూకరము, ఆలస్యము.

**నీరుపదును** (దే.వి.) : కొంచెపుపదును.

**నీరుపాది** (ద్వ.వి.) : ఒకానొకచెట్టు.

**నీరుపాప** (ద్వ.ని.) : 1. అగ్ని; 2. నీటి మనుష్యుఁడు.

**నీరుపాము** (ద్వ.వి.) : జలసర్పము, నీరుకట్టె.

**నీరుపాయము** (ద్వ.వి.) : జవ్వనము, యౌవనము.

**నీరుపిప్పలి** (వై.వి.) : పిప్పలీ విశేషము, తోయపిప్పలి.

**నీరుపిల్లి** (వై.వి.) : జలమార్జాలము, ఉద్రము.

**నీరుపుట్టువ** (ద్వ.వి.) : 1. తామర; 2. శంఖము; 3. కౌస్తుభము. (దీనికి సంస్కృతము నందు సరియైన పదము అబ్జము.) (ఇది వెనుకటి రెండర్థములకు నుదాహరణము.)

**నీరుప్రబ్బ** (ద్వ.వి.) : జలవేతసము. విదులము.

**నీరుబొద్ది** (ద్వ.వి.) : వృద్ధదారక విశేషము.

**నీరుమజ్జిగ** (వై.వి.) : మూడుపాళ్లు నీళ్లు గలసిన మజ్జిగ. (ఇట్లు నీరుచల్ల, నీరుమోరు.మొ.)

**నీరుమట్టము** (ద్వ.వి.) : జలవ్యాప్తిగల భుభాగము.

**నీరుమానిసి** (వై.వి.) : నీటిమనుష్యుఁడు.

**నీరుముంపు** (ద్వ.విణ.) : జలప్రాయము, అనూపము.

**నీరుముట్టు** (ద్వ.అ.క్రి.) : జలస్పర్శము చేయు.

**నీరుమోపరి** (ద్వ.వి.) : 1. కుంభము; 2. మేఘము. (విణ.) : నీరుమోచునది.

**నీరుల్లి** (ద్వ.వి.) : (నీరు + ఉల్లి) ఎఱ్ఱగడ్డ, పలాండువు.

**నీరువంగ** (వై.వి.) : వార్తాక విశేషము, వృంతాకము.

**నీరువట్టివేరు** (ద్వ.వి.) : ఉశీర విశేషము, లామజ్జకము.

**నీరుపట్టు** (ద్వ.అ.క్రి.) : దప్పికొను. (వి.) : దప్పి, పిపాస.

**నీరువత్తిగ** (వై.వి.) : భక్ష్యవిశేషము.

**నీరువరి** (ద్వ.వి.) : నీవారతృణము.

**నీరువామి** (ద్వ.వి.) : సముద్రము, జలరాశి.

**నీరెత్తువంగ** (ద్వ.వి.) : నీరువంగ, వృంతాకము.

**నీరేనుఁగు** (ద్వ.వి.) : (నీరు+ఏనుఁగు) నీటిగజము.

**నీరొట్టు** (ద్వ.వి.) : భక్ష్యవిశేషము.

**నీర్కావి** (ద్వ.వి.) : నీరుకావి యొక్క రూపాంతరము.

**నీర్చిచ్చు** (వై.వి.) : నీరుచిచ్చు యొక్క రూపాంతరము.

**నీర్వట్టు** (ద్వ.అ.క్రి.వి.) : నీరు వట్టు యొక్క రూపాంతరము.

మ్రానులో నగునది; 5. పక్క; 6. పట్టెవలె తీర్చిన ద్రవ ద్రవ్యపు రేఖ; 7.(బ.) : పట్టెలు తీర్చిన సున్నపు పూఁతలోనగునది. (చూ. పట్టె.)

**పట్టియము** (వై.వి.) : 1. పెద్దకత్తి; (చూ. చేకత్తి.) 2. కత్తి. (చూ. పట్టెము.)

**పట్టిలి** (దే.వి.) : ఎడముగా వంపఁబడిన వ్రేళ్లు గల చేర.

**పట్టిసము** (సం.వి.అ.పుం.) : ఆయుధ విశేషము, అడ్డకత్తి.

**పట్టీ** (దే.వి.) : 1. వస్తువులనామములను వరుసగా వ్రాసిన కాకితము లోనగునది; 2. లోపలవక్క పెట్టిచుట్టిన తముల పాకు చుట్ట; 3. ఇనుము లోనగువాని తేకు.

**పట్టు** (యు.దే.అ.క్రి.) : 1.చెల్లు; 2.బహుకాలము చెల్లు; 3.పద్దుపట్టు; 4.ఇంచు; 5.ప్రారంభించు; 6. అంటు; (వీనికి అక్షరము నోటపట్టదు, గుడ్డకు చాయ పట్టలేదు) 7.అక్కఱ కలుగు; (కావలసి యుండిన నీవుపో నాకేమి పట్టినది) 8. పట్టుదల చేయు; 9.కలుగు. (జొన్నవెన్ను తీసినది ఇంక గింజ పట్టలేదు. వీనికి క్రొవ్వు పట్టినది.) (స.క్రి.): 1. గ్రహించు; (ఈ యుంగరము నావ్రేలు పట్టదు, ఈగోనె యెంత బియ్యము పట్టును. ఇత్యాది స్థలముల యందు పట్టు అను క్రియ గ్రహణార్థకమనియే యెఱుంగునది.) 2.నిర్బంధము చేసి గ్రహించు; (గుఱ్ఱమును పట్టి కట్టుము.) 3.అవలంబించు; 4.ఊఁదు; 5. మూర్కొను; (వాసనపట్టు.) 6. పిసుకు; (నాకు నడుము పట్టుము.) 7. జెట్టికీ లెఱిఁగి కర చరణాద్య వయవములను ఇటునటు కదలక యదుము. (వి.) : 1.గ్రహణము; (చంద్ర గ్రహణము నెలపట్టు, సూర్య గ్రహణము ప్రొద్దు పట్టు.) 2.పద్దు; 3.పూఁత; 4.వాస స్థానము; 5. స్థానము; 6.అవకాశము; 7.వెడలుపు; 8. ధైర్యము; 9. విషయము; 10. కారణము; 11. అవలంబము; (వానికి పట్టుదొరకలేదు) 12. అక్కఱ; (నీకాకార్యమందు పట్టునదా ?) 13. పట్టుదల; (అందేమియు పట్టుకానము.) 14. ఘట్టము; (ఇది మంచిపట్టు ఇక్కడ వదల కుము.) 15. జెట్టి కీలెఱిఁగి కరచరణాద్యవ యవ ములను ఇటునటు కదలక యదుముట; 16. బంధుత్వము. (కొన్ని నిఘంటువులయందు ఈయర్థము వ్రాయఁబడియున్నది) (వై.) ఒక జాతి పురుగుల వల్ల కలిగెడు ఒకదినుసు మేలు తరపు నూలు. (పట్టు చీర, పట్టు అవిక. మొ.)

**పట్టుఁగొమ్మ** (దే.వి.) : (పట్టు + కొమ్మ) ఊఁత కోల, ఆధారము.

**పట్టుకాఱు** (దే.వి.) : నిప్పున కాఁచిన లోహము లను ఎత్తెడు ఒక యినుప కొఱముట్టు, సందంశము.

**పట్టుకొను** (దే.అ.క్రి.) : 1. నెలకొను, నిలుచు; 2. (వాయురోగము మొదలగు వానిచేత) బిగిసి కొను. (మెడపట్టు కొన్నది) (ప్రే. పట్టుకొలుపు.)

**పట్టుకోలు** (దే.వి.) : నిలుపు.

**పట్టుజీనువు** (ద్వ.వి.) : పక్షివిశేషము. (కొందఱు దీని కర్థము 'పిగిలిపిట్ట' అని వ్రాసియున్నారు.)

**పట్టుడు** (దే.వి.) : పట్టుదల. (చూ. సగ్గిస ముగ్గిసలు)

**పట్టుదల** (దే.వి.) : వదలనిపట్టు, అభినివేశము.

**పట్టుపురుగు** (వై.వి.) : పట్టువంటి వర్ణము గల ఒక దినుసు పురుగు, ఇంద్రగోపము.

**పట్టుబడి** (దే.వి.) : ఏదేనొకదానిక్రింద వ్యయమైన ధనము.

**పట్టువడు** (ద్వ.అ.క్రి.) : (పట్టు+పడు) 1. చిక్కు; 2. విదితమగు. (ప్రే. పట్టు పఱుచు.)

**పట్టుసారువ** (దే.వి.) : మీటఁ ద్రొక్కువాఁడు పట్టుకొనుటకు గుంజతో చేర్చి కట్టిన పంగల కొయ్య.

**పట్టుసాలె** (వై.వి.) : పట్నూలవాఁడు. (మొదటి రూపము పట్టుసాలియ.)

**పట్టె** (వై.వి.) : 1. పలక; 2. మంచము లోనగు వాని చట్టము; 3. రాజ్యాభిషేక కాలమునందు నొసటఁ గట్టెటు పట్టము; 4. మిద్దెటిండ్ల మీఁదఁ బఱచెడు మ్రానులోనగునది; 5. ప్రక్క; (అరవ పట్టెలు తీర్చినదా?) 6. పట్టెవలెఁ దీర్చిన ద్రవ ద్రవ్యపురేఖ; (పట్టెనామము) 7. కుంచె;

8. (బ.) : పట్టెవలెఁ దీర్చిన సున్నపు పూఁత లోనగునది. (మాణిక్య పట్టెలు, సున్నపు పట్టెలు.మొ.) (పట్టియ యొక్క రూపాంతరము.)

**పట్టెడ** (దే.వి.) : 1. మంచములోనగు వానికి నల్లెడునవారు; 2. ఎద్దు మొదలైన వాని మెడకు కట్టుటకు ఉపయోగముగా నూలితో నేసినపట్టె; 3. పట్టెవలె కోసిన తోలు; 4. పట్టెవలె చాఁగఁ గొట్టిన తగడు; 5. పట్టెవలె నుండెడు స్త్రీ కంఠాభరణ విశేషము; 6. కమసాలె వాని దాఁగలి; (చూ. కమటము) 7. వృక్ష విశేషము.

**పట్టెడమ్రాను** (దే.వి.) : సానదిండు ప్రక్క కొయ్యల క్రింద చట్టము.

**పట్టెమంచము** (వై.వి.) : నవారుపట్టెడ అల్లిన మంచము.

**పట్టెమాఱుపు** (ద్వ.వి.) : వస్త్రమునందలి చిత్రవర్ణ విశేషము.

**పట్టెము** (వై.వి.) : పట్టియము యొక్క రూపాం తరము. (కత్తికి.)

**పట్టెవర్ధనము** (మి.వి.) : మగవారు మిక్కిలి వెడల్పు గాను దళముగాను పట్టెవలెతీర్చిన నొసటిబొట్టు.

**పట్నము** (వై.వి.) : పట్టణము.

**పట్ర** (దే.వి.) : కిరాతభేదము. (పట్రవాఁడు, పట్రది)

**పఠనము** (సం.వి.అ.న.) : పఠించుట, చదువు.

**పఠించు** (సం.స.క్రి.) : చదువు.

**పఠిత** (సం.విణ.) : (ఋ.ఈ.ఋ.) పఠించువాఁడు.

**పఠితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పఠింపఁ బడినది.

**పఠితవ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పఠింపఁ దగినది.

**పడఁకు** (దే.వి.) : 1. సందు; 2. గుహ.

**పడఁత** (దే.వి.) : హనువు.

**పడఁతి** (దే.వి.) : ఆఁడుది, ఇంతి, తొయ్యలి, వనిత.

**పడఁతుక** (దే.వి.) : (పడఁతి + ఉక) ఆఁడుది, ఇంతి, తొయ్యలి, వనిత. (స్వార్థమున ఉక.)

**పడగ** (వై.వి.) : 1. టెక్కెము; 2. సర్పఫణము; 3. స్త్రీకర్ణభూషా విశేషము.

**పడగదారి** (వై.వి.) : పాము, ఫణి. (ఇట్లు పడగ తాలుపు.)

**పడచు** (దే.స.క్రి.) : పడయు యొక్క రూపాం తరము. (పొందుటకు. సంపాదించుటకు.) (చూ. పడపు.)

**పడత** (దే.వి.) : పణతకు మొదటి రూపము.

**పడపు** (దే.వి.) : 1. అర్జనము; (చూ. పడపుఁ గొమ్మ) 2. ఆర్జిత విత్తము.

**పడమటికొండ** (ద్వ.వి.) : (పడమర + కొండ) పశ్చిమశైలము, అస్తపర్వతము.

**పడమటిదొర** (దే.వి.) : (పడమర + దొర) వరుణుఁడు.

**పడమర** (దే.వి.) : పశ్చిమదిక్కు. (విణ.) : పశ్చిమము.

**పడపుఁగొమ్మ** (దే.వి.) : (పడపు + కొమ్మ) వెలయాలు, వేశ్య. (ఇట్లు పడపుఁజెలి, పడపుఁ జేడియ.మొ.)

**పడము** (వై.వి.) : అందలమున క్రింద పఱచెడు రత్నకంబళము. (చూ. గొడియ, గొడె.)

**పడయు** (దే.స.క్రి.) : 1. పొందు; 2. సంపా దించు; 3. (బిడ్డను) కను.

**పడలు** (దే.వి.బ.) : రాసులు. (చూ. తొడరు శబ్దము నాలుగవ అర్థము)

**పడవ** (యు.దే.వి.) : 1.యుద్ధము; 2.ప్రళయము. (వై.) : చిన్న దోనె.

**పడవలము** (దే.వి.) : (పడలు + వలము) సేనా ముఖము, నాసీరము.

**పడవాలు** (వై.వి.) : 1. సేనాధిపతి; 2. స్వల్ప సేనాధిపతి.

**పడసాల** (ద్వ.వి.) : (పడము + సాల) కూటాము.

**పడాల** (వై.వి.) : అందలము మీఁది పన్నాగము.

**పడాలు** (వై.వి.) : పడవాలు యొక్క రూపాం తరము. (స్వల్ప సేనాధిపతికి.)

**పడి** (దే.వి.) : రెండుసోలలకొలఁది.

**పడికట్టు** (దే.వి.) : 1. తూనికకట్లె; 2. మర్యాద; 3. సోపానము.

**పడిగ** (వై.వి.) : తమ్మయుమిసెడి పాత్రము. (రూ. పడిగము.)

**పడిగల్లు** (దే.వి.) : (పడి + కల్లు) తుపాకిగుండు.

**పడిగాపు** (దే.వి.) : (పడి + కాపు) పంచను కాచి యుండు సేవకుఁడు.

**పడితరము** (దే.వి.) : ఏర్పాటు, ఏఁటేఁట వచ్చు మొత్తము.

**పడిదియ** (దే.వి.) : చాకలవాఁడు చలువలు అద్దెకిచ్చుట. (రూపాంతరము పడిదె.)

**పడిదెము** (దే.వి.) : ద్రవరూపమగు వ్యంజన విశేషము, ఊర్పు. (మొదటి రూపము పడిదియము.)

**పడియ** (దే.వి.) : నీళ్లు నిలిచిన చిన్నపల్లము.

**పడియచ్చు** (ద్వ.వి.) : ఒత్తిరూపమేర్పఱచుటకై తొలచిన యచ్చు.

**పడివాగె** (ద్వ.వి.) : ఎక్కుటకాయిత్త పఱచునపుడు సవరించెడు.

**పడిసెము** (వై.వి.) : శైత్యరోగవిశేషము.

**పడిహారి** (వై.వి.) : పణిహారి.

**పడు** (వై.అ.క్రి.) : 1.పతనమగు; 2. శ్రమము నొందు; 3.రాలు; 4.శయనించు; (చూ. ఊఁదనిఁ బాడు రెండవ యర్థము) 5.చచ్చు; 6.పూఁడు; 7.అస్తమించు. (స.క్రి.) : 1.అనుభవించు; 2.పొందు.

**పడుక** (వై.వి.) : పఱపు. (చూ. పడునాలుగవ యర్థము)

**పడుకటిల్లు** (ద్వ.వి.) : (పడుక + ఇల్లు) శయన గృహము.

**పడుకు** (దే.వి.) : ఱాయి, శిల. (చూ. తొడుకు.)

**పడుగాయ** (ద్వ.వి.) : (పడు+కాయ) రాలినకాయ.

**పడుగు** (దే.వి.) : 1. వస్త్రపునేఁతయందలి నిడుపు నూలు; 2. పైకప్పు తీసిన జొన్నకుచ్చెల వరికుప్ప లోనగునది.

**పడుగొమ్మ** (ద్వ.వి.) : (పడు+కొమ్మ) క్రిందికి పడుచున్న కొమ్మ, శిఫ.

**పడుచే** (దే.వి.) : 1. కన్యక; 2. కన్నెఱికముకాని వేశ్య; 3. బాలిక; 4. బాలుఁడు.

**పడుచేఁజేఁత** (ద్వ.వి.) : జారత్వము.

**పడుచేది** (దే.విణ.) : (పడుచు+ఆది) యౌవనము గలది.

**పడుచేరాసి** (ద్వ.వి.) : కన్యారాశి.

**పడుచేలతిండి** (దే.విణ.) : శిశుఘాతిని.

**పడుచేవాఁడు** (దే.విణ.) : యౌవనము గలవాఁడు.

**పడుదల** (దే.వి.) : పక్షివి శేషము, డాబ.

**పడువ** (దే.విణ.) : మిక్కిలి పల్లమైనది. (నేల)

**పడువరి** (ద్వ.వి.) : కోఁతకోయునప్పుడు గింజలు రాలి మొలచిన వరిపైరు.

**పడె** (దే.వి.) : పడియ యొక్క రూపాంతరము.

**పడ్డ** (వై.వి.) : తొలిచూలియావు. (లేక) గేదె.

**పణఁకు** (దే.వి.) : పడఁకు యొక్క రూపాంతరము.

**పణత** (దే.వి.) : నాఁగేటిగొడగ.

**పణము** (ఉభ.దే.వి.) : మల్లబంధ విశేషము. (సం.అ.పుం.) : 1.పందెము; 2.వెల; 3.కూలి; 4.ధనము; 5.జూదము; 6.కొనుట; 7. వ్యవహారము; 8. కర్షమెత్తు రాగి టంకము; 9.గవ్వయెత్తు; 10.అమ్మఁదగిన కూర లోనగు వాని పిడికిలి.

**పణవము** (సం.వి.అ.పుం.) : ఉడుక.

**పణస** (సం.వి.అ.పుం.) : పనస.

**పణాయితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పొగడఁబడినది.

**పణితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. పొగడఁబడినది; 2. పందెముగాఁ జేయఁబడినది.

**పణితవ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. పొగడఁదగినది; 2. అమ్మఁదగినది.

**పణిదియ** (దే.వి.) : పడిదియ యొక్క రూపాంతరము.

**పణిహారి** (వై.వి.) : ద్వారపాలకుఁడు.

**పణ్య** (సం.వి.ఆ.స్త్రీ.) : మానేరుతీఁగ. (విణ.) : 1.పొగడఁదగినది; 2. అమ్మఁదగినది.

**పణ్యవీథి** (సం.వి.ఈ.స్త్రీ.) : అంగడివీధి.

**పణ్యాంగన** (సం.వి.ఆ.స్త్రీ.) : వెలయాలు, వేశ్య.

**పణ్యాజీవుఁడు** (సం.వి.అ.పుం.) : వర్తకుఁడు, బేహారి.

**పణ్యారము** (వై.వి.) : 1.నానఁబప్పు; 2.భక్ష్యము.

**పతంగము** (సం.వి.అ.న.) : పాదరసము. (పుం.) : 1.పక్షి; 2.మిడుత; 3.బాణము; 4. పిల్లి; 5. శాలిధాన్య విశేషము.

**పతంగిక** (సం.వి.ఆ.స్త్రీ.) : తేనెటీఁగ, పుత్తిక.

**పతంగుఁడు** (సం.వి.అ.పుం.) : సూర్యుఁడు, వేఁడివేల్పు.

**పతకము** (వై.వి.) : హారమునడుమ నుండెడు రత్నపు బిల్ల.

**పతగము** (సం.వి.అ.పుం.) : పక్షి, పతంగము.

**పతత్తు** (సం.వి.త్.పుం.) : పక్షి, పతంగము.

**పతత్రము** (సం.వి.అ.న.) : ఱెక్క, పత్రము.

**పతత్రి** (సం.వి.ఇ.న్.పుం.) : పక్షి, గరుత్మంతము.

**పతద్గ్రహము** (సం.వి.అ.పుం.) : తమ్మపడిగము.

**పతనము** (సం.వి.అ.న.) : పడుట, పాటు.

**పతయాళువు** (సం.విశే.) : (ఉ.) పడెడు స్వభావము కలవాఁడు.

**పతాక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.టెక్కెము; 2. టెక్కెపుఁ గంబము; 3. సౌభాగ్యము; (అ.పుం.ము.) : అభినయ హస్త విశేషము. (బొటన వ్రేలిని వంచి చూపుడు వ్రేలి మొదటఁ గూర్చి వ్రేళ్లన్ని చక్కఁగాఁజాఁచి పట్టినది.)

**పతాకి** (సం.విశే.) : (న్.ఈ.న్) టెక్కెము గలవాఁడు.

**పతాకిని** (సం.వి.ఈ.స్త్రీ.) : సేన, ధ్వజిని.

**పతి** (సం.వి.ఇ.పుం.) : మగఁడు. (విశే.) : ఏలిక.

**పతింవర** (సం.వి.ఆ.స్త్రీ.) : తనంతట మగని వరించునట్టి ఆఁడుది, వర్య.

**పతితుఁడు** (సం.విశే.) : (అ.ఆ.అ.) 1. పడిన వాఁడు; 2. పదవి చెడినవాఁడు.

**పతిమ** (వై.వి.) : ప్రతిమ.

**పతివత్ని**(సం.వి.ఈ.స్త్రీ.) : మగనాలు (రూ. పతిపత్ని)

**పతివ్రత** (సం.వి.ఆ.స్త్రీ.) : పతిభక్తిగల యిల్లాలు. క్రొత్తడి.

**పత్తనము** (సం.వి.అ.న.) : పట్టణము, ప్రోలు.

**పత్తి** (ఉభ.దే.వి.) : ప్రత్తి. (సం.ఇ.స్త్రీ.) : 1. గమనము; 2. సేనా విశేషము. (ఒక రథము ఒక యేనుఁగు మూడు గుఱ్ఱములు ఏవురు కాల్బురునుగలది.) (పుం.) : కాలిబంటు.

**పత్తిరి** (వై.వి.) : పూజకుపయోగించెడు బిల్వ దళము లోనగునది.

**పత్తిరిబొట్టు** (వై.వి.) : తిలకవిశేషము.

**పత్తిరేకు** (దే.వి.) : లోహముల నదికించునపుడు పత్తివలెఁ గొట్టి పెట్టెడు సజాతీయమైన పొడిరేకు.

**పత్ని** (సం.వి.ఈ.స్త్రీ.) : అగ్నిసాక్షిగాఁ బెండ్లాడిన పెండ్లాము, భార్య.

**పత్రపరశువు** (సం.వి.ఉ.పుం.) : ఆకుఱాయి.

**పత్రపాశ్య** (సం.వి.ఆ.స్త్రీ.) : పాపటబొట్టు.

**పత్రభంగము** (సం.వి.అ.పుం.) : స్త్రీల యొక్క చెక్కిలి లోనగువానియందు వ్రాయఁబడు మకరికా పత్రము.

**పత్రము** (సం.వి.అ.న.) : 1.ఆకు; 2. వ్యవహారము యొక్క చెల్లుబడికై యొక రొకరు వ్రాసికొనెడు ఆకు; 3. ఱెక్క; 4. వాహనము; 5. బాణము; 6. చుర కత్తి; 7. లవంగపుఁబట్ట.

**పత్రరథము** (సం.వి.అ.పుం.) : పక్షి, పులుఁగు.

**పత్రరేఖ** (సం.వి.ఆ.స్త్రీ.) : (చూ.) పత్రభంగము.

**పత్రల** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.పెద్ద యేలకి; 2. శ్రీతాళము.

**పత్రలత** (సం.వి.ఆ.స్త్రీ.) : మిక్కిలి నిడుపుచురియ.

**పత్రలేఖ** (సం.వి.ఆ.స్త్రీ.) : (చూ.) పత్రభంగము.

**పత్రస్నుహి** (సం.వి.ఈ.స్త్రీ.) : ఆకుజెముడు.

**పత్రాంగము** (సం.వి.అ.న.) : 1. రక్తచందనము; 2. భూర్జము; 3. పద్మకాష్ఠము.

**పత్రాంగుళి** (సం.వి.ఈ.స్త్రీ.) : (చూ.) పత్ర భంగము.

**పత్రి** (ఉభ.వై.వి.) : పత్తిరి యొక్క రూపాంతరము. (సం.న్.పుం.) : 1. డేగ; 2. పక్షి; 3. బాణము; 4. కొండ; 5. మ్రాను; 6. రథికుఁడు.

**పత్రిక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.కాగితము; 2.వ్యవహారము యొక్క చెల్లుబడికై యొకరొకరు వ్రాసికొనెడు పత్రము.

**పత్త్రోర్ణము** (సం.వి.అ.న.) : ముఱికి యెత్తిన పట్టుచీర. (పుం.) : దుండిగము.

**పథము** (సం.వి.అ.పుం.) : మార్గము, త్రోవ.

**పథి** (సం.వి.న్.పుం.) : మార్గము, త్రోవ. (దీనికి ఈ రూపమున తెనుఁగునందు ప్రయోగము లేదు.)

**పథికుఁడు** (సం.వి.అ.పుం.) : దారి నడచువాఁడు.

**పథ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) హితము.

**పదంపడి** (దే.అవ్య.) : 1. వెనుక; 2. మఱియు.

**పదకము** (ఉభ.వై.వి.) : క్రమము. (సం. అ.పుం.) : పతకము.

**పదగుఁడు** (సం.వి.అ.పుం.) : కాలిబంటు.

**పదచాళి** (వై.వి.) : నాట్యభేదము, పెక్కణము. (చూ. తీరుపు.)

**పదటము** (దే.వి.) : ఆత్రము, తత్తఱము.

**పదటు** (దే.వి.) : పదటము యొక్క రూపాంతరము.

**పదడు** (దే.వి.) : బూడిద, భస్మము.

**పదను** (దే.వి.) : 1. సమయము; 2. తడి; 3. వాఁడి; 4. పరపాకము.

**పదనుకొను** (దే.అ.క్రి.) : తడియు.

**పదపడి** (దే.అవ్య.) : పదంపడి యొక్క రూపాంతరము. (వెనుక ననుటకు) (ఇక్కడ పదపడి అనఁగా అత్యంతము అని అర్థమగుచున్నది.)

**పదము** (సం.వి.అ.న.) : 1. పాదము; 2. పద్య పాదము; 3. ఇసుక లోనగు చోట్లఁ గనఁబడెడు పాదచిహ్నము; 4. చిహ్నము; 5. శబ్దము; 6. వాక్యము; 7. ప్రయత్నము; 8. స్థానము; 9. కపటము; 10. వస్తువు. (పుం.) : కిరణము.

**పదరము** (వై.వి.) : తములపాకులు పదిలముగా నుంచెడి యడపము.

**పదరు** (దే.అ.క్రి.) : 1. త్వరపడు; 2. కోపించు; 3. చలించు. (స.క్రి.) : ఆక్షేపించు.

**పదవి** (ఉభ.వై.వి.) : ఉన్నతస్థితి. (సం.ఈ.స్త్రీ.) : మార్గము.

**పదాజి** (సం.వి.ఇ.పుం.) : పదాతి.

**పదాతి** (సం.వి.ఇ.పుం.) : కాలిబంటు.

**పదార్థము** (సం.వి.అ.పుం.) : 1. వస్తువు; 2. శబ్దముల యొక్క అభిధేయము. (సప్త పదార్థములు. ద్రవ్యము, గుణము, కర్మము, సామాన్యము, విశేషము, సమవాయము, అభావము)

**పదాఱు** (ద్వ.స.) : (పది + ఆఱు) పదునాఱు.

**పది** (ఉభ.వై.స.) : తొమ్మిదియునొకటి, దశకము. (తఱుచుగా ఒకఁడు లోనగునవిపరమగుచో ఉదంతంబగు. ఉదా : పదునొకండు, పదు మూడు, పదు నాలుగు, పదినేను, పదు నాఱు, పదునేడు, పదునెనిమిది. పదుగురు. మొ.) (సం.వి.ద్.పుం.) : పాదము.

**పదింబదిగ** (ద్వ.క్రి.విణ.) : (పదియన్ + పది + కాన్.) గట్టిగా, చక్కఁగా.

**పదిక్షుఁడు** (సం.వి.అ.పుం.) : పదాతి, కాలిబంటు.

**పదియార్ధము** (ద్వ.వి.) : (పది + అర్ధము) పదునాఱు తూములు.

**పదిలపడు** (వై.అ.క్రి.) : 1. దృఢపడు; 2. స్థిర పడు. (చూ. పదిలించు) (ప్రే. పదిలపఱుచు)

**పదిలము** (వై.వి.) : స్థైర్యము. (విణ.) 1. జాగరూకము; 2. దృఢము.

**పదిలించే** (వై.స.క్రి.) : పదిలపఱుచు (దృఢ పఱచుటకు. స్థిరపఱచుటకు.)

**పదిలుడు** (వై.విణ.) : 1.జాగరూకుఁడు; 2.స్థిరుఁడు.

**పదుంద్రు** (ద్వ.స.) : పదుగుంద్రు యొక్క రూపాంతరము.

**పదుగు** (దే.వి.) : పదువునకు మొదటి రూపము.

**పదుగుండ్రు** (ద్వ.స.) : పదుగురునకు మాఱు రూపము.

**పదుగురు** (ద్వ.స.) : పదిమంది. (పదికి మహన్మ హత్యర్థక బహువచనాంతా దేశము)

**పదునల్తుము** (ద్వ.వి.) : (పది + నల్తుము) పదు నాలుగు తూములు.

**పదును** (దే.వి.) : (పది+ఊను) పది యంగుళ ముల వఱకు నేలయందు తడిచొచ్చునంతటి వర్షప్రమాణము.

**పదునెనమందుము** (ద్వ.వి.) : (పది + ఎన మందుము) పదునెనిమిది తూములు.

**పదునేడ్దుము** (ద్వ.వి.) : (పది+ఏడ్దుము) పదునేడు తూములు.

**పదునొకొల్తుము** (ద్వ.వి.) : (పది + ఒకొండు + తూము) పదునొకండు తూములు.

**పదుపు** (దే.వి.) : పదువు.

**పదుముత్తము** (ద్వ.వి.) : (పది + ముత్తుము) పదుమూడు తూములు.

**పదురు** (యు.దే.అ.క్రి.) : త్వరపడు. (వి.) : 1. విధము; 2. బ. త్వరితపుమాట.

**పదురుచే** (దే.ప్రే.) : పదురఁజేయు. (చూ. పద్రుచు)

**పదువు** (దే.వి.) : సజాతీయ ప్రాణి సమూహము. (పదుగు యొక్క రూపాంతరము.)

**పదువురు** (ద్వ.స.) : పదుగురు యొక్క రూపాంతరము.

**పద్గుఁడు** (సం.వి.అ.పుం.) : పదాతి, కాలిబంటు.

**పద్దియము** (వై.వి.) : పద్దెము.

**పద్దు** (వై.వి.) : 1. పంతము; 2. ప్రతిజ్ఞ; 3. అంకెలకత్తెము.

**పద్దెము** (వై.వి.) : పద్యము.

**పద్ధతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. త్రోవ; 2. వరుస; 3. అడుసు.

**పద్నాల్గు** (ద్వ.స.) : పదునాలుగు యొక్క రూపాంతరము.

**పద్మ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.లక్ష్మి; 2.బారంగి; 3. మెట్టదామర. (అ.పుం,న.ము.) : 1.తామర; 2. ఒకనిధి; (చూ.నిధి) 3. వ్యూహవిశేషము; 4. సంఖ్యావిశేషము; 5. ఏనుఁగు మొగము నందలిబొట్ల సమూహము (పుం.) : పాము.

**పద్మకము** (సం.వి.అ.న.) : 1. ఏనుఁగు మొగము నందలి బొట్ల సమూహము; 2. పద్మకాష్ఠము.

**పద్మకాష్ఠము** (సం.వి.అ.న.) : ఓషధీవిశేషము.

**పద్మకోశము** (సం.వి.అ.పుం.) : అభినయ హస్త విశేషము. (అయిదు వ్రేళ్లను కొనలు కూడకుండ నట్లు విల్లువలెవంచి యెడము గలవానిఁగాఁ బట్టినది)

**పద్మచారిణి** (సం.వి.ఈ.స్త్రీ.) : మెట్టదామర.

**పద్మనాభుఁడు** (సం.వి.అ.పుం.) : హరి, వెన్నుఁడు.

**పద్మనాయకులు** (సం.వి.అ.పుం.బ.) : నాలవ జాతిలో నొకతెగవారు.

**పద్మపత్రము** (సం.వి.అ.న.) : మెట్ట దామర దుంప.

**పద్మపుఁదీఁగ** (మి.వి.) : (పద్మము + తీఁగ) చోరపుష్పి.

**పద్మబాంధవుఁడు** (సం.వి.అ.పుం.) : సూర్యుఁడు, తామరచెలి.

**పద్మరాగము** (సం.వి.అ.పుం.) : మాణిక్య విశేషము, తామరకెంపు. (ఇది సింహళమున పుట్టినది, రక్తవర్ణము కలది, ఉత్తమ జాతి రత్నము. చూ. మాణిక్యము)

**పద్మవెలమలు** (మి.వి.గ్రా.బ.) : (చూ.) పద్మ నాయకులు.

**పద్మాకరము** (సం.వి.అ.పుం.) : 1. కొలను; 2. చెఱువు.

**పద్మాటము** (సం.వి.అ.పుం.) : తగిరిస.

**పద్మాలయ** (సం.వి.ఆ.స్త్రీ.) : లక్ష్మి, తమ్మియింటి గరిత.

**పద్మి** (సం.వి.న్.పుం.) : ఏనుఁగు, గజము, ద్విపము.

**పద్మిని** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. తామర తీఁగ; 2. తామర కొలను; 3. తామర తంపర; 4. స్త్రీ జాతి విశేషము; 5. ఆఁడేనుఁగు; 6. లక్ష్మి.

**పద్య** (సం.వి.ఆ.స్త్రీ.) : త్రోవ. (అ.న.ము.) : ఛందోబద్ధమైన కావ్యము. (పుం.డు.) : శూద్రుఁడు.

**పద్రుచు** (దే.ప్రే.) : పదురుచు యొక్క రూపాంతరము. (చూ. ఎద్రుచు)

**పన** (దే.వి.) : చేలలో కోసివేసిన ఓదెలప్రోగు.

**పనఁటి** (దే.వి.) : 1. వంటకుండ; 2. కుండ.

**పనవు** (వై.స.క్రి.) : ప్రలాపించు.

**పనస** (వై.వి.) : 1.వేదభాగము; 2.వృక్షవిశేషము. (దీనిఁ గొందఱు కవులు వైకృతముగా వాడి

యున్నారు కనుక సంస్కృతమున పణస అనియే పాఠము ఉండునని తోఁచెడి.)

**పనసవాండ్రు** (ద్వ.వి.) : కమసాలె వారిని యాచించి బ్రతుకువారు.

**పనాయితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పణాయితము.

**పని** (దే.వి.) : 1. వ్యాపారము; 2. కర్మము; 3. ప్రయోజనము; 4. శిల్పము; (ఇందు మంచి పని చేసి యున్నారు.) 5. నియోగము.

**పనిగొను** (దే.స.క్రి.) : (పని+కొను) నియోగించు.

**పనితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పొగడఁబడినది.

**పనిముట్టు** (దే.వి.) : కొఱముట్టు, ఉపకరణము.

**పనివంచు** (దే.స.క్రి.) : (పని + పంచు) పనిగొను, నియోగించు.

**పనివడు** (ద్వ.అ.క్రి.) : (పని + పడు) అక్కఱపడు.

**పనివాఁడు** (దే.వి.) : భృత్యుఁడు, కింకరుఁడు.

**పనివిను** (దే.అ.క్రి.) : ఆజ్ఞావశ వర్తియగు.

**పనుకు** (దే.అ.క్రి.) : అగ్రహించు.

**పనుగొను** దే.అ.క్రి.) : (పన్ను+కొను) 1. గట్టిపడు, దృఢపడు; 2. కలుగు.

**పనుచే** (దే.స.క్రి.) : 1. నియోగించు; 2. పుచ్చు. (చూ. అనుచు.)

**పనుపడు** (ద్వ.అ.క్రి.) : పన్నుపడు యొక్క రూపాంతరము. (కలుగుటకు. నాటుటకు.) (ప్రే. పనుపఱుచు)

**పనుపరి** (దే.విణ.) : (పసుపు + ఆరి) ఆజ్ఞకు లోఁబడినవాఁడు.

**పనుపు** (దే.వి.) : నియోగము. (చూ. పనుచు.)

**పన్న** (దే.విణ.) : 1. అనామధేయుఁడు; 2. వృద్ధుఁడు.

**పన్నకము** (దే.వి.) : పన్నుగడ, పన్నిక, రచన.

**పన్నగము** (సం.వి.అ.పుం.) : 1. పాము; 2. పద్మకాష్ఠము.

**పన్నగాశనుఁడు** (సం.వి.అ.పుం.) : గరుత్మంతుఁడు, పాఁపమేపరి.

**పన్నము** (ఉభ.వై.వి.) : వేదము నందలి అర్థమునకు అవయవము. (సం.విణ.) : (అ.ఆ.అ.) జాఱినది.

**పన్నా** (గ్రా.వి.) : కాకితము. వస్త్రము మొదలగువాని వెడల్పు.

**పన్నాగము** (దే.వి.) : అందలముమీఁది కప్పు.

**పన్నారు** (దే.వి.) : బాలికలాడుకొను గురిగి.

**పన్నిక** (దే.వి.) : పన్నుగడ, పన్నకము, రచన.

**పన్నిదము** (వై.వి.) : 1. జూదమునందు ఒడ్డెడు ధనాదికము; (చూ. పందెము) 2. పాచికలు గవ్వలు మొదలగువాని పొర్లిక.

**పన్నిద్దఱు** (ద్వ.స.) : (పది + ఇద్దఱు) పండ్రెండు మంది. (పండ్రెంటికి మహన్మ త్యర్థక బహువచ నాంతాదేశము)

**పన్నిద్దుము** (ద్వ.వి.) : (పది+ఇద్దుము) పండ్రెండు తూములు.

**పన్నిరుగురు** (ద్వ.స.) : (పది+ఇరుగురు) పన్నిద్దఱు.

**పన్నిరువురు** (ద్వ.స.) : పన్నిరుగురు యొక్క రూపాంతరము.

**పన్నిల్లము** (మి.వి.) : (పది + ఇల్లము) పండ్రెండు పలములు.

**పన్నీరము** (సం.వి.అ.న.) : పన్నీరు. సాహిత్య రత్నాకరమున రసతరంగము.

**పన్నీరు** (వై.వి.) : హిమాంబువు.

**పన్ను** (దే.అ.క్రి.) : 1. యుద్ధమునకు సిద్ధపడు; 2. కలుగు. (అం.ప్రే.) : 1. సిద్ధపరచు; 2. కలుగ జేయు. (అ.స.క్రి.) : 1. ఏర్పరుచు; 2. చేయు. (విణ.) : ఒప్పు.

**పన్నుండు** (దే.అ.క్రి.) : శయనించు, పరుండు.

**పన్నుగడ** (దే.వి.) : 1. రచన; 2. ఏతపుకడవపై దండెనుంచి త్రాళ్లతో బిగించుట.

**పన్నుపడు** (ద్వ.అ.క్రి.) : 1.వాడుకపడు; 2.కలుగు; 3.నాటు (చూ.పనుపడు.) (ప్రే. పన్నుపఱచు.)

**పన్నె** (దే.వి.) : 1. మగ్గమునందు పడుగు నూలు వేఱువేఱు చొప్పించుటకై నడుమ దువ్వెన

పంఢ్లవలె నిలువుగా నేర్పడి యుండునట్లు వెదురుబద్దలతో అడ్డముగాఁ గట్టఁబడిన సాలె వాని సాధన విశేషము; 2. అంకవన్నె వెనుకటి యినుప ముల్లు. (మొదటి రూపము పన్నియ.)

**పన్ను** (దే.వి.) : పనుపు యొక్క రూపాంతరము.

**పప్ప** (దే.వి.) : భక్ష్యము.

**పప్పణము** (సం.వి.అ.పుం.) : పాపట.

**పప్పర** (దే.వి.) : కింశుకము. (దీని భేదము నీరుపప్పర.)

**పప్పళి** (దే.వి.) : 1. వస్త్రమునందలి చిత్ర వర్ణ విశేషము, 2. చిత్రవర్ణ వస్త్ర విశేషము.

**పప్పు** (దే.వి.) : 1. పొట్టుపోయి బ్రద్దలైన కాయ ధాన్యము; 2. సూపము.

**పప్పుచేయు** (ద్వ.స.క్రి.) : నుఱుము చేయు.

**పబువు** (వై.విశే.) : ప్రభువు.

**పబ్బము** (వై.వి.) : 1. సంక్రాంతి లోనగునది; (చూ. కూళుఁడు.) 2.ఉత్సవము; 3.ఆతిథ్యము.

**పబ్లీకు** (అం.విశే.) : అందఱికి చెందిన, బహిరంగమైన.

**పముజు** (దే.వి.) : పంజునకు మొదటి రూపము.

**పమ్మకము** (దే.వి.) : అంచులు ముడిచి కుట్టెడు కుట్టు.

**పమ్ము**(దే.అ.క్రి.) : అతిశయించు. (పంబు యొక్క రూపాంతరము) (స.క్రి.) : అంచులు మడిచి కుట్టు.

**పయఁట** (వై.వి.) : స్త్రీల ఱొమ్ము మీఁది వస్త్రము. (పయ్యఁట యొక్క రూపాంతరము.)

**పయనము** (వై.వి.) : ప్రయాణము.

**పయనించు** (వై.అ.క్రి.) : ప్రయాణమగు.

**పయర** (దే.వి.) : 1. దక్షిణపుగాలి; 2. గాలి; 3. దక్షిణపు గాలిచేఁ బండెడు పెసలు లోనగు కాయధాన్యము. (పయ్యర యొక్క రూపాంతరము.)

**పయస్య** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.పాల; 2. పిన్నపాల; 3. రెడ్డివారి నానఁబ్రాలు. (విశే.) : 1. పాలకు హితవైనది; 2. పాల యందుఁబుట్టినది. (నేయి లోనగునది.)

**పయస్విని** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. ఆవు; 2. ఏఱు; 3. పాలగొలిమిడి.

**పయస్సు** (సం.వి.స్.న.) : 1. పాలు; 2. నీరు.

**పయోజము** (సం.వి.అ.న.) : తామర, నీటి పుట్టుగు.

**పయోధరము** (సం.వి.అ.పుం.) : 1.పాలిండ్లు; 2.మబ్బు; 3.టెంకాయ; 4.కోశకారమను చెఱకు.

**పయోధి** (సం.వి.ఇ.పుం.) : సముద్రము.

**పయోరాశి** (సం.వి.ఇ.పుం.) : సముద్రము, నీటికుప్ప.

**పయ్య** (వై.వి.) : పల్లవన్నె. (విశే.) : పల్లవన్నె గలది.

**పయ్యఁట** (వై.వి. పయఁట.

**పయ్యద** (ద్వ.వి.) : పయ్యెద యొక్క రూపాంతరము. (సంధిని వర్ణ వికారము.)

**పయ్యర** (దే.వి.) : 1. దక్షిణపు గాలి; 2. గాలి.

**పయ్యెద** (ద్వ.వి.) : (పయి + ఎద) పైఁట.

**పర** (ఉభ.దే.వి.) : 1.కంటిపొర; 2.అరఁటి లోనగు వాని పొర. (వై.విశే.) వృత్తియందు పరము శబ్దమునకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. (చూ.పరగడువు.) (సం.వి.) : (ఆ.స్త్రీ.) : వాగ్భేదము.

**పరంగి** (వై.వి.) : 1. శ్వేతముఖుఁడు; 2. మూలికా విశేషము.

**పరంగీలాగి** (ద్వ.వి.) : కెంపుజాతి దినుసు.

**పరంజ** (వై.వి.) : ఇల్లుకట్టునపుడు పనివారల కొఱకు కొయ్యలతోఁ గట్టిన కట్టడము; సారువ.

**పరంజము** (సం.వి.అ.పుం.) : 1. గానుఁగ; 2. చురకత్తియలుఁగు; 3. నురుఁగు.

**పరంపర** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. వరుస; 2. సంతానము; 3. హింస.

**పరంపరాకము** (సం.వి.అ.న.) : యజ్ఞము నందలి పశువధ.

**పరంపరావాహనము** (సం.వి.అ.న.) : తేరుమోకు. అనేకులు మోయునట్టి యందలము లోనగునది. (అని కొందఱు.)

**పరంపరుఁడు** (సం.వి.అ.పుం.) : ముమ్మనుమఁడు.

**పరఁగు** (వై.అ.క్రి.) : 1.ప్రయుక్తమగు; 2.ప్రవర్తిల్లు; 3. ప్రసరించు; 4. ప్రసిద్ధమగు; 5. ప్రయాణమగు; 6. ప్రవహించు; 7. విహరించు.

**పరఁట** (దే.వి.) : ఏఱుఁబిడక, కరీషము.

**పరఁటి** (దే.వి.) : పనఁటి యొక్క రూపాంతరము. (వంటకుండకు.)

**పరఁటిపుట్టువు** (దే.వి.) : అగస్త్యుఁడు, కుంభసంభవుఁడు.

**పరఁటె** (దే.వి.) : పంటెకు మొదటి రూపము. (చూ. కుంచె)

**పరక** (దే.వి.) : 1. రెండు వీసములు; 2. గడ్డి మొదలగు వానిపోఁచ.

**పరకాళాబట్ట** (వై.వి.) : తెల్లని నాజూకుబట్ట.

**పరకీయ** (సం.వి.ఆ.స్త్రీ.) : త్రివిధ నాయికలలో నొకతె. (చూ. నాయిక.) (విణ.) : ఇతరునిది.

**పరగడుపు** (ద్వ.వి.) : (పరము + కడుపు) ఆహారము వేయని కడుపు.

**పరగణా** (హిం.వి.) : జమీలోభాగము.

**పరచి** (దే.వి.) : (చూ.) ఎరవు, యాచితకము.

**పరాజాతుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) బానిసవాఁడు.

**పరజే** (దే.వి.) : పక్షి విశేషము.

**పరతంత్రుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) పరాధీనుఁడు.

**పరదా** (హిం.వి.) : తెర.

**పరదేశి** (సం.వి.న్.పుం.) : అన్యదేశము నందుండి వచ్చినవాఁడు, అతిథి.

**పరపత్తెము** (వై.వి.) : ఇతరుని యొద్ద చేబదులుగా ద్రవ్యము పుచ్చుకొనుట. (వానికి ఎక్కడను పరపత్తెము పుట్టలేదు. నేను పరపత్తెము చేసి ఆ వ్యాపారము చేసితిని.) (దీనిని పరపతి అనియు వాడెదరు.)

**పరపిండాదుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఒకరింటి కూడు తినువాఁడు.

**పరపు** (వై.ప్రే.) : 1. బాణము ప్రయోగించు; 2. ప్రవహింపఁజేయు. (విణ.) : విరివిగలది.

**పరభాగము** (సం.వి.అ.పుం.) : గుణోత్కర్షము.

**పరభృతము** (సం.వి.అ.పుం.) : కోయిల, పికము.

**పరభృత్తు** (సం.వి.త్.పుం.) : కాకి, వాయసము.

**పరమపదము** (సం.వి.అ.న.) : వైకుంఠము.

**పరమము** (సం.వి.అ.పుం.) : పరమాత్మ. (విణ.) : 1. ఆద్యము; 2. ఉత్కృష్టము; 3. ప్రధానము.

**పరమహంస** (సం.వి.అ.పుం.) : ఉత్తమ పదము నొందిన సన్న్యాసి.

**పరమాణువు** (సం. వి. ఉ. పుం.) : సూక్ష్మముల కంటె సూక్ష్మమైన అణువు.

**పరమాత్మ** (సం.వి.న్.పుం.) : పరబ్రహ్మము. (రూ. పరమాత్ముఁడు.)

**పరామానా** (హిం.వి.) : రాజాజ్ఞ, రాజుసన్నదు.

**పరమాన్నము** (సం.వి.అ.న.) : పాలు పోసి అనుకుగా వండిన యన్నము, పాయసము.

**పరము** (ఉభ.దే.వి.) : 1. కట్టెబండి మీఁది పఱపు మ్రాను; 2. చదును. (వై.) : అనశనవ్రతము, ప్రాణాచారము. (చూ. పరమువడు.) (వృత్తి యందు అంత్యవర్ణ లోపము. చూ. పర.) (సం. అ.న.) : 1.కేవలము; 2.మోక్షము. (విణ.) : 1. అన్యము; 2. దూరము; 3. మీఁదిది; 4. శ్రేష్ఠము.

**పరమువడు** (వై.అ.క్రి.) : (పరము + పడు) ప్రాణాచారముపడు.

**పరమేశ్వరుఁడు** (సం.వి.అ.పుం.) : 1. శివుఁడు; 2. విష్ణువు.

**పరమేష్ఠి** (సం.వి.న్.పుం.) : బ్రహ్మ, నలువ.

**పరవంజు** (దే.స.క్రి.) : కమ్ముకొను, ఆవరించు.

**పరవంతుఁడు** (సం.విణ.) : (త్.ఈ.త్.) పరాధీనుఁడు.

**పరవశము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పరాధీనము.

**పరవాది** (దే.విణ.) : అత్రగొట్టు.

**పరవు** (దే.అ.క్రి.) : వ్యాపించు. (వి.) : వ్యాపనము. (పరఁగు యొక్క రూపాంతరము.)

**పరశువు** (సం.వి.ఉ.పుం.) : గండగొడ్డలి.

**పరశ్వథము** (సం.వి.అ.పుం.) : గండగొడ్డలి.

**పరశ్శతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నూటి కంటె నధిక సంఖ్య గలది. (ఇట్లు పరస్సహస్రము.మొ.)

**పరస** (దే.వి.) : ఉత్సవమునకు వచ్చు జనము.

**పరస్పరము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అన్యోన్యము.

**పరస్మైపదము** (సం.వి.అ.న.) : క్రియాపదము యొక్క భేదము.

**పరాకు** (దే.వి.) : 1. తత్పరత; 2. ప్రమాదము.

**పరాకుఁడు** (సం.వి.అ.పుం.) : కుత్సితుఁడు.

**పరాకుపడు** (ద్వ.అ.క్రి.) : ప్రమాదపడు.

**పరాక్రమము** (సం.వి.అ.పుం.) : 1. వీర్యము; 2. శౌర్యము; 3. సామర్థ్యము; 4. ప్రారంభము.

**పరాక్రాంతి** (సం.వి.ఇ.స్త్రీ.) : పరాక్రమము.

**పరాగము** (సం.వి.అ.పుం.) : 1. పుప్పొడి; 2. దుమ్ము; 3. నలుఁగుపిండి; 4.రాహువు సూర్య చంద్రులను బట్టుట; 5. చందనము; 6. విఖ్యాతి; 7. పర్వతవిశేషము.

**పరాఙ్ముఖుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) పెడమొగము పెట్టినవాఁడు.

**పరాచకము** (గ్రా.వి.) : పరిహాసము, ఎకసక్యము.

**పరాచితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) బానిసవాఁడు.

**పరాచీనుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) పెడమొగము పెట్టినవాఁడు, పరాఙ్ముఖుఁడు.

**పరాజయము** (సం.వి.అ.పుం.) : అపజయము, ఓటు.

**పరాజితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఓడినవాఁడు.

**పరాత్పరుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) శ్రేష్ఠుల కందఱికి శ్రేష్ఠుఁడు.

**పరాధీనుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఒకరికి లోఁబడినవాఁడు.

**పరాన్నుడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఒకరింటి కూడు తినువాఁడు.

**పరాభవ** (సం.వి.అ.పుం.) : ఒక సంవత్సరము. (చూ.సంవత్సరము.) (ము.) : 1. అవమానము; 2. నాశము.

**పరాభవించే** (సం.స.క్రి.) : అవమానించు.

**పరాభూతి** (సం.వి.ఇ.స్త్రీ.) : పరాభవము.

**పరాభూతుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) పరాభవింపఁబడినవాఁడు.

**పరామరిక** (వై.వి.) : పరామర్శము.

**పరామరిస** (వై.వి.) : పరామర్శము.

**పరామరిసించే** (వై.స.క్రి.) : పరామర్శ చేయు.

**పరామర్శము** (సం.వి.అ.పుం.) : చక్కగా విచారించుట.

**పరామర్శించే** (సం.స.క్రి.) : చక్కగా విచారించు.

**పరాయణము** (సం.వి.అ.న.) : ఆశ్రయము, ప్రాపు. (విణ.) : అభీష్టము.

**పరాయణుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఒకట ఆసక్తి గలవాఁడు.

**పరాయి** (వై.విణ.) : ఇతరము. (వీఁడు పరాయి వాఁడు.) (ఇది వాడుకలోనిది.)

**పరారి** (దే.విణ.) : ఎత్తుపడి ఊరు విడిచి పాఱిపోయినవాఁడు.

**పరాసుఁడు** (అన్య.వి.) : ఫ్రెంచివాఁడు.

**పరార్థవాది** (సం.వి.న్.పుం.) : వకీలు.

**పరార్థ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ముఖ్యము.

**పరావృతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పొర్లాడినది.

**పరాసనము** (సం.వి.అ.న.) : చంపుట, మారణము.

**పరాసువు** (సం.విణ.) : (ఉ.) చచ్చినవాఁడు.

**పరాస్కంది** (సం.వి.న్.పుం.) : దొంగ, చోరుఁడు.

**పరాస్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. అపజయ మొందినది; 2. నిరాకరింపఁ బడినది.

**పరి** (దే.వి.) : 1.సేన; 2.సమూహము; 3.పఙ్క్తి; 4. వేష్టనము; 5. ఆవృత్తి. (పారి యొక్క రూపాం తరము) (ఈ యర్థమందిదియే కార్థక శబ్ద పూర్వకముగానే ప్రయోగింపఁబడును. ఉదా: ఒక పరి ఒక్కపరి మొ.)

**పరిఁజించే** (వై.స.క్రి.) : పరుఁజుతోఁ బట్టు.

**పరిక** (దే.వి.) : ముగ్గు.

**పరికరము** (సం.వి.అ.పుం.) : 1. ఒక యర్థా లంకారము; (చూ.అలంకారము) 2.ఉప కరణము; 3.సమూహము; 4.పరివారము; 5. నడికట్టు; 6.యోగ పట్టె; 7.ప్రారంభము; 8.మంచము; 9. వివేకము.

**పరికరించే** (వై.స.క్రి.) : పరీక్షించు.

**పరికర్మము** (సం.వి.న్.న.) : దేహము నందలి ముఱికి పోఁగొట్టుట.

**పరికాఁడు** (దే.వి.) : తెగకు ముఖ్యమైన యేనుఁగు, యూథపము.

**పరికి** (దే.వి.) : కిరాతభేదము.

**పరికరించే** (వై.స.క్రి.) : పరీక్షించు.

**పరికించే** (వై. స. క్రి.) : 1. పరీక్షించు; 2. విచారించు.

**పరికిణీ** (దే.వి.) : పావడ, గాగర.

**పరికూటము** (సం.వి.అ.పుం.) : గవని వాకిట నుండెడు మట్టిదిబ్బ.

**పరికె** (దే.వి.) : ఒక దినుసు గడ్డ, త్రిశృంగము.

**పరిక్రమము** (సం.వి.అ.పుం.) : విహారము.

**పరిక్రియ** (సం.వి.ఆ.స్త్రీ.) : చుట్టుకొని వచ్చుట.

**పరిక్షిప్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నలుప్రక్కలఁ జుట్టఁబడినది.

**పరిక్షేపము** (సం.వి.అ.పుం.) : 1. చుట్టుకొని యుండుట; 2. విత్తుట.

**పరిఖ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఆగడ్త, ఖేయము.

**పరిగణనము** (సం.వి.అ.న.) : ఎన్నిక.

**పరిగణించు** (సం.స.క్రి.) : ఎంచు, ఎన్ను.

**పరిగణితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఎన్నఁబడినది.

**పరిగతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. కదలి పోయినది; 2. చుట్టఁబడినది; 3. తెలియఁ బడినది; 4. పొందఁబడినది; 5. మఱవఁ బడినది.

**పరిగృహీతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ప్రియముతో పుచ్చుకొనఁబడినది.

**పరిగె** (దే.వి.) : 1. వృక్షవిశేషము; 2. మత్స్య విశేషము. (మొదటి రూపము పరిగియ.) (క్రి.విణ.) : శీఘ్రము.

**పరిగొను** (దే.అ.క్రి.) : బారుతీరు.

**పరిగ్రహణము** (సం.వి.అ.న.) : ప్రియముతో పుచ్చుకొనుట.

**పరిగ్రహము** (సం.వి.అ.పుం.) : 1. ప్రియముతో పుచ్చుకొనుట; 2. భార్య; 3. పరివారము; 4. సంచి మొదలు; 5. శాపము; 6. ఉపకరణము.

**పరిగ్రహించే** (సం.స.క్రి.) : ప్రియముతో పుచ్చుకొను.

**పరిఘము** (సం.వి.అ.పుం.) : 1. ఒక గ్రహ యోగము; (చూ. యోగము) 2. ఇనుపకట్ల గుదియ; 3. బాణము; 4. గడియమ్రాను; 5. కోటగవను; 6. గాజుకుండ; 7. కుండ; 8. దెబ్బ.

**పరిఘూణించే** (దే.అ.క్రి.) : ఎదురాడు. (దీనికి ఇతర ప్రయోగము కనఁబడలేదు.)

**పరిఘాతనము** (సం.వి.అ.పుం.) : ఇనుపకట్ల గుదియ, లవుడి.

**పరిఘోషము** (సం.వి.అ.పుం.) : 1. ఉఱుము; 2. సైఁగచేఁ దెలిపెడు మాట; 3. మ్రోఁత.

**పరిచయము** (సం.వి.అ.పుం.) : 1. ఎఱుక; 2. స్నేహము.

**పరిచయించే** (సం.అ.క్రి.) : స్నేహించు, మరగు.

**పరిచరించే** (సం.అ.క్రి.) : పరిచర్య చేయు.

**పరిచరుఁడు** (సం.వి.అ.పుం.) : కాచియుండు భటుఁడు. సేనగాచు భటుఁడు. (అని కొందఱు.)

**పరిచర్య** (సం.వి.ఆ.స్త్రీ.) : సేవ, కొలువు.

**పరిచాయ్యము** (సం.వి.అ.పుం.) : యాగాగ్ని యందుపయోగింపఁదగిన పేరు, సమూహ్యము.

**పరిచారకుఁడు** (సం.వి.అ.పుం.) : ఊడిగపువాఁడు.

**పరిచారము** (సం.వి.అ.పుం.) : పరిచర్య.

**పరిచారిక** (సం.వి.ఆ.స్త్రీ.) : ఊడిగపుది.

**పరిచార్యుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) పరిచర్య చేయఁదగిన వాఁడు.

**పరిచితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పరిచయము గలది.

**పరిచితి** (సం.వి.ఇ.స్త్రీ.) : పరిచయము.

**పరిచ్యుతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చక్కగా విడువఁబడినది.

**పరిచాళిక** (దే.వి.) : మల్లబంధ విశేషము.

**పరిచ్ఛదము** (సం.వి.అ.పుం.) : 1. కప్పుడు వస్త్రము; 2. పరిజనము.

**పరిచ్ఛిత్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : నిశ్చయము.

**పరిచ్ఛిన్నము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పరిచ్ఛేదము నొందినది.

**పరిచ్ఛేదము** (సం.వి.అ.పుం.) : 1. గ్రంథభాగము; 2. మేర.

**పరిజనము** (సం.వి.అ.పుం.) : పరివారము, బలఁగము.

**పరిఢవము** (దే.వి.) : అతిశయము, విశేషము.

**పరిఢవించు** (దే.ప్రే.) : 1. పరిఢవిల్లఁ జేయు, నడపు; 2. అతిక్రమించు; 3. ధరించు.

**పరిఢవిల్లు** (దే.అ.క్రి.) : 1. ప్రవర్తిల్లు, నడచు; 2. అతిశయిల్లు.

**పరిణతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. పరిపాకముఁ బొందినది; 2. కొమ్ముతో నడ్డముగాఁ బొడిచినది. (ఏనుఁగు.)

**పరిణతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. పరిపాకము; 2. త్రివిధమైన తెనుఁగు క్రియలలో నొకటి.

**పరిణద్ధము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కట్టఁ బడినది.

**పరిణమించే** (సం.అ.క్రి.) : సంతోషించు. (ఇక్కడ సకర్మముగాఁ గనఁబడు చున్నది.)

**పరిణయము** (సం.వి.అ.పుం.) : వివాహము, పెండ్లి.

**పరిణామము** (సం.వి.అ.పుం.) : 1.ఒక యర్థా లంకారము; (చూ. అలంకారము) 2. క్షేమము; 3. అడ్డముగా విసరఁబడిన యేనుఁగు కొమ్ము దెబ్బ; 4. మాఱు రూపు.

**పరిణాయము** (సం.వి.అ.పుం.) : సారెల యొక్క సవ్యాపసవ్య ప్రసారణము.

**పరిణాహము** (సం.వి.అ.పుం.) : వెడలుపు, వైశాల్యము.

**పరిణేత** (సం.వి.ఋ.పుం.) : మగఁడు, భర్త.

**పరితపించే** (సం.అ.క్రి.) : సంతాపమునొందు.

**పరితము** (వై.వి.) : కోయిల, పికము.

**పరితాపము** (సం.వి.అ.పుం.) : 1. సంతాపము; 2. నరక విశేషము.

**పరితుష్టి** (సం.వి.ఇ.స్త్రీ.) : మిక్కిలి సంతోషము.

**పరితోషము** (సం.వి.అ.పుం.) : మిక్కిలి సంతోషము.

**పరితోషించే** (సం.అ.క్రి.) : మిక్కిలి సంతోషించు.

**పరిత్యక్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) బొత్తిగా విడువఁదగినది.

**పరిత్యజించే** (సం.స.క్రి.) : బొత్తిగా విడుచు.

**పరిత్యాగము** (సం.వి.అ.పుం.) : బొత్తిగా విడుచుట.

**పత్యాజ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) బొత్తిగా విడువఁబడినది.

**పరిత్రాణము** (సం.వి.అ.న.) : 1. రక్షణము; 2. చాలుననెడి తలఁపు. చంప వచ్చిన వాని నడ్డగించుట. (అని కొందఱు.)

**పరిదానము** (సం.వి.అ.న.) : వస్తువుల మాఱుపు.

**పరిది** (వై.వి.) : సూర్యాది పరివేషము.

**పరిదేవనము** (సం.వి.అ.న.) : దుఃఖము తోడిమాట.

**పరిద్రోణి** (సం.వి.ఈ.స్త్రీ.) : నారకడపు పొత్తి.

**పరిధానము** (సం.వి.అ.న.) : దోవతి, అంతరీయము.

**పరిధి** (సం.వి.ఇ.పుం.) : 1. సూర్యాది పరి వేషము; 2. యజ్ఞము నందు పశుబంధనార్థము నాటిన పై పట్టగల కొయ్య.

**పరిధిస్థుఁడు** (సం.వి.అ.పుం.) : చుట్టుకొని కాచి యుండు భటుఁడు. సేవచుట్టును కాచువాఁడు. (అని కొందఱు.)

**పరిపంథి** (సం.వి.న్.పుం.) : 1. శత్రువు; 2. తెరువాటుదొంగ.

**పరిపక్వము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పరిపాకము నొందినది.

**పరిపణము** (సం.వి.అ.న.) : మూలధనము, సంచిమొదలు.

**పరిపరి** (దే.విణ.) : బహుప్రకారము.

**పరిపాకము** (సం.వి.అ.పుం.) : పరువము.

**పరిపాటి** (సం.వి.ఇ.స్త్రీ.) : అనుక్రమము, సొరిది.

**పరిపాలకుఁడు** (సం.విణ.) : (అ.ఈ. అ.) చక్కగా కాపాడువాఁడు.

**పరిపాలనము** (సం.వి.అ.న.) : చక్కగా కాపాడుట.

**పరిపాలించే** (సం.స.క్రి.) : చక్కగా కాపాడు.

**పరిపాలితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చక్కగా కాపాడఁబడినది.

**పరిపూతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చక్కగా పవిత్రమైనది.

**పరిపూర్ణము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చక్కగా నిండినది.

**పరిపూర్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : చక్కగా నిండుట.

**పరిపేలనము** (సం.వి.అ.న.) : కయివడిముస్తె.

**పరిపోషకుఁడు** (సం.విణ.) : (అ.ఆ. అ.) చక్కగా పోషింపఁబడిన వాఁడు.

**పరిపోషణము** (సం.వి.అ.న.) : చక్కగా పోషించుట.

**పరిపోషించే** (సం.స.క్రి.) :చక్కగా పోషించు.

**పరిపోషితుఁడు** (సం.విణ.) : (అ.ఆ. అ.) చక్కగా పోషించువాఁడు.

**పరిప్లవము** (సం.వి.అ.పుం.) : నీరుకోడి. (విణ.) కదలునది.

**పరిబర్హము** (సం.వి.అ.పుం.) : 1. శ్వేతచ్ఛత్రాది రాజార్హ వస్తువు; 2. పరివారము.

**పరిభవము** (సం.వి.అ.పుం.) : అవమానము.

**పరిభవించే** (సం.స.క్రి.) : అవమానించు.

**పరిభావము** (సం.వి.అ.పుం.) : పరిభవము యొక్క రూపాంతరము.

**పరిభాష** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. పదార్థ వివేచ కాచార్యుల యొక్క యుక్తియుక్త వాక్కు; 2. గ్రంథ సంక్షేప నిర్వాహము కొఱకు చేయునట్టి సంకేత విశేషము.

**పరిభాషణము** (సం.వి.అ.న.) : 1.నిందా సహితమైన యుపాలంభము; 2. ఆలాపము; 3.నియమము.

**పరిభూతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అవమా నింపఁబడినది.

**పరిభ్రమము** (సం.వి.అ.పుం.) : అంతట తిరుగుట.

**పరిభ్రమించే** (సం.అ.క్రి.) : అంతట తిరుగు.

**పరిమండలము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అంతట గుండ్రమైనది.

**పరిమళము** (సం.వి.అ.పుం.) : 1.మెదుపుట వలనను రాయిడివలనను బుట్టిన యొప్పిదపు తావి; 2. సురతమున నలఁగిన మేనిపూఁత లోనగువాని వలనఁ బుట్టినతావి; 3. మెదుపుట; 4.రాయిడి.

**పరిమళించే** (సం.అ.క్రి.) : తావివీచు.

**పరిమాణము** (సం.వి.అ.న.) : తూము లోనగు వాని కొలత, ప్రస్థమానము.

**పరిమార్జనము** (సం.వి.అ.న.) : అంతట తుడుచుట.

**పరిమాఱుచు** (దే.స.క్రి.) : (పరియ + మాఱుచు) 1. ఖండించు; 2. చంపు. (రూ. పరిమార్చు. ఖండించుటకు.)

**పరిమితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. కొలఁది యిడఁబడినది; 2. చేర్పఁబడినది.

**పరిమితి** (సం.వి.ఇ.స్త్రీ.) : కొలఁది, పరిమాణము.

**పరియ** (దే.వి.) : పఱియయొక్క రూపాంతరము. (చూ. పరిమాఱుచు.)

**పరియంకము** (వై.వి.) : శయ్య.

**పరియాచకము** (వై.వి.) : పరిహాసము. (అది నిజముకాదు పరియాచకము.)

**పరియాచేకము సేయు** (వై.స.క్రి.) : (పరియాచ కము + చేయు) పరిహాసించు.

**పరియు** (దే.అ.క్రి.) : 1.తప్పు; 2.చెడు; 3.మీఁది భాగము సారహీనమై చెక్కలు వాసి రాలు.

**పరిరంభము** (సం.వి.అ.పుం.) : ఆలింగనము, కౌఁగిలింత.

**పరివట్టము** (వై.వి.) : విష్ణుప్రసాదముగా గ్రహించి తలఁజుట్టుకొనుపట్టు.

**పరివర్జనము** (సం.వి.అ.న.) : 1. బొత్తిగా విడుచుట; 2. చంపుట.

**పరివర్జితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) బొత్తిగా విడువఁబడినది.

**పరివర్తనము** (సం.వి.అ.న.) : 1. వస్తువుల మాఱుపు; 2. చుట్టివచ్చుట; 3. వెనుకకు తిరుగుట. (రూ. పరివర్తము)

**పరివర్తించే** (సం.అ.క్రి.) : చుట్టివచ్చు, తిరుగు.

**పరివసథము** (సం.వి.అ.పుం.) : గ్రామము, ఊరు.

**పరివాదము** (సం.వి.అ.పుం.) : 1. దూఱు; 2. వీణవాయించెడి కొడుపు.

**పరివాదిని** (సం.వి.ఈ.స్త్రీ.) : ఏడు తంతులు గల వీణ.

**పరివాపనము** (సం.వి.అ.న.) : గొఱుగుట, మండనము.

**పరివాపము** (సం.వి.అ.పుం.) : 1. వెద పెట్టుట; 2.కొలఁది; 3.పాదు; 4.తనివి.

**పరివాపితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) గొఱుగఁ బడినది. చక్కగా ఛేదింపఁబడినది. (అని కొందఱు.)

**పరివారము** (సం.వి.అ.పుం.) : 1. పరిజనము; 2. సేన; 3. కత్తియొఱ.

**పరివాహము** (సం.వి.అ.పుం.) : పరీవాహమునకు మొదటి రూపము.

**పరివిగ్నము** (సం.విణ.) : (అ.ఆ.అ.) (చూ.) ఉద్విగ్నము.

**పరివిత్తి** (సం.వి. ఇ.పుం.) : తమ్మునికి పెండ్లి యయి తనకు లేకుండెడి యన్న. (రూ. పరి విత్తుఁడు. అ.పుం.)

**పరివృఢుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ప్రభువు, ఏలిక, (రూ. పరీవృఢుఁడు.)

**పరివృతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1.చుట్టఁ బడినది; 2.పొందఁబడినది; 3.తెలియఁ బడినది.

**పరివృత్తి** (సం.వి.ఇ.పుం.) : ఒక యర్థాలంకారము. (చూ. అలంకారము.)

**పరివేత్త** (సం.వి.ఋ.పుం.) : అన్నకన్న ముందు పెండ్లాడిన తమ్ముఁడు.

**పరివేషము** (సం.వి.అ.పుం.) : 1. గాలి గుడి; 2. పరివేష్టనము. (రూ. పరివేశము.)

**పరివేష్టనము** (సం.వి.అ.న.) : 1. చుట్టి వచ్చుట; 2. పరివట్టము.

**పరివేష్టించే** (సం.స.క్రి.) : చుట్టివచ్చు.

**పరివ్యాధము** (సం.వి.అ.పుం.) : 1. కొండగోఁగు; 2. నీరు ప్రబ్బ.

**పరివ్రాజకుఁడు** (సం.వి.అ.పుం.) : సన్యాసి.

**పరివ్రాట్టు** (సం.వి.జ్.పుం.) : సన్యాసి.

**పరిశిష్టము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కడపట శేషించినది.

**పరిశీలనము** (సం.వి.అ.న.) : శోధనము.

**పరిశీలించే** (సం.స.క్రి.) : శోధించు.

**పరిశుద్ధము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మిక్కిలి శుద్ధి పొందినది.

**పరిశుద్ధి** (సం.వి.ఇ.స్త్రీ.) : మిక్కిలి గరగర.

**పరిశోధనము** (సం.వి.అ.న.) : మిక్కిలి శోధించుట.

**పరిశోధించు** (సం.స.క్రి.) : మిక్కిలి శోధనము చేయు.

**పరిశ్రమము** సం.వి.అ.పుం.) : 1. అలవాటు; 2. మిక్కిలి అలపు.

**పరిశ్రాంతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మిక్కిలి యూఱటఁ జెందినది.

**పరిశ్రాంతి** (సం.వి.ఇ.స్త్రీ.) : మిక్కిలి యూఱట.

**పరిషత్తు** (సం.వి.ద్.స్త్రీ.) : 1.సభ; 2.సమూహము.

**పరిషేచనము** (సం.వి.అ.న.) : పుడిసిట నీళ్లు పోసికొని భోజన పాత్రాదుల చుట్టు విడుచుట.

**పరిష్కరించే** (సం.స.క్రి.) : చక్కఁబెట్టు.

**పరిష్కారము** (సం.వి.అ.పుం.) : 1. చక్కఁబెట్టుట; 2. తొడవు.

**పరిష్కృతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. చక్కఁ బెట్టఁబడినది; 2. అలంకరింపఁబడినది.

**పరిష్కృతి** (సం.వి.ఇ.స్త్రీ.) : పరిష్కారము.

**పరిష్వంగము** (సం.వి.అ.పుం.) : కౌఁగిలింత.

**పరిసంఖ్య** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. ఒక యర్థా లంకారము; (చూ.అలంకారము) 2. ఒక విధి. (చూ.విధి.)

**పరిసరము** (సం.వి.అ.పుం.) : 1. సమీపము; 2. చావు.

**పరిసర్పము** (సం.వి.అ.పుం.) : చుట్టివచ్చుట.

**పరిసర్య** (సం.వి.ఆ.స్త్రీ.) : కొండ లోనగు వాని సమీప మార్గము ననుసరించి పోవుట. అంతట తిరుగుట. (అని కొందఱు.)

**పరిసారము** (సం.వి.అ.పుం.) : (చూ.) పరిసర్య.

**పరిసెనము** (దే.వి.) : గంతు. (డేగలకు ఆఁకలెత్తి వేఁటయందు చొరవ కలుగుటకై మందిచ్చి యెత్తించెడు వాంతి అని కొందఱు దీనికర్థము చెప్పెదరు. ఆపక్షమున పరిసెనంబులు సేయునవి యని పాఠము.)

**పరిస్కందుఁడు** (సం.వి.అ.పుం.) : బానిసవాఁడు.

**పరిస్తరణము** (సం.వి.అ.న.) : అగ్ని చుట్టుపఱచిన దర్భ.

**పరిస్తోమము** (సం.వి.అ.పుం.) : ఏనుఁగు మీఁద పఱచెడి యెఱ్ఱ కంబళి, కుథము.

**పరిస్పందము** (సం.వి.అ.పుం.) : 1. మాల్యాది నిర్మాణము; 2. దర్పణా ద్యుపకరణము.

**పరిస్ఫోటనము** (సం.వి.అ.న.) : 1. చీల్చుట; 2. ప్రకాశింపఁ జేయుట.

**పరిస్ఫోటించు** (సం.స.క్రి.) : 1. చీల్చు; 2. ప్రకాశింపఁ జేయు.

**పరిస్రుత** (సం.వి.ఆ.స్త్రీ.) : కల్లు. (విణ.) : కాఱినది.

**పరిహరించే** (సం.స.క్రి.) : విడుచు, విసర్జించు.

**పరిహసనము** (సం.వి.అ.న.) : పరిహాసము, నగవు.

**పరిహసించే** (సం.స.క్రి.) : పరిహాసము చేయు, నవ్వు.

**పరిహారము** (సం.వి.అ.పుం.) : 1.విడుపు; 2.చేయి.

**పరిహారి** (సం.విణ.) : (న్.ఈ.న్) పరిహ రించువాఁడు.

**పరిహార్యము** (సం.వి.అ.పుం.) : హస్త వలయము. (విణ.) : విడువఁదగినది.

**పరిహాసము** (సం.వి.అ.పుం.) : పరియాచకము.

**పరిహృతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పరిహ రింపఁబడినది.

**పరిహృతి** (సం.వి.ఇ.స్త్రీ.) : విడుపు, పరిహారము.

**పరీక్ష** (సం.వి.ఆ.స్త్రీ.) : పరిశీలనము.

**పరీక్షకుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) పరీ క్షించువాఁడు.

**పరీక్షించు** (సం.స.క్రి.) : పరిశీలించు, పరికించు.

**పరీతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చుట్టుకోఁ బడినది.

**పరీతాపము** (సం.వి.అ.పుం.) : సంతాపము. (పరితాపము యొక్క రూపాంతరము)

**పరీధావి** (సం.వి.న్.పుం.) : ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము)

**పరీభావము** (సం.వి.అ.పుం.) : పరిభావము యొక్క రూపాంతరము.

**పరీరంభము** (సం.వి.అ.పుం.) : పరిరంభము యొక్క రూపాంతరము.

**పరీవర్తము** (సం.వి.అ.పుం.) : వస్తువుల మాఱుపు. (పరివర్తము యొక్క రూపాంతరము.)

**పరీనాదము** (సం.వి.అ.పుం.) : దూఱు. (పరివాదము యొక్క రూపాంతరము.)

**పరీవాపము** (సం.వి.అ.పుం.) : పరివాపము యొక్క రూపాంతరము.

**పరీవారము** (సం.వి.అ.పుం.) : 1.పరిజనము; (పరివారము యొక్క రూపాంతరము.) 2.కత్తి యొఱ; 3. తిరిగెడు ప్రాణి.

**పరీవాహము** (సం.వి.అ.పుం.) : 1. కలుఁజు; 2. శ్వేతచ్ఛత్రాదిరాజార్హ వస్తువు.

**పరీవృతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పరివృతము యొక్క రూపాంతరము.

**పరీష్టి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. ఆమంత్రణార్థము వెదకుట; 2. పరిచర్య; 3. ప్రాకామ్యమను ఒక ఐశ్వర్యము.

**పరీసారము** (సం.వి.అ.పుం.) : పరిసారము యొక్క రూపాంతరము.

**పరీహాసము** (సం.వి.అ.పుం.) : పరిహాసము యొక్క రూపాంతరము.

**పరుండు** (దే.అ.క్రి.) : (పడి+ఉండు) శయనించు. (రేఫా దేశము.)

**పరుఁజో** (వై.వి.) : కత్తిపిడి, త్సరువు.

**పరుఁడు** (సం.వి.అ.పుం.) : 1. శత్రువు; 2. పరమాత్ముఁడు. (విణ.) : అన్యుఁడు.

**పరుగు** (దే.వి.) : 1. ప్రధావనము; 2. కోసు దూరము.

**పరుగెత్తు** (దే.అ.క్రి.) : (పరుగు + ఎత్తు) ప్రధావించు. (రూ. పరువెత్తు.)

**పరువడి** (దే.వి.ఏ.) : (పరువు + వడి) 1. పర్యాయము; (చూ. తత్తబడ) 2. క్రమము.

**పరువము** (వై.వి.) : 1. ప్రాయము; యౌవనము. (అని కొందఱు.) 2. పరిపాకము.

**పరువిడు** (దే.అ.క్రి.) : (పరువు+ఇడు) పరుగెత్తు. (మొదటి రూపము పరుగిడు.)

**పరువు** (ఉభ.దే.వి.) : 1. ధావనము; 2. కోసు దూరము (పరుగు యొక్క రూపాంతరము) (వై.): 1. పరిపాకము; 2. గౌరవము. (సం.ఉ. పుం.స్.న.) : వెదురుగనుపు.

**పరువుగొను** (దే.అ.క్రి.) : (పరువు + కొను) పరుగెత్తు. (మొదటి రూపము పరుగుగొను.)

**పరువువాఱు** (దే.అ.క్రి.) : (పరువు + పాఱు) పరుగెత్తు. (మొదటి రూపము పరుగువాఱు.)

**పరువువెట్టు** (దే.అ.క్రి.) : (పరువు + పెట్టు) పరుగెత్తు. (మొదటి రూపము పరుగువెట్టు.)

**పరుషము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. నిష్ఠురము; 2. నిష్ఠురవాక్యము; 3. చిత్రవర్ణము.

**పరుస** (వై.వి.) : బాటసారుల సమూహము. (విణ.) : కఠినుఁడు.

**పరుసన** (వై.వి.) : పారుష్యము. (విశేషణ మగుచో) (చూ. అలకన.)

**పరుసము** (వై.వి.) : స్పర్శవేధి. (విణ.) : పరుషము.

**పరుసవేది** (వై.వి.) : స్పర్శవేధి.

**పరుసు** (దే.వి.) : విధము. (ఇది ఆ,ఈ ఏ శబ్ద పూర్వకముగానే ప్రయోగముల యందుఁ గానఁబడుచున్నది.)

**పరూషము** (సం.వి.అ.పుం.) : పేరీఁదు.

**పరూషి** (సం.వి.ఈ.స్త్రీ.) : చిట్టీఁదు.

**పరేతరాట్టు** (సం.వి.జ్.పుం.) : యముఁడు.

**పరేతుఁడు** (సం.వి.అ.పుం.) : భూత విశేషము. (విణ.) : చచ్చినవాఁడు.

**పరేష్టుక** (సం.వి.ఆ.స్త్రీ.) : పెక్కీఁతలీనిన యావు.

**పరైధితుఁడు** (సం.వి.అ.పుం.): బానిసవాఁడు.

**పరోక్షము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఇంద్రియ గోచరము కానిది.

**పరోఢ** (సం.వి.ఆ.స్త్రీ.) : పరకీయాభేదము. (ఒకనిఁ బెండ్లాడినది.)

**పరోష్ణి** (సం.వి.ఈ.స్త్రీ.) : గబ్బిలము, తైలపాయిక.

**పర్కటి** (సం.వి.ఈ.స్త్రీ.న్.పుం.) : 1. జువ్వి; 2. పోఁక మ్రాను లోనగువాని క్రొత్తపండు.

**పర్జని** (సం.వి.ఈ.స్త్రీ.) : మ్రానిపసుపు, పచంపచ.

**పర్జన్యము** (సం.వి.అ.పుం.) : 1. ఉఱుము; 2.ఉఱిమెడు మేఘము.

**పర్జన్యుఁడు** (సం.వి.అ.పుం.) : వర్షాధి దేవత, ఇంద్రుఁడు.

**పర్ణము** (సం.వి.అ.న.) : ఆకు. (పుం.) : మోదుగు.

**పర్ణశాల** (సం.వి.ఆ.స్త్రీ.) : ఆకుటిల్లు, ఉటజము.

**పర్ణాసము** (సం.వి.అ.పుం.) : నల్లగగ్గెర.

**పర్పటము** (సం.వి.అ.పుం.) : పాపటచెట్టు.

**పరాటకము** (వై.వి.) : తృణవిశేషము.

**పర్యంకము** (సం.వి.అ.పుం.) : 1. మంచము; 2. (చూ.) పర్యస్తిక.

**పర్యంతము** (సం.వి.అ.పుం.) : వఱదాఁక, దనుక.

**పర్యటనము** (సం.వి.అ.న.) : భిక్షలోనగు వాని కొఱకు తిరుగుట.

**పర్యటించు** (సం.అ.క్రి.) : భిక్షలోనగు వానికొఱకు తిరుగు.

**పర్యయము** (సం.వి.అ.పుం.) : క్రమము తప్పుట.

**పర్యవసానము** (సం.వి.అ.న.) : ముగియిక.

**పర్యవసితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ముగిసినది.

**పర్యవస్థ** (సం.వి.ఆ.స్త్రీ.) : విరోధించుట.

**పర్యస్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. పడినది; 2. కొట్టఁబడినది.

**పర్యస్తిక** (సం.వి.ఆ.స్త్రీ.) : (చూ.) యోగపట్టె.

**పర్యాప్తము** (సం.వి.అ.న.) : 1. యథేష్టము; 2. తృప్తి; 3. శక్తి; 4. నివారణము.

**పర్యాప్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : చాలుననెడు బుద్ధి. చంప వచ్చిన వాని నడ్డగించుట. (అని కొందఱు.)

**పర్యాయము** (సం.వి.అ.పుం.) : 1.ఒక యర్థా లంకారము; (చూ.అలంకారము) 2. అవసరము; 3. క్రమము; 4. ప్రకారము.

**పర్యాయోక్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : ఒక యర్థా లంకారము.(చూ. అలంకారము)

**పార్యాలోచనము** (సం.వి.అ.న.) : చక్కగా ఆలోచించుట.

**పర్యాలోచించు** (సం.స.క్రి.) : చక్కగా ఆలోచించు.

**పర్యుదంచనము** (సం.వి.అ.న.) : ఋణము, అప్పు.

**పర్యుదస్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) త్రోయఁ బడినది.

**పర్యుదాసము** (సం.వి.అ.పుం.) : త్రోయుట.

**పర్యుదాసించు** (సం.స.క్రి.) : త్రోయు.

**పర్యుషితము** (సం.వి.అ.న.) : చలిది. (విణ.) : బహుకాలము ఉంచఁబడినది.

**పర్యేషణ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఆమంత్రణార్థము వెదకుట.

**పర్వతము** (సం.వి.అ.పుం.) : కొండ. (డు.) ఒకానొక దేవఋషి.

**పర్వము** (సం.వి.న్.న.) : 1. గనుపు; 2. దర్శప్రతి పత్సంధి; 3. పండుగ; 4. విషువదాది; 5.సమూహము; 6. ప్రస్తావము; 7. లక్షణాం తరము. (పంచ పర్వములు. అష్టమి, చతుర్దశి, కుహువు, పూర్ణిమ, రవిసంక్రాంతి)

**పర్వరీణము** (సం.వి.అ.న.) : 1.ఆకుల యీనె; 2. జూదమాడు కంబళి; 3. గనుపు; 4. ఆకు నలిపిన పసరు.

**పర్వసంధి** (సం.వి.ఇ.పుం.) : పున్నమకును పాడ్యమికిని, అమావాస్యకును పాడ్యమికిని మధ్య కాలము.

**పర్వు** (దే.అ.క్రి.) : వ్యాపించు. (పరవు యొక్క రూపాంతరము.) (వి.) : ప్రధావనము. (పరువు యొక్క రూపాంతరము.)

**పర్శుక** (సం.వి.ఆ.స్త్రీ.) : ప్రక్కయెముక.

**పఱ** (యు.దే.వి.) : 1. ఉప్పుపండెడు బయలు; (ఉప్పు పఱ.) 2.బయలు; (ఇసుకపఱ.) 3.సున్నము లోనగువానిఁ గొలిచెడు మానవిశే షము; (పఱ్ఱుయొక్క రూపాంతరము.) 4.సమూ హము. (అడపఱ, (చూ.) అంపఱ.) (వై.విణ.): 1.ఇతరము; (చూ.పఱగడ.) 2. మిక్కిలి; 3. గొప్ప.

**పఱఁగు** (వై.అ.క్రి.) : ప్రసరించు.

**పఱగడ** (వై.వి.) : 1. ఇతరస్థలము; 2. పార్శ్వము.

**పఱచే** (యు.దే.అ.క్రి.) : పాఱు. (వై.ప్రే.) 1. పడఁ జేయు; 2. దుప్పటి లోనగువాని పఱచు; 3.పాటుపడఁజేయు. (ప్రేరణార్థక మైన పఱచు ఒక న్యాయమును బట్టి ఉకార మధ్యముగా నుండవలసి యున్నను వ్రాఁత ప్రతుల యందంతట తఱచుగా అకార మధ్యముగా నుండుట వల్ల ఒక ప్రామాణికకవి ప్రయోగమున యతియందు కానఁబడుట వల్లను ఇట్లకార మధ్యముగానును వ్రాయఁ బడియెను.)

**పఱత** (దే.వి.) : ప్రవాహము, పఱ్ఱు, వఱద.

**పఱతి** (దే.వి.) : ప్రవాహము, పఱ్ఱు, వఱద.

**పఱతెంచే** (దే.అ.క్రి.) : (పఱచు + తెంచు) పాఱివచ్చు.

**పఱద** (దే.వి.) : పఱత యొక్క రూపాంతరము.

**పఱపఱ** (దే.వి.) : చించుటయందగు ధ్వన్యను కరణము.

**పఱపు** (యు.దే.ప్రే.) : (పఱపఁ జేయు.) 1.పోఁగొట్టు; 2.త్రోలు; 3.ప్రయోగించు;

4.పూయు. (వి.) : 1. పడక; 2. వేగము; 3. విరివి. (విణ.) : విరివి గలది.

**పఱవ** (దే.వి.) : ప్రవాహము, పఱత, పఱద.

**పఱి** (దే.వి.) : 1. విధము; 2. కాఁడిబరువు (పఱివల పలితట్టు వేయుము.)

**పఱిక** (దే.వి.) : ఒక దినుసుఱాయి.

**పఱిగ** (దే.వి.) : కోయునప్పుడు చేని యందు రాలిన యెన్ను. (చూ. పఱిగరి.)

**పఱిగపిట్ట** (ద్వ.వి.) : పఱిగయేఱి తిను పక్షి విశేషము.

**పఱిగబ్రతుకు** (ద్వ.వి.) : గింజలేఱుకొని తిని బ్రదికెడు బ్రదుకు, ఉంఛవృత్తి.

**పఱిగరి** (దే.విణ.) : (పఱిగ + అరి) పఱిగ యేఱువాఁడు. (చూ. పఱగడ.)

**పఱిగవాఁడు** (దే.విణ.) : పఱిగరి.

**పఱిగొను** (దే.స.క్రి.) : (పఱి+కొను) అపహరించు.(వృత్తియందే పఱి శబ్దమునకు కొల్లయని యర్థము.)

**పఱిపఱి** (దే.విణ.) : పీడితము.

**పఱియ** (దే.వి.) : బ్రద్ద. (చూ. పఱియ వాయు.) (ఒకానొకచోట లఘు రేఫకముగాఁ గానఁబడు చున్నది. చూ. పరిమారుచు.)

**పఱియవాయు** (దే.అ.క్రి.) : (పఱియ + పాయు) చీలు. (ప్రే. పఱియవాపు.)

**పఱివోవు** (దే.అ.క్రి.) : (పఱి + పోవు) 1. కొల్ల పోవు; (చూ. పఱిగొను.) 2. నశించు.

**పఱుచే** (దే.ప్రే.) : 1. పడఁజేయు; 2. దుప్పటి లోనగు వానిపఱచు; 3. పాటు పడఁజేయు. (అను ప్రయుక్తమైనపడు ధాతువునకును రూపమిట్లెఱుంగునది.)

**పఱుపు** (దే.ప్రే.) : 1. పడఁజేయు; 2. పాటుపడఁ జేయు. వి. పడక.

**పఱ్ఱ** (దే.వి.) : 1. ఉప్పు పండెడు బయలు; 2. బయలు; 3. సున్నము లోనగువానిఁ గొలిచెడు మానవిశేషము. (చూ. పఱ.)

**పఱ్ఱియ** (దే.వి.) : పఱియకు మొదటి రూపము.

**పఱ్ఱు** (దే.వి.) : చినుఁగుట యందగు ధ్వన్యను కరణము. (పఱ్ఱుని చినిఁగెను, పఱ్ఱునచించెను.)

**పఱ్ఱె** (దే.వి.) : పఱ్ఱియ యొక్క రూపాంతరము.

**పలంకష** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.పల్లేరు; 2. గుగ్గిలపు చెట్టు; 3. మోదుగు; 4. రాస్న; 5. ముండీర వృక్షము. (అ.పుం.డు.) : నైరృతి.

**పలఁకు** (దే.అ.క్రి.) : పండు, ఫలించు. (అప్ర.)

**పలక** (వై.వి.) : 1.వ్రాయఁదగిన సాధనము; 2.కేడెము; 3.తలుపు లోనగు వానికుప యోగించుటకై కోయఁబడిన మ్రానిచెక్క; 4.బల్ల; 5.జూదమాడుబల్ల; (చూ.జోగిణి.) (ఇక్కడ పలక యనఁగా ఆటయని యర్థము.) 6. సాలె వాఁడు నేఁతసరి తట్టెడు సాధనవిశేషము. (చూ.కుంచె.)

**పలకము** (వై.వి.) : చిన్నమంచము.

**పలకసరి** (వై.వి.) :పురుష కంఠాభరణ విశేషము.

**పలగండుఁడు** (సం.వి.అ.పుం.) : సున్నపు పూఁత పూయువాఁడు, లేపకుఁడు.

**పలచేము** (దే.వి.) : కప్పము.

**పలనాడు** (దే.వి.) : దేశవిశేషము.

**పలపల** (దే.వి.) : 1. తొరఁగుట యందగు నను కరణము; 2. వేగుట యందగు ననుకరణము; (విణ.) : 1. విరళము; 2. కృశము. (చూ. పలపలన.)

**పలపలన** (దే.వి.) : 1. వైరళ్యము; 2. కార్శ్యము. (విశేషణమగుచో.) (చూ. అలకన.) (విణ.) : 1. విరళము; 2. కృశము.

**పలము** (సం.వి.అ.న.) : 1. నాలుగు కర్షముల యెత్తు; (వెండి పలము = ఇందువు. బంగారు పలము = కురుబిస్తము.) 2. మాంసము.

**పలలము** (సం.వి.అ.న.) : 1. మాంసము; 2. బురద; 3. నూవు పిండి. (పుం.డు.) : రాక్షసుఁడు.

**పలవ** (దే.వి.) : రెండుకొమ్మల మొదలు.

**పలవరము** (వై.వి.) : పలవరింత, ప్రలాపము.

**పలవరించే** (వై.అ.క్రి.) : ప్రలాపించు.

**పలవరింత** (వై.వి.) : పలవరించుట, ప్రలాపము.

**పలవించే** (వై.అ.క్రి.) : పలవరించు యొక్క రూపాంతరము.

**పలవు** (వై.అ.క్రి.) : పలవించు యొక్క రూపాంతరము.

**పలాండువు** (సం.వి.ఉ.పుం.) : నీరుల్లి. (రూ. పలండువు.)

**పలాములుచేయుట** (దే.స.క్రి.) : పాడు చేయుట, దోపిడి చేయుట.

**పలాయనము** (సం. వి. అ. న.) : పాఱిపోవుట.

**పలాయితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) పాఱిపోయినవాఁడు.

**పలాలము** (సం.వి.అ.పుం,న.) : గింజ లేని వరిపోఁచ లోనగునది, మోడు.

**పలాశము** (సం.వి.అ.న.) : ఆకు. (పుం.) : 1. ఆకుపచ్చ; 2. గంట్ల కచోరము; 3. మోదుగు. (విణ.) : ఆకుపచ్చనిది.

**పలాశి** (సం.వి.న్.పుం.) : 1. చెట్టు; 2. కోరింద; 3. జువ్వి; 4. రాక్షసుఁడు.

**పలాశుఁడు** (సం.వి.అ.పుం.) : రాక్షసుఁడు, పొలదిండి.

**పలాస్త్రి** (ఆం.వి.) : వ్రణముల కంటించు మలాముపట్టి.

**పలిక్ని**(సం.వి.ఈ.స్త్రీ.) : 1. ముదిసిన యాఁడుది; 2. తొలిచూలి యావు.

**పలితము** (సం.వి.అ.న.) : 1. నర; 2. నర వెంద్రుక; 3. బురద; 4. ఱాతిపూవు.

**పలు** (దే.వి.) : పల్లు యొక్క రూపాంతరము. (విణ.) : అనేకము. (వృత్తి యందు హల్లు పరమగుచో ఉత్వలోపము వికల్పముగానగును. దీనికి యర్థమునందు ఏక వచనము నవ్యస్తముగా ప్రయోగము లేదు.)

**పలుఁగు** (వై.వి.) : స్ఫటికము.

**పలుక** (వై.వి.) : వైవర్ణ్యము, తెల్లన. (ఇది నల్లవంటిది.)

**పలుకఁబాఱు** (ద్వ.అ.క్రి.) : వివర్ణమగు, తెల్లనగు.

**పలుకన** (వై.వి.) : పలుక యొక్క రూపాంతరము. (విశేషణమగుచో. చూ. అలకన.)

**పలుకప్పు** (దే.వి.) : పెదవి, పలుతెర, రదనచ్ఛదము.

**పలుకరించే** (దే.అ.క్రి.) : మాటాడు. (అం,ప్రే.): మాటాడించు. (చూ. పల్కరించు.) (స.క్రి.) : హెచ్చరించు.

**పలుకరింత** (దే.వి.) : 1. మాటాడుట; 2. హెచ్చరించుట.

**పలుకరింపు** (దే.వి.) : పలుకరింత. (చూ. ఆరగింపు.)

**పలుకు** (దే.అ.క్రి.) : మాటాడు. (నీవేల నాతో పలుకవు.) (స.క్రి.) : 1. అను; 2. నిందించు. (వి.) : 1. మాట; 2. నింద; 3. పక్షిధ్వని; 4.వీణాదిస్వరము; 5.విద్య; 6. ఖండము; 7. విత్తు లోపలి భాగము. (రూ. పల్కు. ఖండమునకు.)

**పలుకుఁజెలి** (దే.వి.) : (పలుకు + చెలి) సరస్వతి. (రూ. పల్కుఁజెలి.)

**పలుకుఁదత్తడి** (దే.వి.) : (పలుకు + తత్తడి) చిలుక.

**పలుకుఁదోడు** (దే.విణ.) : (పలుకు + తోడు) పలుకరించు తోడు, మాటతోడు.

**పలుకుబడి** (దే.వి.) : 1. ఉచ్చారణము; 2. వచోనిబంధనము, ఒడంబడిక. (రూ. పల్కుబడి. ఉచ్చారణమునకు.)

**పలుకుఱాయి** (దే.వి.) : ప్రతిధ్వని యిచ్చెడు శిలావిశేషము.

**పలుకెంపు** (దే.వి.) : దంతక్షతము.

**పలుగఱ** (ద్వ.వి.) : (పలు + కఱ) పండ్లపొడి.

**పలుగాఁడి** (దే.వి.) : 1. పనులదొడ్డి లోనగు వానికి పెట్టెడు తలుపు; 2. బండిపరము. (విణ.) : పెక్కుగాఁడులు గలది.

**పలుగాకి** (దే.విణ.) : దుష్టుఁడు.

**పలుగు** (దే.వి.విణ.) : దుర్జనుఁడు.

**పలుగుండ్రు** (దే.స.బ.) : పలుగు యొక్క రూపాంతరము.

**పలుగుగుంటక** (దే.వి.) : పలుగు అమర్చిన గుంటక. (చూ. గుంటక.)

**పలుగుడుఁబాము** (దే.వి.) : (పలుగుడు + పాము) సర్ప విశేషము.

**పలుగుపిట్ట** (ద్వ.వి.) : గుడ్లగూబ. ఘూకము.

**పలుగురు** (దే.స.బ.) : అనేకులు (పల శబ్దమునకు మహన్మహత్యర్థక బహు వచనాంతాదేశము.)

**పలుగొమ్ములమెకము** (ద్వ.వి.) : (పలు + కొమ్ములమెకము.) ఏనుఁగు.

**పలుగొఱ్ఱు** (దే.వి.) : పైరులోని గాదము పెల్ల గించుటకై పండ్లవలె మేకుల మర్చిన పలక.

**పలుచే** (దే.విశ.) : 1. దళసరికానిది; 2. వెలితి యైనది; (పైరు పలుచగా నున్నది.) 3. చిక్కన కానిది; (జావ పలుచగా కాఁచుము.) 4.చులుక.

**పలుచేన** (దే.వి.) : 1. సన్నఁదనము; 2.వెలితి తనము; 3.అనుకుఁదనము; 4.చులుకఁదనము.

**పలుచేపడు** (ద్వ.అ.క్రి.) : పలుచనగు. (మజ్జిగ పలుచపడినది.)

**పలుదెర** (ద్వ.వి.) : (పలు+తెర) (చూ.) పలుకప్పు.

**పలుపట్టడ** (దే.వి.) : సంకరజాతి జనము.

**పలుపు** (దే.వి.) :1.పసులమెడఁగట్టెడు తలుగు, ఆ బంధము; 2. గుఱ్ఱము మెడఁగట్టెడు త్రాడు

**పలుమరు** (దే.ద్ర.క్రి.విశ.) : పలుమఱు యొక్క రూపాంతరము. (చూ. పల్మరు.)

**పలుమఱు** (దే.ద్ర.క్రి.విశ.) : (పలు + మాఱు.) మాటిమాటికి.

**పలుమాఱు** (దే.ద్ర.క్రి.విశ.) : (పలు + మాఱు.) మాటిమాటికి.

**పలుము** (వై.అ.క్రి.) : ప్రలాపించు. (వి.) : ప్రలాపము.

**పలుమేరు** (దే.వి.) : వృక్షవిశేషము.

**పలువ** (ద్వ.విశ.) : (పలు + వా) దుర్జనుఁడు.

**పలువలువ** (దే.వి.) : పెదవి, దశనవానస్సు. (చూ. పల్వల్వ.)

**పలువిత్తు** (దే.విశ.) : పలువురకుఁ బుట్టినవాఁడు.

**పలువుండ్రు** (దే.స.బ.) : పలుగుండ్రు యొక్క రూపాంతరము.

**పలువురు** (దే.స.బ.) : పలుగురు యొక్క రూపాం తరము. (రూ. పల్వురు.)

**పలుసము** (వై.విశ.) : పరుసము యొక్క రూపాం తరము.

**పల్కన** (వై.వి.) : పలుకన యొక్క రూపాంతరము. (ఆమ్రేడితము నందు పలుపల్కన.)

**పల్కరించు** (దే.అ.క్రి.) : మాటాడు. (అం.ప్రే.): మాటాడించు. (చూ. ఎకసెక్కెము) (నెపంబిడి జవరాండ్రను పల్కరించు లాగని యన్వయము.) (స.క్రి.) : హెచ్చరించు.

**పల్కరింత** (దే.వి.) : పలుకరింత యొక్క రూపాం తరము.

**పల్గాకి** (దే.విశ.) : పలుగాకి యొక్క రూపాంతరము.

**పల్నాడు** (దే.వి.) : పలనాడు యొక్క రూపాంతరము.

**పల్పల** (దే.వి.) : పలపల యొక్క రూపాంతరము.

**పల్పలన** (దే.వి.విశ.) : పలపలన యొక్క రూపాం తరము. (విరళమునకు)

**పల్మరు** (దే.ద్ర.క్రి.విశ.) : పలుమరు యొక్క రూపాంతరము.

**పల్మఱు** (దే.ద్ర.క్రి.విశ.) : పలుమఱు యొక్క రూపాంతరము.

**పల్మాఱు** (దే.ద్ర.క్రి.విశ.) : పలుమాఱు యొక్క రూపాంతరము. (చూ. పలుమాఱు.)

**పల్యంకము** (సం.వి.అ.పుం.) : 1.మంచము; 2.మంచె; 3.యతులు లోనగువారి యాసనము; 4. యోగపట్టె.

**పల్యంకిక** (సం.వి.ఆ.స్త్రీ.) : పల్లకి.

**పల్యయనము** (సం.వి.అ.న.) : గుఱ్ఱపుపల్లము.

**పల్యాణము** (సం.వి.అ.న.) : గుఱ్ఱపు పల్లము. (ఇది కొన్ని చోట్ల ఏనుఁగు మీఁది అంబారికి పర్యాయముగా ప్రయోగింపఁబడి యున్నది.) (చూ. పల్లన.)

**పల్ల** (వై.విశ.) : 1. పాటల వర్ణము కలది; 2. కపిల వర్ణము కలది; 3. అరుణ వర్ణము కలది.

**పల్లకట్టు** (ద్వ.విశ.) : పల్లవన్నె చూపట్టునది.

**పల్లకి** (వై.వి.) : మనుష్యులు మోసికొని పోయెడు వాహనము.

**పల్లకీ** (వై.వి.) : పల్లకి యొక్క రూపాంతరము.

**పల్లగింజో** (వై.స.క్రి.) : (చూ.) పల్లించు.

**పల్లట** (దే.వి.) : 1. చలనము; 2. వ్యత్యాసము (రూ. పల్లటము.)

**పల్లటి** (దే.వి.) : జక్కిణిసాధనవిశేషము (చూ.కత్రి.)

**పల్లటిల్లు** (యు.దే.అ.క్రి.) : 1.చలించు; 2.వ్యత్యస్త మగు. (వై.) 1.తెల్లఁబోవు; 2.ఎఱ్ఱవాఱు. (రూ. పల్లటిల్లు. చలించుటకు, వ్యత్యస్తమగుటకు.)

**పల్లటీ** (దే.వి.) : 1.ఎగవు; 2. పారావత విశేషము.

**పల్లటీల్గొను** (దే.అ.క్రి.) : (పల్లటీలు+కొను) ఎగురు.

**పల్లటీల్దాఁటు** (దే.అ.క్రి. ) : (పల్లటీలు + దాఁటు) పల్లటీల్గొను.

**పల్లటీల్వైచు** (దే.అ.క్రి.) : (పల్లటీలు + వైచు) పల్లటీల్గొను.

**పల్లన** (వై.వి.) : (చూ.) 1. గుఱ్ఱపు పల్లము; 2. అంబారి. (రూ. పల్లనము. అంబారికి.)

**పల్లపుఁబంట** (ద్వ.వి.) : (పల్లము + పంట) నీరాసరానుపండెడు పంట.

**పల్లము** (ఉభ.వై.వి.) : 1. పల్లపునేల; 2. గుఱ్ఱము లోనగువాని నెక్కునపుడు క్రింద మెత్తగా నుండు టకై కుట్టి మీఁద వేసి కట్టెడు గంత. (సం.వి. అ.పుం.) : ధాన్యము పోసెడు పెద్ద గరిసె.

**పల్లఱపులు** (ద్వ.వి.బ.) : (పలు + అఱపులు.) 1. వ్యర్థములైన పెక్కు మాటలు; 2. (పలువ + అఱుపులు) ఆదరాని పెక్కు మాటలు.

**పల్లవము** (సం.వి.అ.పుం,న.) : 1.చిగురు; 2.చిగిరించిన కొమ్మ; 3. కోక చెఱఁగు; 4. లత్తుక రంగు; 5.శృంగారము; 6.విరివి. (పుం.) వెనుకటి చరణముల యందలి యర్థము ననుసరించి సంగీతము మొదట చెప్పెడు వాక్యము.

**పల్లవించే** (సం.అ.క్రి.) : చిగురించు, చిగురుచు.

**పల్లవితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. చిగిరించి నది; 2. లత్తుకచే నెఱ్ఱనైనది; 3. విరివియైనది.

**పల్లవుఁడు** (సం.వి.అ.పుం.) : విటుఁడు, షిద్గుఁడు.

**పల్లా** (హిం.వి.) : నూఁటయిఱువది పక్కాసేరుల మానము; పందుము.

**పల్లాయనంబువాఁడు** (ద్వ.విణ.) : ఆప్తుఁడు. (రూ. పల్లాయనమువాఁడు. మొ.)

**పల్లాయనము** (వై.వి.) : ఆప్తత. (చూ. పల్లాయ నంబువాఁడు.)

**పల్లి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1.పల్లె; 2.గుడిసె; 3. బల్లి.

**పల్లించే** (వై.స.క్రి.) : పల్లముకట్టు.

**పల్లిక** (వై.వి.) : వెదురుబ్రద్దలు లోనగు వానితో నల్లినతట్ట.

**పల్లియ** (వై.వి.) : పల్లె. (గొల్లపల్లియ, బోయ పల్లియ. మొ.)

**పల్లు** (యు.దే.వి.) : దంతము. (వై.విణ.) : పల్లము.

**పల్లుడు** (వై.విణ.) : పల్లము.

**పల్లె** (యు.దే.వి.) : 1. జాతి విశేషము; (పల్లె వాఁడు, పల్లెది.) 2. బడి. (వై.) : చిన్న ఊరు. (పల్లియ యొక్క రూపాంతరము.)

**పల్లెకూటము** (దే.వి.) : బాలురు చదువు బడి, పాఠశాల.

**పల్లెత** (దే.వి.) : పల్లెజాతిది, పల్లెది.

**పల్లెమాట** (దే.వి.) : గ్రామ్యవచనము.

**పల్లెరు** (దే.వి.) : పల్లేరు యొక్క రూపాంతరము.

**పల్లేరు** (దే.వి.) : పలంకష.

**పల్లేరుఁగాయ** (దే.వి.) : (పల్లేరు + కాయ) భూషావిశేషము.

**పల్లేరుఁబూవు** (ద్వ.వి.) : (పల్లేరు + పూవు) స్త్రీభూషా విశేషము.

**పల్లొత్తు** (దే.వి.) : (పల్లు + ఒత్తు) దంతక్షతము.

**పల్వరించే** (వై.అ.క్రి.) : పలవరించు యొక్క రూపాంతరము.

**పల్వలము** (సం.వి.అ.న.) : నీళ్లుగల చిన్నపల్లము, పడియ.

**పల్వల్వ** (దే.వి.) : పలువలు యొక్క రూపాంతరము.

**పవడము** (వై.వి.) : పగడము యొక్క రూపాంతరము.

**పవడించే** (దే.అ.క్రి.) : పవళించు. (పవ్వడించు యొక్క రూపాంతరము.)

**పవతుఁడు** (ద్వ.వి.) : పగతుఁడు యొక్క రూపాంతరము.

**పవనతనయుఁడు** (సం.వి.అ.పుం.) : 1. భీముఁడు; 2. హనుమంతుఁడు; 3. అగ్ని.

**పవనము** (సం.వి.అ.న.) : (చూ.) ఆవము. (పుం.) : 1. గాలి; 2. తూర్పెత్తుట.

**పవనాశనము** (సం.వి.అ.పుం.) : సర్పము, పాము.

**పవమానుఁడు** (సం.వి.అ.పుం.) : వాయువు, గాలి.

**పవము** (సం.వి.అ.పుం.) : తూర్పెత్తుట, పవనము.

**పవలు** (దే.వి.) : పగలు యొక్క రూపాంతరము.

**పవళించే** (దే.అ.క్రి.) : శయనించు. (పవ్వళించు యొక్క రూపాంతరము.)

**పవళింత** (దే.వి.) : పవళించుట, శయనము.

**పవాడము** (వై.వి.) : ఒక కార్యము నెఱవేఱవలెనని దేవుని ప్రార్థించుకొని యాప్రార్థన నెఱవేఱని యెడ దేవుని యెదుట చేయు జిహ్వాచ్ఛేదనాది సాహసకృతము. (పావాడము యొక్క రూపాంతరము.)

**పవి** (సం.వి.ఇ.పుం.) : వజ్రాయుధము, కులిశము.

**పవిత్రకము** (సం.వి.అ.న.) : జనప నారితో నల్లిన వలత్రాడు. (పుం.) : 1. మేడి; 2. రావి.

**పవిత్రము** (సం.వి.అ.న.) : 1.జందెము; 2. దర్భ; 3. జలము; 4. గోమయము; 5. తామ్రము. (విణ.) : పరిశుద్ధము.

**పవిది** (వై.వి.) : పగిది యొక్క రూపాంతరము. (విధమునకు.)

**పవ్వడించు** (దే.అ.క్రి.) : పవ్వళించు, శయనించు.

**పవ్వళించే** (దే.అ.క్రి.) : పవ్వడించు యొక్క రూపాంతరము.

**పశుపతి** (సం.వి.ఇ.పుం.) : శివుఁడు, ముక్కంటి.

**పశుమక్షిక** (సం.వి.ఆ.స్త్రీ.) : జోటీఁగ.

**పశువు** (సం.వి.ఉ.పుం.) : 1. నాలుకాళ్ల జంతువు; 2. గొడ్డు.

**పశ్చాత్తాపము** (సం.వి.అ.పుం.) : అనుతాపము, వగపు.

**పశ్చిమము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. పడమటిది; 2. వెనుకటిది.

**పశ్యతోహరుఁడు** (సం.వి.అ.పుం.) : 1. కమసాలెవాఁడు; 2.(చూ.) పచ్చెకాఁడు.

**పశ్యత్పాలుఁడు** (సం.వి.అ.పుం.) : శివుఁడు, ముక్కంటి.

**పస** (దే.వి.) : 1. సారము; 2. సమృద్ధి; 3. చాతుర్యము.

**పసఁగు** (దే.అ.క్రి.) : విశదమగు.

**పసందు** (హిం.వి.) : సొగసుదనము, అందము. (పసందు చేయు, మెచ్చుకొను.)

**పసగరగొను** (దే.స.క్రి.) : (పసగర + కొను) పీడించు.

**పసదనము** (వై.వి.) : తానుకోరిన పని నెఱవేఱినప్పుడు నెఱవేర్చుకొన్నవాఁడు సంతోషించి నెఱవేర్చిన వానికి సంతోషముగా నిచ్చెడు వస్త్రాభరణాది ద్రవ్యము, పారితోషికము.

**పసను** (దే.వి.) : ఎఱుపు మించిన పసుపు వన్నె. (చూ. కుసుమము.) (విణ.) : 1. ఎఱుపు మించిన పసుపు వన్నెగలది; 2. బాగు. (విశేషణమగుచో కడపటి యుత్వమునకు ఇత్వమువచ్చెడి.)

**పసపస** (దే.వి.) : వానయొక్క ముసరు.

**పసరము** (వై.వి.) : గోమహిషజాతి.

**పసరించే** (వై.అ.క్రి.) : వ్యాపించు.

**పసరు** (యు.దే.వి.) : 1.ఆకురసము; 2.ఆకుపచ్చన.

**పసరుగాయ** (దే.వి.) : (పసరు + కాయ) ముదిరిన పిందె. (చూ. కమియు.)

**పసరుమొగ్గ** (ద్వ.వి.) : లేఁతమొగ్గ, క్షారకము.

**పసలము** (వై.వి.) : పసరము యొక్క రూపాంతరము.

**పసాదము** (వై.వి.) : వంటకము, అన్నము.

**పసాపడు** (వై.స.క్రి.) : (పసాదము + సాపడు) భుజించు.

**పసారము** (వై.వి.) : అంగడి.

**పసారు** (వై.వి.) : పసారము యొక్క రూపాంతరము.

**పసి** (యు.దే.వి.) : పశ్వాదుల మీఁది గాలి. (లేత పసిబిడ్డ. మొ.) (వై.వి.) 1. గోగణము; 2. (బ.) : గోవులు.

**పసిఁడి** (దే.వి.) : 1. బంగారు; 2. ధనము.

**పసిఁడికంటి** (దే.వి.) : పైఁడికంటి యొక్క రూపాంతరము.

**పసిఁడికాయ** (దే.వి.) : పొత్తినూలికాయ.

**పసిఁడిపురుగు** (ద్వ.వి.) : పొత్తి నూలికాయ పురుగు.

**పసిఁడితేఁడు** (దే.వి.) : పైఁడితేఁడు యొక్క రూపాంతరము.

**పసిక** (దే.వి. పస.) : (స్వార్థమున ఇక. ఆరమరిక వంటిది.)

**పసిగాపు** (ద్వ.వి.) : (పసి + కాపు) గోపకుఁడు.

**పసిగొను** (దే.అ.క్రి.) : (పసి + కొను) గాలిపట్టు. (చూ. అఱచు.)

**పసితిండి** (ద్వ.వి.) : పులి. వ్యాఘ్రము.

**పసిపాప** (దే.వి.) : లేఁతబిడ్డ. (విణ.) : మిక్కిలి లేఁతయైనది.

**పసిమి** (దే.వి.) : 1.ఆకుపచ్చన; 2.ఎఱుపు మించిన పసుపువన్నె; 3. గోరోజనపు వన్నె. (వృత్తి యందు హల్లు పరమగుచో అంత్య వర్ణము నకు వికల్పంబుగ లోపంబగు.) (పసిమిడి. మొ.)

**పసిమిడి** (దే.విణ.) : (పసిమి+మిడి) పసిమి గలది. (చూ. గింటెము.) (ఇది చలిమిడి లోనగు వాని వంటిది.)

**పసిరిక** (దే.వి.) : (పసరు + ఇక) పసరు వన్నె. (విణ.) : పసరు వన్నె కలది. (స్వార్థమున ఇక. సంధిని వర్ణ వికారము.)

**పసిరికపాము** (దే.వి.) : పచ్చపాము.

**పసిరికపిట్ట** (ద్వ.వి.) : పచ్చపిట్ట, హారితము.

**పసిరిక మొగ్గ** (ద్వ.వి.) : పసరుమొగ్గ.

**పసుపాడు** (ద్వ.అ.క్రి.) : (పసుపు + ఆడు) పసుపు పూసికొని జలకమాడు.

**పసుపు** (వై.వి.) : 1. హరిద్ర; (దీని భేదములు. కస్తురిపసుపు, కూరపసుపు, మ్రానిపసుపు.) 2.హరిద్రా వర్ణము. (విణ.) : హరిద్రా వర్ణము కలది.

**పసుపుఁబిట్ట** (వై.వి.) : (పసుపు+పిట్ట) పసిరికపిట్ట.

**పసుపుముద్ద** (ద్వ.వి.) : (పసుపు + పిట్ట) పసిరికపిట్ట. (చూ. గోర.)

**పసుపుమొల్ల** (వై.వి.) : పచ్చపూమొల్ల, హేమ పుష్పిక.

**పసులపోలిగాఁడు** (ద్వ.వి.) : (చూ.) ఏట్రింత.

**పసులవాఁడు** (ద్వ.వి.) : (పసులు + వాఁడు) గొల్లవాఁడు.

**పస్తాయించు** (దే.అ.క్రి.) : పశ్చాత్తాపపడు.

**పస్తు** (వై.వి.) : ఉపవాసము, ఉపాసము, నిట్ర.

**పస్సె** (దే.వి.) : పాటలవర్ణము. (విణ. ) : పాటల వర్ణము కలది.

**పళపళ** (దే.వి.) : ప్రకాశించుట యందగు ననుకరణము.

**పళ్యము** (వై.వి.) : పళ్లెము యొక్క రూపాంతరము. (భోజన పాత్రమునకు.)

**పళ్లెము** (వై.వి.) : 1.భోజన పాత్రము;(చూ.ఎడ్డెన.) 2. తాంబాళము.

**పళ్లెరము** (వై.వి.) : 1. భోజన పాత్రము; 2. తాంబాళము.

## పా

**పాంచజన్యము** (సం.వి.అ.పుం.) : విష్ణువు యొక్క శంఖము. డు. అగ్ని.

**పాంచాలము** (సం.వి.అ.పుం.) : దేశవిశేషము.

**పాంచాలి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1.ద్రౌపది; 2.బొమ్మ.

**పాంచాలిక** (సం.వి.ఆ.స్త్రీ.) : వస్త్రదంత కాష్ఠాదుల చేతఁజేయఁబడిన నరమృగాదిరూపము, బొమ్మ.

**పాంచాలుఁడు** (సం.వి.అ.పుం.) : ఒక జాతి పురుషుఁడు. (చూ. పురుషుఁడు.) (విణ.) : పాంచాల దేశము నందు పుట్టినవాఁడు.

**పాంజేబులు** (వై.వి.బ.) : కాలికి ధరించు గొలుసులు.

**పాండరము** (సం.వి.అ.పుం.) : తెలుపు. (విణ.): తెల్లనిది.

**పాండవబీడు** (మి.గ్రా.వి.) : బహు కాలము నుండి దున్నని బీటినేల.

**పాండితి** (సం.వి.ఈ.స్త్రీ.) : పాండిత్యము.

**పాండిత్యము** (సం.వి.అ.న.) : పండిత భావము.

**పాండిమ** (సం.వి.న్.పుం.) : తెలుపు, (రూ. పాండిమము.)

**పాండీఁడు** (వై.వి.) : పాండ్యదేశపురాజు.

**పాండుకంబళి** (సం.వి.న్.పుం.) : తెల్ల కంబళిచేత కప్పఁబడిన రథము. విణ. తెల్లకంబళిగలది.

**పాండురము** (సం.వి.అ.న.) : తెల్లపులుము. (పుం.) : 1.తెలుపు; 2.తెలుపు మించిన పచ్చన. (విణ.) : 1. తెల్లనిది; 2. తెలుపు మించిన పచ్చనిది.

**పాండువు** (సం.వి.ఉ.పుం.) : 1. ఒక రోగము; 2. పేరీఁదు; 3. తెలుపు; 4. తెలుపు మించిన పచ్చన.(డు.) : ఒక రాజు.(విణ.) : 1. తెల్లనిది; 2. తెలుపు మించిన పచ్చనిది.

**పాండ్యము** (సం.వి.అ.పుం.) : ఒక దేశము.

**పాంథుఁడు** (సం.వి.అ.పుం.) : పథికుఁడు, తెరువరి.

**పాంశువు** (సం.వి.ఉ.పుం.) : 1. దుమ్ము; 2. ఎరువు.

**పాంసనుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) దూషకుఁడు.

**పాంసుల** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. అంకుటాలు; 2. భూమి.

**పాంసువు** (సం.వి.ఉ.పుం.) : ధూళి, దుమ్ము.

**పాఁకుడు** (దే.వి.) : పండ్ల పాఁచి లోనగునది. (ప్రాఁకుడు యొక్క రూపాంతరము.)

**పాఁగెము** (వై.వి.) : సంబంధము.

**పాఁచి** (వై.వి.) : 1.పండ్ల ముఱికి; (చూ. తెట్టు.) 2. నీటి యందు కలిగెడు పచ్చని ముఱికి; 3. నీటి యందు కలిగెడు పచ్చని తీఁగ, శైవాలము. (విణ.) : ప్రాఁతది. (పాఁచిపని.) (చూ. ప్రాఁచి.)

**పాఁచితీఁగ** (వై.వి.) : మజ్జిగ చిక్కనఁ జేయు నొకానొక తీఁగ, బదర.

**పాఁజేబులు** (దే.వి.బ.) : గజ్జెగొలుసు.

**పాఁడి** (దే.వి.) : క్షీరము.

**పాఁత** (వై.వి.) : 1. వస్త్రము; 2. జీర్ణ వస్త్రము. (చూ. ప్రాఁత.) (విణ.) : బహు దినముల నాఁటిది. (పాఁతచీర) (ప్రాఁత యొక్క రూపాంతరము.)

**పాఁతగిల్లు** (వై.అ.క్రి.) : పాఁతదియగు, (రూ. పాఁతగిలు.) (ప్రాఁత గిల్లు యొక్క రూపాంతరము.)

**పాఁతఱ** (దే.వి.) : (పాఁతు + అఱ) 1. ధాన్య ముంచుటకై నేల త్రవ్విన పల్లము; 2. నిధి.

**పాఁతు** (దే.స.క్రి.) : పూడుచు. (వి.) : భూమి లోనగు వానిలోపల దిగినట్టి పర్వతము లోనగువాని యధో భాగము.

**పాఁపజగము** (ద్వ.వి.) : (పాము + జగము) నాగలోకము.

**పాఁపజన్నిగట్టు** (ద్వ.వి.) : (పాము + జన్నిగట్టు.) వినాయకుఁడు.

**పాఁపతూవు** (దే.వి.) : (పాము + తూపు) నాగాస్త్రము.

**పాఁపమీను** (ద్వ.వి.) : (పాము + మీను) ఒకజాతి ఆఁడుచేఁప, శృంగి.

**పాఁపమేపరి** (దే.వి.) : (పాము + మేపరి) 1. గరుత్మంతుఁడు; (చూ. పన్నారు.) 2. నెమిలి.

**పాఁపమేపుడు** (దే.వి.) : (పాము + మేపరి) 1. గరుత్మంతుఁడు; (చూ. పన్నారు.) 2. నెమిలి.

**పాఁపర** (దే.వి.) : గోతుంబి.

**పాఁపరమ్ము** (ద్వ.వి.) : (పాము + అమ్ము) నాగాస్త్రము. (ఇందువర్ణా గమము.)

**పాఁపఱేఁడు** (దే.వి.) : (పాము + ఱేఁడు) నాగరాజు.

**పాక** (దే.వి.) : దూలములుంచకట్టిన యిల్లు, శాల.

**పాకనాడు** (దే.వి.) : దేశవిశేషము.

**పాకము** (సం.వి.అ.పుం.) : 1. పరిపాకము; 2. పంట; 3. నర; 4. పిల్ల (కావ్యము నందు పాకములు 3. ద్రాక్షాపాకము, నారికేళపాకము, కదళీపాకము)

**పాకలము** (సం.వి.అ.న.) : చెంగల్వ కోస్టు. (పుం.): 1.గుల్మము; 2. గజమునకుఁ గలుగు పిత్తజ్వరము.

**పాకశాసని** (సం.వి.ఇ.పుం.) : ఇంద్రుని కొడుకు, జయంతుఁడు.

**పాకశాసనుఁడు** (సం.వి.అ.పుం.) : ఇంద్రుఁడు.

**పాకాన్నము** (సం.వి.అ.న.) : పాకెన. (చూ. ప్రాకెన్న.)

**పాకారి** (సం.వి.ఇ.పుం.) : పాకాసురారి, ఇంద్రుఁడు.

**పాకి** (దే.వి.) : మఱుఁగు పెరటి కుప్ప యెత్తెడు వాఁడు, పాకివాఁడు.

**పాకీ** (దే.వి.) : పాకియొక్క రూపాంతరము.

**పాకెన** (వై.వి.) : పాకెన్న యొక్క రూపాంతరము.

**పాకెన్న** (వై.వి.) : పెండ్లియందు మూడవ నాటి బువ్వము.

**పాక్యము** (సం.వి.అ.న.) : అట్టుప్పు. (పుం.) : యవక్షారము.

**పాక్షికము** (సం.విశే.) : (అ.ఈ.అ.) పక్షమునఁ గలిగినది.

**పాగ** (యు.దే.వి.) : తలకట్టు. (వై.బ.) : పావకోళ్లు.

**పాగడము** (వై.వి.) : పాదగమునకు మాఱు రూపము.

**పాగా** (యు.దే.వి.) : 1. తలపాగ యొక్క రూపాంతరము; 2. అశ్వశాల; 3. అశ్వసమూహము. (చూ. దూపించు.) (వై.బ.) : పావకోళ్లు.

**పాగు** (వై.వి.) : చక్కెరలోనగునవి కాఁచఁగానగు ద్రవత్వము.

**పాచకుఁడు** (సం.వి.అ.పుం.) : 1. వంటవాఁడు; 2. అగ్ని.

**పాచనము** (సం.వి.అ.పుం.) : 1. ప్రాయశ్చిత్తము; 2. పులుసు.

**పాచని** (సం.వి.ఈ.స్త్రీ.) : కరక, హరీతకి.

**పాచిక** (వై.వి.) : జూదమాడెడి అడ్డ సాళ్లు.

**పాచితము** (వై.వి.) : ప్రాచితము యొక్క రూపాంతరము.

**పాచేనము** (వై.వి.) : పాసనము.

**పాచు** (దే.ప్రే.) : (పాయఁజేయు.) 1. తొలఁగించు; 2. చిక్కెడలించు.

**పాట** (యు.దే.వి.) : 1. సంగీతము; 2. విధము. (ఇది ఈ యర్థమునందు ఆ, ఈ, ఏ శబ్దాది పూర్వకముగానే ప్రయోగింపఁబడుచున్నది.) (వై.) : అగలుసొంటి.

**పాటకము** (ఉభ.వై.వి.) : (చూ.) పోటకము. (సం.వి.అ.పుం.) : 1. పాగడము; 2. పట్టా కత్తి; 3.వాద్యము; 4.నద్యాదితీరము; 5. అక్షాది చాలనము; 6. సేనానివేశము.

**పాటచ్చరుఁడు** (సం.వి.అ.పుం.) : తస్కరుఁడు, దొంగ.

**పాటన** (దే.వి.) : 1. అలంకారము; 2. సంస్కారము; 3. ఆదరణము. (చూ. పాటించు.)

**పాటనము** (సం.వి.అ.న.) : చీల్చుట, వ్రచ్చుట.

**పాటపాట** (దే.విశే.) : కొంచెము కొంచెము.

**పాటపొలము** (దే.వి.) : చిఱువేరు పైరయ్యెడునేల.

**పాటబండి** (దే.వి.) : రథవిశేషము, గాడీ. (చూ. గుజ్జు.)

**పాటము** (వై.వి.) : కెంపులు నాణెము చూచుటకు తగినయెండ.

**పాటల** (సం.వి.ఆ.స్త్రీ.) : కలిగొట్టు. (అ.స్త్రీ.అ.న.ము.) : కలిగొట్టు పువ్వు (అ.పు.) : 1.ఎఱ్ఱ వడ్లు; 2. తెలుపు మించిన యెఱుపు. (విశే.): తెలుపు మించిన యెఱుపుగలది.

**పాటలి** (సం.వి.ఇ.స్త్రీ.) : మొక్కపుఁజెట్టు. (పుం,స్త్రీ.): కలిగొట్టు చెట్టు.

**పాటవము** (సం.వి.అ.న.) : 1. ఆరోగ్యము; 2. నైపుణ్యము; 3. శక్తత; 4. తైక్ష్ణ్యము.

**పాటి** (దే.వి.ఏ.) : 1.సామ్యము; 2. ప్రమాణము. (విశే.) : 1. సమము; 2. సామాన్యము;

3. న్యాయము; 4. కొలఁదిది. (ఇది యీ యర్థమందు ఆ, ఈ, ఏ శబ్దపూర్వకముగానే ప్రయో గింపఁబడుచున్నది.)

**పాటించే** (దే.స.క్రి.) : 1. ఆదరించు; 2. విచారించు; (చూ. కోట) 3. ప్రతీక్షించు; (చూ. అజ్జ.) 4. ధరించు; 5. పొందు.

**పాటిగొను** (దే.స.క్రి.) : (పాటి+కొను) సరిచేయు.

**పాటితము** (సం.విణ.) : (అ.ఆ.అ) చీల్చఁబడినది.

**పాటినేల** (దే.వి.) : (పాడు + నేల) ఊరెత్తు పడిపోయి పాడుపడిన నేల.

**పాటిరేవు** (దే.వి.) : దిగినడచి దాఁటిపోఁ దగిన రేవు.

**పాటిల్లు** (వై.అ.క్రి.) : కలుగు. (రూ. పాటిలు.) (మిగులు పద్యము. చూ. చొప్పడు.)

**పాటీరము** (సం.వి.అ.పుం.) : 1. చందనము; 2. వెదురుచేవ; 3. జల్లెడ; 4. వరిమడి; 5. మబ్బు; 6. ముల్లంగి.

**పాటీలు** (దే.వి.బ.) : స్త్రీహస్త భూషా విశేషము.

**పాటు** (వై.వి.) : 1. పడుట; 2. శ్రమము; 3. ఆపద; (చూ. పాటిల్లు.) 4. సముద్రజలోల్బణ శమనము.

**పాటునఁబడు** (వై.అ.క్రి.) : యథాస్థితికి వచ్చు.

**పాటుపడు** (వై.అ.క్రి.) : శ్రమపడు.

**పాటుమానిసి** (వై.వి.) : పాటుపడు మనుష్యుఁడు.

**పాట్లమారి** (ద్వ.విణ.) : (పాటులు + మారి) మిక్కిలి శ్రమపడు స్వభావము గలవాఁడు.

**పాఠ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. చిఱుబొద్ది; 2. విసబొద్ది. (అ.పుం.ము.) : 1. పఠనము; 2. వేద పఠనము; 3. బ్రహ్మ యజ్ఞము.

**పాఠకుఁడు** (సం.వి.అ.పుం.) : వేదపాఠము చదువువాఁడు. (తద్విశేషములు – అజపుఁడు, శాఖాదండుఁడు.)

**పాఠశాల** (సం.వి.ఆ.స్త్రీ.) : బాలురు చదువుచోటు, బడి.

**పాఠి** (సం.వి.న్.పుం.) : 1. చిత్రమూలము; 2. పాఠకుఁడు.

**పాఠీనము** (సం.వి.అ.పుం.) : వేయి కోఱలచేఁప, కొఱ్ఱ.

**పాఠ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పఠింపఁదగినది.

**పాడగము** (వై.వి.) : స్త్రీపాద భూషా విశేషము.

**పాడఱు** (దే.అ.క్రి.) : (పాడు + అఱు) పాడుపడు. (చూ. కరడు.)

**పాడి** (దే.వి.) : 1. ధర్మము; 2. వ్యవహారము; 3. న్యాయము; 4. స్వభావము.

**పాడు** (దే.అ.క్రి.) : పాటపాడు. (వి.) 1. పాటినేల; 2. పల్లె. (ఆముదాలపాడు, దుత్తపాడు. మొ.) (విణ.) : శూన్యము.

**పాడునుయ్యి** (దే.వి.) : కసవులోనగు వానిచేఁ గప్పఁబడిన ముఖభాగము గల కూపము, అంధకూపము.

**పాడువడు** (ద్వ.అ.క్రి.) : (పాడు + పడు) పాడుఱు, శూన్యమగు.

**పాడువాఱు** (దే.అ.క్రి.) : (పాడు + పాఱు) పాడువడు. (చూ. పాఱు.)

**పాడె** (దే.వి.) : శవవాహనము, ఖట్టిక.

**పాడ్యమి** (వై.వి.) : పక్షమందు మొదటి తిథి, ప్రథమ. (దీనినొక నిఘంటుకారుఁడు సంస్కృత పదముగా వ్రాసి యున్నాఁడు.)

**పాణసి** (దే.వి.) : మాల.

**పాణి** (ఉభ.వై.వి.) : ముత్తెపునీరు. (సం.ఇ.పుం.): మనికట్టు మొదలుకొని వ్రేళ్లతోఁ గూడినచేయి.

**పాణింధమము** (సం.వి.అ.పుం.) : 1. కొలమి తిత్తి; 2. చీఁకటి; 3. వాద్య విశేషము.

**పాణిగృహీతి** (సం.వి.ఈ.స్త్రీ.) : అగ్నిసాక్షిగా పెండ్లాడిన పెండ్లాము.

**పాణిగ్రహణము** (సం.వి.అ.న.) : వివాహము, పెండ్లి.

**పాణిఘుఁడు** (సం.వి.అ.పుం.) : చేతులతో తాళము వేయువాఁడు.

**పాణిపీడనము** (సం.వి.అ.న.) : వివాహము, పెండ్లి.

**పాణివడము** (దే.వి.) : అమ్ములపొది, తూణీరము.

**పాణివాదుఁడు** (సం.వి.అ.పుం.) : (చూ.) పాణిఘుఁడు.

**పాణౌకృతి** (సం.వి.ఇ.స్త్రీ.) : పాణౌకరణము, పెండ్లి.

**పాత** (సం.విణ.) : (బు.ఈ.బు.) కాచువాఁడు.

**పాతకము** (సం.వి.అ.పుం.) : మహా పాపము. (ఇవి అయిదు. స్వర్ణ స్తేయము, సురాపానము, బ్రహ్మహత్య, గురుపత్నీ గమనము, ఇవి చేయువారి తోడి సహవాసము.

**పాతము** (సం.వి.అ.పుం.) : 1. పతనము, పాటు; 2. రాహువు. (విణ.) : కావఁబడినది.

**పాతరలాడు** (ద్వ.అ.క్రి.) : (పాతరలు + ఆడు) వర్తించు.

**పాతాళము** (సం.వి.అ.న.) : 1. క్రింది లోకము; 2. బడబాగ్ని.

**పాతిక** (వై.వి.) : ఒకటిలో నాలుగవ భాగము.

**పాతివ్రత్యము** (సం.వి.అ.న.) : పతివ్రతాత్వము.

**పాతుకుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) పడునట్టి స్వభావముగల వాఁడు.

**పాత్రము** (సం.వి.అ.న.) : 1. రెండు దరుల నడుము; 2. భుకుంసాది; 3. మంత్రి; 4. యోగ్యము; 5.స్రువాది; 6. త్రి.భాజనము. (ఇది తెనుఁగున భాజనార్థమునందు కొందఱు మహాకవులచే పాత్ర యని ప్రయోగింపఁబడి యున్నది. ఒకచోనర్తకి యనునర్థము నందు వైకృతముగా ప్రయోగింపఁబడి యున్నది.)

**పాత్రలాడు** (ద్వ.అ.క్రి.) : పాతరలాడు యొక్క రూపాంతరము.

**పాథస్సు** (సం.వి.స్.న.) : 1.జలము; 2.అన్నము.

**పాథేయము** (సం.వి.అ.న.) : అన్నము బియ్యము లోనగుదారి బత్తెము.

**పాథోధి** (సం.వి.ఇ.పుం.) : సముద్రము, కడలి.

**పాథోనిధి** (సం.వి.ఇ.పుం.) : సముద్రము, కడలి.

**పాదకటకము** (సం.వి.అ.పుం.) : అందియ.

**పాదగ్రహణము** (సం.వి.అ.న.) : (చూ.) అభివాదనము.

**పాదచారి** (సం.వి.న్.పుం.) : కాలిబంటు. (విణ.): నడచిపోవువాఁడు.

**పాదజుఁడు** (సం.వి.అ.పుం.) : శూద్రుఁడు, అడుపుఁబుట్టువు.

**పాచట్టు** (దే.వి.) : (పాడు + తిట్టు) ఇండ్లలోపలి వాసములకు పట్టెలకు పట్టెడు బూసి.

**పాదప** (సం.వి.ఆ.స్త్రీ.) : పావకోళ్లు. (అ.పుం. ము.) : 1. చెట్టు; 2. కాళ్లుంచుకొనెడు పీఁట.

**పాదపట్టము** (సం.వి.అ.పుం.) : (చూ.) పాయ వట్టము.

**పాదబంధనము** (సం.వి.అ.న.) : ఆవుగేదె లోనగునది.

**పాదము** (సం.వి.అ.పుం.) : 1. అడుగు; 2. కిరణము; 3.వేరు; 4.పద్యమునందలి యొక చరణము; 5.పాతిక; 6.కొండ తఱితిప్ప.

**పాదరసము** (వై.వి.) : రసము, పారదము.

**పాదలి** (వై.వి.) : (చూ.) ఓరపాక. (విణ.) : అధముఁడు.

**పాదసరము** (సం.వి.అ.పుం.) : గజ్జెగొలుసు.

**పాదస్ఫోటము** (సం.వి.అ.పుం.) : కాళ్లు పగుళ్లు పాఱెడు కుష్ఠ విశేషము.

**పాదాంగదము** (సం.వి.అ.న.) : అందియ.

**పాదాగ్రము** (సం.వి.అ.న.) : మీఁగాలు, ప్రపదము.

**పాదాతము** (సం.వి.అ.న.) : పదాతుల సమూహము.

**పాదాతికుఁడు** (సం.వి.అ.పుం.) : పదాతి, కాలిబంటు.

**పాది** (యు.దే.వి.) : 1. ఏఱు దాఁటెడి యొకానొక సాధనము; 2. పాది వేఁట. (వై.) : పాదు యొక్క రూపాంతరము.

**పాదిక** (సం.వి.ఆ.స్త్రీ.) : చిన్నకంబము. (విణ.): నాలుగవది.

**పాదిగువ్వ** (దే.వి.) : పాదివేఁట కుపయుక్తమైన పెంపుడు పిట్ట.

**పాదిరి** (వై.వి.) : కలిగొట్టు, పాటలి.

**పాదిలి** (వై.వి.) : కలిగొట్టు, పాటలి.

**పాదివేఁట** (దే.వి.) : కక్కెర కౌఁజు కారు కోడి పూరేడు లోనగు పెంపుడు పిట్టలను పైవిడిచి పిట్టలను పట్టెడు ఒకానొక వేఁట.

**పాదు** (వై.వి.) : 1. చెట్టులోనగువానికి నీళ్లు పోయుటకై క్రింద కుదురుగాఁ జేసిన పల్లము, ఆలవాలము; 2. క్రిందు; 3. నిలుకడ. (చూ. కలపన గంప.)

**పాదుక** (సం.వి.ఆ.స్త్రీ.) : పావకోళ్లు. (అ.న.ము.) ముచ్చె.

**పాదుకొను** (ద్వ.అ.క్రి.) : 1.నెలకొను; 2.నిలుచు. (ప్రే. పాదుకొలుపు. చూ. కవలు.)

**పాదునిలుచే** (ద్వ.అ.క్రి.) : పాదుకొను, నిలుకడయగు.

**పాదువు** (సం.వి.ఉ.ఊ.స్త్రీ.) : 1. పావకోళ్లు; 2. చెప్పులు.

**పాదుసా** (వై.వి.) : రాజు. (పాదుషా రూపాంతరము.)

**పాదుసాహి** (వై.వి.) : రాజు. (పాదుసా, పాదుసాహి శబ్దములకు మ్లేచ్ఛ భాష యందు తఱచు వాడుక గలదు.)

**పాదూకృత్తు** సం.వి.త్.పుం.) : మాదిగవాఁడు, (రూ. పాదు కృత్తు.)

**పాదూవాహుఁడు** (సం.వి.అ.పుం.) : పావకోళ్లను చెప్పులను తెచ్చువాఁడు.

**పాదొట్టు** (దే.వి.) : (పాదు + తొట్టు) (చూ.) పాదట్టు.

**పాదొట్టుపురుగు** (ద్వ.వి.) : సాలెపురుగు.

**పాద్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పాదము కొఱకైనది. (జలాదికము)

**పానకము** (ఉభ.దే.వి.) : ఫలరసము. (సం.అ.పుం.) : బెల్లములోనగువానిఁ గలిపి యేలకులు మొదలైన సంబారువులు చేర్చి చేసెడు పానీయము.

**పానగోష్ఠిక** (సం.వి.ఆ.స్త్రీ.) : అనేకులు చేరి మద్యపానము చేసెడి చోటు.

**పానము** (సం.వి.అ.న.) : 1.త్రాగుడు; 2. త్రాగుడు గిన్నె; 3.కాపు. (వై.వి.) : లింగపీఠము, పానవట్టము. (చూ. గిరిగిటలు)

**పానలు** (దే.వి.బ.) : సందేహము.

**పానవట్టము** (దే.వి.) : లింగపీఠము. (పానము + వట్టము)

**పానారము** (దే.వి.) : పందుపోఁక, పోఢము.

**పానీయము** (సం.వి.అ.న.) : జలము. (విణ.): 1. త్రాగఁదగినది; 2. కావఁదగినది.

**పానీయశాలిక** (సం.వి.ఆ.స్త్రీ.) : చలిపందిలి, ప్రప.

**పానుపు** (దే.వి.) : 1. మంచము; 2. పఱుపు. (రూ. పాన్పు. మంచమునకు.)

**పాప** (దే.వి.) : 1. శిశువు; 2. కంటి నల్లగ్రుడ్డులోని ప్రతిఫలనము.

**పాపఁడు** (దే.వి.) : 1. బాలుఁడు; 2. పురుష శిశువు.

**పాపచేలి** (సం.వి.ఈ.స్త్రీ.) : అగలుసొంటి.

**పాపట** (యు.దే.వి.) : కేశవీధి. (ఇది పాయుధాతు కృదంతము.) (వై.) : వృక ధూమకము. (దీనికి కర్త వనలక్ష్మి.)

**పాపటచేఱు** (ద్వ.వి.) : పాపటబొట్టు.

**పాపటబొట్టు** (దే.వి.) : పాపటకు సరిగా నుదుటవ్రేలెడు చేఱు చుక్క, లాలాటిక.

**పాపటము** (దే.వి.) : గొర్తిపైరు మీఁద గాదము పోవదున్నెడు సాధనము. (ఇది పాయుధాతు కృదంతము.)

**పాపటపుచ్చు** (దే.ప్రే.) : (పాపట వోవఁజేయు) దారివిడిచి తొలఁగించు.

**పాపటవోవు** (దే.అ.క్రి.) : (పాపట + పోవు) దారి విడిచి తొలఁగు. (చూ. పాపటపుచ్చు.)

**పాపనము** (దే.వి.) : పాపటము యొక్క రూపాంతరము.

**పాపము** (సం.వి.అ.న.) : దుష్కృతము. (విణ.): దుష్కృతము గలది.

**పాపాత్ముఁడు** (సం.వి.న్.పుం.) : పాపచిత్తుఁడు.

**పాపి** (సం.విణ.) : (న్.ఈ.న్) పాపము గలవాఁడు.

**పాపిష్ఠుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) మిక్కిలిపాపి.

**పాపు** (దే.ప్రే.) : 1. పాయఁజేయు; (అను ప్రయుక్తమైన పాయి ధాతువునకును రూపమి ట్లెలుంగునది. ఎడఁబాపు, పఱియవాపు. మొ.) 2. దున్ను.

**పాపుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. పాపి; 2. హింసకుండు; 3. అధముఁడు.

**పాపోసు** (వై.వి.) : ముచ్చె. (పాయపోసు యొక్క రూపాంతరము.) (చూ. దౌరు)

**పాప్మము** (సం.వి.న్.పుం.) : పాపము, కలుచ.

**పామ** (సం.వి.ఆ.స్త్రీ.న్.పుం, న.ము.) : గజ్జి.

**పామనుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) గజ్జి కలవాఁడు.

**పామరుఁడు** (సం.విణ.) : (అ.ఈ.అ.) 1. అజ్ఞుఁడు; 2. నీచుఁడు.

**పాము** (దే.స.క్రి.) : రుద్దు, రాచు. (ప్రాము యొక్క రూపాంతరము.) (వి.) : సర్పము.

**పాముదొండ** (ద్వ.వి.) : ఒక దినుసు దొండ.

**పాములనారిగాఁడు** (దే.వి.) : పక్షి విశేషము.

**పాములవాఁడు** (దే.వి.) : పామును పట్టి ఆడించి జీవించువాఁడు, అహితుండికుఁడు.

**పాయ** (దే.వి.) : 1. చీలిక; 2. ఒక నదిలో నుండి చీలిపాఱిన నది; 3. ఖండము; 4. చర్మములోనగువాని ఖండము; 5.మునుము.

**పాయఁబాఱు** (దే.అ.క్రి.) : (పాయ౯ + పాఱు) (అన్నము మొదలైనవి) పాయు.

**పాయకట్టు** (దే.వి.) : ఒక ముఖ్య గ్రామముతోఁ జేరిన యుప గ్రామముల సమూహము, జనపదము.

**పాయకారి** (దే.వి.) : భాగ ప్రకారము భూ స్వాతంత్ర్యము లేని రైతు.

**పాయఖానా** (హిం.వి.) : మరుగు పెరఁడు.

**పాయగిల్లు** (దే.అ.క్రి.) : తొలఁగు. (రూ. పాయగిలు.)

**పాయగొమ్మ** (దే.వి.) : (పాయ + కొమ్మ) పంగలకొమ్మ.

**పాయపోసు** (వై.వి.) : (చూ.) పాపోసు.

**పాయము** (వై.వి.) : వయసు.

**పాయవట్టము** (వై.వి.) : కాలియందె. (చూ.నయ.)

**పాయవడు** (ద్వ.అ.క్రి.) : (పాయ+పడు) 1.చీలు; 2.తొలఁగు; 3.దారి విడిచి తొలఁగు; 4.వెలివడు.

**పాయవాఱు** (దే.అ.క్రి.) : (పాయ + పాఱు) తొలఁగు.

**పాయసము** (సం.వి.అ.న.) : పరమాన్నము. (పుం.) : దేవదారు బంకతోఁ జేసిన ధూపము.

**పాయి** (ఉభ.వై.వి.) : పాలు. (ఇది తఱచుగా బహువచనాంతమైనను ఈ కవిచే నేకవచనాం తముగాఁ జెప్పఁబడి యున్నది. ఇట్లు వ్యవహార మందును కొన్నిచోట్లఁ గానఁబడుచున్నది.) (సం.విణ.) : (న్.ఈ.న్.) తాగుఁబోతు.

**పాయు** (దే.అ.క్రి.) : 1. తొలఁగు; 2. చిక్కెడలు; (చూ. పాచు.) 3. పక్వ పదార్థము కాలాతి క్రమణముచే మెత్తఁ బడిచెడు. (స.క్రి.) : విడుచు.

**పాయువు** (సం.వి.ఉ.పుం.) : గుదము, మూడి.

**పాయ్యము** (సం.వి.అ.న.) : 1. త్రాసు, మూర, తూములోనగు మానము; 2.జలము. (విణ.): నిందింపఁదగినది.

**పారంగతుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) దరిఁ జేరినవాఁడు.

**పారంపరి** (సం.వి.ఈ.స్త్రీ.) : పారంపర్యము.

**పారంపర్యము** (సం.వి.అ.న.) : 1. కుల క్రమము; (పుం. గురు క్రమము అని కొందఱు.) 2. పరంపరా భావము.

**పారగుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) పారంగతుఁడు.

**పారడ** (ద్వ.వి.) : పాలడ యొక్క రూపాంతరము.

**పారణ** (సం.వి.ఆ.స్త్రీ.అ.న.ము.) : ఉపవాసముండి మఱునాడు చేయు భోజనము. (పుం.) : మేఘము.

**పారతంత్ర్యము** (సం.వి.అ.న.) : పరాధీనత.

**పారత్రికము** (సం.విణ.) : (అ.ఈ.అ.) పరలోక సంబంధమైనది.

**పారదము** (సం.వి.అ.పుం.) : పాదరసము, (రూ. పారతము.)

**పారదారికుఁడు** (సం.వి.అ.పుం.) : పరదార రతుఁడు.

**పారదేశికుఁడు** (సం.విణ.) : (అ.ఈ.అ.) 1. అన్యదేశస్థుఁడు; 2. దారినడచువాఁడు.

**పారమార్థికుఁడు** (సం.విణ.) : (అ.ఈ.అ.) 1. పరమార్థబుద్ధి గలవాఁడు; 2. ముఖ్యుఁడు.

**పారము** (సం.వి.అ.న.) : 1.ఆవలిదరి; 2. సమీపము.

**పారలౌకికము** (సం.వి.అ.న.) : పరమాన్నము. (విణ.) : పరలోక సంబంధమయినది.

**పారవశ్యము** (సం. వి. అ. న.) : పరవశత్వము.

**పారశీకము** (సం.వి.అ.పుం.) : 1.ఒకానొక దేశము; 2. ఆ దేశమునందుఁ బుట్టిన గుఱ్ఱము. (రూ. పారసికము, పారసీకము.)

**పారశ్వధికుఁడు** (సం.వి.అ.పుం.) : గండ్రగొడ్డలి యాయుధముగాఁ గలవాఁడు. (రూ. పార శ్వధుఁడు.)

**పారసి** (వై.వి.) : పారసీక దేశపుభాష. (చూ. ఆరెము.)

**పారస్త్రైణేయుఁడు** (సం.వి.అ.పుం.) : పరస్త్రీ వలనఁ బుట్టిన కొడుకు.

**పారా** (హిం.వి.) : కావలి. (రూ. పహరా.)

**పారాణి** (దే.వి.) : కుంకుమములోనగు వానితో పాదములకు చేయు నలంకారము.

**పారాణించు** (దే.స.క్రి.) : కుంకుమము లోనగు వానితో పాదముల నలంకరించు.

**పారాయణము** (సం.వి.అ.న.) : 1.అంతయు; 2.అంతయు చదువుట; 3. పారమును పొందుట.

**పారావతము** (సం.వి.అ.పుం.) : 1. పావురము; 2. కోఁతితుమికి.

**పారావతాంఘ్రి** (సం.వి.ఇ.స్త్రీ.) : మానేరు.

**పారావారము** (సం.వి.అ.న.) : ఈవలావలి దరులు. (పుం.) : సముద్రము.

**పారాశరి** (సం.వి.ఇ.పుం.) : వ్యాసముని. (న్.) సన్యాసి.

**పారి** (ఉభ.దే.వి.) : 1. తడవ; (చూ.పరి) 2.మన్ను. 1.గిండి; 2.ఈడుముంత; 3.ఏనుఁగు కాలిగొలుసు; 4. మల్ల చిప్ప; 5. నీరుప్రబ్బ.

**పారిక** (దే.వి.) : దాసురాలు, బానిస.

**పారికాంక్షి** (సం.వి.న్.పుం.) : 1.ముని; 2.కృచ్ఛ్ర చాంద్రాయణాది వ్రతశీలుఁడు.

**పారికాఁపు** (దే.వి.) : పరిచరుఁడు. (చూ. పఱగడ, పారివాఁడు.)

**పారిజాతము** (సం.వి.అ.పుం.) : 1. పారిభద్రము; 2. కల్పవృక్షము; 3. బ. ధాన్యవిశేషము.

**పారిణి** (సం.వి.ఈ.స్త్రీ.) : పచ్చయిరుగుడు.

**పారితథ్య** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. జడబిల్ల; 2. సిగపువ్వు.

**పారితోషికము** (సం.వి.అ.న.) : (చూ.) పసదనము.

**పారిప్లవము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చలించునది.

**పారిభద్రము** (సం.వి.అ.పుం.) : 1. దేవదారువు; 2. వారిజము; 3. వేము.

**పారిభావ్యము** (సం.వి.అ.న.) : చెంగల్వ కోష్టు.

**పారియాత్రకము** (సం.వి.అ.పుం.) : ఒకానొక కొండ, (రూ. పారి యాత్రము.)

**పారివాఁడు** (దే.వి.) : పారికాఁపు, పరిచరుఁడు.

**పారిషదుఁడు** (సం.వి.అ.పుం.) : ప్రమథగణము నందలి చండికేశ్వరాది.

**పారిహారికుఁడు** (సం.విణ.) : (అ.ఈ.అ.) పరిహారము చేయువాఁడు.

**పారిహార్యము** (సం.వి.అ.పుం.) : సూడిగము, (చూ.) ఆవాపకము. (విణ.) : పరిహారము చేయఁదగినది.

**పారీంద్రము** (సం.వి.అ.పుం.) : సింహము, కంఠీరవము.

**పారీఖత్తు** (హిం.వి.) : విభాగపత్రము.

**పారీణుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) పారము ముట్టినవాఁడు.

**పారు** (దే.అ.క్రి.) : 1. పరుగెత్తు; (ఇది లఘు రేఫక మగుట కాదికవుల ప్రయోగము కనcబడ లేదు.) 2. పాసనము చేయు.

**పారుకాడు** (దే.అ.క్రి.) : (పారుక+ఆడు) పరుగెత్తు.

**పారుడు** (దే.వి.) : పాసనము.

**పారుపత్తెకాcడు** (దే.విణ.) : 1. దొరతనము వారికియ్యవలసిన ధనమును జనుల వలన రాcబట్టెడి అధికారి; 2. అధికారి.

**పారుపత్తెము** (దే.వి.) : 1. దొరతనము వారి కియ్యవలసిన ధనమును ప్రజల వలన రాcబట్టెడి అధికారము; 2. అధికారము. (చూ. తలతల.)

**పారువ** (దే.వి.) : జాడ.

**పారువము** (వై.వి.) : పారావతము.

**పారుష్యము** (సం.వి.అ.న.) : 1. పరుసcదనము; 2. పరుసపు మాట.

**పారేవతము** (సం.వి.అ.న.) : ఒక దినుసు ఎఱ్ఱకిత్తలి, ఈడ.

**పార్తెంచు** (దే.అ.క్రి.) : పాఱుతెంచు యొక్క రూపాంతరము. (పరుగెత్తి వచ్చుటకు.)

**పార్థక్యము** (సం.వి.అ.న.) : పృథగ్భావము, వేర్పాటు.

**పార్థివ** (సం.వి.అ.పుం.) : 1. ఒక సంవత్సరము; (చూ. సంవత్సరము) ము. 2. గుఱ్ఱము. (విణ.): పృథివీ సంబంధమైనది.

**పార్థివుcడు** (సం.వి.అ.పుం.) : రాజు, ఱేcడు.

**పార్థుcడు** (సం.వి.అ.పుం.) : 1. అర్జునుcడు; 2. రాజు.

**పార్పత్తెము** (దే.వి.) : పారుపత్తెము యొక్క రూపాంతరము.

**పార్వణము** (సం.వి. అ.పుం.) : మృగ విశేషము. (పుం,న.) : 1.పిండ ప్రదానము; 2.పర్వ సంబంధమయినది.

**పార్వతి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. గౌరి; 2. ద్రౌపది; 3. ఒకగోపిక; 4. అందుగు; 5. పాలకూర.

**పార్వతీనందనుcడు** (సం. వి. అ. పుం.) : కుమారస్వామి.

**పార్వతేయము** (సం.వి.అ.పుం.) : ప్రొద్దు తిరుగుడు చెట్టు. (విణ.) : పర్వతమునందు పుట్టినది.

**పార్వము** (వై.వి.) : పారువము యొక్క రూపాంతరము.

**పార్శ్వము** (సం.వి.అ.న.) : పర్శువుల సమూహము. (పుం.) : ప్రక్క. త్రి. సమీపము.

**పార్ష్ణి** (సం.వి.ఇ.స్త్రీ.) : వేcదుఱెత్తిన యాcడుది. (పుం, న.) 1.కాలిమడమ; 2.దండు వెనుక; 3. వెనుక.

**పార్ష్ణిగ్రాహుcడు** (సం.వి.అ.పుం.) : దండెత్తి పోవు రాజునకు వెనుక దిక్కుననుండు శత్రువు.

**పార్ష్ణిత్ర** (సం.వి.ఆ.స్త్రీ.) : అఱకాలు మీcగాలు మడమలను మూసికొని యుండు ముచ్చె. (అ.న.ము.) : ముందట నుండి రక్షించెడుసేన.

**పాఱ** (దే.వి.) : త్రవ్వునట్టి యొకానొక సాధనము, ఖనిత్రి.

**పాఱcదోలు** (దే.స.క్రి.) : (పాఱన్+తోలు) తఱుము.

**పాఱcజూచే** (ద్వ.స.క్రి.) : దృష్టించి చూచు.

**పాఱcబోత** (దే.వి.) : పాఱcబోయుట.

**పాఱcబోయు** (దే.స.క్రి.) : (పాఱన్ + పోయు) కుమ్మరించు.

**పాఱమ్ము** (ద్వ.వి.) : (పాఱన్ + అమ్ము.) పాఱవాతియమ్ము.

**పాఱవాతియమ్ము** (ద్వ.వి.) : (పాఱవాయి + అమ్ము) పాఱ యొక్క వాదర వంటి వాదరగల బాణము.

**పాఱవేయు** (దే.స.క్రి.) : (పాఱన్ + వేయు.) 1. విసరి వేయు; 2. వదల విడుచు. (సొమ్ము పాఱవేసినాcడు.)

**పాఱవైచే** (దే.స.క్రి.) : (పాఱన్ + వైచు) విసరివేయు.

**పాఱాడు** (దే.అ.క్రి.) : (పాఱి + ఆడు) పాఱు. (మొదటి రూపము పాఱి యాడు.) (చూ. ఊcగాడు.)

**పాఱు** (దే.అ.క్రి.) : 1.పరుగెత్తు; 2. ప్రవహించు; (చూ.ఓటాఱు.) 3. ప్రసరించు. (ఇది కొన్ని క్రియలకు స్వార్థ మందును కొన్నిటికి ఇంచుక్కాన మందును మఱికొన్నిటికి ఆరంభార్థము నందును అనుప్రయుక్త మగుచున్నది. విరియఁబాఱు, తెల్లవాఱు, పండఁ బాఱు. మొ.)

**పాఱుఁడు** (దే.వి.) : (పాఱ + వాఁడు) బ్రాహ్మణుఁడు.

**పాఱుఁబోతు** (దే.విణ.) : (పాఱు + పోతు) పిఱికి.

**పాఱుటక్క** (ద్వ.వి.) : (పాఱుఁడు + అక్క) బ్రాహ్మణస్త్రీ.

**పాఱుటసుర** (మి.వి.) : (పాఱుఁడు + అసుర) బ్రహ్మరాక్షసుఁడు.

**పాఱుటాకులు** (దే.వి.బ.) : (పాఱుఁడు + ఆకులు) మునులు లోనగువారు వస్త్రమునకు మాఱుగా కట్టుకొనెడి యొకదినుసు ఆకులు. (వృత్తియందే కవచనాంతము.)

**పాఱుడు** (దే.వి.) : పాఱుట, ప్రవాహము.

**పాఱుత** (దే.వి.) : బ్రాహ్మణ భార్య, బ్రాహ్మణి.

**పాఱుతెంచు** (దే.అ.క్రి.) : 1.పరుగెత్తివచ్చు, 2.ప్రవహించు. (చూ. ఎసకము రెండవయర్థము)

**పాఱుపోఁగు** (దే.వి.) : దూర దూరముగా పోయు నూలిపోఁగు.

**పాఱుపోఁగుపోయు** (దే.స.క్రి.) : దూర దూరముగా నూలిపోఁగు పోయు

**పాఱువాఁడు** (దే.వి.) : బ్రాహ్మణుఁడు.

**పాఱువేఁట** (దే.వి.) : దేవోత్సవ విశేషము.

**పాల** (యు.దే.వి.) : 1. ఒకానొకపిట్ట, చాషము; 2. క్షీరిక; (దీని భేదము చిఱుపాల.) (విణ.) : శ్వేతము. (చూ. పాలకొడిస.) (ఇది పాలుధాతు కృదంతము.) వై. పాటలము.

**పాలంక్య** (సం.వి.ఆ.స్త్రీ.) : కుందురుష్క మనెడు గంధ ద్రవ్యము. (రూ. పాలుక్య.)

**పాలకడలి** (ద్వ.వి.) : (పాలు + కడలి) క్షీరాబ్ధి.

**పాలకడలివెన్న** (ద్వ.వి.) : చంద్రుఁడు, సముద్ర నవనీతము.

**పాలకన్ను** (దే.వి.) : ధాన్యవిశేషము.

**పాలకాయ** (దే.వి.) : భక్ష్యవిశేషము.

**పాలకి** (వై.వి.) : పల్లకి యొక్క రూపాంతరము.

**పాలకీ** (వై.వి.) : పాలకి యొక్క రూపాంతరము.

**పాలకీ బొంగుచుక్క** (ద్వ.వి.) : మఘా నక్షత్రము.

**పాలకుఁడు** (సం.విణ.) : (అ.ఈ.అ.) రక్షకుఁడు.

**పాలకుప్ప** (ద్వ.వి.) : (పాలు+కుప్ప) పయోరాశి.

**పాలకూర** (వై.వి.) : (పాలు + కూర) మధుస్రవ.

**పాలకొడిస** (ద్వ.వి.) : శ్వేతకుటజము.

**పాలకొయ్య** (దే.వి.) : (చూ.) యూపము.

**పాలగచ్చు** (దే.వి.) : సన్నసున్నపు పూఁత.

**పాలగరువు** (ద్వ.వి.) : మీఁద ఇసుక గల ఱాతిపాఱునేల.

**పాలగార** (దే.వి.) : (చూ.) పాలగచ్చు.

**పాలగుంజ** (ద్వ.వి.) : (చూ.) యూపము.

**పాలగుమ్మ** (దే.వి.) : పాలపిట్ట, చాషము.

**పాలగుమ్ముడు** (వై.వి.) : (పాలు + గుమ్ముడు) నల్లనేలగుమ్ముడు, క్షీరవిదారి. (ఇక్కడ వ్యతిరేకలక్షణ.)

**పాలగొలిమిడి** (ద్వ.వి.) : (పాలు + గొలిమిడి) పయస్విని.

**పాలగోఁకుడు** (ద్వ.వి.) : (పాలు + గోఁకుడు) గోఁకి యెత్తిన పాలకుండ లోని యడుగంటు.

**పాలఘ్నము** (సం.వి.అ.పుం.) : గుడ్డికామంచి.

**పాలచేఁప** (దే.వి.) : ఒక దినుసు తెల్లచేఁప.

**పాలచేరులు** (ద్వ.వి.బ.) : గజ్జనరము.

**పాలచొఱ** (దే.వి.) : సముద్రమున నుండి మనుష్యులను భక్షించెడు తెల్లని చొఱమీను.

**పాలడ** (ద్వ.వి.) : (పాలు+అడఁగు) బిడ్డలకు పాలు పోసెడు చిన్న శంఖము.

**పాలతుత్తము** (ద్వ.వి.) : అంగడిమందు దినుసు, ఖర్పరి.

**పాలతేఁకు** (దే.వి.) : తేఁకుదినుసు, గృహద్రుమము.

**పాలనము** (సం.వి.అ.న.) : రక్షణము. (ఇది అకారాంత స్త్రీ లింగమునగును.)

**పాలపండ్లు** (ద్వ.వి.బ.) : (పాలు + పండ్లు) పుట్టుదంతములు.

**పాలపాపఁడు** (ద్వ.వి.) : (పాలు + పాపఁడు) పాలు త్రాగెడు బిడ్డఁడు.

**పాలపూస** (దే.వి.) : తెల్లని గాజుపూస.

**పాలబుగ్గలు** (ద్వ.వి.బ.) : (పాలు + బుగ్గలు) పాలంటిన బుగ్గలు. (చూ. కదలాడు.)

**పాలమన్ను** (ద్వ.వి.) : ధవళమృత్తిక, సుద్ద.

**పాలము** (సం.వి.అ.పుం.) : 1. కొయ్య పడిగము; 2. (చూ.) మడ్డు.

**పాలమున్నీటికూఁతురు** (ద్వ.వి.) : (పాలమున్నీరు + కూఁతురు) లక్ష్మీదేవి, క్షీరసాగర కన్యక.

**పాలమున్నీటియల్లుఁడు** (ద్వ.వి.) : (పాలమున్నీరు + అల్లుఁడు) విష్ణువు.

**పాలమున్నీరు** (ద్వ.వి.) : (పాలు + మున్నీరు) క్షీరసాగరము.

**పాలవాఁగు** (వై.వి.) : (పాలు + వాఁగు) క్షీరాబ్ధి.

**పాలవిఱుగుడు** (ద్వ.వి.) : (పాలు + విఱుగుడు.) కాఁగినపాలు ఏదేనియొక దోషముచేత విఱిగి పోయి నీళ్లుగా నేర్పడిన భాగముపోఁగా మిగిలిన చిన్నచిన్న తెల్లముద్దలు, ఆమిక్ష.

**పాలవెల్లి** (ద్వ.వి.) : (పాలు+వెల్లి) క్షీరాబ్ధి.

**పాలసుఁడు** (వై.విశ.) : 1. మూర్ఖుఁడు; 2. దుర్జనుఁడు.

**పాలసున్నము** (ద్వ.వి.) : పాలగచ్చు.

**పాలాడు** (దే.స.క్రి.) : (పాలు+ఆడు) ఖండించు.

**పాలానుగు** (ద్వ.వి.) : (పాలు + ఆనుగు) దుగ్ధతుంబి.

**పాలారుచు** (దే.స.క్రి.) : (పాలు + ఆరుచు) ఉపేక్షించు. (రూ. పాలార్చు.) (చూ. ముందు పద్యము.) (దీనిని కవిత్రయము వారును ఇతరులును పట్టి చేపట్టి అనుపూర్వ కాలికా సమాపక క్రియలకు వెనుకచేర్చి ప్రయోగించి యున్నారు.)

**పాలావు** (ద్వ.వి.) : (పాలు + ఆవు) మిగుల పాలిచ్చెడి యావు, పయస్విని.

**పాలాశము** (సం.వి.అ.పుం.) : ఆకుపచ్చన. (విశ.) : ఆకుపచ్చనిది.

**పాలాసత్రాళ్ళు** (ద్వ.వి.బ.) : గుఱ్ఱము కాళ్ళుగట్టు త్రాళ్ళు.

**పాలించు** (సం.స.క్రి.) : రక్షించు, కాపాడు.

**పాలిండ్లు** (ద్వ.వి.బ.) : (పాలు + ఇండ్లు) స్త్రీ స్తనములు.

**పాలిక** (సం.వి.ఆ.స్త్రీ.) : వివాహకాలము నందు నవధాన్యములు నాఱుపోసెడు శరావ విశేషము. (చూ. జాజాము.) (ఇది సంస్కృత పదముగా అనేక గ్రంథములయందు ప్రయోగములు కనఁబడుచున్నవి. ఒకానొక నిఘంటు కారుఁడు దీనిని తెనుఁగుగా వ్రాసి యున్నాఁడు.)

**పాలికాఁపు** (దే.విశ.) : (పాలు+కాఁపు) భాగస్థుఁడు.

**పాలిచుట్టము** (దే.వి.) : (పాలు + చుట్టము) పాలివాఁడు.

**పాలితము** (సం.వి.అ.పుం.) : పెద్ద టేఁకు. (విశ.): 1. రక్షింపఁబడినది; 2. పెంచుకొనఁబడినది.

**పాలిని** (సం.వి.ఈ.స్త్రీ.) : నల్లతెగడ. (విశ.) : పాలించునది.

**పాలివాఁడు** (దే.వి.) : (పాలు+వాఁడు) 1. జ్ఞాతి; 2. పాలేరువాఁడు. (విశ.) : భాగస్థుఁడు.

**పాలు** (యు.దే.అ.క్రి.) : తెల్లనగు. (వానిముఖము పాలిపోయినది.) (వి.) : 1. భాగము; (ఈ సొమ్ము వాని పాలికి వచ్చినది.) 2.వంతు; (ఈ పనిచేయుట నాపాలు) 3.వశము; 4.సమీపము; (వాని పాలికి పొమ్ము.) 5.(బ.) ప్రాలు యొక్క రూపాంతరము. (చూ. పాలుమాలు.) (వై.) : 1.క్షీరము; 2.మఱ్ఱి మొదలగు చెట్లయందు కలిగెడు తెల్లని రసము.

**పాలుగొను** (దే.స.క్రి.) : (పాలు + కొను) పంచుకొను. (చూ. పాల్గొను.)

**పాలుపడు** (ద్వ.అ.క్రి.) : 1. పూనుకొను; 2. స్వాధీనమగు.

**పాలుపుచ్చు** (దే.ప్రే.) : (పాలుపోఁ జేయు) 1. విభాగించు; 2. నిర్ణయించు.

**పాలుపోవు** (దే.అ.క్రి.) : 1. విభక్తమగు; 2.నిర్ణీతమగు.(నాకు అదియెటుచేయను పాలుపోలేదు.)

**పాలుబాన** (దే.వి.) : ఉభయ రాశియైన అంబారములో కాఁపువానికి చేరవలసిన వర్తనధాన్యము.

**పాలుమాలిక** (దే.వి.) : ప్రాలుమాలిక యొక్క రూపాంతరము. (చూ. పాలుమాలు.)

**పాలుమాలు** (దే.అ.క్రి.) : ప్రాలుమాలు యొక్క రూపాంతరము.

**పాలువెట్లు** (దే.స.క్రి.) : (పాలు + పెట్టు) 1. భాగించు; 2. నిర్ణయించు.

**పాలెలు** (దే.వి.బ.) : బిల్లలమొలత్రాటి యందలి వెండి బంగారముల బిల్లలు.

**పాలేరు** (దే.వి.) : (పాలు + ఏరు) మేఁడిపాలికి దున్నెడు మడఁక.

**పాలేరువాఁడు** (దే.విశే.) : మేఁడిపాలికి దున్నెడు మడఁకవాఁడు.

**పాలేఱు** (ద్వ.వి.) : (పాలు + ఏఱు) 1. క్షీరనది; 2. క్షీరాబ్ధి.

**పాల్కడలి** (ద్వ.వి.) : పాలకడలి యొక్క రూపాంతరము.

**పాల్గొను** (దే.స.క్రి.) : పాలుగొను యొక్క రూపాంతరము.

**పాల్పడు** (ద్వ.అ.క్రి.) : పాలుపడు యొక్క రూపాంతరము. (పూనుకొనుటకు.)

**పాల్మాలిక** (దే.వి.) : పాలుమాలిక యొక్క రూపాంతరము.

**పాల్మాలు** (దే.అ.క్రి.) : పాలుమాలు యొక్క రూపాంతరము.

**పావంచ** (ద్వ.వి.) : మెట్టు, సోపానము.

**పావకము** (సం.వి.అ.పుం.) : 1. చిత్రమూలము; 2. జీడి; 3. నెల్లి.

**పావకుఁడు** (సం.వి.అ.పుం.) : 1.అగ్ని; 2. సూర్యుఁడు; 3. మంచి నడవడిక కలవాఁడు.

**పావకోళ్ళు** (ద్వ.వి.బ.) : కొయ్యతో చేసిన పాదరక్షలు, పాదుకలు.

**పావటీలు** (దే.వి.బ.) : మెట్లు, సోపానములు.

**పావడ** (దే.వి.) : 1. స్త్రీలు మొలఁ గట్టుకొనెడు వస్త్ర విశేషము; 2. ధౌత వస్త్రము; 3. వస్త్రము.

**పావడము** (దే.వి.) : కానుక.

**పావనము** (సం.వి.అ.న.) : 1. సాంత పనాది వ్రతము; 2. జలము; 3. గోమయము; 4.రుద్రాక్షము. (పుం.) : 1.అందుగు బంకతోఁ జేసిన ధూప ద్రవ్యము; 2.పచ్చగుంట గలిజేరు. (విశే.) : పవిత్రము.

**పావని** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. ఆవు; 2. గంగ; 3. తులసి. (ఇ.పుం.) : 1. భీముఁడు; 2. హనుమంతుఁడు. (విశే.) : పవిత్రురాలు.

**పావలి** (దే.వి.) : చిన్నజాతిగోళికూరాకు, విచిల్లిక.

**పావలు** (వై.వి.బ.) : పావకోళ్ళు. (పాగలు యొక్క రూపాంతరము. చూ. దలిమము.)

**పావాడము** (దే.వి.) : (చూ.) పవాడము.

**పావాలు** (వై.వి.బ.) : పాగాలు యొక్క రూపాంతరము.

**పావి** (వై.వి.) : పాపి.

**పావు** (వై.వి.) : నాల్గవభాగము, వరాలో నాల్గవ భాగము.

**పావురపుఁబలుకు** (ద్వ.వి.) : (పావురము + పలుకు) మణితము.

**పావురము** (వై.వి.) : పావురాయి, పారావతము.

**పావురాయి** (వై.వి.) : పావురాయి, పారావతము.

**పావులా** (వై.వి.) : రూపాయలో నాల్గవ భాగము.

**పాశకము** (సం.వి.అ.పుం.) : పాచిక, అక్షము.

**పాశము** (సం.వి.అ.పుం.) : 1. త్రాడు; 2. కేశ పర్యాయములకు పరమైనచో వాని సమూహము; (కేశపాశము. మొ.) 3. కర్ణ శబ్ద పూర్వకమైనప్పుడు సుకర్ణము; 4. ఛత్రపూర్వకమైనప్పుడు కుత్సితచ్ఛత్రము.

**పాశి** (సం.వి.న్.పుం.) : 1. వరుణుఁడు; 2. యముఁడు; 3. వ్యాధుఁడు. (విశే.) : పాశధరుఁడు.

**పాశుపతము** (సం.వి.అ.పుం.) : 1.పశుపతి యధిదైవతముగాఁ గలయొక యస్త్రము; 2. పశుపతి మతము; 3. ఒక పుష్పము. (విశే.) : పశుపతి యందాస గలది.

**పాశుపాల్యము** (సం.వి.అ.న.) : గోమహిష్యాది పోషణ వృత్తి.

**పాశ్చాత్యుఁడు** (సం.వి.అ.పుం.) : వరుణుఁడు. (విణ.) : 1.పడమటివాఁడు; 2.వెనుకటివాఁడు.

**పాశ్య** (సం.వి.ఆ.స్త్రీ.) : పాశముల సమూహము.

**పాషండము** (సం.వి.అ.పుం.) : ఒక మతము.

**పాషండుఁడు** (సం.వి.అ.పుం.) : వేద బాహ్యుఁడు. (రూ. పాషండి, న్.పుం.)

**పాషాణదారకుఁడు** (సం.వి.అ.పుం.) : ఱాయి తొలుచు పనివాఁడు, కాసీఁడు.

**పాషాణదారణము** (సం.వి.అ.పుం.) : (చూ.) కాసెయులి, టంకము.

**పాషాణము** (సం.వి.అ.పుం.) : ఱాయి, శిల, గ్రావము.

**పాసఁగు** (దే.వి.) : శాలిధాన్య విశేషము. (మొదటి రూపము ప్రాసఁగు)

**పాసనము** (వై.వి.) : కడుపువెళ్లుట, విరేచనము.

**పాసిక** (వై.వి.) : పాచికకు మొదటి రూపము.

**పాసెము** (వై.వి.) : పాయసము. (చూ.పణ్యారము)

**పాళ** (దే.వి.) : పోఁకలోనగు వానికప్పుడు తోడి పూగుత్తి, కుహళి.

**పాళము** (యు.దే.వి.) : 1.విధము; 2. సమయము. (వై.) : 1. బంగారులోనగువాని కడ్డి; 2.కొలఁది. (ఇది యీరెండర్థములకు నుదాహరణము.)

**పాళా** (వై.వి.) : బంగారులోనగు వాని కడ్డి. (పాళము యొక్క రూపాంతరము.)

**పాళి** (ఉభ.వై.వి.) : 1. జూద మాడెడు పలక; 2. సారెల పోఁత. (సం.ఇ.ఈ.స్త్రీ.) : 1.అంచు; 2.గుఱుతు; 3. చోటు; 4. వరుస; 5. చెవితమ్మె; 6. కొండ నెత్తము; 7. మీసములఁగల ఆఁడుది; 8. పేను.

**పాళియ** (వై.వి.) : పాళె.

**పాళియము** (వై.వి.) : పాళెమునకు మొదటి రూపము. (దండునకు.)

**పాళీ** (యు.దే.వి.) : వ్రాసెడి యినుప కలము యొక్క మొన. (వై.) : 1. జూదమాడెడు పలక; 2. బ.జూదము. (పాళి యొక్క రూపాంతరము.)

**పాళె** (వై.వి.) : జూదమాడెడు పలక. (పాళియ యొక్క రూపాంతరము.)

**పాళెంబుదిగు** (ద్వ.అ.క్రి.) : (దండు) విడియు. (చూ. పాళెము.) (ప్రే. పాళెంబుదించు.)

**పాళెగాఁడు** (ద్వ.వి.) : (పాళెము + కాఁడు) పాళెముపట్టుదొర.

**పాళెము** (వై.వి.) : 1. కావలి; 2. పాళె గాని పట్టణము; 3. చిన్న పట్టణము; 4. దండు; 5.దండు విడియుచోటు.

**పాళెముపట్టు** (ద్వ.వి.) : పాళెగాని రాజ్యము.

## పి

**పింగ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.గోరోజనము; 2.పార్వతి; 3.ఇంగువ; 4.కాఁడ. (అ.న.ము.): కురువేరు. (పుం.) : గోరోజనపు వర్ణము. (విణ.): గోరోజనపు వర్ణము గలది.

**పింగలి** (దే.విణ.) : వెనుకటిది, వెనుకటివాఁడు.

**పింగటించు** (గ్రా.వి.) : అతిశయపు మాటలాడు. (రూ. పింగళించుట.)

**పింగళ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. దక్షిణపు దిక్కునందలి ఆఁడేనుఁగు; 2. ఒకనాడి; 3. పైఁడికంటి; 4. ఒకానొక వేశ్య. (అ.పుం.) : సంవత్సర విశేషము. (చూ.సంవత్సరము) ము.1. గోరోజనము వంటి వర్ణము; 2. కోఁతి; 3.ఒకపాము; 4.ముంగిస; 5.నిధివిశేషము. (విణ.) : గోరోజనము వంటి వర్ణము కలది.

**పింగళుఁడు** (సం.వి.అ.పుం.) : 1. సూర్యుని ప్రక్కనుండు వారిలో నొకఁడు; (చూ.దండుఁడు) 2.అగ్ని; 3. శివుఁడు.

**పింగాణి** (దే.వి.) : ఒక దినుసు తెల్లమట్టిపాత్రము.

**పించియము** (వై.వి.) : పించెము.

**పించెము** (వై.వి.) : నెమిలిపురి. (పించియము యొక్క రూపాంతరము)

**పించము** (వై.వి.) : మదము.

**పింఛను** (ఆం.వి.) : చిరకాలము పనిచేసినందుకై యిచ్చు మనోవృత్తి.

**పింఛము** (సం.వి.అ.న.) : 1. నెమిలిపురి; 2. కృష్ణుని శిరో భూషణము.

**పింజే** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.దూది; 2.పసుపు. (అ.న.ము.) : 1.బలము; 2. హింస. (విణ.): కలంత పాటినది.

**పింజేనము** (సం.వి.అ.న.) : దూదేకువిల్లు.

**పింజేరము** (సం.వి.అ.న.) :1.బంగారు; 2.హరి దళము. (పుం.) : 1. ఎఱుపుమించిన పసుపు వర్ణము; 2.తామ్రము. (విణ.) : 1.ఎఱుపు మించిన పసుపు వర్ణము కలది; 2. కలంత పాటినది.

**పింజలము** (సం.వి.అ.పుం.) : మిక్కిలి కలంత పాటిన సేనలోనగునది.

**పింజించే** (దే.స.క్రి.) : 1. పింజెపోయు; 2.నీళ్లు చిలుకరిలం జిమ్ము.

**పింజిక** (సం.వి.ఆ.స్త్రీ.) : నూలిచుట్ట, తూలనాళిక.

**పింజూషము** (సం.వి.అ.పుం.) : కర్ణమలము, గులిమి.

**పింజె** (దే.వి.) : 1. ముందుచెక్కుకొనెడి వస్త్రపు కుచ్చె; 2. వెనుకంజెక్కుకొను దోవతికొంగు.

**పింజ** (వై.వి.) :1.దూదేకువిల్లు, పింజనము; (చూ.పింజారి) 2.బాణము క్రింది చివర, పుంఖము.

**పింజనగ్రోవి** (దే.వి.) : (పింజన + క్రోవి) చిమ్మనగ్రోవి.

**పింజారి** (ద్వ.వి.) : (పింజ + ఆరి) దూదేకు వాండు. (సంధిని వర్ణ వికారము.)

**పింఠ** (సం.వి.ఆ.స్త్రీ.) : విటజన సమాశ్రయము. (చూ. వేశము.)

**పిండపుష్పము** (సం.వి.అ.న.) : 1. మెట్లనూయి; 2. అశోకపుంబువ్వు; 3. దాసనపుంబువ్వు.

**పిండము** (సం.వి.అ.న.) : 1. బ్రదుకుం దెరువు; 2. ఇనుము. (పుం.) : 1. అన్నపుపిడుచ; 2. పితృ దేవతల కిచ్చెడు అన్నపు ముద్ద; 3.గర్భము; 4. శరీరము; 5. శరీరమునందు ఏక దేశము; 6.గృహమునందు ఏకదేశము; 7.చెండు; 8.గజకుంభము; 9.బోళము; 10.బలము; 11. సమూహము; 12. దట్టము; 13.చిల్లమడ్డి; (రూ. పిండకము) 14.దాసనము.

**పిండలి** (వై.వి.) : ముద్ద.

**పిండాభ్రము** (సం.వి.అ.న.) : వానతూర.

**పిండాలువు** (సం.వి.ఉ.పుం.) : చాఱకంద.

**పిండి** (ఉభ. వై.వి.) : బియ్యము లోనగువాని పొడి, పిష్టము. (సం.ఈ.స్త్రీ.) : 1. సమూహము; 2.ఒక దినుసు ఈందు; 3. మంగ; 4. సొర.

**పిండిక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. బండికంటి నడిమి తూము; 2. తురుష్క దేశము నందు అందుగు బంకతోం జేసెడు ధూపద్రవ్యము; 3. పిక్క యందలి మాంసము.

**పిండికూడు** (ద్వ.వి.) : సంకటి.

**పిండికూర** (వై.వి.) : ఒకదినుసు కూరాకు. (దీనినే పిండిబొద్దికూర అందురు.)

**పిండికొండ** (వై.వి.) : వృక్షవిశేషము, కొండపిండి.

**పిండితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. దట్టము; 2. గుణింపంబడినది; 3. ఎంచంబడినది; 4. చేర్పంబడినది.

**పిండిదొండ** (వై.వి.) : తుర్యతుండి.

**పిండిపోంకలు** (వై.వి.బ.) : గుడ పిండములు.

**పిండిమిరియము** (వై.వి.) : పులుసు లేక పలుచగా వండిన వ్యంజన విశేషము.

**పిండిలము** (సం.వి.అ.పుం.) : (చూ.) వంతెన.

**పిండివంట** (ద్వ.వి.) : 1. అప్పము లోనగు అపూపము; 2. చక్కిలము లోనగు భక్ష్యము.

**పిండివడియము** (వై.వి.) : పిండితో చేసిన వడియము.

**పిండీకృతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ముద్దగాం జేయంబడినది.

**పిండీతకము** (సం.వి.అ.పుం.) : 1. మంగ; 2. మరువము.

**పిండు** (ఉభ.దే.స.క్రి.) : 1. పాలుపితుకు; 2. రసము పిడుచు. (వై.వి.) : సమూహము, గుంపు. (సం.అ.పుం.) : చెండు. (తెనుంగు నందు ఉత్వము వచ్చినది.)

**పిండుగట్టు** (ద్వ.అ.క్రి.) : (పిండు + కట్టు) గుంపుగూడు.

**పిందియ** (దే.వి.) : పిందె.

**పిందె** (దే.వి.) : 1. కాయయగుటకు ముందటిది; (దీనికి ముందటిది పూఁబిందె.) 2. రత్నాల పోఁగులు లోనగువాని యందు జవ చుట్టు నేర్పఱచెడు తదవయవ విశేషము. (పిందియ యొక్క రూపాంతరము.)

**పింపిణీ** (దే.వి.) : స్త్రీవేణీవిశేషము.

**పింపిసలాడు** (దే.అ.క్రి.) : (పింపిసలు + ఆడు) 1. బాలికలు పెదవి మీఁదుగా నొక విధమైన ధ్వని కలిగించుచు నర్తించు; 2. నర్తించు.

**పింపిసలు** (దే.వి.బ.) : పింపిళ్లునకు మొదటి రూపము.

**పింపిళ్లాడు** (దే.అ.క్రి.) : (పింపిళ్లు + ఆడు) నర్తించు.

**పింపిళ్లు** (దే.వి.బ.) : (పింపిస + లు) పెదవి మీఁదుగా నొక విధమైన ధ్వని గలిగించుచు నర్తించెడు బాలికా క్రీడా విశేషము. (రూ.) పింపిళులు. (చూ. అచ్చనగండ్లు)

**పింపిళ్లుగూయు** (దే.అ.క్రి.) : (పింపిళ్లు + గునియు) 1. బాలకులు బాలికలును పెదవి మీఁదుగా నొకవిధమైన ధ్వని గలిగించుచు నర్తించు; 2. నర్తించు. చూ. వీడు. (వి.) : మూడవ యర్థము నుదాహరణము.

**పికపికలు** (దే.విణ.బ.) : చెల్లాచెదరు.

**పికము** (సం.వి.అ.పుం.) : కోకిలము, కోయిల.

**పికవర్ధనము** (సం.వి.అ.పుం.) : కాకము, కాకి.

**పికిలి** (దే.వి.) : పక్షివిశేషము. (చూ. పిక్కిలి)

**పికిలిపువ్వు** (ద్వ.వి.) : పికిలిపిట్టతోఁక క్రిందిఱెక్క (చూ. కై కానుక.)

**పిక్క** (వై.వి.) : 1.జంఘ; 2. ఒకానొక చెట్టు.

**పిక్కటిల్లు** (దే.అ.క్రి.) : 1. నిండు; 2. అతిశయించు; 3. వ్యాపించు; 4. పిగులు; 5. వర్ధిల్లు. (రూ. పిక్కటిలు. నిండుటకు. పిగులుటకు.)

**పిక్కారు** (ద్వ.వి.) : (పిదప + కారు) (చూ.) దాళువా.

**పిక్కిలి** (దే.వి.) : పికిలి యొక్క రూపాంతరము.

**పిక్కు** (దే.అ.క్రి.) : వెనుదీయు. (స.క్రి.) : వంచించు. (వి.) : 1. మర్మము; 2. వంచన.

**పిగులు** (దే.అ.క్రి.) : వస్త్రములోనగునది బిగువుచే చినుఁగు.

**పిచండము** (సం.వి.అ.పుం.) : 1. కడుపు; 2. పఱపు.

**పిచండిలుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) పెద్దకడుపువాఁడు.

**పిచండము** (సం.వి.అ.పుం.) : 1. కడుపు; 2. మృగములవీఁపు.

**పిచుమందము** (సం.వి.అ.పుం.) : వేము, నింబము.

**పిచుమర్దము** (సం.వి.అ.పుం.): వేము, నింబము.

**పిచులము** (సం.వి.అ.పుం.) : 1. నీరుకాకి; 2. గన్నేరు; 3. పక్కె.

**పిచువు** (సం.వి.ఉ.పుం.) : 1. దూది; 2. కుష్ఠ భేదము; 3. మాడ; 4. ఒకానొక రాక్షసుఁడు.

**పిచ్చటము** (సం.వి.అ.న.) : 1.తగరము; 2.సత్తు. (పుం.) కంటి తెవులు.

**పిచ్చి** (వై.వి.) : పిత్తవ్యాధి, ఉన్మాదము.

**పిచ్చిక** (దే.వి.) : ఊరఁబిచ్చిక, చటకము.

**పిచ్చికకుంటు** (దే.వి.) : అనూరుఁడు. (విణ.) : కాళ్లులేనివాఁడు. (చూ. పిచ్చుకకుంటు)

**పిచ్చికుంటు** (దే.వి.) : (పిచ్చిక + కుంటు) అనూరుఁడు. (చూ. పిచ్చుకుంటు)

**పిచ్చిల్లు** (దే.అ.క్రి.) : చిప్పిల్లునకు మాఱురూపము. (రూ. పిచ్చిలు.)

**పిచ్చివాఁడు** (ద్వ.విణ.) : పిచ్చిపట్టిన వాఁడు, ఉన్మత్తుఁడు.

**పిచ్చే** (యు.దే.విణ.) : హీనము. (వై.వి.) : పిచ్చి.

**పిచ్చేపట్టు** (దే.వి.) : లుబ్ధత్వము.

**పిచ్చేపెసలు** (దే.వి.బ.) : ఒక దినుసు పెసలు.

**పిచ్చేలించు** (దే.అ.క్రి.) : 1. అతిశయించు; 2. భయపడు. (స.క్రి.) : ప్రశంసించు.

**పిచ్చే** (యు.దే.వి.) : చింతవిత్తు. (వై.) : జంతువుల కడుపులోని పిత్తకోశము.

**పిచ్చే క** (దే.వి.) : పిచ్చిక యొక్క రూపాంతరము.

**పిచ్చే కకాలు** (దే.వి.) : తృణవిశేషము, పర్పటము.

**పిచ్చేకకుంటు** (దే.వి.) : అనూరుఁడు. (విణ.) : కాళ్లు లేనివాఁడు. (చూ. గుజ్జు)

**పిచ్చేకుంటు** (దే.వి.) : (పిచ్చుక + కుంటు) అనూరుఁడు. (విణ.) : కాళ్లు లేనివాఁడు.

**పిచ్చేగుంటివాండ్రు** (దే.వి.బ.) : కమ్మ వారిని అడిగికొని జీవించువారు. బిచ్చమెత్తువారు. (అని కొందఱు.)

**పిచ్ఛ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. అరఁటి; 2. ఒఱ; 3. గుఱ్ఱపు కాలిపుండు; 4. పోఁక; 5. సమూహము; 6. పాము యొక్క జొల్లు; 7. బూరుగు బంక; 8.వరుస; 9. గంజిమీఁదిమీఁగడ. (అ.న.ము.) : 1. నెమలి పురి; 2. సిగ. (పుం.) : తోఁక.

**పిచ్ఛందకము** (సం.వి.అ.పుం.) : రాజగృహరచన.

**పిచ్ఛిల** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.ఇరుగుడు; 2.బూరుగు. (విణ.) : 1. పేరినది; 2. మీఁగడ కట్టినది.

**పిటకము** (సం.వి.అ.పుం,న. ) : పుండు. (పుం.): 1. చిన్నపెట్టె; 2. చిన్న గంప.

**పిటము** (సం.వి.అ.పుం.) : గంప, కండోలము.

**పిట్ట** (వై.వి.) : పులుఁగు, పక్షి, ఖగము, విహంగము.

**పిట్టపిడుగు** (దే.క్రి.విణ.) : అనివార్యము.

**పిట్టు** (వై.వి.) : వాసెనమీఁద పక్వము చేసిన పిండి.

**పిఠరము** (సం.వి.అ.న.) : 1.కవ్వపుకోల; 2.ముసై. (పుం,న.) : వంటకుండ.

**పిడి** (దే.వి.) : 1. కత్తిపరుఁజేలోనగునది, త్సరువు; 2. పిడికిలి; 3. ఆఁడుమృగము.

**పిడికట్టు** (దే.వి.) : వింటినడుము, లస్తకము.

**పిడికిలి** (దే.వి.) : ముడువఁబడిన వ్రేళ్లు గల అఱచేయి, ముష్టి.

**పిడికిలించు** (దే.స.క్రి.) : పిడికిటఁబట్టు.

**పిడికోల** (దే.వి.) : నాఁగేలులోనగువాని మేఁడి.

**పిడిగంట** (ద్వ.వి.) : నిడుపుపిడిగల గంట.

**పిడిగుద్దులు** (దే.వి.బ.) : బాలక్రీడా విశేషము. (చూ. కుప్పిగంతులు.)

**పిడిగొట్టు** (దే.స.క్రి.) : (పిడి + కొట్టు) ఎద్దుపట్టు.

**పిడిమూర** (దే.వి.) : ముడువఁడిన వ్రేళ్లు గల మూర, రత్ని.

**పిడియము** (దే.వి.) : పిడెము.

**పిడివాటు** (దే.వి.) : 1. పనకట్టలను చేతికొలఁది నెత్తిగింజలు రాలఁ గొట్టుట; 2. ఒడంబడిక. (పిడివాటు చీటి.)

**పిడివాదము** (అర.వి.) : మూర్ఖవాదము.

**పిడివేయు** (దే.అ.క్రి.) : పసులకఱిలో చేయిడి త్రిప్పు.

**పిడిసాన** (ద్వ.వి.) : వడ్లవాఁడును ఱాళ్ల పని వాఁడును కొయ్యలకును రత్నముల కును బెజ్జము వేసెడు సాధనము, అస్ఫోటని.

**పిడుఁజే** (దే.వి.) : పశువుల దేహమందు చేరి రక్తముపీల్చెడు జంతువిశేషము.

**పిడుఁదు** (దే.వి.) : పిడుఁజు యొక్క రూపాంతరము.

**పిడుక** (దే.వి.) : పిసికిపిడుచగా చేసితట్టి యండఁ బెట్టిన పేఁడ, కరీషము. (వాడుక పిడకయని.)

**పిడుక మొసలి** (దే.వి.) : శింశుమార భేదము.

**పిడుగు** (దే.వి.) : అశని, నిర్ఘాతము.

**పిడుగుకైదువు** (దే.వి.) : వజ్రాయుధము.

**పిడుచ** (దే.వి.) : అన్నములోనగువాని ముద్ద. (వాడుక పిడచయని.)

**పిడుచపాఁత** (ద్వ.వి.) : అలుకుచుట్ట.

**పిడుచు** (దే.స.క్రి.) : రసములోనగు వాని పిండు.

**పిడుత** (దే.వి.) : మిక్కిలి చిన్నకుండ. (వాడుక పిడతయని.)

**పిడెము** (దే.వి.) : బాఁకు. (పిడియము యొక్క రూపాంతరము.)

**పిడ్గు** (దే.వి.) : పిడుగు యొక్క రూపాంతరము.

**పిణ్యాకము** (సం.వి.అ.పుం,న.) : 1. తెలికపిండి; 2. ఇంగువ; 3. చిల్లమడ్డి; 4. కుంకుమపువ్వు.

**పిత** (సం.వి.ఋ.పుం.) : తండ్రి. (తండ్రులు అయిదుగురు. కన్నవాఁడు, వడుగు చేసినవాఁడు,

చదువు చెప్పినవాఁడు, అన్నముపెట్టినవాఁడు, వెఱపు దీర్చి కాపాడినవాఁడు.) (ద్వి.) : తల్లిదండ్రులు.

**పితర** (వై.వి.) : తండ్రి.

**పితరదొర** (ద్వ.వి.) : యముఁడు, పితృపతి. (చూ. కేటఁత్రాడు.) (ఇట్లు పితరులఱేఁడు.మొ.)

**పితరుఁడు** (వై.వి.) : 1. తండ్రి; 2. (బ.) : మృతి పొందిన పితృవర్గమువారు, పితృదేవతలు.

**పితరులచుక్క** (వై.వి.) : మఘానక్షత్రము.

**పితలాటము** (దే.వి.) : మోసము. (రూ. పితలాటకము.)

**పితామహి** (సం.వి.ఈ.స్త్రీ.) : తండ్రితల్లి.

**పితామహుఁడు** (సం.వి.అ.పుం.) : 1. తండ్రి తండ్రి; 2. తండ్రి; 3. బ్రహ్మ.

**పితాళ్లు** (వై.వి.బ.) : పితరుల యొక్క రూపాంతరము.

**పితుకు** (దే.స.క్రి.) : పాలుపిండు.

**పితూరి** (హిం.వి.) : రాజద్రోహము, కలహము, కుట్ర.

**పితృపతి** (సం.వి.ఇ.పుం.) : యముఁడు, పితరుల ఱేఁడు.

**పితృప్రసుపు** (సం.వి.ఊ.స్త్రీ.) : ప్రొద్దు పొడుచుటకు ముందైదు గడియల వఱకును ప్రొద్దు గ్రుంకిన వెనుక మూడు గడియల వఱకును గల కాలము.

**పితృయజ్ఞము** (సం.వి.అ.పుం.) : పితృతర్పణము.

**పితృవనము** (సం.వి.అ.న.) : శ్మశానము, ఒలికిమిట్ట.

**పితృవ్యుఁడు** (సం.వి.అ.పుం.) : తండ్రి తోడఁ బుట్టినవాఁడు.

**పిత్తము** (సం.వి.అ.న.) : ధాతు విశేషము. (చూ. ధాతువు.)

**పిత్తల** (సం.వి.ఆ.స్త్రీ.) : నీరుపిప్పలి. (అ.న.ము.): ఇత్తడి. (విణ.) : పిచ్చుగలది. (రూ. పిత్తడి.)

**పిత్తు** (దే.అ.క్రి.) : అపానవాయువు విడుచు. (వి.): అపానవాయువు.

**పిత్ర్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) తండ్రిది.

**పిత్సంతము** (సం.వి.త్.పుం.) : పక్షి. (విణ.) : పడనిచ్ఛగలది.

**పిదప** (దే.వి.) : వెనుక. (విణ.) : 1. వెనుకటిది; 2. తక్కువ, నీచము. (పిదప చేను, పిదప పని.మొ.)

**పిదపిద** (దే.విణ.) : 1. అనుకు; (చూ. పిదపిదన) 2. మృదువు.

**పిదపిదన** (దే.వి.) : 1. అనుకుఁదనము; 2. మృదుత్వము. (విణ.) : 1. అనుకు; 2. మృదువు. (చూ. పిదపిద.)

**పిదుకు** (దే.స.క్రి.) : పితుకు యొక్క రూపాంతరము.

**పిధానము** (సం.వి.అ.న.) : మఱుఁగు, తిరోధానము.

**పిన** (దే.విణ.) : పిన్న యొక్క రూపాంతరము. (పినతల్లి, పినతండ్రి. మొ.)

**పినగుమ్ముడు** (ద్వ.వి.) : టేఁకు.

**పినద్ధము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. కట్టఁబడినది (వస్త్రము); 2. తొడుగఁబడినది (కవచము)

**పినాకము** (సం.వి.అ.పుం,న.) : 1. శివుని విల్లు; 2. త్రిశూలము; 3. మట్టివాన.

**పినాకి** (సం.వి.న్.పుం.) : శివుడు, ముక్కంటి.

**పినాకిని** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. నదీవిశేషము; 2. వీణావిశేషము.

**పినుఁగు** (దే.వి.) : లుబ్ధకుఁడు. (విణ.) : లుబ్ధుఁడు. (చూ. పిలుఁగు.)

**పిన్న** (దే.విణ.) : చిన్న. (పిన్నవాఁడు, పిన్నది)

**పిన్నకక్కెర** (ద్వ.వి.) : పక్షివిశేషము, కక్కెర.

**పిన్నగోరఁట** (ద్వ.వి.) : సహ.

**పిన్నగ్రద్ద** (ద్వ.వి.) : పక్షివిశేషము, చింద.

**పిన్నజమ్మి** (ద్వ.వి.) : నేలజమ్మి, శమీరము.

**పిన్నటనాఁడు** (దే.వి.) : పిన్ననాడు యొక్క రూపాంతరము.

**పిన్నతుమికి** (దే.వి.) : కాకితుమికి.

**పిన్నదూలగోవెల** (దే.వి.) : దూలగోవెల, కందూర.

**పిన్ననాడు** (దే.వి.) : బాల్యదశ, చిన్ననాడు.

**పిన్ననుదురు** (దే.వి.) : ఏనుఁగునొసటి బుడిపి, వాతకుంభము.

**పిన్ననేరెడు** (దే.వి.) : కాకినేరెడు, కాకజంబువు.

**పిన్నపాఁపర** (దే.వి.) : పాఁపర, గోతుంబ.

**పిన్నపాప** (దే.వి.) : కన్యక.

**పిన్నపాల** (దే.వి.) : చిఱుపాల, క్షీరావి.

**పిన్నములక** (దే.వి.) : నేలములక, కంటకారిక.

**పిన్నముల్లంగి** (ద్వ.వి.) : క్షుద్ర మూలకము.

**పిన్నయిప్ప** (దే.వి.) : మధూళిక.

**పిన్నఱికము** (దే.వి.) : పిన్నతనము.

**పిన్నవరగోఁగు** (దే.వి.) : కమలవల్లభ.

**పిపాస** (సం.వి.ఆ.స్త్రీ.) : నీరుత్రావనిచ్ఛ, నీరువట్టు.

**పిపాసితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) నీరుత్రావ నిచ్ఛ కొన్నవాఁడు.

**పిపాసువు** (సం.విణ.) : (ఉ.) నీరుత్రావ నిచ్ఛించువాఁడు.

**పిపీలిక** (సం.వి.ఆ.స్త్రీ.) : చీమ. (రూ. పిపీలి. ఈ.స్త్రీ.)

**పిప్పల** (సం.వి.ఆ.స్త్రీ.) : పిప్పులి. (అ.న.ము.) : జలము. (పుం.) : 1. రావి; 2. బాతు.

**పిప్పలాశనము** (సం.వి.అ.పుం.) : ఏనుఁగు, గజము.

**పిప్పలి** (సం.వి.ఈ.స్త్రీ.) : ఊషణ. (ఇ.పుం.) : రావి.

**పిప్పి** (దే.వి.) : నలిచి రసము పిండిన ఆకు లోనగునది.

**పిప్పిక** (సం.వి.ఆ.స్త్రీ.) : పండ్లపాఁచి, దంతమలము.

**పిప్పిరి** (దే.వి.) : పిప్పి.

**పిప్లువు** (సం.వి.ఉ.పుం.) : పుట్టుమచ్చ. తిలకాలకము.

**పిమ్మట** (దే.వి.) : మనోవ్యథ. ద్ర. 1. అనంతరము; 2. పరోక్షమందు.

**పియ్యి** (దే.వి.) : పీయి యొక్క రూపాంతరము.

**పిర** (దే.వి.) : కానిలో నాల్గవభాగము.

**పిరంగి** (దే.వి.) : సిపాయిలు యుద్ధ మప్పుడు మందు గుండు వేసి గట్టించి కాల్చెడి యినుప క్రోవి. (చూ. అగాదు.)

**పిరంగీ** (దే.వి.) : పిరంగి యొక్క రూపాంతరము.

**పిరి** (దే.వి.) : 1. మెలి; 2. వెంటి; (చూ. పిరిగొను) 3. గోనెలులోనగునవి కట్టెడు త్రాడు.

**పిరిగొను** (దే.అ.క్రి.) : (పిరి + కొను) పెనఁగొను. (స.క్రి.) : మెలిపెట్టు. (చూ. పల్మురు.)

**పిరువీఁకు** (దే.వి.) : (పీఁకు + పీఁకు) 1. పీఁకులాట; 2. బాధ.

**పిరువీఁకులాడు** (దే.అ.క్రి.) : (పిరువీఁకులు + ఆడు) పెనఁగులాడు.

**పిరువీఁకుసేయు** (ద్వ.స.క్రి.) : (పిరువీఁకు + చేయు) 1. పీఁకులాడు; 2. బాధించు. (చూ. వెనుకటి పద్యము.) (రూ. పిరువీఁకులుసేయు.)

**పిర్వీఁకు** (దే.వి.) : పిరువీఁకు యొక్క రూపాం తరము. (బాధకు)

**పిఱికి** (వై.విణ.) : భయశీలుఁడు, భీరువు.

**పిఱికికండ** (వై.వి.) : అధైర్యము.

**పిఱికిమెకము** (వై.వి.) : జింక, హరిణము.

**పిఱు** (దే.వి.) : వృత్తియందు పిఱుఁదు శబ్దమునకు అంత్యవర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. (పిఱుతివియు. మొ.)

**పిఱుఁదు** (దే.వి.) : 1. మొలకువెనుకటి భాగము; 2. వెనుక.

**పిఱుఁదుకొను** (దే.స.క్రి.) : వెంబడించు.

**పిఱుతివియు** (దే.అ.క్రి.) : (పిఱుఁదు + తివియు) వెనుదీయు, పరాఙ్ముఖమగు.

**పిఱుతివుచు** (దే.అ.క్రి.) : (పిఱుఁదు + తివిచు) వెనుదీయు, పరాఙ్ముఖమగు.

**పిఱుదీయు** (దే.అ.క్రి.) : (పిఱుఁదు + తీయు) వెనుదీయు, పరాఙ్ముఖమగు.

**పిఱుము** (దే.వి.) : పరుషభావము.

**పిఱువడు** (ద్వ.అ.క్రి.) : (పిఱుఁదు + పడు) 1. వెనుదీయు; 2. భయపడు.

**పిఱువెట్టు** (దే.స.క్రి.) : (పిఱుఁదు + పెట్టు) అనాదరించు.

**పిఱువోవు** (దే.అ.క్రి.) : (పిఱుఁదు + పోవు) వెనుదీయు.

**పిఱుసను** (దే.అ.క్రి.) : (పిఱుఁదు + చను) వెనుదీయు.

**పిఱ్ఱి** (దే.వి.) : పిఱుఁదు, నితంబము.

**పిలపిల** (దే.వి.) : మూఁగుటయందును వచ్చుట యందును పోవుటయందును బిక్కిరించుట యందును నగు ననుకరణము.

**పిలుఁగు** (దే.వి.విణ.) : పినుఁగు యొక్క రూపాంతరము. (లుబ్ధునకు.)

**పిలుక** (వై.వి.) : పక్షిలోనగువానిపిల్ల.

**పిలుకు** (దే.వి.) : గర్వము. (చూ. పిలుకుమాలు.)

**పిలుకుమారు** (దే.అ.క్రి.) : 1. చచ్చు; 2. నాశ మొందు. (చూ. పిలుకుమాలు.) (రూ. పిల్కు మాఱు. పిలుకుమాలు యొక్క రూపాంతరము.)

**పిలుకుమార్చు** (దే.ప్రే.) : (పిలుకుమారఁ జేయు.) 1. చంపు; 2. నాశము చేయు. (మొదటి రూపము పిలుకుమారుచు.)

**పిలుకుమాలు** (దే.అ.క్రి.) : 1.చచ్చు; (చూ. పిలుకుమారు.) 2.నాశమొందు. (రూ. పిల్కుమాలు.)

**పిలుకుమాల్చు** (దే.ప్రే.) : పిలుకుమాలఁ జేయు. (మొదటి రూపము పిలుకు మాలుచు.)

**పిలుచు** (దే.స.క్రి.) : ఆహ్వానించు, (రూ. పిల్చు.)

**పిలుపు** (దే.వి.) : పిలుచుట, ఆహ్వానము.

**పిలుపుడు** (దే.వి.) : పిలుచుట, ఆహ్వానము.

**పిల్క** (వై.వి.) : పిలుక యొక్క రూపాంతరము.

**పిల్ల** (వై.వి.) : 1. పక్షిలోనగువాని సంతతి; (కోడిపిల్ల, మేఁకపిల్ల, ఎలుకపిల్ల, అరఁటిపిల్ల. మొ.) 2. ఆఁడుపడుచు; 3. (బ.) : బిడ్డలు. (విణ.) : చిన్న. (పిల్లకాలువ. మొ.)

**పిల్లఁగ్రోలు** (ద్వ.వి.) : (పిల్ల + క్రోలు) పిల్లనగ్రోవి, మురళి.

**పిల్లఁగ్రోవి** (ద్వ.వి.) : (పిల్ల + క్రోలు) పిల్లనగ్రోవి, మురళి.

**పిల్లకాయ** (ద్వ.వి.) : బాలుఁడు.

**పిల్లగడ్డము** (ద్వ.వి.) : నడుమమాత్రము కొంచెము వెండ్రుకలుగలగడ్డము.

**పిల్లగాఁడు** (ద్వ.వి.) : (పిల్ల+కాఁడు) బాలుఁడు.

**పిల్లగెఱులు** (ద్వ.వి.బ.) : బాలక్రీడా విశేషము.

**పిల్లజుట్టు** (ద్వ.వి.) : బాలుర ముందటి సిగ.

**పిల్లదీపు** (ద్వ.వి.) : (పిల్ల + తీపు) బాలక్రీడా విశేషము. (చూ. తూరన తుంకములు.)

**పిల్లదీవి** (వై.వి.) : బాలక్రీడా విశేషము. (బ.) : పిల్లదీవులు. (చూ. గుళ్ళు.)

**పిల్లనగ్రోలు** (ద్వ.వి.) : (పిల్ల + క్రోలు) పిల్లనగ్రోవి.

**పిల్లనగ్రోవి** (ద్వ.వి.) : (పిల్ల + క్రోవి) ఊఁదుట కనువుగా బెజ్జములు వేసిన వెదురు గొట్టము, మురళి. (సంధి యందు వర్ణాధిక్యము. ఇట్లు పిల్లనగ్రోలునందును.)

**పిల్లనూయి** (ద్వ.వి.) : నూతిలోపలి చిన్న నూయి, కూపకము. (పిల్లబావియనుచో బావిలోపలి చిన్న బావి అని యర్థ మెఱుంగునది.)

**పిల్లపీచర** (ద్వ.వి.) : పీఁచర, శతావరి.

**పిల్లపెసర** (ద్వ.వి.) : కాకిపెసర, ముద్గ పర్ణి. (ధాన్యవాచకమైనచో పిల్లపెసలు.)

**పిల్లము** (సం.వి.అ.పుం.) : తడికన్ను. (విణ.) : తడికన్నుగలది.

**పిల్లమెఱము** (ద్వ.వి.) : 1. తలక్రిందుగా వేసెడు లాఁగు; 2. లాఁగు.

**పిల్లవ్రేలు** (ద్వ.వి.) : చిటికెనవ్రేలు.

**పిల్లాఁడి** (దే.వి.) : పిల్లాణికి మొదటి రూపము.

**పిల్లాకము** (సం.వి.అ.పుం.) : పక్షిపిల్ల.

**పిల్లాణి** (దే.వి.) : ఆఁడుదాని కాలి నాలుగవ వ్రేలి యందలి ఆభరణము.

**పిల్లి** (వై.వి.) : మార్జాలము. (దీని భేదములు. జంగుపిల్లి, నీరుపిల్లి, జవాది పిల్లి, పునుఁగుపిల్లి, బూతపిల్లి. మొ.)

**పిల్లికన్రతనము** (ద్వ.వి.) : (పిల్లికను + రతనము) వైడూర్యము.

**పిల్లిగడ్డ** (వై.వి.) : పునుఁగుచట్టము.

**పిల్లు** (దే.వి.) : పుల్లు యొక్క రూపాంతరము.

**పిల్లేరుగంతు** (ద్వ.వి.) : (పిల్ల + ఏరు గంతు) తలక్రిందుగా వేసెడు లాఁగు.

**పిశంగము** (సం.వి.అ.పుం.) : కపిల వర్ణము. (విణ.) : కపిలవర్ణము గలది.

**పిశాచము** (సం.వి.అ.పుం.) : 1. దేవయోని విశేషము; 2. పిల్లి.

**పిశాచి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. స్త్రీ పిశాచము; 2. జటామాంసి.

**పిశిత** (సం.వి.ఆ.స్త్రీ.) : జటామాంసి. (అ.న.ము.) : మాంసము.

**పిశున** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. స్పృక్క; 2. కొండ బెండ. (అ.న.ము.) : కుంకుమ పువ్వు. (పుం.) : కాకి.

**పిశునుఁడు** (సం.వి.అ.పుం.) : నారదుఁడు. (విణ.) : 1. కొండెకాఁడు; 2. దుష్టుఁడు.

**పిష్టకము** (సం.వి.అ.న.) : నూఁబొడి. (పుం.) : 1. పిండివంట; 2. నేత్రరోగ విశేషము; 3. కించిజ్జ ఘనాధిక్యమును స్తనాంత విస్తృతి యుఁగ గల గజ విశేషము.

**పిష్టవచనము** (సం.వి.అ.న.) : పిండివంట చేసెడు పాత్రము. బూరెల మూకుడు. (అని కొందఱు.)

**పిష్టము** (సం.వి.అ.న.) : 1. పిండి; 2. సీసము. (విణ.) పొడిచేయఁబడినది.

**పిష్టాతకము** (సం.వి.అ.పుం.) : వస్త్రములకు వాసన కట్టెడు బుక్కాము, పటవాసకము.

**పిస** (దే.వి.) : అవివేకము.

**పిసక** (దే.వి.) : తలవెంద్రుకలయందు చెమటచే బందనగొను ముఱికి.

**పిసరు** (దే.వి.) : 1.కడిగిన ధాన్యములో త్రోపుడు పడినది; 2.లేశము; (పిసరంత పొడి) 3. విష్ఠ. (పిసరు వెళ్ల గ్రుద్దినాఁడు.)

**పిసాసి** (వై.వి.) : పిశాచి, పిశాచము.

**పిసాళము** (దే.వి.) : 1. వికాసము; 2. పరిహాసము; 3. ప్రకాశము; 4. వ్యాపనము; 5.దొంగ యెత్తు. (చూ. పిసాళించు.)

**పిసాళి** (దే.విణ.) :1.ప్రకాశము కలది; 2.వ్యాపనము గలది; (చూ.ఊఁక) 3.దొంగ యెత్తు గలది.

**పిసాళించు** (దే.అ.క్రి.) : 1. ప్రకాశించు; (చూ. పచారించు) 2. పరిమళించు; 3. వ్యాపించు; 4. పరిహాసము లాడు; 5. దొంగయెత్తువేయు.

**పిసి** (దే.వి.) : తొలియందు బిగఁగొట్టుటకై చెక్కిన స్తంభము పట్టె లోనగు వాని చివర.

**పిసికిళ్లు** (దే.వి.బ.) : 1. జొన్నలు లోనగువాని యూఁచబియ్యము; 2. పిసుకుటలు.

**పిసిడి** (దే.విణ.) : పిసిని.

**పిసినారి** (దే.విణ.) : (పిసిని + ఆరి) పిసిని గొట్టు, లోభి. (స్వార్థమున అరి. సంధియందు వర్ణ వికారము.)

**పిసిని** (దే.విణ.) : పిసినివాఁడు. (పిసిడి యొక్క రూపాంతరము)

**పిసినిగొట్టు** (దే.విణ.) : పిసినారి. (స్వార్థమున కొట్టు.)

**పిసుకు** (దే.స.క్రి.) : 1. పిండిలోనగు వానిచేత మర్దించు; 2. పాదములు లోనగువాని నొత్తు.

**పిహితము** (సం.వి.అ.న.) : 1. ఒక అర్థాలంకారము; (చూ. అలంకారము) 2. కనుఱెప్ప మూఁత. (విణ.) : కప్పఁబడినది.

**పిళ్ల** (అర.వి.) : కొన్ని జాతుల పేరునకుఁ జేర్చెడు పదము.

**పిళ్లారి** (దే.వి.) : వినాయకుఁడు.

**పిళ్లు** (దే.వి.బ.) : దూడలను కుడువనీని యావులను దూడలు చచ్చిన యావులను మరులు కొలుపుటకైతద్యోని ద్వారమునఁ జొప్పించి లాగెడుతోరపు కుఱుచ కసవు వెంటి.

## పీ

**పీఁకు** (దే.స.క్రి.) : 1.పెఱుకు; 2.తీసివేయు.

**పీఁకులాట** (దే.వి.) : పీఁకులాడుట, పిరువీఁకు.

**పీఁకులాడు** (దే.అ.క్రి.) : (పీఁకులు + ఆడు) పెనఁగులాడు. (ఏలనాతో పీఁకులాడెదవు.)

**పీఁకువీఁకాడు** (దే.స.క్రి.) : (పీఁకు + పీఁకు + ఆడు) మిక్కిలి పెఱుకులాడు.

**పీఁకె** (దే.వి.) : 1. నాగసరములోనగు వాద్య ముఖమునఁ జొప్పించెడు క్రోవిపుల్ల; 2. కాళె వలెఁ జుట్టిన చిన్న ఆకు చుట్ట; 3. తాగి మిగిలిన పొగచుట్ట.

**పీఁకెవాఱు** (దే.అ.క్రి.) : 1. చప్పటయగు; 2. కృశించు.

**పీఁచేము** (వై.వి.) : పించము యొక్క రూపాంతరము.

**పీఁచేర** (దే.వి.) : శతావరి. (ఇది ద్వివిధము. పిల్ల పీఁచర, పెద్దపీఁచర. ఇదే పిల్లపీఁచర.)

**పీఁచే** (దే.వి.) : గూఁడు వలెఁ బెనఁచుకొని యుండునార. (టెంకాయ పీఁచు, బీఱకాయ పీఁచు. మొ.)

**పీఁట** (వై.వి.) : కూర్చుండెడు పలక, ఆసనము.

**పీఁటవెట్టు** (ద్వ.అ.క్రి.) : (పీఁట + పెట్టు) లేవక యొకచోటనే పాదుకొని యుండు.

**పీగ్రద్ద** (ద్వ.వి.) : పీతిరిగద్ద, ఆతాయి.

**పీఠమర్దుఁడు** (సం.వి.అ.పుం.) : శృంగార నాయక సచివులలో ఒకఁడు. (చూ. సచివుఁడు.) (విణ.) : దృష్టుఁడు.

**పీఠము** (సం.వి.అ.పుం.) : ఆసనము, పీఁట.

**పీఠి** (సం.వి.ఈ.స్త్రీ.) : ఆసనము, పీఁట.

**పీఠిక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. గ్రంథము మొదట వ్రాసెడు దాని పుట్టు పూర్వోత్తరములు; 2.ఉత్కృష్టపీఠము.

**పీడ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. బాధ; 2. కరుణ; 3. సిగదండ; 4. సరళ వృక్షము.

**పీడనము** (సం.వి.అ.న.) : పరులచే గలగు రాయిడి.

**పీడించు** (సం.స.క్రి.) : బాధించు, నొగులుచు.

**పీడితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. పీడింప బడుచున్నది; 2. పిసుకబడినది.

**పీడ్యమానము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పీడింప బడుచున్నది.

**పీత** (ఉభ.వై.వి.) : ఎండ్రకాయ. (సం.ఆ. స్త్రీ.) : పసుపు. (అ.పుం.ము.) : 1. ఎండ్రకాయ; 2. పసుపు వర్ణము. (విణ.) : 1. పసుపు వర్ణము గలది; 2. త్రాగఁబడినది.

**పీతదారువు** (సం.వి.ఉ.పుం,స్త్రీ.) : దేవదారువు.

**పీతద్రువు** (సం.వి.ఉ.పుం.) : 1. మ్రాని పసుపు; 2. సరళ వృక్షము.

**పీతనము** (సం.వి.అ.న.) :1. కుంకుమపువ్వు; 2. హరిదళము; 3. దేవదారువు. (పుం.) : అంబాళము.

**పీతముండము** (సం.వి.అ.పుం.) : పచ్చతల పిచ్చుక.

**పీతసాలకము** (సం.వి.అ.పుం.) : వేఁగిస.

**పీతాంబరుఁడు** (సం.వి.అ.పుం.) : విష్ణువు, పచ్చ వలువదారి. (విణ.) : పీతవస్త్రము గలవాఁడు.

**పీతి** (సం.వి.ఇ.స్త్రీ.) : పానము. (పుం.) : గుఱ్ఱము.

**పీతిగోరువంక** (ద్వ.వి.) : పక్షివిశేషము, విట్ఛారిక.

**పీతిరిగద్ద** (ద్వ.వి.) : (పీతి + గద్ద) పీగ్రద్ద. (సంధి యందు వర్ణాధిక్యము.)

**పీతిరిగుంట** (ద్వ.వి.) : (పీతి + గుంట) ముఱికి గుంట. (సంధి యందు వర్ణాధిక్యము.)

**పీతోలు** (గ్రా.వి.) : పైనుండు సన్నని చర్మము.

**పీనము** (సం.వి.అ.న.) : సంతోషము. (పుం.) : చెమట. (విణ.) : బలిసినది.

**పీనసము** (సం.వి.అ.పుం.) : రోగ విశేషము, పడిసెము.

**పీనాహము** (సం.వి.అ.పుం.) : ఇటిక లోనగు వానిచేత కట్టబడిన నూతివాతి కట్టు, తాగాఁడి.

**పీనుఁగు** (దే.వి.) : ప్రాణమువాసిన బొంది, శవము.

**పీనుఁగుదిండి** (దే.వి.) : (పీనుగు + తిండి) పిశాచము.

**పీనోధ్ని** (సం.వి.ఈ.స్త్రీ.) : పెద్దపొదుగు గల యావు.

**పీన్గు** (దే.వి.) : పీనుగు యొక్క రూపాంతరము.

**పీయి** (దే.వి.) : మలము, విష్ఠ, పురీషము.

**పీయూషము** (సం.వి.అ.న.) : 1. అమృతము; 2. జున్నుపాలు.

**పీరు** (దే.అ.క్రి.) : పీలు యొక్క రూపాంతరము. (వి.) : క్షీరధార, గుమ్మ.

**పీరుచు** (దే.స.క్రి.) : పీలుచు యొక్క రూపాంతరము. (రూ. పీర్చు.)

**పీర్లు** (హిం.వి.) : మహమ్మదీయుల భక్తుల జ్ఞాపకార్థమైన చిహ్నము.

**పీల** (దే.విణ.) : బక్క, కృశము.

**పీలి** (దే.వి.) : 1. పక్షివిశేషము; 2. ఓడకు దారి చూపెడు చుక్కాను.

**పీలిక** (దే.వి.) : వస్త్రములోనగువాని ఖండము.

**పీలికాడు** (దే.వి.) : ఓడ చుక్కాను తిప్పెడువాఁడు, కర్ణధారుఁడు.

**పీలు** (దే.అ.క్రి.) : పిగులు యొక్క రూపాంతరము.

**పీలుకము** (సం.వి.అ.పుం.) : పక్షిపిల్ల.

**పీలుచే** (దే.స.క్రి.) : 1. జుఱ్ఱు; 2. ఊపిరిపట్టి పొడి ముక్కు లోపలి కీడ్చుకొను (రూ. పీల్చు.)

**పీలుపర్ణి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. చాఁగ; 2. దొండ.

**పీలువాది** (సం.వి.న్.పుం.) : ఒక మతమువాఁడు.

**పీలువు** (సం.వి.ఉ.పుం.) : 1. గొలుసు చెట్టు; 2. ఏనుఁగు; 3. పరమాణువు; 4. తాటిచెక్క; 5. పుష్పము; 6. బాణము.

**పీవము** (సం.విణ.) : (న్.ఈ.న్.) పీనము, బలిసినది.

**పీవరము** (సం.వి.అ.పుం.) : తాఁబేలు. (విణ.): 1. బలిసినది; 2. క్రొవ్వినది.

**పీవరి** (సం.వి.ఈ.స్త్రీ.) : పెద్దపీఁచర.



**పుంఖము** (సం.వి.అ.పుం.) : బాణము క్రింది చివర, పింజ.

**పుంఖితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పుంఖానుపుంఖముగా జేయఁబడినది.

**పుంగవము** (సం.వి.అ.పుం.) : 1. ఎద్దు; 2. ఓషధి విశేషము.

**పుంగవుఁడు** (సం.వి.అ.పుం.) : (ఉత్తర పదమైనచో) శ్రేష్ఠుఁడు.

**పుంగుడు** (దే.వి.) : తెల్లపొదల కుష్ఠము. పులిపులి. (అని కొందఱు.)

**పుంజము** (సం.వి.అ.పుం.) : రాశి, ప్రోగు.

**పుంజి** (వై.వి.) : సమృద్ధి. (విణ.) : సమృద్ధము. (ఆ గ్రామమిప్పుడు పుంజిగానున్నది.)

**పుంజికొను** (ద్వ.అ.క్రి.) : గుబురుకొను.

**పుంజీ** (దే.వి.) : నాలుఁగు.

**పుంజీభవించు** (సం.అ.క్రి.) : రాశిపడు, ప్రోగువడు.

**పుంజేము** (వై.వి.) : ముప్పదియెనికల నూలు.

**పుంజాలదండ** (వై.వి.) : ఆఁడుదాని కంఠాభరణ విశేషము. (చూ. ఒడ్డాణము.)

**పుంజు** (దే.వి.) : మగకోడి, కుక్కుటము.

**పుంజుదాలుపు** (దే.వి.) : (పుంజు + తాలుపు) కుమారస్వామి.

**పుంట** (దే.వి.) : సంధ్య. (పూఁట యొక్క రూపాంతరము.)

**పుండరీకము** (సం.వి.అ.న.) : 1.తెల్ల దామర; 2.తెల్లగొడుగు; 3.తీర్థ విశేషము; 4.గంధద్రవ్య విశేషము. (పుం.) : 1.ఆగ్నేయపు దిక్కునందలి యేనుఁగు; 2.బెబ్బులి; 3.కప్ప; 4.తియ్య మామిడి; 5. తెల్లపొదల కుష్ఠము. (డు.) : 1. ఒకానొక ముని; 2. నిఘంటువులు చేసిన వారలలో నొకఁడు.

**పుండరీకాక్షుఁడు** (సం.వి.అ.పుం.) : విష్ణువు, తెలిదమ్మికంటి.

**పుండలించు** (దే.అ.క్రి.) : అభూత కల్పనముచేయు.

**పుండు** (దే.వి.) : వ్రణము, పిటకము.

**పుండ్రము** (సం.వి.అ.పుం.) : 1. నలుపు గలసిన యెఱ్ఱచెఱకు; 2.తెల్లదామర; 3.నుదుటి నామము; 4. పురుగు; 5.పువ్వుల గురివెంద, పుండ్రకము; 6. వంగదేశము. (డు.) : ఒక రాక్షసుఁడు.

**పుంత** (దే.వి.) : (చూ.) ఉపరథ్య.

**పుంభావము** (సం.వి.అ.పుం.) : ప్రౌఢిమము.

**పుంశ్చలి** (సం.వి.ఈ.స్త్రీ.) : ఱంకుటాలు, కులట.

**పుంసవనము** (సం.వి.అ.న.) : 1. గర్భ చిహ్నము తెలిసిన తోడనే పురుష ప్రజగా పుట్టవలెనని చేసెడి యొకానొక శుభకర్మము; (చూ. కర్మము.) 2. క్షీరము.

**పుకారు** (హిం.వి.) : కేకలు, అల్లరి, వదంతి.

**పుకిలించు** (దే.స.క్రి.) : పుక్కిలించు యొక్క రూపాంతరము. (చూ. పల్మరు.)

**పుకిలింత** (దే.వి.) : పుక్కిలింత యొక్క రూపాం తరము.

**పుక్క** (దే.వి.) : బుగ్గ యొక్క రూపాంతరము.

**పుక్కిలి** (దే.వి.) : బుగ్గలోపలి భాగము.

**పుక్కిలించు** (దే.స.క్రి.) : నీళ్లు లోనగువాని గండూషించు.

**పుక్కిలింత** (దే.వి.) : పుక్కిలించుట, గండూషము.

**పుచ్చె** (దే.వి.) : 1. తలపుఱ్ఱె; 2. టెంకాయ బొండ్లము లోనగునది.

**పుచ్చే** (దే.వి.) : కాళింగి. (దీని భేదము చేంతి పుచ్చ.)

**పుచ్చేడీక** (దే.వి.) : సిగ్గరి.

**పుచ్చే** (దే.అ.క్రి.) : పుప్పిపట్టు. ప్రే. పోcజేయు. (స.క్రి.) : 1. గ్రహించు; 2. పెఱుకు. (వి.) : ఆముదపుమడ్డి.

**పుచ్చేకొను** (దే.స.క్రి.) : గ్రహించు.

**పుచ్చేకోలు** (దే.వి.) : పుచ్చుకొనుట, గ్రహణము.

**పుచ్ఛేటి** (సం.వి.ఈ.స్త్రీ.) : నెటిక విఱుచుట. (దీనిc గొందఱు పున్న పుంసక లింగములుగా వ్రాసి యున్నారు.)

**పుచ్ఛము** (సం.వి.అ.పుం,న.) : 1.తోcక; 2. వెనుక ప్రక్క.

**పుటపుట** (దే.వి.) : అదుముట యందగు ననుకరణము.

**పుటపుటన** (దే.విణ.) : 1. అధికము; 2. ప్రవృద్ధము.

**పుటపుటనగు** (దే.అ.క్రి.) : (పుటపుటన + అటు) ప్రవృద్ధమగు.

**పుటభేదము** (సం.వి.అ.పుం.) : 1. పట్టణము; (రూ. పుటభేదనము.న.) 2. చతుర్విధవాద్యము; 3. ఏటివంపు.

**పుటము** (ఉభ.వై.వి.) : అశ్వగతి విశేషము. (చూ.) ప్లుతము. (పుటముల్ దుమికించు అనుచో పుటములుగా దుమికించుననుట. దీనికి ఏకవచ నాంతముగా ప్రయోగము కనcబడ లేదు.) (చూ. తీరు.) (సం.అ.పుం.న.) : 1. పూలబుట్ట; 2. దొప్ప; 3. గుఱ్ఱపు కాలిగొరిజ.

**పుటముబ్బు** (ద్వ.అ.క్రి.) : (పుటము + ఉబ్బు) మీcదికుబ్బు.

**పుటమెగయు** (ద్వ.అ.క్రి.) : (పుటము + ఎగయు) 1. మీcదికెగయు; 2. దాcటు.

**పుటి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. పూలబుట్ట; 2. దొప్ప.

**పుటిక** (వై.వి.) : చిన్నగంప, (రూ. పుట్టిక.)

**పుటితము** (సం.వి.అ.న.) : దొప్పవలె కూర్పcబడిన రెండు చేతులు, దోసిలి. (విణ.) : 1. కుట్టc బడినది; 2. దొప్పగాc జేయబడినది.

**పుటుక్కు** (దే.వి.) : తెగుట యందగు ధ్వన్యను కరణము. (పుటుక్కున తెగెను.)

**పుట్ట** (దే.వి.) : 1. వల్మీకము; 2. చిన్న పొద; 3. జన్మస్థానము. (రోగముల పుట్ట. మొ.)

**పుట్టకాcపు** (దే.వి.) : ఎలుcగు, భల్లూకము.

**పుట్టకాలివాcడు** (దే.విణ.) : (పుట్టకాలు+వాcడు) పుట్టకాలు గలవాcడు, వల్మీకపాదుcడు.

**పుట్టకాలు** (దే.వి.) : పుట్టవలె దుర్మాంసము పెరిcగిన కాలు.

**పుట్టకూడు** (దే.వి.) : చీమ గ్రుడ్లతోc గలసిన పుట్టమట్టి ముద్ద.

**పుట్టకూడుదిండి** (దే.వి.) : (పుట్టకూడు + తిండి) ఎలుcగు, భల్లూకము.(ఇట్లు పుట్టకూడు మేపుడు.)

**పుట్టకొక్కు** (దే.వి.) : పుట్ట యందు తెల్లగా మొగ్గవలె మొలచునది, భూస్ఫోటము. (ఇది మిక్కిలి మెత్తగా నుండును.)

**పుట్టకోట** (ద్వ.వి.) : కోటకు బలము కోసము కోట బయట వేసిన మట్టితిన్నె.

**పుట్టగొడుగు** (దే.వి.) : పుట్ట యందు తెల్లగా గొడుగువలె మొలచునది, ఛత్రాకము. (దీని పుట్టంగొడుగని యొకానొకcడు ప్రయోగించి యున్నాcడు.)

**పుట్టగోcచి** (దే.వి.) : పెద్దకౌపీనము.

**పుట్టచెండు** (ద్వ.వి.) : (పుట్టము + చెండు) 1. ఎగురc గొట్టి యాడెడు వస్త్రాదికృతమైన బంతి; 2. (బ.) : బాలక్రీడా విశేషము. (చూ. ఆలంకులు.)

**పుట్టచేర్పు** (దే.వి.) : (చూ.) పుట్టకొక్కు.

**పుట్టతమ్మ** (దే.వి.) : ఒకదినుసుతమ్మ.

**పుట్టతేనె** (దే.వి.) : పుట్టలోపెట్టిన పెరతేనె.

**పుట్టతేలు** (దే.వి.) : మండ్రగబ్బ.

**పుట్టపుట్టువు** (దే.వి.) : వాల్మీకిముని.

**పుట్టము** (వై.వి.) : వస్త్రము.

**పుట్టి** (దే.వి.) :1. మాన విశేషము; (నాలుగు ఏఁదుముల కొలఁది.) 2. పేములతో పెద్ద గంప వలె అల్లి మీఁద తోలు కప్పి కుట్టఁబడిన యేఱు దాఁటెడు సాధన విశేషము. (వాని పుట్టి మునిఁగెను, వాని పుట్టి ముంచెను ఇత్యాది స్థలముల యందు వాఁడెక్కిన పుట్టి మునిఁగెను, వాఁడెక్కిన పుట్టిముంచెను అని శబ్దార్థము. వాఁడు మునిఁగెను, వానిముంచెను అని తాత్పర్యార్థము. అప్పుడు మునుఁగుట కును ముంచుటకును చెడుటయు చెఱుచుటయు నర్థము.)

**పుట్టిక** (వై.వి.) : పుటిక యొక్క రూపాంతరము.

**పుట్టినిల్లు** (దే.వి.) : (పుట్టిన + ఇల్లు) మాతృ గృహము, జన్మస్థానము.

**పుట్టు** (దే.అ.క్రి.) : జన్మించు. (వి.) : జన్మము.

**పుట్టుక** (దే.వి.) : జన్మము. (స్వార్థమునక ప్రత్యయము.)

**పుట్టుకల్లరి** (దే.విణ.) : పుట్టుక మొదలు కల్లలాడు వాడు.

**పుట్టుగట్టు** (ద్వ.వి.) : ఉదయాద్రి.

**పుట్టుగు** (దే.వి.) : పుట్టుక, జన్మము. (చూ. పుట్టువు.)

**పుట్టుగొడ్డు** (దే.విణ.) : పుట్టుక మొదలు గొడ్డుతనముగలది.

**పుట్టుగ్రుడ్డి** (దే.విణ.) : పుట్టుక మొదలు గుడ్డి వాఁడైనవాఁడు, జనుషాంధుఁడు. (ఇట్లుఁ పుట్టుచీకు.)

**పుట్టుచెయువు** (ద్వ.వి.) : జాతకర్మము.

**పుట్టుపాప** (దే.విణ.) : వ్యాధిచే తెల్లఁ బాఱిన దేహము గలవాఁడు.

**పుట్టుబడి** (దే.వి.) : పుట్టుక, ఉత్పత్తి.

**పుట్టుమచ్చ** (దే.వి.) : పుట్టుక మొదలు దేహము నందు కలిగిన నల్లబొట్టు, తిలకాలకము.

**పుట్టుమూఁగ** (ద్వ.వి.) : పుట్టుక మొదలు మూఁగయైన వాఁడు. (చూ. తమ్మిపుట్టు.)

**పుట్టువడుగు** (ద్వ.వి.) : పుట్టుక మొదలు బ్రహ్మచారియైనవాఁడు.

**పుట్టువు** (దే.వి.) : పుట్టుక. (చూ. కూటువు.) (పుట్టుగు యొక్క రూపాంతరము.)

**పుట్టువెట్టి** (దే.విణ.) : పుట్టుక మొదలు వెట్టివాఁడైనవాఁడు.

**పుట్నిల్లు** (దే.వి.) : పుట్టినిల్లు యొక్క రూపాంతరము.

**పుడమి** (వై.వి.) : నేల, భూమి.

**పుడమితాలుపు** (ద్వ.వి.) : 1. శేషుఁడు; 2. రాజు; 3. పర్వతము.

**పుడమిపట్టి** (ద్వ.వి.) : 1. అంగారకుఁడు; 2. నరకాసురుఁడు; 3. సీత, భూమిజ.

**పుడమిపుట్టు** (ద్వ.వి.) : 1. చెట్టు, భూజము; 2. సీత, భూమిజ.

**పుడమితేఁడు** ద్వ.వి.) : రాజు, భూపతి.

**పుడమివేలుపు** (ద్వ.వి.) : బ్రాహ్మణుఁడు, భూదేవుఁడు.

**పుడమీశుఁడు** (వై.వి.గ్రా.) : రాజు. (ఇట్లు పుడమీశ్వరుఁడు.)

**పుడికిరించు** (దే.స.క్రి.) : (చూ.) పుణికిరించు.

**పుడికిరింత** (దే.వి.) : పుడికిరించుట, పుణికిరింత.

**పుడికిళ్లు** (దే.వి.బ.) : (చూ.) పుణికిళ్లు.

**పుడిసిలి** (దే.వి.) : కుదియఁబట్టిన చేరలో సగము, ప్రసృతి.

**పుడిసిలించు** (దే.స.క్రి.) : (జలము లోనగువాని) పుడిసిటఁబట్టు.

**పుడిసిలింత** (దే.వి.) : పుడిసిటఁ బట్టుట, పుడిసిలించుట.

**పుడుఁకులు** (దే.వి.బ.) : భక్ష్యవిశేషము.

**పుడుక** (దే.వి.) : 1. పుల్ల; 2. కట్టెపుల్ల. (వాడుక పుడుకయని.)

**పుడుకబావిలి** (దే.వి.) : స్త్రీ కర్ణభూషా విశేషము.

**పుడుకు** (దే.స.క్రి.) : 1.కొంచెముగా ఇచ్చు; 2. ఇచ్చు; 3. (అయిదు వ్రేళ్లతో) గ్రహించు. (వి.) : ఈవి.

**పుడుకుఁగల్లు** (దే.వి.) : (పుడుకు + కల్లు) చింతామణి.

**పుడుకుఁదొడుకు** (దే.వి.) : (పుడుకు + తొడుకు) కామధేనువు. (చూ. తొడుకు. ఇట్లు పుడుకుఁబసి.)

**పుడుకుమ్రాను** (దే.వి.) : కల్పవృక్షము.

**పుణికిరించు** (దే.స.క్రి.) : 1. కొంచెముగా ఇచ్చు; 2. (సన్నిపాత దోషము చేత వ్రేళ్లతో) గ్రహించు. (పుడికిరించు యొక్క రూపాంతరము.)

**పుణికిరింత** (దే.వి.) : పుడికిరింత యొక్క రూపాంతరము.

**పుణికిళ్లు** (దే.వి.బ.) : బాలక్రీడా విశేషము. (పుడికిళ్లు యొక్క రూపాంతరము.)

**పుణుఁకులు** (దే.వి.బ.) : పుడుఁకులు యొక్క రూపాంతరము.

**పుణుకు** (దే.స.క్రి.వి.) : పుడుకు యొక్క రూపాంతరము.

**పుణ్యకము** (సం.వి.అ.న.) : ఉపవాసాది రూప వ్రతము.

**పుణ్యజనుఁడు** (సం.వి.అ.పుం.) : 1. నైరృతి; 2. రాక్షసుఁడు; 3. యక్షుఁడు; 4. పుణ్యాత్ముఁ డగు మనుష్యుఁడు.

**పుణ్యజనేశ్వరుఁడు** (సం.వి.అ.పుం.) : కుబేరుఁడు.

**పుణ్యభూమి** (సం.వి.ఇ.స్త్రీ.) : వింధ్యమునకు హిమవంతమునకు మధ్య దేశము.

**పుణ్యము** (సం.వి.అ.న.) : 1. ధర్మము; 2. సుకృతము. (విణ.) : 1. పవిత్రము; 2. మనోజ్ఞము.

**పుణ్యవంతుడు** (సం.విణ.) : (త్.ఈ.త్.) 1. ధార్మికుఁడు; 2. సుకృతి.

**పుణ్యాత్ముఁడు** (సం.విణ.) : (న్.) పుణ్య స్వరూపుఁడు.

**పుణ్యాహము** (సం.వి.అ.న.) : పుణ్యదినము.

**పుణ్యాహవాచనము** (సం.వి.అ.న.) : దైవాది కర్మ ప్రారంభమునందు మంగళార్థము పుణ్యాహమను శబ్దమును మూడు మారులు చెప్పెడు శుభకర్మము.

**పుతపుత** (దే.వి.) : చలనము నందగు ననుకర ణము. (ఆ మాట విన్నది మొదలు నా మనసు పుతపుతయను చున్నది.)

**పుతపుతపోవు** (దే.అ.క్రి.) : వివశమగు.

**పుత్త** (వై.వి.) : పృష్ఠము.

**పుత్తడి** (యు.దే.వి.) : అపరంజి. (వై.) : (చూ.) పుత్తళిక.

**పుత్తళి** (ఉభ.దే.వి.) : పుత్తడి యొక్క రూపాం తరము. (సం.ఈ.స్త్రీ.) : పుత్తళిక.

**పుత్తళిక** (సం.వి.ఆ.స్త్రీ.) : వస్త్రదంతకాష్ఠాదుల చేత చేయఁబడిన బొమ్మ.

**పుత్తిక** (సం.వి.ఆ.స్త్రీ.) : పెరయీఁగ, పతంగిక.

**పుత్తెంచు** (దే.ప్రే.) : (పుచ్చు + తెంచు) పుచ్చు. (స్వార్థమున తెంచు.)

**పుత్త్రిక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. కూఁతురు; 2. పుత్తళిక; 3. లక్కదూది.

**పుత్త్రుఁడు** (సం.వి.అ.పుం.) : కొడుకు. (పుత్త్రులు పన్నిద్దఱు. 1. ఔరసుఁడు; (భార్యయందు తనకు బుట్టిన కొడుకు.) 2.క్షేత్రజుడు; (ఏదేనియొక కారణమున సంతానవిచ్ఛిత్తి కలుగఁగా పెద్దల యనుజ్ఞ చేత తన భార్యయందు దేవరుఁడు లోనగువానికి బుట్టిన కొడుకు.) 3. దత్తుఁడు; (దత్తు తీసికొన్న కొడుకు.) 4. కృత్రిముడు; (గుణజ్ఞుఁడని యభిమానించి పెంచు కొన్న కొడుకు.) 5. గూఢోత్పన్నుఁడు; (భార్యయందు తనకు తెలియకుండా అంకు మగనికిఁ బుట్టిన కొడుకు.) 6. అపవిద్ధుఁడు; (తల్లిచేత గాని, తండ్రిచేత గాని యుభయుల చేతగాని విడువగా తెచ్చి పెంచుకొన్న కొడుకు.) 7. కానీనుఁడు; (తన భార్యయందు కన్యాత్వమున రహస్యముగా నితరునికిఁ బుట్టిన కొడుకు.) 8. సహోఢ జుఁడు; (గర్భిణిగా నుండ తెలిసికాని తెలియక కాని వివాహము చేసికొన్న భార్య యందు పుట్టిన యాకొడుకు) 9. క్రీతుఁడు; (తల్లి దండ్రుల వద్ద వెల యిచ్చి కొనుకున్న కొడుకు.) 10. పౌనర్భ

వుఁడు; (పునర్భువు నందుఁ బుట్టిన కొడుకు) 11. స్వయందత్తుఁడు; (తల్లిదండ్రులు లేక కాని తల్లిదండ్రులచే నకారణముగ విడువబడికాని తనంతట నేను నీకు బుత్రుఁడనయ్యెదనని వచ్చిన కొడుకు.) 12. జ్ఞాతిరేతుఁడు. (జ్ఞాతి కొడుకు.) (వీరిలో మొదటి యార్గురు బంధువు లగుదురు కాని దాయాదులు కారు. ఇది భారతము నందు వ్రాయఁబడి యున్న విధము ననుసరించినది. జ్ఞాతి రేతుఁడను దానికి మాఱుగా మనుస్మృతి యందు పారశవుఁడు (లేక) శౌద్రుఁడనియు విజ్ఞానేశ్వరీయము నందు పుత్రికా పుత్రుఁడనియు వ్రాయఁ బడియున్నది)

**పుదియబొట్టు** (ద్వ.వి.) : ఊర్ధ్వ పుండ్రము.

**పుదీనా** (హిం.వి.) : సువాసనగల ఒక మొక్క.

**పునర్నవ** (సం.వి.ఆ.స్త్రీ.) : గలిజేరు. (అ.పుం. ము.) : గోరు.

**పునర్భవ** (సం.వి.ఆ.స్త్రీ.) : చంద్రకళ. (అ.పుం. ము.) : 1. గోరు; 2. సంసారము. (విణ.) : మరల బుట్టినది.

**పునర్భువు** (సం.వి.ఊ.స్త్రీ.) : మాఱు మనువుది, దిధిషువు.

**పునర్వసువు** (సం.వి.ఉ.పుం.) : ఒక నక్షత్రము. (చూ.నక్షత్రము.) (వు.) 1.విష్ణువు; 2.శివుఁడు; 3. కాత్యాయన ముని.

**పునశ్చరణము** (సం.వి.అ.న.) : మంత్రము యొక్క పునఃపునః పఠనము.

**పునస్సంధానము** (సం.వి.అ.న.) : విచ్ఛిన్నమై పోయిన యగ్నిని మరల హెూమ గుండము నందుఁ గూర్చుట.

**పునస్సంస్కారము** (సం.వి.అ.పుం.) : ద్వితీయ వారోపనయనాది సంస్కారము.

**పునాది** (దే.వి.) : బలమునకై గోడకడుగున భూమిలో లోఁతుగా త్రవ్విపెట్టెడు గోడ, మూల బంధము.

**పునాసలు** (వై.వి.బ.) : సూర్యుఁడు పునర్వసు నక్షత్ర మందుండఁగా విత్తిన సజ్జలు లోనగు ధాన్యములు.

**పునీతుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) పవిత్రుఁడు.

**పునుఁగు** (దే.వి.) : మార్జారిక వలన గలుగు గంధద్రవ్యము.

**పునుగుచట్టము** (దే.వి.) : పునుఁగుండు నట్టికోశము, బిడాలకము.

**పునుఁగుపిల్లి** (ద్వ.వి.) : పునుఁగు తీసెడు పిల్లి, మార్జారిక.

**పునుఁగురాజనాలు** (దే.వి.) : మిక్కిలి వాసన గల శాలిధాన్య విశేషము.

**పునుక** (దే.వి.) : తలచిప్పయెముక, కపాలము.

**పునుకతాలుపు** (దే.వి.) : శివుఁడు, కపాలభృత్తు.

**పునెము** (వై.వి.విణ.) : పున్నెము యొక్క రూపాంతరము. (సుకృతమునకు.)

**పున్న** (దే.విణ.) : పిన్న. (పున్నతేలు. మొ.)

**పున్నమ** (వై.వి.) : శుక్లపక్షమునందు పదునేనవ తిథి.

**పున్నాగము** (సం.వి.అ.పుం.) : 1. సురపొన్న; 2. ఇంద్రుని యేనుఁగు; 3. పురుషశ్రేష్ఠుఁడు; 4. తెల్లగలువ; 5. జాజికాయ.

**పున్నియము** (వై.వి.) : సుకృతము. (విణ.) : సుకృతము కలది.

**పున్నెము** (వై.వి.విణ.) : పున్నియము యొక్క రూపాంతరము. (సుకృతమునకు.)

**పుప్పము** (వై.వి.) : పువ్వు, పుష్పము.

**పుప్పి** (దే.వి.) : వ్యాధిచేత పురుగుపడి గోరు లోనగునది పుచ్చుట.

**పుప్పించు** (దే.ప్రే.) : పుచ్చు. (ఇచ్చట ప్రేరణార్థకమైన పుచ్చునకు మీఁద ఇంచుక్కని యెఱుంగునది.)

**పుప్పిపురుగు** (ద్వ.వి.) : (చూ.) నుసిపురుగు.

**పుప్పు** (దే.వి.) : పశువుల గొరిజలు వ్రస్సి పురుగులు పడెడు వ్యాధి. (చూ. అదురుద్రిక్క.)

**పుప్పొడి** (ద్వ.వి.) : (పూ + పొడి) పుష్పముల యందలి ధూళి, పరాగము.

**పుబ్బ** (వై.వి.) : ఒక నక్షత్రము. (చూ. నక్షత్రము) (పాడ్యమిని సంస్కృత పదముగా వ్రాసిన

నిఘంటుకారుఁడు దీనిని సంస్కృతపదముగా వ్రాసి యున్నాఁడు.)

**పుమాంసుఁడు** (సం.వి.స్.పుం.) : మనుష్యుఁడు, మానిసి.

**పుయిలోట** (దే.వి.) : (పుయి లోడుట.) వెను దీయుట, సంకోచము. (రూ. పుయి లోటము.) (చూ. పుయిలోడు.)

**పుయిలోడు** (దే.అ.క్రి.) : (పుయిలు + ఓడు) వెనుదీయు, సంకోచించు. (ఇందు పూర్వావయవము అన్యదేశ్యము. ఇది ఈడేఱు, నెఱవేఱు శబ్దములవంటిది.)

**పురందరుఁడు** (సం.వి.అ.పుం.) : ఇంద్రుఁడు.

**పురంధ్రి** (సం.వి.ఇ.ఈ.స్త్రీ.) : 1. కుటుంబముగల ఆఁడుది; 2. ఆఁడుది.

**పురఁట** (దే.వి.) : సంధ్య. (పూఁటకు మొదటి రూపము.)

**పురడించే** (వై.అ.క్రి.) : పురణించు యొక్క రూపాంతరము.

**పురణించు** (వై.అ.క్రి.) : 1. వర్ధిల్లు; 2. విజృంభించు.

**పురపుర** (దే.వి.) : పొక్కుటయందగు ననుకరణము.

**పురపురలాడు** (దే.అ.క్రి.) : (పురపురలు + ఆడు) మిక్కిలి యపేక్షపడు.

**పురము** (సం.వి.అ.న.) : 1.పట్టణము; 2.పాటలీపుత్రమను పట్టణము; 3. శరీరము; 4.ఇల్లు; 5. మేడ; 6. మూడు. (పుం.) : గుగ్గిలపుఁజెట్టు.

**పురస్కరించు** (సం.స.క్రి.) : 1. ముందిడుకొను; 2. పూజించు.

**పురస్కారము** (సం.వి.అ.పుం.) : 1. ముందిడుట; 2. పూజనము; 3. సన్మానము; 4. పరిగ్రహించుట; 5. తడుపుట; 6. శత్రువాక్రమించుట; 7. అపదూఱుపడుట.

**పురస్కార్యము** (సం.విశ.) : (అ.ఆ.అ.) పురస్కరింపఁదగినది.

**పురస్కృతము** (సం.విశ.) : (అ.ఆ.అ.) 1. ముందిడఁబడినది; 2. పూజింపఁబడినది; 3. సన్మానింపఁబడినది; 4. పరిగ్రహింపఁబడినది; 5. తడుపఁబడినది; 6. శత్రువుచే నాక్రమింపబడినది; 7. అపదూఱుపడినది.

**పురస్కృతి** (సం.వి.ఇ.స్త్రీ.) : (చూ.) పురస్కారము.

**పురస్క్రియ** (సం.వి.ఆ.స్త్రీ.) : (చూ.) పురస్కారము.

**పురస్సరుఁడు** (సం.విశ.) : (అ.ఆ.అ.) ముందు నడచువాఁడు, పురోగముఁడు.

**పురాహరుఁడు** (సం.వి.అ.పుం.) : శివుఁడు, ముక్కంటి.

**పురాకృతము** (సం.విశ.) : (అ.ఆ.అ.) పూర్వజన్మమందు చేయఁబడినది. (శుభా శుభ కర్మము.)

**పురాణము** (సం.వి.అ.న.) : 1. సర్గ ప్రతి సర్గాది పంచ లక్షణములతోఁ గూడిన బ్రాహ్మాది; (అవి పదునెనిమిది: బ్రాహ్మము, పాద్మము, వైష్ణవము, శైవము, భాగవతము, నారదీయము, మార్కండేయము, ఆగ్నేయము, భవిష్యత్తు, బ్రహ్మకైవర్తము, లైంగము, వారాహము, స్కాందము, వామనము, కౌర్మము, మాత్స్యము, గారుడము, బ్రహ్మాండము.); 2. పదునెనిమిది (పుం.) : కర్షమెత్తు టంకసాలవాటు. (విశ.) : పురాతనము.

**పురాణించు** (ఉభ.వై.అ.క్రి.) : 1. వర్ధిల్లు; 2. విజృంభించు. (చూ. పురణించు.) (సం.స.క్రి.) : పురాణము చెప్పు. (చూ. దొరఁకొను)

**పురాతనము** (సం.విశ.) : (అ.ఈ.అ.) బహు దినములనాటిది.

**పురాయించు** (వై.అ.క్రి.) : 1.వర్ధిల్లు; 2. విజృంభించు.

**పురారి** (సం.వి.ఇ.పుం.) : శివుఁడు, ముక్కంటి.

**పురావృత్తము** (సం.వి.అ.న.) : తొల్లిటి కథ.

**పురి** (ఉభ.దే.వి.) : 1. మెలి; 2. నెమిలి పింఛము; 3. కవియుట, ఆక్రమణము; 4. ధాన్యము పోసి యుంచుటకు గడ్డితో కట్టినకూటు. (సం.ఈ.స్త్రీ.): పట్టణము, ప్రోలు.

**పురికొను** (దే.అ.క్రి.) : కవియు, క్రమ్ము. (చూ. ప్రే.)

**పురిడిపిట్ట** (ద్వ.వి.) : పక్షివిశేషము, పూరేడు.

**పురిపులుఁగు** (దే.వి.) : నెమలి, బర్హిణము. (చూ. గొరగొర.) (ఇట్లు పురిపిట్ట.)

**పురివిచ్చు** (దే.అ.క్రి.) : వేఱుపడు, పాయు.

**పురీతత్తు** (సం.వి.త్.న.) : ప్రేగు, ఆంత్రము.

**పురీషము** (సం.వి.అ.న.) : మలము, విష్ఠ.

**పురుగు** (వై.వి.) : క్రిమి, కీలకము.

**పురుటియాలు** (దే.వి.) : (పురుడు + ఆలు) బాలెంతరాలు.

**పురుటిల్లు** (దే.వి.) : (పురుడు + ఇల్లు) ప్రసవ గృహము, అరిష్టము.

**పురుడించు** (దే.అ.క్రి.) : పోలికయగు. (స.క్రి.) పోలు.

**పురుడు** (దే.వి.) : 1. జాతాశౌచము; 2. జాతా శౌచ సమయము; 3. ఆ. విణ.

**పురుభువు** (సం.విణ.) : (ఊ.ఊ.ఉ.) మిక్కుటము. (రూ. పురుహువు.)

**పురులోము** (దే.అ.క్రి.) : (పురులు + ఓము) క్షాత్రము మెఱయించు.

**పురువు** (ఉభ.వై.వి.) : పురుగు యొక్క రూపాం తరము. (చూ. పుర్వు.) (సం.అ.పుం.) : 1. తల; 2. ఒక రాజు. (విణ.) : మిక్కుటము.

**పురుషకారము** (సం.వి.అ.పుం.) : పురుష ప్రయత్నము.

**పురుషము** (సం.వి.అ.పుం.) : 1. క్రియాల మీఁది విభక్తుల సంజ్ఞ; (ఇవి మూడు. ప్రథమ పురుషము, మధ్యమ పురుషము, ఉత్తమ పురుషము.) 2. శాస్త్రము; సురపొన్న.

**పురుషాయితము** (సం.వి.అ.న.) : ఉపరతి.

**పురుషార్థము** (సం.వి.అ.పుం.) : పురుష ప్రయోజనము. (పురుషార్థములు నాలుగు : ధర్మము, అర్థము, కామము, మోక్షము.)

**పురుషుఁడు** (సం.వి.అ.పుం.) : 1. మనుష్యుఁడు; 2. సాంఖ్య జీవుడు; 3. పరమాత్మ.

**పురుషోత్తముఁడు** (సం.వి.అ.పుం.) : 1. విష్ణువు; 2. శివుఁడు.

**పురుహూతుఁడు** (సం.వి.అ.పుం.) : ఇంద్రుఁడు.

**పురె** (దే.అవ్య.) : ప్రశంసార్థకము. (చూ. బాపురె.)

**పురే** (దే.అవ్య.) : పురెయొక్క రూపాంతరము.

**పురోగముఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ముందు నడచువాఁడు.

**పురోగామి** (సం.విణ.) : (న్.ఈ.న్.) ముందు నడచువాఁడు.

**పురోగుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ముందు నడచువాఁడు.

**పురోడాశము** (సం.వి.అ.పుం.) : 1.యజ్ఞార్థమైన అపూపము; 2.సోమలతరసము; 3.హుత శేషము.

**పురోణి** (వై.వి.) : చిన్నయుత్తరము, చీటి.

**పురోధసుఁడు** (సం.వి.న్.పుం.) : పురోహితుఁడు. (రూ. పురోధ.)

**పురోభాగి** (సం.విణ.) : (న్.ఈ.న్.) ఎప్పుడును తప్పులు వెదకువాఁడు.

**పురోహితుఁడు** (సం.వి.అ.పుం.) : శుభా శుభ వైదిక కర్మములను చేయించుచు మేలు కీడులను తెలుపుచుండెడి యాచార్యుఁడు, ఒజ్జ.

**పుర్వు** (వై.వి.) : పరువు యొక్క రూపాంతరము.

**పుఱియ** (వై.వి.) : పుట్టె.

**పుట్ట** (దే.విణ.) : ఎడమ, నామము. (పుట్ట చేయి. మొ.)

**పుట్టియ** (వై.వి.) : పుఱియకు మొదటి రూపము.

**పుట్టు** (దే.వి.) : పలుచని మలము.

**పుట్టె** (వై.వి.) : (చూ.) పునుక.

**పుల** (దే.విణ.) : పసుపు మించిన తెలుపువన్నె కలది. (పులకండము.) (పుల్ల యొక్క రూపాంతరము.)

**పులకండము** (ద్వ.వి.) : కండచక్కెర.

**పులకము** (సం.వి.అ.పుం.) : 1.పులగము; 2. ఏనుఁగున కిచ్చెడి యన్నపు కబళము; 3. పురుగు; 4.చెట్టు మీఁది నల్లపురుగు; 5. నులిపురుగు; 6. మణిదోష విశేషము; (అనఁగా మణుల యందలి చీలిక.) 7. వజ్ర మణి; 8. హరిదళము; 9. కడప.

**పులకరము** (వై.వి.) : 1. గగుర్పాటు; 2.జ్వరము.

**పులకరించే** (వై.అ.క్రి.) : గగుర్పొడుచు.

**పులకలు** (సం.వి.అ.పుం.) : గగుర్పాటు. (తెనుఁగుననిది స్త్రీ సమము గాను బహు వచనాంతముగాను బ్రయోగములం జూపట్టెడు.)

**పులకించే** (సం.అ.క్రి.) : గగుర్పాటు గలది యగు.

**పులగము** (వై.వి.) : పెసరపప్పు చేర్చి వండిన యన్నము.

**పులపాడుచు** (దే.అ.క్రి.) : ఱెప్పవేయక చూచు.

**పులము** (సం.వి.అ.పుం.) : గగుర్పాటు. (విణ.) విపులము.

**పులసరము** (దే.వి.) : పాకము చెడుట వలనఁ గలిగిన పులుసు.

**పులసరి** (దే.విణ.) : గర్విష్ఠుఁడు.

**పులాకము** (సం.వి.అ.పుం.) : 1. పొల్లు; 2. మెతుకు; 3. సంక్షేమము.

**పులావు** (హిం.వి.) : ఒక విధమైన వంటకము.

**పులి** (దే.వి.) : వ్యాఘ్రము. (విణ.) : పులిసినది. (పులికడుగు. మొ.)

**పులికడుగు** (దే.వి.) : పులిసిన కడుగు నీరు, ధాన్యామ్లము.

**పులికూడు** (దే.వి.) : 1. పులిసిన యన్నము; 2. భిక్షాన్నము.

**పులికోచే** (దే.వి.) : పులిముఖమువంటి ముఖము గలిగిన సాలెపురుగు వంటియొక పెద్ద పురుగు.

**పులిగంజి** (ద్వ.వి.) : పుల్లనీళ్లు, ఆరనాళము.

**పులిగాయము** (దే.వి.) : ఆఱిన గంటిమచ్చ.

**పులిగోరు** (దే.వి.) : 1. నడుమ వ్యాఘ్ర నఖమును పతకమునకు మాఱుగాఁ గూర్చిన హారము; (చూ. మొలకట్టు.); 2. వ్యాఘ్ర నఖము.

**పులిచించేలము** (ద్వ.వి.) : పులి చింత.

**పులిచింత** (ద్వ.వి.) : చుక్రిక.

**పులిచెంచలి** (దే.వి.) : చుక్రిక.

**పులిచెవులాకు** (ద్వ.వి.) : (పులిచెవులు + ఆకు) ఒకానొక మందు చెట్టు.

**పులిజూదము** (ద్వ.వి.) : ఒకానొక ఆట.

**పులిత్రేఁపు** (దే.వి.) : అజీర్ణపు త్రేఁపు.

**పులినము** (సం.వి.అ.న.) : ఇసుకదిన్నె, సైకతము.

**పులినీరు** (ద్వ.వి.) : రక్తము విరిగి గాయము లోనగువాని యందుండి కాఱెడు నీరు.

**పులిపురి** (దే.వి.) : దేహమునందు మిరియమువలె పెరిఁగెడు దుర్మాంస విశేషము, కేమము.

**పులిపిరికాయ** (దే.వి.) : దేహము నందు మిరియము వలె పెరిఁగెడు దుర్మాంస విశేషము, కేమము.

**పులిపిలి** (దే.వి.) : పులిపిరికాయ. (విణ.) : పీడితము. అవమర్దితము.

**పులిపులికాయ** (దే.వి.) : పులిపిరికాయ, కేమము.

**పులిపెంజెర** (దే.వి.) : కాటుకరేకుపాము.

**పులిమిపుచ్చే** (దే.స.క్రి.) : (విషయమును) తేలికగా పోనిచ్చు.

**పులిమెకము** (ద్వ.వి.) : మత్స్యవిశేషము.

**పులిమెట్టు** (దే.వి.) : తేర్చిన కడుగు యొక్క యడుగుది.

**పులియ** (దే.వి.) : విస్తరాకు.

**పులియఁడు** (దే.వి.) : పులివలె నుండుటచే కుక్క కియ్యఁబడిన పేరు. (చూ. గబ్బి.)

**పులియఁబాఱు** (దే.అ.క్రి.) : (పులియన్ + పాఱు) పులియు. (చూ. పాఱు.)

**పులియు** (దే.అ.క్రి.) : పుల్లనగు.

**పులయోర** (అర.వి.) : పులుసు కలిసిన యన్నము. (రూ. పులిహోర.)

**పులిరుసు** (దే.వి.) : పుల్లిరుసు యొక్క రూపాంతరము.

**పులివరుగు** (దే.వి.) : పులియబెట్టిన వరుగు.

**పులిసరి** (దే.వి.) : పులుగుడు, వాతఘ్ని.

**పులు** (దే.వి.) : 1. రత్నమాలిన్యము; 2. కసవు. 3. (ఆ. విణ.) : అల్పము. (పులుమానిసి. మొ.) (వెనుకటి రెండర్థములయందిది పుల్లు యొక్క రూపాంతరము.)

**పులుఁగు** (దే.వి.) : పక్షి, విహగము, పిట్ట.

**పులుఁగుపిట్ట** (ద్వ.వి.) : గుడ్లగూబ, ఘూకము.

**పులుఁగుబొల్లఁడు** (దే.వి.) : గరుత్మంతుఁడు.

**పులుఁగుఱాయి** (దే.వి.) : పచ్చ, గారుత్మతము.

**పులుఁగుతేఁడు** (దే.వి.) : గరుత్మంతుఁడు, ఖగేశ్వరుఁడు.

**పులుకాసిపురువు** (ద్వ.వి.) : పచ్చతెక్క పురుగు.

**పులుకాసిపులుఁగు** (దే.వి.) : చిలుక.

**పులుకుపులుకు** (దే.వి.) : తెప్పలు మూసి మూసి తెఱచుచు చూచుట యందగు ననుకరణము. (రూ. పుల్కు పుల్కు.)

**పులుగరి** (దే.విణ.) : (పులుగు + అరి) జాడ యెఱిఁగినవాఁడు.

**పులుగాకు** (దే.వి.) : (పులు + కాకు) ఉపద్రవము.

**పులుగు** (దే.వి.) : 1. గుఱుతు; 2. జాడ. (చూ. పులుగరి)

**పులుగుడు** (దే.వి.) : పులిసరి, వాతఘ్ని. (ఇది ద్వివిధము. నల్లపులుగుడు, తెల్లపులుగుడు.)

**పులుదిండిఱాయి** (దే.వి.) : (పులు + తిండి ఱాయి) ఇంద్రనీలమణి. చూ. నెట్టెము. (ఇట్లు పులు దిండిచలుప.)

**పులుప** (దే.వి.) : పలుచగా నూఱిన పుల్ల యూరుఁబిండి.

**పులుమానిసి** (ద్వ.వి.) : అల్ప మనుష్యుడు. (చూ. దెస.)

**పులుము** (దే.స.క్రి.) : 1. రుద్దు; 2. నలుపు; 3. ఉసుము; 4. కొట్టు; (వి.) : కుష్ఠరోగము.

**పులుముడు** (దే.వి.) : రుద్దుడు, మార్జనము.

**పులుమ్రాను** (దే.వి.) : తాళనారికేళాది తృణ ద్రుమము.

**పులుసు** (దే.వి.) : 1. ఒక రసము, ఆమ్లము; (చూ. రసము.) 2. వ్యంజన విశేషము.

**పులుసుఁగూర** (ద్వ.వి.) : (పులుసు + కూర) పులుసుపోసిన వండిన కూర.

**పులోమజ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఇంద్రుని భార్య, శచి.

**పులోమజిత్తు** (సం.వి.త్.పుం.) : ఇంద్రుఁడు.

**పుల్కసుఁడు** (సం.వి.అ.పుం.) : 1. బోయవాఁడు; 2. మాలవాఁడు; 3. అధముఁడు. (రూ. పుల్కశుఁడు.)

**పుల్గము** (వై.వి.) : పులగము యొక్క రూపాంతరము.

**పుల్గరి** (దే.విణ.) : పులుగరి యొక్క రూపాంతరము.

**పుల్పిరి** (దే.వి.) : పులిపిరి యొక్క రూపాంతరము.

**పుల్పొడుచే** (దే.అ.క్రి.) : పులుపొడుచు యొక్క రూపాంతరము.

**పుల్ల** (దే.వి.) : 1. పుడక; 2. సమిధ; 3. పొయి నిడుకట్టె. (విణ.) 1. పుల్లనిది (పుల్ల దానిమ్మ. మొ.); 2. పసుపు మించిన తెలుపు వన్నెగలది. (పుల్లావు. మొ.)

**పుల్లంటుఱాయి** (దే.వి.) : (పుల్లు + అంటు ఱాయి.) ఇంద్రనీలమణి.

**పుల్లకంద** (ద్వ.వి.) : ఒక దినుసుకంద.

**పుల్లగిల్లు** (దే.అ.క్రి.) : భయపడు. (రూ. పుల్లగిలు.)

**పుల్లగూర** (ద్వ.వి.) : (పుల్ల + కూర) (చూ.) పులుసుఁగూర.

**పుల్లగొరక** (దే.వి.) : నీరుకోడి, పరిప్లవము.

**పుల్లతి** (దే.వి.) : సాదనకాండ్రు గుఱికి నాటెడు కోల.

**పుల్లతీఁగ** (ద్వ.వి.) : సోమలత.

**పుల్లదానిమ్మ** (ద్వ.వి.) : ఆమ్ల దాడిమము.

**పుల్లన** (దే.వి.) : పులుసు. (విణ.) : పులుసుగలది. (వృత్తి యందు విశేషణమగుచో పుల్లని. చూ. అలకన.)

**పుల్లనీళ్లు** (ద్వ.వి.బ.) : కూటినీళ్లు, ఆరనాళము.

**పుల్లప్రత్తి** (దే.వి.) : ఒక దినుసు ప్రత్తి.

**పుల్లప్రబ్బ** (దే.వి.) : ఆమ్లవేతసము.

**పుల్లబచ్చలి** (దే.వి.) : వల్లిసూరణము.

**పుల్లమామిడి** (దే.వి.) : కొండమామిడి.

**పుల్లయుసిరిక** (దే.వి.) : (పుల్ల + ఉసిరిక) కొండ యుసిరిక. (దీని కాయలు పెద్దవి.)

**పుల్లరి** (దే.వి.) : (పుల్లు + అరి) పసులు కసవు మేయుటకై యిచ్చెదు పన్ను, తృణభాగధేయము.

**పుల్లరుజు** (దే.వి.) : (పుల్లు+అరుజు) మత్స్య విశేషము.

**పుల్లవడు** (ద్వ.అ.క్రి.) : (పుల్ల + పడు) స్తంభించు.

**పుల్లవావిలి** (దే.వి.) : తెల్లవావిలి, శ్వేతసురస.

**పుల్లవెలఁగ** (దే.వి.) : ఒక దినుసు వెలగ.

**పుల్లసిల్లు** (దే.అ.క్రి.) : 1.వివర్ణమగు; (చూ. పుల్లతీఁగ.); 2.కలఁగు. (రూ. పుల్లసిల్లు. కలఁగుటకు.)

**పుల్లావు** (దే.వి.) : (పుల్ల + ఆవు) కపిలధేనువు.

**పుల్లియ** (దే.వి.) : పుల్లె.

**పుల్లిరుసు** (దే.వి.) : (పుల్లు + ఇరుసు) తొండాపు త్రాటికి అనుదలగా నమర్చిన చిన్న యిరుసు.

**పుల్లు** (దే.వి.) : కసవు, తృణము. (చూ. పులు) (విణ.) : అల్పము. (పుల్లిరుసు. మొ.)

**పుల్లుడి** (దే.వి.) : (పుల్లు + ఉడి) ఒకానొకప్పుడు సాగుబడికుపయోగించెడు పొలము. (ఇట్టివి ఏఁడుడి, నీరుడి.)

**పుల్లుఱుకుపాము** (దే.వి.) : (పుల్లు + ఉఱుకు పాము.) సర్ప విశేషము.

**పుల్లె** (దే.వి.) : విస్తరాకు. (పుల్లియ యొక్క రూపాంతరము.)

**పుల్లెన** (దే.వి.) : ఒకానొక మందుచెట్టు.

**పువు** (వై.వి.) : పువ్వు యొక్క రూపాంతరము.

**పువుఁబోఁడి** (ద్వ.వి.) : పువ్వుబోఁడి యొక్క రూపాంతరము.

**పువ్వాటు** (ద్వ.వి.) : (పువ్వు + వాటు) ముందు వెనుక లకు నూఁగాడుట.

**పువ్వార** (ద్వ.వి.) : (పువు + నార) ఈఁదుతాడు లోనగున వాని వంటి చెట్లయొక్క పూఁత.

**పువ్వారుఁబోఁడి** (పువ్వు + ఆరు + పోఁడి) 1. పుష్పము వలె మిక్కిలి మనోజ్ఞురాలగు ఆఁడుది; 2. ఆఁడుది.

**పువ్విలుకాఁడు** (ద్వ.వి.) : (పువు + విలుకాఁడు) మన్మథుఁడు, పుష్పధన్వుఁడు.

**పువ్విలుతుఁడు** (ద్వ.వి.) : (పువు + విలుతుఁడు) మన్మథుఁడు, పుష్పధన్వుఁడు.

**పువ్వు** (వై.వి.) : పువు, పూవు, విరి, పుష్పము.

**పుషితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పోషింపఁ బడినది.

**పుష్కర** (సం.వి.ఆ.స్త్రీ.) : మెట్టతామర. (అ.వ. ము.) : 1. ఆకాశము; 2.ఉదకము; 3.తామర; 4. మెట్టతామర దుంప; 5.తొండము చివర; 6.వాద్య ముఖము; 7.కత్తివాదర; 8. బాణము; 9.కుష్ఠమనెడు ఓషధి; 10.ఒక ద్వీపము (చూ. ద్వీపము.) 11. తీర్థ విశేషము. (పుం.) : 1. బెగ్గురు పక్షి; 2.రోగ విశేషము; 3.సర్ప విశేషము. (దు.) : 1.ఒక రాజు; 2.వరుణుని కొడుకు.

**పుష్కరాహ్వము** (సం.వి.అ.పుం.) : బెగ్గురుపక్షి.

**పుష్కరిణి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1.కోనేఱు; 2. తామర కొలను; 3. ఆఁడేనుగు. (మగ యేనుఁగు పుష్కరి.న్.పుం.)

**పుష్కలము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. శ్రేష్ఠము; 2. అధికము, సమృద్ధము.

**పుష్టము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. పోషింప బడినది; 2. బలిసినది.

**పుష్టి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. పోషణము; 2. బలుపు; 3. సమృద్ధి.

**పుష్పంధయము** (సం.వి.అ.పుం.) : తుమ్మెద.

**పుష్పకము** (సం.వి.అ.న.) : 1.కుబేరుని విమానము; 2.కుసుమాంజనము; 3. రత్న కంకణము; 4. కుంపటి. (పుం.) : కృష్ణుని తేరి గుఱ్ఱములలో నొకటి.

**పుష్పకేతువు** (సం.వి.అ.న.) : కుసుమాంజనము. (పుం.) : మన్మథుఁడు.

**పుష్పదంతము** (సం.వి.అ.పుం.) : వాయువు దిక్కు నందలి యేనుఁగు. ఒక విద్యాధరుఁడు.

**పుష్పధన్వుఁడు** (సం.వి.న్.పుం.) : మన్మథుఁడు, పూవిలుతుఁడు.

**పుష్పపుటము** (సం.వి.అ.పుం.) : అభినయహస్త విశేషము.

**పుష్పఫలము** (సం.వి.అ.పుం.) : కపిత్థము, వెలఁగ.

**పుష్పమంజరి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. పూగుత్తి; 2. బ. ధాన్య విశేషము.

**పుష్పము** (సం.వి.అ.న.) : 1. పూవు; 2. స్త్రీ రజస్సు; 3. గండి వనము; 4. మాచిపత్రి.

**పుష్పరథము** (సం.వి.అ.పుం.) : క్రీడా యోగ్యమగు రథము (రూ. పుష్య రథము.)

**పుష్పరసము** (సం.వి.అ.పుం.) : పూఁదేనె.

**పుష్పలావిక** (సం.వి.ఆ.స్త్రీ.) : పూల బంతులు సరములు లోనగునవి గ్రుచ్చి యమ్మెడు ఆఁడుది.

**పుష్పలిహము** (సం.వి.హ్.పుం.) : షట్పదము, తుమ్మెద.

**పుష్పవంతులు** (సం.వి.త్.పుం.ద్వి.) : సూర్య చంద్రులు.

**పుష్పవతి** (సం.వి.ఈ.స్త్రీ.) : రజస్వల, ముట్టుది.

**పుష్పశరుఁడు** (సం.వి.అ.పుం.) : మన్మథుఁడు.

**పుష్పసమయము** (సం.వి.అ.పుం.) : వసంత ఋతువు, పూఁదఱి.

**పుష్పించే** (సం.అ.క్రి.) : వికసించు, పూచు.

**పుష్పిక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. దంత మలము; 2. లింగ మలము.

**పుష్పిణి** (సం.వి.ఈ.స్త్రీ.) : (చూ.) పుష్పవతి.

**పుష్పితము** (సం.విశ.) : (అ.ఆ.అ.) పూచినది.

**పుష్యమి** (సం.వి.ఈ.స్త్రీ.) : ఒక నక్షత్రము. (చూ. నక్షత్రము.)

**పుష్యము** (సం.వి.అ.పుం.) : 1. పుష్యమీ నక్షత్రము; 2. పౌష మాసము; 3. పుష్య రాగము; 4.కలియుగము.

**పుష్యరాగము** (సం.వి.అ.పుం.) : శ్వేతమణి విశేషము.

**పుసలాయించు** (వై.స.క్రి.) : బుజ్జగించు.

**పుసి** (దే.వి.) : నేత్రమలము, దూషిక.

**పుసుకు** (దే.వి.) : తుమ్ముటలోనగువాని యందగు ధ్వన్యనుకరణము. (పుసుకని తుమ్మెను, పుసుకున చెప్పెను.)

**పుస్తకము** (సం.వి.అ.న.) : లిఖిత పత్ర సంపుటము.

**పుస్తము** (సం.వి.అ.న.) : 1. లప్పము వేయుట లోనగు శిల్పులపని; 2. పుస్తకము; 3. మాంసపు చక్కిలము.

**పుస్తు** (దే.వి.) : దుర్గంధము.

**పుస్తె** (దే.వి.) : మంగళ సూత్రము.

**పుస్తెముడుపు** (దే.వి.) : కంటె బొట్టు.

**పుళిందము** (సం.వి.అ.పుం.) : ఒక దేశము. (చూ. దేశము.)

**పుళిందుఁడు** (సం.వి.అ.పుం.) : ఇతర భాష తెలియక అడవి యందు వాసము చేయుచు మిక్కిలి జీవహింసాపరుఁడై తిరిగెడు ఒక జాతి బోయవాఁడు.

## పూ

**పూ** (వై.వి.) : పువ్వు. (దీనికి వృత్తియందు ఉకారమునకు వలెను మాగమాది కార్యము నెఱుంగవలెను. ఉదా. పూఁగొమ్మ, పూటడిదము.)

**పూంచే** (దే.పే.) : పూనుచు యొక్క రూపాంతరము.

**పూఁచే** (దే.అ.క్రి.) : పూను, ఉద్యమించు.

**పూఁజేఁప** (ద్వ.వి.) : (పూ+చేఁప) మత్స్య విశేషము. (దీనిని అఱవమున వరాలందురు.)

**పూఁట** (దే.వి.) : 1. సంధ్య; 2. దినము; 3. కాలము (పగటి పూఁట, రాత్రి పూఁట); (పురఁట యొక్క రూపాంతరము.) 4. ఒకఁడు చేయ వలసిన పనిని నేను చేసెదనని మఱి యొకఁడు పూనుట, ప్రతిభూత్వము. (విశ.) (చూ. పూఁటకాఁపు.)

**పూఁటకాఁపు** (దే.విశ.) : ఒకఁడు చేయవలసిన పనిని నేను చేసెదనని పూనుకొనిన మఱి యొకఁడు, ప్రతిభువు.

**పూఁటకూళ్లమ్మ** (ద్వ.వి.) : (పూఁట కూళ్లు + అమ్మ) వెలతీసికొని వేళవేళకు అన్నము వండి పెట్టెడు వంటలక్క.

**పూఁటకూళ్లయిల్లు** (దే.వి.) : (పూఁట కూళ్లు + ఇల్లు.) పూఁటకూళ్లు వండిపెట్టెడు గృహము.

**పూఁటకూళ్లు** (దే.వి.బ.) : వెలతీసికొని వేళవేళకు పెట్టెడు అన్నము.

**పూఁటవడు** (ద్వ.అ.క్రి.) : (పూఁట+పడు) ఒకఁడు చేయవలసిన పనిని నేను చేసెదనని మఱి యొకఁడు పూనికగొను.

**పూఁటవాఁడు** (ద్వ.వి.) : పూఁటవడుట.

**పూఁటవెట్టు** (దే.స.క్రి.) : (పూఁట + పెట్టు) ఒకఁడు తాను చేయవలసిన పనిని మఱి యొకనిని నీవు చేయుమని పూనిక గొలుపు.

**పూఁడులు** (దే.విణ.బ.) : అనేకములు. (సంవత్స రములు) (రూ. పండ్లు.)

**పూఁత** (దే.వి.) : 1. చర్చ; 2. చందనము; 3. సున్నపు గచ్చు.

**పూఁదఱి** (ద్వ.వి.) : (పూ + తఱి.) వసంత ఋతువు, పుష్ప సమయము.

**పూఁదేనియ** (ద్వ.వి.) : (పూ+తేనియ) పుష్పరసము, మకరందము. (రూ. పూఁదేనె.)

**పూఁపు** (దే.వి.) : పూనిక, ఉద్యమము.

**పూఁబాళ** (ద్వ.వి.) : (పూ + పాళ) 1.పువ్వులు గల పాళ; 2. బ.ధాన్య విశేషము. (చూ. కుసుమ.)

**పూఁబిందె** (ద్వ.వి.) : (పూ+పిందె) మిక్కిలి లేఁత పిందె, పూప. (మొదటి రూపము పూఁ బిందియ.)

**పూఁబోఁడి** (ద్వ.వి.) : (పూ + పోఁడి) (చూ. పువుఁబోఁడి.)

**పూగము** (సం.వి.అ.న.) : పోఁక. (పుం.) : 1. ప్రోగు; 2. పోఁకమ్రాను; 3. గంగరావి.

**పూచి** (దే.వి.) : 1. తృణవిశేషము; 2. బాధ్యత, కార్యము.

**పూచిక** (దే.వి.) : 1. తృణవిశేషము; 2. బాధ్యత, కార్యము.

**పూచే** (వై.అ.క్రి.) : 1. పుష్పించు; 2. తప్పు సుళ్లు పొడము.

**పూజ** (సం.వి.ఆ.స్త్రీ.) : అర్చన, సపర్య, సమస్య.

**పూజకుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) అర్చకుఁడు.

**పూజనము** (సం.వి.అ.న.) : పూజించుట, అర్చన.

**పూజనీయుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) పూజింపఁదగినవాఁడు.

**పూజించే** (ఉభ.వై.సం.స.క్రి.) : పూజచేయు, అర్చించు.

**పూజితవ్యుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) పూజనీయుఁడు.

**పూజితుఁడు** (సం.వి.అ.పుం.) : వేలుపు. (విణ.) పూజింపబడినవాడు.

**పూజె** (దే.వి.) : ఘటాదుల మీఁది చిత్రము. (కుండకు పూజెలు పెట్టిరి.)

**పూజెకుండలు** (ద్వ.వి.) : ఐరేనికుండలు.

**పూజెగులు** (దే.వి.బ.) : (పూజె + కాఁగులు) ఐరేని కుండలు.

**పూజెసేయు** (ద్వ.స.క్రి.) : (పూజె+చేయు) ఘటాదులను చిత్రించు.

**పూజ్యుఁడు** (సం.వి.అ.పుం.) : మామ. (విణ.) పూజింప దగినవాఁడు.

**పూజే** (వై.వి.) : అర్చన.

**పూజేరి** (ద్వ.వి.) : (పూజ + అరి) అర్చకుఁడు.

**పూజారి** (ద్వ.వి.) : పూజరి యొక్క రూపాంతరము.

**పూటము** (దే.వి.) : బరువు, భారము.

**పూడ** (దే.వి.) : మూడి, గుదము.

**పూడిక** (దే.వి.) : నూయి మొదలగువాని యందు అడుగున పూడినమన్ను.

**పూడు** (దే.అ.క్రి.) : 1. పల్లము మట్టిలోనగు వానిచే నిండు; 2. నిండు. (వి.) : పూడిక.

**పూడుఁబాము** (దే.వి.) : (పూడు + పాము) మట్టిలోపూడి యుండు ఇరుదలల పాము.

**పూడుచు** (దే.ప్రే.) : 1. పూడఁజేయు; 2. పాఁతు (రూ. పూడ్చు.)

**పూడుపు** (దే.వి.) : 1. పూడ్చుట; 2. నిక్షేపము.

**పూత** (దే.వి.) : పూచుట, వికసనము.

**పూతన** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. ఒకానొక రాక్షసి; 2. కరక. (అ.పుం.ము.) : గజ విశేషము. (విషాణ కర్ణన యనచరణములలో ఏదేని నొక్కటి నొక ప్రక్క కలుగక మఱియొక ప్రక్క నన్నియుఁ జక్కగాఁ గలిగి మేఘమువలె నల్లనై మంజిడి వన్నెగల నఖ రోమములు గలిగినది. ఇది యూధనాశకమంద్రు.)

**పూతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. తూర్పె త్తినది; 2. పరిశుద్ధమయినది; 3. వడకట్టఁ బడినది.

**పూతిక** (సం.వి.ఆ.స్త్రీ.) : కొమ్మనగొట్టె పిండిచెట్టు. (అ.పుం.ము.) 1. నెమిలడుగు చెట్టు; 2. పూతి మార్జాలము.

**పూతికరజము** (సం.వి.అ.పుం.) : నెమిలడుగుచెట్టు.

**పూతికాష్ఠము** (సం.వి.అ.న.) : 1. దేవదారువు; 2. సరళ వృక్షము.

**పూతిగంధి** (సం.వి.ఇ.పుం.) : దుర్గంధము, గదురు.

**పూతిదారువు** (సం.వి.ఉ.పుం.) : దేవదారువు.

**పూతిఫలి** (సం.వి.ఈ.స్త్రీ.) : కారుగచ్చ.

**పూత్యండము** (సం.వి.అ.పుం.) : 1.కస్తురిమెకము; 2.గదురు కంపు గల ఒక దినుసు పురుగు.

**పూదియ** (దే.వి.) : పూదె. (చూ. గవ్వచౌకము.)

**పూదె** (దే.వి.) : బంగారుపూస.

**పూదెగట్టు** (దే.అ.క్రి.) : (పూదె + కట్టు) బంగారు పూసగా నేర్పడు.

**పూనిక** (దే.వి.) : కడఁక, ఉద్యమము.

**పూనికి** (దే.వి.) : కడఁక, ఉద్యమము. (చూ. పూన్కి.)

**పూనిగొల్లలు** (ద్వ.వి.బ.) : గొల్లలలో నొక తెగవారు.

**పూనీరు** (వై.వి.) : పన్నీరు.

**పూను** (దే.అ.క్రి.) : కడఁగు, ఉద్యమించు. (స.క్రి.): 1. ధరించు; (ఈ యర్థమునందు దీనికి ఆది హల్లు వికల్పముగా లోపించును. చూ. ఊను.) అప్పకవి. 2. వహించు.

**పూనుచు** (దే.ప్రే.) : పూనఁజేయు. (రూ. పూన్చు.) వహింపఁజేయుటకు.

**పూనూక** (ద్వ.వి.) : మిక్కిలి సన్ననూక.

**పూనూనె** (ద్వ.వి.) : సంపెంగనూనె.

**పూనె** (దే.వి.) : బరణి.

**పూన్కి** (దే.వి.) : పూనికి యొక్క రూపాంతరము.

**పూప** (దే.వి.) : 1.పూఁబిందె; 2.శిశువు; 3. కంటిపాప. (విణ.) లేఁత.

**పూపము** (సం.వి.అ.పుం.) : 1. భక్ష్యము; 2. పిండి వంట.

**పూపలిక** (సం.వి.ఆ.స్త్రీ.) : అపూపము, పిండివంట.

**పూయము** (సం.వి.అ.న.) : 1. చీము; 2. జూదము; 3. పీనుఁగు.

**పూయు** (దే.స.క్రి.) : 1. చందనము లోనగు దానిని అలఁదు; 2. మన్ను లోనగు వానిని మెత్తు.

**పూరకము** (సం.వి.అ.పుం.) : 1. ఊపిరిఁ బూరించుట; 2. మాది ఫలము.

**పూరకుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) నించువాఁడు.

**పూరగించు** (వై.స.క్రి.) : 1. నెరవేర్చు; 2. కడపు.

**పూరణము** (సం.వి.అ.న.) : 1.నించుట; 2.గుణించుట; 3.కుడుము మొదలగు పిండి వంట లోపల పెట్టెడు బెల్లము వేసి నూఁతిన పప్పుముద్ద లోనగునది; 4.గలిజేరు. (విణ.) : నించునది.

**పూరణి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. పేక; 2. బూరుగు.

**పూరము** (సం.వి.అ.పుం.) : 1.జల ప్రవాహము; 2.భక్ష్యము; 3.వ్రణసంశుద్ధి; 4.గలిజేరు.

**పూరా** (హిం.విణ.) : సంపూర్ణమయిన.

**పూరి** (దే.వి.) : 1. గడ్డి, తృణము; 2. మృగముల చనుపాలు.

**పూరించు** (సం.స.క్రి.) : 1.పూరగించు; 2.నించు.

**పూరిక** (సం.వి.ఆ.స్త్ర.) : 1. బూరె; 2. పూరీ.

**పూరితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. నింపఁబడినది; 2. గుణింపఁబడినది.

**పూరీ** (వై.వి.) : భక్ష్యవిశేషము. (ఒకానొక ఆధునిక నిఘంటుకారుఁడు పూరీపోళీ శబ్దములను సంస్కృతముగా వ్రాసి యున్నాఁడు. అది విచార్యము.)

**పూరుదొన్నె** (ద్వ.వి.) : ఒకానొకచెట్టు.

**పూరుషుఁడు** (సం.వి.అ.పుం.) : మనుష్యుఁడు, మానిసి.

**పూరేడు** (దే.వి.) : పూరేడు యొక్క రూపాంతరము.

**పూరేకు** (ద్వ.వి.) : 1. పుష్పదళము; 2. (బ.) : ధాన్య విశేషము.

**పూరేడు** (దే.వి.) : పక్షివిశేషము.

**పూర్ణ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. తిథి విశేషము (చూ. తిథి.); 2. పున్నమ.

**పూర్ణపాత్రము** (సం.వి.అ.న.) : 1.(చూ. పూర్ణానకము మొదటి యర్థము); 2.వస్తు సంపూర్ణ పాత్రము.

**పూర్ణమాసము** (సం.వి.అ.పుం.) : పున్నమనాటి యుగము. (రూ. పౌర్ణమాసము.)

**పూర్ణము** (సం.వి.అ.న.) : వింటినారిని చెవిదాఁక తిగుచుట. (విణ.) : 1.నిండినది; 2.శక్తి గలది; 3. సమస్తము.

**పూర్ణానకము** (సం.వి.అ.న.) : 1. ఉత్సవ కాలము నందు సంతోషముచే వస్త్రాభరణాదికము దోఁచు కొనుట, దోఁపు; 2. తప్పెట.

**పూర్ణిమ** (సం.వి.ఆ.స్త్రీ.) : పౌర్ణమాసి, పున్నమ.

**పూర్ణీభవించు** (సం.అ.క్రి.) : పూర్ణమగు, నిండు.

**పూర్తము** (సం.వి.అ.న.) : 1. నూతిని బావిని చెఱువును త్రవ్వించుట, గుడి కట్టించుట, తోట పెట్టించుట, అన్నము పెట్టుట; 2. పాలనము. (విణ.) : 1. నింపఁబడినది; 2. కప్పఁబడినది.

**పూర్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : పురాణము, నింపు.

**పూర్ణము** (వై.వి.) : కుడుములు మొదలగు పిండి వంటల లోపలఁ బెట్టెడు బెల్లమువేసి నూతిన పప్పుముద్ద లోనగునది.

**పూర్వ** (సం.వి.ఆ.స్త్రీ.) : తూర్పు, తొలిదిక్కు.

**పూర్వగంగ** (సం.వి.ఆ.స్త్రీ.) : నర్మదానది.

**పూర్వజ** (సం.వి.ఆ.స్త్రీ.) : అక్క. (విణ.) : మొదట పుట్టినది.

**పూర్వజుఁడు** (సం.వి.అ.పుం.) : అన్న. (విణ.) : మొదటపుట్టినవాఁడు.

**పూర్వదేవుఁడు** (సం.వి.అ.పుం.) : తొలివేల్పు.

**పూర్వపక్షము** (సం.వి.అ.పుం.) : 1. వాదము; 2. శుక్లపక్షము.

**పూర్వపర్వతము** (సం.వి.అ.పుం.) : తూర్పుకొండ. (ఇట్లు పూర్వాద్రీ. మొ.)

**పూర్వఫల్గుని** (సం.వి.ఈ.స్త్రీ.) : ఒక నక్షత్రము. (చూ. నక్షత్రము.)

**పూర్వభద్రపదము** (సం.వి.అ.పుం.) : ఒక నక్షత్రము. (చూ. నక్షత్రము.)

**పూర్వము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. మొదటిది; 2. మొదటి దిక్కుది; 3. మొదటి చోటిది; 4.ముందటి కాలముది.

**పూర్వరాగము** (సం.వి.అ.పుం.) : శ్రవణము వలనఁగాని దర్శనము వలనఁ గాని పరస్పరము వృద్ధిఁ బొందిన యనురాగముగల నాయికా నాయకులకు అయోగమునందుఁ గలిగెడి దశా విశేషము. (ఇది త్రివిధము : నీలీరాగము, కుసుంభరాగము, మంజిష్ఠా రాగము.)

**పూర్వరాత్రము** (సం.వి.అ.పుం.) : ముందటి దినము రాత్రి.

**పూర్వాషాఢ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఒక నక్షత్రము. (చూ. నక్షత్రము.)

**పూర్వాహ్ణము** (సం.వి.అ.పుం.) : దిన పూర్వ భాగము, లేఁబగలు.

**పూర్వులు** (సం.వి.అ.పుం.) : బ. ముందటివారు.

**పూర్వోత్తర** (సం.వి.ఆ.స్త్రీ.) : ఈశాన్య దిగ్భాగము.

**పూలగురివెంద** (ద్వా.వి.) : వాసంతి.

**పూలమట్ట** (ద్వ.వి.) : మత్స్యవిశేషము.

**పూలము** (సం.వి.అ.పుం.న.) : గడ్డికట్ట.

**పూలముడుపు** (ద్వ.వి.) : (పూలు + ముడుపు) గర్భిణికి చేయించెడు పుష్పధారణము.

**పూలి** (దే.వి.) : ఒకానొక చెట్టు.

**పూవత్తి** (వై.వి.) : బాణసంచు విశేషము.

**పూవింటి** (ద్వ.వి.) : (పూ + విల్లు) మన్మథుఁడు, పుష్పధన్వుఁడు.

**పూవింటివాఁడు** (ద్వ.వి.) : (పూ + విల్లు) మన్మథుఁడు, పుష్పధన్వుఁడు.

**పూవిలుకాఁడు** (ద్వ.వి.) : మన్మథుఁడు, పుష్ప ధన్వుఁడు.

**పూవిలుతుఁడు** (ద్వ.వి.) : మన్మథుఁడు, పుష్ప ధన్వుఁడు.

**పూవు** (వై.వి.) : 1. పుష్పము; 2. కాఁకరవత్తి లోనగువాని యందలి పువ్వు; 3. కంటి యందు పడెడు పువ్వు.

**పూవుఁబోఁడి** (ద్వ.వి.) : (చూ. పువ్వుఁబోడి.)

**పూవుగట్టు** (ద్వ.అ.క్రి.) : (పూవు + కట్టు) పూవు గలదియగు.

**పూషుఁడు** (సం.వి.న్.పుం.) : ద్వాదశాదిత్యులలో నొకఁడు. (చూ. ఆదిత్యుఁడు.)

**పూస** (దే.వి.) : 1. పూదె; 2. మణి; 3. వ్రేలు లోనగువాని కీలు.

**పూసకజ్జము** (ద్వ.వి.) : భక్ష్యవిశేషము, మనోహరము.

**పూసకామంచి** (ద్వ.వి.) : తృణవిశేషము.

**పూసయెముక** (దే.వి.) : వెన్నుపూస, కశేరుక.

**పూసలగురివెంద** (ద్వ.వి.) : గుంజ.

**పూసలవాఁడు** (దే.వి.) : రత్నములు సానపెట్టు వాఁడు, మణికారకుఁడు.



**పృక్క** (సం.వి.ఆ.(స్త్రీ.) : పిక్క, శాక విశేషము. (అని కొందఱు.)

**పృక్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కూడుకొన్నది.

**పృక్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : స్పర్శము, తాఁకుడు.

**పృచ్ఛ** (సం.వి.ఆ.స్త్రీ.) : ప్రశ్నము, అడుగుట.

**పృచ్ఛించు** (సం.స.క్రి.) : ప్రశ్నముచేయు, అడుగు.

**పృతన** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. సేన; 2. సేనా విశేషము. (ఇన్నూట నలువది మూడు రథములు అన్ని యేనుఁగులు ఏళ్నూట యిరువది తొమ్మిది గుఱ్ఱములు వేయినిన్నూట పదునేవురు కాల్వురును గలది.)

**పృతనాషాట్టు** (సం.వి.హ్.పుం.) : ఇంద్రుఁడు.

**పృథక్పర్ణి** (సం.వి.ఈ.స్త్రీ.) : కోలపొన్న.

**పృథగ్జనుఁడు** (సం.వి.అ.పుం.) : 1. నీచుఁడు; 2. మూర్ఖుఁడు; 3. పాపి.

**పృథగ్విధము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పెక్కు విధములు గలది.

**పృథివి** (సం.వి.ఈ.స్త్రీ.) : భూమి. (రూ. పృథవి.)

**పృథివీపతి** (సం.వి.ఇ.పుం.) : 1. రాజు; 2. యముఁడు; 3. వృషభమనెడు ఓషధీ విశేషము.

**పృథుకము** (సం.వి.అ.పుం.) : 1. పిల్ల; 2. అడుకులు.

**పృథురోమము** (సం.వి.న్.పుం.) : చేఁప. (విణ.) పెద్ద వెండ్రుకలు గలది.

**పృథులము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విరివి యైనది.

**పృథువు** (సం.వి.ఉ.స్త్రీ.) : 1. నల్లజిల కఱ్ఱ; 2. ఇంగువ మ్రాను. (పుం.) : 1. అగ్ని; 2. ఒక రాజు. (విణ.) : 1. గొప్పది; 2. విరివియైనది.

**పృథ్వి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. పుడమి; 2. ఇంగువ మ్రాను; 3. నల్లజిలకఱ్ఱ. (విణ.) విరివియైనది.

**పృథ్వీక** (సం.వి.ఆ.స్త్రీ.) : పెద్దయేలకులు.

**పృదాకువు** (సం.వి.ఉ.పుం.) : 1. పాము; 2. తేలు; 3. పులి; 4. చిఱుతపులి.

**పృశ్ని** (సం.వి.ఇ.పుం.) : 1. కిరణము; 2. బోయ వాఁడు. (విణ.) : (చూ. అలిపిరి.)

**పృశ్నిపర్ణి** (సం.వి.ఈ.స్త్రీ.) : కోలపొన్న.

**పృషతము** (సం.వి.అ.పుం.) : 1.దుప్పి; 2.నీటి బొట్టు. (విణ.) : బ్రహ్మ బిందువుతోఁ గూడినది.

**పృషత్కము** (సం.వి.అ.పుం.) : బాణము, శరము, అమ్ము.

**పృషత్తు** (సం.వి.త్.న.) : నీటిబొట్టు. పుం. దుప్పి. (విణ.) : బ్రహ్మబిందువుతోఁ గూడినది.

**పృషదంశకము** (సం.వి.అ.పుం.) : పిల్లి. (రూ. వృషదంశకము.)

**పృషదశ్వుఁడు** (సం.వి.అ.పుం.) : వాయువు, గాలి.

**పృషదాజ్యము** (సం.వి.అ.న.) : పెరుఁగుతోఁ గలపఁబడిన నేయి.

**పృష్టము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అడుగఁ బడినది.

**పృష్టి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. తాఁకుడు; 2. కిరణము.

**పృష్ఠమాంసాదనము** (సం.వి.అ.న.) : కడచిన పనికి చింతించుట.

**పృష్ఠము** (సం.వి.అ.న.) : 1.మూడి; 2.వీఁపు; 3.వెనుకప్రక్క; 4. యజ్ఞ సంబంధి స్తోత్ర విశేషము.

**పృష్ఠ్యము** (సం.వి.అ.న.) : పృష్ఠములనెడి యజ్ఞ సంబంధి స్తోత్ర విశేషముల సమూహము. (పుం.) : మోపు మోసెడు గుఱ్ఱము.

## పె

**పె** (దే.విణ.) : వృత్తియందు పెనుపు శబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. (దీనికి పరుష సరళములు పరములగునపుడు నుమాగమంబగును. పెన్గురుఁజు, పెన్జిలువ, పెన్జీఁకటి, పెన్జెమట, పెన్జొఱ, పెన్దడి, పెన్దత్తఱము, పెన్దపసి, పెన్దరఁగ, పెన్దీఁగ, పెన్దుఱుము, పెన్దెర, పెన్దెవులు, పెన్బులుఁగు, పెన్బొగ, పెన్బ్రోడ, పెన్బ్రోవు, పెన్గుబ్బ, పెన్జగతి, పెన్జడ, పెన్దరి. మొ. ఇందలి ద్రుతంబునకు బిందువు నగు. పెం జీఁకటి.మొ.) (ఒకానొకచో స్థిరము పరమగునపుడును బిందువు కానంబడి యెడి.)

**పెంకి** (దే.వి.) : ఒకానొక తీఁగ.

**పెంకు** (దే.వి.) : 1. ఇంటికికప్పెడు ఓడు బిల్ల; 2. కుండలోనగు వాని పెంచిక. (కుండపెంకు, అద్దపు పెంకు, పుఱ్ఱె పెంకు మొ.)

**పెంకె** (దే.విణ.) : 1. మొండికట్టె; 2. మూర్ఖుఁడు.

**పెంకెపురుగు** (ద్వ.వి.) : ధాన్యమునకుఁ బట్టెడు ఒక దినుసు పురుగు.

**పెంచిక** (దే.వి.) : కుండలోనగువాని పెంకు. (పుఱ్ఱెపెంచిక.)

**పెంచే** (దే.ప్రే.) : పెనుచు యొక్క రూపాంతరము. (వి.) : పెంచిక.

**పెంచుకొను** (దే.స.క్రి.) : దత్తుతీసికొను.

**పెంజెర** (దే.వి.) : ఒక దినుసుకొండ చిలువ. (దీని భేదములు తుస్సు పెంజెర, పొట్టపెంజెర, రక్తపెంజెర.)

**పెంట** (యు.దే.వి.) : 1.చీపురుకట్టచేత ఊడ్చి యెత్తిన చెత్తలోనగునది; 2.ఎరువు కుప్ప; 3.ఆవులమంద ముందున్న చోటు. (వై.) : పేట యొక్క రూపాంతరము. (మంగలపెంట. మొ.)

**పెంటగట్టు** (దే.అ.క్రి.) : (పెంట + కట్టు) పెంటకై మందగట్టు.

**పెంటపట్టు** (దే.వి.) : పసులులోనగువాని దొడ్డి.

**పెంటి** (దే.వి.) : పశుపక్ష్యాది స్త్రీ జాతి. (పెంటి తాడు.)

**పెంటిక**: ఉండఉండగా వేసెడు మేఁక లోనగువాని పేఁడ.

**పెంటికరడు** (దే.వి.) : చిన్న అల.

**పెంటిపడు** (ద్వ.అ.క్రి.) : కవగూడు.

**పెంట్రిక** (దే.వి.) : పెంటికకు మొదటి రూపము. (చూ. పెంటపట్టు.)

**పెండ** (దే.వి.) : పేఁడ యొక్క రూపాంతరము.

**పెండరము** (దే.వి.) : పెండారము యొక్క రూపాంతరము.

**పెండలము** (దే.వి.) : ఒక దినుసు దుంప.

**పెండారము** (దే.వి.) : (చూ.) గండపెండారము.

**పెండియము** (దే.వి.) : 1. కాల ధరించెడు పెండెము; 2. దొడ్డి మొదలైన వాని వాకిటికిఁ బెట్టెడు పెండెము.

**పెండిలి** (దే.వి.) : వివాహము. (చూ. పెండిలి సేయు.)

**పెండిలియగు** (దే.స.క్రి.) : (పెండిలి + అగు) వివాహమగు. (రూ. పెండ్లి యగు.)

**పెండిలియాడు** (దే.స.క్రి.) : (పెండిలి + ఆడు) వివాహమగు. (రూ. పెండ్లియగు.)

**పెండిలిసేయు** (ద్వ.స.క్రి.) : (పెండిలి + చేయు) పెండ్లాడు. (రూ. పెండ్లి సేయు.)

**పెండె** (దే.వి.) : 1.ఇంటివాసములమీఁద అడ్డముగావేసి కట్టెడుకొయ్య; 2. పొగాకు మొదలైన వాని నగయందు సగము.

**పెండెకట్లు** (దే.వి.బ.) : పెండెలవలె పెట్టెలుగా దీర్చిన విభూతి రేఖలు.

**పెండెము** (దే.వి.) :1.గండపెండారము; 2.పలు గాడి తలుపు. (పెండియము యొక్క రూపాంతరము.)

**పెండెరము** (దే.వి.) : పెండేరము యొక్క రూపాంతరము.

**పెండేరము** (దే.వి.) : పెండేరము యొక్క రూపాంతరము. (చూ. నెరుము.)

**పెండ్లము** (దే.వి.) : (పెండ్లి + అము) వివాహమైన భార్య.

**పెండ్లాడు** (దే.స.క్రి.) : (పెండ్లి + ఆడు) వివాహమగు. (మొదటి రూపము పెండ్లియాడు.)

**పెండ్లాము** (దే.వి.) : పెండ్లము యొక్క రూపాంతరము.

**పెండ్లి** (దే.వి.) : పెండిలి యొక్క రూపాంతరము. (బ. పెండ్లిండ్లు.)

**పెండ్లికుండలు** (ద్వ.వి.బ.) : పూజెలు పెట్టి పెండ్లి యందుపయోగించెడు కుండలు, ఐరేని.

**పెండ్లికూఁతురు** (దే.వి.) : 1.వివాహ దీక్షితురాలు, వధువు. (చూ.నలఁగు.); 2.కోడలు (చూ. పెండ్లి కొడుకు.)

**పెండ్లికొడుకు** (ద్వ.వి.) : 1. వివాహ దీక్షితుఁడు; వరుఁడు; 2. అల్లుఁడు.

**పెండ్లిగుమ్మడి** (దే.వి.) : వివాహాది శుభ దినముల యందు ఉపయోగించెడు గుమ్మడి, బూడిద గుమ్మడి.

**పెండ్లినడక** (దే.వి.) : పెండ్లి యందువలె తిన్నగా నడచు నడక.

**పెండ్లియరుఁగు** (దే.వి.) : (పెండ్లి + అరుఁగు) పెండ్లి యందు వధూవరులు కూర్చుండుటకై వ్రేలెఁడు ఎత్తున చౌకము తీర్చి వేసెడు తిన్నె.

**పెందలకడ** (దే.ద్ర.క్రి.విణ.) : (పెన్ + తలకడ) ప్రొద్దుపోక మునుపు.

**పెందలాడ** (దే.ద్ర.క్రి.విణ.) : పెందలకడ యొక్క రూపాంతరము.

**పెందిరువడి** (దే.వి.) : (పెఁ + తిరువడి) (వైష్ణవ పరిభాష యందు) గరుత్మంతుడు.

**పెందెరువు** (దే.వి.): (పెఁ+తెరువు) రాజమార్గము.

**పెందొడ** (దే.వి.) : (పెఁ+తొడ) ఊరుమూలము.

**పెంద్రోవ** (దే.వి.) : (పెఁ+త్రోవ) ముక్తి.

**పెంపగు** (దే.అ.క్రి.) : (పెంపు + అగు) వర్ధిల్లు.

**పెంపారు** (దే.అ.క్రి.) : (పెంపు+ఆరు) గొప్పయగు.

**పెంపు** (దే.ప్రే.) : నాశము చేయు. (వి.) : 1.సమృద్ధి; 2.నాశము; 3.అతిశయము; 4.గౌరవము; 5. మహత్వము.

**పెండుపు** (దే.విణ.) : పెంచఁబడినది. (పెంపుడు చిలుక.)

**పెంపుమీఱు** (దే.అ.క్రి.) : అతిశయించు.

**పెకలు** (దే.అ.క్రి.) : 1.పెల్లగిల్లు; 2.ప్రయాణమగు.

**పెకలుచే** (దే.ప్రే.) : (పెకలఁజేయు) పెకలించు.

**పెక్కండ్రు** (వై.స.బ.) : అనేకులు. (పెక్కు శబ్దమునకు మహన్మహత్యర్థక రూపము.)

**పెక్కణము** (వై.వి.) : 1. అభినయము తోడి నృత్యము; 2. మల్లరంగము. (చూ. ప్రెక్కణము.)

**పెక్కలి** (దే.వి.) : ఒకానొకచెట్టు.

**పెక్కు** (వై.స.) : అనేకము.

**పెక్కురు** (వై.స.బ.) : పెక్కండ్రు యొక్క రూపాంతరము.

**పెక్కువ** (దే.వి.) : 1. వర్ధనము; 2. ఆధిక్యము.

**పెగడ** (దే.వి.) : ప్రెగడ యొక్క రూపాంతరము.

**పెగలు** (దే.అ.క్రి.) : పెకలు యొక్క రూపాంతరము. (పెల్లగిల్లుటకు.)

**పెగలుచు** (దే.ప్రే.) : పెకలుచు యొక్క రూపాంతరము.

**పెగ్గుమ్ముడు** (వై.వి.) : (పెద్ద + గుమ్ముడు) శ్రీపర్ణి.

**పెగ్గురు** (వై.వి.) : బెగ్గురుపక్షి, సారసము. (ఇది యిట్లు పరుషాదిగానును కానఁ బడుచున్నది.)

**పెచౌ రి** (దే.విణ.) : మూర్ఖుఁడు.

**పెచ్చే** (దే.వి.) : 1. అక్కఱను బట్టి నాణెముల మార్పులోనగు వానియందు అధికముగా నిచ్చెడు ధనము; 2. పండు లోనగువాని మీది తోలు. (విణ.) : అధికము.

**పెటపెట** (దే.వి.) : పండ్లు కొఱుకుట లోనగు వాని యందగు ధ్వన్యనుకరణము. (కొఱుకుట యందు. ఉఱుముట యందు.(చూ. తొటతొట.) పగులుటయందు. పెటులుటయందు. ప్రేలుట యందు. విఱుగుటయందు.)

**పెటపెటమను** (దే.అ.క్రి.) : (పెటపెట + అను) పెటపెట అను ధ్వని కలదియగు.

**పెటపెటలాడు** (దే.అ.క్రి.) : (పెటపెటలు + ఆడు) పెటపెటమను.

**పెటిలు** (దే.అ.క్రి.) : పెట్లు. (ఇది యిట్లు ఇకార మధ్యముగా ప్రతుల యందుఁ గానఁబడు చున్నది.)

**పెటుకు** (దే.విశ.) : విరసము. (ఏల పెటుకు మాటలాడెదవు.)

**పెటులు** (దే.అ.క్రి.) : పెట్లు. (వి.) : పెట్లుఁగ్రోవి.

**పెట్ట** (దే.వి.) : 1. పశుపక్షిస్త్రీ జాతి; 2. ఆఁడుకోడి.

**పెట్టమారి** (దే.వి.) : ఆఁడుకోడివలె నుండు పుంజు.

**పెట్టు** (దే.అ.క్రి.) : కలుగు. (స.క్రి.) : 1. ఉంచు; 2. (పక్షులు లోనగునవి) గర్భము నుండి గ్రుడ్లను వెలిపుచ్చు; (కోడి గ్రుడ్లు పెట్టెను); 3. గ్రుడ్డు పొదిగి పిల్లను చేయు; 4.ధరించు; 5. ఇచ్చు; 6. మోపు; (వాఁడు తాను చేసి అది నా మీఁద పెట్టినాఁడు); 7. గోడ మొదలగు వాని లేపు; 8.నాటు; (చెట్టు పెట్టినవాఁడు నీళ్లుపోయును.) 9.కొట్టు; (చెంపను రెండు పెట్లు పెట్టినాఁడు.) (ఇది విడుచు లోనగు ధాతువులకు అను ప్రయుక్త మయినప్పుడు బొత్తిగానను అర్థమును దెలిపెడిని. ఉదా. వాఁడు. పాఠశాల విడిచిపెట్టెను.) (వి.) : 1.దెబ్బ; 2. ఈవి (పెట్టుపోఁతలు.); 3. మాఱు; 4. ఆవృత్తి; (ఇది యీయర్థము నందు ఏకార్థక శబ్ద పూర్వకము గానే ప్రయోగింపఁ బడును.)

**పెట్టుఁజెట్టు** (దే.వి.) : (పెట్టు+చెట్టు) కల్పవృక్షము.

**పెట్టుకొను** (దే.స.క్రి.) : ఉంచుకొను. (సొమ్ములు పెట్టుకొను, పేరు పెట్టుకొను. మొ.)

**పెట్టుకోలు** (దే.వి.) : పెట్టుకొనుట.

**పెట్టుడు** (దే.వి.) : ఈవి, త్యాగము, దానము.

**పెట్టుబడి** (దే.వి.) : దేనికేని వెచ్చమునకై మొదట పెట్టిన ధనము.

**పెట్టుమందు** (దే.వి.) : స్వవశమగుటకు గాను పెట్టెడు మందు, వశ్యౌషధము.

**పెట్టువడు** (ద్వ.అ.క్రి.) : (పెట్టు + పడు) దెబ్బతిను.

**పెట్టె** (వై.వి.) : 1. సొమ్ములు లోనగునవి యుంచెడు పేటిక; 2. పల్లకినడిమి పెట్టె; 3. బండి పరము మీఁది పెట్టె; 4. పాము చుట్టుకొను చుట్ట. (మొదటి రూపము పెట్టియ.)

**పెట్టెబండి** (ద్వ.వి.) : పరము మీఁద పెట్టెవలె నమర్చిన బండి.

**పెట్టెవెట్టు** (ద్వ.అ.క్రి.) : (పెట్టె + పెట్టు) (పాము) చుట్టుకొను.

**పెట్రకొలికికట్టు** (దే.స.క్రి.) : పెడఱెక్కలు విఱిచికట్టు.

**పెట్లకంబము** (ద్వ.వి.) : (పెట్లు + కంబము) అదురువేటు గొట్టము.

**పెట్లదిమ్మె** (దే.వి.) : (పెట్లు+దిమ్మె) 1. అదురు వేటు గొట్టము; 2. చేలయందు పక్షులను దోలుటకై సర్పాకారముగా పేని పెట్టుకొని యుండెడు చేరు.

**పెట్లమారి** (దే.విశ.) : (పెట్లు + మారి) దెబ్బలు తిను స్వభావము కలవాడు, దెబ్బలు తిను స్వభావము కలది.

**పెట్లాఁగు** (దే.వి.) : (పెట్లు + లాఁగు) మల్లబంధ విశేషము.

**పెట్లు** (దే.అ.క్రి.) : కాలి ధ్వనిపూర్వకముగ బ్రద్దలగు.(పెటులు యొక్క రూపాంతరము.)

**పెట్లుఁగ్రోవి** (దే.వి.) : (పెట్లు + క్రోవి) అదురువేటు గొట్టము.

**పెట్లుప్పు** (దే.వి.) : (పెట్లు + ఉప్పు) ఒక దినుసు ఉప్పు.

**పెఠిల్లు** (దే.వి.) : 1. హతి యందగు ధ్వన్యను కరణము. (చూ. కఠిల్లు.); 2. పిడుగు పడుట యందగు ధ్వన్యనుకరణము. (ఆమ్రేడితము నందు పెఠిల్లు పెఠిల్లు, పెఠిల్లు పెఠిల్లు.)

**పెడ** (వై.విశే.) : 1. పెద్ద; 2. వెనుకటిది; 3. విపరీతము.

**పెడఁబాయు** (దే.స.క్రి.) : ఎడఁబాయునకు మొదటి రూపము.

**పెడక** (వై.వి.) : 1. కత్తియొక్క పృష్ఠ భాగము; 2. ఆకు యొక్క పృష్ఠభాగము. (చూ. పెణక.)

**పెడకంటి** (దే.వి.) : కాపుఁవారి జాతి విశేషము.

**పెడకట్టె** (వై.విశే.) : పెడసరకట్టెకు రూపాంతరము.

**పెడకట్లు** (ద్వ.వి.బ.) : చేతులను వెనుకకు విఱిచి కట్టుట.

**పెడకేలు** (వై.వి.) : వెనుకకు త్రిప్పిన భుజము.

**పెడగాలు** (ద్వ.వి.) : (పెడ+కాలు) వెనుకకు మడిచిన కాలు.

**పెడచెవి** (వై.వి.) : చెవి వెనుకటి భాగము.

**పెడచేయి** (వై.వి.) : చేతికి వెనుకటి భాగము, మీఁజేయి.

**పెడతల** (ద్వ.వి.) : తలవెనుకటి భాగము, అవటువు.

**పెడదారి** (వై.వి.) : తప్పుత్రోవ, అపథము.

**పెడనెల** (ద్వ.వి.) : తీర్పరి. (అప్ర.)

**పెడమరలు** (ద్వ.అ.క్రి.) : వెనుకకు తిరుగు. (వి.) : వెనుకకు తిరుగుట. (చూ. పెడమర్లు.)

**పెడమర్లు** (ద్వ.అ.క్రి.) : వెనుకకుతిరుగు. (పెడమరలు యొక్క రూపాంతరము.)

**పెడమఱు** (దే.అ.క్రి.) : వెనుకకు మరలు. (ప్రే. పెడమరించు.)

**పెడమల్లె** (వై.వి.) : ఒకజాతి పెద్దమల్లె.

**పెడము** (వై.వి.) : పెడమోము యొక్క రూపాంతరము.

**పెడమోము** (వై.వి.) : వెనుకకు తిరిగిన మొగము.

**పెడమోమువడు** (వై.అ.క్రి.) : (పెడమోము + పడు) వెనుకకు తిరిగిన మొగమగు.

**పెడరేఁచే** (వై.ప్రే.) : పురికొలుపు.

**పెడలు** (దే.వి.) : పెరడు. (ఇక్కడ పెరటి యని యున్నను బాధ లేదు. అయినను పాఠమిట్లు కనఁబడుచున్నది.)

**పెడసరకట్టె** (ద్వ.విశే.) : (పెడసరము + కట్టె) మూర్ఖుఁడు, మూర్ఖురాలు.

**పెడసరము** (దే.వి.) : మౌర్ఖ్యము.

**పెడిసె** (దే.వి.) : పక్షి విశేషము. (అప్ర.)

**పెడులు** (దే.అ.క్రి.) : పెట్లు. (పెటులు యొక్క రూపాంతరము.)

**పెడ్డ** (దే.వి.) : మట్టిపెల్ల. (ఆమడిగడ్డ పెడ్డలుగా నున్నది.)

**పెణక** (యు.దే.వి.) : ఇంటి యొక్క ఒక భాగపు కప్పు. (వై.) : పెడక యొక్క రూపాంతరము. (ఆకు యొక్క పృష్ఠ భాగమునకు. చూ. తెలె.)

**పెత్తనగాఁడు** (ద్వ.విశే.) : (పెత్తనము + కాఁడు) అధికారి.

**పెత్తనము** (వై.వి.) : (పెద్ద + తనము) 1. అధికారము; 2. వార్ధకము.

**పెద** (వై.విశే.) : పెద్ద యొక్క రూపాంతరము. (పెద తండ్రి. మొ.)

**పెదవి** (దే.వి.) : మోవి, వాతెర, అధరము.

**పెద్ద** (వై.విశే.) : 1. వృద్ధుఁడు; 2. పెద్దవాఁడు, జ్యేష్ఠుఁడు; 3. గొప్పవాఁడు; 4. అధికము; 5.శ్రేష్ఠము; 6.దీర్ఘము; (క్రి.విశే.) అత్యంతము. (పెద్ద అను విశేషణమునందుగల సంజ్ఞా వాచక శబ్దములు. పెద్దకక్కెర (కర్కరేటువు), పెద్దకాఁకర (మహాకార వేల్లము), పెద్దకాఁచి (కాకాదని), పెద్దకూఁకటి మూగ (మాందిలవము), పెద్ద కొంగ (బలాకము), పెద్ద గఱిక (గండాలి), పెద్ద గుమ్మడి (పెండ్లిగుమ్మడి), పెద్దగుమ్ముడు (శ్రీపర్ణి), పెద్దగోరఁట (కురంటకము), పెద్ద చేఁతరాసి (మహా ఝురసి), పెద్దచేమంతి (మహా సహ), పెద్దజల్లిమెకము (సృమరము.), పెద్ద తుమ్మి (మహాద్రోణము), పెద్ద దవనము (మహా దమనము), పెద్ద దుప్పి (రామము), పెద్దదూలగోవెల (మహాత్మగుప్త.), పెద్దదోస (రాజకర్కటి), పెద్ద నువ్వు (మహా తిలము), పెద్ద నేరెడు (మహాజంబువు), పెద్దపల్లేరు (మహా పలంకష),పెద్ద పాఁపఱ (ఇంద్ర వారుణి.), పెద్దపీఁచర (పీవరి), పెద్ద పెన్నేరు

(మహాశ్వగంధ), పెద్దబీఱ (రాజకోశాతకి), పెద్ద బోడతరము (మహా ముండిని), పెద్దమానేరు (మహా జ్యోతిష్మతి), పెద్దముత్తవపులగము (అతిబిల), పెద్దములక (మహా వార్తాకి), పెద్దముల్లంగి (మహా మూలకము), పెద్దమ్రాను (డుండు కము), పెద్దయీాడ (స్వర్ణపారేవతము), పెద్దయేలకి (బృహదేల), పెద్దవర గోఁగు (బృహత్పీలువు), పెద్దవిరి (మహానీలి), పెద్దవేము (మహానింబము), పెద్దారుగ (వరకము.) మొ.)

**పెద్దకాఁపు** (ద్వ. విణ.) : గ్రామాధికారి.

**పెద్దతల** (ద్వ. విణ.) : పెద్దగానుండి కార్యములను నడపించువాఁడు.

**పెద్దనిదుర** (వై. వి.) : పెద్దనిద్దుర యొుక్క రూపాంతరము.

**పెద్దనిదురవోవు** (ద్వ. అ. క్రి.) : (పెద్దనిదుర + పోవు) చచ్చు.

**పెద్దనిద్దుర** (వై. వి.) : చావు, దీర్ఘనిద్ర.

**పెద్దనెల** (ద్వ. వి.) : జ్యేష్ఠమాసము.

**పెద్దపులి** (ద్వ. వి.) : బెబ్బులికి మొదటి రూపము.

**పెద్దపులుఁగు** (ద్వ. వి.) : గుడ్లగూబ, మహాపక్షి.

**పెద్దపొల** (వై. వి.) : గోమాంసము.

**పెద్దమ్మ** (వై. వి.) : (పెద్ద+అమ్మ) 1. జ్యేష్ఠాదేవి; 2. పెదతల్లి.

**పెద్దరోగము** (మి. వి.) : దేహము తెగ దినెడు వ్యాధి విశేషము.

**పెద్దఱికము** (ద్వ. వి.) : పెద్దతనము.

**పెద్దలు** (వై. వి. బ.) : తెలిసినవారు.

**పెద్దవాకిలి** (ద్వ. వి.) : గోపురద్వారము.

**పెద్దవారము** (మి. వి.) : బుధవారము.

**పెద్దవిన్నపము** (వై. వి.) : చెవుడు, బధిరత్వము.

**పెద్దవిన్నపమువాఁడు** (ద్వ. విణ.) : చెవిటివాఁడు.

**పెద్దవీది** (వై. వి.) : రాజమార్గము.

**పెద్దవేలుపు** (ద్వ. వి.) : బ్రహ్మ, సురజ్యేష్ఠుఁడు.

**పెద్దవ్రేలు** (ద్వ. వి.) : బొటనవ్రేలు, అంగుష్ఠము.

**పెద్దాకుచెట్టు** (ద్వ. వి.) : (పెద్ద + ఆకుచెట్టు) ఒకానొక అడవిచెట్టు.

**పెద్దాపురి** (దే. వి.) : పెద్దాపురమునందు చేయఁబడు శర్కర.

**పెద్దింటమ్మ** (ద్వ. వి.) : (పెద్ద + ఇల్లు + అమ్మ) ఒక గ్రామదేవత. (గ్రామదేవతా భేదము లిట్టుల నేకములు గలవు.)

**పెన** (దే. వి.) : 1. మెలిక; 2. బంధము; 3. రెండు పశువులను చేర్చి బంధించెడు బంధము.

**పెనఁకువ** (దే. వి.) : 1. పెనఁగులాట; 2. చుట్టుకొనుట (చూ. పెనఁగు); 3. మేళనము; 4. యుద్ధము; 5. వివాదము; 6. కలయిక.

**పెనఁకువలుగొను** (దే. అ. క్రి.) : (పెనఁకువలు + కొను) మెలివడు.

**పెనఁగఁబడు** (ద్వ. అ. క్రి.) : (పెనగఁ + పడు) పెనవేసికొను.

**పెనఁగాడు** (దే. అ. క్రి.) : (పెనఁగి + ఆడు) పెనగొను. (మొదటి రూపము పెనఁగియాడు. చూ. ఊఁగాడు.)

**పెనఁగు** (దే. అ. క్రి.) : 1. పెనఁగొను; 2. చుట్టుకొను; 3. కలయు; 4. యుద్ధము చేయు; 5. మాఱాడు; (వి.) : పెనఁకువ.

**పెనఁగులాట** (దే. వి.) : (పెనఁగులాడుట) పెనఁగొనుట. (రూ. పెనఁగులాటము.)

**పెనఁగులాడు** (దే. అ. క్రి.) : (పెనఁగులు + ఆడు) మల్లాడు.

**పెనఁగువడు** (దే. అ. క్రి.) : (పెనగు + పడు) చేరు.

**పెనఁగొను** (దే. అ. క్రి.) : (పెన + కొను) 1. మెలిగొను; 2. చేరు.

**పెనఁచే** (దే. ప్రే.) : పెనగజేయు.

**పెనపరి** (దే. విణ.) : (పెనపు+అరి) 1. వివాదశీలుడు; 2. భేదశీలుఁడు.

**పెనపు** (దే. ప్రే.) : (పెనయఁజేయు.) 1. కలపు; 2. పెనఁచు; (వి.) : 1. వివాదము; 2. భేదము.

**పెనము** (దే. వి.) : దోసెలులోనగువాని కాల్చెడు గుండ్రని యినుప తగడు స్వేదని.

**పెనము** (దే. అ. క్రి.) : 1. కలయు; 2. పెనఁగు.

**పెనవెట్టు** (దే. స. క్రి.) : (పెన + పెట్టు) మెలివెట్టు.

**పెనవేయు** (దే.స.క్రి.) : 1. మెలిపెట్టు; 2. పశువులను ఒకటితో నొకటిఁచేర్చి ముడివేయు.

**పెనిమిటి** (దే.వి.) : (పెనుపు+మేటి) మగఁడు, భర్త. (చూ. పాట పాట) (ఇందు సంధిని వర్ణ వికారము.)

**పెను** (దే.విశ.) : వృత్తి యందు పెనుపు శబ్దమునకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. (పెన్నుద్ది, పెన్నూఁత, పెనుఁగొమ్మ, పెను మేటి, మొ. దీనికి అచ్చు పరమగు నపుడు ద్విత్వమని యెఱుంగునది. దీనికి స్థిర వర్ణములు పరములగునపుడు ఉత్వ లోపంబు బహుళంబు గానగు. పెన్నాటకము, పెన్నింట, పెన్నీరు, పెన్నెత్తురు, పెన్నెనరు, పెన్నెత్తి, పెన్మద్ద, పెన్మసరు, పెన్నెక. మొ.)

**పెనుఁగొమ్ము** (దే.వి.) : (పెనుపు+కొమ్మ) చెట్టు మొదటి కొమ్మ, కపట, స్కంధశాఖ.

**పెనుఁబాము** (దే.వి.) : (పెనుపు+పాము) కొండచిలువ, అజగరము.

**పెనుచే** (దే.ప్రే.) : పెరుఁగఁజేయు, వర్ధిల్లఁజేయు, పెంచు.

**పెనుపడు** (దే.అ.క్రి.) : (పెనుపు+పడు) 1. అతిశయిల్లు; 2. వర్ధిల్లు.

**పెనుపరి** (దే.విశ.) : (పెనుపు + అరి) వృద్ధిఁ బొందించువాఁడు.

**పెనుపారు** (దే.అ.క్రి.) : (పెనుపు + ఆరు) పెంపారు.

**పెనుపు** (దే.వి.) : 1. పెంచుట; 2. వృద్ధి; 3. ఆధిక్యము; 4. మహత్వము.

**పెనుమసనము** (ద్వ.వి.) : (పెనుపు + మసనము) కాశి.

**పెనుమినుకులు** (దే.వి.బ.) : (పెనుపు + మినుకులు) వేదము. (చూ. పేరిమి కాఁడు.)

**పెనుమ్రాను** (దే.వి.) : (పెనుపు + మ్రాను) దుండిగము.

**పెనువెల్లి** (దే.వి.) : (పెనుపు + వెల్లి) ప్రళయ కాలము నందలి యేకార్ణవము.

**పెనువ్రేలు** (దే.వి.) : (పెనుపు + వ్రేలు) బొటన వ్రేలు, అంగుష్ఠము.

**పెన్న** (వై.వి.) : పినాకినీ నది.

**పెన్నడపులుఁగు** (దే.వి.) : (పెన్ + నడపులుఁగు) కురరము.

**పెన్నెరు** (దే.వి.) : పెన్నేరు యొక్క రూపాంతరము.

**పెన్నేరు** (దే.వి.) : అశ్వగంధ.

**పెన్మిటి** (దే.వి.) : పెనిమిటి యొక్క రూపాంతరము.

**పెమ్మె** (దే.వి.) : పెరిమె యొక్క రూపాంతరము.

**పెయ్య** (దే.వి.) : 1. పాలువిడిచిన ఆడుదూడ (చూ. తలుగు); 2. దూడ; 3. ఆవు.

**పెర** (యు.దే.వి.) : తేనెతెట్టె.

**పెరక** (దే.వి.) : పెంకు, పెంచు.

**పెరజో** (దే.వి.) : సర్పవిశేషము. (అప్ర.)

**పెరడు** (దే.వి.) : ఇంటివెనుకటి దొడ్డి, నిష్కుటము.

**పెరయీఁగ** (దే.వి.) : ఒక దినుసు తేనెటీఁగ, పుత్తిక.

**పెరరేచు** (వై.స.క్రి.) : ప్రేరేపణచేయు.

**పెరరేపు** (వై.స.క్రి.) : పెరరేచు యొక్క రూపాంతరము.

**పెరవణి** (వై.వి.) : పేరణియాట. (ఈ రూపము ఈ యొకచోటనే కనఁబడు చున్నది.)

**పెరసు** (దే.వి.) : పొల, మాంసము.

**పెరిమ** (వై.వి.) : ప్రేమ.

**పెరిమె** (దే.వి.) : పెద్దఱికము.

**పెరుఁగాకు** (దే.వి.) : (పెరుఁగు + ఆకు) పెరుఁగు తోఁటకూర, శాకిని.

**పెరుఁగు** (దే.అ.క్రి.) : 1. వర్ధిల్లు; 2. ఎదుగు; (వి.) : దధి. (విశ.) : 1. ఏండ్లుచెల్లినవాఁడు, ఏండ్లు చెల్లినది; 2. వృద్ధి పొందినది. (చూ. పెరువు.)

**పెరుఁగుడు** (దే.వి.) : 1. వర్ధనము; 2. వృద్ధి.

**పెరుఁగుతోఁటకూర** (దే.వి.) : పెరుఁగాకు, శాకిని. పెరుఁగు సంద్రము. (ద్వ.వి.) : పెరుఁగు సముద్రము, దధ్యుదము.

**పెరుగు** (దే.అ.క్రి.) : తెగు.

**పెరుమాకోయిల** (దే.వి.) : (పెరుమాళ్లు + కోయిల) కాంచీపురము. (చూ. కోయిల.)

**పెరుమాళ్లు** (దే.వి.బ.) : విష్ణువు.

**పెరువు** (దే.అ.క్రి.) : 1. వర్ధిల్లు; 2. ఎదుగు; (చూ.పెర్గు.) (వి.) : దధి. (విణ.) : 1. ఏండ్లు చెల్లినది; ఏండ్లు చెల్లినవాఁడు; 2. వృద్ధి పొందినది. (పెరుఁగు యొక్క రూపాంతరము.)

**పెర్కు**(దే.అ.క్రి.) : పెఱుకు యొక్క రూపాంతరము. (పీఁకుటకు.)

**పెర్గు** (దే.అ.క్రి.వి.) : పెరుగు యొక్క రూపాంతరము.

**పెర్వు** (దే.అ.క్రి.వి.) : పెరువు యొక్క రూపాంతరము. (దధికి.)

**పెఱ** (వై.స.) : అన్యము. (ఇట్లు పెఱ, చెఱ ఇత్యాద్యనేక శబ్దములయందు శకట రేఫము కనఁబడుచుండగా చిన్నయసూరిగారు "శకటరేఫము తత్సమతద్భవములందులేదు." అని చెప్పుటకు అభిప్రాయమేమో తెలిసినది కాదు.)

**పెఱగాయ** (ద్వ.విణ.) : (పెఱ + కాయ) కుత్సితుఁడు.

**పెఱమగఁడు** (ద్వ.వి.) : జారుఁడు.

**పెఱిక** (దే.వి.) : ఎద్దులోనగువాని మీఁదవేసి మోయించెడు గోనెమూట.

**పెఱికాటము** (దే.వి.) : ఎడ్లలోనగువానిచే ధాన్యాదులు మోయించుట.

**పెఱుకు** (దే.స.క్రి.) : 1. పీఁకు; 2. పెల్లగించు; 3. మోయు.

**పెఱుగు** (దే.అ.క్రి.) : 1. కడఁగు, ఉద్యమించు; 2. విజృంభించు.

**పెలుకుఱు** (దే.అ.క్రి.) : భయాదుల చేత అంగములు విలవిలపోవు, విహ్వాలించు.

**పెలుచ** (దే.వి.) : 1.అతిశయము; 2.ఆగ్రహము; 3. ఆధిక్యము; 4. కాఠిన్యము; (చూ. పెలుచన.) (విణ.) అధికము. ద్ర. ఉచ్చైరర్థకము, గట్టిగా. (ఇది నల్లలోనగువాని వంటిది.)

**పెలుచన** (దే.వి.) : 1. అతిశయము (చూ. పెలుచ); 2.ఆటోపము (చూ.పెల్చన); 3.ఆగ్రహము; 4. ఆధిక్యము (చూ.పెల్చన); 5. కాఠిన్యము; (విశేషణమగుచో.) 6. ఉచ్చైర్నాదము; (విశేషణమగుచో.) (చూ. అలకన.)

**పెల్కుఱు** (దే.అ.క్రి.) : పెలుకుఱు యొక్క రూపాంతరము.

**పెల్చే** (దే.వి.విణ.) : పెలుచ యొక్క రూపాంతరము.

**పెల్చేన** (దే.వి.) : పెలుచన యొక్క రూపాంతరము. (ఆటోపమునకు.) ఆధిక్యమునకు.

**పెల్ల** (దే.వి.) : ఎండి పెల్లగిలిన పలుచని మంటిగడ్డ.

**పెల్లగించు** (దే.ప్రే.) : పెల్లగిలఁ జేయు, ఉన్మూలించు.

**పెల్లగిల్లు** (దే.అ.క్రి.) : 1. పాదు ఊడిలేచు, ఉన్మూలితమగు; 2.పాఱు; (రూ.పెల్ల గిల్లు.పాఱుటకు.)

**పెల్లిదము** (ద్వ.వి.) : (పెల్లు + ఇదము) పెల్లు, అతిశయము.

**పెల్లు** (వై.వి.) : 1. అతిశయము; 2. ఆధిక్యము; (క్రి. విణ.) : అత్యంతము. (విణ.) : అధికము.

**పెల్లుకొను** (ద్వ.అ.క్రి.) : అతిశయిల్లు (చూ. దల్లు.)

**పెసర** (దే.వి.) : సస్య విశేషము.

**పెసలు** (దే.వి.) : పెసరధాన్యము. (దీని భేదములు నల్లపెసలు, పచ్చపెసలు, పిచ్చపెసలు.)

**పెళపెళ** (దే.వి.) : 1. ధ్వనివిశేషము; 2. విఱుగుట లోనగువాని యందగు ధ్వన్యనుకరణము; (విఱుగుటయందు; విఱుచుటయందు; ఉఱుముట యందు; ఆర్చుటయందు.)

**పెళపెళయను** (దే.అ.క్రి.) : (పెళపెళ + అను) తోలు లోనగునవి పెళపెళయని ధ్వనించు.

**పెఱుచే** (దే.విణ.) : 1. మూర్ఖుఁడు; 2. విరసము.

**పెళ్లమ్రాను** (దే.వి.) : దున్నిన పిమ్మట మిట్టపల్లములు సరిపడ మీఁద నీడ్చెడు పలక.

**పెళ్లు** (దే.వి.) : విఱుగుటలోనగు వాని యందగు ధ్వన్యనుకరణము. (విఱుగుట యందు; దాటుట యందు.)

**పెళ్లెము** (దే.వి.) : వాద్యము చేయుటకు అనేక వస్తువులు చేర్చి చేసిన పిండి, మేదకము.

# పే

**పేఁట** (వై.వి.) : 1. నగరము; 2. శాఖానగరము.

**పేఁటు** (దే.వి.) : బీఁటిక. (చూ. పట్టు. (దే.అ.క్రి.): రెండవ యర్థము నుదాహరణము.)

**పేఁడ** (దే.వి.) : గోమయము. (రూ. పెండ.)

**పేఁడగువ్వ** (దే.వి.) : పారావత విశేషము.

**పేఁడపురుగు** (ద్వ.వి.) పేఁడయందుండు ఒక దినుసు ఱెక్క పురుగు.

**పేఁడు** (దే.స.క్రి.) : దారము పేను.

**పేక** (దే.వి.) : వస్త్రములనేఁత యందలి యడ్డ నూలు.

**పేగు** (దే.వి.) : ప్రేగు యొక్క రూపాంతరము.

**పేచకము** (సం.వి.అ.పుం.) : 1. గుడ్లగూబ; 2.ఏనుఁగుతోఁక మొదలు; 3. దాని సమీపము.

**పేచి** కన్న.(వి.) : భారము, తంటా.

**పేచిక** (దే.వి.) : ఒకానొకచెట్టు.

**పేచీఖోరు** : తంటాలమారి.

**పేజీ** (ఆం.వి.) : పుట.

**పేట** (ఉభ.దే.వి.) : హారము నొక సరము, యష్టి. (సం.ఆ.స్త్రీ.): పెట్టె. (రూ. పేటము, పేటకము. (అ.పుం.న.)

**పేటనఁబెట్టు** (ద్వ.అ.క్రి.) : (పేటన౯ + పెట్టు) యత్నించు.

**పేటాడు** (దే.అ.క్రి.) : (పేటు + ఆడు) భేదించు.

**పేటి** (ఉభ.దే.వి.) : నడికట్టు. సం.ఈ.స్త్రీ. పెట్టె.

**పేటిక** (సం.వి.ఆ.స్త్రీ.): 1. పెట్టె; 2. సమూహము.

**పేటీ** (దే.వి.) : పేటి యొక్క రూపాంతరము.

**పేటు** (దే.వి.) : 1. సరిగ లోనగు వానితో నేసిన పట్టె; 2. పర్వత శిఖరము.

**పేడి** (వై.వి.) : నపుంసకుఁడు.

**పేడు** (దే.వి.) : సన్నచెక్క.

**పేడె** (వై.విణ.) : గడ్డము మీసము లేనివాఁడు. (గడ్డము మీసము లేనిది. పెడెమూతి.)

**పేడెత్తు** (దే.అ.క్రి.) : (పేడు + ఎత్తు) విచ్చు, తొలఁగు.

**పేణీ** (వై.వి.) : భక్ష్య విశేషము.

**పేద** (వై.వి.) : భటుఁడు. (విణ.) : 1. పిఱికి; 2.దరిద్రుఁడు; 3.అనుద్ధతుఁడు; 4.అశక్తుడు.

**పేదర్మి** (ద్వ.వి.) : పేదఱిమి యొక్క రూపాంతరము. (దారిద్ర్యమునకు.)

**పేదఱికము** (ద్వ.వి.) : దారిద్ర్యము.

**పేదఱిమి** (ద్వ.వి.): 1.దారిద్ర్యము; (చూ. పేదర్మి.) 2. పిఱికితనము.

**పేదవడు** (వై.అ.క్రి.) : (పేద + పడు) 1. దారిద్ర్యమును పొందు; 2. దైన్యమును పొందు.

**పేనా** (ఆం.వి.) : కలము.

**పేను** (దే.స.క్రి.) : దారము పేఁడు. (వి.) : తలయందు పట్టెడు జంతు విశేషము, యూకము.

**పేన్నీళ్లు** (ద్వ.వి.బ.) : (పేడ + నీళ్లు) కలయంపి చల్లెడు పేఁడ కలిసిన నీళ్ళు.

**పేపర** (దే.వి.) : పక్షివిశేషము. (అప్ర.)

**పేము** (దే.వి.) : ప్రేము యొక్క రూపాంతరము.

**పేముబొద్దు** (దే.వి.) : గోడయంచుల యందు పేమువలె ఏర్పఱచెడు బొద్దు.

**పేయ** (దే.వి.) : పెయ్యకు మొదటి రూపము.

**పేయము** (సం.వి.అ.న.) : 1. నీళ్లు; 2. పాలు. (పుం.): 1. అచ్చపుఁదేట; 2. వెలవ. (విణ.): త్రావఁ దగినది.

**పేరంట్రము** (దే.వి.) : పేరటము యొక్క రూపాంతరము. (మొదటి యర్థము నకు. పేరంట్రము పేరంట్రముగానని యర్థము.)

**పేరఁటము** (దే.వి.) : 1. వివాహాది శుభ కార్యములు నడపుటకు ముత్తయిదువలు ఇరుగు పొరుగు ముత్తయిదువలను రమ్మని పిలుచుట; 2.వివాహాది శుభ కార్యముల యందు ఇరుగు పొరుగు ముత్తయిదువలు వచ్చి వేయు తత్సంబంధమైన కార్యము.

**పేరఁటాలికూర** (ద్వ.వి.) : ఒక దినుసు కూరాకు.

**పేరఁటాలు** (దే.వి.) : 1. పేరఁటమునకు వచ్చిన ముత్తయిదువ; 2. మృత సువాసిని.

**పేరడవి** (ద్వ.వి.) : (పేరు+అడవి) మహారణ్యము.

**పేరణము** (వై.వి.) : పేరణి యొక్క రూపాంతరము.

**పేరణి** (యు.దే.వి.) : అంగీ. (వై.) : భాండోపరి నృత్యము.

**పేరము** (దే.వి.) : పేరము యొక్క రూపాంతరము.

**పేరాముదపుఁజెట్టు** (ద్వ.వి.) : (పేరాముదము + చెట్టు) రక్తైరండము.

**పేరాముదము** (ద్వ.వి.) : (పేరు + ఆముదము) రక్తైరండ తైలము.

**పేరాముదాలు** (ద్వ.వి.బ.) : పేరాముదపు విత్తులు.

**పేరి** (ఆం.వి.) : ఒక విధమైన ఫలవృక్షము.

**పేరిమి** (దే.వి.) : (పేరు + ఇమి) 1. గౌరవము; 2. అతిశయము (చూ. పేర్మి.)

**పేరిమికాఁడు** (దే.విణ.) : గొప్పవాఁడు, ఘనుఁడు.

**పేరీఁదు** (దే.వి.) : (పేరు + ఈఁదు) ఖర్జూరము.

**పేరు** (దే.అ.క్రి.) : 1. ఘనీభవించు; 2. సాంద్ర మగు; 3. అతిశయించు; (వి.) : 1. నామము; 2. కీర్తి; 3. దండ; (విణ.) : 1. పెద్ద; 2. అధికము; (హల్లు పరమగుచో దీని యుకారము నకు వికల్పముగా లోపంబగు.)

**పేరుంగరము** (దే.వి.) : (పేరు + ఉంగరము) పేరు చెక్కిన ఉంగరము, ముద్రిక.

**పేరుకొను** (దే.స.క్రి.) : 1. పేరు పెట్టి పిలుచు; 2. పిలుచు (చూ. పేర్కొను); 3. ఉచ్చరించు, వచించు; 4. స్తుతించు; (చూ. పేర్కొను)

**పేరుకోలు** (దే.వి.) : పేరుకొనుట.

**పేరుగ్రుచ్చు** (దే.స.క్రి.) : (పేరు+క్రుచ్చు) 1. పేరు పెట్టి పిలుచు; 2. చెప్పు; (క్రుచ్చు అనునది కూర్చు యొక్క మాఱు రూపమని యెఱుంగునది. చూ. వాక్రుచ్చు.)

**పేరుచే** (దే.అ.క్రి.) : 1. అతిశయించు; 2. విజృంభించు; (స.క్రి.) : 1. ఒకటి మీఁద నొకటి పెట్టు; (ఱాళ్ళు పేర్చి పెట్టుము.) 2. ఒకటిమీఁద నొకటిగా పెట్టి ఏర్పరచు. (రూ. పేర్చు, అతిశయించుటకు.) ఒకటి మీఁద నొకటిగాఁ బెట్టి యేర్పఱచుటకు.

**పేరుడు** (దే.వి.) : పేరుట, ఘనీభవించుట.

**పేరుపు** (దే.వి.) : 1. ఒకటిమీఁద నొకటి పెట్టుట; 2. కుండపెంకు. (చూ. పేర్పు.)

**పేరెము** (దే.వి.) : 1. గుఱ్ఱపు పరుగు; 2. పరుగు.

**పేరొజము** (వై.వి.) : మరకతమణి విశేషము.

**పేరోజము** (సం.వి.అ.న.) : క్షుద్రమణి విశేషము.

**పేరోదనము** (వై.వి.) : పేరోజము యొక్క రూపాంతరము.

**పేర్కొను** (దే.స.క్రి.) : పేరుకొను యొక్క రూపాంతరము. (పేరు పెట్టి పిలుచుటకు. పిలుచుటకు. స్తుతించుటకు.)

**పేర్కోలు** (దే.వి.) : పేరుకోలు యొక్క రూపాంతరము.

**పేర్పు** (దే.వి.) : పేరుపు యొక్క రూపాంతరము. (ఒకటి మీఁద నొకటి పెట్టుటకు. కుండ పెంకునకు. చూ. పిసరు.)

**పేర్మి** (దే.వి.) : పేరిమి యొక్క రూపాంతరము. (గౌరవమునకు. అతిశయమునకు.)

**పేలపిండి** (ద్వ.వి.) : పేలాలువిసరిచేసిన పిండి, సక్తువు.

**పేలలు** (దే.వి.బ.) : లాజలు. (దీనిని ఆవాల వలెనే పేలాలని వాడెదరు. వృత్తి యందేక వచనాంతము. పేల గింజల మొ.) (ప్రేలల యొక్క రూపాంతరము.)

**పేలవము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పలుచనిది, విరళము.

**పేలా** (దే.వి.) : నీళ్లుత్రాగెడు ఒక దినుసుగిన్నె.

**పేలిక** (దే.వి.) : చింపిగుడ్డ. (చూ. నాలిక.)

**పేలు** (ద.అ.క్రి.) : సెగచేతవేఁగియుబుకు. (ప్రేలు యొక్క రూపాంతరము.)

**పేలుచు** (దే.ప్రే.) : పేలఁజేయు. (రూ. పేల్చు.)

**పేవు** (దే.వి.) : పేగుయొక్క రూపాంతరము.

**పేశలము** (సం.వి.అ.పుం.) : 1.కోయిల; 2.రోఁకలి. (విణ.) : 1. నేర్పు గలది; 2. చక్కనిది.

**పేశి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. గ్రుడ్డు (ఇకారాంతము నగు.); 2. కత్తియొఱ; 3. మాంసపుముద్ద.

**పేశీకోశము** (సం.వి.అ.పుం.) : అండము, గ్రుడ్డు.

**పేషణము** (సం.వి.అ.న.) : నూఱుట.

**పేషణి** (సం.వి.ఈ.స్త్రీ.) : నూతెదుఱాయి, సన్నెకల్లు.

**పేష్కషు** (హిం.వి.) : జమీఁదారులు ప్రభుత్వము వారికి కట్టు పన్ను.

**పేష్కారు** (హిం. వి.) : అమల్దారు క్రింది యుద్యోగస్థుఁడు.

**పేసెము** (వై.వి.) : (చూ.) బేసము.



**పై** (దే.వి.) : మీఁదు, ఉపరిభాగము. (పైక్రిందులు, పైమాట. మొ.) (మొదటి రూపము. పయి.)

**పైఁట** (వై.వి.) : పయటఁ యొక్క రూపాంతరము. (మొదటిరూపము పయిఁట.)

**పైఁడి** (దే.వి.) : 1. బంగారు; 2.ధనము; 3.(చూ.) ఉంకువ. (మొదటి రూపము. పయిఁడి.)

**పైఁడికంటి** (దే.వి.) : (పైఁడి+కన్ను) పక్షి విశేషము, కనకాక్షి. (విణ.) : బంగారు చాయ కన్నులు గలది. (మొదటి రూపము. పయిఁడికంటి.)

**పైఁడిచేూలాలు** (దే.వి.) : భూమి, వసుగర్భ.

**పైఁడితామర** (ద్వ.వి.) : మెట్టతామర, స్థలపద్మిని. (మొదటి రూపము పయిఁడి తామర.)

**పైఁడినెలఁత** (దే.వి.) : లక్ష్మి, ఇందిర. (మొదటి రూపము పయిఁడినెలఁత.)

**పైఁడి** ప్రత్తి (ద్వ.వి.) : కార్పాసభేదము. (మొదటి రూపము పయిఁడి ప్రత్తి.)

**పైఁడిముడుచు** (దే.అ.క్రి.) : నిశ్చితార్థము చేయు. (మొదటి రూపము పయిఁడి ముడుచు.)

**పైఁడిముడుపు** (దే.వి.) : నిశ్చితార్థము. (మొదటి రూపము పయిఁడిముడుపు.)

**పైఁడితేఁడు** (దే.వి.) : కుబేరుడు, ధనాధిపుఁడు. (ఇట్లు పైఁడి దొర, పైఁడి రాయఁడు. మొ.) (మొదటి రూపము పయిఁడితేఁడు.)

**పైకము** (ఉభ.దే.వి.) : 1. రెండు కాసుల నాణెము; 2. ధనము; 3. సమూహము; (మొదటి రూపము పయికము.) (సం.అ.న.) : పికముల సమూహము.

**పైకూటమి** (దే.వి.) : ఉపరిసురతము. (మొదటి రూపము పయికూటమి.)

**పైకొను** (దే.అ.క్రి.) : 1. మీఱు; 2. కవియు; 3. యత్నించు; 4. కలుగు; (ప్రే. పైకొలుపు.) (మొదటి రూపము పయికొను.)

**పైజేూఱు** (దే.వి.) : ముచ్చె. (మొదటి రూపము పయిజాఱు.)

**పైజేూఱుమట్ట** (దే.వి.) : మత్స్యవిశేషము. (మొదటి రూపము పయిజాఱుమట్ట.)

**పైఠ** (సం.వి.ఆ.(స్త్రీ.) : ఆఁడువారిపైట.

**పైఠరము** (సం.విణ.) : (అ.ఈ.అ.) పిఠరము నందు వండఁబడినది. (పిండి వంట.) (చూ. పిఠరము.)

**పైతామహము** (సం.విణ.) : (అ.ఈ.అ.) పితామహ సంబంధమైనది.

**పైతృకము** (సం.విణ.) : (అ.ఈ.అ.) పితృ సంబంధమైనది.

**పైతృష్వసేయుఁడు** (సం.వి.అ.పుం.) : మేనత్త కొడుకు.

**పైతృష్వస్రీయుఁడు** (సం.వి.అ.పుం.) : మేనత్త కొడుకు.

**పైత్తము** (సం.విణ.) : (అ.ఈ.అ.) పిత్తమువలనఁ గలిగినది. (వ్యాధి.)

**పైత్రము** (సం.విణ.) : (అ.ఆ.అ.) పితృ సంబంధమైనది.

**పైద** (దే.వి.) : పిల్లకాయ. (మొదటి రూపము పయిద.)

**పైదలి** (దే.వి.) : ఆఁడుది. (మొదటి రూపము పయిదలి.)

**పైనము** (వై.వి.) : పయనము యొక్క రూపాంతరము. (మొదటిరూపము పయినము.)

**పైపడు** (ద్వ.అ.క్రి.) : 1. మీఱు; 2. పైకొను, కవియు. (మొదటి రూపము పయిపడు. మీఱుటకు.) (చూ. ప్రేపు.)

**పైపాటు** (ద్వ.వి.) : (పైపడుట.) కవియుట. (మొదటి రూపము పయిపాటు.)

**పైపగ** (దే.ద్ర.క్రి.విణ.) : (పైపై + కాఁ) సులభముగా. (ఆ తప్పు పైపైగ తేలిపోయినది.) (మొదటి రూపము పయిపయిగ.)

**ఫైర** (దే. వి.) : పయర యొక్క రూపాంతరము. (మొదటి రూపము పయిర.)

**ఫైరము** (దే.వి.) : ఆవు. (చూ. పేటన బెట్టు) (మొదటి రూపము పయిరము.)

**ఫైరు** (దే.వి.) : సస్యము. (మొదటి రూపము పయిరు.)

**పైరులయెకిమీఁడు** (దే.వి.) : చంద్రుఁడు, ఓషధీశుఁడు. (మొదటి రూపము పయిరుల యెకిమీఁడు.)

**పైలుమాను** (హిం.వి.) : జెట్టివాఁడు.

**పైశాచము** (సం.వి.అ.పుం.) : నిద్రించియు తాగి మైమఱచియు శీలము సంరక్షింపఁ బరాకు పడియున్న దానిని సంభోగేచ్ఛచే రహస్యముగాఁ జేసికొను వివాహము. (చూ. వివాహము.) (ఇది యధమము.) (విణ.) : పిశాచ సంబంధమైనది.

**పైశున్యము** (సం.వి.అ.న.) : కొండెకానితనము.

**పైసరము** (దే.వి.) : రతి. (మొదటి రూపము పయిసరము.)

**పైసలా** (హిం.వి.) : తీర్పు, పరిష్కారము.



**పొ** (దే.విణ.) : వృత్తియందు పొన్ను శబ్దమునకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. (దీనికి పరుష సరళములు పరములగునపుడు నుమాగమంబగు. పొఁబట్టు, పొంబనఁటి, పొంగట్టు.మొ.) అవ్య. నిశ్చయమును దెలుపును.

**పొంకపడు** (ద్వ.అ.క్రి.) : (పొంకము + పడు) పొందికపడు. (ప్రే.) : పొంకపఱచు.

**పొంకము** (దే.వి.) : పొందిక.

**పొంకించు** (దే.స.క్రి.) : పొంకపఱుచు.

**పొంగటినెల** (దే.వి.) : (పొంగలి + నెల) మార్గశీర్ష మాసము.

**పొంగటి పండుగ** (ద్వ.వి.) : (పొంగలి + పండుగ) మకర సంక్రాంతి.

**పొంగట్టు** (ద్వ.వి.) : (పొన్ను + గట్టు) హేమాద్రి.

**పొంగరము** (దే.వి.) : ఒక దినుసు పిండివంట.

**పొంగలి** (దే.వి.) : పాలు చేర్చి పొంగించునట్టి అన్నము. (దీని భేదములు పప్పు పొంగలి, చక్కెర పొంగలి.)

**పొంగలించే** (దే.అ.క్రి.) : నిక్కు.

**పొంగారు** (దే.అ.క్రి.) : (పొంగు + ఆరు) 1.ఉబుకు; 2. సంతోషించు; 3. అతిశయించు; 4.విజృంభించు; 5. నిక్కు.

**పొంగిలి** (దే.వి.) : పక్షులయాహారము.

**పొంగు** (దే.అ.క్రి.) : 1.ఉల్బణమగు; 2. సంతోషించు; 3. గర్వించు. (వి.) : 1. ఉల్బణము; 2.సంతోషము; 3. గర్వము; (నీపొంగుక్రుంగ.)

**పొంగునీళ్లు** (ద్వ.వి.బ.) : చిట్టుడుకు నీళ్లు.

**పొంగుప్రాలు** (దే.వి.బ.) : ధాన్య విశేషము.

**పొంచిక** (దే.వి.) : పొంచు. (ఇది పెంచిక వంటిది.)

**పొంచే** (దే.అ.క్రి.) : ఏదేని నుద్దేశించి మఱుఁగు పడి కనుపెట్టి యుండు. (వి.) : ఏదేనినుద్దేశించి మఱుఁగుపడి కనుపెట్టి యుండుట.

**పొంజు** (దే.స.క్రి.) : పోఁజు యొక్క రూపాంతరము.

**పొంటె** (దే.ద్ర.) : కొఱకు అను ప్రత్యయార్థము నందు వచ్చునది.

**పొంత** (వై.వి.) : 1. సమీపము; 2. తీరము.

**పొంతకడవ** (వై.వి.) : ప్రొయ్యి దగ్గఱి నీళ్లకుండ.

**పొంతకత్తె** (ద్వ.వి.) : (పొంతము+కత్తె) కుంటెనకత్తె.

**పొంతనము** (ద్వ.వి.) : (పొందు+తనము) గ్రహమైత్రి. (స్వార్థమున తనము)

**పొంతము** (దే.వి.) : పొందు, స్నేహము.

**పొందిక** (దే.వి.) : 1. పొంకము (మాట పొందికగా లేదు.); 2. చేరిక; 3. కలయిక.

**పొందు** (దే.అ.క్రి.) : (కన్ను) వాలు. (స.క్రి.) : 1. ప్రాప్తించు; (చూ. తలపెట్టు.); 2. కలయు. (వి.) : 1.పొందిక; 2. స్నేహము; 3. సంధి (చూ. పడు.); 4. ప్రాప్తి; 5. అభేదము; 6.ఆనుకూల్యము; (విణ.) : స్నేహితుఁడు.

**పొందుకాఁడు** (దే.విణ.) : స్నేహితుఁడు.

**పొందుకొను** (దే.అ.క్రి.) : నెలకొను.

**పొందుపడు** (ద్వ. అ. క్రి.) : సరిపడు, అనుకూలించు.

**పొందుపాటు** (ద్వ. వి.) : సరిపడుట, అనుకూలించుట.

**పొంపిరి** (దే.వి.) : సాంద్రత. (విణ.) : సాంద్రము. (పొంపిరి గానని యర్థము.)

**పొంపిరివోవు** (దే.అ.క్రి.) : (పొంపిరి + పోవు) 1. అతిశయించు; 2. వర్ధిల్లు; (చూ. దట్టుఁడు.) 3. వ్యాపించు; 4. పుట్టు; 5. సంతోషించు; 6. విజృంభించు.

**పొంపు** (దే.వి.) : 1. మెడవెనుకటి భాగము (మెడపొంపు.); 2. ఒప్పు. (దీనికి యర్థమునందీ గ్రంథకర్త ప్రయోగములే కనఁబడుచున్నవి.)

**పొంపెసలారు** (దే.అ.క్రి.) : (పొంపు + ఎసలారు) ఒప్పగు. (దీనికి ప్రయోగ మొక్కటే కానఁబడు చున్నది.)

**పొకారు** (దే.అ.క్రి.) : నాశమగు. (పోకారు యొక్క రూపాంతరము.)

**పొకారుచే** (దే.ప్రే.) : పొకారఁజేయు, నాశము చేయు. (పోకారుచు యొక్క రూపాంతరము.)

**పొకాలు** (దే.అ.క్రి.) : 1. వెడలు; 2. పోవు; (పోకాలు యొక్క రూపాంతరము.) (ఇది కోప దుఃఖము కాలములయందు ఉపయోగ పఱిచెడు మాట.)

**పొక్కలి** (దే.వి.) : 1. ఎత్తుడు ప్రొయ్యి; 2. మూడు రాళ్లు పెట్టిన ప్రొయ్యి.

**పొక్కి** (దే.వి.) : 1. గుఱుతు; 2. ఉపాయము.

**పొక్కిలి** (దే.వి.) : 1. బొడ్డు; 2. గుంట. (ఇది రెండర్థములకు నుదాహరణము.)

**పొక్కిలిచూలి** (దే.వి.) : బ్రహ్మ, నాభిజన్ముఁడు.

**పొక్కు** (దే.అ.క్రి.) : 1. దుఃఖించు; 2. బొబ్బలేచు; 3. ఉలుకు; (వి.) : 1. దుఃఖము; 2. బొబ్బ; 3. ఎండిలేచిన పెల్ల; 4. జనశ్రుతి విశేషము.

**పొక్కుడు** (దే.వి.) : ఎండిలేచిన పెల్ల, పొక్కు. (చూ. పొంపెసలారు.)

**పొగ** (దే.వి.) : ధూమము.

**పొగకన్ను** (దే.వి.) : అగ్ని జనించిన శివుని ఫాలనేత్రము.

**పొగకట్టు** (దే.వి.) : ఇంటి పైకప్పు సందుల యందు పొగచేత చుట్టఁబడి కట్టువలెఁగనఁబడెడు సూర్యకిరణము.

**పొగగూఁడు** (దే.వి.) : ఇంటికప్పు నందు పొగ పోవుట కేర్పఱచిన సందు.

**పొగచే** (దే.ప్రే.) : (పొగయఁ జేయు.) 1. పొగ యించు; 2. సాతాళించు.

**పొగచేట్ట** (దే.వి.) : పొగాకుచుట్ట.

**పొగచూరు** (దే.అ.క్రి.) : పొగపట్టు.

**పొగచెట్టు** (దే.వి.) : పొగాకుచెట్టు, ధూమ్రపత్రిక.

**పొగడ** (వై.వి.) : (చూ. వకుళము) (చూ. పొగడు.)

**పొగడిక** (దే.వి.) : పొగడు, స్తుతి, స్తోత్రము.

**పొగడికోలు** (దే.వి.) : పొగడికొనుట.

**పొగడిత** (దే.వి.) : 1. స్తుతి; 2. కీర్తి.

**పొగడు** (దే.స.క్రి.) : స్తుతించు. (వి.) : స్తుతి. (చూ. తెగడు.)

**పొగడ్త** (దే.వి.) : 1. స్తుతించుట; 2. స్తుతి; 3. కీర్తి. (పొగడిత యొక్క రూపాంతరము.)

**పొగడ్తవడు** (ద్వ.అ.క్రి.) : (పొగడ్త + పడు) స్తుతింపఁబడు.

**పొగపు** (దే.ప్రే.) : సాతాళించు. (ఇక్కడ పొగపిన అనఁగా పక్వముచేసిన అని యర్థము.)

**పొగబాణము** (మి.వి.) : ఒక దినుసు బాణపు సంచు.

**పొగయు** (దే.అ.క్రి.) : 1. పొగగలది యగు; 2. కుములు.

**పొగరు** (దే.వి.) : 1. గర్వము; 2. ధైర్యము; 3. తీక్ష్ణగంధము.

**పొగరుఁబోతు** (దే.విణ.) : (పొగరు + పోతు) గర్వశీలుఁడు.

**పొగాకు** (దే.వి.) : (పొగ + ఆకు) ధూమ్రపత్రము.

**పొగులు** (దే.అ.క్రి.) : 1.పరితపించు; 2.కుములు.

**పొచ్చెము** (దే.వి.) : 1. న్యూనత; 2. కపటము. (విణ.) : న్యూనము.

**పాట** (వై.వి.) : దొప్ప. (ఆకుపాట.)

**పాటకరించు** (దే.అ.క్రి.) : 1. అతిశయించు; 2. వర్ధిల్లు.

**పాటకఱ** (దే. వి.) : పొట్టకఱ్ఱ యొక్క రూపాంతరము.

**పాటకఱ్ఱ** (దే. వి.) : పొట్టకఱ్ఱ యొక్క రూపాంతరము.

**పాటపాట** (దే.వి.) : రాలుటలోనగు వాని యందగు ధ్వన్యనుకరణము. (రాలుట యందు. కురియుటయందు.) (చూ. తొటతొట.) పొడముటయందు.

**పాటమరించే** (దే.అ.క్రి.) : 1. బొబ్బ లోనగునది లేచు; 2. చిగురు లోనగునది పుట్టు. (రూ. పొటమరిల్లు, పొటమరిలు.)

**పాటము** (యు.దే.అ.క్రి.) : పుట్టు. (పొడము యొక్క రూపాంతరము.) (వై.) : నాసాపుటము.

**పాటి** (వై.వి�ణ.) : పొట్టి యొక్క రూపాంతరము.

**పాటిపాటి** (వై.విఱ.) : అల్పము.

**పాటుకు** (దే.వి.) : 1. చెట్టుమీఁదనుండి వాన చినుకులు పడుట యందగు ధ్వన్యనుకరణము; 2. ప్రొద్దు పొడుచుట యందును క్రుంగుట యందునగు అనుకరణము. (ప్రొద్దు పొడుచుట యందు.) (చూ. పొటుక్కు.) క్రుంకుటయందు.

**పాటుక్కు** (దే.వి.) : పొటుకు యొక్క రూపాంతరము. (ప్రొద్దు పొడుచుట యందు.)

**పాటేలు** (దే.వి.) : పొట్టేలు యొక్క రూపాంతరము. చాటుపద్యము.

**పొట్ట** (దే.వి.) : 1. కడుపు; 2. వరిపొట్ట.

**పొట్టకఱ** (దే.వి.) : పొట్టకఱ్ఱ యొక్క రూపాంతరము.

**పొట్టకఱుకు** (దే.వి.) : ఎన్నుపొట్టు పరువము.

**పొట్టకఱ్ఱ** (దే.వి.) : బయటికి రాక లోపల బలిసి యుండు ఎన్ను, కలమగర్భము.

**పొట్టపట్టెడ** (దే.వి.) : టంగువాఱు.

**పొట్టపెంజెర** (దే.వి.) : ఒక దినుసు పెంజెర.

**పొట్టము** (దే.వి.) : గోచి, కాపీనము.

**పొట్టకూటివాఁడు** (దే.విఱ.) : (పొట్టకూడు + వాఁడు.) కడుపు కూటికి పనిచేయువాఁడు.

**పొట్టకూడు** (దే.వి.) : జీతము మాఱుగా పొట్టకు పెట్టెడు అన్నము, కడుపుకూడు.

**పొట్టక్రొవ్వు** (దే.వి.) : ఆహారము వలనఁ కలిగిన మదము.

**పొట్టపోసికొను** (దే.అ.క్రి.) : మానావ మానము లెంచక కడుపు నింపుకొను.

**పొట్టవాఁడు** (దే.విఱ.) : బొజ్జ కడుపువాఁడు.

**పొట్టి** (వై.విఱ. వామనుఁడు, వామనము.

**పొట్టింపుచీరణము** (దే.వి.) : ఒక దినుసు చిన్న చీరణము.

**పొట్టికాఁకర** (వై.వి.) : పొట్టికాయలు గల కాఁకర, కర్కోటము.

**పొట్టిపిట్ట** (వై.వి.) : పక్షివిశేషము.

**పొట్టియ** (దే.వి.) : తేలు, వృశ్చికము.

**పొట్టు** (దే.వి.) : 1. ఉముక; 2. కాయధాన్యము మీఁది తోలు.

**పొట్టుపొరలగు** (దే.అ.క్రి.) : పీడితమగు.

**పొట్టెలు** (దే.వి.) : పొట్టేలు యొక్క రూపాంతరము.

**పొట్టేలు** (దే.వి.) : గొఱ్ఱెపోతు, మేషము.

**పొట్రేను** (ద్వ.వి.) : (పొట్టి + రేను) ఒక దినుసు చెట్టు.

**పొట్ల** (వై.వి.) : ఒకానొక తీఁగ, పటోలిక. (దీని భేదములు గుజ్జుపొట్ల, చేఁతిపొట్ల.)

**పొట్లపూరిక్క** (వై.వి.) : పుష్యమీ నక్షత్రము.

**పొట్లపూరిక్కనెల** (ద్వ.వి.) : పుష్యమాసము.

**పొట్లము** (వై.వి.) : 1. పువ్వులు మొదలగు వానిని ఆకులు లోనగు వాని యందుంచి మడిచిన మడుపు; 2. గుంపు; 3. సేన.

**పొట్లు** (దే.అ.క్రి.) : పాఁచిపట్టు. (అప్ర.)

**పొడ** (దే.వి.) : 1. రూపు; 2. చూపు; 3. దేహము నందు పెద్దబొట్టుగాఁ గనఁబడురేఖ.

**పొడక** (దే.వి.) : పొణకకు మొదటి రూపము.

**పొడకట్టు** (దే.అ.క్రి.) : 1. కనఁబడు; 2. ప్రత్యక్షమగు.

**పొడగను** (దే.స.క్రి.) : (పొడ + కను) చూచు. (ప్రే. పొడగనిపించు.)

**పొడగాంచు** (దే.స.క్రి.) : (పొడ + కాంచు) చూచు. (ప్రే. పొడగనిపించు.)

**పొడగానుపు** (దే.వి.) : పొడగనుట, దర్శనము. (రూ. పొడగాన్పు.)

**పొడచూచు** (ద్వ.స.క్రి.) : పొడగాంచు.

**పొడచూపు** (ద్వ.అ.క్రి.) : 1. కనబడు; 2. ప్రత్యక్షమగు.

**పొడతెంచు** (దే.అ.క్రి.) : 1. ఉదయించు; 2. పుట్టు.

**పొడదామర** (దే.వి.) : 1. మండలాకార కుష్ఠము; 2. ఒక దినుసు పచ్చాకు.

**పొడనీడ** (దే.వి.) : సందులగుండతోఁచి పొడ పొడగా నేర్పడు నీడ.

**పొడపత్రి** (ద్వ.వి.) : ఒకానొక చెట్టు.

**పొడము** (దే.అ.క్రి.) : పుట్టు, జనించు. (చూ. పొడమూడవయర్థము.)

**పొడయెండ** (దే.వి.) : (పొడ + ఎండ) సందుల గుండ తోఁచి పొడపొడగా నేర్పడు ఎండ.

**పొడలమెకము** (ద్వ.వి.) : దుప్పి, చమూరువు.

**పొడవడఁగు** (దే.అ.క్రి.) : (పొడవు + అడఁగు) 1. చెడు; 2. చచ్చు.

**పొడవడఁచు** (దే.ప్రే.) : (పొలవడఁగఁ జేయు) 1. చెఱుచు; 2. చంపు.

**పొడవడు** (ద్వ.అ.క్రి.) : (పొడ + పడు) కనఁబడు.

**పొడవు** (దే.వి.) : రూపు.

**పొడవుసూపు** (ద్వ.అ.క్రి.) : (పొడవు + చూపు) 1. ప్రత్యక్షమగు (చూ. పొడుపు.) 2. కనఁబడు.

**పొడసుత్తె** (దే.వి.) : చిన్నసుత్తె.

**పొడి** (దే.వి.) : చూర్ణము. (విణ.) : ఎండినది. (పొడిగుడ్డ.)

**పొడిగొట్టు** (దే.స.క్రి.) : (పొడి + కొట్టు) చేని యందలి చెట్లుకొట్టు.

**పొడిచీఁకటి** (దే.వి.) : మసమసకని చీఁకటి, అవతమసము.

**పొడిసేయు** (ద్వ.స.క్రి.) : (పొడి + చేయు) చూర్ణము చేయు.

**పొడుగు** (దే.అ.క్రి.) : 1. ఉన్నతమగు; 2. వర్ధిల్లు. (వి.) : 1. మీఁదు; (చూ. పొడుగుమడుగు); 2. ఉన్నతి; 3. ఎత్తు. (విణ.) : 1. ఉన్నతము; 2. ఉత్కృష్టము. (చూ. పొడుపు.)

**పొడుగుమడుఁగు** (దే.వి.) : ఆకాశగంగ. (చూ. తొడుగు.)

**పొడుచు** (దే.అ.క్రి.) : 1. పోట్లాడు, 2. ఉద యించు; (స.క్రి.) : 1. పిడికిలి లోనగు వానితో క్రుమ్ము; 2. బల్లెము లోనగువానితో గ్రుచ్చు; 3. వ్రేయు; 4. కుట్టు; 5. (ఆన) పెట్టు.

**పొడుపు** (దే.వి.) : 1. పొడుచుట (పొడుపు మాట); 2. ఉదయము; 3. పోటు.

**పొడుపుఁగొండ** (ద్వ.వి.) : (పొడుపు + కొండ) ఉదయాద్రి.

**పొడుము** (దే.వి.) : పొడి, చూర్ణము.

**పొడువ** (దే.విణ.) : (పొడుచు వాఁడు) దుర్జనుఁడు.

**పొడువఁడు** (దే.విణ.) : (పొడువ + ఆడు) దుర్జనుఁడు.

**పొడువు** (దే.వి.) : 1. ఉన్నతి; 2. ఎత్తు; 3. మీఁదు; (విణ.) : 1. ఉన్నతము; 2. ఉత్కృష్టము; (పొడుగు యొక్క రూపాంతరము.)

**పొడ్మ** (దే.అ.క్రి.) : పొడము యొక్క రూపాంతరము.

**పొణక** (దే.వి.) : ఈఁతబ్రద్దలు లోనగువానితో నల్లినబొట్ట, కుసూల విశేషము.

**పొణకుకట్టు** (దే.వి.) : తేలికైన యొక దినుసు కట్టు.

**పొతక** (దే.వి.) : పొత్తర.

**పొతము** (వై.వి.) : 1. పొట్లము; 2. గుంపు.

**పొతుకు** (దే.వి.) : ధాన్యపురాశి చుట్ట గీఁచెడు గిఱి.

**పొత్తము** (వై.వి.) : 1. పుస్తకము; 2. కావ్యము; 3. గ్రంథము.

**పొత్తర** (దే.వి.) : ఆకులు లోనగువాని కట్ట.

**పొత్తరము** (వై.వి.) : నూఱెడుగుంౘ్రాయి, ఉపల.

**పొత్తరముల్లు** (దే.వి.) : ఒక దినుసు పచ్చిక.

**పొత్తి** (వై.వి.) : 1. మెత్తని సన్నని పాత వస్త్రము (పొత్తిగుడ్డ.); 2. చెట్టు మీఁది నార (పొత్తి చీర); 3. పోఁకపూగుత్తి మీఁది పట్ట, కుహళి; 4. విశల్య.

**పొత్తిక** (వై.వి.) : మెత్తని సన్నని చిన్న వస్త్రము. (స్వార్థమున కప్రత్యయము.)

**పొత్తికడుపు** (వై.వి.) : క్రీఁగడుపు, వస్తి.

**పొత్తిగడ్డ** (వై.వి.) : పొత్తి, విశల్య.

**పొత్తిచీర** (వై.వి.) : నారచీర. (చూ. పసిఁడి పురుగు.)

**పొత్తిదామర** (వై.వి.) : (పొత్తి + తామర) ముడుఁగు దామర, నమస్కారి.

**పొత్తినూలికాయ** (ద్వ.వి.) : (పొత్తి నూలు + కాయ) పొత్తినూలి గూఁడు.

**పొత్తినూలు** (ద్వ.వి.) : పట్టుపురుగు నేసెడు పట్టునూలు. (చూ. పుర్వు.)

**పొత్తు** (దే.వి.) : 1. స్నేహము; 2. సంగతి; 3.అవిభక్తత; 4.ఉమ్మడి; (విణ.) : 1. స్నేహితము; 2. సంగతము.

**పొత్తుకత్తె** (ద్వ.విణ.) : స్నేహితురాలు.

**పొత్తుకాఁడు** (దే.విణ.) : స్నేహితుఁడు.

**పొత్తుగుడుపు** (దే.వి.) : (పొత్తు+కుడుపు) సహ భోజనము, సజగ్ధి.

**పొత్తువు** (వై.వి.) : సరస్వతి.

**పొత్తుసేయు** (ద్వ.అ.క్రి.) : (పొత్తు+చేయు) స్నేహించు.

**పొత్తెము** (దే.వి.) : గరిడీసాల యందు క్రింద పఱచెడి యెఱ్ఱమన్ను.

**పొత్రము** (వై.వి.) : పొత్తరము యొక్క రూపాంతరము.

**పొద** (దే.వి.) : ఒకటితోనొకటి పెనఁ గొన్న బోదెలేని చిన్న చెట్లగుంపు, గుల్మిని.

**పొదక** (దే.వి.) : పెద్దయెలుఁగు, పెద్దగొంతు.

**పొదడు** (దే.విణ.) : పొట్టివాఁడు, వామనుఁడు.

**పొదరిండ్లచుక్క** (ద్వ.వి.) : పునర్వసు నక్షత్రము.

**పొదరిల్లు** (దే.వి.) : (పొదరు + ఇల్లు) ఇంటివలె నుండు పొద, నికుంజము. (రూ. పొదరుటిల్లు.)

**పొదరు** (దే.వి.) : పొద.

**పొదలాడు** (దే.అ.క్రి.) : (పొదలి + ఆడు) పొదలు, వర్ధిల్లు. (మొదటి రూపము పొదలి యాడు. చూ. ఊఁగాడు.)

**పొదలిక** (దే.వి.) : పెంపు, వర్ధనము.

**పొదలు** (దే.అ.క్రి.) : పెరుఁగు, వర్ధిల్లు.

**పొదలుకొను** (దే.అ.క్రి.) : 1. పెరుఁగు; 2. బలియు. (స్వార్థమునకొను.)

**పొదవెట్టు** (దే.స.క్రి.) : 1. సూచించు; 2. ఆరోపించు.

**పొది** (దే.వి.) : 1. పొదుఁగు; 2. భారము; 3. అమ్ములపొది, తూణము; 4. సమూహము; 5. మంగలవాని అడపము.

**పొదికట్టు** (దే.వి.) : వాకిటిముందరి పంచపాక.

**పొదిగిలి** (దే.వి.) : ప్రక్కకు సందిటికిని నడిమి భాగము.

**పొదిగొను** (దే.అ.క్రి.) : (పొది + కొను) గుంపుగూడు.

**పొదిటి** (దే.విణ.) : పొదడు, పొట్టి.

**పొదుఁగు** (దే.వి.) : ఆవులోనగువానికి పాలుండెడు చోటు, ఊధము.

**పొదుఁగుచేయు** (ద్వ.అ.క్రి.) : (ఆవు లోనగునది యీనబోవు సమయమున) పెద్ద పొదుఁగు గలది యగు. (ఆవు పొదుఁగు చేసినది.)

**పొదుక** (దే.వి.) : పొది, భారము. (స్వార్థమున ఉక.)

**పొదుగు** (దే.స.క్రి.) : 1.క్రమ్ము; 2. (రత్నములు లోనగువాని) చెక్కు; 3.కప్పు (చూ. నూఁగుడు.); 4. పక్షులు గ్రుడ్లను ఱెక్కలతో కప్పు. (వి.) : పొత్తిగుడ్డ. (అని ఒకచో వ్రాయఁబడి యున్నది.)

**పొదుగుడు** (దే.వి.) : కప్పుడు.

**పొదుపు** (దే.వి.) : వృద్ధి.

**పొదురు** (దే.అ.క్రి.) : పూచు, (ప్రే. పొదిరించు.)

**పొదువు** (దే.అ.క్రి.) : కవియు. (స.క్రి.) : 1.క్రమ్ము; 2.(రత్నములులోనగువాని) చెక్కు; 3. కప్పు (చూ. నూఁగుడు.); 4. పక్షులు గ్రుడ్లను ఱెక్కలతో కప్పు. 1.కప్పుడు; (పొదుగు యొక్క రూపాంతరము); 2. ఊధము (పొదుఁగు యొక్క రూపాంతరము)

**పొద్దు** (వై.వి.) : ప్రొద్దు యొక్క రూపాంతరము. (కాలమునకు.)

**పొన** (దే.విశ.) : దృగ్గోచరమైనది. (ఆమ్రేడితము నందు పొనపొన.)

**పొనరారు** (దే.అ.క్రి.) : (పొనరు + ఆరు) ఒప్పు.

**పొనరు** (దే.అ.క్రి.) : 1.ఆగు; 2. పొసఁగు. (వి.) : 1.పొందిక; 2. ఇంపు. (ఒనరునకు మొదటి రూపము. చూ. ఒనరు.)

**పొనరుచేు** (దే.ప్రే.) : (పొనరఁ జేయు) 1. కావించు (చూ. కైకొను); 2. పొసఁగించు. (రూ. పొనర్చు. కావించుటకు.)

**పొనరువడు** (ద్వ.అ.క్రి.) : (పొనరు + పడు) పొందుపడు.

**పొనలు** (దే.అ.క్రి.) : దగదగమందు.

**పొనిక** (దే.వి.) : ముంజిగడ్డి.

**పొనుఁగు** (దే.వి.) : తృణవిశేషము. (విశ.) : 1. నిస్తేజము; 2. పొట్టి.

**పొనుఁగు చేప** (దే.వి.) : మత్స్య విశేషము.

**పొనుఁగువడు** (దే.అ.క్రి.) : (పొనుఁగు + పడు) 1. నిస్తేజమగు; 2. నశించు; 3. శూన్యమగు.

**పొనుపడు** (ద్వ.అ.క్రి.) : 1.నిస్తేజమగు; 2.వ్యర్థ మగు; 3. ఉడుగు. (పొనుఁగువడు యొక్క రూపాంతరము.)

**పొనుపు** (దే.వి.) : పరాక్రమము. (రూ. పొంపు.)

**పొన్న** (యు.దే.విశ.) : దృగ్గోచరమైనది. (పొన యొక్క రూపాంతరము.) (వై.వి.) : పున్నాగము.

**పొన్నంగి** (దే.వి.) : పక్షివిశేషము.

**పొన్నగంటి** (దే.వి.) : ఒక దినుసు కూరాకు, మత్స్యాక్షి.

**పొన్నట్టు** (దే.వి.) : అబక, చట్టువము.

**పొన్నరి** (దే.విశ.) : పొన్నారి యొక్క రూపాంతరము.

**పొన్నాడ** (దే.వి.) : ఒక దినుసు చిఱుతపులి.

**పొన్నారి** (దే.విశ.) : మనోజ్ఞము. (చిన్నారి, పొన్నరి అను పదములు వేఱు వేఱుగా ప్రయోగింపఁబడియుండుట వలన ఇదియును వేఱుగా వ్రాయఁ బడినది.)

**పొన్ను** (దే.వి.) : 1. బంగారు; 2. రోఁకలి మొదలగు వాని మొనను వేసెడు లోహ వలయము, శంబరము.

**పొన్పడు** (ద్వ.అ.క్రి.) : పొనుపడు యొక్క రూపాంతరము. (నిస్తేజమగుటకు.)

**పొమ్ము** (దే.క్రి.) : నిశ్చయమును దెలుపునది. (చూ. పొడువ.)

**పొయి** (దే.వి.) : పొయ్యి యొక్క రూపాంతరము.

**పొయ్యి** (దే.వి.) : ప్రొయ్యి యొక్క రూపాంతరము.

**పొర** (దే.వి.) : 1. అరఁటిలోనగువాని యావరణ విశేషము; 2. నేత్రరోగ విశేషము; 3.పాము యొక్క కుబుసము; 4. కపటము; 5. మడత; 6. ప్రమాదము.

**పొరఁటు** (దే.స.క్రి. కూరాకునీళ్లిగుర పొర్లించి వండు.

**పొరక** (దే.వి.) : 1. (గడ్డి) పోఁచ; 2. ఈనపుడక; 3. చీఁపురుకట్ట.

**పొరకచేప** (దే.వి.) : మత్స్యవిశేషము.

**పొరకటి** (దే.వి.) : వాకిటిచేరువగోడ.

**పొరకసుడి** (దే.వి.) : ఎద్దులు లోనగువాని మీది యొక దినుసు తప్పుసుడి.

**పొరచి** (దే.వి.) : చేబదులుగా అడిగి తెచ్చుకొన్న ధనాధికము.

**పొరట** (వై.వి.) : పుస్తకపు పత్రము యొక్క ఒక ప్రక్క

**పొరపడు** (ద్వ.అ.క్రి.) : ప్రమాదపడు.

**పొరపాటు** (ద్వ.వి.) : పొరపడుట, ప్రమాదము.

**పొరపు** (దే.వి.) : భేదము.

**పొరపోవు** (దే.అ.క్రి.) : పొరదారి నెక్కు. (నీళ్లు త్రాగితిని, పొరపోయినది.)

**పొరయు** (దే.అ.క్రి.) : 1. కలుగు; 2. పొంచు. (స.క్రి.) : పొందు.

**పొరలఁబడు** (ద్వ.అ.క్రి.) : (పొరలన్ + పడు) పొరలు. (స్వార్థమున పడు.)

**పొరలాట** (దే.వి.) : పొరలాడుట.

**పొరలాడు** (దే.అ.క్రి.) : (పొరలి + ఆడు) పొరలు. (మొదటి రూపము పొరలియాడు.) (చూ. జరగు, ఊఁగాడు.)

**పొరలిక** (దే.వి.) : పొరలుట, లుఠనము.

**పొరలు** (దే.అ.క్రి.) : 1. పొర్లు; 2. ప్రవర్తిల్లు; (వి.) : పొరలిక.

**పొరలుచే** (దే.ప్రే.) : (పొరలఁ జేయు) పొరలించు. (రూ. పొరల్చు.)

**పొరలుదండము** (దే.వి.) : పొరలుచు పెట్టెడు దండము.

**పొరలువెట్టు** దే.అ.క్రి. (పొరలు+పెట్టు) పొరలు.

**పొరి** (వై.వి.) : పొలియొక్క రూపాంత రము. (చూ. పొరిగొను. మొ.) (ద్ర.క్రి. విశ.) : 1.అత్యంతము; 2. దృఢముగా; 3. క్రమముగా; 4. మాటికి.

**పొరిగొను** (ద్వ.స.క్రి.) : (పొరి+కొను) 1. చంపు; 2. నాశము చేయు.

**పొరిచూపు** (దే.వి.) : 1. ఉగ్రదృష్టి; 2. భేదదృష్టి.

**పొరిమారుచే** (దే.ప్రే.) : చంపు. (రూ. పొరి మార్చు.)(పొరిమాలుచు యొక్క రూపాం తరము.)

**పొరిమాలు** (దే.అ.క్రి.) : చచ్చు.

**పొరిమాలుచే** (దే.ప్రే.) : పొరిమాలఁ జేయు. (రూ. పొరిమాల్చు.)

**పొరిపుచ్చే** (దే.ప్రే.) : (పొరివోవఁ జేయు.) చంపు.

**పొరివోవు** (దే.అ.క్రి.) : (పొరి + పోవు) చచ్చు.

**పొరుగు** (దే.వి.) : 1. ప్రక్క; (వీఁడు నాపొరుగున ఉన్నాఁడు.) 2. ఇరుగునకు ప్రక్క; 3. సమీపము.

**పొరువు** (దే.వి.) : పొరుగు యొక్క రూపాంతరము. (సమీపమునకు.)

**పొర్గు** (దే.వి.) : పొరుగు యొక్క రూపాంతరము. (సమీపమునకు.)

**పొర్లాడు** (దే.అ.క్రి.) : పొరలాడు యొక్క రూపాంతరము.

**పొర్లిక** (దే.వి.) : పొరలిక యొక్క రూపాంతరము.

**పొర్లు** (దే.అ.క్రి.) : 1. పొర్లాడు; 2. పశు మిథునము కూడు. (పొరలు యొక్క రూపాం తరము.)

**పొర్లుకట్ట** (దే.వి.) : వెల్లువపొరలిరాక అడ్డముగా వేసెడు కట్ట.

**పొర్లుగాడి** (దే.వి.) : క్రోష్టుపుచ్ఛిక.

**పొఱడు** (దే.వి.) : గూను.

**పొఱడువోవు** (దే.అ.క్రి.) : (పొఱడు + పోవు) గూనుపడు. (చూ. పొఱడు.)

**పొఱయు** (దే.స.క్రి.) : పొరయు, పొందు.

**పొఱిపుచ్చు** (దే.ప్రే.) : (పొఱివోవఁ జేయు) కలఁచు. (చూ. పొఱివోవు.)

**పొఱివోవు** (దే.అ.క్రి.) : (పొఱి + పోవు) కలగు.

**పొల** (యు.దే.విశ.) : అల్ల. (చూ. డబడబ.) (వై.వి.) : 1. మాంసము; 2. మాంసపు దుర్గంధము; 3. చేఁప మీది పొట్టు, శల్కము.

**పొలఁకు** (దే.వి.) : తృణశ్రేణి.

**పొలఁతి** (దే.వి.) : ఆఁడుది, ఇంతి.

**పొలఁతుక** (దే.వి.) : ఆఁడుది, ఇంతి. (స్వార్థమున ఉక.)

**పొలకు** (దే.వి.) : కట్వంగఫలము. (అప్ర.)

**పొలకువ** (దే.వి.) : జాడ, పోబడి.

**పొలదిండి** (ద్వ.వి.) : (పొల+తిండి) రాక్షసుఁడు, క్రవ్యాదుఁడు. (ఇట్లు పొలమేఁతరి, పొలమేపరి.)

**పొలపము** (దే.వి.) : 1.వ్యాపనము; 2.వాసన; 3.ప్రకాశము; (విశ.) : వ్యాప్తము. (పొలము గానని యర్థము)

**పొలపరి** (దే.విశ.) : (పొలము+అరి) జాడ తెలిసిన వాఁడు. (సంధియందు వర్ణాగమ విశేష మని యెఱుంగునది.)

**పొలపొల** (దే.వి.) : పొక్కుట యందగు ననుకరణము.

**పొలమరి** (దే.వి.) : (పొలము + అరి) పొలముకాఁపు. (విణ.) : జాడ తెలిసినవాఁడు.

**పొలమారు** (దే.అ.క్రి.) : ప్రమాదపడు. (చూ. పొలమార్చు.)

**పొలమార్చే** (దే.ప్రే.) : పొలమార జేయు.

**పొలము** (దే.వి.) : 1. పైరుపట్టునేల (చూ. దొరలు.); 2. వరిపైరు పెట్టునేల (చూ. కలను); 3.పసులుమేయు కంచె; 4.అడవి; 5. ప్రదేశము; 6.ఊరు; 7.జాడ; 8.విధము.

**పొలముపాటు** (ద్వ.వి.) : పైరుపెట్టుట, కృషి.

**పొలయలుక** (దే.వి.) : (పొల్ల + అలుక) (చూ. ప్రణయ కోపము.)

**పొలయిక** (దే.వి.) : 1. సంచారము; 2. వ్యాపనము.

**పొలయు** (దే.అ.క్రి.) : 1. సంచరించు; 2. వ్యాపించు; 3. సమీపించు; 4. ప్రవేశించు.

**పొలస** (దే.వి.) : మత్స్యవిశేషము. (అప్ర.)

**పొలసాడు** (దే.అ.క్రి.) : (పొలసి + ఆడు) సంచరించు. (మొదటి రూపము పొలసియాడు. చూ. ఊఁగాడు.)

**పొలసు** (వై.వి.) : 1.మాంసము; 2. మాంసపు దుర్గంధము; 3. చేపమీఁది పొట్టు, శుల్కము.

**పొలుసుదిండి** (ద్వ.వి.) : (పొలుసు + తిండి) పొలదిండి, క్రవ్యాదుఁడు. (ఇట్లు పొలసు మేపరి. మొ.)

**పొలి** (యు.దే.వి.) : 1. లాభము (పొలి గలుగు); 2. నష్టి (పొలివోవు.) (వై.) : బలి. (పొలిమేర.)

**పొలికలను** (ద్వ.వి.) : యుద్ధభూమి.

**పొలిమేర** (వై.వి.) : గ్రామద్వయ మధ్యసీమ, ఎల్ల.

**పొలియిక** (దే.వి.) : 1. నాశము; 2. మరణము.

**పొలియు** (దే.అ.క్రి.) : 1. చెడు; 2. చచ్చు.

**పొలివుచ్చు** (దే.ప్రే.) : పొలివోవఁ జేయు. (చంపుటకు.)

**పొలివెట్టు** (దే.వి.) : (పొలి+పెట్టు) గుడికేర్పఱిచిన స్థితి.

**పొలివోవు** (దే.అ.క్రి.) : (పొలి + పోవు) 1.చచ్చు; 2.చెడు; 3.వ్యర్థమగు; 4.భంగపడు; 5.ఉడుగు.

**పొలుచే** (దే.అ.క్రి.) : 1. ప్రత్యక్షమగు; 2. కనఁబడు; (పొడుచు యొక్క రూపాంతరము) 3.ఒప్పు; 4. స్థిర మగు. (రూ. పొల్చు.)

**పొలునోరు** (దే.వి.) : (పొర్లు+నోరు) వంకరనోరు.

**పొలుపారు** (దే.అ.క్రి.) : (పొలుపు + ఆరు) ఒప్పారు. (రూ. పొల్పారు.) (ఇట్లు పొలు పొందు. మొ.)

**పొలుపు** (దే.వి.) : 1. ఒప్పు; 2. విధము; 3. స్థైర్యము; (విణ.) : స్థిరము. (రూ. పొల్పు.)

**పొలువ** (దే.విణ.) : పొడువ యొక్క రూపాంతరము.

**పొలువడు** (ద్వ.అ.క్రి.) : తఱుఁగు, క్షయించు. (చూ.నేయి.) (పొల్లువడు యొక్క రూపాంతరము.)

**పొల్తి** (దే.వి.) : పొలఁతి యొక్క రూపాంతరము.

**పొల్తుక** (దే.వి.) : పొలఁతుక యొక్క రూపాంతరము.

**పొల్ల** (వై.వి.) : బొత్తిగా గింజపట్టని ధాన్యము. (విణ.) : 1. వ్యర్థము, వ్యర్థుఁడు. (చూ. పొగడిత, పఱగడ.); 2. త్రోపుడైనది.

**పొల్లవడు** (వై.అ.క్రి.) : (పొల్లు+పడు) 1. వ్యర్థ మగు; 2. క్షయించు.

**పొల్లవుచ్చు** (ద్వ.ప్రే.) : పొల్లవోవఁ జేయు.

**పొల్లవోవు** (ద్వ.అ.క్రి.) : (పొల్ల+పోవు) పొల్లవడు.

**పొల్లు** (వై.వి.) : 1. బొత్తిగా గింజపట్టని ధాన్యము; 2. నిరర్థక శబ్దము; (వి.ణ.) : వ్యర్థము.

**పొల్లుఁదనము** (వై.వి.) : (పొల్లు+తనము) అపౌరుషము.

**పొల్లువడు** (వై.అ.క్రి.) : 1. క్షయించు (చూ. పొలువడు.); 2. వ్యర్థమగు.

**పొవ** (దే.వి.) : పొగ యొక్క రూపాంతరము.

**పొవడ** (వై.వి.) : పొగడ యొక్క రూపాంతరము.

**పొవడు** (దే.స.క్రి.వి.) : పొగడు యొక్క రూపాంతరము.

**పొవయు** (దే.అ.క్రి.) : పొగయు యొక్క రూపాంతరము. (చూ. నెవయు.)

**బోటు** (వై.వి.) : కొండ మొదలగువాని యందు ఉబ్బుగానుండు చోటు. (విణ.) : 1. ప్రౌఢుఁడు; 2. ధూర్తుఁడు.

**బోటు** (ఆం.వి.) : పడవ.

**బోడ** (దే.వి.) : 1. సన్యాసి; (చూ. నాన గండ) 2. మ్రోడు. (విణ.) : బోడిది, బోడివాఁడు (చూ. బుఙ్ఞకాయ.)

**బోడఁడు** (దే.విణ.) : బోడివాఁడు, ముండితుఁడు.

**బోడతరము** (దే.వి.) : ఒకానొకచెట్టు, ముండిని.

**బోడసరము** (దే.వి.) : బొడ్డసరమునకు మొదటి రూపము.

**బోడి** (దే.విణ.) : మొండితనము, ముండితుఁడు.

**బోడించు** (దే.స.క్రి.) : బోడిచేయు.

**బోడింపు** (దే.వి.) : బోడించుట. (చూ. ఆరగింపు)

**బోడిక** (దే.వి.) : 1. సేవకుఁడు; 2. బాలకుఁడు.

**బోడు** (దే.విణ.) : బోడయైనది, బోడ.

**బోణి** (దే.వి.) : మొట్టమొదట సరకు అమ్మఁగా వచ్చిన సొమ్ము.

**బోద** (వై.వి.) : పక్షిలోనగువాని పిల్ల. (ఉదా : అంచబోద, లేటిబోద, ఎలుక బోద) (ఇక్కడ పోఁకబోద అనఁగా లేఁతపోఁకయని యర్థము.)

**బోదన** (వై.వి.) : దుర్బోధనము. (రూ. బోధాయనము.)

**బోదియ** (దే.వి.) : 1. అడుగునుండి కొమ్మల మొదళ్ల పర్యంతము గల వృక్ష భాగము, ప్రకాండము; 2. స్తంభము మీఁది ఆవయవ విశేషము.

**బోదు** (దే.వి.) : 1. సాగరము మోసెడి యెద్దుగంత; 2. గోము.

**బోదె** (దే.వి.) : 1. బోదియ, ప్రకాండము; 2. స్తంభము మీఁది ఆవయవ విశేషము. (బోదియ యొక్క రూపాంతరము.) 3. మిరెప చేను లోనగు వానియందు ఈవలావల కాలువ లేర్పఱచిన కట్ట.

**బోదెకొయ్య** (దే.వి.) : కడపక్రిందికమ్మి.

**బోధకరుఁడు** (సం.వి.అ.పుం.) : వేకువను రాజుల నిద్ర మేల్కొలి పెడువాఁడు, వైతాళికుఁడు.

**బోధకుఁడు** (సం.వి.అ.పుం.) : ఉపాధ్యాయుఁడు. (విణ.) : బోధించువాఁడు.

**బోధచేయు** (మి.స.క్రి.) : బోధించు.

**బోధనము** (సం.వి.అ.న.): బోధించుట, కఱపుట.

**బోధనీయము** (సం.విణ.) : (అ.ఆ.అ.) బోధింపఁదగినది.

**బోధపడు** (మి.అ.క్రి.) : ఆకళింతకువచ్చు.

**బోధము** (సం.వి.అ.పుం.) : తెలివి, జ్ఞానము.

**బోధి** (సం.వి.ఇ.పుం.) : 1. రావి; 2. సమాధి విశేషము.

**బోధించే** (సం.స.క్రి.) : తెలియఁజేయు, కఱపు.

**బోధితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) బోధింపఁ బడినవాఁడు.

**బోధ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) బోధనీయము.

**బోనకత్తియ** (వై.వి.) : (బోనము + కత్తియ) అన్నము చేసిపెట్టునది (రూ. బోనకత్తె.)

**బోనకాఁడు** (ద్వ.వి.) : (బోనము + కాఁడు) అన్నము చేసిపెట్టువాఁడు.

**బోనము** (వై.వి.) : 1. భోజనము; 2. అన్నము. (వృత్తియందంత్య వర్ణ లోపము. ఉదా. బోన కావడి, బోన పుట్టుక. మొ.)

**బోనముకత్తె** (వై.వి.) : బోనకత్తె.

**బోనముపెట్టె** (వై.వి.) : తోలుకప్పిన గుండ్రని పెట్టె.

**బోను** (దే.వి.) : 1.మృగములు లోనగు వానిని పట్టెడు కపట యంత్రము; 2. పెంపుడు మృగము లుండుటకై చుట్టు కమ్ములమర్చి చేసిన ఒక విధమైన పెట్టె లోనగునది.

**బోనుపొయ్యి** (దే.వి.) : అటునిటు తీసికొనిపోఁ దగిన మంటిపొయ్యి.

**బోము** (దే.వి.) : బలవంతము, బలాత్కారము.

**బోయ** (దే.వి.) : 1. కిరాతుఁడు; 2. కైవర్తుఁడు.

**బోయఁడు** (దే.వి.) : బోయవాఁడు. (బోయ యొక్క రూపాంతరము.)

**బోయత** (దే.వి.) : బోయది. (కిరాతస్త్రీకి.)

**బోయి** (దే.వి.) : బోయీ యొక్క రూపాంతరము.

**బోయీా** (దే.వి.) : పల్లకి మోచువాఁడు, బెస్త.

**బోయీాఁడు** (దే.వి.) : బోయి (స్వార్థమున ఈఁడు)

**బోయెత** (దే.వి.) : బోయత యొక్క రూపాంతరము.

**బోర** (దే.వి.) : ఱొమ్ము, అక్కు, ఎద, వక్షము.

**బోరగించే** (దే.ప్రే.) : బోరగిల్లఁజేయు.

**బోరగిల్లు** (దే.అ.క్రి.) : 1. ఱొమ్ము భూమినాను; 2. ఱొమ్ము భూమి నానఁ బరుండు. (రూ. బోరగిలు ఱొమ్ము భూమినానుటకు. ఱొమ్ము భూమినానఁ బరుండుటకు.) (ఇక్కడ భూమి యను నది పఱపులోనగు వానికిని ఉప లక్షణము.)

**బోరన** (దే.ద్ర.క్రి.విణ.) : శీఘ్రముగా.

**బోరప్రాఁకుడు** (దే.వి.) : పాము, ఉరగము.

**బోరు** (దే.వి.) : వానకురియుట యందగు ధ్వన్యను కరణము. (వాన బోరున కురియు చున్నది.) (విణ.) : పెద్ద. (ఉదా. బోరు తలుపులు. మొ.)

**బోరుకలఁగు** (దే.అ.క్రి.) : మ్రోఁగు, ధ్వనించు. (ఒకానొక గ్రంథము నందు బోరుకల్గు అని ప్రయోగింపఁబడి యున్నది.)

**బోరుకాడించే** (దే.ప్రే.) : బోరుకాడఁ జేయు. (చూ. బోర్కాడించు.)

**బోరుకాడు** (దే.అ.క్రి.) : (బోరుక + ఆడు) స్నానముచేయు.

**బోరుకొను** (దే.అ.క్రి.) : బోరుకలఁగు, మ్రోఁగు.

**బోరుతలుపులు** (దే.వి.బ.) : నగరు లోనగువాని వాకిటి పెద్ద ఱెక్క తలుపులు.

**బోరువ** (ద్వ.వి.) : (బోరు+వా) ఒక దినుసు పెద్దగడ్డ.

**బోరెము** (దే.వి.) : దూది లోనగువాని మూట.

**బోరెంపోతు** (దే.ప్రే.) : తిండిపోతు, కొవ్వినవాఁడు.

**బోర్కాడించే** (దే.ప్రే.) : బోరుకాడించు యొక్క రూపాంతరము.

**బోర్కాడు** (దే.అ.క్రి.) : బోరుకాడు యొక్క రూపాం తరము.

**బోర్డు** (ఆం.వి.) : 1. కార్యనిర్వాహక సభ; 2. పెద్ద కొయ్యపలక.

**బోర్తలుపులు** (దే.వి.బ.) : బోరు తలుపులు యొక్క రూపాంతరము.

**బోలము** (సం.వి.అ.పుం.) : బాలెంత బోళము.

**బోలు** (దే.విణ.) : లోపల ఏమియు లేనిది.

**బోలె** (దే.వి.) : 1. ఓటికుండ; 2. కుండబొచ్చె.

**బోలెము** (దే.వి.) : వేగము. (చూ. నడగఁడు.)

**బోసి** (దే.వి.) : పండ్లులేనిది, బొక్కి.

**బోసివడు** (ద్వ.అ.క్రి.) : (బోసి + పడు) బోసివోవు.

**బోసివోవు** (దే.అ.క్రి.) : (బోసి + పోవు) బోసి యగు. (చూ. పొటము) (ప్రూ. బోసివుచ్చు.)

**బోసేయు** (వై.స.క్రి.) : (బోనము + చేయు) భుజించు.

**బోళము** (వై.వి.) : గంధరసము.

**బోళా** (వై.విణ.) : కపటములేని, దాపరములేని.



**బ్రక్క** (దే.విణ.) : దేనుఁడు. (బక్కకు మొదటి రూపము.)

**బ్రతుకు** (దే.అ.క్రి.) : జీవించు. (అ.వి.) : 1.జీవనము; 2.స్థితి. బ్రతుకుఁదెరువు. (దే. వి.) : (బ్రతుకు + తెరువు) జీవనోపాయము.

**బ్రదిమి** (దే.వి.) : జీవనము.

**బ్రదుకు** (దే.అ.క్రి.వి.) : బ్రతుకు యొక్క రూపాం తరము. (జీవించుటకు.) (చూ. ఎదరు. రెండవ అర్థముకడ.) జీవనమునకు.

**బ్రద్ద** (యు.దే.వి.) :1.తునక; 2. చీలిక. (వై.) : ప్రేమ. (చూ. కుప్పసము రెండవ అర్థము కడ.)

**బ్రద్దపరి** (ద్వ.వి.) : పేములతో నల్లిన కేడెము.

**బ్రద్దర** (ద్వ.వి.) : (బ్రద్ద+అర) 1.తునుక; 2.చీలిక.

**బ్రద్దలవారు** (ద్వ.వి.బ.) : వేత్రధరులు.

**బ్రధ్నము** (సం.వి.అ.పుం.) : వేరు, బుధ్నము.

**బ్రధ్నుఁడు** (సం.వి.అ.పుం.) : 1. సూర్యుఁడు; 2. శివుఁడు.

**బ్రమయు** (వై.అ.క్రి.) : భ్రమించు, బమ్మెరవోవు.

**బ్రమరిదిరుగు** (ద్వ.అ.క్రి.) : (బ్రమరి + తిరుగు) చుట్టివచ్చు.

**బ్రమరివాఱు** (దే.అ.క్రి.) : (బ్రమరి + పాఱు) బ్రమరి దిరుగు. (ఒకానొకచోట బ్రమరులు వాఱు అని ప్రయోగింపఁబడి యున్నది.)

**బ్రమ్మి** (వై.వి.) : సోమెద చెట్టు.

**బ్రల్లు** (దే.వి.) : కూలుటయందగు ధ్వన్యను కరణము. (బల్లు యొక్క మొదటి రూపము.)

**బ్రహ్మ** (సం.వి.న్.పుం.) : 1. నలువ; (నవబ్రహ్మలు. భృగువు, పులస్త్యుఁడు, పులహుఁడు, అంగిర సుఁడు, అత్రి, క్రతువు, దక్షుఁడు, వసిష్ఠుఁడు, మరీచి.) 2. విష్ణువు; 3. బ్రాహ్మణుఁడు; 4. ఒక ఋత్విజుఁడు. (చూ. ఋత్విజుఁడు) (న.ము.) : 1.పరమాత్మ; 2.వేదము; 3.తపము. (పుం.) : ఒక గ్రహ యోగము. (చూ. యోగము)

**బ్రహ్మచర్యము** (సం.వి.అ.న.) : ఆశ్రమ విశేషము. (చూ. ఆశ్రమము)

**బ్రహ్మచారి** (సం.వి.న్.పుం.) : ముంజి త్రాడు లోనగువాని ధరించి వేదము చదివి బ్రహ్మచర్య వ్రతము నందుండువాఁడు.

**బ్రహ్మణ్యము** (సం.వి.అ.పుం.) : గంగరావి. (విణ.) : బ్రాహ్మణ హితము.

**బ్రహ్మదర్భ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఒక దినుసు ఓమము.

**బ్రహ్మదారువు** (సం.వి.ఉ.న.) : గంగరావి.

**బ్రహ్మపుత్రము** (సం.వి.అ.పుం.) : 1. పడమర పాఱెడి యొక యేఱు; 2. విషభేదము.

**బ్రహ్మబంధువు** (సం.విణ.) : (ఉ.) 1. గుఱింపఁ బడువాఁడు; 2. దూఱఁ బడువాఁడు.

**బ్రహ్మబిందువు** (సం.వి.అ.పుం.) : వేదపాఠము నందలి నోటితుంపర.

**బ్రహ్మభూయము** (సం.వి.అ.న.) : బ్రహ్మత్వము.

**బ్రహ్మమేఖలము** (సం.వి.అ.పుం.) : బ్రహ్మచారులకు ముంజిగా ఉపయోగింపఁబడు తృణ విశేషము.

**బ్రహ్మయజ్ఞము** (సం.వి.అ.పుం.) : వేదపాఠము.

**బ్రహ్మరంధ్రము** (సం.వి.అ.న.) : నడునెత్తి, మాడపట్టు.

**బ్రహ్మరథము** (సం.వి.అ.పుం.) : మృతి పొందిన సన్యాసులను తీసికొనిపోయెడు వాహనము.

**బ్రహ్మవర్చసము** (సం.వి.అ.న.) : సదాచారాధ్యయన సమృద్ధి.

**బ్రహ్మవాది** (సం.వి.న్.పుం.) : వేదాంతి.

**బ్రహ్మసాయుజ్యము** (సం.వి.అ.న.) : బ్రహ్మత్వము.

**బ్రహ్మసువు** (సం.వి.ఊ.పుం.) : మన్మథుఁడు, మరుఁడు.

**బ్రహ్మసూత్రము** (సం.వి.అ.న.) : యజ్ఞోపవీతము.

**బ్రహ్మాంజలి** (సం.వి.ఇ.పుం.) : వేదాధ్యయన కాలము నందలి మ్రొక్కు.

**బ్రహ్మారణ్యము** (సం.వి.అ.న.) : వేద పాఠభూమి.

**బ్రహ్మావర్తము** (సం.వి.అ.పుం.) : ఢిల్లీకి వాయవ్య భాగమున నుండెడు దేశవిశేషము.

**బ్రహ్మాసనము** (సం.వి.అ.న.) : ధ్యానోపాయ భూతమైన పద్మ స్వస్తిక దండాద్యాసనము.



**బ్రాఁతి** (దే.వి.) : ప్రేమ. (విణ.) : 1. అధికము; 2. దుర్లభము; 3. ప్రియము.

**బ్రాంది** (ఆం.వి.) : ఒక విధమైన మద్యము.

**బ్రాహ్మణబ్రువుఁడు** (సం.వి.అ.పుం.) : జాతిమాత్రోప జీవియైన బ్రాహ్మణుఁడు.

**బ్రాహ్మణము** (సం.వి.అ.న.) : 1. బ్రాహ్మణ సమూహము; 2. వేద భాగము.

**బ్రాహ్మణాయనుఁడు** (సం.వి.అ.పుం.) : విద్వాం సుఁడును సత్కర్మపరుఁడునైన వంశకర్తవలనఁ బుట్టిన విప్రుఁడు.

**బ్రాహ్మణార్థము** (సం.వి.) : పితృ కార్యముల యందు భోజనమునకుఁ బోవుట.

**బ్రాహ్మణి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. బ్రాహ్మణుని భార్య; 2. నలికండ్ల పాము; 3. చిఱుతేఁకు.

**బ్రాహ్మణుఁడు** (సం.వి.అ.పుం.) : పాఱుఁడు.

**బ్రాహ్మణ్యము** (సం.వి.అ.న.) : 1. బ్రాహ్మణ సమూహము; 2. బ్రాహ్మణ భావము; 3. బ్రాహ్మణ కర్మము. (పుం. డు.) : శని.

**బ్రాహ్మము** (సం.వి.అ.న.) : పెద్దవ్రేలి మొదట నుండెడు బ్రహ్మతీర్థము. (పుం.) : విద్యయు

నాచారముఁ గల వరునిఁ దానే పిలిచి వధూసహితముగ వస్త్రాదులచే నలంకరించి పూజించి కన్యనిచ్చి చేయు వివాహము. (చూ. వివాహము) (విణ.) : బ్రహ్మ సంబంధమైనది.

**బ్రాహ్మణయష్టిక** (సం.వి.ఆ.స్త్రీ.) : చిఱుతేఁకు, బారంగి.

**బ్రాహ్మి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. ఒక మాతృక; (చూ. మాతృక.) 2. సరస్వతి; 3. బాఁపనచీమ; 4.పొన్నగంటికూర; 5.బారంగి; 6. సోమెదకూర.

## బ్రు

**బ్రుంగు** (దే.అ.క్రి.) : 1. పూఁదు; 2. మఱుఁగు; 3. మునుఁగు.

**బ్రుంగుడు** (దే.విణ.) : 1.మఱిఁగినది; 2. మునిఁగినది.

**బ్రుంగుడువడు** (ద్వ.అ.క్రి.) : (బ్రుంగుడు + పడు) మఱుఁగుపడు.

**బ్రుంగుడువాటు** (ద్వ.వి.) : బ్రుంగుడు వడుట.

**బ్రుంగువడు** (ద్వ.అ.క్రి.) : మగ్గమగు. (బ్రుంగుడు వడు యొక్క మాఱు రూపము.)

**బ్రుంచు** (దే.ప్రే.) : బ్రుంగఁజేయు.

**బ్రుయ్యు** (దే.అ.క్రి.) : నశించు.

**బ్రుసి** (సం.వి.ఈ.స్త్రీ.) : వ్రతుల ఆసనము, (రూ. బ్రుషి.)

## బ్లా

**బ్లాంకెటు** (ఆం.వి.) : బనాతుపచ్చడము.

## భ

**భ** : ఒక అక్షరము.

**భంగ** (సం.వి.ఆ.స్త్రీ.) : జనపవిత్తులు. (అ. పుం. ము.) : 1. చెఱుపు; 2. అల; 3. అవమానము; 4.రోగము; 5. రోగవిశేషము.

**భంగపడు** (మి.అ.క్రి.) : (భంగము + పడు) అవమానపడు.

**భంగపాటు** (మి.వి.) : భంగపడుట.

**భంగపెట్టు** (మి.స.క్రి.) : (భంగము + పెట్టు) భంగపఱుచు.

**భంగి** (సం.వి.ఇ.ఈ.స్త్రీ.) : విధము. (ఈ.స్త్రీ.) : 1. భంగము; 2. గంజాయి.

**భంగించే** (సం.స.క్రి.) : భంగపఱచు.

**భంగురము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. నశించునది; 2. వంకరైనది.

**భంగ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) భంగలు పండునది. (పొలము.)

**భంజకము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విఱుచునది.

**భంజనము** (సం.వి.అ.న.) : విఱుపు.

**భంజళి** (సం.వి.ఈ.స్త్రీ.) : పామువలె వంకరగా పోయెడి అశ్వగతి విశేషము. (రూ. భంజళిక. (ఆ.స్త్రీ.) (చూ. మురళి.)

**భంజించు** (సం.స.క్రి.) : విఱుచు.

**భంజిక** (సం.వి.ఆ.స్త్రీ.) : చిఱుతేఁకు.

**భంటాకి** (సం.వి.ఈ.స్త్రీ.) : ములక.

**భండనము** (సం.వి.అ.న.) : 1. యుద్ధము; 2. కవచము; 3. దుశ్చేష్ట.

**భండారము** (సం.వి.అ.పుం.) : బొక్కసము.

**భండించు** (సం.అ.క్రి.) : బండాటలాడు.

**భండీరము** (సం.వి.అ.పుం.) : 1. దిరిసెనము; 2. చిట్టికూర.

**భండీరి** (సం.వి.ఈ.స్త్రీ.) : మంజిటి.

**భండుఁడు** (సం.వి.అ.పుం.) : దుశ్చేష్టుఁడు, ఆకతాయి.

**భంబు** (సం.వి.అ.న.) : 1.నక్షత్రము; 2.ఆకాశము. (పు.) : కిరణము. (చూ. కంబు.)

**భక్తము** (సం.వి.అ.న.) : అన్నము. (విణ.) : భాగింపఁబడినది.

**భక్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. సేవ; (ఇది అష్టవిధము. భాగవత వాత్సల్యము, భగవత్పూజ యందను మోదము, భగవదర్చన, భగవద్విషయము నంద దంభము, భగవత్కథాశ్రవణేచ్ఛ, స్వర నేత్రాంగ వికారము, సదా భగవదను స్మరణము, అమాంస భక్షణము. భక్తి లక్షణము నవ విధము. శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవ, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము,

ఆత్మనివేదనము.) 2. భయముతోఁ గూడిన స్నేహము; 3. భాగము.

**భక్తుఁడు** (సం.వి.అ.పుం.) : భక్తి గలవాఁడు, డింగరీఁడు.

**భక్షకుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) తిండిపోతు.

**భక్షణము** (సం.వి.అ.న.) : భక్షించుట, తిండి.

**భక్షణీయము** (సం.విణ.) : (అ.ఆ.అ.) భక్ష్యము.

**భక్షించే** (సం.స.క్రి.) : భక్షణము చేయు, తిను.

**భక్షితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) భక్షింపఁ బడినది.

**భక్ష్యకారుఁడు** (సం.విణ.) : (అ.ఈ.అ.) పిండి వంటవాఁడు. (రూ. భక్ష్యం కారుఁడు.)

**భక్ష్యము** (సం.వి.అ.న.) : తినుబండము. (పంచ భక్ష్యములు. భక్ష్యము, భోజ్యము, లేహ్యము, చోష్యము, పానీయము.)(విణ.) : తినఁదగినది.

**భగందరము** (సం.వి.అ.పుం.) : మర్మస్థానము నందలి వ్రణము.

**భగము** (సం.వి.అ.పుం,న.) : 1.శ్రీ; 2.వీర్యము; 3.ఇచ్ఛ; 4.జ్ఞానము; 5.వైరాగ్యము; 6.కీర్తి; 7.మహాత్మ్యము; 8.ఐశ్వర్యము; 9.యత్నము; 10.ధర్మము; 11. మోక్షము; 12.యోని. (పుం.డు.) : ద్వాదశాదిత్యులలో నొకఁడు. (చూ. ఆదిత్యుఁడు.) భగవంతుఁడు (సం. వి.త్. పుం.) : 1. విష్ణువు; 2. శివుఁడు; 3. బుద్ధ దేవుఁడు. (విణ.) పూజ్యుఁడు. (రూ. భగవానుఁడు.)

**భగవతి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1.సరస్వతి; 2.పార్వతి; 3. గంగ. (విణ.) : పూజ్యురాలు.

**భగిని** (సం.వి.ఈ.స్త్రీ.) : తోడఁబుట్టినది.

**భగ్నము** (సం.విణ.) : (అ.ఆ.అ.) భంగము నొందినది.

**భజనము** (సం.వి.అ.న.) : 1. సేవించుట; 2. భాగించుట.

**భజమానము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1.సేవించు నది; 2.భాగించునది; 3.న్యాయముతోఁ గూడినది.

**భజించే** (సం.స.క్రి.) : 1. సేవించు; 2. భాగించు. (సంభజించు అనియు.)

**భజిష్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. సేవింప దగినది; 2. భాగింపదగినది.

**భటము** (సం.వి.అ.పుం.) : దినము యొక్క పదునేనవ భాగము. (చూ. దినము.)

**భటిత్రము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఇనుప సలాకకు గ్రుచ్చి కాల్చినది. (కఱకుట్లు.)

**భటుఁడు** (సం.వి.అ.పుం.) : 1. కాలిబంటు; 2. పనివాఁడు.

**భట్టారకుఁడు** (సం.వి.అ.పుం.) : 1. (నాట్య పరి భాష యందు) రాజు; 2. ముని; 3.సూర్యుఁడు.

**భట్టిని** (సం.వి.ఈ.స్త్రీ.) : 1.(నాట్య పరిభాష యందు) రాజుపెండ్లాము; 2. బ్రాహ్మణుని పెండ్లాము.

**భట్టుఁడు** (సం.వి.అ.పుం.) : బట్టువాఁడు. అభినయదర్పణము.

**భద్ర** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. తిథివిశేషము; (చూ. తిథి.) 2. కృష్ణుని అష్ట మహిషులలో నొకతె; 3. గంగానది. (అ.న.ము.) : 1.శుభము; 2.బంగారు; 3.నాగముస్తె. (స్త్రీ,న.) : ఒక కరణము. (చూ.కరణము) (పుం.) : 1. గజ జాతి విశేషము; (చూ.గజము) (ఈ జాతి గజము శుభకార్యముల యందు పుర ప్రచార యోగ్యమైనది.) 2. ఎద్దు; 3. కాటుక పిట్ట. (డు.) : 1. వీరభద్రుఁడు; 2. పురుష జాతి విశేషము. (చూ. పురుషుఁడు.) (విణ.) : 1. శుభకరము; 2.శ్రేష్ఠము.

**భద్రకుంభము** (సం.వి.అ.పుం.) : రాజద్వారము నందుంచిన జలపూర్ణమైన స్వర్ణకలశము.

**భద్రదారువు** (సం.వి.ఉ.న.) : దేవదారువు.

**భద్రపర్ణి** (సం.వి.ఈ.స్త్రీ.) : గుమ్ముడు.

**భద్రబల** (సం.వి.ఆ.స్త్రీ.) : గొంతెమగోరు.

**భద్రముస్తకము** (సం.వి.అ.పుం.) : నాగముస్తె.

**భద్రయవము** (సం.వి.అ.న.) : కొడిసెకాయ.

**భద్రశ్రీ** (సం.వి.ఈ.పుం.) : చందనము, గందము.

**భద్రాకరణము** (సం.వి.అ.న.) :క్షౌరము, వపనము.

**భద్రాసనము** (సం.వి.అ.న.) : రాజు కూర్చుండు పీఠము.

**భయంకరము** (సం.విణ.) : (అ.ఆ.అ.) భయమును పుట్టించునది.

**భయము** (సం.వి.అ.న.) : వెఱపు. (విణ.) : వెఱపు పుట్టించునది.

**భయానకము** (సం.వి.అ.పుం.) : 1.నవరసము లలో నొకటి; (చూ. రసము.) 2.పులి; 3.రాహువు. (విణ.) : భయానకరసము గలది.

**భరంతు** (హిం.వి.) : ఇంటిమట్టము.

**భరటుఁడు** (సం.వి.అ.పుం.) : 1. కూలివాఁడు; 2. కుమ్మరవాఁడు.

**భరణము** (సం.వి.అ.న.) : 1.భరించుట; 2.కూలి; 3. జీతము; 4. ఇరువది తూముల మానము.

**భరణి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. ఒక నక్షత్రము; (చూ. నక్షత్రము) 2. భూమి.

**భరణ్యము** (సం.వి.అ.న.) : 1. కూలి; 2. జీతము.

**భరద్వాజము** (సం.వి.అ.పుం.) : ఏట్రింత. (డు.): 1. ఒకముని; 2. ద్రోణుఁడు.

**భరము** (సం.వి.అ.పుం.) : 1. అతిశయము; 2. బరువు; 3. బారువ.

**భరించే** (సం.స.క్రి.) : 1. మోచు; 2. ప్రోచు. (సంభరించు అనియు.)

**భర్గుఁడు** (సం.వి.అ.పుం.) : శివుఁడు, ముక్కంటి.

**భర్జనము** (సం.వి.అ.న.) : వేఁచుట, భృష్టి.

**భర్జించు** (సం.స.క్రి.) : భర్జనము చేయు, వేఁచు.

**భర్త** (సం.వి.ఋ.పుం.) : మగఁడు. (విణ.) : 1. మోచువాఁడు; 2. ప్రోచువాఁడు.

**భర్తి** (హిం.వి.) : సంపూర్తి.

**భర్తృదారకుఁడు** (సం.వి.అ.పుం.) : (నాట్య పరిభాష యందు) యువరాజు.

**భర్తృదారిక** (సం.వి.ఆ.స్త్రీ.) : (నాట్య పరిభాష యందు) రాజు కూఁతురు.

**భర్త్సనము** (సం.వి.అ.న.) : బెదరింపు మాట.

**భర్మము** (సం.వి.అ.న్.న.) : బంగారు. (న్.న.) : జీతము.

**భల్లము** (సం.వి.అ.న.) : బల్లెము. (పుం.) : ఎలుఁగుబంటు.

**భల్లాతకి** (సం.వి.ఈ.స్త్రీ.) : జీడి.

**భల్లారే** (దే.అవ్య.) : ఆశ్చర్యార్థకము. (రూ. బళిరే.)

**భల్లుంగము** (సం.వి.అ.పుం.) : గట్టివెదురు.

**భల్లుకము** (సం.వి.అ.పుం.) : 1. ఎలుఁగుబంటు; 2. కోఁతి.

**భల్లూకము** (సం.వి.అ.పుం.) : ఎలుఁగు, భల్లుకము.

**భవదీయము** (సం.విణ.) : (అ.ఆ.అ.) నీది.

**భవనము** (సం.వి.అ.పుం.) : 1.అగుట; 2.ఇల్లు.

**భవనాసి** (గ్రా.వి.) : అక్షయపాత్ర.

**భవము** (సం. వి. అ. పుం.) : 1. పుట్టుక; 2.సంసారము; 3.ప్రాప్తి; 4.శుభము; 5.సత్త.

**భవాదృశుఁడు** (సం.విణ.) : (శ్) నీవంటివాఁడు.

**భవాని** (సం.వి.ఈ.స్త్రీ.) : పార్వతి, గట్రాచూలి.

**భవికము** (సం.వి.అ.న.) : శుభము, మేలు.

**భవిత** (సం.విణ.) : (ఋ.ఈ.ఋ.) కాఁగల స్వభావము గలవాఁడు.

**భవితవ్యము** (సం.వి.అ.న.) : 1. భాగ్యము; 2. శుభము. (విణ.) : కాఁదగినది.

**భవిష్ణువు** (సం.విణ.) : (ఉ) కాగల స్వభావము కలవాఁడు.

**భవిష్యత్తు** (సం.విణ.) : (త్.ఈ.త్.) కాగలది.

**భవిష్యము** (సం.వి.అ.న.) : 1. భాగ్యము; 2. శుభము. (విణ.) కాఁగలది.

**భవుఁడు** (సం.వి.అ.పుం.) : శివుఁడు, ముక్కంటి.

**భవ్య** (సం.వి.ఆ.స్త్రీ.) :1.పార్వతి; 2. గజ పిప్పలి. (అ.న.ము.) : 1.శుభము; 2. ఎముక. (విణ.): 1. శుభమైనది; 2. సత్యమైనది; 3. యోగ్య మైనది; 4. కాఁగలది.

**భషకము** (సం.వి.అ.పుం.) : శునకము, కుక్క

**భషణము** (సం.వి.అ.న.) : కుక్క యొక్క మొఱుగు.

**భసలము** (సం.వి.అ.పుం.) : తుమ్మెద, భృంగము.

**భస్త్ర** (సం.వి.ఆ.స్త్రీ.) : (కమ్మరవాని) కొలిమితిత్తి.

**భస్త్రి** (సం.వి.ఈ.స్త్రీ.) : (కమ్మరవాని) కొలిమితిత్తి.

**భస్మగంధిని** (సం.వి.ఈ.స్త్రీ.) : రేణుకయగు గంధ ద్రవ్యము.

**భస్తగర్భ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. కంపుటిరుగుడు; 2. ఇరుగుడు.

**భస్మము** (సం.వి.న్.న.) : ఏదయినను కాలి తెల్లగానైన పొడి, బూది.

**భస్మీకరించు** (సం.స.క్రి.) : భస్మముచేయు.

## భా

**భా** (సం.వి.ఆ.స్.స్త్రీ.) : సూర్యుని వెలుఁగు కిరణము.

**భాంగీనము** (సం.విణ.) : (అ.ఆ.అ.) భంగలు పండినది. (పొలము)

**భాండము** (సం.వి.అ.న.) : 1. తొడవు; 2. గుఱ్ఱపుఁదొడవు; 3. కుండలోనగు మట్టి పాత్రము; 4. వస్తువు; 5. మొదలి సొమ్ము; 6. సంచిమొదలు.

**భాండాగారము** (సం.వి.అ.న.) : ధనముండు చోటు, బొక్కసము.

**భాండి** (సం.వి.ఈ.స్త్రీ.) : మంజిట.

**భాగధేయము** (సం.వి.అ.న.) : భాగ్యము. (పుం.) : కప్పము.

**భాగము** (సం.వి.అ.పుం.) : 1.పాలు; 2.భాగ్యము.

**భాగించు** (సం.స.క్రి.) : భాగముచేయు, పంచు.

**భాగినేయుఁడు** (సం.వి.అ.పుం.) : తోడఁబుట్టిన దాని కొడుకు, మేనల్లుఁడు.

**భాగీరథి** (సం.వి.ఈ.స్త్రీ.) : గంగ, మిన్నేఱు.

**భాగ్యము** (సం.వి.అ.న.) : 1.అదృష్టము; 2. సుకృతము. (విణ.) : భాగింపఁదగినది.

**భాజనము** (సం.వి.అ.న.) : 1.పాత్రము; 2. యోగ్యము.

**భాటకము** (సం.వి.అ.పుం.) : బాడిగ, అవక్రయము.

**భాణము** (సం.వి.అ.పుం.) : నాటక భేదము. (చూ. నాటకము.)

**భాతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. కాంతి; 2. విధము. (రెండవ అర్థమునకు తెనుగు గ్రంథముల యందు ప్రయోగము.)

**భాద్రపద** (సం.వి.ఆ.స్త్రీ.) : ఉత్తరభద్రపదా నక్షత్రము. (అ.పుం.ము.) : భాద్రపద మాసము.

**భానుమంతుఁడు** (సం.వి.త్.పుం.) : సూర్యుఁడు. (విణ.) : కిరణము గలవాఁడు.

**భానువు** (సం.వి.ఉ.పుం.) : 1. సూర్య కిరణము; 2. సూర్యుఁడు.

**భామ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఆఁడుది. (అ.పుం.ము.) : 1. కోపము; 2. సూర్యకిరణము. (డు.) : సూర్యుఁడు.

**భామిని** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. క్రీడా సమయము నందు కోపము చూపెడు ఆఁడుది; 2. ఆఁడుది.

**భారకుఁడు** (సం.వి.అ.పుం.) : బరువు మోసెడి కూలివాఁడు.

**భారతము** (సం.వి.అ.న.) : 1. వ్యాస ప్రోక్తమైన అయిదవ వేదము; 2. హిమవత్పర్వతమునకును దక్షిణ సముద్రమునకును నడుమైన ఒక వర్షము. (చూ. వర్షము) (పుం.డు.) : నట్టువుఁడు.

**భారతి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1.సరస్వతి; 2.వాక్కు; 3.ఒక కావ్యవృత్తి (చూ.వృత్తి) 4. పక్షి విశేషము.

**భారద్వాజము** (సం.వి.అ.పుం.) : పక్షి విశేషము, ఏట్రింత.

**భారద్వాజి** (సం.వి.ఈ.స్త్రీ.) : అడవి ప్రత్తి.

**భారము** (సం.వి.అ.పుం.): 1.బరువు; 2. బారువ.

**భారయష్టి** (సం.వి.ఇ.స్త్రీ.) : కావడిబద్ద.

**భారవాహుఁడు** (సం.వి.అ.పుం.) : బరువు మోసెడు వాఁడు, భారకుఁడు.

**భారి** (హిం.విణ.) : గొప్ప, ఘనమైన, బలిసిన.

**భార్గవి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. లక్ష్మి, 2.పార్వతి; 3. గఱిక.

**భార్గవుఁడు** (సం.వి.అ.పుం.) : 1. శుక్రుఁడు; 2. పరశురాముఁడు.

**భార్గి** (సం.వి.ఈ.స్త్రీ.) : బారంగి.

**భార్య** (సం.వి.ఆ.స్త్రీ.) : అగ్నిసాక్షిగా పెండ్లాడిన పెండ్లాము, పత్ని.

**భార్యాటికుఁడు** (సం.వి.అ.పుం.) : పెండ్లాము మాట జవదాఁటనివాఁడు.

**భాలూకము** (సం.వి.అ.పుం.) : భల్లుకము, ఎలుఁగు.

**భావ** (సం.వి.అ.పుం.) : ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము) 1. సత్తు; 2. మనోవికారము; 3. అభిప్రాయము; 4. ఆత్మ; 5. పుట్టుక; 6. ధాత్వర్థ రూపక్రియ; 7. స్వభావము; 8. పదార్థము; 9. విభూతి; 10. రత్యాది. (డు.) : (నాట్య పరిభాష యందు) విద్వాంసుఁడు.

**భావజుఁడు** (సం.వి.అ.పుం.) : మన్మథుఁడు, తలఁపుచూలి.

**భావన** (సం.వి.ఆ.స్త్రీ.అ.న.) : 1. తలఁపు; 2. వాసనకట్టుట.

**భావి** (సం.విణ.) : (న్.ఈ.న్.) కాఁగలది, భవిష్యత్తు.

**భావించు** (సం.అ.క్రి.) : ఎంచు, తలఁచు.

**భావికము** (సం.వి.అ.న.) : ఒక అర్థాలంకారము. (చూ. అలంకారము.)

**భావితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. పొందఁ బడినది; 2. కర్పూరాదులచేత వాసనకట్టినది.

**భావిని** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. భావము గల ఆఁడుది; 2. ఆఁడుది.

**భావుకము** (సం.వి.అ.న.) : శుభము, భవికము.

**భావుకుఁడు** (సం.వి.అ.పుం.) : తోడఁబుట్టినదాని మగఁడు, బావమఱది.

**భావ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అవశ్యము కాఁదగినది.

**భాష** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. సంస్కృతాది; 2. మాట; 3. ప్రతిజ్ఞ; 4. ప్రమాణము.

**భాషణము** (సం.వి.అ.న.) : మాటాడుట.

**భాషించే** (సం.అ.క్రి.) : మాటాడు.

**భాషితము** (సం.వి.అ.న.) : మాట. (విణ.) : మాటాడినది.

**భాష్యము** (సం.వి.అ.న.) : సూత్ర వ్యాఖ్యాన గ్రంథము. (విణ.) : మాటాడఁ దగినది.

**భాసంతము** (సం.వి.అ.పుం.) : గంప పులుఁగు. (విణ.) : చక్కనిది.

**భాసమానము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ప్రకాశించుచున్నది.

**భాసిల్లు** (సం.అ.క్రి.) : ప్రకాశించు. (ఉద్భాసిల్లు, సముద్భాసిల్లు అనియు.)

**భాసురము** (సం.వి.అ.పుం.) : పటికపు ఱాయి. (విణ.) : ప్రకాశించునది.

**భాస్కరుఁడు** (సం.వి.అ.పుం.) : 1. సూర్యుఁడు; 2. అగ్ని.

**భాస్వంతుఁడు** (సం.వి.త్.పుం.) : సూర్యుఁడు. (విణ.) : ప్రకాశించువాఁడు.

**భాస్వరుఁడు** (సం.వి.అ.పుం.) : సూర్యుఁడు. (విణ.) : ప్రకాశించువాఁడు.

## భి

**భిండిపాలము** (సం.వి.అ.పుం.) : విడిచివాటు గుదియ. (వాడుకయందు భిండివాలమందురు. చూ. భింది పాలము.)

**భిందిపాలము** (సం.వి.అ.పుం.) : విడిచివాటు గుదియ. రెండు మూడు చక్రములు గల మాదిగ కత్తి. (అని కొందఱు.) (చూ. భిండిపాలము.)

**భిక్ష** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. బిచ్చము; 2. బిచ్చమెత్తిన వస్తువు; 3. కడకొలది అన్నము; 4. కూలి; 5. సేవ. (రూ. భిక్షము.)

**భిక్షించు** (సం.స.క్రి.) : భిక్షమెత్తు.

**భిక్షుకుఁడు** (సం.వి.అ.పుం.) : భిక్షమెత్తుకొని జీవించెడు సన్యాసి.

**భిక్షువు** (సం.వి.ఉ.పుం.) : 1. బ్రహ్మచారి; 2. సన్యాసి.

**భిత్తము** (సం.వి.అ.న.) : ఖండము, తునుక.

**భిత్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. భేదనము; 2. గోడ; 3. జుత్తిలి.

**భిత్తిక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. పిడుగు; 2. గోడ; 3. చల్లగడ్డ.

**భిద** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. భేదము; 2. భేదనము; 3. భేదోపాయము.

**భిదురము** (సం.వి.అ.న.) : వజ్రాయుధము, ఱాతివాలు.

**భిన్నము** (సం.వి.అ.పుం.) : 1. అర్థ దోషములలో నొకటి; 2. నీల రత్న దోషము. (విణ.) : 1. పగిలినది; 2. చీలినది; 3. విరిసినది; 4. వేఱు పడినది; 5. కూడినది.

**భిల్లుఁడు** (సం.వి.అ.పుం.) : బోయవాఁడు.

**భిషక్కు** (సం.వి.జ్.పుం.) : చికిత్సకుఁడు, వైద్యుఁడు.

**భిస్స** (సం.వి.ఆ.స్త్రీ.) : అన్నము, వంటకము.

**భిస్సట** (సం.వి.ఆ.స్త్రీ.) : మాఁడన్నము.

## భీ

**భీ** (సం.వి.ఈ.స్త్రీ.) : భయము, వెఱపు.

**భీకరము** (సం.విణ.) : (అ.ఆ.అ.) వెఱపు పుట్టించునది, భయంకరము.

**భీతము** (సం.వి.అ.న.) : వెఱపు. (విణ.) : వెఱచినది.

**భీతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. వెఱపు; 2. వడఁకు.

**భీతిల్లు** (సం.అ.క్రి.) : భయపడు, వెఱచు.

**భీమము** (సం.వి.అ.పుం.) : భయానక రసము. (విణ.) : భయానక రసము కలది.

**భీముఁడు** (సం.వి.అ.పుం.) : 1. ధర్మరాజు తమ్ముఁడు; 2. ఒక రాజు; 3. శివుఁడు. (విణ.): భయంకరుఁడు.

**భీరుకుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) వెఱపరి.

**భీరువు** (సం.వి.ఊ.స్త్రీ.) : 1. వెఱపరియగు ఆఁడుది; 2.ఆఁడుది. (ఉ.స్త్రీ.) : పిల్లపీఁచర. (విణ.) : వెఱపరి.

**భీలుకుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) భీరుకుఁడు యొక్క రూపాంతరము.

**భీషణము** (సం.వి.అ.పుం.) : భయానక రసము. (విణ.) : భయానక రసము కలది.

**భీష్మము** (సం.వి.అ.పుం.విణ.) : భయానక రసము. (విణ.) : భయానకరసము కలది.

**భీష్మసువు** (సం.వి.ఊ.స్త్రీ.) : గంగానది.

**భీష్ముఁడు** (సం.వి.అ.పుం.) : 1. శాంతనవుఁడు; 2. శివుఁడు. (విణ.) : భయంకరుఁడు.

## భు

**భుక్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. భుజింపఁబడినది; 2. అనుభవింపఁ బడినది.

**భుక్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. భోజనము; 2. అనుభవము.

**భుగ్నము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. వంగినది; 2. విఱిగినది; 3. వంకరైనది.

**భుజ** (సం.వి.ఆ.స్త్రీ.అ.పుం.ము.) : చేయి.

**భుజంగభుక్కు** (సం.వి.జ్.పుం,) : నెమలి, పాఁపమేపరి.

**భుజంగమము** (సం.వి.అ.పుం.) : పాము.

**భుజంగము** (సం.వి.అ.పుం.) : పాము. (డు.) : విటుఁడు.

**భుజంగాక్షి** (సం.వి.ఈ.స్త్రీ.) : సర్పాక్షి.

**భుజకీర్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : బాహుపురి.

**భుజగము** (సం.వి.అ.పుం.) : పాము.

**భుజపత్రము** (సం.వి.అ.పుం.) : బుజపత్తిరి.

**భుజశిరస్సు** (సం.వి.స్.న.) : మూఁపు, అంసము.

**భుజాంతరము** (సం.వి.అ.న.) : ఱొమ్ము, క్రోడము.

**భుజించు** (సం.స.క్రి.) : 1.తిను; 2.అనుభవించు.

**భుజిష్య** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.పరిచారిక; 2.వేశ్య. (అ.పుం.ము.) : చేతకట్టుకొనెడు తోరము. (డు.) : పరిచారకుఁడు.(విణ.) : స్వతంత్రుఁడు.

**భువనము** (సం.వి.అ.న.) : 1. జగము; 2.ఉదకము; 3. ఆకాశము.

**భువనేశ్వరము** (సం.వి.అ.న.) : గృహ విశేషము, చుట్టుబవంతి.

**భువి** (సం.వి.ఊ.స్త్రీ.) : 1. భూమి; 2. స్థానము.

## భూ

**భూకదంబము** (సం.వి.అ.పుం.) : నేలకడమి.

**భూకము** (సం.వి.అ.న.) : 1. బొక్క; 2. కాలము.

**భూగృహము** (సం.వి.అ.న.) : నేల మాలియ.

**భూజము** (సం.వి.అ.పుం.) : వృక్షము, పుడమిపుట్టు.

**భూజాని** (సం.వి.ఇ.పుం.) : 1.విష్ణువు; 2.రాజు.

**భూతకేశము** (సం.వి.అ.పుం.) : మరలుజడ.

**భూతధాత్రి** (సం.వి.ఈ.స్త్రీ.) : భూమి, నేల.

**భూతము** (సం.వి.అ.న.) : 1. పృథి వ్యాధి; (ఇవి అయిదు. పృథివి అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము.) 2. పిశాచాది; 3. ప్రాణి. (సుం.): 1. దేవయోని విశేషము; 2. కృష్ణ చతుర్దశి. (డు.) : కొడుకు. (విణ.) : 1. తగినది; 2. కడచినది; 3. నిక్కువ మయినది; 4. పొందఁ బడినది; 5. వెలసినది; 6. (ఉత్తర పదమైనచో) సమానమైనది.

**భూతయజ్ఞము** (సం.వి.అ.పుం.) : భూతబలి.

**భూతవేశి** (సం.వి.ఈ.స్త్రీ.) : తెల్లవావిలి.

**భూతాత్మము** (సం.వి.న్.పుం.) : దేహము. (డు.): బ్రహ్మ.

**భూతావాసము** (సం.వి.అ.పుం.) : విభీతకము, తాండ్ర.

**భూతి** (సం.వి.ఇ.స్త్రీ.) :1.ఐశ్వర్యము; 2. సంపద; 3. భస్మము; 4. సత్త; 5. పుట్టుక; 6.ఏనుఁగు శృంగారము.

**భూతికము** (సం.వి.అ.న.) : 1. ఓమము; 2. కర్పూరము; 3.కామంచి కసవు; 4. చీఁపురు కసవు; 5. నేలవేము. (రూ. భూతీకము.)

**భూతులసి** (సం.వి.ఈ.స్త్రీ.) : నేలతొళసి.

**భూతేశుఁడు** (సం.వి.అ.పుం.) : శివుఁడు. బూచుల ఱేఁడు.

**భూదారము** (సం.వి.అ.పుం.) : వరాహము, కిటి, పంది.

**భూదేవుఁడు** (సం.వి.అ.పుం.) : బ్రాహ్మణుఁడు, నేల వేలుపు.

**భూధరము** (సం.వి.అ.పుం.) : పర్వతము, నేలతాలుపు.

**భూనింబము** (సం.వి.అ.పుం.) : నేలవేము.

**భూపతి** (సం.వి.ఇ.పుం.) : రాజు, నేలఱేఁడు.

**భూపది** (సం.వి.ఈ.స్త్రీ.) : మల్లియ.

**భూపాటలి** (సం.వి.ఈ.స్త్రీ.) : నేలకలిగొట్టు.

**భూపుఁడు** (సం.వి.అ.పుం.) : రాజు, ఱేఁడు.

**భూపూగము** (సం.వి.అ.పుం.) : (చూ.) తోఁటపోఁక.

**భూబదరి** (సం.వి.ఈ.స్త్రీ.) : నేలరేను.

**భూభుజుఁడు** (సం.వి.జ్.పుం.) : 1. కొండ; 2.రాజు. (దీనికి సరియైన తెనుఁగుమాట నేలతాలుపు.)

**భూమి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. నేల; 2. చోటు.

**భూమిక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.మాఱువేషము; 2. రచన.

**భూమికర్మారువు** (సం.వి.) : నేలగుమ్మడి.

**భూమిచంపకము** (సం.వి.అ.పుం.) : నేలసంపెఁగ.

**భూమిజ** (సం.వి.ఆ.స్త్రీ.) : సీత. (అ.పుం.డు.) : 1. అంగారకుఁడు; 2. నరకాసురుఁడు.

**భూమిజంబుక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. కాకినేరేడు; 2. నేలనేరేడు.

**భూమిస్పృశుఁడు** (సం.వి.శ్.పుం.) : 1. కోమటి; 2. మనుష్యుఁడు.

**భూమ్యామలకి** (సం.వి.ఈ.స్త్రీ.) : నేలయుసిరిక.

**భూయస్సు** (సం.విణ.) : (న్.)అధికము, మిక్కుటము.

**భూయిష్ఠము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అధికము, మిక్కుటము.

**భూరి** (సం.వి.ఇ.న.) : బంగారు. (విణ.) : అధికము.

**భూరిఫేన** (సం.వి.ఆ.స్త్రీ.) : సంబరేను.

**భూరిమాయము** (సం.వి.అ.పుం.) : జంబుకము, నక్క.

**భూరిమాయువు** (సం.వి.ఉ.పుం.) : జంబుకము, నక్క.

**భూరుండి** (సం.వి.ఈ.స్త్రీ.) : గురుగు.

**భూరుహము** (సం.వి.అ.పుం.) : వృక్షము, పుడమిపుట్టు.

**భూర్జము** (సం.వి.అ.పుం.) : బుజపత్తిరి.

**భూవరుఁడు** (సం.వి.అ.పుం.) : రాజు పుడమి ఱేఁడు.

**భూష** (సం.వి.ఆ.స్త్రీ.) : భూషణము, తొడవు.

**భూషణము** (సం.వి.అ.న.) : 1. అలంకరణము, 2. తొడవు.

**భూషించే** (సం.స.క్రి.) : స్తుతించు. (సమూద్భూషించు అనియు.)

**భూషితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) అలంకరింపఁబడిన వాఁడు.

**భూష్ణువు** (సం.విణ.) : (ఉ.) కాఁగల స్వభావము గలవాఁడు.

**భూసురుఁడు** (సం.వి.అ.పుం.) : బ్రాహ్మణుఁడు, నేల వేలుపు.

**భూస్తృణము** (సం.వి.అ.న.) : చిప్పకసవు.

**భృ**

**భృంగము** (సం.వి.అ.న.) : లవంగపుఁబట్ట. (పుం.) : 1.తుమ్మెద; 2.కూఁకటి మూఁగ; 3. గుంట గలిజేరు. (డు.) : విటుఁడు.

**భృంగరాజము** (సం.వి.అ.పుం.) : 1. గుంట గలిజేరు; 2.గండుతుమ్మెద; 3.కూఁకటి మూఁగ.

**భృంగారము** (సం.వి.అ.పుం.) : 1.గుంటగలిజేరు; 2. బంగారు గిండి.

**భృంగారి** (సం.వి.ఈ.స్త్రీ.) : చిమ్మట పురుగు, ఝిల్లిక.

**భృంగి** (సం.వి.ఈ.స్త్రీ.) : అతివస. (న్.పుం.) : భృంగీశ్వరుఁడు.

**భృగువు** (సం.వి.ఉ.పుం.) : 1. కొండ చఱియ; 2. ఒక ముని; 3. శుక్రుఁడు; 4. శివుఁడు.

**భృతకుఁడు** (సం.వి.అ.పుం.) : కూలివాఁడు.

**భృతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. భరింపఁబడినది; 2. నింపఁబడినది.

**భృతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. మోచుట; 2. కూలి; 3. వెల.

**భృతిభుజుఁడు** (సం. వి. జ్. పుం.) : కూలివాఁడు.

**భృత్య** (సం.వి.ఆ.స్త్రీ.) : కూలి. (అ.పుం.డు.) : పనివాఁడు, బంటు.

**భృశము** (సం.క్రి.విణ.అ.న.) : పెల్లు. (విణ.) : అధికము.

**భృష్టము** (సం.విణ.) : (అ.ఆ.అ.) వేఁచఁబడినది.

**భృష్టి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. వేఁపుడు; 2. పాడడవి.

**భే**

**భేకము** (సం.వి.అ.పుం.) : 1. కప్ప; 2. మేఘము.

**భేకి** (సం.వి.ఈ.స్త్రీ.) : ఆఁడుకప్ప, వర్షాభ్వి.

**భేదకుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) భేదించువాఁడు.

**భేదనము** (సం.వి.అ.న.) : భేదించుట. (పుం.): పుల్లబచ్చలి.

**భేదము** (సం.వి.అ.పుం.) : 1.భేదనము; 2. వేఱిమి; 3. విశేషము; 4. ఒక ఉపాయము. (చూ. ఉపాయము) (ఇది త్రివిధము. ఒండొరుల స్నేహము చెఱుచుట, ఒండొరులకు రాయిడి పుట్టించుట, బెదరుచూపుట.)

**భేదించు** (సం.ప్రే.) : భేదిల్లఁజేయు. (నిర్భేదించు అనియు.)

**భేదితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) భేదింపఁబడినది.

**భేద్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) భేదింపఁదగినది.

**భేదిల్లు** (సం.అ.క్రి.) : 1. వేఱగు; 2. చీలు.

**భేరి** (సం.వి.ఈ.స్త్రీ.) : వాద్యవిశేషము. దుందుభి.

**భేరుండము** (సం.వి.అ.పుం.) : పక్షి విశేషము. (విణ.) : భయంకరము.

**భేలుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. మూర్ఖుఁడు; 2. పిఱికి; 3. చలించువాఁడు.

**భేషజము** (సం.వి.అ.న.) : ఔషధము, మందు.

**భై**

**భైక్షము** (సం.వి.అ.న.) : భిక్షాసమూహము.

**భైరవము** (సం.వి.అ.పుం.) : భయానక రసము.

**భైరవి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. పార్వతి; 2. రాగ విశేషము.

**భైరవుఁడు** (సం.వి.అ.పుం.) : శివుఁడు. (విణ.): భయానకరసము కలవాఁడు.

**భైషజ్యము** (సం.వి.అ.న.) : ఔషధము, మందు.

## భో

**భోక్త** (సం.విణ.) : (ఋ.ఈ.ఋ.) 1. భుజించు వాఁడు; 2. అనుభవించు వాఁడు.

**భోక్తవ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. భుజింపఁ దగినది; 2. అనుభవింపఁ దగినది.

**భోగగృహము** (సం.వి.అ.న.) : పడకిల్లు.

**భోగము** (సం.వి.అ.పుం.) : 1.సుఖము; 2. భోజనము; 3. పాము యొక్క పడగ; 4. పాము యొక్క శరీరము; 5. ధనము; 6. వేశ్యాదుల కిచ్చెడు వెల; 7. పాలనము. (అష్టభోగములు. గృహము, శయ్య, వస్త్రము, ఆభరణము, స్త్రీ, పుష్పము, గంధము, తాంబూలము.)

**భోగవతి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1.పాతాళము; 2. పాతాళమునందలి యేఱు. (విణ.) : భోగము గలది.

**భోగి** (సం.వి.న్.పుం.) : 1. పాము; 2. రాజు; 3. మంగలి. (విణ.) : సుకవాసి.

**భోగించే** (సం.అ.క్రి.) : సుఖించు, అనుభవించు. (ఉపభోగించు అనియు.)

**భోగిని** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. ఆఁడుఁ బాము; 2. భోగముది; 3. పట్టాభి షిక్తురాలుకాని రాజుభార్య.

**భోగ్యము** (సం.వి.అ.న.) : 1. ధనము; 2. ధాన్యము. (విణ.) : భోగింపఁదగినది.

**భోజనము** (సం.వి.అ.న.) : ఆహారము, కుడుపు.

**భోజ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) భుజింపఁ దగినది.

**భోషాణము** (దే.వి.) : పెద్దపెట్టె.

## భౌ

**భౌతికము** (సం.వి.అ.న.) : ముత్తెము. (విణ.) : భూతసంబంధమైనది.

**భౌముఁడు** (సం.వి.అ.పుం.) : 1. అంగారకుఁడు, 2. నరకాసురుఁడు. (విణ.) : భూమియందుఁ బుట్టినవాఁడు.

**భౌరికుఁడు** (సం.వి.) : బంగారునాణెపు బండారమునకు అధికారి.

## భ్ర

**భ్రంశము** (సం.వి.అ.పుం.) : 1. చలించుట; 2. జాఱుట.

**భ్రకుంసుఁడు** (సం.వి.అ.పుం.) : భ్రకుంసుఁడు యొక్క రూపాంతరము.

**భ్రకుటి** (సం.వి.ఇ.స్త్రీ.) : భ్రుకుటి యొక్క రూపాంతరము.

**భ్రక్షము** (సం.వి.అ.పుం.) : తన తప్పును మఱుఁగు పుచ్చుట.

**భ్రమణము** (సం.వి.అ.న.) : తిరుగుడు. (పుం.) : తుమ్మెద.

**భ్రమము** (సం.వి.అ.పుం.) : 1. భ్రాంతి; 2. తిరుగుడు; 3. బండి కంటి తిరుగుడు; 4. నీళ్లు వెలికిఁబోవుట కేర్పఱచిన తూము లోనగునది.

**భ్రమరకము** (సం.వి.అ.పుం.) : 1. తుమ్మెద; 2. బొంగరము; 3. ముంగురులు.

**భ్రమరము** (సం.వి.అ.పుం.) : 1. తుమ్మెద; 2. ముంగురులు; 3. అభినయహస్త విశేషము.

**భ్రమరించే** (సం.అ.క్రి.) : భ్రమణము చేయు, తిరుగు.

**భ్రమి** (సం.వి.ఇ.ఈ.స్త్రీ.) : భ్రమణము, తిరుగుడు.

**భ్రమించే** (సం.అ.క్రి.) : భ్రమరించు, తిరుగు.

**భ్రష్టము** (సం.విణ.) : (అ.ఆ.అ.) జాఱినది.

**భ్రష్టుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) వెలివేయఁ బడ్డవాఁడు. (రూ. భ్రష్టు)

## భ్రా

**భ్రాంతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) భ్రాంతి నొందినది.

**భ్రాంతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1.మిథ్యామతి; (ఉన్నది లేనట్టు లేనిది ఉన్నట్టును తలఁచుట.) 2. భ్రమణము; 3. ఒక అర్థాలంకారము. (చూ. అలంకారము.)

**భ్రాజితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ప్రకాశము నొందినది.

**భ్రాజిష్ణువు** (సం.విణ.) : (ఉ.) ప్రకాశించువాఁడు.

**భ్రాత** (సం.వి.ఋ.పుం.) : తోడఁబుట్టినవాఁడు.

**భ్రాతృవ్యుఁడు** (సం.వి.అ.పుం.) : 1. తోడఁబుట్టిన వాని కొడుకు; 2. పగవాడు.

**భ్రాత్రీయుఁడు** (సం.వి.అ.పుం.) : తోడఁబుట్టిన వాని కొడుకు.

**భ్రామరము** (సం.వి.అ.న.) : భ్రమరములు గూర్చిన తెల్లనితేనె. (పుం.) : ఒక దినుసురాయి. (విణ.) : భ్రమర సంబంధమైనది.

**భ్రాష్ట్రము** (సం.వి.అ.పుం.) : వేఁపుడుచట్టి, మంగలము.



**భ్రుకుంసుఁడు** (సం.వి.అ.పుం.) : స్త్రీ వేషము వేసికొని ఆడెడు పురుషుఁడు.

**భ్రుకుటి** (సం.వి.ఇ.స్త్రీ.) : బొమముడి (రూ.) భృకుటి.



**భ్రూకుంసుఁడు** (సం.వి.అ.పుం.) : భ్రుకుంసుఁడు యొక్క రూపాంతరము.

**భ్రూకుటి** (సం.వి.ఇ.స్త్రీ.) : భ్రుకుటి యొక్క రూపాంతరము.

**భ్రూణ** (సం.వి.ఆ.స్త్రీ.) : చూలాలు. (అ.పుం.ము.): 1. గర్భము; 2. బిడ్డ.

**భ్రూభంగము** (సం. వి. అ. పుం.) : బొమముడి.

**భ్రూవు** (సం.వి.ఊ.స్త్రీ.) : కనుబొమ.



**భ్రేషము** (సం.వి.అ.పుం.) : తనకుచితమైన ధర్మము నుండి చలించుట.



**మ** : ఒక అక్షరము.

**మంకు** (దే.విణ.) : 1. మొండి; 2. మూర్ఖుఁడు.

**మంకెన** (దే.వి.) : 1. బంధూకము; 2. ఎద్దు మీఁద. నీల్ల బిందెలు తెచ్చునపుడు ఆ బిందెల క్రింద కుదురుగా సంతన చేసి యుంచఁబడు బెత్తపు బుట్టల జత.

**మంఖుణము** (సం.వి.అ.న.) : పిక్కలకుఁ దొడిగికొను కవచము.

**మంగ** (దే.వి.) : పిండీతకము.

**మంగల** (దే.వి.) : క్షౌరకజాతి. (మంగలవాఁడు, మంగలది.)

**మంగలకత్తి** (ద్వ.వి.) : మంగలవానికత్తి, క్షురము.

**మంగలకత్తిరూపు** (ద్వ.వి.) : కృత్తికా నక్షత్రము.

**మంగలపక్కె** (దే.వి.) : మత్స్య విశేషము.

**మంగలపిట్ట** (ద్వ.వి.) : ఏట్రింత, భారద్వాజము.

**మంగలము** (దే.వి.) : వేఁపుచుచట్టి, భ్రాష్ట్రము.

**మంగలి** (దే.వి.) : మంగలవాఁడు, క్షౌరకుఁడు.

**మంగలికోల్లు** (దే.వి.) : సన్నాయి, నాగసరము.

**మంగలిపని** (దే.వి.) : క్షౌరము.

**మంగళ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. పార్వతి; 2. తెల్ల గఱిక. (అ.న.ము.) : 1. శుభము; 2. క్షేమము.

**మంగళదేవత** (సం.వి.ఆ.స్త్రీ.) : లక్ష్మి.

**మంగళవారము** (సం.వి.అ.పుం.) : ఒక వారము. (చూ. వారము.)

**మంగళసూత్రము** (సం.వి.అ.న.) : 1. బొట్టు దారము; 2. తాలిబొట్టు.

**మంగళహారతి** (వై.వి.) : మంగళారతి యొక్క మాఱురూపము.

**మంగళారతి** (వై.వి.) : మంగళకరమైన ఆరతి. (ఇది అంచయానవంటిది.)

**మంగళాశాసనము** (సం.వి.అ.న.) : (వైష్ణవ పరిభాష యందు) ఆశీర్వాదము.

**మంగళుఁడు** (సం.వి.అ.పుం.) : అంగారకుఁడు.

**మంగళ్య** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.గోరోజనము; 2. జమ్మి; 3. తెల్లవస; 4. సదాప. (అ.న.ము) : 1.మల్లెపూవాసనగల అగరు, మల్లెపూ వాసనగల నల్ల అగలు. (అనికొందఱు.)

2.మీఁగడ పెరుఁగు. (పుం.): 1.కలుఁక్రాంత; 2.మారేడు; 3. రావి; 4. చిఱుసెనగలు. (విణ.): శుభకరము.

**మంగి** (దే.వి.): మంగలవాఁడు, క్షౌరికుఁడు.

**మంగు** (దే.వి.): మాఁగుయొక్క రూపాంతరము.

**మంగుడు** (దే.వి.): ముఖమునందలి నల్లనిపొడ.

**మంచేము** (సం.వి.అ.పుం.): 1.మంచము; 2. మంచె.

**మంచి** (దే.వి.): మేలు. (మంచి సెబ్బరలు.) (విణ.): యోగ్యము. (మఱియు దీనికి సందర్భాను సారముగా అనేకార్థములు కలవు.) (ఇక్కడ మంచికి మిక్కిలియని అర్థము.)

**మంచిగందము** (దే.వి.): శ్రీచందనము.

**మంచినీళ్లు** (దే.వి.బ.): పాన యోగ్య మగు జలము.

**మంచినూనె** (దే.వి.): తలంటుకొను తైలము.

**మంచిపాము** (దే.వి.): నాగుఁబాము, త్రాఁచు.

**మంచిబెల్లము** (దే.వి.): చెఱకు రసముతో చేసిన బెల్లము.

**మంచిముత్తెము** (దే.వి.): ఆకృతిమవ్వైన మౌక్తికము.

**మంచియ** (వై.వి.): మంచెకు మొదటి రూపము.

**మంచె** (వై.వి.): జొన్నచేను మొదలగు చోట్ల కూర్చుండుటకై యెత్తుగావేసెడు చప్పరము వంటి పర్యంకము.

**మంచేఁ** (దే.ప్రే.): మనుచు యొుక్క రూపాంతరము. (వి.): హిమము.

**మంచేఁగొండ** (దే.వి.): హిమవత్పర్వతము. (ఇట్లు మంచుగుబ్బలి. మొ.)

**మంచేతఱి** (దే.వి.): హేమంతఋతువు.

**మంజరి** (సం.వి.ఇ.ఈ.స్త్రీ.): 1.చిగిరించిన లేఁత కొమ్మ, పూచిన లేఁత కొమ్మ. (అని కొందఱు.) 2.బొట్టుగు; 3.పెద్దముత్తెము. (దీని కర్థము పూగుత్తియని తఱచుగా వాడుదురు. పూగుత్తి పర్యాయములు మఱియొకచోఁ జెప్పఁబడి యున్నవి కదా.) 4. ఒకానొక వృత్తము.

**మంజిటి** (వై.వి.): మంజిష్ఠ.

**మంజిడి** (వై.వి.): 1. చిత్రవర్ణవస్త్రము; 2. నీల వస్త్రము.

**మంజిమ** (సం.వి.పుం.): మనోజ్ఞత. (రూ. మంజిమము.)

**మంజిష్ట** (సం.వి.ఆ.స్త్రీ.): 1. ఒకానొక చెట్టు; 2. మిక్కిలి ప్రకాశించెడి యెఱుపు.

**మంజిష్ఠారాగము** (సం.వి.అ.పుం.): బయటికిని విశేషముగా కనఁబడుచు లోపలను ఎప్పటికి వీడకుండెడు గాఢానురాగము. (చూ. పూర్వ రాగము)

**మంజీరము** (సం.వి.అ.పుం.): అందె, నూపురము.

**మంజులము** (సం.వి.అ.న.): 1.పొఁచి; 2. పొద రిల్లు. (పుం.): ఒక దినుసు కూకురుగుండెంగ పక్షి. (విణ.) ఒప్పిదమైనది.

**మంజువు** (సం.విణ.): (ఉ.) మనోజ్ఞము.

**మంజూరు** (హిం.వి.): అంగీకారము.

**మంజూష** (సం.వి.ఆ.స్త్రీ.): పెట్టె, మందసము.

**మంజేస** (వై.వి.): పెట్టె, మందసము.

**మంజోడి** (దే.వి.): వజ్రముల తూనిక. (రూ. మంజాళి)

**మంట** (దే.వి.): 1.జ్వాల; 2.కోపము; 3.చుఱుక్కు మనెడు నొప్పి. (గాయము తగిలినచోట మంటయెత్తుచున్నది.)

**మంటకము** (సం.వి.అ.పుం.): భక్ష్య విశేషము, మండెఁగ.

**మంటచేమురు** (దే.వి.): ఎఱ్ఱగాఁ గాలిన గరిఁటెలో పోయఁగా మండెడుచమురు. (ఇట్లు మంట నేయి. మొ.)

**మంటమారి** (దే.విణ.): 1. జ్వలనశీలుఁడు; (చూ.నేఱా) 2. కోపశీలుఁడు.

**మంటినూనె** (దే.వి.): (మన్ను + నూనె) (చూ.) మట్టితైలము.

**మండ** (ఉభ.దే.వి.): 1. శాఖ; 2. ఉప శాఖ; 3. వేఁపుడు కుచ్చు; 4. చీలమండ. (సం.వి. ఆ.స్త్రీ.): ఉసిరిక చెట్టు.

**మండకంచేము** (దే.వి.) : అంచుకట్టిన కంచము.

**మండనము** (సం. వి. అ. న.) : 1. భూషణము; 2.అలంకరించుట. (విణ.) : అలంకరించునది.

**మండపము** (సం.వి.అ.పుం,న.) : 1. చుట్టును నడుమను మఱుఁగు లేక స్తంభములు నిలిపి కట్టిన కట్టడము, చవిక; 2. చావడి.

**మండపి** (సం.వి.ఈ.స్త్రీ.) : చిన్న మండపము.

**మండము** (ఉభ.దే.వి.) : చేఁపలఁ బొడుచు చిల్లకోల. (సం.అ.న.) : మీఁగడ. (పుం.న.) : 1. గంజి; 2.నూనెలోనగువానితేట. (పుం.) : 1.ఆముదపుఁజెట్టు; 2.భూషణము; 3.ఒకదినుసు కూరాకు.

**మండలము** (సం.వి.అ.న.) : 1. పరివేషము; 2.దేశము; 3.కుష్ఠము; 4. విలుకాఁడు రెండు కాళ్లతో మండలాకా రముగా నిలుచుట; (చూ. స్థానము) 5. పన్నిద్దఱు రాజులు. (పుం.) : 1. సమూహము; 2.వలయాకారముగా దీర్చిన యొకవ్యూహము; 3. కుక్క. సూర్యచంద్రాదుల బింబము.

**మండలాగ్రము** (సం.వి.అ.పుం.) : ఖడ్గము, కత్తి.

**మండలి** (సం.వి.ఈ.స్త్రీ.) : సమూహము. (న్.పుం.) : 1. పాము; 2. మండలేశ్వ రుఁడు; 3. సూర్యుఁడు; 4. పిల్లి; 5. కుక్క.

**మండలేశ్వరుఁడు** (సం.వి.అ.పుం.) : అధీశ్వర సార్వభౌములకంటె ఇతరుఁడైన రాజు.

**మండవాయి** (దే.వి.) : గుల్భవాయువు.

**మండహారకుఁడు** (సం.వి.అ.పుం.) : కబ్బిలి వాఁడు, కల్లమ్మువాడు.

**మండాటము** (దే.వి.) : దైన్యముతో యాచించుట.

**మండాడు** (దే.స.క్రి.) : దైన్యముతో యాచించు.

**మండాము** (దే.వి.) : మండము యొక్క రూపాంతరము.

**మండి** (దే.వి.) : ఒక కాలు నేలమోఁకరించుట.

**మండిగండ్రలు** (దే.వి.బ.) : ధాన్యవిశేషము.

**మండిగము** (దే.వి.) : వాకిటిక్రింద అడ్డుగా నమర్చిన కొయ్యశిల.

**మండితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) అలంక రింపఁబడినవాఁడు.

**మండిలూటి** (దే.వి.) : బయట పొటమరింపక లోపల నణఁగి యుండు వ్రణము.

**మండీ** (దే.వి.) : మండికి మొదటి రూపము.

**మండు** (దే.అ.క్రి.) : 1. జ్వలించు; 2. చుఱుకు మని నొచ్చు; (గాయము మండు చున్నది.) 3.ఈర్ష్యాదులచేఁ దపించు. (ఒళ్లు మండు చున్నది. మొ.)

**మండునెల** (దే.వి.) : వసంతఋతువు.

**మండువా** (వై.వి.) : 1. పాక; 2. ఒక తట్టు గోడలేని గుఱ్ఱాల పాక.

**మండూక పర్ణము** (సం.వి.అ.పుం.) : దుండిగము.

**మండూకపర్ణి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. పొన్నగంటి; 2. బెండ; 3. మంజిష్ఠ.

**మండూకము** (సం.వి.అ.పుం.) : 1.కప్ప; 2. దుండి గము. (రూ. మండుకము) డు. ఒక ఋషి.

**మండూరము** (సం.వి.అ.న.) : 1. ఇనుప చిట్టెము; 2. ఇనుప చిట్టెముతో చేసిన సిందూరము.

**మండె** (దే.వి.) : జొన్నకంకులు పొగాకు లోనగునవి మగ్గుటకై ప్రోగువేసి మీఁదకప్పి పెట్టుట. (మొదటిరూపము మండియ.)

**మండెఁగ** (వై.వి.) : పంచదార వేయని గోదుమ పూరీ.

**మండెము** (వై.వి.) : మాఁడెము యొక్క రూపాం తరము.

**మండ్ర** (దే.వి.) : ఒకానొక ముండ్లచెట్టు.

**మండ్రగబ్బ** (దే.వి.) : నల్లని పెద్దతేలు, షడ్బిందువు.

**మండ్రాటము** (దే.వి.) : సంతాపము.

**మండ్రాడు** (దే.అ.క్రి.) : సంతాపించు.

**మంత** (సం.విణ.) : (ఋ.ఈ.ఋ.) ఆలోచించు వాఁడు.

**మంతనము** (వై.వి.) : 1.ఆలోచన; 2. ఏకాం తము; 3. రహస్యము.

**మంతరము** (వై.వి.) : 1.ప్రసవోపాయము; 2.జాల విద్య. (మంత్రమునకు మొదటి రూపము.)

**మంతరసాని** (వై.వి.) : మంత్రసానికి మొదటి రూపము.

**మంతవ్యుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఆలోచింపఁ దగినవాఁడు.

**మంతిరి** (వై.వి.) : మంత్రి.

**మంతిరించే** (వై.అ.క్రి.) : మంత్రముచేయు.

**మంతు** (దే.వి.) : ప్రసిద్ధి. 1.మంత్రి; 2.చదరంగమున మంత్రిగా నుంచుకొన్న కాయ; 3.మంత్రము. (చూ. నాగబెత్తము.)

**మంతువు** (సం.వి.ఉ.స్త్రీ.) : తెలివి. (పుం.) : 1. అపరాధము; 2. మనుష్యుఁడు; 3. రాజు.

**మంత్రకాఁడు** (దే.వి.) : (మంత్రము + కాఁడు) ఇంద్రజాలవిద్య నెఱిఁగిన వాఁడు.

**మంత్రణ** (సం.వి.ఆ.స్త్రీ.) : రహస్యాలోచన. (రూ. మంత్రణము. అ.న.)

**మంత్రము** (వై.వి.) : 1. ప్రసవోపాయము; 2.(మంత్ర సాని) జాల విద్య. (చూ. మంత్ర కాఁడు) (సం. అ. పుం.) : 1. గాయత్రి లోనగునది; 2. రహస్యము; 3. అధర్వ వేదము.

**మంత్రవాది** (సం.వి.పుం.) : మాంత్రికుఁడు.

**మంత్రసాని** (వై.వి.) : (మంత్రము + సాని) సుఖముగా ప్రసవింప నుపాయము చేసెడు చికిత్సకురాలు, సావిక. (మంతరసాని యొక్క రూపాంతరము.)

**మంత్రాంగము** (సం.వి.) : మంత్రిత్వము, తంత్రము.

**మంత్రి** (సం.వి.పుం.) : 1. బుద్ధి సహాయుఁడు; 2. సహాయుఁడు.

**మంత్రించు** (సం.అ.క్రి.) : మంతిరించు.

**మంథదండము** (సం.వి.అ.పుం.) : కవ్వము.

**మంథనము** (సం.వి.అ.న.) : త్రచ్చుట. (పుం.) కవ్వము.

**మంథని** (సం.వి.ఈ.స్త్రీ.) : (చూ.) తరిగడవ.

**మంథము** (సం.వి.అ.పుం.) : 1.కవ్వము; 2.కంటి నొప్పి; 3.అంబలి; 4.వధము. (డు.) : సూర్యుఁడు.

**మంథరజ్జువు** (సం.వి.ఉ.పుం.) : (చూ.) తరిత్రాడు.

**మంథరము** (సం.వి.అ.పుం.) : 1.కవ్వము. (విణ.) : 1.చొరవలేనిది; 2.మెల్లగాఁ బోవునది; 3. వంకరైనది; 4. విరివియైనది.

**మంథాద్రి** (సం.వి.ఇ.పుం.) : కవ్వపుఁ గొండ. (ఇట్లు మంథాచలము, మంథ శైలము. మొ.)

**మంథానము** (సం.వి.అ.పుం.) : మంథ దండము, కవ్వము.

**మంద** (దే.వి.) : 1. ఊరికి వెలుపల పశువు లుండుచోటు; 2. గోష్ఠము; 3.పశు సమూహము; 4.గొల్లపల్లె, వ్రజము.

**మందకట్టు** (దే.వి.) : గొల్లపల్లెలవారు ఏర్పఱుచుకొన్న యేర్పాటు.

**మందగామి** (సం.విణ.) : (న్.ఈ.న్.) మెల్లగా నడచువాఁడు.

**మందగించే** (వై.అ.క్రి.) : మందమగు.

**మందగొను** (దే.అ.క్రి.) : మందగాఁ గూడు.

**మందట** (దే.వి.) : 1. సమీపము; 2. అడఁకువ.

**మందటిల్లు** (దే.అ.క్రి.) : అడఁగు. (రూ. మందటిలు.)

**మందడి** (వై.వి.) : గుఱ్ఱపుశాల, మందుర.

**మందడీఁడు** (దే.వి.) : (మందడి + ఈఁడు) గుఱ్ఱపువాఁడు, మందురకుఁడు.

**మందపిచ్చేక** (దే.వి.) : చటక విశేషము, ఖంజరీటము.

**మందప్రోయాలు** (దే.వి.) : గొల్లది, వ్రేత.

**మందము** (ఉభ.దే.విణ.) : 1.దట్టము; 2. స్థూలము. (సం.వి.అ.పుం.) : గజజాతి విశేషము. (చూ. గజము.) (ఈ జాతిగజము యుద్ధ కాలమునందు వాహన యోగ్యమైనది.) (విణ.) : 1. చొరవ లేనిది; 2. మెల్లనిది.

**మందరము** (సం.వి.అ.పుం.) : 1. కవ్వపుఁ గొండ; 2. మందారమను కల్పవృక్షము. (విణ.): 1. అలసము; 2. బహుళము.

**మందల** (దే.వి.) : 1. మేర; 2. మనుదల, జీవము; 3. సమీపము.

**మందలించే** (దే.స.క్రి.) : 1.చెప్పు; 2.ఆజ్ఞా పించు; 3.మనవిచేయు; 4.హెచ్చరించు; 5.తలఁచు.

**మందలింపు** (దే.వి.) : వ్యవహారము (చూ. ఆరగింపు.)

**మందస** (వై.వి.) : పెట్టె. (రూ. మందసము.)

**మందహాసము** (సం.వి.అ.పుం.) : చిఱునవ్వు.

**మందాకిని** (సం.వి.ఈ.స్త్రీ.) : 1.గంగ; 2. ఆకాశ గంగ; 3. ఒకానొక వృత్తము; 4. అఱువ దేండ్ల ఆడుది.

**మందాకు** (దే.వి.) : (మందు + ఆకు) ఓషధి. (చూ. పసరు మొదటి యర్థము.)

**మందాక్షము** (సం.వి.అ.న.) : సిగ్గు, లజ్జ, వ్రీడ, త్రస.

**మందారము** (ఉభ.దే.వి.) : మేఘావరణము. (సం.అ.పుం.) : 1.ఒక కల్పవృక్షము; 2.జిల్లేడు; 3. బాడిదము.

**మంది** (దే.వి.) : 1. జనసమూహము; 2. పరి జనము; 3. కాలుబలము.

**మందిరము** (సం.వి.అ.న.) : 1.ఇల్లు; 2. పట్టణము. (పుం.) : సముద్రము.

**మందీభవించే** (సం.అ.క్రి.) : మందమగు.

**మందు** (దే.వి.) : 1.ఔషధము; 2.వశ్యౌషధము; 3.ప్రతిక్రియ; 4.ఉపాయము. (విణ.) : దుర్లభము.

**మందుఁడు** (సం.వి.అ.పుం.) : శని. (విణ.) : 1. చొరవ లేనివాఁడు; 2. అల్పుఁడు; 3. ఇచ్చ వచ్చినట్టు తిరుగువాఁడు; 4. నిర్భాగ్యుఁడు; 5. మూర్ఖుడు; 6. వ్యాధిగ్రస్తుఁడు.

**మందుపట్టడ** (దే.వి.) : బాణసంచు చేసెడు శాల.

**మందుభాయి** (గ్రా.వి.) : నల్లమందు తినువాఁడు.

**మందుమల** (దే.వి.) : మందు చెట్లుండు పర్వతము, ద్రోణము.

**మందుర** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.లాయము; 2.పడక.

**మందురకుఁడు** (సం.వి.అ.పుం.) : గుఱ్ఱపు వాఁడు, మందడీఁడు.

**మందులమారి** (దే.విణ.) : మర్లుమందు పెట్టు వాఁడు, మర్లుమందు పెట్టునది.

**మందెమేలము** (దే.వి.) :1.ఉపేక్ష; 2. చనువు; 3. స్నేహము. (చూ. మంట రెండవ అర్థము)

**మందోష్ణము** (సం.వి.అ.న.) : ఇంచుక వేఁడి. (విణ.) : ఇంచుకవేఁడియైనది.

**మంద్రము** (సం.విణ.) : (అ.ఆ.అ.) గంభీరమైన స్వరము)

**మంపిల్లు** (దే.అ.క్రి.) : మత్తిల్లు. (రూ. మంపిలు.)

**మంపు** (దే.వి.) : 1. మత్తు; 2. మైకము.

**మంపుగొను** (దే.అ.క్రి.) : (మంపు+కొను) మత్తిల్లు. (ప్రే. మంపు గొలుపు.)

**మంబరము** (దే.వి.) : దహనము. (చూ. మంబరము సేయు)

**మంబరము** సేయు (దే.స.క్రి.) : (మంబరము + చేయు) దహించు.

**మకరందము** (సం.వి.అ.పుం.) : పూఁదేనె.

**మకరకంఠి** (సం.వి.ఈ.స్త్రీ.) : నడుమ మొసలి ముఖమేర్పఱచిన పురుషుని కర్ణభూషా విశేషము.

**మకరకుండలము** (సం.వి.అ.న.) : మొసలిముఖ మేర్పడఁజేసిన తోరణము.

**మకరధ్వజుఁడు** (సం.వి.అ.పుం.) : మన్మథుఁడు. (ఇట్లు మకరకేతనుఁడు. మొ.)

**మకరము** (సం.వి.అ.పుం.) : 1.పెద్ద చేఁప, మొసలి; (అని కొందఱు.) 2.ఒక నిధి; (చూ. నిధి) 3. ఒక రాశి; (చూ.రాశి) 4. అభినయ హస్త విశేషము.

**మకరాంకుఁడు** (సం.వి.అ.పుం.) : మన్మథుఁడు, మరుఁడు.

**మకరాలయము** (సం.వి.అ.పుం.) : సముద్రము, కడలి.

**మకరిక** (సం.వి.ఆ.స్త్రీ.) : మకరికాపత్రము.

**మకరికాపత్రము** (సం.వి.అ.న.) : స్త్రీలకు చెక్కిళ్లు లోనగు తావులయందు లత్తుకతో వ్రాసెడు మకర రూపమగురేఖ.

**మకరివల** (దే.వి.) : మృగములను బట్టెడు ఒక దినుసు వల.

**మకాము** (హిం.వి.) : ప్రయాణము నందు నిలుచు స్థలము.

**మకిల** (వై.వి.) : 1. మురికి; 2. నలుపు.

**మకుటము** (సం.వి.అ.న.) : కిరీటము, బొమిడికము.

**మకురము** (సం.వి.అ.పుం.) : 1. అద్దము; 2. పొగడ; 3. మల్లెపువ్వు; 4. కుమ్మరిసారెఁ ద్రిప్పెడు కఱ్ఱ.

**మకురుతనము** (దే.వి.) : మూర్ఖత్వము, మొండితనము.

**మకుష్టకము** (సం.వి.అ.పుం.) : అడవి పెసలు. (రూ. మపుష్టకము)

**మకూలకము** (సం.వి.అ.పుం.) : దంతిచెట్టు.

**మక్క** (వై.వి.) : బిడ్డలుగన్న స్త్రీకి పొత్తి కడుపునఁ బుట్టెడి అపాయకరమైన నెత్తురుగడ్డ.

**మక్కనగాయ** (ద్వ.వి.) : (మక్కన + కాయ) బిడ్డలు గన్న స్త్రీకి పొత్తి కడుపునఁ బుట్టెడి అపాయకర మైన నెత్తురుగడ్డ.

**మక్కల్లము** (సం.వి.అ.పుం.) : బిడ్డలు గన్న స్త్రీకి పొత్తి కడుపునఁ బుట్టెడి అపాయకరమైన నెత్తురుగడ్డ.

**మక్కళించు** (దే.అ.క్రి.) : 1. తిరుగుకొను; (వానికి జ్వరము మక్కళించుకొన్నది, అనఁగా జ్వరము నిలిచి యుండి మరల వచ్చినదనుట.) 2. సరి పడు; (చూ. మంజిడి) 3. సరిపోలు. (అం,ప్రే.): 1. తిరుగు కొనఁజేయు; (ఇక్కడ తిరుగుకొనఁ జేయుట అనఁగా లోపలికి అడఁచుకొన్న కడుపును మరల నుబ్బించుట అని అర్థము.) 2. సరి పఱచు; (ఇక్కడ సరిపఱచుట అనఁగా చెక్కుట.) (ఇక్కడ సరిపఱచుట అనఁగా ఇముడ్చుట.)

**మక్కా** (వై.వి.) : యవన దేశము నందలి ముఖ్య పట్టణము.

**మక్తా** (హిం.వి.) : గుత్త.

**మక్కి** (దే.విఱ.) : నిస్సారము. (ఇక్కడ మాంసము లేనిదని యర్థము.)

**మక్కు** (దే.అ.క్రి.) : 1. కాంతిహీనమగు; 2. నవయు; 3. చచ్చు. (స.క్రి.) : గీఱు.

**మక్కువ** (దే.వి.) : కూరిమి, ప్రేమము.

**మక్కెలు** (దే.వి.బ.) : ఎముకలు, అస్థులు.

**మక్షిక** (సం.వి.ఆ.స్త్రీ.) : ఈఁగ.

**మఖము** (సం.వి.అ.పుం.) : యజ్ఞము, జన్నము.

**మగ** (దే.వి.) : పుంస్త్వము. (మగవాఁడు)

**మగఁటిమి** (దే.వి.) : 1. మగతనము, పౌరుషము; 2. శౌర్యము. (చూ. పూరగించు.)

**మగఁడు** (దే.వి.) : 1. పురుషుఁడు; 2. భర్త; 3. రాజు; (వృత్తి యందంత్య వర్ణ లోపము. మగపాటు, మగపొందు. మొ.)

**మగచెయ్యువులు** (ద్వ.వి.బ.) : గ్రామ్య ధర్మము. (ఇట్లు మగపనులు. మొ.)

**మగధము** (సం.వి.అ.పుం.) : ఒకానొక దేశము.

**మగధుఁడు** (సం.వి.అ.పుం.) : వంశావళి చదివెడువాఁడు. (రూ. మాగధుఁడు)

**మగనాలు** (దే.వి.) : (మగని + ఆలు) మగఁడు గల ఆఁడుది, పతిపత్ని.

**మగపాడి** (దే.వి.) : 1. శౌర్యము; 2. ఉపరతి.

**మగపోఁడుములు** (దే.వి.బ.) : గ్రామ్యధర్మము.

**మగమానికపువాలు** (దే.వి.) : వజ్రాయుధము.

**మగమానికము** (దే.వి.) : రవ, వజ్రము.

**మగఱాతివాలు** (దే.వి.) : వజ్రాయుధము.

**మగఱాయి** (దే.వి.) : మగమానికము.

**మగలాగు** (దే.వి.) : మగపొడి, ఉపరతి.

**మగవాఁడు** (దే.వి.) : 1. పురుషుఁడు; 2. శూరుఁడు.

**మగిడి** (దే.వి.) : పాములవాఁడు ఊఁదెడు వాద్య విశేషము.

**మగుడఁబడు** (దే.అ.క్రి.) : (మగుడన్ + పడు) మగుడు. (స్వార్థమున పడు.)

**మగుడు** (దే.అ.క్రి.) : మరలు.

**మగుడుచే** (దే.స.క్రి.) : మగుడఁజేయు. (రూ. మగుడ్చు.)

**మగులు** (దే.వి.) : గోడమీఁదికప్పు (చూ.) మదురు.

**మగులుగోడ** (దే.వి.) : మగులు పెట్టినగోడ.

**మగువ** (దే.వి.) : ఆడుది, ఇంతి, పొలఁతి, స్త్రీ.

**మగ్గపుగుంత** (దే.వి.) : సాలెవాఁడు నేయుటకుఁ గూర్చున్నపుడు కాలు దాఁచుకొనెడు పల్లము. (చూ. కుంచె అయిదవ యర్థము.)

**మగ్గము** (దే.వి.) : సాలెవాఁడు నేసెడు యంత్రము.

**మగ్గరి** (దే.వి.) : (మగ్గము + అరి) సాలెవాఁడు.

**మగ్గు** (దే.అ.క్రి.) : ఉక్కచే చెమ్మగిల్లిచెడు.

**మగ్గుడు** (దే.వి.) : మగ్గుట.

**మగ్గుడుపాటు** (దే.అ.క్రి.) : మగ్గు.

**మగ్దూరు** (హిం.వి.) : అధికారము, శక్తి.

**మగ్నము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మునిఁగినది.

**మఘ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.మొక్కజొన్నలు; 2.ఒక నక్షత్రము. (చూ. నక్షత్రము) (అ.పుం.ము.) : 1. యజ్ఞము; 2. ఒకానొక దీవి.

**మఘవంతుఁడు** (సం.వి.న్.పుం.) : ఇంద్రుఁడు, వేల్పుఱేఁడు. (మఖ వంతుఁడు అనియు.)

**మఘవుఁడు** (సం.వి.న్.పుం.) : ఇంద్రుఁడు, వేల్పుఱేఁడు. (మఖవుఁడు అనియు.)

**మచ్చరిక** (సం.వి.ఆ.స్త్రీ.) : ప్రశస్త వాచకము, మతల్లిక.

**మచ్చిక** (దే.వి.) : 1. మోహము; 2. ఆసక్తి. (చూ. మచ్చిగ.)

**మచ్చికపడు** (దే.అ.క్రి.) : 1.మరులుకొను; 2.మరగు.

**మచ్చిగ** (దే.వి.) : మచ్చికయొక్క రూపాంతరము. (మోహమునకు.)

**మచ్చికంటి** దే.వి. (మచ్చెము + కన్ను) 1. చేఁపల వంటి కన్నులుగల ఆఁడుది; 2. ఆఁడుది.

**మచ్చెము** (వై.వి.) : చేఁప.

**మచ్చ** (దే.వి.) : 1. పుట్టినప్పుడే దేహము నందుఁ గలిగిన నల్లని యెఱ్ఱని చుక్క, లాంఛనము; 2. గాయము మొదలైనవి మానిన పిమ్మట దేహమునం దేర్పడెడు గుఱుతు.

**మచ్చమాయు** (దే.అ.క్రి.) : నశించు.

**మచ్చము** (దే.వి.) : గుఱుతు.

**మచ్చరము** (వై.వి.) : 1. చలము; 2. ద్వేషము. (చూ. మచ్చరించు)

**మచ్చరి** (వై.విణ.) : (మచ్చరము+ఇ) 1. చలపాది; 2. ద్వేషి.

**మచ్చరించు** (వై.అ.క్రి.) : 1.చలపట్టు; 2. ద్వేషించు.

**మచ్చరికము** (వై.వి.) : 1. చలము; 2. ద్వేషము; 3. పోటి.

**మచ్చరికించు** (వై.అ.క్రి.) : 1. చలపట్టు; 2. ద్వేషించు.

**మచ్చరీఁడు** (వై.విణ.) : (మచ్చరి + ఈఁడు) మచ్చరము కలవాఁడు. (స్వార్థమున ఈఁడు.)

**మచ్చు** (దే.వి.) : 1. మీఁదకట్టడము లేని మిద్దెటిల్లు; 2. చొక్కుపొడి; 3. మృగాదులు వలలోఁ దగులుకొనుటకై వలకు సమీపమున నుంచఁబడు నాహారము, ప్రలోభనము; 4. వన్నె సరిగా నున్నదని చూచుకొనుటకై యగసాల వాఁడిచ్చెడు వెండి బంగారముల కమ్మి; (ఇక్కడ మచ్చునఁగా కేవలము మాదిరియని యర్థము) 5.బ.వన్నె యొరసి పరీక్షించుటకై యగసాల లోనగు వారుంచుకొని యుండెడు వెండి, బంగారముల కమ్ములు. (చూ.కమటము)

**మచ్చుకత్తి** (దే.వి.) : కొమ్మలునఱకెడు మోటకత్తి.

**మచ్ఛము** (సం.వి.అ.పుం.) : మత్స్యము, చేఁప.

**మజకూరు** (హిం.వి.) : పైనచెప్పిన ఈ.

**మజబుతు** (హిం.విణ.) : గట్టి.

**మజూరి** (హిం.వి.) : దినపుకూలి.

**మజ్జ** (సం.వి.ఆ.స్త్రీ.న్.పుం.) : చెట్టు చేవ. (న్.పుం,) : ఎముకల యందలి నేయి.

**మజ్జనము** (సం.వి.అ.న.) : స్నానము, మునుక.

**మజ్జిగ** (వై.వి.) : చల్ల, తక్రము.

**మజే** (దే.అవ్య.) : ప్రశంసను తెలుపునది.

**మజో** (దే.అవ్య.) : మజ యొక్క రూపాంతరము.

**మజ్జే** (దే.అవ్య.) : మజ యొక్క రూపాంతరము.

**మజ్జేరె** (దే.అవ్య.) : మజ్జ (రూ. మజ్జరే.)

**మజ్జా** (దే.అవ్య.) : మజ్జు యొక్క రూపాంతరము. (చూ. బూతము)

**మజ్జారె** (దే.అవ్య.) : మజ్జరె యొక్క రూపాంతరము. (రూ. మజ్జారే.)

**మటమట** (దే.వి.) : మలమల యొక్క రూపాంతరము.

**మటమటలాడు** (దే.అ.క్రి.) : (మటమటలు + ఆడు) మండు, జ్వలించు.

**మటిక** (దే.వి.) : మట్టిక యొక్క రూపాంతరము.

**మటుమాయ** (దే.విణ. ) : (మాయము + మాయము) మిక్కిలి మాయము.

**మటుమాయలాఁడు** (దే.విణ.) : (మటు మాయలు + ఆఁడు) మిక్కిలి మాయలు గలవాఁడు. (చూ. చవ్వ.)

**మట్ట** (దే.వి.) : 1. తాటిచెట్టులోనగు వానికొమ్మ; 2. ఆవులులోనగు వానితోఁక.

**మట్టగించు** (వై.స.క్రి.) : తగ్గించు.

**మట్టగిడుసు** (దే.వి.) : మత్స్యవిశేషము.

**మట్టపలక** (వై.వి.) : (మట్టము + పలక) మట్టము చూచెడుపలక.

**మట్టమధ్యాహ్నము** (దే.వి.) : పట్టపగలు.

**మట్టము** (వై.వి.) : కొలఁది. (విణ.) : 1. తక్కువ; 2. పొట్టి; 3. సమము. (వృత్తి యందు హల్లు పరమగుచో ము వర్ణము లోపించును. మట్టపలక, మట్టపొట్టి. మొ.)

**మట్టసము** (వై.విణ.) : 1.కురుచైనది; 2. పరిమితము.

**మట్టసి** (వై.విణ.) : పొట్టివాఁడు.

**మట్టాడు** (దే.అ.క్రి.) : (మట్టి + ఆడు) 1.నడచు; 2.సంచరించు; 3. వ్యాపించు.

**మట్టి** (వై.వి.) : మన్ను, మృత్తిక.

**మట్టిక** (దే.వి.) : గోరుచిక్కుడు. (రూ. మటిక)

**మట్టితైలము** (దే.వి.) : మట్టివలనఁ దీసెడు ధృతి.

**మట్టియ** (దే.వి.) : 1.మగవానికాలి రెండవ వ్రేలి మించు; 2.(బ.) : ఆఁడుదానికాలి రెండవ వ్రేలి మెట్టెలు. (చూ. బిబ్బిలికాయ) వై. మట్టి.

**మట్టు** (యు.దే.స.క్రి.) : త్రొక్కు.(వి.) : 1.త్రొక్కుడు; 2. కుదురు; (చూ. మట్ట) 3. ప్రదేశము. (అడుగుమట్టు, పైమట్టు.) వై. 1.మితి; 2.పర్యంతము. (విణ.) : 1.తక్కువ; 2. మితము.

**మట్టుకాఁకర** (దే.వి.) : ఒక దినుసు కాఁకర, కర్కోటము.

**మట్టుకొను** (దే.అ.క్రి.) : కుదురుకొను. (ప్రే. మట్టుకొలుపు.)

**మట్టుచేయు** (వై.స.క్రి.) : తగ్గించు.

**మట్టుపడు** (యు.ద్వ.అ.క్రి.) : కుదురుపడు. (ప్రే. మట్టుపఱుచు.) వై. అడఁగు.

**మట్టుపెట్టు** (ద్వ.స.క్రి.) : అడఁచు, చంపు.

**మట్టుబచ్చలి** (దే.వి.) : దుంపబచ్చలి, ఉపోదక.

**మట్టుబీఱ** (దే.వి.) : ఒక దినుసుబీఱ.

**మట్టుమిగులు** (దే.అ.క్రి.) : అతిక్రమించు.

**మట్టుమీఱు** (దే.అ.క్రి.) : అతిక్రమించు.

**మట్టె** (దే.వి.) : 1. మగవానికాలి రెండవ వ్రేలిమించు; 2. (బ.) : ఆఁడుదాని కాలి రెండవ వ్రేలి మెట్టెలు. (విణ.) : బట్ట చాఱలు గలది. (మట్టె యావు. మొ.)

**మట్ర** (దే.వి.) : దున్నునపుడు కొంద్ర తిరుగక నడుమ నిలిచెడు కొంచెము తావు.

**మఠము** (సం.వి.అ.పుం.) : సన్యాసుల లోనగు వారు ఉండెడు చోటు.

**మఠ్యము** (సం.వి.అ.పుం.) : తాళభేదము. (పది అక్షరముల కాలము.)

**మడ** (దే.వి.) : ప్రవాహమార్గము.

**మడఁక** (దే.వి.) : 1. మడుపు; 2. (చూ.) అరక.

**మడఁగు** (దే.అ.క్రి.) : 1. వంగు; 2. మరలు.

**మడఁచు** (దే.స.క్రి.) : మడఁగ జేయు. (చూ. లఁగగొను.)

**మడఁతి** (దే.వి.) : ఆఁడుది, పడఁతి, ఇంతి, స్త్రీ.

**మాఱుపడు** (ద్వ.అ.క్రి.) : భేదపడు.

**మాఱుపాటు** (ద్వ.వి.) : మాఱుపడుట, వ్యత్యాసము.

**మాఱుపు** (దే.వి.) : ఒకటిచ్చి మఱియొకటి పుచ్చుకొనుట, వినిమయము.

**మాఱుపెట్టు** (దే.అ.క్రి.) : ఎదరించు. (చూ. మార్పెట్టు.)

**మాఱుమగఁడు** (దే.వి.) : ఉపపతి.

**మాఱుమనువు** (దే.వి.) : (ఆడుదాని) ద్వితీయ వరణము.

**మాఱుమనువుది** (దే.వి.) : (మాఱు మనువు + అది) దిధిషువు.

**మాఱుమాట** (దే.వి.) : ప్రతివచనము.

**మాఱుమూల** (దే.వి.) : ఎదురుమూల.

**మాఱుమొగము** (దే.వి.) : పెడమొగము, పరాఙ్ముఖము.

**మాఱుమొగమువడు** (ద్వ.అ.క్రి.) : (మాఱు మొగము + పడు) పరాఙ్ముఖమగు. (చూ. బీఱువోవు.)

**మాఱుమ్రోఁత** (దే.వి.) : ప్రతిధ్వని.

**మాఱొడ్డు** (దే.అ.క్రి.) : (మాఱు+ఒడ్డు) ప్రతిఘటించు. (వి.) : ప్రతిఘటనము.

**మాల** (వై.వి.) : చండాలుఁడు. (సం.ఆ.స్త్రీ.) : 1.పూదండ; 2.పిక్క. (అ.పుం.ము.) : చండాల జాతి విశేషము. (పుం.న.) : దిబ్బ.

**మాలఁడు** (వై.వి.) : మాలవాఁడు, చండాలుడు.

**మాలకము** (సం.వి.అ.పుం.) : 1.వేము; 2.గగ్గెర; 3. దిబ్బ.

**మాలకరి** (వై.వి.) : 1.మాలాకారుడు; 2. వన పాలకుడు.

**మాలకాకి** (వై.వి.) : ద్రోణాకాకము, కాకోలము.

**మాలతి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1.జాజి; 2.ఒకానొక స్త్రీ.

**మాలాకారుఁడు** (సం.వి.అ.పుం.) : పూమాలెలు కట్టి అమ్మువాఁడు.

**మాలాతృణకము** (సం.వి.అ.న.) : చిప్పకసవు.

**మాలి** (సం.వి.న్.పుం.) : 1. మాలాకారుఁడు; 2.సుకేశుఁడను రాక్షసుని కొడుకు. (విణ.) : మాలగలవాఁడు. (వై.వి.) తోఁటకాచు వాఁడు.

**మాలిక** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. పూమాలె; 2. మెడఁ బెట్టుకొనుడు తీఁగ; 3. విరజాజి; 4.మాడుగు; 5. నదీ విశేషము; 6. కూఁతురు.

**మాలికుఁడు** (సం.వి.అ.పుం.) : మాలాకారుడు.

**మాలిన్యము** (సం.వి.అ.న.) : మలినత, మలినత్వము.

**మాలిమి** (దే.వి.) : 1.వాత్సల్యము; 2.ఓడ నడుపు శాస్త్రము; 3.ఓడనడుపు శాస్త్రము నెఱిఁగిన వాఁడు.

**మాలిమికాడు** (దే.వి.) : మాలిమి శాస్త్రము నెఱిఁగినవాఁడు.

**మాలీషు** (హిం.వి.) : గుఱ్ఱమును తోముట.

**మాలు** (దే.అ.క్రి.) : చెడు, నశించు. (చూ. బ్రుంగుడువాటు)

**మాలుగు** (దే.అ.క్రి.) : సోమరితనముఁ బొందు. (రూ. మాల్గు.) (వి.) : 1. సోమరితనము; 2.బెస్తల భుజము మీఁది తడిమడత పొత్తులు.

**మాలుగుఁబోతు** (దే.విణ.) : (మాలుగు + పోతు) సోమరి.

**మాలుచు** (దే.స.క్రి.) : మాలఁజేయు. (రూ. మాల్చు. చే. దివాణము)

**మాలుధానము** (సం.వి.అ.పుం.) : ముఱ్ఱుఁబాము.

**మాలూరము** (సం.వి.అ.పుం.) : 1. మారేడు; 2. వెలగ.

**మాలె** (వై.వి.) : 1. పుష్పమాలిక; 2. మాడుగు. (మొదటి రూపము మాలియ.)

**మాలెత** (దే.వి.) : (మాల+ఎత) మాలది, చండాల స్త్రీ.

**మాల్యము** (సం.వి.అ.న.) : 1. పుష్పమాలిక; 2. పుష్పము.

**మాల్యవంతము** (సం.వి.త్పుం.) : ఒకానొక కొండ.

**మావతుఁడు** (వై.వి.) : మావటివాఁడు.

**మావటము** (దే.వి.) : తములపాకుల కట్ట (చూ. చఱపు)

**మావటి** (వై.వి.) : మావటివాఁడు, ఆధోరణుఁడు.

**మావటీఁడు** (దే.వి.) : (మావటి + ఈడు) మావటివాఁడు. (చూ. ఓజ) (స్వార్థమున ఈఁడు.)

**మావలి** (దే.వి.) : సుగంధిమాల.

**మావి** (దే.వి.) : 1. మనుష్యాది గర్భస్థ పిండమునకు రక్షకముగా మీద క్రమ్ముకొని యుండు తోలు సంచి, జరాయువు; 2. మావిడి.

**మావిడి** (దే.వి.) : మామిడి యొక్క రూపాంతరము.

**మావు** (దే.వి.) : 1. అశ్వము; 2. అశ్వ సంగమము; 3. మత్స్య గ్రహణ సాధన విశేషము. (క్రిందు సన్నముగా మీఁదు వాటపు విరివిగా అడుగు మీఁది చివరలు చేనలోనఁ జొప్పించి యూఁత వలె చువ్వలతో నేర్పఱపఁబడినది.)

**మావుమోయువాఁడు** (ద్వ.వి.) : కింపురుషుడు, తురంగవదనుఁడు.

**మావెలఁగ** (దే.వి.) : ఉలిమిరి, వరుణము.

**మాషవర్ణి** (సం.వి.ఈ.స్త్రీ.) : కారుమినుము.

**మాషము** (సం.వి.అ.పుం.) : 1.మిను ములు; 2.అయిదు గురిగింజలయెత్తు; 3.త్వగ్దోష భేదము; 4. మూర్ఖము.

**మాషీణము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మాషములు పండునది. (పొలము.)

**మాష్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మాషములు పండునది. (పొలము.)

**మాసటి** (దే.వి.) : 1. శూరుఁడు; (చూ. మాస్టీఁడు) 2.మల్లుఁడు. (విణ.) : శ్రేష్ఠుఁడు. (చూ. మాసటీఁడు.)

**మాసటీఁడు** (దే.వి.) : (మాసటి + ఈఁడు) 1. శూరుఁడు (చూ. మాస్టీఁడు) 2. మల్లుఁడు. (విణ.) : శ్రేష్ఠుఁడు. (స్వార్థమున ఈఁడు)

**మాసము** (వై.వి.) : రెండున్నర చిన్నమెత్తు. (సం.వి.అ.పుం.) : 1. నెల; (ఇవి పండ్రెండు: చైత్రము, వైశాఖము, జ్యేష్ఠము, ఆషాఢము, శ్రావణము, భాద్రపదము, ఆశ్వయుజము, కార్తికము, మార్గశిరము, పుష్యము, మాఘము, ఫాల్గునము) 2. మాషపరిమాణము.

**మాసరము** (సం.వి.అ.పుం.) : వార్పు గంజి, గంజిమీఁది మీఁగడ. (అని కొందఱు.) (విణ.) : 1. వ్యాప్తము; 2. దీర్ఘము.

**మాసి** (వై.వి.) : 1. మైల; 2. మానిసి యొక్క రూపాంతరము. (ఇది వాడుక లోనిది.)

**మాసిక** (దే.వి.) : 1. అతుకు; 2. చిక్కు.

**మాసికము** (సం.వి.అ.న.) : 1. ఆబ్దికము వఱకు నెలనెలకు చేసెడు శ్రాద్ధము; 2.ప్రతి అమావాస్య యందును చేసెడు శ్రాద్ధము. (విణ.) : మాస సంబంధమైనది.

**మాస్టీఁడు** (దే.వి.) : మాసటీఁడు యొక్క రూపాంతరము. (శూరునకు.)

**మాహ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఆవు, మాహేయి.

**మాహాత్మ్యము** (సం.వి.అ.న.) : మహాత్మత్వము, గొప్పతనము.

**మాహిష్యుఁడు** (సం.వి.అ.పుం.) : అంతఃపురము కావలికితగినవాడు.

**మాహేంద్రము** (సం.వి.అ.పుం.) : దినము యొక్క పదుమూడవ భాగము. (చూ. దినము)

**మాహేయి** (సం.వి.ఈ.స్త్రీ.) : ఆవు, గోవు.

**మాహేశ్వరి** (సం.వి.ఈ.స్త్రీ.) : ఒక మాతృక. (చూ. మాతృక)

**మాళిగ** (వై.వి.) : మాడుగు.

## మి

**మింగడ** (దే.వి.) : మీఁగడ యొక్క రూపాంతరము.

**మించిలి** (దే.వి.) : (చూ.) జిబిలిక, నిశాంకుశ.

**మించు** (దే.అ.క్రి.) : 1. అతిశయించు; 2. అతిక్రమించు. (వి.) : 1. పురుష పాదతర్జన్యాభరణము; 2. మెఱపు; 3. ప్రకాశము; 4. ఆధిక్యము.

**మించేగాలు** (దే.వి.) : (మించు + కాలు) దక్షిణపాదము.

**మించేబోఁడి** (దే.వి.) : (మించు+పోఁడి) 1. మెఱపు వలె మనోజ్ఞురాలగు ఆఁడుది; 2. ఆఁడుది. (రూ. మించుఁబోఁణి.)

**మించేదల** (దే.వి.) : 1. అతిక్రమణము; 2. ఆధిక్యము.

**మింజుమలే** (హిం.అవ్య.) : దానిలో నొకపాలు.

**మింటితెరువరి** (దే.వి.) : (మిన్ను + తెరువరి) 1. సూర్యుఁడు; 2. అమరుఁడు.

**మింఠుఁడు** (సం.వి.అ.పుం.) : మిండ గాఁడు, విటుఁడు.

**మిండ** (దే.వి.) : రక్తపుచ్ఛిక. (వై.విణ.) : వృత్తియందు మిండఁడునకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. (ఉదా. మిండ తపసి; (విట తపస్వి) మిండతుమ్మెద; (మగ తుమ్మెద) మిండవడ్డి. (అధిక మగువడ్డి.)

**మిండఁడు** (వై.వి.) : 1.విటుఁడు; 2.పురుషుఁడు. (విణ.) : అధికుఁడు. (వృత్తి యందు అంత్యవర్ణ లోపము. చూ. మిండ.)

**మిండగాఁడు** (దే.వి.) : (మిండ + కాఁడు) మిండఁడు. (స్వార్థమున కాఁడు.)

**మిండగీఁడు** (దే.వి.) : మిండగాఁడు యొక్క రూపాంతరము.

**మిండత** (దే.వి.) : (మిండదు + త) జారిణి.

**మిండటీకము** (ద్వ.వి.) : (మిడదు + టీకము) జారత్వము.

**మిండలకోరి** (ద్వ.వి.) : మిండత, జారిణి. (ఇది తగవు గోరివంటిది.)

**మిక్కటము** (దే.విణ.) : మిక్కిలి, అధికము.

**మిక్కిలి** (దే.విణ.) : 1. అధికము; 2. శ్రేష్ఠము.

**మిక్కిలివాఁడు** (దే.విణ.) : అధికుఁడు.

**మిక్కిలికంటివేల్పు** (దే.వి.) : (మిక్కిలి కన్ను + వేల్పు) శివుఁడు, ముక్కంటి.

**మిక్కిలికన్ను** (దే.వి.) : త్రిపురాంతకుని ఫాల నేత్రము. (రూ. మిక్కిలికను.) (చూ. మొన. మూడవ యర్థము నుదాహరణము.)

**మిక్కిలు** (దే.అ.క్రి.) : మీఱు, అతిశయించు.

**మిక్కుటము** (దే.విణ.) : మిక్కుటము యొక్క రూపాంతరము. (అధికమునకు)

**మిగత** (దే.వి.) : మిగులు, శేషము.

**మిగులు** (దే.అ.క్రి.) : 1.శేషించు; 2. అతిశయించు; 3. మట్టుమీఱు.

**మిగులుచే** (దే.స.క్రి.) : మిగులఁ జేయు. (రూ. మిగుల్చు. శేషింపఁ జేయుటకు.)

**మిటమిట** (దే.వి.) : 1.కాయుట యందగు ధ్వన్యనుకరణము; (చూ. మిగులు మూడవ యర్థము) 2. మండుట యందగు ధ్వన్యనుకరణము.

**మిటమిటన** (దే.వి.) : మిటమిట యనుట. (విశేషణ మగుచో మిటమిటని.)

**మిటాయి** (హిం.వి.) : పిండివంట. (రూ. మిఠాయి.)

**మిటారము** (దే.వి.) : 1. నిక్కు; 2. అతిశయము.

**మిటారి** (దే.వి.) : 1. మదము గల యాఁడుది; 2. ఆఁడుది. (ప్రమద) (విణ.) : 1. మదము గలది; 2. నిక్కు గలది; 3. ఉన్నతిగలది.

**మిటారించే** (దే.అ.క్రి.) : 1. నిక్కు; (మిటారించు క్రియకు చనుదోయి కర్త.) 2. విజృంభించు; 3. అతిశయించు.

**మిట్ట** (దే.వి.) : ఉన్నతభూమి. (విణ.) : 1. ఉన్నతము; (మిట్టపండ్లు) 2. తీక్ష్ణము.

**మిట్టమిఱ్ఱు** (దే.వి.) : (మిఱ్ఱుమిఱ్ఱు) అత్యున్నత భూమి. (విణ.) : అత్యున్నతము.

**మిట్టాడు** (దే.అ.క్రి.) : (మిట్టి+ఆడు) సంచరించు.

**మిట్టించు** (దే.అ.క్రి.) : ఎగురు, మిట్టు. (చూ. ఉలికిపాటు.)

**మిట్టిపడు** (ద్వ.అ.క్రి.) : మిట్టిపడుట.

**మిట్టు** (దే.అ.క్రి.) : ఎగురు, మిట్టించు.

**మిడి** (దే.వి.) : మిడిసిపాటు, గర్వము. (విణ.) : 1.మిడిసిపాటు గలది; 2.ఉన్నతము; 3. తీక్ష్ణము.

**మిడిగ్రుడ్లవాఁడు** (దే.విణ.) : ఉన్నేత్రుఁడు.

**మిడిగ్రుడ్లు** (దే.వి.బ.) : ముందటి కుఱికిన కనుగ్రుడ్డులు.

**మిడినాగు** (దే.వి.) : ఎగిరియెగిరి పడు సర్ప విశేషము.

**మిడిపండ్లవాఁడు** (దే.విణ.) : మిట్ట పండ్లవాఁడు, దంతురుఁడు.

**మిడిపండ్లు** (దే.వి.బ.) : మిట్టపండ్లు (చూ. తెఱ్ఱ.)

**మిడిమేలము** (దే.వి.) : మిడిసిపాటు.

**మిడియ** (దే.వి.) : వేదవాక్యము.

**మిడియు** (దే.అ.క్రి.) :1.ఎగురు, మిట్టు (చూ. తొలఁకు. వి. మొదటి యర్థము) 2. వెలికుఱుకు.

**మిడివోవు** (దే.అ.క్రి.) : (మిడిసి+పోవు) 1. తక్కు; 2. తొలఁగు.

**మిడిసిపడు** (ద్వ.అ.క్రి.) : మిట్టిపడు (చూ. మిడిసిపాటు)

**మిడిసిపాటు** (ద్వ.వి.) : మిట్టిపాటు.

**మిడుఁగు** (దే.వి.) : మిడుఁగుఱు.

**మిడుఁగుఱు** (దే.వి.) : 1. అగ్ని కణము, విస్ఫులింగము; 2. మిణుఁగుఱు బురుగు.

**మిడుకు** (దే.అ.క్రి.) : 1.బ్రదుకు; 2. త్రుళ్లు; 3.కదలు; 4.సంచరించు; 5.పరితపించు; 6.ఎండు.

**మిడుగు** (దే.వి.) : కఠినశిల.

**మిడుచు** (దే.స.క్రి.) : 1. ద్రవ ద్రవ్యమును బొట్టుబొట్టుగా విడుచు; 2. నెటిక విఱుచు.

**మిడుత** (దే.వి.) : ఒక దినుసు ఱెక్క పురుగు, శలభము.

**మిడుమిడుకను** (దే.అ.క్రి.) : (మిడుకు + మిడుకు + అను) మిడుకు, పరితపించు.

**మిణకరము** (దే.వి.) : ఏమియుతోచక భ్రమించుట.

**మిణకరించు** (దే.అ.క్రి.) : ఏమియు తోఁచక భ్రమించు.

**మిణుఁగు** (దే.వి.) : మిడుఁగు యొక్క రూపాంతరము.

**మిణుఁగుఱు** (దే.వి.) : మిడుగుఱు యొక్క రూపాంతరము. (అగ్ని కణమునకు.)

**మితంపచుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) లోభి.

**మితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. కొలది యిడబడినది; 2. తెలియబడినది.

**మితి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. కొలది; 2. గడువు.

**మిత్త** (వై.వి.) : స్నేహితుఁడు.

**మిత్తి** (వై.వి.) : 1. మృత్యుదేవత; (చూ. జముదాడి) 2. చావు.

**మిత్తిక** (వై.వి.) : మన్ను, మృత్తిక.

**మిత్తిగొంగ** (దే.వి.) : శివుఁడు, మృత్యుంజయుఁడు.

**మిత్తిచూలు** (దే.వి.) : కేతుగ్రహము.

**మిత్తివేఁటకాఁడు** (ద్వ.వి.) : శివుఁడు, మృత్యుంజయుఁడు.

**మిత్రము** (సం.వి.అ.న.) : 1.స్నేహితుఁడు; 2. దండెత్తిపోవువాని శత్రుదేశమున కావలి దేశపు రాజు. (రూ.మిత్రుడు) (పుం.డు.) : సూర్యుఁడు.

**మిథము** (సం.అవ్య.స్.) : పరస్పరము. (ఇది యీ యాధునిక గ్రంథమందొక చోటనే ప్రయోగింపఁబడి యున్నది.)

**మిథునము** (సం.వి.అ.న.) : 1. ఆలుమగల జత; 2. ద్వయము; 3. ఒక రాశి. (చూ.రాశి)

**మిథ్య** (సం.అవ్య.) : అసత్యము. (మిథ్యా దృష్టి = నాస్తికత్వము, మిథ్యామతి = భ్రాంతి)

**మిద్దియ** (దే.వి.) : మిద్దె.

**మిద్దె** (దే.వి.) : 1. మాడుపుమీద చదునుగా పలుకలు కప్పి గచ్చు పూసిన కప్పు; (మిద్దెటిల్లు.) (చూ.మిద్దియ) 2. తామరపూవు లోనగువాని లోపలి దిమ్మె; 3.ఉంగరము మీఁద దిమ్మెవలె నేర్పఱచెడి తదవయవ విశేషము. (మిద్దెటుంగరము.)

**మినమిన** (దే.వి.) : తళతళయను కాంతి విశేషము.

**మినమినలాడు** (దే.అ.క్రి.) : (మినమినలు + ఆడు) మినమినయని మెఱయు.

**మినహాయింపు** (హిం.వి.) : తగ్గింపు, తీసివేత.

**మిను** (దే.వి.) : మిన్నుయొక్క రూపాంతరము.

**మినుకు** (దే.అ.క్రి.) : మినుకుమినుక్కుమను. (అది ఊరకమినుకుచున్నది చూడుము.) (వి.) : 1. మినకు మినుక్కుమను కాంతి; (చూ. రూ. మిన్కు) (ఆమ్రేడితము నందు మినుమినుకు.) 2. కిరణము; 3. తాలిబొట్టు; 4. చిన్న బంగారు నాణెము; 5. బ. వేదము; (చూ. రూ. మిన్కు) (రూ. మినుకు మినుక్కుమను కాంతికిని వేదమునకును.) 6. వాక్కు.

**మినుకుఁజేడియ** (దే.వి.) : సరస్వతి.

**మినుకుమినుకుమను** (దే.అ.క్రి.) : (మినుకు మినుకు + అను) మినుకు మినుక్కు మని మెఱయు. (రూ. మినుకు మినుక్కుమను. మొ.)

**మినుకులబరణి** (దే.వి.) : సూర్యుఁడు, త్రయీ తనువు.

**మినుకులయిక్క** (దే.వి.) : (మినుకులు + ఇక్క) సూర్యుఁడు, త్రయీతనువు.

**మినుక్కురను** (దే.అ.క్రి.) : (మినుక్కురు + అను) మినుక్కుమని మెఱయు.

**మినుచూలు** (దే.వి.) : వాయువు, నభస్వంతుఁడు.

**మినుపపోఁక** (దే.వి.) : (మినుము+పోక) భక్ష్య విశేషము.

**మినుమినుకను** (దే.అ.క్రి.) : (మినుమినుకు + అను) మినుకు మినుకుమను. (చూ. మల్లామడి.)

**మినుము** (దే.వి.) : 1. సస్యవిశేషము; 2. బ. ధాన్య విశేషము, మాషము.

**మినుసిగవేల్పు** (ద్వ.వి.) : శివుఁడు, వ్యోమకేశుఁడు.

**మిన్న** (వై.వి.) : రత్నము. (విశే.) : శ్రేష్ఠము.

**మిన్నక** (దే.అవ్య.) : (చూ.) ఊరక.

**మిన్ను** (దే.వి.) : ఆకాశము.

**మిన్నుకొలఁకు** (దే.వి.) : ఆకాశగంగ, సురదీర్ఘిక. (చూ. మించుఁగాలు.)

**మిన్నుమన్ను** (ద్వ.వి.) : ఆకాశమును భూమియు, రోదసి.

**మిన్నువాఁకతాలుపు** (ద్వ.వి.) : శివుఁడు, గంగాధరుఁడు.

**మిన్నేఱు** (దే.వి.) : (మిన్ను + ఏఱు) ఆకాశగంగ, స్వర్ణది.

**మిన్వాఁక** (దే.వి.) : మిన్నువాఁక యొక్క రూపాం తరము.

**మిమ్మటము** (దే.విశే.) : మిక్కటము.

**మిర** (సం.వి.ఆ.స్త్రీ.) : మేర, మర్యాద.

**మిరాసి** (హిం.వి.) : పారంపర్యముగా వచ్చు సొత్తు, హక్కు.

**మిరియము** (వై.వి.) : ఒక దినుసు సంబారువు, మరీచము.

**మిరెపకాండ్ర** (ద్వ.వి.) : (మిరెము + కాండ్ర) ఒకానకొ ముండ్లచెట్టు.

**మిరెపకాయ** (దే.వి.) : (మిరెము + కాయ) బృహన్మరీచము.

**మిరెము** (వై.వి.) : మిరియము యొక్క రూపాంతరము.

**మిర్మిట్లు** (దే.వి.బ.) : మిఱుమిట్లు యొక్క రూపాంతరము.

**మిఱు** (దే.విశే.) : మిఱుమిట్లు గలది. (ఆమ్రేడి తము నందు మిఱుమిఱు.)

**మిఱుమిట్లు** దే.వి.బ. (మిట్లు+మిట్లు) (కన్నులు) మిక్కిలి మిట్టుటలు. (మొదటి రూపము. మిఱు మిట్టులు.)

**మిఱుమిట్లుగొను** (దే.అ.క్రి.) : (మిఱుమిట్లు + కొను) (కన్నులు) మిక్కిలి చెదరు.

**మిఱ్ఱు** (దే.వి.) : ఉన్నతభూమి. (విశే.) : ఉన్నతము.

**మిలమిల** (దే.వి.) : 1. మినమిన; (చూ. మిల మిలలాడు) 2. మెదలుట యందగు ధ్వన్యను కరణము; 3. మెలఁగుట యందగు ధ్వన్యను కరణము.

**మిలమిలన** (దే.వి.) : మినమినలాడుట. (విశేషణ మగుచో.) (చూ. అలకన.)

**మిలమిలలాడు** (దే.అ.క్రి.) : (మిలమిలలు + ఆడు) మినమినలాడు.

**మిలాయించు** (హిం.స.క్రి.) : కలుపు.

**మివులు** (దే.అ.క్రి.) : మిగులు యొక్క రూపాం తరము. (మట్టుమీఱుటకు.)

**మిశ్రణము** (సం.వి.అ.న.) : మిశ్రీకరించుట, కలుపుట.

**మిశ్రము** (సం.విశే.) : (అ.ఆ.అ.) కలిసినది, మిశ్రితము.

**మిశ్రితము** (సం.విశే.) : (అ.ఆ.అ.) కలిసినది, మిశ్రితము.

**మిశ్రీకరించు** (సం.స.క్రి.) : మిశ్రము చేయు, కలుపు.

**మిశ్రేయ** (సం.వి.ఆ.స్త్రీ.అ.పుం.ము.) : అడవి సపాద.

**మిష** (సం.వి.అ.న.) : కపటము, నెపము.

**మిషి** (సం.వి.ఈ.స్త్రీ.) : జటామాంసి.

**మిస** (దే.వి.) : కాంతి విశేషము. (ఆమ్రేడితము నందు మిసమిస.)

**మిసమిస** (దే.వి.) : మెఱచుట యందగు ధ్వన్యను కరణము.

**మిసమిసమను** (దే.అ.క్రి.) : (మిసమిస + అను) మిసమిసయను. (రూ. మిసమిసను.)

**మిసి** (దే.వి.) : మత్స్యవిశేషము. (చూ. కల్లరుజు) (సం.ఇ.ఈ.స్త్రీ.) : 1. జటామాంసి; 2. ఓమము; 3. సదాప. (ఇ.ఈ.స్త్రీ.ఇ.పుం.) : అడవిసదాప.

**మిసిమి** (దే.వి.) : 1. నూతనకాంతి; 2. నవనీతము.

**మిసిమింతుఁడు** (దే.విణ.) : అలసినవాఁడు, శ్రాంతుఁడు.

**మిసిమింతురాలు** (దే.విణ.) : (మిసిమింతుఁడు + ఆలు) అలసినది, శ్రాంతురాలు.

**మిసుకు** (దే.అ.క్రి.) : కదలు.

**మిహి** (దే.విణ.) : శ్రేష్ఠము.

**మిహిక** (సం.వి.ఆ.స్త్రీ.) : మంచు, హిమము.

**మిహిరుఁడు** (సం.వి.అ.పుం.) : సూర్యుఁడు.

**మిళిందము** (సం.వి.అ.పుం.) : తుమ్మెద, భ్రమరము.

**మిళితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కలిసినది, మిశ్రము.

**మిళ్లి** (దే.వి.) : మిక్కిలి గరిఁటె, ఖజపము.

## మీ

**మీ** (దే.విణ.) : వృత్తియందు మీదు శబ్దమునకు మీది వర్ణము లోపింపగా మిగిలిన రూపము. (దీనికి పరుషములు పరములగునపుడు నుగాగమంబగు. ఉ.మీఁగడ, మీఁజెయి. మొ.)

**మీఁగండ్లమెకము** (దే.వి.గ్రా.) : (మీఁదు + కన్నులు + మెకము) శరభము, ఊర్ధ్వలోచనము.

**మీఁగడ** (దే.వి.) : (మీదు + కడ) కాఁగిన పాల మీఁది తెట్టె, పెరుగుమీది తెట్టె, మస్తువు.

**మీఁగడ పెరుగు** (ద్వ.వి.) : మీగడతోడి పెరుఁగు, శీఘ్రునము.

**మీఁగాలు** (దే.వి.) : (మీదు + కాలు) పాదోపరి భాగము.

**మీఁజెయి** (దే.వి.) : (మీదు + చెయి) కరోపరి భాగము.

**మీఁదిసాకిరి** (దే.వి.) : (మీదు+సాకిరి) ఉత్తరసాక్షి.

**మీఁదు** (దే.వి.) : 1. పరము; 2. ఉపరి భాగము; 3. భవిష్యత్కాలము; 4. దేవతకని నియమించిన ముడుపు.

**మీఁదుమిక్కిలి** (దే.విణ.) : కడుమిక్కిలి.

**మీట** (దే.వి.) : ఏతపుమ్రాని క్రింది యరభాగము. (ఏతపు మ్రాని మీఁది అరభాగము మునస.)

**మీటింగు** (ఆం.వి.) : సమావేశము, సభకూటమి.

**మీటు** (దే.స.క్రి.) : 1. ఎగఁజిమ్ము; 2. పొడుచు; 3. (తేలు) (వి.) : 1. ఉద్రేకము; (చూ. నాడు.) 2. పెంపు. (విణ.) : అధికము.

**మీఢము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విడువఁ బడినది. (కాల్మడి)

**మీనకేతనుఁడు** (సం.వి.అ.పుం.) : మన్మథుఁడు, మరుఁడు.

**మీనము** (సం.వి.) : 1. మత్స్యము; 2. ఒక రాశి (చూ. రాశి)

**మీనవల్లంకి** (వై.వి.) : నీటికుటికి మత్స్యములను బట్టెడు పక్షి విశేషము.

**మీనవల్లిక** (సం.వి.ఆ.స్త్రీ.) : మీనవల్లంకి.

**మీను** (వై.వి.) : మత్స్యము, చేప, ఝషము. (హల్లు పరమగుచో ఇందలి యుత్వమునకు వికల్పముగ లోపంబగు.)

**మీనురూపురిక్క** (వై.వి.) : రేవతీ నక్షత్రము.

**మీమాంస** (సం.వి.ఆ.స్త్రీ.) : కర్మబ్రహ్మ ప్రతిపాదక శాస్త్రము.

**మీమాంసకుఁడు** (సం.వి.అ.పుం.) : మీమాంసా శాస్త్రము తెలిసినవాడు.

**మీఱు** (దే.అ.క్రి.) : 1. అతిశయించు; 2. కడుచు. (స.క్రి.) : అతిక్రమించు (చూ. బానసీఁడు.) (దీనిని గొందఱు లఘు రేఫముగా వాడి యున్నారు.)

**మీలనము** (సం.వి.అ.న.) : 1. కనుమూయుట; 2.ఒక యర్థాలంకారము. (చూ. అలంకారము)

**మీలముచ్చు** (ద్వ.వి.) : మీనపల్లంకి.

**మీలితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మూయఁ బడినది.

**మీవడ** (ద్వ.వి.) : మీఁగడ యొక్క రూపాంతరము.

**మీసకట్టు** (దే.వి.) : (మీసము + కట్టు) మీసము యొక్క యేర్పాటు.

**మీసము** (దే.వి.) : మగవాని పై పెదవి మీఁది వెండ్రుకల వరుస, శ్మశ్రువు.

**మీసరము** (దే.విణ.) : శ్రేష్ఠము.

## ము

**ము** (దే.అప.) : అమహత్తులకును మహ న్నపుంసక ములకును ప్రథమైక వచనమునందు వచ్చెడు ప్రత్యయము. (వనము, అపత్యము, కళత్రము. మొ.) (విణ.) : 1.వృత్తియందు మూడు శబ్దము నకు ఆదేశముగా వచ్చెడు రూపము. (ఉ. ముక్కాఁక, ముక్కోటిక, ముచ్చవు కము, ముచ్చుట్టు, ముజ్జగము, ముత్తరము, ముత్తఱులు, ముత్తు నియ, ముత్త్రోవ, ముప్పూఁట, ముప్పేట, ముప్పొద్దు, ముమ్మాటు, ముమ్మాఱు, ముమ్మూడు, ముమ్మూల, ముల్లోకములు, ముప్వంక, మువ్వన్నె, మువ్వరుస, మువ్వెట్టి, మువ్వెత, మువ్వేసములు.) 2. ముందు శబ్దమునకు మీఁది వర్ణము లోపిం పఁగా మిగిలిన రూపము. (ముంగడ, ముంగు రులు, ముంజెయి.మొ.)

**ముంగ** (దే.వి.) : ఎన్నులమోపు. (వై. విణ.) : మూగ యొక్క రూపాంతరము.

**ముంగడ** (దే.వి.) : (ముందు + కడ) 1. ముందు చోటు, ఎదురు; 2. ముందు.

**ముంగమురము** (దే.వి.) : (ముందు + కయి + మురము) ముంజేత ధరించెడు కటక విశేషము.

**ముంగమురాము** (దే.వి.) : ముంగమురము యొక్క రూపాంతరము.

**ముంగమురారి** (దే. వి.) : (ముందు + కయి + మురారి) (చూ.) ముంగమురము (చూ. ముంగయి మురారి)

**ముంగయిమురారి** (దే. వి.) : (ముందు + కయి మురారి) (చూ.) ముంగమురము (చూ. ముంగయి మురారి)

**ముంగర** (దే.వి.) : ముక్కర యొక్క రూపాంతరము.

**ముంగల** (దే.వి.) : (ముందు+కలను) ముందుచోటు, ముందు. ముంగడ యొక్క రూపాంతరము.

**ముంగలి** (దే.విణ.) : 1. ముందు నడచునది, ముందు నడచువాఁడు; 2. మీఁదటి.

**ముంగలు** (దే.అ.క్రి.) : ముందునడచు.

**ముంగాము** (దే.వి.) : 1. పొట్లముగా మడిచిన తాటాకు మట్ట; 2. బెల్లము మొదలగు వాని నించిన బరువులో సగము.

**ముంగాముచీర** (దే.వి.) : ఆఁడువారు కట్టుకొనెడు ఒక దినుసు నారకోక.

**ముంగామురము** (దే.వి.) : ముంగుమురము యొక్క రూపాంతరము.

**ముంగామురారి** (దే.వి.) : ముంగ మురారి యొక్క రూపాంతరము. (ఇట్లు ఒకపాఠము. చూ. ముంగయిమురారి.)

**ముంగామురుగు** (దే.వి.) : (ముందు + కయి + మురుగు) (చూ.) ముంగమురము. (రూ. ముంగా మురువు)

**ముంగాలు** (దే.వి.) : (ముందు+కాలు) పాదాగ్రము, ప్రపదము.

**ముంగి** (దే.వి.) : ముంగిస.

**ముంగిముశాతనము** (గ్రా.వి.) : మౌనముగా నుండు మూర్ఖుని స్వభావము.

**ముంగిలి** (దే.వి.) : (ముంగల + ఇల్లు) 1. అంకణము యొక్క మధ్య ప్రదేశము; 2. అంకణము; 3. మధ్య ప్రదేశము. (సంధిని లోపవికారములు.)

**ముంగిస** (దే.వి.) : ముంగి, నకులము.

**ముంగిసమ్రాను** (దే.వి.) : ముంగిస రూపు గల మునస చివర. (చూ. మునుస)

**ముఁగురులు** (దే.వి.) : (ముందు + కురులు) నొసటిపై గునిసి యాడెడు ఉంగరపు వెంట్రుకలు, భ్రమరకము.

**ముంగేలు** (దే.వి.) : (ముందు + కేలు) ముంజెయి, ప్రకోష్ఠము.

**ముంగొంగు** (దే.వి.) : (ముందు + కొంగు) చెఱఁగుకొన.

**ముంగొన** (దే.వి.) : (ముందు + కొన) ముందటి కొన.

**ముంగోపము** (దే.వి.) : (ముందు + కోపము) ఓర్పు లేక తటాలున వచ్చు కోపము.

**ముంగోపి** (దే.విశ.) : ఓర్పులేక తటాలున కోపము చేసి కొనువాఁడు.

**ముంగోలు** (దే.విశ.) : (ముందు + కోలు) మొదటిది, ప్రాథమికము.

**ముంచే** (దే.ప్రే.) : మునుచు యొక్క రూపాంతరము.

**ముంచేకొను** (దే.స.క్రి.) : ఆక్రమించుకొను. (వానిని వ్యాధి ముంచుకొన్నది)

**ముంజకేశుఁడు** (సం.వి.అ.పుం.) : విష్ణువు, వెన్నుఁడు.

**ముంజము** (సం.వి.అ.పుం.) : ముంజి గడ్డి, పొనిక.

**ముంజి** (వై.వి.) : బ్రహ్మచారి కట్టుకొనెడు ముంజదర్భ మొలత్రాడు.

**ముంజికాఁడు** (దే.వి.) : బ్రహ్మచారి.

**ముంజె** (దే.వి.) : లేఁతతాటికాయలోని గిజురు.

**ముంజెయి** (ద్వ.వి.) : (ముందు+చెయి) మనికట్టు వఱకుగల మోచేతి క్రిందిచేయి, ప్రకోష్ఠము. (రూ. ముంజే)

**ముంజెరము** (దే.వి.) : (ముకు + చెరమ) నాసాపుటము.

**ముంజూరు** (దే.వి.) : (ముందు + చూరు) చూరుముందటి భాగము, వాచూరు.

**ముండ** (దే.వి.) : 1.విధవ; 2.బ.వేశ్య; (చూ. మరగు. స.క్రి.) (సం.వి.) : బోడతరము. (అ.పుం,న.ము.) : తల.

**ముండనము** (సం.వి.అ.న.) : 1.క్షౌరము; 2. రక్షణము.

**ముండమోపి** (దే.వి.) : ముండమోసినది, విధవ.

**ముండమోయు** (దే.అ.క్రి.) : 1. వైధవ్యము నొందు; 2. వ్యర్థమగు.

**ముండరి** (దే.విశ.) : (ముండలు + అరి) ముండల మారి. (చూ. చుట్టము మూడవ అర్థము)

**ముండలమారి** (దే.విశ.) : వేశ్యాసంగమశీలుడు, వైశికుఁడు.

**ముండి** (సం.వి.న్.పుం.) : 1. మంగలవాడు; 2. బోడతరము.

**ముండితుఁడు** (సం.విశ.) : (అ.ఆ.అ.) 1.తలబోడియైనవాఁడు; 2.తలగొఱుగఁబడిన వాఁడు.

**ముండుఁడు** (సం.వి.అ.పుం.) : 1. రాహువు; 2. ఒక అసురుఁడు. విశ. 1. బోడితలవాఁడు; 2. తెగిన చేతులు కాళ్లు లోనగునవి కలవాఁడు.

**ముండ్లకంచె** (దే.వి.) : ముండ్లకంప వెలుగు, ఆవేష్టకము.

**ముండ్లపంది** (దే.వి.) : ఏఁదుపంది, శల్యము. (రూ. ములుపంది.)

**ముంత** (దే.వి.) : 1. జోడ్తవెలవంటి మాని పాత్రము; 2. మానిక.

**ముంతపొగ** (దే.వి.) : మూతికి కట్టుటకు కాల్చి ముంతలో వేసిన మిరెపకాయల పొగ.

**ముంతమామిడి** (దే.వి.) : ఒకానొక చెట్టు, అగ్రబీజము.

**ముందర** (దే.వి.) : 1. మునుపు; 2. మొదలు; 3.ఎదురు. (చూ. ముందఱ.)

**ముందఱ** (దే.వి.) : 1. ఎదురు; 2. మునుపు; 3. మొదలు.

**ముందటిమ్రాను** (దే.వి.) : అరిణ నిలుపుటకై అడ్డముగా గట్టబడిన మ్రాను.

**ముందల** (దే.వి.) : (ముందు+తల) శిరోగ్రభాగము.

**ముందు** (దే.వి.) : 1. ఎదురు; 2. పూర్వకాలము.

**ముందుపడు** (ద్వ.అ.క్రి.) : మునుకొను, ముందగు. (ఏ పనికిని వాఁడు ముందుపడును.)

**ముంపు** (దే.వి.) : 1. ముంచుట; 2. గుంపు.

**ముంపుగొను** (దే.అ.క్రి.) : (ముంపు + కొను) గుంపుగూడు.

**ముకద్దం** (హిం.వి.) : గ్రామపు పెద్ద (రూ. మొఖద్దం)

**ముకద్దమా** (హిం.వి.) : వ్యవహారము, పని. (రూ. మొఖద్దమా.)

**ముకాబిలా** (హిం.వి.) : సంప్రతింపు. (రూ. మొఖాబిలా.)

**ముకాసా** (గ్రా.వి.) : పన్నులేకుండ నియ్యబడిన గ్రామము. (రూ. మొఖాసా.)

**ముకు** (వై.వి.) : ముక్కు యొక్క రూపాంతరము.

**ముకుందము** (సం.వి.అ.న.) : ఎఱ్ఱ దామర. (పుం.) : 1. ఒక నిధి; (చూ. నిధి) 2. కుందురుష్క మనెడు గంధ ద్రవ్యము; 3. పాదరసము; 4. మణి విశేషము.

**ముకుందుఁడు** (సం.వి.అ.పుం.) : విష్ణువు, వెన్నుఁడు.

**ముకుఁగోళ్లు** (దే.వి.బ.) : (ముకు + క్రోళ్లు) నాసారంధ్రములు. (రూ. ముక్కుఁగ్రోళ్లు)

**ముకుఁజెఱమ** (దే.వి.) : (ముకు + చెఱమ) నాసాపుటము (రూ. ముక్కుఁజెఱమ.)

**ముకుద్రాడు** (దే.వి.) : (ముకు + త్రాడు) ఎడ్లకు ముక్కున గ్రుచ్చెడు దారము, నాధము. (రూ. ముక్కుఁ ద్రాడు.)

**ముకుటము** (ఉభ.దే.వి.) : ముక్కుటము యొక్క రూపాంతరము. (సం.అ.న.) : మకుటము యొక్క రూపాంతరము.

**ముకుదూలము** (వై.వి.) : ముక్కునడిమి యెముక, (రూ. ముక్కుదూలము.)

**ముకుదొమ్మ** (దే.వి.) : మత్స్యవిశేషము.

**ముకుబంతి** (వై.వి.) : ధేనువులకు శైత్యముచే నాసారంధ్రముల యందు గలిగెడు కేశావృత పిండరూపవ్యాధి విశేషము. (దీనిని సేకరించి యుంచుకొని మఱియొక దానికి ఆ వ్యాధి కలిగి నప్పుడు తన్నివారణార్థము దీనిఁగొని బడిసి వేయుదురు.)

**ముకురము** (సం.వి.) : 1. అద్దము; 2. పొగడ; 3. మల్లెపువ్వు; 4. కుమ్మరిలాతము.

**ముకుష్టకము** (సం.వి.అ.పుం.) : మకుష్టకము యొక్క రూపాంతరము.

**ముకుళము** (సం.వి.అ.పుం) : అరవిరి మొగ్గ, (పుం.) : అభినయ హస్త విశేషము. (అయిదు వ్రేళ్లను కొనలు గూర్చిపట్టినది.)

**ముకుళించు** (సం.ఆ.క్రి.) : మొగుడు. (ఆం. ప్రే.) : మొగుడ్చు.

**ముకుళితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ముకుళించినది.

**ముకుళీభవించు** (సం.అ.క్రి.) : ముకుళించు, మొగుడు.

**ముకూలకము** (సం.వి.అ.పుం.) : దంతిచెట్టు.

**ముక్క** (దే.వి.) : తునుక, ఖండము.

**ముక్కంటి** (దే.వి.) : (మూడు + కన్ను) శివుఁడు, త్రిలోచనుఁడు.

**ముక్కంటిచెలి** (దే.వి.) : కుబేరుఁడు, త్ర్యంబక సఖుఁడు.

**ముక్కంటిచుక్క** (దే.వి.) : ఉత్తరభాద్ర పదా నక్షత్రము.

**ముక్కడి** (దే.వి.) : (మూఁగు+కాఁడి) 1. దుక్కి చాలించి ఆహారమునకు పోవునపుడు అరక లన్నింటి నొక్కచో ప్రోగు చేసి యొక్కటిగా జేర్చి నిలిపినట్టి యా అరకల కాండ్ల మొత్తము; 2. అనేకులకు ఒక పెట్టున తగిలెడు వ్యాధి.

**ముక్కద్దము** (వై.వి.) : (ముక్కు + అద్దము) సులోచనము.

**ముక్కన్ను** (దే.వి.) :(మూడు+కన్ను) మూడవకన్ను.

**ముక్కపురుగు** (దే.వి.) : తవుటిపురుగు.

**ముక్కరమాను** (దే.వి.) : పుల్లిరుసు తిరుగు చట్టము.

**ముక్కరము** (దే.వి.) : (ముక్కు + కారెము) నాసా రంధ్రము, ముకుఁగోళ్లు. (సంధిని వర్ణవికారము)

**ముక్కఱ** (దే.వి.) : (ముక్కు + ఱాయి) నాసికాభరణ విశేషము, నాసామణి. (రూ. ముక్కర. సంధిని వర్ణ వికారాజకము.)

**ముక్కలిపీఁట** (దే.వి.) : ముక్కాలిపీఁట యొక్క రూపాంతరము.

**ముక్కాని** (దే.వి.) : (మూడు+కాని) మూడుకానులు.

**ముక్కారు** (దే.వి.) : (మూడు+కారు) మూడుకారులు. (చూ. కారు)

**ముక్కాలిపీఁట** (దే.వి.) : (మూడు+కాలు+పీట) మూడుకాళ్ల మర్చిన యెత్తుబల్ల.

**ముక్కాలు** (దే.వి.) : (మూడు+కాలు) మూడుకాళ్లు.

**ముక్కిడి** (దే.వి.) : ఒక చెట్టు.

**ముక్కు**(దే.అ.క్రి.) : చెడు. (వై.) : (ఏదైన కష్టమైన పనిని చేయునపుడు.) శ్వాసనమును బిగఁబట్టు. (వి.) : 1.చంచువు; 2.చూచుకము; 3.నాసిక.

**ముక్కుఁగమ్మి** (వై.వి.) : (ముక్కు+కమ్మి) ముక్కు పోఁగు.

**ముక్కుటము** (దే.వి.) : నారమడి, క్షౌమము.

**ముక్కుదాడిమ** (వై.వి.) : ఒక చెట్టు.

**ముక్కుపూరెడు** (దే.వి.) : ఒక దినుసు పూరేడుపిట్ట.

**ముక్కుపోఁగు** (దే.వి.) : ముక్కుఁగమ్మి, నత్తు.

**ముక్కుముంగర** (దే.వి.) : ఒకానొక అడవిచెట్టు.

**ముక్కులు** (దే.వి.బ.) : 1. మిక్కిలి చిన్న నూకలు; 2. భక్ష్యవిశేషము.

**ముక్కుస** (ద్వ.వి.) : (మూడు + కుంచము) మూడు కుంచములు.

**ముక్కూరు** (దే.అ.క్రి.) : అజ్ఞానమును పొందు. (ఇది యీ యొక్క చోటనే యున్నది.)

**ముక్కొటిక** (దే.వి.) : (మూడు + కొటిక) త్రిపురములు.

**ముక్కొను** (దే.అ.క్రి.) : (మును+కొను) ముందుకొను.

**ముక్కొమ్ముమెకము** (దే.వి.) : (ముందు + కొమ్ము మెకము) మనుబోతు, ఋశ్య మృగము.

**ముక్కోణము** (దే.వి.) : (మూడు + కోణము) త్రికోణము.

**ముక్కోపము** (దే.వి.) : ముంగోపము.

**ముక్కోల** (దే.వి.) : (మూడు + కోల) త్రిదండము.

**ముక్త** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.ముత్తెము; 2.అంకుటాలు. (విణ.) : 1.ముక్తి నొందినది; 2.విడువఁబడినది.

**ముక్తసరు** (హిం.వి.) : సంగ్రహమైన.

**ముక్తాయింపు** (దే.వి.) : ముగింపు.

**ముక్తావళి** (సం.వి.ఇ.ఈ.స్త్రీ.) : ముక్తాహారము.

**ముక్తాస్ఫోటము** (సం.వి.అ.పుం.) : ముత్తెపుఁజిప్ప.

**ముక్త్యార్** (హిం.వి.) : స్వతంత్రుఁడు.

**ముక్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. మోక్షము; 2. విడుపు.

**ముఖము** (సం.వి.అ.న.) : 1.మొగము; 2.నోరు; 3.మాట; 4. ఒక నాటకసంధి; (చూ.సంధి) 5. ఇల్లులోనగువాని ముందటి భాగము; 6. ఉపాయము; 7. ప్రయత్నము.

**ముఖరము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. మ్రోగునది; 2. అసంబద్ధ వచనము లాడునది.

**ముఖవాసన** (సం.వి.ఆ.స్త్రీ.అ.పుం,న.) : కర్పూరాదివాసన.

**ముఖవీణ** (సం.వి.ఆ.స్త్రీ.) : మొగవీణె.

**ముఖశాల** (సం.వి.ఆ.స్త్రీ.) : తలవాకిటి చావడి, మొగసాల.

**ముఖ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ప్రధానము, గామిడి.

**ముగింపు** (దే.వి.) : సమాప్తి. (చూ. ఆరగింపు)

**ముగితి** (వై.వి.) : మోక్షము.

**ముగియిక** (దే.వి.) : ముగింపు, సమాప్తి.

**ముగియు** (దే.అ.క్రి.) : సమాప్తమగు. (ప్రే. ముగించు.)

**ముగుద** (వై.వి.) : 1. ముగ్ధ; 2. ఆఁడుది.

**ముగురు** (దే.స.ర్వ.) : ముగ్గురు యొక్క రూపాంతరము.

**ముగ్గ** (దే.వి.) : ఒకానొక చెట్టు. (అప్ర.)

**ముగ్గు** (దే.వి.) : ప్రుగ్గు యొక్క రూపాంతరము.

**ముగ్గురు** (దే.స.బ.) : (మూడు + గురు) మూడు నకు మహన్మహత్యర్థక బహువచనాంతాదేశము.

**ముగ్గొయ్య** (దే.వి.) : (ముందు + కొయ్య) అగ్ర దండము. (విణ.) : అసాధ్యము.

**ముగ్ధ** (సం.వి.) : స్వీయాంతర్భేద విశిష్ట నాయికా విశేషము. (ఉదయించుచున్న యౌవనము గలది, పండ్రెండేండ్ల పర్యంతమైన వయసు గలది.) (విణ.) : 1.చక్కనిది; 2. తెలివిలేనిది; 3. క్రొత్తది.

**ముచుండ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఎఱ్ఱమల్లె.

**ముచ్చె** (దే.వి.) : ముచ్చివాఁడు, చిత్రకారుఁడు.

**ముచ్చెక** (దే.వి.) : (ముందు + సిక) టెంకాయ తాటికాయ లోనగువాని తొడిమక్రింది బిల్ల. (సంధిని వర్ణవికారము.)

**ముచ్చిచ్చె** (దే.వి.) : (మూడు + చిచ్చు) త్రేతాగ్ని.

**ముచ్చిరి** (దే.విణ.) : 1. శోకము నొందినవాఁడు; 2. దుఃఖము నొందినవాఁడు.

**ముచ్చిరు** (దే.అ.క్రి.) : 1. శోకించు; 2. దుఃఖించు.

**ముచ్చిలి** (దే.వి.) : పెడతల యందలి గుంత, ఆవటువు. (రూ. ముచ్చిలి గుంట.)

**ముచ్చిలించె** (దే.స.క్రి.) : దొంగిలించు. (చూ. ముచ్చు)

**ముచ్చిలిక** (దే.వి.) :1.వాదిప్రతివాదులు మధ్యస్థ లకు మీరు తీర్పుచేసిన ప్రకారము ఒప్పుకొని యెద మని వ్రాసి యిచ్చెడు ఒడంబడిక; 2. సేద్యము చేయుకాఁపులు నేలకలవారికి వ్రాసి యిచ్చెడు ఒడంబడిక.

**ముచ్చిలిపాటు** (దే.వి.) : కునికిపాటు.

**ముచ్చిలు** (దే.స.క్రి.) : ముచ్చిలించు, దొంగిలించు.

**ముచ్చివుక** (దే.వి.) : (మూడు + చివుక) ముద్దుగులము.

**ముచ్చె** (వై.వి.) : మీఁగాలుగుదికాలు సైతము కప్పుకొని యుండెడు పాపోసు, పార్ష్ణిత్ర.

**ముచ్చెబంగారు** (వై.వి.) : (చూ.) కాకిబంగారు.

**ముచ్చెలుక** (దే.వి.) : (మూడు+చెలక) దుగులము బేడ. (ఇది విచార్యము.)

**ముచ్చెవాఁడు** (దే.వి.) : చర్మకారుఁడు, మాదిగవాఁడు.

**ముచ్చె** (దే.వి.) : (ముడ్డి + పూస) ముడ్డి యందలి పూస, త్రికము (సంధియందు వర్ణ వికారము)

**ముచ్చెంగి** (దే.వి.) : మత్స్యవిశేషము. (చూ. కొరద)

**ముచ్చెట** (దే.వి.) : 1.సల్లాపము; (మీ ముచ్చట అయినదా.) 2.వృత్తాంతము; 3.కోరిక; 4.ప్రేమము.

**ముచ్చెటకాఁడు** (దే.విణ.) : కోరిక కలవాఁడు.

**ముచ్చెటపడు** (దే.అ.క్రి.) : కోరు.

**ముచ్చటించు** (దే.అ.క్రి.) : ముచ్చటలాడు.

**ముచ్చెట్లు** (దే.వి.) : (మూడు + చోట్లు) మూడు ప్రదేశములు. (ఇక్కడ చఱచుటకు తుడుచుట యర్థము.)

**ముచ్చెముడుఁగు** (వై.అ.క్రి.) : (ముడుగు + ముడుగు) మిక్కిలి ముడుఁగు. (ఇక్కడ ముడుఁగు టకు చేష్టలుడుగుట యర్థము.)

**ముచ్చెవలము** (దే.వి.) : (మూడు + చవలము) మూడు చవలములు.

**ముచ్చె** (దే.వి.) : ప్రుచ్చు యొక్క రూపాంతరము.

**ముజేరా** (హిం.వి.) : తిరిఁగి రావలసిన సొమ్ము.

**మజుముదారు** (హిం.వి.) : లెక్కలను పరీక్షించు నొక యుద్యోగస్థుఁడు.

**ముటము** (దే.వి.) : ముద్దపిడుక.

**ముటాలు** (గ్రా.వి.బ.) : వంట చెఱకు, కట్టెలు.

**ముట్టఁబడు** దే.అ.క్రి. (ముట్టఁ+పడు) దయ్యు. (చూ. తూఱఁబడు.)

**ముట్టడము** (దే.వి.) : 1. నిర్బంధము; 2. ముట్టడించుట.

**ముట్టడి** (దే.వి.) : 1.నిర్బంధము; 2.ముట్టడించుట.

**ముట్టడించు** (దే.స.క్రి.) : కోట లోనగుదాని చుట్టుకొని నిర్బంధించు.

**ముట్టణము** (దే.వి.) : ముట్టడము యొక్క రూపాంతరము. (ముట్టడించుటకు.)

**ముట్టించు** (దే.స.క్రి.) : 1. ముట్టఁజేయు; 2. కాల్చు; 3. రగుల్చు.

**ముట్టికాళ్లవాఁడు** (దే.విశ.) : ముట్టు మోఁకాళ్లు గలవాఁడు, సంజ్ఞువు.

**ముట్టియ** (దే.వి.) : ముట్టె.

**ముట్టు** (దే.స.క్రి.) : 1. తాఁకు; 2. శత్రువును దాఁకు; 3. మర్మముదాఁకు; 4. ముట్టడించు; 5. కడముట్టు. (వి.) : 1.తాఁకుడు; (చూ.కోల్తల మొదటి యర్థము.) 2. (ఆఁడుదాని) రజస్సు; 3. కొఱముట్టు, పరికరము. (విశ.) : రజస్వల.

**ముట్టుకొను** (దే.స.క్రి.) : 1.ముట్టడించు; 2. ఆక్రమించు.

**ముట్టుకోలు** (దే.వి.) : ముట్టడి.

**ముట్టుకోలుగొను** (దే.స.క్రి.) : (ముట్టుకోలు + కొను) ముట్టడించు. (రూ. ముట్టుకోల్గొను.)

**ముట్టుకోలుపట్టు** (దే.స.క్రి.) : (ముట్టుకోలు + కొను) ముట్టడించు. (రూ. ముట్టుకోల్పట్టు.)

**ముట్టుకోలుపఱచు** (దే.స.క్రి.) : (ముట్టుకోలు + కొను) ముట్టడించు.

**ముట్టుత** (దే.వి.) : ముట్టుది, రజస్వల.

**ముట్టునీళ్లు** (దే.వి.బ.) : బహిష్ఠయైన యాఁడుది నాలవనాడు చేయు స్నానము. (ముట్టునీళ్లు మునిఁగి అనునప్పుడు మునిఁగి యనుటకు చేసియని యర్థము)

**ముట్టుపడు** (ద్వ.అ.క్రి.) : సంకటమగు.

**ముట్టుపాటు** (ద్వ.వి.) : సంకటము.

**ముట్టె** (దే.వి.) : పందిముక్కు, పోత్రము.

**ముట్టెచేప** (దే.వి.) : మత్స్యవిశేషము.

**ముట్టెమెకము** (దే.వి.) : పంది, పోత్రి.

**ముట్టెమోపు** (దే.వి.) : కార్యనిర్వాహక సమయము. (వాఁడు ఇన్నిదినములు కానిమ్మని ముట్టె మోపున నాచేత కాదన్నాఁడు.)

**ముఠా** (హిం.వి.) : కొన్ని గ్రామములు, జన సమూహము.

**ముడి** (దే.వి.) : 1. దారములోనగువాని ముడి, గ్రంథి; 2. వెంద్రుకల ముడి; 3. చెట్టులోనగు వాని బుడిపి; 4. ఎద్దు మూఁపురము; (చూ. ముడిగిబ్బ) 5. కలహము; (చూ. ముళ్లయతి) 6. ముడి వలె వ్రాసెడి కొన్ని హల్లుల రూపాంతరము; (తాముడి, నాముడి, మాముడి.) 7.సంధి; (చూ.ముడికాఁడు) 8.ముడ్డి యొక్క రూపాంతరము; 1. ఖండము కానిది; (ముడిపోఁక, ముడి బియ్యము.) 2.వికసింపనిది. (ముడి పూలు) (ముడిజొన్నలు అనుచో పొట్టుతోడి జొన్నలని యర్థము.)

**ముడికాఁడు** (దే.విశ.) : సంధానము చేయువాఁడు, సంధాయకుఁడు.

**ముడికాళ్లవాఁడు** (దే.విశ.) : ముట్టికాళ్లవాఁడు, సంజ్ఞువు.

**ముడికొక్కు** (దే.వి.) : ఒకానొక పురుగు.

**ముడిగిబ్బ** (దే.వి.) : ఆఁబోతు. (చూ. కక్కరము.)

**ముడిగొను** (దే.స.క్రి.) : (ముడి+కొను) ముడుఁచు. (ప్రే. ముడికొలుపు.)

**ముడిచె** (దే.వి.) : సాంక్రామిక రోగము.

**ముడిబట్ట** (దే.వి.) : అంచుకమ్ములు లేని వస్త్రము.

**ముడిబొమ** (దే.వి.) : ముడివడ్డబొమ.

**ముడియ** (దే.వి.) : 1. మూట; 2. పందెము.

**ముడియవిడుపు** (దే.వి.) : ముడి విడుచు దొంగ. (దూ. ముడియవిడ్పు.)

**ముడివడు** (ద్వ.అ.క్రి.) : (ముడి+పడు) 1.ముడి గలదియగు; 2.సంధించు; 3.పెనఁగొను; 4.కలుగు.

**ముడివాటు** (ద్వ.వి.) : ముడివడుట. (బొమల్ ముడివాటు – బొమల యొక్క ముడివాటు.)

**ముడివెట్టు** (దే.స.క్రి.) : (ముడి+పెట్టు) ముడివేయు.

**ముడుఁగబాఱు** (ద్వ.అ.క్రి.) : (ముడుఁగ౯+పాఱు) ముడుఁగు. (స్వార్థమున పాఱు. చూ.పాఱు.)

**ముడుఁగు** (వై.అ.క్రి.) : 1. ముకుళించు; 2. తగ్గు; 3. సంకోచించు; 4. చేష్టలుడుగు. (చూ. ముచ్చుముడుఁగు)

**ముడుఁగుఁదామర** (దే.వి.) : (ముడుఁగు + తామర) పొత్తిదామర, నమస్కారి.

**ముడుఁచే** (వై.స.క్రి.) : 1. ముడుఁగఁ జేయు; 2. ముడివెట్టు. (ఈ యర్థమౌపచారికము.)

**ముడుచే** (దే.స.క్రి.) : ముడివేయు.

**ముడుత** (దే.వి.) : 1. వస్త్రపునెఱి; 2. కడుపు మీఁది వళి.

**ముడిపరి** (దే.వి.) : (ముడుపు + అరి) ముడుపు పట్టినవాఁడు.

**ముడుపు** (దే.వి.) : 1. ధనము ముడిచిన మూట; 2. ధనము.

**ముడుము** (దే.వి.) : మోఁకాలు, జానువు.

**ముడుసు** (దే.వి.) : 1. ముడ్డిపూస; 2. ఎముక.

**ముడేకము** (దే.వి.) : ఏగాని.

**ముడ్డి** (దే.వి.) : మూడియొక్క రూపాంతరము, గుదము.

**ముడ్డిపూస** (దే.వి.) : వెన్నెముక క్రింది చివరపూస, త్రికము.

**ముణుఁగుఁదామర** (దే.వి.) : ముడుఁగుఁ దామర యొక్క రూపాంతరము.

**ముతంగి** (సం.వి.ఈ.స్త్రీ.) : తెల్లగిసె.

**ముతరాచ** (ద్వ.వి.) : ముత్తరాచ యొక్క రూపాంతరము.

**ముతుక** (దే.విణ.) : ముదుక యొక్క రూపాంతరము.

**ముత్త** (దే.విణ.) : వృద్ధ, వృద్ధుఁడు.

**ముత్తరాచ** (ద్వ.వి.) : ఒక శూద్రజాతి. (ముత్తరాచ వాఁడు, ముత్తరాచది.)

**ముత్తవపులగము** (దే.వి.) : చిట్టాముదపుఁజెట్టు, బల.

**ముత్తవ్వ** (ద్వ.వి.) : (ముత్త+అవ్వ) వృద్ధపితామహి. (రూ. ముత్తవ)

**ముత్తాత** (దే.వి.) : (ముత్త+తాత) వృద్ధ పితామహుఁడు.

**ముత్తి** (వై.వి.) : మోక్షము. (చూ. ఋత్తి)

**ముత్తిగ** (దే.వి.) : (మూడు + తిగ) తొమ్మిది.

**ముత్తియము** (వై.వి.) : ముత్తెము.

**ముత్తుము** (దే.వి.) : (మూడు + తూము) మూడు తూములు.

**ముత్తెపుఁజిప్ప** (దే.వి.) : (ముత్తెము + చిప్ప) 1. శుక్తి; 2. భక్ష్యవిశేషము.

**ముత్తెపుఁబంట** (దే.వి.) : (ముత్తెము+పంట) చెఱకు.

**ముత్తెపురిక్కనెల** (దే.వి.) : (ముత్తెము + రిక్కనెల) చైత్రమాసము.

**ముత్తెపుసవతు** (వై.వి.) : (ముత్తెము + సవతు) చిత్రా నక్షత్రము.

**ముత్తెము** (వై.వి.) : మౌక్తికము (ముత్తియము యొక్క రూపాంతరము)

**ముత్తెసరి** (వై.వి.) : 1. ముక్తాహారము; 2. సస్య విశేషము; 3. బ. ధాన్య విశేషము. (చూ. బంగారు తీఁగెలు)

**ముత్తోయలి** (దే.వి.) : (ముత్త+తోయలి) ముత్తయిదువ.

**ముత్యము** (వై.వి.) : ముత్తియము యొక్క రూపాంతరము.

**ముత్యాలమ్మ** (వై.వి.) : (ముత్యాలు + అమ్మ) ఒక గ్రామదేవత.

**ముత్త్రోవద్రిమ్మరి** (దే.వి.) : (మూడు + త్రోవ + త్రిమ్మరి) ఆకాశగంగ, త్రిపథగ.

**ముదము** (సం.వి.ద్.స్త్రీ.) : సంతోషము, హర్షము.

**ముదముద** (దే.వి.) : కొతుకు, సంకోచము.

**ముదల** (దే.వి.) : 1.ఆజ్ఞ; 2.లక్ష్యము; 3.గనిమ చేరిక నేల.

**ముదలకించు** (దే.స.క్రి.) : మార్కొను.

**ముదలవెట్టు** (దే.స.క్రి.) : (ముదల + పెట్టు) ఆజ్ఞాపించు.

**ముదలించే** (దే.స.క్రి.) : 1.అడుగు; 2.మార్కొను.

**ముది** (దే.వి.) : వార్ధకము. (విణ.) : వృద్ధ, వృద్ధుఁడు.

**ముదిగారము** (దే.వి.) : మౌర్ఖ్యము.

**ముదిత** (దే.వి.) : ఆఁడుది. (ఇది దేశ్యముగా ఆంధ్ర భాషాభూషణ మందును జెప్పఁబడి యున్నది.) (సం.వి. ఆ.స్త్రీ.) : పరికీయాభేదము. (విణ.) : సంతోషము నొందినది.

**ముదిమి** (దే.వి.) : వార్ధకము.

**ముదియ** (వై.వి.) :ముద్దియ యొక్క రూపాంతరము.

**ముదియు** (దే.అ.క్రి.) : ముదిమిపొందు.

**ముదిరము** (సం.వి.అ.పుం.) : మేఘము. (డు.) విటుఁడు.

**ముదుక** (దే.విణ.) : 1. ముదుగు; 2. వృద్ధ, వృద్ధుఁడు.

**ముదుకఁడు** (దే.విణ.) : వృద్ధుఁడు.

**ముదుగు** (దే.విణ.) : లావు. (నూలిపోఁగు. మొ.)

**ముదుటుంగరము** (దే.వి.) : ముద్దుటుంగరము యొక్క రూపాంతరము.

**ముదురు** (దే.అ.క్రి.) : (కాయ లోనగునది) 1.పరిణమించు; 2.వర్ధిల్లు. (విణ.) : వృద్ధము.

**ముదుసలి** (దే.విణ.) : వృద్ధ, వృద్ధుడు.

**ముద్గపర్ణి** (సం.వి.ఈ.స్త్రీ.) : పిల్లపెసర.

**ముద్గము** (సం.వి.అ.పుం.) : పెసలు.

**ముద్గరము** (సం.వి.అ.పుం.) : 1. ఇనుపగుదియ; (కొయ్య గుదియము నుండి) 2. సమ్మెట.

**ముద్ద** (యు.దే.వి.) : 1. కబళము; 2. పిండము. వై. ముగ్ధ (ముద్దరాలు.)

**ముద్దకమ్మర** (దే.వి.) : ఊయికరగి యినుము చేసెడు కమ్మరజాతి. (ముద్దకమ్మరవాఁడు.)

**ముద్దకవ్వము** (దే.వి.) : మ్రానిబిల్ల తగిలించి కవ్వము.

**ముద్దకొలిమి** (దే.వి.) : ఊయి యినుముగా కరఁగెడు కొలిమి.

**ముద్దతు** (హిం.వి.) : కాలపరిమితి. (ముద్దతు కౌలు, కరారునామా, ముద్దతు క్రయము, అవధిక్రయము.)

**ముద్దయ్య** (వై.వి.) : (ముద్దు+అయ్య) కుమారస్వామి.

**ముద్దరాలు** (దే.విణ.) : (ముద్దు + ఆలు) 1.చుంబనాది పూర్వకముగా లాలనము చేయు; 2.ఆదరించు.

**ముద్దాయి** (హిం.వి.) : ప్రతివాది, నేరము మోపబడినవాఁడు.

**ముద్ది** (దే.వి.) : ఇడుమ, ఆపద.

**ముద్దిడు** (దే.స.క్రి.) : (ముద్దు + ఇడు) చుంబనము చేయు.

**ముద్దియ** (వై.వి.) : ఆఁడుది, ఇంతి, వనిత.

**ముద్దీఁటె** (దే.వి.) : (ముద్ద+ఈఁటె) (చూ.) సెళ్లు.

**ముద్దు** (వై.వి.) :1.ముద్ర; (ముద్దు టుంగరము) 2.చుంబనము; (నాకొక ముద్దిమ్ము) 3.ఆదరము; మనోజ్ఞత. (విణ.) : మనోజ్ఞము. (ఆ చిలుక మిగుల ముద్దుగానున్నది.)

**ముద్దుఁడు** (వై.విణ.) : ఏమియుఁ తెలియని వాఁడు.

**ముద్దుగుమ్మ** (దే.వి.) : 1. మనోజ్ఞురాలగు ఆఁడుది; 2. ఆఁడుది. (రూ. ముద్దులగుమ్మ.)

**ముద్దుటుంగరము** (ద్వ.వి.) : (ముద్దు + ఉంగరము) అక్షరములు చెక్కిన ఉంగరము ముద్రాంగుళీయకము.

**ముద్దుపెట్టుకొను** (దే.స.క్రి.) : చుంబనము చేయు.

**ముద్దురాలు** (దే.వి.) : (ముద్దు+ఆలు) మనోజ్ఞురాలగు ఆఁడుది.

**ముద్దులాఁడి** (దే.వి.) : (ముద్దులు+ఆఁడి) మనోజ్ఞురాలగు ఆఁడుది. (విణ.) : మనోజ్ఞురాలు.

**ముద్దులాఁడు** (దే.విణ.) : (ముద్దులు + ఆఁడు) మనోజ్ఞుఁడు.

**ముద్ర** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. సంజ్ఞాక్షరములు చెక్కిన ఉంగరము లోనగునది; 2. ఉంగరములలో వాని యందుగల సంజ్ఞాక్షరములు.

**ముద్రణము** (సం.వి.అ.న.) : ముద్రించుట.

**ముద్రపలక** (దే.వి.) : ముద్రవేసెడు పలక.

**ముద్రించు** (సం.స.క్రి.) : ముద్రాంకితము చేయు.

**ముద్రిక** (సం.వి.ఆ.స్త్రీ.) : ముద్దుటుంగరము, అంగుళిముద్ర.

**ముద్రితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. ముద్రింప బడినది; 2 ముకుళితమైనది.

**మునగ** (వై.వి.) : శిగ్రువు.

**మునస** (దే.వి.) : ఏతపుమ్రాని మీఁది యర భాగము. (ఏతపు మ్రాని క్రింది యర భాగము మీఁట.)

**మునసపు** (హిం.వి.) : న్యాయము తీర్చునధికారి.

**ముని** (దే.విశే.) : వృత్తియందును శబ్దము యొక్క అంత్యోకారమునకు ఇకారము వచ్చిన రూపము. (ముని వ్రేళ్లు, మునిముచ్చు. మొ.) (సం.వి. ఇ.పుం.) : 1.వసిష్ఠాది; 2.బుద్ధదేవుడు; 3. అగిసియ.

**మునికోల** (దే.వి.) : 1. (చూ.) ప్రాజనము; 2. కశ. (ములుకోలు యొక్క రూపాంతరము.)

**మునిచీఁకటి** (దే.వి.) : (మును + చీఁకటి) ప్రొద్దు గ్రుంకిన తోడనే పర్వెడు పలుచని చీఁకటి. (ఒకానొకఁడు మునిముని చీఁకటియని ప్రయోగించినాఁడు. అప్పుడు ప్రొద్దు గ్రుంకీ క్రుంకక మునుపు పర్వునట్టి పలుచని చీఁకటి యని యర్థము.)

**మునిమనుమఁడు** (దే.వి.) : (మును + మనుమఁడు) ప్రపౌత్రుఁడు.

**మునిమనుమరాలు** (దే.వి.) : (మునిమనుమ + ఆలు) ప్రపౌత్రి.

**మునిమాపు** (దే.వి.) : (మును+మాపు) ప్రదోషము. (చూ. బంటు రెండవ యర్థము.)

**మునిముంగల** (దే.వి.) : (ముంగల + ముంగల) మొట్టమొదట.

**మునిముచ్చే** (దే.వి.) : (మును+ముచ్చు) పశ్యతోహరుఁడు, పశ్యతోహరాలు.

**మునియేఁడు** (దే.వి.) : (మును+ఏఁడు) నిరుటికి తొలి సంవత్సరము.

**మునిషీ** (హిం.వి.) : చదువు చెప్పువాఁడు, లేఖకుఁడు.

**మునీంద్రుఁడు** (సం.వి.అ.పుం.) : 1. బుద్ధ దేవుఁడు; 2. ఋషిశ్రేష్ఠుఁడు.

**మును** (దే.వి.) : 1.మున్ను యొక్క రూపాంతరము; (ముందునకు.) మొదలునకు. 2. తుది. (ఇది అగ్రము వంటిది.)

**మునుఁగు** (దే.అ.క్రి.) : 1. మునుకవేయు; 2. అడఁగు; 3. నశించు; 4. మఱుఁగుపడు.

**మునుక** (దే.వి.) : 1.మునుఁగుట; 2. మునుక వేయుట.

**మునుకు** (దే.అ.క్రి.) : 1.సంతాపించు; 2.మాఱు పలుకు; 3. పలుకు.

**మునుకువ** (దే.వి.) : పూనిక. (చూ. మొండాడు.) (ఇది యిక్కడ ఒక చోటనే కనఁబడియెడి. దీనికి సందర్భానుసారముగా ఈయర్థము తోఁచుచున్నది.)

**మునుకొను** (దే.అ.క్రి.) : ముందుకొను, ముందుపడు.

**మునుకోలు** (దే.వి.) : మునుకొనుట.

**మునుగట్టు** (దే.వి.) : తొలుగట్టు, పూర్వపర్వతము.

**మునుచే** (దే.అ.క్రి.) : మనుకొను. (ప్రే.) : మునుఁగఁజేయు.

**మునుపడు** (దే.అ.క్రి.) : మునుకొను.

**మునుపు** (దే.వి.) : ముందు, పూర్వము.

**మునుము** (దే.వి.) : 1. పైరుకోఁత కేర్పఱుచుకొన్న మితి; 2. వరుస; (మునుమిడి = వరుసయిడి అనఁగా వరుసవెంబడినని యర్థము.) 3.ఎదురు; 4. ఎదుటిచోటు; 5. సేనా ముఖము; 6. తఱచు దనము. (చూ. మున్ను) (విశే.) : తఱచు.

**మునుముకొను** (దే.అ.క్రి.) : వరుసపెట్టు.

**మున్కొను** (దే.అ.క్రి.) : మునుకొను యొక్క రూపాం తరము.

**మున్గు** (దే.అ.క్రి.) : మునుగు యొక్క రూపాం తరము. (మునుకవేయుటకు.)

**మున్నడి** (దే.అవ్య.క్రి.విశే.) : (మున్ను + అడుగు) ముందుగా. (ముమ్మడి వంటిది.)

**మున్నరక** (దే.వి.) : (మున్ను + అరక) ధైర్యము.

**మున్నాడి** (దే.అవ్య.క్రి.విశే.) : మున్నడి యొక్క రూపాంతరము.

**మున్నీటిచూలి** (దే.వి.) : (మున్నీరు + చూలి) లక్ష్మి, క్షీరసాగర కన్యక.

**మున్నీరు** (దే.వి.) : (మును + నీరు) సముద్రము.

**మున్ను** (దే.సర్వ.) : 1. ముందు; 2. మొదలు.

**మున్నూఱు** (దే.స.) : (మూడు + నూఱు) మూడునూఱులు.

**మున్నెరిక** (దే.వి.) : (మున్ను + ఎరిక) పూర్వ రాగము వలనఁ గలిగిన విరహ తాపము.

**మున్పు** (దే.వి.) : మునుపు యొక్క రూపాంతరము.

**మున్ము** (దే.వి.) : మునుము యొక్క రూపాంతరము. (వరుసకు. తఱచుఁ దనమునకు.)

**ముప్పండ్రు** (దే.వి.) : ముప్పదికి మహన్మహత్యర్థక బహువచనాంతాదేశము, ముప్పదిమంది.

**ముప్పటిలు** (దే.అ.క్రి.) : చల్లారు.

**ముప్పది** (దే.సర్వ.) : (మూడు + పది) మూడు పదులు.

**ముప్పదిరెంటిగుంపు** (దే.వి.) : (ముప్పదిరెండు + గుంపు) రేవతీ నక్షత్రము.

**ముప్పాతిక** (దే.వి.) : (మూడు + పాతిక) మూడు పాతికలు.

**ముప్పావు** (దే.వి.) : (మూడు + పావు) మూడు పావులు.

**ముప్పావులా** (దే.వి.) : (మూడు + పావులా) మూడు పావులాలు.

**ముప్పిడి** (దే.వి.) : (మూడు + పిడి) బాఁకు.

**ముప్పిర** (దే.వి.) : (మూడు+పిర) మూడుపిరలు.

**ముప్పిరి** (దే.వి.) : (మూడు + పిరి) మూడు పిరులు. (విణ.) : మూడు పిరులుగలది.

**ముప్పరిగొను** (దే.అ.క్రి.) : (ముప్పిరి + కొను) 1. మూడుపిరులుగా పెనఁగొను; 2. పెనగొను.

**ముప్పు** (దే.వి.) : 1. వార్ధకము; 2. విపత్తు.

**ముప్పూఁట** (దే.వి.) : (మూడు + పూఁట) మూడు పూఁటలు.

**ముప్పొంగు** (దే.అ.క్రి.) : (మూడు + పొంగు) మూడు పొంగులు పొంగు, ఉప్పొంగు, క్షేత్రయ.

**ముప్పొత్తులు** (దే.వి.బ.) : (మూడు + పొత్తులు) అశ్రద్ధ.

**ముప్పోకలాడు** (దే.వి.) : (మూడు + పోకలు + ఆడు) త్రిగుణాత్మకుఁడు, భగవంతుఁడు.

**ముబ్బడి** (దే.విణ.) : ముమ్మడి యొక్క రూపాం తరము.

**ముబ్బడించే** (దే.అ.క్రి.) : ముమ్మడించు యొక్క రూపాంతరము.

**ముబ్బె** (దే.వి.) : నితంబపార్శ్వము.

**ముముక్షువు** (సం.విణ.) : (ఉ.) నిడువ నిచ్ఛ గలవాఁడు.

**ముమూర్ష** (సం.వి.ఆ.స్త్రీ.) : చావనిచ్ఛ.

**ముమూర్షువు** (సం.విణ.) : (ఉ.) చావనిచ్ఛ గలవాఁడు.

**ముమ్మడి** (దే.విణ.) : ముద్మడుఁగు యొక్క రూపాంతరము.

**ముమ్మడించు** (దే.అ.క్రి.) : ముమ్మడి యగు.

**ముమ్మడుఁగు** (దే.విణ.) : (మూడు + మడుఁగు) మూడు మడుఁగులు గలది, త్రిగుణము.

**ముమ్మనుమఁడు** (దే.వి.) : ముని మనుమఁడు యొక్క రూపాంతరము.

**ముమ్మనుమరాలు** (దే.వి.) : ముని మనుమరాలు యొక్క రూపాంతరము.

**ముమ్మరము** (దే.విణ.) : అధికము, అగ్గలము.

**ముమ్మరించే** (దే.అ.క్రి.) : అతిశయించు, అగ్గలించు.

**ముమ్మూడు** (దే.స.) : (మూడు + మూడు) మూడు మూళ్లు, తొమ్మిది.

**ముమ్మొనవాలు** (ద్వ.వి.) : (మూడు + మొనవాలు) త్రిశూలము.

**ముమ్మొనవాలుదాలుపు** (దే.వి.) : (ముమ్మొన వాలు + తాలుపు) శివుఁడు, శూలి.

**ముమ్మోటు** (దే.విణ.) : (మును + మోటు) మూఢశిరోమణి.

**ముయ్యంచు** (దే.వి.) : (మూడు + అంచు) మూడు మూలలు. (విణ.) : మూడుమూలలు గలది.

**ముయ్యంచుతుంగ** (దే.వి.) : మూడంచుల తుంగ.

**ముయ్యెడ** (దే.వి.) : (మూడు+అడ్డ) ఆఱు మానికలు.

**ముయ్యేలగుట్ట** (దే.వి.) : (మూడు+ఎల్ల+గుట్ట) 1. మూడు ఎల్లలు కలియచోటు; 2. మూడు దారులు కలియు చోటు, త్రికము. (చూ. ముడివడు) (ఇక్కడ యెల్ల శబ్దమునకు స్థానము మాత్ర మర్థము.)

**ముయ్యాకుఁబొన్న** (దే.వి.) : (మూడు + ఆకు + పొన్న) సాలపర్ణి.

**ముయ్యాఱు** (దే.స.) : (మూడు + ఆఱు) మూడు ఆఱులు, పదెనెనిమిది.

**ముయ్యేడు** (దే.స.) : (మూడు+ఏడు) మూడేళ్లు, ఇరువది యొకటి.

**ముయ్యేఱు** (దే.వి.) : (మూడు + ఏఱు) గంగ, త్రిపథగ.

**ముర** (సం.వి.ఆ.స్త్రీ.) : గంధద్రవ్య విశేషము. (అ.పుం.డు.) : ఒక అసురుఁడు.

**మురంగి** (సం.వి.ఈ.స్త్రీ.) : కారుమునగ.

**మురజము** (సం.వి.అ.పుం.) : మృదంగము. (దీని మ్రోఁతమార్జన.)

**మురముర** (దే.వి.) : 1.మూల్గుటయందగు ధ్వన్యనుకరణము; 2.అణఁగుట యందగు ధ్వన్యనుకరణము.

**మురళి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1.పిల్లనగ్రోవి; 2. అశ్వ ధారావిశేషము.

**మురళించు** (దే.స.క్రి.) : తిరస్కరించు.

**మురారి** (సం.వి.ఇ.పుం.) : 1. కృష్ణుఁడు; 2. ఒకానొక కవి.

**మురాళము** (దే.వి.) : మురాళించుట.

**మురాళించు** (దే.స.క్రి.) : దిగఁదుడుచు.

**మురి** (దే.వి.) : 1. గర్వము; 2. నకయందలి కులుకు.

**మురించే** (దే.స.క్రి.) : త్రిప్పు. (ఇది ఒక ఆధునిక గ్రంథమందొక్కచోఁ గనఁబడుచున్నది.)

**మురికాఁడు** (దే.విణ.) : గర్విష్ఠుఁడు.

**మురికొను** (దే.స.క్రి.) : (మురియ+కొను) ఖండించు.

**మురిడీగొలుసు** (దే.వి.) : ముంజేత వేసికొనెడు బంగారు మెలికగొలుసు.

**మురిపము** (దే.వి.) : 1. నడకయందలి కులుకు; (చూ. పెడము.) 2. గర్వము.

**మురిపెము** (దే.వి.) : మురిపము యొక్క రూపాంతరము. (కులుకునకు.)

**మురియ** (దే.వి.) : ఖండము.

**మురియఁబడు** (దే.అ.క్రి.) : (మురియన్ + పడు) అతిశయించు.

**మురియు** (దే.అ.క్రి.) : 1.నడుచునప్పుడు కులుకు; 2.గర్వించు; 3.తిరుగు; 4.తెగు; 5.విఱుగు.

**మురుగు** (దే.వి.) : 1. పట్టెలు తీరకడ్డిగా కొట్టించి ముంజేత ధరించెడు స్వర్ణాభరణము; (చూ. మరిడీ గొలుసు.) 2. అల్లిక వేసిన బంగారు కమ్మి.

**మురువు** (దే.వి.) :1. సౌందర్యము; 2. గర్వము; 3. మురుగు యొక్క రూపాంతరము. (విణ.) : సుందరము.

**ముర్మురము** (సం.వి.అ.పుం.) : 1. కుమ్ము; 2. సూర్యుని గుఱ్ఱము. డు. మన్మథుఁడు.

**ముఱకటము** (దే.వి.) : ముఱకటించుట.

**ముఱకటించు** (దే.స.క్రి.) : త్రిప్పు.

**ముఱకము** (దే.వి.) : నిక్కు, ఉద్ధతి.

**ముఱముఱమను** (దే.అ.క్రి.) : (ముఱముఱ + అను) ముఱముఱలాడు.

**ముఱముఱలాడు** దే.అ.క్రి. (ముఱముఱలు + ఆడు) కోపవికారము చూపు.

**ముఱి** (దే.విణ.) :1. అల్పము; (ముఱి ప్రోవు) 2. కుత్సితము. (ముఱి మొండెము.) (ఆమ్రేడితము నందు ముఱిముఱి.)

**ముఱికి** (దే.వి.) : కల్మషము, మాలిన్యము.

**ముఱికినాడు** (దే.వి.) : ఒకానొక దేశము. (రూ. ములికినాడు.)

**ముఱియు** (దే.అ.క్రి.) : గర్వించు. (ఈయొకచోటనే యిది యలఘు రేఫముగాఁ గనఁబడుచున్నది.)

**ముఱు** (దే.వి.) : ముఱ్ఱు యొక్క రూపాంతరము.

**ముఱుగు** (దే.అ.క్రి.) : 1. క్రుళ్లు; 2. చదియు.

**ముఱుగుడు** (దే.విణ.) : ముఱిగినది.

**ముఱుత్రోవ** (దే.వి.) : (ముఱుగు+త్రోవ) దుర్గంధపు మార్గము.

**ముఱ్ఱు** (దే.వి.) : ముఱ్ఱుఁబాలు.

**ముఱ్ఱుఁబాము** (దే.వి.) : (ముఱ్ఱు+పాము) (చూ.) మాతులాహి.

**ముఱ్ఱుఁబాలు** (ద్వ.వి.) : (ముఱ్ఱు + పాలు) ఆవులు లోనగునవి యీనిన తరువాతి మూడు దినముల లోని పాలు.

**ములక** (దే.వి.) : వార్తాకి. (ఇది త్రివిధము. కప్రములక, తెల్లములక, పెద్దములక.)

**ములికి** (దే.వి.) : 1. బాణము; (చూ. ముల్కి) 2. బాణపుటలుఁగు; (చూ. పాల మున్నీటి యల్లుఁడు.) 3. బొంగరము మొనను గ్రువ్వబడి యుండు ఇనుప ముక్క.

**ములు** (దే.వి.) : 1. ముల్లు; 2. త్రాసుముల్లు; 3. వరిముల్లు. (వెనుకటి రెండర్థములకు చూ. కుసుమ రెండవ యర్థము.) (ముల్లు యొక్క రూపాంతరము.)

**ములుకత్తి** (దే.వి.) : ముల్లు తీసెడు ఒక దినుసు చిన్నకత్తి.

**ములుకోల** (దే.వి.) : ఎడ్లను బొడిచెడు మునికోల, ప్రాజనము.

**ములుగు** (దే.అ.క్రి.) : మూలుఁగు. (వి.) మూలుగుట. వై. బొక్కసము. (చూ. మరగు. స.క్రి.)

**ములుగొలిమిడి** (దే.వి.) : ఇక్షురము.

**ములుగోరంట** (దే.వి.) : ఝింటి.

**ములచింత** (దే.వి.) : ముల్లచింత యొక్క రూపాంతరము.

**ములుచ** (దే.విణ.) : 1. మూఢుఁడు; 2. తక్కువ.

**ములుజెముడు** (దే.వి.) : త్రికంటకము.

**ములుతారు** (దే.వి.) : మృగములను పట్టెడి యొక రకమైన వల.

**ములుదోస** (దే.వి.) : రోమశి.

**ములుబంతి** (దే.వి.) : చోరసాధన విశేషము. (చూ. గద్దగోరు.)

**ములుము** (దే.వి.) : బావులనీళ్లు పాఱించి పండించెడు పొలము.

**ములుమోదుగు** (దే.వి.) : రోహితకము.

**ములువాలుగ** (దే.వి.) : మత్స్యవిశేషము.

**ములువెంపలి** (దే.వి.) : కంటకపుంఖి.

**ములువెలఁగ** (దే.వి.) : చతురశ్రికము.

**ములువెలమ** (దే.వి.) : వికంతము.

**ములుసూపు** (దే.అ.క్రి.) : (ములు+చూపు) మీఱు, అతిశయించు.

**ముల్కి** (దే.వి.) : ములికి యొక్క రూపాంతరము. (బాణమునకు.)

**ముల్చ** (దే.విణ.) : ములుచ యొక్క రూపాంతరము.

**ముల్లంగి** (వై.వి.) : ఒక దినుసుగడ్డ. (దీని భేదము పెద్దముల్లంగి.)

**ముల్లాకుఱాయి** (దే.వి.) : (ముల్లు + ఆకుఱాయి) పత్రపరశుభేదము.

**ముల్లు** (దే.వి.) : 1. కంటకము; 2. నీవారాది శూకము; 3. త్రాసుముల్లు.

**ముల్లుచింత** (దే.వి.) : (ముల్లు + ఉచ్చింత) అలర్కము. (దీనినే ముండ్ల ముస్తెయందురు.)

**ముల్లె** (వై.వి.) : 1. ధనముముడి; 2. ముడుపు, మూట. (మొదటి రూపము ముల్లియ.)

**మువురు** (దే.సర్వ.బ.) : మురుగు యొక్క రూపాంతరము.

**మువ్వ** (ద్వ.వి.) : (మూడు+వా) 1.మొనలో మూడు సందులుగల పెద్దగజ్జె; 2. ఒక పట్టణము. క్షేత్రయ.

**మువ్వంచేకు** (దే.వి.) : (మూడు+పంచ) మూడు పంచలు. (విణ.) మూడు పంచలు గలది. (సంధి యందు వర్ణాగమ వర్ణలోప వర్ణ వికార ములని యెఱుంగునది.)

**మువ్వంటు** (దే.వి.) : (మూడు + అంటు) నెలకు లోపలి మూడు పురుడులు. (మువ్వంటుల నాడు అనఁగా నెలపురిటి లోపలనని యర్థము.)

**మువ్వకోడె** (దే.వి.) : కాఁడికిని గంతకును క్రొత్తగా అలవటిచెడి యెద్దు. (ఇట్లు మువ్వపసరము)

**ముప్పదోసె** (దే.వి.) : అడుగున ఒంటి పలక గల దోనె.

**ముప్పన్నెమెకము** (దే.వి.) : పెద్దపులి, చిత్రకాయము.

**ముప్పన్నెవిల్లు** (ద్వ.వి.) : ఇంద్రధనుస్సు.

**ముప్వీసము** (సం.వి.) : (మూడు + వీసము) మూడు వీసములు.

**ముప్వురు** (దే.సర్వ.బ.) : ముగ్గురు యొక్క రూపాంతరము.

**ముషితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1.దొంగిలఁ బడినది; 2.నఱకఁ బడినది.

**ముష్కకము** (సం.వి.అ.పుం.) : మొక్కపు చెట్టు.

**ముష్కము** (సం.వి.అ.పుం.) : 1. వృషణము; 2. మొక్కపుచెట్టు; 3. మొత్తము.

**ముష్కరుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) కుటిలుఁడు.

**ముష్టి** (సం.వి.ఇ.పుం.స్త్రీ.) : 1.కత్తిపిడి; 2. పిడికిలి; 3. సమృద్ధి; 4. ముసిఁడి. (పుం.) : అభినయ హస్త విశేషము.

**ముష్టింపచుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) దరిద్రుఁడు.

**ముసద్దీ** (హిం.వి.) : లెక్కవాఁడు, లేఖకుఁడు.

**ముసనాబు** (దే.వి.) : అందలము ప్రక్కతెర. (చూ. గొడియ.)

**ముసముస** (దే.వి.) : 1. ముసురుట లోనగువాని యందగు ధ్వన్యనుకరణము; 2. కోపమున గలుగు చిఱచిఱ; 3. పంది మూర్కొనుట యందగు ధ్వన్యనుకరణము.

**ముసముసమను** (దే.అ.క్రి.) : (ముసముస + అను) 1. ముసముస యని శబ్దించు; 2. చిఱ చిఱలాడు. (రూ. ముసముస యను.)

**ముసరు** (దే.అ.క్రి.) : కవియు, క్రమ్ము. (చూ. పసి. దే. కడపట.)

**ముసలము** (సం.వి.అ.పుం,న.) : రోఁకలి, అయోగ్రము.

**ముసలి** (దే.విణ.) : వృద్ధు. (సం.వి. ఈ.స్త్రీ.) : 1.ఉడుము; 2. ఎలుకజీడి; 3. నేలతాడు; 4. బల్లి. (న్. పుం.) : బలరాముఁడు.

**ముసల్యుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ముసలము చేత చంపదగినవాఁడు.

**ముసాంబ్రము** (దే.వి.) : ఒక మందు దినుసు.

**ముసాపు, ముసాబు** (అర.వి.) : ముసురువాన.

**ముసి** (దే.విణ.) : బొంకు, అసత్యము. (చూ. బతిమాలుచు.)

**ముసించు** (దే.అ.క్రి.) : చెడు. (నాకు ఆవేళకు బుద్ధి ముసించి పోయెను.)

**ముసిఁడి** (వై.వి.) : ముష్టిచెట్టు.

**ముసిముసినవ్వు** (దే.వి.) : చిఱునగవు, దరహాసము. (రూ. ముసిముసి నగవు.)

**ముసుండి** (సం.వి.ఈ.స్త్రీ.) : కొయ్య గుదియ. (ఇనుప గుదియ ముద్గరము.)

**ముసుఁగు** (దే.వి.) : ముసుఁగుడు.

**ముసుఁగుడు** (దే.వి.) : కప్పుడు, అవకుంఠనము.

**ముసుఁగుడువడు** (దే.అ.క్రి.) : (ముసుఁగుడు + పడు) కప్పుడువడు.

**ముసుఁగుబొంద** (దే.వి.) : మట్టలు ఊడనితాడి లోనగు చిన్నచెట్టు.

**ముసుఁగువడు** (ద్వ.అ.క్రి.) : (ముసుగు + పడు) ముసుఁగుడువడు.

**ముసుఁగువాఱు** (దే.అ.క్రి.) : (ముసుగు + పాఱు) ముసుఁగువడు.

**ముసురు** (దే.వి.) : నిరంతవర్షము.

**ముసురుకవియు** (దే.అ.క్రి.) : ముసురుకొను. (ఇక్కడ కవియు ధాతువు ఇంచుక్పర్యాయము.)

**ముసురుకొను** (దే.అ.క్రి.) : కవియు, క్రమ్ము. (చూ. అసురుసురు.)

**ముసురుమూతి** (దే.వి.) : కోవ వికారము గల ముఖము. (ముసురు మూతివాఁడు, ముసురు మూతితనము.)

**ముసువు** (దే.వి.) : ముసుఁగు యొక్క రూపాం తరము.

**ముస్త** (సం.వి.ఆ.స్త్రీ.) : నిడుముస్తె.

**ముస్తకము** (సం.వి.అ.పుం.) : 1. కయివడిముస్తె; 2. నిడుముస్తె.

**ముస్తాదు** (హిం.విణ.) : సిద్ధమైన, తగియున్న (రూ. ముస్తాబు)

**ముస్తియ** (వై.వి.) : ముస్తె. (చూ. ఈఁజేటి.)

**ముస్తీదు** (దే.విణ.) : ఆయిత్తము, సిద్ధము.

**ముస్తె** (వై.వి.) : 1. తుంగ; 2. తుంగగడ్డ. (ఇది త్రివిధము. నిడుముస్తె, నాగముస్తె, వట్రువ ముస్తె. ఇదే నిడుముస్తె.)

**ముహూర్తము** (సం.వి.అ.పుం,న.) : 1.పంద్రెండు క్షణముల కాలము; 2.రెండు గడియల కాలము.

**ముళ్లయతి** (దే.వి.) : ఒకరొకరికి కలహము ముడిపెట్టెడు ముని, నారదుఁడు.

## మూ

**మూ** (దే.సర్వ.) : వృత్తియందు మూడు శబ్దమునకు మీఁదివర్ణములోపింపఁగా మిగిలిన రూపము.

**మూఁక** (దే.వి.) : 1. సమూహము; 2. సేన.

**మూఁకవిప్ప** (దే.విణ.) : చెదరఁ గొట్టునది.

**మూఁకుడు** (దే.వి.) : (మూఁత+కుడుక) 1. కుండ మీఁద మూసెడు తట్టవంటి మట్టిపాత్రము; 2. మూఁత; 3. తట్ట వంటి మట్టిపాత్రము, శరావము. (సంధిని వర్ణలోపము.)

**మూఁగ** (యు.దే.వి.) : 1. దోమ; (చూ. బొడ బొడ) 2. పక్షి విశేషము. (వై.విణ.) : మూఁగవాఁడు.

**మూఁగంబాఱు** (దే.అ.క్రి.) : (మూఁగꣳ + పాఱు) మూఁగు.

**మూఁగతీఁట** (దే.వి.) : దట్టముగా పేలినతీఁట.

**మూఁగు** (దే.అ.క్రి.) : కవియు.

**మూఁడు** (దే.అ.క్రి.) : 1. కలుగు; 2. ముగియు. స. రెండు నొకటి.

**మూఁడుచే** (దే.క్రి.) : మూఁడఁజేయు, కలిగించు. (రూ. మూడ్చు.)

**మూఁత** (దే.వి.) : 1.మూయుట; 2. మూయుటకుఁ దగిన మూఁకుడు లోనగునది.

**మూఁతబల్ల** (దే.వి.) : వాచూరుపట్టె.

**మూఁపు** (దే.వి.) : భుజశిరము, అంసము.

**మూఁపురము** (దే.వి.) : ఎద్దుయొక్క భుజశిరము, కకుదము.

**మూకుఁడు** (సం.వి.అ.పుం.) : ఒక అసురుఁడు. (విణ.) : మూఁగవాఁడు. (రూ. మూకు)

**మూగురు** (దే.స.) : ముగ్గురునకు మొదటిరూపము.

**మూగేలు** (దే.వి.) : గంధమూషిక, చుంచు.

**మూచూచే** (దే.స.క్రి.) : (మూతి + చూచు) మూర్కొను, ఆఘ్రాణించు.

**మూట** (వై.వి.) : బట్టలులోనగువాని ముడియ.

**మూటము** (దే.వి.) : ముటము యొక్క రూపాంతరము.

**మూడమంచు** (దే.వి.) : దట్టమైన మంచు, హిమాని.

**మూడి** (దే.వి.) : ముడ్డికి మొదటిరూపము.

**మూడు** (దే.స.) : రెండు నొకటి. (ఇది సార్ధ బిందుక మనుటకుఁ గవిత్రయము వారి ప్రయోగముల యందుఁ దగిన యుదాహరణ ములు దొరకమిగాక యిది బహువచనమున మూళ్లని వాడఁబడుచున్నది.)

**మూఢుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. తెలివి లేనివాఁడు; 2. బాలుఁడు.

**మూతము** (సం.వి.అ.న.) : రాజులు చేతిక్రింద నుంచుకొను తలగడ. (విణ.) : కట్టఁబడినది.

**మూతి** (దే.వి.) : 1.నోటిపైభాగము; 2.ముఖము.

**మూత్రకృచ్ఛ్రము** (సం.వి.అ.న.) : నీరుడిరోగము.

**మూత్రము** (సం.వి.అ.న.) : నీరు, కాలుమడి.

**మూత్రించే** (సం.అ.క్రి.) : నీరు విడుచు, కాలుమడుచు.

**మూత్రితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) నీరు విడిచినవాఁడు.

**మూదల** (దే.వి.) : (మూల + తల) నిరూపణము, తార్కాణ.

**మూదలించు** (దే.స.క్రి.) : 1. నిరూపించు, తార్కాణించు; 2. ఎచ్చరించు.

**మూదలిక** (దే.వి.) : మూదల, తార్కాణ.

**మూస** (దే.వి.) :1. వస్త్రగాలితము చేయగా రాలక నిలిచినది; 2. రాగులు ఆముదాలు మేలు రాసికాఁగా మిగిలిన పొల్లు.

**మూను** (దే.స.క్రి.) : వస్త్రగాలితము చేయు.

**వాయువు** (సం.వి.అ.పుం.) : గాలి. (దీని భేదములు - గోగంధనము, వాసంతము, చారము, కించులుకము, ఇరింగణము, ఝంఝు, చూషకము, వాత్య. (ఆయాయర్థము నాయాయి పదముకడఁ జూచినది) పంచ వాయువులు - ప్రాణము, అపానము, సమానము, ఉదానము, వ్యానము. పంచోప వాయువులు-నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయము.)

**వాయువేగి** (సం.వి.న్.పుం.) : వాయువు యొక్క వేగము వంటి వేగము గలిగిన దగుటచేత కుక్క కియ్యఁబడిన పేరు. (చూ. గబ్బి)

**వాయుసఖుఁడు** (సం.వి.అ.పుం.) : అగ్ని, గాలినెచ్చెలి.

**వాయోడు** (ద్వ.అ.క్రి.) : (వా+ఓడు) మాట పిఱికియగు.

**వార** (దే.వి.) : 1. ఎనిమిది పుంజముల నూలు; 2. (లెక్కల యందలి) ఎచ్చు తక్కువలు.

**వారంటు** (ఆం.వి.) : (ఒకని పట్టుకొనుటకు.) అధికారపత్రిక.

**వారఁబట్టు** (ద్వ.స.క్రి.) : (వా + రాఁ + పట్టు) ఆపోశించు.

**వారకము** (ఉభ.దే.వి.) : లేనికాలము నందు వృద్ధ్యాదులు లేక యుపయోగార్థ మొకరికిచ్చి కలిగినకాలమునందు మరలఁబుచ్చుకొనెడు ధనాదికము.

**వారడ** (దే.వి.) : తాటాకువారినచివ్వ.

**వారడి** (దే.వి.) : నష్టి, లోపము. (ఆవారడి యిందుఁ గలసి వచ్చెను.)

**వారడు** (వై.స.క్రి.) : చాలించు. (అప్ర.)

**వారణ** (సం.వి.ఆ.స్త్రీ.) : చెలియకట్ట. (అ.న.ము.) వారించుట. (పుం.) ఏనుఁగు.

**వారణబుస** (సం.వి.ఆ.స్త్రీ.) : అరఁటి (రూ. వారణవృష.)

**వారధి** (దే.వి.) : వంతెన.

**వారము** (ఉభ.దే.వి.) : వారువము యొక్క రూపాంతరము. (సం.అ.న.) మద్యపాత్రము. (పుం.) 1. సూర్యాది వాసరము; (ఇవి యేడు. ఆదిత్యవారము, సోమవారము, మంగళ వారము, బుధ వారము, బృహస్పతి వారము, శుక్ర వారము, శనివారము.) 2. తడవ; 3. సమూహము; 4. వాకిలి; 5. క్షణము; 6. కుబ్జవృక్షము. (డు.) శివుఁడు.

**వారముఖ్య** (సం.వి.ఆ.స్త్రీ.) : యోగ్యతఁ బట్టి జనుల చేత సత్కరింపఁబడిన వేశ్య.

**వారయాత్రికుఁడు** (సం.వి.అ.పుం.) : పెండ్లి చుట్టము.

**వారవాణము** (సం.వి.అ.పుం.) : కవచము.

**వారసు** (హిం.వి.) : ఆస్తికర్త.

**వారస్త్రీ** (సం.వి.ఈ.స్త్రీ.) : వేశ్య. (ఇట్లు వారకాంత, వారాంగన. మొ.)

**వారాన్నిధి** (సం.వి.ఇ.పుం.) : సముద్రము.

**వారాశి** (సం.వి.ఇ.పుం.) : సంద్రము, నీటికుప్ప. (రూ. వారిరాశి.)

**వారాహి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. ఒక మాతృక (చూ. మాతృక); 2. అడవి యాఁడు పంది; 3. పాఁచి తీఁగ; 4. నేలతాడు.

**వారి** (సం.వి.ఇ.న.) : 1. నీళ్లు; 2. కురువేరు. (స్త్రీ.) సరస్వతి. (ఈ.) కుండ. (ఇ.ఈ.) 1. ఏనుఁగుఁ బట్టెడుచోటు; 2. ఏనుఁగుఁబట్టెడు పల్లము, (చూ.) అవపాతము.

**వారించు** (సం.స.క్రి.) : అడ్డగించు, నివారించు.

**వారిజేము** (సం.వి.అ.న.) : 1. తామర; 2. ఉప్పు. (పుం.) : 1. శంఖము; 2. శంబూకము; 3. బాడిదము.

**వారిజము** (వై.వి.) : పారిభద్రము. కొండ బూరుగు. (అని కొందఱు.)

**వారిణ** (దే.వి.) : చిన్న చేఁపలను బట్టెడు సాధనవిశేషము.

**వారిదము** (ఉభ.వై.వి.) : పారిభద్రము. (సం.అ.పుం.) 1. మేఘము; 2. ముస్త.

**వారిధి** (సం.వి.ఇ.పుం.) : వారినిధి, సముద్రము.

**వారిపర్ణి** (సం.వి.ఈ.స్త్రీ.) : (చూ.) నాఁచు.

**వారివాహము** (సం.వి.అ.పుం.) : మబ్బు, నీరుతాల్పు.

**వారు** (యు.దే.స.క్రి.) : రెండు చేతులతో తాటాకు ఓరచివ్వు. (వై.అ.క్రి.) : 1. ఉడుగు; (దీనికి వ్యతిరేకక్త్వార్థ మందును వ్యతిరేకార్థక విశేషణము నందును మాత్రము ప్రయోగములు కానఁబడెడి.) 2.వడియు. (గంజి వారెను.)

**వారుచే** (యు.దే.అ.క్రి.స.క్రి.వై.ప్రే.) : వార్చునకు మొదటిరూపము.

**వారుణి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. పడమటి దిక్కు; 2. సారాయి; 3. శతభిషఙ్న క్షత్రము; 4. ఒక దినుసు గఱిక.

**వారుపు** (యు.దే.వై.వి.) : వార్పునకు మొదటి రూపము.

**వారువపుజన్నము** (ద్వ.వి.) : అశ్వమేధ యాగము.

**వారువము** (దే.వి.) : గుఱ్ఱము, అశ్వము.

**వార్చు** (యు.దే.అ.క్రి.) : ఆచమించు. (స.క్రి.) ప్రతీక్షించు. (వై.ప్రే.) వారఁ జేయు. (వంట లక్క గంజివార్చెను.)

**వార్దరు** (ఆం.వి.) : చెరసాలలోనుండు బంట్రౌతు.

**వార్త** (సం.వి. ఆ.స్త్రీ.) : 1. వృత్తాంతము; 2. వర్తనము; 3. జీవనోపాయము; 4. అర్థానర్థ వివేచన విద్య (చూ.విద్య); 5. వార్తాకము. (అ.న.ము.) : 1. పొల్లు; 2.ఆరోగ్యము. (విణ.) : 1.రోగము తీఱినది; 2. జీవనో పాయము గలది.

**వార్తాకము** (సం.వి.అ.పుం.) : వంగ.

**వార్తాకి** (సం.వి.ఈ.స్త్రీ.) : ములక.

**వార్తావహుఁడు** (సం.వి.అ.పుం.) : 1. కావడి మోసెడు వాఁడు; 2. వృత్తాంతమును తెలిసికొని పోయిచెప్పువాఁడు.

**వార్తికము** (సం.వి. అ.న.) : ఉక్తానుక్త దురుక్తార్థము లను వ్యక్తము చేసెడు గ్రంథము. (పుం.) పక్షివిశేషము.

**వార్తికుఁడు** (సం.వి.అ.పుం.) : సందేశహరుఁడు, దూత.

**వార్ధకము** (సం.వి.అ.న.) : 1. వృద్ధత్వము; 2. వృద్ధ సమూహము.

**వార్ధక్యము** (సం.వి.అ.న.) : ముసలితనము, వృద్ధత్వము.

**వార్ధి** (సం.వి.ఇ.పుం.) : వారిధి యొక్క రూపాం తరము.

**వార్ధుషికుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) వడ్డికిచ్చి జీవనము చేయువాఁడు, కుసీదుఁడు.

**వార్పు** (యు.దే.వి.) : ఆచమనము. వై. గంజి.

**వార్మణము** (సం.వి.అ.న.) : వర్మముల సమూహము. (వర్మము = కవచము)

**వార్వపుటగ్గి** (ద్వ.వి.) : (వార్వము+అగ్గి) బడబాగ్ని.

**వార్వము** (దే.వి.) : వారువము యొక్క రూపాంతరము.

**వార్షికము** (సం.వి.అ.న.) : కలుక్రాంత. (విణ.): 1.వాన కాలమునఁ బుట్టినది; 2. సంవత్సర కాలపరిమితి గలది.

**వాఱంటువిల్లు** (దే.వి.) : (వాఱు + అంటువిల్లు) ఱాళ్ల పనివారి వాఱుగట్టిన పెద్దవింటికోల.

**వాఱు** (దే.వి.) : సన్నగాఁ గోసినతోలు.

**వాఱెన** (దే.వి.) : (వాఱు + ఎన) 1. నొగతో కాఁడిని చేర్చి కట్టెడు వాఱు లోనగునది; 2. ఏఁడి కోలతోకాఁడిని చేర్చి కట్టెడు వాఱు లోనగునది. (చూ. పగ్గము మొదటి యర్థము); 3.ముంగిస మ్రానితో గడను చేర్చికట్టెడు వాఱు లోనగునది.

**వాఱెనపీఁట** (ద్వ.వి.) : ఏఁడికోలకును కాఁడికిని నడుమ చేరికగా నుండెడు కొయ్య.

**వాలకము** (ఉభ.దే.వి.) :1.మోసము; 2.వేషము. (చూ.అణ్ణాడు) (సం.అ.పుం,న.) : 1.ఉంగ రము; 2. సూడిగము.

**వాలధి** (సం.వి.ఇ.పుం.) : ఏనుఁగు గుఱ్ఱము లోనగువాని తోఁక.

**వాలపాశ్య** (సం.వి.ఆ.స్త్రీ.) : జడబిళ్ల, పారితథ్య.

**వాలము** (ఉభ.వై.వి.) : బెబ్బులి. (సం.అ.పుం.): 1. తోఁక; 2. తలవెండ్రుక; 3. కత్తి.

**వాలయించే** (దే.అం,ప్రే.) : నిర్బంధించు. (వాలాయించు యొక్క రూపాంతరము)

**వాలఱుగుడు** (ద్వ.వి.) : (వాలు + అఱుగుడు) వాలిఁడికోఁతి.

**వాలహస్తము** (సం.వి.అ.పుం.) : 1. వెండ్రుకలు గల తోఁక; 2. వెండ్రుకల సమూహము.

**వాలాయము** (దే.వి.) : నిర్బంధము. (వి.ణ.) : 1. అనివార్యము; 2. నిరంతరము. (వాలా యము – వాలాయముగ.)

**వాలాయించే** (దే.అ.క్రి.) : నిర్బంధపడు.

**వాలారు** (ద్వ.విణ.) : (వాలు+ఆరు) వాఁడి యైనది. (చూ. నారి.)

**వాలిఁడి** (ద్వ.వి.) : (వాలు+ఇఁడి) తోఁకలేని కోఁతి. (విణ.) తోఁకలేనిది.

**వాలిక** (ఉభ.దే.విణ.) : 1. దీర్ఘము; 2. వాఁడి యైనది. (చూ. దీని ముందు భాగము కొండొక మూడవ యర్థము కడ.) (సం.వి.ఆ.స్త్రీ.) అంగిటిగుంట.

**వాలు** (యు.దే.అ.క్రి.) : 1.అతిశయించు; 2.క్రిందికి దిగు; 3. ఒఱగు; 4. వంగు. (వ్రాలు యొక్క రూపాంతరము) (చూ.వాలుచు) (స.క్రి.) అతిక్రమించు. (చూ. దీని ముందుభాగము మూఁడు (అ.క్రి.) : మొదటి యర్థము కడ) (వై.వి.) : 1.కత్తి; 2. దైర్ఘ్యము; 3.వాఁడిమి. (చూ. వాలారు) (విణ.) : 1.దీర్ఘము; 2.వాఁడి; (రూ. వాలు రమ్ము. హోరి) (ఇది గొడ్డురాలు వంటిది) 3.క్రూరము.

**వాలుఁగంటి** (దే.వి.) : (వాలు+కన్ను) 1. దీర్ఘము లయిన కన్నులు గల యాఁడుది; 2. ఆఁడుది. (విశాలాక్షి.)

**వాలుక** (సం.వి.ఆ.స్త్రీ.) : ఇసుక. (అ.న.ము.) నూఁగు దోస.

**వాలుకొంగ** (ద్వ.వి.) : వక్కుకొంగ, బకము.

**వాలుగ** (దే.వి.) : 1. మత్స్యవిశేషము; (చూ. వాలు దైర్ఘ్యమనునర్థము) 2. మత్స్యము.

**వాలుగకంటి** (దే.వి.) : 1. వాలుగవంటి కన్నులు గల యాఁడుది; 2. ఆఁడుది. (చూ. నులుము రెండవ యర్థము)

**వాలుగటెంకి** (దే.వి.) : మత్స్యవిశేషము.

**వాలుగడాలు** (దే.వి.) : మన్మథుఁడు, మీనకేతనుఁడు.

**వాలుగడుపు** (ద్వ.వి.) : (వాలు + కడుపు) బొజ్జ. (రూ. వాల్గడుపు.)

**వాలుగపాము** (దే.వి.) : మత్స్యవిశేషము.

**వాలుచే** (దే.ప్రే.) : వాలఁజేయు. (రూ. వాల్చు. వంచుటకు)

**వాలుచేక్క** (ద్వ.వి.) : శుక్రుఁడు.

**వాలుడు** (దే.వి.) : వాతారి.

**వాలుపు** (దే.వి.) : వాల్చుట.

**వాలుప్రొద్దు** (ద్వ.వి.) : లేఁబ్రొద్దు, అపరాహ్ణము.

**వాలుమగఁడు** (ద్వ.విణ.) : శూరుఁడు.

**వాలుమెకము** (వై.వి.) : అడవిపంది.

**వాలువ** (దే.వి.) : వాలుగ యొక్క రూపాంతరము.

**వాలూరు** (దే.అ.క్రి.) : ఆలస్యమగు.

**వాలెము** (దే.వి.విణ.క్రి.విణ.) : వాలాయము యొక్క రూపాంతరము. (నిరంతరమునకు. అవశ్యమునకు.) (ఈరూపము తిమ్మకవిత్వము నందు మాత్రమే కానఁబడుచున్నది.)

**వాల్కము** (సం.విణ.) : (అ.ఈ.అ.) నారది. (చీర.)

**వాల్గంటి** (ద్వ.వి.) : వాలుఁగంటి యొక్క రూపాంతరము.

**వాల్మీకి** (సం.వి.ఇ.పుం.) : సంస్కృత రామాయణ మును రచించిన మహర్షి.

**వాల్లభ్యము** (సం.వి.అ.న.) : ఆధిపత్యము, దొరతనము.

**వావదూకుడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) యుక్తి యుక్తముగా మాటలాడువాఁడు. వాగ్మి.

**వావాదు** (వై.వి.) : (చూ.) ఉపన్యాసము, వాఙ్ముఖము.

**వావి** (దే.వి.) : బంధుత్వము.

**వావింట** (దే.వి.) : వాయింట యొక్క రూపాంతరము.

**వావిక** (దే.వి.) : కుత్తుక మొదటఁ గలగుంట.

**వావిరి** (దే.వి.) : 1. క్రమము; 2. అనుగతి; 3. ఉత్కర్షము. (విణ.) : 1. అధికము; 2.అనుగతము; 3. ఉత్కృష్టము.

**వావిలి** (దే.వి.) : శేఫాలిక. (ఇది ద్వి విధము. నల్లవావిలి, తెల్లవావిలి. ఇదియె నల్లవావిలి.)

**వావురము** (దే.వి.) : వారువమునకు మాఱు రూపము. (దీనికి సరియైన ప్రయోగము చిక్కినది కాదు.)

**వావృత్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) వరింపఁబడినది.

**వాశకము** (సం.వి.అ.పుం.) : అడ్డసరము.

**వాశి** (సం.వి.ఈ.స్త్రీ.) : (చూ.) బాడిస.

**వాశిత** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.ఆఁడేనుఁగు; 2. ఆఁడుది. (అ.న.ము.) మృగపక్షి ధ్వని. (విణ.) వాసన కట్టఁబడినది.

**వాస** (దే.వి.) : ఇంటికిమీఁద పఱపెడువాసము.

**వాసంతము** (సం.వి.అ.పుం.) : 1.ఒంటె; 2. కోయిల; 3.తెమ్మెర.(విణ.) : 1.ఉంచఁబడినది; 2.వసంత సంబంధమైనది.

**వాసంతి** (సం.వి.ఈ.స్త్రీ.) :1.అడవి మొల్ల; 2. పువ్వులగురివెంద; 3. బట్ట కడిమి.

**వాసకము** (సం.వి.అ.పుం.): 1.ఇల్లు; 2.అడ్డసరము.

**వాసకసజ్జిక** (సం.వి.ఆ.స్త్రీ.): ప్రియుఁడు పడకకు వచ్చెదునని తెలిసి పడకిల్లు సింగారించి తాను సింగారించుకొని యుండెడు నాయిక. (చూ. నాయిక)

**వాసగృహము** (సం.వి.అ.న.) : పడకిల్లు, భోగగృహము.

**వాసన** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. గంధము; 2.అనుభూతార్థస్మృతి; 3.ప్రత్యాశ. (అ.న.ము.) : 1.వాసన కట్టుట; 2. వస్త్రము; 3. వీరాసనము. (విణ.) వసన సంబంధమైనది.

**వాసనకొడుపు** (మి.వి.) : పెద్దయూఁదువత్తి.

**వాసపోయు** (దే.అ.క్రి.) : వాసాలపఱపు.

**వాసము** (ఉభ.దే.వి.) : ఇంటికి మీఁద పఱచెడు పట్టె. (చూ. వాసపోయు) (సం.స్.న.) వస్త్రము. (చూ.చాలు మొదటి యర్థము) (మొదటి రూపము వాసస్సు) (అ.పుం.) : 1. ఇల్లు; 2.అడ్డసరము.

**వాసయోగము** (సం.వి.అ.పుం.) : గందపొడి, చూర్ణము.

**వాసరము** (సం.వి.అ.పుం,న.) : దినము, దివసము, ప్రొద్దు.

**వాసవుఁడు** (సం.వి.అ.పుం.) : ఇంద్రుఁడు, వేల్పుఱేఁడు.

**వాసి** (ఉభ. దే.వి.): 1.తారతమ్యము; 2.భేదము; 3. ఆధిక్యము; 4. లాభము, (వాఁడు వడ్డికి వాసికిచ్చి జీవనము చేయుచున్నాఁడు.) 5. ప్రసిద్ధి; 6. పరిమితి. (ఇందు ముప్పాతిక వాసి గ్రంథమచ్చు పడినది.) (విణ.) : 1. ఉత్కృష్టము, (దానికంటె నిదివాసి); 2. స్వస్థము (ఇప్పుడు నాకు ఒళ్లు వాసిగానున్నది); 3. బాగు. (సం.వి.) వాశి యొక్క రూపాంతరము.

**వాసించే** (సం.అ.క్రి.): వసించు. (స.క్రి.) వాసన కట్టు. (చూ. నెలవత్తి.)

**వాసిత** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. ఆఁడేనుఁగు; 2.ఆఁడుది. (అ.న.ము.) మృగ పక్షుల ధ్వని. (విణ.): 1.వాసనకట్టినది; 2. వాసెన కట్టినది.

**వాసుకి** (సం.వి.ఇ.పుం.) : ఒక సర్పరాజు.

**వాసుదేవుఁడు** (సం.వి.అ.పుం.) : వసుదేవుని కొడుకు, కృష్ణుఁడు.

**వాసువు** (సం.వి.ఊ.స్త్రీ.): నాట్యపరిభాషయందు బాలిక.

**వాసె** (వై.వి.) : వాసెగ్రోలు. (మొదటి రూపము వాసియ.)

**వాసెగ్రోలు** (ద్వ.వి.): (వాసె + క్రోలు) పిల్లంగ్రోవి.

**వాసెన** (వై.వి.) : ఆవిరిపోకయొసటి కుండ మూతిమూసి కట్టినగుడ్డ.

**వాసెనకట్టు** (ద్వ.వి.) : వాసెనగుడ్డ కట్టువంటి కట్టు.

**వాసెనకుడుము** (ద్వ.వి.): ఇడ్డెనయను పిండివంట.

**వాస్తవము** (సం.వి.అ.న.) : యథార్థము.

**వాస్తవికము** (సం.విణ.) : (అ.ఈ.అ.) యథార్థమైనది.

**వాస్తవ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) వసింపఁదగినది.

**వాస్తవ్యుఁడు** (సం.వి.అ.పుం.) : గృహస్థుఁడు.

**వాస్తుకము** (సం.వి.అ.న.) : ఒక దినుసు కూరాకు, చక్రవర్తము. (రూ. వాస్తూకము.)

**వాస్తువు** (సం.వి.ఉ.పుం,న.) : 1. ఇండ్లు మొదలైనవి యేర్పఱుపఁదగిన భూమి; 2. ఇల్లు.

**వాస్తోష్పతి** (సం.వి.ఇ.పుం.) : 1. ఇంద్రుఁడు; 2. వేల్పుఱేఁడు.

**వాస్త్రము** (సం.విణ.) : (అ.ఆ. అ.) 1.వస్త్రము చేతఁగప్పఁబడినది; (రథము); 2.వస్త్ర సంబంధ మైనది.

**వాహద్విషము** (సం.వి.ష్.పుం.) : ఎనుపోతు.

**వాహనము** (సం.వి.అ.న.) : ఎక్కఁదగిన యేనుఁగు లోనగునది.

**వాహము** (సం.వి.అ.పుం.) : 1.గుఱ్ఱము; 2.ఎద్దు; 3. భుజము; 4. వాయువు; 5. ఇరుస.

**వాహసము** (సం.వి.అ.పుం.) : 1. పెనుఁబాము; 2. తూముకాలువ; 3. నీరుచెంచలి.

**వాహితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) వహింపఁ బడినది.

**వాహిత్థము** (సం.వి.అ.న.) : ఏనుఁగు యొక్క వాతకుంభము క్రిందిచోటు.

**వాహిని** (ఉభ.వై.వి.) :వాగ్ధోరణి. (సం.వి.ఈ. స్త్రీ.) : 1. నది; 2.సేన; 3.సేనా విశేషము. (ఎనుబది యొక్క రథము అన్నియేనుఁగులు ఇన్నూట నలువది మూడు గుఱ్ఱములు నన్నూట యేవురు కాల్వురును గలది.)

**వాహినీపతి** (సం.వి.ఇ.పుం.) : 1. సేనా నాయకుఁడు; 2. సముద్రుఁడు.

**వాహ్యము** (సం.వి.అ.న.) : వాహనము. (విణ.): వహింపఁదగినది.

**వాహ్యాళి** (సం.వి.ఇ.స్త్రీ.) : స్వారి. (చూ. ప్రోయాలు)

**వాళి** (దే.వి.) : 1. పసులుపోవుదారి; 2. వాడుక.

## వి

**వి** (దే.అప.) : ది అనుదానికి బహువచనము. (చూ. ది)

**వింగడము** (వై.విణ.) :1.విస్తీర్ణము; 2.సుందరము; 3.విపరీతము; 4.వేఱు. (చూ. వింగడించు.)

**వింగడించు** (వై.స.క్రి.) : వేఱుపఱచు, విభజించు.

**వింజామర** (మి.వి.) : (వెల్ల+చామర) తెల్లని చామరము. (రూ. వింజామరము.) (అఱవ మున వెణ్‌శామర మందురు) (ఇది ముంగోపము వంటిది.)

**వింజిలి** (దే.వి.) : మత్స్య విశేషము.

**వింజము** (వై.వి.) : వింధ్య పర్వతము.

**వింట** (దే.వి.) : వినుట, శ్రవణము.

**వింటాలము** (దే.వి.) : మల్లబంధ విశేషము.

**వింటికోల** (దే.వి.) : (విల్లు + కోల) ఱాళ్లపని వాని యొక్క ధనురాకారమైన సాధన విశేషము.

**వింటిపట్టు** (దే.వి.) : (విల్లు+పట్టు) (చూ.) అమ్ముvేటునేల, ధన్వంతరము.

**వింటిరాసి** (ద్వ.వి.) : (విల్లు + రాసి) ధనూరాశి.

**వింటివాఁడు** (దే.విణ.) : (విల్లు+వాఁడు) విలుకాఁడు.

**వింత** (దే.వి.) : ఆశ్చర్యము. (విణ.) : 1.అపూర్వము (చూ. ఒయ్య మొదటి యర్థము); 2.అన్యము.

**వింతరాలు** (దే.విణ.) : (వింత+ఆలు) అన్యురాలు. (ఇది ముద్దరాలు వంటిది.)

**వింతవాఁడు** (దే.విణ.) : అన్యుడు.

**విందు** (దే.వి.) : 1. చుట్టములు లోనగు వానికి పెట్టెడు భోజనము; 2.ఆతిథ్యము; 3.చుట్టము.

**విందుపురుగు** (ద్వ.వి.) : ఒక దినుసు సాలెపురుగు.

**విందువు** (సం.విణ.) : (ఉ.ఊ.ఉ.) తెలియువాఁడు.

**వింధ్య** (సం.వి.ఆ.స్త్రీ.) : లవలి. (అ.పుం.ము.) పర్వత విశేషము. (డు.) బోయవాఁడు.

**వింశతి** (సం.స.ఇ.స్త్రీ.) : ఇరువది. (విణ.) ఇరువది సంఖ్య గలది.

**వింశము** (సం.విణ.) : (అ.ఈ.అ.) ఇరువదవది.

**వికంతకము** (సం.వి.అ.పుం.) : ములువెలమ. పుల్లవెలఁగ. (అని కొందఱు.)

**వికచము** (సం.వి.అ.పుం.) : కేతు గ్రహము. (విణ.) : 1.వికసించినది; 2. వెంద్రుకలులేనిది.

**వికట** (సం.వి.ఆ.స్త్రీ.) : వజ్రవారాహి యను దేవత. (విణ.) : 1.మిక్కిలి వంకరైనది; 2.విరివి యైనది; 3. చక్కనైనది.

**వికటకవి** (సం.వి.ఇ.పుం.) : వికటముగా మాట లాడువాఁడు, హాస్యకరుఁడు.

**వికటించే** (సం.అ.క్రి.) : వంకరయగు, ఎదురు తిరుగు. (వాఁడు నాతో వికటించియున్నాఁడు.)

**వికత్థనము** (సం.వి.అ.న.) : స్తోత్రము, పొగడిక.

**వికర్తనుఁడు** (సం.వి.అ.పుం.) : సూర్యుఁడు.

**వికర్మికుఁడు** (సం.వి.అ.పుం.) : అంగడిపారుపత్తె కాఁడు.

**వికలము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విచ్ఛేదము నొందినది.

**వికల్పము** (సం.వి.అ.పుం.) : 1. భ్రాంతి; 2. మాఱుదల; 3. అవాంతర కల్పము; 4. ఒక యర్థాలంకారము (చూ. అలంకారము)

**వికవిక** (దే.వి.) : నవ్వుట యందగు ధ్వన్యను కరణము. (చూ. తిరుగలి రెండవ యర్థము)

**వికస** (సం.వి.ఆ.స్త్రీ.) : మంజిడి. (అ.పుం.డు.): చంద్రుఁడు.

**వికసనము** (సం.వి.అ.న.) : వికాసము, తెలివి.

**వికసించే** (సం.అ.క్రి.) : వికాసము పొందు, విరియు.

**వికసితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) వికసించినది.

**వికస్వరము** (సం.విణ.) : (అ.ఆ.అ.) వికసించునది.

**వికారము** (సం.వి.అ.పుం.) : 1. మనసు యొక్క కాని రూపము యొక్కకాని మాఱు పాటు; 2.తెవులు. (షోడశవి కారములు. ఏకాదశేంద్రి యములు పంచభూతములును.)

**వికారి** (సం.వి.న్.పుం.) : ఒక సంవత్సరము. (చూ.సంవత్సరము.) (విణ.) వికారము గలది.

**వికావిక** (దే.వి.) : 1.నవ్వుట యందగు ధ్వన్యను కరణము; 2. కేరుటయందగు ధ్వన్యనుకరణము; (విణ.బ.) చెల్లా చెదరు.

**వికాసము** (సం.వి.అ.పుం.) : వికసనము, తెలివి.

**వికాసి** (సం.విణ.) : (న్.ఈ.న్.) వికాసము కలది.

**వికిరము** (సం.వి.అ.న.) : గజకుంభస్థల మధ్యము. (పుం.) : 1.పక్షి; 2.ఖండము; 3.శ్రాద్ధకాలము నందు నిమంత్రితులు భుజించిన పిమ్మట విస్తరకు ముందఱ వేసెదు అన్నము; 4.నూయి.

**వికీరణము** (సం.వి.అ.న.) : వెదచల్లుట. (పుం.): జిల్లేడు.

**వికీర్ణము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. వెదచల్లఁ బడినది; 2. చెదరినది.

**వికుర్వాణుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) సంతోషము నొందిన మనస్సు కలవాఁడు.

**వికృతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. వికారము నొందినది; 2.తెవులు నొందినది; 3.రోఁత యయినది.

**వికృతి** (సం.వి.ఇ.స్త్రీ.) :1.వికారము; 2.ఒక ఛందస్సు. (చూ. ఛందస్సు) (పుం.) : ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము)

**విక్కము** (సం.వి.) : ఇరువైయేండ్ల వయస్సు గల యేనుఁగు.

**విక్కవిరియు** (దే.అ.క్రి.) : (విరియు + విరియు) మిక్కిలి విరియు.

**విక్కు**(దే.అ.క్రి.) : 1. విజృంభించు; 2. గర్వించు.

**విక్రమ** (సం.వి.అ.పుం.) : ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము) (ము.) : 1. అధికబలము; 2. ఆక్రమ ణము; 3. శౌర్యము; 4. చరణము.

**విక్రమించు** (సం.అ.క్రి.) : 1. వీర్యము చూపు; 2. శౌర్యము చూపు.

**విక్రముఁడు** (సం.వి.అ.పుం.) : 1.విష్ణువు; 2. విక్రమార్కరాజు.

**విక్రయము** (సం.వి.అ.పుం.) : అమ్మకము, విపణము.

**విక్రయి** (సం.వి.న్.పుం.) : (చూ.) విక్రయికుఁడు.

**విక్రయించే** (సం.స.క్రి.) : విక్రయము చేయు, అమ్ము.

**విక్రయికుఁడు** (సం.వి.అ.పుం.) : అమ్మెడు వాఁడు.

**విక్రాంతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1.విక్రమము; 2. అశ్వగతి.

**విక్రాంతుఁడు** (సం.విణ.) : (అ. ఆ. అ.) విక్రమించినవాఁడు.

**విక్రియ** (సం.వి.ఆ.స్త్రీ.) : (చూ.) వికారము.

**విక్రీడితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విక్రయింపఁ బడ్డది.

**విక్రేత** (సం.వి.ఋ.పుం.) : విక్రయించువాఁడు.

**విక్రేయము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విక్రయింపఁ దగినది.

**విక్లబుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) భయకోశాదుల చేత చేతులు కాళ్లు విలవిలపోవువాఁడు.

**విక్షావము** (సం.వి.అ.పుం.) : 1.దగ్గు; 2.తుమ్ము.

**విక్షిప్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. ఎగుర వేయఁబడినది; 2. విసిరి వేయఁబడినది.

**విక్షేపము** (సం.వి.అ.పుం.) : 1. ఎగుర వేయుట; 2. విసిరి వేయుట; 3. కదలిక.

**విక్షేపించే** (సం.స.క్రి.) : 1.ఎగురవేయు;2. విసిరి వేయు.

**విఖ్యాతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విఖ్యాతిఁ జెందినది.

**విఖ్యాతి** (సం.వి.ఇ.స్త్రీ.) : మిక్కిలి ప్రసిద్ధి.

**విఖ్యుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ముక్కు పోయినవాఁడు, ముక్కిఁడి. (రూ. విఖ్రుఁడు.)

**విగడియ** (వై.వి.) : గడియలో అఱువదవభాగము.

**విగతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. బొత్తిగాఁ పోయినది; 2. వెలుఁగు లేనిది.

**విగమము** (సం.వి.అ.పుం.) : 1.నాశము; 2. విభజనము.

**విగళనము** (సం.వి.అ.న.) : మిక్కిలి జాఱుట, విస్ఖలనము.

**విగళితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మిక్కిలి జాఱినది.

**విగాఢము** (సం.విణ.) : (అ.ఆ.అ.) (చూ.) విగాహితము.

**విగాహము** (సం.వి.అ.పుం.) : మునుఁగుట. (రూ. విగాహనము)

**విగాహించే** (సం.అ.క్రి.) : మునుఁగు, క్రుంకు.

**విగాహితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మునిఁగినది.

**విగుణము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విభిన్న గుణము గలది.

**విగుర్వించు** (దే.స.క్రి.) : (విఱుచు + విఱుచు) చక్కగా విఱుచు.

**విగ్రహము** (సం.వి.అ.పుం.) : 1.శరీరము; 2.విభాగము; 3. విస్తారము. (పుం.న.) : 1.యుద్ధము; 2.షడ్గుణములలో నొకటి (చూ. గుణము)

**విగ్రహించు** (సం.అ.క్రి.) : కలహించు, పోరు.

**విగ్రుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) (చూ.) విఖ్యుఁడు.

**విఘటిక** (సం.వి.ఆ.స్త్రీ.) : (చూ.) విగడియ.

**విఘసము** (సం.వి.అ.పుం.) దేవతా తిథుల భుక్తశేషము.

**విఘాతము** సం.వి.అ.పుం,న. 1.అడ్డంకి; 2. పెద్ద దెబ్బ; 3. చెఱుపు.

**విఘాతించే** సం.స.క్రి. 1. చెఱుచు; 2. చంపు.

**విఘ్నపడు** (మి.అ.క్రి.) : (విఘ్నము + పడు) అడ్డిపడు. (చూ. జాలి మూడవ యర్థము)

**విఘ్నము** (సం.వి.అ.పుం.) : అడ్డి, అంతరాయము.

**విఘ్నరాజు** (సం.వి.అ.పుం.) : వినాయకుఁడు.

**విచక్షణుఁడు** (సం.వి.అ.పుం.) : చదువరి. (విణ.) నేర్పరి.

**విచయనము** (సం.వి.అ.న.) : వెదకుట, అన్వేషణము.

**విచర్చిక** (సం.వి.ఆ.స్త్రీ.) : గజ్జి, పామ.

**విచారణ** (సం.వి.ఆ.స్త్రీ.) : ప్రమాణముల చేత విషయమును పరిశీలించుట, చర్చ.

**విచారణీయము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విచారణచేయఁదగినది.

**విచారపడు** (మి.అ.క్రి.) : (విచారము + పడు) సంతాపించు.

**విచారము** (సం.వి.అ.పుం.) : 1. ఆలోచనము; 2. సంతాపము.

**విచారించు** (సం.అ.క్రి.) : 1. ఆలోచించు; 2. సంతాపించు.

**విచారితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విచారింపఁబడినది.

**విచార్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విచారింపఁదగినది.

**విచికిత్స** (సం.వి.ఆ.స్త్రీ.) : సంశయము, సందియము.

**విచికిలము** (సం.వి.అ.పుం.) : 1. ఒక దినుసు మల్లె; 2. మల్లె; 3. దవనము.

**విచిత్రము** (సం.వి.అ.న.) : ఆశ్చర్యము. (పుం.) చిత్రవర్ణము. (విణ.) : 1.ఆశ్చర్యకరము; 2.చిత్రవర్ణముకలది.

**విచల్లిక** (సం.వి.ఆ.స్త్రీ.) : (చూ.) పావలి.

**విచేష్టించు** (సం.అ.క్రి.) : మిక్కిలి చేష్టించు. (చూ. చేష్టించు.)

**విచ్చేయు** (మి.గ్రా.అ.క్రి.) : 1. వచ్చు; 2. పోవు. (ఇక్కడ విచ్చేయుట యనఁగా కూర్చుండుట.) (విజయం చేయునకు మాఱు రూపము) (చూ.విజయము చేయు)

**విచ్చే** (దే.వి.) : నాలుగువేళ్ళకు చుట్టితీసిన నూలిచుట్ట.

**విచ్చేలవిడి** (దే.వి.) : (విచ్చులు+విడి) స్వాతంత్ర్యము. (విణ.) స్వతంత్ర్యము. (క్రి.విణ.) యథేచ్ఛము.

**విచ్చేవిచ్చేలు** (దే.అవ్య.) : యథా యథలు.

**విచ్ఛాయ** (వై.వి.) : రత్నదోషవిశేషము.

**విచ్చే** (దే.అ.క్రి.) : 1.విరియు; 2.చీలు. (అం.(ప్రే.) విరియఁజేయు. (కనువిచ్చి చూచెను) (ప్రే. విడుచు యొక్క రూపాంతరము.

**విచ్చేకత్తి** (ద్వి.వి.) : ఒఱదూసినకత్తి.

**విచ్చేటాకు** (దే.వి.) : (విచ్చు + ఆకు) చెవ్వాకు.

**విచ్చుమొగ్గ** (ద్వి.వి.) :1.విరియు మొగ్గ; 2.చెల్లాచెదరగుట.(ఇది రెండర్థములకు నుదాహరణము.) (విణ.) : 1.చెల్లాచెదరైనది; 2. చెల్లాచెదరు చేయునది.

**విచ్ఛాయము** (సం.వి.అ.పుం.) : రత్న దోష విశేషము. (విణ.) చాయ పోయినది.

**విచ్ఛిత్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. ఎడఁబాటు; 2. వస్త్ర భూషణాద్యలంకారము కొలఁదిగా నుండినను మిక్కిలి యొప్పిదమును తోఁపఁజేసెడు స్త్రీల యొక్క శృంగార చేష్టావిశేషము; 3. పూఁత; 4.నఱకుడు.

**విచ్ఛిన్నము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1.ఎడఁబడినది; 2.పూయఁబడినది; 3.నఱకఁబడినది; 4.వంకరైనది.

**విచ్ఛేదము** (సం.వి.అ.పుం.) : 1. ఎడఁబాటు; 2. నఱకుడు.

**విజనము** (సం.విణ.) : (అ.ఆ.అ.) జనులు లేనిది ఏకాంతము.

**విజయ** (సం.వి.ఆ.స్త్రీ.) :1.జయతిథి; 2.పార్వతి; 3.పార్వతియొక్క చెలికత్తె. (అ.పుం.) : 1.ఒక సంవత్సరము (చూ. సంవత్సరము); 2. దినము యొక్క ఆరవ భాగము. (చూ.దినము.)

**విజయంచేయు** (మి.అ.క్రి.) : (విజయము + చేయు) 1.వచ్చు; 2.పోవు. (విజయము చేయు యొక్క రూపాంతరము. (చూ.) విజయము చేయు.)

**విజయచ్ఛందము** (సం.వి.అ.పుం.) : ఏనూఱు పేటలు గల హారము.

**విజయదశమి** (సం.వి.ఈ.స్త్రీ.) : ఆయుధములు లోనగువానిఁ బూజించెడు ఆశ్వయుజమాసము శక్లపక్షము నందలి పదవతిథి.

**విజయము** (సం.వి.అ.పుం.) : 1.మిక్కిలి గెలుపు; 2.దినము యొక్క ఆఱవ భాగము. (చూ. దినము.)

**విజయముచేయు** (మి.అ.క్రి.) : 1.వచ్చు; 2. పోవు. (ఇది పూజ్యుల యొక్క రాకపోకల యందే ప్రయోగిం పఁబడెడి.)

**విజయి** (సం.విణ.) : (న్.ఈ.న్.) విజయము గలవాఁడు.

**విజయుఁడు** (సం.వి.అ.పుం.) : 1. అర్జునుఁడు; 2. విష్ణుద్వార పాలకులలో నొకఁడు.

**విజాతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. విభిన్నజాతి; 2.విశేష జాతి.

**విజాతీయము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విజాతి సంబంధమైనది.

**విజగీష** (సం.వి.ఆ.స్త్రీ.) : మిక్కిలి జయింపనిచ్ఛ.

**విజగీషువు** (సం.విణ.) : (ఉ.) మిక్కిలి జయింప నిచ్ఛ గలవాఁడు.

**విజితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) జయింపఁ బడినవాఁడు.

**విజిలము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మీఁగడ గట్టినది, (పెరుఁగు లోనగునది) పిచ్ఛిలము.

**విజృంభణము** (సం.వి.అ.న.) : మిక్కిలి జృంభణము. (చూ. జృంభణము)

**విజృంభించు** (సం.అ.క్రి.) : 1. చెలరేఁగు; 2. వికసించు.

**విజృంభితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. వికసించినది; 2. ఆవులించినది.

**విజ్ఞప్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : విజ్ఞాపనము, విన్నపము.

**విజ్ఞాతుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ప్రసిద్ధుఁడు.

**విజ్ఞానము** (సం.వి.అ.న.) : 1. శాస్త్రాదుల యందలి జ్ఞానము; 2. విశేషజ్ఞానము; 3. కార్యము.

**విజ్ఞాపనము** (సం.వి.అ.న.) : విజ్ఞప్తి. (చూ.) విన్నపము.

**విజ్ఞాపించు** (సం.స.క్రి.) : విజ్ఞాపనము చేయు, విన్నవించు.

**విజ్ఞుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) నిపుణుఁడు, నేర్పరి.

**విజ్ఝే** (దే.అ.క్రి.) : వ్యాపించు. (వి.) : తన్నుకొనుట యందగు ధ్వన్యను కరణము. (ఆమ్రేడితమునందు విజ్ఝువిజ్ఝు.)

**విజ్జోడు** (ద్వ.విణ.) : (వీడు + జోడు) జోడు కానిది, సరికానిది.

**విజ్జోడుపడు** (ద్వ.అ.క్రి.) : భేదపడు.

**విటంకము** (సం.వి.అ.పుం,న.) : కొణిగ యందలి గువ్వగూఁడు.

**విటంకత్తె** (మి.గ్రా.వి.) : విటుకులాఁడి, విటి.

**విటకాఁడు** (మి.గ్రా.వి.) : విటుఁడు. (చూ. లోఁగలి) (స్వార్థమున కాఁడు)

**విటతటము** (దే.విణ.) : విటతాటము యొక్క రూపాంతరము.

**విటతాటనము** (దే.విణ.) : తాఱు మాఱు.

**విటతాటము** (దే.విణ.) : తాఱుమాఱు.

**విటపము** (సం.వి.అ.పుం,న.) : 1. చిగిరించిన కొమ్మ; 2. కొమ్మ; 3. చిగురు; 4. బోదెలేని చెట్టు.(డు.) విటరాయఁడు.

**విటపి** (సం.వి.న్.పుం.) : 1. చెట్టు; 2. మఱ్ఱిచెట్టు.

**విటరాయఁడు** (వై.వి.) : విటశ్రేష్ఠుఁడు.

**విటి** (సం.వి.ఈ.స్త్రీ.) : విటకత్తె, విటుకులాఁడి.

**విటుఁడు** (సం.వి.అ.పుం.) : విటకాఁడు, పల్లవుఁడు.

**విటుకులాఁడి** (ద్వ.వి.) : (విటుకలు + ఆఁడి) విటురాలు.

**విట్ఖదిరము** (సం.వి.అ.పుం.) : తుమ్మ. వెలితుమ్మ. (అని కొందఱు.)

**విట్చరము** (సం.వి.అ.పుం.) : (చూ.) ఊరఁబంది.

**విట్ఛారిక** (సం.వి.ఆ.స్త్రీ.) : పీతిగోరువంక.

**విట్టు** (సం.వి.ష్.స్త్రీ.) : విష్ఠ, మలము.

**విడంగము** (సం.వి.అ.పుం,న.) : 1. వాయి విళంగము; 2. వంటయుప్పు. (విణ.) నేర్పరి.

**విడంబన** (సం.వి.ఆ.స్త్రీ.) : (అ.న.ము.) 1. అనుక రించుట; 2. మోసపుచ్చుట.

**విడంబించే** (సం.స.క్రి.) : 1. అనుకరించు; 2. మోసపుచ్చు.

**విడఁద్రొక్కు** (దే.స.క్రి.) : (విడఁ + త్రొక్కు) విడుచు.

**విడనాడు** (దే.స.క్రి.) : (విడఁ + ఆడు) విడుచు.

**విడవలి** (దే.వి.) : ఇండ్లకుకప్పెడు తృణవిశేషము.

**విడి** (దే.వి.) : 1. అరుణకాంతి; 2. ప్రతాపము; 3. క్రోధము; 4. పరాక్రమము; 5. ప్రత్తికాయ లోనిజడ. (విణ.) : 1.అరుణము; 2. ప్రత్యేక మైనది; (విడాకు, విడిపూస, ఒకయెద్దు విడిగా మేయుచున్నది.) 3.విడువఁ దగినది; (విడికథ) 4. పని నుండి విడిచినది. (విడి కోడె, ఇప్పుడు వీఁడు విడిగా నున్నాఁడు.) (క్రి.విణ.) ఒంటరి.

**విడిగోలు** (దే.వి.) : (విడి + కోలు) మాఱుపు. (విణ.) పనిలేనిది.

**విడిచివాటుగుదియ** (ద్వ.వి.) : భిండిపాలము, సాఁగు.

**విడిదల** (ద్వ.వి.) : (విడిది + తల) విడియుచోటు, విడిసినచోటు. (దండు విడియుచోటు స్కంధావారము, దండు నందొక్కొక్కఁడు విడిసినచోటు శిబిరము.)

**విడిది** (దే.వి.) : 1. విడియుట; 2. విడిసినచోటు. (నేను నావిడిదికి పోయెదను.)

**విడిపట్టు** (దే.వి.) : (విడిది + పట్టు) విడిదిచోటు.

**విడిమట్టు** (దే.వి.) : 1. వాసస్థానము; 2. కాఁపురము; 3. విడిది.

**విడిముడి** (దే.వి.) : ధనము.

**విడియము** (వై.వి.) : విడెము. (ముపర్ణకము లేని రూపము గ్రంథములయందు తఱచు వాడుక లోనిది కాదు.) రూ. విడియ.

**విడియు** (దే.అ.క్రి.) : 1. ప్రయాణమై పోవువారు దారిలో నొకచోట దిగు; 2.వీడు; 3.జాఱు.

**విడివడు** (ద్వ.అ.క్రి.) : (విడి+పడు) 1.వీడు; 2.జాఱు; 3.తెగ నుండి వేఱు పడు; (ఆయావు విడివడినది); 4. నిర్బంధము నుండితొలఁగు. (వీఁడు విడివడి యథేచ్ఛముగా తిరుగుచున్నాఁడు.)

**విడివాటుబడియ** (దే.వి.) : విడిచివాటు గుదియ.

**విడివేఁట** (దే.వి.) : డేగవేఁట.

**విడివోవు** (దే.అ.క్రి.) : (విడి+పోవు) వదలు, విడివడు.

**విడు** (దే.అ.క్రి.) : వీడు.

**విడుగడ** (దే.వి.) : విడుపు, విడుదల, విమోచనము.

**విడుగర** (దే.వి.) : విడుపు, విడుదల, విమోచనము.

**విడుగు** (దే.అ.క్రి.) : వికసించు.

**విడుచు** (దే.ప్రే.) : విడఁజేయు, విమోచనము చేయు.

**విడుత** (దే.వి.) : తడవ. (నీవొక విడుతవానితోఁ జెప్పుము)

**విడుదల** (దే.వి.) : విడుగడ విడుగర, విమోచనము.

**విడుపరి** (దే.విణ.) : (విడుపు+అరి) 1. పరిత్యాగశీలుఁడు (చూ. విడుపు); 2. త్యాగశీలుఁడు.

**విడుపు** (దే.వి.) : 1. విమోచనము, పరిత్యాగము; 2. త్యాగము, దానము.

**విడుమర** (దే.వి.) : విడుదల, విమోచనము.

**విడువడు** (ద్వ.అ.క్రి.) : (విడుపు+పడు) విడివడు. (చూ. దుడుకఁడు.)

**విడూరము** (సం.వి.అ.పుం.) : విదూరము యొక్క రూపాంతరము.

**విడెము** (వై.వి.) : తాంబూలము. (విడియము యొక్క రూపాంతరము.)

**విద్చు** (దే.ప్రే.) : విడుచు యొక్క రూపాంతరము.

**విద్డూరము** (వై.వి.) : మౌర్ఖ్యము. (విణ.) మూర్ఖము.

**విద్పు** (దే.వి.) : విడుపు యొక్క రూపాంతరము. (విమోచనమునకు.)

**విడ్యము** (వై.వి.) : విడియము యొక్క రూపాంతరము.

**విడ్వరము** (సం.వి.అ.న.) : ఉపద్రవము.

**విత** (వై.విణ.) : వితా యొక్క రూపాంతరము.

**వితండ** (సం.వి.ఆ.స్త్రీ.) : స్వపక్ష పాతముగ వాదించెడు వాదము. (అ. పుం.ము.) తలుపునకు వేసెడు తాళము.

**వితంతువు** (సం.వి.ఉ.స్త్రీ.) : ముండమోపి, విధవ.

**వితంసము** (సం.వి.అ.పుం.) : మృగములను పక్షులనుఁ బట్టెడు ఉరిత్రాడు.

**వితతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విరివి చేయఁబడినది.

**వితతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. విరివి; 2. సమూహము.

**వితథము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విరివి చేయఁబడినది.

**వితమరి** (ద్వ.విణ.) : (వితము+అరి) కార్యదక్షుఁడు.

**వితము** (వై.వి.) : విధము.

**వితరణము** (సం.వి.అ.న.) : విడుపు, దానము, ఈవి.

**వితరణి** (సం.వి.ఇ.పుం.) : దాత, ఈవి కాఁడు.

**వితర్కము** (సం.వి.అ.పుం.) : 1.ఊహ; 2. సంశయము.

**వితర్కించు** (సం.అ.క్రి.) : 1. ఊహించు; 2. సంశయించు.

**వితర్ది** (సం.వి.ఇ.స్త్రీ.) : అరుఁగు (రూ. వితర్దిక. ఆ.స్త్రీ.)

**వితస్తి** (సం.వి.ఇ.పుం.స్త్రీ.) : (చూ.) జేన.

**వితా** (వై.విణ.) : వ్యర్థము.

**వితాకు** (దే.వి.) : 1. నిశ్చేష్టత; 2. పారవశ్యము; 3.పరాకు; (విణ.) : 1.నిశ్చేష్టితుఁడు, నిశ్చేష్టితు రాలు; 2. పరవశుఁడు.

**వితాకుఁడు** (దే.విణ.) : నిశ్చేష్టితుఁడు.

**వితాకుపడు** (ద్వ.అ.క్రి.) : నిశ్చేష్టితుఁడగు.

**వితానము** (సం.వి.అ.న.) : వృత్త విశేషము. పుం,న. 1. మేలుకట్టు; 2. యజ్ఞము; 3. విరివి. (పుం.) : 1. సమూహము; 2. అవసరము. (విణ.) : 1. మందము; 2. శూన్యము.

**వితావిత** (వై.విణ.) : మిక్కిలి వ్యర్థము.

**వితీర్ణము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. దాఁట బడినది; 2. ఇయ్యఁబడినది.

**వితీర్ణి** (సం.వి.ఇ.స్త్రీ.) : ఈవి, వితరణము.

**వితున్నకము** (సం.వి.అ.న.) : 1. కొతిమిరి; 2. మయిలుతుత్తము. పుం. నేలయుసిరిక.

**వితున్నము** (సం.వి.అ.న.) : 1. నీరు చెంచలి; 2. పాఁచి.

**విత్త** (దే.వి.) : మిక్కిలి చిన్నగోనె.

**విత్తనము** (దే.వి.) : విత్తు, బీజము.

**విత్తము** (సం.వి.అ.న.) : ధనము. (విణ.) : 1. తెలియఁ బడినది; 2. పొందఁబడినది; 3. ప్రసిద్ధి నొందినది; 4. విచారింపఁబడినది.

**విత్తు** (దే.స.క్రి.) : (విత్తనములు) చల్లు. (వి.) విత్తనము.

**విదగ్ధుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. నేర్పరి; 2. చౌరవకాఁడు.

**విదరము** (సం.వి.అ.న.) : చీల్చుట, వ్రచ్చుట.

**విదర్భ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఒక పట్టణము. (అ.పుం.ము.) ఒక దేశము.

**విదళనము** (సం.వి.అ.న.) : 1.మిక్కిలి ఖండించుట; 2. మిక్కిలి భేదించుట.

**విదళము** (సం.వి.అ.న.) : కందులు మొదలగు వాని పప్పు.

**విదళించు** (సం.స.క్రి.) : 1. మిక్కిలి ఖండించు; 2. మిక్కిలి భేదించు.

**విదళితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1.మిక్కిలి ఖండింపఁబడినది; 2.మిక్కిలి భేదింపఁ బడినది.

**విదారకము** (సం.వి.అ.పుం.) : 1. చెలమ; 2. పిల్లనూయి.(విణ.) : చీల్చునది.

**విదారణము** (సం.వి.అ.న.) : 1.చీల్చుట; 2.చంపుట; 3.యుద్ధము. (ప్రవిదారణము అనియు.)

**విదారి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. తెల్ల నేల గుమ్మడి; 2. ముయ్యాకుపొన్న; 3. వ్యాధి విశేషము.

**విదారించే** (సం.స.క్రి.) : చీల్చు, వ్రచ్చు.

**విదారిగంధ** (సం.వి.ఆ.స్త్రీ.) : ముయ్యాకు పొన్న.

**విదిక్కు** (సం.వి.శ్.స్త్రీ.) : రెండు దిక్కుల నడుము, మూల.

**విదితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. తెలియఁ బడినది; 2. అంగీకరింపఁ బడినది.

**విదియ** (వై.వి.) : (పక్షమందు) రెండవ తిథి.

**విదీర్ణము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చీల్పఁబడినది.

**విదురు** (దే.అ.క్రి.) : విదులునకు మొదటి రూపము. (చూ. విదురుచు.)

**విదురుఁడు** (సం.వి.అ.పుం.) : ధృతరాష్ట్రుని తమ్ముఁడు. (విణ.) : 1.తెలియునట్టివాఁడు; 2. తెలిసినవాఁడు.

**విదురుచు** (దే.ప్రే.) : విదురఁజేయు, విదిలించు. (రూ. విదుర్చు.)

**విదురుపు** (దే.వి.) : విదురుచుట. (రూ. విదుర్పు.)

**విదులము** (సం.వి.అ.పుం.) : 1.ప్రబ్బ; 2.నీరు ప్రబ్బ. (రూ. విధులము)

**విదులు** (దే.అ.క్రి.) : రాలు. (చూ. విదులుచు.)

**విదులుచు** (దే.ప్రే.) : విదులఁజేయు. (రూ. విదుల్చు)

**విదులుపు** (దే.వి.) : విదులుచుట. (రూ.విదుల్పు)

**విదుపు** (సం.వి.ఉ.పుం.) : ఏనుఁగు కుంభస్థల మధ్యము.

**విదుషి** (సం.వి.ఈ.స్త్రీ.) : విద్వాంసురాలు.

**విదూరము** (సం.వి.అ.పుం.) : వైడూర్యమణి పుట్టెడు దేశ విశేషము.

**విదూషకుఁడు** (సం.వి.అ.పుం.) : శృంగారనాయక సచివులలో నొకఁడు. (చూ. సచివుఁడు.) (విణ.) : పరులను దూఱువాఁడు.

**విదేశము** (సం.వి.అ.పుం.) : అన్యదేశము.

**విదేశీయుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) అన్యదేశస్థుఁడు.

**విదేహము** (సం.వి.అ.పుం.) : దేశ విశేషము. (విణ.) : దేహములేనిది.

**విద్దె** (వై.వి.) : విద్య, చదువు. (మొదటి రూపము విద్దియ.)

**విద్దెము** (వై.వి.) : బాలక్రీడా విశేషము. (మొదటి రూపము విద్దియము)

**విద్య** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. చదువు; 2. జ్ఞానము. (చతుర్విద్యలు. ఆన్వీక్షకి. (ఇందు విజ్ఞానము తెలుపఁబడును.) త్రయి, (ఇందు ధర్మా ధర్మములు తెలుపఁబడును.) వార్త, (ఇందు అర్థా నర్థములు తెలుపఁ బడును.) దండనీతి. (ఇందు నయానయములు తెలుపఁబడును) షడ్విద్యలు:- ఆకర్షణము, స్తంభనము, మార ణము, విద్వేషణము, చ్ఛాటనము, మోహనము. చతుర్దశ విద్యలు:- చతుర్వేదములు, షడంగ ములు, మీమాంస, న్యాయశాస్త్రము, పురాణ ములు, ధర్మశాస్త్రము. అష్టాదశ విద్యలు:- చతుర్దశ విద్యలు, ఆయుర్వేదము, ధనుర్వేదము, నీతిశాస్త్రము, అర్థశాస్త్రము.)

**విద్యమానము** (సం.విణ.) : (అ.ఆ.అ.) వర్తమానము.

**విద్యాధరుఁడు** (సం.వి.అ.పుం.) : దేవయోని విశేషము.

**విద్యార్థి** (సం.వి.న్.పుం.) : చదువుకోరువాఁడు, చదువువాఁడు.

**విద్యావంతుఁడు** (సం.విణ.) : (త్.ఈ.త్.) విద్యగలవాఁడు, చదువరి.

**విద్యుత్తు** (సం.వి.త్.స్త్రీ.) : 1. మెఱపు; 2. సంధ్య. (విణ.) : మెఱుఁగులేనిది.

**విద్యోతించే** (సం.అ.క్రి.) : ప్రకాశించు, వెలుఁగు.

**విద్రధి** (సం.వి.ఇ.స్త్రీ.) : కడుపులోని బల్ల.

**విద్రవము** (సం.వి.అ.పుం.) : 1. యుద్ధము వలనఁ బాఱిపోవుట; 2. బుద్ధి; 3. నింద; 4. కాఱుట. విద్రావము (సం.వి.అ.పుం.) : యుద్ధము వలనఁ బాఱుట.

**విద్రావితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) యుద్ధము వలనఁ బాఱిపోయినవాఁడు.

**విద్రుచే** (దే.ప్రే.) : విదురుచు యొక్క రూపాం తరము.

**విద్రుతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కరఁగఁ బడినది.

**విద్రుమము** (సం.వి.అ.పుం.) : 1. పగడము; 2. పగడపుఁజెట్టు; 3. చిగురు.

**విద్రుమలత** (సం.వి.ఆ.స్త్రీ.) : గువ్వ గుత్తిక.

**విద్వాంసుఁడు** (సం.వి.స్.పుం.) : చదువరి. (విణ.) : ఎఱుకగలవాఁడు.

**విద్విషుఁడు** (సం.వి.అ.పుం.) : పగవాఁడు, శత్రువు.

**విద్వేషణము** (సం.వి.అ.న.) : 1. విరోధము; 2. షడ్విద్యలలో నొకటి. (చూ. విద్య.)

**విద్వేషము** (సం.వి.అ.పుం.) : పగ, విరోధము.

**విద్వేషి** (సం.విణ.) : (న్.ఈ.న్.) పగవాఁడు, విరోధి.

**విద్వేషించే** (సం.అ.క్రి.) : పగగొను, విరోధించు.

**విధ** (సం.వి.ఆ.స్త్రీ.) : సమృద్ధి. (ఆ.స్త్రీ.అ.పుం.ము.) : 1.ప్రకారము; 2.విధి; 3.వేతనము; 4.గజ కబళము. (విధా శబ్దము ప్రకారార్థము నందు పుంలింగముగాను నిఘంటువుల యందు చెప్పఁబడియున్నది.)

**విధవ** (సం.వి.ఆ.స్త్రీ.) : పెనిమిటి లేనిది, ముండమోపి.

**విధాతృఁడు** (సం.వి.ఋ.పుం.) : 1. బ్రహ్మ; 2.మన్మథుఁడు. (రూ. విధాత.)

**విధానము** (సం.వి.అ.న.) : 1.చేయుట; 2. ఆజ్ఞ; 3. పూజ; 4. గజకబళము; 5. ఉపాయము; 6. ధనము.

**విధాయకము** (సం.వి.) : విధి, ఆజ్ఞ.

**విధాయకుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) విధించువాఁడు.

**విధాయి** (సం.విణ.) : (న్.ఈ.న్.) విధించువాఁడు.

**విధి** (సం.వి.ఇ.పుం.) : 1. బ్రహ్మ; 2. చేయుట; 3. కాలము; 4. భాగ్యము; 5. అలంకార విశేషము; 6.ఏర్పాటు. (ఇది త్రివిధము. అపూర్వవిధి, నియమ విధి, పరి సంఖ్యావిధి.)

**విధించు** (సం.స.క్రి.) : కట్టడచేయు, ఏర్పాటుచేయు.

**విధుంతుదుఁడు** (సం.వి.అ.పుం.) : రాహుగ్రహము.

**విధుతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. విడువఁబడినది; 2.కదలింపఁబడినది.

**విధురము** (సం.వి.అ.న.) : 1. ఎడఁబాటు; 2. వైకల్యము. (విణ.) : 1. ఎడఁబాటు నొందినది; 2.వైకల్యము నొందినది.

**విధువనము** (సం.వి.అ.న.) : కదలించుట, విధూననము.

**విధువు** (సం.వి.ఉ.పుం.) : 1. చంద్రుఁడు; 2. విష్ణువు; 3. కర్పూరము.

**విధూతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. కదలింపఁబడినది; 2. విడువఁ బడినది.

**విధూతి** (సం.వి.ఇ.స్త్రీ.) : కదలించుట, విధువనము.

**విధూననము** (సం.వి.అ.న.) : కదలించుట, విధువనము.

**విధేయుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) వినయము గలవాఁడు.

**విద్ధకర్ణి** (సం.వి.ఈ.స్త్రీ.) : చిఱుబొద్ది.

**విద్ధము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. తొలువఁబడినది; 2. త్రోయఁబడినది; 3.బాధింపఁబడినది; 4.సమానమైనది.

**విధ్వంసము** (సం.వి.అ.పుం.) : మిక్కిలి ధ్వంసము.

**వినత** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.గరుత్మంతుని తల్లి; 2.వంపుపెట్టె. (విణ.) : 1.వంకరైనది; 2.వంగినది; 3. గురు శిక్షిత మైనది.

**వినతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1.వినయము; 2. నమస్కారము.

**విననివాఁడు** (దే.విణ.) : చెవుటివాఁడు, బధిరుఁడు.

**వినమితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మిక్కిలి వంగినది.

**వినమ్రము** (సం.వి.అ.న.) : తగరము. (విణ.): మిక్కిలి వంగినది.

**వినయము** (సం.వి.అ.పుం.) : 1. వినమ్రత; 2. గురుశిక్ష.

**వినాయకుఁడు** (సం.వి.అ.పుం.) : 1. విఘ్నేశ్వరుఁడు; 2. బుద్ధదేవుఁడు; 3. గరుత్మంతుఁడు; 4. గురువు.

**వినాశము** (సం.వి.అ.పుం.) : మిక్కిలి నాశము. (చూ. నాశము.)

**వినినిందించు** (సం.స.క్రి.) : మిక్కిలి నిందించు.

**వినికి** (దే.వి.) : వినుట, వినుకలి, ఆకర్ణనము.

**వినికిడి** (దే.వి.) : (వినికి + ఇడి) వినికి. (స్వార్థమున ఇడి.)

**వినిమయము** (సం.వి.అ.పుం.) : 1. వస్తువుల మాఱుపు; 2. కుదువ.

**వినియుక్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) వినియోగింపఁబడినది.

**వినియోగము** (సం.వి.అ.పుం.) : 1. ఉపయోగము; 2. నియమనము.

**వినియోగించు** (సం.స.క్రి.) : ఉపయోగపఱచు.

**వినిర్గతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) బయలు వెడలినది.

**వినీతము** (సం.వి.అ.పుం.) : చక్కగా మోసెడి గుఱ్ఱము.

**వినీతుఁడు** (సం.వి.అ.పుం.) : వర్తకుఁడు. (విణ.): 1.జితేంద్రియుఁడు; 2.గురువు చేత శిక్షింపఁబడినవాఁడు; 3. గురువు చేత శిక్షింపఁబడనివాఁడు; 4. వినయము గలవాఁడు.

**విను** (దే.స.క్రి.) : ఆకర్ణించు. (వి.) ఆకాశము. (హల్లుపరమగుచో దీని యుకారమునకు వికల్పముగా లోపంబగు.)

**వినుకలి** (దే.వి.) : వినికి, ఆకర్ణనము.

**వినుకలికంటి** (దే.వి.) : (వినుకలి+కన్ను) పాము, చక్షుశ్రవము.

**వినుకెంపు** (దే.వి.) : సూర్యుఁడు, ద్యుమణి. (ఇట్లు వినుమానికము, వినురతనము.)

**వినుచే** (దే.అ.క్రి.) : వినవచ్చు. (ప్రే.) వినఁజేయు, వినిపించు.

**వినుచూలి** (దే.వి.) : వాయువు, నభస్వంతుఁడు. (రూ. విన్నుచూలి)

**వినుద్రిమ్మరి** (దే.వి.) : (విను+త్రిమ్మరి) ఖచరుఁడు.

**విన్నుప్రోలు** (ద్వ.వి.) : స్వర్గము.

**వినుమ్రాను** (దే.వి.) : కల్పవృక్షము.

**వినువలను** (దే.వి.) : స్వర్గము. (రూ. విన్వలను.)

**వినువాఁక** (ద్వ.వి.) : గంగ, స్వర్నది.

**వినుసిగదేవర** (ద్వ.వి.) : శివుఁడు, వ్యోమకేశుఁడు.

**వినోదము** (సం.వి.అ.పుం.) :1. క్రీడాదుల చేత ప్రొద్దు పుచ్చుట వేడుక; 2. క్రీడ.

**వినోదించే** (సం.అ.క్రి.) : 1. క్రీడాదుల చేత ప్రొద్దు పుచ్చు; 2. క్రీడించు.

**విన్కలి** (దే.వి.) : వినుకలి యొక్క రూపాంతరము.

**విన్కి** (దే.వి.) : వినికి యొక్క రూపాంతరము.

**విన్న** (దే.విణ.) : వివర్ణమైనది.

**విన్నఁబడు** (వై.అ.క్రి.) : (విన్న+పడు) వివర్ణమగు.

**విన్నఁబాటు** (వై.వి.) : విన్నఁబడుట, వైవర్ణ్యము.

**విన్నఁబోవు** (ద్వ.అ.క్రి.) : (విన్న+పోవు) వివర్ణమగు.

**విన్నఁబాటు** (వై.వి.) : విన్నఁబడుట, వైవర్ణ్యము.

**విన్నఁబోవు** (ద్వ.అ.క్రి.) : (విన్న+పోవు) వివర్ణమగు.

**విన్నన** (వై.వి.) : 1. వైవర్ణ్యము; (చూ. అలకన) 2. న్యూనత.

**విన్ననువు** (వై.వి.) : 1. నేర్పు; 2. విధము.

**విన్నపత్రిక** (మి.గ్రా.వి.) : (విన్నపము + పత్రిక) విజ్ఞానపత్రిక.

**విన్నపము** (వై.వి.) : మనవి,విజ్ఞాపనము.

**విన్నము** (సం.విణ.) :(అ.ఆ.అ.) 1.పొందఁబడినది; 2.తెలియఁబడినది; 3.విచారింపఁబడినది

**విన్నవించే** (వై.స.క్రి.) : మనవిచేయు, విజ్ఞాపించు.

**విన్నాణము** (వై.వి.) : 1. నేర్పు; 2. మల్లబంధము; 3. ఒప్పిదము.

**విన్నాణి** (వై.వి.) : (విన్నాణము + ఇ) సన్యాసి. (విణ.) : నేర్పరి.

**విన్ను** (దే.వి.) : ఆకాశము. (చూ. కిలాతము.) (విను శబ్దమునకు మొదటి రూపము.)

**విన్యసించు** (సం.స.క్రి.) : ఉంచు.

**విన్యస్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఉంచఁబడినది. (మొదటి రూపము న్యస్తము.)

**విన్యాసము** (సం.వి.అ.పుం.) : 1.ఉనుచుట; (మొదటి రూపము న్యాసము) 2. రచన.

**విపంచి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. వీణ; 2. క్రీడ. (రూ. విపంచిక.ఆ.స్త్రీ.)

**విపక్షుఁడు** (సం.వి.అ.పుం.) : శత్రువు. (విణ.) : పక్షము లేనివాఁడు.

**విపణము** (సం.వి.అ.పుం.) : అమ్మకము, విక్రయము.

**విపణి** (సం.వి.ఇ.ఈ.స్త్రీ. ఇ.పుం.) : 1. అంగడి; 2. అంగడి వీథి; 3. అంగడి యందుండు అమ్ముడుసరకు. (న్.పుం.) : వర్తకుఁడు.

**విపత్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. విపత్తు; 2. యాతన.

**విపత్తు** (సం.వి.ద్.స్త్రీ.) : ఆపద, ఇడుము. (దీనికి విరుద్ధార్థక పదము సంపత్తు.)

**విపథము** (సం.వి.అ.పుం.) : చెడుత్రోవ, దురధ్వము.

**విపన్నము** (సం.వి.అ.పుం.) : పాము. (విణ.) : విపత్తు నొందినది.

**విపరీతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) వ్యత్యస్తము.

**విపర్యయము** (సం.వి.అ.పుం.) : వ్యత్యాసము.

**విపర్యస్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విపర్యాసము నొందినది.

**విపర్యాసము** (సం.వి.అ.పుం.) : (చూ.) విపర్యయము.

**విపశ్చితుఁడు** (సం.వి.త్.పుం.) : చదువరి, పండితుఁడు.

**విపాకము** (సం.వి.అ.పుం.) : 1. దుష్పా కము; 2. పరిపాకము; 3. పరిణామము; 4.పాకము. (విణ.) : పాకము చెడినది.

**విపాదిక** (సం.వి.ఆ.స్త్రీ.) : (చూ.) పాదస్ఫోటము.

**విపాశ** (సం.వి.ఆ.స్త్రీ.) : నదీవిశేషము. (విణ.) : విడిచి పోయిన పాశములు గలది.

**విపినము** (సం.వి.అ.న.) : అడవి, వనము, అరణ్యము.

**విపుల** (సం.వి.ఆ.స్త్రీ.) : నేల. (విణ.) : విరివియైనది.

**విప్ప** (దే.ప్రే.) : విడుచు యొక్క రూపాంతరము. (వి.) : 1.విరియుట; 2.వైశాల్యము; 3. బాహుళ్యము.

**విప్రకారము** (సం.వి.అ.పుం.) :1. తిరస్కారము; 2. అపకారము; 3. దంతనిష్పీడనము వలనఁ గలిగిన ముఖవికారము లోనగునది.

**విప్రకృతుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. తిరస్క రింపఁబడినవాఁడు; 2. అపకారము చేయఁ బడినవాఁడు.

**విప్రకృష్టము** (సం.విణ.) : (అ.ఆ.అ.) దవ్వు, దూరము.

**విప్రతిపత్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. కలఁత; 2. విరోధము.

**విప్రతీపము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మిక్కిలి ప్రతికూలము. (చూ. ప్రతీపము.)

**విప్రతీసారము** (సం.వి.అ.పుం.) : 1. పశ్చాత్తా పము; 2. కోపము; 3. ఆకృత్యము.

**విప్రయాణము** (సం.వి.అ.న.) : యుద్ధ మునఁబాఱి పోవుట, పలాయనము.

**విప్రయోగము** (సం.వి.అ.పుం.స్త్రీ.) : పురుషుల యెడఁ బాటు, విప్రలంభము.

**విప్రలంభము** (సం.వి.అ.పుం.) : 1. (చూ.) విప్ర యోగము; 2. (చూ.) విసంవాదము; 3.మిక్కిలి వంచనము.

**విప్రలబ్ధ** (సం.వి.ఆ.స్త్రీ.) : సంకేతస్థలము నందు ప్రియునిఁగానక మోసపోయి వ్యాకులతఁ బొందునట్టి నాయిక.(చూ. నాయిక) (విణ.): వంచింపఁబడినది.

**విప్రలాపము** (సం.వి.అ.పుం.) : 1.పరస్పర విరుద్ధమైన మాట; 2. అపార్థమైన మాట.

**విప్రశ్నిక** (సం.వి.ఆ.స్త్రీ.) : సోదె చెప్పునది, వేల్పుసాని.

**విప్రుఁడు** (సం.వి.అ.పుం.) : బ్రాహ్మణుఁడు, పాఱుఁడు.

**విప్రుషము** (సం.వి.ష్.స్త్రీ.) : నీటిబొట్టు.

**విప్లవము** (సం.వి.అ.పుం.) : 1. కొల్ల మొదలగు దేశోపద్రవము; 2. ముష్టి ప్రహారాది.

**విబంధము** (సం.వి.అ.పుం.) : మలమూత్ర బంధనరోగము.

**విబుధుఁడు** (సం.వి.అ.పుం.) : 1. చదువరి; 2. వేలుపు; 3. చంద్రుఁడు.

**విబూది** (వై.వి.) : బూది, భస్మము.

**విభక్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విభాగింపఁ బడినది.

**విభక్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1.విభాగము; 2.ప్రథమాది. (ఇవి యేడు. ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థి,పంచమి, షష్ఠి, సప్తమి.)

**విభజనము** (సం.వి.అ.న.) : విభజించుట, విభాగము.

**విభజించే** (సం.స.క్రి.) : పంచు, విభాగించు.

**విభవ** (సం.వి.అ.పుం.) : ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము) (ము.) 1. సంపద; 2. ధనము.

**విభాకరుఁడు** (సం.వి.అ.పుం.) : 1. సూర్యుఁడు; 2. అగ్ని.

**విభాగము** (సం.వి.అ.పుం.) : 1.పాలు; 2. పంపకము.

**విభాగించే** (సం.స.క్రి.) : భాగించు, పంచు. (సంవిభాగించు అనియు.)

**విభాజకము** (సం.విణ.) :(అ.ఈ.అ.) విభజిం చునది. (భాగహారమునందు విభజించు సంఖ్య.)

**విభాజితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విభజింపఁబడినది. (భాగహారము నందు భాగింపఁగా ఏర్పడిన మొత్తము.)

**విభాజ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విభజింపఁదగినది. (భాగహారమునందు భాగింపఁదగిన సంఖ్య.)

**విభాతము** (సం.వి.అ.న.) : వేకువ, (చూ.) ప్రభాతము.

**విభావన** (సం.వి.ఆ.స్త్రీ.) : ఒక యర్థాలంకారము. (చూ. అలంకారము.)

**విభావము** (సం.వి.అ.పుం.) : 1.రసోత్పాదన కారణము; (ఇది ద్వివిధము. ఆలంబన విభావము, ఉద్దీపన విభావము) 2. పరిచయము.

**విభావరి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. రేయి; 2. పసుపు; 3. కుంటెనకత్తె.

**విభావసుఁడు** (సం.వి.అ.పుం.) : 1. సూర్యుఁడు; 2. అగ్ని.

**విభీతకము** (సం.వి.అ.పుం.) : తాండ్ర.

**విభీషణము**(సం.వి.అ.పుం.) : కిక్కస కసవు. (విణ.) : మిక్కిలి భయంకరమైనది. (వి.డు.): రావణుని తమ్ముఁడు.

**విభుఁడు** (సం.వి.ఉ.పుం.) : 1.ప్రభువు; 2. శివుఁడు; 3. బ్రహ్మ; 4. సర్వ వ్యాపకుఁడు.

**విభూతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1.తిర్యక్పుండ్రధారులు ధరించెడు భస్మము; 2. ఒక ఐశ్వర్యము. (చూ. ఐశ్వర్యము)

**విభూషణము** (సం.వి.అ.న.) : తొడవు, ఆభరణము.

**విభ్రమము** (సం.వి.అ.పుం.) : 1.భ్రాంతి; 2.వస్త్ర భూషణాది ప్రయుక్తమైన కాంతి విశేషము; 3. వచన భూషణ విపర్యాసరూపమైన స్త్రీల యొక్క శృంగార చేష్టా విశేషము.

**విభ్రాట్టు** (సం.విణ.) : (జ్.) (భూషణాదులచేత) ప్రకాశించువాఁడు.

**విమతుఁడు** (సం.వి.అ.పుం.) : శత్రువు. (వి.ణ.): విరుద్ధమైన మతము గల వాఁడు.

**విమనుఁడు** (సం.విణ.) : (స్.) (చూ.) అంతర్మనుఁడు.

**విమర్దనము** (సం.వి.అ.న.) :1. చందనము లోనగు వాని పూయుట; 2.కస్తూరి లోనగువాని నూఱుట.

**విమర్శనము** (సం.వి.అ.న.) : (చూ.) పరామర్శము.

**విమర్శము** (సం.వి.అ.పుం.) : ఒక నాటక సంధి. (చూ. సంధి.)

**విమర్శించే** (సం.స.క్రి.) : పరామర్శము చేయు.

**విమల** (సం.వి.ఆ.స్త్రీ.) : సంబరేను. (విణ.) : 1. నిర్మలమైనది; 2. ఒప్పిద మైనది.

**విమాత** (సం.వి.ఋ.స్త్రీ.) : సవతి తల్లి.

**విమానము** (సం.వి.అ.పుం,న.) : 1. అంతరిక్షము నందు దేవతలు ఎక్కి సంచరించెడు రథము; 2. చక్రవర్తి యొక్క సౌధము; 3. గుఱ్ఱము; 4. నీళ్లమీఁద జను లెక్కిపోయెడు కలము.

**విముక్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మిక్కిలి విడువఁబడినది.

**విముఖుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) పరాఙ్ముఖుఁడు.

**విమోచనము** (సం.వి.అ.న.) : మిక్కిలి విడుపు.

**విమోహము** (సం.వి.అ.పుం.) : మిక్కిలి మోహము.

**విమోహించు** (సం.అ.క్రి.) : మిక్కిలి మోహించు.

**విమోహితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) మిక్కిలి మోహించినవాఁడు.

**వియచ్చరుఁడు** (సం.వి.అ.పుం.) : దేవయోని విశేషము, ఖచరుఁడు, మింటితెరువరి.

**వియత్తు** (సం.వి.త్.న.) : ఆకాశము, మిన్ను.

**వియద్గంగ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఆకాశగంగ, మిన్నేఱు.

**వియమము** (సం.వి.అ.పుం.) : 1. హింసాదుల వలన నుడుగుట; 2.బాధ.

**వియాతుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) దిట్టతనము గలవాఁడు.

**వియామము** (సం.వి.అ.పుం.) : వియమము యొక్క రూపాంతరము.

**వియుక్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) వియోగము గలది.

**వియోగము** (సం.వి.అ.పుం.) : ఎడఁబాటు, విరహము. (దీనికి విరుద్ధార్థక పదము సంయోగము.)

**వియ్యంకుఁడు** (దే.వి.) : (వియ్యము + అంకుఁడు) వియ్యమందినవాఁడు. (పెండ్లికొమార్త తండ్రికి పెండ్లి కొమారుని తండ్రియు, పెండ్లికొమారుని తండ్రికి పెండ్లికొమార్త తండ్రియు పరస్పరము వియ్యంకులని యెఱుంగునది.)

**వియ్యంకురాలు** (దే.వి.) : (వియ్యంకుఁడు+ఆలు) వియ్యమందినది. (పెండ్లికొమార్త తల్లికి పెండ్లికుమారుని తల్లియు, పెండ్లికొమారుని తల్లికి పెండ్లికొమార్త తల్లియు పరస్పరము వియ్యంకురాండ్రని యెఱుంగునది.)

**వియ్యపురాలు** (దే.వి.) : (వియ్యము + ఆలు) వియ్యంకురాలు.

**వియ్యపుసాని** (ద్వ.వి.) : (వియ్యము + సాని) వియ్యపురాలు.

**వియ్యమందు** (దే.అ.క్రి.) : (వియ్యము + అందు) సంబంధము చేయు.

**వియ్యము** (దే.వి.) : 1. వైవాహిక సంబంధము; 2. వియ్యంకుఁడు.

**విరక్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : రాగములేమి, విరాగము.

**విరక్తుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. విరక్తి గలవాఁడు; 2. అనురాగము లేనివాఁడు.

**విరచించే** (సం.స.క్రి.) : విశేషముగా రచించు.

**విరచితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విశేషముగా రచింపఁబడినది.

**విరజ** (సం.వి.ఆ.స్త్రీ.) : వైకుంఠము నందుండు నొకానొకనది.

**విరజస్తమసుఁడు** (సం.వి.న్.పుం.) : రజస్తమోగుణములు లేనివాఁడు, సాత్వికుఁడు.

**విరజాజి** (ద్వ.వి.) : జాజివగ, నవ మాలిక.

**విరజాది** (ద్వ.వి.) : విరజాజి యొక్క రూపాంతరము.

**విరటుఁడు** (వై.వి.) : విరాటరాజు.

**విరతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మిక్కిలి విరతిఁ బొందినది.

**విరతి** (సం.వి.ఇ.స్త్రీ.) : విశ్రాంతి, విరామము, ఉడుకువ.

**విరమించే** (సం.అ.క్రి.) : విశ్రాంతి బొందు, ఉడుగు.

**విరవాజి** (ద్వ.వి.) : విరజాజి యొక్క రూపాంతరము. (చూ. విరవాది.)

**విరవాది** (ద్వ.వి.) : విరజాజి యొక్క రూపాంతరము.

**విరవిర** (యు.దే.వి.) : 1. విరియుట యందగు ధ్వన్యనుకరణము; 2. త్రెళ్లట యందగు ధ్వన్యను కరణము. (వై.వి.) విలవిల యొక్క రూపాం తరము. (చూ. విరవిరవాఱు, విరవిరవోవు.)

**విరవిరవాఱు** (ద్వ.అ.క్రి.) : (విరవిర + పాఱు) విరవిరవోవు.

**విరవిరవోవు** (ద్వ.అ.క్రి.) : (విరవిర + పోవు) విలవిలవోవు యొక్క రూపాంతరము. (చూ. నిదు వెంద్రుక వెట్టు.)

**విరసము** (సం.వి.అ.పుం.) : అర్థ దోషములలో నొకటి. (విణ.) : 1. రసములేనిది; 2. విరుద్ధ రసముగలది.

**విరసించే** (సం.అ.క్రి.) : 1. విరసత్వము నొందు; 2. ద్వేషించు.

**విరహము** (సం.వి.అ.పుం.) : ఎడఁ బాటు, వియోగము.

**విరహి** (సం.వి.న్.పుం.) : విరహము గలవాఁడు.

**విరహిణి** (సం.వి.ఈ.స్త్రీ.) : విరహము గలది.

**విరహితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. విడువఁ బడినది; 2. లేనిది.

**విరహోత్కంఠిత** (సం.వి.ఆ.స్త్రీ.) : వేళకు నాయకుఁడు రాక తడయఁగా విరహము చేత తహ తహపడు నాయిక. (చూ. నాయిక.)

**విరళ** (సం.వి.ఆ.స్త్రీ.) : నల్లయుప్పి.

**విరళము** (ఉభ.దే.వి.) : ఒక విధమైన పన్ను. (విరాళము యొక్క రూపాంతరము.) (సం.అ.న.) : పెరుఁగు. (విణ.) : ఎడమయినది.

**విరళి** (వై.విణ.) : విశాలము.

**విరాగుఁడు** (సం.విణ.) : (అ.ఈ.అ.) విషయేచ్ఛా రహితుఁడు.

**విరాజమానము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మిక్కిలి ప్రకాశించుచున్నది.

**విరాజితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మిక్కిలి ప్రకాశితము.

**విరాట్టు** (సం.వి.జ్.పుం.) : 1. ఆదిదేవుఁడు; 2. క్షత్రియుఁడు; 3. గరుత్మంతుఁడు.

**విరామము** (సం.వి.అ.పుం.) : విశ్రాంతి, ఉడుకువ.

**విరాలము** (సం.విణ.) : (అ.ఆ.అ.) వలపుఁ బుట్టించునది. (ఒకఁడు విరాళము వైకృతమనె.)

**విరావము** (సం.వి.అ.పుం.) : మ్రోఁత, ధ్వని.

**విరాళము** (యు.దే.వి.) : ఒక విధమైన పన్ను. (వై.) వలపు.

**విరాళి** (వై.వి.) : 1. వలపు; 2. భక్తి.

**విరి** (దే.వి.) : పుష్పము. (విణ.) : 1. వికసించినది; 2. వీడినది; 3. తొలఁగినది.

**విరించనుఁడు** (సం.వి.అ.పుం.) : బ్రహ్మ, నలువ.

**విరించము** (సం.వి.అ.పుం.) : దినము యొక్క పదవ భాగము. (చూ. దినము.)

**విరించి** (సం.వి.ఇ.పుం.) : 1. బ్రహ్మ; 2. విష్ణువు; 3. శివుఁడు.

**విరించుఁడు** (సం.వి.అ.పుం.) : బ్రహ్మ, విరించనుఁడు.

**విరిగి** (దే.వి.) : శ్లేష్మాతకు.

**విరిఁబోఁడి** (దే.వి.) : 1.పుష్పమువలె మనోజ్ఞురాలైన ఆఁడుది; 2.ఆఁడుది. (చూ.అలరుఁబోఁడి.)

**విరిదట్టు** (దే.విణ.) : (విరి+తట్టు) ఎడఁబాటు నొందినది, వియుక్తము.

**విరిపోటు** (దే.వి.) : భేదము.

**విరిపోటుసేయు** (ద్వ.స.క్రి.) : (విరిపోటు + చేయు) భేదించు.

**విరియఁబడు** (ద్వ.అ.క్రి.) : (విరియన్ + పడు) విరియు, వీడు. (స్వార్థము నపడు.)

**విరియఁబాఱు** (దే.అ.క్రి.) : (విరియన్ + పాఱు) 1. వికసించు; (చూ. కమ్మనీరు) 2. వీడు; 3. వ్యాపించు; 4. పగులు. (చూ. పాఱు.)

**విరియఁబోయు** (దే.స.క్రి.) : (విరియన్ + పోయు) (తల వెండ్రుకలను ముడిదీసి) వ్రేలాడవిడుచు.

**విరియు** (దే.అ.క్రి.) : 1.వికసించు; 2.పగులు; 3.వీడు; 4.చెదరు; 5. తొలఁగు; 6.ఉప్పొంగు; (చూ. దీనికి ముందు వెనుకటి భాగములను మినుకులబరణి, నిప్పుక.)

**విరివాయు** (దే.అ.క్రి.) : (విరి + పాయు) పాయవడు, చీలు.

**విరివి** (దే.వి.) : విస్తృతి. (విణ.) : విస్తృతము.

**విరివిడి** (దే.వి.) : (విరివి+ఇడి) విస్తృతి. (విణ.): విస్తృతము. (స్వార్థమున ఇడి.)

**విరివిలుకాఁడు** (దే.వి.) : మన్మథుఁడు, పుష్ప ధన్వుఁడు. (ఇట్లు విరివిలు తుఁడు.)

**విరుద్ధము** (సం.వి.అ.పుం.) : అర్థ దోషములలో నొకటి. (విణ.) : వరోధముగలది.

**విరూపము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. విరుద్ధ రూపము గలది; 2. వంకరైనది; 3. బేసి.

**విరూపాక్షుఁడు** (సం.వి.అ.పుం.) : శివుఁడు, బేసికంటి.

**విరేచనము** (సం.వి.అ.న.) : పాసనము. (పుం.) గొలుగు.

**విరోచనుఁడు** (సం.వి.అ.పుం.) :1. సూర్యుఁడు; 2.చంద్రుఁడు; 3.అగ్ని; 4. ప్రహ్లాదుని కొడుకు.

**విరోధనము** (సం.వి.అ.న.) : విరోధించుట, పగగొనుట.

**విరోధము** (సం.వి.అ.పుం.): 1. పగ; 2. మాఱు; 3.అడ్డంకి; 4. ఎడఁబాటు.

**విరోధి** (సం.వి.న్.పుం.) : 1.పగవాఁడు; 2. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

**విరోధించు** (సం.అ.క్రి.) : ద్వేషించు, పగగొను.

**విరోధికృత్తు** (సం.వి.త్.పుం.) : ఒక ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

**విఱీగి** (దే.వి.) : పగుళ్లువాసిన నేల.

**విటిచికట్టు** (దే.స.క్రి.) : (చేతులను) వెనుకకు మరలించి కట్టు. వి.బ. (చేతులను) వెనుకకు మరలించికట్టుట.

**విటివి** (దే.వి.) : విస్తృతి. (విణ.) : విస్తృతము. (చూ. విరివి.)

**విఱుగఁబడు** (ద్వ.అ.క్రి.) : 1. గర్వించు; 2. ఓడు.

**విఱుగఁబాటు** (ద్వ.వి.) :(విఱుగఁబడుట) 1.గర్వించుట; 2. ఓడుట.

**విఱుగడ** (దే.వి.) : విరామము, ఉడుకువ.

**విఱుగు** (దే.అ.క్రి.) : 1. తునియు; 2. ఓడు; 3. పాకము చెడు. (నెత్తురు విటిగెను, పాలు విటిగెను, మందు విటిగెను, మనసు విటిగెను. మొ.) (వి.) తునియుట. (రూ. విర్గు, తునియుటకు.)

**విఱుగుడు** (దే.వి.) : విటిగిన వస్తువు. (పాల విఱుగుడు. మొ.) విణ. విఱుపైనది. (అది దానికి విఱుగుడు.)

**విఱుచు** (దే.ప్రే.) : విఱుగఁ జేయు.

**విఱుపు** (దే.వి.) : విఱుచుట. (విణ.) : విఱుగుడు.

**విఱ్ఱవీఁగు** (దే.అ.క్రి.) : (వీఁగు + వీఁగు) మిక్కిలి నిక్కు.

**విలంఘించు** (సం.స.క్రి.) : లంఘించు యొక్క రూపాంతరము.

**విలంబము** (సం.వి.అ.పుం.) : 1. జాగు; 2. వ్రేలుట. (రూ. విలంబనము. అ.న.)

**విలంబితము** (సం.వి.అ.న.) : నృత్తగీతవాద్యముల యందు చౌకపు కాలము. (విణ.) : (అ.ఆ.అ.) 1.జాగుగలది; 2. వ్రేలునది.

**విలంభము** (సం.వి.అ.పుం.) : ఈవి, త్యాగము.

**విలక్షణము** (సం.వి.అ.న.) : కారణములేని యునికి. (విణ.) : 1. వేఱైనది; 2. విశేషమైన లక్షణము గలది.

**విలక్షుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. వెఱఁగు పడ్డవాఁడు; 2. సిగ్గుపడ్డవాఁడు.

**విలగ్నము** (సం.వి.అ.పుం,న.) : నడుము. (విణ.): చక్కగా తగిలినది.

**విలపనము** (సం.వి.అ.న.) : విలాపము, వాచారపము.

**విలపించు** (సం.అ.క్రి.) : దుఃఖముతో వనరు, వాచారు.

**విలయము** (సం.వి.అ.పుం.) : ప్రళయము.

**విలవిల** (యు.దే.వి.) : తన్నుకొనుట యందగు ధ్వన్యనుకరణము. (చూ.విల విలపోవు.)

**విలవిలపోవు** (ద్వ.అ.క్రి.) : విహ్వలతఁ జెందు. (చేతులు కాళ్లు విలవిల పోవుచున్నది.)

**విలసనము** (సం. వి. అ. న.) : 1. క్రీడ; 2. ప్రకాశము.

**విలసితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. క్రీడితము; 2. ప్రకాశితము.

**విలసిల్లు** (సం.అ.క్రి.) : 1. ప్రకాశించు; 2. ఒప్పు.

**విలాతి** (దే.వి.) : దేశము. (రూ. విలా యతి.)

**విలాపము** (సం.వి.అ.పుం.) : దుఃఖము తోడి మాట, వాచారపము.

**విలాపించే** (సం.అ.క్రి.) : విలపించు, వాచారు.

**విలాసము** (ఉభ.దే.వి.) : జాబుమీఁద వ్రాసెడు చిరునామ. (ఇది యన్య దేశ్యము.) (సం. అ.పుం.) : 1. క్రీడ; 2. ప్రియ సందర్శనాదుల చేతనగు యానావలోకనాది క్రియా విశేష రూపమైన స్త్రీల యొక్క శృంగారచేష్టా విశేషము.

**విలాసి** (సం.వి.న్.పుం.) :1.మన్మథుఁడు; 2.చంద్రుఁడు; 3.విష్ణువు; 4.శివుఁడు; 5.అగ్ని.(విణ.) : విలాస వంతుఁడు.

**విలాసిని** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. విలాసవతియైన ఆఁడుది; 2.ఆఁడుది;3.వేశ్య.

**విలియవేయు** (దే.క్రి.) : సరిచూచు, ఏర్పఱచు.

**విలీనము** (సం.విణ.) : (అ.ఆ.అ.) కరఁగినది, విద్రుతము.

**విలు** (దే.వి.) : విల్లు యొక్క రూపాంతరము. (చూ.కాటియ.) (హల్లుపరమగుచో దీని యుకారమునకు వికల్పముగా లోపంబగు.)

**విలుకాఁడు** (దే.విణ.) : విల్లుపూనిన వాఁడు, ధానుష్కుఁడు.

**విలుచు** (దే.స.క్రి.) : వెలయిచ్చికొను. (రూ. విల్చు. (చూ.) పోకడపెట్టు రెండవ యర్థము.)

**విలుదాలుపు** (దే.విణ.) : (విలు+తాలుపు) విల్లు తాల్చిన వాఁడు, ధనుర్ధరుఁడు. (రూ. విలు దాల్పు.)

**విలువ** (దే.వి.) : వెల, క్రయము. (చూ. చలువ మొదటి యర్థము.)

**విలువకాఁడు** (దే.వి.) : వెలయిచ్చి కొనువాఁడు, క్రయికుఁడు. (రూ. విల్వకాఁడు.)

**విలేపనము** (సం.వి.అ.న.) : 1. పూఁత పూసి కొనెడు చందనాది; 2. చందనా దుల పూఁత.

**విలేపి** (సం.వి.ఈ.స్త్రీ.) : కాఁపుదు గంజి, వెలవ.

**విలోకించు** (సం.స.క్రి.) : చూచు, ఆలోకించు.

**విలోమము** (సం.వి.అ.పుం.) : 1.కుక్క; 2.పాము. (డు. వరుణుఁడు.) (విణ.) : అవరోహణ క్రమము గలది.

**విల్లు** (దే.వి.) : ధనువు. (దీని భేదములు. తడవిల్లు, వెదురువిల్లు, సెలసువిల్లు. మొ.)

**వివక్ష** (సం.వి.ఆ.స్త్రీ.) : చెప్పనిచ్ఛ.

**వివక్షించు** (సం.అ.క్రి.) : చెప్పనిచ్ఛించు.

**వివక్షితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చెప్ప నిచ్ఛించినది.

**వివక్షువు** (సం.విణ.) : (ఉ.) చెప్పనిచ్ఛించువాఁడు.

**వివధము** (సం.వి.అ.పుం.) : 1.కావడి; 2.త్రోవ; 3. బరువు.

**వివరణము** (సం.వి.అ.న.) :వాఖ్యానము.

**వివరము** (ఉభ.వై.వి.): వివరణము. (సం.అ.న.): 1. రంధ్రము; 2. దూషణము.

**వివరించు** (వై.స.క్రి.) : 1. వక్కాణించు; 2. విచారించు; (చూ. విసుమానము.) 3.ఆలస్యము చేయు.

**వివర్ణుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1.వెల్లఁబాఱిన వాఁడు; 2. అధముఁడు; 3. మూర్ఖుఁడు.

**వివర్తనము** (సం.వి.అ.న.) : చుట్టివచ్చుట, తిరిగి వచ్చుట.

**వివర్తము** (సం.వి.అ.పుం.) : 1. తిరిగి వచ్చుట; 2.నృత్యము; 3.సమూహము.

**వివర్ధనము** (సం.వి.అ.న.) : విశేష వర్ధనము.

**వివశుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. మరణ కాలము సమీపించుట చేత కలఁత నొందిన బుద్ధి గలవాఁడు; 2. స్వవశము గాని బుద్ధి గలవాఁడు.

**వివస్వంతుఁడు** (సం.వి.త్.పుం.) :1.సూర్యుడు; (ఇతని పట్టణము వివస్వతి.ఈ.స్త్రీ.) 2.వేలుపు.

**వివాదము** (సం.వి.అ.పుం.) : తగవు. (ఇది పదునెనిమిది విధములు గలది. అప్పు పుచ్చుకొనుట, సొమ్ముదాఁచుట, ఒకరిసొమ్మును తాను అమ్ముట, ఉమ్మడి బేరము, ఇచ్చిన దాని మరలించుట, జీతమియ్యమి, ఒప్పుకొని మరలఁ బడుట, క్రయ, విక్రయములుచేసి తిరగఁబడుట, స్వామి భృత్యన్యాయము, సీమానిర్ణయము, దండవాక్పారుష్య ములు, దొంగతనము, బందిపోటు లోనగు సాహసము, స్త్రీ సంగ్రహ ణము, భార్యాభర్తృ క్రమము, దాయభాగము, ద్యూతము, ప్రాణిద్యూతము.)

**వివాహమగు** (సం.స.క్రి.) : (వివాహము + అగు) పెండ్లాడు.

**వివాహము** (సం.వి.అ.పుం.) : పరిణ యము, పెండ్లి. (అష్టవిధ వివాహములు. బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, ఆసురము, గాంధ ర్వము, రాక్షసము, పైశాచము.)

**వివిక్తము**(సం.విణ.) : (అ.ఆ.అ.) 1.ఏకాంతము; 2.విభిన్నము; 3.పవిత్రము; 4.వివేకముగలది.

**వివిధము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అనేక విధములు గలది.

**వివీతము** (సం.వి.అ.పుం.) : పసులు మేయు కంచె.

**వివృతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. తెఱవఁ బడినది; 2. వికసించినది.

**వివేకము** (సం.వి.అ.పుం.) : 1. దేహాత్మాది విభేద జ్ఞానము; 2. విభేదము; 3. విచారము.

**వివేకి** (సం.వి.న్.పుం.) : విచారణ చేయువాఁడు. (విణ.) : వివేకము గలవాఁడు.

**వివేకించు** (సం.స.క్రి.) : విచారించు.

**వివేచనము** (సం.వి.అ.న.) : వివేకించుట.

**వివేచనీయము** (సం.విణ.) : (అ.ఆ.అ.) వివేకింపఁదగినది.

**వివేచించే** (సం.అ.క్రి.) : వివేచన చేయు, వివేకించు.

**వివ్వచ్చము** (వై.వి.) : బీభత్సరసము.

**వివ్వచుఁడు** (వై.వి.) : అర్జునుఁడు.

**విశంకటము** (సం.విణ.) : (అ.ఆ,ఈ.అ.) విరివి గలది.

**విశదము** (సం.వి.అ.పుం.) : (విణ.) : 1. తెల్లనిది; 2. స్పష్టమయినది.

**విశదీకరించే** (సం.స.క్రి.) : స్పష్టము చేయు.

**విశయము** (సం.వి.అ.పుం.) : 1. వాసస్థానము; 2. సందేహము.

**విశరఘూతము** (సం.వి.అ.పుం.) : చంపుట, వధము.

**విశల్య** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.తఁటిగొట్టు; 2.తిప్పతీఁగ; 3.తెల్లతెగడ; 4.దంతి చెట్టు.(విణ.) : శల్యము లేనిది.

**విశల్యకరణి** (సం.వి.ఈ.స్త్రీ.) : ఓషధీ విశేషము. (దీనితో చేరిన తక్కిన మూడు. సంధానకరణి, సౌవర్ణకరణి, సంజీవకరణి.)

**విశసనము** (సం.వి.అ.న.) : వధము, చంపుట. (పుం.) కత్తి.

**విశసించే** (సం.స.క్రి.) : విశసనము చేయు, చంపు.

**విశాఖ** (సం.వి.ఆ.స్త్రీ.) :1. ఒక నక్షత్రము; (చూ.నక్షత్రము) 2.కాఁకర. (అ.న.ము.) : విలుకాఁడు రెండుకాళ్ల నడుమజేనెఁడెడము గలుగ నిలుచుట. (చూ. స్థానము.) (పుం.) నాలు వడికెడు కదురు. (విణ.) : శాఖలు లేనిది.

**విశాఖుఁడు** (సం.వి.అ.పుం.) : కుమారస్వామి.

**విశాయము** (సం.వి.అ.పుం.) : 1. కావలివారు పర్యాయక్రమమున పరుండుట; 2. పర్యాయము.

**విశారదుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. విద్వాంసుఁడు; 2. నేర్పరి.

**విశాల** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. పెద్దపాఁపర; 2. ఉజ్జయిని. (విణ.) : విరివియైనది.

**విశాలత్వక్కు** (సం.వి.చ్.పుం.) : ఏడాకులరఁటి.

**విశాలాక్షి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. పార్వతి; 2. విశాలములైన కన్నులుగల ఆఁడుది.

**విశిఖ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.రాజమార్గము; 2.పాఱ. (అ.పుం.ము.) : 1.బాణము; 2.చిల్లకోల. (విణ.) : శిఖలేనిది.

**విశిష్టము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. కూడుకొన్నది; 2. మిక్కిలి శిష్టమైనది.

**విశీర్ణము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. వదలినది; 2. శుష్కించినది.

**విశుఁడు** (సం.విశ్.పుం.) : 1.కోమటి; 2. మనుష్యుఁడు.

**విశృంఖలము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అడ్డులేనిది.

**విశేషకము** (సం.వి.అ.పుం,న.) : నొసటి బొట్టు. (విణ.) : విశేషింపఁజేయునది.

**విశేషణము** (సం.వి.అ.న.) : గుణవాచక శబ్దము.

**విశేషము** (సం.వి.అ.పుం.) : 1.అతిశయము; 2.భేదము; 3.అవయవము; 4.వింత రూపము; 5.నొసటిబొట్టు; 6.ఒక యర్థాలంకారము. (చూ.అలంకారము.)

**విశేషించే** (సం.అ.క్రి.) : అతిశయించు.

**విశేష్యము** (సం.వి.అ.న.) : వస్తువాచక శబ్దము.

**విశ్రమము** (సం.వి.అ.పుం.) : 1. పద్య విరామము; 2. ఊఱట.

**విశ్రమించే** (సం.అ.క్రి.) : ఊఱడిల్లు.

**విశ్రాంతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఊఱడిల్లినది.

**విశ్రాంతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. పద్యవిరామము; 2. ఊఱట.

**విశ్రాణనము** (సం.వి.అ.న.) : ఈవి, త్యాగము.

**విశ్రామము** (సం.వి.అ.పుం.) : విశ్రమము యొక్క రూపాంతరము.

**విశ్రావము** (సం.వి.అ.పుం.) : మిక్కిలి ప్రసిద్ధి ప్రఖ్యాతి.

**విశ్రతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1.మిక్కిలి ప్రసిద్ధి కెక్కినది; 2. ప్రవహించినది.

**విశ్రుతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1.ప్రసిద్ధి; 2.ప్రవాహము.

**విశ్రుతుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. ప్రసిద్ధి కెక్కినవాఁడు; 2.తెలియఁబడినవాఁడు.

**విశ్లేషము** (సం.వి.అ.పుం.) : 1. ఎడఁబాటు; 2. ఒడఁగూడమి.

**విశ్వ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. భూమి; 2. అతివస. (ఆ.స్త్రీ.అ.న.ము.) : సొంటి. (న.) లోకము. (విణ.) : సమస్తము.

**విశ్వంభర** (సం.వి.ఆ.స్త్రీ.) : ధరిత్రి, భూమి, నేల.

**విశ్వంభరుఁడు** (సం.వి.అ.పుం.) : 1.విష్ణువు; 2. ఇంద్రుఁడు.

**విశ్వకద్రువు** (సం.వి.ఉ.పుం.) : 1. వేటకుక్క; 2. ధ్వని. (విణ.) : దుర్జనుఁడు.

**విశ్వకర్మ** (సం.వి.న్.పుం.) : 1. దేవశిల్పి; (రూ. విశ్వకర్ముఁడు. (చూ.) మూఁడుబోవు మూడవ యర్థము) 2. సూర్యుఁడు; 3. ఒకానొకముని.

**విశ్వకేతువు** (సం.వి.ఉ.పుం.) : అనిరుద్ధుఁడు.

**విశ్వజనీనము** (సం.విణ.) : (అ.ఆ.అ.) సర్వ జనులకు హితమైనది.

**విశ్వతోముఖము** (సం.వి.అ.న.) : బ్రహ్మము. (విణ.) : అంతట వ్యాపించినది.

**విశ్వనాథుఁడు** (సం.వి.అ.పుం.) : కాశీక్షేత్రము నందు నివసించియుండు శివుఁడు.

**విశ్వభేషజము** (సం.వి.అ.న.) : సొంటి.

**విశ్వరూపుఁడు** (సం.వి.అ.పుం.) : విష్ణువు.

**విశ్వసనీయము** (సం.విణ.) :(అ.ఆ.అ.) విశ్వ సింపదగినది.

**విశ్వసించు** (సం.స.క్రి.) : నమ్ము.

**విశ్వసితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విశ్వ సింపఁబడినది.

**విశ్వసృజుఁడు** (సం.వి.జ్.పుం.) : బ్రహ్మ, నలువ.

**విశ్వస్త** (సం.వి.ఆ.స్త్రీ.) : విధవ. (విణ.) : విశ్వ సింపఁబడినది.

**విశ్వామిత్రుఁడు** (సం.వి.అ.పుం.) : ఒక ఋషి.

**విశ్వాసము** (సం.వి.అ.పుం.) : నమ్మకము, ప్రత్యయము.

**విశ్వాసి** (సం.విణ.) : (న్.ఈ.న్.) విశ్వాసము గలవాఁడు.

**విశ్వుఁడు** (సం.వి.అ.పుం.) : గణదేవతా విశేషము. (వీరు పదుగురు.)

**విష** (సం.వి.ఆ.స్త్రీ.) : అతివస.(అ.న.ము.) జలము.(పుం,న.) గరళము.

**విషణ్ణుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) విషాదము పొందినవాఁడు.

**విషధరము** (సం.వి.అ.పుం.) : 1. పాము; 2. మబ్బు.

**విషధరుఁడు** (సం.వి.అ.పుం.) : శివుఁడు. (విణ.) : విషము ధరించిన వాఁడు.

**విషధి** (సం.వి.ఇ.పుం.) : జలధి, సముద్రము.

**విషపుచ్ఛము** (సం.వి.అ.పుం.) : తేలు, వృశ్చికము.

**విషముచ్ఛదము** (సం.వి.అ.పుం.) : ఏడా కులరఁటి.

**విషమము** (సం.వి.అ.న.) : ఒక యర్థాలంకారము. (చూ.అలంకారము.) (విణ.) : సమము కానిది, బేసి.

**విషమశరుఁడు** (సం.వి.అ.పుం.) : మన్మథుఁడు, బేసిక యిదవు జోదు. (ఇట్లు విషమా యుధుఁడు. మొ.)

**విషమించు** (సం.అ.క్రి.) : విరోధించు.

**విషయము**(సం.వి.అ.పుం.) : 1. గ్రంథాదుల యొక్క తెలియఁ బడిన యంశము; 2.లౌకి కార్థము; 3.ఇంద్రియార్థము; 4.గోచరము; 5.దేశము; 6. ఒక ముఖ్యగ్రామముతో చేరిన ఉప గ్రామముల సమూహము, పాయకట్టు.

**విషయి** (సం.వి.న్.న.) : ఇంద్రియము. (పుం.) : 1.రాజు; 2.మన్మథుఁడు; 3.విషయాస్తకుఁడు; 4.ఆరోపింపఁబడునది.

**విషయీకరించే** (సం.స.క్రి.) : ఉద్దేశించు.

**విషవృక్షము** (సం.వి.అ.పుం.) : ముష్టిచెట్టు.

**విషవైద్యుఁడు** (సం.వి.అ.పుం.) : గారడీఁడు.

**విషాణము** (సం.వి.అ.పుం,న.) : 1. కొమ్ము; 2. ఏనుఁగు కొమ్ము.

**విషాణి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1.జుట్టుపు; 2. పిన్న పాల. (న్.పుం.) : 1.ఎద్దు; 2.ఏనుఁగు.

**విషాదము** (సం.వి.అ.పుం.) : 1. అపరాధ ధన హాన్యాదులచే ఉపాయము తోఁచక మనసున గలిగెడు ఖేదము; 2. ఖేదము.

**విషాదించు** (సం.అ.క్రి.) : 1. అపరాధ ధన హాన్యాదులచే ఉపాయము తోఁచక మనసున ఖేదపడు; 2. ఖేదపడు.

**విషు** (సం.వి.ఉ.పుం.) : ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

**విషువత్తు** (సం.వి.త్.న.) : రేయి పగలు సమమైన కాలము.

**విషువము** (సం.వి.అ.న.) : రేయిపగలు సమమైన కాలము.

**విషూచిక** (సం.వి.ఆ.స్త్రీ.) : వమన విరేచన వ్యాధి. (రూ. విషూచి. ఈ.స్త్రీ.)

**విష్కంభము** (సం.వి.అ.పుం.) : 1. ఒక గ్రహ యోగము; (చూ.యోగము.) 2. గడెమ్రాను; 3.అడ్డంకి; 4.నాటకాంగ విశేషము; 5. యోగుల బంధ విశేష ము; 6. విరివి.

**విష్కిరము** (సం.వి.అ.పుం.) : 1.పక్షి; 2.కవుఁజు; 3. కోడి; 4. నెమిలి.

**విష్టపము** (సం.వి.అ.న.) : లోకము, భువనము.

**విష్టరము** (సం.వి.అ.పుం.) : 1.ఆసనము; 2.దర్భ పిడికిలి; 3. మ్రాను.

**విష్టరశ్రవుఁడు** (సం.విన్.పుం.) : విష్ణువు, వెన్నుఁడు.

**విష్టి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. కూలి; 2. కూలి లేని పని; 3. పని. (విణ.) : పని చేయువాఁడు.

**విష్ఠ** (సం.వి.ఆ.స్త్రీ.) : మలము, పురీషము.

**విష్ఠించు** (సం.అ.క్రి.) : విష్ఠచేయు, ఏరుగు.

**విష్ణుక్రాంత** (సం.వి.ఆ.స్త్రీ.) : ఒకానొక మందు చెట్టు.

**విష్ణుపదము** (సం.వి.అ.న.) : 1. ఆకాశము; 2. పాల సముద్రము; 3. ఆవుల మంద.

**విష్ణుపది** (సం.వి.ఈ.స్త్రీ.) : 1.గంగ; 2. ద్వారక; 3.రవి సంక్రమణ విశేషము.

**విష్ణురథము** (సం.వి.అ.పుం.) : గరుత్మంతుఁడు, గరుడుఁడు.

**విష్ణువు** (సం.వి. ఉ.పుం.) : 1. వెన్నుఁడు; (ఇతని సారథి దారకుఁడు, తేరు శతానందము, గుఱ్ఱములు సైన్యసుగ్రీవ మేఘపుష్ప వలాహక ములు.) 2.ఒక ఆదిత్యుఁడు (చూ.ఆదిత్యుఁడు.)

**విష్యుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) విషముచేత చంపఁదగినవాఁడు.

**విష్వక్సేన** (సం.వి.ఆ.స్త్రీ.) : ప్రేంకణము.

**విష్వక్సేనప్రియ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. పాఁచితీఁగ; 2. లక్ష్మి.

**విష్వక్సేనుఁడు** (సం.వి.అ.పుం.) : 1. విష్ణువు; 2. విష్ణు సేనాధిపతి.

**విసంవాదము** (సం.వి.అ.పుం.) : ముందు ఒప్పుకొని వెనుక లేదని వాదించుట.

**విసదారి** (వై.వి.) : పాము, విషధరము.

**విసనకఱ్ఱ** (ద్వ.వి.) : విసరుకొను వీవన, తాల వృంతము.

**విసపాల** (ద్వ.వి.) : (విసము + పాల) ఒకానొక మందు చెట్టు.

**విసపాలవిత్తు** (ద్వ.విణ.) : నాశకుఁడు.

**విసవుమేఁతరి** (ద్వ.వి.) : (విసము + మేఁతరి) శివుఁడు.

**విసబొద్ది** (ద్వ.వి.) : (విసము + బొద్ది) ఒకానొక మందు చెట్టు, పాఠ.

**విసము** (వై.వి.) : 1.విషము; 2.జలము. (ఇది రెండర్థములకునుదాహరణము.)

**విసరణము** (సం.వి.అ.న.) : ప్రసరణము.

**విసరము** (సం.వి.అ.పుం.) : 1. ప్రసరణము; 2. సమూహము.

**విసరియాడు** (ద్వ.స.క్రి.) : (విసరి + ఆడు) విసరు. (చూ. ఊఁగాడు.)

**విసరు** (వై.అ.క్రి.) : 1. బయలుపడు; 2. వీచు. (స.క్రి.) : 1. ఆడించు; (పక్షి ఱెక్కలు

విసరుచున్నది) 2. వేయు. (పిరంగివిసరెను. చూ. వేయుట అను నర్థము నుదాహరణము) (వి.) 1.ఆడించుట; (చూ.దూప.) 2.వీచుట. (చూ.కసరు. వి.రెండవయర్థము) 3.వేయుట. (చూ. వెలివిసరు.)

**విసరుమొన** (ద్వ.వి.) : మల్లవిద్యా విశేషము.

**విసర్గము** (సం.వి.అ.పుం.) : 1.త్యాగము; 2.విసర్జనము; 3. మలవిసర్జనము; 4.విసర్జనీయము; 5. దక్షిణాయనము.

**విజర్జనము** (సం.వి.అ.న.) : 1.ఈవి; 2.విడుపు; 3. పుచ్చుట.

**విసర్జనీయము** (సం.వి.అ.పుం.) : రెండు సున్నలు. (విణ.) : విడువఁదగినది.

**విసర్జించే** (సం.స.క్రి.) : విసర్జనము చేయు, విడుచు.

**విసర్పణము** (సం.వి.అ.న.) : 1. ప్రసరణము; 2. కండూత్యాది ప్రసరణము.

**విసవిస** (యు.దే.వి.) : త్రిప్పుట నవ్వుట ముసురుట విసరుట యందగు ధ్వన్యనుకరణము. (వై.విణ.) : ప్రసరించునది.

**విసారము** (సం.వి.అ.న.) : కొయ్య. (పుం.) చేఁప.

**విసారి** (సం.విణ.) : (న్.ఈ.న్.) ప్రసరించునది.

**విసిపలక** (ద్వ.వి.) : పరుండెడు పెద్దపలక.

**విసిమాలు** (దే.అ.క్రి.) : మిక్కిలి విసుగు. (చూ. జూకించు.)

**విసుగు** (దే.అ.క్రి.) : నిర్వేదించు. వి. నిర్వేదము. (చూ. నిర్వేదము.)

**విసుమానము** (వై.వి.) : ఆశ్చర్యము. (చూ. పై పద్యము) (విణ.) : ఆశ్చర్య కరమైనది.

**విసువాసము** (వై.వి.) : నమ్మకము. (చూ. విసువాసి.)

**విసువాసి** (వై.విణ.) : నమ్మకము గలవాఁడు.

**విసువు** (దే.అ.క్రి.వి.) : విసుగు యొక్క రూపాంతరము. (నిర్వేదించుటకు. నిర్వేదమునకు.)

**విసృతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విస్తృతము.

**విసృత్వరుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ప్రసరించునట్టి స్వభావము గలవాఁడు.

**విసృమరుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) ప్రసరించునట్టి స్వభావము గలవాఁడు.

**విసృష్టము**(సం.విణ.) : (అ.ఆ.అ.) 1.విసరివేయఁబడినది; 2.విడువఁ బడినది.

**విస్తర** (వై.వి.) : భోజనము చేసెడియాకు.

**విస్తరము** (సం.వి.అ.పుం.) : 1. శబ్ద విస్తృతి; 2. విరివి; 3. స్నేహము; 4. పీఠము.

**విస్తరి** (వై.వి.) : విస్తరాకు.

**విస్తరించు** (సం.ప్రే.) : విస్తరిల్లఁజేయు.

**విస్తరిల్లు** (సం.అ.క్రి.) : విరివియగు.

**విస్తారము** (సం.వి.అ.పుం.) : 1.విరివి; 2. బోదె లేని చెట్టు.

**విస్తీర్ణము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విరివియైనది.

**విస్తు** (దే.వి.) : దేహమునందుఁ గలిగెడు దుర్గంధము.

**విస్తృతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విరివియైనది.

**విస్ఫారము** (సం.వి.అ.పుం.) : వింటి మ్రోఁత, (రూ.విష్పారము.) (విణ.) : మిక్కిలి యధికమైనది.

**విస్ఫారితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. ప్రకాశమొందినది; 2. కదలింప ఁబడినది.

**విస్ఫూర్జితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మిక్కిలి ప్రకాశమొందినది.

**విస్ఫోటము** (సం.వి.అ.పుం.) : పొక్కు, బొబ్బ.

**విస్మయము** (సం.వి.అ.పుం.) : 1. ఆశ్చర్యము; 2. గర్వము. (విణ.) : ఆశ్చర్యకరమైనది.

**విస్మరణము** (సం.వి.అ.న.) : స్మరణము తప్పుట, మఱపు.

**విస్మితి** (సం.వి.ఇ.స్త్రీ.) : విస్మయము, ఆశ్చర్యము.

**విస్మితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) విస్మయము నొందినవాఁడు,ఆశ్చర్యము నొందినవాఁడు.

**విస్మృతము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విస్మృతి నొందినది.

**విస్మృతి** (సం.వి.ఇ.స్త్రీ.) : విస్మరణము, మఱపు.

**విస్రంబము** (సం.వి.అ.పుం.) : 1.నమ్మకము; 2.వధము; 3.స్నేహము; 4.ఆట్లాట జగడము.

**విస్రబ్ధము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. నమ్మఁబడినది; 2.అణఁగినది; 3. శాంతి నొందినది. (క్రి.విణ.అ.న.) : అత్యంతము.

**విస్రము** (సం.విణ.) : (అ.ఆ.అ.) అపక్వమైన గంధముగలది.

**విస్రస** (సం.వి.ఆ.స్త్రీ.) : ముసలితనము, జర.

**విస్వరుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) భేదపడిన కంఠస్వరము కలవాఁడు.

**విహంగమ** (సం.వి.ఆ.స్త్రీ.) : కావడిబ్రద్ద. (అ.పుం.ము.) : పక్షి, పులుఁగు.

**విహంగము** (సం.వి.అ.పుం.): 1.పక్షి; 2. బాణము. (విణ.) : ఎగురునది.

**విహంగిక** (సం.వి.ఆ.స్త్రీ.) : కావడిబ్రద్ద.

**విహగము** (సం.వి.అ.పుం.) : పక్షి, పులుఁగు.

**విహరణము** (సం.వి.అ.న.) : విహారము.

**విహరించు** (సం.అ.క్రి.) : విహారము చేయు.

**విహర్త** (సం.విణ.) : (ఋ.ఈ.ఋ.) విహరించువాఁడు.

**విహసితము** (సం.వి.అ.న.) : మృదు ధ్వని గల నవ్వు. (ఇది మధ్యమము. చూ. హాసము.)

**విహస్తుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1.నెమ్మది లేని మనస్సు గలవాఁడు; 2.చదువుకొన్నవాఁడు.

**విహాపితము** (సం.వి.అ.న.) : దానము, ఈవి.

**విహాయసము** (సం.వి.స్.అ.పుం,న.) : ఆకాశము. (అ.పుం.) :పక్షి.

**విహాయితము** (సం.వి.అ.న.) : ఈవి, దానము.

**విహారము** (సం.వి.అ.పుం.) : 1.వేడుకగాఁ దిరుగుట; 2.త్రిప్పుట; 3.తోఁట; 4.బౌద్ధాలయము.

**విహారి** (సం.విణ.) : (న్.ఈ.న్.) విహరించువాఁడు.

**విహితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) విధింపఁబడినది.

**విహృతము** (సం.వి.అ.న.) : మాటాడఁదగిన కాలమందు సిగ్గుచే మాటాడకుండునట్టి స్త్రీల యొక్క శృంగార చేష్టా విశేషము.

**విహృతి** (సం.వి.ఇ.స్త్రీ.) : విహరణము, విహారము.

**విహ్వాలించు** (సం.అ.క్రి.) : భయాదులచేత అవయవముల స్వాధీనత తప్పినవాఁడగు.

**విహ్వాలుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) భయాదుల చేత అవయవముల స్వాధీనత తప్పినవాఁడు.

**విళంగీలు** (దే.వి.బ.) : తిట్లు. (అప్ర.)

**విళంబి** (సం.వి.న్.పుం.) : ఒక సంవత్స రము. (చూ.సంవత్సరము) (విణ.) : విలంబము చేయువాఁడు.

## వీ

**వీఁక** (దే.వి.) : 1.ఉత్సాహము; 2. పరాక్రమము; 3. విజృంభణము; (చూ. ఊఁక మొదటి యర్థము.) 4.గర్వము; 5.ఉన్నతి; 6.యుద్ధము వలనఁ బాఱుట; 7. దైన్యము; 8.విధము. (చూ. ముందు వెనుకలు.)

**వీఁగియాడు** (దే.అ.క్రి.) : (వీఁగి+ఆడు) చలించు. (చూ. ఊఁగాడు)

**వీఁగు** (దే.అ.క్రి.) : 1. ఉత్సహించు; 2. నిక్కు; 3. యుద్ధము వలనఁ బాఱు; 4. చలించు.

**వీఁడు** (దే.స.) : (ఈ శబ్దమునకు మహదర్థక ప్రథమైక వచన రూపము.) ఈ పురుషుఁడు.

**వీఁపు** (దే.వి.) : వెనుకమేను, చరమాంగము, పృష్ఠము.

**వీకాశము** (సం.వి.అ.పుం.) :1. ప్రకాశము; 2. ఏకాంతస్థలము.

**వీకు** (దే.వి.) : 1.ఉన్నతి; 2.ఉద్ధతి; 3.పరాక్రమము.

**వీక్ష** (సం.వి.ఆ.స్త్రీ.) : చూపు, దృష్టి.

**వీక్షణము** (సం.వి.అ.న.) : చూచుట, చూపు, దృష్టి.

**వీక్షించు** (సం.స.క్రి.) : చూచు. (అభివీక్షించు, ఉద్వీక్షించు, ప్రవీక్షించు, సంవీక్షించు, సముద్వీక్షించు అనియు.)

**వీక్షితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చూడఁబడినది.

**వీక్ష్యము** (సం.వి.అ.న.) : ఆశ్చర్యము. (విణ.) : 1. చూడఁదగినది; 2.ఆశ్చర్యకరమైనది.

**వీచి** (సం.వి.ఇ.పు,స్త్రీ.) : 1. అల; 2. అవకాశము; 3.కొంచెము; 4.సుఖము. (అలయను నర్థము నందిది ఈకారాంత స్త్రీ లింగమునగును.)

**వీచే** (దే.అ.క్రి.): (గాలి) విసరు. (స.క్రి.) : విసరు.

**వీచోపులు** (దే.వి.) : (వీచు. చోపులు) వింజామరలు. (చూ. వీచు. స.క్రి.)

**వీజనము** (సం.వి.అ.న.) : విసనకఱ్ఱ, తాళవృంతము.

**వీటతటము** (దే.విణ.) : వీటతాటము యొక్క రూపాంతరము.

**వీటతాటనము** (దే.విణ.) : విటతాటనము యొక్క రూపాంతరము.

**వీటతాటము** (దే.విణ.) : విటతాటము యొక్క రూపాంతరము.

**వీటి** (ఉభ.దే.వి.) : కొల్ల. (సం.ఇ.ఈ.స్త్రీ.) : తాంబూలము.

**వీటిఁబుచ్చే** (దే.ప్రే.) : వీటిఁబోవఁజేయు.

**వీటిఁబోవు** (దే.అ.క్రి.) : (వీటి+పోవు) 1. దూషితమగు; 2. నష్టమగు; 3. వ్యర్థమగు. (సంధి నిద్రుతము.)

**వీటిక** (సం.వి.ఆ.స్త్రీ.) : తాంబూలము, వీటి.

**వీడియము** (వై.వి.) : తాంబూలము.

**వీడు** (దే.అ.క్రి.) : 1. వదలు; 2. విశదమగు; 3. కొనసాగు, వర్ధిల్లు; (అం,ప్రే.) : వీడఁజేయు. (వి.) : 1.పట్టణము; 2. కట్నము; (ఇది రెండర్థములకు నుదాహరణము.) 3.దండు; 4.శిబిరము; 5.పథికజన సమూహము.

**వీడుకొను** (దే.స.క్రి.) : 1. పోయి వచ్చెదనని చెప్పుకొని వదలు; (చూ. వీడ్కొలుపు) 2. వదలు. (చూ.వీడ్కొను.)

**వీడుకొలుపు** (దే.ప్రే.) : (వీడుకొనఁజేయు) పోయి వచ్చెదనని చెప్పుకొనఁగా మంచిది పోయి రమ్మనిపుచ్చు. (చూ. వీడ్కొలుపు.)

**వీడుకోలు** (దే.వి.) : 1. పోవననుజ్ఞ; 2. విడుపు; 3. మరణము.

**వీడుచే** (దే.ప్రే.) : వీడఁజేయు, విడుచు.

**వీడుజోడాడు** (ద్వ.అ.క్రి.) : మాఱుపాటు నొందు.

**వీడుజోడు** (ద్వ.విణ.) : విజ్జోడునకు మొదటి రూపము.

**వీడుపట్టు** (దే.వి.) : 1. దండు విడియు చోటు; 2. విడిది; 3. వాసస్థానము. (చూ. లోఁగలి.)

**వీడుపడు** (ద్వ.అ.క్రి.) : 1. మాఱుపడు; 2.భేదపడు 3.తడఁబడు. (చూ. వీడ్వడు.)

**వీడుపాటు** (ద్వ.వి.) : మాఱుపాటు, వ్యత్యాసము. (చూ. వీడ్పాటు.)

**వీడువడు** (ద్వ.అ.క్రి.) : (వీడు + పడు) 1.మాఱు పడు; 2.భేదపడు; 3.తడఁబడు. (చూ. వీడ్వడు.)

**వీడెము** (వై.వి.) : వీడియము యొక్క రూపాంతరము.

**వీడ్కొను** (దే.స.క్రి.) :వీడుకొనుయొక్క రూపాంతరము.(పోయివచ్చెదనని చెప్పుకొని వదలుటకు.)

**వీడ్కొలుపు** (దే.ప్రే.) : వీడుకొలుపు యొక్క రూపాంతరము.( రూ.వీడ్కొల్పు.)

**వీడ్కోలు** (దే.వి.) : వీడుకోలు యొక్క రూపాంతరము. (పోవననుజ్ఞకు.)

**వీడ్పాటు** (ద్వ.వి.) : వీడుపాటు యొక్క రూపాంతరము.

**వీడ్యము** (వై.వి.) : విడ్యము యొక్క రూపాంతరము.

**వీడ్వడు** (ద్వ.అ.క్రి.) : వీడువడు యొక్క రూపాంతరము. (మాఱుపడుటకు. భేదపడుటకు.)

**వీణ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. తంత్రీవాద్య విశేషము; (సరస్వతి వీణ. కచ్ఛపి, నారదుని వీణమహతి.) 2. మెఱపు.

**వీణము** (దే.వి.) : సన్నవస్త్రము, వలిపము, అంకుశము.

**వీణాము** (దే.వి.) : వీణము యొక్క రూపాంతరము.

**వీణావాదుఁడు** (సం.వి.అ.పుం.) : వీణ వాయించువాఁడు.

**వీణియ** (యు.దే.వి.) : కస్తూరి మృగము యొక్క కస్తూరి యుండెడు బొడ్డుకాయ. (వై.) వీణావాద్యము. (చూ.అపు రూపము.)

**వీణె** (యు.వి.) : వీణియ యొక్క రూపాంతరము.

**వీతంసము** (సం.వి.అ.పుం.) : మృగ పక్షులను బట్టెడు వల, ఉరిలోనగు సాధనము.

**వీతము** (సం.వి.అ.న.) : 1. అంకుశము పోటు; 2.సత్తువలేని యేనుఁగు; 3.సత్తువలేని గుఱ్ఱము. (విణ.) : పోయినది.

**వీతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1.చూలుపడుట; 2.జిగి; 3.తిండి; 4.పరుగు; 5.పోక. (పుం.) గుఱ్ఱము.

**వీతిహొత్రుఁడు** (సం.వి.అ.పుం.) : 1.అగ్ని; 2. సూర్యుఁడు.

**వీతెంచే** (దే.అ.క్రి.) : (వీచు + తెంచు) వీచు, విసరు. (స్వార్థమున తెంచు.)

**వీది** (వై.వి.) : ఇండ్లవరుసలు రెంటికి నడిమిత్రోవ.

**వీధి** (సం.వి.ఇ.ఈ.స్త్రీ.) : 1.ఇండ్లవరుస; 2.వరుస; 3.ఇండ్ల వరుసలు రెంటికి నడిమి త్రోవ; 4.నాటక విశేషము.

**వీధ్రము** (సం.విణ.) : (అ.ఆ.అ.) గరగరికైనది, నిర్మలము.

**వీనియ** (వై.వి.) : వీణియ యొక్క రూపాంతరము.

**వీను** (దే.వి.) : 1. చెవి; 2. ప్రసిద్ధి. (చూ. వీను మిగులు.)

**వీనుమిగులు** (దే.అ.క్రి.) : ప్రసిద్ధికెక్కు.

**వీనులకంటి** (దే.వి.) : సర్పము, చక్షుశ్శ్రవము.

**వీనె** (వై.వి.) : వీనియ యొక్క రూపాంతరము.

**వీప్స** (సం.వి.ఆ.స్త్రీ.) : ఒకటి వెనుక నొకటి వ్యాపింపనిచ్చు.

**వీయము** (దే.వి.) : వియ్యమునకు మొదటి రూపము.

**వీర** (సం.వి.ఆ.స్త్రీ) : మగడుఁ గొడుకులునుఁ గల ఆడుది. (అ.న.ము.) కుం కుమ పువ్వు. (పుం.) రసవిశేషము. (చూ. రసము.)

**వీరకత్తియ** (వై.వి.) : (వీరము+కత్తియ) వియ్యంకురాలు.

**వీరకాఁడు** (ద్వ.వి.) : వియ్యంకుఁడు. (చూ. వీరకత్తియ.)

**వీరజయంతిక** (సం.వి.ఆ.స్త్రీ.) : యుద్ధము నందలి వీరుల నృత్తము.

**వీరణము** (ఉభ.దే.వి.) : చర్మవాద్య విశేషము. (సం.అ.న.) అవురుగడ్డి.

**వీరతరము** (సం.వి.అ.న.) : అవురుగడ్డి. (పుం.) బాణము.

**వీరతరువు** (సం.వి.ఉ.పుం.) : ఏఱుమద్ది.

**వీరతాయెతు** (మి.గ్రా.వి.) : వీరులు బిరుదుగా కట్టుకొనెడు తాయెత్తు.

**వీరపత్ని** (సం.వి.ఈ.స్త్రీ.) : వీరునిఁ బెండ్లాడిన పెండ్లాము.

**వీరపాణము** (సం.వి.అ.న.) :యుద్ధము కడపటఁ గాని మొదటఁ గాని వీరులు చేసెడు గోష్ఠీపానము.

**వీరభద్రపళ్లెరము** (మి.గ్రా.వి.) : మిక్కిలి పెద్ద పళ్లెరము.

**వీరిమద్దియలు** (వై.వి.బ.) : 1.(చూ.) వీర మధ్యములు; 2. స్త్రీలు కాలి పెద్ద వ్రేలిని ధరించెడు ముద్రికా విశేషము.

**వీరమద్దెలు** (వై.వి.బ.) : వీరమద్దియలు యొక్క రూపాంతరము.

**వీరమధ్యములు** (సం.వి.అ.న.బ.) : శత్రు వీరుల పేళ్లనడుమఁజెక్కి శూరులు బిరుదుగా కాలి పెద్దవ్రేలిని ధరించెడు ముద్రికలు.

**వీరము** (వై.వి.) : బీరముయొక్క రూపాంతరము. (చూ. వీరకత్తియ, వీరకాఁడు.)

**వీరముద్దియలు** (వై.వి.బ.) : (చూ.) 1. వీర ముద్రికలు; 2. స్త్రీలు కాలి పెద్దవ్రేలిని ధరించెడు ముద్రికా విశేషములు.

**వీరముద్దెలు** (వై.వి.బ.) : వీరముద్దియలు యొక్క రూపాంతరము.

**వీరముద్రికలు** (సం.వి.ఆ.స్త్రీ.బ.) : శూరులు బిరుదుగా కాలిపెద్ద వ్రేలిని ధరించెడు ముద్రికా విశేషము.

**వీరముష్టి** (సం.వి.ఇ.పుం.) : కోమట్లను యాచించుకొని జీవించెడు ఒక తెగ భిక్షుకుఁడు.

**వీరవృక్షము** (సం.వి.అ.పుం.) : 1. ఏఱుమద్ది; 2. జీడి.

**వీరవైష్ణవుఁడు** (సం.వి.అ.పుం.) : వైష్ణవ మతము నందు మిక్కిలి పట్టుగల విష్ణుభక్తుఁడు.

**వీరశైవుఁడు** (సం.వి.అ.పుం.) : శైవమతమునందు మిక్కిలి పట్టుగల శివభక్తుఁడు.

**వీరసువు** (సం.వి.ఊ.స్త్రీ.) : వీరునిఁ గన్నతల్లి.

**వీరహుఁడు** (సం.వి.న్.పుం.) : ఉత్సర్గేష్టిని జేసి గార్హపత్యాగ్నిని విడిచినవాఁడు.

**వీరాణము** (దే.వి.) : వీరణము యొక్క రూపాం తరము.

**వీరాయితము** (సం.వి.అ.న.) : పురుషాయితము.

**వీరాశంసనము** (సం.వి.అ.న.) : భయంకరమైన యుద్ధభూమి.

**వీరాసనము** (సం.వి.అ.న.) : 1. దేని మీఁదను ఆనక కూర్చుండుట; 2. రాత్రిపూఁట కత్తిచేతఁ బట్టుకొని హెచ్చరికతోఁ గావలి యుండుట.

**వీరుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. శూరుఁడు; 2. శ్రేష్ఠుఁడు.

**వీరుధము** (సం.వి.ధ్.స్త్రీ.) : 1. ఒకటితో నొకటి పెనఁగొన్న ద్రాక్ష తీఁగ లోనగువాని పొద; 2. చిగురుఁగొమ్మ.

**వీర్యము** (సం.వి.అ.న.) : 1. పరాక్రమము; 2. రేతస్సు; 3. తేజము; 4. ప్రభావము.

**వీటిఁడి** (దే.విణ.) : వేటిఁడి యొక్క మాఱు రూపము.

**వీలు** (దే.అ.క్రి.) : ఉపయోగించు. (విణ.) అనుకూలము. (వి.) అనుకూల్యము.

**వీలుపడు** (ద్వ.అ.క్రి.) : సరిపడు, అనుకూలపడు.

**వీవధము** (సం.వి.అ.పుం.) : 1. కావడి; 2. త్రోవ; 3. బరువు.

**వీవన** (దే.వి.) : విసనకఱ్ఱ.

**వీవలి** (దే.వి.) : గాలి, వాయువు. (ఇది కావలి వంటిది.)

**వీసబడి** (దే.వి.) : (వీసము + బడి) గ్రామము నందు భాగ ప్రకారము గలిగిన భూ స్వాతంత్ర్యము.

**వీసము** (దే.వి.) : 1. రూకలో పదునాఱవ భాగము; 2. ఒకట పదునాఱవ భాగము.

**వీసర** (ద్వ.వి.) : (వీసము + అర) కొఱంత, వెలితి. (చూ. వీసరపోవు.) (రూ. వీసరము.)

**వీసరపడు** (ద్వ.అ.క్రి.) : వెలితిపడు, వీసరపోవు.

**వీసరపోవు** (దే.అ.క్రి.) : వెలితిపడు.

**వీసె** (వై.వి.) : నలువది పలములు. (మొదటి రూపము వీసియ.)

## వు

**వు** (దే.అప.) : నామ పదముల మీఁదను క్రియా పదముల మీఁదను వచ్చెడు ప్రత్యయము. (ఉదా. విష్ణువు, మ్రొక్కెదవు. మొ.)

## వృ

**వృంతము** (సం.వి.అ.న.) : 1. తొడిమ; 2. చూచుకము; 3. ఘటోదకధార.

**వృంతాకము** (సం.వి.అ.పుం.) : వార్తాక విశేషము, నీరువంగ.

**వృకధూపము** (సం.వి.అ.పుం.) : అనేక పరిమళ వస్తువులు కూర్చి చేసిన ధూపము, కృతిమ ధూపము.

**వృకధూమకము** (సం.వి.అ.పుం.) : పాపటచెట్టు.

**వృకము** (సం.వి.అ.పుం.) : తోఁడేలు, ఈహా మృగము.

**వృకోదరుఁడు** (సం.వి.అ.పుం.) : తోఁడేలు, ఈహామృగము.

**వృకోదరుఁడు** (సం.వి.అ.పుం.) : భీమసేనుఁడు, తోఁడేటి కడుపువాఁడు.

**వృక్క** (సం.వి.ఆ.స్త్రీ.అ.పుం,న.ము.) : శ్రౌతాదుల యందు ప్రసిద్ధమైన శ్రేష్ఠమాంసము. (రూ. వృక్య.)

**వృక్ణము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. విఱిగినది; 2. కోయఁబడినది.

**వృక్షధూపము**(సం.వి.అ.పుం.) : దేవదారు బంకతోఁ జేసిన ధూపద్రవ్యము.

**వృక్షము** (సం.వి.అ.పుం.) : చెట్టు, తరువు, పాదపము.

**వృక్షరుహ** (సం.వి.ఆ.స్త్రీ.) : (చూ. బదనిక)

**వృక్షవాటిక** (సం.వి.ఆ.స్త్రీ.) : అమాత్యులు లోనగు ధనికుల యొక్క గృహముల యందలి ఉపవనము.

**వృక్షాదనము** (సం.వి.అ.పుం.) : 1.ఉలి; 2.రావి.

**వృక్షాదని** (సం.వి.ఈ.స్త్రీ.) : బదనిక, వృక్షరుహ.

**వృక్షామ్లము** (సం.వి.అ.న.) : చింతపండు, తింత్రిణీకము.

**వృజినము** (సం.వి.అ.న.) : పాపము. (పుం.) క్లేశము. (విణ.) : వక్రము.

**వృతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1.వరించుట; 2.చుట్టు వేసిన వెలుగు; 3. చుట్టుట.

**వృతుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) వరింపఁ బడినవాఁడు.

**వృత్తపత్రము** (సం.వి.అ.న.) : వన్నె వెదురు.

**వృత్తపర్ణి** (సం.వి.ఈ.స్త్రీ.) : తెల్లజనము.

**వృత్తము** (సం.వి.అ.న.) : 1.పద్యభేదము; 2.నడత; 3.జీవనము. (పుం.) తాఁబేలు. (విణ.) : 1. వరింపఁ బడినది; 2.చుట్టఁబడినది; 3.కడచినది; 4. చచ్చినది; 5. వట్రువయైనది; 6. గట్టియైనది.

**వృత్తముస్తకము** (సం.వి.అ.న.) : వట్రువముస్తె.

**వృత్తాంతము** (సం.వి.అ.పుం.) : 1.సమాచారము; 2.కథ; 3.అంతయు; 4.ఏకాంతము; 5.ప్రక్రియ; 6.ప్రస్తావము.

**వృత్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. నడవడిక; 2. జీవనోపాయము; (ఇది చతుర్విధము. కృషి, పాశుపాల్యము, వాణిజ్యము, సేవ.) 3. వివరణ గ్రంథము; 4. అభిధాది; (ఇవి మూడు. అభిద, లక్షణ, వ్యంజన.) 5. కైశిక్యాది. (ఇవి నాలుగు కైశికి, ఆరభటి, సాత్వతి, భారతి.)

**వృత్రము** (సం.వి.అ.పుం.) : 1.చీఁకటి; 2.కొండ.

**వృత్రహుఁడు** (సం.వి.న్.పుం.) : ఇంద్రుఁడు.

**వృత్రుఁడు** (సం.వి.అ.పుం.) : 1.శత్రువు; 2. ఒక అసురుఁడు.

**వృథ** (సం.అవ్య.) : వృథా శబ్దమునకు తెనుఁగున హ్రస్వము వచ్చిన రూపము.

**వృథా** (సం.అవ్య.) : వ్యర్థముగా.

**వృద్ధ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఎనుబడియేండ్లకు పైఁబడిన ముసలిది.

**వృద్ధకాకము**(సం.వి.అ.పుం.) : మాలకాకి.

**వృద్ధదారకము** (సం.వి.అ.పుం.) : బొద్ది.

**వృద్ధము** (సం.వి.అ.న.) : ఊపువ్వు. (విణ.): వృద్ధిఁ బొందినది.

**వృద్ధశ్రవుఁడు** (సం.వి.స్.పుం.) : ఇంద్రుఁడు.

**వృద్ధి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1.అభివృద్ధి; 2.సమృద్ధి; 3. అభ్యుదయము; 4.వడ్డి; (ద్వి. చతుర్విధము. కాయిక వృద్ధి, కాలిక వృద్ధి, కారిత వృద్ధి, చక్ర వృద్ధి.) 5. గుణకారము; 6. కంతి; 7.ఒక గ్రహ యోగము; (చూ. యోగము.) 8. గంధ ద్రవ్య విశేషము.

**వృద్ధి జీవిక** (సం.వి.ఆ.స్త్రీ.) : వడ్డికిచ్చి జీవించెడు జీవనము.

**వృద్ధుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. ఎనుబడియేండ్లకు పైఁబడిన ముసలివాఁడు; 2.తెలిసిన వాఁడు. (రూ. వృద్ధు.)

**వృద్ధ్యాజీవుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) వడ్డికిచ్చి జీవనము చేయువాఁడు, వార్ధుషికుఁడు.

**వృశ్చికము** (సం.వి.అ.పుం.) : 1.తేలు; 2. తేలుకొండి; 3. ఒకరాశి; 4. కందురీఁగ; 5. గొంగళి పురుగు; 6. తెల్ల గలిజేరు.

**వృష** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.ఎలుకజీడి; 2.దురదగొండి. (పుం.ము.) : 1.ఎద్దు; 2.ధర్మము; 3. ఎలుక; 4. అడ్డసరము; 5. ఓషధీ విశేషము; 6. వాస్తుస్థాన విశేషము.

**వృషగంధిక** (సం.వి.ఆ.స్త్రీ.) : గాడి దగడపర.

**వృషణము** (సం.వి.అ.పుం.) : ముష్కము.

**వృషధ్వజుఁడు** (సం.వి.అ.పుం.) : శివుఁడు, ముక్కంటి.

**వృషభము** (సం.వి. అ.పుం.) : 1.ఎద్దు; 2. ఒక రాశి; (చూ. రాశి.) 3. ఓషధీ విశేషము; 4.తిరుమల. (విణ.) : ఉత్తరపదమైనచో శ్రేష్ఠము. (కవి వృషభుఁడు)

**వృషభి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. విధవ; 2. స్వైరిణి.

**వృషలి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. శూద్రజాతి స్త్రీ; 2.కన్యక; 3.గొడ్రాలు; 4.చచ్చుడు బిడ్డలు గలది.

**వృషలుఁడు** (సం.వి.అ.పుం.) : 1. శూద్రుఁడు; 2. చంద్రగుప్తుఁడు; 3. పాపాత్ముఁడు.

**వృషస్యంతి** (సం.వి.ఈ.స్త్రీ.) : కాముకి.

**వృషాకపాయి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1.లక్ష్మి; 2. పార్వతి; 3.శచి; 4.స్వాహ; 5.తిప్పతీగ; 6.పిల్లపీచర.

**వృషాకపి** (సం.వి.ఇ.పుం.) : 1.విష్ణువు; 2. శివుఁడు; 3. అగ్ని.

**వృషుఁడు** (సం.వి.అ.పుం.) : వీర్య వృద్ధి గలవాఁడు. (విణ.) : ఉత్తరపదమైనచో శ్రేష్ఠుఁడు. (వి.న్.పుం.) : ఇంద్రుఁడు, కర్ణుడు.

**వృష్టి** (సం.వి.ఇ.స్త్రీ.) : వర్షము, వాన.

**వృష్ణి** (సం.వి.ఇ.పుం.) : 1.పొట్టేలు; 2.ఒక యాదవుఁడు; 3.కృష్ణుఁడు; 4.ఇంద్రుఁడు; 5.అగ్ని; 6. పాషండుఁడు.

## వె

**వెంగలి** (వై.విణ.) : 1. మూఢుఁడు, అవివేకి; 2. జడుఁడు. (రూ. వెంగళి. ఉదా. వెంగళప్ప.) (వెకలి యొక్క రూపాంతరము.)

**వెంగలివిత్తు** (ద్వ.విణ.) : మూఢాగ్రేసరుఁడు. (అంగజలీలలను వెంగలి విత్తయి తిరుగక అని యన్వయము.)

**వెంచే** (దే.వి.) : మడుఁగు, హ్రదము.

**వెంట** (దే.వి.) : 1. కార్యము; 2. విషయము; 3. మార్గము; 4. విధము; 5. వేఁట.

**వెంటము** (దే.వి.) : వేడుక, కుతూహలము.

**వెంటి** (దే.వి.) : కసవుపిరి.

**వెంటిగొను** (దే.అ.క్రి.) : (వెంటి+కొను) పిరిగొను.

**వెంట్రువ** (దే.వి.) : ఒక దినుసు ముంగిస, బభ్రువు.

**వెండి** (దే.వి.) : రజతము. (అవ్య.) : 1.మఱి; 2.పిమ్మట. (ఇదియు సువర్ణకాంత మునగును. చూ.ను.)

**వెండికొండ** (ద్వ.వి.) : రజతాద్రి. (ఇట్లు వెండిమల. మొ.)

**వెండిగుండు** (ద్వ.వి.) : 1.వెండికొండ; 2. వెండి గుండువలె నుండుటచే కుక్కకియ్యఁబడిన పేరు. (చూ. గబ్బి.)

**వెండ్రుక** (దే.వి.) : 1.కేశము; 2.రోమము.

**వెంపర** (దే.వి.) : 1. పీడనము; 2. భేదనము; 3.హింస. (చూ.వెంపరలాడు.)

**వెంపరలాడు** (దే.స.క్రి.) : (వెంపరలు + ఆడు) 1. పీడించు; 2. భేదించు; 3. హింసించు.

**వెంపలి** (దే.వి.) : బాణపుంఖి. (దీని భేదము ములు వెంపలి.)

**వెంబడి** (దే.ద్ర.) : పశ్చాదర్థకము, వెంట.

**వెంబడించే** (దే.స.క్రి.) : వెనుకొను. (నన్ను వెంబడించి వచ్చుచున్నాఁడు.)

**వెంబర** (దే.విణ.) : 1. దుష్టుఁడు, దుష్టురాలు; 2. అవివేకి.

**వెంబరవిత్తు** (దే.విణ.) : 1. దుష్టాగ్రేసరుఁడు; 2. మూఢాగ్రేసరుఁడు. (చూ. వెంబర.)

**వెకలి** (వై.విణ.) : 1. మూఢుఁడు; 2. ఆసక్తుఁడు.

**వెక్క** (దే.వి.) : వేఁడిమి.

**వెక్కలి** (వై.విణ.) : వెకలి యొక్క రూపాంతరము.

**వెక్కసపడు** (ద్వ.అ.క్రి.) : (వెక్కసము + పడు) దుస్సహత్వము నొందు.

**వెక్కసపాటు** (ద్వ.వి.) : వెక్కసపడుట.

**వెక్కసము** (దే.వి.) : 1.దుస్సహత్వము; 2. (బ.) దుస్సహవచనములు. (విణ.) : 1. దుస్సహము; 2.దుర్లభము; 3. అధికము.

**వెక్కసి** (దే.విణ.) : (వెక్కసము + ఇ) దుస్సహుఁడు, దుస్సహురాలు.

**వెక్కసించే** (దే.అ.క్రి.) : దుస్సహమగు.

**వెక్కిరించే** (వై.అ.క్రి.) : 1. వికారచేష్టలు చేయు; 2. ఒకరి యొక్క వేషభాషా చేష్టల ననుకరించి అపహాస్యము చేయు. (నన్ను వాఁడు వెక్కిరించుచున్నాఁడు.) (చూ. వెక్కిరింతలాడు.)

**వెక్కిరింత** (వై.వి.) : వెక్కిరించుట. (చూ. వెక్కిరింతలాడు.)

**వెక్కిరింతలాడు** (ద్వ.స.క్రి.) : (వెక్కిరింతలు + ఆడు) వికారచేష్టలు చేయు.

**వెక్కిలి** (వై.వి.) : దప్పి మొదలైనవాని చేతఁ గలిగెడి వ్యాధి విశేషము. (బ. వెక్కిల్లు.) (ఎక్కిలికి మాఱు రూపము.)

**వెక్కు** (వై.అ.క్రి.) :1. వెక్కిలి విడుచు; 2. ఏడ్చునపుడు వెక్కిలి ధ్వనివలె ధ్వనించు. (వి.) వెక్కిలి.

**వెక్కురు** (వై.విణ.) : వికారము పట్టినవాఁడు.

**వెగచు** (దే.అ.క్రి.) : వెక్కు. (ఇక్కడ వెగచుననఁగా వెక్కి యేడ్చునని యర్థము.)

**వెగటు** (వై.వి.) : వైరస్యము. (విణ.) విరసము.

**వెగడు** (దే.వి.) : 1. తల్లడము; 2. తడఁబాటు.

**వెగడుపడు** (ద్వ.అ.క్రి.) : తల్లడపడు. (చూ. ఒజ్జ మూడవ యర్థము.)

**వెగ్గలము** (దే.విణ.) : మిక్కుటము, అధికము.

**వెగ్గలీఁడు** (దే.విణ.) : (వెగ్గలము+ఈఁడు) అధికుఁడు.

**వెచ్చించే** (వై.స.క్రి.) : వెచ్చముసేయు.

**వెచ్చే** (దే.వి.) : 1. వేఁడిమి; 2. కాఁక.

**వెచ్చకాఁడు** (ద్వ.వి.) : (వెచ్చము+కాఁడు) విటుఁడు.

**వెచ్చన** (దే.వి.) : వేఁడిమి. (విశేషణమగచో) (చూ. అలకన.) (విణ.) వేఁడి. (చూ. చల్లన.విణ.)

**వెచ్చేపడు** (వై.అ.క్రి.) : (వెచ్చము+పడు) వెచ్చమగు. (చూ. ఈగడ.) (ప్రే. వెచ్చపఱుచు.)

**వెచ్చేపెట్టు** (ద్వ.స.క్రి.) : (వెచ్చము + పెట్టు) వెచ్చించు. (చూ. కూడఁబెట్టు మొదటియర్థము.)

**వెచ్చేపోవు** (ద్వ.అ.క్రి.) : (వెచ్చము + పోవు) వెచ్చపడు.

**వెచ్చేము** (వై.వి.) : 1.వ్యయము; 2.ఇంటికి వాడుకొనుటకు కావలసిన చిల్లర సరకుల యప్పు.

**వెచ్చే** (దే.అ.క్రి.) : కాఁగు. (వి.) వేఁడిమి.

**వెజ్జే** (వై.వి.) : వైద్యుఁడు.

**వెజ్జేరాలు** (ద్వ.వి.) : (వెజ్జు + ఆలు) వైద్యురాలు.

**వెట్ట** (దే.వి.) : 1. వెట్టకారు; 2. వేఁడిమి.

**వెట్టకారు** (ద్వ.వి.) : గ్రీష్మర్తువు, వేసవి.

**వెట్టచెవులతపసి** (ద్వ.వి.) : ఉగ్రశ్రవుఁడు.

**వెట్టము** (దే.వి.) : శత్రువు.

**వెట్టి** (వై.వి.) : కూలిలేక చేసెడు పని.

**వెట్టిగొను** (ద్వ.స.క్రి.) : (వెట్టి+కొను) వెట్టి చేయించు.

**వెట్టివాఁడు** (ద్వ.వి.) : గ్రామమునందు దినబత్తెము లేక వెట్టిపని చేయువాఁడు.

**వెట్టీఁడు** (ద్వ.విణ.) : (వెట్టి + ఈఁడు) వెట్టి చేయువాఁడు.

**వెడ** (దే.విణ.) : 1. అల్పము; 2. తుచ్ఛము; 3. వ్యర్థము. (క్రి.విణ.) : ఇంచుక.

**వెడఁగు** (దే.వి.) : 1. అవివేకము; 2. వికారము. (విణ.) : అవివేకి.

**వెడఁగుపడు** (ద్వ.అ.క్రి.) : 1. అవివేకము నొందు; 2. జడత్వమునొందు; 3. వికారము నొందు. (ఇచ్చట వాఁగు శబ్దమునకు సైనికులర్థము. చూ. వాఁగు.)

**వెడఁగుపాటు** (ద్వ.వి.) : వెడఁగు పడుట. (జడత్వము నొందుటకు. చూ. గ్రక్కుమిక్కుమను.)

**వెడఁగురుపడు** (ద్వ.అ.క్రి.) : జడత్వము నొందు.

**వెడఁద** (దే.విణ.) : విశాలము.

**వెడఁదమోముమెకము** (ద్వ.వి.) : సింహము, పంచాస్యము.

**వెడఁదవాతియమ్ము** (ద్వ.వి.) : (వెడఁద వాయి + అమ్ము) బాణవిశేషము.

**వెడలఁబడు** (ద్వ.అ.క్రి.) : (వెడలన్ + పడు) వెడలు. (స్వార్థమునపడు.)

**వెడలఁబాటు** (ద్వ.వి.) : వెడలఁబడుట.

**వెడలఁబాఱు** (దే.అ.క్రి.) : (వెడలన్ + పాఱు) వెడలు. (చూ. పోలు. వి. చూ. పాఱు.)

**వెడలు** (దే.అ.క్రి.) : బయలువెళ్లు.

**వెడలుచే** (దే.ప్రే.) : వెడలఁజేయు. (రూ.వెడల్చు.)

**వెడలుపు** (దే.వి.) : వైశాల్యము, (రూ. వెడల్పు.)

**వెడవింటి** (దే.వి.) : (వెడ + విల్లు) మన్మథుఁడు, ఇక్షు ధన్వుఁడు. (చూ. తొగ రెండవ యర్థము.)

**వెడవిలుకాఁడు** (దే.వి.) : (వెడ + విల్లు) మన్మథుఁడు, ఇక్షుధన్వుఁడు. (చూ. వంకిణి.) (ఇట్లు వెడవిలుతుఁడు.)

**వెడవెడ** (దే.విణ.) :అత్యల్పము, సూక్ష్మము. (చూ. వీఁగియాడు.) (క్రి.విణ.) : 1.సూక్ష్మముగ; 2. మందముగ; 3. మృదువుగ.

**వెడ్డరి** (దే.విణ.) : (వెడ్డ + అరి) కపటి, వంచకుఁడు.

**వెడ్డు** (దే.వి.) : 1. కపటము; 2. వంచన.

**వెడ్డువెట్టు** (దే.స.క్రి.) : (వెడ్డు+పెట్టు) వంచించు.

**వెణఁద** (దే.విణ.) : వెడఁద యొక్క రూపాంతరము. (దీనికిఁ బ్రయోగాంతరము మృగ్యము.)

**వెణుతురు** (వై.వి.) : కరీరము. (వెలుతురు యొక్క రూపాంతరము.)

**వెత** (వై.వి.) : దుఃఖము.

**వెతకు** (దే.స.క్రి.) : అన్వేషించు.

**వెతారము** (దే.వి.) : వెత, దుఃఖము, వ్యథ.

**వెద** (దే.వి.) : 1. విత్తుట; 2. పక్షి గర్భాధానము; 3.పశుఋతువు; 4.కొప్పు. (చూ. వినుమ్రాను.)

**వెదకు** (దే.స.క్రి.) : వెతకు యొక్క రూపాంతరము.

**వెదకుడు** (దే.వి.) : వెదకుట, అన్వేషణము.

**వెదగొల్లు** (దే.వి.) : విత్తులు వెదవేసెడు గొట్టు.

**వెదచల్లు** (దే.స.క్రి.) : 1. పాఱఁజల్లు; (వాఁడు నాలుగు తట్టుల రూకలు వెదచల్లినాఁడు.) 2.వ్యాపింపఁజేయు.

**వెదచిందు** (దే.అ.క్రి.) : వ్యాపించు.

**వెదపెట్టు** (దే.స.క్రి.) : విత్తు. (చూ. నిట్టు రెండవ యర్థము.)

**వెదావు** (దే.వి.) : (వెద + ఆవు) వెదపదనై యాఁబోతుచే వెనుకొనఁబడు ఆవు, సంధిని. (ఇట్లు వెదమొదవు. మొ.)

**వెదురు** (వై.వి.) : వేణువు. (ఇది ద్వివిధము. గట్టివెదురు, బొంగు వెదురు.)

**వెదురుకంపజిట్ట** (ద్వ.వి.) : పక్షి విశేషము.

**వెదురుపాలు** (వై.వి.) : త్వక్షీరము.

**వెదురు పిచ్చిక** (ద్వ.వి.) : పక్షి విశేషము.

**వెదురుప్పు** (ద్వ.వి.) : (వెదురు + ఉప్పు) వెదురుపాలు.

**వెదురుమిడుత** (ద్వ.వి.) : క్రిమి విశేషము.

**వెదురువిల్లు** (ద్వ.వి.) : వెదురు బద్దలతోఁ జేసిన విల్లు. (చూ. విల్లు.)

**వెనకయ్య** (వై.వి.) : వినాయకుఁడు, విఘ్నేశ్వరుఁడు.

**వెనకు** (దే.స.క్రి.) : వెదకు యొక్క రూపాంతరము.

**వెనకుడు** (దే.వి.) : వెదకుడు యొక్క రూపాంతరము.

**వెను** (దే.వి.) : వెన్ను యొక్క రూపాంతరము. అవ్య.వెనుక. (దీనికి హల్లుపరమగుచో ఉత్వము నకు వికల్పముగా లోపంబగు.)

**వెనుఁబడు** (ద్వ.అ.క్రి.) : 1. (చూ.) విషాదించు; 2. ఖేదపడు.

**వెనుఁబాటు** (ద్వ.వి.) : వెనుఁబడుట. (విషాదమునకు.)

**వెనుక** (ద్వ.వి.) : 1. పశ్చాద్భాగము; 2. ముందు; 3.పడమర; (చూ. చుట్టలుఁగు.) 4.ఉపేక్ష. (విణ.) : 1.పశ్చాద్భాగమున నున్నది; 2. ముందటిది. 1. వెంబడి; (నా. వెనుక రమ్ము.) 2. పిమ్మట. (నేను వెనుక వచ్చెదను.) (దీని మొదటి రూపము వెనుకల.)

**వెనుక చిక్కు** (దే.అ.క్రి.) : వెనుకపడు.

**వెనుక చూపుల మెకము** (ద్వ.వి.) : ఎలుఁగు, భల్లూకము.

**వెనుకటి పని** (దే.వి.) : అపరకర్మము.

**వెనుకటి వాఁడు** (దే.వి.) : (వెనుక + వాఁడు) అనుజుఁడు. (విణ.) : వెనుక నున్నవాఁడు.

**వెనుకదీయు** (దే.అ.క్రి.) : (వెనుక + తీయు) 1. వెనుకకు మరలు; 2. సంకోచించు.

**వెనుక ద్రొక్కు** (దే.అ.క్రి.) : (వెనుక + త్రొక్కు) వెనుదీయు.

**వెనుకపడు** (ద్వ.అ.క్రి.) : 1. వెనుక చిక్కు; 2. (ధనము వెచ్చము కాక) కూడఁబడు.

**వెనుకపాటు** (ద్వ.వి.) : వెనుకపడుట.

**వెనుకమేను** (దే.వి.) : వీఁపు చరమాంగము.

**వెనుకమ్రాను** (దే.వి.) : ఏతపుబానకు నీళ్లెత్తు వాఁడు కూర్చుండుటకై నిలువు గాళ్ల మీఁద అడ్డముగా నుంచిన మ్రాను.

**వెనుకల** (ద్వ.వి.) : (వెను+కలను) (చూ.) వెనుక. (ఇది మంగలవంటిది. ఈ పదము సాధువే కాని దీనికి ప్రయోగము మృగ్యము. వెనుకాల యనుట గ్రామ్యము.)

**వెనుకవేయు** (దే.స.క్రి.) : (ధనము వెచ్చము చేయక) కూడఁబెట్టు.

**వెనుకొను** (దే.స.క్రి.) : వెంబడించు.

**వెనుచేఱచు** (దే.స.క్రి.) : వెంబడించు.

**వెనుతవులు** (దే.స.క్రి.) : వెంబడించు.

**వెనుదన్ను** (దే.అ.క్రి.స.క్రి.) : వెన్నుదన్ను యొక్క రూపాంతరము. (వెనుక నిల్చుటకు.)

**వెనుదీయు** (దే.అ.క్రి.) : (వెను + తీయు) వెనుకకు మరలు.

**వెనువెంట** (దే.ద్ర.) : మిక్కిలి వెంబడి.

**వెన్క** (దే.వి.విశ.ద్ర.) : వెనుక యొక్క రూపాంతరము. (పశ్చాద్భాగమునకు. (చూ. వేగిర కాఁడు.) వెంబడికి.)

**వెన్కొను** (దే.స.క్రి.) : వెనుకొను యొక్క రూపాంతరము.

**వెన్తవులు** (దే.స.క్రి.) : వెనుతవులు యొక్క రూపాంతరము.

**వెన్న** (వై.వి.) : (వెల్ల + నేయి) పెరుఁగు చిలికి యెత్తినది, నవనీతము.

**వెన్నంటు** (దే.స.క్రి.) : (వెన్ను+అంటు) వెంబడించు.

**వెన్నడాయి** (ద్వ.వి.) : పక్షివిశేషము.

**వెన్నడి** (దే.వి.) : వెంబడి.

**వెన్నడించు** (దే.స.క్రి.) : వెంబడించు.

**వెన్నడికొను** (దే.స.క్రి.) : వెంబడించు.

**వెన్నదొంగ** (ద్వ.వి.) : కృష్ణుఁడు, నవనీతచోరుఁడు. (ఇట్లు వెన్నముచ్చు.)

**వెన్నపడిదము** (ద్వ.వి.) : ఒక దినుసు పిండివంట.

**వెన్నపాలకాయ** (ద్వ.వి.) : భక్ష్య విశేషము.

**వెన్నపూస** (ద్వ.వి.) : వెన్నముద్ద.

**వెన్నప్పము** (వై.వి.) : (వెన్న + అప్పము) మధుర భక్ష్య విశేషము. (చూ. కడియపుటట్టు.)

**వెన్నమడుఁగు** (ద్వ.వి.) : వస్త్ర విశేషము.

**వెన్నముద్దకోడి** (ద్వ.వి.) : పక్షివిశేషము.

**వెన్నముద్దలు** (ద్వ.వి.బ.) : శాలిధాన్య విశేషము.

**వెన్న మెఱుఁగు** (ద్వ.వి.) : భక్ష్యవిశేషము.

**వెన్నయుండ** (ద్వ.వి.) : (వెన్న+ఉండ) మధుర భక్ష్యవిశేషము.

**వెన్నవెదురు** (వై.వి.) : ఒక దినుసు కూరాకు చెట్టు, విశల్య.

**వెన్నాడు** (దే.స.క్రి.) : (వెన్ను + ఆడు) వెన్నడించు.

**వెన్నిచ్చు** (ద్వ.అ.క్రి.) : (వెన్ను + ఇచ్చు) వెనుదీయు.

**వెన్ను** (దే.వి.) : 1. వీఁపు; 2. వరి మొదలగువాని ఎన్ను; 3. ఇంటి నడికొప్పు. (ఈ రెండు ఉదాహరణము లందును శ్లేష.)

**వెన్నుఁడు** వై.వి.) : విష్ణువు, కృష్ణుఁడు.

**వెన్నుకట్టె** (ద్వ.వి.) : పృష్ఠ బంధము.

**వెన్నుగాఁడి** (దే.వి.) : (వెన్ను + కాఁడి) ఇంటి నడికొప్పుమ్రాను.

**వెన్నుదన్ను** (దే.అ.క్రి.) : (వెన్ను + తన్ను) వెనుక నిల్చు. (స.క్రి.) : వెంబడించు.

**వెన్నుపట్టె** (ద్వ.వి.) : 1. ఇంటివెన్ను గాఁడి; 2. వీఁపు నడిమి యెముక.

**వెన్నుపాము** (దే.వి.) : వెన్నెముక యందుండు పురుగు, కుండలి.

**వెన్నుపూస** (దే.వి.) : వీఁపు నడిమి యెముక.

**వెన్నుబద్ద** (దే.వి.) : వెన్నుగాఁడి.

**వెన్నుమ్రాను** (దే.వి.) : వెన్నుగాఁడి.

**వెన్నెముక** (దే.వి.) : (వెన్ను+ఎముక) వీఁపు నడిమి యెముక, కశేరుక.

**వెన్నెల** (ద్వ.వి.) : (వెల్ల + నెల) 1. చంద్రుని యొక్క తెల్లని కాంతి, చంద్రిక; 2. అంజలి విశేషము.

**వెన్నెలకారు** (ద్వ.వి.) : శరదృతువు.

**వెన్నెలకుప్పలు** (ద్వ.వి.బ.) : బాలక్రీడా విశేషము. (చూ. డాఁగిలి మ్రుచ్చులు.) (ఇట్లు వెన్నెల ప్రోవులు.)

**వెన్నెలకోలు** (ద్వ.వి.) : నమస్కారము.

**వెన్నెలగుత్తి** (ద్వ.వి.) : చంద్రుఁడు, శుభ్రాంశువు.

**వెన్నెల పులుఁగు** (ద్వ.వి.) : వెన్నెలకు సంతోషించెడు పక్షి విశేషము, చకోరము. (ఇట్లు వెన్నెలపిట్ట.)

**వెన్నెలతేఁడు** (ద్వ.వి.) : చంద్రుఁడు, కళానిధి. (ఇట్లు వెన్నెల రాయఁడు.)

**వెన్బడు** (ద్వ.అ.క్రి.) : వెనుఁబడు యొక్క రూపాంతరము. (విషాదించుటకు.)

**వెన్బాటు** (ద్వ.వి.) : వెనుఁబాటు యొక్క రూపాంతరము. (విషాదమునకు.)

**వెప్ప** (దే.వి.) : వేఁడిమి.

**వెమ్ము** (దే.అ.క్రి.) : తప్తమగు, తాపము నొందు.

**వెయి** (దే.స.) : వేయి యొక్క రూపాంతరము.

**వెరఁగు** (దే.వి.) : 1. ఆశ్చర్యము; 2. నిశ్చేష్టత. (చూ. వెఱఁగు.)

**వెరఁజోడు** (దే.స.క్రి.) : (వెరఁజి + ఆడు) జారుకొను. (చూ. ఊఁగాడు.)

**వెరఁజో** (దే.స.క్రి.) : జారుకొను.

**వెరవరి** (దే.విశ.) : (వెరవు + అరి) ఉపాయశాలి.

**వెరవిఁడి** (దే.విశ.) : (వెరవు + ఇఁడి)

**వెరవు** (దే.వి.) : 1. ఉపాయము; (చూ. బెట్టిదము విశ. రెండవ యర్థము.) 2. జీవనోపాయము; 3. విధము. (విశ.) : 1. యుక్తము; 2. అధీనము.

**వెరవేఁకి** (ద్వ.వి.) : విరహ తాపము. (ఇందలి వెర శబ్దము విరహార్థకమయి ప్రత్యేకముగా ప్రయోగములందు కానఁబడదు.)

**వెరసి** (దే.వి.) : లెక్క మొత్తము. (విశ.) : కడపటిది.

**వెరసు** (దే.వి.) : అంకెలులోనగు వాని పఙ్క్తి.

**వెరువు** (దే.వి.) : వెరవు యొక్క రూపాంతరము. (చూ. గౌరువంక.) (ఇట్లు ఉకార మధ్యముగా వాడుక లేకయున్నను ఇది యిట్లే యుండవలయు ననుటకుఁ బ్రయోగము కానఁబడు చున్నది గాని అకార మధ్యముగా వాడుక విశేషించి యుండినను అది యట్లే యుండవలె ననుటకుఁ దగిన ప్రయోగము కానఁబడదు.)

**వెఱ** (దే.వి.) : 1. భయము; 2. ఆశ్చర్యము.

**వెఱఁగు** (దే.వి.) : 1. ఆశ్చర్యము; 2. నిశ్చేష్టత. (చూ. వెఱఁగుపాటు.)

**వెఱుఁగుపడు** (ద్వ.అ.క్రి.) : 1. ఆశ్చర్యము నొందు; (చూ. తఱుఁగు.) 2. నిశ్చేష్టతఁ బొందు. (చూ. వెఱఁగు పాటు.)

**వెఱఁగుపాటు** (ద్వ.వి.) : వెఱఁగు పడుట. (ఆశ్చర్యమునకు. నిశ్చేష్టతకు.) (చూ. వెన్బాటు.)

**వెఱఁగొందు** (దే.అ.క్రి.) : (వెఱఁగు + ఒందు) ఆశ్చర్యపడు.

**వెఱక** (దే.వి.) : వెంద్రుక.

**వెఱచేఱచే** (దే.అ.క్రి.) : భయపడు. (చూ. ఒక్కెఱ. విశ.)

**వెఱచు** (దే.అ.క్రి.) : భయపడు. (చూ. అఱచు మొదటియర్థము.)

**వెఱపరి** (దే.విశ.) : (వెఱపు + అరి) భయము గలవాఁడు, భయము గలది.

**వెఱపిఁడి** (దే.విశ.) : (వెఱపు + ఇఁడి) భయము లేనివాఁడు, భయములేనిది.

**వెఱపు** (దే.వి.) : భయము. (చూ. వెఱచు.)

**వెఱబొమ్మ** (దే.వి.) : పశ్వాదులకు వెఱపు పుట్టుటకై భీకరాకారముగఁ బ్రతిష్ఠించెడు ప్రతిమ. వెఱవెఱపాటు (ద్వ.వి.) : నిశ్చేష్టత. (దీనికీ గ్రంథము నందు తప్ప మఱియెక్కడను ప్రయోగము కనఁబడలేదు.)

**వెఱ్ఱి** (దే.వి.) : 1. పిచ్చి, ఉన్మాదము; (చూ. ఒఱపు. విశ. మొదటి యర్థము.) 2. అవివేకము. (విశ.) : 1. పిచ్చివాఁడు, ఉన్మత్తుఁడు; (చూ. వెడ్డ మొదటి యర్థము.) 2. వివేకము లేనివాఁడు, వివేకము లేనిది. (వెఱ్ఱి శబ్దము ముందుగల సంజ్ఞావాచక శబ్దములు. వెఱ్ఱిచెఱకు (చెఱకు వంటి తృణ విశేషము), వెఱ్ఱిజిల్లెడు (రాజార్కము), వెఱ్ఱితుమ్మ (తుమ్మదినుసు), వెఱ్ఱినిమ్మ (నిమ్మదినుసు), వెఱ్ఱిపుచ్చ (పుచ్చదినుసు), వెఱ్ఱి బచ్చలి (బచ్చలి దినుసు), వెఱ్ఱిబీఱ (చేతి బీఱ), వెఱ్ఱిమేడి (కాకిమేడి), వెఱ్ఱి యావ (తెల్లావ.) ఇట్టివి.)

**వెఱ్ఱినీళ్లు** (ద్వ.వి.బ.) : మద్యము.

**వెఱ్ఱిబాగులు** (దే.వి.) : వివేకము లేనిది, వివేకములేనివాఁడు.

**వెఱ్ఱివాఁడు** (దే.విశ.) : వెఱ్ఱిపట్టినవాఁడు, ఉన్మత్తుఁడు.

**వెల** (దే.వి.) : 1. కొను వస్తువులు లోనగువాని కిచ్చెడు విలువ, మూల్యము; (చూ. కడుకొను.) 2. పందెము. (చూ. వాట్లీఁడు.)

**వెలఁగ** (దే.వి.) : కపిత్థము.

**వెలఁది** (దే.వి.) : 1. గరగరికయైన ఆఁడుది; 2. ఆఁడుది; 3. ధాళ ధాళ్యము. (విశ.) : 1.నిర్మలము; 2. ప్రసన్నము.

**వెలఁదుక** (దే.వి.) : (వెలఁది + ఉక) వెలఁది. (స్వార్థమున ఉక.)

**వెలచే** (వై.స.క్రి.) : శుద్ధిచేయు, తోము. (చూ. ఎడ్డెన.)

**వెలనాడు** (దే.వి.) : దేశ విశేషము. (రూ. వెల్నాడు.)

**వెలమ** (దే.వి.) : శూద్రజాతి విశేషము. (వెలమ వాఁడు, వెలమది.) బ. ఆ జాతివారు.

**వెలమసంది** (దే.వి.) : నేలవేము యొక్క అవాంతర భేదము, కాకజంఘ.

**వెలయాలు** (దే.వి.) : (వెల + ఆలు) వేశ్య. (ఇట్లు వెలవెలఁది. మొ.)

**వెలయు** (వై.అ.క్రి.) : 1.ప్రకాశించు; 2. ప్రసన్నత నొందు; (చూ. బెరయు రెండవ యర్థము.) 3. ప్రసిద్ధికెక్కు; 4. బయలుపడు.

**వెలరారు** (ద్వ.అ.క్రి) : (వెలరు + ఆరు) తెల్లనగు.

**వెలరు** (వై.వి.) : తెల్లన.

**వెలరువాఱు** (ద్వ.అ.క్రి.) : (వెలరు+పాఱు) 1. తెల్లనగు; 2. వెలవెలఁ బోవు.

**వెలలు** (దే.అ.క్రి.) : వెడలు యొక్క రూపాంతరము.

**వెలలుచే** (దే.ప్రే.) : వెడలుచు యొక్క రూపాంతరము.

**వెలవ** (వై.వి.) : కాఁపుడు గంజి.

**వెలవడము** (దే.వి.) : ఒక విధమైన వరిధాన్యము.

**వెలవెలఁబాఱు** (ద్వ.అ.క్రి.) : (వెలవెల + పాఱు) వివర్ణమగు.

**వెలవెలఁబోవు** (ద్వ.అ.క్రి.) : (వెలవెల + పోవు) వివర్ణమగు.

**వెలవెలన** (వై.వి.) : వెలవెలపాటు. (విశేషణ మగుచో.) (చూ. అలకన.)

**వెలవెలనగు** (ద్వ.అ.క్రి.) : (వెలవెలన+అగు) వెల వెలఁబోవు.

**వెలవెలనవోవు** (ద్వ.అ.క్రి.) : (వెలవెలన + పోవు) వెలవెలఁబోవు.

**వెలవెలపాటు** (వై.వి.) : వైవర్ణ్యము.

**వెలవెల్లనగు** (ద్వ.అ.క్రి.) : (వెలవెల్లన + అగు) వెలవెలఁబోవు.

**వెలారించే** (దే.స.క్రి.) : వెలారుచు యొక్క రూపాంతరము.

**వెలారుచు** (దే.స.క్రి.) : (వెలి+అరుచు) 1. వెడ లించు; 2. బయలుపఱుచు. (రూ. వెలార్చు. వెడలించుటకు. బయలు పఱచుటకు.)

**వెలి** (యు.దే.వి.) : 1.బయలు; 2.బహిష్కారము; 3.దేహము యొక్క బహిఃప్రదేశము; 4. బయలుపాటు.

**వెలికత్తెర నేల** (ద్వ.వి.) : కంకరమన్ను కలిసిన భూమి.

**వెలికి** (దే.వి.) : ఒకానొక చెట్టు, గంధ పిండీతకము.

**వెలికిలు** (దే.అ.క్రి.) : 1. వీఁపు క్రిందగు; (వెలికిలఁ బడెను.) 2. వీఁపు క్రిందుగా పరుండు.

**వెలిగడ** (ద్వ.వి.) : (వెలి + కడ) మెట్టనేల.

**వెలిగారము** (వై.వి.) : (వెలి + కారము) బంగారమునకు కాంతి గలుగఁజేసెడి యొక దినుసు తెల్లని యుప్పు, టంకణము.

**వెలిగిడ్డి** (వై.వి.) : కామధేనువు.

**వెలిగుల్ల** (వై.వి.) : శంఖము.

**వెలిగొండ** (ద్వ.వి.) : (వెలి + కొండ) దూరము నందున్న పర్వతము.

**వెలిగౌరు** (ద్వ.వి.) : (ఇంద్రుని) తెల్ల యేనుఁగు, ఐరావతము.

**వెలిగ్రుక్క** (దే.వి.) : రతికూజితము, మణితము.

**వెలిచంద్ర** (ద్వ.వి.) : తెల్లచంద్ర, కదరము.

**వెలిచవి** (దే.వి.) : జారత్వము.

**వెలిచె** (దే.వి.) : పక్షి విశేషము, వర్తకము. (మొదటి రూపము వెలిచియ.)

**వెలితి** (దే.వి.) : 1.తక్కువ; 2.తఱచుఁ దనము లేమి. (విణ.) :1.తక్కువైనది; 2.తఱచుకానిది.

**వెలితిప్ప** (వై.వి.) : వెండికొండ, కైలాసము.

**వెలితుమ్మ** (ద్వ.వి.) : తెల్లతుమ్మ, విట్ఖదిరము.

**వెలిదుక్కి** (దే.వి.) : నీళ్లు కట్టక వాన తడిచే దున్నుట. (మఱియొకటి రొంపిదుక్కి.)

**వెలిపము** (దే.వి.) : వలిపము యొక్క రూపాంతరము. (సన్నని తెల్ల వస్త్రమునకు.)

**వెలిపుచ్చే** (దే.స.క్రి.) : బయలుపఱుచు.

**వెలిపెట్టు** (దే.స.క్రి.) : వెలివేయు.

**వెలిబిత్తరి** (దే.వి.) : మల్లబంధ విశేషము.

**వెలిమాడు** (దే.వి.) : విదేశములకంపఁబడు ధాన్యాదులు. (లోమాడు, విదేశ ముల నుండి తేఁబడు ధాన్యాదులు.)

**వెలిమావు** (ద్వ.వి.) : (ఇంద్రుని) తెల్ల గుఱ్ఱము, ఉచ్చైశ్రవము.

**వెలిమిడి** (ద్వ.వి.) : (వెలి+మిడుఁగు) 1. భస్మము; (చూ. ములుగు.) 2. బూడిద. (చూ.వెల్మిడి.)

**వెలిమొట్ట** (ద్వ.వి.) : మత్స్య విశేషము.

**వెలిమ్రాను** (ద్వ.వి.) : దేవతరువు, కల్పవృక్షము.

**వెలియు** (దే.అ.క్రి.) : 1. వానకురిసి నిలుచు; 2. చాయయెత్తిపోవు.

**వెలియునికి** (దే.వి.) : (వెలి + ఉనికి) పరదేశము నందలి యునికి, ప్రవాసము.

**వెలివాఁడు** (దే.వి.) : చండాలుఁడు.

**వెలివాడ** (ద్వ.వి.) : చండాలవాటిక.

**వెలివాడవాఁడు** (ద్వ.వి.) : చండాలుఁడు.

**వెలివాఱు** (దే.వి.) : వేఁటాడెడు చోట బయట చుట్టు పాటించెడు పోఁగు. (చూ. ఆరడము.)

**వెలివిరియు** (దే.అ.క్రి.) : వెల్లివిరియు యొక్క రూపాంతరము. (ఉబుకుటకు.) (చూ. పొలుపు రెండవయర్థము.)

**వెలివిసరు** (దే.అ.క్రి.) : బయలుపడు.

**వెలివేయు** (దే.స.క్రి.) : బహిష్కరించు.

**వెలిసె** (దే.వి.) : ఇంటిచూరు.

**వెలు** (దే.వి.) : వృత్తియందు వెలికి వచ్చెడు ఆదేశము. (ఉదా. వెలుపల, వెలువడు. మొ.)

**వెలుఁగు** (దే.అ.క్రి.) : 1.ప్రకాశించు; 2.జ్వలించు. (వి.) : 1.ప్రకాశము; 2. కిరణము; 3.ఎండ. (చూ. కాచు, అ.క్రి. రెండవ యర్థము.)

**వెలుఁగుఱేఁడు** (దే.వి.) : సూర్యుఁడు, త్విషాంపతి.

**వెలుఁగొందు** (దే.అ.క్రి.) : (వెలుఁగు + ఒందు) ప్రకాశించు.

**వెలుక** (ద్వ.వి.) : (వెలి + ఉక) తెల్లన. (స్వార్థమున ఉక.)

**వెలుకఁబాఱు** (ద్వ.అ.క్రి.) : (వెలుక + పాఱు) వెల్లఁబాఱు. (చూ. పాఱు.)

**వెలుగు** (దే.వి.) : లోపల పశువులు లోనగునవి చొరక తోఁట మొదలగు వాని చుట్టు ముండ్ల చెట్లు పెట్టి యెదిగించిన ఆవరణము. (రూ. వెల్గు.)

**వెలుచే** (దే.వి.) : సర్పము. (చూ. వెల్చ.)

**వెలుచే** (దే.స.క్రి.) : తోలు. (ప్రే. వెలిపించు) (ప్రే.) : 1.వెడలించు; 2.(నూలు) తోఁడు. (వెలలుచు యొక్క రూపాంతరము. రూ. వెల్చు.)

**వెలుతురు** (యు.దే.వి.) : ప్రకాశము, ఎండ. (రూ.వెల్తురు.) పూ. వెఱుతురు యొక్క రూపాంతరము.

**వెలుపల** (దే.వి.) : (వెలి + పల) బహిః ప్రదేశము. (చూ. లోపల. వి.) (చూ. వెలు.)

**వెలుపలించే** (దే.స.క్రి.) : వెలిపఱుచు. (రూ. వెల్పలించు.)

**వెలుపించే** (దే.స.క్రి.) : వెలుపుచేయు.

**వెలుపు** (దే.వి.) : వెడలుపు యొక్క రూపాంతరము.

**వెలుపుడు** (దే.వి.) : నూలువెలుచుట. (చూ. వెలుచు.)

**వెలువడుము** (దే.వి.) : సస్య విశేషము. (చూ. వరగ) బ. ధాన్య విశేషము. (చూ. వెల్వడము.)

**వెలువడు** (ద్వ.అ.క్రి.) : (వెలి + పడు) 1. బయలు పడు; 2. బయలుదేఱు. (చూ. వెలు.)

**వెలువరించే** (ద్వ.ప్రే.) : వెలువఱుచు యొక్క రూపాంతరము.

**వెలువఱుచే** (ద్వ.ప్రే.) : వెలువడఁ జేయు.

**వెల్కఁబాఱు** (ద్వ.అ.క్రి.) : వెలుకఁబాఱు యొక్క రూపాంతరము.

**వెల్చ** (దే.వి.) : వెలుచ యొక్క రూపాంతరము.

**వెల్తి** (దే.వి.విణ.) : వెలితి యొక్క రూపాంతరము.

**వెల్పల** (దే.వి.విణ.) : వెలుపల యొక్క రూపాంతరము. (చూ. వెలచు.)

**వెల్మిడి** (ద్వ.వి.) : వెలిమిడి యొక్క రూపాంతరము. (బూడిదకు.)

**వెల్ల** (వై.విణ.) : తెల్లనిది, ధవళము.

**వెల్లఁకి** (దే.వి.) : గడ్డ.

**వెల్లఁబాటు** (వై.వి.) : (వెల్ల + పాటు) వెల్లనగుట.

**వెల్లఁబాఱు** (ద్వ.అ.క్రి.) : (వెల్ల + పాఱు) వెల్లనగు, వైవర్ణ్యముఁబొందు.

**వెల్లచఱపు** (ద్వ.వి.) : సున్నపుపూఁత.

**వెల్లడి** (వై.వి.) : 1. బయలు; 2. ప్రసిద్ధి.

**వెల్లన** (వై.వి.) : తెల్లన. (విశేషణమగుచో.) (చూ. అలకన.)

**వెల్లనగు** (ద్వ.అ.క్రి.) : (వెల్లన+అగు) వెల్లఁబాఱు.

**వెల్లాటకత్తె** (ద్వ.వి.) : (వెల్లాటకము+కత్తె) జారిణి. వేశ్య. (అని కొందఱు.) (మొదటి రూపము వెల్లాట కత్తియ.)

**వెల్లాటకము** (ద్వ.వి.) : (వెల్ల+ఆటకము) ప్రసిద్ధి.

**వెల్లి** (యు.దే.వి.) : 1. ప్రవాహము; 2. పరంపర. వై. తెలుపు.

**వెల్లిక** (దే.వి.) : వెల్లి యొక్క రూపాంతరము. (ప్రవాహమునకు.)

**వెల్లిగొను** (దే.అ.క్రి.) : (వెల్లి+కొను) 1. ప్రవహించు; 2. పరంపరగా వెడలు. (చూ.ఱింగు.) (ప్రే. వెల్లి గొలుపు.)

**వెల్లివిరి** (దే.విణ.) : ప్రకటితము.

**వెల్లివిరియు** (దే.అ.క్రి.) : 1.ప్రవహించు; 2. ఉబుకు; (చూ.వెలివిరియు.) 3. వ్యాపించు; 4. ప్రకటితమగు; 5. చెదరు. (చూ. చెన్ను రెండవ యర్థము.)

**వెల్లివొడుచే** (దే.అ.క్రి.) : (వెల్లి + పొడుచు) ప్రవహించు.

**వెల్లుల్లి** (ద్వ.వి.) : (వెల్లి+ఉల్లి) తెల్లగడ్డ, లశునము.

**వెల్లువ** (దే.వి.) : 1. ప్రవాహము; 2. సేన. (ఈ యర్థముల రెంటియందునిది వాహినీ శబ్ద సమానార్థకము.) 3. ఇటికగోడల యింటిచూరు.

**వెల్లువగట్టు** (దే.అ.క్రి.) : (వెల్లువ+కట్టు) 1. ప్రవహించు; 2. మడుఁగు కట్టు.

**వెల్లెలుక** (ద్వ.వి.) : (వెల్ల + ఎలుక) తెల్లయెలుక (మొదటి రూపము వెల్లయెలుక.) (చూ. కల్లెలుక.)

**వెల్వడము** (దే.వి.) : వెలువడము యొక్క రూపాంతరము.

**వెల్వడు** (ద్వ.అ.క్రి.) : వెలువడు యొక్క రూపాంతరము.

**వెల్వెలఁబాఱు** (ద్వ.అ.క్రి.) : వెలవెలఁబాఱు యొక్క రూపాంతరము. (చూ. వెలవెలఁబాఱు.)

**వెల్వెలుకఁబాఱు** (ద్వ.అ.క్రి.) : (వెల్వెలుక + పాఱు.) మిక్కిలి వెలుకఁ బాఱు. (వెలు వెలుకఁ బాఱు యొక్క రూపాంతరము.

**వెల్వెల్ల** (వై.విణ.) : (వెల్ల+వెల్ల) మిక్కిలి వైవర్ణ్యము.

**వెస** (వై.వి.) : వేగము. (క్రి.విణ.) : శీఘ్రముగ.

**వెసనము** (వై.వి.) : వ్యసనము. (ఇది కొన్ని నిఘంటువులందు వైకృతముగా వ్రాయఁబడి యున్నది.)

**వెసల** (దే.వి.) : వంటకుండ.

**వెళ్లు** (దే.అ.క్రి.) : 1. వెడలు యొక్క రూపాంతరము; (వానిని వెళ్లఁ గొట్టెను, వాఁడు ఇల్లు వెళ్లిరాఁడు.) 2. పోవు. (నేనే ఊరికి వెళ్లి వచ్చితిని.)

# వే

**వే** (యు.దే.స.వేయి.) : (విణ.) అనేకము. (వేమాఱులు.) (వై.క్రి. విణ.) : 1. వేగముగ; 2. శీఘ్రముగ. (ఆమ్రేడితమగుచో వేవే.)

**వేంచేయు** (మి.గ్రా.అ.క్రి.) : 1. వచ్చు; 2. పోవు; 3. కూర్చుండు; 4. నివసించు. (విజయము చేయు యొక్క మాఱు రూపము.) (చూ. విజయము చేయు.)

**వేండ్రము** (దే.వి.) : తాపము. (చూ. తీండ్రము.)

**వేఁకటి** (దే.వి.) : గర్భము. (వ్రేఁకటి యొక్క రూపాంతరము.)

**వేఁకరము** (దే.వి.) : ఉపద్రవము.

**వేఁకరి** (దే.వి.) : (వ్రేఁకము+అరి) కిరాత భేదము.

**వేఁకి** (దే.వి.) : జ్వరము. (చూ. ములుగు.)

**వేఁగి** (వై.వి.) : పులి, వ్యాఘ్రము.

**వేఁగినాడు** (దే.వి.) : వేఁగీదేశము.

**వేఁగిస** (దే.వి.) : సర్జకము.

**వేఁగీ** (దే.వి.) : దేశవిశేషము.

**వేఁగు** (దే.అ.క్రి.) : తపించు. (వ్రేఁగు యొక్క రూపాంతరము.)

**వేఁచు** (దే.ప్రే.) : వేఁగఁజేయు, వేఁగించు.

**వేఁట** (దే.వి.) : 1. మృగయ; (ఇది ద్వివిధము. మృగములవేఁట, పక్షుల వేఁట. అందు మృగముల వేఁట ఏదు వేఁట, గంటవేఁట, తెరవేట అని త్రివిధము. పక్షులవేట పాదివేట, విడివేఁట అని ద్వివిధము.) 2. మేఁకపోతు; 3. పొట్టేలు.

**వేఁటకాఁడు** (దే.వి.) : బోయ, మృగయుఁడు. (విణ.) సంహారకుఁడు. (చూ.కాచు రెండవ యర్థము.)

**వేఁటకుక్క** (ద్వ.వి.) : వేఁటాడుటయందు నేర్పుగల శునకము, విశ్వకద్రువు.

**వేఁటగిరి** (దే.వి.) : వేఁటాడి జీవించెడి బోయ.

**వేఁటపల్లె** (ద్వ.వి.) : బోయపల్లె, పక్కణము. (మొదటి రూపము వేఁటపల్లియ.)

**వేఁటపిట్ట** (ద్వ.వి.) : దీమపుపిట్ట. (చూ. దీమము.)

**వేఁటరి** (దే.వి.) : (వేఁట + అరి) వేఁటకాఁడు.

**వేఁటాడు** (దే.స.క్రి.) : (వేఁట + ఆడు) 1. అడవి యందు మృగములను పక్షులను వధించు; 2.వధించు. (రూ.వేఁటలాడు.వి.వేఁటలాట.)

**వేఁడి** (దే.వి.): 1.వేఁడిమి; 2.తాపము; 3.చుఱుకు; 4. తేజము. (విణ.) 1. ఉష్ణము; 2.ఎక్కడ నున్నాఁడు. (దీనికి నీరుశబ్దము పరమగునపుడు డి వర్ణ లోపము చూపట్టెడు.)

**వేఁడికంటి** (దే.వి.) : (వేఁడి+కన్ను) శివుఁడు, ఉగ్రాక్షుఁడు.

**వేఁడిమి** (దే.వి.) : 1. వెచ్చన; 2. తాపము.

**వేఁడివెలుఁగు** (దే.వి.) : సూర్యుఁడు, ఉష్ణరశ్మి.

**వేఁడివేలుపు** (దే.వి.) : 1. సూర్యుఁడు, తపనుఁడు; 2. అగ్ని, జ్వలనుఁడు. (రూ. వేఁడివేల్పు.)

**వేఁడు** (దే.స.క్రి.) : 1.ప్రార్థించు; 2.కోరు; 3. యాచించు. (చూ.వేఁడుకోలు.) స.ఎవఁడు.

**వేఁడుకొను** (దే.స.క్రి.) : ప్రార్థించు, (రూ. వేఁడి కొను.) (చూ. వేఁడిమి.) (స్వార్థమున కొను.)

**వేఁడుకోలు** (దే.వి.) : వేఁడుకొనుట. (రూ. వేఁడికోలు.)

**వేఁత** (దే.వి.) : వ్రేఁత యొక్క రూపాంతరము.

**వేఁదుఱు** (దే.వి.) : ఉన్మాదము, ఉన్మత్తుఁడు.

**వేఁపి** (దే.వి.) : కుక్క, శునకము, సారమేయము. (ఇది వేఁగు ధాతు కృదంతము.)

**వేఁపు** (దే.వి.) : వేఁచుట, వేఁపుడు. (వ్రేఁపు యొక్క రూపాంతరము.)

**వేఁపుడు** (దే.వి.) : 1. వేఁచుట, భర్జనము; 2. వేఁచెడు చట్టి. (విణ.) : వేఁచినది.

**వేఁబోక** (దే.వి.) : వేగుఁబోక యొక్క రూపాంతరము. (చూ. పూఁబోఁడి.)

**వేకువ** (దే.వి.) : వేగుజాము, ప్రభాతము.

**వేగ** (వై.వి.) : 1.వడి; 2.త్వర. (క్రి.విణ.) : త్వరితము. (వేవేగయని ప్రయోగము.) (ఇది కుండ లోనగు వాని వంటిది.)

**సారువ** (దే.వి.) : 1.ఎక్కుటకును బరువెక్కించుటకును పొడుగుగా కట్టవలె వేయించెడి యిసుక లోనగు వానిదిబ్బ; 2. కట్ట.

**సారువా** (దే.వి.) : వర్షాకాలమునందు నీరాసరాను పండెడు పల్లపుపంట.

**సారూప్యము** (సం.వి.అ.న.) : సమాన రూపత్వము.

**సారె** (యు.దే.వి.) : 1. కూఁతునత్తగారింటికిఁ బంపునపుడు పంపెడు వరుస; 2. కుమ్మర వాని చక్రము; 3. బ. వీణెమెట్లు. మాటి మాటికి. 1. పగడసాలకాయ; 2. గోరువంక; (ఇది రెండర్థములకు నుదాహరణము) 3. పాచిక.

**సారెకు** (దే.క్రి.) : మాటిమాటికి.

**సారెసత్తు** (దే.వి.) : భక్ష్యవిశేషము, జంతిక, సంయావము.

**సార్జంటు** (ఆం.వి.) : భటులమీఁద అధికారి.

**సార్ద్రము** (సం.విణ.) : (అ.ఆ.అ.) తడిసినది, ఆర్ద్రము.

**సార్థకము** (సం.విణ.) : (అ.ఈ.అ.) సఫలము.

**సార్థము** (సం.వి.అ.పుం.) : 1. జంతు సమూహము; 2. వర్తక జన సమూహము. (విణ.) అర్థముతోఁ గూడినది.

**సార్థవాహుఁడు** (సం.వి.అ.పుం.) : వర్తకుఁడు. (విణ.) ముఖ్యుఁడు.

**సార్లా** (దే.విణ.) : అనుకూలము, సఫలము.

**సార్వభౌమము** (సం.వి.అ.పుం.) : ఉత్తరపు దిక్కునందుంచెడి యేనుఁగు.

**సార్వభౌముఁడు** (సం.వి.అ.పుం.) : సమస్త భూమిని నేలురాజు, చక్రవర్తి.

**సాల** (వై.వి.) : 1. ఇల్లు; 2. చావడి.

**సాలగ్రామము** (సం.వి.అ.పుం.) : విష్ణుమూర్తి చిహ్నిత శిలావిశేషము.

**సాలపర్ణి** (సం.వి.ఈ.స్త్రీ.) : ముయ్యాకు పొన్న. (రూ. శాలపర్ణి.)

**సాలభంజిక** (సం.వి.ఆ.స్త్రీ.) : వస్త్రదంత కాష్ఠాదుల చేత చేయఁబడిన బొమ్మ, పుత్తళిక.

**సాలము** (సం.వి.అ.పుం.) : 1. వృక్షము; 2. ప్రాకారము; 3. మద్ది.

**సాలామిశ్రీ** (దే.వి.) : ఒక మందు దినుసు.

**సాలావృకము** (సం.వి.అ.పుం.) : 1.కుక్క; 2. కోఁతి; 3. తోఁడేలు; 4. నక్క.

**సాలీఁడు** (ద్వ.వి.) : (సాలె+ఈఁడు) 1. సాలెవాఁడు; 2. సాలెపురుగు.

**సాలీయానా** (హిం.విణ.) : సంవత్సరపు. (రూ. సాల్యానా.)

**సాలు** (దే.వి.) : 1. (చూ.) రాంకవము; 2. సన్న వస్త్రము. (చూ. మెట్ట మూడవ యర్థము.)

**సాలు** (హిం.వి.) : సంవత్సరము.

**సాలువు** (దే.వి.) : సాలు యొక్క రూపాంతరము. (సన్న వస్త్రమునకు.) (చూ. సకిన నాలుగవ యర్థము.)

**సాలె** (వై.వి.) : సాలెవాని కులము.

**సాలెపట్టు** (ద్వ.వి.) : సాలెపురుగు నేసిన నేఁత, ఆశాబంధము.

**సాలెపురుగు** (వై.వి.) : బొడ్డునందలి నూలువిడిచి నేఁత నేసెడి యొక పురుగు, తంతువాయము.

**సాలెవాఁడు** (ద్వ.వి.) : నేఁత నేయు వాఁడు, తంతువాయుఁడు.

**సాలోక్యము** (సం.వి.అ.న.) : సమాన లోకత్వము.

**సాల్పడు** (ద్వ.అ.క్రి.) : (సాలు+పడు) 1.నిస్సారమగు; (చూ.ప్రే.) 2.ఒఱగు. (ప్రే. సాల్పఱుచు.)

**సావలి** (దే.వి.) : దుబుడక్కవాఁడు.

**సావలీఁడు** (దే.వి.) : దుబుడక్కవాఁడు. (స్వార్థమున ఈఁడు.)

**సావాసము** (వై.వి.) : సహవాసము, పొత్తు.

**సావాసి** (వై.వి.) : (సావాసము+ఇ) సౌవిదల్లుఁడు. (చూ. ముందు వెనుకలు.)

**సావి** (దే.వి.) : కాలము.

**సావిక** (సం.వి.ఆ.స్త్రీ.) : మంత్రసాని.

**సావిత్రము** (సం.వి.అ.పుం.) : దినము యొక్క ఐదవ భాగము. (చూ. దినము.)

**సావిత్రి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1.సరస్వతి; 2.పార్వతి; 3. సత్యవంతుని భార్య.

**సావిత్రుఁడు** (సం.వి.అ.పుం.) : 1. ఒక వసువు; (చూ. వసువు.) 2. శివుఁడు.

**సావు** (దే.వి.) : చావు యొక్క రూపాంతరము.

**సాసువులు** (దే.వి.బ.) : ఆవాలు.

**సాస్న** (సం.వి.ఆ.స్త్రీ.) : (చూ.) గంగడోలు.

**సాహసము** (సం.వి.అ.న.) : 1.తెగువ; 2. దండోపాయము.

**సాహసించే** (సం.అ.క్రి.) : సాహసము చేయు, తెగించు.

**సాహసికుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) సాహసము కలవాఁడు.

**సాహస్రము** (సం.వి.అ.న.) : సహస్రముల సమూహము.

**సాహస్రుఁడు** (సం.వి.అ.పుం.) : సహస్ర బలమునకధికారి.

**సాహాయ్యము** (సం.వి.అ.న.) : సహాయత్వము, తోడుపాటు.

**సాహిణము** (దే.వి.) : గుఱ్ఱపుశాల. (చూ. ఎకరా.)

**సాహిణి** (దే.వి.) : (సాహిణము+ఇ) గుఱ్ఱపు వాఁడు. (చూ. తలాటము.) (రూ. సాహిణీ) (దీనికి గ్రంథాంతరముల యందు ప్రయోగము మృగ్యము.)

**సాహితి** (సం.వి.ఈ.స్త్రీ.) : సాహిత్యము యొక్క రూపాంతరము.

**సాహిత్యము** (సం.వి.అ.న.) : 1. అర్థజ్ఞానము; 2. కూడిక.

**సాహు** (హిం.వి.) : సాహుకారి, వర్తకుఁడు, కొఠీదారుఁడు. (చూ. మిండకడమిండవడ్డి.)

**సాహేబు** (హిం.వి.) : ప్రభువు. (రూ. సాయిబు.)

**సాహెూ** (హిం.అవ్య.) : కటికవారు చేసెడు హెచ్చరిక.

**సాళగము** (సం.వి.అ.న.) : తిలతండుల న్యాయముననై వరాగ మేళనము.

**సాళగించు** (సం.అ.క్రి.) : మిళితమగు.

**సాళగింపు** (సం.వి.) : మేళనము. (సాళగశబ్దము సంస్కృతముగా నుండుట వలన దీనిని తత్సమ మనియే చెప్పవలెను. తత్సమక్రియ ఇంప్వం తముగా నుండుట యపూర్వము.)

**సాళువము** (దే.వి.) : శ్యేనవిశేషము. (చూ. అఱుజు.)

**సాళ్వఁడు** (దే.వి.) : సాళ్వమను డేగవలె పాటి వేఁటాడుటచే కుక్క కియ్యఁబడిన పేరు. (చూ.గబ్బి.)

**సాళ్వము** (దే.వి.) : సాళువము యొక్క రూపాంతరము.



**సింగఁడు** (వై.వి.) : 1. నృసింహుఁడు; 2. ఎఱుకు వాఁడు. (చూ. బూరఁడు.)

**సింగపుఁబీఁట** (వై.వి.) : (సింగము+పీఁట) సింహాసనము.

**సింగము** (వై.వి.) : సింహము. (చూ. పురుడించు. స.క్రి.)

**సింగళము** (వై.వి.) : సింహళద్వీపము.

**సింగాణి** (వై.వి.) :1.ఒక దినుసు విల్లు; 2.విల్లు; 3.కుక్క పేరు. (చూ.జిగురు రెండవ యర్థము.)

**సింగారపుఁదోఁట** (ద్వ.వి.) : (సింగారము + తోఁట) ఉద్యానవనము.

**సింగారము** (వై.వి.) : అలంకారము, శృంగారము.

**సింగారి** (వై.వి.) : శృంగారవతియగు ఆఁడుది.

**సింగారించు** (వై.స.క్రి.) : అలంకరించు.

**సింగి** (వై.వి.) : ఎఱుకుది.

**సింగిణి** (వై.వి.) : సింగాణి యొక్క రూపాంతరము. (రూ. సింగిణీ.)

**సింగినాదము** (వై.వి.) : పొడ దుప్పి కొమ్ముతో చేయఁబడిన యోగుల సుషిర వాద్య విశేషము. (చూ.నాగబెత్తము.) (వ్యర్థ సంభాషణకీమాట వాడుదురు.)

**సింగిలీకము** (దే.వి.) : పెద్దనల్లకోఁతి.

**సింగోట** (దే.వి.) : (చూ.) దివిదారికొమ్ము.

**సిందుకము** (సం.వి.అ.పుం.) : వావిలి, సిందువారము.

**సిందురము** (వై.వి.) : 1.సిందూరము; 2. సిందు వారవృక్షము.

**సిందువారము** (సం.వి.అ.పుం.) : వావిలి. (దీనికి దోహద క్రియముఖానిలము.)

**సిందూరము** (సం.వి.అ.న.) : చెందిరము. (పుం.) సిందువారము.

**సింధురము** (సం.వి.అ.పుం.) : ఏనుఁగు, గజము.

**సింధువు** (సం.వి.ఉ.స్త్రీ.) : ఒకానొక యేఱు. (పుం.) 1.సముద్రము; 2.ఏనుఁగు; 3. పడమరగాఁ బాఱెడి యేఱు; 4. ఒక దేశము.

**సింహద్వారము** (సం.వి.అ.న.) : తలవాకిలి.

**సింహనాదము** (సం.వి.అ.పుం.) : ఏనుఁగులు మొదలైనవి భయపడుటకై వీరులు చేసెడు ధ్వని, బొబ్బ.

**సింహపుచ్ఛి** (సం.వి.ఈ.స్త్రీ.) : నక్కతోఁక పొన్న.

**సింహము** (సం.వి.అ.పుం.) : 1. సింగము; 2. ఒక రాశి. (చూ.రాశి.); 3. (ఉత్తర పదమైనచో) శ్రేష్ఠము.

**సింహసంహననుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) సర్వాంగ సుందరుఁడు.

**సింహావలోకనము** (సం.వి.అ.న.) : శబ్దాలంకార విశేషము.

**సింహాసనము** (సం.వి.అ.న.) : సింహ ముఖ మేర్పఱచిన స్వర్ణమయమైన యున్నత పీఠము.

**సింహాస్యము** (సం.వి.అ.పుం.) : అడ్డసరము.

**సింహి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1.అడ్డసరము; 2.ములక.

**సింహుండము** (సం.వి.అ.పుం.) : జెముడు.

**సిక** (వై.వి.) : సిగ, జుట్టు.

**సికత** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.ఇసుకనేల; 2. మొరప నేల; 3. ఒకవ్యాధి; బ. 4. ఇసుక; 5.మొరము.

**సికతిలము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఇసుక గలది. (నేల.)

**సికస్తు** (హిం.విణ.) : శిథిలమయిన.

**సికా** (వై.వి.) : ముద్ర. (చూ. సికాయుంగరము.)

**సికాయుంగరము** (ద్వ.వి.) : (సికా + ఉంగరము) ముద్దుటుంగరము, మొహరు గల ఉంగరము.

**సిక్తము** (సం.విణ.) : (అ.ఆ.అ.) తడిసినది.

**సిక్థము** (సం.వి.అ.న.) : మైనము, పుం. మెతుకు.

**సిక్యము** (సం.వి.అ.న.) : ఏనుఁగు యొక్క స్తనాగ్రము నందలి మదము.

**సిగ** (వై.వి.) : సిక యొక్క రూపాంతరము.

**సిగబంతి** (ద్వ.వి.) : సిగదండ, శేఖరము.

**సిగము** (దే.వి.) : సిపమునకు మొదటి రూపము.

**సిగర** (వై.వి.) : సిగరి యొక్క రూపాంతరము. (చూ. వహి. మూడవ యర్థము.)

**సిగరము** (వై.వి.) : శిఖరము.

**సిగరి** (వై.వి.) : కొన్ని సంబారువులు చేర్చి పక్వము చేసిన మజ్జిగ. (చూ. దుంబొడి.)

**సిగ్గరి** (దే.విణ.) : (సిగ్గు + అరి) లజ్జగలవాఁడు, లజ్జగలది.

**సిగ్గరికత్తియ** (ద్వ.విణ.) : లజ్జ గలది. (రూ. సిగ్గరికత్తె.) (స్వార్థమున కత్తియ.)

**సిగ్గఱు** (దే.అ.క్రి.) : (సిగ్గు + అఱు) సిగ్గుచెడు.

**సిగ్గిఁడి** (దే.విణ.) : (సిగ్గు+ఇఁడి) లజ్జ చెడిన వాఁడు, లజ్జ చెడినది.

**సిగ్గు** (దే.వి.) : స్తుత్యాదులచేఁ గలిగెడు మనస్సంకోచము, లజ్జ.

**సిగ్గుపడు** (ద్వ.అ.క్రి.) : సిగ్గుఁజెందు, లజ్జించు.

**సిగ్గుపాటు** (ద్వ.వి.) : సిగ్గుపడుట.

**సిగ్గువోవు** (దే.అ.క్రి.) : (సిగ్గు+పోవు) సిగ్గుపడు, లజ్జించు.

**సిచయము** (సం.వి.అ.పుం.) : 1.వస్త్రము; 2. జీర్ణవస్త్రము.

**సిడము** (దే.వి.) : 1. ధ్వజము; 2. ధ్వజస్తంభము. (చూ. పడగ. మొదటి యర్థము.)

**సిడి** (దే.వి.) : 1. ఏతపుమ్రాను; 2. సిడుల జాతరకు నాటిన స్తంభము మీఁది యడ్డ మ్రాను. (ఇదిగంపసిడి, గాలపుసిడి అని ద్వివిధము.) బ. (చూ.) సిళ్లు.

**సిత** (సం.వి.ఆ.స్త్రీ.) : చక్కెర. (అ.న.ము.) తెల్ల పులుము. (పుం.) తెలుపు. (విణ.) 1. తెల్లనిది; 2.కట్టఁబడినది; 3. ముగిసినది.

**సితచ్ఛత్ర** (సం.వి.ఆ.స్త్రీ.) : సదాప.

**సితవీర్య** (సం.వి.ఆ.స్త్రీ.) జీలుగు.

**సితశివము** (సం.వి.అ.న.) : ఇందుప్పు, శీతశివము.

**సితాభ్రము** (సం.వి.అ.పుం.) : కర్పూరము, ఘనసారము.

**సితాభ్రము** (సం.వి.అ.పుం.) : కర్పూరము, ఘనసారము.

**సితుఁడు** (సం.వి.అ.పుం.) : శుక్రుఁడు. (విణ.) తెల్లనివాఁడు.

**సిద్దాయము** (వై.వి.) : వెచ్చపుసొమ్ము నందు కూడఁబెట్టిన ధనము.

**సిద్దీ** (హిం.వి.) : నీగ్రోజాతివాఁడు.

**సిద్దె** (దే.వి.) : బుంగవలె తోలుతో కుట్టిన పాత్రము. (మొదటి రూపము సిద్దియ.)

**సిద్ధము** (సం.వి.అ.పుం.) : ఒక గ్రహ యోగము. (చూ. యోగము.) (విణ.) 1. అయిత్తమైనది; 2. ఈడేఱినది; 3.ఎడతెగనిది; 4.వండఁబడినది.

**సిద్ధాంతము** (సం.వి.అ.పుం.) : 1. స్థిరమైన పక్షము; 2. నవవిధ జ్యోతిష గ్రంథములు.

**సిద్ధాంతి** (సం.వి.న్.పుం.) : 1. నవ విధ జ్యోతిష గ్రంథములను తెలిసిన వాఁడు; 2.తత్వ శాస్త్రమును తెలిసినవాఁడు.

**సిద్ధాంతీకరించు** (సం.స.క్రి.) : సిద్ధాంతము చేయు.

**సిద్ధాయము** (సం.వి.అ.పుం.) : అరి, కప్పము.

**సిద్ధార్థము** (సం.వి.అ.పుం.) : తెల్లావలు.

**సిద్ధార్థి** (సం.వి.న్.పుం.) : ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

**సిద్ధార్థుఁడు** (సం.వి.అ.పుం.) : శాక్యబుద్ధదేవుఁడు.

**సిద్ధి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. ఈడేఱుట; 2. బుద్ధియను గంధ ద్రవ్యము; 3. ఒక గ్రహయోగము. (చూ. యోగము.)

**సిద్ధించు** (సం.అ.క్రి.) : ఈడేఱు, సమకూడు.

**సిద్ధుఁడు** (సం.వి.అ.పుం.) : 1. దేవయోని విశేషము; 2. వ్యాసాది.

**సిధ్మము** (సం.వి.న్.న.) : సిబ్బెము. (విణ.) సిబ్బెము గలది.

**సిధ్మల** (సం.వి.ఆ.స్త్రీ.) : ఉప్పుఁజేఁప. (విణ.) సిబ్బెము గలది.

**సిధ్యము** (సం.వి.అ.పుం.) : పుష్యనక్షత్రము.

**సినీవాలి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. చంద్రకళ కాన వచ్చెడి యమావాస్య; 2. పార్వతి.

**సిఫాయి** (హిం.వి.) : కాలిబంటు.

**సిఫారసు** (హిం.వి.) : యోగ్యతా పత్రిక, యోగ్యతా వచనము.

**సిబ్బంది** (హిం.వి.) : బంట్రౌతులు.

**సిబ్బి** (దే.వి.) : ఇత్తడిమూఁకుడు.

**సిబ్బితి** (దే.వి.) : సిగ్గు.

**సిబ్బితికత్తె** (ద్వ.విణ.) : సిగ్గు గల ఆఁడుది.

**సిబ్బితికాఁడు** (దే.విణ.) : సిగ్గు గలవాఁడు.

**సిబ్బెము** (వై.వి.) : దేహమునందుఁ గలిగెడి యొక దినుసు పొడ. (మొదటి రూపము సిబ్బియము.)

**సిర** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. నాడి; 2. ఈనె.

**సిరంగఁడు** (వై.వి.) : శ్రీరంగనాథుఁడు.

**సిరంగము** (వై.వి.) : శ్రీరంగక్షేత్రము. (చూ. సిరంగఁడు.)

**సిరము** (ఉభ.వై.వి.) : తల. (సం.వి.అ.పుం.) పిప్పలికట్టె.

**సిరస్తాదారు** (హిం.వి.) : లెక్కలు చూచువారికి పై యుద్యోగస్థుఁడు.

**సిరా** (హిం.వి.) : వ్రాయుటకు వినియోగించు ద్రవము.

**సిరాజి** (దే.వి.) : దేశ విశేషము. (చూ. నారాజి.) (రూ. సిరాజీ.)

**సిరాణము** (దే.వి.) : ఆయుధ విశేషము.

**సిరి** (వై.వి.) : 1. లక్ష్మి; 2. సంపద; 3. శోభ.

**సిరిగందము** (వై.వి.) : 1. శ్రీచందనము; (చూ. చిలచిల.) 2. శ్రీచందనవృక్షము.

**సిరిగట్టు** (వై.వి.) : ఒక పర్వతము, శ్రీశైలము.

**సిరిచూలి** (ద్వ.వి.) : మన్మథుఁడు, శ్రీపుత్రుఁడు.

**సిరిమంతుఁడు** (వై.విణ.) : శ్రీమంతుఁడు.

**సిరిసింగణావత్తి** (ద్వ.వి.) : బాలక్రీడా విశేషము. (చూ. కుందెనగుడి.) (రూ. సిరిసింగణాలవత్తి.)

**సిలాజిత్తు** (వై.వి.) : అంగడిమందు దినుసు.

**సిలుగు** (దే.వి.) : ఉపద్రవము.

**సిలువ** (దే.వి.) : క్రీస్తును బంధించి వధించిన కొఱ్ఱు.

**సిల్హము** (సం.వి.అ.పుం.) : ధూప ద్రవ్య విశేషము, చిల్లమడ్డి.

**సివఁగి** (దే.వి.) : 1. సివ్వఁగి యొక్క రూపాంతరము; 2. సివఁగి వలె నుండుటచే కుక్కకియ్యఁబడిన పేరు. (చూ. గబ్బి.) (చూ. సివ్వఁగి.) (రూ. చివఁగి.)

**సివము** (దే.వి.) : దేవతావేశము.

**సివాయి** (హిం.అవ్య.) : తప్ప, కాక.

**సివారు** (హిం.విణ.) : గ్రామమునకు చేరియుండు.

**సివిలు** (ఆం.విణ.) : ఆస్తివిషయమైన.

**సివ్వఁగి** (దే.వి.) : ఒకానొక మృగము, తరక్షువు.

**సిసల్** (హిం.విణ.) : నిర్ధారణమైన.

**సిసువు** (వై.వి.) : పసిబిడ్డ, శిశువు.

**సిసృక్ష** (సం.వి.ఆ.స్త్రీ.) : సృజింపనిచ్ఛ.

**సిసృక్షువు** (సం.విణ.) : (ఉ.) సృజింప నిచ్ఛ గలవాఁడు.

**సిసృప్స** (సం.వి.ఆ.స్త్రీ.) : పోవనిచ్ఛ.

**సిసృప్సువు** (సం.విణ.) : (ఉ.) పోవనిచ్ఛ గలవాఁడు.

**సిస్తు** (దే.విణ.) : 1. అందము; 2. వి. పన్ను. (మొదటి రూపము సిదులు.)

**సిళ్ళు** (దే.వి.బ.) : (ఏనుగును పొడిచెడి) బరిగోల.

## సీ

**సీ** (వై.వి.) : శ్రీ.

**సీకాయ** (దే.వి.) : నూనెజిడ్డును పోఁగొట్టెడి యొకానొక కాయ.

**సీకారి** (వై.వి.) : పాటపాడువాఁడు, గాయకుఁడు. (చూ. వాసె.)

**సీకు** (ఆం.విణ.) : ఆరోగ్యములేని.

**సీత** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. శ్రీరాముని భార్య; 2. నాఁగటి చాలు; 3. గంగ.

**సీతభేది** (దే.వి.) : ఆమవిరేచనము.

**సీతాకోకచిలుక** (దే.వి.) : చిత్రవర్ణము గలిగి చేటలవలె నుండు పెద్ద ఱెక్కలుగల యొక పురుగు.

**సీతాఫలము** (సం.వి.అ.న.) : ఒకానొక పండు.

**సీతాభోగములు** (సం.వి.అ.పుం.బ.) : శాలిధాన్య విశేషము.

**సీతు** (వై.వి.) : 1. చలి; 2. చలికాలము. (చూ. వానరెండవ యర్థము.)

**సీతువు** (వై.వి.) : సీతు యొక్క రూపాంతరము.

**సీత్కారము** (సం.వి.అ.న.) : చలి లోనగువాని వలని బాధచేఁ గలిగెడు ధ్వని విశేషము.

**సీత్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఒకసారి దున్నినది. (నేల.)

**సీదరము** (యు.దే.వి.) : దారిద్ర్యము. (వై.) 1. సర్పము; (చూ. సీద్రము) 2. సర్పకంచుకము. (ఇది దారిద్ర్యమునకును సర్పకంచుకమునకు నుదాహరణము.)

**సీద్రము** (యు.వి.) : సీదరము యొక్క రూపాంతరము. (సర్పమునకు.)

**సీమ** (ఉభ.దే.వి.) : 1. దేశము; 2. ప్రదేశము; 3. రాజ్యము. 1. ఎల్ల; (దేశసీమ, గ్రామసీమ, క్షేత్రసీమ, గృహసీమ అని సీమచతుర్విధము.అది అయిదు విధములైన చిహ్నములు గలది.) (వృక్షము లోనగునవి చిహ్నముగాఁగలది) (తటాకాది జలస్థానము చిహ్నముగా ఁగలది) (తుషాంగారాది నిధానము చిహ్నముగాఁగలది) భయవర్జిత, అభిజ్ఞానము కొఱకు అర్థి ప్రత్యర్థులేర్పఱచిన చిహ్నము గలది.) (రాజు స్వేచ్ఛచే నిర్మించిన చిహ్నము గలది.) 2. పెడతల; 3. వరిమడి.

**సీమంతము** (సం.వి.అ.పుం.) : 1. పాపట; 2. సీమంతోన్న యనము.

**సీమంతిని** (సం.వి.ఈ.స్త్రీ.) : ఆఁడుది, ఇంతి, వనిత.

**సీమాటి** (వై.వి.) : భాగ్యశాలిని యైన యాఁడుది.

**సీరపాణి** (సం.వి.ఇ.పుం.) : బలరాముఁడు, నాఁగటి జోదు.

**సీరము** (సం.వి.అ.పుం.) : నాఁగలి, హలము.

**సీరి** (సం.వి.న్.పుం.) : బలరాముఁడు, నాఁగటిజోదు.

**సీల** (దే.వి.) : చీల యొక్క రూపాంతరము.

**సీలమండ** (దే.వి.) : చీలమండ యొుక్క రూపాంతరము.

**సీవనము** (సం.వి.అ.న.) : (బట్ట) కుట్టుట.

**సీవిరి** (దే.వి.) : 1. వింజామరము; 2. ఆలవట్టము. (ఇక్కడ వ్యజన శబ్దమునక ఆలవట్ట మర్థము.)

**సీసకము** (ఉభ.దే.వి.) : 1. కిరీటము; 2. మల్లబంధ విశేషము. (చూ. కుదికలు.) (సం.అ.న.) సీసము.

**సీసము** (ఉభ.దే.వి.) : మల్లబంధ విశేషము.

**సీసా** (హిం.వి.) : బుడ్డి.



**సు** (సం.) : (ఉపసర్గము) మంచి, మిక్కిలి అను నర్థములను తెలుపునది. (ఉదా. సుగుణము, సునాయాసము. మొ.)

**సుంకము** (వై.వి.) : 1. కొన్ని అమ్ముడు సరకులకుఁ గాను దొరతనము వారికిచ్చెడు పన్ను; (వృత్తి యందు వికల్పముగ అంత్యవర్ణ లోపము. ఉదా. సుంకసరకు.) 2. ప్రతిబంధము.

**సుంకరి** (ద్వ.వి.) : (సుంకము + అరి) సుంకము తీయువాఁడు.

**సుంకరీఁడు** (ద్వ.వి.) : (సుంకరి + ఈఁడు) సుంకము తీయువాఁడు.

**సుంకీఁడు** (ద్వ.వి.) : (సుంకము + ఈఁడు) సుంకము తీయువాఁడు.

**సుంకు** (యు.దే.వి.) : 1. జొన్నలోనగు వాని కంకిమీఁది పూత; 2. పెండ్లి యందు పళ్లెరమునఁ బోసి వధూవరుల మీఁద చెరుగు బియ్యము. (వై.) ప్రతిబంధము.

**సుంకేసలము** (దే.వి.) : వృక్షవిశేషము.

**సుంత** (దే.విశ.) : ఇంచుక. (ఇసుమంత యొక్క మాఱు రూపము.)

**సుందరి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. చక్కని యాఁడుది; 2. ఆఁడుది.

**సుందరుఁడు** (సం.విశ.) : (అ.ఆ, ఈ.అ.) చక్కనివాఁడు.

**సుకందకము** (సం.వి.అ.పుం.) : 1. నీరుల్లి; 2. మట్టుకాఁకర.

**సుకత** (సం.వి.ఆ.స్త్రీ.) : సాధువుకాని యావు, ఒట్టియ.

**సుకము** (వై.వి.) : సౌఖ్యము, భోగము.

**సుకర** (సం.వి.ఆ.స్త్రీ.) : సాధువైన యావు. (విశ.) సులభము.

**సుకర్మము** (సం.వి.న్.న.) : మంచిపని. (పుం.) ఒక గ్రహయోగము. (చూ. యోగము.)

**సుకలుఁడు** (సం.విశ.) : (అ.ఆ.అ.) దాతయు భోక్తయు నైనవాఁడు.

**సుకవాసి** (వై.విశ.) : కష్టపడక సుఖముగ నుండువాఁడు.

**సుకారి** (దే.వి.) : ఎద్దులమీఁద సరకెత్తించుకొని యూరూరు తిరిగి వర్తకము చేసెడి యొక నీచజాతి.

**సుకిని** (వై.వి.) : సుఖవతి.

**సుకియ** (దే.వి.) : భక్ష్యవిశేషము. (చూ. ఔఁగు.)

**సుకుమారము** (సం.వి.అ.పుం.) : పుండ్రేక్షువు. (విశ.) కోమలము.

**సుకృతము** (సం.వి.అ.న.) : 1. పుణ్యము; 2. శుభము. (విశ.) చక్కగాఁ జేయఁబడినది.

**సుకృతి** (సం.విశ.) : (న్.ఈ.న్.) 1. పుణ్యవంతుఁడు; 2. భాగ్యవంతుఁడు.

**సుక్కురుఁడు** (వై.వి.) : శుక్రుఁడు.

**సుఖ** (సం.వి.ఆ.స్త్రీ.) : వరుణుని పట్టణము. (అ.న.ము.) : 1. సౌఖ్యము; 2. స్వర్గము. (విశ.) సౌఖ్యము గలది.

**సుఖవర్చకము** (సం.వి.అ.పుం.) : సజ్జాకారము.

**సుఖవాసి** (సం.వి.న్.పుం.) : కారుబుడమ. (విశ.) సుకవాసి.

**సుఖి** (సం.వి.న్.పుం.) : యతి. (విశ.) సుఖము గలవాఁడు.

**సుఖించు** (సం.అ.క్రి.) : సుఖపడు.

**సుగంధి** (సం.వి.ఇ.పుం.) : నూఁగుదోస. (విణ.) ఇంపైన వాసనఁగలది.

**సుగంధిమూల** (సం.వి.ఆ.స్త్రీ.) : మావలి.

**సుగతుఁడు** (సం.వి.అ.పుం.) : బుద్ధదేవుఁడు.

**సుగము** (వై.వి.) : సుకము యొక్క రూపాంతరము.

**సుగుడి** (దే.విణ.) : సరసుఁడు.

**సుగ్గడితము** (దే.విణ.) : తఱచు నేఁత గలది. (వస్త్రము.)

**సుగ్రీవుఁడు** (సం.వి.అ.పుం.) : ఒక వానరుఁడు. (విణ.) మంచి మెడ గలవాఁడు.

**సుచకము** (సం.వి.అ.పుం.) : మొఱిఁగెడి కుక్క.

**సుచరిత్ర** (సం.వి.ఆ.స్త్రీ.) : పతివ్రత, క్రొత్తడి.

**సుచేలకము** (సం.వి.అ.పుం.) : సన్నకోక, వలిపము. (విణ.) మంచి వస్త్రము కలది.

**సుజనుఁడు** (సం.వి.అ.పుం.) : 1. ఇంద్రుని సారథి; 2. మంచి మనుష్యుఁడు.

**సుడాలము** (సం.వి.అ.పుం.) : అశ్వధారా విశేషము. (చూ. మురళి రెండవ యర్థము.)

**సుడి** (దే.వి.) : 1. జలావర్తము; 2. రోమావర్తము; 3. అనిలావర్తము.

**సుడిఁబడు** (ద్వ.అ.క్రి.) : (సుడిఁ + పడు) సుడివడు యొక్క రూపాంతరము.

**సుడిగట్టు** (ద్వ.వి.) : చక్రవాళపర్వతము.

**సుడిగాలి** (దే.వి.) : సుడియుగాలి, వాత్య.

**సుడిగొట్టు** (దే.వి.) : గాలి, వాయువు.

**సుడిగొను** (దే.స.క్రి.) : (సుడి+కొను) చుట్టుకొను. (ప్రే. సుడిగొలుపు.) (ఆమ్రేడితమగుచో సుడిసుడి గొను = మిక్కిలి సుడిగొను.) (చూ. తోఁక.)

**సుడిగోరు** (ద్వ.వి.) : తంతిమీటుటకు బంగారు లోనగు వానితో చేసి వ్రేలికి వేసికొనెడు గోరు.

**సుడియ** (దే.వి.) : తములపాకుల బరువునందు సగము. (విణ.) తులువ.

**సుడియు** (దే.అ.క్రి.) : 1. చుట్టిచుట్టి వీచు; 2. చుట్టుకొను.

**సుడివడు** (ద్వ.అ.క్రి.) : (సుడి + పడు) 1. చుట్టుకొను; 2. కలఁతపడు; 3. చలించు.

**సుడివాలు** (ద్వ.వి.) : చక్రాయుధము. (ఇట్లు సుడికయిదువు. మొ.)

**సుడివోవు** (దే.అ.క్రి.) : (సుడి+పోవు) వ్యర్థమగు.

**సుడుము** (దే.వి.) : నూఱుగొట్టెల గుంపు. కంటకాది భారము. (అని కొందఱు.)

**సుత** (ఉభ. దే.అవ్య.) : ప్రభృత్యర్థకము, మొదలు కొని. (అదిసుత, నాటిసుత. మొ.) (సం.వి.) (ఆ.స్త్రీ.) కూఁతురు.

**సుతనువు** (సం.వి.ఉ.స్త్రీ.) : 1.కోమలమైన దేహము గల ఆఁడుది; 2. ఆఁడుది.

**సుతరాం** (గ్రా.అవ్య.) : బొత్తుగా, ఎంతమాత్రము. (రూ. సుతలాం.)

**సుతశ్రేణి** (సం.వి.ఈ.స్త్రీ.) : ఎలుకచెవి, మూషగపర్ణి.

**సుతి** (వై.వి.) : 1.షడ్జాది స్వరారంభ కావయవ మైన హ్రస్వ మాత్రక శబ్ద విశేషము; 2. కంఠ స్వరాదులకు సహాయమగు తంత్రిలోనగు వాని ధ్వని.

**సుతికాఁడు** (ద్వ.వి.) : సుతిపోయు వాఁడు.

**సుతుఁడు** (సం.వి.అ.పుం.) : 1.కొడుకు; 2.రాజు.

**సుత్తె** (దే.వి.) : దాగలిమీఁద బంగారు లోనగు వాని నుంచి సాఁగఁగొట్టెడు కారువుల సాధన విశేషము, తాడఘు. (మొదటి రూపము సుత్తియ.)

**సుత్య** (సం.వి.ఆ.స్త్రీ.) : సోమలతను కొట్టి పిడుచుట, సోమపానము. (అని కొందఱు.) 2. స్నానము.

**సుత్రాముఁడు** (సం.వి.న్.పుం.) : ఇంద్రుఁడు.

**సుత్వుఁడు** (సం.వి.న్.పుం.) : యజ్ఞము నందు సోమలతను కొట్టి పిడిచిన వాఁడు.

**సుద** (దే.వి.) : తుద, కొన, కడ.

**సుదతి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. చక్కని పలువరుసగల ఆఁడుది; 2. ఆఁడుది.

**సుదర్శనము** (సం.వి. అ.న.) : అమరావతీ పట్టణము. (పుం.) 1. విష్ణు చక్రము; 2. మేరు పర్వతము నందలి నేరేడు.

**సుదాయము** (సం.వి.అ.పుం.) : పెండ్లియందు అల్లునికి ఆఁడుబిడ్డకు నిచ్చెడి అరణము.

**సుదూరము** (సం.విణ.) : (అ.ఈ.అ.) మిక్కిలి దవ్వు ఎడదవ్వు.

**సుద్ద** (వై.వి.) : తెల్లమన్ను, శ్వేతమృత్తిక.

**సుద్దగించే** (వై.స.క్రి.) : బంగారు లోనగువానిని సుత్తెతో మిట్టపల్లములు లేక సుద్దపఱచు.

**సుద్దము** (వై.విణ.) : నిర్దోషము.

**సుద్ది** (వై.వి.) : 1. వృత్తాంతము; 2. పరిశుద్ధి; 3. మాట.

**సుద్దిగాఁడు** (ద్వ.వి.) : (సుద్ది + కాఁడు) పరిశుద్ధుఁడు.

**సుద్దిచేయు** (వై.స.క్రి.) : శుద్ధిపఱచు.

**సుధ** (సం.వి.ఆ.స్త్రీ.) :1.అమృతము; 2.పాలు; 3.సున్నము; 4. జెముడు; 5. చాఁగ; 6.ఇటిక.

**సుధర్మ** (సం.వి.ఆ.స్త్రీ.న్.పుం.) : దేవసభ.

**సుధాంశువు** (సం.వి.ఉ.పుం.) : చంద్రుఁడు.

**సుధాకరుఁడు** (సం.వి.అ.పుం.) : చంద్రుఁడు.

**సుధి** (సం.వి.ఈ.పుం.) : విద్వాంసుఁడు, చదువరి.

**సునాభము** (సం.వి.అ.పుం.) : తెల్లగినియ.

**సునాయాసము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మిక్కిలి సులభము.

**సునాసీరుఁడు** (సం.వి.అ.పుం.) : ఇంద్రుఁడు.

**సునామణి** (హిం.వి.) : చదివి వినిపించుట.

**సునిషణ్ణకము** (సం.వి.అ.న.) : నీరుచెంచలి.

**సున్న** (వై.వి.) : 1. అనుస్వారము; 2. అభావము; 3. మణిదోష విశేషము.

**సున్నగిల్లు** (వై.అ.క్రి.) : గుండ్రమగు. (రూ. సున్నగిలు.)

**సున్నతి** (హిం.వి.) : శిశ్నముకొన తోలును ఛేదించుట. ఇది మహమ్మదీయుల, యోహూదీయుల యాచారము.

**సున్నపుఁగాయ** (ద్వ.వి.) : (సున్నము + కాయ) సున్నముంచు కొనెడు కరండము.

**సున్నము** (వై.వి.) : తెల్లని యొకదినుసు కారపు వస్తువు. (ఒక దినుసు రాతినిగాని, శంఖమును గాని, నీటి గుల్లనుగాని, ముత్యపు చిప్పను గాని, ముత్యమునుగాని కాల్చి దీనిని చేయుదురు.)

**సున్ని** (వై.వి.) : నలుఁగునకై పచ్చి పెసలులోనగు వాని విసరిచేసిన పొడి.

**సున్నితము** (వై.విణ.) : కచ్చితము.

**సుపథము** (సం.వి.న్.పుం.) : సత్పథము, మంచిత్రోవ.

**సుపర్ణ** (సం.వి.ఆ.స్త్రీ.) :1. గరుత్మంతుని తల్లి; 2.తామరతీఁగ. (అ.పుం.ము.) 1.పాలపిట్ట; 2.ఱేల.

**సుపర్ణుఁడు** (సం.వి.అ.పుం.) : గరుత్మంతుఁడు, గరుడుఁడు.

**సుపర్వుఁడు** (సం.వి.న్.పుం.) : వేలుపు, దేవత.

**సుపాణి** (వై.వి.) : 1. (ముత్యము నందలి) శుభ్రమైన నీరు; 2. శుభ్రమైన నీరు గల ముత్యము. (సుప్పాణి యొక్క రూపాంతరము.)

**సుప్తి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. నిద్ర; 2. నిద్ర యందలి వధము; 3. తిమ్మిరి.

**సుప్తుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) నిద్రించిన వాఁడు.

**సుప్పాణి** (వై.వి.) : (సుప్ప+పాణి) (చూ.) సుపాణి.

**సుప్రతిష్ఠ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఒక ఛందస్సు. (చూ. ఛందస్సు)

**సుప్రతీకము** (సం.వి. అ.పుం.) : ఈశాన్యపు దిక్కు నందలి యేనుఁగు. (విణ.) మంచి యవయవములు గలది.

**సుప్రలాపము** (సం.వి.అ.పుం.) : మంచిమాట.

**సుబా** (హిం.వి.) : రాజ్యమునందొక గొప్ప భాగము.

**సుబాణము** (దే.వి.) : ఒక దినుసు పిరంగి.

**సుబ్బు** (దే.అ.క్రి.) : బయలుపడు.

**సుబేదారు** (హిం.వి.) : 1. సుబాకు ప్రభువు; 2. సేనలో నొక యధికారి.

**సుబ్రహ్మణ్యుఁడు** (సం.వి.అ.పుం.) : కుమారస్వామి.

**సుభగ** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. మనోహరురాలు; 2. భాగ్యవంతురాలు.

**సుభద్ర** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.అర్జునుని భార్య; 2.గుమ్మడి. (అ.పుం.ము.) స్వర గ్రామ నామ విశేషము.

**సుభిక్ష** (సం.వి.ఆ.స్త్రీ.) : ఆరెపువ్వు. (విణ.ము.) సులభ భిక్షము కలది. (దుర్భిక్షము లేనిది యనుట.)

**సుమంగలి** (సం.వి.ఈ.స్త్రీ.) : ముత్తయిదువ, సువాసిని.

**సుమనము** (సం.వి.ఆ.పు.) : గోదుమలు.

**సుమనస్సు** (సం.వి.స్.స్త్రీ.) : 1.పువ్వు; 2.జాజి. (పుం.) 1. వేలుపు; 2. విద్వాంసుఁడు.

**సుమనోరజము** (సం.వి.స్.న.) : పుప్పొడి.

**సుమము** (సం.వి.అ.న.) : కుసుమము, పువ్వు.

**సుమారు** (హిం.వి.) : కొంచెమెచ్చు తగ్గు.

**సుమాళము** (దే.వి.) : సంతోషాదుల వలనఁ గలిగెడు పారవశ్యము, ఆవేశము.

**సుమాళి** (దే.విణ.) : (సుమాళము+ఇ) సుమాళము గలవాఁడు. (చూ. తనకలి. విణ. రెండవ యర్థము.)

**సుమాళించు** (దే.అ.క్రి.) : సుమాళమునొందు.

**సుముఖుఁడు** (సం.వి.అ.పుం.) : 1. గరుత్మంతుని కొడుకు; 2. ఒక నాగ కుమారుఁడు; 3.విఘ్నేశ్వరుఁడు; 4. విద్వాంసుఁడు. (విణ.) చక్కని ముఖము గలవాఁడు.

**సుమేరువు** (సం.వి.ఉ.పుం.) మేరుపర్వతము.

**సుర** (ఉభ.దే.వి.) 1. గాలిసుడి; (చూ. సురగాలి, అవచాటము.) 2. గాలి. (చూ. సురఁటి, సురమాలి) (విణ.) పెద్ద. (చూ. సురమాయి.) (సం.ఆ.స్త్రీ.) 1. మద్యము; 2. మద్యపానము చేసెడు గిన్నె. (అ.పుం.బ.) వేలుపులు.

**సురంగ** (సం.వి.ఆ.స్త్రీ.) : (అ.పుం.ము.) సొరంగము. (అ.పుం.) ఒక దినుసు పూఁజెట్టు.

**సురఁటి** (దే.వి.) : (సుర+అంటు) వట్రువ విసనకఱ్ఱ.

**సురకాని** (ద్వ.వి.) : కానిలో నాల్గవ భాగము. (ఇక్కడ సుర శబ్దమునకు వ్యతిరేక లక్షణచే చిన్నయని యర్థము.)

**సురకొలి** (దే.వి.) : ఒక దినుసు పిరంగి.

**సురగవి** (సం.వి.ఈ.స్త్రీ.) : కామధేనువు, వేల్పుటావు.

**సురగాలి** (దే.వి.) : సుడిగాలి. (చూ. చొరుగు.) (ఇట్లు సురకరువలి.)

**సురజ్యేష్ఠుఁడు** (సం.వి.అ.పుం.) : బ్రహ్మ, వేలుపుఁబెద్ద.

**సురటి** (సం.వి.ఈ.స్త్రీ.) : రాగవిశేషము.

**సురతము** (సం.వి.అ.న.) : స్త్రీ పురుషుల కలయిక.

**సురతాణి** (వై.వి.) : 1. ఇంద్రుఁడు; 2. ఇంద్రాణి.

**సురతుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) దయ గలవాఁడు.

**సురదీర్ఘిక** (సం.వి.ఆ.స్త్రీ.) : ఆకాశగంగ, వేల్పుటేఱు.

**సురద్విషుఁడు** (సం.వి.ష్.పుం.) : అసురుఁడు, వేల్పుదాయ. (ఇట్లు సురారి. మొ.)

**సురనిమ్నగ** (సం.వి.ఆ.స్త్రీ.) : ఆకాశగంగ, వేల్పుటేఱు.

**సురపతి** (సం.వి.ఇ.పుం.) : ఇంద్రుఁడు, వేల్పుఱేఁడు.

**సురపాది** (దే.వి.) : ఒకానొక చెట్టు, కాకాంగము.

**సురపున్నాగము** (సం.వి.అ.పుం.) : సురపొన్న.

**సురపొన్న** (వై.వి.) : ఒక దినుసు పొన్న.

**సురభి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. కామధేనువు; 2. ఆవు; 3. అందుగు; 4. మురయనెడు గంధ ద్రవ్యము. (న.) 1.బంగారు; 2.వాసన గల కలువ. (పుం.) 1వసంత ఋతువు; 2. చైత్ర మాసము; 3. సంపెఁగ; 4.జాజికాయ. విణ. 1.మంచివాసన గలది; 2.మనోజ్ఞ మయినది.

**సురభిళము** (సం.విణ.) : (అ.ఆ.అ.) మంచివాసన గలది.

**సురభీకరించు** (సం.స.క్రి.) : వాసన కలదానిఁగాఁ జేయు.

**సురమాయి** (దే.విణ.) : మిక్కిలి నల్లనిది. (దీనికి వృత్తియందు వికల్పముగా అంత్య వర్ణ లోపము.)

**సురమాలి** (దే.విణ.) : గాలినించినది. (చూ. బాలీసు.)

**సురర్షి** (సం.వి.ఇ.పుం.) : నారదాది దేవఋషి.

**సురలోకము** (సం.వి.అ.పుం.) : స్వర్గము, వేల్పుఁబ్రోలు.

**సురవర్త్మ ము** (సం.వి.న్.న.) : ఆకాశము, వేలుఁదెరువు.

**సురస** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.నాగమాత; 2.సర్పాక్షి. (అ.న.ము.) నల్లగగ్గెర. విణ. తియ్యనిది.

**సురాచార్యుఁడు** (సం.వి.అ.పుం.) : బృహస్పతి, వేల్పుటొజ్జ.

**సురామండము** (సం.వి.అ.న.) : కల్లుతేట, కల్లుమీఁగడ. (అని కొందఱు.)

**సురాలయము** (సం.వి.అ.పుం.) : మేరుపర్వతము.

**సురాష్ట్రజము** (సం.వి.అ.పుం.) : 1. తొగరి; 2. తొగరిమన్ను; 3. అడవి తొగరి తీఁగె.

**సురాళము** (దే.వి.) : 1. భూతాద్యావేశ జనితశిరోభ్రమణము; 2. కోపావేశము.

**సురాళించు** (దే.స.క్రి.) : (దృష్టిదోష పరిహారార్థము.) దిగఁదుడుచు.

**సురిగ** (దే.వి.) : చిన్నకొమ్మ, ఉపశాఖ.

**సురిగి** (దే.వి.) : ఒకానొక చెట్టు.

**సురియ** (వై.వి.) : చురకత్తి.

**సురియాళు** (ద్వ.వి.) : (సురియ+ఆళు) మాలవాఁడు. (ఇందు ఉత్తరపదము అరవము.)

**సురుఁగు** (దే.అ.క్రి.) : 1. అదృశ్యమగు; 2. పాఱు; 3. జాడఁగాఁబోవు; 4. చలించు. (చూ. ఉత్తరార్థము.) (చూ. ప్రబ్బ.)

**సురుగుడు** (దే.వి.) : ఒకానొక యెఱ్ఱచాయ చెక్క చెట్టు.

**సురుడు** (దే.వి.) : దివటీకి మాఱుగా కాల్చి పట్టుకొనెడు వెలుతురు కట్టెల కట్ట.

**సురుమా** (హిం.వి.) : ఒక విధమైన కాటుక, అంజనము.

**సురుము** (దే.వి.) : పొడి, చూర్ణము.

**సురూపుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. చక్కనివాఁడు; 2. విద్వాంసుఁడు.

**సురె** (వై.వి.) : సురియ యొక్క రూపాంతరము.

**సురెయాళు** (ద్వ.వి.) : సురియాళు యొక్క రూపాంతరము.

**సురేకారము** (ద్వ.వి.) : ఒకదినుసు ఉప్పు.

**సురోదము** (సం.వి.అ.పుం.) : కల్లుసముద్రము.

**సుఱసుఱ** (దే.వి.) : స్రుక్కుట యందగు ధ్వన్యనుకరణము.

**సులభము** (సం.విణ.) : (అ.ఆ.అ.) సుఖముగా లభించునది. (సులభము కానిది దుర్లభము.)

**సులువు** (వై.విణ.) : చులకనైన.

**సులోచనము** (సం.వి.అ.న.) : ముక్కద్దము.

**సుల్తాను** (హిం.వి.) : తురుష్కప్రభువు.

**సువర్చల** (సం.వి.ఆ.స్త్రీ.) : నింగిమిరి.

**సువర్ణకము** (సం.వి.అ.పుం.) : ఱేల, కృతమాలము.

**సువర్ణము** (సం.వి.అ.న.) : 1.బంగారు; 2. మాడ; 3. ధనము; 4. ఒకపువ్వు; 5. నల్ల అగలు. (విణ.) మంచి వర్ణము గలది.

**సువల్లి** (సం.వి.ఈ.స్త్రీ.) : కారుగచ్చ.

**సువహ** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.అందుగు; 2.కారేలకి; 3. చెప్పుతట్ట; 4. నల్లవావిలి; 5.సర్పాక్షి; 6. వీణె. (విణ.) సుఖముగ మోపఁదగినది.

**సువారము** (వై.వి.) : వంట.

**సువాల** (ద్వ.వి.) : సువ్వాల యొక్క రూపాంతరము. (చూ. అల్లొనేరెడు మూడవయర్థము.)

**సువాసిని** (సం.వి.ఈ.స్త్రీ.) : పేరంటాలు.

**సువ్రత** (సం.వి.ఆ.స్త్రీ.) : సులభముగా పిదుకఁదగిన యావు. (విణ.) మంచి వ్రతము గలది.

**సువ్వలాల** (ద్వ.వి.) : (సువ్వి + ఆలతి + ఆలతి) సువ్వాల.

**సువ్వాల** (ద్వ.వి.) : (సువ్వి + ఆలతి) ఆఁడువారు పెండ్లిండ్ల యందు సువ్వి యను పదముతో ఆలాపము చేసి పాడెడు పాట.

**సువ్వి** (దే.వి.) : దంచుట యందగు ధ్వన్యనుకరణము.

**సుషమ** (సం.వి.ఆ.స్త్రీ.) : మిక్కిలి శోభ. (విణ.) 1.మనోజ్ఞమైనది; 2. సరి సమానమైనది.

**సుషవి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. కాఁకర; 2. జీలకఱ్ఱ; 3. నల్లజీలకఱ్ఱ. (రూ. సుశవి.)

**సుషి** (సం.వి.ఇ.స్త్రీ.) : బెజ్జము, రంధ్రము.

**సుషిమము** (సం.వి.అ.న.) : చల్లన. (విణ.) చల్లనిది. (రూ. సుశిమము.)

**సుషిర** (సం.వి.ఆ.స్త్రీ.) : గువ్వగుత్తిక. (అ.న.ము.) 1. బెజ్జము; 2. పిల్లంగ్రోవి లోనగు వాద్యము. (పుం.) కిక్కస. (విణ.) బెజ్జము గలది.

**సుషుప్తి** (సం.వి.ఇ.స్త్రీ.) ఒళ్లెఱుఁగని నిద్ర. (ఇది త్ర్యవస్థలలో నొకటి. చూ. అవస్థ.)

**సుషుమ్న** (సం.వి.ఆ.స్త్రీ.) : ఒక నాడి. (చూ. నాడి.)

**సుషేణము** (సం.వి.అ.పుం.) : కలివి.

**సుషేణిక** (సం.వి.ఆ.స్త్రీ.) : నల్లతెగడ.

**సుస్తి** (హిం.వి.) : సోమరితనము.

**సుహృదుఁడు** (సం.వి.ద్.పుం.) : చెలికాఁడు.

**సుళువు** (వై.విణ.) : సులభము. (రూ. సులువు.)

**సుళ్లమారి** (దే.విణ.) : 1. సుడులు గలవాఁడు; 2. చుట్లఁబెట్టు వాఁడు. (ఇది రెండర్థములకు నుదాహరణము.)

## సూ

**సూకరము** (సం.వి.అ.పుం.) : పంది, వరాహము.

**సూక్ష్మము** (సం.వి.అ.న.) : 1. అధ్యాత్మము; 2.కపటము. (పుం.) అణువు. (విణ.) సున్నము.

**సూచకము** (సం.వి.అ.పుం.) : 1.సూది; 2.నక్క; 3. కుక్క; 4. కాకి; 5. పిల్లి.

**సూచకుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. కొండెము చెప్పువాఁడు; 2. బోధ చేయువాఁడు.

**సూచన** (సం.వి.ఆ.స్త్రీ.) : 1. జాడ; 2. గ్రుచ్చుట; 3. తెలుపుట; 4. చూపు.

**సూచి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1. సూది; 2. అభినయ హస్త విశేషము. (చూ. సూచీ ముఖము.)

**సూచించు** (సం.స.క్రి.) : 1. జాడగా తెలియఁ జేయు; 2. తెలియఁజేయు.

**సూచిక** (సం.వి.ఆ.స్త్రీ.) : సూది. (విణ.) తెలియఁ జేయునది.

**సూచితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. జాడగా తెలుపఁబడినది; 2. తెలుపఁ బడినది.

**సుచీముఖము** (సం.వి.అ.పుం.) : 1. అభినయ హస్తవిశేషము; (తక్కిన వ్రేళ్లు ముడువఁబడి ముక్కుమోవ నిలువుగా చాఁపఁబడిన చూపుడు వ్రేలు గలది) 2.బాణము; 3. పక్షివిశేషము.

**సూటి** (దే.వి.) : 1. గుఱి; 2. విధము.

**సూటికాఁడు** (దే.విణ.) : 1.గుఱికాఁడు; 2. అందగాఁడు.

**సూటిపడు** (ద్వ.అ.క్రి.) : సరితాఁకు.

**సూడించు** (దే.అ.క్రి.) : పగగొను.

**సూడిగములు** (దే.వి.బ.) : 1. ఆఁడుదాని చేతి గాజులు; 2. చేతికడియములు.

**సూడిద** (దే.వి.) : కానుక.

**సూడు** (దే.వి.) : 1. పగ; 2. పగవాఁడు.

**సూడుకాఁడు** (దే.వి.) : పగవాఁడు, శత్రువు.

**సూడుకొను** (దే.అ.క్రి.) : పగగొను.

**సూడుపట్టు** (దే.స.క్రి.) : విరోధించు.

**సూతకము** (సం.వి.అ.న.) : 1. జాతాశౌచము; 2. మృతాశౌచము. పుం.న. పాదరసము.

**సూతము** (సం.వి.అ.పుం.) : పాదరసము, సూతకము.

**సూతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. కుట్టు; 2. ప్రసవము.

**సూతిక** (సం.వి.ఆ.స్త్రీ.) : బాలెంతరాలు.

**సూతిని** (దే.వి.) : దేశ విశేషము. (చూ. బాలీసు.)

**సూతుఁడు** (సం.వి.అ.పుం.) : 1. తేరు గడపు వాఁడు; 2. బట్టువాఁడు; 3. వడ్లంగి.

**సూత్థానుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) నేర్పరి.

**సూత్రధారుఁడు** (సం.వి.అ.పుం.) : 1. ఆటాడించు వాఁడు; 2.నడపించువాఁడు; 3.వడ్లంగి; 4. వేల్పుతేఁడు.

**సూత్రపడు** (మి.అ.క్రి.) : జతపడు.

**సూత్రము** (సం.వి.అ.న.) : 1.నూలిపోఁగు; 2.శాస్త్రాది సూచనా గ్రంథము; 3.జన్నిదము; 4.ఏర్పాటు.

**సూత్రించు** (సం.స.క్రి.) : సూత్రపఱచు.

**సూదంటుఱాయి** (ద్వ.వి.) : (సూది + అంటుఱాయి) అయస్కాంతము.

**సూదనము** (సం.వి.అ.న.) : చంపుట. (విణ.) చంపునది.

**సూదము** (సం.వి.అ.పుం.) : వండిన పప్పు.

**సూది** (వై.వి.) : గుడ్డలుకుట్టు సాధనము.

**సూదిగొంటు** (వై.వి.) : ఒక దినుసు పోఁక, లతాపూగము.

**సూదితము** (సం.విణ.) : (అ.ఆ.అ.) చంపఁబడినది.

**సూదిమల్లె** (వై.వి.) : ఒక దినుసు మల్లె.

**సూదిరాయి** (ద్వ.వి.) : సూదంటుఱాయి.

**సూదుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) వంటవాఁడు.

**సూన** (సం.వి.ఆ.స్త్రీ.) : 1.కూఁతురు; 2. కొండనాలుక; 3.వధస్థానము. (ఇవి అయిదు. కండని, (ఱోలు) పేషణి, (సన్నెకల్లు) చుల్లి, (ప్రొయ్యి) ఉదకుంభి, (నీళ్లకడవ) మార్జని, (పొరక) ఇట్లు.) (అ.న.ము.) 1. ప్రసవము; 2. పుష్పము. విణ. శూన్యము.

**సూనగాఁడు** (మి.గ్రా.విణ.) : (సూన+కాఁడు) చంపువాఁడు. (చూ. గొడగరి.)

**సూనరి** (మి.గ్రా.విణ.) : (సూన+అరి) 1.చంపువాఁడు; 2. పూవులమ్మువాఁడు.

**సూనుఁడు** (సం.వి.ఉ.పుం.) : 1.కొడుకు; 2. తమ్ముఁడు; 3. సూర్యుఁడు; (స్త్రీ లింగమైనచో. (వు.) కూఁతురు.)

**సూనృతము** (సం.వి.అ.న.) : శుభము. (విణ.) ప్రియమును సత్యమునైనది. (మాట.)

**సూపకారుఁడు** (సం.వి.అ.పుం.) : వంటవాఁడు.

**సూపము** (సం.వి.అ.పుం.) : వండినపప్పు. (డు.) వంటవాఁడు.

**సూయాణము** (వై.వి.) : శత్రు భయంకరమైన దండయాత్ర.

**సూరణము** (సం.వి.అ.పుం.) : కందగడ్డ.

**సూరసూతుఁడు** (సం.వి.అ.పుం.) : అనూరుఁడు.

**సూరి** (సం.వి.ఇ.పుం.) : సూర్యుఁడు. (ఇ.న్.పుం.) పండితుఁడు.

**సూరుఁడు** (సం.వి.అ.పుం.) : సూర్యుఁడు.

**సూరెగిల్లు** (దే.అ.క్రి.) : ప్రక్కకొదుఁగు. (రూ. సూరెగిలు.)

**సూరెపాను** (దే.వి.) : ఆలవట్టము.

**సూరెపుటము** (వై.వి.) : (చూ.) సూర్యపటము.

**సూరెలు** (దే.వి.బ.) : పార్శ్వము.

**సూర్మి** (సం.వి.ఇ.ఈ.స్త్రీ.) : లోహపు ప్రతిమ. (రూ. శూర్మి.)

**సూర్యకాంతము** (సం.వి.అ.పుం.) : సూర్యరశ్మి తగులుటచే నిప్పు కలిగెడు ఒక దినుసుఱాయి.

**సూర్యతనయ** (సం.వి.ఆ.స్త్రీ.) : యమునానది, కాళింది.

**సూర్యపటము** (సం.వి.అ.పుం.) : మేలుతరపు మొకమాలు.

**సూర్యుఁడు** (సం.వి.అ.పుం.) : వెలుఁగు ఱేఁడు.

**సూర్యానువర్తిని** (సం.వి.ఈ.స్త్రీ.) : ప్రొద్దుతిరుగుడు.

**సూల** (వై.వి.) : రోగవిశేషము.

**సూలచేకట్లు** (దే.వి.) : కంకణ విశేషము.

**సూసకము** (దే.వి.) : స్త్రీలు తలను ధరించెడు తిరుగుడు బిల్ల.

**సూసరి** (దే.వి.) : సున్నము పూయువాఁడు, లేపకుఁడు.



**సృక్వము** (సం.వి.న్.న.) : పెదవిమూల, సెలవి.

**సృక్వి** (సం.వి.ఇ.న.) : పెదవిమూల, సెలవి.

**సృగము** (సం.వి.అ.పుం.) : సాఁగు, భిండివాలము.

**సృగాలము** (సం.వి.అ.పుం.) : నక్క, జంబుకము.

**సృజన** (సం.వి.ఆ.స్త్రీ.) : సృష్టి. (చూ. విశ్వసృజుఁడు.)

**సృజించు** (సం.స.క్రి.) : సృష్టిచేయు.

**సృజ్యము** (సం.విణ.) : (అ.ఆ.అ.) సృజింపఁదగినది.

**సృణి** (సం.వి.ఇ.పుం.స్త్రీ.) : అంకుశము.

**సృణిక** (సం.వి.ఆ.స్త్రీ.) : చొంగ. (రూ. సృణీక.)

**స్మృతి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. త్రోవ; 2. పోక.

**స్మృమరము** (సం.వి.అ.పుం.) : పెద్ద చమర మృగము.

**స్మృష్టము** (సం.విణ.) : (అ.ఆ.అ.) 1. సృజింపఁ బడినది; 2. విడువఁబడినది; 3. నిశ్చయింపఁ బడినది; 4. అధిక మైనది.

**స్మృష్టి** (సం.వి.ఇ.స్త్రీ.) : 1. సృజించుట; 2. స్వభావము.



**సెంటెన్సు** (ఆం.వి.) : శిక్షావిధి.

**సెక** (వై.వి.) : 1. జ్వాల; 2. తాపము.

**సెకకంటి** (ద్వ.వి.) : (సెక+కన్ను) శివుఁడు. (చూ. పొందు. విణ.)

**సెకవెలుఁగు** (ద్వ.వి.) : సూర్యుఁడు, ఉష్ణరశ్మి.

**సెగ** (వై.వి.) : సెక యొక్క రూపాంతరము.

**సెగతేఁడు** (ద్వ.వి.) : అగ్ని, శిఖావంతుఁడు.

**సెగ్గము** (దే.వి.) : రోఁత. (చూ. సెగ్గించు.) విణ. నింద్యము. (చూ. ఆలి.)

**సెగ్గించు** (దే.స.క్రి.) : రోయు.

**సెగ్గింపు** (దే.వి.రోఁత.) : (చూ. ఆరగింపు.)

**సెగ్గు** (దే.వి.) : సెగ్గెము యొక్క రూపాంతరము.

**సెజ్జ** (వై.వి.) : శయ్య.

**సెట్టి** (వై.వి.) : 1. కోమట్లులోనగువారి పట్టపుఁ బేరు; 2. వర్తకుఁడు.

**సెపియించు** (వై.స.క్రి.) : శపియించు. (రూ. సెపించు.)

**సెబాసు** (హిం.అవ్య. బళీ.) : (చూ. సేబాసు.)

**సెబ్బర** (దే.వి.) : చెడుగు. (మంచి సెబ్బరలు.) విణ. చెడ్డది. (చూ. సెబ్ర.)

**సెబ్ర** (దే.వి.) : సెబ్బర యొక్క రూపాంతరము. (చెడ్డది అనుటకు.)

**సెమ్మె** (వై.వి.) : దీపస్తంభము.

**సెర** (దే.వి.) : నేత్రమునందలి రేఖ.

**సెరగు** (దే.వి.) : ఆపద.

**సెల** (వై.వి.) : 1. సెలయేఱు; (చూ. జలజలకడ ప్రవహించుట యందు అను నర్థము.) 2. బాణపు ములికి; 3. ఏదుపందిముల్లు; 4. మునికోల మొదలగువాని చివరయందలి యినుప ముల్లు; 5. బాణము; 6. వ్రణము నందు చీము వ్యాపించెడి రంధ్రము.

**సెలకట్టె** (వై.వి.) : 1. బాణము; 2. బాణమువలె వేగముగాఁబాఱునట్టి శ్యేనవిశేషము. (కొందఱు ఆధునిక కవులు జలకట్టెయనిప్రయోగించినారు. ఆపక్షమున నదియ వ్యుత్పన్న పదమగుట మాత్రముగా కయీయుదాహరణము నందలి వేఁటొకయను విశేషణమునకు ప్రయోజనమును లేకపోవుచున్నది.) (మొదటి రూపము సెలకట్టియ.)

**సెల** (దే.వి.) : 1. ఉపశాఖ; 2. దోసెఁడు గింజలు.

**సెలగత్తి** (ద్వ.వి.) : (సెలగు + కత్తి) కల్లుగీఁచువాని కత్తి.

**సెలగు** (దే.స.క్రి.) : ఖండించు. (చెలగు యొక్క రూపాంతరము.) (చూ. చెలవు.)

**సెలగొమ్మ** (దే.వి.) : (సెలగ + కొమ్మ) ఉపశాఖ.

**సెలగోల** (ద్వ.వి.) : (సెల+కోల) గొల్లవాఁడు పసుల మేపెడు కోల.

**సెలపంది** (ద్వ.వి.) : ఏదుపంది, ముండ్లపంది.

**సెలపుండు** (ద్వ.వి.) : నారికుఱుపు, నాడీవ్రణము.

**సెలయు** (దే.అ.క్రి.) : విజృంభించు. (హరిశ్చంద్ర కథయందు ఆమేటి దొరసెలసి అనియు, నల కథ యందు ఆమేటి దొర సెలసితానలమన్మతి అనియు భేదములు.) (స.క్రి.) చిమ్ము. (చెలయు యొక్క రూపాంతరము.)

**సెలయూట** (ద్వ.వి.) : (సెల+ఊట) కొండ యూట, ప్రస్రవణము.

**సెలయేఱు** (ద్వ.వి.) : (సెల+ఏఱు) పర్వతము నుండి పాఱెడు నది, నిర్ఝరము.

**సెలవడు** (వై.అ.క్రి.) : (సెల+పడు) సెలవాఱు. (చూ. పులినీరు.)

**సెలవాఱు** (ద్వ.అ.క్రి.) : (సెల+పాఱు) సెలవేయు.

**సెలవి** (వై.వి.) : పెదవిమూల.

**సెలవిచ్చు** (దే.స.క్రి.) : (సెలవు + ఇచ్చు) ఆజ్ఞాపించు.

**సెలవిల్లు** (దే.వి.) : సెలసువిల్లు యొక్క రూపాంతరము.

**సెలవు** (దే.స.క్రి.) : సెలగు యొక్క రూపాంతరము. (వి.) 1. ఆజ్ఞ; 2. ఉపయోగము. (చూ. ప్రే.మొదటి యర్థము నుదాహరణము.)

**సెలసు** (దే.వి.) : ఒకానొక చెట్టు. (చెలిమేడి – ఇది సందిగ్ధము.)

**సెలసువిల్లు** (దే.వి.) : సెలసు బద్దలతోఁ జేసిన విల్లు. (చూ.విల్లు.)

**సెల్లా** (వై.వి.) : అంచుకమ్ములు లేని తెల్లవస్త్రము.

**సెల్లుఁడు** (వై.వి.) : శల్యుఁడు. (అచ్చు పుస్తకము నందు "శల్యుఁడట్లు" అని యున్నది. అప్పుడు ఛందోలక్షణమునకు దోషము.)

**సెవ** (వై.వి.) : సెగ యొక్క రూపాంతరము.



**సేకము** (ఉభ.వై.వి.సెగ.) : (ఇది విచార్యము.) (సం.అ.పుం.) 1. చల్లుట; 2. తడుపుట.

**సేకరము** (వై.వి.) : సంగ్రహము.

**సేకరించే** (యు.దే.అ.క్రి.) : తెప్పిఱిల్లు. (వై.స.క్రి.) సంగ్రహించు.

**సేగి** (దే.వి.) : 1. నష్టి; 2. ఆపద, కీడు.

**సేచకము** (సం.వి.అ.పుం.) : మేఘము. (విణ.) 1. చల్లునది; 2. తడుపునది.

**సేచనము** (సం.వి.అ.న.) : 1. చల్లుట; 2. తడుపుట; 3. ఓడలోఁజొచ్చిన నీళ్లు వెలికిఁ బాఱఁ జల్లెడు బొక్కెన.

**సేదుకట్టి** (దే.వి.) : సాలెవాని సాధన విశేషము.

**సేతువు** (సం.వి.ఉ.పుం.) : 1. నీటికట్ట; 2.ఉలిమిరి.

**సేద** (వై.వి.) : శ్రమము, బడలిక.

**సేదగొను** (ద్వ.అ.క్రి.) : (సేద+కొను) బడలు, శ్రమము నొందు.

**సేద్యము** (వై.వి.) : పయిరుపెట్టుట, కృషి.

**సేద్యకాఁడు** (ద్వ.వి.) : సేద్యము చేయువాఁడు, కృషీవలుఁడు.

**సేన** (ఉభ.దే.విణ.) : బహువు. (వాఁడు వచ్చి సేనసేపైనది.) (సం.వి.ఆ.స్త్రీ.) దండు, సైన్యము.

**సేనము** (దే.వి.) : చిన్నయులి, బంగారు నఱకెడి యులి. (అని కొందఱు.) (ఇది సానము అని కొన్ని చోట్లవ్రాయఁబడియున్నది.)

**సేనాంగము** (సం.వి.అ.న.) : రథ, గజ, తురగ, పదాతి చతుష్టయము.

**సేనాని** (సం.వి.ఈ.పుం.) : 1. కుమారస్వామి; 2. సేనాధిపతి.

**సేనాముఖము** (సం.వి.అ.న.) : 1. సేన యొక్క అగ్రభాగము; 2. మూఁడు రథములు మూఁడేనుఁగులు తొమ్మిది గుఱ్ఱములు పదునేవురు కాల్వురును గలసేన.

**సేపు** (దే.వి.) : కాలము.

**సేబాసు** (దే.అవ్య.) : సెబాసు యొక్క రూపాంతరము. (చూ. బసివి.)

**సేమంతిక** (సం.వి.ఆ.స్త్రీ.) : చేమంతి. (మొదటి రూపము సేమంతి.ఈ.స్త్రీ.)

**సేమము** (వై.వి.) : 1.ఉన్నది చెడకుండుట; 2. శుభము.

**సేరి** (దే.విణ.) : ఈనాముకాని పొలము.

**సేరు** (దే.వి.) : 1.అఱువది నాలుగు డబ్బుల యెత్తు పట్టెడు మానవిశేషము; 2. ఇరువది డబ్బుల యెత్తు; 3. ఇరువది నాలుగు తులముల యెత్తు.

**సేల** (వై.వి.) : వస్త్రము.

**సేలు** (దే.వి.) : సాలు యొక్క రూపాంతరము. (అప్ర.)

**సేవ** (సం.వి.ఆ.స్త్రీ.) : శుశ్రూష, కొలువు.

**సేవకము** (సం.వి.అ.పుం.) : వీణకరివె, ప్రసేవకము.

**సేవకుఁడు** (సం.వి.అ.పుం.) : కొలువుడు కాఁడు. (విణ.) కొలుచువాఁడు.

**సేవనము** (సం.వి.అ.న.) : 1.కొలువు; 2. కుట్టు.

**సేవి** (సం.వి.న్.పుం.) : సేవకుఁడు, కొలువుడుకాఁడు.

**సేవించు** (సం.స.క్రి.) : కొలుచు. (సంసేవించు. అనియు.)

**సేవిక** (సం.వి.ఆ.స్త్రీ.) : సేవియ.

**సేవితుఁడు** (సం.విణ.) : (అ.ఆ.అ.) సేవింపఁబడినవాఁడు.

**సేవియ** (వై.వి.) : గోధుమ నూకతో సన్నగా తాలికలు చేసి పాలుపోసి వండెడు భక్ష్య విశేషము.

**సేవె** (వై.వి.) : సేవియ యొక్క రూపాంతరము.

**సేవ్యము** (ఉభ.దే.వి.) : దున్ని సిద్ధము చేసిన పొలము. (సం.వి.అ.న.) 1.వట్టివేరు; 2.నీటి వట్టివేరు. (విణ.) సేవింపఁ దగినది.

**సేస** (వై.వి.) : 1.అక్షత; 2.సేసఁబ్రాలు; 3.పాపట.

**సేసఁబ్రాలు** (ద్వ.వి.బ.) : తలఁబ్రాలు.

**సేసకొప్పు** (ద్వ.వి.) : కొండెసిగ. (చూ.మక్కళించు.)

**సేళము** (దే.వి.) : ఒకానొకచెట్టు, కారంభ.



**సై** (వై.ఉప.) : సహశబ్దార్థకము. (సైదోడు. మొ.) (మొదటి రూపము సయి.)

**సైంధవము** (సం.వి.అ.పుం,న.) : ఇందుప్పు. (పుం.) గుఱ్ఱము. (విణ.) సింధువునఁబుట్టినది.

**సైంహికేయుఁడు** (సం.వి.అ.పుం.) : రాహుగ్రహము.

**సైఁచు** (వై.అ.క్రి.) : 1. ఓర్చుకొను; 2. రుచించు. (నాకది సైఁచదు.) (స.క్రి.) ఓర్చు. (మొదటి రూపము సయిఁచు. ఓర్చుకొనుటకు.)

**సైఁదము** (దే.వి.) : గోధుమ పిండి.

**సైఁపు** (వై.వి.) : ఓర్పు. (మొదటి రూపము సయిఁపు.)

**సైఁపుడు** (వై.వి.) : ఓర్పు. (మొదటి రూపము సయిఁపుడు.)

**సైకతము** (సం.వి.అ.న.) : 1.ఇసుకదిబ్బ; 2.ఇసుకనేల.

**సైకము** (దే.వి.) : సూక్ష్మత్వము. (మొదటి రూపము సయికము)

**సైగ** (వై.వి.) : హస్తాదుల సంజ్ఞ. (మొదటి రూపము సయిగ)

**సైడ్డు** (ఆం.వి.) : ప్రక్క, పుట.

**సైతము** (వై.అవ్య.) : కూడ. (మొదటి రూపము సయితము)

**సైతవాహిని** (సం.వి.ఈ.స్త్రీ.) : బాహుదయనెడునది.

**సైతాను** (హిం.వి.) : పిశాచముల యధిపతి.

**సైదోడు** (ద్వ.వి.) : (సై + తోడు) తోఁబుట్టువు. (చూ. పొందు. విణ.)

**సైద్ధాంతికుఁడు** (సం.విణ.) : (అ.ఈ.అ.) సిద్ధాంతము తెలిసిన వాఁడు.

**సైనికుఁడు** (సం.వి.అ.న.) : సేనాధిపతి. (విణ.) సేనతోఁ జేరినవాఁడు.

**సైన్యము** (సం.వి.అ.న.) సేన. (పుం.) : కృష్ణుని తేరి గుఱ్ఱములలో నొకటి. (చూ. రథ్యము.) (విణ.) సేనతోఁ గూడినది.

**సైరంధ్రి** (సం.వి.ఈ.స్త్రీ.) : 1.(చూ.) గట్టువాలు; 2.అంతఃపురపు కావలికత్తె; 3.సంకర జాతిస్త్రీ.

**సైరణ** (వై.వి.) : సహనము. (మొదటి రూపము సయిరణ.)

**సైరించు** (వై.అ.క్రి.) : సైరణ చేయు. (మొదటి రూపము సయిరించు.)

**సైరికము** (సం.వి.అ.పుం.) : దున్నెడి యెద్దు. (విణ.) సీరసంబంధమయినది. (సీరము = నాఁగలి.)

**సైరికుఁడు** (సం.వి.అ.పుం.) : దున్నెడువాఁడు, హాలికుఁడు.

**సైరిభము** (సం.వి.అ.పుం.) : 1. కారెనుపోతు; 2. స్వర్గము.

**సైరేయకము** (సం.వి.అ.పుం.) : తెల్లగోరంట, ములుగోరంట. (అని కొందఱు.)

**సైలరు** (ఆం.వి.) : ఓడలమీఁద పని చేయువాఁడు.



**సొంటి** (వై.వి.) : పక్వముచేసి యెండఁబెట్టిన అల్లము.

**సొంటు** (వై.వి.) : తప్పు, దోషము.

**సొంతము** (వై.విణ.) : స్వకీయము. (ఈ యిల్లు నాకు సొంతము.) (వృత్తి యందు వికల్పముగ అంత్యవర్ణ లోపము. సొంతపని.)

**సొంపిల్లు** (దే.అ.క్రి.) : సొంపగు. (రూ. సొంపిలు.)

**సొంపు** (దే.వి.) : 1. సమృద్ధి; 2. సంతోషము; 3. ప్రసన్నత; 4. సుఖము; 5. సౌందర్యము.

**సొగటాలు** (ద్వ.వి.బ.) : (సొగపు + ఆటలు) పగడసాలాట.

**సొగటు** (దే.వి.) : వాడు.

**సొగపు** (వై.వి.) : చొక్కు, పారవశ్యము.

**సొగయిక** (వై.వి.) : సొగపు, చొక్కు, పారవశ్యము.

**సొగయు** (వై.అ.క్రి.) :1.చొక్కు పరవశత్వము నొందు; 2.మూర్ఛిల్లు. (చూ. వెనుకటి భాగము.)

**సొగసు** (వై.వి.) : అందము. (దీనిఁ జూచువారు సొగయుదురని వ్యుత్పత్తి.)

**సొగసుకత్తె** (వై.వి.) : విటకత్తె. (చూ. సొగసు కాఁడు.) విణ. అందగత్తె.

**సొగసుకాఁడు** (ద్వ.వి.) : విటకాఁడు. (విణ.) అందగాఁడు.

**సొగియించే** (వై.అ.క్రి.) : సుఖించు.

**సొగియు** (వై.అ.క్రి.) : ఇంపగు. (చూ. సొరదోఁకి.)

**సొచ్చెము** (వై.వి.) : పెచ్చు, అధికము.

**సొజ్జె**(దే.వి.) : బియ్యము వేఁచి వండిన యన్నము.

**సొజ్జెబూరె** (ద్వ.వి.) : భక్ష్యవిశేషము.

**సొటసొట** (దే.వి.) : కార్శ్యము.

**సొటసొటవోవు** (దే.అ.క్రి.) : (సొటసొట + పోవు) కృశించు. (రూ. సొటసొటలు వోవు.) (ఈ యర్థము నందు సొటసొటలాడు అను రూపము మిక్కిలి వాడుకలో నున్నది.)

**సొట్ట** (దే.వి.) : చొట్టయొక్క రూపాంతరము.

**సొడ్డు** (దే.వి.) : న్యూనత, కొఱఁత.

**సొత్తు** (వై.వి.) : సొమ్ము.

**సొద** (వై.వి.) : పీనుఁగును గాల్చుటకు బేర్చిన కట్టెలు లోనగువాని ప్రోగు.

**సొన** (దే.వి.) : 1. గ్రుడ్డులోని జెన; 2. బెండ లోనగు వాని మీఁది నూఁగు; 3. ఊటకాలువ.

**సొనచిక్కుడు** (దే.వి.) : ఉలవకాయ వంటి కాయలు గల ఒకానొక చెట్టు.

**సొన్నము** (వై.వి.) :1. బంగారు; 2. మాడ. (వృత్తి యందు మువర్ణలోపమును అంత్య వర్ణమునకు దీర్ఘంబునగు.)

**సొన్నారి** (ద్వ.వి.) : (సొన్నము + ఆరి) అగసాలె వాఁడు. (చూ. కమ్మటము.)

**సొబగు** (వై.వి.) : చక్కఁదనము, సౌందర్యము.

**సొబగుఁడు** (వై.విణ.) : చక్కనివాఁడు. (వి.) విటుఁడు.

**సొబను** (దే.వి.) : బడబచూలు.

**సొమ్మ** (వై.వి.) : మూర్ఛ.

**సొమ్మగొను** (ద్వ.అ.క్రి.) : (సొమ్మ + కొను) సొమ్మసిల్లు.

**సొమ్మవోవు** (ద్వ.అ.క్రి.) : (సొమ్మ + పోవు) సొమ్మసిల్లు.

**సొమ్మసిల్లు** (వై.అ.క్రి.) : మూర్ఛిల్లు. (రూ. సొమ్మసిలు.)

**సొమ్ము** (వై.వి.) : 1. ధనము; 2. ఆభరణము; 3. గోధనము; 4. అధీనవస్తువు.

**సొరంగము** (వై.వి.) : గుహవలె తొలిచిన రంధ్రము.

**సొరగు** (దే.అ.క్రి.) : లీనమగు.

**సొరదోఁకి** (దే.విణ.) : దురాచారుఁడు.

**సొరపు** (దే.విణ.) : కృశము. (చూ. పొరపు.విణ.)

**సొరము** (వై.వి.) : 1. కంఠధ్వని; 2. షడ్జాది.

**సొరిది** (దే.వి.) : 1. వరుస; 2. క్రమము.

**సొరుగు** (దే.అ.క్రి.) : మూర్ఛిల్లు. (వి.) మూర్ఛ.

**సొఱ** (దే.వి.) : తుంబి. (దీని భేదము చేఁతి సొఱ.) (చూ. సొఱ్ఱ.)

**సొఱ్ఱ** (దే.వి.) : సొఱకు మొదటి రూపము.

**సొలపు** (దే.వి.) : 1.పారవశ్యము; 2.వైముఖ్యము.

**సొలయిక** (దే.వి.) : వైముఖ్యము.

**సొలయు** (దే.అ.క్రి.) : 1.మూర్ఛపోవు; 2.వెను దీయు; 3.వైముఖ్యము నొందు; 4.వైరస్యము నొందు.

**సొలిమిడి** (దే.వి.) : సొమ్మ, మూర్ఛ.

**సొవ** (దే.వి.) : సవయొక్క రూపాంతరము. (ఆమ్రేడితమగుచో సొవసొవ.)

**సొసాయించు** (దే.క్రి.) : మందలించు, హెచ్చరించు.

## సో

**సోఁకు** (దే.అ.క్రి.) : 1. తగులు; 2. గ్రహమావేశించు. (వి.) 1. స్పర్శము; 2. రాక్షసుఁడు.

**సోఁకుఁజుక్క** (ద్వ.వి.) : (సోఁకు + చుక్క) మూలా నక్షత్రము.

**సోఁకుటొజ్జ** (ద్వ.వి.) : (సోఁకు+ఒజ్జ) శుక్రుఁడు, దైత్యగురువు.

**సోఁకుడు** (దే.వి.) : 1. స్పర్శము; 2. గ్రహావేశము; 3. పిశాచము; 4. రాక్షసుఁడు.

**సోఁకుడుముడుఁగు** (దే.వి.) : ఓషధి విశేషము.

**సోఁకుదయ్యము** (ద్వ.వి.) : వాయువు, స్పర్శనము.

**సోఁకుల తేఁడు** (దే.వి.) : నైరృతి, మూలతేఁడు.

**సోఁగు** (వై.వి.) : సరము.

**సోఁపు** (దే.వి.) : ఒకానొక సంబారపు దినుసు.

**సోఁపుఁబిండి** (ద్వ.వి.) : చణకపిష్టము, చమసి.

**సోఁగ** (దే.వి.) : దైర్ఘ్యము.

**సోజరు** (ఆం.వి.) : సైనికుఁడు.

**సోడు** (దే.వి.) : మాడపట్టు, బ్రహ్మరంధ్రము.

**సోఢ** (సం.విణ.) : (ఋ.ఈ.ఋ.) 1. ఓపువాఁడు; 2. ఓర్చువాఁడు.

**సోఢము** (సం.విణ.) : (అ.ఆ.అ.) ఓర్వఁబడినది. (అపరాధము లోనగునది.)

**సోణము** (దే.వి.) : నాసామూలము.

**సోద** (దే.వి.) : గచ్చు, గార.

**సోదన** (వై.వి.) : 1. శోధనము; 2. శకునార్థము రామాయణము మొదలైన గ్రంథముల యందు దారము వేసి శోధించుట.

**సోదరి** (సం.వి.ఈ.స్త్రీ.) : తోడఁబుట్టినది.

**సోదరుఁడు** (సం.వి.అ.పుం.) : తోడఁ బుట్టిన వాఁడు.

**సోదర్యుఁడు** (సం.వి.అ.పుం.) : తోడఁ బుట్టిన వాఁడు.

**సోదించు** (వై.స.క్రి.) : శోధనచేయు. (చూ. సొంటు.)

**సోదె** (వై.వి.) : రాఁగల మేలుకీడులను గూర్చిచేయు ప్రశ్నము. (మొదటి రూపము సోదియ.)

**సోదెకత్తె** (వై.వి.) : సోదెచెప్పునది, దైవజ్ఞ. (మొదటి రూపము సోదె కత్తియ.)

**సోదెము** (వై.వి.) : సోద్దెము యొక్క రూపాంతరము.

**సోద్దెము** (వై.వి.) : ఆశ్చర్యము. (విణ.) ఆశ్చర్యకరమైనది.

**సోధ్రకము** (సం.వి.అ.పుం.) : బిళ్లు.

**సోన** (దే.వి.) : 1. అల్పవర్షము; 2. వర్షము.

**సోనంగి** (దే.వి.) : శునకజాతి. (రూ. జోనంగి.)

**సోపనము** (వై.వి.) : మెట్టు.

**సోపప్లవుఁడు** (సం.వి.అ.పుం.) : రాహువు చేపట్టఁబడినవాఁడు. (చంద్రుఁడు, లేక సూర్యుఁడు.)

**సోపానము** (సం.వి.అ.న.) : మెట్టు, ఆరోహణము. (రూ. సౌపానము.)

**సోబ** (వై.వి.) : వ్యాధివిశేషము, శోఫ.

**సోబతు** (హిం.వి.) : తోడు, సహవాసము.

**సోబనము** (వై.వి.) : మంగళము.

**సోబాన** (వై.వి.) : ఒక దినుసు పెండ్లిపాట. (చూ. సువ్వాల.)

**సోబె** (వై.వి.) : సిబ్బెము. (మొదటి రూపము సోబియ.)

**సోమ** (వై.వి.) : 1. శ్రమము; 2. పరాక్రమము. (చూ. సోమము.)

**సోమకర్కటి** (సం.వి.ఈ.స్త్రీ.) : కరపుచ్చ.

**సోమధార** (సం.వి.ఆ.స్త్రీ.) : ఆకాశగంగ.

**సోమపీథి** (సం.వి.న్.పుం.) : యజ్ఞము నందు సోమపానము చేయువాఁడు. (రూ. సోమపీతి.)

**సోమపుఁడు** (సం.వి.అ.పుం.) : యజ్ఞమునందు సోమపానము చేయువాఁడు. (రూ. సోమపీతి.)

**సోమము** (ఉభ.వై.వి.) : పరాక్రమము. (సం.అ. పుం.) 1.తిప్పతీఁగ; 2.జలము; 3.కర్పూరము; 4. దినము యొక్క పదునొకండవ భాగము. (చూ. దినము.)

**సోమయాజి** (సం.వి.న్.పుం.) : యజ్ఞము చేసినవాఁడు.

**సోమరాజి** (సం.వి.ఈ.స్త్రీ.) : కారుగచ్చ.

**సోమరి** (ద్వ.విణ.) : (సోము + అరి) అలసుఁడు, మందుఁడు.

**సోమవల్కము** (సం.వి.అ.పుం.) : 1. వెలిచంద్ర; 2. తేఁకు.

**సోమవల్కలము** (సం.వి.అ.పుం.) : వెలిచంద్ర.

**సోమవల్కరి** (సం.వి.ఈ.స్త్రీ.) : సోమెదకూర.

**సోమవల్లి** (సం.వి.ఈ.స్త్రీ.) : తిప్పతీఁగ.

**సోమవారము** (సం.వి.అ.పుం.) : ఒకవారము. (ఇట్లు ఇందువారము. మొ.) (చూ. వారము.)

**సోమసూత్రము** (సం.వి.అ.న.) : 1. పానవట్టము నుండి నీళ్లు పోవుదారి; 2. సోమసూత్రము వంటి ముఖభాగము గలిగిన లోహపాత్ర విశేషము.

**సోమాసి** (వై.వి.) : సోమయాజి.

**సోమించు** (వై.అ.క్రి.) : 1.సరిపోలు; 2. పరాక్ర మించు; 3. విజృంభించు; 4. వ్యాపించు.

**సోమిద** (వై.వి.) : తిప్పతీఁగ.

**సోమిదము** (దే.వి.) : శణపర్ణి.

**సోమిదమ్మ** (వై.వి.) : (సోమిద + అమ్మ) సోమయాజి భార్య.

**సోమిసాని** (వై.వి.) : (సోమిద + సాని) సోమయాజి భార్య.

**సోము** (వై.వి.) : సుఖము. విణ. ఆసక్తము.

**సోముఁడు** (సం.వి.అ.పుం.) : 1. చంద్రుఁడు; 2.శివుఁడు; 3. కుబేరుఁడు; 4. వాయువు; 5. పితృ దేవత; 6. ఒక వసువు; (చూ. వసువు.) 7. ఒక వానరుఁడు.

**సోమెద** (వై.వి.) : ఒక దినుసు కూరాకు, సోమవల్లరి.

**సోమోద్భవ** (సం.వి.ఆ.స్త్రీ.) : నర్మదానది.

**సోయగము** (దే.వి.) : అందము, చక్కఁదనము.

**సోరంగి** (దే.వి.) : మత్స్యవిశేషము.

**సోరణగండ్లు** (దే.వి.బ.) : (సోరణము + గండులు) గవాక్షము. (వృత్తి యందేక వచనాంతము.) (చూ. అఱువుళ్లు.)

**సోరణము** (దే.వి.) : గవాక్షము. (చూ. పట్టియ మూడవ యర్థము.)

**సోరు** (దే.వి.) : సోరుప్పు, పెట్లుప్పు.

**సోరువా** (హిం.వి.) : మాంసపుచారు.

**సోర్ణగండ్లు** (దే.వి.బ.) : సోరణగండ్లు యొక్క రూపాంతరము.

**సోల** (దే.వి.) : పదునాఱు డబ్బుల యెత్తు వస్తువు పట్టెడు మాన విశేషము, నికుంచకము.

**సోలము** (దే.వి.) : 1. మత్తు; 2. చొక్కు.

**సోలింత** (దే.వి.) : వివశత్వము నొంది వ్రాలుట. (చూ. పొరపు. విణ.)

**సోలు** (దే.అ.క్రి.) : వివశత్వము నొంది వ్రాలు.

**సోళాదొప్పి** (దే.వి.) : ద్యూత విశేషము. (కొన్ని చోట్ల సోళాం దొప్పి అని కనఁబడుచున్నది.)

## సౌ

**సౌందర్యము** (సం.వి.అ.న.) : చక్కఁదనము.

**సౌకర్యము** (సం.వి.అ.న.) : 1. అనాయాసము; 2. సూకరభావము.

**సౌకుమార్యము** (సం.వి.అ.న.) : 1.సుకుమార త్వము; 2.కావ్య గుణములలో నొకటి. (చూ.గుణము.)

**సౌఖశాయనికుఁడు** (సం.వి.అ.పుం.) : రాజులను నిద్ర మేలుకొలుపు వాఁడు. (విణ.) సుఖనిద్ర యాయని ప్రశ్నము చేయువాఁడు.

**సౌఖ్యము** (సం.వి.అ.న.) : సుఖము.

**సౌగంధికము** (సం.వి.అ.న.) : 1. చెంగలువ; 2. కామంచి. (పుం.) 1. మాణిక్య విశేషము; (ఇది ఆంధ్రమునందు పుట్టినది, అశోకపు చిగురు దాళుగలది, మధ్యమజాతి రత్నము. (చూ.)

మాణిక్యము.) 2. గంధకము. డు. సుగంధ వస్తువుల వ్యాపారము చేయువాఁడు.

**సౌగంధ్యము** (సం.వి.అ.న.) : వాసన.

**సౌచికుఁడు** (సం.వి.అ.పుం.) : కుట్రపువాఁడు.

**సౌజన్యము** (సం.వి.అ.న.) : సుజనత్వము, మంచితనము.

**సౌదాగరు** (హిం.వి.) : వర్తకుఁడు, గుఱ్ఱముల బేరగాఁడు.

**సౌదామని** (సం.వి.ఈ.స్త్రీ.) : 1.మెఱుపు; 2.ఒక దినుసు మెఱుపు; 3.ఒక అప్సరస్త్రీ. (రూ. సౌదామిని.)

**సౌదాయికము** (సం.వి.అ.న.) : తల్లిదండ్రుల చేతనేనియు అన్నదమ్ముల చేతనేనియు నియ్యఁబడుస్త్రీ ధనము.

**సౌధము** (సం.వి.అ.పుం,న.) : రాజగృహము, నగరు.

**సౌనికుఁడు** (సం.వి.అ.పుం.) : మృగ పక్ష్యాదులను జంపి విక్రయించి జీవించువాఁడు.

**సౌప్తికము** (సం.వి.అ.న.) : 1. నిద్రించుట లోనగు సమయములందు శత్రువుల పైఁబడి చంపుట; 2. మహాభారతము నందలి యొక పర్వము.

**సౌభాగినేయి** (సం.వి.ఈ.స్త్రీ.) : భాగ్యవతి కూఁతురు.

**సౌభాగినేయుఁడు** (సం.వి.అ.పుం.) : భాగ్యవతి కొడుకు.

**సౌభాగ్యము** (సం.వి.అ.న.) : 1. సుభగత్వము; 2. ఒక గ్రహ యోగము. (చూ. యోగము.)

**సౌభ్రాత్రము** (సం.వి.అ.న.) : మంచి తోడఁబుట్టఁ దనము.

**సౌమనస్యము** (సం.వి.అ.న.) : 1. సుబనో భావము; 2. శ్రాద్ధము నందు పిండదానా నంతరము బ్రాహ్మణ హస్తము నందిచ్చెడు పుష్పదాన మంత్రము.

**సౌమ్య** (సం.వి.అ.పుం.) : ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

**సౌమ్యుఁడు** (సం.వి.అ.పుం.) : బుధగ్రహము. (విణ.) 1. తిన్నని వాఁడు; 2. ఒప్పినవాఁడు; 3.సోముఁడు దేవతఁగా గలవాఁడు.

**సౌరభము** (సం.వి.అ.న.) : 1. వాసన; 2. కుంకుమము; 3. బోళము. (పుం.) ఎద్దు.

**సౌరభేయము** (సం.వి.అ.పుం.) : ఎద్దు, బలీవర్దము.

**సౌరభేయి** (సం.వి.ఈ.స్త్రీ.) : ఆవు, గోవు.

**సౌరభ్యము** (సం.వి.అ.న.) : 1.వాసన; 2. ఒప్పిదము; 3. గుణ గౌరవము.

**సౌరము** (సం.వి.అ.న.) : ఒక మతము. (చూ. మతము.)

**సౌరాష్ట్రము** (సం.వి.అ.న.) : కంచు. (పుం.) 1. ఒక దేశము; 2. రాగవిశేషము.

**సౌరాష్ట్రికము** (సం.వి.అ.పుం.) : విషభేదము. (విణ.) సౌరాష్ట్రదేశ సంబంధమైనది.

**సౌరి** (సం.వి.ఇ.పుం.) : 1. శనైశ్చరుఁడు; 2. యముఁడు.

**సౌరికుఁడు** (సం.వి.అ.పుం.) : కల్లమ్మువాఁడు, కబ్బిలి.

**సౌరు** (దే.వి.) : 1. అందము; 2. విధము. (చూ. గగ్గులకాఁడు.) విణ. మనోజ్ఞము. (మొదటి రూపము సవురు. అందమునకు.)

**సౌవర్చలము** (సం.వి.అ.న.) : ఒక దినుసు ఉప్పు.

**సౌవర్ణకరణి** (సం.వి.ఈ.స్త్రీ.) : ఓషధి విశేషము. (దీనితో చేరిన తక్కిన మూడు. విశల్య కరణి, సంధానకరణి, సంజీవకరణి.)

**సౌవిదల్లుఁడు** (సం.వి.అ.పుం.) : అంతఃపురపు కావలివాఁడు.

**సౌవిదుఁడు** (సం.వి.అ.పుం.) : అంతఃపురపు కావలివాఁడు.

**సౌవీరము** (సం.వి.అ.న.) :1.పులియఁ బెట్టిన కడుగు నీళ్లు; 2. నీలాంజనము; 3. రేఁగుఁ బండు. (పుం.) ఒకానొక దేశము.

**సౌశీల్యము** (సం.వి.అ.న.) : సుశీలత్వము.

**సౌష్ఠవము** (సం.వి.అ.న.) : 1. సుష్ఠుభావము; 2. నాట్యాంగ విశేషము.

**సౌహార్దము** (సం.వి.అ.న.) : సుహృద్భావము, స్నేహము.

**సాహిత్యము** (సం.వి.అ.న.) : తృప్తి, తనవి.

**సౌహృదము** (సం.వి.అ.న.) : (చూ.) సౌహార్దము.

**సౌహృద్యము** (సం.వి.అ.న.) : (చూ.) సౌహార్దము.

## స్కం

**స్కందుఁడు** (సం.వి.అ.పుం.) : కుమారస్వామి.

**స్కంధము** (సం.వి.అ.పుం.) : 1.మూఁపు; 2. చెట్టు బోదె; 3. యుద్ధము; 4. సమూహము; 5.శరీరము. (డు.) దశార్ణదేశపు రాజు. (స్కంధ త్రయము. ఆదానము, నిదానము, చికిత్స.) (ఇవి వైద్యశాస్త్రమునందలివి.) స్కంధ పంచకము. రూప, వేదనా, విజ్ఞాన, సంజ్ఞా, సంస్కారములు. (ఇవి బౌద్ధ శాస్త్రోక్తములు.)

**స్కంధపట్టిక** (సం.వి.ఆ.స్త్రీ.) : తలుపున కమర్చెడు గందపట్టె.

**స్కంధశాఖ** (సం.వి.ఆ.స్త్రీ.) : మ్రాని మొదటికొమ్మ.

**స్కంధావారము** (సం.వి.అ.పుం.) : 1.దండు విడిసిన చోటు; 2. దండు.

**స్కన్నము** (సం.విశ.) : (అ.ఆ.అ.) జాఱినది.

## స్ఖ

**స్ఖలనము** (సం.వి.అ.న.) : 1. జాఱుపాటు; 2. తొట్రుపాటు.

**స్ఖలించు** (సం.అ.క్రి.) : 1. జాఱు; 2. తొట్రుపడు.

**స్ఖలితము** (సం.విశ.) : (అ.ఆ.అ.) 1. జాఱినది; 2. తొట్రుపడినది.

## స్ఖా

**స్ఖాలిత్యము** (సం.వి.అ.న.) : స్ఖలితభావము, పొరపాటు.

## స్టా

**స్టాంపు** (ఆం.వి.) : బిల్ల, ముద్ర, ముద్రవేసిన కాగితము.

## స్టీ

**స్టీమరు** (ఆం.వి.) : పొగయోడ.

## స్టే

**స్టేషన్** (ఆం.వి.) : ఉండుతావు, (పోలీసుస్టేషన్, రైలుస్టేషన్. మొ.)

## స్త

**స్తంబకరి** (సం.వి.ఇ.పుం.) : ధాన్యము.

**స్తంబఘనము** (సం.వి.అ.పుం.) : వరిపైరు మొదలగువాని కోసెడు కొడవలిలోనగునది.

**స్తంబఘ్నము** (సం.వి.అ.పుం.) : వరిపైరు మొదలగువాని కోసెడు కొడవలిలోనగునది.

**స్తంబము** (సం.వి.అ.పుం.) : 1. వరిలోనగువాని గంట; 2. బోదెలేని చిన్నచెట్టు.

**స్తంబేరమము** (సం.వి.అ.పుం.) : ఏనుఁగు, గజము.

**స్తంభనము** (సం.వి.అ.న.) : 1. మ్రానుపడఁ జేయుట; 2. మంత్ర శక్తిచేత అగ్నిలోనగు వాని శక్తి నణఁగఁజేయుట. (ఇది షడ్విద్యలలో నొకటి. చూ. విద్య.)

**స్తంభబలి** (సం.వి.ఇ.పుం.) : (చూ. కంబవల్లి.)

**స్తంభము** (సం.వి.అ.పుం.) : 1. కంబము; (గృహ మధ్యస్తంభము కహారము.) 2. మ్రానుపాటు.

**స్తంభయిత** (సం.విశ.) : (ఋ.ఈ.ఋ.) స్తంభించువాఁడు.

**స్తంభించే** (సం.అ.క్రి.) : మ్రానుపడు. (సంస్తంభించు అనియు.)

**స్తనంధయ** (సం.వి.ఆ.స్త్రీ.) : పాలుద్రాగెడు ఆఁడుబిడ్డ, చంటిపాప.

**స్తనంధయుఁడు** (సం.వి.అ.పుం.) : పాలుత్రాగెడు మగబిడ్డ, చంటిపాప.

**స్తనము** (సం.వి.అ.పుం.) : కుచము, చను.

**స్తనయిత్నువు** (సం.వి.ఉ.పుం.) : 1.మబ్బు; 2. ఉఱుము.

**స్తనితము** (సం.వి.అ.న.) : ఉఱుము, గర్జితము.

**స్తన్యము** (సం.వి.అ.న.) : చనుపాలు.

**స్తబకము** (సం.వి.అ.పుం.) : పూగుత్తి, గుచ్ఛకము.

**పోరు బాట** : పోరాటం తప్ప ఇక గత్యంతరం లేదనుకొని సాగే మార్గం.

**ఫ్లోర్ క్రాసింగు** : ఒక పార్టీ టికెట్‌తో గెలిచి, మరో పార్టీలో చేరిపోవడం.

**పురుషాధిక్య సమాజం** : పురుషుల మాటే చెల్లుబాటయ్యే సమాజం. చూడండి. మహిళా సాధికారత, లింగవివక్ష.

**ప్రభుత్వ రాయితీలు** : ప్రభుత్వం పేదలకు చూపే వెసులుబాట.

**ప్రభుత్వ ఫలితాలు** : ప్రభుత్వ పథకాలు అందించే ఫలితాలు.

## బ

**బతుకు పోరు** : జీవన పోరాటం. కనీసం తిండి, బట్ట కోసం గడిపే జీవితం.

**బెల్టు షాపులు** : మరొకచోట గల బ్రాంది షాపుకు అనుబంధంగా గల చిన్న షాపు.

**బాడుగ నేతలు** : స్వయంకృషి, అంకిత భావంతో నాయకులుగా ఎదగకుండా, కిరాయికి నాయకులుగా వ్యవహరించటం.

**బాదుడు** : ఎక్కువగా కొట్టడం, పద్ధతిలేని పనులు.

**బ్రాంచి కాలువలు** : చూడండి. లింకు కాలువలు.

**బిందు వ్యవసాయం** : నీటి బిందువులను చల్లి, చేసే యాంత్రిక వ్యవసాయం.

**బిడింగ్ తీయడం** : విశాఖజిల్లా చింతపల్లి అడవులలో ఈత చెట్ల బీళ్ళుగా ఉంటాయి. దీన్ని బిడింగుకుంట అన్నారు. ఇచట ఆటవికులు నివసిస్తారు. ఇచట గల బాక్సైట్ వెలికి తీసేందుకు ప్రయత్నాలు జరుగుతున్నాయి. బిడింగు తొలగించి, తమను నిరాశ్రయులను చేయవద్దని గిరిజనుల ఆందోళన. (ఆంధ్రజ్యోతి 2.5.2008)

**బి.ఫారం** : రాజకీయ పార్టీలు తమ అభ్యర్థిగా పోటీ చేసే అధికారం కల్పించడం.

**బినామీ కూలీలు** : కూలి పనికి నియమించకుండా, దొంగ లెక్కలు రాసుకొనే లెక్కల్లో కూలీలు.

**బురిడీ కొట్టించడం** : దగా చేయడం.

**బులియన్ మార్కెట్** : వెండి, బంగారం రేట్లు నిర్ణయించే మార్కెట్.

**బుల్లితెర** : టి.వి.

**బెల్టు షాపులు** : ఒక లిక్కరు కాంట్రాక్టరు తన షాపుకు అనుబంధంగా మరో గ్రామంలో పెట్టుకొనే లిక్కరు షాపులు.

**బ్రెయిన్ డెత్** : మెదడు పని చేయడం ఆగిపోవడం.

**బొనాంజా** : పెద్ద మేళా.

**బ్లాక్ మెయిల్ రాజకీయాలు** : వెనుకవుండి దుర్బుద్ధితో నడిపే రాజకీయాలు.

**భద్రతా బలగాలు** : రక్షణ సైన్యం.

**భయం గుప్పిట్లో** : నిత్యం భయంతో నలిగిపోవడం.

**భూ నిర్వాసితులు** : ఏదైనా ప్రాజెక్టు నిర్మాణం వలన భూములను పోగొట్టుకున్నవారు.

**భూకబ్జా** : భూమిని అక్రమంగా ఆక్రమించి సొంతం చేసుకోవడం.

## మ

**మంగళం పాడటం** : అర్ధంతరంగా ముగించడం.

**మంగళం పాడుదాం** : ముగించుదాం.

**మటాష్** : అదృశ్యం కావడం, పేలిపోవడం.

**మడమ తిప్పడం** : వెనక్కు తిరిగి పోవడం, పరాజయం.

**మల్ల గుల్లాలు** : నిర్ణయించలేక తికమక పడటం.

**మహానాడు** : పెద్ద సభ. భారీ స్థాయిలో జన సమీకరణం. తెలుగుదేశం పార్టీ వ్యవస్థాపక సభ కూడా. ఉదా : కాపు మహానాడు.

**మహా మేళా** : గొప్ప సంబరం.

**మహిళా సాధికారత** :మహిళలకు తగుఅధికారాలు ఇచ్చి, వాటిని నిర్వహించేశక్తి కల్పించడం.

**మాచ్ ఫిక్సింగ్** : లోపాయికారీ వ్యవహారం. క్రికెట్ ఆటనుంచి ఈపదం ప్రచారంలోకి వచ్చింది. ఏ జట్టు గెలవాలో ముందే లోపాయికారిగా నిర్ణయించుకొని దాని కనుగుణంగా ఆటగాళ్ళు ఆడటం.

**మానవ హారం** : వ్యక్తులు వర్తులాకారంలో గానీ, వరుసగా గానీ నిలబడి ఉద్యమించడం. ఇది సత్కార్యం కోసం కోవచ్చు. సమస్య పరిష్కారం కోసం కావచ్చు.

**మాఫియా** : దౌర్జన్యాలతో అక్రమార్జన చేసేవారు.

**మాఫియా డాన్** : మాఫియా ముఠా నాయకుడు.

**మాఫీ చేయడం** : తీసుకున్న అప్పు, చెల్లించవలసిన పన్నులు రద్దు చేయడం.

**మారటోరియం** : ప్రజలు తీసుకున్న అప్పులను– తీర్చలేని పరిస్థితి ఏర్పడినప్పుడు ప్రభుత్వం మాఫీ చేయడం.

**మిత్రపక్షం** : కొన్ని అంశాలలోనైనా భావ సారూప్యం గల పార్టీలు, కొన్ని అంశాలలో కలసి మిత్ర పక్షంగా ఏర్పడటం.

**మీడియా** : పత్రికలు, రేడియో, టీవి ఛానళ్ళు, ఎఫ్.ఎం.రేడియో, కంప్యూటరు నెట్వర్కు మొదలైన – వార్తలు, సమాచారం అందించే సాధనాలు. ఇవి ప్రజల జ్ఞానావసరాలను తీరుస్తాయి.

**ముందస్తు ఎన్నికలు** : రావలసిన తేదీ కంటే ముందుగా వచ్చిన ఎన్నికలు.

**ముగ్గులోకి దించడం** : మోసగించి రొంపిలోకి లాగడం.

**ముడుపులు చెల్లించడం** : లంచాలు ఇవ్వడం. తొలుత ఇది భగవత్ కైంకర్యానికి ఇచ్చే వస్తువుకు వాడేవారు.

**మూల్యం చెల్లించడం** : చేసిన తప్పిదానికి అపరాధం చెల్లించడం.

**ముదనష్టం** : అయాచితంగా వచ్చిన ఆస్తి.

## య ర ల వ

**యాగీ చేయడం** : ఒట్టి పుణ్యానికి గోల చేయడం.

**రాజకీయ వ్యభిచారం** : ఎన్నికల కోసం సిద్ధాంత విరుద్ధమైన పార్టీతో జత కట్టడం.

**రాజకీయులు** : రాజకీయాలలో మునిగి తేలేవారు.

**రాజీలేని పోరాటం** : నిరంతర సమరం.

**రామరాజ్యం** : ప్రజలు తిండి, బట్ట, ఇల్లు, పాడిపంటలు సమృద్ధిగా కలిగి హాయిగా జీవించే కాలం. పట్టాభిషేకానంతరం శ్రీరాముడు చేసిన పాలనను రామరాజ్యం అంటారు.

**రిలే నిరాహారదీక్ష** : విరామం తీసుకుని నిరాహార దీక్ష చేయడం.

**రీ కౌంటింగ్** : ఎన్నికలలో ఒకసారి ఓట్లను లెక్కించాక దానిలో ఏదైనా తేడా ఉందని భావిస్తే మరల లెక్కించడం.

**రెఫరెండం** : ప్రజాభిప్రాయం ఎన్నికల ద్వారా తెలుసుకొని తదుపరి నిర్ణయించడం.

**రెబెల్** : తిరుగుబాటుదారుడు. పార్టీ క్రమశిక్షణ ఉల్లంఘించినవాడు.

**రోడ్ షో** : ఊరేగింపుగా రాజకీయ నాయకులు రోడ్డుపై పయనం. ఎన్నికల పరంగా నాయకుల ఊరేగింపు పరంగా ఈ పదం వాడుకలోకి వచ్చింది.

**లంబాడా తండా** : లంబాడీ తెగ నివసించే చోటు.

**లబ్ధిదారులు** : (ప్రభుత్వ పథకాల వలన) లాభం పొందేవారు.

**లింగ వివక్ష** : స్త్రీ, పురుష భేదం చూపి, పురుషునికే ప్రాధాన్యం ఇవ్వడం, స్త్రీని తక్కువగా చూడటం.

**లింకు కాలువలు** : ప్రధాన కాలువ నుంచి మిగతా ప్రాంతాలకు నీరందించే కాలువలు. వీటిని బ్రాంచి కాలువలని అంటారు.

**లిఫ్టిరిగేషన్** : నీటిని లోతట్టు నుంచి పైకి పంపిణీ చేసి వ్యవసాయం చేయడం.

**లొల్లి** : అనవసర రాద్ధాంతం.

**లోతట్టు ప్రాంతాలు** : సాధారణ భూమట్టం కంటే దిగువనగల ప్రాంతాలు. వరదలకు, పెద్ద వానలకు తుఫానులకు ముప్పుకు గురయ్యే ప్రాంతాలు.

**వరదగూడు** : చందమామ చుట్టూ ఏర్పడే వలయం. వలయం దగ్గరగా ఉండే వర్షాలు ఆలస్యంగా పడతాయని దూరంగా ఉంటే తొందరగా పడతాయని రైతాంగం నమ్మిక.

**వామపక్షాలు** : అధికార పార్టీకి వ్యతిరేక పార్టీలు.

**వార్తాహరుడు** : వార్తలను చేరవేసేవాడు. ఈతనినే కొరియర్ అని కూడ అంటారు.

**విద్యుత్ షార్టు సర్క్యూట్** : విద్యుత్ సరఫరా షార్టు సర్క్యూట్ అయితే మీటర్లు, దాంతో భవనాలు కాలిపోయి, కూలిపోయే ప్రమాదం ఉంది. షార్టు సర్క్యూట్ వల్లే గుంటూరు మిర్చియార్డు బుగ్గి అయిందని బలమైన వాదన.

**విధి విధానాలు** : ఒక సంస్థ, పార్టీ నిర్వహణలో ఏర్పరచుకున్న, పాటించదగు నిబంధనలు, నియమాలు.

**విపక్షం** : ప్రతిపక్షం. అధికార పార్టీని ఎండగట్టే వర్గం.

**విశ్వసనీయత** : చిత్తశుద్ధితో వ్యవహరించడం. బాధ్యతాయుత ప్రవర్తన. ఎదుటి వారిలో నమ్మకం కలిగించడం.

**విషపు నవ్వు** : మనసులో కల్మషం ఉంచుకొని నవ్వడం.

**వృక్షో రక్షతి రక్షితః** : చెట్లనుపెంచి వాటిని రక్షించండి. అవి మనలను రక్షిస్తాయి అనేభావం. కాలుష్య నివారణకు ఇది రాచబాట.

**వెన్నుపోటు** : మోసంచేసి అనుకున్నది సాధించడం. పని సాధించేందుకు అనుసరించే వక్రమార్గం.

**వెబ్ సైట్** : సమాచారాన్ని విద్యుల్లిపిలోకి మార్చి, మరల ఉపయోగించుకొనేందుకు వీలుగా బాహ్యంగా ఉంచడం.

**వేటుపడడం** : సాధారణంగా రాజకీయ పార్టీలలో పార్టీ నిబంధనలు ఉల్లంఘించి వ్యవహరించినపుడు శిక్షించడం.

**వైర్‌సిస్టం** : లాకులవద్ద నీరు త్వరగా క్రిందకు పోవడానికి ప్రక్కన మరోకాలువ ద్వారా నీరు విడుదల కావటం.

## శ స హ

**శ్రీముఖం** : వ్యక్తికి ఇచ్చే తాకీదు లేదా నోటీసు.

**శ్వేత విప్లవం** : అధికంగా పాల ఉత్పత్తి చేయడం.

**సంకేతం** : సూచన. ముందుగా తెలియజేసే చిహ్నం.

**సగటు మనిషి** : కనీస అవసరాలు తీరీ, తీరని మనిషి.

**శంకరగిరిమాన్యాలు పట్టించడం** : దారీ కక్షతో కష్టపెట్టడం.

**సన్నాయి నొక్కులు** : తెలిసిన విషయాన్ని వక్రీకరిస్తూ కొంచెం కొంచెం చెప్పడం.

**సబ్సిడీ** : తక్కువ ధరకు అందించడం. ఈ తక్కువను ప్రభుత్వం పూరించవచ్చు.

**సామాజిక వర్గం** : కులానికి కొత్త పేరు.

**సమీకరణలు** : కలయికలు. ఆప్తుల సంబంధాలు.

**సాంఘిక ఉద్యమం** : ప్రజల సామూహిక శక్తిని సమీకరించి, వ్యవస్థాపరమైన మార్పు కోసం చేసే దీర్ఘ కాల పోరాటం. అనుకున్నది సాధించగానే ఉద్యమం సమసి పోతుంది.

ఉదా : భారత స్వాతంత్ర్య ఉద్యమం.

**సాచెట్** : పాలు, కొబ్బరి నూనె తదితరాల నిలువకు ఉపయోగించే ప్లాస్టిక్ సంచి.

**సింగిల్ నంబరు** : ఇది లాటరీ. ఒక నంబరు పందెం కాస్తే – కొన్ని రెట్లు – ఉదాహరణకు 60 రెట్లు లాభం వచ్చే సులభమైన (మోస పూరిత) మార్గం. కానీ, దురదృష్టవశాత్తూ – ఈ పందెంలో నిరుపేదలు పాల్గొని ఉన్నది కాస్తా పోగొట్టుకుంటారు.

**సునామీ** : తీవ్రాతితీవ్రమైన సముద్ర భూకంపం. అపారనష్టానికి గురిచేయగల సాగర తుఫాన్.

**సెంటిమెంటు** : ఆవేశంతో కూడిన అనురాగం.

**సెజ్** : ప్రతి జిల్లాలో ఒక ప్రత్యేక ఆర్థిక మండలి నెలకొల్పి తద్వారా పరిశ్రమల ప్రగతితో మౌలిక సదుపాయాలు కల్పించడం. స్పెషల్ ఇకనామిక్ జోన్.

**సేవాసూచిక** : సేవకు కొలమానం.

**సొండింజనీరు** : చెవిటివాడు (వ్యంగ్య భావన).

**స్కామ్** : మోసం చేసి ధనం సంపాదించేందుకు తోడ్పడే పద్ధతి.

**స్వయం ఉపాధి** : పనిచేసి పొట్టపోసుకోవడం. ఇందుకు ప్రభుత్వ పథకాలు చాల ఉన్నాయి.

**స్వయం సహాయం** : ఒకరికొకరు సహాయం చేసుకుని అభివృద్ధి చెందడం.

**స్టాక్ మార్కెట్** : షేర్లు అమ్మే, కొనే అంగడి.

**స్వాగతించడం** : ఆహ్వానించడం.

**స్వావలంబన** : స్వశక్తిపై బతికే మార్గం ఏర్పరచుకోవడం.

**హంగ్** : చట్ట సభలలో ఒక పార్టీకి తగిన మెజారిటీ లేక ఇతర పార్టీల సాయంతో ప్రభుత్వాన్ని ఏర్పరచటం.

**హంగామా** : మందిని కూడగట్టి హడావుడి చేయడం.

**హరిత విప్లవం** : అత్యధికంగా పంటలు పండించటం.

**హవా** : పలుకుబడి, గాలివాటం.

**హింస రచన** : హింస కోసం చేసే పన్నాగం. దీన్ని ధ్వంస రచన అని కూడా అంటున్నాం.

**హైకమాండ్** : అధిష్ఠాన వర్గం.

**హైడ్రామా** : కృత్రిమ చర్యలు.

# తెలుగు పద సంపద - పర్యాయ పదాలు

తెలుగులో అపారమైన పద సంపద ఉంది. ఒకో భావం వ్యక్తీకరించడానికి ఒకో ప్రత్యేక పదం ఉంది. ఇది వాడుక భాషా పటిమకు నిదర్శనం. పర్యాయ పదం అనగా ఒక పదానికి పలు సమానార్థకాలు ఉండడం, అది అనేక రూపాలలో ఉండడం సహజం.

**అంగడి** దుకాణం, విపణి, జన్యం, ఆదణం.

**అందం** అలరు, ఒప్పు, సొరు, సింగారం, కొమరు.

**అడవి** అరణ్యం, కాంతారం, కాననం, వనం, వని, పర్వతానికి వాలుగా ఉండే పక్కభాగం.

**అన్నం** బువ్వ, వంటకం, కూడు, ఓదనం.

**ఇంద్రజాలం** జాలం, కనుకట్టు, మంత్రం, మాయ.

**ఈర్ష్య** మత్సరం, ఈసు, అసూయ.

**ఉదయం** పొద్దు పొడుపు, సూర్యోదయం.

**ఊపిరి** ఉచ్ఛ్వాసం, నిశ్వాసం, శ్వాస.

**ఏడుపు** ఆక్రందన, గోడు, పరిదేవన, రోదనం, రుదితం.

**ఓదార్పు** అనులాపం, అనునయం, ఉపలాలనం, ఉపశమనం, ఊరడింపు, పరామర్శ, బుజ్జగింపు, లాలన.

**కడుపు** ఉదరం, గర్భం, డొక్క, జఠరం.

**కన్ను** అక్షి, చక్షువు, నయనం, నేత్రం, లోచనం, దేహదీపం.

**గురువు** ఆచార్యుడు, దేశికుడు, ఉపదేశికుడు, విద్యాదాత.

**చిలుక** కీరం, శుకం, హెూర, ముక్కు పురుగు.

**జగం** జగతి, జగత్తు, లోకం, ప్రపంచం.

**జీవితం** జీవనం, బతుకు, మనుగడ, వివాహం, దేహ ధారణ

**జ్ఞానం** ఎరుక, తెలివి, విజ్ఞానం, సంజ్ఞానం, సంగతి, చేతన, చైతన్యం.

**తండ్రి** అయ్య, అప్ప, జనకుడు, జనయిత, నాన్న, నాయన, పిత.

**తరంగం** ఊర్మి, అల, కడలి, తెర.

**తల్లి** జనని, జనయిత్రి, మాత, ధాత్రి, సుతిని, ప్రసూతి, అమ్మ, అంబ.

**తాత** పితామహుడు (తండ్రి తండ్రి), అబ్బ, ఆర్యకుడు, మాతామహుడు (తల్లి తండ్రి)

| | |
|---|---|
| **తేనె** | తేనియ, ఉచ్ఛిష్టం, పుష్పరసం, మధువు, మకరందం, భ్రామరం, పుష్పాసవం. |
| **దాత** | ఈవరి, ఉదారుడు, తెగుదారి, తెగువరి. |
| **ధర** | విశ్వం, ధరణి, పృథ్వి |
| **నవ్వు** | పరిహసించు, హసించు, హాస్యం, కేరింత, హసనం. |
| **నిద్ర** | శయనం, నిదుర, కునుకు, కనుమోడ్చు. |
| **ప్రేమ** | అనురక్తి, అనురాగం, ఇంపు, చెలిమి, నెయ్యం, మచ్చిక, ప్రియత్వం, మమత, మాలిమి, రాగం, వలపు. |
| **బంగారం** | హిరణ్యం, కనకం, కాంచనం, పుత్తడి, భృంగారం, పసిడి, పైడి. |
| **బాల్యం** | చిన్నతనం, పిన్నతనం, ఆటప్రాయం, చిరుతనం, మొలకప్రాయం. |
| **బుద్ధి** | మతి, మనీషి, ధిషణ, ధీ. |
| **బ్రహ్మచారి** | వటువు, ఉపనీతుడు, వర్ణి. |
| **భర్త** | మగడు, పతి, నాథుడు. |
| **భార్య** | పత్ని, ధర్మచారిణి, జాయ, ఇల్లాలు. |
| **భూమి** | అచల, అదితి, అద్రికీల, అవని, ధరణి, నేల, వసుంధర, రత్నసువు, విశ్వంభర, సముద్రమేఖల, హరిప్రియ, సారంగం. |
| **భోజనం** | అన్నం, ఓదనం, కూడు, సాదం, తినివేసినది, ఆహారం, ఓగిరం. |
| **యౌవనం** | ఈడు, ఎలప్రాయం, కోడెప్రాయం, జవ్వనం, తరుణ వయసు. |
| **వివాహం** | పెండ్లి, పరిణయం, పాణిగ్రహణం, మనువు, కల్యాణం. |
| **సమయం** | అదును, కాలం, తరుణం, అంతరం, తరి, సందర్భం. |
| **సముద్రం** | అంబుధి, సాగరం, అంబురాశి, కడలి, జలధరం, జలధి, జలరాశి, నీరధి, పయోధి, సింధువు. |
| **సాయంత్రం** | మాపటివేళ, సంధ్యా సమయం, మాపు, సాయం సమయం, సాయాహ్నం. |
| **స్వేచ్ఛ** | యథేచ్ఛ, విచ్చలవిడి, అలవోక, అవసరం, వ్యుత్థానం, స్వాతంత్ర్యం. |
| **స్త్రీ** | మహిళ, వనిత, అంగన, అంబుజాక్షి, అతివ, నెలత, అబల, అలరుబోడి, చంద్రవదన, అబ్జనయన, అలివేణి, చిగురుబోణి, ఆడది, ఇందువదన, కాంత, కోమలాంగి. |



# తెలుగు పద సంపద - నానార్థాలు

**నానార్థం అంటే ఒకే పదానికి పలు అర్థాలు కలిగి ఉండడం.**

| | |
|---|---|
| **అంకురం** | మొలక, జలం, రోమం, రక్తం |
| **అంగం** | విధం, అందం, ఉపాయం, అవయవం |
| **అండజం** | చేప, పక్షి, పాము, తొండ, గుడ్డు శరీరం నుండి బయటకు వచ్చి పొదగబడటం ద్వారా పుట్టినది ఏదైనా అండజమే |
| **అక్కర** | ప్రయోజనం, శ్రద్ధ, కార్యం, అవసరం |
| **ఇనుడు** | సూర్యుడు, ప్రభువు, భర్త |
| **ఇష్టం** | యజ్ఞం, వాంఛితం, ప్రియం |
| **ఉక్కు** | శౌర్యం, ఒక లోహం, గట్టితనం |
| **ఉత్తరం** | జాబు, ఒక దిక్కు, సమాధానం, శ్రేష్ఠం |
| **ఉత్పలం** | కలువ, నల్లకలువ, పిడక, పాతాళం |
| **ఉపచారం** | సేవ, పూజించుట, చికిత్స, నమస్కారం |
| **ఉపాధి** | ధర్మచింత, కారణం, కపటం |
| **ఉమ** | పార్వతి, కీర్తి, కాంతి, పసుపు |
| **ఋతువు** | రెండు నెలల కాలం, ప్రకాశం, సూర్యుడు |
| **ఋషి** | ముని, ఎలుగు, వేదం |
| **ఐరావతం** | ఇంద్రుని ఏనుగు, నారింజ, రేగు, పాము |
| **కంచుకము** | చొక్కా, రవిక, కవచం |
| **కంఠం** | మెడ, కంఠ ధ్వని, దగ్గర, ఉమ్మెత్త |
| **కనకం** | బంగారం, ఉమ్మెత్త, చంపకం |
| **కపాలం** | తలపుర్రె, భిక్షాపాత్ర, గిన్నె |
| **కల్యాణం** | మంగళం, బంగారు, పరిణయం |
| **కష్టం** | దుఃఖం, శ్రమం, పాపం, బాధ |
| **కాంచనం** | బంగారు, సంపెంగ, ఉమ్మెత్త, పసుపు |
| **కామిని** | సుందరి, కల్లు, కామం కలది |
| **కాలం** | సమయం, చావు, నలుపు |
| **కుముదం** | ఎర్రతామర, తెల్ల కలువ, గాలి, శివుని శంఖం |
| **గుణం** | స్వభావం, విద్య, దయ |

| | |
|---|---|
| **గోవు** | ఆవు, కన్ను, బాణం, దిక్కు, వాక్కు |
| **గ్రామం** | ఊరు, సమూహం, సంగీత స్వరం |
| **జీవం** | ప్రాణం, తత్త్వం, జంతువు |
| **తంత్రం** | తంతు, హేతువు, ప్రధానం, మగ్గం |
| **తటం** | ఒడ్డు, వరిమడి, పల్లం, దిగంతం |
| **తాత** | తండ్రి, బ్రహ్మ, తండ్రి తండ్రి, తల్లి తండ్రి |
| **దక్షుడు** | ప్రజాపతులలో ఒకరు, నేర్పరి, ఒక ముని |
| **దాసుడు** | సేవకుడు, శూద్రుడు, జాలరి, జ్ఞాని |
| **ద్విజం** | పక్షి, పాము, దంతం |
| **ధర్మం** | పుణ్యం, స్వభావం, న్యాయం, ఆచారం |
| **ధాత** | బ్రహ్మ, రక్షించువాడు, ధరించువాడు, ఒక సంవత్సరం |
| **ధీమంతుడు** | పండితుడు, బృహస్పతి, బుద్ధిమంతుడు |
| **నాణెం** | నాగరికత, బంగారపుబిళ్ళ, ముద్ర, వెండి, మేలిమి |
| **నిర్యాణం** | మరణం, ముక్తి, ఏనుగు కడకన్ను |
| **నీరజం** | తామర, ముత్యం, నత్తగుల్ల |
| **నేత్రం** | కన్ను, పేరు, ఏను, నక్షత్రం |
| **పత్రం** | ఆకు, బాణం, ఱెక్క, ఉత్తరం |
| **పదం** | పాదం, చిహ్నం, పద్యపాదం, అంశం |
| **పరికరం** | ఉపకరణం, నడికట్టు, సమూహం, ఒడ్డాణం |
| **పాలు** | క్షీరం, భాగం, వంతు, సమీపం |
| **పుణ్యం** | ధర్మం, మనోజ్ఞం |
| **భానుడు** | సూర్యుడు, రాజు, దినం, కరణం |
| **మోక్షము** | కైవల్యం, విడుపు, మొక్కపుచెట్టు |
| **శుద్ధి** | శోధనం, నిర్మలత్వం, మార్జనం |
| **సంకేతం** | సంజ్ఞ, గుర్తు, ఏర్పాటు |



# కొన్ని తెలుగు పదాల వ్యుత్పత్తులు

| | |
|---|---|
| **అంతేవాసి** | గురువుగారింట విద్యనభ్యసించేవాడు |
| **అంబ** | కాశీరాజు కూతురు |
| **అంభోజం** | నీటినుంచి పుట్టినది (పద్మం) |
| **అంబోధి** | నీటికి స్థానమైనది (సముద్రం) |
| **అచలము** | చలించినది (పర్వతం) |
| **అక్షపాదుడు** | పాదమందు నేత్రాలు కలవాడు (గౌతముడు) |
| **అతిథి** | తిథి, వార, నక్షత్ర నియమం లేకుండా ఏ సమయమందైనా వచ్చేవాడు (అతిథి) |
| **అపూర్వం** | పూర్వం లేనిది |
| **అదృష్టము** | చూడడానికి వీలు లేనిది (దైవం) |
| **అనిమిషపతి** | దేవతలకు రాజు (ఇంద్రుడు) |
| **అనిమిషులు** | రెప్పవాల్చనివారు (దేవతులు) |
| **అనూరుడు** | తొడలు లేనివాడు (సూర్యసారధి) |
| **అపత్యము** | నరకము - అనే పతనదశ నుంచి కాపాడేది (సంతానం) |
| **అమరలోకము** | అమరులు అనగా దేవతలు నివసించే లోకం (స్వర్గం) |
| **అమాత్యుడు** | మంత్రం అంటే ఆలోచన గలవాడు (మంత్రి) |
| **అమితము** | మితం కానిది (ఎక్కువైనది) |
| **అమూల్యం** | వెలకట్ట లేనిది (వెలలేనిది) |
| **అయోధ్య** | యోధులను జయింప శక్యం కాని దేశం (కోసలదేశ రాజధాని) |
| **అయోనిజ** | గర్భం ధరించకుండా పుట్టినది (సీత) |
| **అరిష్టం** | శుభం కానిది (అశుభం) |
| **అశ్వత్థం** | అశ్వరూపమైన అగ్నిని ధరించి ఉండేది (రాత్రి) |
| **అసత్యం** | సత్యం కానిది (అబద్ధం) |
| **అసివ్రతం** | అసి అంటే కత్తి వంటి ఆసలు కలది |
| **ఆంజనేయుడు** | శివతేజము గ్రహించిన వాయువు వలన అంజనాదేవికి పుట్టినవాడు (హనుమంతుడు) |
| **ఆత్మభువు** | ఆత్మలో పుట్టిన వాక్కు (సంతోషం) |
| **ఆమోదం** | దూరంగా వ్యాపించి పరిమాణం |

| | |
|---|---|
| **ఇందీవరం** | ఇందిర అనగా లక్ష్మిచే ప్రేమింపబడినది (నల్లకలువ) |
| **ఇంద్రజిత్తు** | ఇంద్రుని జయించినవాడు (మేఘనాథుడు) |
| **ఈశ్వరుడు** | స్వభావం చేతనే ఐశ్వర్యం గలవాడు (శివుడు) |
| **ఉదకం** | ద్రవరూపంలో ఉండేది |
| **ఉదధి** | ఉదకాన్ని ధరించేది (నీరు) |
| **ఊర్వసి** | నాయమని తొడల నుండి పుట్టినది (ఊర్వశి) |
| **ఊర్ధ్వలోకం** | భూలోకానికి పై లోకం (స్వర్గం) |
| **ఊర్మితూల** | తరంగాలు అనగా అలలు మాలగా గలది (సముద్రం) |
| **ఏకచరం** | ఒంటరిగా తిరుగాడునది (ఖడ్గమృగం) |
| **ఐంద్రజాలికుడు** | ఇంద్రజాలం చేసేవాడు (మాయావి) |
| **ఔషధం** | ఓషధుల వలన తయారయ్యేది (మందు) |
| **ఔదాశన్యము** | ఉదాసీన భావం (ఇష్టం లేకుండుట) |
| **కచ్ఛపం** | పుచ్ఛము అనగా తోకతో నీటిని తాగేది (తాబేలు) |
| **కడలి** | కడలు అనగా అలలు కలది (సముద్రం) |
| **కపాలమాలి** | కపాలాలు అనగా పుఱ్ఱెలు మాలగా కలవాడు (శివుడు) |
| **కపాలి** | కపాలం అనగా పుఱ్ఱెలు భిక్షపాత్రగా కలవాడు |
| **కలకంఠి** | ఎంతో మధురమైన కంఠస్వరం కలది (స్త్రీ) |
| **కలాపి** | పింఛాలు కలది (నెమలి) |
| **కుంభకారుడు** | కుంభము అనగా కుండలను చేసేవాడు (కుమ్మరి) |
| **కృష్ణద్వైపాయనుడు** | కృష్ణ ద్వీపంలో నివసించేవాడు |
| **కృష్ణుడు** | నల్లని వర్ణము కలవాడు (కృష్ణుడు) |
| **కేసరి** | జూలు కలది (సింహం) |
| **క్షత్రియుడు** | క్షతము అనగా దెబ్బవలన రక్షించేవాడు |
| **గంధర్వం** | సుగంధాలు అలముకున్నవారు (దేవతలు) |
| **గురువు** | అంధకారం అనే అజ్ఞానాన్ని తొలగించేవాడు (ఉపాధ్యాయుడు) |
| **చంచలాత్ములు** | స్థిరస్వభావం లేని ఆత్మలు కలవి (పక్షులు) |
| **చతుష్టిథం** | నాలుగు వీధులు కలిసేచోటు (రాజమార్గం) |
| **జగన్నాథుడు** | ఈ ప్రపంచానికి రాజు (శ్రీమహా విష్ణువు) |
| **జలధి** | నీరు కలది (సముద్రం) |
| **జలజం** | జలము అనగా నీటినుండి పుట్టినది |

| | |
|---|---|
| **జాహ్నవి** | జహ్ను అనే మహర్షి చెవినుండి పుట్టినది |
| **జీమూతం** | నీరు బంధింపబడినది, మేఘం |
| **జ్వలనుడు** | మండే స్వభావం కలవాడు (సూర్యుడు) |
| **తద్దినం** | మృతి చెందిన నాటిదినం (ఆబ్దికం) |
| **తపోధనుడు** | తపస్సేధనంగా కలవాడు (ఋషి) |
| **తలోదరి** | చిన్న ఉదరం కలది (స్త్రీ) |
| **తిలకం** | తిల అనగా నువ్వుగింజ వలె ఉండేది (బొట్టు) |
| **తురంగం** | త్వరగా పరుగెత్తేది (గుఱ్ఱం) |
| **తుహనాది** | తుహనం అనగా మంచుతో కూడిన కొండ (హిమాలయపర్వతం) |
| **తూణీరం** | బాణాలతో నింపేది (అమ్ములపొది) |
| **తినేత్రుడు** | మూడు కన్నులు కలవాడు (శివుడు) |
| **దశముఖుడు** | పది ముఖాలు అనగా తలలు కలవాడు (రావణుడు) |
| **దాశరథి** | దశరథ మహారాజు కుమారుడు (శ్రీరాముడు) |
| **దివాంధం** | పగటిపూట చూడలేనిది (గుడ్లగూబ) |
| **దివిజము** | దివి అనగా స్వర్గంలో పుట్టినవారు (దేవతలు) |
| **దీపావళి** | దీపాలవరుస (దీపాణ) |
| **ద్విజుడు** | రెండు జన్మలు కలవాడు (బ్రాహ్మణుడు) |
| **ద్విపదుడు** | రెండు పాదాలు కలవాడు |
| **ధరణి** | ధర అనగా విశ్వాన్ని ధరించేది (భూమి) |
| **ధరిత్రి** | ధర అనగా విశ్వాన్ని ధరించేది (భూమి) |
| **ధూర్జటి** | భారమైన జడలు కలవాడు (శివుడు) |
| **ధశము** | గమనం లేనిది. పర్వతం |
| **నళినీబాంధవుడు** | పద్మాలకు బంధువు (సూర్యుడు) |
| **నిటలాక్షుడు** | నుదుట కన్నులు గలవాడు (శివుడు) |
| **నిశాచరుడు** | రాత్రులందు సంచారం చేసేవాడు (రాక్షసుడు) |
| **పయోధరం** | పయస్సు అనగా పాలును ధరించేది (మేఘం) |
| **పక్షి** | పక్ష గలది (పక్షి) |
| **పాదపం** | పాదములచే నీటిని తాగేది (వృక్షం) |
| **పారావారం** | విస్తారమైన తీరము గలది (సముద్రం) |
| **పీతాంబరుడు** | పచ్చని వస్త్రాలు ధరించేవాడు (విష్ణువు) |
| **పీయూషలు** | పానము చేసేది (అమృతం) |
| **ప్రజాపతి** | ప్రజలకు రాజు (బ్రహ్మ) |

| | |
|---|---|
| **ప్రచేతనుడు** | మంచి మనస్సు కలవాడు (వగవాడు) |
| **ప్రద్యుమ్నుడు** | గొప్ప బలశాలి (మన్మధుడు) |
| **బలభద్రుడు** | బలముచే శ్రేష్ఠుడు (బలరాముడు) |
| **బలరాముడు** | బలముచే జనులను రంజింపచేసేవాడు |
| **భూపాలుడు** | భూమిని పాలించేవాడు (రాజు) |
| **భూరుహము** | భూమి నుంచి పుట్టినది (చెట్టు) |
| **మదనుడు** | మదింపచేసేవాడు (మన్మధుడు) |
| **మధుసూదనుడు** | మధువు అనే రాక్షసుని సంహరించినవాడు (విష్ణువు) |
| **మానవుడు** | మనువు వలన జన్మించినవాడు |
| **రత్నగర్భ** | భూగర్భంలో రత్నాలు గల భూమి (భూతి) |
| **రత్నాకరం** | రత్నములకు నిలయం (సముద్రం) |
| **రాఘవుడు** | రఘువంశంలో జన్మించినవాడు (రాముడు) |
| **లంబోదరుడు** | వ్రేలాడునట్టి పొట్ట గలవాడు (గణపతి) |
| **విశాలాక్షి** | విశాలమైన కన్నులు గల వనిత (పార్వతి) |
| **విశ్వంభర** | విశ్వాన్ని ధరించేది (భూమి) |
| **విశ్వామిత్రుడు** | ప్రపంచానికి మిత్రుడు |
| **వేదవ్యాసుడు** | వేదాలను విభాగం చేసినవాడు |
| **వేదాంగం** | వేదాలగు అవయవాలైన ఆరు శాస్త్రాలు |
| **శంభుడు** | శంఖాన్ని ధరించేవాడు, సుఖాన్ని కలిగించేవాడు (శివుడు) |
| **శీతాద్రి** | చల్లనైన కొండ (హిమాలయం) |
| **శ్రీ** | విష్ణువును ఆశ్రయించినది (లక్ష్మి) |
| **షట్పదం** | ఆరు పాదాలు కలది (తుమ్మెద) |
| **షన్ముఖి** | ఆరు ముఖాలు కలవాడు (కుమారస్వామి) |
| **సంజీవి** | మరణించేవారిని బ్రతికించే మందు. |
| **సంధ్య** | అహోరాత్రాలచే సంధింపబడినది. (ఉదయ, మధ్యాహ్న, సాయంకాలములు) |
| **సాగరం** | సగర కుమారుల చేత యాగాశ్వాసం కొరకు త్రవ్వినది (సముద్రం) |
| **సృగాలము** | మాంసం తినేది (నక్క) |
| **హుతభుక్కు** | హుతాన్ని అనగా హోమద్రవ్యాన్ని భుజించేవాడు అగ్ని |
| **హిమాద్రి** | హిమం అనగా మంచుగల పర్వతాలు (హిమాలయాలు) |



# ప్రకృతి - వికృతులు

| ప్రకృతి | వికృతి | ప్రకృతి | వికృతి |
|---|---|---|---|
| అంక | అంకె | అచ్చుతలు | అక్షత |
| అంకణం | అంకణ | అచ్చెరువు | ఆశ్చర్యం |
| అంకము | అంకం | అటవి | అడవి |
| అంకుశం | అంకుసం | అడలు | అడవి |
| అంగణం | అంకణం | అద్భుతం | అబ్బురం |
| అంగడి | అంగణం | అధికం | అదనం |
| అంగారం | ఇంగలం | అనాధ | అనద |
| అంగు | అంగ | అనుకూలం | అనుగవం |
| అంగుష్ఠం | అంగుటం, | అన్యము | అన్నెము |
| | ఉంగటం | అన్యాయం | అవనాయం |
| అంగుళీయకం | అంగులీయకం | అన్నెం | అన్యాయం |
| అంచ | హింస | అపత్యం | బొట్టియ |
| అంచపదం | హింసపదం | అపారం | అబ్బరం |
| అంచల | అంచు | అపూపం | అప్పము |
| అంజల | అంజలి | అపూర్వం | అపురూప |
| అంతఃపురం | అంతిపురి | అప్పలు | అపూప |
| అంతు | అంత | అప్సరస | అచ్చర |
| అంబర | అంబరు | అపోసనం | అపోము |
| అంబ | అమ్మ | అభ్యాసం | అబ్బసం |
| అంబిక | అమ్మిక | అమావాస్య | అమవస |
| అక్షయం | అక్కజం | అర | అరలు |
| అక్షరం | అక్కరం | అరదం | రధం |
| అఘాత | అగడ్త | అర్కా | అక్క |
| అగరు | అగలు | అరుంధతి | ఆరంజోతి |
| అగ్ని | అగ్గి | అర్ధరాత్రి | అద్దమరేయి |
| అచ్ఛ | అచ్చు | అర్థాశ | అడియాశ |

| ప్రకృతి | వికృతి | ప్రకృతి | వికృతి |
|---|---|---|---|
| అరిసె | అతిశస | ఆమంత్రణం | ఆమతి |
| అర్పణం | అప్పనం | ఆయత్తం | ఆయతం |
| అలక్తం | లత్తుకం | ఆయుధం | ఆయిదం |
| అలక్ష్యం | అలకనం | ఆరంభం | ఆరబం |
| అలస | అలుచు | ఆరాచి | తరాజు |
| అలిపరి | అల్ప | ఆరాత్రి | ఆర్తి |
| అల్పం | అలుపం | ఆరామం | ఆరాం |
| అలుచు | అలక | ఆరోహ | ఆరగింపు |
| అవకటం | అవగడం | ఆర్జన | ఆజన |
| అశ్రద్ధ | అసడ్డ | ఆర్య | అయ్య |
| అష్టకం | అట్టం | ఆర్యీ | ఆయీ |
| అసుర | అసర | ఆలస్యం | ఆలసం |
| అహం | ఆము | ఆలాపం | ఆలపించు |
| అహమిక | ఆమిక | ఆశ | ఆస |
| అందోళిక | అందలం | ఆశ్చర్యం | అచ్చెరువు |
| ఆకాశం | ఆకసం | ఆశ్రయం | ఆసర |
| ఆగ్రహము | ఆగడము | ఆసక్తి | ఆసత్తి |
| ఆచ్ఛికం | అచ్చికం | ఆహారం | ఓగిరము |
| ఆజ్ఞ | ఆన | ఆళి | ఓలి |
| ఆజ్ఞప్తి | ఆనతి | ఇక్షు | ఇంచు |
| ఆతంకం | అడ్డంకి | ఇచ్ఛ | ఇచ్ఛ |
| ఆధార | అధరువు | ఇలిక | ఎలుక |
| ఆతురం | ఆత్రం | ఇష్టిక | ఇటిక |
| ఆత్మ | ఆతుమ | ఈర్ష్య | ఈసు, ఈరసం |
| ఆధారం | ఆదరువు | ఈశ్వరుడు | ఈసరుడు |
| ఆపోశనం | ఆపోసనం | ఈసత్ | ఇంచుక |
| ఆభుక్తి | ఆబూతి | ఈహ | ఇయ్య |
| ఆమండం | ఆముదం | ఉక్కల | ఉక్కలుడు |

| ప్రకృతి | వికృతి | ప్రకృతి | వికృతి |
|---|---|---|---|
| ఉగ్ర | ఉక్కెర | ఊర్ణి | ఉన్ని |
| ఉచ్ఛ్వాస | ఊసివాసం | ఊర్మి | ఉమ్మి |
| ఉత్కలు | ఉత్కలం | ఊష్మ | ఉబ్బ |
| ఉత్కారిక | ఉక్కెర | ఊషరం | ఊసరం |
| ఉత్తరం | ఉత్తరువు | ఋక్ష | రొక్కము |
| ఉత్తరణం | ఉత్తరించు | ఋషి | రుసి |
| ఉత్తరీయం | ఉత్తరిగం | ఏకాంతం | ఏకతం |
| ఉత్పత్తి | ఉప్పతిల్లు | ఏకాకి | ఎక్కటి |
| ఉత్సర్జనం | ఉజ్జనం | ఓఢ్యాణ | ఒడ్డాణం |
| ఉదయం | ఒదవు | ఓల్ల | అల్లము |
| ఉద్గారం | ఓకరింత | కంకేళి | కంగేళి |
| ఉద్ధతి | ఉదుట | కంఠం | గొంతు |
| ఉద్యోగం | ఉద్దియం | కుంఠికా | కంటె |
| ఉన్మత్త | ఉమ్మెత్త | కండూతి | కండు |
| ఉన్మాద | ఉన్మాదం | కంథా | గంత |
| ఉపరి | ఉపరం | కందర | గ్రంత |
| ఉపవాసం | ఉపాసం | కంధరం | కందరం |
| ఉపాహారం | ఉపారం | కంబళ | కంబళి |
| ఉపాధ్యాయ | ఒజ్జ | కక్ష్య | చంక |
| ఉపాధ్యాయిని | ఒజ్జసాని | కక్ష్యా | కచ్చడం |
| ఉపాయం | ఉపము | కచ్ఛ | కాసె |
| ఉపేక్ష | ఒప్పరికం | కటు | గాటు |
| ఉరస్సు | ఔమ్ము | కఠారు | కటారి |
| ఉరూపి | ఉలచ | కథ | కత |
| ఉల్బణం | ఉబ్బుకం | కదంబ | కడిమి |
| ఉల్కా | ఉక్క | కన్యా | కన్నె, కన్నియ |
| ఉల్లాసం | ఉల్లసం | కపటి | గుచ్చి |
| ఉలూకు | ఉలచ | కపిల | కవిల |
| ఉష్ట్రము | ఒంటె | కపింజల | కువుజు |
| | | కబళం | కవళం |

| ప్రకృతి | వికృతి | ప్రకృతి | వికృతి |
|---|---|---|---|
| కరవాలం | కరవాలు | కావటీ | కావటి |
| కరవింద | కలివి | కావ్యం | కబ్బం |
| కర్కర | కంకర | కషాయం | కాసె |
| కర్కశ | కరకు | కాష్ఠ | కట్టె |
| కర్ణ | కన్నము | కిన్నర | కిన్నెర |
| కర్త్రీ | కత్తి | కిరీటి | క్రీడి |
| కర్పర | కప్పెర | కీర్తి | కీరితి |
| కర్పూరం | కపురం | కుండికా | గుండిగ |
| కర్మ | కమ్మ | గుండల | గుండ్రం |
| కరశాణ | కరసాన | కుండీ | కుండ |
| కలంజ | గంజాయి | కుంతి | గొంతి |
| కలయ | కలము | కుక్కుటం | కోడి |
| కలవాలం | కరవాలు | కుటీరం | గుడిసె |
| కలహం | కయ్యం | కుటీ | గుడి |
| కలిక | కళ్ళెము | కుడ్యము | గోడ |
| కల్మజా | కలుచు | కుఠారి | గొడ్డిలి |
| కల్యా | కల్లు | కుద్దాలము | గొడ్డలి |
| కవి | కయి | కుమారుడు | కొమరుడు |
| కష్టము | కస్తి | కురంటక | గోరంట |
| కస్తూరి | కస్తురి | కుక్కురం | కుక్క |
| కళంకం | కళంకు | కులం | కొలం |
| కాంక్ష | కచ్చు | కుశం | కస్సె |
| కాండ | కాడ | కుశల | కుసులు |
| కాంశ్య | కంచు | కూర్పాసం | కుబుసము |
| కాక | కాకి | కూష్మాండం | గుమ్మడి |
| కాకల | కాకితము | కృత్తికా | కత్తెర |
| కాన్యం | కానం | కృషి | కరిసెము |
| కారికా | కారియ | కృష్ణుడు | కన్నయ్య |
| కార్పటిక | కోమటి | కేక | కేస |
| కార్యం | కర్ణం | కైరవం | కలువ |

| ప్రకృతి | వికృతి | ప్రకృతి | వికృతి |
|---|---|---|---|
| కోణ | కొన | గుంజ | గురీజ |
| కోమలా | కోమలి | గుప్తం | గుత్తము |
| కౌపీనం | గోచి | గుహ | గొబ |
| క్రాంతి | కార్తె | గూఢము | గుట్టు |
| క్రూర | కూళ | గృధ్రము | గద్ద |
| క్రోశం | క్రోసు | గృహము | గీము |
| క్రౌంచం | కొంగ | గోణి | గోనె |
| క్షారం | కారం | గోధూమ | గొదుమ |
| క్షతికా | చిటిక | గోపాల | గొల్ల |
| క్షుధ | గొద | గోమతి | కోమటి |
| క్షుర | చురియ | గోష్ఠము | కొట్టము |
| క్షేమం | సేమం | గౌరవం | గారవం |
| ఖండ | కండ | గౌరి | గౌరు |
| ఖడ్గం | కగ్గం | గ్రంథి | కంతి |
| ఖని | గని | గ్రాసం | గాసం |
| ఖనిత్రం | గునపం | ఘంట | గంట |
| ఖరుర | కప్పెర | ఘటి | గడియ |
| ఖాత | గాతము | ఘటికార | గడియారం |
| ఖేచర | కేసరి | ఘట్టము | గట్టు |
| గంధర్వుడు | కత్తళుడు | ఘీంకారం | గీంక |
| గద | గుదియ | ఘోణి | గూటి |
| గద్గద | గగ్గు | చంగ | చక్కన |
| గర్త | గుంట | చంచు | చెంచు |
| గర్భం | కడుపు | చండికా | చండి |
| గహన | గగన | చంపక | సంపెంగ |
| గహ్వరం | గవి | చణ | జాణ |
| గాఢం | గాటం | చతురంగం | చదరంగం |
| గాయని | గాణి | చతుర్దంతి | చౌదంతి |
| గార్దభం | గాడిద | | |
| గుణాలయం | గుడారు | | |

| ప్రకృతి | వికృతి | ప్రకృతి | వికృతి |
| --- | --- | --- | --- |
| చతురి | చవితి | టంకశాలా | టంకశాల |
| చమరి | సవరం | ఢక్కా | డంకా |
| చామరం | వింజామరం | డింగర | డింగరి |
| చాలనీ | జల్లెడ | తంత్రి | తంతు |
| చించా | చింత | తటం | తట్టు |
| చిత్రము | చిత్తరువు | తపస్వి | తపసి |
| చిరి | చిలుక | తమట | తప్పెట |
| చిహ్నం | చిన్నెం | తస్కరం | తక్కిలి |
| చీర | జీర | తాంబూలం | తమ్మలం |
| చేలము | చీర | తామరసం | తామర |
| చేష్ట | చేత | తాల | తాళము |
| చోద్యం | సొద్దెము | తాళ | తాడి |
| ఛాత్రుడు | చట్టువు | తింత్రిణి | చింత |
| ఛాయ | చాయ | తిథి | తేది |
| ఛాత్ర | చట్టు | తిమ్మిర | తిమర |
| ఛిద్రం | చిందర | తిలలు | తెలకలు |
| ఛురిక | చురియ | తీవ్రం | తిరువు |
| జటా | జడ | తుండం | తొండం |
| జటాధారి | జడదారి | తులం | దొమ్మి |
| జయకరి | జాకర | తురంగం | తురక |
| జాగరం | జాగారం | తురుష్కుడు | తురక |
| జాడ్యం | జడ్డ | తులసి | తొళసి |
| జాతిపత్రం | జాజిపత్రి | తుషారం | తుంపర |
| జారిణి | జజారి | తూలం | దూది |
| జీర్ణం | చిరుగు | తృటి | చిటిక |
| జూటం | జుట్టు | తోరణం | తోవకము |
| జ్యేష్ఠ | జెష్ట | త్యాగం | చాగము |
| జ్యోతి | జోతి | త్యాగి | చాగి |
| జ్యోతిషం | జోస్యం | త్రిఘట | తెగడ |

| ప్రకృతి | వికృతి | ప్రకృతి | వికృతి |
|---|---|---|---|
| త్రిలింగ | తెలుగు | ద్రుణం | దొనం |
| దండ | దండు | ద్రోణికా | దొన్నె |
| దంపతి | జంపతి | ద్వయీ | దోసిలి |
| దక్షిణం | దక్కినం | ద్వాదశాహ | బారసాల |
| దత్తత | దత్తు | ద్వారం | దారి |
| దర్భ | దబ్బ | ద్వారబంధం | దారబంధం |
| దశరాత్రులు | దసరా | ద్వీపం | దీవి |
| దశ | దెస | ద్వేషం | దేసం |
| దాయాద | దాయ | ద్రోహి | దొని |
| దిశ | దెస | ధన్వీ | దణి |
| దివా | దివి | ధవళం | తెలుపు |
| దీపం | దివ్వె | ధాత | తాత |
| దుండి | దొండ | ధాత్రి | దాది |
| దుర్గా | దుర్గి | ధూళి | దూలి |
| దుష్ట | తుంట | ధృష్ట | దిట్ట |
| దృఢం | దిటం | ధౌత | ధోవతి |
| దృతి | తిత్తి | నరసింహ | నరసింహుడు |
| దేవ | దేవర | నర్తక | నట్టువు |
| దేవయానం | దివాణం | నాక | నక్క |
| దేవాలయం | దేవళం | నాకబలి | నాగవల్లి |
| దేవి | దేవేరి | నాక్ర | నక్క |
| దైవం | దయ్యం | నాట్యము | నట్టువ |
| దోషం | దోసం | నాడి | నారి |
| దోషకం | దోసె | నాయన | నాయఁడు |
| దోల | జోలె | నిజం | నిక్కం |
| దోషి | దోసి | నిత్యం | నిచ్చెలు |
| దౌష్ట్యం | దుండగము | నిద్ర | నిదుర |
| ద్యూతం | జూదం | నిమిషము | నిముసం |
| ద్రవిణం | త్రాణం | నియమం | నీమం |

| ప్రకృతి | వికృతి | ప్రకృతి | వికృతి |
|---|---|---|---|
| నిర్ధారణ | నిబ్బరం | పాయసం | పాసెం |
| నిర్మలం | నిచ్చలం | పింఛం | పించ |
| నిశా | నిసి | పింజ | పిచం |
| నిశ్చయం | నిచ్చయం | పిండికా | పిక్క |
| నిశ్రేణి | నిచ్చెన | పిప్పలీ | పిప్పి |
| నిస్సంతతి | నిస్సంతు | పిష్టపం | పిండి |
| నీరము, నీర | నీరు | పీఠం | పీట |
| నృత్తం | నెత్తం | పుండ్ర | బొట్టు |
| నేమి | నెమ్మి | పుణ్యం | పున్నెం |
| నౌక | నావ | పుత్తళికా | పుత్తడి |
| పంచసార | పంచదార | పురి | ప్రోలు |
| పండితుడు | పంతులు | పులాకం | పులగం |
| పక్షము | పక్కి | పుష్పం | పూవు |
| పంక్తి | బంతి | పుస్తకం | పొత్తం |
| పట్టణం | పట్నం | పూరికా | పూరి |
| పదము | పదవి | పూర్తిగా | బొత్తిగా |
| పదకం | పతకం | పూర్ణిమ | పున్నమ |
| పద్యం | పద్దెం | పృథివి | పుడమి |
| పర | పరాయి | పేటీ | పెట్టె |
| పరామర్శ | పరామరిక | ప్రకృతి | పగిది |
| పరిధి | పరిది | ప్రతిజ్ఞ | ప్రతిన |
| పరిహాసం | పరియాచకం | ప్రతిమా | పతిమ |
| పరువం | పరువు | ప్రధాని | ప్రగ్గడ |
| పర్వం | పబ్బం | ప్రభువు | పబువు |
| పలే | పల్లె | ప్రమిద | పమిదె |
| పల్వల | పల్లం | ప్రయాణం | పయనం |
| పాదం | పాదు | ప్రలాపం | పలవరం |
| పాదిక | పాతిక | ప్రశ్న | పన్నం |
| పాపి | పావి | ప్రసాదం | పసాదం |

| ప్రకృతి | వికృతి | ప్రకృతి | వికృతి |
|---|---|---|---|
| ప్రస్తరం | పొత్తరం | మతి | మది |
| ప్రాకారం | ప్రహరి | మత్సరం | మచ్చరం |
| ప్రాణం | పానం | మతుక | మెరక |
| ప్రాయం | పరువం | మరువకం | మరువం |
| ప్రాయశ్చిత్తం | ప్రాచితం | మర్దళ | మద్దెల |
| ప్రేమ | పేర్మి | మర్యాద | మరియాద |
| బక | పక్కి | మలిన | మయిల |
| బలిష్ఠుడు | బల్లదుడు | మాణిక్యం | మానికం |
| బిడాలం | పిల్లి | మాననీయ | మన్నియ |
| బిలము | బెలము | మాలికా | మాలిగ |
| బిల్వ | బిలువం | మనుష్యుడు | మానిసి |
| బృందం | బిందము | మార్జిక | మజ్జిగ |
| బ్రహ్మ | బమ్మ, బొమ్మ | మాలా | మాలి |
| బ్రాహ్మణుడు | బాపడు | ముకుళం | మొగ్గ |
| భక్తి | బత్తి | ముక్తా | ముత్తెము |
| భటుడు | బంటు | ముక్తి | ముత్తి |
| భస్మం | బసుమం | ముగ్ధా | ముగుద |
| భాండం | బాన | ముద్రా | ముద్దు |
| భారం | బరువు | మూక | మూగ |
| భాష | బాస | మూర్ఖం | మంకు |
| భిక్షం | బిచ్చం | మూర్ఖుడు | మూఢుడు |
| భీతి | బీతు | మాలికా | మొక్క |
| భుక్తి | బూతి | మృగం | మెకము |
| భూతం | బూచి | మృత్తికా | మిత్తిక |
| భృంగారం | బంగారం | మృత్తు | మట్టి |
| భేరి | బేరి | మృత్యు | మిత్తి |
| మంచం | మంచె | మేఘం | మొగులు |
| మంటపం | మండపం | మేధస్సు | మెదడు |
| మంత్రం | మంతరం | మేషం | మేక |
| మణి | మిన్న | మౌక్తికం | ముత్తియం |

| ప్రకృతి | వికృతి | ప్రకృతి | వికృతి |
|---|---|---|---|
| యంత్రం | జంత్రం | రూప్యం | రూపాయి |
| యంత్రిక | జంతిక | రోషం | రోసం |
| యజ్ఞం | జన్నం | రౌరవం | రోరవం |
| యజ్ఞోపవీతం | జందియం | లక్షణం | లక్కణం |
| యత్నం | జతనం | లక్ష్మి | లచ్చి |
| యముడు | జముడు | లఘువు | లగువు |
| యమునా | జమునా | లాంగలం | నాగలి |
| యశస్సు | అసము | లాక్షా | లక్క |
| యాత్ర | జాతర | లాఘవ | లగువు |
| యాయవర | ఆయవారం | లేఖ | లేక |
| యుక్తి | ఉత్తి | లేశం | లేసు |
| యువతి | ఉవిద | వంశ | వాసము |
| యోగి | జోగి | వంశం | వంగడం |
| యౌవనం | జవ్వనం | వటు | చిటుక |
| రంధ్రం | క్రంతం | వటువు | వడుగు |
| రతి | రంతు | వధూనీ | వదినె |
| రత్నం | రతనం | వనితా | వెలది |
| రథం | అరదం | వర్ణ | వన్నె |
| రథ్యా | రచ్చ | వర్తి | వత్తి |
| రహాట | రాట్టము | వల్క | వక్క |
| రాక్షసుడు | రక్కసుడు | వశం | వసం |
| రాఘవుడు | రాగవుడు | వళి | వడి |
| రాజ | రాచ | వాంత | వాంతి |
| రాజభారం | రాయబారం | వాటీ | వాడ |
| రాజసం | రాయసం | వాపీ | బావి |
| రాజహంస | రాయంచ | వాల | వాలు |
| రాత్రి | రేయి, రేతిరి | వాసం | బస |
| రాశి | రాసి | వికల | వెకిలి |
| రుద్రాక్ష | రుదురక్క | విజ్ఞాపన | విన్నపం |
| రూఢి | రూడి | విద్వరం | విడ్డూరం |

| ప్రకృతి | వికృతి | ప్రకృతి | వికృతి |
| --- | --- | --- | --- |
| విద్య | విద్దె | శక్తి | సత్తి |
| విధం | విత్తం | శబ్దం | సద్దు |
| విప్ర | పాగడు | శమీ | జమ్మి |
| వినాయక | వెనకయ్య | శయ్యా | సెజ్జ |
| విభూతి | విబూది | శర్కరా | చెక్కెర |
| విరహం | విరాళి | శలాక | సలాక |
| విరాగి | బైరాగి | శల్యం | చీల |
| విశ్వాసం | విసువాసం | శవం | శబం |
| విషం | విసం | శాల | సాల |
| విష్ణుడు | వెన్నడు | శాలికా | సాలె |
| వివరణ | వివరము | శాస్త్రం | చట్టం |
| విసర్జ | వెచ్చము | శిఖర | చివర |
| విస్మయం | విసుమానం | శిఖా | సిగ |
| విహ్వాల | విలవిల | శిలా | సెల |
| వృద్ధి | వడ్డి | శుంఠి | సొంటి |
| వృషభం | బసవన్న | శుకం | చిలుక |
| వేత్రం | బెత్తం | శుచి | చిచ్చు |
| వేషం | వేసం | శూన్యం | సున్న |
| వైశ్య | వ్రాసె | శిరీష | దిరిశెన |
| వైద్యుడు | వేజ్జుడు | శృంఖల | సంకెల |
| వ్యంగ్య | వెంగిలి | శృంగారం | సింగారం |
| వ్యంజన | వీవన | శోభనం | సోబనము |
| వ్యయం | వెచ్చం | శ్మశానం | మసనం |
| వ్యర్థము | వమ్ము | శ్రమ | చెమట |
| వ్యవహారం | బేహారం | శ్రీ | సిరి |
| వ్యాఖ్యానం | వైనం | శ్రీగంధం | సిరిగంద్రం |
| వ్రీడా | బిడియం | శ్రీధరం | సీదరం |
| శంక | జంకు | శ్రీమంత | సిరిమంతుడు |
| శంఖం | సంకు | శ్రీభాసి | తివాసి |
| శకునం | సకిలం | శ్రేష్ఠి | సెట్టి |

| ప్రకృతి | వికృతి | ప్రకృతి | వికృతి |
|---|---|---|---|
| శ్రుతి | సుతి | స్థిర | తిరము |
| సంకటం | సంగడం | స్త్రీ | ఇంతి |
| సంతోషి | చిందరు | స్థూలం | తోరం |
| సంతతి | సంతు | స్నానం | తానం |
| సంతోషం | సంతసం | స్నేహం | నేస్తం |
| సంభ్రమం | సంబరం | స్ఫటిక | పటిక |
| సంధ్య | సంజ | స్రావ | జావ |
| సఖుడు | సకుడు | స్వతంత్రం | స్వంత |
| సన్యాసి | సన్నాసి | స్వత్వ | సొత్తు |
| సపత్ని | సవతి | స్ఫోటక | పోటక |
| సమత | సామెత | స్వరం | సొరం, సరం |
| సరణి | సరవి | స్వర్ణము | సొన్నము |
| సత్త్వం | సత్తువ | స్వామి | సామి |
| సర్పం | సప్పం | స్వామిని | సాని |
| సహాయం | సాయం | స్వీకార | సేకరణ |
| సాక్షి | సాకిరి | హంస | అంచ |
| సింహం | సింగం | హంసపాద | అంచపాద |
| సుఖం | సుగం | హరణం | అరణం |
| సుధా | సుద్ద | హస్తి | హత్తి |
| సురంగం | సొరంగం | హింగు | ఇంగువ |
| సూక్తి | సుద్ది | హితకరి | ఇతకరి |
| సూచి | సూది | హిమ | ఇగం |
| సేవంతి | చేమంతి | హృదయం | ఎడద |
| సేందర్య | చందు | హేడ | పడ్డ |
| స్కందుడు | కందుడు | హేయ | ఏవం |
| స్తంభ | కంబము | హేరంబ | ఎనుం |
| స్తన | చన్ను | హెూరా | ఓడ |
| స్థానం | తానం | హెూడా | ఓడ |
| స్థావర | తావరం | | |

# తెలుగు తేనె సొనలు (పలుకుబడులు)

## అ ఆ

| జాతీయం | - | భావం |
|---|---|---|
| అంకురారోపణ | - | ప్రారంభం |
| అంగలార్చడం | - | దుఃఖించడం |
| అంటూసొంటు | - | సంబంధం, పొత్తు |
| అండదండ | - | సహకారం, దిక్కు |
| అందని మ్రానిపళ్ళు | - | ప్రయత్నం చేసినా దొరకనిది |
| అందచందాలు | - | పొందిక, అందం |
| అందె వేసిన చేయి | - | నేర్పరి, మొనగాడు |
| అక్కన్న మాదన్నలు | - | ఎడబాయక కలసి ఉండేవారు |
| అక్షింతలు పడ్డాయి | - | పెండ్లి జరిగింది, చివాట్లు పడ్డాయి |
| అగస్త్య భ్రాత | - | ఊరు, పేరు తెలియనివాడు |
| అచట బుట్టిన చిగురు కొమ్మైన చేవ | - | అచట ప్రతిదీ శక్తివంతమైనది. |
| అచ్చట ముచ్చట | - | ముద్దు మురిపెం |
| అజగరోపవాసం | - | ఎంత తిన్నా తిననట్లుగానే ఉండటం |
| అట్టుడుకుట | - | ఒకసారి పెల్లుబుకుట |
| అడపాదడపా | - | అపుడప్పుడు |
| అడవి గాచిన వెన్నెల | - | వ్యర్థమైన సంపద |
| అడుగులకు మడుగులొత్తడం | - | విధేయతతో సేవించటం |
| అడ్డగాడిద | - | పోకిరి వెధవ |
| అడ్డాలనాటి పాప | - | పసికూన |
| అడ్డదిడ్డం | - | సరిలేని వరుస |
| అన్నెం పున్నెం | - | మంచి, చెడు |
| అమ్మలక్కలు | - | ఇరుగు పొరుగువారు |
| అయ్యవారి నట్టిల్లు | - | శూన్యం |
| అరణ్య రోదన | - | వృథా ప్రయాస |
| అరచేతి ఉసిరిక | - | చేతిలో పని |
| అరచేతిలో వైకుంఠం | - | తియ్యని మాటలు చెప్పి మోసగించడం |
| అరునూరగు | - | అసాధ్యం |
| అవినాభావ సంబంధం | - | విడదీయరానిది |

| | | |
|---|---|---|
| అల్లాడి ఆకులు మేయు | - | నానా కష్టాలు పడు |
| అల్లారు ముద్దు | - | గారాబం |
| అవాకులు చవాకులు | - | నోటికొచ్చిన మాటలు |
| అసూర్యంపశ్య | - | ఎండ కన్నెరుగనిది |
| అసిధారావ్రతం | - | మిక్కిలి కఠినం |
| ఆకాశ పంచాంగం | - | లేనిపోనిది చెప్పడం |
| ఆకాశ రామన్న లేఖ | - | సంతకం లేని ఉత్తరం |
| ఆబాల గోపాలం | - | అందరూ |
| ఆరంభ శూరత్వం | - | మొదట ఉత్సాహం చూపడం |
| ఆరు మూడగు | - | పని కాకపోవడం |
| ఆషాఢ భూతి | - | నమ్మించి మోసం చేసేవాడు |

## ఇ ఈ

| | | |
|---|---|---|
| **ఇ**ంటిల్లిపాది | - | ఇంట్లో అందరూ |
| ఇంట్లో ఈగల మోత | - | ఏమీలేదని చెప్పడం |
| ఇచ్చకాలు | - | ముఖప్రీతి మాటలు, అచ్చిక బుచ్చికలు, బులిబుచ్చకాలు |
| ఇనుప గజ్జెల తల్లి | - | దరిద్ర దేవత |
| ఇరుసున కందెన బెట్టక | - | మసి బెట్టక |
| ఇల్లు గుల్ల చేయు | - | ఇల్లు దోచేయడం |
| ఇసుక తక్కిడి, పేడ తక్కిడి | - | ఒకరిని మించిన మోసగాడు మరొకరు (తక్కిడి అంటే మోసగాడు) |
| ఇసుక పాతర | - | అంతులేనిది |
| ఈడు జోడు | - | సరిసమానం |
| ఈనిన పులి | - | అతి కోపంగా ఉండడం |

## ఉ ఊ ఎ ఏ ఐ

| | | |
|---|---|---|
| ఉంగరాలచేతి మొట్టికాయ | - | కలిగినవాని మాటవినడం |
| ఉడుతాభక్తి | - | చేతనైన సాయం |
| ఉత్తరకుమార ప్రజ్ఞలు | - | వ్యర్థ ప్రలాపాలు |
| ఉమ్మాయి జగ్గాయి | - | కొంటెవాడు, దారినపోయేవాడు |
| ఎంగిలి మంగలం | - | అపరిశుభ్రమైనది |

ఎండ కన్నెరుగక - ఇంటి బయటికి రాక
ఎత్తువారి చేతిబిడ్డ - తనకు అనుకూలంగా ఉండే వారి మాట వినడం
ఎదుగు బొదుగులేని - పెరగని
ఎల్లుండి పొద్దున ఏకాదశినాడు - ఏమీలేదని
ఎవరికి వారే యమునా తీరే - ఎవరిష్టం వారిదే
ఏండ్లు పూండ్లు - చాల కాలం
ఏకై వచ్చి మేకై బిగిసిన - నమ్రతగా వచ్చి దుర్మార్గంగా మారిన
ఏనుగుతిన్న వెలగపండు - లోపల లొటారం
ఏనుగుపాడి - సమృద్ధిగా ఉండడం
ఏనుగు దాహం - పేరాశ
ఏ ఏండ కా గొడుగు పట్టు - ఎక్కడ చెప్పేవి అక్కడ చెప్పడం
ఐదు పదిచేయు - నమస్కరించు

## ఒఓఔ

ఒంటికంటి రామలింగం - అసూయాపరుడు
ఒక కోడి కూసేపల్లి - చిన్న ఊరు
ఒడలెల్ల కన్నులుగా చూచు - కన్నార్పక
ఓడలు బండ్లు, బండ్లు ఓడలు - ధనికులు పేదలుగా,
పేదలు ధనికులుగా మారడం
ఔగాములు - మంచిచెడ్డలు, వచ్చేది, పోయేది

## క ఖ

కంకణం కట్టుకొను - ప్రతిజ్ఞ చేయడం
కంచు కాగడా వేసినా దొరకదు - బొత్తిగా లేదు
కంచి గరుడ సేవ - ప్రయోజనం లేనిది
కంట వత్తి బెట్టుకొను - నిద్రాహారాలు లేక పనిచేయు
కంటికి రెప్ప - అతి శ్రద్ధగా
కన్నూమిన్నూ ఏకం - ఎడతెగని బాధ
కకావికలు - చెల్లాచెదరు
కడుపు కక్కుర్తి - చేయరాని పనులు చేయడం
కడుపు చిచ్చు - సంతాన మరణం
కడుపు చల్లగా - అందరూ హాయిగా ఉండడం

| | | |
|---|---|---|
| కడుపే కైలాసం | – | డబ్బు సంపాదనే లక్ష్యం, స్వార్థం చూసుకోవడం |
| కత్తిమీద సాము | – | కష్టమైన పని |
| కత్తుల బోను | – | ప్రమాదకరం |
| కథల కామరాజు | – | కథలతో కాలక్షేపం చేసేవారు, కులాసా మనిషి కాలేడు అభూత కల్పనలతో మనోరంజకంగా మాట్లాడు వాడు |
| కనుసన్నలలో మెలగు | – | అదుపాజ్ఞలలో నడచు |
| కన్నీళ్ళు తుడుచు | – | తాత్కాలికంగా ఉపశమనపరచు |
| కన్నీరు మున్నీరుగా | – | ఏక ధారగా ఏడ్చు |
| కన్ను గీటు | – | సైగ చేయు |
| కన్నుల నిప్పులు రాలు | – | కన్ను లెఱ్ఱజేయు, అమిత కోపం |
| కన్ను గప్పు | – | మోసం చేయడం |
| కప్పదాటు (వేయు) | – | పని పూర్తిగా చేయకపోవడం |
| కప్పల తక్కెడ | – | అస్థిరం, నిలకడలేనిది |
| కయ్యానికి కాలుచాచు | – | అనవసరంగా కలహానికి దిగడం |
| కరతలామలకం | – | అతి సులభం – అరచేతిలో ఉసిరికాయ |
| కర్ణాకర్ణిగా | – | ఒకరి నుంచి మరొకరికి |
| కర్ణుడు లేని భారతం | – | ముఖ్యుడులేని విషయం |
| కలలోని వార్త | – | లేని విషయం, అసత్యం |
| కలలో కాన్పు | – | అసంభవం |
| కలికానికైనా దొరకని | – | బొత్తిగా లేకుండడం |
| కాకతాళీయం | – | అనుకోకుండా జరిగింది |
| కాకిగోల | – | విసుగు పుట్టించు |
| కాకులను కొట్టి గద్దలకు వేయుట | – | పేదలను పీడించి ధనికులకు సహాయపడటం |
| కారాలు మిరియాలు నూరు | – | కోపించు |
| కాలికి బుద్ధి చెప్పు | – | గెలవలేక పరుగు లంకించడం |
| కాలుగాలిన పిల్లి | – | అటూ ఇటూ తోచక తిరగడం |
| కీడెంచి మేలెంచు | – | చెడ్డను ఊహించి, తుదకు మంచి జరగాలను కోవడం. |
| కుండమార్పిడి | – | ఇచ్చిపుచ్చుకొను |
| కుందేటి కొమ్ము | – | అసాధ్యమైనది |
| కుంభకోణం | – | మోసం |

| | | |
|---|---|---|
| కుడిభుజం | - | గొప్ప అండ |
| కుమ్మక్కు | - | కలసి కుట్ర పన్నడం |
| కుమ్మరావంలో రాగి ముంతలేరుట | - | అసాధ్యమైనది |
| కూకటి వేళ్ళతో పెల్లగించు | - | సమూలంగా కదలించు |
| కూపస్థ మండూకం | - | బావిలో కప్పలా, తనకు తెలిసిందే సర్వస్వం అనుకునేవాడు |
| కొంగు బంగారం | - | అందుబాటులో ఉండేది |
| కొంగుముడి వేయు | - | పెళ్లాడు |
| కొండను తవ్వి ఎలుకను పట్టు | - | ఎక్కువ శ్రమ, అతి తక్కువ ప్రయోజనం |
| కొండంత దేవరకు కొండంత పత్రి తేగలమా | - | ఎంతవానికైన ఇంతే సేవ చేయగలగడం |
| కొండేల కొరివి | - | తగాదాలు పెట్టే వాడు |
| కొంపలు కూల్చడం | - | కీడు తలపెట్టడం |
| కొరకరాని కొయ్య | - | మూర్ఖుడు, మొండివాడు |
| కోటికి పడగలెత్తడం | - | ఆరితేరడం, ధనవంతుడు కావడం |
| కోతలు కోయడం | - | డంబాలు పలకడం |

## గ ఘ

| | | |
|---|---|---|
| గంగలో కలపడం | - | పాడు చేయడం |
| గంట వాయించు | - | దేవతార్చన చేయు |
| గంతకు తగిన బొంత | - | ఎవరికి తగినవారు వారికి |
| గగన కుసుమం | - | అసాధ్యం |
| గగన పుష్పం | - | అసంభవం |
| గజస్నానం | - | వృథా |
| గతజల సేతు బంధం | - | నిరుపయోగం (పారిననీటికి ఆనకట్ట కట్టడం) |
| గడ్డికరుచు | - | అడ్డమైన పనులు చేయడం. |
| గాడిద గత్తర | - | అనవసర గోల |
| గాడిద గుడ్డు | - | హుళక్కి |
| గాసటబీసట | - | తారుమారు |
| గుంట చిక్కులు | - | పలు బాధలు |
| గుండె రాయి చేసికొను | - | ధైర్యం వహించు |

| | | |
|---|---|---|
| గుండెలు తీసినబంటు | - | నమ్మించి మోసం చేయువాడు, మిక్కిలి నేర్పరి, మోసగాడు |
| గుటకలు మింగు | - | ఆశ |
| గొంతెమ్మ కోరికలు | - | అసాధ్యమైనవి కోరడం |
| గోచిపాత రాయుడు | - | సన్యాసి |
| గోడ పెట్టు, చెంప పెట్టు | - | అటు ఇటూ దెబ్బలు |
| గోముఖ వ్యాఘ్రం | - | మంచివాడుగా నటించే దుర్మార్గుడు |
| గోరంతలు కొండంతలు చేయు | - | కొద్దిదానిని పెద్దది చేయడం |
| గోరుచుట్టుపై రోకలి పోటు | - | దెబ్బపై దెబ్బ |
| ఘంటాపథం | - | రాజమార్గం |
| ఘోటక బ్రహ్మచారి | - | దొంగ సన్యాసి |

## చ ఛ

| | | |
|---|---|---|
| (చంకన) చేతులు కట్టుకొను | - | విధేయత ప్రదర్శించు |
| చంద్రునికో నూలుపోగు | - | గొప్పవారికి లాంఛనప్రాయ సత్కారం |
| చాట భారతం | - | ఎడతెగని ప్రసంగం |
| చింతాకంత | - | కాస్త |
| చిదంబర రహస్యం | - | ప్రయోజనం లేని గోప్యం, తెలిసి కూడా తెలియనట్లు ఉండేది |
| చిలుక పలుకు | - | పలికిన మాట తిరిగి పలకడం |
| చీకటితప్పు | - | జారత్వం |
| చుట్టాల సురభి | - | బంధువులంటే పడి చచ్చేవాడు |
| చెట్టపట్టాలు | - | కలసి మెలసి తిరగడం |
| చెప్పు క్రింద తేలు | - | చచ్చినట్లు పడి ఉండేది |
| చెవినిల్లుగట్టుకొని పోరు | - | పదే పదే చెప్పు |
| చెవిలో పూవుపెట్టు | - | అమాయకుడు అని భ్రమింపచేయు |
| చేతి చమురు భాగవతం | - | సొంత సొమ్ము ఖర్చు చేస్తూండడం |
| చేతులు దులుపుకోవడం | - | వదిలించుకోవడం |
| చేదోడు వాదోడు | - | సాయపడటం |
| చొప్పదంటు | - | ప్రశ్నలు - వ్యర్థమైన ప్రశ్నలు |

# జ త

జీతం పెట్టని బంటు - జీతం లేని నౌకరు, విశ్వాసపాత్రుడు
డొంక తిరుగుడు - ఒక విషయాన్ని మలుపులు తిప్పి చెప్పడం
తంగేటి జున్ను - సులభంగా లభించేది
తల తాకట్టు పెట్టు - వశం అగు, అమిత కష్ట సమయం
తల ప్రాణం తోకకు వచ్చు - అమిత ప్రయాసకు గురి అవడం
తలలో నాలుక - కలసి మెలసి ఉండడం
తలకొట్లమారి తనం - తగాదాలు పెట్టే స్వభావం
తల్లి పుట్టిల్లు మేనమామ వద్ద దాచినట్లు - పరిచయస్తుల వద్ద అసలు విషయం దాచినట్లు
తవ్వి తలకెత్తినట్లు - పెద్ద ఉపకారం
తాతకు దగ్గులు నేర్పడం - అన్ని తెలిసిన వారికి వివరించడం
తాతలనాటి పంచాంగం - పాత కథ
తాతాచార్యులుగారి ముద్ర - తప్పించుకోలేనివి
తాడూ బొంగరం లేదు - ఆధార రహితం
తామరాకుపై నీటిబొట్టు - అంటీ అంటనిది
తామర తంపర - కావలసినంత
తిమ్మిని బమ్మి, బమ్మిని తిమ్మి చేయు - తలలు మార్చు
తూరుపారబట్టు - కడిగేయడం
తేనె పూసిన కత్తి - సాధువులా కన్పించి, క్రూరంగా ప్రవర్తించడం
తేలు కుట్టిన దొంగ - బాధ కలిగినా మిన్నకుండడం
తొంటి చెయ్యి చూపడం - లేదని చెప్పడం
తోక ముడచడం - ఓడిపోవడం
తోడు దొంగలు - ఇద్దరూ తప్పు చేసిన వారే
దత్తపుత్ర శోకం - రాని ఏడుపు
దానితోడిదే లోకం - అదే గతి
దుంపతెంచు - సమూలంగా నాశనం చేయు
నక్క తోకను తొక్కు - అదృష్టవంతుడగు
నడుమంత్రపు సిరి - మధ్యలో వచ్చిన అదృష్టం
నమ్మించి గొంతు కోయు - నమ్మకంతో మోసగించు
నలుగురి నోళ్ళ పడడం - అందరికీ తెలియడం
నల్లేరుపై బండి - చాల సులువైనది

| | | |
|---|---|---|
| నాపసాని | - | పనిచేయక పెత్తనం చేసేది |
| నాలుగాకులు ఎక్కువ చదువు | - | ఎత్తులు తెలిసి ఉండు |
| నాలుకపై నువ్వు గింజ నానదు | - | రహస్యం దాచుకోలేదు |
| నిండుకుండ తొణకదు | - | గుంభనగా ఉండడం |
| నిత్య కల్యాణం-పచ్చతోరణం | - | ఎప్పుడూ కళకళలాడుతూ ఉండడం |
| నిప్పు తొక్కిన కోతి | - | కాలు నిలువక అటునిటు పరుగెత్తు |
| నివురుగప్పిన నిప్పు | - | పైకి కనబడని అసలు గుణం |
| నిర్భాగ్య దామోదరుడు | - | వ్యర్థుడు |
| నీటముంచినా పాల ముంచినా నీదే భారం | - | మంచి చేసినా, చెడు చేసినా నీదే సుమా! |
| నీలాపనిందలు | - | అపనిందలు |
| నీళ్ళు వదలుకొను | - | ఆశ వదలుకొను |
| నీళ్ళు నములు | - | సందేహించు |
| నెత్తి నోరు గొట్టుకొను | - | లబోదిబోమను |
| నెత్తిన చేయిపెట్టు | - | మోసగించు |
| నెత్తికి కన్నులు వచ్చు | - | గర్వించు |
| నేతి బీరకాయ | - | పేరు గొప్ప ఊరు దిబ్బ |
| నేల ఈనినట్లు | - | అసంఖ్యాకంగా |
| నేల విడిచి సాము | - | ఆధారం లేనిది |
| నోట దుమ్ముగొట్టు | - | తిండికి లేకుండా చేయు |
| నోటికి తాళం వేయు | - | మాట్లాడకుండా చేయు |
| నోటిలో వేలిడినా కరవడు | - | అమాయకుడు |

## ప ఫ

| | | |
|---|---|---|
| పంగనామాలు పెట్టు | - | మోసగించు |
| పండంటి కాపురం | - | అన్ని సంపదలు కలది |
| పక్కలో బల్లెం | - | తెలియని శత్రువు |
| పట్టపగ్గాలు లేవు | - | అదుపులేనిది |
| పట్టిందల్లా బంగారం | - | కలసిరావడం |
| పడిగాపులు గాచు | - | వేచియుండు |
| పడుగుపేక | - | కలసి మెలసి ఉండడం |
| పప్పులో కాలువేయు | - | పొరపాటు చేయు |
| పలుకే బంగారం | - | అతి తక్కువగా మాట్లాడడం |

పాటునపడు - సరైన దిశలో నుండు
పాత పంచాంగం - పూర్వం గొడవ
పింగళా జపం - మోసం
పిచ్చాపాటి - కబుర్లు చెప్పుకోవడం
పిలవని పేరంటం - పిలుపు లేకుండా తనంత తాను రావడం
పుంఖాను పుంఖం - ఎడతెగక
పుక్కిటి పురాణం - ఆధారాలు లేని కథ
పుణ్యం పురుషార్థం - రెండు లాభాలు
పుల్ల విరుపు మాటలు - సూటిపోటు మాటలు
పులి మీద పుట్ర - వెంట వెంట కష్టాలు రావడం
పులు కడిగిన ముత్యం - మాలిన్యం లేనిది
పూలమ్మిన చోట కట్టెలమ్మడం - బాగా బతికిన చోట బాధ పడడం
పులినోట పడక తప్పించుకోవడం - ఆపద నుంచి బయటపడడం
పూస గుచ్చినట్లు - వరుసగా
పూసలో దారంలాగా - అనుకూలంగా
పెండ్లి నడక - నెమ్మదిగా నడవడం
పెట్టుపోతలు - అన్నీ ఇచ్చి పోషించడం
పెద్ద తల - వృద్ధుడు
పేగుతీపి - కన్న మమకారం
పేద సాదలు - పేదలు, బైరాగులు
పేరు గొప్ప ఊరు దిబ్బ - పైకి గొప్ప, లోపల అన్నీ లోట్లే
పైన పటారం లోన లొటారం - పైకి గొప్పగా కనబడటం
లోపల ఏమీ లేకుండా ఉండడం
పైలా పచ్చీసు - సరదా మనిషి
పోచికోలు తిండి - తోచక తినడం
ప్రాణ గొడ్డం - ప్రాణాపాయకరం

## బ భ మ

బంగారు కాపురం - మంచి కాపురం
బగీరథ ప్రయత్నం - హమ్మయ్యా! అనుకోవడం, గొప్ప ప్రయత్నం,
శ్రమతో కూడుకొన్నవి
బట్టతలకు మోకాలికి ముడిపెట్టినట్లు - సంబంధం లేని పనులు చేసినట్లు చెప్పడం

| | | |
|---|---|---|
| బతుకుదెరువు | - | జీవనోపాయం |
| బలుసాకు తిని బతుకు | - | ప్రాణాన్ని రక్షించుకొను |
| బిసి బిసి మాటలు | - | కల్లబొల్లి మాటలు |
| బొందితో కైలాసం చేరడం | - | చనిపోవడం |
| బ్రతుకు జీవుడా | - | తప్పించుకోవడం |
| భుజాలు తడుముకొను | - | చేసిన తప్పు తెలుసుకొను |
| మంత్రం నీళ్ళు చల్లు | - | ముగ్ధుని చేసుకోవడం. |
| మడమ తిరుగని మగటిమి | - | ఎదురులేనితనం |
| మద్దెలలో ఎలుకలా | - | తప్పించుకునే దారి లేకుండడం |
| మసిపాతలో మాణిక్యం | - | నివురుగప్పిన నిప్పు |
| మాట పట్టింపు | - | వివాదం |
| మాట ఇచ్చు | - | వాగ్దానం |
| మాటవరుసకు | - | విషయాలు చెప్పేటప్పుడు వాడే ఊతపదం |
| మిడతంభొట్లు శకునం | - | అదృష్టం చేత పని జరగడం |
| మీన మేషాలు లెక్కించడం | - | వ్యర్థాలోచనలు చేయడం |
| మీసాలపై తేనె | - | స్వల్ప సుఖం |
| ముంగిట ముత్యం | - | మిక్కిలి ప్రకాశం |
| ముంజేతి కంకణానికి అద్దమేల | - | స్పష్టంగా కనిపించేదానికి వివరణ ఎందుకు |
| ముందరి కాళ్ళకు బంధాలు | - | అనవసరంగా ముందే ఇబ్బంది కలిగించడం |
| ముక్కుపచ్చలారక | - | పసితనం |
| ముక్కుపై వేలిడు | - | ఆశ్చర్యం తెలియజేయు |
| ముచ్చెమటలు | - | ఎక్కువగా హైరాన పడడం |
| ముత్యమంత మాట | - | విలువైన మాట |
| ముత్తడిపండు దిను | - | ముదిమి ఆనందంగా అనుభవించు |
| ముద్దు గులుకు | - | ఆనందంగా ఉండు |
| ముద్దుల మూటగట్టు | - | బాగా ఆనందించు |
| ముప్పుతిప్పలు పెట్టు | - | యాతనకు గురిచేయు |
| మూటాముల్లె | - | డబ్బు దస్కం |
| మూడు పూవులు-ఆరు కాయలు | - | మంచి దశ |
| మూన్నాళ్ళ ముచ్చట | - | తాత్కాలికమైన ఆనందం |

| | | |
|---|---|---|
| మూసిన ముత్యం | - | కప్పిన గొప్పతనం |
| మెచ్చి మేక తోలు కప్పు | - | మెచ్చినా నిరుపయోగమగు |
| మేకపోతు గాంభీర్యం | - | లోన భయమున్నా, పైకి గంభీరంగా వుండటం. |
| మేక వన్నె పులి | - | పైకి సాధువుగా కన్పించి, ఆచరణలో క్రూరంగా ప్రవర్తించడం |
| మేడికాయ బోనం | - | నిస్సారం |
| మేలు బంతి | - | మంచి ఒరవడి |
| మైలవరం సంతలో గంతులు సాగవు | - | కిమ్మనక ఊరకుండడం |
| మోకాలిలో మెడ నరం పట్టు | - | అర్థం లేని వాదన |

## య ర

| | | |
|---|---|---|
| యక్ష ప్రశ్నలు | - | ఎడతెగని, కఠినమైన ప్రశ్నలు |
| యజ్ఞం చేసినంత పని | - | కష్ట సాధ్యమైన పని |
| యథాతథంగా | - | ఉన్నదున్నట్లుగా |
| యమ యాతనపడు | - | నానా బాధలుపడు |
| యాగీపెట్టు | - | అల్లరిచేయు |
| యాదవ కులంలో ముసలం | - | సర్వనాశనానికి మూలం |
| యాదృచ్ఛికంగా | - | తలవని తలంపుగా |
| యాయవార మెత్తికొను | - | బిచ్చం ఎత్తుకొను |
| యుగంధర ప్రజ్ఞ | - | అనితర సాధ్యమైన తెలివితేటలు |
| యోగనిద్ర | - | మెలకువరాని నిద్ర |
| యోధాన యోధుడు | - | మిక్కిలి గొప్పవాడు |
| రంగరంగ వైభవం | - | అతిగొప్ప |
| రంధ్రాన్వేషి | - | తప్పులు వెతికేవాడు |
| రచ్చకీడ్చడం | - | వీధిన పడడం |
| రచ్చబండ | - | పదిమంది కూర్చునే బండ |
| రసాభాస | - | ఆటంకం కలిగించడం |
| రాకాసి బుద్ధులు | - | చెడు బుద్ధులు |
| రాచకురుపు | - | ప్రాణాలు తీసే జబ్బు |
| రాచపాడి | - | రాచమార్గం, రాజోచితం |

| | | |
|---|---|---|
| రాచిరంపాన పెట్టు | – | బాధించు |
| రాజు వేషం వాని రంగు | – | మూన్నాళ్ళ ముచ్చట |
| రామదాడి | – | పెద్ద దాడి |
| రామబాణం | – | తిరుగులేనిది |
| రామరాజ్యం | – | సుభిక్షంగా ఉన్న దేశం |
| రాయి గుద్ది చెప్పు | – | గట్టిగా చెప్పు |
| రాయి గొట్టిన గొడ్డలి | – | మొద్దుబారిన వాడు |
| రావణాసురుని కాష్ఠం | – | ఎడతెగని సమస్య |
| రాసి పెట్టి ఉండు | – | శాశ్వతం చేయు |
| రుద్రభూమి | – | శ్మశానం |
| రుద్రాక్ష పిల్లి | – | మోసగాడు |
| రూఢికెక్కు | – | ప్రసిద్ధి చెందు |
| రూపు చెడు | – | నశించు |
| రెంటికి చెడిన రేవడి | – | రెండువిధాల చెడినవిధం, ఉభయ భ్రష్టత్వం |
| రెండు కళ్ళూ చాలవు | – | చూడదగింది |
| రెండు చేతులా | – | ధారాళంగా |
| రెండు తాంబూలాలు | – | గొప్ప కవులలో గౌరవప్రదంగా ఇచ్చేది (జమీందారులకు, జాగీర్దార్లకు రెండు తాంబూలాలు, రెండు ఆహ్వాన పత్రికలు ఇవ్వడం రివాజు) |
| రెండు నాలుకలు | – | ఆడిన మాట తప్పడం |
| రెక్కలు వచ్చు | – | తన కాళ్ళపై తాను బతుకు |
| రెక్కాడితేగాని డొక్కాడదు | – | పనిచేస్తే గాని గడవదు |
| రెడ్డొచ్చె మొదలు | – | కొంత జరిగాక మరల ప్రారంభించు |
| రేకు మడచు | – | అడ్డగించు |
| రేగుచెట్టు భాగవతం | – | తెలియకున్నా తెలిసినట్లు నటించడం |
| రేజీకటి | – | రాత్రిళ్ళు కనబడకుండా ఉండడం |
| రొట్టె నేతిలో పడు | – | నష్టం అనుకుంటే లాభం |
| రొమ్ముున చేయిడి నిద్రపోవు | – | ఆదమరచి నిద్రించు |
| రొక్క డొక్కాలు | – | హెచ్చు తగ్గులు |
| రోకటి పాట | – | అలవోకగా పాడేది |

రోకలి ఎక్కుపెట్టినట్లు - అలవి కాని పనులకు పూనుకోవడం
రోళ్ళ రోకళ్ళ పాడు - లోకమంతా చెప్పుకొను

## ల వ

లంచపంచాలు - లంచాలు
లక్కగేదె బేరాలు - పనికిరాని వ్యాపారం
లక్షోపలక్షలు - విపరీతంగా
లక్ష్మీ కటాక్షం - సంపద
లింగులిటుకులు - హెచ్చు తగ్గులు
లెక్కచేయక - ఖాతరు చేయక
లేత సొరకాయ నరుకు - కోతలు కోయు
లోలా భట్టీయం - బడాయి మాటలు
లోకాభిరామాయణం - ఉబుసుపోక కబుర్లు
లోన లొటారం - లోపల ఏమీలేదు
వంకపెట్టడం - తప్పు పట్టడం
వంకలు తీర్చు - సరిదిద్దు
వంచిన నడుం ఎత్తకుండా - నిర్విరామంగా
వంటింటి కుందేలు - ఇంటి పట్టున ఉండేది
వండుకొని, వార్చుకొని - వంట చేసి
వగలమారి వంకాయ - టక్కరి
మేకపోతు గాంభీర్యం - వట్టి గాంభీర్యం
వట్టి గొడ్డు తాకట్టు - నిరుపయోగం
వచ్చిన తోవ పట్టు - మరలి పోవు
వజ్రకవచం - రక్షించేది
వట్టిగొడ్డు తాకట్టు - నిరుపయోగం
వట్టి పోవడం - ఎండి పోవడం
వడ్డించిన విస్తరి - అన్నీ సిద్ధంగా ఉన్న ఏర్పాటు
వడ్ల గింజలో బియ్యపు గింజ - విశేషం ఏమీలేదు
వన్నెలు చిన్నెలు - అందాలు
వసపోసిన పిట్ట - తెగ వాగేవాడు

| | | |
|---|---|---|
| వాడితోడిదే లోకం | - | వాడే దిక్కు |
| వాతప్పు | - | మాట తప్పడం |
| వావి వరుస | - | బంధుత్వం |
| విగ్రహ పుష్టి | - | బలంగా కన్పించడం |
| విరియబూచు | - | బాగా పండు |
| విశ్వామిత్ర సృష్టి | - | కృత్రిమ సృష్టి |
| విస్సన్న చెప్పిందే వేదం | - | ఆయన మాటే తుది నిర్ణయం |
| వీనుల విందు | - | చెవికి ఇంపు |
| వీపు మీద చర్మం ఒలిపించు | - | వీపు బద్దలు కొట్టడం |
| వీపు విమానం మోత | - | బాగా కొట్టడం |
| వీపు విరిగి పడు | - | కూలబడు |
| వెంట్రుక వాసి | - | చాల తక్కువ |
| వెంట్రుక ముక్కతో సమానం | - | లెక్కలేదు |
| వెదకబోయిన తీగ కాలికి తగిలినట్లు | - | కావాలనుకున్నది కాళ్ళ ముందే ఉన్నట్లు |
| వెనుక ముందు చూడక | - | లాభనష్టాలు లెక్కచేయక |
| వెన్నయుండ నేయి వెదకనేల | - | చేతిలో ఉండగా వెదకుట ఎందుకు |
| వెన్నతో బెట్టిన విద్య | - | పుట్టుకతో నేర్పినది వచ్చినది |
| వెనుకంజ వేయు | - | తగ్గుముఖం పట్టు |
| వెన్నిచ్చు | - | పారిపోవు |
| వెన్ను దన్ను | - | వెన్నంటివచ్చు |
| వెన్నుపోటు | - | వంచన |
| వెర్రిబాగుల వాడు | - | అమాయకుడు |
| వెర్రి తీరె రోకలి తలకు చుట్టు | - | ఎంతో వివరించిచెప్పినా మళ్ళీమొదటికి రావడం |
| వెర్రివాని చేతి రాయి | - | లక్ష్యంలేని రాయి |
| వెర్రి వేషాలు | - | తలతిక్క ప్రవర్తన |
| వేనోళ్ళ పొగడు | - | అతిగా ప్రశంసించు |
| వేనవేలు | - | అనేకం |
| వేపకాయంత వెర్రి | - | కొద్దిగా చాదస్తం |
| వేయిండ్ల పూజారి | - | చాలా వ్యవహారాలు కలిగిన వాడని |
| వేలు మడిచి చెప్పు | - | వివరించి చెప్పేది |
| వేళపాళ | - | సమయం సందర్భం |

## శ

| | | |
|---|---|---|
| శషభిషలు | - | అభిప్రాయ భేదాలు, గొణుగుడు |
| శని గ్రహం | - | దురదృష్టం |
| శఠగోపం పెట్టు | - | మోసం చేయు |
| శుభస్య శీఘ్రం | - | మంచి పని త్వరగా చేయి |
| శ్రీరంగనీతులు | - | తాము ఆచరించక ఇతరులను ఆచరించమనేవి |
| శ్రీరామరక్ష | - | అభయం, నిరపాయం |
| శని విరగడయ్యింది | - | చెడు రోజులు పోయాయి |

## స

| | | |
|---|---|---|
| సంక్రామ్య రోగాలు | - | అంటు రోగాలు |
| సంచిమొదలు | - | అసలు మూలధనం |
| సందట్లో సడేమియా | - | పదిమంది చేరినపుడు అందింది పుచ్చుకోవడం |
| సగం చచ్చి సగం చావక | - | చివరి దశ |
| సడిచప్పుడు | - | సద్దు |
| సత్యకాలం వాడు | - | అమాయకుడు |
| సప్తమీవిభక్తి | - | అందుయిందులేక ఉభయభ్రష్టత్వం |
| సముద్రానికి ఏతం వేయు | - | వ్యర్థ ప్రయత్నం |
| సరిసాటి | - | సమానం |
| సర్వమంగళం | - | పూజ్యం, అంతాపోవడం. |
| సొమ్ముతిను | - | ఆశ్రయంలో బతుకు దెరువు చూచు |
| సవతి తల్లి ప్రేమ | - | పక్షపాతంతో చూచు |
| సవతి పోరు | - | కలిసి ఉంటూ ఎప్పుడూ తగాదాలు పడటం |
| సర్వమంగళం | - | ఏమీకాదు, పూజ్యం |
| సింహావలోకనం | - | గతం పరిశీలించడం |
| సిగపట్ల గోత్రం | - | తగాదాలాడేవారు |
| సిగపువ్వు వాడకుండుట | - | చెక్కుచెదరకుండుట |
| సిగపువ్వులుజుట్టు | - | నెత్తికెక్కు, స్వేచ్ఛగానుండుట |
| సిరిరా మోకాలడ్డు | - | మూర్ఖత్వం |
| సీత పుట్టి లంక చెరచినట్లు | - | సంబంధం లేకుండానే మంచి చేయడం |

సుగ్రీవాజ్ఞ - తప్పని సరిగా పాటించ వలసినవి.
సుతరామూ - బొత్తిగా
సూటిపోటి మాటలు - ఎత్తిపొడుపు మాటలు
సూక్ష్మంలో మోక్షం - తక్కువలో అధిక లాభం
సైంధవు లడ్డు - అత్యవసర సమయంలో ఏర్పడే అవరోధం
సెనగలు తిని చేయి కడుగునట్లు - పనిచేసీ తనకేమీ సంబంధం లేనట్లు ఉండటం
సెలవు దీర్చడం - మాట నిలుపుకోవడం
సొంటి కొమ్ము - చురుక్కుమనిపించేది
సొమ్ముతిను - ఆశ్రయమున బ్రతుకుట
సొరకాయకోతలు - పూర్తిగా అబద్ధాలు చెప్పటం
స్వర్గానికి నిచ్చెన - ఉన్నత పథం
స్వామికార్యం స్వకార్యం - రెండు ప్రయోజనాలు
స్వాహా చేయు - అపహరించు

## హ

హంగుదారు - ప్రోత్సహించేవాడు
హంస గమనం - నెమ్మదిగా నడక
హనుమంతుని ముందు కుప్పిగంతులు - గొప్పవారి ఎదుట ప్రజ్ఞలు పలకడం
హరీ అను - చనిపోవు
హస్తిమశకాంతరం - ఏనుగు – దోమకు గల తేడా, ఎక్కువ తేడా
హుళక్కి - లేనివి, శూన్యం
హృదయశల్యం - మరణకారకం కాకుండా నిరంతరం బాధపెట్టేవి
హెచ్చుకుందు మాటలు - ఎగుడు దిగుడు మాటలు
హొయలుగా - విలాసంగా
హేమాహేమీలు - ఒక రంగంలో నిష్ణాతులు, వీరులు



# తెలుగు పంట : జంట పదాలు

అంటూసొంటు
అండదండలు
అందచందాలు
అందీఅందని
అక్కచెల్లెళ్ళు
అచ్చికబుచ్చిక
అట అబ్బాయి
అడపాదడపా
అప్పుసొప్పు
అత్తమామలు
అదవదలు
అదుపుపొదుపు
అదురుబెదురు
అన్నదమ్ములు
అమ్మనాన్నలు
అమ్మలక్కలు
అభంశుభం
అరగుర
అల్లరి చిల్లరగా
అవాకులు చెవాకులు
అహమహమిక

ఆకలిదప్పులు
ఆకువక్కలు
ఆటాపాటా
ఆటూ పోటూ
ఆదరాబాదరా
ఆయిదా
ఆముదా
ఇంటావంటా
ఇంచుమించు
ఇల్లుఇల్లాలు
ఇల్లువాకిలి
ఈడుజోడు
ఉక్కిరిబిక్కిరి
ఉప్పుపప్పు
ఊరుపేరూ
ఎకాఎకిని
ఎండావాన
ఎగుడుదిగుడు
ఎదుగూబొదుగూ
ఉలుకూపలుకూ
కుచం స్తనం

కీరం నాలుక
ఉమామహేశ్వరులు
కచాకచి
కట్నకానుకలు
కరాకండి
కలసిమెలసి
కలిమిలేములు
కల్లనిజములు
కష్టసుఖాలు
కావడికుండలు
కులమతాలు
కుయ్యోమొర్రో
కూడుగుడ్డ
కూరగాయలు
కోపతాపాలు
గడబిడ
గజిబిజి
గాసటబీసట
గుప్పుసప్పుగా
గుసగుస

గొడ్డుగోద
చదువు సంధ్యలు
చాటుమాటు
చాలు–మూల
చిందర వందర
చిన్నా పెద్ద
చిన్నా చితకా
చిన్నారి పొన్నారి
చిటపట
చీకటివెలుగులు
చీకూచింత
చీటికిమాటికి
చీమాదోమా
చుట్టపక్కాలు
చెట్టుచేమలు
చెట్టాపట్టాలు
చెమ్మచెక్క
చెల్లాచెదురు
చేదోడువాదోడు

టాలాటోలీ
తండోపతండాలు
తప్పుఒప్పులు
తల్లిదండ్రులు
తత్తరబిత్తర
తళుకుబెళుకు
తారుమారు
తిండితిప్పలు
తికమక
తేనెసోనలు
దాదాపు వరకు
ధూపదీపాలు
నవనషలు
పండ్లుఫలాలు
పనీపాట
పాడిపంటలు
పాపపుణ్యాలు
పిచ్చాపాటి
పురుగూపుట్ర

పూలూపళ్ళు
పేరుప్రతిష్ఠలు
భోగభాగ్యాలు
మంచిచెడ్డలు
మాటామంతి
ముందువెనుక
రూపురేఖలు
వెలుగుచీకటి
వేళాపాళా
వేషభాషలు
సందుగొందులు
సిగ్గుఎగ్గు
సిరిసంపదలు
సీతారాములు
సుఖదుఃఖాలు
సూర్యచంద్రులు
చదువు సంధ్యలు
హమేషాతమాషా
హుటాహుటీ



# తెలుగు అంకెల పరిధి

**తెలుగు అంకెలు Telugu Numbers.** ఉదా : ౧ ౨ ౩ ౪ ౫ ౬ ౭ ౮ ౯

తెలుగు అంకెలు – సంఖ్యామానం ఈ తీరుగా ఉంటుంది –

| అంకె | స్థానం | సంఖ్య | |
|---|---|---|---|
| 1 | ఒకటి | 1 | One |
| 10 | పది | $10^{1}$ | Ten |
| 100 | నూరు | $10^{2}$ | Hundred |
| 1000 | వేయి | $10^{3}$ | Thousand |
| 10000 | పదివేలు | $10^{4}$ | Ten thousand |
| 100000 | లక్ష | $10^{5}$ | Lakh |
| 1000000 | పదిలక్షలు | $10^{6}$ | Million |
| 10000000 | కోటి | $10^{7}$ | |
| 100000000 | దశకోటి | $10^{8}$ | Billion |
| 1000000000 | శతకోటి | $10^{9}$ | - |
| 10000000000 | సహస్రకోటి (అర్బుదం) | $10^{10}$ | |
| 100000000000 | న్యర్బుదం | $10^{11}$ | |
| 1000000000000 | ఖర్వం | $10^{12}$ | |
| 10000000000000 | మహాఖర్వం | $10^{13}$ | |
| 100000000000000 | పద్మం | $10^{14}$ | |
| 1000000000000000 | మహాపద్మ | $10^{15}$ | |
| 10000000000000000 | క్షోణి | $10^{16}$ | |
| 100000000000000000 | మహాక్షోణి | $10^{17}$ | |
| 1000000000000000000 | శంఖం | $10^{18}$ | |
| 10000000000000000000 | మహాశంఖం | $10^{19}$ | |
| 100000000000000000000 | క్షితి | $10^{20}$ | |

ఇలాగ 1 ప్రక్కన సున్నాలు చేరిస్తే $10^{21}$ –మహాక్షితి, $10^{22}$–క్షోభం, $10^{23}$–మహాక్షోభం, $10^{24}$ –నిధి, $10^{25}$ –మహానిధి, $10^{26}$ – పరతం, $10^{27}$ – పరార్థం, $10^{28}$ – అనంతం, $10^{29}$–సాగరం,$10^{30}$–అవ్యాయం, $10^{31}$–అమృతం, $10^{32}$–అచింత్యం, $10^{33}$– అమేయం, $10^{34}$ – భూరి, $10^{35}$ – మహాభూరి, $10^{36}$ అవుతాయి.

# తెలుగు న్యాయాలు తెలుసుకుందాం

## అ

**అంకుశ న్యాయం** ఏనుగు అంకుశానికి లోబడినట్లు.

**అంకోలబీజ న్యాయం** ఉరుము శబ్దం వినగానే విత్తనాలు మ్రానినంటుకొనినట్లు.

**అండకుక్కుటీ న్యాయం** గుడ్డు లేనిదే కోడిగాని, కోడి లేనిదే గ్రుడ్డు గాని ఉండదు.

**అండ విస్రంభన న్యాయం** బుడ్డపై ఆధారపడి ఏరుదాట జూచినట్లు.

**అంతర్దీపికా న్యాయం** కుండలోనున్న దీపం పైకి వెలుగకుండా లోపలే ప్రకాశించు తీరు.

**అంధకరదీపికా న్యాయం** గుడ్డివాని చేతిలోని కాగడా వానికెంత మాత్రం ప్రయోజనం కాని రీతి.

**అంధకవర్తకీయ న్యాయం** అంధుడు తన క్షేమం నిమిత్తం చప్పట్లు చరుస్తూ, వెళ్ళుచుండగా ఒక పూరేడు పక్షి (వర్తకం) దైవ వశాత్తు చేతికి జిక్కిన విధానం.

**అంధకూప న్యాయం** గ్రుడ్డివాండ్లు ఒకరి వెనుక ఒకరు పోతూ ముందువాడు నూతిలో పడగానే మిగతా వారూ నూతిలో పడిన రీతి.

**అచలచల న్యాయం** రైలుబండ్లు మొదలగు వానిపై పోయేప్పుడు నడుచుచున్న బండ్లు నిలిచి ఉన్నట్లును, నిలిచి వున్నవి నడుచుచున్నట్లు గన్పించడం.

**అజగర న్యాయం** కొండచిలువ నిదిరించుచున్నట్టే కన్పించి, సమీపించిన జంతువులను హఠాత్తుగా పట్టుకొని మ్రింగేట్లు.

**అతి పరిచయ న్యాయం** మిక్కిలి పరిచయం హానికరం.

**అదగ్ధ దహన న్యాయం** నిప్పు కాలని వస్తువును కాల్చునే కాని కాలిన దానిని కాల్చనేరనట్లు.

**అవ్యాపార వ్యాపార న్యాయం** కూసే గాడిద మేసే గాడిదను చెరిపెనన్నట్లు.

## ఆ

**ఆకాశభేదన న్యాయం** ఆకాశాన్ని బద్దలు చేయుటకేమిఁకలదు.

**ఆకాశ ముష్టి హనన న్యాయం** ఆకాశాన్ని పిడికిలితో గుద్దడం ఎవరి తరం (వ్యర్థ ప్రయత్నం)

**ఆదర్శ న్యాయం** అద్దం భంగి నిర్మలంగా ఉండడం.

**ఆదర్శ గజ న్యాయం** ఒక పెద్ద ఏనుగు చిన్న యుద్ధంలో గన్పించే విధం.

**ఆదర్శ మలిన న్యాయం** అద్దానికి మకిలి పట్టుకొన్న సులువుగా పోవడం.

**ఆమ్రవన న్యాయం** అనేక వృక్ష జాతులు కల తోటలో కొన్ని మామిడి చెట్లున్న దానిని మామిడి వనమంటారు.

**ఆదిత్యగతి న్యాయం** సూర్యుడు ఎల్లవేళల చరించుచున్నా ఒక చోటనే ఉన్నట్లు తోచు రీతి.

**ఆమోదషట్పద న్యాయం** పరిమళంను ఘ్రాణించి తుమ్మెద పువ్వు చోటును గుర్తించు మాదిరి.

**ఆరోహణ అవరోహణ న్యాయం** మానవుడు ఎల్లప్పుడును ఒకే స్థితి అందుండక హెచ్చు తగ్గులు అనుభవించడం.

**ఆశామోదక న్యాయం** కుడుములు వండుకొని తింటాననే ఆశతో సద్యః కాలంలో భుజించు రీతి.

**ఆశామోదకతృప్తి న్యాయం** పనిమీద వచ్చిన వాని కార్యాన్ని సిద్ధింపచేయక మిఠాయిచ్చి, మధుర వాక్కులతో సాగనంపుట.

**ఆఖ్వన్నపిట న్యాయం** (ఆఖు = ఎలుక) ఎలుక అన్నపు గిన్నెను పడద్రోయగలదు, కాని యధాస్థానంలో ఉంచలేదనునట్లు.

## ఇ

**ఇషుకార న్యాయం** దీక్షతోఁదన కార్యాన్ని నిమగ్నం చేసుకోవడం.

**ఇక్షురస న్యాయం** చెఱకురసం వెలువడుటకై చెఱకుగడను గానుగలోంచి గట్టిగా నొక్కాలి అనటం.

**ఇతోవ్యాఘ్రితస్త న్యాయం** ఇటు పులి, అటు లోతైన చెరువు అన్నట్లు.

**ఇషువేగక్షయ న్యాయం** బాణం వదిలినప్పుడు మహావేగంతో బరువిడి చేయునప్పటికి మందగించునట్లు.

## ఉ

**ఉత్ఖాతదంష్ట్రోరగ న్యాయం** కోఱలు తీసిన పాము బుస గొట్టును, కాటు వేయలేదు అన్నట్లు.

**ఉదకే విశీర్ణ న్యాయం** తడిగానున్న తావున తడివస్తువు నెండబెట్టుట అవివేకం అన్నమాట.

**ఉలూకల మర్ధ న్యాయం** రోలు పోయి మద్దెలతో మొరపెట్టుకొన్నట్టు.

**ఉలూఖల శేషన్యాయం** మొగమాటం కల అల్లుడు అత్తగారు పెట్టిన చలిమిడి తినక రోటిలో మిగిలినది నాకినట్టు.

**ఉష్ట్రలగుడ న్యాయం** ఒంటె ఏ కఱ్ఱను మోస్తున్నదో ఆ కఱ్ఱతోనే కామందు దానిని కొట్టే విధం.

**ఉష్ట్రశూల న్యాయం** ఒంటెకు శూలరోగం వస్తే రోకండ్లతో కుమ్మితేనే గాని పోని విధం.

## ఊ

**ఊర్ణనాభి న్యాయం** సాలీడు తన నుండి దారాలను తీసి గూడుగా వాటిని తిరిగి మింగి నిర్వికారంగా ఉండే రీతి.

**ఊపర బీజ న్యాయం** చవిటి నేలలో విత్తనాలు చల్లినరీతి వ్యర్థ ప్రయాస అయినట్లు.

**ఊపరవృష్టి న్యాయం** చవిటి నేలను వర్షించునట్లు.

**ఊహాపోహ న్యాయం** ఊహ, అపోహ తెలియబడని దానిని భావించుట లేనిది ఉన్నదను కొనునట్లు (భ్రమించడం).

## ఏ

**ఏకదేశ వికృతి న్యాయం** ఒక భాగంలో అంగవైకల్యం కలిగి ఉన్నా అసలు రూపం కలిగి ఉండుట.

**ఏకనాళఫల బాహుళ్య న్యాయం** ఒకే కాడను అనేక ఫలాలు వేలాడుచుండే విధం.

**ఏకపుత్ర న్యాయం** గుణవంతుఁడగు కుమారుఁడొక్కడే చాలు.

**ఏకసూర్య న్యాయం** ఒక సూర్యుడన్ని విధాల అంతటను ప్రకాశించే రీతి.

**ఏరండబీజ న్యాయం** ఆమదపు గింజను తడిపిన చిట్లునట్లు దుష్టునికి హితోపదేశం చేయ పూనుట కీడుకరం.

**ఓతప్రోత న్యాయం** పడుగు పేక లేకమై వస్త్రమైన రీతి సంఘీ భావం బలం.

## క

**కంటక న్యాయం** ముల్లు తీసేందుకు ముల్లే తగునన్నట్టు.

**కంబళ భోజన న్యాయం** కంబళిలో భుజిస్తూ వెంట్రుక లేరినట్లు.

**కజ్జలజల న్యాయం** కాటుకలో నీళ్ళుపోసి నూరితే నీళ్ళు నల్లబడవు. కాటుక కరగదు.

**కటకగవోదాహరణ న్యాయం** అపాయం అనపాయం రెండూ కలిసి ఉండడం.

**కణజమూషక న్యాయం** గాది కింది పందికొక్కు గాదిలోనే జీవించునట్లు.

**కదళీ కంటక న్యాయం** అరిటి ఆకు ముల్లుపై పడినా, ముల్లు అరటి ఆకుపై పడ్డా ఆకుకే ప్రమాదం.

**కదళీఫల న్యాయం** అరటిపండువలె సులభంగా అనుభవింపతగిన రీతి.

**కపోణిగుడ న్యాయం** మోచేతి యందలి బెల్లపు పాకం మిగులకున్నా మాటిమాటికి నాకడం.

**కమఠీ దుగ్ధ పాన న్యాయం** తాబేలు పాలివ్వదు తాగబూనుట అవివేకం.

**కరకావృష్టి న్యాయం** రాతినేలపై కురిసిన వర్షం చందం వ్యర్థం.

**కరతలామలక న్యాయం** తంగేటి జున్ను వంటిది సులభంగా ననుభవింపతగినది.

**కరదీపికా న్యాయం** తన చేతిలోని దీపం తనకంటె నితరుల కెంతో ప్రయోజనకరం.

**కరభదోహన న్యాయం** పాలిచ్చు గోవుండగా గాడిద పాలు పితికిన విధం.

**కరికపిత్థ న్యాయం** ఏనుగు మింగిన వెలగపండు వలె.

**కరిణీ ప్రసవ న్యాయం** పందికి పది పిల్లలు పుట్టడం కన్నా ఏనుగుకు ఒక పిల్ల పుట్టిన మేలు.

**కర్కటీ గర్భ న్యాయం** ఎండ్రకాయ పిల్లలు పుట్టినవి పుట్టినట్టే చనిపోయే రీతి.

**కర్మభూమస్త్వత్ఫల న్యాయం** శ్రమ ఎంతో ఫలమంత కష్టేఫలి.

**కాకతాళీయ న్యాయం** కాకి వాలగానే అప్రయత్నంగా తాటి పండు పడినట్టు.

**కాచకుంభదీప న్యాయం** గాలి ఎంత వీచినా గాజుబుడ్డిలోని దీపం కదలకుండు రీతి.

## ఖ

**ఖండితశాఖా న్యాయం** జీవం కల వృక్షపు కొమ్మలు ఎన్నిసార్లు నటికినను చిగిర్చు రీతి.

**ఖర్వా పేక్షిత ఫల న్యాయం** పొట్టివాడు అందని మ్రాని పండ్లకై అర్రుజూచిన విధం.

**ఖలమైత్రీ న్యాయం** ఉదయకాలపు ఎండ దీర్ఘంగా ఉండి క్షమేపి క్షీణించు విధం.

**ఖలేకపోత న్యాయం** పావురాలన్నీ కలసి వల నెత్తికొని పోయిన మాదిరి సంఘీభావం బలం.

**ఖల్వాట బిల్వీయ న్యాయం** బట్టతలవాడు మారేడు చెట్టు క్రిందికి రాగా మారేడు కాయ నెత్తిమీద పడి నెత్తి చిల్లిపడ్డట్టు.

**ఖరాశ్వ న్యాయం** గుర్రం గాడిదయైనట్లు.

## గ

**గంధర్వనగర న్యాయం** మాయజగత్తు లేనిది ఉన్నట్టు భ్రాంతి.

**గగన కుసుమ న్యాయం** ఏమీ లేదనునట్లు.

**గజనిమీలన న్యాయం** ఏనుగు కన్నులు తెరచినా మూసినట్లుండుట.

**గజస్నాన న్యాయం** ఏనుగు స్నానం.

**గడ్డరికా ప్రవాహ న్యాయం** ఒక గొర్రెతో పాటు తక్కిన గొర్రెలన్నీ నదిలో పడు రీతి.

**గతజలసేతు బంధన న్యాయం** నీరు పోయిన పిదప గట్టు వేసినట్లు.

**గర్తజంబుక న్యాయం** గుంటనక్క చేష్టలు.

**గుడజిహ్వికా న్యాయం** బెల్లం నాలుకమీద నున్నంతసేపే రుచి అన్నట్లు.

**గృహ దీపికా న్యాయం** దీపం చిన్నదైనను ఇంటినంతా ప్రకాశింపజేయడం.

**గృహబద్ధకుమారి న్యాయం** కలబంద ఇంటిలో కట్టిన పెరుగను పెరగదు, చావను చావదు.

**గోమయ పాయసీమ న్యాయం** పేడ పరమాన్నమగునా అన్నట్లు.

**గోమహిష న్యాయం** గేదెకు ఆవుకు మైత్రిలేదు. విరోధం లేదన్నట్లు.

**గోవత్స న్యాయం** ఆవు నమ్మినప్పుడు దూడకు వెల లేని విధం తల్లితో దూడ.

**గ్రావ్ణిరేఖా న్యాయం** శిలాశాసనం శాశ్వతం.

**గ్రామదూర న్యాయం** ఈవూరి కావూరెంత దూరమో ఆవూరికి ఈవూరు అంతే దూరం అన్నట్లు.

**ఘరట్ట న్యాయం** తిరుగలి దిమ్మలలో నొకటి తిరిగేది మరొకటి తిరుగనిది అందుచేతనే పని జరుగును లేనిచో జరుగదన్నమాట.

**ఘృతకోశాతకీ న్యాయం** నేతిబీరకాయ చందం నెయ్యి లేదు సరిగదా కమ్మని పదార్థమైన లేదనడం.

## చ

**చందనగుణ న్యాయం** గంధపు చెట్టు నొద్ద పెరిగిన ఇతరజాతి వృక్షాలు సైతం చందనపు వాసన కలిగి ఉండురీతి.

**చందన న్యాయం** గంధపు బిందువు శరీరంపై ఉంచితే దాని చల్లదనం పరిమళం అంతా వ్యాపించే రీతి.

**చంద్ర చంద్రికా న్యాయం** చంద్రుని దాని వెన్నెలను విడదీయరాని విధం.

**చంద్ర చకోర న్యాయం** చకోర పక్షి (వెన్నెల పులుగు) చంద్రుని రాకకై ఎదురు చూచిన విధం.

**చక్షుశ్రవణ న్యాయం** నమిలిన దానినే మరల మరల నమలుట.

**చాలినీ న్యాయం** జల్లెడలో పోసి జల్లించునట్లు.

**చిత్రపట న్యాయం** ముందు రేఖలు గీచి పిదప బొమ్మను తయారు చేసినట్లు.

**చిత్రానం న్యాయం** చిత్ర పటంలోని అగ్ని దహించు శక్తి లేని రీతి.

**చిత్రితాంగ జంబుక న్యాయం** పులిని చూచి నక్క వాత బెట్టుకొన్నట్టు.

## ఛా

**ఛాయాపిశాచి న్యాయం** తన నీడను చూచుకొని పిశాచమని వెరచుట.

**ఛురికాకూష్మాండ న్యాయం** కడవంత గుమ్మడికాయ కత్తిపీటకు లోకువన్నట్లు.

## జ

**జతుకాష్ఠ న్యాయం** లక్కపుల్ల ఎచ్చట విరచిన నచ్చట విరుగును. తిరిగి అతికిన అతుకు కొనునట్లు.

**జలతైలబిందు న్యాయం** నీళ్ళమీద వేసిన నూనె చుక్క నీరంతా కలియబారునట్లు.

**జలతాడన న్యాయం** నీటికి దెబ్బ తగలదనినట్లు.

**జలతుంబికా న్యాయం** బురద అంటిన గుమ్మడికాయ నీట మునుగును, బురద బోవగానే తేలియాడునట్లు.

**జలమౌక్తిక న్యాయం** ముత్యపు చిప్పలో పడ్డ నీటి బిందువులు ముత్యాలు అయినట్లు.

**జలేతరంగ బుద్బుద న్యాయం** అలలు కాని, బుడగలు కాని నీటబుట్టి నీటిలోనే లీనమై పోవునట్లు.

**జానపద న్యాయం** నగరవాసులు నాగరికులన్నట్లు.

**జలకతక రేణు న్యాయం** చిల్లగింజ రేణువులచే మురికి నీరు మలిన రహితమైనట్టు.

## ట

**టిట్టిభ న్యాయం** అల్పజీవి తీతువ పిట్ట తన స్వల్పశక్తిచే సముద్రుని వ్యాకులానికి గురి చేయ తలంచిన మాదిరి.

## డ

**డమరుకమణి న్యాయం** బుడు బుడుక్క నడుమకట్టిన దారం చివరి నుండే పూస రెండువైపుల వాయించుటకుపయోగపడేట్లు.

## త

**తండులభక్షణ న్యాయం** వంట జేయ నోవక బియ్యం బొక్కుట సోమరితనం.

**తంతు న్యాయం** నూలు పోగులన్నీ వస్త్రంగా తయారైన చందం.

**తప్తతైలాంబు న్యాయం** కాగిన నూనెపై నీళ్ళచుక్క విడిచిన భగ్గుమనునట్లు.

**తమోదీప న్యాయం** దీపమున్న చోట చీకటి యుండునట్లు.

**తరంగ న్యాయం** అలలు ఒకదాని వెంబడి ఒకటి విడువక వచ్చునన్నట్లు.

**తాళసర్ప న్యాయం** తాడిచెట్టుపై ప్రాకెడి తాచుపాము ఒడలు చీరుకొనిపోయి చచ్చినట్లు.

**తిలతండుల న్యాయం** నువ్వులు బియ్యాన్ని కలిపిన కలియును విడదీసిన విడువనట్లు.

**తీరస్థ బక న్యాయం** తీరం అందు నిలబడి కొంగచేసే జపం రీతి.

**తుంబీవికల వీణా న్యాయం** అనబకాయ బుర్ర లేనిచో వీణ సరిగా ధ్వనించదనడం.

**తుల్యాయవ్యయ న్యాయం** ఆదాయం చూచుకొని వ్యయం చేయాలి.

**తుష ఖండన న్యాయం** ఊకనుదంచుట బుద్ధి హీనత అన్నట్లు.

**తృణరజ్జు న్యాయం** గడ్డిపోచలన్నీ మోకైన విధం. ఏనుగును బంధింప శక్యమైనట్లు.

**తేజస్తిమిర న్యాయం** వెలుగున్న చోట చీకటి ఉండదనినట్లు.

## ద

**దండాభావ న్యాయం** కఱ్ఱలేని వానిని గొఱ్ఱె అయినా కరచునట్లు.

**దంపతీ కలహ న్యాయం** భార్యాభర్తల కలహం ఆరంభమున ఘాటుగా నుండి చివరకు శూన్యమగునట్లు.

**దగ్ధబీజ న్యాయం** కాలిన బీజం మొలకెత్తిన రీతి.

**దగ్ధ పదమార్జాల న్యాయం** కాళ్ళు కాలిన పిల్లి విధం.

**దగ్ధ రజ్జు న్యాయం** కాలిపోయిన తాడు ముట్టినంత మాత్రాన విడిపోవుట.

**దగ్ధేంధన న్యాయం** కట్టెలు వంట చేయుటకు తోడ్పడుతాయి. కాని అవి కాలిపోయి నశించునట్లు.

**దర్వీపాకరస న్యాయం** గరిటె సమస్త వస్తువులను గలియతిప్పునే కాని రుచులను ఎరుగని రీతి.

**దారపురుష న్యాయం** మొద్దును జూచి మనుష్యుండని భ్రమపడడం.

**దీపికా న్యాయం** దీపం చిన్నదైనా చీకటిని పారద్రోలునట్లు.

**దేహళీదీప న్యాయం** గడప మీద దీపం పెట్టిన ఇంట బైట వెలుతురుండు నన్నట్లు.

## న

**నదీ సముద్ర న్యాయం** నదులన్నింటికిని సముద్రమే ఆధారం అన్నట్లు.

**నర్తక న్యాయం** నర్తకుడు ఒకే కాలంలో అందరినీ రంజింపజేసే మాదిరి.

**నారికేళంబు న్యాయం** కొబ్బరి కాయలోనికి నీరెప్పుడెట్లు వచ్చునో ఎవరెరంగుదురన్నట్లు.

**నాసికాంగుళీ న్యాయం** ఎవని ముక్కు రంధ్రాలలో వాని వ్రేళ్ళు పట్టునట్టి చందం.

**నిర్ధన మనోరథ న్యాయం** ధనం లేని వానికి కోరిక లెక్కువ అన్నట్లు.

**నిర్వ్యాపారాంబష్ఠ న్యాయం** పనిలేని మంగలి పిల్లి తల గొరిగెనన్నట్లు.

**నివాతస్థ దీప న్యాయం** గాలిలేని చోట దీపం నిశ్చలంగా నున్నట్లు.

**నీరనీర న్యాయం** నీరును నీరును గలసిన వేరు సేయ నేరితరమన్నట్లు.

**నౌక శకట న్యాయం** ఓడలు బండ్లగుట, బండ్లు ఓడలగుట.

**న్యగ్రోధ బీజ న్యాయం** మర్రి విత్తనం చిన్నదైనా వృక్షం మహావృక్షం అయినట్లు.

## ప

**పంక ప్రక్షాళన న్యాయం** అడుసుదొక్కనేల కాలుగడుగనేల?

**పంకమగ్న గజ న్యాయం** బురదలో దిగబడిన ఏనుగును ఏనుగే ఎత్తవలె అన్నట్లు.

**పంజర బక న్యాయం** కొంగను పంజరాన బెట్టి ఎంత చక్కగా పోషించినను జిలుక వలె పలుకనేరదు.

**పంజరస్థ సింహ న్యాయం** బోనులోని సింహం భయకారణం గానిదనుట.

**పక్షికులా న్యాయం** పిల్లలు పెరిగిన పిమ్మట పక్షి తన గూటిని వదలును.

**పటకుటీర న్యాయం** డేరా ఎచ్చట కావలెనన్న అచ్చట నిల్లుగ నేర్పడునట్లు.

**పతంగ దీప న్యాయం** ఫలాల భ్రాంతిచే అగ్నిలోబడ్డ మిడత రీతి.

**పయోవిష కుంభ న్యాయం** పైన పాలు లోన విషం. అంగిట బెల్లం ఆత్మలో విషమన్నట్లు.

**పరిణామ న్యాయం** కాలాన్ననుసరించి సర్వం మారుచుండే రీతి.

**పాషాణేష్టక న్యాయం** చట్రాతికన్న ఇటుకరాయి మృదువైనది.

**పిష్టపేషణ న్యాయం** నూరినదే నూరుట. నమిలినదే నమలుట.

**పిస్ట ప్రమిత్య పూప న్యాయం** పిండి ఎంతో రొట్టె అంతయే.

**పూర్ణఘట న్యాయం** నిండు కుండ తొణికినట్లు.

**ప్రపానకరస న్యాయం** ఆయా వస్తువు గలసి పానకానికి క్రొత్త రుచినిచ్చిన రీతి.

## బ

**బహురాజక న్యాయం** బహు మంది పరిపాలనం నాశనానికి దారి దీయున్నట్టు.

**బహువృకాకృష్ట మృగ న్యాయం** తోడేళ్ళ గుంపులో జిక్కిన లేడి భంగి.

**బిడాల విణ్మోచన న్యాయం** పిల్లి తన మలాన్ని పూడ్చి వేయుననునట్లు.

**బీజాంకుర న్యాయం** గింజలో మొలక అణగి ఉన్నట్లు.

**బహుబసపత్నీక న్యాయం** అనేక భార్యలుకల గృహస్థుని ఆక్రందనం.

**బ్రాహ్మణ గ్రామ న్యాయం** మామిడి చెట్లెక్కువ ఉండే మామిడి వనమున్నట్లు.

## భ

**భల్లూకముష్టి న్యాయం** ఎలుగు బంటి తన పిడికిలి నెన్ని విధాలను విడువదన్నట్టు, భల్లూకపట్టు.

**భస్మచ్ఛన్నాగ్ని న్యాయం** బూడిదచే కప్పబడ్డ అగ్ని లోపల గణగణలాడుతుంది.

**భిత్తిబిడాల న్యాయం** గోడమీద పిల్లి.

**భూలింగ శకుని న్యాయం** దోషమని ఇతరులకు జెప్పు కార్యాన్ని తానే చేయడం.

**బోహాగ్ని న్యాయం** ఇనుముం గూడిన అగ్నికి సమ్మెట పెట్టన్నట్టు.

**భ్రమర కీట న్యాయం** తిరిగి ధ్వని చేస్తూ ఆ పురుగు తుమ్మెదలో మనస్సు నిల్పి తుమ్మెద అయినట్లు.

**భ్రమర న్యాయం** తుమ్మెద పరిమళాలు వెదజల్లు పుష్పాల చెంతకే పోతుంది.

## మ

**మండూక ప్లుతి న్యాయం** కప్ప దాట్లు కొంచెం పనిచేసి అది విడిచి మరొకటి చేయుట.

**మండూక మక్షికా న్యాయం** కప్ప పాము నోట నుండీ ఈగను మింగబోవునట్లు.

**మక్షికా న్యాయం** ఈగ ఎందుం బోయినా మలిన పదార్థాన్నే వెదకు రీతి.

**మణికంకణ న్యాయం** మణులతో కూడిన వలయం.

**మత్స్యకంటక న్యాయం** ముల్లుతీసి వేచి చేపను దినునట్లు.

**మరుమరీచికా న్యాయం** ఎండమావుల మాదిరి భ్రాంతి కలిగించు.

**మర్కట కిశోర న్యాయం** కోతి పిల్లలు పట్టు వదలక తల్లి వెంట బోవునట్లు.

**మృగవాగురా న్యాయం** వాగు అనగా మృగాలను బట్టు వల.

**మార్జాల మూషిక న్యాయం** పిల్లి ఎలుక చెల్లాటం.

**మధుకోశ న్యాయం** తేనె ఇతరాల పాలయినట్లు.

**మూర్ఖ సేవన న్యాయం** మూర్ఖుని కొలుచుట.

**మేఘ మయూర న్యాయం** మేఘ గర్జనకు నెమలి ఆడుట.

## య

**యథారాజ న్యాయం** రాజెలాగో ప్రజలు అలాగే.

**యవవరాహ న్యాయం** అడవి పంది చేను మేయగా ఊర పంది చెవులు గోసినట్లు.

**యమకీటక న్యాయం** కులాల కీటన్యాయం = కుమ్మరపురువు రీతి.

**యాచిత కమండ న్యాయం** నలుగురి నుండి ఆశించిన భూషణాలచే అలంకరించు కొనునట్లు.

**యూప పశు న్యాయం** యాగ స్తంభానికి గట్టబడ్డ పశువునకు జావుదప్పదు.

## ర

**రండా వివాహ న్యాయం** జారిణికి వివాహ వాంఛ ఉండునట్లు.

**రజ్జుస్పర న్యాయం** తాడును చూచి పామనుకొనుట.

**రధ్యాప్రవాహ న్యాయం** వీధులలో నుండి వచ్చు పిల్ల కాలువలు ఏరులై పారినట్లు.

**రుమాక్షిప్త న్యాయం** ఉప్పుపత్రలో పడవేసిన వస్తువు ఉప్పయిపోవు విధం.

## ల

**లతావృక్ష న్యాయం** తీగచెట్టు అండలేక నిలువజాలనట్టు.

**లశునభక్షణ న్యాయం** వెల్లుల్లి సేవించినను రోగమట్లే నిలిచి ఉన్నట్లు.

**లవణాగ్ని న్యాయం** ఉప్పుకు నిప్పుకు గిట్టదన్నట్లు.

**లాంగూల తరణ న్యాయం** కుక్కతోక బట్టుకొని గోదావరి యీద ప్రయత్నించినట్లు.

**లోహఘట న్యాయం** ఇనుప కుండకు రాతి తెడ్డన్నట్లు.

**లోహచుంబక న్యాయం** సూదంటురాయి ఇనుపముక్కను ఆకర్షించు రీతి.

## వ

**వజ్రలేపన న్యాయం** గచ్చు చేసిన వస్తువు కదలకుండునట్టు.

**వటబీజ న్యాయం** విత్తనం చిన్నది, వృక్షం పెద్దది (మర్రిచెట్టు) దానమల్పం, ఫలమధికం.

**వన చంద్రికా న్యాయం** అడవి గాచిన వెన్నెల.

**వలీముఖ నారికేళ న్యాయం** కోతి కొబ్బరికాయను పడవేస్తుంది, కాని తినదన్నట్లు.

**వృశ్చిక చోర న్యాయం** దొంగవానిని తేలుకుట్టినట్టు మౌనంగా నుండుట.

**వృశ్చిక విదూషక న్యాయం** హాస్యగానికి తేలుకుట్టినుట్ట, అదికూడ హాస్యమన్నట్లు.

## శ

**శశవిషాణ న్యాయం** కుందేటి కొమ్ము అన్నట్లు, వట్టిదన్నమాట.

**శాఖాచంక్రమణ న్యాయం** ఒక కొమ్మ మీద నుండి మరొక దాని పైకెక్కుట.

**శాఖా చంద్ర న్యాయం** ఆకాశమందున్న చంద్రుని చెట్టుకొమ్మకు దగ్గరగా ఉండెనని చూపించినట్లు.

**శ్శుక్తంబుబిందు న్యాయం** ముత్తెపు చిప్పలో బడ్డ నీటి చుక్క ముత్యం అయినట్లు.

**శ్వపుచ్ఛ న్యాయం** కుక్కతోక వంకర చక్క చేయరాదు.

**శ్వశ్రూభిక్ష న్యాయం** బిచ్చగాడు రాగా కోడలు ముష్టిలేదనుట.

## స

**సందంశ న్యాయం** కారుతో నొక్కిపట్టినట్లు.

**సముద్ర మధుబిందు న్యాయం** సముద్రంలో ఒక తేనె చుక్క వేసిన తియ్యబడదన్నట్లు.

**సింహ ఘంటా న్యాయం** సింహం మెడకున్న ఘంట విప్పగల వారెవరన్నట్లు.

**సుధార్ధహరిద్రా న్యాయం** సున్నంతో దడసిన పసుపు ఎఱ్ఱబడునన్నట్లు.

**సూత్ర శాటక న్యాయం** నూలుతో బట్ట నేసెననగా, నూలును బట్టగా నేసెనని యర్థం.

**స్థాలీపులాక న్యాయం** ఒక మెతుకును బట్టి చూసిన అన్నమంతా పధను తెలియునట్లు.

**స్రోతో నిమ్న న్యాయం** నీరు పల్లమెరుగును నిజం దేవుఁడెరుగును.

**స్వదీప చుంబ న్యాయం** దీపం తనదని ముద్దు పెట్టుకొనబోగా మూతి మీసాలన్ని కాలినట్టు.

## హ

**హంసబక న్యాయం** కొంగలలో హంస ఉన్నా దానికి కీర్తి దక్కదు. హంస అని ఎవరు గుర్తింపరు.

**హస్తిపద న్యాయం** ఏనుగడుగులో అన్ని జంతువుల అడుగులు నిముడునన్నట్లు.

**హస్తిమశక న్యాయం** ఏనుగునకు దోమకు గల తారతమ్యం అంత తేడా అన్నమాట.

**హంసక్షీర నీర న్యాయం** పాలు నీరు కలిసిన హంస నీటిని వేరు చేసి పాలనే త్రాగునట్లు.

## క్ష

**క్షాతేక్షార న్యాయం** పుండుపై కారం చల్లినట్లు.

**క్షీరదగ్ధ జిహ్వా న్యాయం** వేడిపాలు త్రాగగా నాలుక కాలింది. మజ్జిగను సైతం నూదుకొని త్రాగినట్లు.

**క్షీరపాషాణ న్యాయం** పాలనిమిత్తం రాసిని మోసినట్టు.



# తెలుగు, అరబిక్, రోమన్ అంకెలు : సంఖ్యలు

| | తెలుగు | అరబిక్ | రోమన్ |
|---|---|---|---|
| ఒకటి | ౧ | 1 | I |
| రెండు | ౨ | 2 | II |
| మూడు | ౩ | 3 | III |
| నాలుగు | ౪ | 4 | IV |
| ఐదు | ౫ | 5 | V |
| ఆరు | ౬ | 6 | VI |
| ఏడు | ౭ | 7 | VII |
| ఎనిమిది | ౮ | 8 | VIII |
| తొమ్మిది | ౯ | 9 | IX |
| పది | ౧౦ | 10 | X |
| పదకొండు | ౧౧ | 11 | XI |
| పన్నెండు | ౧౨ | 12 | XII |
| పదమూడు | ౧౩ | 13 | XIII |
| పద్నాలుగు | ౧౪ | 14 | XIV |
| పదిహేను | ౧౫ | 15 | XV |
| పదహారు | ౧౬ | 16 | XVI |
| పదహేడు | ౧౭ | 17 | XVII |
| పద్దెనిమిది | ౧౮ | 18 | XVIII |
| పందొమ్మిది | ౧౯ | 19 | XIX |
| ఇరవై | ౨౦ | 20 | XX |
| ఇరవై ఒకటి | ౨౧ | 21 | XXI |
| ఇరవై రెండు | ౨౨ | 22 | XXII |
| ఇరవై మూడు | ౨౩ | 23 | XXIII |
| ఇరవై నాలుగు | ౨౪ | 24 | XXIV |
| ఇరవై అయిదు | ౨౫ | 25 | XXV |
| ఇరవై ఆరు | ౨౬ | 26 | XXVI |
| ఇరవై ఏడు | ౨౭ | 27 | XXVII |

| | తెలుగు | అరబిక్ | రోమన్ |
|---|---|---|---|
| ఇరవై ఎనిమిది | ౨౮ | 28 | XXVIII |
| ఇరవై తొమ్మిది | ౨౯ | 29 | XXIX |
| ముప్పయి | ౩౦ | 30 | XXX |
| ముప్పయి ఒకటి | ౩౧ | 31 | XXXI |
| ముప్పయి రెండు | ౩౨ | 32 | XXXII |
| ముప్పయి మూడు | ౩౩ | 33 | XXXIII |
| ముప్పయి నాలుగు | ౩౪ | 34 | XXXIV |
| ముప్పయి అయిదు | ౩౫ | 35 | XXXV |
| ముప్పయి ఆరు | ౩౬ | 36 | XXXVI |
| ముప్పయి ఏడు | ౩౭ | 37 | XXXVII |
| ముప్పయి ఎనిమిది | ౩౮ | 38 | XXXVIII |
| ముప్పయి తొమ్మిది | ౩౯ | 39 | XXXIX |
| నలభై | ౪౦ | 40 | XL |
| యాభై | ౫౦ | 50 | L |
| అరవై | ౬౦ | 60 | LX |
| డెబ్బయి | ౭౦ | 70 | LXX |
| ఎనభై | ౮౦ | 80 | XXL |
| తొంభై | ౯౦ | 90 | XC |
| నూరు | ౧౦౦ | 100 | C |
| నాలుగు వందలు | ౪౦౦ | 400 | CD |
| ఐదు వందలు | ౫౦౦ | 500 | D |
| తొమ్మిది వందలు | ౯౦౦ | 900 | CM |
| వెయ్యి | ౧౦౦౦ | 1000 | M |
| పదొమ్మిది వందలు | ౧౯౦౦ | 1900 | MCM |
| రెండువేలు | ౨౦౦౦ | 2000 | MM |
| రెండువేల అయిదు | ౨౦౦౫ | 2005 | MMV |
| రెండువేల పది | ౨౦౧౦ | 2010 | MMX |
| ఐదువేలు | ౫౦౦౦ | 5000 | V |



# సంఖ్యావాచక విజ్ఞాన మహోదధి

ఉత్తరగీత (3-1) ఇలా చెబుతూంది -

*అనంతశాస్త్రం బహువేది తవ్యం*
*స్వల్పశ్చాకాలో బహువశ్చ విఘ్నః*
*యత్సారభూతం తదుపాసి తవ్యం*
*హంసోయధా క్షీరమివాంబు మిశ్రమ్"*

శాస్త్రాలు అనంతమైనవి. కాలమా బహు తక్కువ. ఇందు అనేక విఘ్నాలు. హంస నీరు కలసిన పాల నుండి పాలను మాత్రం తీసుకొని నీటిని వదలివేసినట్లు, విజ్ఞులు విజ్ఞానంలో సారాన్ని గ్రహించి పిప్పిని వదిలేయాలని ఈ శ్లోక తాత్పర్యం. సంఖ్యా వాచక విజ్ఞానాన్ని ఒకసారి పరిశీలిస్తే పై శ్లోకం తాలూకు సుసంగత్వం (Relevance) ద్యోతకం అవుతుంది.

భారతీయ ఆర్ష పండితులు వాఙ్మయాన్ని ఎన్ని కోణాలలో అభివృద్ధి పరచారో ఆలోచనలకు అందని విషయం. భారతీయ భాషల వలె అభివృద్ధి చెందిన విజ్ఞానం ప్రపంచ భాషలలో ఎక్కడా ఉండకపోవచ్చు. ఒక్కో అంకెకు వందల సంఖ్యలో సంఖ్యా వాచకాలు, వాటి వివరాలూ ఉన్నట్లు తెలుస్తుంది. ఉదాహరణకు రెండు, మూడు అంకెలపై 500లకు మించి సంఖ్యా వాచకాలున్నాయి. ఈ అధ్యాయంలో 2 అంకెకు 4, 3 అంకెకు 2 సంఖ్యా పదాల వివరణ నమూనాగా మాత్రం ఇచ్చాము. సింధువుగా లభించే విజ్ఞానంలో ఇది బిందువు మాత్రమే.

నా చిరకాల మిత్రుడు భీశెట్టి అనంతరావు, అనకాపల్లి (విశాఖపట్నం జిల్లా) 108 సంఖ్యా వాచకాలకు సుమారు 20 వేలు వివరణలను **సంఖ్యావాచక పదకోశము** (1980) అనే గ్రంథంలో ఇచ్చారు. ఒక్కసారి పరిశీలిస్తే భారతీయ విజ్ఞాన శాస్త్ర సాగరం ఎంతటి బృహత్తరమైనదో బోధపడుతుంది.

## 1

ఒక సూర్యుడు
ఒక ప్రభువు శ్రీరాముడు
ఏకాక్షరం - ఓం

## 2

ద్వియోగాలు : కర్మ, జ్ఞాన యోగాలు
ద్వివచనాలు : ఏక, బహు వచనాలు

ద్విగుణాలు : సద్గుణ, దుర్గుణాలు
ద్వివిధ ఆహారాలు : శాకాహార, మాంసాహారాలు

## 3

త్రిఋణాలు : దేవ ఋణం, పితృణం, ఋషి ఋణం
త్రికాలాలు : (అ) క్రియారూపకంగా-1 భూతకాలం,2 భవిష్యత్కాలం,3 వర్తమానకాలం
(ఆ) కాలరూపకంగా - 1 ప్రాతఃకాలం, 2 మధ్యాహ్నకాలం, 3 సంధ్యాకాలం
(ఇ) భౌతికంగా - 1 వేసవికాలం, 2 వర్షాకాలం, 3 శీతాకాలం.

## 4

చతుర్దిశలు : తూర్పు, దక్షిణ, పశ్చిమ, ఉత్తర.
చతుర్విధ అంతఃకరణలు : మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం.
చతుర్వేదాలు : ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వణ వేదం
చతుర్విధోపాయాలు : సామ, దాన, భేద, దండోపాయాలు.

## 5

పంచాంగాలు : ఉపాయం, సహాయం, దేశకాల విభజనం, ఆపదకు ప్రతిక్రియ, కార్యసిద్ధి.
పంచ అవస్థలు : జగత్తు, స్వప్నం, సుషుప్తి, మూర్ఛ, మరణం.
పంచ ఆనందాలు : యోగానందం, ఆత్మానందం, అద్వైతానందం, విద్యానందం, విషయానందం.
పంచ కావ్యాలు : శృంగార నౌషధం, మనుచరిత్ర, పారిజాతాపహరణం, వసు చరిత్ర, విజయవిలాసం.
పంచభూతాలు : భూమి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం.
పంచ పాండవులు : ధర్మరాజు, అర్జునుడు, భీముడు, నకుల, సహదేవులు.
పంచలోహాలు : బంగారం, వెండి, రాగి, తగరం, సీసం.

## 6

ఆరుకాండలు (రామాయణం) : బాల,అయోధ్య, అరణ్య, కిష్కింధ,సుందర,యుద్ధకాండలు.
షడంగాలు : శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం.

## 7

సప్త ఋషులు : భృగువు, అంగీరసుడు, కశ్యపుడు, అత్రి, వశిష్టుడు, అగస్త్యుడు, విశ్వామిత్రుడు.
ఏడు వారాలు : ఆది, సోమ, మంగళ, బుధ, గురు, శుక్ర, శని వారాలు.

సప్త సంతానాలు : నుయి, ఉద్యానవనం, మండపం, చలివేంద్రం, కావ్యం, పుత్రుడు, గుడి

సప్తస్వరాలు : షడ్జమం, ఋషభం, గాంధారం, మధ్యమం, పంచమం, దైవతం, నిషాదం.

## 8

అష్టకష్టాలు : 1 దేశాంతర గమనం, 2 భార్యావియోగం, 3 ఆపత్కాలమందు బంధు ఆగమనం, 4 ఉచ్ఛిష్ట భోజనం, 5 శత్రు స్నేహం, 6 పరాన్న ప్రతీక్షణం, 7 అప్రతిష్ఠ, 8 దారిద్ర్యం.

అష్టదిక్కులు : తూర్పు, ఆగ్నేయం, దక్షిణం, వాయవ్యం, పడమర, నైఋతి, ఉత్తరం, ఈశాన్యం.

అష్టదిగ్గజ కవులు : (కృష్ణదేవరాయల ఆస్థానం) 1 అల్లసాని పెద్దన, 2 నంది తిమ్మన, 3 భట్టుమూర్తి (రామరాజ భూషణుడు), 4 పింగళి సూరన, 5 తెనాలి రామకృష్ణుడు, 6 అయ్యలరాజు రామభద్రుడు, 7 మాదయగారి మల్లన, 8 ధూర్జటి.

అష్ట నాయికలు : 1 స్వాధీన పతిక, 2 వాసన సజ్జిక, 3 విరహోత్కంఠిత, 4 విప్రలబ్ధ, 5 ఖండిత, 6 కలహాంతరిత, 7 ప్రోషిత భర్తృక, 8 అభిసారిక.

అష్టసిద్ధులు : 1 అణిమ (అణువులా సూక్ష్మరూపం పొందడం), 2 గరిమ (ఎంత పెద్ద పరిమాణం గల ఆకారాన్నైనా పొందగలగడం), 3 లఘిమ (పరమాణుకాల కంటె తేలికగా అవ్వగలగడం), 4 ప్రాప్తి (ఇష్టపదార్థాలు పొందగలగడం), 5 ప్రాకామ్యమం (లౌకిక పారలౌకిక పదార్థాలు ఏమి కావాలంటే అవి పొందడం), 6 ఈశత్వం (మాయని, సర్వజీవుల్ని యిష్టం వచ్చినట్లు నడిపించడం), 7 వశత్వం (బ్రహ్మాది దేవతలందరినీ వశం చేసుకోవడం), 8 కామావసాయిత్వం (అన్ని కోరికలు పూర్తిగా తీర్చుకోవడం).

అష్టైశ్వర్యాలు : 1 దాసీజనం, 2 భృతులు, 3 పుత్రులు, 4 మిత్రులు, 5 బంధువులు, 6 వాహనం, 7 ధనం, 8 ధాన్యాలు.

## 9

నవగ్రహ అధిదేవతలు : 1 రవి – నారాయణుడు, 2 చంద్రుడు – లక్ష్మి, 3 కుజుడు – అగ్ని, 4 బుధుడు – వాయువు, 5 గురుడు – శంకరుడు, 6 శుక్రుడు – విష్ణువు, 7 శని – కలిపురుషుడు, 8 రాహువు – రాక్షసులు, 9 కేతువు – రాక్షసులు.

నవగ్రహ వాహనాలు : 1 సూర్యుడు–7 గుఱ్ఱాల రథం, 2 చంద్రుడు – 10 గుఱ్ఱాల రథం, 3 కుజుడు – పొట్టేలు, 4 బుధుడు – సర్పం, నెమలి, 5 గురుడు – హంస, 6 శుక్రుడు – కప్ప, 7 శని – కాకి, 8 రాహువు – సింహం, 9 కేతువు – డేగ.

నవరత్నాలు : 1 మౌక్తికం, 2 కెంపు, 3 వజ్రం, 4 ప్రవాళం, 5 మరకతం, 6 నీలం, 7 గోమేధికం, 8 పుష్యరాగం, 9 వైఢూర్యం.

నవరసాలు : 1శృంగారరసం, 2హాస్యరసం, 3 కరుణరసం, 4 వీరరసం, 5 అద్భుత రసం, 6 భయానక రసం, 7 బీభత్స రసం, 8 రౌద్ర రసం, 9 శాంత రసం.

## 10

దశ కావ్యగుణాలు : (దండి) 1 శైథిల్య స్పర్శం లేనిది, 2 ప్రసిద్ధార్ధం, 3 రసంతోడి వాక్కులుగలది, 4 అనిష్టురాక్షర ప్రాయం, 5 అవిషమమగు బంధంగలది, 6 అర్థంలో అనేయత్వం, 7 ఉత్కృష్ణగుణవద్వాక్కు కలది, 8 లౌకికార్థాశ్రయణం, 9 సమాస భూయస్త్వం, 10 ఒకదాని ధర్మం ఇంకొకదానిలో ఆరోపించడం.

దశావతారాలు : 1 మత్స్యావతారం, 2 కూర్మావతారం, 3 వరహోతారం, 4 నరసింహా వతారం, 5 వామనావతారం, 6 రామావతారం, 7 బలరామావతారం, 8 పరశరామా వతారం, 9 బుద్ధావతారం, 10 కల్కా ్యవతారం.

## 11

ఏకాదశ కీర్తిశేషులు : (చచ్చియు బ్రతికియున్నవారు) 1 పరోపకారి, 2 వనమాలి (తోటమాలి),3 దేవాలయధర్మకర్త, 4 ధర్మసత్రధర్మకర్త, 5 వైద్యశాలధర్మకర్త, 6 నీతి దప్పని రాజు, 7 యుద్ధరంగమందు వెనుదిరగని వీరుడు, 8 గొప్పవిద్య నేర్చినవాడు, 9 కృతి యొనర్చినవాడు, 10 కృతినందినవాడు, 11 సత్పుత్రుని గన్నవాడు.

## 12

ద్వాదశ మాసాలు : (చాంద్రమానం ప్రకారం) 1 చైత్రం (చిత్తా నక్షత్రయుక్త పౌర్ణమి), 2 వైశాఖం (విశాఖయుక్త పౌర్ణమి), 3 జ్యేష్టం (జ్యేష్టయుక్త పౌర్ణమి), 4 ఆషాఢం (అశ్లేషయుక్త పౌర్ణమి), 5 శ్రావణం (శ్రావణయుక్త పౌర్ణమి), 6 భాద్రపదం (ఉత్తరా భాద్ర పదయుక్త పౌర్ణమి), 7 ఆశ్వయుజం (అశ్వనీయుక్త పౌర్ణమి), 8 కార్తీకం (కృతికయుక్త పౌర్ణమి), 9 మార్గశిరం (మృగశిరయుక్త పౌర్ణమి), 10 పుష్యం (పుష్య యుక్త పౌర్ణమి), 11 మాఘం (ముఖ నక్షత్ర యుక్త పౌర్ణమి), 12 ఫాల్గుణం (ఉత్తర ఫల్గుని నక్షత్ర యుక్త పౌర్ణమి).

## 18

అష్టాదశ పురాణాలు : 1 మత్స్య పురాణం, 2 మార్కండేయ పురాణం, 3 దేవీ భాగవతం, 4 భవిష్యత్ పురాణం, 5 బ్రహ్మాండ పురాణం, 6 బ్రహ్మవైవర్త పురాణం, 7 వరాహ పురాణం, 8 వామన పురాణం, 9 విష్ణు పురాణం, 10 వాయు పురాణం, 11 అగ్ని పురాణం, 12 నారద పురాణం, 13 పద్మ పురాణం, 14 లింగ పురాణం, 15 గరుడ పురాణం, 16 కూర్మ పురాణం, 17 స్కాంద పురాణం, 18 బ్రహ్మ పురాణం.

అష్టాదశ ఉప పురాణాలు : 1 సనత్కుమార, 2 నృసింహ పురాణం, 3 స్కాంద పురాణం, 4 శివధర్మం, 5 నందికేశ్వర పురాణం, 6 దౌర్వ్యాస పురాణం, 7 నారదీయ పురాణం, 8 కపిలపురాణం, 9 మానవపురాణం, 10 ఔశన పురాణం, 11 వారుణ పురాణం, 12 కాళీపురాణం, 13 సాంబ పురాణం, 14 సౌర పురాణం, 15 పరాశర పురాణం, 16 మారీచ పురాణం, 17 భార్గవ పురాణం, 18 బ్రహ్మాండ పురాణం.

అష్టాదశ భగవద్గీతాధ్యాయాలు (యోగాలు) : 1 అర్జున విషాదయోగం, 2 సాంఖ్య యోగం, 3 కర్మయోగం, 4 జ్ఞానయోగం, 5 సన్యాసయోగం, 6 ఆత్మసంయమ యోగం, 7 విజ్ఞాన యోగం, 8 అక్షరపర బ్రహ్మ యోగం, 9 రాజవిద్యా రాజగుహ్య యోగం, 10 విభూతియోగం, 11 విశ్వరూప సందర్శన యోగం, 12 భక్తియోగం, 13 క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగం, 14 గుణత్రయ విభాగయోగం, 15 పురుషోత్తమప్రాప్తి యోగం, 16 దైవాసుర సంపద్విభాగయోగం,17 శ్రద్ధాత్రయవిభాగయోగం,18 మోక్ష సన్యాస యోగం.

అష్టాదశ భారత పర్వాలు : 1ఆదిపర్వం, 2 సభాపర్వం, 3 అరణ్యపర్వం, 4 విరాట పర్వం, 5 ఉద్యోగపర్వం, 6 భీష్మపర్వం, 7 ద్రోణపర్వం, 8 కర్ణపర్వం, 9 శల్యపర్వం, 10 సౌప్తికపర్వం, 11 స్త్రీపర్వం,12 శాంతిపర్వం,13 అనుశాసనిక పర్వం,14 అశ్వ మేధ పర్వం, 15 ఆశ్రమవాసపర్వం, 16 మౌసల పర్వం, 17 మహాప్రస్థానిక పర్వం, 18 స్వర్గారోహణ పర్వం.

అష్టాదశ విద్యలు : 1 ఋగ్వేదం, 2 యజుర్వేదం, 3 సామ వేదం, 4 అధర్వణ వేదం, 5 శిక్షా, 6 వ్యాకరణం, 7 ఛందస్సు, 8 నిరుక్తం, 9 జ్యోతిషం, 10 కల్పం, 11 మీమాంస, 12న్యాయశాస్త్రం, 13 పురాణాలు, 14 ధర్మశాస్త్రాలు, 15 ఆయుర్వేదం, 16 ధనుర్వేదం, 17 నీతిశాస్త్రం, 18 అర్థశాస్త్రం.

అష్టాదశ శక్తిపీఠాలు : 1శాంకరీదేవీ (శ్రీలంకలో),2కామాక్షి (కాంచీపురం), 3 శృంఖలా దేవి (బంగాళం),4చాముండి (క్రౌంచపట్టణం),5 జోగులాంబ(అలంపూరు), 6 భ్రమరాంబ

(శ్రీశైలం), 7 మహాలక్ష్మి (కొల్హాపూర్), 8 ఏకవేణికాంబ (మయూరపురం), 9 విరజాదేవి (జాజిపూర్),10 మాణిక్యాంబ (ద్రాక్షారామం), 11 కామాఖ్య (అహిచ్ఛత్రిపురం), 12 మాధవి (ప్రయాగ), 13 మహాకాళి (ఉజ్జయని), 14 పురుహూతిక (పిఠాపురం), 15 వైష్ణవీ (జ్వాలాముఖీ), 16 మాంగల్యగౌరి (గయ), 17 విశాలాక్షి (కాశి), 18 సరస్వతి (కాశ్మీరం).
అష్టాదశ స్మృతులు : 1 మను స్మృతి, 2 బ్రహ్మ స్మృతి, 3 దక్ష స్మృతి, 4 గౌతమ స్మృతి, 5 యమ స్మృతి, 6 అంగీరస స్మృతి, 7 యోగీశ్వరస్మృతి, 8 ప్రచేస స్మృతి, 9 శాతాతప స్మృతి, 10 పరాశర స్మృతి, 11 సంవర్తన స్మృతి, 12 ఉశన స్మృతి, 13 శంఖస్మృతి, 14 లిఖిత స్మృతి, 15 ఆత్రేయస్మృతి,16 విష్ణు స్మృతి, 17 ఆపస్తంబ స్మృతి, 18 హరీత స్మృతి.

## 64

చతుష్షష్టిత్య కళలు : (వాత్స్యాయన) 1 అందాన్నిచ్చేవట్టి అలంకారాలు, 2 దేహా లంకరణం, నఖాలంకరణం, శిరోజాలంకరణం, 3 ముఖతిలకాలంకరణం, 4 శిరోజా లంకరణాలు (పరిమళ గంధకాలు), 5 వస్త్రాలు ధరించునట్టి విధాలు, 6 వస్త్రాల నలంకరించుకొను వివిధ రీతులు, 7 సంగీతం – నటనం, 8 వాయిద్యాలు వాయించుట, పాడుట, 9 జలతరంగాన్ని ధ్వనింపజేయుట, 10 నాటకమాడుట, 11 నాట్యం – నర్తనం, 12 సత్రునర్తన, 13 అనేక భాషలతో సంబంధం కల్పించుకొనుట, 14 భాషాజ్ఞానం, 15 పదాలకూర్పు లక్షణాలు, 16 వచన కావ్యాలు పఠించుట, 17 పద్యాల నొప్పగించుట, 18 పద్యాల విమర్శించుట, 19 నాటక విమర్శనం, కథావివరణం, 20 పద్యపాదాన్ని పూర్తిచేయుట, 21 అడిగిన పద్యాన్ని అల్లుట, 22 పద్యం మూలం ప్రశ్నించినచో ప్రత్యుత్తరం పద్యం ద్వారా ఇచ్చుట, 23 భాషను మార్చి మాట్లాడుట, సంకేత పరిభాష, 24 ఒకని ప్రవర్తన, వేషం, భావాన్నిబట్టి వాని స్వభావం నెరుగు విధం, 25 వశీకరణ తంత్రం, 26 పాకకళ, 27 పలువిధాలైన పానీయాలు చేయుట, 28 కుట్టుపని, సూదితో తయారుచేసే చేతిపనులు, 29 ఋతుభేదాలు, ఋతువునకు తగినట్టు పడకలనమర్చుట, దాని సంబంధమైన అలంకరణ (కుటుంబ సంబంధమైన కళలు), 30 శరీర సంబంధమైన వ్యాయామం, 31 ఆటలు, 32 ఈత, జలక్రీడ (శరీర వ్యాయామ విద్యలు), 33 చదరంగం, 34 పందెపు ఆటలు, 35 పొడపు కథలు – దాని వివరణం, 36 గణితం – ప్రశ్నోత్తరాలు, 37 ఇంద్రజాలం (భ్రమను కలిగించునట్టి కళ), 38 హస్తలాఘవం, 39 పక్షులు, ప్రాణులవలె అరచుట, 40 వేషం వేయుట, 41 రంగులు వేయుట, 42 పూలమాల కూర్చుట, అలంకరణం తయారుచేయుట, 43 వాహనాలను, పటాలను, మంచాలను పుష్పాలతో నలంకరించుట, 44 పుష్పాలవలె ఇతర వస్తువులను తయారుచేయుట (కృత్రిమ పుష్పాలు), 45 శంఖం, దంతం వీటితో

కర్ణాభరణాలు చేయుట, 46 నూలుతో పక్షులు, మృగాలు, పుష్పాలల్లుట, 47 మృత్తికతో వస్తువులు, విగ్రహాలు, మున్నగునవి తయారుచేయుట, 48 వస్తురూపాన్ని మార్చునట్టి కళ (ప్రత్తిని పట్టువలె కనబడునట్లు చేయుట), 49 చిలుకలు, ఇతర పక్షులకు మాటలు నేర్పుట, మాట్లాడునట్లు చేయుట, 50 మేకలు, కోళ్ళు, పక్షిజాలాలు, ఇతర పెంపుడు జంతువులకు పోట్లాట నేర్పుట, 51 తోటపని 52 సుగంధ ద్రవ్యాలు తయారుచేయుట, 53 కలపతో చెక్కడాలు చేయుట, 54 పేముతుంగ వీనితో తట్టలు మొదలైనవి చేయుట, 55 కమ్మరి పనులు, 56 యాంత్రిక జ్ఞానాన్ని పొందుట, 57 భవననిర్మాణపు పనులు, 58 వర్ణపురాళ్లను భవనంలో పొదిగించుట, 59 లోహ జ్ఞానాన్ని సంపాదించుట, 60 నవ రత్నాలను ఆభరణంలో పొదిగించు జ్ఞానం, 61 ఖరీదుగలరాళ్ళకు వర్ణమిచ్చుట, 62 యుద్ధకళ, 63 పరిభాషాజ్ఞానం, 64 ధూర్తుల చిహ్నాలను తెలుసుకొనుట (వా.కా).

చతుష్షష్టి విద్యలు : 1 వేదం, 2 శాస్త్రం, 3 ధర్మశాస్త్రం, 4 వ్యాకరణం, 5 జ్యోతిషం, 6 ఆయుర్వేదం, 7 గాంధర్వం, 8 కవిత్వం, 9 సర్వ శాస్త్రం, 10 సాముద్రికం, 11 కొక్కోకం, 12 శాకునం, 13 మల్లవిద్య, 14 గారుడం, 15 వాక్చమత్కారం, 16 బూజవిజయం, 17 దేశభాషలు, 18 లిపిజ్ఞానం, 19 లిపిలేఖనం, 20 ఆరద గయనం, 21 రత్నపరీక్ష, 22 అస్త్రవిద్య, 23 పాకచమత్కారం, 24 జంతుభేదం, 25 వృక్షదోహద క్రియ, 26 ఆగమశాస్త్రం, 27 ఇంద్రజాలవిద్య, 28 మహేంద్రజాలనం, 29 కుట్టుపని, 30 శిల్పశాస్త్రం, 31 రసగంధవాదం, 32 భూపాలవిధి, 33 అంజన విశేషాలు, 34 వాయు జలాగ్ని స్తంభన, 35 స్వరవంచన, 36 ధ్వనివిశేషం,37 గుటికా శుద్ధి, 38 పశుపాలనవిధి, 39 అవిద్యాశ్ఛేదనావిద్య, 40 విహంగభేదగతి, 41 చిత్ర లేఖనం, 42 అభినయ శాస్త్రం, 43 చోరత్వధీమంతం, 44 వాస్తుశాస్త్రం, 45 మణి మంతౌషధసిద్ధి, 46 లోహకారకత్యం, 47 కాశపని, 48 స్వప్నశాస్త్రం, 49 కులాల, 50 వడ్రంగి, 51 మోదర, 52 చర్మకట్టు, 53 కార్యకరణ విద్య, 54 గణితశాస్త్రం, 55 దూతికాకృత్యం, 56 చరాచరాన్యధాకరణం, 57 తంతువిద్య, 58 యోగరాజం, 59 సేద్యం, 60 ప్రశ్నశాస్త్రం,61 వ్యాపారం,
62 మిత్రభేదం, 63 వేట, 64 తురగా రోహణం (చ్ఞా వి. మా)

## 100

శత ధృతరాష్ట్రసుతులు : (కౌరవులు) 1 దుర్యోధనుడు, 2 దుశ్శాసనుడు, 3 దుర్ధర్షుడు, 4 దుర్ముఖుడు, 5 జలసంధుడు, 6 సహుడు, 7 సముడు, 8 విందుడు, 9 అనువిందుడు, 10 దుర్బాహుడు, 11 సుబాహుడు, 12 దుష్ప్రధర్షణుడు, 13 ధర్మధుడు, 14 చిత్రయోధి, 15 దుష్కర్ణుడు, 16 కర్ణుడు, 17 వివింశతి, 18 వికర్ణుడు, 19 జయసంధి, 20 సులోచనుడు, 21 చిత్రుడు, 22 ఉపచిత్రుడు, 23 చిత్రాక్షుడు, 24 చారుచిత్రుడు, 25 శతాననుడు, 26

దుర్మర్షణుడు, 27 దుర్ధర్షణుడు, 28 వివిర్సుడు, 29 కటుడు,30 శముడు, 31 ఊర్ణనాభుడు, 32 సునాధుడు,33 నందకుడు,34 ఉపనందకుడు, 35 సేనాపతి, 36 సుషేణుడు, 37 కుండో, 38 మహోదరుడు, 39 చిత్రధ్వజుడు, 40 చిత్రరథుడు, 41 చిత్రభానుడు, 42 అమిత్రజిత్, 43 చిత్రబాణుడు, 44 చిత్ర వర్ముడు, 45 సువర్ముడు, 46 దుర్వినియోచనుడు, 47 చిత్ర సేనుడు, 48 విక్రాంతకుడు, 49 సుచిత్రుడు, 50 చిత్ర వర్మ,51అపరాజితుడు, 52 పండితుడు,53 శాలాక్షుడు,54 దురావరాజితుడు, 55 జయంతుడు, 56 జయ త్సేనుడు, 57 దుర్జయుడు, 58 ధృడహస్తుడు, 59 సుహాస్తుడు, 60 వాతవేగుడు, 61 సువర్చనుడు, 62 ఆదిత్యుడు, 63 కేతువు, 64 బహ్వాంశి, 65 నాగదంతుడు, 66 ఉగ్రశాయి, 67 కవచి, 68 నషంగి, 69 చాపి, 70 దండదారుడు, 71 ధను గ్రహుడు, 72 ఉగ్రుడు, 73 భీముడు, 74 రథభీముడు, 75 భీమబాహుడు, 76 ఆలోపుడు, 77 భీమకర్ముడు, 78 సుబాహుడు, 79 భీమవిక్రాంతుడు, 80 అభయుడు, 81 రౌద్రకర్ముడు, 82 దృఢరథుడు, 83 అనానృదృడు, 84 కుండభేది, 85 విరావి, 86 దీర్ఘలోచనుడు, 87 దీర్ఘద్వజుడు, 88 దీర్ఘభుజుడు, 89 అదీర్ఘుడు, 90 దీర్ఘుడు, 91 దీర్ఘ బాహుడు, 93 వ్యూడోరుడు, 94 కనక ధ్వజుడు, 95 మహా కుండుడు, 96 కుండుడు, 97 కుండజుడు, 98 చిత్రజాసనుడు, 99 చిత్రకుడు, 100 కవి (దుస్సల కూతురుతో 101 మంది) (మ భా - ఆ మం).

## 108

అష్టోత్తరశత శక్తిపీఠాలు : 1 అతిప్రియాదేవి (హరిగంగా ద్వారం), 2 అతిశాంకరీదేవి (కార్తిక క్షేత్రం), 3 అనంగాదేవి (భరతాశ్రమం), 4 అభయాదేవి (ఉష్ణగండ తీర్థం), 5 అమోఘాదేవి (విపాశతీర్థం), 6 అమృతాదేవి (వీణాధరాస్థలి), 7 ఆరోగ్యాదేవి (వైద్యనాథధామం), 8 ఇంద్రాణీదేవి (దేవలోకం), 9 ఉత్పలాక్షీదేవి (సహస్రాక్షి క్షేత్రం), 10 ఉమాదేవి (వినాయక క్షేత్రం), 11 ఉరశీదేవి (బదరీక్షేత్రం), 12 ఏకవీరాదేవి (సహ్యాభరాధరం),13 ఓషధిశక్తి (ఉత్తరకురు సీమ), 14 కపిలాదేవి (మహాలింగ క్షేత్రం), 15 కమలాదేవి (కమలాలయం),16 కల్యాణీదేవి (మలయపర్వతం),17 కామ చారణీదేవి (మందరగిరి), 18 కామప్రపూర్ణహిమనగం (పూర్ణగిరిమాయి), 19 కాముకీ శక్తి (గన్ధమాదనం), 20 కాళీదేవి (లంజర క్షేత్రం), 21 కీర్తిమతిదేవి (ఏకామ్ర పీఠం), 22 కుమారి (కన్యాకుమారి) - మాయాక్షేత్రం, 23 కుముదాదేవి (మానస సరోవరం), 24 కుశోదకాదేవి (కుశద్వీపం), 25 కోటరీదేవి (కోటితీర్థం), 26 గాయత్రీ దేవి (వేదముఖ క్షేత్రం), 27 గోమతీదేవి (గోమన్తక్షేత్రం), 28 గౌరీదేవి (కన్యాకుబ్జ పురం), 29 చంద్రికాదేవి (హరిశ్చంద్ర క్షేత్రం),30 గౌరీదేవి (ముఖక్షేత్రం), 31 చండికాదేవి (కురుండకపురం), 32 జయంతీదేవి (హస్తినాపురం), 33 జయాదేవి (వరాహగిరి), 34 జలప్రియాదేవి (సుందరశివలింగక్షేత్రం),35 తారాదేవి - (కిష్కింధ), 36 త్రిసంధ్యా దేవి (గోదావరీతీర దేశం), 37 దేవకీశక్తీ (వ్రజమండల

మధుర), 38 ధరాదేవి (శంఖోద్ధార క్షేత్రం), 39 ధృతిదేవి (పిండార క్షేత్రం), 40 నందినీదేవి (దేవికాస్థలి), 41 నారాయణీ (సులాశము), 42 నితంబాదేవి (వింధ్యగిరి), 43 నిధిశక్తి (శ్రవణాలయమున), 44 ప్రభండాదేవి (భగలండ క్షేత్రం), 45 పరమేశ్వరీశక్తి (పాతాళం),46 పాటలాదేవి (పుండ్రవర్ధనం),47 పారావారాదేవి (తటం), 48 పింగళా దేవి (పమోష్టి), 49 పురుహూతా దేవి (పుష్కర క్షేత్రం), 50 పార్వతీదేవి (ఛర్గసన్నిధి), 51 పుష్కరావతీదేవి (ప్రభాస క్షేత్రం), 52 పుష్టిదేవి (దారుకావనం), 53 బిల్వపత్రిక (పల్వర క్షేత్రం),54 భద్రకర్ణిక (గోకర్ణం), 55 భద్రాదేవి (భద్రపీఠ క్షేత్రం), 56 భవానీ దేవి (స్థానేశ్వరం), 57 భీమాదేవి (హిమవత్పర్వతం), 58 మకుటేశ్వరి (మకుట క్షేత్రం), 59 మంగళాదేవి (గయ), 60 మన్మథాదేవి (హేమకూటం), 61 మహాదేవి (సాలగామం), 62 మహాభాగ (మమాలయ క్షేత్రమున), 63 మహాలక్ష్మి (కరవీరపురం), 64 మహోత్పలాదేవి (హిరణ్య క్షేత్రం), 65 మాండవీదేవి (మాండవ్యక్షేత్రం), 66 దేవ మాతాదేవి సరస్వతీనదీ నరమున, 67 మధోత్కలాదేవి - చైత్రరథమున, 68 మాధవీ దేవి-ప్రయాగ,69 మాహేశ్వరదేవి - మహాకాల క్షేత్రం, 70 మృగావతీదేవి - యమునా తీర భూమి, 71 మోధాదేవి - కాశ్మీరదేశం, 72 రంభాగౌరీదేవి - మలయ పర్వతం, 73 రమణాదేవి - రామతీర్థం, 74 రాథాదేవి - బృందావనం, 75 రుక్మిణీదేవి - ద్వారావతీపురం, 76 రుద్ర సుందరీదేవి - త్రికూట పర్వతం, 77 రుద్రాణీదేవి - రుద్రకోటి క్షేత్రం, 78 లలితాదేవి - ప్రయాగ, 79 లలితాదేవి - సంతానపీఠక స్థలం, 80 లక్ష్మీదేవి - సిద్ధవనం, 81 లింగధారిణీదేవి - నైమిశారణ్యం, 82 లోలా దేవి- ఉత్పలావర్తం, 83 వందనయాదేవి - అశ్వత క్షేత్రం, 84 వరాహదేవి - సోమేశ్వరం, 85 వింధ్యవాసినీదేవి - వింధ్యాచలం, 86 విపులాదేవి - విపులాక్షేత్రం, 87 విమలాదేవి - జగన్నాథం, 88 విశ్వకామాదేవి - దక్షిణేశ్వరం, 89 విశ్వంభరాదేవి - విశ్వేశ్వరాపురం, 90 విశాలాక్షీదేవి - వారణాసి, 81 విశ్వముఖీదేవి- జాలంధర క్షేత్రం, 82 విశ్వేశ్వరి-విశ్వేశ్వరీక్షేత్రం, 83 శుద్ధదేవి-కపాలమోచన క్షేత్రం, 84 శివ ధారిణీదేవి- మచ్చోరమ, 85 వైష్ణవీ (మాత) దేవి - మాతల క్షేత్రం, 86 శుభానాన్దాదేవి -శివకుండం, 87 సత్యవాదినీదేవి - కుముద క్షేత్రం, 88 సన్మార్గదాయిని - కేదారం, 89 సరస్వతీదేవి - బ్రహ్మపురి, 90 స్వాహాదేవి - (మాహేశ) - మహిష్మతిపురం, 91 సింహికాదేవి - కృతశౌచ క్షేత్రం, 92 సీతాదేవి - చిత్రకూటం, 93 సుగన్ధాదేవి - మాధవవనం,94 సుగళాదేవి - చంద్రభాగాతటం, 95 సుప్రభాశక్తి - సూర్యబింబం, 96 సుభద్రాదేవి- శోణగంగాసంగమం, 97 సుమాతాదేవి - కాయావరోహణ క్షేత్రం, 98 సోమాక్య - మాహేశ్వర క్షేత్రం.

## భాషకు సొంపును, ఇంపునూ పెంచే

# తెలుగు సామెతలు

అంకెలేని కోతి లంకంతా చెరిచిందట.

అంగట్లో అన్నీ వున్నాయి, అల్లుని నోటిలో శని వుంది.

అంగడిలో చింగుడు (చిల్లర) దొరకదు.

అంత్య నిష్ఠూరం కంటె ఆదినిష్ఠూరం మేలు.

అంధునకు అద్దం చూపినట్లు.

అందరూ అందలమెక్కే వారైతే మోసే వారెవరు ?

అందితే జుట్టూ అందకున్న కాళ్ళూ.

అక్క మనది అయితే బావ మనవాడా?

అగ్గిమీద గుగ్గిలం.

అగ్గికి వాయువు తోడైనట్లు.

అచ్చి పెండ్లి బుచ్చి చావుకు వచ్చినది.

అడ్డగోడ మీద పిల్లి.

అడిగినగాని అమ్మయైనను పెట్టదు.

అడిగేవానికి చెప్పేవాడు లోకువ.

అడుసు త్రొక్కనేల; కాలు కడుగనేల?

అత్త చచ్చిన ఆరునెల్లకు కోడలి కంటినీరు వచ్చింది.

అతివినయం ధూర్త లక్షణం.

అత్తలేని కోడలు ఉత్తమురాలు, కోడలులేని అత్త గుణవంతురాలు.

అత్తసొమ్ము అల్లుడు ధారవోసినట్లు.

అత్త ఒకరింటి కోడలే.

అదృష్టం కలసివస్తే ఆలు పెళ్ళామౌతుంది.

అనువుకానిచోట అధికుల మనరాదు.

అనుమానం పెనుభూతం.

అనుమానం ప్రాణసంకటం.

అనూరాధ కార్తెలో ఆశ్లేష వాన అరికాలు తేమ.

అనాధి కర్రేయినా ఈనుతుంది.

అప్పుచేసి పప్పుకూడు.

అప్పులేదు ఆస్తిలేదు.

అభంశుభం ఎరుగడు.

అబద్ధమాడినా గోడపెట్టినట్లుండాలి.

అమ్మబోతే అడివి కొనబోతే కొరివి.

అమ్మ పెట్టాపెట్టదు అడుక్కు తినానివ్వదు.

అయ్యొరాకపోతే అమావాస్య అట్టేవుంటుందా?

అరచేతిలోనే వైకుంఠం చూపుతారు.

అరటిపండు వలిచి అరచేతిలో పెట్టినట్లు.

అరచే కుక్క కరవ నేరదు.

అలవాటులో పొరపాటు.

అవ్వ కావాలి, బువ్వ కావాలి.

ఆకలి రుచి ఎరుగదు, నిద్ర సుఖ మెరుగదు, వలపు సిగ్గెరుగదు.

ఆటలో అరటిపండు.

ఆడలేక మద్దెల ఓటిదన్నాడట.

ఆ వూరి కీవూరెంతో ఈ వూరికావూరూ అంతే.

ఆరుద్ర కాస్తే ఆరు కార్తెలు కురుస్తాయి.

ఆరు మూడైనా, మూడు ఆరైనా సరే.

ఆరు నెలలు స్నేహం చేస్తే వీరు వారవుతారు.

ఆరోగ్యమే మహాభాగ్యం.

ఆలూ లేదు, చూలూ లేదు, కొడుకు పేరు సోమలింగం.

ఆలస్యం అమృతం విషం.

ఆవులిస్తే ప్రేగులు లెక్కపెట్టుట.

ఆవు చేలో మేస్తుంటే దూడ గట్టున మేస్తుందా?

ఆహార వ్యవహారములందు సిగ్గుకూడదు.

ఇంట గెలిచి రచ్చ గెలువు.

ఇంటి దొంగ నీశ్వరుడైనా పట్టలేడు.

ఇంటిలో ఈగల మోత, బయట పల్లకీల మోత.

ఇంట్లో పెండ్లయితే, వూళ్ళో కుక్కలకు హడావిడి.

ఇతరుల సొమ్ముకంటె విషం మేలు.

ఇతర్లను గురించి చెడ్డచెప్పేవాడెప్పుడూ తాను చెడ్డవాడై యుంటాడు.

ఇరుకులో సరుకు మంత్ర.

ఇల్లాలు గ్రుడ్డిదైతే ఇంటికుండలకు చేటు.

ఇల్లుకట్టి చూడు, పెళ్లిచేసి చూడు.

ఇల్లు గెలవలేనివాడు రచ్చ గెలుచునా?

ఇల్లు అలుకగానే పండుగగునా?

ఇల్లుచూచి ఇల్లాలును చూడమన్నట్లు.

ఇసుక తక్కెడ ఈగె తక్కెడ.

ఈ కంటికి ఈ రెప్పలు దూరమా?

ఈగిచూచి పిల్లనీయి, పిడిచూచి కొడవలియి.

ఈతచెట్టు యిల్లు కాదు, తాటిచెట్టు తల్లి కాదు.

ఉంగరాల చేతితో మొట్టితో నొప్పి ఉండదు.

ఉట్టికెక్కలేనమ్మ స్వర్గానికెక్కునా?

ఉడిగి ఉత్తరం చేరింది.

ఉత్తరాన ఉరిమితే వాన తప్పదు, పాము తరిమితే కరవక తప్పదు.

ఉద్యోగం పురుష లక్షణం.

ఉన్నమాటంటే ఉలుకెక్కువ.

ఉపకారానికి పోగా అపకారం ఎదురైనట్లు.

ఉభయ భ్రష్టుత్వం ఉపసన్యాసం.

ఉయ్యాలలో బిడ్డనుంచి ఊరంతా వెతికిందట.

ఉల్లి పదితల్లుల పెట్టు.

ఉల్లిచేసిన మేలు తల్లిచేయలేదు.

ఉసురువుంటే ఉప్పమ్ముకొని బతుకవచ్చు.

ఊరంతా చుట్టాలు, వుట్టికట్ట తావులేదు.

ఊరు పొమ్మంటుంది, కాడు రమ్మంటుంది.

ఊరంతా నాయనకు వణకితే, నాన్న అమ్మకు వణకినట్లు.

ఊళ్ళో పెండ్లికి కుక్కలకు హడావిడి.

ఋణ శేషం, వ్రణ శేషం, అగ్ని శేషం, శత్రు శేషం వుంచరాదు.

ఎంత చెట్టు కంతగాలి.

ఎంత ప్రొద్దువుండగా లేచినా, తుమ్మగుంట వద్దనే తెల్లవారినది.

ఎక్కడనైనను బావా అనవచ్చుగాని, వంగ తోట వద్ద బావా అనవద్దు అన్నాడు.

ఎక్కడవున్నావు కంబళి అంటే, వేసిన చోటనే వున్నాను గొంగళీ అన్నదట.

ఎద్దుతన్నునని భయపడి, గుఱ్ఱము చాటున దాగినాడట.

ఎద్దు పుండు కాకికి ముద్దా.

ఎనుబోతుమీద వానకురిసినట్లు.

ఎరనుచూపి చేపను లాగినట్లు.

ఎలుకకు పిల్లి సాక్షి.

ఎవరి వెర్రి వారికానందం.

ఎవరు త్రవ్వుకొన్న గోతిలో వారే పడతారు.

ఎవరికి వారే యమునాతీరే.

ఏకయి వచ్చి, మేకై బిగిసినది.

ఏ గాలికి ఆ చాప యెత్తినట్లు.

ఏనుగులను తినేవానికి పీనుగులు పిండి వంటలా?

ఏనుగుమీద ఈగ వ్రాలినట్లు.

ఏ పుట్టలో ఏ పామున్నదో ఎవరికెరుక.

ఏమీలేని ఆకు ఎగసెగసి పడితే, అన్నీవున్న ఆకు అణగిమణగి వుంటుంది.

ఏ యెండ కా గొడుగు పట్టరాదు.

ఏరుకొని తినేవాని వెంట గీరుకొని తినేవాడు పడినట్లు.

ఐశ్వర్యానికి అంతులేదు.

ఐసా, పయిసా.

ఒక దెబ్బకు రెండు ముక్కలు.

ఒకరిద్దర్ని చంపితేగాని వైద్యుడుగాడు.

ఒక అబద్ధం కమ్మడానికి వెయ్యి అబద్ధాలు ఆడాలి.

ఓడలు ఒళ్ళమీద, బళ్ళు ఓడలుమీద వస్తాయి.

ఓలి తక్కువని గ్రుడ్డిదానిని పెళ్ళాడితే నెలకు ముప్పైకుండలు పోగొట్టినట్లు.

కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగునా?

కండ్లకు గంతకట్టి అడవిలో విడిచినట్లు.

కంచే చేనుమేస్తే దిక్కేమిటి?

కందకులేని దురద, పెండలానికెందుకున్నట్లు.

కట్టె వంకర పొయ్యి తీర్చినట్లు.

కడవంత గుమ్మడికాయ, కత్తిపీటకు లొంగె.

కడుపా, చెఱువా?

కడుపుతో ఉన్న అమ్మ కనకా మానదు, పండుకొన్నమ్మ తినకా మానదు.

కడుపులో లేనిది, కౌగిలించుకుంటే వస్తుందా?

కడుపు చింపితే, కాళ్ళమీద పడును.

కడుపు నిండితే గారెలు చేదు.

కతికితే అతకదు.

కత్తిపోటు తప్పినా, కలంపోటు తప్పదు.

కత్తిమీద సాము.

కని పెంచినమ్మ కష్టం గొడ్రాలికేం ఎఱుక.

కనుమూసినంతసేపు పట్టదు.

కనుగొని రమ్మంటే కాల్చి వచ్చునట్లు.

కయ్యానికి కాలు దువ్వుట.

కర్రలేనివానిని గొర్రెయినా కరుస్తుంది.

కరిచేకుక్క మొరగదు, మొరిగేకుక్క కరవదు.

కరవులో అధికమాసమన్నట్లు.

కలిమిలేములు కావడికుండలు.

కలిగినవారికి అంతా చుట్టాలే.

కలకాలం బ్రతికినను కాటికి పోక తప్పదు.

కలుపుతీయని మడి, దేవుడిలేని గుడి.

కల్యాణం వచ్చినా, కక్కువచ్చినా ఆగవు.

కష్టసుఖాలు కావడికుండలు.

కష్టే ఫలి.

కాకిపిల్ల కాకికి ముద్దు.

కాకిముక్కున దొండపండులాగ.

కాకులను కొట్టి, గద్దలకు వేసినట్లు.

కాచినచెట్టుకు రాళ్ళదెబ్బలు.

కారణం లేకనే కార్యము పుట్టదు.

కాలికివేస్తే వేలికి, వేలికివేస్తే కాలికి.

కాలుగాలిన పిల్లివలె తిరుగుట.

కాలుజారితే తీసుకోవచ్చునుకాని, నోరు జారితే తీసికోలేము.

కాలికివేస్తే మెడకు, మెడకువేస్తే కాలికి.

కాళ్ళ దగ్గరకు వచ్చిన బేరం, కాశికి వెళ్ళినా దొరకదన్నట్లు.

కీడెంచి మేలెంచవలెను.

కుక్క కాటుకి చెప్పుదెబ్బ.

కుక్కతోక పట్టుకొని గోదావరీదినట్లు.

కుక్కను చంపిన పాపం గుడికట్టినా పోదు.

కుంటి కులాసం, యింటికి మోసం.

కుమ్మరవీధిలో కుండలమ్మినట్లు.

కులహీనమైనను, గుణహీనం కాదు.

కూటికి పేదైతే, కులానికి పేదా?

కూడు కలిగినవాడు, కులం మరచినట్లు.

కొండత్రవ్వి ఎలుకను పట్టినట్లు.

కొండనాలుకకు మందువేస్తే ఉన్న నాలుక వూడిపోయిందట.

కొండకు ఒక వెంద్రుక ముడివేస్తే, వస్తే కొండ వస్తుంది, పోతే వెంద్రుక పోతుంది.

క్రొత్తొకవింత, పాతొక రోత.

క్రొత్త బిచ్చగాడు ప్రొద్దెరుగడు.

కొఱవితో కొప్పు గోకికొనినట్లు.

కోటివిద్యలు కూటికొరకు యన్నట్లు.

కోతికి కొబ్బరికాయ దొరికినట్లు.

గంగలో మునిగినా కాకి హంస కానట్లు.

గంగిగోవు పాలు గంటెడైన చాలు.

గంతకు తగిన బొంత.

గడ్డం కాలి ఒకడు ఏడుస్తుంటే, చుట్టకు నిప్పు యిమ్మని ఒకడు వెంబడించినట్లు.

గడుసువాడు మూడిందాల చెడును.

గతకాలం మేలు, వచ్చుకాలంకంటె.

గతిలేనమ్మకు, మతిలేని మగడు.

గ్రహచారం బాగాలేకపోతే, గుఱ్ఱం గాడిదై కూసినట్లు.

గాజుకుప్పెలో దీపంలా.

గాదిక్రింద పందికొక్కు.

గాలిలో దీపంపెట్టి, దేవుడా నీ మహాత్మ్యం అన్నట్లు.

గ్రుడ్డిలో మెల్ల.

గ్రుడ్డికన్ను మూసినా ఒకటే, తెరచినా ఒకటే.

గ్రుడ్డివానికి దీపం చూపినట్టు.

గ్రుడ్డువచ్చి, పిల్లను వెక్కిరించినట్లు.

గుండెలు తీసిన బంటు.

గుమ్మడికాయల దొంగ అంటే, భుజాలు తడుము కొన్నట్లు.

గుమ్మడికాయ పోయేదారి ఎరుగడు, ఆవగింజ పోయేదారి అట్టేపట్టి చూస్తాడు.

గ్రుడ్డికన్న, మెల్ల మేలు.

గురివిందగింజ తన క్రింద నున్న నలు పెరుగదు.

గురువుకు తగ్గ శిష్యుడు.

గురువుగారికే పంగనామాలు పెట్టేవాడు.

గుళ్ళు మ్రింగేవానికి, గుడి లింగాలు లక్ష్యమా ?

గొడ్రాలి కేంతెలుసు, బిడ్డనొప్పులు.

గొడ్రాలి తిట్టు, గొడ్డలి పెట్టు.

గొర్రెకు బెత్తెడే తోక.

గొర్రె కాచేవాణ్ణి నమ్మదు, కోసేవాణ్ణి నమ్ముతుంది.

గొర్రెలలో తోడేలు చొరబడ్డట్టు.

గోటితో మీటేది, గొడ్డళ్ళతో చీల్చునా ?

గోడలకు చెవులుండును.

గోంగూరలో చింతకాడ వేసినట్లు.

గోతికాడ నక్కవలె.

గోరంతవుంటే, కొండంత చేస్తారు.

గోరుచుట్టుమీద రోకటిపోటు.

ఘటాలు శాశ్వతమా యన్నట్లు.

చంద్రునికొక నూలుపోగు.

చక్కదనానికి మా అక్క, సంగీతానికి మా బావ.

చచ్చినవాడి పెండ్లికి వచ్చిందే కట్నము.

చచ్చినవాడు ఏడిస్తే మాత్రం వస్తాడా?

చచ్చేదాకా బతికితే పెండ్లి చేస్తానన్నట్లు.

చచ్చిన పామును కొట్టేందుకు అందరూ బంట్లే.

చచ్చినవాని తల తూర్పుకుంటేనేమి, పడమట కుంటేనేమి ?

చదువుకున్న వానికన్న చాకలిమేలు.

చదువవేస్తే ఉన్నమతి పోయినదట.

చదువ వేయనంతవరకూ కాకరకాయ, చదు వేసిన తర్వాత కీకరకాయ.

చదివేది రామాయణం, కూలగొట్టేవి దేవ స్థలాలు.

చద్దికూడుతిన్నమ్మకు, మగనిఆకలి తెలియదు.

చన్నీళ్ళకు వేడినీళ్ళు తోడు.

చల్లకువచ్చి ముంత దాచనేల?

చావుదప్పి, కన్ను లొట్టపోయినట్లు.

చావా చావనివ్వడు, బ్రతుకా బ్రతుకనివ్వడు.

చింత చచ్చినా పులుపు చావదు.

చిత్తశుద్ధిలేని శివపూజ లేలయన్నట్లు.

చిత్తకార్తెలో కుక్కలు.

చిన్ననాడు లేనిదే పెద్దనాడు వస్తుందా?

చిన్నపామునైనా, పెద్దకర్రతో కొట్టవలెను.

చిలువ వదిలితేగాని ఫలం దక్కదు.

చుట్టమైవచ్చి దయ్యమై పీకేడట.

చుట్ట మాకలి మంచ మెరుగునన్నట్లు.

చుట్టమని చూడవస్తే, యింటివారంతా దయ్యాలై పట్టుకొన్నారట.

చూచిరమ్మంటే, కాల్చివచ్చే రకం.

చూడచూడ జాడలు వేరు.

చెట్టయి వంగనిది మ్రానై వంగుతుందా?

చెట్టును బట్టి కాయ.

చెట్టుముందా, విత్తుముందా అన్నట్లు.

చెట్టులేనివూళ్ళో ఆముదపుచెట్టు మ్రాను.

చెడు కాలానికి చెడ్డబుద్ధులు.

చెట్టుపేరు చెప్పి, కాయలమ్ముకొన్నట్లు.

చెప్పుడు మాటలు చెడ్డవి.

చెప్పేవానికి వినేవాడు లోకువ.

చెరపకురా చెడేవు.

చెవిటివానివద్ద శంఖమూదినట్లు.

చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకొన్నట్లు.

చేసిన పాపము చెపితే పోవును.

చేసిన పాపము కాశికిపోయినా తీరదు.

జగమెరిగిన బ్రాహ్మణునకు జందెమేల?

జామాతా దశమగ్రహః.

జీతంలేని నౌఖరు, కోపంలేని దొర.

జోగీజోగీ రాసుకుంటే బూడిద రాలుతుంది.

జోరీగల గుంపుకు గోరోజనం మెండు.

డబ్బిస్తే కొండమీద కోతి దిగివస్తుంది.

డబ్బులేని డాబుసరియన్నట్లు.

తడిగుడ్డలతో గొంతుకు తెగకోస్తాడు.

తనబంగారం కాకపోతే వన్నెలేదు, వెరవూ లేదు.

తనకుమాలిన ధర్మం, మొదలు చెడ్డ బేరం.

తనదాకా వస్తే గాని నొప్పి తెలియదు.

తనదాకవస్తే తగవే లేదు.

తనకోపమే తన శత్రువు.

తప్పులేనివాడు ధరణిలో ఉండడు.

తలప్రాణం తోకకు వచ్చింది.

తల్లిపుట్టిల్లు మేనమామకెరుక.

తల్లయినా అడుగనిది అన్నం పెట్టదు.

తల్లిదండ్రులకు మించిన పూజ్యులులేరు.

తాటాకు చప్పుళ్ళకు కుందేళ్ళు బెదురునా ?

తాడితన్నేవాని తలతన్నే వాడొకడుండును.

తాతకు దగ్గులు నేర్పవలెనా ?

తాను పట్టిన కోడికి నాలుగేకాళ్ళు.

తానుచెడినకోతి వనమంతా చెరచినట్లు.

తానొకటితలిస్తే, దైవమొకటి తలచినట్లు.

తావలచినది రంభ, తామునిగినది గంగ.

తిండికి తిమ్మరాజు, పనికి పోతురాజు.

తిన్నయింటి వాసాలు లెక్క పెట్టినట్లు.

తినగా తినగా గారెలు చేదెక్కినవి.

తినమరిగిన కోడి యిల్లెక్కి కూసినట్లు.

తిమ్మిని బ్రహ్మి, బ్రహ్మిని తిమ్మి చేసాడు.

తీగెకు కాయ బరువా ?

తుమ్మితే ఊడే ముక్కు ఎన్నాళ్ళుండును ?

తులసివనంలో గంజాయి మొక్క మొలచినట్లు.

తెగించినవానికి తెడ్డే లింగం.

తెలివి తక్కువ ఆకలెక్కువ.

పంటచేను విడిచి పరిగ ఏరినట్లు.

పండా కాయా?

పండినా ఎండినా పన్ను తప్పదు.

పంచెకేలరా ప్రత్తిధర.

పక్కలో బల్లెం.

పగటి మాటలు పనికిచేటు, రాత్రిమాటలు నిద్రకుచేటు.

పచ్చిగడ్డివేస్తే భగ్గున మండిపడుతున్నది.

పచ్చి వెలగకాయ గొంతుకపడ్డట్లు.

పట్టపగ్గాలు లేవు.

ఏగోచులా సేద్యం పాకానికి రాదు.

పట్టిందల్లా బంగారం, ముట్టిందల్లా ముత్యం.

పదిమందితోటి చావు పెండ్లితో సమానం.

పదిమందిలో పడ్డపాము చావదు.

పనిచేయనివాడు యింటికి దొంగ అన్నట్లు.

పనివాడు పందిరివేస్తే పిచ్చుకలు పడద్రోసిన వన్నట్లు.

పనివానికడుపున తినేవాడు పుట్టినట్లు.

పని తక్కువ, పాకులాట యెక్కువ.

పల్లంవుండేచోట నీళ్ళు నిలుస్తవి.

పిండికొద్ది రొట్టె అన్నట్లు.

పిచ్చికమీద బ్రహ్మాస్త్రమా?

పిచ్చివాడికి లోకం అంతా పిచ్చే అనిపిస్తుంది.

పిట్టకొంచెము, కూత ఘనము.

పిలువని పేరంటానికి వెళ్ళినట్లు.

పిల్లికి భిక్షం పెట్టదు.

పిల్లికి ఎలుక సాక్షి.

పిల్లిని చంకబెట్టుకొని పెండ్లికి వెళ్ళినట్లు.

పుట్టుట గిట్టుట కొరకే.

పుండుకు పుల్ల మగడు.

పులినిచూచి నక్క వాతపెట్టుకొన్నట్లు.

పెండ్లి నడక నడిచినట్లు.

పెరుగుట విరుగుట కొరకే.

పేదవాని కోపం, పెదవికి చేటు.

పేనుకు పెత్తనమిస్తే, తలెల్లా తెగకొరికిందట.

పేరు గొప్ప ఊరు దిబ్బ.

పొంగినతంతా పొరలిపోతే.

పొట్టివానికి పుట్టెడు బుద్ధులు.

పొదుగు కోసి పాలు తాగినట్లు.

పొద్దు తిరిగుడు దొంక తిరుగుడు.

పొమ్మనలేక పొగబెట్టినట్లు.

పొరుగింటి పుల్లకూర రుచి.

పోరు నష్టము, పొందు లాభము.

ప్రీతితో పెట్టినది పిడికెడు చాలును.

బూడిదలోపోసిన పన్నీరు.

బ్రతికియుండిన బలుసాకు తినవచ్చును.

భోజనానికి ముందు, స్నానానికి వెనుక.

మంచివానికి మరణమే సాక్షి.

మంచివానికి ఒకమాట, మంచి గొడ్డుకు ఒక దెబ్బ.

మంది యెక్కువైతే మజ్జిగ పలుచన.

మంచికిపోగా చెడ్డ ఎదురాయెనన్నట్లు.

మన్ను తిన్న పామువలె నున్నాడు.

మనస్సుంటే మార్గమున్న దన్నట్లు.

మనోవ్యాధికి మందు లేదు.

మతిలేని మాట, శృతిలేని పాట.

మనస్సుకు మనస్సే సాక్షి.

మనుష్యుడు పేద అయినా మాట పేద కాదు.

మసిపూసి మారేడుకాయ.

మాతృభాషను, మాతను గౌరవింపుము.

మితము తప్పితే అమృతమైనా విషమే.

ముందరికి వస్తే గొయ్యి, వెనుకకుపోతే నుయ్యి.

ముందువచ్చిన చెవులకంటే వెనుకవచ్చిన కొమ్ములు ఎక్కువ.

ముందున్నది ముసళ్ళపండుగ.

ముసుగులో గుద్దులాట.

మూడునాళ్ళ ముచ్చట.

మూడునాళ్ళ ముచ్చటిదు ఆరుజోళ్ళు చెప్పులా!

మూలిగే నక్క మీద తాటికాయపడ్డట్లు.

మెత్తనివానిని చూస్తే మొట్టబుద్ధి.

మెయ్యబోయి మెడకు తగిలించుకొన్నట్లు.

మెతుకులు చల్లితే కాకులకు కొదవా?

మేకులు పెరికిన కోతివలె.

మేడలు గుడిసెలు కావడంకన్న, గుడిసెలు మేడలు కావడం మేలు.

మేలుమేలంటే మెడబడ్డట్లు.

మొండిచేతితోటి మొత్తుకొన్నట్లు.

మొండి చేతులవానికి నువ్వులు తినడం నేర్పినట్లు.

మొక్క పోయిన దేవుడు యెదురుగా వచ్చినట్లు.

మొండివాడు రాజుకన్న బలవంతుడు.

మొగమాటానికెడితే, కడుపు వచ్చినదట.

మొక్కయై వంగనిది, మ్రానై వంగునా ?

మొగవాడు తిరుగక చెడితే, ఆడది తిరిగి చెడినదట.

మొగుడు కొట్టినందుకు యేడ్వలేదట, తోడికోడలు నవ్వినందుకు ఏడ్చిందట.

మౌన మర్థాంగీకారము.

యోగికి, రోగికి, భోగికి నిద్రుండదు.

రవుతు కొద్దీ గుఱ్ఱము.

రాగల శని రామేశ్వరం వెళ్ళినా తప్పదు.

రాజాజ్ఞకు మించిన శాసనము లేదు.

రాజుల సొమ్ము రాళ్లపాలు.

రాజు మెచ్చినది రంభ.

రాజు భార్య మేడయెక్కితే, కుమ్మరవాని కోడలు గుడిసెయెక్కిందట.

రాజుతలిస్తే దెబ్బలకు కొదవా?

రాజుకూతురైనా ఒకని ఆలే.

లంక కాల్చిన వాడు రాముని కెరిక.

లంకమేతకు ఏటి ఈతకు సరి.

వంకాయ తమ్ముడు వాగుడుకాయ.

వంగకు ముదురునాటు, అరటికి లేతకాటు.

వియ్యానికైన కయ్యానకైనా సాత ఉండాలి.

శంఖంలో పోస్తేగాని తీర్థం కాదు.

శతకోటి దరిద్రాలకు అనంతకోటి ఉపాయాలు.

సంతోషం సగం బలం.

సంసారి సుఖి. సంసారి దుఃఖీ.

సత్రం భోజనం మఠం నిద్ర.

హనుమంతుని ముందా కుప్పిగంతులా.